# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

ఎనిమిదవ సంపుటము



పునర్ముద్రణ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500 004.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

ఎనిమిదవ సంపుటము

పునర్ముద్రణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500 004,

# తొలిపలుకు

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు పునర్ముద్రణ చేయవలెనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నిశ్చయించి యీ బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించినది. మొత్తము ఎనిమిది సంపుటాలలో నాల్గు సంపుటాల పునర్ముద్రణ కార్యము 23-1-1979 నాటికి పూర్తియైనది. మిగిలిన నాల్గు సంపుటాలను ఈనాడు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్రమహాజనులకు అర్పిస్తున్నది.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదటి నాలుగు సంపుటాలు స్వర్గీయులైన శ్రీ రావు కుమార వేంకటమహీపతి సూర్యారావు బహద్దరుగారి అండదండలలో, సంపూర్ణ ఆర్థిక సహకారములో, స్వర్గీయ జయంతి రామయ్య పంతులుగారి పర్యవేక్షణలో సిద్ధమై 1949వ సంవత్సరములో కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు పక్షాన ప్రకటితమైనవి. తర్వాత 5, 6, 7 సంపుటాలు 1957 సంవత్సరములో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సహాయముతో ముద్రితమైనవి. ఏడవ సంపుటము అనుబంధము (ఎనిమిదవ సంపుటము) మాత్రము ముద్రణ కాకుండగా, 1965వ సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 5000/- ఆర్థిక సహాయము గావించి దీని ముద్రణకు తోడ్పడినది. ఈ ఎనిమిదవ సంపుటము 1974 సంవత్సరము హైదరాబాదు నగరములో, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వేదికపైన ఆవిష్కృతమైనది. ఆ సందర్భములో అకాడమీ అధ్యక్షులు డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అన్నిసంపుటాలు మరొక పర్యాయము నిర్దుష్టంగా ప్రకటించవలసి యున్నదని భావించి ఆ పని నిర్వహించవలసినదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరినారు. అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జె. వెంగళరావుగారు ఈ కోరికను అంగీకరించి అందుకు కావలసిన ఏర్పాట్లు చేయగలనని వాగ్దానము చేసినారు.

ముఖ్యమంత్రిగారి వాగ్దానాన్ని అనుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఈ విషయాన్ని పరిశీలించవలెనని, ప్రభుత్వ పురావస్తుశాఖ డైరెక్టర్ డా. రమేశన్ గారి అధ్యక్షతన, డా. బి. రామరాజు, ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు, శ్రీ దేవులపల్లి రామానుజరావు అప్పుడు కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, శ్రీ ఎన్. వెంకట స్వామి, అప్పుడు డైరెక్టర్, తెలుగు అకాడమీ, డా. పి. యస్. ఆర్. అప్పారావు, అప్పుడు ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ, గార్లతో కూడిన ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘము సమావేశమై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పక్షాన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అచ్చుకావలెననీ, అచ్చు పర్యవేక్షణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించవలెనని తొలిముద్రణలోని అచ్చుతప్పులను సవరించవలెననీ, ఇందుకు కావలసిన పూర్తి డబ్బును ప్రభుత్వము యీయవలెనని సిఫారసు చేయగా, ఈ సిఫారసును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము అంగీకరించింది. తత్ఫలితంగా ఈ సంపుటాల పునర్ముద్రణ కార్యక్రమము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చేపట్టినది. ఈ నిఘంటువులలోని అనుబంధాలను గ్రంథభాగములో చేర్పవలెనని కూడ పై సంఘము నిర్ణయించినది. ఈ నిర్ణయానుసారము ఆయాసంపుటాలలోని అచ్చుతప్పులను సవరించి అనుబంధభాగాన్ని గ్రంథములో చేర్చే బాధ్యత మొదటి నాలుగుసంపుటాల మట్టుకు శ్రీయుతులు ఎన్. సి.

యస్. పార్థసారథి పి. వి. శ్రీనివాసాచార్యులు, చీమకుర్తి శేషగిరిరావు, ఎన్. ఎస్. సుందరేశ్వర రావు గార్లకు అప్పగించడమైనది. మిగిలిన నాలుగు సంపుటాలు అనగా, 5, 6, 7, 8 సంపుటాలను సవరించే బాధ్యత డా. నిడదవోలు వెంకటరావుగారు, అకాదమీ కోరికపైన నిర్వహించినారు. వీరందరికీ అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ సంపుటము అచ్చుపని దక్షిణ భారత ప్రెస్, హైదరాబాదు వారికి అప్పగించి ముద్రణ పర్యవేక్షకులుగా శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, శ్రీ సి. వి. శేషాచార్యులగార్లను నియమించడమైనది. వీరందరికీ అకాదమి పక్షాన కృతజ్ఞతలు.

ఈ బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అప్పగించి కావలసిన డబ్బును పూర్తిగా మంజూరు చేసి, అకాడమీకి అందజేసి సాహిత్య అకాడమీ పట్ల విశ్వాసము ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు అకాడమీపక్షాన ధన్యవాదాలు.

**ఇరివెంటి కృష్ణమూర్తి**

కార్యదర్శి

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.

హైదరాబాదు,

7-8-1982

# మనవి

నేడికి తెలుగుభాషకు సర్వతోముఖ సంపూర్ణ పదజాలకోశము అవడగిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు చరమసంపుటానుబంధ ప్రకటన భాగ్యమునకు త్రిలింగదేశము నోచినది.

దీనికి కూర్పులు చేర్పు లుండబోవని కాదు - ఉన్నంతలో దీనికి సాదృశ్య మదృశ్యమని.

దీని నిర్మాణము తలపెట్టిన మహామనీషి పీఠికాపుర ప్రభువు శ్రీ రావుకుమార వేంకట మహీపతి సూర్యారావు ఒహద్దరువారు. వారి మహోన్నత ఆశయమునకు భాషాభివృద్ధికి ఈ నిఘంటువు ప్రతీక.

పిఠాపురము మహారాజా శ్రీ రావు కుమార వేంకట మహీపతి సూర్యారావు బహద్దూరు K. C. I. D. Litt. వారి ఔదార్యముతో 1930లో ప్రారంభించిన ఈ నిఘంటువు 1949 లో సంస్థానములు ప్రజా ధనము లగునాటికి, తెలుగునాట సాహితీధురీణులైన పండిత ప్రకాండులచే వ్రాతప్రతిగా వెలయించిన భాగ్యము ఆంధ్రులకు దక్కినది.

ఎందరో పండితవరేణ్యుల ధీశక్తిచే ఈ నిఘంటువు సర్వసమగ్రతతో వెలసినది. శ్రీ జయంతి రామయ్య పంతులుగారి అధ్వర్యములో, 1949లో, నాల్గు సంపుటములను ప్రకటించి నిఘంటువు కార్యాలయము కారణాంతరములచే ఎత్తివేయబడినది. ఆ పరిస్థితులలో డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు 1957లో రాజావారి యనుజ్ఞాపత్రము పొంది, రాష్ట్ర ప్రభుత్వమునుండి 5000 రు॥లను, కేంద్ర ప్రభుత్వమునుండి 8000 రు॥లను, సాహాయ్యముగా పొంది మద్రాసులో 5, 6, 7 సంపుటములలో ఎక్కువభాగము పూర్తిచేసిరి. ఈ సంపుటములను మిగిలినవ్రాతప్రతులను ఆం॥ సా॥ పరిషత్తు కార్యదర్శియైన శ్రీ దంటు భాస్కరరావుగారు కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి ఆదేశముపై శ్రీ సీతాపతిగారికి తమ స్వంత ధనము ఖర్చులుగా 5000/ రు॥లు యిచ్చి కాకినాడ పరిషత్తు కార్యాలయమునకు తరలించిరి. 1958 జూన్ 12వ తేదీని ఆం॥ సా॥ పరిష ద్వార్షిక మహాసభలలో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితవరేణ్యులు యావిష్కరణ గావించిరి.

నాటినుండి 7వ సం॥పు అనుబంధ వ్రాతభాగము ముద్రణ నొందవలసి సంస్కరింపవలసి వచ్చి నది. శ్రీ దంటు భాస్కరరావుగారి కోరికపై డా॥ దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీ శశాంక (శ్రీ వోలేటి సుబ్బారావు), డా॥ పాటిబండ మాధవశర్మగారు, శ్రీ శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగార్ల సహాయముతో వ్రాతపతిని తయారుచేసి కాకినాడ పంపిరి.

ఏడవ సం॥పు అనుబంధము మనకు ఆంధ్ర సాహిత్య అకాడమీ, హైదరాబాదు వారు 5000రు॥లు సహాయము చేసిరి. అట్టి సహాయమునకు దోహదమొనరించిన డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతాభి వందనములు. ఆ ధనముతోడను శ్రీ దంటు భాస్కరరావుగారు రిమారమి 5000 రు॥ల తోను 62 ఫారముల వఱకు ముద్రణ సాగినది. విశాఖపట్టణము సేల్సుటాక్సు డిప్యూటీ కమీషనరు శ్రీ పి. సీతాపతిరావు I. A. S.

గారి ప్రోత్సాహముతో కాకినాడ సేవ్యాహకుల అధిపతులైన శ్రీ మనవాళ్ళ స్వామిగారు రమారమి 2 వేల రూపాయల వ్యయముతో సప్తమ సంపుటము సంపూర్ణముగా ముద్రింపించిరి. దానిలో 1930లో మొదలుపెట్టిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు ముద్రణము 1972లో పూర్తియై సంపూర్ణప్రతి 7 సంపుటములు ఆంధ్రుల కందిచ్చు భాగ్యము చేపట్టిన ఆం॥ సా॥ పరిషత్తు ధన్యతమము.

ఏడవ సం॥పు అనుబంధ శుద్ధప్రతిని తయారుచేయుటకు సహకరించిన కాకినాడ పండిత ప్రకాండులగు శ్రీ ఆకెళ్ళ శేషాద్రి, శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ సామవేదము శ్రీరామమూర్తి శాస్త్రి గార్లకు మే మెంతయో ఋణపడి యున్నాము. ముఖ్యముగా నాటి పత్రికా సంపాదకులుగు శ్రీ కాకరపర్తి కృష్ణ శాస్త్రిగారికి కూడ మేము ఋణపడి యున్నాము.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు నిర్మాణము కావించిన పండితపర్యులు శ్రీ కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రి, శ్రీ ఏర్చా సర్వేశ్వర శాస్త్రి, శ్రీ ప్రయాగ వేంకటరమణ శాస్త్రి, శ్రీ ఆకుండి వేంకట శాస్త్రి, శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రి, శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ చిలుకూరి వీరభద్ర శాస్త్రి, శ్రీ జెయుకుపల్లి అప్పారాయ శాస్త్రి, శ్రీ సామవేదం శ్రీరామమూర్తి శాస్త్రి, శ్రీ పన్నాల వేంకటాద్రి భట్టశర్మ, శ్రీ ఇంద్రకంటి సూర్యనారాయణ శాస్త్రిగార్లకు, ఇంకనూ సహకరించిన పండిత ప్రకాండులకు మా కృతజ్ఞతాభివందనములు.

నేటికి పిఠాపురము మహారాజా శ్రీ రావు వేంకటమహీపతి సూర్యారావు బహద్దరువారి కోరిక నెరవేర్చి ఆంధ్రులకు ఆంధ్రభాషకు ఒక అమూల్య అలంకారము అందజేసిన ఈ నిఘంటువునకు సహకరించిన ప్రతి యొక్కరికి మా నమోవాకములు.

ఇట్లు

**ఆంధ్ర సాహిత్య పరిషత్తు (రిజిష్టర్డ్)**

కాకినాడ.



మహారాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు C. B. E. గారు

| సంకేతములు | వివరణము |
| --- | --- |
| అ. | ఆకారాంతము-ఇశ్లే,- అ, ఇ, ఈ, చ్,జ్. మొదలగునవి తత్తదంతములుగా గ్రహించునది, |
| అ. ఆ: ఈ. అ. | పుంలింగవిశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగవిశేషణ మయినపుడు ఆకారాంతము లేక ఈకారాంతము. నపుంసకలింగ విశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగములలో విశేషము ఉన్నప్పుడు అవి సూచింపఁబడినవి. చివర యచ్చులను బట్టి యవి తత్తదంతములుగా గ్రహించునది. ఉదా;— 1) అంకకుఁడు విశ. (అ. కికా. అ.) ఇట స్త్రీలింగరూపము ఆకారాంతమగు "అంకికా. (2) అంతర్ధాత, విశ (ఋ త్రీ ఋ.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంతర్ధాత్రీ. (3) అంకి.విశ. (న్.నీ న్.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంకినీ'. (4) అపటువు విశ. (ఉ ఉ. ట్వీ ఉ.) ఇట ఉకారాంతమగు 'అపటువు'ను ఈకారాంతమగు 'అపట్వీ'యును స్త్రీలింగ రూపములు. (5) అనామము. విశ (న్. న్ మ్నీ. ఆ. న్.). ఇట నకారాంతమగు 'అనామ'యును ఈకారాంతమగు 'అనామ్నీ' యును ఆకారాంతమగు 'అనామా'యును స్త్రీలింగరూపములుగా నెఱుంగునది. |
| అ. క్రి. | అకర్మకక్రియ. |
| అనౌ. | అనౌపవిభక్తికము. |
| అప. | అపదము, (ఆగమము మొదలగునవి.) |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య. | అవ్యయము. |
| ఆమ్రే. | ఆమ్రేడితము. |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉప. | ఉపపదము, (చూ. అసి-తెలుఁగు) |
| ఉభ. | ఉభయము (సంస్కృతమును తెనుఁగును.) |
| ఏ | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము. |
| క. | కన్నడము. |
| కరాలపా. | కరాలపాటి రంగయ్యగారి భారతపాఠము. |
| కు. | కుయిభాష. |
| క్రి. | క్రియ. |
| క్రి. విశ. | క్రియావిశేషణము. |
| క్షేత్రగ. | క్షేత్రగణితము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| చూ. | చూడుఁడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ. | జన్యము |

| సంకేతములు. | వివరములు |
|---|---|
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త | తమిళము. |
| తంత్ర. | తంత్రశాస్త్రము |
| తర్క. | తర్కశాస్త్రము. |
| తు | తులుభాష, |
| ద్రు. | ద్రుతాంతము. |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో అంతర్భూతము.) |
| ధర్మ. | ధర్మశాస్త్రము. |
| న | నపుంసకలింగము. |
| నాటక | నాటక పరిభాష. |
| నాట్య. | నాట్యశాస్త్రము. |
| పా. | పాళిభాష. |
| పీఠి. | పీఠిక. |
| పుం | పుంలింగము. |
| పుం న. | పుంనపుంసకలింగము. |
| పు . స్త్రీ | పుంస్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| బ. | బహువచనాంతకము. |
| బీజగ. | బీజగణితము. |
| భా. ల. వ్యా. | భాంతము లక్ష్మీపతిశాస్త్రిగారి ఆంధ్రభాగవత వ్యాఖ్య. |
| మంత్ర. | మంత్రశాస్త్రము. |
| మ. | మలయాళము. |
| మహా. | మహారాష్ట్రము. |
| మి | మిశ్రము - సంస్కృతపదము సంస్కృతేతరపదముతోఁ గాని తెలుఁగుకృత్ప్రత్యయముతోఁ గాని తెలుగుతద్ధిత ప్రత్యయముతోఁ గాని కలిసిన పదము. |
| మొ | మొదలైనవి. |
| యోగ. | యోగశాస్త్రము. |
| రూ. | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము. |
| వి.ణ | విశేషణము. |
| వీరేశ పా. | కందుకూరి వీరేశలింగముగారి పాఠము. |
| వేదము. పా. | వేదము వేంకటరాయశాస్త్రిగారి పాఠము. |
| వేదాంత. | వేదాంతశాస్త్రము. |

| సంకేతములు | వివరములు |
| --- | --- |
| వైద్య | వైద్యశాస్త్రము. |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| వ్యవ | వ్యవహారము |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. |
| శత్ర. | శత్రంతము (దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు) |
| శ. సం. | శకసంవత్సరములు |
| శ్లో. | శ్లోకము. |
| స | సర్వనామము, |
| సం | సంస్కృతము |
| సంగీ | సంగీతశాస్త్రము. |
| స. క్రి. | సకర్మకక్రియ. |
| సా. | సామెత |
| స్త్రీ. | స్త్రీలింగము. |
| హిం. | హిందూస్థానీభాష. |
| √ | (మూలచిహ్నము.) ఇది జనకపదములకు ముందుపయోగింపఁబడును. |
| = | (సామ్యచిహ్నము.) ఇదిరూపమందుఁ గాని యర్థమునందుగాని సామ్యము గలపదముల నడుమ నుపయోగింపబడును. |
| వృ. వి | చెట్టు లత మొదలగువానిగుర్తు. |
| | ఇది విభిన్నార్థమును దెలుపును. |
| | సమానార్థమును దెలుపును. |

(తక్కినవి స్పష్టము.)

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి అశ్వాసాముల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 1 | అచలా | అచలాత్మజాపరిణయము. | ఆ. 3. | వేంకటాచార్యకవి |
| 2 | అచ్చ భా | అచ్చ తెలుఁగుభారవి. | ఆ. 5. | శ్రీరామకవి |
| 3 | అచ్చ. రా. | అచ్చతెనుఁగురామాయణము. | | కూచిమంచి తిమ్మకవి |
| | | బాల. బాలకాండము. | | |
| | | అయో. అయోధ్యాకాండము. | | |
| | | అర. అరణ్యకాండము | కాం. 6. | |
| | | కిష్కిం. కిష్కింధాకాండము, | | |
| | | సుం. సుందరకాండము. | | |
| | | యు. యుద్ధకాండము. | | |
| | అధ్యా. | అధ్యాత్మరామాయణము. (బాలకాండాదులు ఆఱును ఉత్తరకాండమును, కలసి ఏడు కాండములు.) | కాం. 7. | కోటమరాజు నాగయామాత్యుఁడు |
| | | ఉ. ఉత్తరకాండము. | | |
| 5 | అని. | అనిరుద్ధచరిత్రము. | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| 6 | అప్ప | అప్పకవీయము. (లక్షణగ్రంథము | ఆ. 5. | కాకునూరి అప్పకవి |
| 7 | అమక. | అష్టమహిషీకల్యాణము. (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు |
| 8 | అహ, | అహల్యాసంక్రందనము | ఆ. 3. | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు |
| 9 | ఆం. చం | ఆంధ్రచంద్రాలోకము. | కాం. 3. | అడిదము సూరకవి |
| 10 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము (నిఘంటువు) | | నుదురుపాటి వేంకటనార్యుఁడు |
| 11 | ఆం. శే. | ఆంధ్రనామశేషము (నిఘంటువు. | | ఆడిదము సూరకవి |
| 12 | ఆం. సం | ఆంధ్రనామసంగ్రహము (నిఘంటువు.) | | పైడిపాటి లక్ష్మణకవి |
| | | దేవ. దేవవర్గు | | |
| | | మాన. మానవవర్గు. | | |
| | | స్థా. స్థావరవర్గు | వర్గులు 5. | |
| | | తి. తిర్యగ్వర్గు | | |
| | | నా. నానార్థవర్గు | | |
| 13 | ఆం. పద | ఆంధ్రపదాకరము. | | |
| 14 | ఆము. | ఆముక్తమాల్యద. | ఆ. 5. | శ్రీకృష్ణదేవరాయలు |
| 15 | ఇందు. | ఇందుమతీపరిణయము. | ఆ. 6. | కుమార ధూర్జటి |
| 16 | ఇందు.రా | ఇందుమతీపరిణయము. | ఆ. 4. | తెనాలి రామభద్రకవి |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 17 | ఉ. రా | ఉత్తర రామాయణము | ఆ. 8. | కంకంటి పాపరాజు |
| 18 | ఉ. హరి | ఉత్తర హరివంశము. | ఆ. 5. | నాచన సోమనాథుఁడు |
| 19 | ఉ. హరిశ్చ | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. 4. | కల్లెళ్ళపాటి లింగన |
| 20 | కకు | కకుత్థ్సవిజయము. | ఆ. 5. | మట్ల అనంతభూపాలుఁడు |
| 21 | కలు. శ | కలువాయి శతకము. | | డబ్బీరు నరసు |
| 22 | కవిక. | కవికర్ణరసాయనము. | ఆ. 6. | సంకుసాల నృసింహకవి |
| 23 | కవిచౌ. శ | కవిచౌడప్పశతకము. | | కవి చౌడప్ప |
| 24 | కవిజ | కవిజనరంజనము. | ఆ 3. | అడిదము సూరకవి |
| 25 | కవిజనా | కవిజనాశ్రయము.<br>(లక్షణగ్రంథము.)<br>సంజ్ఞా. సంజ్ఞాధికారము.<br>వృత్తాధికారము.<br>జాతి. జాత్యధికారము<br>దోషా. దోషాధికారము. | అధికారములు. 4. | వేములవాడ భీమకవి |
| 26 | కవిరా | కవిరాజమనోరంజనము | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుఁడు |
| 27 | కవిస. | కవిసర్పగారుడము<br>(లక్షణగ్రంథము.) | ఆ. 2. | కాచన బసవన్న |
| 28 | కళా. | కళాపూర్ణోదయము | ఆ. 8. | పింగళి సూరన |
| 29 | కార్తిక | కార్తికమాహాత్మ్యము | | కుందుర్తి వేంకటాచలపతి |
| 30 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి.<br>(లక్షణగ్రంథము) | ఉల్లాసములు 9. | విన్నకోట పెద్దన్న |
| 31 | కాశీ. | కాశీఖండము. | ఆ. [illegible] | శ్రీనాథుఁడు |
| 32 | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము | ఆ. 8. | ధూర్జటి |
| 33 | కా. శ. | కాళహస్తీశ్వరశతకము. | | ధూర్జటి |
| 34 | కిరా. | కిరాతార్జునీయము | ఆ 5. | గోపాలుని సింగయ |
| 35 | కుచేల. | కుచేలోపాఖ్యానము | ఆ. 3. | గట్టుప్రభువు |
| 36 | కువల. | కువలయాశ్వచరిత్రము. | ఆ 5. | నవరము చిననారాయణ కవి |
| 37 | కు. సం | కుమారసంభవము. | ఆ. 12 | నన్నెచోడుఁడు |
| 38 | కృ. క | కృష్ణకర్ణామృతము | ఆ [illegible]. | వెలఁగపూడి వెంగన |
| 39 | కృ. శకుం | శకుంతలాపరిణయము | ఆ. [illegible]. | కృష్ణకవి |
| 40 | కృష్ణ. | కృష్ణరాయవిజయము | ఆ. 4. | కుమార ధూర్జటి |
| 41 | కృష్ణ. శ. | కృష్ణశతకము | | నృసింహకవి |
| 42 | కృష్ణా | కృష్ణాభ్యుదయము. | ఆ 5. | గొంతేటి సూరన్న |
| 43 | కేయూర. | కేయూరబాహుచరిత్రము | ఆ. 4 | మంచన |
| 44 | క్రీడా | క్రీడాభిరామము. | ఆ. 1. | వల్లభరాయ కవి |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి విభాగనామముల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 45 | గంధ. | గంధవహము. | ఆ. 1. | మంచర్ల వాసుదేవకవి |
| 46 | గాధే | గాధేయోపాఖ్యానము. | | చిత్రకవి అనంతామాత్యుఁడు |
| 47 | గోపీ. రా. | గోపీనాథరామాయణము. | | గోపీనాథ వెంకటకవి |
| 48 | ఘటికా | ఘటికాచలమాహాత్మ్యము. | ఆ. 3. | తెనాలి రామకృష్ణుఁడు |
| 49 | చంద్ర. | చంద్రభానుచరిత్రము. | ఆ 5. | తరిగొప్పుల మల్లన్న |
| 50 | చంద్ర. వి | చంద్రరేఖావిలాసము. | ఆ. 3. | కూచిమంచి జగ్గకవి |
| 51 | చంద్రా. | చంద్రాంగదచరిత్రము. | ఆ 6. | పైడిమఱ్ఱి వేంకటపతి |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము. | ఆ 6 | (శ్రీ) సురభి మాధవరాయ ప్రభువు |
| 53 | చ. పూ. రా. | చ పూ రామాయణము | ఆ. 8. | ఋగ్వేదికవి వేంకటాచలపతి |
| 54 | చమ | చమత్కారమంజరి | ఆ 3. | సింహాద్రి వేంకటాచార్యుఁడు |
| 55 | చిత్రభా | చిత్రభారతము. | ఆ. 8. | చరికొండ ధర్మన్న |
| 56 | చి ని | చిన్నయ్యసూరినిఘంటువు. వ్రాతది | | పరవస్తు చిన్నయసూరి |
| 57 | చెన్న. | చెన్నబసవపురాణము. | ఆ. 5. | అత్తనూరి పాపకవి |
| 58 | జాహ్నవి | జాహ్నవీమాహాత్మ్యము. | ఆ. 4. | పసుఁగు లక్ష్మణకవి |
| 59 | జై. భా. | జైమినిభారతము. (అశ్వమేధపర్వము.) | ఆ. 8 | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి |
| 60 | తపతీ | తపతీసంవరణోపాఖ్యానము. | ఆ. 5. | అద్దంకి గంగాధరకవి |
| 61 | దశకు. | దశకుమారచరిత్రము | ఆ. 12. | కేతన |
| 62 | ద. శా. | దక్షిణహిందూస్థానశాసనము. | సంపుటములు. 6 | |
| 63 | దశా. | దశావతారచరిత్రము | ఆ. 10. | ధరణిదేవుల రామయామాత్యుఁడు |
| 64 | దాశ. | దాశరథిశతకము. | | కంచెర్ల గోపన్న |
| 65 | దిలీప. | దిలీపచరిత్రము. | ఆ. 4. | కొటికలపూడి వేంకటకృష్ణకవి |
| 66 | ద్వా. | (సింహాసన) ద్వాత్రింశిక | ఆ. 12. | కొఱవి గోపరాజు |
| 67 | ద్వికో. భాగ. | ద్విపదభాగవతము, | స్కం 12. | కోనేటి నాథుఁడు |
| 68 | ద్వి శి సా | ద్విపదసారంగధర చరిత్రము. | ఆ. 2. | కూచిమంచి తిమ్మకవి |
| 69 | ద్వి. నల | ద్విపదనలచరిత్రము, | భా 5. | చక్రపురి రాఘవాచార్యులు |
| 70 | ద్వి పరమ. | ద్విపదపరమయోగివిలాసము. | ఆ. 8. | తాళ్ళపాక తిరువేంగళనాథుఁడు |
| 71 | ద్వి భార. | ద్విపదభారతము. (విరాటపర్వము-వ్రాతప్రతి) | ఆ 5. | తిమ్మన |
| 72 | ద్వి శ. సా | ద్విపదసారంగధరచరిత్రము. | ఆ. 3. | జాణాల శంభుదాసుఁడు |
| 73 | ద్వి భాగ, | ద్విపద భాగవతము. (దశమస్కంధము. | స్కం. 1. | మడికి సింగన్న |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 74 | ద్వి. హరిశ్చ. | ద్విపదహరిశ్చంద్రచరిత్రము. | భా. 2. | గౌరన |
| 75 | ధనా | ధనాభిరామము. (వ్రాతప్రతి) | ఆ. 3. | సూరన |
| 76 | ధర్మ. | ధర్మఖండము. | ఆ. 9. | ఈదులపల్లి భవానీశంకరుఁడు |
| 77 | ఆం. ధా. | ఆంధ్రధాతుమాల. | | పరవస్తు చిన్నయసూరి |
| 78 | నరస. | నరసభూపాలీయము. (లక్షణగ్రంథము.) | ఆ 5. | మూర్తికవి |
| 79 | నవ. (నాథ) | నవనాథచరిత్రము. (ద్విపద- వ్రాతప్రతి) | భా. 5 | గౌరన |
| 80 | నా. పంచ. | పంచతంత్రము. | ఆ. 5. | నారాయణ కవి |
| 81 | నార. | నారసింహపురాణము. (ఉత్తర భాగము.) | ఆ 5. | హరిభట్టు |
| 82 | నిరం. | నిరంకుశోపాఖ్యానము. | ఆ. 4 | కందుకూరి రుద్రయ |
| 83 | నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము. | ఆ. 10 | తిక్కన సోమయాజి |
| 84 | నీతి. | నీతిసీసపద్యశతకము, | | తాళ్ళపాక తిమ్మయ |
| 85 | నీలా. | నీలాసుందరీపరిణయము | ఆ. 3. | కూచిమంచి తిమ్మకవి |
| 86 | నృసిం. | నృసింహపురాణము | ఆ 5. | ఎఱ్ఱాప్రెగ్గడ |
| 87 | నైష. | శృంగార నైషధము | ఆ 8. | శ్రీనాథుఁడు |
| 88 | పండితా. | పండితారాధ్యచరిత్రము. (ద్విపద) దీక్షా దీక్షాప్రకరణము. పురా. పురాతనప్రకరణము. వాద. వాదప్రకరణము మహిమ. మహిమప్రకరణము. పర్వ పర్వతప్రకరణము. | ప్రకరణములు 5. | పాలుకురికి సోమనాథుఁడు |
| 89 | పద్మ. | పద్మపురాణము. (ఉత్తరఖండము) | ఆ 10. | మడికి సింగన్న |
| 90 | పరమ. | పరమయోగివిలాసము. | ఆ. 5. | తిమ్మనృపాలుఁడు |
| 91 | పాంచా. | పాంచాలీపరిణయము. | ఆ. 5 | కాకమాని మూర్తికవి |
| 92 | పాండు. | పాండురంగమాహాత్మ్యము. | ఆ 5. | తెనాలి రామకృష్ణుఁడు |
| 93 | పారి. | పారిజాతాపహరణము. | ఆ. 5. | నంది తిమ్మన |
| 94 | పార్వ. | పార్వతీపరిణయము. | ఆ. 6. | కోట శ్రీరాయరఘునాథ తొండమాన్మహీపాలుఁడు |
| 95 | పి. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. 4. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| 96 | పె. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. 3 | పెద్దాడ నాగరాజు |
| 97 | ప్రబంధ. | ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము. | ఆ. 1. | గణపవరపు వేంకటకవి |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 98 | ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము. | ఆ. 5. | నంది మల్లయ, ఘంట సింగయ |
| 99 | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము. | ఆ. 5. | పింగళి సూరన |
| 100 | ప్రభు. (లిం. | ప్రభులింగలీల. (ద్విపద) | ఆ. 5. (ఒక్కొక్క ఆశ్వాసమునకుఅయిదైదు గతులు గలవు.) | పిడుపర్తి సోమయ |
| 101 | ప్ర. మణి. | ప్రబంధమణిభూషణము. | | |
| 102 | బస. పు. | బసవ పురాణము. (ద్విపద) | ఆ. 7. | పాలుకురికి సోమన |
| 103 | బహు. | బహుళాశ్వ చరిత్రము. | ఆ 5. | దామరల వేంగళనాయకుడు |
| 104 | బిల్హ. | బిల్హణీయము. | ఆ. 3. | వండిపెద్ది కృష్ణస్వామి |
| 105 | బ్రహ్మో | బ్రహ్మోత్తర ఖండము. | ఆ 5. | శ్రీధరమల్లె వేంకటరామకవి |
| 106 | బ్రౌ. | బ్రౌణ్య నిఘంటువు. | | బ్రౌనుదొర |
| 107 | భర్తృ. | భర్తృహరి సుభాషితము<br>నీతి. నీతిశతకము<br>శృం. శృంగారశతకము.<br>వై. వైరాగ్య శతకము. | శతకములు3. | ఏనుగు లక్ష్మణకవి |
| 108 | భల్లా | భల్లాణ చరిత్రము | ఆ. 5. | వాలేశ్వరుడు |
| 109 | భాగ. | భాగవతము | స్కం. 12. | బమ్మెర పోతరాజు |
| 110 | భాను. | భానుమతీ పరిణయము. | ఆ. 4. | రెంటూరి రంగరాజు |
| | భార. | భారతము,<br>ఆది ఆదిపర్వము ఆ. 8<br>సభా. సభాపర్వము. ఆ, 2.<br>అర. అరణ్యపర్వము, ఆ. 7.<br>విరా. విరాట పర్వము ఆ. 3.<br>ఉద్యో. ఉద్యోగపర్వము. ఆ. 4.<br>భీష్మ భీష్మపర్వము. ఆ 5.<br>ద్రో. ద్రోణపర్వము ఆ. 5<br>కర్ణ. కర్ణ పర్వము. ఆ. 3.<br>శల్య శల్యపర్వము. ఆ. 2,<br>సౌ. సౌప్తిక పర్వము. ఆ. 2.<br>స్త్రీ. స్త్రీ ర్వము. ఆ 2.<br>శాం శాంతిపర్వము. ఆ. 6. | పర్వములు18 | కవిత్రయము (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తృనామములు |
|---|---|---|---|---|
| | | అను. అనుశాసనిక పర్వము ఆ. 5.<br>అశ్వ. అశ్వమేధిక పర్వము. ఆ. 4.<br>ఆశ్ర. ఆశ్రమవాసపర్వము ఆ. 2<br>మౌ. మౌసలపర్వము. ఆ. 1.<br>మహా. మహాప్రస్థానికపర్వము ఆ. 1.<br>స్వ. స్వర్గారోహణ పర్వము ఆ. 1. | | |
| 111 | భా. రా. | భాస్కర రామాయణము. (అచ్చ తెనుఁగు రామాయణము కడ మున్నట్లు దీనికి కాండము తెలియుంగునది.) | కాం. 6. | భాస్కరుఁడు లోనగువారు |
| 112 | భా. శ. | భాస్కర శతకము. | | మారద వెంకయ్య |
| 113 | భీమ. | భీమేశ్వర పురాణము | ఆ. 6. | శ్రీనాథుఁడు |
| 114 | భేష. | భేషజ కల్పము | ఆ. 4. | బహుపాద వేంకటాచార్యుఁడు |
| 115 | భో జ. రా. | భోజరాజీయము. | ఆ. 7. | అనంతామాత్యుఁడు |
| 116 | భోజసుతా. | భోజసుతా పరిణయము | ఆ. 5. | కోటీశ్వర కవి |
| 117 | మను చ. | మనుచరిత్రము. | ఆ. 6. | అల్లసాని పెద్దన |
| 118 | మల్ల. | మల్లభూపాలీయము. (భర్తృహరి కడనున్నట్లే దీనికి శతకము తెలియుంగునది.) | శతకములు 3 | ఎలకూచి బాలసరస్వతి |
| 119 | మల్లుపు. | మల్లుపురాణము. (దేవమల్ల చరిత్రము వ్రాఁతప్రతి) | ఆ. 4 | మదురుపాటి వేంకనార్యుఁడు |
| 120 | మల్హణ. | మల్హణ చరిత్ర. | ఆ 3. | ఎడపాటి ఎఱ్ఱన |
| 121 | మార్కం. | మార్కండేయ పురాణము. | ఆ. 8. | మారన |
| 122 | ముకుంద. | ముకుందవిలాసము. | ఆ. 5. | కాణాచి పెద్దన |
| 123 | మృ వి. | మృత్యుంజయ విలాసము. | ఆ 3. | గోఁగులపాటి కూర్మదాసుఁడు |
| 124 | మై | మైరావణ చరిత్రము, | ఆ. 2. | మాడయకవి |
| 125 | మొ రా. | మొల్ల రామాయణము (అచ్చ తెనుఁగు రామాయణము కడనున్నట్లు దీనికి కాండము తెలియుంగునది.) | కాం. 6. | మొల్ల |
| 126 | యయా. | యయాతి చరిత్రము | ఆ. 5. | పొన్నిగంటి తెలగనార్యుఁడు |
| 127 | రంగా. | రంగరాయ చరిత్రము. | ఆ. 3. | దిట్టకవి నారాయణకవి |
| 128 | రం. రా. | రంగనాథ రామాయణము (ద్విపద) (అచ్చ తెనుఁగు రామాయణము కడమున్నట్లు దీనికి కాండము తెలియుంగునది.) | కాం. 6. | రంగనాథుఁడు |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 129 | రం, రా ఉ | రంగనాథ రామాయణము ఉత్తర. కాండము-(ద్విపద) | కాం. 1. | కాచభూపతి, విట్ఠలరాజు |
| 130 | రఘు. | రఘువంశము. | అ 10. | అవుదూరి కిచ్చయ్య |
| 131 | రఘునా. | రఘునాథాభ్యుదయము (వ్రాతప్రతి | | విజయరాఘవకవి |
| 132 | రత్న. | రత్నపరీక్ష. | | భైరవకవి |
| 133 | రస. | రసమంజరి (లక్షణ గ్రంథము) | గుచ్ఛములు4 | సురభాని కోదండపతి |
| 134 | రసా. | రసాభరణము (లక్షణ గ్రంథము) | అ. 4. | అనంతామాత్యుఁడు |
| 135 | రసిక. | రసికజనమనోభిరామము | ఆ, 7. | కూచిమంచి తిమ్మకవి |
| 136 | రాఘవ. | రాఘవపాండవీయము | ఆ, 4. | పింగళి సూరన్న |
| 137 | రాజగో. | రాజగోపాల విలాసము | ఆ. 5. | కాళయ |
| 138 | రాజ చ. | రాజశేఖర చరిత్రము | ఆ. 3. | మాదయగారి మల్లన్న |
| 139 | రాజ. వి | రాజశేఖర విలాసము | ఆ. 3. | కూచిమంచి తిమ్మకవి |
| 140 | రాధా. | రాధామాధవము | ఆ. 5. | చింతలపూడి ఎల్లనార్యుఁడు |
| 141 | రాధికా. | రాధికాసాంత్వనము | ఆ. 4. | ముద్దుపళని |
| 142 | రామ. | రామరాజీయము | ఆ. 1. | వెంకయ్య |
| 143 | రామలిం. | రామలింగేశ్వర శతకము | | అడిదము సూరన్న |
| 144 | రామా. | రామాభ్యుదయము | అ. 8. | అయ్యలరాజు రామభద్రుఁడు |
| 145 | రామే. | రామేశ్వర మాహాత్మ్యము | ఆ. 5, | పనుఁగు లక్ష్మణకవి |
| 146 | రా. వి. | రాజవాహన విజయము | ఆ 5. | కాకమాని మూర్తికవి |
| 147 | రుక్మాం | రుక్మాంగద చరిత్రము | ఆ. 5. | ప్రౌఢకవి మల్లన్న |
| 148 | రుక్మి. | రుక్మిణీ పరిణయము | ఆ. 5. | కూచిమంచి తిమ్మకవి |
| 149 | లక్షణ. | లక్షణసారసంగ్రహము | | చిత్రకవి పెద్దన్న |
| 150 | ల. వి. | లక్ష్మీవిలాసము | ఆ. 5. | రాయసము వేంకటపతి |
| 151 | వన. వి. | వనమాలి విలాసము | | నారన సూరన |
| 152 | వరాహ. | వరాహ పురాణము | అ. 12. | నందిమల్లయ్య ఘంట సింగన్న |
| 153 | వసు. | వసుచరిత్రము | ఆ. 6. | రామరాజభూషణుఁడు |
| 154 | వా. రా. | వాసిష్ఠ రామాయణము | ఆ. 5. | మడికి సింగన |
| 155 | వాల్మీ. | వాల్మీకి చరిత్రము | ఆ. 3. | రఘునాథ భూపాలుఁడు |
| 156 | విక్ర. | విక్రమార్క చరిత్రము | ఆ. 8. | జక్కన |
| 157 | విజ. వి. | విజయవిలాసము | ఆ. 3. | చేమకూర వేంకటకవి |
| 158 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము | కాం. 3. | కేతన |
| 159 | వి. న. | విజయనందనవిలాసము | ఆ. 3. | మంగళగిరి ఆనందకవి |
| 160 | వి. పు. | విష్ణు పురాణము | ఆ, 8. | వెన్నెలకంటి సూరన |
| 161 | విష్ణుమా. | విష్ణుమాయా నాటకము | | చింతలపూఁడి ఎల్లనార్యుఁడు |
| 162 | విప్ర. | విప్రనారాయణ చరిత్రము | ఆ. 5. | చెదలవాడ మల్లయ్య |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 163 | వీథి | వీథినాటకము | | శ్రీనాథుఁడు |
| 164 | వీర. | వీరభద్ర విజయము | ఆ. 4 | బమ్మెర పోతన్న |
| 165 | వేంక. | వేంకటేశాంధ్రము (నిఘంటువు) | వర్గులు, 5. | గణపవరపు వేంకటకవి |
| 166 | వేం. పంచ. | పంచతంత్రము | ఆ. 5. | వేంకటనాథుఁడు |
| 167 | వేం. మా. | వేంకటాచల మాహాత్మ్యము | ఆ. 6. | తరిగొండ వెంకమ్మ |
| 168 | వేణు. | వేణుగోపాల శతకము | | |
| 169 | వేమన. | వేమన శతకము | భాగ. 3. | వేమన యోగి |
| 170 | వై. జ. | వైజయంతీ విలాసము | ఆ, 4. | సారంగు తమ్మయ్య |
| 171 | శ. ర. | శబ్దరత్నాకరము (నిఘంటువు) | | బహుజనపల్లి సీతారామాచార్యులు |
| 172 | శశాం. | శశాంక విజయము | ఆ. 5. | శేషము వేంకటపతి |
| 173 | శా. ప. మ. | శాసనపద్యమంజరి | | |
| 174 | శివధ, | శివధర్మోత్తరము | ఆ. 8. | మల్లారెడ్డి కవి |
| 175 | శివర. | శివరహస్యఖండము | ఆ. 10. | కోడూరి వేంకటాచలపతి |
| 176 | శివరా. | శివరాత్రి మాహాత్మ్యము | ఆ. 4. | శ్రీనాథుఁడు |
| 177 | శివ. సా. | శివతత్త్వసారము | | మల్లికార్జున పండితారాధ్యుఁడు |
| 178 | శుక. | శుక సప్తతి | ఆ. 4. | కదిరీపతి నాయకుఁడు |
| 179 | శుక. చ. | శుక చరిత్రము | ఆ. 5. | పరశురామపంతుల రామమూర్తి కవి |
| 180 | శృంగా | శృంగార రసమంజరి | | సురతాని కోదండపతి |
| 181 | శేష. | శేషధర్మము | ఆ. 5. | తామరపల్లి తిమ్మయ |
| 182 | శ్రీరం. | శ్రీరంగ మహత్త్వము | ఆ. 5. | భైరవకవి |
| 183 | శ్రీరం మా. | శ్రీరంగ మాహాత్మ్యము | ఆ. 10. | కట్టా వరదరాజేంద్రుఁడు |
| 184 | ష. చ. | షట్చక్రవర్తి చరిత్రము | ఆ. 8. | మల్లారెడ్డి కవి |
| 185 | షోడ. | షోడశకుమార చరిత్రము | ఆ. 8 | వెన్నెలకంటి అన్నయ్య |
| 186 | సకల. స. | సకలనీతి సమ్మతము | | మడికి సింగన్న |
| 187 | సత్య. సాం. | సత్యభామాసాంత్వనము | | లింగనమఖి, కామేశ్వరకవి |
| 188 | సమీర. | సమీరకుమారవిజయము | ఆ 7. | పుష్పగిరి తిమ్మన |
| 198 | సర్వ. సా. | సర్వలక్షణసారసంగ్రహము | | కూచిమంచి తిమ్మకవి |
| 190 | సస్యా. | సస్యానందము | | |
| 161 | సాం ని | సాంబ నిఘంటువు | వర్గులు. 5. | కస్తూరి రంగకవి |
| 162 | సాంబో. | సాంబోపాఖ్యానము | ఆ. 5. | రంగప్పరాజు |
| 163 | సానందో. | సానందోపాఖ్యానము | ఆ. 5. | శివరామకవి |
| 194 | సారంగ. | సారంగధర చరిత్రము | ఆ. 3. | చేమకూర వెంకటకవి |
| 195 | సిం. నార. | సింహాద్రినారసింహశతకము | | గోఁగులపాటి కూర్మదాసుఁడు |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 196 | సీతారా. | సీతారామాంజనేయ సంవాదము | ఆ. 3. | పరశురామపంతుల గురులింగమూర్తి |
| 197 | సీతావి. | సీతా విజయము (శతకంఠ రామాయణము) | ఆ. 4. | మర్దనకవి<br>పెనుమళ్ల సోమకవి |
| 198 | సీమం | సీమంతినీ కల్యాణము | ఆ. 5. | తెనాలి అన్నయ్య |
| 199 | సుద. | సుదక్షిణా పరిణయము | ఆ. 5. | అఋఘురికవి |
| 200 | సుదంతా. | సుదంతా పరిణయము (వ్రాతప్రతి) | ఆ. 4. | గట్టుప్రభువు |
| 201 | సురా. | సురాభాండేశ్వరము | ఆ. 1. | బద్దెనకవి |
| 202 | సు శ. | సుమతి శతకము | | పక్కిలంక వీరభద్రకవి |
| 203 | సేతు. | సేతు ఖండము | ఆ. 6. | అయ్యలరాజునారాయణామాత్యుడు |
| 204 | హంస. | హంసవింశతి | ఆ. 5. | |
| 205 | హ. న. | హరిశ్చంద్ర నలోపాఖ్యానము | ఆ. 5. | రామరాజభూషణుఁడు |
| 206 | హర. | హరవిలాసము | ఆ. 7. | శ్రీనాథుఁడు |
| 207 | హర. వి. | హరభక్త విలాసము | | |
| 208 | హరి. | హరివంశము | | ఎఱ్ఱాప్రెగ్గడ |
| | | పూ. పూర్వభాగము | ఆ. 9. | |
| | | ఉ. ఉత్తరభాగము | ఆ. 10. | |
| 209 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము | ఆ. 5 | శంకరకవి |
| 210 | హ. వరాహ. | వరాహపురాణము | ఆ. 5. | హరిభట్టు |

(కడమవి స్పష్టము)

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథము లందలి సర్గాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 1 | అమర. | అమరసుధ | | భానుజి దీక్షితులు |
| 2 | ఆ. ని. | ఆప్తువి సంస్కృతాంగ్ల నిఘంటువు | | వామనశివరామా ప్టేడు |
| 3 | ఉ. చ. | ఉత్తరరామచరితము | అంకములు 7 | భవభూతి |
| 4 | కల్ప. | శబ్దకల్పద్రుమము (నిఘంటువు) | | సర్. రాజా రాధాకాంతదేవబహాదరు |
| 5 | కాదం. | కాదంబరీ కావ్యము | భాగములు 2 | బాణకవియు, తత్పుత్రుడును |
| 6 | కావ్యాద. | కావ్యాదర్శము | పరిచ్ఛేదములు 3 | దండికవి |
| 7 | కే. ని. | నానార్థార్ణవ సంక్షేప నిఘంటువు | కాండములు 6 | కేశవమిశ్రుడు |
| 8 | గీత. | భగవద్గీత | అధ్యాయములు 18 | వ్యాసమహర్షి |
| 9 | గీతగో. | గీతగోవిందము | సర్గములు 12 | జయదేవుడు |
| 10 | త్రి. ని. | త్రికాండశేషము (నిఘంటువు) | కాండములు 3 | పురుషోత్తముడు |
| 11 | పరా. | పరాశరస్మృతి | కాండములు 2 | పరాశర మహర్షి |
| 12 | భట్టి. | భట్టికావ్యము | సర్గములు 22 | భట్టి |
| 13 | భామినీ. | భామినీ విలాసము | ఉల్లాసములు 4. | జగన్నాథపండితరాయలు |
| 14 | మను. | మనుస్మృతి | అధ్యాయములు 12. | మనువు |
| 15 | మహా. | మహావీర చరిత్రము | అంకములు 7. | భవభూతి |
| 16 | మాలతీ | మాలతీమాధవము | అంకములు 10. | భవభూతి |
| 17 | మాళవి. | మాళవికాగ్నిమిత్రము | అంకములు 5 | కాళిదాసుడు |
| 18 | ముద్రా. | ముద్రారాక్షసము | అంకములు 7 | విశాఖదత్తుడు |
| 19 | మురా. | అనర్ఘ రాఘవము | అంకములు 7 | మురారి |
| 20 | మృచ్ఛ. | మృచ్ఛకటికము | అంకములు 10 | శూద్రకుడు |
| 21 | మే. ని. | మేదిని నిఘంటువు | భాగములు 2 | మేదినికరుడు |
| 22 | మేఘ. | మేఘదూతము | | కాళిదాసుడు |
| 23 | యాజ్ఞ. | యాజ్ఞవల్క్య స్మృతి<br>ఆచా. ఆచారకాండము<br>ప్రా. ప్రాయశ్చిత్త కాండము<br>వ్యవ. వ్యవహార కాండము | కాండములు 3 | యాజ్ఞవల్క్యమహర్షి |
| 24 | రత్నా. | రత్నావళి | అంకములు 4 | శ్రీహర్ష దేవుడు |
| 25 | రస. | రసగంగాధరము | | జగన్నాథ పండితరాయలు |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి సర్గాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 26 | రా. ని. | రాజ నిఘంటువు | వర్గములు21 | నరహరి పండితుఁడు |
| 27 | వాచ | వాచస్పత్య నిఘంటువు | | తారానాథ తర్కవాచస్పతి |
| 28 | విక్ర మో. | విక్ర మోర్వశీయము | అంకములు5 | కాళిదాసుఁడు |
| 29 | వి. ని. | విశ్వ నిఘంటువు | | మహేశ్వర సూరి |
| 30 | విల్యమ్సు | విల్యమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు | | సర్ మోనియర్ విల్యమ్సు |
| 31 | వేణీ. | వేణీసంహారము | అంకములు6 | భట్ట నారాయణుఁడు |
| 32 | వై. ని. | వైజయంతీ నిఘంటువు | కాండములు8 | యాదవ ప్రకాశుఁడు |
| 33 | శాకుం. | అభిజ్ఞాన శాకుంతలము | అంకములు7 | కాళిదాసుఁడు |
| 34 | శా. ని. | శాశ్వత నిఘంటువు | | శాశ్వతుఁడు |
| 35 | శిశు. | శిశుపాలవధము | సర్గములు 20 | మాఘకవి |
| 36 | సం. కిరా. | కిరాతార్జునీయము | సర్గములు 18 | భారవి |
| 37 | సం. కు. సం. | కుమారసంభవము | సర్గములు17 | కాళిదాసుఁడు |
| 38 | సం.చం. రా. | చంపూరామాయణము | కాండములు6 | భోజరాజు, లక్ష్మణసూరి |
| 39 | సం.దశకు. | దశకుమార చరిత్రము | | దండికవి |
| 40 | సం నైష | నైషధీయ చరితము | సర్గములు22 | శ్రీహర్షకవి |
| 41 | సం పంచ. | పంచతంత్రము | తంత్రములు5 | విష్ణుశర్మ |
| 42 | సం.ప్రబోధ. | ప్రబోధ చంద్రోదయము | అంకములు6 | కృష్ణమిశ్రకవి |
| 43 | సం.భర్తృ | భర్తృహరి సుభాషితము | శతకములు 3 | భర్తృహరి |
| 44 | సం భాగ | భాగవతము | స్కంధములు 12. | వ్యాసమహర్షి |
| 45 | సం భార | భారతము | పర్వములు18 | వ్యాసమహర్షి |
| 46 | సం రఘు. | రఘువంశము | సర్గములు19 | కాళిదాసుఁడు |
| 47 | స రామా. | రామాయణము | కాండములు6 | వాల్మీకి మహర్షి |
| 48 | సా. ద. | సాహిత్య దర్పణము | పరిచ్ఛేదములు 10 | విశ్వనాథకవిరాజు |
| 49 | హలా. ని. | అభిధాన రత్నమాలా నిఘంటువు | కాండములు5 | హలాయుధుఁడు |
| 50 | హితో. | హితోపదేశము | భాగములు4 | నారాయణపండితుఁడు |
| 51 | హేమ, ని. | అనేకార్థ సంగ్రహము (నిఘంటువు) | కాండములు7 | హేమచంద్రుఁడు |

(కడమవి స్పష్టము)



# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## శ

**శ** ఒక యక్షరము.

**శంక** సం. వి. అ. స్త్రీ. 1. సందేహము, సంశయము. 2. అనుమానము (అపాయశంక, అరిష్టశంక). 3. అవిశ్వాసము. 4. భయము, వెఱపు. 5. ఆశ, ప్రతీక్షణము. 6. ఆపోహము, భ్రాంతి, తప్పుటభిప్రాయము. మ. భుజదండంబున నొక్క భామ దొడిగెన్ భూభర్తకున్ భూరి దిగ్విజయారంభ విజృంభణార్జిత మహాకీర్తి ప్రతాప ప్రభా ప్రజ శంకావహనూత్నవజ్రమణి రుగ్వ్యాపార దుర్వార మున్...నైష. 6. 58.
7. వాదమధ్యమున బయలుదేఱిన యాటంకము.
8. (అగునను) నమ్మకము.

**శంకనీయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సందిగ్ధము. సంశయాస్పదము. 2. అనుమానింపఁదగినది. 3. ఊహింపఁదగినది.

**శంకము** సం. వి. అ. పుం. బండి మొదలగువానిని లాగెడి యెద్దు.

**శంకరాభరణము** సం. వి. అ. న. (శంకర+ఆభరణము) 1. ఈశ్వరునికి నలంకారము, సర్పము 2 (సంగీ.) ఒకానొక రాగము (ముప్పది రెండు నపుంసక రాగములలో నొకటి).
సీ. కాంభోజి కేదారగౌళ శోకవరాళి పున్నాగ గుమ్మకాంభోజి శంక, రాభరణము మేఘరాజి తోడి వరాళినాదనామక్రియనాట...హంస 124.
గీ. శంకరాభరణమును శోక విరాళి రంజిగుజ్జరి పంతువరాళినాట జౌళిదేశాక్షితోడివరాళి శ్రీవరాళి హెజ్జజ్జకేదారగౌళ పాడి. ప్రబంధ. 96.
వ. ఘూర్జరి ధన్యాసి శంకరాభరణంబులు మొదలైన రాగోపరాగంబులు. మత్స్యపు. 5. 54.

**శంకరావాసము** సం. వి. అ. పుం. 1. కైలాసము. 2. ఆరతి కర్పూరము.

**శంకరి** సం. వి. ఈ. స్త్రీ. 1. శివునిభార్య, పార్వతి. 2. చిఱువేలువంటి యొకవిధమైన వంగదేశపు రంగు పదార్థము. 3. జమ్మిచెట్టు.

**శంకరుఁడు** సం. విశే. (అ. ఆ. ఈ. అ.) సుఖము కలిగించువాఁడు. శుభప్రదుఁడు. వి. అ. పుం. 1. శివుఁడు. 2. శంకరాచార్యుఁడు (అద్వైత వేదాంత మతోద్ధారకుఁడు.)

**శంకలుసేయు** మి. స. క్రి. (శంకలు+చేయు) 1. పూర్వపక్షముచేయు; ప్రశ్నించు.
శా. పంకేజాతములన్ దిసంతు లడఁచున్ శాలామణీపాదముల్, వంకల్ దీర్చు మనోజసాయకములన్ వాల్చూపు తేజాంకురిన్, శంకల్ సేయు మొగంబు జక్కవ కవన్ జక్కట్లు దిద్దుం గుచా, హంకారంబు మదాళిమాలికల మాటాడించు వేణీరుచుల్. విజ. వి. 2 16. (ఇట ఔపమ్యద్యోతకము).

**శంకాభియోగము** సం. వి. అ. పుం. అనుమానము మీఁదఁ దెచ్చిన వ్యాజ్యెము.

**శంకి** సం. విశే. (న్. నీ. న్.) (సమాసాంతమున) 1. సందేహపడుచున్నవాఁడు. 2. భయపడుచున్నవాఁడు. 3. (అగునని) నమ్ముచున్నవాఁడు. 4. అపాయముతో కూడినది.

**శంకించు** సం. అ. క్రి. 1. అనుమానించు, సందేహించు.
శా. ... పోఁదగ మర్దింపం దలం పేని శంకింపం బట్లోకా వారు బ్రాహ్మణులె యేకీడైన నైరింపఁ

గన్. భార. ఉద్యో. 3. 103.
2. జంకు, భయపడు.
వ. ... తన్మూర్తినతండును వకుల సహదేవ ద్రుపద విరాటులును దేటిచూడ శంకించి మాఱు మొగంబులతో నగ్గించి రా సమయంబున. భార. ద్రోణ. 5. 63
వ. ... ఇంచుకయుఁ దడయ శంకించి. మార్క. 1. 167.
స. క్రి. తలఁచు, ఊహించు.
మ. ... దేవా నిన్ను మహాస్వామి దా,శరథిం బ్రశాస్తపునస్వముద్భవునిఁగా శంకించెదన్ జెప్పవే. హరి. పూ. 3. 190.

**శంకితము** నం. విశే. (అ. అ. అ.) 1. సందేహము నొందినది, భయపడినది. 2. సందిగ్ధము, వితర్కితము, అనుమానము గలది; అనుమానింపఁబడినది. 3. నిశ్చయము లేనిది. 4. భయంకరమైనది. 5. స్థైర్యములేనిది, దుర్బలము.

**శంకితవర్ణుఁడు** నం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**శంకితుఁడు** నం. విశే. (అ. అ అ.) 1. సందేహముఁ బొందినవాఁడు. 2. భయపడినవాఁడు. 3. అనుమానింపఁబడినవాఁడు.

**శంకిలు(ల్లు)** నం. అ. క్రి. శంకించు. కం. కడలెత్తి మ్రోయవెఱచును, జడనిధు లినుఁ డెండగాయ శంకిలు. భా. రా. బాల. 126.

**శంకుకర్ణము** నం. విశే. (అ. అ. అ.) శంకువు వంటి చెవులుగలది. వి. అ. పుం. గర్దభము, గాడిద.

**శంకుకర్ణుఁడు** నం. వి. అ. పుం. స్కందుని యను చరులలో నొకఁడు.

**శంకుజీవ** నం. వి. అ. స్త్రీ. నీడగడియారపుముల్లు.

**శంకుతరువు** నం. వి. ఉ. పుం. సాలవృక్షము, మద్దిచెట్టు.

**శంకుల** నం. వి. అ. స్త్రీ. 1. ఒకవిధమగు కత్తి, శస్త్రచికిత్స చేయుట కుపయోగించు వాఁడియైన రెండంచులుగల సాధన విశేషము.
2. అడకత్తెర.

**శంకులాఖండము** నం. వి. అ. పుం కత్తెరతోఁ గత్తిరించిన వక్కముక్క.

**శంకువు** నం. వి. ఉ. పుం. ఈఁటె, చిన్నయీఁటె, బాకు. 2. స్తంభము, రాడు.
మ. ... తత్ప్రాయస శంకు కాండములఁ దోడ్తోఁ గొట్టుచున్ గింకరుల్. శివధర్మ. 4. 90
3. మేకు, గసిక. 4. వాడియైన బాణాగ్రము, బాణాగ్రమున వెనుకకుఁ దిరిగియుండెడి కొన. మధ్యాక్కర. మృదురోమములు శంకునిభకర్ణములు మెత్తని వలుదపొమగును, నిడుదచన్నులు ...భార. ఆది. 7. 98.
5. మొరడు, కొమ్మలు కొట్టివేసిన చెట్టుమొదలు. 6. నీడ గడియారపు ముల్లు. ప్రొద్దు కట్టుటకై నీడను గొలుచుట కుపయోగించు కొయ్యచీల. 7. పండ్రెండంగుళములు పరిమాణము. 8. కొలత కఱ్ఱ, కొలతబద్ద. 9. పదిఖర్వములు, పదిలక్షల కోటులు. (దశకోటిసంఖ్య యని వాచ.) 10. ఆకు యొక్క యీనె. 11. పుట్టచీమల పుట్ట. 12. మగగుఱి, మేఢ్రము. 13. ఒక జాతి చేప. 14. రాక్షసుఁడు. 15. విషము. 16. పాపము. 17. హంస. 18. విక్రమార్కుని కొలువులో నుండిన నవరత్నములనఁబడువారిలో ఒక కవి. 19. శివుఁడు. 20. సాలవృక్షము. 21. మన్మథుఁడు. 22. గంధద్రవ్య విశేషము.

**శంకుస్థాపనము** నం. వి. అ. న. గృహనిర్మాణారంభ సమయమున భూమిలో శంకువును స్థాపించుట.

**శంఖకము** నం. వి. అ. పుం. న. శంఖము. పుం. 1. శిరోరోగము. 2. కర్ణాస్థి, చెవియెముక. న. శంఖముతోఁ జేసిన హస్తాభరణము, సంకులు.

**శంఖకారకుఁడు** నం. వి. అ. పుం. శంఖములు చెక్కుట వృత్తిగాఁగల యొక సంకీర్ణ జాతి వాఁడు. ఇట్లే. శంఖకారుఁడు.

**శంఖక్షీరము** నం. వి. అ. న. అసంభవ వస్తువు (ఇది గగన కుసుమము, శశవిషాణము వంటిది).

**శంఖచరి** నం. వి. ఈ. స్త్రీ. లలాటిక; నొసటఁ బెట్టుకొనెడి బొట్టు.

**శంఖచర్చి** నం వి. ఈ. స్త్రీ =శంఖచరి.

**శంఖజము** నం. వి. అ. పుం. (పావురపు గ్రుడ్డువలె నుండెడి) పెదముత్తెము.

**శంఖద్రావ(క)ము** సం. వి. అ. పుం. శంఖములఁ గరఁగించెడి యొకానొక ద్రావకము; ఔషధ ద్రవ్య విశేషము.

**శంఖనఖము** సం. వి. అ. పుం. క్షుద్రశంఖము, నత్త గుల్ల; క్షుద్ర జలజంతువిశేషము, నత్త.
సీ. గులకరింతయు నీరుగుట్టు శంఖనఖంబు వులు కాసి ననిమిరి బుంగపురువు. హంస. 4-156.

**శంఖప్రస్థము** సం. వి. అ. పుం. చంద్రునిలోని కలంకము.

**శంఖభృత్తు** సం. వి. త్. పుం. విష్ణువు.

**శంఖము** సం. వి. అ. పుం. న. 1. సంకువు. 2. లలాటాస్థి, నుదుటి యెముక. 3. చెవికి దగ్గఱగా నుండెడి యెముక; కణఁత యెముక, 4. ఏనుఁగు దంతముల మధ్యప్రదేశము, 5. సంఖ్యా విశేషము, నూఱు ఖర్వములు. 6. యుద్ధసంబంధ మైన వాద్యము. 7. నఖయనెడి సుగంధ ద్రవ్యము. 8. కుబేరుని నవనిధులలో నొకటి.
మ. ఒక శంఖంబునఁ బొంగునర్థపతి యుద్యోగంబు దాముస్ భజిం,పక......బిల్హ. 1.31

**శంఖముక్త** సం. వి. ఆ. స్త్రీ. ముత్తెపుఁజిప్ప.

**శంఖముఖము** సం. వి. అ. పుం. మొసలి, మకరము.

**శంఖలిఖితుఁడు** సం. వి. అ. పుం. న్యాయముగా ప్రవర్తించు రాజు. ద్వి. వ. శంఖలిఖితులు, స్మృతి కర్తలగు శంఖుఁడు, లిఖితుఁడు నను నిరువురు ఋషులు.

**శంఖి** సం. వి. న్. పుం. 1. సముద్రము. 2 విష్ణువు 3. శంఖ మూఁదువాఁడు, 4. శంఖముల పనిచేయు వాఁడు.

**శంఖిని** సం. వి. ఈ. స్త్రీ. (శంఖిని చిత్రిణి, హస్తిని, పద్మిని అనెడి నాలుగు జాతులలో నొకజాతి యాఁడుది).
చం. నడుము కృశంబు పిన్న జఘనంబు కుచంబులు గట్టి వెండ్రుక,ల్నిడుపులు గన్నులా మెఱుఁగు నిగ్గులు కాంతకు వింతభోజనం, బడరుఁ బ్రియంబుఁ గోపము నయంబుసమంబులు దానఁ గొందెమే,ర్పడ విను రక్తపుష్పపట రాగిణి శంఖినిఁగా నెఱుంగుమీ. సింహా. 1,2,215

**శంఖుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణునిచేఁ జంపబడిన యొకానొక రాక్షసుఁడు. 2. శంఖలిఖితులను స్మృతి కర్తలగు ఋషులలో మొదటి వాఁడు.

**శంఠుఁడు** సం. వి. అ. పుం. నపుంసకుఁడు.

**శంతనువు** సం. వి ఉ. పుం. ఒకానొక చంద్ర వంశపు రాజు. ఇతఁడు గంగా సత్యవతులను పెండ్లాడి గంగ యందు భీష్ముని, సత్యవతియందు చిత్రాంగద విచిత్రవీర్యులను గనెను.

**శంతాతి** సం. విశే. ఇ. సుఖము గలిగించువాఁడు, సుఖ ప్రదుఁడు.

**శంప** సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు.
శా. ఆదైత్యేంద్రకుమారుఁ గొల్చిరి మహోద్యద్రత్న హారావృతల్, పాదాబ్జక్వణదచ్ఛనూపురలు శంపాసంపదుద్యత్తనుల్. నార. 2.9.7.

**శంపాకము** సం. వి. అ. పుం. 1. లక్క. 2. పాకము, పరిణామము, పక్వమగుట. 3. జేల.

**శంబపాణి** సం వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

**శంబ(భ)ము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సుఖము గలది, అదృష్టవంతము. 2. సుఖహీనము, దురదృష్టవంతము.
వి. అ. పుం. 1. వజ్రాయుధము.
మ. సమిదుద్ద్యోదిత హేతి భృద్దళన విస్ఫార ప్రభావాప్తిమై, క్షమఁ జెంపొందిన యుదగ్ర జిష్ణుయుతి నిచ్చల్ బల్ మొనల్సూపు శం,బముపై ధాటికిఁ జయ్యనన్వెడల నీక్షార్కభర్త ధామాగ్ని క,ర్యమ బింబోపధినారతిచ్చు నహారజ్ఞావాస యాత్రోవలన్. చంద్రికా. 5.74.
2 రోఁకటి యినుపపొన్ను. 3. నడుమునకు జుట్టుకొనెడి యినుప గొలుసు. 4. చాలుగా దున్నుట; రెండవమాఱు దున్నుట.

**శంబరము** సం. విశే. (అ. ఆ. అ.) శ్రేష్ఠమైనది. ఉత్తమము.
వి. అ. పుం. 1. పర్వతము. 2. ఒకజాతిలేడి. 3. జలము.
ఉ. శంబర శోషణక్రియకుఁ జాలి దురంత తరప్రతాపరేఖ, ఖం బధికాంగకంబులకు గాఁక ఘటించి హరిత్తురంగసే, వ్యంబుమహాబలోద్ధతము నైన

శతాంగము నెక్కి యన్నిదా. ఘంబునఁ బద్మినీ యువతికాముఁడు కాముని౯ దెల్పె పొల్పుగన్. పంచతంత్రము. 1. 295.

4. ఒకజాతిచేఁప. 5. యుద్ధము.6. చిత్రమూలము (వృ. వి.). 7. లొద్దుగ (వృ. వి.) 8. ఏఱుమద్ది. (వృ. వి.) 9. ఒక రాక్షసుఁడు.

న. 1. నీరు. 2.మేఘము. 3. ధనము. 4. వ్రతము. 5. చిత్తరువు.

**శంబరసూదనుఁడు** నం. వి. అ. పుం. శంబరుని సంహరించినవాఁడు. ప్రద్యుమ్నుఁడు, మన్మథుఁడు.

**శంబరారి** నం. వి. ఇ. పుం. శంబరాసురునకు శత్రువు, ప్రద్యుమ్నుఁడు. మన్మథుఁడు. తే. గీ....జగతి నెంతటి యుపకారి శంబరారి. విజ. వి. 2. 203

**శంబరి** నం. వి. ఈ. స్త్రీ. 1. మాయ, గారడి. 2. మాయావిని, గారడి చేయు స్త్రీ. 3. ఎలుక జీడికూర (వృ. వి.).

**శంబరుఁడు** నం. వి. అ. పుం. 1. ప్రద్యుమ్నునిచే జంపఁబడిన యొక రాక్షసుఁడు.

సీ. సెలయేళ్ళ లోన వర్తిలెడువక్రతలెల్ల, మయ శంబరులలోని మాయలెల్ల. నిరంకుశో. 2. 43.

2 జినదేవుఁడు.

**శ(స)ంబలము** నం. వి. అ. పుం. న. 1. తీరము,ఒడ్డు. 2. పాథేయము, త్రోవబత్తెము. 3. అసూయ, ఓర్వలేమి.

**శంబువు** నం. వి. ఉ. పుం. కప్పచిప్ప, ఆలిచిప్ప.

**శంబూక** నం. వి. అ. స్త్రీ. — శంబువు.

**శంబూ(బు)కము** నం. వి. అ. పుం. 1. కప్పచిప్ప, ఆలిచిప్ప. 2. చిన్న శంఖము. 3. నత్త. 4. ఏనుగు కుంభస్థలము నడిమిచోటు.

**శంబూకుఁడు** నం. వి. అ. పుం. ఒకానొక శూద్ర తపస్వి.

**శంభలీ(ళి)** నం. వి. ఈ. స్త్రీ. కుట్టిని, దూతిక,కుంటెనకత్తె, అంకులాడి.

వ. అసార ప్రసారంబులు చేయు శంభళీజనంబుల చేతను మారాకయెటింగించిన....భీమ 2. 127.

**శంభుప్రియ** నం. వి. ఆ. స్త్రీ. 1. దుర్గాదేవి. 2. ఆమలకి, ఉసిరికచెట్టు.

**శంభువల్లభము** నం. వి. అ. న. తెల్లతామర పువ్వు.

**శంభువు(ఁడు)** నం. విశే. ఉ. శుభము నిచ్చువాఁడు. సుఖకరుఁడు. సుఖము నిచ్చువాఁడు. వి. ఉ. పుం. 1. శివుఁడు 2. బ్రహ్మ. 3. ముని. 4. ఒక జాతి సిద్ధుఁడు. 5. విష్ణువు. 6. తెల్లజిల్లేడు (వృ. వి.).

**శంయువు** నం. విశే. ఉ. సుఖము కలది, శుభాన్వితము

**శంవము.** నం. వి.అ. పుం. 1. క్రమపద్ధతిని దున్నుట. 2. వజ్రాయుధము. 3. రోఁకటి యినుపపొన్ను.

**శంస** నం వి. అ. స్త్రీ. 1. స్తుతి, పొగడ్త. 2. కోరిక, ఇచ్ఛ. 3. కథనము, చెప్పుట. 4. మాట, పలుకు (మే.ని.).

**శంసనము** నం. వి. అ. న. 1. స్తుతించుట, పొగడుట. 2. చెప్పుట, కథనము, 3. కంఠపాఠము చేయుట.

**శంసి** నం. విశే. (న్.సీ. న్.) (తఱచుగ సమాసాంతమున) 1.స్తుతించువాఁడు, పొగడువాఁడు. 2.చెప్పువాఁడు,తెలుపువాఁడు. 3.భవిష్యత్తు చెప్పువాఁడు, జరుగఁబోవు పనిని సూచించువాఁడు.

**శంసితము** నం. విశే. (అ. అ. అ.) 1. పొగడఁబడినది, స్తుతిఁపఁబడినది. 2. చెప్పఁబడినది, వచింపఁబడినది. 3. కోరఁబడినది. 4. నిశ్చయింపఁబడినది. 5. స్థిరపఱుపఁబడినది. 6. నింద యారోపింపఁబడినది. 7. నవ్వఁబడినది.

**శంస్త.** నం. వి. ఋ. పుం. 1. స్తోత్రపాఠకుఁడు. 2. మంత్రములు పఠించుద్విజుఁడు.

**శకకర్త** నం. వి. ఋ. పుం. శకమునకు మూలపురుషుఁడు (విక్రమార్కుఁడు, శాలివాహనుఁడు, క్రీస్తు మొ.).

**శకటబిలము** నం. వి. అ పుం నీరుకోడి.

**శకటము** నం వి. అ. పుం. న. 1. ఒక విధమగు యానము, బండి. 2. రోహిణీ నక్షత్రము. పుం. 1. శకటము వలె నేర్పఱుపబడిన సేన, శకటవ్యూహము. 3. రెండువేల పలముల బరువుగల బండి బరువు. 4. తినిశవృక్షము, నెమ్మిచెట్టు, ధాన్యము బాగుచేయు సాధనము.

**శకటాక్షము** నం. వి. అ. పుం. బండియిరుసు.

**శకటారి** నం. వి. ఇ. పుం. శకటాసురుని శత్రువు.

కృష్ణుఁడు.
సీ. శకటారి నెమ్మోముసరి యొండులేదని ద్విజ రాజుపై నానఁబెట్టవచ్చు. రాధికా. 2. ౬౭.

**శకటాహ్వ** సం. వి. ఆ. స్త్రీ. రోహిణీ నక్షత్రము.

**శకటిక** సం. వి. ఆ. స్త్రీ. చిన్నబండి

**శకటుఁడు** సం. వి. అ. పుం. శ్రీకృష్ణునిచేఁ జంపఁబడిన యొక్క రాక్షసుఁడు, శకటాసురుఁడు

**శకము** సం. వి. అ. పుం. 1. సుప్రసిద్ధుఁడగు రాజు రాజ్యారంభముతోఁ బరిగణింపఁబడు కాలవిశేషము (యుధిష్ఠిరశకము, విక్రమార్క శకము, శాలివాహనశకము, మొ.) క్రీస్తుశకము తర్వాత డెబ్బది యెనిమిది సంవత్సరములకుఁ ప్రారంభమైన శాలివాహనుని కాలము 2. శాలివాహన శకము. (శకవర్షములు). 3. దేశభేదము. 4. జాతిభేదము, పౌండ్రకజాతితోపాటు చెప్పఁబడిన యొక తెగ.

**శకలము** సం. వి. అ. పుం. న. 1. భాగము, అంశము, ఖండము, ముక్క, తునుక. న. 1. చెట్టుపట్ట. 2. చేప పై పొలుసు.

**శకలి** సం. వి. న్. పుం. చేప, మత్స్యము.

**శకలితము** సం. విణ. (అ. ఆ. అ.) ముక్కలుగాఁ జేయఁబడినది.

**శకాంతకుఁడు** సం. వి. అ. పుం. శకుల నశింపజేసిన వాఁడు. విక్రమార్కుఁడు.

**శకాబ్దము** సం. వి. అ. పుం. శకములో నొక సంవత్సరము, శాలివాహన శకమునకు సంబంధించిన సంవత్సరము.

**శకారి** సం. వి. ఇ. పుం. శకాంతకుఁడు.

**శకారుఁడు** సం. వి. అ. పుం. రాజు యొక్క యుంపుడు కత్తెకుఁ దోడఁబుట్టినవాఁడు. (చూ. మృచ్ఛకటిక).

**శకుంతము** సం. వి. అ. పుం. 1. పక్షి. 2. నీలిరంగుగల పాలపిట్ట. 3. పక్షివిశేషము, ఒకజాతిపిట్ట. 4. కీటవిశేషము, ఒకజాతిపురుగు.

**శకుంతల** సం. వి. ఆ. స్త్రీ. విశ్వామిత్రునకు మేనక యందుఁ బుట్టిన కూఁతురు.

**శకుంతి** సం. వి. ఇ. పుం. పక్షి.

**శకుంతిక** సం. వి. ఆ. స్త్రీ. 1. పక్షి. 2. ఒకజాతిపిట్ట. 3. మిడుత, శలభము.

**శకుఁడు** సం. వి. అ. పుం. 1. ఒకానొకరాజు. 2. ఒక జాతి మనుష్యుఁడు.

**శకునజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. బల్లి.

**శకునజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) శకునము, రాఁబోవు శుభాశుభముల సూచించు నిమిత్తములు) తెలిసినవాఁడు.

**శకునము** సం. వి. అ. పుం. 1. పక్షి, పిట్ట. 2. పక్షి విశేషము, రాబందు, ఒకజాతి గ్రద్ద. 3. గానవిశేషము.
న. 1. శుభాశుభముల సూచించునట్టి నిమిత్తము.
తే గీ. ... మంచి శకునంబు లివిగో నా మాట జూఁడు కన్నె యీలోనఁ బెండ్లి గాఁగలదు నీకు. విజ. వి. 2. 159.
గీ. ఎల్లవారికి శకునంబులెల్లఁ బలికి బల్లి తాబోయి తొట్టిలో బడినరీతి. రాధికా. 3. 46.

**శకుని** సం. వి. ఇ. పుం. 1. పక్షి, విహగము. 2. రాబందు, ఒకజాతిగ్రద్ద. 3. దుర్యోధనుని మేనమామ. 4. కృష్ణునిచే జంపబడిన యొక రాక్షసుఁడు. 5. (జ్యోతి.) పంచాంగములలో నొకటగు కరణములందలి 11 భేదములలో నొకటి. ఈ. స్త్రీ. 1. ఆఁడుఁబిచ్చుక, పక్షివిశేషము. 2. నల్లగోరువంక.

**శకుని ప్రప** సం. వి. ఆ. స్త్రీ. పక్షులు నీరు ద్రాగెడి తొట్టె.

**శకునీశ్వరుఁడు** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు.

**శకులము** సం. వి. అ. పుం. 1. ఒకజాతిచేప.

**శకులా(ల్యా)దని** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక విధమగు మందుచెట్టు, కటుకరోహిణి. 2. నీటిపిప్పలి(వృ. వి.). 3. జటామాంసి (వృ. వి.). 4. ఎఱ్ఱవానపాము.

**శకులార్భకము** సం. వి. అ పుం. ఒకజాతి చేప.

**శకులి** సం. వి. న్. పుం. మత్స్యము. చేప (రూ. శకిలి.).

**శకృత్కరి** సం. వి. ఇ. పుం, దూడ, వత్సము. (శకృత్కరి. ఈ. స్త్రీ. కూడనున్నది).

**శకృత్తు** నం. వి. త్. న. పశుమలము, పేడ, మలము.
వ. తాడనావమానమేహన నిష్ఠీవనపాషాణశకృ ద్రజః ప్రక్షేపణ పూతివాత దురుక్తులంబరిభూతుం డైనను గడనంబెట్టక భాగ. పంచమస్కంధము. 78.

**శకృత్పిండ(క)ము** నం వి. అ. పుం పేఁడముద్ద.

**శక్కరి** నం. వి. ఈ. స్త్రీ. 1. నది. 2. ఒడ్డాణము; మొలనూలు. 3. సంకీర్ణజాతి స్త్రీ. 4. వ్రేలు, అంగుళి.

**శక్క(క్వ)రము** నం. వి. అ. పుం. ఎద్దు, వృషభము.

**శక్తము** నం విశే. (అ. ఆ. అ.) 1. సమర్థము, శక్తి గలది 2. బలవంతము, బలాఢ్యమైనది. 3. సమృద్ధము, సంపదగలది. 4. అభిధాశక్తి గలది, అభిధా మూలమున నర్థమును దెలుపునది (పదము). 5. తెలివిగలది.

**శక్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. శరీరబలము. 2. సామర్థ్యము. 3. రాజకీయము అగు ప్రభు మంత్రోత్సాహ శక్తులలో నొకటి. 4. (తంత్ర.) పీఠాధిష్ఠాన దేవత.
కం. తగనాశక్తికినభిముఖ, యగుచుం బద్మాసనస్థయై కూర్చుండెన్. కళా. 4. 189.
5. ఆయుధవిశేషము, ఒక విధమయిన యాయుధము.
మ. ...లక్ష్మణశక్తింబడవైచి రామవిభుపై శస్త్రౌఘ వర్షింపఁగన్. దశావ. 7. 134.
6. ఈఁటె. 7. కార్యమును బుట్టించుటకు యోగ్యమైన కారణనిష్ఠమగు ధర్మము 8 అభిధా లక్షణ వ్యంజనలనెడి శబ్దశక్తులలో నొకటి. 9. అభిధాశక్తి. 10. గౌరి. 11. లక్ష్మి. 12. ఆఁడుగుటి. 13. ఖడ్గము. 14 పాచిక. 15. ప్రతిభ.

**శక్తిగ్రహము** నం. విశే. (అ. ఆ. అ.) (శబ్ద) శక్తిని గ్రహించునది. వి. అ. పుం. అర్థబోధకతా రూపమగు (శబ్దనిష్ఠ) వృత్తిని దెలిసికొనుట.

**శక్తిగ్రాహకము** నం. విశే. (అ. ఆ. అ). అర్థమును నిశ్చయించునది, స్థిరపఱచునది (హేతువు).

**శక్తిత్రయము** నం. వి. అ. న. ప్రభు మంత్రోత్సాహ శక్తులు.

**శక్తిధరుఁడు** నం. విశే. (అ. ఆ. అ.). బలము గలవాఁడు. వి. అ. పుం. 1. ఈఁటెపట్టి పోరాడు యోధుఁడు. 2. కుమారస్వామి (శక్తి ధ్వజుఁడు).

**శక్తిపాణి** నం. వి. ఇ. పుం. — శక్తిధరుఁడు.

**శక్తిమంతుఁడు** నం. విశే. (త్. మతీ. త్.). శక్తిగలవాఁడు, బలముగలవాఁడు,
2. సామర్థ్యము గలవాఁడు.

**శ(స)క్తువు** నం. వి. ఉ. పుం యవచూర్ణము, సక్తువు, పేలపిండి.

**శక్నుఁడు(వు)** నం. విశే. (ఉ) ప్రియముగా మాటలాడు వాఁడు, ఇష్టముగా మాటలాడువాఁడు (శక్లుఁడు).

**శక్యప్రతీకారము** నం, విశే. (అ. ఆ. అ). శక్యమైన ప్రతిక్రియగలది. ప్రతిక్రియచేయ శక్యమయినది.

**శక్యము** నం. విశే (అ. ఆ. అ) 1. సాధ్యమైనది, సాధింపఁదగినది, చేయఁదగినది.
కం ఎవ్వరికిని మోపెట్టను దివ్వను శక్యంబు గాని దృఢకార్ముకమున్.
ఉ. వింతయె కాముశక్తి నుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్. భార. ఆది. 7. 58. భార. ఆది. 7.25.
ఆ. వె. తరుణి విభ్రమంబు తలపోయ శక్యమే, ధాతకైన వాని తాతకైన. నిరంకుశ. 2.53.
2. నెఱవేర్పఁదగినది. జరుపఁదగినది. 3. అభిధావృత్తిచే దెలుపఁబడినది (అర్థము).

**శక్యార్థము** నం. వి. అ. పుం. అభిధచేఁ దెలుపఁబడిన యర్థము (వ్యతి. లక్ష్యార్థము. వ్యంగార్థము.)

**శక్రగోపము.** నం. వి. అ. పుం. ఇంద్రగోపము, ఆరుద్రపురుగు.

**శక్రజము** నం. వి. అ. పుం. కాకి. (ఇట్లే శక్రజాతకము మొ)

**శక్రజిత్తు** నం వి. త్. పుం. ఇంద్రజిత్తు, రావణుని. పుత్రుఁడైన మేఘనాదుఁడు,

**శక్రద్వారము.** నం. వి. అ. న. = హరిద్వారమను తీర్థక్షేత్రము.
సీ. ... మత్పూర్వులు శతశృంగమునను ద్రోణ, మునమ, శక్రద్వారమున మహాధ్వరములు సేసిరి భార. శాంతి 6.213.

**శక్రధనుస్సు(వు).** నం. వి. స్. న. ఇంద్రధనుస్సు.

**శక్రిధ్వజము** సం. వి. అ. పుం.— ఇంద్రధ్వజము.

**శక్రిపాదపము** సం. వి. అ. పుం. 1. కుటజవృక్షము. 2. దేవదారువృక్షము.

**శక్రిభవనము** సం. వి. అ. న. స్వర్గము. ఇంద్రుని నివాసము.

**శక్రభువనము** సం. వి. అ. పుం. స్వర్గము, ఇంద్రలోకము.

**శక్రిభూభవ** సం. వి. అ. స్త్రీ. వెట్టిపుచ్చ, ఇంద్రవారుణి.

**శక్రమాతృక** సం వి.అ. స్త్రీ. ఇంద్రుని చెక్కెము నిలువబెట్టెడు కఱ్ఱస్తంభము.

**శక్రము** సం. వి. అ. పుం. 1. అర్జున వృక్షము 2. కుటజవృక్షము. 3. గుడ్లగూబ. 4. జ్యేష్ఠా నక్షత్రము. 5. పదునాలుగుసంఖ్య.

**శక్రిమూర్ధము** సం. వి. న్.పుం. వల్మీకము. పుట్ట.

**శక్రశాల** సం. వి. అ. స్త్రీ. యజ్ఞశాల.

**శక్రసుతుఁడు** సం. వి. అ. పుం. 1. జయంతుఁడు. 2. అర్జునుఁడు. 3.వాలి(ఇట్లే శక్రాత్మజుఁడు.మొ.)

**శక్రిసృష్ట** సం, వి. అ. స్త్రీ. హారీతకి. కరక(వృ వి.).

**శక్రాఖ్యము** సం. వి . అ పుం. గుడ్లగూబ.

**శక్రాశనము** సం. వి. అ. పుం. 1.కుటజవృక్షము. న. భంగుతోఁ జేసిన మద్యము.

**శక్రి** సం. వి. ఇ.పుం.1. మేఘము. 2. వజ్రాయుధము 3. పర్వతము. 4. ఏనుఁగు.

**శక్రుఁడు** సం. వి. అ. పుం. 1.ఇంద్రుఁడు. 2, శివుఁడు.

**శక్రోత్థానము.** సం. వి. అ, పుం భాద్రపదశుక్ల ద్వాదశినాఁ డింద్రు నుద్దేశించి చేయఁబడెడి యుత్సవము (ఇట్లే శక్రోత్సవము).

**శక్వము** సం. వి. అ. పుం. ఏనుఁగు.

**శక్వరి** సం. వి. ఈ. స్త్రీ. పదునాల్గవ ఛందము.

**శచి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఇంద్రునిభార్య.

**శచీపతి** సం. వి. ఇ పుం ఇంద్రుఁడు.

**శట** సం. వి. అ స్త్రీ 1.యోగుఁ జడ. 2. సింగపు జూలు.

**శటము** సం. విశే. (అ. అ. అ) 1. పుల్లనైనది. 2. ఒగరైనది.

**శటి** సం. వి. ఇ. స్త్రీ, కచోరము (వృ. వి.).

**శఠకము** సం. వి. అ. న. నేయి, నీరు గలిపిన బియ్యపుపిండి, ఘృతజల మిశ్రితమయిన శాలి చూర్ణము.

**శఠకోపము** వి. విష్ణ్వాలయమున భక్తుల తలపై నుంచెడి విష్ణుపాదములు గల పాత్రవిశేషము. **శఠకోపము పెట్టు**—వంచించు.

సీ. వడిపాఖుఁడుల సర్వస్వమ్ముఁగొని శఠకోపంబుఁ బెట్టిరి గురుతరముగ. ( శఠగోపము అని. వా.) సిం నార. 26.

**శఠకోపుఁడు శఠగోపుఁడు** సం వి అ. పుం. రామానుజ స్వామికి మఱియొక యవతారమున పేరు.

వ...అతండయిటమీద .... శఠకోపసమాఖ్య సంభవించి...భూతలంబుఁ బావనంబు సేయంగలవాఁడు- ఆము. 6.66.

**శఠము**[1] సం. వి. అ.పుం. కోపము. (ఈ యర్థమిచ్చుటనే శావవచ్చుచున్నది.)

ద్వి. తొడవులు డాఁచియా ధూర్తులమీద నడిచైచి విభునకు శఠముబుట్టింప....ద్వి. పరమ. 3.206పా.

**శఠము**[2] సం వి.అ.పుం. ఉమ్మెత్తచెట్టు.న. 1. ఇనుము. 2. కుంకుమపువ్వు.

**శఠుఁడు** సం. విశే. (అ.అ అ 1. మోసపుచ్చువాఁడు, వంచకుఁడు.

మహాస్రగ్ధర. ఘనుడై తిమ్మక్షితీశాగ్రణి శఠకమఠ గ్రావ సంఘాతపాతాశనరాడాశాంతదంతి స్థవిర శిరుల జంజాటముల్ మాన్పి... మనుచ. 1. 209

ఆ. శఠులుకాని భృత్యజనుల నియోగింప, భవుని పూజకొఱకు, శివధర్మ.1–209.

2. దుష్టుడు దుర్మార్గుఁడు.

వి. అ. పు.1. మోసగాడు. శృంగార నాయకులలో నొకడు. 3. మూర్ఖుఁడు. బుద్ధి లేనివాఁడు. 4. మధ్యవర్తి. 5. సోమరి, అలసుఁడు.

**శణము** సం. వి. అ. న. 1. జినుము (వృ. వి.). 2. గంజాయి చెట్టు.

**శణసూత్రము** సం. వి. అ. న. 1. జనుపనార 2. జనుపనారతో నల్లిన వల. 3. మోకు,త్రాడు.

**శతకము** నం. విఱ.(అ. ఆ. అ.) 1. నూఱు నంఖ్య గలది. నూఱువస్తువులు గలది.
వి. అ. న. 1. శతము, నూఱు నూఱుపద్యముల సమూహము. ఉదా॥ సూర్యశతకము.

**శతకుంభము** నం. వి.. అ. పుం. బంగారుగని గల యొకానొక పర్వతము. న. బంగారము.

**శతకోటి** నం. వి. అ. ఇ· నూఱంచులుగలది.వి. ఇ. పుం వజ్రాయుధము. స్త్రీ. నూఱుకోట్లు.
గీ. ప్రబలఖలగోత్రవ్యాతికి నీవదనఖంబె, చాలు శతకోటి సాధనంబేలమాకు. వసు.౩.

**శతక్రతువు** నం. వి. ఉ. పుం. ఇంద్రుడు.

**శతఖండము** నం. వి. అ. న. బంగారము.

**శతగుణము** నం విఱ. (అ. ఆ. అ.) నూఱురెట్లు (ఇట్లే శతగుణితము).

**శతగ్రంథి**. నం. వి. ఇ. స్త్రీ. దూర్వ. గఱిక.

**శతఘ్ని** నం. వి. ఈ. స్త్రీ. 1. ఆయుధ విశేషము 2. అడుతేలు. 3. గళరోగ విశేషము. కుత్తుకలోఁ బుట్టు రోగవిశేషము. 4. కరంజము. కానుగుచెట్టు.

**శతఘ్నుఁడు** నం. వి. అ. పుం శివుఁడు.

**శతతమము** నం. విఱ. (అ.ఆ.అ.) నూఱవది.

**శతతారక** నం. వి. అ. స్త్రీ. శతభిషానక్షత్రము.

**శతదల** నం. వి. ఆ. స్త్రీ. పుష్పవృక్ష విశేషము, తెల్ల గులాబీ (వృ. వి.) ఇట్లే శతపత్రిక.

**శతద్రువు** నం. వి. . ఉ. స్త్రీ. 1. పంజాబు దేశము నందలి ప్రకృతము. సట్లెజ్జి యనబడునది. 2. గంగానది.

**శతధా** నం. అవ్య. ( తెలుగున దీనికి వ్యస్తప్రయోగము లేదు.)
1. నూఱుమార్గముల, 2.నూరుభాగముల 3.నూరు మడుఁగుల. అ. స్త్రీ. దూర్వ,గఱిక.

**శతధారము** నం.విఱ. (అ. ఆ అ.)1.నూఱుధారలుగా ప్రవహించునది. 2. నూఱంచులు గలది. వి. అ. న. వజ్రాయుధము,

**శతధృతి** నం. వి. ఇ. పుం· 1. ఇంద్రుఁడు 2. బ్రహ్మదేవుఁడు 3. స్వర్గము.
కం. అతులరజస్స్ఫురితుండై, శతధృతిసదృశుఁడయి పుట్టెఁజంద్రుఁడు–మార్క.2. 199

**శతపత్ర** నం. వి. ఆ. స్త్రీ. ఆడుది (విలియమ్స్).

**శతపత్రకము** నం. వి. అ. పుం. 1. పక్షివిశేషము, (వడ్రంగి పిట్ట), మానుగోయిల.(ఇట్లే శతచ్ఛదము)

**శతపత్రము** నం. వి. అ. పుం. 1. నెమలి 2. సారస పక్షి. 3. దార్వాఘూటము 4. ఒక జాతి చిలుక. న. తామరపువ్వు.

**శతపథబ్రాహ్మణము** నం. వి. అ. న. శుక్లయజుర్వేదమునకు సంబంధించిన వేదభాగము.

**శతప(పా)దము** నం. విఱ. (ద్) నూఱడుగులు గలది. వి. స్త్రీ. జెఱ్ఱి.

**శతప(పా)ది** నం. వి. ఈ. స్త్రీ. జెఱ్ఱి.

**శతపద్మము** నం. వి. అ. న. 1. నూఱుఱేకులు గల పద్మము. 2. తెల్లతామర.

**శతపర్వ** నం. వి. న్. స్త్రీ. శుక్రునిభార్య.

**శతపర్వము** నం.వి. న్.పుం. 1. వెదురు. 2. ఒకజాతి చెఱకు.
స్త్రీ. 1. ఆశ్వయుజశుక్ల పౌర్ణమాస్య. 2. దూర్వ, గఱిక. 3. కటుక రోహిణి 4. వసదుంప.

**శతపర్విక** నం. వి. అ. స్త్రీ.1.దూర్వ గఱిక (వృ.వి.) 2.వసదుంప. 3. యవసస్యము.

**శతపాదిక** నం.వి.అ స్త్రీ.1. జెఱ్ఱి.2.కారువెల్లి(వృ.వి ).

**శతపుష్ప** నం. వి. ఆ. స్త్రీ. సదాప(వృ. వి. (శ. ర).

**శతపోనకము** నం. వి. అ. పుం. రోగవిశేషము, భగందరము.

**శతపోనము** నం. వి. అ. పుం. జల్లెడ.

**శతప్రాసము** నం. వి. అ· పుం. కరవీరవృక్షము.

**శతఫలి** నం. వి. న్. పుం. వెదురు.

**శతభిష** నం. వి. అ. స్త్రీ. అశ్వినినుండి యిరువది నాల్గవ నక్షత్రము.

**శతభిషజము** నం. వి. జ్. స్త్రీ. శతభిష.

**శతభీరువు** నం. వి. ఉ. స్త్రీ. ఒకజాతిమల్లె.

**శతమఖుఁడు**. నం. వి., అ. పుం. నూరుయజ్ఞములు చేసినవాఁడు; ఇంద్రుఁడు.

**శతమన్యువు** నం. వి. ఉ. పుం. 1. ఇంద్రుఁడు

సీ. శతమన్యు శుద్ధాంత సౌధకూటము మీఁదఁ గను పట్టు కాంచనకలశ మనఁగ భీమ. 2.49.
గుడ్లగూబ.

**శతమయూఖుఁడు.** నం. వి అ. పుం. చంద్రుఁడు.

**శతమానము** నం వి. అ .పుం. న. 1. వెండియొక్క పలప్రమాణము. పలమెత్తు వెండి. 2. ఆఢకము, తూము, పరిమాణవిశేషము. 3 మంగళసూత్రము. ఈయర్థము ఆంధ్రలోకవ్యవహారమునఁ గలదు.

**శతము** నం. వి. అ. న. 1. నూఱు
గీ.... కౌరవకుమార శతము భార్యలు నూఱ్వురు. భార. ఆశ్రమ. 2. 90.
2. అధికసంఖ్య

**శతముఖము** నం విశ. (అ. ఈ. అ )1. నూఱు ముఖములుగలది. 8. నూఱు మార్గములుగలది. వి.అ.న. నూఱుద్వారములు, నూఱుమార్గములు.

**శతముఖి** నం. వి. ఈ. స్త్రీ చీపురుకట్ట.

**శతమూల** నం. వి. ఆ. స్త్రీ.దూర్వ, గఱిక (వృ. వి ).

**శతరుద్రియము** యజుర్వేదాంతర్గతమైన "నమక" మను వేదభాగము.
సీ. వరసింహము జపింప నరసింహము జపించు, నాది శైవమున కదియె నుడువు, శతరుద్రియముఁ బూన శతరుద్రియనుఁ బూను హనుమజ్జపంబున కదియె చేయు. నిరంకుశో. 4 72.

**శతరూప** నం వి. ఆ. స్త్రీ. బ్రహ్మదేవుని పుత్రిక (బ్రహ్మ యనర్హసంబంధమున నా మెను భార్యగాఁ జేసికొని యా మెయందు స్వాయంభువమనువును గనినట్లు చెప్పుదురు.) (వాచ.).

**శతవర్షము** నం.విశ.(అ. ఆ. అ.)1. నూఱేండ్లు గలది 2. నూఱేండ్లు వచ్చునది, నూఱేండ్ల వఱకు నుండునది వి అ. న. శతాబ్దము, నూఱేండ్లు.

**శతవీర్య** నం. వి ఆ. స్త్రీ. తెల్లదూర్వ. తెల్లగఱిక (వృ. వి.). 2. శతావరి, పిల్లితేగలు.

**శతవేధి** నం. వి. న్. పుం. పుల్లప్రబ్బలి (వృ. వి.).

**శతశః** నం. అవ్య (తెలుఁగున వ్యస్తప్రయోగము గావరాదు,) 1. నూఱువిధములు. 2. నూఱుల లెక్కను. 8. నానాప్రకారముగా.

**శతశాఖము** నం. విశ. (అ.ఆ.అ.) 1 పెక్కుశాఖలు గలది. 2 నానాప్రకారము.

**శతహ్ర(హ్రి)ద** నం. వి. ఆ. స్త్రీ. 1. మెఱుపు. 2 వజ్రాయుధము.

**శతాంగము** నం. వి. అ. పుం. 1. రథము, తేరు
వ. ... అన్యోన్యవ్యాఘాతాఘట్టనల శతాంగతురంగ సూతకేతు బాణాసనతనుత్రాణ శిరస్త్రాణములు ధరణి పయిం దొరఁగిన...చిత్రభా. 8. 53.
2. తినిశవృక్షము, నెమ్మిచెట్టు (వృ వి.).

**శతాక్షి** నం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి. రేయి 2. దుర్గాదేవి.

**శతానందము** నం. వి. అ. పుం. విష్ణునిరథము. విశ (అ.ఆ అ.) పెక్కండ్ర కానందము గూర్చునది.

**శతానందము** నం వి. అ. పుం. విష్ణురథము.

**శతానందుఁడు** నం. వి అ పుం 1. బ్రహ్మదేవుఁడు
కం. అనఘలీలచేత శతానందుం డధికసంభృతానందుండై...కళా. 5. 29
2. కృష్ణుఁడు 3. అహల్యాగౌతముల పుత్రుఁడును జనకమహారాజపురోహితుఁడునగు నొక ఋషి.

**శతాబ్దము** నం. వి. అ. న. నూఱేండ్లు.

**శతాబ్ది** నం. వి. ఈ. స్త్రీ. నూఱేండ్లు.

**శతాయు(స్సు)షుఁడు** నం.విశ.న్. నూఱు సంవత్సరముల ఆయుర్దాయము కలవాఁడు (శతాయువు).

**శతారము** నం. వి. అ. న. వజ్రాయుధము.

**శతారుషి** నం. వి. ఈ. స్త్రీ. కుష్ఠవ్యాధి.

**శతారుస్సు** నం. వి. స్. న. =శతారుషి.

**శతావరము** నం. వి. అ. పుం. నూఱునాణెముల దండనము.

**శతావరి** నం. వి. ఈ. స్త్రీ. 1. ఓషధివిశేషము. పిల్లి తేగలు. 2. శచీదేవి.

**శతి** నం. విశ. (ని. నీ. న్.) 1. నూఱుమడుఁగులు గలది. 2. నానాప్రకారమైనది. వి. న్. పుం నూటింటి కధికారి.

**శతికము** నం. విశ. (అ. ఈ. అ.) 1. నూఱుగలది. 2. నూటింటికి సంబంధించినది 3. నూటింటితో జరిగినది. 4. నూటితోఁ గొనినది. 5. నూఱుగా

మాఱువది. 6. నూఱునాణెములు లాభముగలది. (ఇట్లే శత్యము)

**శతేశుఁడు** సం. వి. అ. పుం. 1 నూటి కధికారి, 2. నూఱుగ్రామములు పాలించువాఁడు

**శత్రుంజయము** సం. వి. అ. పుం. ఏనుగు. 2 గుజరాతునందలి ఒక పర్వతము.

**శత్రుంతపుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) శత్రువులను దపింపఁజేయువాఁడు శత్రువులఁ జెంపువాఁడు

**శత్రుఁడు (వు)** సం. వి. ఉ పుం పగవాఁడు.

క౦. బలహీనులైనచో శత్రులఁ జెఱుచుట నీతి. భార. ఆది. 6. 103.

**శత్రుకర్షణుఁడు** సం. విశ. (అ ఆ. అ.) శత్రువులను లోఁబఱచుకొనువాఁడు. శత్రువుల నోడించువాఁడు. (ఇట్లే శత్రుదమనుఁడు శత్రునిబర్హణుఁడు మొ).

**శత్రుఘ్నుఁడు** సం. వి. అ. పుం. 1. శత్రువులఁ జంపువాఁడు. 7. సుమిత్రాపుత్రుఁడు; లక్ష్మణుని సోదరుఁడు

శా. శత్రుఘ్నుండు వడన్ హతాశఁ బఱచెన్ సైన్యంబు దైన్యంబునన్. జైమిని. 6 146

**శత్రువు** సం. వి. ఉ. పుం. 1. జయించినవాఁడు విరోధి. 2. పగవాడు, విరోధి 3. తనరాజ్యమునకుఁ బ్రక్కనుండెడు రాజు, అరి. 4. (జ్యోతి) లగ్నమున కాఱవస్థానము.

**శత్వరి** సం. వి. ఈ. స్త్రీ. రాత్రి.

**శదము** సం. వి. అ. పుం.

1. ఫలమూలాది శాకాహార విశేషములు. 2. ఫలసాయము, ఆదాయము.

**శద్రి** సం. వి. ఇ పుం 1. ఏనుఁగు. 2. మేఘము. 3. అర్జునుఁడు.

(స్త్రీ.) 1. మెఱుపు. 2. కలకండ.

**శద్రువు** సం. విశ. (ఉ) 1. నడచువది. 2. పడిపోవుచున్నది, క్షీణించుచున్నది.

**శనము** సం. విశ. (అ. ఆ. అ.) 1. శాంతమైనది. 2. మృదువైనది.

**శని** సం. వి. ఇ. పుం. 1. నవగ్రహములలో నొక గ్రహము. సూర్యపుత్రుఁడైన శనైశ్చరుఁడు.

సీ. నలునకా శనిచేతి యలఁత హరిశ్చంద్ర మహిపాల మౌళికా మాలకొల్పు. నిరంకుశో. 4. 97.

2. శనివారము. 3. శివుఁడు. 4. దురదృష్టము.

గీ కాలశని యుండెనో జవరాలిఁబాసి, యేల వచ్చితి నా బుద్ధి కూలిపోను రాధికా. 3. 100

**శనిజము** సం వి. అ న మిరియము.

**శనిప్రదోషము** సం వి అ. పుం. త్రయోదశీ శని వారమునాటి సాయంకాలము

**శనిప్రియము** సం వి. అ. న. ఇంద్రనీలము. రత్న విశేషము.

**శనివా(స)రము** సం వి అ. పుం ఏడువారములలో నొకటి, శనిదేవతగాఁ గల దినము, స్థిరవారము

**శనివారపుజడి** మి వి – ఎడతెగక యుండునది; ఎడ తెగక కురియు వాన.

సీ. చెవులు చిందఱవోవఁ జెలఁగు కవీంద్రుల పోరంటిమే శనివారపు జడి. కళా. 6. 20.

**శనివారోత్సవము** సం. వి. అ పుం. – శివకేశవులకుఁ బ్రీతికరముగా శనివారమునఁ జేయు నుత్సవము.

మ. శనివారోత్సవ మాచరించె మునిశిష్య వ్రాత మున్ దాను భీమ. 2. 66.

మ శనివారోత్సవ వేళ గన్గొనియె. కాశీ. 3. 18.

**శనిశరము** వి ఒక జాతిదేగ.

గీ వారణంబును జలకట్టె బైరిగిద్దు, చంచడము సాళువము శనిశరము మించు వేస్త్రమును తళుకాదిగ వేర వేర,నొప్పుడేగల జతగూర్చుకుండుటయును. ప్రబంధ. 190.

వ. మఱియు సాళువంబులు శనిశరంబులు వారణంబులు బేసడంబులు జలకట్టెలు తళుకు మించు మొదలగు డేగలం గరంబుల గల బెత్తంబుల హత్తించి. ఇందు. 2. 60.

**శనైశ్చరుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) మెల్లఁగా నడచువాఁడు వి. అ. పుం. శని.

**శపథపత్రము** సం. వి. అ. న. ప్రమాణపత్రము.

**శపథము** సం. వి. అ. పుం. 1. తిట్టుట. 2. శాపము. 3. ప్రమాణము, ప్రతిజ్ఞ.

కం. తానొక నిజమరిపోలెం,బూని పలికెఁ బెక్కు శపథములు..... భోజరా. 6, 56,

అగ్నిప్రమాణము మొ. 4. ఒట్టు పెట్టుకొనుట.

**శపనము** సం. వి. అ. న. 1. శపథము. 2. నిందించుట, దూఱుట, నింద.

**శపి(యి)ంచు** సం. న. క్రి. తిట్టు, నిందించు.

వ. మా తండ్రి మమ్ముఁ దిర్యగ్యోని జాతుల రగుఁడని శపించి తన సత్యవ్రతంబు పరిపాలింపదలచి... మార్క. 1. 79.

ఉ. నీకు నిది చేసినదేమి వృథాశపింతురే....మను. 4. 87.

వ. మనుష్య పక్షపాతంబున నన్ను ధిక్కరించితిరి, మనుష్యులు గండని శపియించితోవ ప్రసన్నత్వంబు గైకొని. మార్క. 1. 166.

కం. ముసలి శపియించె నపుడ, య్యసితాబ్జేక్షణల రాజయక్ష్మ క్షోభం, బెసఁగ నశియింప...మను, 4. 9 ; ద్వి పరమ. 1. 28.

**శప్తము** సం. విశ (అ ఆ. అ) 1. శపింపఁబడినది. 2. ప్రమాణము చేయఁబడినది. 3 నిందింపఁబడినది.

**శఫము** సం. వి అ. పుం. న. 1. గొరిజ. డెక్క. 2. చెట్టువేరు.

**శఫరము** సం. వి. అ. పుం. మత్స్యవిశేషము; ఒక జాతి చేప.

**శఫరుకము** సం వి. అ. పుం. పెట్టె; పాత్ర.

**శబరము** సం వి అ పుం 1. చేయి 2. నీరు.

**శబరలోధ్రము** సం వి అ పుం అడవిలొద్దుగచెట్టు

**శబరాలయము** సం. వి అ పుం కోయగూడెము, పక్కణము.

**శబరి** సం వి ఈ స్త్రీ 1. చెంచెత, శబరస్త్రీ. 2. రామభక్తురాలయిన యొక కోయది.

**శబ(వ)రుఁడు** సం వి అ పుం 1 కొండవాఁడు. కిరాతుఁడు 2. శివుఁడు 3. మీమాంసాశాస్త్రమున గ్రంథకర్తయు వ్యాఖ్యాతయునైన శబరాచార్యుఁడు.

**శబల** సం వి. అ స్త్రీ 1 పలురంగులు గల యావు 2. కామధేనువు

**శబలత** సం. వి అ స్త్రీ చిత్రవర్ణత్వము.

శ్రీత్వశివాత్వాలంబన తత్వాక్లేపాత్త శబలతా సంగత్......భార. విరా. 3. 1.

**శబలము** సం. విశ. (అ. ఆ అ) 1. చిత్రవర్ణము గలది. పలురంగులు గలది. 2. వేఱు వేఱు భాగములుగా విభజింపఁబడినది. 3. స్పష్టముగా నుచ్చరింపబడినది. వి. అ. పుం. చిత్రవర్ణము న. నీరు.

**శబలి** సం. వి. ఈ. స్త్రీ. – శబల.

**శబలిమ** సం. వి. న్. పుం. చిత్రవర్ణత్వము.

**శబ్దకోశము** సం. వి. అ. పుం. నిఘంటువు

**శబ్దగతము** సం. విశ. (అ ఆ. అ) శబ్దమును పొందినది, శబ్దమం దున్నది.

**శబ్దగుణము** సం. విశ. (అ ఆ. అ) శబ్దము గుణముగాఁ గలది. వి అ పుం. ఆకాశము, మిన్ను.

**శబ్దగ్రహము** సం వి. అ. పుం 1. శబ్దమును గ్రహించుట. 2. కర్ణము, చెవి.

**శబ్దగ్రామము** సం. వి. అ. పుం ధ్వని వినిపించునంత దూరము.

**శబ్దచిత్రము** సం. వి. అ. న. పదముల కూర్పునందు మాత్రము చాతుర్యము గల కావ్యము.
ఇది యధమ కావ్యముగా నెంచఁబడినది;
శబ్దముల కూర్పునందుఁ జేయు వైచిత్రి.

**శబ్దచోరుఁడు** సం. వి అ. పుం పదముల నపహరించెడి కవి ఇతరుల కావ్యములనుండి పద్యములు పదములు నపహరించు వాఁడు.

**శబ్దతన్మాత్రము** సం. వి. అ న. ధ్వని యొక్క సూక్ష్మ పరమాణువు. ఆకాశ కారణమయిన సూక్ష్మభూతము

**శబ్దనము** సం విశ. (అ ఆ అ.) 1. ధ్వనిచేయునది వి. అ న. 1. ధ్వనిచేయుట. 2 ధ్వని 3 బిగ్గరగాఁ పిలుచుట, ఆహ్వానము. 4. పేర్కొనుట, పేరు పెట్టి పిలుచుట.

**శబ్దనేత** సం. వి. ఋ. పుం. పాణిని.

**శబ్దపతి** సం వి ఇ. పుం. నామ మాత్రమున రాజు, పేరునకే రాజు.

**శబ్దపాతి** సం. విశ. (న్. నీ. న్.) శబ్దవేధి. ధ్వనిచేత లక్ష్యమును గొట్టునది.

శబ్దప్రమాణము సం. వి. అ. న. వాగ్రూపమయిన ప్రమాణము.

శబ్దబోధము సం. వి. అ. పుం. శబ్దముల వలనఁ గలిగిన జ్ఞానము.

శబ్దబ్రహ్మము సం. వి. న్. న. 1. వేదము, శ్రుతి 2. శబ్దములందుఁ దెలియనగు బ్రహ్మస్వరూపము. 3. స్ఫోటము, శబ్దశక్తి.
చం. వెలయఁగ శబ్దభేది యను విద్య జగంబున భోజరాజుచేఁ, గలదఁట. భోజరా. 2. 143.

శబ్దభేది సం. విశే. (న్. నీ. న్.) శబ్దవేధి, ధ్వనిచేత లక్ష్యమును గొట్టునది. వి. న్. పుం. 1. అర్జునుఁడు 2. బాణవిశేషము. 3. గుదము.

శబ్దము సం వి అ పుం. 1. శ్రవణేంద్రియ గోచరమగు విషయము. ధ్వని, ఆకాశగుణము.
(క) ప్రాణుల కంఠధ్వని. (చ) వాద్య ధ్వని.
2. పదము, అర్థబోధకము. 3. సుబంతపదము. 4. బిరుదము. 5. పేరు, నామమాత్రము, కీర్తి; 6. (న్యాయ.) చతుర్విధ ప్రమాణములలో నొకటి. 7. వ్యాకరణము.

శబ్దవిద్య సం. వి. ఆ. స్త్రీ. శబ్దశాస్త్రము. వ్యాకరణము.

శబ్దవృత్తి సం. వి. ఈ. స్త్రీ. అభిధ, లక్షణ, వ్యంజన అను త్రివిధమయిన శబ్దమందున్న శక్తి.

శబ్దవేధి సం. విశే. (న్ నీ. న్.) కంటికిఁ గనఁబడని లక్ష్యమును ధ్వనిని బట్టి కొట్టువాఁడు. వి న్. పుం. 1. బాణవిశేషము. 2. దశరథుఁడు. 3. అర్జునుఁడు

శబ్దశక్తి – శబ్దవృత్తి. సం. వి. ఇ. స్త్రీ అభిధ, లక్షణ, వ్యంజన అను మూఁడు విధములయిన శబ్దవృత్తి.

శబ్దశాసనము సం. వి. అ న. – శబ్దశాస్త్రము

శబ్దశాస్త్రము సం. వి. అ న వ్యాకరణము.

శబ్దసంగ్రహము సం వి. అ. పుం. నిఘంటువు

శబ్దస్మృతి సం. వి. ఇ. స్త్రీ. భాషాశాస్త్రము. (ఫైలాలజీ).

శబ్దాఖ్యేయము సం. విశే. (అ ఆ అ) మాటలలోఁ దెలుపఁదగినది. వి అ న. మాటలతో దెలుపుట.

శబ్దాధిష్ఠానము సం. వి. అ. న. శ్రవణము, చెవి.

శబ్దానుకృతి సం. వి ఇ. స్త్రీ. శబ్దానుకరణము. శబ్ద ధ్వనిచే అర్థమును స్ఫురింపఁజేయుట.

శబ్దానుశాసనము సం. వి. అ. న. శబ్దశాస్త్రము. వ్యాకరణము

శబ్దాలంకారము సం వి. అ. పుం (అలం) శబ్దముల వలనఁ జమత్కృతిని బుట్టించు నలంకారము. యమకము మొ (వ్యతి. అర్థాలంకారము)

శబ్దించు సం అ క్రి. మ్రోయు. ధ్వనించు. (శ.ర.) స. క్రి ధ్వనింపఁజేయు. మ్రోగించు.
శా. బంధుల్ మేలన వామహస్తమునఁ జాపం బెత్తి మౌర్వీలతా, సంధానం బొనరించి కొంచెపుఁ దెగన్ శబ్దించుచున్ధీరతా, సింధుండా హరి దాని ఖండితముగా జేసెన్. భాగ. 10 పూ. 1282.

శబ్దితము. సం. విశే. (అ ఆ అ) 1. ధ్వని గలదిగాఁ జేయఁబడినది, వాయింపఁబడినది. 2. ఉచ్చరింపఁ బడినది. 3. పిలువఁ బడినది. 4. పేరు పెట్టఁబడినది. 5. వివరింపఁ బడినది 6. ఉద్ఘోషింపఁబడినది. వి అ. న. ధ్వని, కేక.

శమథము. సం. వి. అ పుం. మనశ్శాంతి, కామాది వికారములు లేమి.

శమథుఁడు. సం. వి. అ. పుం ఆలోచన చెప్పువాఁడు. మంత్రి.

శమనము. సం. విశే. (అ. ఆ అ) 1 అణఁచునది. నశింపఁ జేయునది. వి. అ న 1. వశపరచుకొనుట, జయించుట. 2. మనశ్శాంతి. నెమ్మది. 3 సమాప్తి, అంతము 4 హింసించుట. 5. యజ్ఞమునఁ బశువులఁ జంపుట. 6 మ్రింగుట, నములుట. పుం ఒకజాతిజింక.

శమనస్వస సం వి ఋ స్త్రీ. యమునానది.

శమని సం వి. ఈ స్త్రీ. రాత్రి

శమనీయము. సం. వి. అ న. ఉపశాంతి కలిగించు చికిత్స.

శమనీ(ష)సదుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు. రాత్రించరుఁడు, పిశాచము.

శమనుఁడు. సం వి. అ. పుం. యముఁడు. మృత్యు దేవత.

**శమపరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మనశ్శాంతి గలవాఁడు, శాంతుఁడు.

**శమము.** సం.వి.అ.పుం.1. అంతరింద్రియ నిగ్రహము.
సీ. శమదమాదికుఁడైన సన్యాసిఁగనుఁగొన్న,మును పెన్నఁడును లేని కనరుదోఁచు. నిరంకుశో. 2 25
2. మనో నిగ్రహము, నెమ్మది, శాంతి. విశ్రాంతి. తెలిపి. 3. ఉపశాంతి, తగ్గుట. 4. సంధి, సఖ్యము. 5.ముక్తి,మోక్షము. 6. కరము,చేయి, ఉపచారము.

**శమలము** సం. వి. అ. న. 1. మలము. పురీషము 2. అపరిశుద్ధత. మురికి. 3. పాపము. 4 దుఃఖము, ఆపద.

**శమి** సం. విణ. (న్. నీ. న్.). 1. అంతరింద్రియ నిగ్రహము గలవాఁడు. మనశ్శాంతి గలవాఁడు శాంతుఁడు.
గీ. శముల కేటికి వృవనివేశములు... దశావతార చరిత్ర. 6. 50
2. ఇంద్రియ నిగ్రహము గలవాఁడు. వి. ఈ. స్త్రీ. 1. జమ్మిచెట్టు.
గీ. అప్పు డావర్జితాధ్వ ధారాభిఘార, పరిమళగ్లా జనవశమీ పల్లవాగ్ర,హుతవహ శాశన జిహ్వాసముత్థ మగుచు, హోమధూమంబు జాలమై నొయ్యఁ బోలసి. శృం.నై. 6. 103.
- కాయశలాటువు.

**శమి(యిం)ంచే** సం. అ. క్రి. శాంతించు.
తే. గీ. ఉరగకులము బోయఁ బొరిగొని శమి యించె సింహా. 11. 297.
మ. .... మహాభవ దాహంబు శమించు మీ పదజల ప్రాశంబునన్. ఉ. రా. 1. 144
సీ. హిమవారిచే శమియించునే తాపంబు వరు శరీర స్వేద వారిఁగాక.
స క్రి పోగొట్టు. శాంతినొందించు.
వ. తెలియక చేసిన పాపపుంజంబు గురువ రేణ్యుఁడు సమయింప నేర్చునాచార్యానుగ్రహంబు గల్గిన వెనుక తెలిసి చేసిన పాపంబు గురుండు శమింపలేఁడు. వెంకటా. 3. 17.

**శమిత** సం వి పుం. యజ్ఞమున పశువును జంపువాఁడు, కసాయివాఁడు.

**శమితము** సం. విణ. (అ. అ. ఐ.) 1. శమింప జేయఁబడినది. తగ్గింపఁబడినది.
మ. శమితారాతి బలుండు వాఁ(ఁ)కు బాంచాల ప్రభుం డిప్డు చుట్టము దానయ్యె .......... భార. ఆది. 8. 44.
2. మాన్పఁబడినది, కుదుర్పఁబడినది (రోగము). 3. సడలింపఁబడినది, శాంతము. 4. నెమ్మదించునది. 5. మితముగాఁ జేయఁబడినది. 6 చ(ం)పఁబడినది.

**శమీగర్భుఁడు** సం వి. అ. పుం. 1 అగ్నిహోత్రుఁడు, అగ్ని. 2. బ్రాహ్మణుఁడు.

**శమీధాన్యము** సం. వి. అ. న. కాయధాన్యము, కాయలలో నుండి పుట్టు ధాన్యము. పె(స)లు, మినుములు. మొ.)

**శమీ(మి)రము** సం. వి. అ. పుం. చిన్నజాతి జమ్మి చెట్టు.

**శమ్మి** వి. జమ్మి చెట్టు.
వ. దీనికిఁ బడమట నైర్ఋతిమూల చలుకు కట్టిన రావి మ్రాను. పడమట శమ్మి మ్రానును.పి. కా. శ. 1. 024.

**శమ్య** సం. వి అ. స్త్రీ 1. చేతికఱ్ఱ. 2. దుడ్డుకఱ్ఱ. 3. కాఁడిచీల. 4. (సంగీ.) హస్తతాళము. చేతిలో చేయి వేసి చఱచుట. 6. యజ్ఞపాత్రము.

**శయతుఁడు** సం. వి. అ. పుం. 1. నిద్రాళువు. 2. చంద్రుఁడు.

**శయథము** సం విణ. (అ ఆ అ) నిద్ర గలది. నిద్రాళువు కునికిపాట్లు పడునది. వి. అ. పుం 1. మృత్యుదేవత. 2. కొండచిలువ. 3. అడవిపంది. 4. చేప.

**శయనము** సం. వి. అ. న. 1. నిద్రించుట, నిద్ర. 2. పఱుపు, పడక. 3. రతి, మైథునము.

**శయనించే** సం. అ క్రి. పరుండు.
సీ. శయనింప నొల్లదు శయ్యపై నైనను వనజాక్షి నాయుసురంబుననె కాని. రాధికా 3.108.
వ, సహదేవుఁడు శుచియై వార్చి గర్భశయనంబున శయనించి యగ్నినూక్తంబు(ల)ం బఠించుచు. భార. సభా. 1. 257.
గీ. ప్రీతి మంచఁబుపై నుండి పీఁట నుండి, చెప్పు పావలుదొడి, తలచిం చుట్టి, నవ్వుచును మాట

లాడుచు నడిచి నడిచి, వంగి శయనించి నిలుచుండి వార్వఁజనదు. విజ్ఞా. 1.59.

గీ. దిగంబరత శయనింప నీరాడఁగాదు. మార్క. 3. 230.

**శయనీయ(క)ము** సం. వి అ. న. పఱుపు, సెజ్జ, శయ్య.

**శయనైకాదశి** సం. వి. ఈ. స్త్రీ. విష్ణువు విశ్రాంతి పొందుటకై పరుండెడి యేకాదశి, ఆషాఢ శుక్లైకాదశి.

**శయము** సం. విణ.(అ అ ఈ అ.) (సమాసాంతమున.) (ఇది కాలవాచక భిన్నమగు హలంతాదంత సప్తమి కంటెఁ బరముగానున్నప్పుడు సమాసమున సప్తమికి అలుక్కు వికల్పముగా వచ్చును. ఉదా: దృషదిశయము, గ్రామేశయము మొ.) పరుండువది.

**శయము** వి. అ. పుం. 1. పఱుపు,శయ్య 2.సెజ్జ.

కం. కాంతారవిహారమ్మున శ్రాంతుండై గోపికాంకశయుఁ డగువన్నన్. భాగ. 10 604

చం....శయమ్ముల కంకణావళుల్, వదిలెఁ దొలంకెఁబో నయనవారి శయమ్ములఁ గంకణావళుల్. చంద్రికా. 4.18.

2. నిద్ర. 3. చేయి.

శయపూజాంబుజముల్ కటిం దడఁబడన్. ఆము. 1.56

4.పాము,కొండచిలువ 5 తిట్టు, శాపము. 6 నేలనాఁచెడు వాఁడికొయ్య. 7. పందెము.

**శయానకము** సం. వి. అ. పుం. 1. ఊసరవెల్లి. 2. కొండచిలువ. అజగరము,

**శయానము** సం విణ (అ. ఆ.అ) నిద్రించునది, పవ్వళించునది.

శా ఆనిష్ఠానిధి గేహసీమ నడురే యాలించినన్ మ్రోయునెం,తే నాగేంద్రశయానుపుణ్యకథలున్. ఆము. 1.84

మాలిని. గరుడవిహితయానాఙ్మధరోర్వీశయానా. సింహా. భా. 1.ఆ. 2.183

**శయాలు(వు)పు** సం. విణ. (ఉ) నిద్రగలది, కునికిపాట్లుపడునది. వి. ఉ పుం. 1. కొండచిలువ. 2 కుక్క. 3. నక్క.

**శయించే-శయనించే** సం. అ. క్రి. పరుండు.

శా. ఎచ్చోనైనను నిల్చు నాఁకటికి నేమేనిం గొనున్ రాత్రియై,నచ్చో నెమ్మిశయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించు. భార. శాం. 2. 233.

మ. .... మహాశోభాఢ్య శయ్యోపరిం జతురప్రీతి శయించి కార్యకథనా సంసక్తుమై నున్నెడన్. హరి. పూ. 8. 146.

మ...విష్ణుండు నీటన్ శయిం,చిన నద్దేవునియాత్మఁ బుట్టి దివిష జ్యేష్ఠుండు....ఉ. రా. 8. 241.

**శయితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిద్రించునది. 2. విశ్రాంతి గొనునది. 3. పరుండునది. వి. అ. న. నిద్దుర.

**శయువు** సం. వి. ఉ. పుం. కొండచిలువ, అజగరము.

**శయ్య** సం వి. ఆ. స్త్రీ. 1. పఱుపు, పాన్పు.

సీ. బోధించునొకవేళఁ బూవిల్తుశాస్త్రంబు, జదివించునొకవేళ శయ్యలోలి. రాధికా. 1. 59.

సీ. శయ్యాతలంబున శయనించి చంద్రునిఁ బరికించి వీక్షించి భావములర. బిల్హ. 2. 50.

మ. నవ శబ్దార్థ రసానుబంధపద విన్యాసక్రియా భావ గౌ,రవపాకధ్వని రీతిశయ్యలఁ గవీంద్రశ్రేణి కావ్యాళిఁజె,ప్ప...విక్ర. 1. 15., భార. ఆది. 2. 46.

2. మంచము, శయనాధారము. 3. నిద్రించుట, నిద్ర. 4. (అలం.) పదములకూర్పు, గుంఫనము.

**శయ్యోత్సంగము** సం. వి అ. పుం. పాన్పుయొక్క పార్శ్వభాగము.

**శరండము** సం. వి అ. పుం. 1. పక్షి. 2. ఊసరవెల్లి. 3. భూషణవిశేషము

**శరండుఁడు** సం. వి. అ పుం 1. మోసగాఁడు. ధూర్తుఁడు. విషయాసక్తుఁడు.

**శరకాండము** సం. వి. అ పుం 1. రెల్లుకట్ట. రెల్లుకాఁడ. 2. బాణదండము, అంపకొయ్య.

**శరజన్ముఁడు** సం వి. న్. పుం. కుమారస్వామి.

**శరజము** సం వి. అ. న. అప్పుడు తీసినవెన్న, సద్యోఘృతము (వాచ.).

**శరజుఁడు** సం. వి. అ. పుం. - శరజన్ముఁడు, కుమార

స్వామి.

**శరటము** సం. వి. అ. ం.పు 1. ఊసరవెల్లి. 2. కుంకుమపువ్వు.

**శరణము** సం. వి. అ. న. 1 రక్షణము, బ్రోచుట.

చం. శరణంబునాకగుము దానవసూదన పాక శాసనా. భార. అర. 2 46.

2. ఆశ్రయము. రక్షకస్థానము. ప్రాపు. 3. గృహము, ఇల్లు 4. గుహ, జంతు నివాసము. 5. హింసించుట, వధ. చంపుట.

**శరణముచొచ్చు** క్రి. స. క్రి.(శరణము + చొచ్చు) శరణొందు, రక్షకుని గాఁగోరు.

కం. శరణాగత రక్షకుఁడవు, కరుణాకరుఁడవు త్రిలోక కళ్యాణుఁడ వీ,శ్వరుఁడవు గావున నిన్నే, శరణము చొచ్చితి ముకుంద సర్వార్తిహరా. హరి. ఉ. 8. 238.

**శరణాగతుఁడు** సం. విణ. (అ, ఆ. అ.). శరణు పొందినవాఁడు. రక్షణమును గోరి వచ్చినవాఁడు. (ఇట్లే శరణాపన్నుఁడు.)

**శరణార్థి** సం. విణ. (న్. నీ. న్.). శరణు కోరు వాఁడు, ప్రాపు గోరువాఁడు.

చం. ఈ, యవనిపులెల్ల నాతని దయం బరిముక్తులు వాని చేత నాహవజితులుం. దదీయ శరణార్థులు.... భార. సభా. 2. 24.

వి. నమస్కారము. (ఈ యర్థము ఆంధ్రగ్రంథముల యందే కానవచ్చుచున్నది).

సీ. ఇదె నమస్కారమో హిమభాను నల్లుఁడ శరణార్థి నీకు, మత్స్యధ్వజాంక. ఇందు. 3.87.

మ. ... మా, వెనువెంటన్ జనుదెంచు నమ్ముఁడు నశానివేళన్ బ్రయాణంబు రం,డనభక్తిన్ శరణార్థిఁ జేసి......... కాశ. 4.63.

ద్వి. చక్కవజనఁ జొచ్చి శరణార్థిఁ జేయ మరలి చూచుడు జంగమము నందఁదోఁచె. పండితా. దీక్షా. 66.

(ఇట్లే శరణైషి)

**శరణు** సం. విణ. రక్షకము. (ఇది వర్గము, వర్గు వంటిది.).

గీ, ఛాపఖట్వాంగధర నీవె శరణు మాకు, నన్యథా శరణంబు లేదభవ భీమ. భీమ. 4.113

వి. 1 నమస్కారము. వందనము.

సీ. జోహారు పార్వతీ సుందరీధవనీకు శరణు విశ్వాధార సార నీకు. సూత సంహిత ఆ. 2. పు. 112

గీ. విధిగృహాక్షయ విత్తశేవధికి శరణు చిరకృతేక్ష్వాకు పుణ్యరాశికిని బ్రణుతి ... అము. 6. 99.

2. శరణాగతి

చం....వి, వసమతిబ్రమ్రొగ్గినీకు శరణంచు భయంబున గూయిడం గృపా,రసికుఁడ వీవు చేయు దభిరక్షయు గంబుల నెల్లనిట్లయై, యెసఁగు భవత్సమాశ్రయ సమిద్ధజనాళ్నత నాకు వచ్చురా. హరి ఉ. 9. 154.

గీ. అతివ యీ రాజు మగధదేశాధినాథుఁ, డధిక బలశాలి శరణన నఖిలరిపు,లఁ, గరుణ రక్షించు బరుల దుర్గర్వమడఁచి నిక్కము పరంతపాఖ్య తెందిన యతండు. ఇందు. 1. 5. 119.

మ. శరణన్న న్విడనిన్ను నేను శఫరీ సామాన్య బుద్ధిన్ ... దశా. 1. 155

**శరణుఁడు** సం. వి. అ. పుం. శివభక్తుఁడు (ఈ పదము శైవ గ్రంథములందే కానవచ్చు చున్నది.)

ద్వి. లింగసర్వేంద్రియ లీనుండు ముగ్ధసంగయ్య వచ్చునే శరణుని ననుచు. బస. పు. 9. 74. వం,

ద్వి. పరదైవ నామ దుర్భాషణుతోడ సరిచేయ వచ్చునే శరణుని ననుచు. బస పు 6. 724 వం.

ద్వి. సవిశేషమతి లేమ శరణుఁ డొప్పించి, వని తయుఁ దానును వడిఁ జాఁగి మ్రొక్కి. పండితా. పురా. 176 పా.

**శరణువేఁడు** స. క్రి. శరణు + వేఁడు) = శరణు చొచ్చు.

చం. విని ముదమందుచున్ శరణు వేఁడెదఁగావు ము నన్ను నీశ్వరా. భార. అను. 3. 262.

గీ శరణు వేఁడెద రక్షింపు సౌఖ్య మొసఁగి. దశా. 3. 41.

**శరణుసొ(చొ)చ్చు** అ. క్రి., స. క్రి. (శరణు + చొచ్చు.). శరణాగతి నొందు, రక్షకుఁడు గాఁగోరు

సీ. ఇదె నీకు శరణు సొచ్చెద శాంతుఁడవుగమ్ము. రాఘవ. 4, 71.

సీ. శ్రీ రామచంద్రుండు చేపట్టఁడాయెనా శరణు చొచ్చిన విభీషణుని దొల్లి. దశా. 1. 183.

వ. శక యవన కాంభోజ పారదప్ల వాదిదేశం బుల రాజులు ప్రాణభయార్తులై తత్కులగురుం

డైన వసిష్ఠు శరణు చొచ్చిన. వి. పు 5. 289.

శరణొందు, శరణుచొచ్చు స. క్రి (శరణు + ఒందు.)

ఉ కాంచన శైలమైనఁ గణకం దవకల్పిన నర్థికోటికిన్, ఒంచియిడున్ రణోర్వి బురమర్దనుడైన నెదిర్చె నేని భంగించును శాస్త్రవుండయినఁ గేవలమున్ శరణొందెనేని రక్షించును కామమంత్రిమణికిన్ సరివత్తురె మంత్రు లెవ్వరున్ జాహ్నవి. 1. 83.

మ ... ఇచ్చోనేభయం బయ్యె వ,న్శరణొందం బని యేమి......దశా 1. 155.

శరణోన్ముఖుఁడు సం విణ. (అ ఈ. అ ). శరణమునకై యెదురు చూచువాఁడు

శరణ్యము. సం విణ. (అ ఆ అ.). రక్షించుటకు సమర్థమైనది. ఆశ్రయమైనది. 2. రక్షకము, రక్షించునది. 3. రక్షణమును గోరునది దీనదశలో నున్నది వి. అ.న ఆశ్రయము, రక్షకస్థానము, తలదాచుకొనెడి చోటు. 2 రక్షణము, ప్రాపు

2. అపాయము, హాని ఆ ని).

శరణ్యుఁడు. సం. వి. అ. పుం రక్షణసమర్థుఁడు, శివుఁడు.

కం.. భువనాధీశ్వర!, శంకర దివిజాసురవంద్య పాద దీనశరణ్యా!

శివరహస్య ఖండము-3. 166

కం. ... జనశరణ్యు లుత్తములు నిత్యసాంగత్యమునన్. భార. సభా. 1 112.

శరణ్యువు సం వి ఉ పుం. 1. రక్షకుఁడు 2 మేఘము. 3 గాలి. వాయువు

శరత్కామి సం వి. న. పుం కుక్క.

శరత్తు సం. వి. త్. స్త్రీ 1. ఒకానొక ఋతువు, ఆశ్వయుజ కార్తికమాసములతో నేర్పడుఋతువు

కం. కాలము శరత్సమాగమ, హేలా సౌభాగ్య మహిమ నేపు వహించెన్. పాండు. 4. 87.

2. సంవత్సరము

ఉ. పంచశరద్వయస్కుఁడవు. బాలుఁడ వించుకగాని లేవు. ఆం. భాగ. 7 152.

శరత్పద్మము సం. వి అ. పుం. న. తెల్లతామర, పుండరీకము

శరత్పర్వము సం వి. న్. న. వ్రతము నిమిత్తముగాఁ గల కోజాగరమను నుత్సవము.

శరదిజము సం. విణ (అ. ఆ. అ ). శరదృతువున బుట్టినది, శరదృతువు నందుండునది.

శరదుదాశయము సం వి అ పుం. శరత్కాలమునందలి జలాశయము.

శరధి సం. వి ఇ. పుం. 1. తూణీరము. అమ్ములపొది. 2. సముద్రము.

శరఫలము సం. వి. అ. న. బాణాగ్రమున వెనుకకు దిరిగి యుండు ములికి.

శరభంగుడు సం వి. అ. పుం. దండకారణ్యమున శ్రీరామున కాతిథ్య మొసఁగిన యొకానొక ముని.

శరభము సం వి. అ పుం. 1. ఏనుగుగున్న 2. మృగవిశేషము. సింహముకంటె బలవత్తరమై యెనిమిది పాదములుగల జంతువు.

సీ. శరభ సింహవ్యాఘ్ర సత్త్వ చయంబుల నేడిక లెల్లెట్ల యెక్కియాడి. భార. ద్రోణ 2. 210.

3. ఉష్ట్రము, ఒంటె. 4. మంత్ర విశేషము.

ఆ. వె. వీరభద్ర మెన్న వీరభద్రమె తెచ్చు. శరభమన్నదియె సంగ్రహించు., మనుజనాథకడవ మంత్రంబులా బ్రహ్మ,రాక్షసునకు నీళ్లు ద్రాగినట్లు నిరంకుశో. 4. 72.

శరభువు సం. వి. ఉ పుం. శరజన్ముఁడు. కార్తికేయుఁడు.

శరము సం. వి. అ. పుం. 1. బాణము. అమ్ము

మ. కిరముం,గని తానిట్లనె నూనసాయక శరాఘాతార్త చిత్తాబ్జమై. రాధికా. 2. 60.

2. తెల్లరెల్లు, రెల్లు. 3. మీఁగడ. 4. గాయము పుండు. 5. అయిదుసంఖ్య. న. 1. నీరు.

శరయంత్ర(క)ము సం. వి. అ. న. తాళపత్ర గ్రంథమందలి పత్రములను గూర్చు త్రాడు.

మ.....శివవిద్యా మంటపాగ్రంబుపై, శరయంత్రంబిడి యందుఁ బుస్తకముఁ బూజల్ సేయ న్యాయఁబగున్. శివధర్మ. 2. 17.

శరలకము సం. వి. అ. న. జలము. నీరు.

శరవణ(న)ము సం. వి అ. న రెల్లువనము, రెల్లు

రెల్లు బలిసిన యడవి.

సీ. శరవణోద్భవుం డన గుహుం డుద్భవిల్లఁడె భార. ఆది. 6. 49.

శా. స్వామీ! వీరు పరాశరర్షి తనయుల్ వ్యాసా గ్రజుల్ మున్ను మే.ధా మౌఢ్యంబున మూర్ఖులై శరవణాంతంబందు మత్స్యంబులన్, వేమారు వ్యధి యించి రజ్జువులనెంతేఁ గూర్చి క్రీడింపఁగా, నామౌ నీంద్రుఁడు చూచి నందనుల ప్రోద్యత్తూ(?)ర కృత్య బొగిన్. శివరహస్య. 5. 309.

**శరవన(ణ)భవుఁడు** నం. వి. అ పుం. కుమారస్వామి ఇట్లే. శరవణోద్భవుఁడు.

**శరవాణి** నం. వి. ఇ. పుం 1. బాణ శిరస్సు, బాణా గ్రము. 2. విలుకాఁడు. ధానుష్కుఁడు. 3. బాణ ములు చేయువాఁడు 4. పదాతి, కాలి బంటు,

**శరవ్యము** నం. వి. అ. న. 1. లక్ష్యము. గుఱి.

చం. కలదు నుమీ మనోజశర కంపిత ధైర్య శర వ్యులై తలం, పుల వచనంబులం గ్రియల... నిరం కుశో. 1. 40,

**శరసంధానము** నం. వి. అ. న. వింటికి బాణము కూర్చుట.

మ శరసంధాన బలక్షమాది వివిధైశ్వర్యంబులుం గల్గిదు, ర్భా(?) మండలత్వ బిల ప్రవేశ చలన ప్రవ్యక్తమ్ము తల్ మానినన్. చాటువు.

**శరాఘాతము** నం. వి. అ. పుం. 1. బాణపు దెబ్బ. 2. విలువిద్య.

**శరాటి(డి)(తి)** నం వి ఇ. పుం. ఒకజాతి పక్షి, ఆడెలు.

**శరాభ్యాసము** నం వి. అ పుం. బాణసంధానము నల వఱచు విద్య. విలువిద్య.

**శరారువు** నం. విశ. (ఉ). ఘాతుకము, హింసించునది.

కం. చోరులు శరారులును మఱి, జారులు, గ్రూరు లును నూరిజన నిందకులున్, దారాత్మజ వశ గతులు, న్నారకమున కరుగువారుననుఁ బోలిధరన్. ధర్మఖం. 1. 189.

వి. ఉ. పుం దుష్టమృగము. క్రూరజంతువు,

**శరారోపము** నం. వి అ పుం. విల్లు, ధనుస్సు.

**శరావతి** నం. వి. ఈ. స్త్రీ, 1. ఒకానొక పట్టణము (ఈ పట్టణమునకు రాముఁడు లవుని రాజుగాఁ జేసెను.). 2. నదివిశేషము, ఒకానొక నది

**శరావము** నం. వి అ. పుం. న. 1. మూఁకుడు 2. పళ్ళెము, కాంశ్యము, మట్టిపాత్ర. 3. రెండు కుడవముల పరిమాణము.

**శరాశ్రయము** నం. వి. అ. పుం. తూణీరము, అమ్ముల పొది.

**శరాసనము** నం. వి. అ. న. విల్లు.

కం. తరుణారుణా రుణాంబుజ, శరమిడు శరా సనమున సంధించిమరుం, డరవిందనయనడెందము, కరమరుదుగ నుచ్చిపోవఁగా నేసెనెపన్. విక్ర. 1. 125.

(ఇట్లే శరాస్యము మొ.).

**శరిమము** నం. వి. న్. పుం. ప్రసవము, బిడ్డను గనుట, కాన్పు.

**శరీరకర్త** నం వి. ఋ. పుం. జనకుఁడు, తండ్రి.

**శరీరకుఁడు** నం. వి. అ. పుం. జీవుఁడు (ఇట్లే శారీరకుఁడు.).

**శరీరజము** నం వి. అ. పుం. రోగము, జబ్బు. విశ. (అ ఆ అ.) దేహమున బుట్టినది.

**శరీరజుఁడు** నం. వి. అ. పుం. 1. మన్మథుఁడు, అంగ జాతుఁడు. 2. పుత్రుఁడు.

**శరీరదండము** నం. వి. అ. పుం. 1. దెబ్బలు మొ॥గు. శిక్ష, ఒడలునొవ్వఁ జేయు శిక్ష. 2. (తపస్సునందు) శరీ శోషణము. శరీరము సుష్కింపఁజేయుట.

**శరీరపతనము** నం. వి. అ. న. దేహము పడిపోవుట, చావు.

**శరీరపాకము** నం. వి. అ. పుం. దేహకార్శ్యము.

**శరీరపాతము** — శరీరపతనము. నం. వి. అ. పుం.

**శరీరబంధము** నం. వి. అ. పుం. 1. దేహస్వరూపము. 2. అవతరించుట, దేహముకాల్చుట.

**శరీరబద్ధుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) శరీరము దాల్చినవాఁడు, రూపొందినవాఁడు.

**శరీరభాక్కు** నం విశ. జ్. దేహము దాల్చినవాఁడు. రూపొందినవాఁడు, వి. జ్. పుం, జంతువు,

ప్రాణి.

శరీరము సం. వి. అ. న. మేను, దేహము, ఒడలు.
క౦. సారెకుఁ దెలియ శరీరము, సారంబావంత లేదు.......శివధర్మ. 5. 62.
2. దేహబలము. 3. మృతదేహము.

శరీరయాత్ర సం. వి. ఆ. స్త్రీ. జీవిక జీవసాధారము.

శరీరసంస్కారము సం. వి. అ. పుం. 1. దేహమలంకరించుట. 2. ప్రాయశ్చిత్తాదులచే శరీరము పవిత్రముచేయుట.

శరీరసంబంధము సం. వి. అ. పుం. వివాహమూలకమైన సంబంధము.

శరీరసాదము సం. వి. అ పుం. దేహము సన్నగిల్లుట.

శరీరస్థితి సం. వి. ఇ. స్త్రీ. 1. శరీరపోషణము. 2. తినుట, భోజనము జేయుట.

శరీరావరణము సం. వి అ.. న. చర్మము. విశే. (అ. ఆ. అ.) శరీరమును గప్పునది. దేహము నావరించునది.

శరీరి సం. విశే. (న్. ఈ. న్.) శరీరముగలవాఁడు, శరీరధారి. 2. జీవించుచున్నవాఁడు. వి. న్ పుం 1. ప్రాణి, జంతువు. 2. మనుష్యుఁడు 3. జీవుఁడు.

శరువు సం. వి. ఉ. పుం. 1. బాణము. 2. ఆయుధము. 3. వజ్రాయుధము. 4. క్రోధము. 5. ధనుర్విద్యాభ్యాసము, విలువిద్య నేర్చుట.

శరేష్టము సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

శర్కర సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కెర, కలకండ
సీ. క్షీరశర్కరలును ఘృతబహుభంగిక, వ్యంజనంబులు వివిధాన్నపాన, ములను. భార. పౌసల. 29.
2. సన్నఱాయి, గులకఱాయి.
ఉ. ఒక్కెడ శాతకంటము లొక్కెడఁగర్కశ శర్కరావ్రజం, బొక్కెడ వంధకారమయ మొక్కెడ. శివధర్మ. 4. 39.
3. కంకరమన్ను. 4. ఇసుక 5. ముక్క, ఖండము 6. కుండపెంకు. 7. ఘనీభవించిన యణు సముదాయము. ఉదా. జలశర్కర. 8. రోగభేదము, మూత్రకృచ్ఛ్రరోగము.

శర్కరకము సం. వి. అ. పుం. ఒక జాతి దబ్బ (వృ. వి.), తియ్యనిమ్మ.

శర్కరజ సం. వి. ఆ. స్త్రీ. కలకండము, పటిక బెల్లము.

శర్కరావంతము సం. విశే. (త్. ఈ. త్.) శర్కరిలము.

శర్కరాసప్తమి సం. వి ఆ. స్త్రీ. వైశాఖ శుక్ల సప్తమి.

శర్కరి సం. వి. ఈ. స్త్రీ. 1. నది. 2. వడికట్టు, కాసెకోక. 3. కలము, లేఖని.

శర్కరిలము సం. విశే. (అ. ఆ. అ) 1. గులకఱాలు గలది.
తే. గీ. దేవపూజావసరసముద్దీప్యమాన చారుమణిరంగవల్లికా శర్కరిలము. నిరంకుశో. 1. 62.
2. ఇసుకతో గూడినది (ప్రదేశము). ఇట్లే శర్కరికము.

శర్ధంజహము సం. విశే. (అ ఆ. అ.) అపారవాయువును గలిగించునది. వి. అ. పుం. అనుములు.

శర్ధనము సం వి అ. న. అపానవాయువు విడుచుట

శర్ధము సం వి అ. పుం అపానవాయువు విడుచుట. 2. గుంపు జనసముదాయము 3. బలము, శక్తి.

శరణ్యము సం. విశే. (అ. ఆ. అ.) రక్షణము నొసంగునది, ఆశ్రయ మొసంగునది.

శర్మదము సం. విశే. (అ. ఆ. అ.) సుఖము నిచ్చునది.

శర్మదుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

శర్మము సం. విశే. (న్) సుఖవంతము, సుఖము గలది. వి. న్. పుం బ్రాహ్మణుల నామమునకుఁ జివరఁ జేర్పఁబడు పదము. ఉదా. దేవశర్మ, విష్ణుశర్మ. న. 1. సంతోషము, సుఖము.
మ. భుజదండంబునవొక్క భామదొడిగెన్ భూభర్తకున్...... త్రిజగల్లోచన శర్మదావకలనాధీరంబుగేయూరమున్. శృం. నై. 6. 58.

శర్మరము సం. వి. అ. పుం. ఒక విధమైన వస్త్రము (బట్ట); మ్రాని పసుపు (వృ. వి ).

శర్మిష్ఠ సం. వి. ఆ. స్త్రీ. వృషపర్వుఁడను రాక్షసరాజు కూఁతురు. యయాతి భార్య.

**శర్వ** సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి. 2. అంగుళి, వ్రేలు.

**శర్వరము** సం. వి. అ. న. చీకటి.

చం. అరిగి మగండు స‌్పన కులాంగనయున్ శశి గ్రుంకినట్టి శ,ర్వరియును బోల్పఁ బట్టుచు...కాశీ మౌసల. 98.

**శర్వరి** సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి. 2. సంధ్యాకాలము. 3. పసుపు. 4. ఆడుది.

**శర్వరుఁడు** సం వి. అ. పుం మన్మథుఁడు.

**శర్వాణి** సం. వి ఈ. స్త్రీ. పార్వతీదేవి.

**శర్వుఁడు** సం. వి. అ. పుం. 1 శివుఁడు. 2. విష్ణువు.

**శలంగము** సం. వి. అ పుం. లవణ విశేషము.

**శలంగుఁడు** సం. వి. అ. పుం. రాజు, చక్రవర్తి.

**శలకము** సం. వి. అ. పుం. సాలెపురుఁగు, లూత.

**శలభము** సం. వి. అ. పుం. 1. మిడుత.

చం. ......చిచ్చులోపలం బడి వడిఁ దూలివచ్చు శలభంబు తెఱంగున ... సింహా. శా. 1 ఆ. 2. 140.

2. చిమ్మట, ఈలపురుగు.

**శలము** సం. వి. అ. పుం. 1. ఈఁటె 2. చీల. 3. ఉష్ట్రము, ఒంటె. న. ఏదుపందిముల్లు.

**శలలము** సం. వి. అ. న. ఏదుపందిముల్లు.

**శలలి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఏదుపందిముల్లు. 2. చిన్న యడవిపంది.

**శలాక** సం. వి. ఆ స్త్రీ. 1. చిన్నకట్టె. కొయ్యచీల. 2. కన్నులకుఁ గాటుక పెట్టుటకుపయోగించు చిన్న కడ్డి (అంజనశలాక).

సీ కమ్మని పసిఁడి టంకంబులఁ గరఁగిన లాలిత నూత్నశలాకవోలె విక్ర. 6. 44.

తే. గీ. ఆమణిశలాకయరుణమై యద్భుతంపు, రంగు గలిగినయది. కళా. 5. 24.

3. బాణము. 4. ఈఁటె. 5. (వైద్యుఁడు) గాయమును లోపల శోధించుట కుపయోగించు సాధనము శస్త్రవైద్యసాధనము. 6 గొడుగు కమ్మి. 7. (చేతి వ్రేళ్ళ యొక్కయు కాలివ్రేళ్ళ యొక్కయు మూలమునకాధారమైన) ఎముక. 8. అంకురము, మొలక. 9. కుంచె, చిత్తరువు వ్రాయు సాధనము. 10. పలుతోముకుంచె. పలుదోము పుడక. 11. ఏదుపందిముల్లు, ఏదుపంది. 12. పాచె. 13. తిన్నని గీతలు గీయుటప్పుడుప యోగించుకఱ్ఱ 14. శారిక, గోరువంక.

**శలాటము** సం. వి. అ. పుం. బండెఁడుబరువు

**శలాటు** సం. – శలాటువు. బహు 4. 15.

సీ. ఫలశలాటువితానబద్ధశాడనముల ఘనవిహంగ పాదఘట్టనముల,

గీ కోర్వఁజాలక కంపంబు నొందుచుండు పాద పంబు......శివధర్మ. 5. 125.

**శలాటువు** సం వి. ఉ. పుం. 1. పచ్చికాయ. 2. ఒక విధమగు దు వ. 3. బిల్వము. మారేడు చెట్టు. అపక్వఫలము.

**శలాలువు** సం. వి. ఉ. పుం. ఒకవిధమగు పరిమళ ద్రవ్యము.

**శలి** సం. వి. ఈ. స్త్రీ. చిన్నయేదుపంది,

**శలుఁడు** సం. వి. అ. పుం. 1. శృంగియను శివ పరిచారకుఁడు. 2. బ్రహ్మ. 3. ఒకరాజు.

**శల్క-(ల)ము** సం. వి. అ. న. 1. చేఁప పొలుసు. 2 చెట్టుపట్ట. 3. ముక్క, ఖండము.

**శల్కాలి** సం. వి. న్. పుం. – శల్కి.

**శల్కి** సం. వి. న్. పుం. చేఁప.

**శల్మలి** సం. వి ఈ. స్త్రీ బూరుగుచెట్టు.

**శల్యకంఠము** సం. వి. అ. పుం. ఏదుపంది.

**శల్యకము** సం. వి. అ. పుం. 1. ఈఁటె. 2. ముల్లు, పేడు. 3. ఏదుపంది.

**శల్యక్రియ** సం. వి. ఆ. స్త్రీ శల్యాహరణము.

**శల్యము** సం. వి. అ. పుం. న. 1. చిన్నయీఁటె 2. బాణము. 3. ముల్లు. 4. గసిక, చిన్న కొయ్యచీల. న. 1. పైనుండివచ్చి శరీరమున నిలువ యుండి మిగుల బాధ కలిగించు పదార్థము.

గీ. పాత్రమున నుండు శల్యంబులెత్తివైచి, శాస్త్రయుక్తిని గొని భేషజంబు సేయఁగఁ దగు నాశేష జీవకళవులఁ దీర్ప, జనదుకృతులవ మంగళజనులు వారు. రాధికా. 1. 6.

శా. చింతాశల్యము వాసెనే? భుజబలోత్సాహంబు

నీకెక్కడవే? భార. విరా. 11. 358. దుఃఖ కారణము. 3. ఎముక. 4. కష్టము, ఆపద. 5. పాపము. 6. విషము. 7. నింద. పుం. 1. ఏదు పంది. 2. ముండ్లచెట్టు. 3. బిల్వవృక్షము. 4. మదనవృక్షము. 5. ముండ్లుతీయుట, కంట కోద్ధారణము. 6. వెలుగు, కంచె, ఆవరణము. 7. ఒకజాతి చేప.

శల్యలోమము సం. వి. న్. న. ఏదుపందిముల్లు.

శల్యశాస్త్రము సం. వి. అ. న. — శల్యాహారణము.

శల్యాహరణము సం. వి. అ. న. ముండ్లు, ములుకులు మొదలగువానిని శైత్కిఁ దీయుట, శరీరమునుండి యన్యపదార్థమును దీసివేయుటకుఁ జేయు శస్త్ర చికిత్స

శల్యితము సం. విశే. (అ. ఆ. అ.) ఈఁటెతో బొడువఁ బడినది.

శల్యుఁడు సం. వి. అ. పుం. మద్రదేశాధిపతి, నకుల సహదేవుల మేనమామ.

శల్యోద్ధరణము సం. వి. అ. న. — శల్యాహారణము.

శల్యోద్ధారము సం వి. అ పుం. — శల్యాహారణము.

శల్లకము సం. వి. అ. పుం. ఒకజాతిచెట్టు (వృ. వి.), న. చెట్టు పట్ట.

శ(స)ల్లకి సం. వి. ఈ స్త్రీ. 1. ఏదుపంది. 2. ఒక జాతి చెట్టు. దీనియాకులు కొమ్మలు నేనుఁగులకు మిక్కిలిప్రియము

శల్లకీద్రవము సం. వి. అ పుం ధూపద్రవ్యవిశేషము, సిహ్లకము.

శల్లము సం వి. అ పుం. కప్ప. న. చెట్టు పట్ట.

శవకామ్యము సం వి అ. పుం. కుక్క.

శవము సం వి అ పుం. న. పీనుఁగు. మృత కళే బరము న. నీరు.

శవయానము సం. వి అ న పాడె, శవమును దీసి కొనుపోవు నొక విధమయిన వాహనము

శవరము సం — శబరము.

శవరుఁడు సం శబరుఁడు.

శవలము సం — శబలము

శవసానము సం. వి. అ. పుం. మార్గము, బాట, దారి. న. శ్మశానము.

శవసానుఁడు సం. వి. అ. పుం. బాటసారి, పథికుఁడు.

శవాశము సం. విశే. (అ. ఆ. అ.) శవములను దినునది.

శశధరము సం. వి. అ. పుం. ఆరతికర్పూరము ఇశ్లే శశలాంఛనము. శశాంకము మొ.

శశధరుఁడు సం. వి అ. పుం. చంద్రుఁడు.

శశపుతకము సం. వి. అ. న. వ్రేలిగోటితోఁ గీఱుట.

శశబి(వి)ందువు సం. వి. ఉ పుం 1. చంద్రుఁడు. 2. విష్ణువు.

శశభృతుఁడు(త్తు) సం. వి. త్. పుం. చంద్రుఁడు.

శశ(క)ము సం. వి. అ. పుం. కుందేలు.

శశము సం. వి. అ. పుం. 1 కుందేలు.

ఆ వె శరభసింహనాగ శార్దూల భల్లూక, హరిణ కిటి శశాదులైనవెల్ల. చిత్రభా. 8. 121.

2 చంద్రుని కలంకము 3 లోధ్రవృక్షము, లొద్దుగ చెట్టు. 4 బాలెంతబోళము.

శశలక్షణుఁడు సం. వి. అ. పుం. చద్రుంఁడు. ఇశ్లే శశలాంఛనుఁడు. మొ

శశవిషాణము సం. వి అ. న. కుందేటికొమ్ము ఇశ్లే శశ శృంగము,

గీ. గగన కుసుమంబు గొడ్రాలుకన్న బిడ్డ, శశ విషాణంబు దుర్బీజజాతుఘనత ప-చమ శుచిత్వ మల్లుని మంచితనము, గలదె నిన్నవఁ బనియేమి కలికి కృష్ణ. రాధికా. 4. 79.

అత్యంతాసంభవ వస్తువు (చూ. గగన కుసుమము)

శశస్థలి సం వి ఈ. స్త్రీ గంగాయమునా నదుల మధ్య దేశము.

శశాంకమూర్తి సం వి ఇ పుం చంద్రుఁడు

శశాంకమౌళి సం. వి. ఇ పుం చంద్రశేఖరుఁడు, శివుఁడు

శశాంకలేఖ సం వి ఆ. స్త్రీ. చంద్రరేఖ, నెలవంక

శశాంకుఁడు సం. వి అ పుం. చంద్రుఁడు.

ఉ అపురిఁ బాయకుండు మకరాంకశశాంక మనోజ్ఞ

మూర్తి. మను. 1. 51.

**శశాద(న)ము** సం. వి. అ. పుం. శ్యేనము, డేగ.

**శశి** సం. వి. న్. పుం. 1. చంద్రుఁడు. 2. కర్పూరము.

**శశికాంతము** సం. వి. అ. పుం. చంద్రకాంతమణి.

సీ. తతనితంబాభోగ ధవళాంశుకమ్ములో యంగ దట్టపుఁ గావిరంగువలన, శశికాంతమణిపీఠి జాజువాఱఁగ.......మను 2. 27.

న. కలువ.

**శశికోటి** సం. వి. ఇ. స్త్రీ నెలవంకకొన, చంద్రరేఖ యగ్రము.

**శశిజుఁడు** సం. వి. అ. పుం. బుధుఁడు. బుధగ్రహము.

**శశిని** సం. వి. ఈ. స్త్రీ చంద్రుని పదునాఱు కళలలో నొకటి.

**శశిపూలచందురులు** మి. వి. బ. భూషణ విశేషము.

సీ. రతనాల కుప్పె సారవు జడకుచ్చులు శశిపూల చందురుల్ నరిగెలు. చెన్న. 2 207.

**శశిప్రభము** సం. విశే. (అ. ఆ. అ.) చంద్రుని కాంతి వంటి కాంతిగలది.

వి. అ. న. 1. కుముదము, తెల్లకలువ. 2. ముత్తెము.

**శశిభూషణుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**శశిభృత్తు** సం. వి. త్. పుం. శివుఁడు

**శశివకాశి** సం. వి. ఇ. పుం. శివుఁడు.

**శశిరేఖ** సం. వి. అ. స్త్రీ. చంద్రకళ.

సీ. కరుణారసమువోంగి తొరఁగెడు చాడ్పున శశిరేఖ నమృతంబు జాలువాఱ. భార. విరా. 1. 512.

**శశిశేఖరుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**శశు(శు)డు** సం. వి. అ. పుం. కామశాస్త్రమందుఁ జెప్పఁబడిన పురుషజాతులు నాల్గింటిలో ఒక జాతి పురుషుఁడు.

**శశోర్ణము** సం. వి. అ. న. కుందేటి బొచ్చు.

**శశ్వత్** సం. అవ్య. (తెనుఁగున సమాసపూర్వపదము గానే యుండును. ఉదా. శశ్వచ్ఛాంతి).

చం. శశ్వదుదవాన మహావ్రతశీతపీడితాచల ముని సౌఖ్యహేతువిలస ద్ధృడశాగ్ని శిఖాచయంబులన్. భార. ఆది. 2. 2 ౯.

ఉ. ......... శశ్వదుల్లాసముఖానుభూతినచలస్థితి నొప్పునతండు దాతుఁడై. భార. స్వర్గ. 92.

1. శాశ్వతముగా, ఎప్పటికిని. 2. మాటిమాటికిని.

**శష్ప(స్ప)ము** సం. వి. అ. పుం. ప్రతిభాక్షయము, తెలివి నశించుట. న. లేతపచ్చిక, బాలతృణము.

**శష్కు(స్కు)లి** సం. వి. ఈ. స్త్రీ. 1. చక్కిలము, ఒక విధమైన భక్ష్యము.

ఉ. శుష్కవచశ్శిలాతతుల నూటిగఁజూచి మహాకవి ప్రశవ, శ్శష్కులికావిదారణము సల్పగ నేర్పిన జాణలార......నిరంకుశో. 1. 9.

గీ. ఇష్టమానసమయిన యా హేమఖగము, వలుని మానస మానంద జలధియందు, గర్ణశష్కులి కల కంబుఁ గొఁగిలించి, యీఁదజేయుచు మృదుభాష నిట్టులనియె. శృం. నై. 2. 7.

2. బియ్యపుజావ. 3. కర్ణరంధ్రము. 4. కర్ణరోగము. 5. ఒకజాతి చేప.

**శసనము** సం. వి. అ. న. 1. యజ్ఞమున జంతువును జంపుట. 2. హననము, చంపుట.

**శస్తకము** సం. వి. అ. న. అంగుళిత్రాణము, అత్తెము, వ్రేళ్ళకుఁ దొడిగికొనెడి యుడుము తోలు. మొ.

**శస్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. స్తోత్రము చేయబడినది, పొగడఁబడినది.

గీ. ఛందములఁజాసి శబ్దార్థ సరణివదరి, యచ్చుటచ్చుట నష్టశబ్దాదిదోష, శస్తమైన శివజ్ఞాన పుస్తకంబు, నిందుమతి వేడ్కఁదెలుపునతండు గురుఁడు. శివధర్మోత్తరము. 2. 8.

2. శుభముకలది, శుభమైనది. 3. మంచిది ఉత్తమమైనది. 4. పలుమాఱు చదువఁబడినది. 5. చంపఁబడినది. 6. అపాయము గల్గింపబడినది. వి. అ. న. 1. క్షేమము, సుఖము. 2. శ్రేష్ఠత. 3. శరీరము. 4. అంగుళిత్రాణము, అత్తెము(శస్త్రకము అని కూడఁగలదు).

**శస్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. స్తుతి, పొగడ్త. 2. మంత్రరూపమైన స్తోత్రము.

**శస్త్రకారుఁడు** సం. వి. అ. పుం. ఆయుధములు

చేయువాఁడు.

**శస్త్రకోశము** సం. వి. అ. పుం. కత్తి యొఱ.

**శస్త్రజీవి** సం. వి. న్. పుం. శస్త్రములచే జీవించు యోధుఁడు.

**శస్త్రధరుఁడు** సం. వి. అ. పుం. 1. యోధుడు. జోదు. 2. ఆయుధధారియైన మనుష్యుడు.

**శస్త్రన్యాసము** సం. వి. అ. పుం. ఆయుధములు క్రిందఁ బడవేయుట. ఇట్లే శస్త్రపరిత్యాగము.

**శస్త్రపాణి** సం. విశ. (ఇ) 1. ఆయుధములుచేతగల వాఁడు. ఆయుధము ధరించువాఁడు. 2. ఒక విధమగు ఆతతాయి, ధనాపహారి. వి ఇ. పుం. ఆయుధధారియైన యోధుఁడు.

**శస్త్రప్రహారము** సం. వి. అ. పుం. ఆయుధముచేఁ తగిలినదెబ్బ.

**శస్త్రమార్జుఁడు** సం. వి. అ. పుం. ఆయుధములు బాగుచేయు శిల్పి.

**శస్త్ర(ర)ము** సం. వి. అ. న. 1. ఆయుధము. 2. సాధనము, పనిముట్టు. 3. ఉక్కు. 4. స్తోత్రము, స్తోత్రరూప మంత్రము. 5. ఆవృత్తి చేయుట, కంఠపాఠము చేయుట.

**శస్త్రవిద్య** సం. వి. ఆ. స్త్రీ. ఆయుధవిద్య.

**శస్త్రవృత్తి** సం. వి. ఇ. పుం. – శస్త్రజీవి.

**శస్త్రశాస్త్రము** సం. వి. అ. న. ఆయుధవిద్య.

**శస్త్రసంపాతము** సం. వి. అ. పుం. పెక్కు ఆయుధము లాకస్మికముగాఁబడుట.

**శస్త్రసంహతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఆయుధ సమూహము. 2. ఆయుధశాల.

**శస్త్రహతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆయుధముతోఁ జంపఁబడిన వాఁడు. 2. పక్షిమృగాలచేఁ జంపఁబడినవాఁడు.

**శస్త్రహస్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ.). ఆయుధము చేతనున్న వాఁడు. వి. అ. పుం. ఆయుధము చేతఁ బూనిన మనుష్యుఁడు

**శస్త్రహతచతుర్దశి** సం. వి. ఈ. స్త్రీ. ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి.

**శస్త్రాజీవుఁడు** సం. వి. అ పుం. శస్త్రముచే జీవించు వాఁడు, ఆయుధ జీవియైన యోధుఁడు.

**శస్త్రాభ్యాసము** సం. వి. అ. పుం. శస్త్ర ప్రయోగము నేర్చుకొనుట. ఆయుధముల ప్రయోగము నేర్చుకొనుట.

**శస్త్రాయసము** సం. వి. అ. న. 1. ఉక్కు 2. ఇనుము.

**శస్త్రి** సం. విశ. (న్. నీ. న్.). ఆయుధములు ధరించిన వాఁడు. వి. ఈ. స్త్రీ. ఛురిక. చిన్న కత్తి.

**శస్త్రిక** సం. వి. ఆ. స్త్రీ. చిన్నకత్తి. ఛురిక.

సీ. శామిత్ర శస్త్రిఁ గుందని సామి విరహిహృల్లక్షణ దారయుతమార శస్త్రి నొదుగు. చంద్రికా. 4. 7.

**శస్త్రోద్యమము** సం. వి. అ. పుం. (కొట్టుటకు) ఆయుధ మెత్తుట.

**శస్త్రోపకరణము** సం. వి. అ. న. యుద్ధసాధనము ఆయుధ సామాగ్రి.

**శస్త్రోపజీవి** సం. వి. న్. పుం. – శస్త్రాజీవుఁడు.

**శస్యము** సం. విశ. (అ. ఆ. అ.). 1. శ్రేష్ఠమైనది. ఉత్తమమయినది. 2. శ్లాఘ్యమైనది, కొనియాడఁదగినది.

కం. యమనియమాద్యష్టాంగ, క్రమాభ్యసన నిర్మథిత వికారనుచేతః కమలా మోదమయాత్మా, సమతారాహిత్య శస్య సర్వసమస్యాఽధార. శాంతి. 2 448.

వి. అ. న. సుగుణము.

## శా

**శా** ఒక యక్షరము.

**శాంకరము** సం. విశ. (అ. ఈ. అ.). శంకరుని సంబంధమైనది. శివసంబంధి. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

**శాంకరి** సం. విశ. పుం. 1. గణపతి. 2. కుమారస్వామి. 3. అగ్ని. సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

**శాంఖము** సం. విశ. (అ. ఈ. అ.) 1. శంఖ సంబంధమైనది. 2. శంఖ వికారంమైనది, శంఖముతోఁ జేసినది. వి. అ. పుం. శంఖధ్వని.

**శాంఖికుఁడు** సం. వి. అ. పుం. 1. శంఖపు బనిచేయు జాతివాఁడు,

2. శంఖ మూఁడు వాఁడు.

**శాండిల్యము** సం. వి. అ. పుం. 1. మారేడు చెట్టు. 2. అగ్ని భేదము, ఒకానొక యగ్ని.

**శాండిల్యుఁడు** సం. వి. అ. పుం. గోత్రప్రవర్తకుఁడును, ధర్మశాస్త్రకర్తయు నైన యొక ముని.

**శాంత** సం. వి. ఆ. స్త్రీ. 1. దశరథుని కూతురు. 2 ఒక జాతి జమ్మి (వృ. వి.).

**శాంతనవుఁడు** సం. వి. అ. పుం. శంతను పుత్త్రుఁడు. భీష్ముఁడు

**శాంతము** సం. విణ. (అ. ఆ. అ.). 1. ఉపశమించినది తగ్గినది, ఆఁకలి మొ॥ తీఱినది. 2. కుదిరినది. అణఁగినది, అంత మొందినది ఆగిపోయినది. దీపము మొ॥ 4. ఆటంక పఱుపఁ బడినది, అడఁచఁబడినది. 5. మరణించినది, మృతి నొందినది. 6. అణఁపఁ బడినది, నిశ్చలముగాఁ జేయఁబడినది. 7. నెమ్మది గలది, కామాది వికారముల క్షోభలేనిది. 8. మచ్చిక చేయఁబడినది. 9. తృప్తి గలది. 11. మెల్లనిది, మందమైనది. 12. పవిత్రమైనది. 13. వినయము గలది. 13. (నాటక పరిభాషయందు (శాంతమ్ పాపమ్ మొ॥ స్థలమున అమంగళ పరిహారార్థ ముపయుక్తమగుతుంది). వి. అ. పుం. 1. శాంతి. నెమ్మది 2. నిర్వేదము (శమము స్థాయి భావముగా గల రసవిశేషము).

న. ఉపశమించుట, తగ్గుట.

**శాంతాత్ముఁడు** సం. విణ. న్. శాంతమైన మనస్సు కలవాఁడు. మొ.

**శాంతి** సం. వి. ఈ. స్త్రీ. 1. కామక్రోధాదుల నణఁగించుట. 2. విషయ సుఖములందు సంపూర్ణమైన విరక్తి. 3. ఉపద్రవములను దొలఁగించుట. 5. మనస్తృప్తి. 6. గోచారాదులచే సూచితమైన యైహికానిష్టములగు పాపములను బోఁగొట్టుకొనుటకుఁ జేయు జపహోమాదికర్మము. 7. ఆఁకలి శమింపఁ జేయుట. 8. దుర్గ. 9. ఉపశమనము, తగ్గుట. (ఉదా. రోగశాంతి). 10. సౌభాగ్యము. 11. సుఖము. 12. జ్ఞానేంద్రియ నిగ్రహము.

సీ. శాంతి బుద్ధీంద్రియ సన్నివారణదాంతి, కర్మేంద్రియముల యోగ్యప్రవృత్తి. భార. అను. 5. 181. (బుద్ధీంద్రియములు-జ్ఞానేంద్రియములు; త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు). 18. శాంతి పాఠము.

ఉ. ఇందుఁగూడి శాంతి పఠియింపుఁడు...భీమ. 2. 161.

**శాంతించే** సం. అ. క్రి. శమించు, తగ్గిపోవు.

గీ. తపమునకు విఘ్నకరియంచుఁ దలఁగఁ దఱుఁ, దొలయు వర్షావధూటి పయోధరముల, వేయి రకముల నింపెనస్వేదజమున, నపుడ శాంతించె నతని మహాతపంబు (శాంతించెన్ – వశించెననియు ధ్వని.) క. శకుం. 1. 39.

**శాంతికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. పాపము పోఁగొట్టునది; గోచారాదులచే సూచితమైన యాపదను బోఁగొట్టుకొనుటకుఁ జేయఁబడెడి కర్మము.

వ. దేవకునివచనప్రతికారార్థంబు శాంతిక పౌష్టిక క్రియలు నిర్వర్తింప.......భార. ఆది. 1. 87.

**శాంతిగృహము** సం. వి. అ. న. విశ్రాంతి కొఱకైన యిల్లు, తెలపిగాఁ గూర్చుండుట కేర్పడిన గృహము.

**శాంతిజలము** సం. వి. అ. న. గోచారాదులచే సూచితమైన యనర్థమును బోఁగొట్టుటకై చేయఁబడిన శాంతికర్మమునందు మంత్రములచేఁ బవిత్రితమై పాపములను (అనర్థములను) దొలగించు నీరు. ఇట్లే శాంత్యుదకము మొ.

**శాంతిహోమము** సం. వి. అ. పుం. అనర్థములు (ఆపదలు) తొలఁగుటకై చేయు హోమము.

**శాంబరి** సం. వి. ఈ. స్త్రీ. 1. మాయ, గారడి.

సీ. తత్ప్రవరదేహసమిద్ధ శిఖదీప్తి శాంబరీమహిమచే సంగ్రహించి. మను. 4. 8.

సీ. ... శాంబరీ చంగ భుజంగకృత్యవివేకపుంజ భూరుహవల్లి లంజతల్లి. నిరంకుశో. 2. 41.

ఉ....కిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయు శాంబరీ భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్.

2. గారడిచేయు స్త్రీ, మాయచేయు నాఁడుది.

**శాంబావకుఁడు** సం. వి. అ. పుం. శంఖముల వ్యాపా

ఱము చేయు పురుషుఁడు.

**శాంబ(బా)కము** సం. వి. అ. పుం. ఆలి చిప్ప; కప్పచిప్ప.

**శాంభవము** సం. విశ. (అ. ఈ. అ.) శంభుని (శివుని) సంబంధమైనది. వి. అ. పుం. 1. కర్పూరము. 2. గుగ్గిలము. (వాచ.) 3. ఒక జాతి విషము. న. దేవదారు వృక్షము.

**శాంభవి** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి. 2. నీలదూర్వ. వల్లగఱిక (వృ. వి.). 3. ముద్రాభేదము, శాంబరీ ముద్ర. ప్రాణముపోవుటకు ద్వారమైన బ్రహ్మరంధ్రము.

**శాంభవుఁడు** సం. వి. అ. పుం. 1. శివోపాసకుఁడు, శివభక్తుఁడు. 2. శివపుత్రుఁడు.

**శాకంభరి** సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గాదేవి. (రోము దేశమందలి ఒక పట్టణము.

**శాకచక్రిక** సం. వి. ఆ. స్త్రీ. చింతపండు.

**శాకటము** సం. విశ. (అ. ఈ. అ.) 1. శకటసంబంధి, బండి సంబంధమైనది. 2. బండిలోఁ బోవునది. వి. అ. పుం. 1. బండిలాగెడి యెద్దు. 2. శ్లేష్మాతక వృక్షము. న. 1. పొలము, క్షేత్రము

**శాకటాయనుఁడు** సం. వి. అ. పుం. యాస్క, పాణినులు ప్రామాణికునిగా గ్రహించిన యొకానొక శబ్దశాస్త్ర శబ్దవ్యుత్పత్తి శాస్త్రవేత్త (శబ్దవ్యుత్పత్తి శాస్త్రమును వ్యాకరణమును దెలిసిన యొక ఋషి).

**శాకటికుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) 1. శకటసంబంధి, బండికి సంబంధించినవాఁడు. 2. బండిలోఁ బోవువాఁడు.

**శాకటీనము** సం. వి. అ. పుం. బండిబరువు (బండెడు బరువు).

**శాకతరువు** సం. వి. ఉ. పుం. టేకుచెట్టు.

**శాకపణము** సం. వి. అ. పుం. 1. పిడికెఁడు పరిమాణము. 2. పిడికెఁడు కూరాకు.

**శాకపత్రము** సం. వి. అ. పుం. శిగ్రువు, మునగ (వృ. వి

**శాకము** సం. వి. అ. పుం. న. 1. కూర, ఆకుకూర, తోటకూర మొ.

ద్వి. ఒసవరి చిగురాకు టొగరు శాకముల, కసరాటరిలి సరాగవువాద మెసఁగఁ, గోయిల జనరాలు క్రోల్చివరిలి, వాయెత్తి యాకీరవాణి యేడ్పుటయు. పరమ. 3. పుట 1. 33.

2. కూరగా నుపయోగించు కాయ, దుంప, పండు మొ. పుం. 1. బలము, శక్తి. 2. టేకుచెట్టు. 3. శిరీషవృక్షము, 4. దిరిసెనచెట్టు.

సీ. శాకవృక్షమునీడఁ జలుపుక్రీడ. శృం. నై. 5. 45.

5. శకము, కాలభేదము (శాలివాహనుని కాలము.). 6. ఆఱవద్వీపము.

**శాకయోగ్యము** సం. వి. అ. పుం. కొత్తిమిరి, కుస్తుంబరి.

**శాకలము** సం. విశ. (అ. ఈ. అ.) శకలమునకు (ముక్కకు) సంబంధించినది. వి. అ. పుం. ఋగ్వేదములో నొక భాగము.

**శాకలశాఖ** సం. వి. ఆ. స్త్రీ. శాకలులు పరంపరగాఁ జదువు ఋగ్వేదభాగము.

**శాకలికము** సం. విశ. (అ. ఈ. అ.) శకల (ముక్క) సంబంధమైనది.

**శాకలులు** సం. వి. అ. పుం. బ. శకలముని ప్రోక్తమయిన కల్పాది గ్రంథములను వంశపారంపర్యముగఁ జదువువారు.

**శాకశాకటము** సం. వి. అ. న. కూరలదొడ్డి, కూరదినుసులు పైరుపెట్టుపొలము. ఇట్లే శాకశాకినము.

**శాకాంగము** సం. వి. అ. న. మిరియము.

**శాకామ్లభేదనము** సం. వి. అ. న. ఎఱ్ఱగోఁగు కూర (వృ. వి.) (చుక్రము. (వృ. వి.) వాచ.).

**శాకామ్లము** సం. వి. అ. న. మారేడుపండు.

**శాకాహారుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) కూరలు మాత్రము తినువాఁడు. వ్యతి. మాంసాహారుఁడు.

శా. శాకాహారులు కందమూలురు శిలోంఛవ్రతక్రముల్ తాపసీ. కాశీ. 3. 6.

శా. శాకాహారుఁడు నిర్జితేంద్రియుఁడు పాషాణాగ్రతల్పుండునై. పార. 7. 73,

**శాకినము** సం. వి. అ. న. పొలము, క్షేత్రము. చూ. శాకశాకినము.

**శాకిని** సం. వి. ఈ. స్త్రీ. 1. కూరలు పైరుపెట్టు పొలము.

సీ. శాకినీమూలకచ్ఛత్రశాకసారణీ ధాన్యాకమేఘనాదములతోడ. భీమ. 2. 56.

2. (యక్షిణి యని యెంచఁబడు) దుర్గాపరిచారిక. 3. దుర్గాదేవి.

**శాకుంతలము** సం. వి. అ. న. కాళిదాస విరచితమైన యభిజ్ఞాన శాకుంతల మనెడి నాటకము.

**శాకుంతలేయుఁడు** సం. వి. అ. పుం. శకుంతలా పుత్త్రుఁడు, భరతుఁడు. ఇట్లే శాకుంతలుఁడు.

**శాకుతుఁడు** సం. విశ. (అ ఈ. అ) 1. ఇతరులను బాధపెట్టెడివాఁడు, పరితాపకుఁడు.

**శాకునము** సం. విశ. (అ. ఈ. అ.) 1. పక్షుల సంబంధమైనది. 2. శకున సంబంధమైనది. 3. రాఁబోవు శుభాశుభములను సూచించునది.

**శాకునికము** సం. వి. అ. న. శకునముల ఫలములను దెలుపుట.

**శాకునికుఁడు** సం. వి. అ. పుం. 1. పక్షులను వేఁటాడువాఁడు, పిట్టలను బట్టుకొనెడివాఁడు 2. శకున శాస్త్రపండితుఁడు.

కం. అని నియమంబున హితశాకునిక స్సర్వశాస్త్ర వేద కోవిదయుతుఁడై. సింహాసన. ద్వా. 1. ఆ. 2. 105.

**శాకునేయము** సం. వి. అ పుం. చిన్న గుడ్లగూబ.

**శాకులికుఁడు** సం. వి. అ. పుం. చేపలఁ బట్టువాఁడు.

**శాక్కరము** సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

**శాక్తము** సం. విశ (అ. ఈ. అ.) 1. శక్తి (బలము) సంబంధమైనది.

2. శక్తి (దుర్గాదేవి) సంబంధమైనది.

**శాక్తికుఁడు** సం. వి. అ. పుం. 1. శక్తి (దుర్గ) పూజకుఁడు, శక్త్యుపాసకుఁడు. 2. ఈఁటెపట్టి పోరాడు యోధుఁడు.

**శాక్తీకుఁడు** సం. వి. అ. పుం. ఈఁటె పట్టి పోరాడు యోధుఁడు.

**శాక్తుఁడు** సం. వి. అ. పుం. శక్తి (దేవత)ని బూజించువాఁడు, దుర్గాదేవతోపాసకుఁడు.

**శాక్తేయుఁడు** సం. వి. అ. పుం. 1. శక్త్యుపాసకుఁడు, శాక్తుఁడు 2. పరాశరుఁడు, శక్తిపుత్రుఁడు. రూపాం. శాక్త్యుఁడు.

**శాక్యము** సం. వి. అ. పుం. బుద్ధునివంశము.

**శాక్యముని** సం. వి. ఇ. పుం. బుద్ధుఁడు.

**శాక్యసింహుఁడు** సం. వి. అ. పుం. బుద్ధుఁడు.

**శాక్యుఁడు** సం. వి. అ. పుం. బుద్ధుఁడు.

**శాక్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. శక్రునిభార్య, శచి. 2. దుర్గ.

**శాక్వరము** సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

**శాఖ** సం. వి. ఆ. స్త్రీ. 1. (చెట్టు) కొమ్మ. 2. బాహువు. 3. భాగము. 4. గ్రంథములో నొక భాగము. 5. తెగ, జాతి, సమానధర్మము ననుసరించు జనబృందము. 6. పరంపరగాఁ గొందఱచే ననుసరింపఁబడిన వేదభాగము (శాఖలశాఖ ఆశ్వలాయనశాఖ.).

కం. శాఖ దిగవిడచి శాంబర, శాఖవ్వర్తించెనేని సద్విజుఁడైవన్, శాఖారణ్యుఁడు వాఁడే,శాఖను బాహ్యుఁడనియం్రడు సమ్మనుటెల్లన్. విజ్ఞా కాం. 1. 7.

**శాఖలువాఱు** మి. అ. క్రి. (శాఖలు+పాఱు) కొమ్మలుసాగు, వ్యాపించు; విస్తరిల్లు.

చం....... సం,జనిత కుతూహలాంకురము శాఖలు వాఱఁగ వచ్చుచున్న య,మ్మునికులసార్వభౌముని ముముక్షువరేణ్యు మహానుభావునిన్. విప్ర. 3. 5.

**శాఖాచంక్రమణము** సం. వి. అ. న. ఒక కొమ్మనుండి మఱియొక కొమ్మపైకి దుముకుట; కావలసిన విషయమును వదలి యితర విషయములను గూర్చి సంభాషించుట.

**శాఖానగరము** సం. వి. అ. న. ఉపనగరము, పట్టణములోఁ జేరియున్న పేఁట.

సీ. ..............................వజ్రపురము.

గీ. ప్రాంతమునను శాఖా నగరములయందు విరివి చూపట్టమేళంబు విడిసి విడిసి ప్రభా. 4, 92,

ఇట్లే శాఖాపురమ్ము మొ॥

శాఖాపిత్తము సం. వి. అ. పుం. రోగవిశేషము, కాళ్ళుచేతులు, మున్నగుశరీరభాగము లు మండుట.

శాఖామృగము సం. వి. అ. పుం. 1. క్రోఁతి. 2. ఉడుత.

శాఖారండుఁడు సం వి. అ. పుం. స్వశాఖాద్రోహి. వంశపరంపరాగతమైన తన వేదశాఖను విడిచి యితర శాఖయందుఁ జెప్పబడిన కర్మముల నాచరించువాఁడు.

శాఖారథ్య సం. వి. ఆ. స్త్రీ. పెద్దబాటకు సంబంధించిన యొక చిన్నబాట, ఉపరథ్య

శాఖాలము సం. వి. అ. పుం. వానీరము, నీరుప్రబ్బలి (వృ వి).

శాఖాశిఫ సం వి ఆ. స్త్రీ 1. మఱ్ఱి మొదలగు చెట్ల యూడ. 2. ఊడలవంటి యవయవములు గల తిప్పతీఁగ మొ. తీఁగ.

శాఖి సం విశ.(న్. నీ. న్.) 1. శాఖలు గలది.
వి. న్. పుం. 1. వృక్షము, చెట్టు.
గీ. శాఖఁగదవయ్య యర్థార్థికల్పశాఖ. శృం నై. 1. 109.
2. వేదము. 3. వేదసంబంధమైన యొక శాఖ ననుసరించు ద్విజుఁడు. 4. మ్లేచ్ఛభేదము, ఒక జాతి మ్లేచ్ఛుఁడు.

శాఖుఁడు సం. వి. అ. పుం. 1. కుమారస్వామి యనుచరులలో నొకఁడు, 2. రాహువు,

శాఖోపశాఖలు సం వి. ఆ స్త్రీ. బ. కొమ్మలురెమ్మలు, అసంఖ్యాకములు, పెక్కులు.
వ లక్షోపలక్షలు కోటానకోట్లు తండోపతండంబులు పుంఖానుపుంఖంబులు శాఖోపశాఖలు నేలయీని నటుల. ప్రబంధ. 6. 88.

శాట(క)ము. సం. వి. అ. పుం. న. 1. బట్ట,వస్త్రము. 2. పావడము, పరికిణి.

శాటి సం, వి. ఈ. స్త్రీ =శాటము
చం. తళుకు దుకూలశాటిఁ గటిఁ దాల్చి పటీరమలంది......మను 5. 78.
గీ. చండ మార్తాండ కిరణంపుశాటి మీట.వాల్మీకి.2.

శాట్యాయనము సం. వి. అ. న, ఒక హోమకర్మమునఁ గలిగిన వైగుణ్యమును జక్కఁజేయుటకు విహితమైన హోమము, ప్రాయశ్చిత్తార్థ హోమము.

శాఠ్యము సం. వి. అ. న. 1. కపటము, మోసము, చెడ్డతనము. 2. ఛలోక్తి.

శాణము సం. విశ. (అ ఈ. అ,) జనపనార సంబంధమైనది, జనపనారతో నేసినది.
వి అ. పుం ఒరగల్లు, గీటురాయి. 2. అస్త్రాదులు పదును పెట్టు రాయి. 3. అంపము. 4. నాలుగు మాషముల పరిమాణము. న. 1. ముతుకబట్ట, 2. గోనెపట్ట.

శాణాజీవుఁడు సం, వి అ. పుం. ఆయుధములు పదును పెట్టు పనివలన జీవించువాఁడు.

శాణి సం. వి. ఇ పుం. ఒకానొక మొక్క (దీని నారతో ముదుక బట్టలు నేయుదురు).
ఈ. స్త్రీ. 1. ఒరగల్లు, గీటురాయి 2. అస్త్రములు పదును పెట్టెడి రాయి కత్తులు నూఱెడి రాయి. 3. అంపము. 4. నారబట్ట. 5. చిరిగిన బట్ట. 6. చిన్న తెర; చిన్న గుడారము. 7. అభినయ విశేషము.

శాణితము సం. విశ. (అ. ఆ. అ) 1. పదును పెట్టఁబడినది. 2. నూఱఁబడినది.

శాణీరము సం. వి. అ. న. శోణానదీ తీరము.

శాతకుం(కౌం)భము. సం వి. అ. న. 1. బంగారము.
ఉ. భ్రాజిత శాతకుంభ గృహపంక్తులఁ బుష్పితవల్లి వేల్లితోర్వీజవనావృతిన్. భార. ఆది. 8. 17
2. ఉమ్మెత్తచెట్టు 3. గన్నేరుచెట్టు.

శాతనము సం. వి. అ న. 1. పదను పెట్టుట. వాఁడి చేయుట. 2. భేదించుట, వశింపజేయుట 3. పడగొట్టుట, 4. క్షీణింపజేయుట. 5,గిల్లుట 6 వాడుట, మ్లానమగుట.

శాతపత్రకము సం. వి. అ. పుం. వెన్నెల, చంద్రాతపము.

శాతపత్రకి సం వి. ఈ. స్త్రీ, చంద్రిక, వెన్నెల,

శాతభీరువు సం. వి ఉ పుం మల్లికాభేదము, ఒక జాతిమల్లె (వృ వి)

శాతమన్యవము సం, విశ. (అ. ఆ. అ.) ఇంద్ర సంబంధమైనది.

వ. మఱియు నప్పట్టణంబు నెట్టనంబునం గనుపట్టు వజ్రవైడూర్య కురువింద మరకత పద్మరాగ శాతమన్యవ శిలాజాల ప్రవాళ పుష్యరాగ ముక్తా వితాన ప్రముఖచిరత్నరత్న ఖచిత.శివధర్మ. 3.75.

**శాతమానము.** సం, విశ. (అ. ఈ. అ.) నూటిచేఁ గొనఁబడినది. శతక్రీతము.

**శాతము** సం. విశ. (అ. ఆ. అ ) 1. పదను పెట్టఁబడినది. వాడియైనది,

కం. శాతాసి చాపధరుఁడవు, డాతని కొక యాప్త బంధుఁ డరుదెంచి బల, వ్రాతములపై కుఱిశి. జైమిని 6. 149.

2. సన్నగిల్లినది 3. దుర్బలమైనది. 4. అందమైనది, సుందరమైనది. 5. ఖండింపఁబడినది. వఱకఁబడినది, 6. సుఖము గలది వి. అ. పుం. 1. ఉమ్మెత్తచెట్టు. 2. సంతోషము, సుఖము.

**శాతోదరి** సం వి. ఈ. స్త్రీ. సన్నని నడుము గల స్త్రీ.

మ. నమపీన స్తని నస్తినాస్తివిచికిత్సా హేతు శాతోదరిన్. శృం.నై. 2. 21.

**శాత్రవము** సం. విశ. (అ. ఈ. అ.) 1. శత్రువునకు సంబంధించినది. 2. శత్రుత్వము గలది.

వి అ న, 1. శత్రుసంఘము. 2. శత్రుత్వము, పగ, విరోధము.

చం. బాంధవ శాత్రవాకలితభావభవా ! ...... భార. విరా. 1. 333.

కం మైత్రీసౌఖ్యముఁ బోలునె, శాత్రవమె మ్మెయిఁ దలంప శక్రశ్రీకిం, బాత్రిమవై యింపుగఁ దన్మిత్రుఁడవగు మిదియ మేలు మీ యిద్దఱకున్. భార. ఉద్యో. 1. 133,

**శాత్రవీయము** సం. విశ. (అ. ఈ. అ.) 1. శత్రువు సంబంధమైనది. 2. శత్రుత్వము గలది,

**శాత్రవుఁడు.** సం వి అ. పుం, శత్రువు, పగవాఁడు

చం. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవ భర్తకు వీఁడు......... భాగ. 2. 153.

**శాదము** సం వి. అ. పుం 1.లేఁతగడ్డి. 2. కర్దమము, బురద.

ఆ.వె. ఉద్ధరింపనైతి సద్ధర్మగతిఁజూపు, శాదమగ్నమైన సౌరభేయి. ధర్మఖం. 1-148.

గీ. అలరుఁదేనియ వానిచిమొలక గట్టి, శర్కరా బీజములు సుధాశాదభూమి, భావజుఁడు విత్తమొలచిన పైరువెఱపె, రదవిలాసంబు పూఁబోఁడి పెదవి వదవి. పాఁడు. 3. 191.

**శాద్వలము** సం. విశ. (అ. ఆ. అ.).1. పచ్చిక గలది. 2. లేఁతగడ్డితో నిండినది. 3. ఆకుపచ్చనిది.

వి. అ. పుం. న. 1. పచ్చికబయలు.

సీ. వనకుంజ మధ్యశాద్వలచరన్మృగపఙ్క్తి దావపావకభీతిఁ దల్లడిల్ల. మను. 3. 11.

**శానము** సం. వి. అ. పుం. 1. ఒరగల్లు, గీటురాయి. 2. సానఱాయి, అస్త్రములుపదునుపెట్టెడిఱాయి.

**శాపటి(తి)కము** సం. వి. అ. పుం నెమిలి.

**శాపనివృత్తి** సం. వి. ఇ. స్త్రీ. శాపము తొలఁగుట.

**శాపము** సం. వి. అ పుం. 1. శపించుట, ఆక్రోశము, తిట్టు. 2. ఒట్టు. శపథము. 3. నింద. దూఱు 4. బహిష్కారము, వెలివెట్టుట.

**శాపాస్త్రుఁడు** సం. వి. అ పుం. శాపము ఆయుధముగా గలవాఁడు,ముని,ఋషి. ఇట్లే శాపాయుధుఁడు మొ॥

**శాపించే** సం. స. క్రి. శపించు, తిట్టు, చెడు గగుగాక యని పలుకు.

కం. కోపంబున జలములు గొని, శాపం బీఁదలఁచి యున్న సమయంబున నా, భూపాలుని వారించెను, శాపింపకయుండ నతని వశిశాంతిమతిన్. బ్రహ్మో 1.14

ద్వి. ఇట నెయ్యివోయంగనీక యుండినను, గటకటా శాపించెఁ గాక యత్తవసి, కాదె విట్టక విఱ్ఱుగాఁ బసు లన్చునా. బస. పు. 9. 249 పం.

**శాపితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. శపింపఁబడినది, తిట్టఁబడినది, 2. ఒట్టుపెట్టఁబడినది. 3. శపథము చేయఁబడినది

**శాపోత్సర్గము** సం. వి. అ పుం. శాపమిచ్చుట.

**శాఫరికుడు** సం. వి అ పుం. చేఁపలఁ బట్టువాఁడు,

**శాబ(క)ము** సం వి. అ. పుం. పశుపక్ష్యాదులపిల్ల. ఉదా॥మృగశాబకము, పక్షిశాబకము, మొ॥

సీ చన్నుమానినయట్టి శాబకశ్రేణిపై.భాగ.10.527

**శాబరభేదా(ష)ఖ్యము** సం వి. అ న. తామ్రము

రాగి.

శాబ(వ)రము. సం. విశ. (అ. ఈ. అ.) 1. అడవి జాతులవారి సంబంధమైనది, శబర సంబంధమైనది, మోటైనది. 2. నీచమైనది. అల్పమైనది.

వి. అ. పుం. అపరాధము, తప్పు 2. పాపము, దుష్టత్వము. 3. లొద్దుగుచెట్టు. 4. శబరస్వామి రచించిన మీమాంసాభాష్యము.

శాబరి సం. వి. ఈ. స్త్రీ. అడవిజాతులవారు మాటాడెడి ప్రాకృతభాష, అపభ్రంశము.

శాబాసు వి. సెబాసున కపభ్రంశ రూపము, ప్రశంసార్థకము.

శా. ...మ, జ్ఞా రే శివము బాగురే స్ఫురితమున్ శాబాసు భాలించు—... చంద్ర. 1. 127.

శాబ్దబోధము సం. వి. అ. పుం. పదార్థస్మృతి ద్వారమున శబ్దజన్యమగు అన్వయజ్ఞానము.

శాబ్దము సం. విశ (అ ఈ అ.) 1. శబ్ద సంబంధమైనది. శబ్దము నుండి పుట్టినది. 2. ధ్వని సంబంధమైనది, ధ్వని ననుసరించి యుండునది, వాఙ్మాత్రమైనది, నోటితోఁ జెప్పినది. 4. ధ్వని గలది, మ్రోగునది.

శాబ్ది సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి, వాగ్దేవత.

శాబ్దికము సం. విశ. (అ. ఈ. అ) శబ్దసంబంధమైనది. వాగ్రూపమైనది. 2. ధ్వని సంబంధమైనది. 3. ధ్వని చేయునది.

శాబ్దికుఁడు సం. వి. అ. పుం. వైయాకరణుఁడు, శబ్దశాస్త్రవేత్త. ఇట్లే శాబ్దుఁడు.

శామనము సం. వి అ. న. 1. చంపుట. 2. మనశ్శాంతి, నెమ్మది. 3. సమాప్తి, ముగింపు.

శామని సం. వి. ఈ. స్త్రీ. దక్షిణదిక్కు.

శామిత్రము సం. వి. అ. న. 1. శమితయొక్క కర్మము. యజ్ఞమునఁ బశువును వధించుట. 2. యజ్ఞార్థము పశువును యూపస్తంభమునకుఁ గట్టుట. 3. యజ్ఞము. 4. యజ్ఞపాత్రము (అ.ని.)

శామిలి సం. వి. ఈ. స్త్రీ. స్రుక్కు, హోమము చేయుట కుపయోగించు గరిటెవంటి పాత్రము

శామీనము సం. వి. అ న. భస్మము, బూది, శామిలి.

శామీని సం. వి. ఈ. స్త్రీ. స్రుక్కు, యజ్ఞపాత్ర విశేషము.

శామీలము సం. వి. అ. న. భస్మము, బూది.

శామీలి సం. వి. ఈ. స్త్రీ. జపమాల, అక్షసూత్రము.

శాయము సం. వి. అ. పుం. పరుండుట, శయనించుట.

శాయి వి. (హిం. స్యా. హి.) సిరా, మషీరసము.

తే. రసికుడైనట్టి కాలంపు రత్తివాను, తనరు బ్రహ్మాండమను పెద్దదవతిలోన, శాయి నిండారఁ బోసిన చందమునను, గారుతిమిరంపు గుంపు సొంపారఁబర్వె. హంస. 1. 141,

సం. విశ. (న్. నీ. న్.) పరుండువాఁడు, శయనించువాఁడు,

మాలిని. ఉరగశయన శాయీ యోగ్యవిద్యానపాయీ, సిం.హో. భా. 1. అ. 2. 183.

చం...దు, స్వహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైనయ, య్యహిపతి. భార. ఆది 1.105

శాయిక సం. వి. ఆ. స్త్రీ. విశ్రాంతి; నిద్ర.

శారద సం. వి. ఆ. స్త్రీ. 1, ఒక జాతివీణ. 2. సరస్వతి.

కం...లో, కేశకుటుంబిని శారద, యాశశిబింబాస్యమౌళి నక్షత లిడియెన్. శృం. నై. 5. 18.

3. దుర్గ. 4. సుగంధి(వృ.వి.). 5. బ్రాహ్మి(వృ.వి.)

శారదము సం. విశ. అ. ఈ. అ. శరదృతుసంబంధి, శరత్కాలమందైనది.

ఉ. శారదరాత్రులు జ్వలలసత్తరతారకహార పంక్తులం, జారుతరంబులయ్యె. భార. అర. 4. 142,

2. ప్రతి సంవత్సరమున నుండునది. 3. క్రొత్తది, నవీనము. 4. చిన్నది, 5. లేఁతది. 6. వినయము గలది, లజ్జగలది. 7. పిఱికిది. ధైర్యములేనిది.

వి. అ. పుం. 1. సంవత్సరము. 2. శరత్కాలమునందుఁబుట్టుజబ్బు. 3. శరత్కాలపుటెండ. 4. ఒక దినుసు సీమచిక్కుడు. 5. వకుళవృక్షము, పొగడ చెట్టు. 6. ఱెల్లు. 7. పచ్చిపెసరు (వృ. వి.). న. ధాన్యము, వరి, 2. తెల్ల తామర.

శారది సం. వి. ఈ. స్త్రీ. కార్తిక శుక్ల పూర్ణిమ, ఏడాకుల యరఁటి (వృ. వి.); సప్తపర్ణము. 3. నీరు పిప్పలి (వృ. వి.).

శారదికము సం. వి. అ. పుం. 1. శరత్కాలమునఁ

బుట్టురోగము. 2. శరత్కాలపు ఎండ. న. ప్రతి సంవత్సరమునఁ బెట్టవలసిన శ్రాద్ధము, ఆబ్దికము.

**శారదీయము** సం. విణ. (అ. ఆ. అ.) శరత్కాలమం దుండునది, శరత్కాలభవము.

**శారము** సం. విణ. (అ. ఆ అ.) 1. పొడలు గలది. చిత్రవర్ణము గలది. 2. ఆకు పచ్చని రంగు గలది. వి అ. పుం 1. విచిత్రవర్ణము. 2. పసుపుపచ్చని రంగు. 3. గాలి, వాయువు. 4. సొగటాల పాళి లోని గడులలో నడపెడిసారె, జూదపుసారె. 5. ఉపద్రవము, హాని, కీడు.

**శారి** సం. వి.ఈ. స్త్రీ. 1. ఒకజాతి పక్షి, గోరువంక. రగడ......శారికేఁటుల ఝంకారంబులు. విల్హ. 2. 29.

2. దర్భగడ్డి (వ్య. వి.).

**శారిక** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకజాతి పక్షి, గోరువంక. తే. గీ. సారికా కీర పరభృత చంచరీక, కలిత కల కల నినదసంకలిత....విల్హ. 2. 43.

2. ఫిడేలు, సారంగి మొదలగు సంగీతసాధనములు వాయించెడి వింటివంటి యొక పనిముట్టు, కమాను. 5. జూదపుసారె, సొగటాల పాళిలో గడులలో నడపెడుకాయ.

**శారి** సం. వి. ఇ. పుం. 1. సారె. చదరంగపు బొమ్మ (లేక) కాయ. 2. గుండ్రని చిన్నబంతి. 3. ఒక జాతి పాచిక. స్త్రీ. 1. సారిక యనెడి పక్షి. 2. మోసము, వంచన. 3 ఏనుఁగుం మీఁద జార వేసెడి జాలు గుడ్డ.

**శారిపట్టము** సం. వి. అ. పుం. నెత్తపలక, సొగటాల పాళికై గడులుగీచి రంగువేసిన గుడ్డ.

**శారిఫల(క)ము** సం వి. అ. పుం. న. నెత్తపలక, జూదము, సొగటాలు, చదరంగము ఆడుట కుప యోగించు గడులు గీచినబల్ల.

**శారీరకము** సం. విణ. (అ. ఈ. అ.) 1. శరీర సంబంధమైనది. 2 శరీరము ధరించినది.

వి. అ. న. 1. శరీరము ధరించిన బ్రహ్మము (జీవాత్మ) 2. బ్రహ్మవిచారము, బ్రహ్మసూత్రము నకు శంకరాచార్యులు రచించిన భాష్యము.

**శారీరకసూత్రము** సం. వి. అ. న. వ్యాస విరచితమయిన వేదాంతసూత్రము, బ్రహ్మసూత్రము.

**శారీరకీయము** సం. విణ. (అ. ఆ. అ.) శరీరసంబంధి

**శారీరము** సం. విణ. (అ. ఈ. అ.) శరీరసంబంధి. 2. శరీరము ధరించినది. మూర్తీభవించినది.

వి. అ. పుం. కంఠస్వరము. 2. వృషభము. 3. ఓషధీ విశేషము, ఒకానొక వనమూలిక. 4. మలము, పురీషము.

**శారీరికము** సం. విణ. (అ. ఈ. అ.) శరీరసంబంధి.

**శారీరుఁడు** సం. వి. అ. పుం. జీవాత్మ, ప్రతి దేహము నందు నుండెడి జీవుఁడు.

**శారుకము** సం. విణ. (అ. ఈ. అ.) క్రూరము; కీడు గలిగించునది.

**శార్కర(రి)కము** సం. విణ. (అ. ఆ. అ.) గులక రాళ్లు గలది (నేల).

**శార్కరము** సం. విణ. (అ ఈ.. అ.) 1. పంచదారతోఁ జేసినది. 2 గులకఱాలుగలది.

వి. అ. పుం. 1. గులకఱాతినేల. 2. పాలనురుగు; మీఁగడ. 4. బెల్లపునీరు.

**శార్కరీయము** సం. విణ. (అ. ఆ. అ.) — శార్కరకము.

**శార్ఙ్గధన్వుఁడు** సం. వి. న్. పుం. విష్ణువు.

**శార్ఙ్గధరుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు.

**శార్ఙ్గపాణి** సం. వి. ఇ. పుం. విష్ణువు, శార్ఙ్గము చేతఁ గలవాఁడు.

**శార్ఙ్గము** సం. విణ. (అ. ఈ. అ.) 1. కొమ్ముతోఁ జేయఁబడినది. 2. విల్లు ధరించినది.

వి. అ. పుం. న. 1. విల్లు. 2 విష్ణుని విల్లు. న. అల్లము.

కం. అతఁడు సద్యోయావనుఁడైన తోడన యొక స్వభావుఁ డను సిద్ధునిచే, నూతనమొక మణియు నము, ద్యోతిత శార్ఙ్గము మెఱుఁగుఁదూపులుఁ బడసెన్. కళా. 5. 23.

శా...అందఱన్, జేష్టల్ దక్కఁగ శార్ఙ్గముక్తవిశిఖ శ్రేణి న్వైనం జేసినన్. చిత్రభా. 7. 123.

**శార్ఙ్గి** సం. వి. న్. పుం. 1. ధన్వి, విలుకాఁడు, 2. విష్ణువు. 3. శివుఁడు.

**శార్దూలము** సం. వి. అ. పుం. 1 పెద్దపులి. 2. చిఱుతపులి, ఒకజాతి చిఱుతపులి. 3. శరభమృగము.

విశే. అ పుం శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠము. ఉదా. రాజశార్దూలము

**శార్దూలవిక్రీడితము** సం. వి. అ. న. పులియాట. 2. (ఛంద) ఒకానొక వృత్తము, వృత్తభేదము.

**శార్వరము** సం. విశే (అ. ఈ. ఆ) 1. రాత్రి సంబంధమైనది. 2. మోసము చేయునది. 3. ఘాతుకము, చంపునది.

వి. అ. న. కటికచీకటి, గాంఢాంధకారము.

**శార్వరి** సం. వి. ఈ. స్త్రీ. 1 రాత్రి. వి. న్. పుం. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**శాల** సం వి ఆ స్త్రీ. 1. సాల, చావడి.

గీ. అచటి హోమశాలకరిగి మౌనంబున.......ద్వా. 1. ఆ. 283.

2. ఇల్లు, గృహము 3. వృక్షస్కంధశాఖ, పెద్దకొమ్మ. 4. వృక్షస్కంధశాఖ, చెట్టుబోదె. 5. గుఱ్ఱము, ఆవు మున్నగువానికై యేర్పఱిచిన చావడి. ఇది యీ యర్థమున షష్ఠీ సమాసాంతమున వికల్పముగా నపుంసకమగును. ఉదా॥గోశాల, గోశాలము, అశ్వశాల, అశ్వశాలము. మొ॥

**శాలము** సం. వి అ. పుం 1. సర్జతరువు; 2. చెట్టు.

ఉ ప్రతీప వసుధాధిపు శాలవిశాల దక్షిణోత్సంగమునందు మన్మథవశంబున నుండెఁ గరంబులీలతోన్. భార. ఆది. 4. 165.

3. ఆవరణము 4. ఒకవిధమైన చేప

**శాలవము** సం. వి. అ. పుం లోధ్రవృక్షము, లొద్దుగచెట్టు.

**శాలాకి** సం వి. న్. పుం 1. ఈఁటె యాయుధముగాఁగల యోధుఁడు. 2. శస్త్రవైద్యుఁడు 3 మంగలి.

**శాలాకుఁడు** సం. వి అ పుం. పాణిని మహర్షి; వ్యాకరణ శాస్త్రకర్త.

**శాలాజిరము** సం వి. అ పుం. న బోలుగా నుండు మట్టిపాత్రము.

**శాలాతురీయుఁడు** సం. వి. అ. పుం. పాణిని మహర్షి; శలాతురగ్రామమునఁ బుట్టినవాఁడు. ఇట్లే శాలోత్తరీయుఁడు.

**శాలామృగము** సం. వి అ. పుం. నక్క, సృగాలము.

**శాలారము** సం. వి. అ. న. 1. నిచ్చెన. 2. పక్షిపంజరము. 3. ఏనుఁగుపాదము.

**శాలావృకము** సం వి. అ. పుం. 1. కుక్క. 2. తోడేలు. 3. జింక. 4. పిల్లి. 5. నక్క. 6. క్రోఁతి.

**శాలి** సం విశే. (న్. నీ న్.) (తఱచు సమాసాంతమున) 1. సంపన్నమైనది; ప్రకాశించునది. మాలిని సకలభువన రక్షాశాలి శుంభద్విహారా! భార స్వర్గ. 96

ఉ. ఆ వసుధాధినాథుని మహాధృతిశాలి జయించు తెంపునన్, భావజుఁ డప్పు డున్మదనబాణముతియ్యని వింటఁగూర్చుచో...శృం నై. 1. 81.

2. గృహసంబంధమైనది; ఇంటియందలిది.

**శాలి** సం వి. ఇ పుం. 1. వరి పైరు; సస్యవిశేషము·

గీ. .... విమల శాల్యోదనంబుపై వెల్లిసూపు నాజ్యధారా ప్రవాహ సాహస్రములకు. శృం. నై. 6. 124.

2. పునుగు పిల్లి.

**శాలికము** సం. వి. అ. పుం. 1. పన్ను, సుంకము, 2. శిల్పులుండు గ్రామము

**శాలికుఁడు**సం వి అ పుం సాలె, తంతువాయుఁడు.

**శాలిగోపి** సం వి ఈ స్త్రీ వరిపొలము కాచు స్త్రీ.

**శాలిచూర్ణము** సం వి. అ. పుం న. వరిపిండి

**శాలిని** సం వి ఈ. స్త్రీ 1 గృహిణి, గృహ యజమానురాలు. 2. (ఛంద.) ఒకానొక వృత్తము.

**శాలిపిష్టము** సం. వి. అ న. స్ఫటికశిల. 2. వరిపిండి.

**శాలిభవనము** సం. వి. అ. న. వరిపొలము.

**శాలివాహనుఁడు** సం వి అ. పుం విక్రమార్కునిసంహరించి శకప్రవర్తకుఁడై రాజ్యమేలిన యొకానొక చక్రవర్తి. (క్రీస్తుశకము తర్వాత డెబ్బదియెనిమిది వత్సరములకు శాలివాహనశక మారంభమైనది.).

**శాలిహోత్రము** సం. వి. అ. పుం. గుఱ్ఱము.

న శాలిహోత్రుఁడను మునిచే రచింపఁబడిన అశ్వశాస్త్ర విశేషము

సీ. శాలిహోత్రం బెంత చదివిన వశ్వశిక్షా కుశలత్వ బు గలుగునెట్లు. శివయోగ. ఉ. 1. 18 పా.

**శాలిహోత్రి** సం. వి. న్. పుం గుఱ్ఱము

**శాలిహోత్రుఁడు** సం. వి. అ. పుం. అశ్వశాస్త్ర ప్రవర్తకుఁడైన యొక రాజు; వశు శాస్త్ర గ్రంథకర్త.

**శాలీనత** సం. వి ఆ. స్త్రీ. సిగ్గరితనము, సిగ్గు.

గీ. వీనిఁ గులశీలశాలి శాలీనశాన, తంబునావన చంద్రబింబంబు నెత్తి, శాలవీథిఁపు మేఁకోత్పల పలాశ, మాలికలఁబోలులలిత దృగ్జాలకముల. శృం. నై. 5. 44.

**శాలీనత్వము** సం. వి. అ. న. — శాలీనత.

**శాలీనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. సిగ్గుగలవాఁడు. సిగ్గరి; దిట్టతనము లేనివాఁడు. 2. పోలినవాఁడు, సమానుఁడు. వి. అ. పుం. గృహస్థు.

**శాలుఁడు** సం. వి. అ. పుం. శాలివాహనుఁడు.

**శాలు(లూ)కము** సం. వి. అ. న. 1. తామరకలువ మొదలగు వాని దుంప. 2. జాజికాయ. పుం. కప్ప

**శాలు(లూ)రము** సం. వి. అ. పుం. కప్ప.

**శాలువు** సం. వి. ఉ. పుం. 1. కప్ప. 2. పరిమళద్రవ్య విశేషము.

3. ఒకవిధమైన యొగరు పదార్థము. న. కలువ, తామర మొదలగువాని దుంప.

**శాలేయము** సం. వి. అ. న. 1. వరిమడి. 2. సదాప చెట్టు.

**శాల్మలము** సం. వి. అ. పుం 1. బూరుగుచెట్టు. 2. ఒకానొక ద్వీపము, సప్తద్వీపములలో నొకటి. 3. బూరుగుచెట్టు జిగురు.

**శాల్మలి** సం. వి న్. పుం. గరుత్మంతుఁడు. ఈ. స్త్రీ. 1. బూరుగుచెట్టు.

వ ......తాను రాజనందన మునిచివచ్చిన శాల్మలీ పాదపంబుఁ గనుంగొని షోడ. 7. 102.

2. నరకభేదము. 3. పాతాళమందలి యొక నది.

**శాల్మలికము** సం వి. అ. న. ములు మోదుగు (వృ వి).

**శాల్మలిని** సం. వి. ఈ. స్త్రీ. బూరుగుచెట్టు.

**శాల్మలివేష్ట(క)ము** సం. వి. అ. పుం. బూరుగుజిగురు.

**శాల్యోదనము** సం. వి. అ. పుం. న వరియన్నము.

**శావము** సం. విశే (అ. ఈ. అ.) 1. శవసంబంధమైనది; జ్ఞాతియొక్క మరణము వలనఁ గలిగినది. 2. కపిలవర్ణము గలది.

వి. అ. పుం. 1. పిల్లజంతువు. వత్సము. 2. కపిల వర్ణము, శాబము.

**శాశ్వతము** సం విశే. (అ ఈ అ.) ఎప్పటికి నుండునది, నశ్వరము కానిది.

కం. విశ్వామిత్రుఁడు తపమతి, శాశ్వతముగఁ జేయు బెటిఁగి యమరేశ్వరుఁడు ... ద్వా. 11. 117.

ఉ. ...... శాశ్వతమైన కాలమిది, సర్వము వేదబ మందురట్టి. భాగ. 10. 127

2. వి. అ. పుం. స్వర్గము.

**శాశ్వతి** సం. వి ఈ స్త్రీ. భూమి.

**శాశ్వతికము** సం. విశే. (అ. ఈ. అ.) ఎప్పటికి నుండునది, నశ్వరము కానిది, శాశ్వతము

గీ. జ్ఞాన విజ్ఞానదృష్టి శాశ్వతిక తత్త్వుఁ, డయ్యె నేనియు విడువరా దాశ్రమముల...భార. శాం. 6. 277.

**శాశ్వతుఁడు** సం. వి.అ. పుం. 1. శివుఁడు 2. వ్యాసుఁడు 3. సూర్యుఁడు.

**శాష్కులుఁడు** సం.వి.అపుం. మత్స్యములనుదినువాఁడు,

**శాసకుఁడు** సం. వి. అ పుం. 1. పాలించువాఁడు, ఏలిక. 2. దండించువాఁడు.

**శాసనము** సం. వి. అ. న. 1 శిక్షించుట, బోధించుట. 2. పరిపాలనము, ఏలుబడి.

సీ... నిజ శాసనోల్లంఘన జిఘృక్షు శామిలోల కురంగచయభిల్లి లంచతల్లి. నిరం. 2. 41

3. ఆజ్ఞ. 4. వ్రాతమూలమైన యాజ్ఞ. 5. విధి విహిత వాక్యము. 6 (భూమి మొ) దానము చేయునపుడు రాజు వ్రాసి యిచ్చిన పత్రము. 7. వ్రాతమూలమైన యొప్పుదల; ఒప్పుదల కాగి

తము. 8. ఇంద్రియ నిగ్రహము. 9. ప్రామాణిక గ్రంథము. (సమాసాంతమున స్మరశాసనుఁడు మున్నగుచోట్ల సంహరించువాఁడను వర్థమునిచ్చును).

**శాసనహరుఁడు** సం. వి. అ. పుం రాయబారి.

**శాసనహారి.** సం. విన్. పుం. శాసనహరుఁడు.

**శాసనీయము** సం. విశే. (అ. అ.) 1. పరిపాలింపఁదగినది.

2. శిక్షింపఁదగినది.

**శాసనమాడ** వి ఒక విధమగు నాణెము. ద.శా. 4. 797

**శాసించే** సం. స. క్రి. దండించు, శిక్షించు.

గీ. ఒహుః మ గర్వమునఁ గార్యభంగియును, న కార్యనిర్ణయము నెఱుఁగక నాగ్రవృత్తి, గాని తెరువున నడచుచున్నేని గురునినైన శాసింపఁగా దగునం ద్రుబుధులు.

మ.. ఎవ్వఁడేమునుఁగు గంగాంభః ప్రవాహంబునన్, జనుఁడాతండును బుండరీకనయనా శాసించుఁ బాపౌఘముల్, కాశీ 5. 45.

(తొలఁగించుకొని అని భావము) 2. ఆజ్ఞాపించు.

వ. అని బహు విధముల దుస్సహుని శాసించి ద్రుహిణుం డంతర్హితు-డయ్యె నంత. మార్క. 4. 67.

**శాసిత** సం వి. ఋ. పుం 1. ఏలిక, పరిపాలించువాఁడు. 2. దండించువాఁడు, శిక్షించువాఁడు.

**శాసితము** సం. విశే. (అ. అ. అ.) 1. పరిపాలింపఁబడినది. 2. శిక్షింపఁబడినది.

**శాస్త** సం వి. ఋ పుం. 1. బోధకుఁడు. ఉపాధ్యాయుఁడు 2. పాలకుఁడు ఏలిక, రాజు 3. తండ్రి. 4. బుద్ధుఁడు; జినుఁడు. సం. విశే. (ఋ త్రి. ఋ.) శాసించువాఁడు. (శాసితకు వైదికరూపము).

సీ. శాస్త యొక్కండు తచ్చాసనంబు ననయేఁ జరియి తు నొక్కండ గురుఁ డతండు. భార. అశ్వ. 2. 58.

శ్లో ముసీంద్రః శ్రీఘనః శాస్తా మునిః శాక్యముని స్తు యః. అమర. స్వర్గ. 14. శ్లో. లఘువో లఘువశ్చేతి ద్వేధాంతస్థాన్ వదంతి శాస్త్రారః. ఆం. ధ్రశబ్దచింతామణి. సంజ్ఞా. 22.

**శాస్తి** సం. వి. ఇ. స్త్రీ ఆజ్ఞ.

చం. వినుము......పహి యకుంఠిత శాస్తిగ నేలు మంతయున్. భార. శల్య 2. 131.

2. శిక్ష: ప్రతీకారము,

మ. ... గొనయం బెక్కిడి యమ్ముఁ గూర్చియుఁక నీకున్ శాస్తి గావింపకేఁ, జన నాబాణ మమోఘమంచు ... దశా 7. 302. 3. రాజదండము, 4. తప్పుసవరించుట: శిక్షించుట. 5. పాలనము, ఏలుబడి.

**శాస్త్రకృత్తు** సం. వి. త్. పుం. — శాస్త్రకారుఁడు.

**శాస్త్రగండుఁడు** సం. వి. అ. పుం. శాస్త్రములయం దల్పజ్ఞానముగలవాఁడు.

**శాస్త్రచక్షుస్సు** సం. వి. స్. న. వ్యాకరణము(ఇతర శాస్త్రము బోధపఱచుకొనుట కిదినేత్రమువంటిది).

**శాస్త్రజ్ఞుఁడు** సం. విశే. (అ. ఆ.అ.). 1. శాస్త్రములు తెలిసినవాఁడు. 2. కేవల శాస్త్రజ్ఞానము గలవాఁడు (అనుభవములేని శాస్త్రజ్ఞానము గలవాఁడు.)

**శాస్త్రతత్త్వము** సం. వి. అ. న. శాస్త్రముల యందు బోధింపఁబడిన సత్యము.

**శాస్త్రదృష్టి** సం. వి. ఇ. స్త్రీ.శాస్త్ర విహితములయిన యంశములఁ బరిశీలించుట, (వ్యతి.) లోకదృష్టి.

**శాస్త్రప్రసంగము** సం. వి.అ. పుం 1. శాస్త్రవిషయములపై వాదము. 2. వేదవిషయములపై వాదము.

**శాస్త్రము** సం. వి. అ. న, 1.ఆజ్ఞ. 2. వేదవిహిత వాక్యము. 3. వేదము, నియమవ గ్రంథము (వేదాంత శాస్త్రము. తర్కశాస్త్రము, అలంకార శాస్త్రము మొ.).

ద్వి. శివరహస్యాది ప్రసిద్ధశాస్త్రములు, శివుని చేఁ బడసిన చెలువ శిష్యులము. బసవపు. 3. 187.

చం. విమల మతిం బురాణములు వింటి ననేకము లర్థ ధర్మశాస్త్రముల తెఱం గెఱింగితి. భార. ఆది. 1. 10.

5. జ్ఞానము, తెలివి. 6. గ్రంథము.

**శాస్త్రవిదుఁడు** సం. వి. ద్.పుం. శాస్త్రము నెఱింగిన వాఁడు.

**శాస్త్రవిధానము** సం. వి. అ. న.వేదమునఁ జెప్పఁబడిన పద్ధతి, వేదము విధించిన పద్ధతి.

**శాస్త్రవిధి** సం. వి. ఇ. పుం. — శాస్త్రవిధానము,

**శాస్త్రవిప్రతిషేధము** నం. వి. అ. పుం. 1. శాస్త్ర వాక్యములకుఁ బరస్పర విరోధము 2. వేదవిధులకు విరుద్ధముగాఁ బ్రవర్తించుట.

**శాస్త్రవిరుద్ధము** నం. విశే. (అ. ఆ. అ.) శాస్త్రములకు వ్యతిరేకమైనది; అశాస్త్రీయమైనది.

**శాస్త్రవేది** నం. విశే. (న్. నీ. న్.) శాస్త్రము నెఱిఁగి న(ది) వాఁడు.

గీ. శాస్త్రవేదిచే నున్న విషయంబుకంటె. సింహా. శా. 1. ఆ. 3. 10.

**శాస్త్రశిల్పి**. నం. వి. న్. పుం. కాశ్మీరదేశము.

**శాస్త్రసిద్ధము** నం. విశే. (అ. ఆ అ.) శాస్త్రముచే స్థాపింపఁబడినది. శాస్త్రముచే స్థిరపఱుపఁబడినది.

**శాస్త్రాతిక్రమము** నం. వి. అ. పుం. శాస్త్రము నతిక్ర మించుట; శ్రుతిస్మృతులయందుఁ జెప్పినదాని నతి క్రమించుట.

**శాస్త్రి** నం. విశే. (న్. నీ. న్.)1. శాస్త్రము బాగుగా జదివినవాఁడు. వి. న్. పుం. గొప్ప పండితుఁడు. 2. శాస్త్రము బోధించు గురువు.

**శాస్త్రీయము** నం. విశే.(అ. ఆ. అ.) 1. వేద విహితమై నది. 2. శాస్త్రమునందుఁ జెప్పబడినది.

**శాస్త్రోక్తము** నం. విశే. (అ. ఆ. అ.) —శాస్త్రీయము

**శాస్యము** నం. విశే. (అ. ఆ. అ.) 1. బోధింపఁదగినది, ఉపదేశింపఁదగినది 2. పాలింపఁదగినది 3 శిక్షింపఁ దగినది.

**శాహి** హిం. వి. రాజు, ప్రభువు.

## శి

**శి** నం. వి. అ. పుం. 1. శుభము. సౌభాగ్యము. 2. శాంతి, నెమ్మది. 3. శివుఁడు,

**శింఘాణము** నం. వి అ. పుం. 1. నురుగు. ఫేనము. 2. కఫము, శ్లేష్మము. న. 1. నాసామలము, చీమి డి. 2. ఇనుప చిట్టెము. 3. కాచపాత్రము, గాజు గిన్నె.

**శింఘితము** నం. విశే. (అ. ఆ. అ.) మూర్కొనఁబడి నది, ఆఘ్రాణింపఁబడ్డది.

**శింజ** నం. వి. అ.స్త్రీ. 1. నగలచప్పుడు: భూషణధ్వని, శింజితము. 2. వింటినారి, శింజిని.

**శింజము** నం. వి. అ పుం. నగలచేప్పుడు. భూషణధ్వని, శింజితము.

**శింజానము** నం. విశే. (అ. ఆ. అ.) మ్రోగుచున్నది. ధ్వనించుచున్నది, శింజయను ధ్వనిగలది (శ. ర).

**శింజాయితము** నం. విశే. (అ. ఆ. అ.) ధ్వనించు చున్నది.

శింజాయిత మంజీర వ్యంజిత నీలాంశు భృంగమగు పదకంజం బంజక యిడగా. సిం:హా.

**శింజితము** నం. విశే. (అ. ఆ. అ.) ధ్వని చేయునది. మ్రోగునది. వి. అ. న. భూషణధ్వని. నగల చప్పుడు.

**శింజిని** 1. వింటినారి.

సీ కటుదంత సంఘర్ష కిటకిటస్వనముతో శింజినీ నినదంబు నెవుడు పఱుప. దశావ. 6.117

2. అందె, నూపురము.

**శిం(సిం)బ** నం. వి. అ. స్త్రీ. మినుము. పెసరు మున్నగు కాయధాన్యముల కాయ.

**శింబము** నం. వి. అ. పుం. తగిరసచెట్టు (వృ. వి.).

**శింబి** నం. వి· ఈ. స్త్రీ. 1. పెసరు, మినుము. మొద లగు కాయధాన్యముల కాయ. 2. ఒకానొక వనమూలిక (వృ. వి.).

**శింబిక**. నం. వి. అ. స్త్రీ. 1. పెసరు, మినుము మొ. కాయధాన్యముల కాయ 2, ఒకజాతి సీమచిక్కుడు (వృ. వి.).

**శింశుప** నం. వి. అ. స్త్రీ. వృక్షవిశేషము, ఒకానొక చెట్టు.

**శింశుమారము**. నం. వి. అ. పుం. 1. మొసలి. 2 నీరు కోఁతి;ఒకజ్యోతిర్మండలము (శింశుమారచక్రము)

**శికస్తు** విశే (హిం. శికస్త్,) శిథిలమైనది.

మ. కృశమై మేనులు డుస్సిపాఱెడు ఫిరంగీ గుండ్లచే డస్సి ఫౌఁజు శికస్తయ్యె...రంగా. 3. 127

**శికృవు** నం. విశే. సోమరి. అలఁసుడు.

**శిక్య** నం. వి.అ. స్త్రీ. 1. త్రాళ్ళతో నల్లిన చిక్కము. 2. కావడిమట్టు, ఉట్టి.

**శిక్యము** సం. వి. అ న. —శిక్య.

శా. స్వల్పాకారుల శిక్యభారులఁగు మారాభీరులన్ దీరలన్. భాగ. 10 476.

**శిక్షితము** సం. విశ. (అ. ఆ. అ.) కావడి యుట్టిలో నుంచఁబడినది.

**శిక్ష** సం. వి. ఆ. స్త్రీ. 1. దండనము.

గీ. వాకల దటంచు నెన్నెని వదరుచుండ, శిక్షఁ జేయకయుంట యుపేక్ష గాదె. వాల్మీ ... 328

2. అభ్యాసము. జ్ఞాన సంపాదనము. 3. ఒక పని చేయ సమర్థుఁడు గావలయు ననెడి కోరిక. 4. నేర్పుట, బోధనము.

వ నీవు నధర్మ ప్రవృత్తుండవై ధర్మశిక్ష సేయుచు గోఁవుల కావద యాపాదించుచున్న వాఁడవు. భార. సభా. 2. 44.

కం...చింశితకామప్రదాన శిక్షాక్షమమున్ శృ నై. 6. 93.

5. వేదాంగములలో నొకటి. వర్ణోచ్చారణ పద్ధతి తెలుపు గ్రంథము. 6. వినయము. 7. శాస్త్రము.

**శిక్షకుఁడు** సం. వి. అ. పుం. 1. ఉపాధ్యాయుఁడు, గురువు. 2. విద్వాంసుఁడు, పండితుఁడు.

ఆ. అశ్వశిక్షకుండనై మత్స్యభూవిభుఁ గొలుచువాఁడ...భార. విరాట. 1. 94.

3. అదుపులో నుంచువాఁడు, పాలించువాఁడు, శాసించువాఁడు.

**శిక్షణము** సం. వి. అ. న. 1. చదువుకొనుట, జ్ఞాన సంపాదనము. 2. చదువు చెప్పుట, బోధించుట.

**శిక్షాకరుఁడు** సం. వి. అ. పుం. 1. ఉపాధ్యాయుఁడు, బోధకుఁడు. 2. వ్యాసుఁడు

**శిక్షించు** సం. వ. క్రి. దండించు.

కం. ... బెగడించి నినున్ శిక్షించెద రని చెప్పిన... భాగ. 10. 421.

2. బోధించు; బోధచేయు.

కం. శిక్షించితి మన్యములగు, పక్షంబులు మాని నీతి పారగుఁ డయ్యెన్ 7. 161.

వ. తొల్లి సముద్రతీరంబుననుండి యొక్క వృద్ధ హంస ధర్మాధర్మంబులు సెప్పుచు ధర్మమార్గంబున వర్తిల్లుచుండుఁ డని పక్షులనెల్ల శిక్షించుచుఁ బ్రాణిహింస సేయక తపోవృత్తి నున్న....భార. సభా. 2. 44.

వ. ఇట్టి నిజధర్మంబు నీవు తప్పితేని నిన్ను నెవ్వరు శిక్షింతురు. మార్క. 5 158.

**శిక్షితము** సం. విశ. (అ. ఆ. అ.) నియమింపఁబడినది; నేర్పఁబడినది; అదుపులో నుంచబడినది.

ఉ శిక్షిత చిత్తులార! శుభసిద్ధులు వొందు...భార. స్వర్గ. 91.

**శిక్షితాక్షరుఁడు** సం వి అ. పుం. (నేర్పఁబడిన యక్షరములు గలవాఁడు) 1. గురువు, ఉపాధ్యాయుఁడు. 2. విద్యార్థి, శిష్యుఁడు.

**శిక్షితుఁడు** సం. విశ (అ ఆ. అ.) 1. చదువుకొనినవాఁడు, అభ్యసించినవాఁడు. 2. బోధింపఁబడినవాఁడు, నేర్పఁబడినవాఁడు. 3. మంచిపద్ధతులలోఁ బెట్టఁబడినవాఁడు. 4. నేర్పరి, ప్రవీణుఁడు. 5. అణకువ గలవాఁడు.

**శిఖ** సం. వి. ఆ. స్త్రీ. 1. శిరోమధ్యమున నున్న కేశగుచ్ఛము, జుట్టు. 2. సిగ, కొప్పు. 3. తురాయి. 4. కొండకొన, పర్వతశిఖరము. 5. ధార, వాడియైన యంచు. 6. బట్టకొంగు, వస్త్రాంచలము. 7. జ్వాల. మంట.

తే. గీ. పెక్కువదు లీఁదివెడలుట పేర్చుదావ,శిఖలు గడచుట దారుణాశీవిషముల,శారి దప్పుట...భార. ద్రోణ. 3. 176.

8. కిరణము. 9. నెమిలిజుట్టు. 10. కొమ్మ, ఊడ. 11. మన్మథతాపము. 12. చివరిభాగము, మొన.

సీ. కదియనాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి. శృం. నై. 5. 9.

**శిఖండకము** సం. వి. అ. పుం. 1. పిల్లజుట్టు, కూఁకటి.

వ. ... తరుణతరతరలసమీరకుమారతాండవిత
శిఖండకలతాతరుషండమండితోద్యాన
పరిసరంబులయందు...నార. 2. 89.

2. బాలురకుఁ గర్ణపార్శ్వముల నుండు కాకి తెక్కలవలెనుండు కేశగుచ్ఛము, కాకపక్షము. 3. సిగ 4. నెమిలిపింఛము.

**శిఖండము** సం. వి. అ. పుం 1. చూడ, జుట్టు.

గీ. శ్రీకరాంగదకౌస్తుభశిఖిశిఖండ, మంజుమంజీర

కర్ణికామణికిరీట కనకపటహాః చాకచక్యముల వాని, గృష్ణదేవునిఁ గని నవ్వికిర మనియె. రాధికా. 4. 30.

2. నెమిలిపింఛము, కొప్పు, సిగ.

**శిఖండి** నం. వి. న్. పుం. 1. ధృష్టద్యుమ్నుని యన్న, స్త్రీయై పుట్టి కొంతకాలమునకు పుంస్త్వము నొందినవాఁడు, ద్రుపదరాజు కొడుకు.

సీ. ఒక శిఖండికి చాల నొద్దికయై బ్రహ్మచర్య వ్రతునిఁ జంపఁ జనకయున్న. గీ. మెచ్చవచ్చును విచ్చు పెచ్చుగాఁగ కృష్ణ. 1. 48.

2. నెమలి. 3. కోడి. 4. బాణము. 5. నెమిలి పింఛము. 6. ఒకజాతిమల్లె. 7. విష్ణువు. 8. రెండు తలల పాము.

విశ.(న్. నీ న్. ) సిగ గలది, జుట్టుగలది 2 నియ మము లేనిది, ఏర్పాటుగా లేనిది (ఈ విశ. అర్థ ములు సంస్కృతమున లేవు )

కం. గీసిన వెదురుసలాకల నేసిన యిరుదల శిఖండి నిడుమంచమునందు. క్రీడా. 70. ఇరుదల శిఖండి– శిఖండి వలె రెండు వైపులందును ఒక విధముగా నుండి తలయంపికడ, కాళ్ళకడయను నియతి లేనిది (మంచము) అని భావము. 3. మాట నిలుకడ లేని వాఁడు. నీచుఁడు.

శా. రెండా నాల్కలు సంప్రదాయకునకున్ లెక్కింపఁగా నొక్కటే, గండామొండి శిఖండి బండ లకు లెక్కల్ లేని నాల్కల్ గదా. చాటు పద్య మణిమంజరి. 1. భా, కృష్ణ. 1 48

**శిఖండికము**. నం. వి అ పుం. కోడి, కుక్కుటము

**శిఖండిని** నం. వి. ఈ స్త్రీ 1. ఆఁడునెమిలి. 2. ఒక జాతి మల్లె.

**శిఖర** నం. వి. అ. స్త్రీ మూర్వ (వృ. వి.), చాఁగ.

**శిఖరము** నం వి. అ న. 1 పర్వత శిఖరము, కొండ కొన. 2. చెట్టుకొన, వృక్షాగ్రము. 3. కొన, అగ్రము 4. కత్తిమొన. 5 సిగ. 6. కక్ష, బాహుమూలము. 7. గగుర్పాటు, రోమాంచము. 8. అరేబియా దేశపు మల్లెమొగ్గ. 9. కెంపు, పద్మరాగము.

**శిఖరవాసిని** నం. వి. ఈ. స్త్రీ దుర్గాదేవి.

**శిఖరి** నం. విశ. (న్. నీ. న్.) శిఖరము గలది, వి. న్. పుం. 1. పర్వతము.

తే. గీ. వసుమతికి నాభిభూతమై వఱలునట్టి, భర్మ శిఖరికి నుత్తరభాగమందు. బిల్హ. 1 20

2. పర్వతదుర్గము. కొండమీదికోట. చెట్టు. 4. తీతువపిట్ట. 5. ఉత్తరేను (వృ. వి).

**శిఖరిణి** నం. వి. ఈ. స్త్రీ. 1. ఉత్తమస్త్రీ 2. పాగిచిన పెరుగు మెంతిపెరుగు. 3. రోమావళి. 4. ఒక జాతి ద్రాక్ష. 5. మూర్వ. చాఁగ (వృ వి ) 6 అరేబియా దేశపుమల్లి(వృ.వి). 7.(ఛంద.) ఒకానొకవృత్తము.

**శిఖాకందము** నం. వి. అ న. వెల్లుల్లి.

**శిఖాతరువు** నం. వి. ఉ. పుం. దీపస్తంభము.

**శిఖాధరము** నం. విశ. (అ.ఆ. అ.) శిఖను ధరించునది, సిగ గలది. వి. అ. పుం. 1. నెమిలి.

**శిఖామణి** నం వి. ఇ. పుం. చూడామణి, సిగపై ధరిం చెడి మణి, శిరోరత్నము.

చం...ధూర్తకశిఖామణి వైతని గౌరి యల్గ గానలము మృదూక్తి వేడు శివుఁ డాయత సౌఖ్యముమాకు నిచ్చుతన్. (శ్లేషుఁడు) చంద్రికా 1. 5.

**శిఖాలువు** నం. వి. ఉ. పుం. నెమిలిచెట్టు (వృ. వి.).

**శిఖావంతము**. నం. విశ. (త్. వతీ. త్.) 1. సిగగలది, జుట్టుగలది. 2. జ్వాలగలది. సెగగలది వి. త్. పుం. 1. దీపము 2. అగ్ని. 3. కేతువు, తొక్కెము.

**శిఖాలము**. నం విశ. (అ. ఆ అ,) సిగ గలది. జుట్టు గలది. వి అ. పుం. నెమిలి.

**శిఖావళము** నం. వి. అ. పుం. నెమిలి. మయూరము.

ఉ......చంద్రజూటుకుల పాలిక రాజఘరోజపాళి కం, గాళికఁబాదసేవక శిఖావళకాళికఁ బ్రస్తుతించె దన్. నిరంకుశో. 1.5.

**శిఖావృద్ధి** నం. వి. ఈ. స్త్రీ. దినదినము పెరిగెడి యన్యాయపు వడ్డీ.

**శిఖి** నం. విశ. (న్. నీ. న్.) 1. అగ్రము కలది. 2 శిఖ కలవాఁడు, తురాయి గలవాఁడు. 3. గర్వము గలవాఁడు.

వి. న్. పుం. 1. నెమిలి. 2 అగ్ని.

ఆ. వె. అనుభవింపఁదనికి యట మఱివిషయముల్, విడుతుననితలంచు వెడఁగుఁదలఁపు, లఖలశిఖిశిఖాళి

య- దింఛనాద్యముల్ గమియవైచి యార్పగడగు వట్లు. కు. సం. 6.
2. కోడిపుంజు. 4. బాణము. 5. చెట్టు. 6. దీపము. 7. ఎద్దు. 8. గుఱ్ఱము. 9. పర్వతము. 10. బ్రాహ్మణుఁడు. 11. యోగి, జటిలుఁడు. 12. కేతువు. 13. మూడుసంఖ్య. 14. చిత్రమూలము(వృ. వి.). 15. మెంతి (వృ. వి).

**శిఖికంఠము** సం. వి. అ. న. మైలుతుత్తము. ఇట్లే శిఖిగ్రీవము.

**శిఖిముఖి** సం వి. న్. పుం. చెకుముకిరాయి.

**శిఖివాహనుఁడు** సం. వి. అ. పుం నెమిలి వాహనముగాఁ గలవాఁడు, కుమారస్వామి.

**శిగ్రుజము** సం. వి. అ. న. మునగవిత్తు.

**శిగ్రువు** సం వి. ఉ పుం. మునగ (వృ. వి) కూర.

**శితద్రువు** సం. వి. ఉ. స్త్రీ — శతద్రువు.

**శితము** సం. విశే (అ. ఆ. అ.) 1. వాఁడియైనది. 2. బక్కయైనది

**శితశూకము** సం. వి. అ. పుం. యవధాన్యము.

**శితసారకము** సం. వి. అ. పుం. తుమ్మికి (వృ. వి).

**శితి** సం. విశే ఇ. 1. తెల్లనిది. 2. నల్లనిది.

**శితికంఠము** సం. వి. అ పుం. కూకురుగడ్డంగి.

**శితికంఠుఁడు** సం. వి. అ పుం. శివుఁడు, కాలకంఠుఁడు.

**శిథిలము** సం. విశే (అ. ఆ. అ.) సంధులు వదలినది, శ్లథము.
సీ. ... అకటదలరి నీయందకములు శిథిలంబులైనవి భార. అశ్వ 4. 237.

**శిథిలి** సం వి ఈ స్త్రీ. చేణొణుజె.

**శిపివిష్టుఁడు** సం. వి. అ పుం. 1. విష్ణువు. 2. శివుఁడు. 3. బట్టతలవాఁడు. 4. కుష్ఠరోగము గలవాఁడు.

**శిప్ర** సం వి. ఆ స్త్రీ. ఒక నది పేరు.

**శిఫ** సం, వి ఆ. స్త్రీ. 1. ఊడ, పడుగొమ్మ. 3. తామరదుంప. 4. మాంసి (వృ వి.). 5. జడ.

**శిఫారసు** వి (హిం. శిఫార్స్) వాక్సాహాయ్యము.
సీ. సొగసుగా దొరయొద్దఁ దగినట్టు కూర్పుఁడి అంకుటాగ్రడకు శిఫారసులు చేసి. తెంజ. శ. 59.

**శివి** సం. వి. ఇ. పుం. 1. హింసించెడి పశువు. 2. ఒక చక్రవర్తి.

**శివిక** సం. వి. అ. స్త్రీ. పల్లకి, యాప్యయానము.

**శివిరము** సం. వి. అ. న. దండు విడిసిన చోటు; వేలము
మ. అరదం బిమ్మెయి నెక్కి యుబ్బి శివిరంబా ప్రొద్ద నిశ్శేషతం, బొరయం జేయు కుతూహలంబు... భార. సౌప్తి 1. 162.

**శిర** సం. వి. అ. స్త్రీ. 1. నరము. 2. ఈనె.

**శిరము** సం. వి. స్. న. 1. తల.
గీ. అట్టి దెగనేసి జన్నపు టిట్టి శిరము, గరిమ చెడకుండ దివి బ్రవేలఁగట్టెఁ గాన. భీమ. 2. 120.

**శిరసంటు** మి. అ. క్రి. (శిరసు+అంటు) తలయంటు, త…కుఁ జమురు మర్దనచేయు.
సీ. చిట్టాముదమ్మున శిరసంటి నునుమేన నావమానియనించి నలుఁగు వెట్టి. ఇందు. 2. 15.

**శిరసావహించు** సం. న క్రి. (దీనికి సంస్కృతమునఁ బ్రయోగము లేదు. 1. తలతో ధరించు, నెత్తి మీఁదఁ బెట్టుకొను
సీ. అఖిల వేదాతీతుఁడైన శ్రీమన్మహాదేవుఁడు నిను శిరసావహింప వరాహ. 7. 26.
చం. అని మణి ముద్రికామణి ప్రియత్వ మెసంగ నొసంగ భక్తిఁ గైకొని శిరసావహించి కనుఁగోవలనుంచి. సమీర. 3. 42.
గీ. .... చంద్రుఁడుదయించె వప్పాల సంద్రమునను, వాని శిరసావహించె భవానివిభుఁడు. దశా. 2. 242.
2. (వినయముతో) అంగీకరించు, ఒప్పుకొను.
ఉదా. పెద్దల మాట శిరసా వహింపవలెను.

**శిరసు(స్సు)** సం. వి. స్. న. శిరము, తల.
కం. ... శిరసుండగ మోకాలను సేసలు వెట్టుట ...ఉ హరి.
కం. ... మరుత్సరిదా కల్పిత మనోజ్ఞ చరణ శిరస్సుందర మూర్తికి... భార. విరా. 1. 37.

**శిరస్కము** సం వి. అ న. 1 శిరస్త్రాణము, యుద్ధమునందు యోధులు శిరమునందు ధరించు ఇనుపకవచము. 2. కిరీటము.

**శిరస్తా** వి. (హిం. శిరస్తా) న్యాయస్థానాదులయందు లెక్కలు మొదలగువానికి జవాబుదారుడుగా నుండు ముఖ్యోద్యోగి.
సీ. తల్లదిప్పుచును శిరస్తా చెప్పు వెంటనే కేలు మొగిడ్చి వకీలు చెప్పు... వేణు. శ. 16.

**శిరస్త్రము** నం. వి. అ. న. శిరస్సును గాపాడునది, బొమిడికము. చూ. శిరస్కము.
శా. .... తూణీరంబులున్ సజ్యకో,దండంబున్ ధరియించి కంకట శిరస్త్రచ్ఛన్నుఁడై చారుదే,ష్ణుం డేతెంచె....చిత్రభారతము 7. 60
వ. ... అన్యోన్య బాణఘట్టనల శతాంగ తురంగ సూత కేతు బాణాసన తనుత్రాణ శిరస్త్రంబులు నుగ్గి పయిం దొరఁగిన. చిత్రభా. 8. 58.

**శిరస్త్రాణము** నం వి అ. న. శిరస్త్రము.
వ. ... తుత్తుమురైన తనుత్రాణశిరస్త్రాణంబులు... చిత్రభా. 8. 86.

**శిరోధర** నం. వి. ఆ. స్త్రీ. గ్రీవ, మెడ.

**శిరోధి** నం. వి ఇ. స్త్రీ. శిరోధర.

**శిరోమణి** నం. వి. ఇ. స్త్రీ 1. శిరస్సునందలి మణి, తలమానికము. 2. శ్రేష్ఠమైనది.
చం. ... శిరోమణు లందమందగా, మురువగు పంచభోగయుత భోగుల నీఁగను శ్రీ లొసంగుచున్. రాధికా. 2. 86.

**శిరోమర్మము** నం. వి. న్. పుం. పంది, సూకరము.

**శిరోమాలి** నం. వి. న్. పుం. కపాలమాల ధరించిన వాఁడు, శివుఁడు.

**శిరోరుహము** నం. వి. అ న శిరోజము, తలవెంట్రుక.

**శిరోవల్లి** నం వి. ఈ స్త్రీ. నెమిలిజుట్టు.

**శిరోవృత్తము** నం వి. అ న. తలపాగ, ఉష్ణీషము.

**శిరోవేష్టము** నం వి. అ. పుం. ఉష్ణీషము, తలపాగ.

**శిరోవ్యథ** నం. వి. ఆ. స్త్రీ. తలనొప్పి.
తే. గీ. సంధ్య యన్న శిరోవ్యథ సంభవించు. నిరంకుశో. 2. 25.

**శిరోస్థి** నం. వి. ఇ. న. కపాలము, పుర్రె.

**శిల** నం. వి. ఆ. స్త్రీ. 1. ఱాయి
సీ. ... కొమ్ములఁ గోరాడి చిమ్ముచో నెగసిన ఘనగండశిలలు మేఘములు దాఁక. భోజరా. 6. 315.
2. తిరుగలి. 3. ద్వారముక్రింది త్రొక్కుడుఁగమ్మి, కడప, బురద కమ్మి, 4. స్తంభాగ్రము. స్తంభము కొన. 5. నాడి, రక్తనాళము, 6 మణిశిల, 7. కర్పూరము.

**శిలము** నం. వి. అ పుం. న పొలములో సస్యము తీసికొనిపోయిన తర్వాత జీవనార్థము వెన్నులేరుకొను వృత్తి చూ. ఉంఛము.

**శిలాకుట్టకము** నం. వి అ పుం. ఱాతిపనివాని యులి.

**శిలాకుసుమము** నం. వి. అ. న. ఱాతి పువ్వు; ఒక విధమగు సంభారద్రవ్యము.

**శిలాక్షరము** నం వి అ న. 1. ఱాతిపై చెక్కిన యక్షరము 2. ఱాతిపై చెక్కిన యక్షరములవలె స్థిరమైన మాట. మొ॥
కం. చెలిమి శిలాక్షర మెప్పుడు, నలుక జలాక్షరము సుజనులగు వారలకున్, చెలిమి జలాక్షర మెప్పుడు, నలుక శిలాక్షరము కుజనులగువారలకున్. కేయూర. 3. 29.
ఉ. ఆడినమాటలెల్లను శిలాక్షరముల్ శివభక్తి నెమ్మదిన్ వీడఁడు...శివధ. 1. 69.

**శిలాజతువు** నం. వి. ఉ. న. 1. మట్టితైలము(ఆ.ని.). 2. తేగురుఱాయి, 3. పర్వతమునందుఁ బుట్టెడు నొక విధమగు నుపధాతువు (వాచ).

**శిలాజము** నం. విశే. (అ. ఆ. అ.) ఱాతిలోఁ బుట్టినది, గనిలోఁ బుట్టినది. న. 1. శిలాజిత్తు (గంధద్రవ్య భేద మని వాచస్పత్యము). 2.మట్టితైలము, 3. ఇనుము, 4. గనిలోఁబుట్టిన వస్తువు, ఖనిజ పదార్థము.

**శిలాజిత్తు** నం. వి. త్. స్త్రీ. శిలాజతువు.

**శిలాటకము** నం. వి. అ. పుం. 1. రంధ్రము, 2. వెలుగు, కంచె, ఆవరణ. 3. మేడమీఁది గది.

**శిలాత్మజము** నం. వి. అ. న. ఇనుము.

**శిలాత్మిక** నం వి. ఆ. స్త్రీ మూస, మూష.

**శిలాద్రుమువు** నం వి. ఉ పుం. శైలేయమను గంధద్రవ్యము.

**శిలాధాతువు** నం. వి. ఉ. పుం. 1. సుద్దఱాయి, తెల్లఱాయి. 2. తేగురుఱాయి.

**శిలాపట్ట(క)ము** సం. వి. అ. న. సన్నెకల్లు, నూఱెడుఱాయి.

**శిలాపాకి** సం. వి. ఈ. స్త్రీ. గురిగింజ.

**శిలాపుత్రకము** సం. వి. అ. పుం. నూఱుట కుప యోగించు ఱాతిగుండు, పొత్తరము, గుండ్రాయి.

**శిలాపుష్పము** సం. వి. అ. న. ఱాతిపువ్వు, గంధ ద్రవ్యవిశేషము; ఓషధివిశేషము.

**శిలాభవము** సం. వి. అ. న. ఱాతిపువ్వు.

**శిలాభేదము** సం వి. అ. పుం. ఱాయి పగులఁగొట్టెడి యులి.

**శిలారంభ** సం వి. ఆ. స్త్రీ. కాకదళి, అడవి యరటి (వృ. వి.).

**శిలారసము** సం. వి. అ. పుం. ఒక విధమగు ధూప ద్రవ్యము.

**శిలావల్క** సం. వి. ఆ. స్త్రీ ఱాయివలె గట్టిదగు పట్ట గల యొకజాతి వృక్షము.

**శిలావల్కలము** సం వి. అ. పుం న. — శిలావల్క.

**శిలావ్యాధి** సం. విశే. పుం. శిలాజంతువు, శైలేయము.

**శిలాసారము** సం. వి. అ. న. ఇనుము.

వ. ... అపహసిత శిలాసారోదారంబును గడకపట్టి కామండితంబును నైన గదాదండంబు...భార. శల్య. 2. 95.

**శిలాహ్వము** సం. వి. అ. న. 1. మణిశిల. 2. శిలా జిత్తు.

**శిలి** సం. విశే. పుం. భూర్జపత్రవృక్షము. స్త్రీ. 1. కడపత్రొక్కుఁడు గమ్మి.

2. ఒకజాతి వానపాము (ఎఱ్ఱ). 3. స్తంభాగ్రము. 4. అస్త్రము, ఆయుధము. 5. బాణము. 6. ఆఁడుకప్ప

**శిలింధ్రకము** సం. వి అ న. కుక్కగొడుగు.

**శిలింధ్రము** సం. వి అ. పుం 1. ఒకజాతి చేప. 2. వృక్షవిశేషము, నేలతాడి న 1. కుక్క పుట్టగొడుగు, పుట్టగొడుగు 2. అరటిపువ్వు. 3. తెల్ల తెగడ (వృ. వి.).

**శిలింధ్రి** సం వి. ఈ స్త్రీ. 1. మన్ను, బంకమన్ను. 2. చిన్న వానపాము: చిన్నయెఱ్ఱ. 3. ఆఁడుకప్ప.

**శిలీముఖము** సం. వి. అ. పుం. 1. తుమ్మెద. 2. బాణము.

ఉ. వసరవిన్ విరించినొకయేటున... రాజు హృద యాబ్జము గాడఁగనేసె నెంతయుం, గాసిల తేఁటి ఱెక్కగుఱి గట్టిన పుష్పశిలీముఖంబులన్. శృం.నై. 1. 84

గీ. అగ్నిశిఖలయ్యె వివరింప నగ్నిశిఖలు ఘనశిలీ ముఖములు శిలీముఖములయ్యె. రాధికా. 2. 117.

3. యుద్ధము.

**శిలీముఖుఁడు** సం. వి. అ. పుం అవివేకి, తెలివి తక్కువవాఁడు

**శిలేయము** సం. విశే. (అ. ఆ అ.) శిలామయము, ఱాలతో నిండినది.

వి. అ. న — శైలేయము.

**శిలోచ్చయము** సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

మ. మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మిభూత నానానదీ,నద కాంతారపురీ శిలోచ్చయుఁడనై. శృం. నై. 2. 20.

**శిలోత్థము** సం. వి. అ. న. శైలేయము, గంధద్రవ్య విశేషము. ఇట్లే శిలోద్భవము మొ॥

**శిల్పకారి** సం వి న్. పుం. — శిల్పకారుఁడు.

**శిల్పకారుఁడు** సం. వి. అ. పుం. చిత్తరువులు మొద లగు చేతిపనులు చేయువాఁడు, శిల్పి.

**శిల్పము** సం. వి. అ. న. 1. కళ. (చిత్రలేఖనము మొ. కళలఱువది నాలుగు) 2. మూర్తిమంది రాది నిర్మాణము. 3. మృద్దారు శిలాదులచే నిర్మింపఁబడిన మూర్తిమందిరాదికము.

చం ... ధాత్రికపూర్వముగా నొనర్చి చెచ్చెరఁ గొని రమ్ము నీదయిన శిల్పకళా కుశలత్వ మేర్పడన్. భార. సభా. 1. 5.

కం ఓ విశ్వకర్మ! కుశలమె! నీవెగదా జగతి సకల నిర్మాణంబుల్, గావించునట్టి శిల్పక,ళావేదివి మనవి వినుము లలిమీఱంగన్. శివరహస్య సంభవ. 3. 148.

2. పనిపాటు

ఆ. వివిధశిల్పములఁ బ్రవీణనై మఱియునువలయు పనులవెంట మెలగనేర్తు. భార. విరా. 1. 107.

3. సంస్కారము. విధివిహితమయిన క్రియ, నైపుణ్యము.

మ. అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్...ని.రా. 1.

చేయుము నీవాంధ్రభాష శిల్పము మెఱయన్. కేయూర. 1. 11.

మ. కలహంసోజ్జ్వలినాకపాణి శుహనాకెట్ల్య శిల్పంబువన్. పారవి.

4. నేర్పు. 5. హోమమునకై నేయిగ్రహించు వరికరము, స్రుక్కు. 6. ఆకారము, రూపము. 7. సృష్టి. 8 చుఱుకుఁదనము.

**శిల్పవిద్య** నం వి. ఆ స్త్రీ 1. యంత్రములు నడిపించెడి శాస్త్రము. 2 చేతిపని, శిల్పము.

**శిల్పశాస్త్రము** నం. వి. అ. న. చేతిపనులను గూర్చి గాని, యంత్రములు నడుపుటను గూర్చి గాని రచించిన గ్రంథము. 2. వాస్తువిషయకజ్ఞానమును గల్గించు శాస్త్రము (వాచ.).

**శిల్పి** నం. విశే. (న్. నీ న్.) శిల్పవిద్యా సంబంధమైనది యంత్రసంబంధమైనది. వి. న్. పుం. 1. శిల్పము నేర్చినవాఁడు. యంత్రవిద్య నేర్చినవాఁడు.

ఉ. ఆ నగమౌళిఁజూచి మది నద్భుతమంది సువర్ణ శిల్పికిన్, మానితభాసమాన బహుమాన శతంబు లొసంగి వీడ్కొనెన్. శివరహస్య. 3. 1·6.

వడ్రంగి, సాలె, మంగలి, చాకలి, ముచ్చిజాతుల లోనివాఁడు.

**శిల్పికము** నం. విశే. (అ. ఆ. అ.) యంత్రసంబంధమైనది, చేతిపనికి సంబంధించినది.

వి. అ. న. చేతిపని,యంత్రములు నడిపెడి పని.

**శివ** నం. వి. ఆ. స్త్రీ 1. పార్వతి. 2. సౌభాగ్యవతి యగు స్త్రీ. 3. ముక్తి, మోక్షము. 4. నక్క.

శా. ఆ దుర్యోధనుఁ డుద్భవిల్లుడును గ్రవ్యాదారవంబున్ శివానాదంబున్ ... భార. ఆది. 5. 106.

5. కరక (వృ. వి.). 6. జమ్మి (వృ. వి.). 7. ఉసిరిక (వృ. వి.). 8. నేల యుసిరిక(వృ.వి.). 9. దూర్వ, గఱిక (వృ. వి.). 10. పసుపు (వృ. వి.). 11. గోరోచనము.

**శివకము** నం. వి. అ. పుం. 1. పశువులను గట్టెడు రాడు. 2. పశువులు దేహమును రాచికొనెడి గుంజె, రాపిడిగుంజె.

**శివ(ం)కరము** నం. విశే. (అ. ఈ అ.) శుభప్రదమైనది, శుభమునిచ్చునది.

కం. శివకరము దపము మేధాధవ సకల జనంబు లకును......భార. శాంతి. 5. 69.

**శివతాతి** నం. విశే. (ఇ) శుభాంతమైనది. 1. శుభంకరమైనది. వి. ఇ. పుం. శుభము, మంగళము.

**శివదూతి** నం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గాదేవి. 2. ఒకానొక యోగిని.

**శివద్రుమము** నం. వి. అ. పుం. మారేడుచెట్టు.

**శివద్విష్ట** నం. వి. ఆ. స్త్రీ. కేతకి (వృ. వి.). మొగలి (వృ. వి.).

**శివధాతువు** నం. వి. ఉ. పుం. 1. పాదరసము. 2. పాలఱాయి.

**శివనాభము** నం. వి. అ. పుం. ఒకవిధమగు పాలగ్రామము.

**శివపదము** నం. వి. అ. న. కైలాసము.

కం.శివశాస్త్రం బెవ్వఁడు విను, శివశాస్త్రం బెవఁడు నొడువు శివపదమున వాఁడు వసించు...శివధర్మ. 1. 200.

**శివపాడు** మి. వి. శ్మశానము.

ద్వి. ...నల్గడల చీకట్లు గ్రమ్ముచును, ఆ మహీపతి యేలునట్టి పట్టణము, సీమయు నవ్వేళ శివపాడువైవ ద్వి. పరమ. 2. 1 5.

(శివపాడువైచు = చెఱచు అని భావము.).

**శివపురము** నం. వి. అ. న. కాశీపురము.

**శివపురాణము** నం. వి. అ. న. పదునెనిమిది మహాపురాణములలో నొకటి.

**శివపురి** నం. వి ఈ. స్త్రీ. కాశీపురము.

**శివప్రియ** నం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి.

**శివప్రియము** నం. వి. అ. పుం. 1. స్ఫటికము. 2. అగిసెచెట్టు. 3. ఉమ్మెత్త.

న. రుద్రాక్షము.

**శివబీజము** నం. వి. అ. న. పాదరసము.

**శివమల్లకము** నం. వి. అ పుం. అర్జునము, తెల్లమద్ది.

**శివము** నం. విశ. (అ. ఆ. అ.) 1. శుభకరము, శుభము నిచ్చునది. 2 సుఖకరము, సౌఖ్యము నిచ్చునది.

కం..... శివనామంబే, శివమొసఁగు మంత్రరాజము. శివధర్మ. 1. 169.

వి. అ. పుం. 1. మోక్షము, 2. వేదము, 3. దేవత, వేల్పు 4. పశువులను కట్టు కొయ్య. 5. పాదరసము 6. గుగ్గిలము, ఒక విధమగు ధూప ద్రవ్యము. 7. నల్ల యుమ్మెత్త 8. తియ్య మామిడి 9. (జ్యోతి), విష్కంభాది యోగము లలో నొకటి, 11. నూఁగు దోస.

న. 1. శుభము. 2. సుఖము, 3. జలము. 4. సముద్రపుటుప్పు. 5. జాతియుప్పు, సైంధవ లవణము. 6. అద్వైత పరబ్రహ్మము.

సీ. ..... అవ్యక్త మనఁగ బ్రహ్మంబనా నుత్తర మనఁగ శివంబన విమతి కెక్కు. భార. శాం. 5. 345.

7. పరిశుద్ధమైన వెలిగారము.

**శివయోగి** వి. శివభక్తుఁడగు తపస్వి.

18. పప్పునకు 1. శివయోగులుపదుడ్రకుప(డ్లు) దంచెడు అణ్ణది యొక్క తై పిట్టము దునకు వడ్లు డఁచెడు అణ్ణు వంద్రడు యిదటుంగా ముప్పురికు శిలాశాసవము వెట్టి-ద. శా. 4. 12. 88.

వ. అమ్మా! శివుఁడన శివయోగి యన భేదంబు గలదె హర. 2. 102.

**శివరాత్రి** నం వి ఇ. స్త్రీ మాఘ కృష్ణపక్ష చతుర్దశి, నిద్రాహారములు మాని జాగరముండు రాత్రి.

గీ మానినికి నీవు ప్రక్కను లేని యట్టి, రాతిరెల్లను మఱి శివరాత్రి యరయ. రాధికా. 1. 138.

**శివరాయల వరాలు** వి బ. శివరాయ ముద్ర గల వరహాలు.

సీ. అఖిలసీమామూలమైన దుర్గమ్ములు చేతికై దేసి వేల్ శివరాయల వరాల నెలకట్టడల పటాణీల్ గరీబు. రా. వి. 5. 13.

**శివలింగము** నం. వి. అ. వి. 1. జాయి మున్నగు వానితో నిర్మింపఁబడిన లింగరూప మగు శివుని యర్చా విగ్రహము.

2. శివలింగమును బూజించుట కేర్పఱుపఁబడిన యాలయము.

**శివవల్లభ** నం. వి. ఆ. స్త్రీ. 1. శతపత్రి, తెల్ల గులాబి. 2. పార్వతి.

**శివవల్లభము** నం. వి. అ న. మామిడిచెట్టు.

**శివశేఖరము** నం. వి. అ. పుం. 1. చెందమామ, చంద్రుఁడు. 2. ఉమ్మెత్తచెట్టు. 3. అగిసెపువ్వు (వాచ.).

**శివసత్తి** మి. వి. 1. ఈశ్వరశక్తి, పార్వతి. 2. మ దేవత, అమ్మవారు. 3. అమ్మవారు వః న (పూనిన) మానిసి.

గీ. మగనికంటె నెరుసు వగలాఁడి శివసత్తి, బలు గయాళి పోరుగు పాలి జాలి, మందులాఁడి చెడుగు మానిసి బూతంబు, పిసిఁడి బిచ్చగాండ్ల వెన్ను గుదియ. చెన్న. 2. 24.

**శివాత్మకము** నం. వి. అ. న. జాతి యుప్పు, సైంధవ లవణము.

**శివాదేశకుఁడు** (అ. శివ. అ) 1. శుభ వర్తమానముఁ దెచ్చినవాఁడు. 2. భావి శుభమును జెప్పువాఁడు.

**శివాని** నం. వి. ఈ. స్త్రీ. శివునిభార్య, పార్వతి.

**శివాప్రియము** నం. వి. అ. పుం. మేఁక.

**శివాఫల** నం. వి ఆ స్త్రీ. శమీవృక్షము, జమ్మి.

**శివారాతి** నం వి. ఇ. స్త్రీ. 1. పార్వతీ పరమేశ్వరులను ద్వేషించువాఁడు, పాషండుఁడు. 2. కుక్క.

**శివాలయము** నం. వి. అ. పుం. 1. శివుని నివాసము. 2. ఎఱ్ఱతులసి.

న. 1. శివునిగుడి. 2. శ్మశానము.

**శివాలువు** నం. వి ఉ. పుం. నక్క.

**శివి** నం. వి. ఇ. పుం. 1. ఘాతుక జంతువు, క్రూర మృగము. 2. భూర్జపత్త్రిము.

**శివుఁడు** నం. వి. అ. పుం. ఈశ్వరుఁడు. ముక్కంటి.

**శివేతరము** నం. విశ. (అ. ఆ. అ.) అమంగళము, శుభములేనిది.

**శివేష్ట** నం. వి ఆ. స్త్రీ. దూర్వ, గఱిక.

**శిశిరకరుఁడు** సం. వి. అ. పుం చల్లని కిరణములుగల వాఁడు. చంద్రుఁడు. ఇట్లే శిశిర కిరణుఁడు మొ॥

**శిశిరము** సం. విశే. (అ. ఆ. అ.) చల్లనిది,

వ. ఆ....అనిలాలోలకల్లోల మాలాస్ఫాలన సముచ్ఛల జ్జల కణాసార శిశిర శిశిరం బగుచున్న గంగాపులినంబున. భార. ఆది. 4. 142.

ఉ...మే, యాడక నిద్ర వోయె శిశిరానిలముల్ పయివీచుచుండఁగన్. భార. ఆది. 5. 170.

వి. అ. పుం. న. 1. మంచు, హిమము. 2. శిశిర ఋతువు (మాఘ ఫాల్గుణ మాసములు). 3. చల్లఁదనము,

**శిశిరవిధి** సం. వి. ఇ. పుం. శైత్యోపచారము.

క....రసిక కిసలయ పాణుల్, బిస కిసల కుసుమ విసరము వెస మసలక తెచ్చి శిశిర విధి లాలసులై. విజయ. 3. 57,

**శిశిరాత్యయము** సం. వి. ఇ. పుం. శిశిర ఋతువు యొక్క తుద, వసంత ఋతు ప్రారంభము. ఇట్లే శిశిరాపగమము.

**శిశిరోపచారము** సం. వి. అ. పుం. శీతలక్రియలు.

తే. గీ చెలికి శిశిరోపచారముల్ సేయఁ జేయ, నంతకంతకు మదనాగ్ని యధికమైనఁ. జెలులు మదిలోన నెంతయుఁ జిన్నవోయి, రాజునకు విన్నవించిరి రమణి తెఱఁగు, విక్రమా. 7. 64

**శిశుకము** సం. వి. అ. పుం. 1. బిడ్డ, పిల్ల. 2. పశుపక్ష్యాదుల పిల్ల. 3. వృక్షము, చెట్టు. 4 మొసలి. 5. మొసలి వలె నుండెడి చేఁప.

**శిశుక్రందీయము** సం వి. అ. పుం శిశువుల వ్యాధి నిదానములను వాని చికిత్సలను దెలుపు గ్రంథము.

**శిశుగంధ** సం. వి. ఆ. స్త్రీ. ముద్దమల్లె. ఒక జాతి మల్లె.

**శిశుచాంద్రాయణము** సం. వి. అ. న. చిన్న చాంద్రాయణ వ్రతము.

(ప్రొద్దుట నాలుగు ముద్దలు, రాత్రి నాలుగు ముద్దలు మాత్రము అన్నము తినుచు చేయు వ్రత విశేషము)

**శిశునాగము** సం. వి. అ. పుం. పిల్ల యేనుఁగు. ఏనుఁగుగున్న.

**శిశుపాలుఁడు** సం. వి. అ. పుం. దమఘోషుని పుత్త్రుఁడైన చేదిదేశపు రాజు.

ఉ. పాలిత దుగ్ధయుండు శిశుపాలుఁడు బాలుఁడు ... భార. సభా. 2. 32,

**శిశుమారము** సం వి. అ పుం 1. మకరము, మొసలి 2. ఆకాశము నందలి తారాచక్రభేదము (వాచ). శింశుమార చక్రము.

**శిశుమారశిరస్సు** సం. వి. స్. న. ఈశాన్యదిక్కు.

**శిశువాహ(క)ము** సం. వి. అ. పుం. అడవిమేఁక.

**శిశువాహ్య(క)ము** సం వి అ. పుం శిశువాహకము.

**శిశువు** సం. వి. ఉ పుం. 1. బిడ్డ. 2. పశుపక్ష్యాదుల పిల్ల. 3 ఎనిమిదేండ్లకుఁ దక్కువ యీడుగల పిల్లవాఁడు. 4. విద్యార్థి.

**శిశ్నము** సం. వి. అ న. మగ గుఱి. మేఢ్రము.

**శిశ్విదానుఁడు** సం విశే (అ ఆ అ.) 1. ధర్మనిష్ఠ గలవాఁడు. 2. పాపాత్ముఁడు, దుష్టుఁడు.

**శిష్టత్వము** సం. వి. అ. న. సదాచార సంపత్తి, మంచి నడవడి, సుజనత్వము.

శా. శిష్టత్వంబున వేదశాస్త్రపఠన శ్రీచేత నాధాతకుం, దృష్టింపంగ నశక్యుఁడైన ధరణీదేవోత్తమున్....నిరం. 1. 59.

**శిష్టము** సం. విశే (అ. ఆ. అ.) 1. మిగిలినది. 2. ఆజ్ఞాపింపఁబడినది. 3. శిక్షితము, మంచి మార్గమలవఱుపఁబడినది. 4. మంచిగుణము గలది. 5. గాంభీర్యము.

గీ. యాగశాలను గట్టినయట్టిచో నె, వనలవిప్రానిలంబుల కభిముఖముగ, మునుగు వెట్టకచేముక్కుమూఁకొనక, మలము విడుచుట శిష్టధర్మంబుగాదు. విజ్ఞా. కాం. 1. 85.

6. నాగరకత గలది, సభ్యమైనది. 7. ముఖ్యమైనది.

**శిష్టాచారము** సం వి. అ. పుం.1. శిష్టులయాచారము, శిష్టులు వర్తించు మార్గము. 2. మంచి పద్ధతి.

**శిష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. పరిపాలన, 2 ఆజ్ఞ ఉత్తరువు. 3. శిక్ష, శాస్తి.

**శిష్టుఁడు** సం. వి. అ. పుం. 1. ప్రసిద్ధ పురుషుఁడు, ప్రఖ్యాత పురుషుఁడు. 2. పండితుఁడు, విద్వాం

మఁడు 3. మ [ంత్రి]ఁలోచన చెప్పువాఁడు. 4 సదాచార సంపన్నుఁడు, మంచినడవడిగల మనుష్యుఁడు.
ఆ.. నిఖిల భూప్రజా పాలనఁ జేయుచుండె శిష్టవే ద్యమగుచు. భార. ఆది. 3. 15.
విణ. 1, శాంతుఁడు, 2. వేదమందు విశ్వాసము గలవాఁడు, 3. ధీరుఁడు, 4. యోగ్యుఁడు.
వసంతతిలకము. వీరావతార మకవిస్మృత నిత్యధర్మ ప్రారంభశిష్టజన పాలన సక్త ... ...
భార ఆది. 2. 240.

**శిష్యపుత్రుఁడు** సం. వి. అ పుం 1. కుమారుఁడుగా నెంచఁబడిన శిష్యుఁడు, 2. శిష్యుని కుమారుఁడు.

**శిష్యశిక్ష** సం. వి ఆ స్త్రీ. 1. శిష్యుని తప్పుదిద్దుట, శిష్యశిక్ష. 2. శిష్యుని మంచిమార్గమునఁ బెట్టుట.

**శిష్యుఁడు** సం. వి. అ. పుం. అంతేవాసి, చదువు నేర్చుకొనువాఁడు, విద్యార్థి.
ఆ. వె ఁవధు నిన్ను శిష్యుఁడును ధార్మికుండు సత్యవ్రతుం డునని మహాదరమున, వడిగె నీవు ధర్మహానికి నోర్చిన, గురుఁడు నిశ్చయించెఁ గొడుకు చావు. భార. ద్రోణ. 5. 35.

**శిహ్ల(క)ము** సం. వి. అ. పుం. చిల్లమడ్డి, గంధద్రవ్య విశేషము.

## శీ

**శీ** సం. వి. ఈ. స్త్రీ. (దీనికి వ్యస్తప్రయోగ ము లేదు. సమాసమున శ్లేషాదులయం దుపయోగింపఁబడ వచ్చును.) 1. నిద్ర. 2. శాంతి, నెమ్మది.

**శీకరము** సం. వి. అ. పుం. 1. తుంపర.
సీ. ....కరికరశీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబుకణముల .... భార. ఆది. 4. 23.
2. నీటి బిందువు.
ఉ. శీకర బృంద మెంతయు నశీత మరీచి మరీచి జాలమై, శ్రీకృత ధారధర్మమయి తేజరిలన్. కళా. 4. 200.
3. వాయువు.
న. 1. సరల వృక్షము. 2. సరల వృక్షము యొక్క బంక.

**శీకరి** సం విణ. (న్. జీ. న్.) 1. తుంపరలు గలది, 2. జలబిందువులను గురియునది.

**శీఘ్రకారి** సం. విణ. (న్. జీ. న్.) త్వరగాఁ జేయువాఁడు త్వరగాఁబనిచేయువాఁడు, చురుకైన వాఁడు.

**శీఘ్రకోపి** సం. విణ. (న్. ఈ. న్.) త్వరగాఁ గోపము వచ్చువాఁడు, ముంగోపి.

**శీఘ్రచేతనము** సం. వి. అ. పుం. 1. కుక్క. 2. తెల్ల జిల్లేడు.

**శీఘ్రబుద్ధి** సం. విణ. (ఇ) సూక్ష్మబుద్ధిగలవాఁడు, చురుకుఁదనము గలవాఁడు.
ఆ. .... పూర్ణ ఘటికాంత నాదంబు చెవులు సోఁకి వంత శీఘ్ర గతిని· సింహా. భా. 1. అ. 2. 60

**శీఘ్రము** సం. విణ. (అ. ఆ. అ.) వేగముగలది, వడిగలది.
వి. అ పుం. 1. ఆలస్యము లేమి, అవిలంబము.
ఉ. ఆ వనవీథిలోఁ గల మృగావళిఁ బట్టు సంహరించి... శీఘ్రము పాశియ మెత్తి... శ్రీకాళహస్తి. 3. 52.

**శీఘ్రలంఘనము** సం విణ. (అ. ఆ. అ.) వడిగాఁ బోవునది.
వి. అ. న. వడిగా దుముకుట.

**శీఘ్రవేధి** సం. విణ· (న్. నీ. న్.) వడిగాఁ గొట్టువాఁడు, మంచి విలుకాఁడు.

**శీఘ్రి** సం. విణ. (న్. జీ. న్ ) 1. వడి గల వాఁడు, చురుకైన వాఁడు, వేగముగా మాటలాడు వాఁడు. 2. ఉచ్చారణమునఁ దొందర గలవాఁడు,

**శీఘ్రియము** సం. వి. అ. పుం. పిల్లుల పోరాటము.

**శీఘ్రియుఁడు** సం. విణ (అ ఆ. అ.) వడిగలవాఁడు, వేగవంతుఁడు.
వి అ పుం. 1. విష్ణువు. 2. శివుఁడు.

**శీఘ్రీయము** సం. విణ. (అ ఆ అ.) వడిగలది, వేగవంతము.

**శీఘ్ర్యము** సం. వి. అ. న. వడి, వేగము.

**శీత** సం. వి. ఆ. స్త్రీ. 1. నాగటిచాలు.
2 అ న. చల్లదనము.
అ పుం. 1. ప్రబ్బ. 2. తిరిగి. (వ్య. వి.). అ. పుం. చలికాలము.

**శీతకము** సం. విణ. (అ ఆ. అ.) శీతము.
వి. అ. పుం. 1. చేల్లని వస్తువు. 2. చేలికాలము,

3. తేలు.

**శీతకరము** సం. వి. అ. పుం. కర్పూరము, హారతి కర్పూరము.

**శీతకరుఁడు** సం. వి అ పుం. చంద్రుఁడు.

**శీతకుంభము** సం. వి. అ. పుం. కరవీర భేదము, పరిమళము గల గన్నేరు.

**శీతకుఁడు** సం వి అ. పుం 1. సోమరిపోతు, విలంబము చేయు మనుష్యుఁడు. 2. శాంతుండు, విచారము లేని మనుష్యుఁడు.

**శీతక్షారము** సం వి. అ పుం వెలిగారము.

**శీతగంధము** సం వి. అ పుం. తెల్లమంచిగంధము.

**శీతచంపకము** సం. వి. అ పుం 1. దీపము. 2 అద్దము

**శీతపుష్పము** సం. వి. అ పుం. శిరీషము, దిరిసెనచెట్టు (వృ. వి.).

**శీతప్రభము** సం. వి అ పుం. కర్పూరము.

**శీతభానువు** సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు, ఉ...భానుఁడు శీతభానుఁడున్, గాఁడిన మేఘ కాళిమ వికారము దూరముసేయ నెంతయున్, నాదెముచూపె శారద దినంబులు నిర్మల మౌక్తికాకృతిన్. పాండు. 4. 43 2. కర్పూరము

**శీతభీరువు** సం. వి. ఉ. పుం. ఒక రకము మల్లె.

**శీతమరీచి** సం. వి. ఇ. పుం. 1. చంద్రుడు, 2. కర్పూరము,

**శీతము** సం. విశ (అ ఆ అ) 1. చల్లనిది, శీతలము 2. ఉత్సాహములేనిది, సోమరితనము గలది.
వి. అ పుం. 1 వేపచెట్టు, 2. ఒకజాతి ఔల్లు, 3. చలికాలము, 4. కర్పూరము.
న. 1. చేల్లదనము, చలి.
సీ... శీతాతపంబులు వాతగతము భార.ఆది.5.60
2. సీరు, 3. దాల్చిన చెక్క, లవంగ పట్ట

**శీతమూల(క)ము** సం వి. అ న వట్టివేరు, ఉశీరము.

**శీతరమ్యము** సం వి అ. పుం దీపము.

**శీతరు(శుక్)చుఁడు** సం వి చ్. పుం చంద్రుఁడు

**శీతల** సం వి ఆ స్త్రీ 1. రోగవిశేషము, స్ఫోటకము 2. స్ఫోటకమున కధిష్ఠాన దేవతయైన యమ్మవారు.

**శీతలకము** సం. వి. అ. న. తెల్లకలువ.

**శీతలచ్ఛదము** సం. వి. అ. పుం. చంపకము, సంపంగి చెట్టు (వృ. వి.).

**శీతలజలము** సం. వి. అ. న. 1. ఉత్పలము, కలువ, 2. చల్లని సీరు.

**శీతలము** సం. వి. అ. న. శైత్యోపచారము.
క్షిత్రక్షేత్రాలు...నిత్య నైవేద్య దీపారాధనలు, పానకం మొదలైన శీతలాలు, తిరునాళ్ళ మహోత్సవాలు చేయిం స్తిమి. ద. శా. 4. 709.
విశ. (అ. ఆ. అ.) 1. చేల్లనిది.
సీ...కరికర శీతలచ్ఛాయఁ దచ్ఛికరాంబుకణముల చల్లని గాడ్పున వడి....భార. ఆది. 4. 28.
2. సహింపఁదగినది.
వి అ పుం 1.కర్పూరభేదము. 2.కర్పూరతైలము. 3. చంపకము, సంపంగి చెట్టు. 4. (సూర్యుడు మేష రాశియందుండు నపు డాచరింపఁబడెడి) వ్రత విశేషము.
న. 1.చేల్లదనము 2 చేలికాలము, 3 ఒక విధమగు సుగ ధ ద్రవ్యము 4. మంచి గంధము. 5. ముత్తెము, 6. పుష్పకాసీసము. 7. పద్మము, తామర. 8. వీరణము, అవురుగడ్డి (వృ. వి.).

**శీతలషష్ఠి** సం. వి. ఇ. స్త్రీ మాఘ శుక్ల షష్టితిథి.

**శీతలి** సం వి. ఇ. స్త్రీ శీతల.

**శీతలిక** సం వి. ఆ స్త్రీ సోమిదము, శణపర్ణి, శైత్యమున కుపచరించు నొక లత.
చ...శీ, తలికలు చిక్క మూలములఁ దామర తూఁడులఁ దెండు మీరు.... చెలువకు శీతలక్రియలు నేయుర మింకెడ నేయ నేఁటికిన్. కు సం 5.316.

**శీతలుఁడు** సం వి. అ. పుం చంద్రుఁడు.

**శీతవల్కము** సం. వి అ. పుం. ఉదుంబరము, మేడి చెట్టు ఇక్లే శీతవీర్యకము.

**శీతశివము** సం. వి. అ. పుం. 1. జమ్మి చెట్టు.
న. 1.సైంధవ లవణము. 2. వెలిగారము.

**శీతశూకము** సం వి. అ. పుం యవ, సస్యవిశేషము.

**శీతసహము** సం వి అ. పుం పీలు వృక్షము, గొలుగు చెట్టు.

**శీతాంశువు** సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు,

శా ... శీ,తాంశు సూర్యగ్రులు స(ంశితావళి నీయా కాఁ రేఖల్. ని౦. 4. 118. 2. కర్పూరము

శీతాదము సం. వి. అ పుం. పంటి చిగుళ్ళ జబ్బు.

శీతాద్రి సం వి. అ. పుం. హిమాలయపర్వతము, చలిమల.

శీతాలువు సం విశ. (ఉ) శీతబాధ పడుచున్న వాఁడు.

శీతాశ్మము సం వి న్. పుం. చంద్రకాంతపురాయి.

శీ(సీ)త్కారము సం. వి. అ. పుం. 1. ఆకస్మికమగు సంతోషమును (లేక) దుఃఖమును తెలుపు ధ్వని 2 రతికాలమున స్త్రీలుచేయు స్త్రీధ్వని విశేషము.

శీధుగంధము సం వి అ పుం. వకుళము, పొగడచెట్టు.

శీధుపుఁడు సం. వి. అ పుం. మద్యము (కల్లు) త్రాగు మనుష్యుఁడు.

శీధువు సం. వి. ఉ. పుం. న. 1. మద్యము.
క... యా, దవులు మనోజ్ఞము లగు శీ, ధువులును మాంసములు వేడ్కతో నింటింటన్ (పమకట్టితో మచు) భార. మౌ. 28. (చెఱకు రసముతోఁ జేసిన) కల్లు. 2. ద్రాక్షసారాయి.

శీనము సం. విశ. (అ. ఆ. అ.) ఘనీభవించినది, పేరు కొన్నది వి. అ పుం. కొండచిలువ.

శీనుఁడు సం. వి. అ. పుం మూర్ఖుఁడు

శీభ్యము సం. వి. అ పుం వృషభము, ఎద్దు.

శీరము సం వి. అ. పుం, అజగరము, కొండ చిలువ.

శీర్ణపర్ణము సం. వి. అ. న. వడిలిన యాకు ఇట్లే శీర్ణపత్రము పుం. వేపచెట్టు.

శీర్ణపాదుఁడు సం. వి. అ పుం. 1. యముఁడు 2. శనైశ్చరుఁడు (ఒక గ్రహము).

శీర్ణము సం విశ. (అ. ఆ. అ) 1. వాడినది. 2. ఎండినది, కుప్పించినది 3. బ్రద్దలుచేయఁ బడినది, చీల్పఁబడినది. 4 నన్నగిల్లినది. 5. చిన్నది, అల్పమైనది. వి అ. న. పరిమళ ద్రవ్య విశేషము.

శీర్ణవృంతము సం. వి. అ. న. ఖర్బూజాపండు. (ఒక జాతి ఫలవృక్షమని వాచ.)

శీర్షకము సం. వి. అ పుం, రాహు గ్రహము, రాహువు
న 1. తల. 2. కపాలము, పుఱ్ఱె. 3. ఇనుప కుళ్ళాయి, శిరస్త్రాణము. 4. తలపాగ. 5. న్యాయసభవారి తీర్పు, న్యాయసభవా రేర్పఱచిన శిక్ష.

శీర్షచ్ఛేద్యుఁడు సం విశ. (అ ఆ. అ) తల నఱకఁదగిన వాఁడు, శిరచ్ఛేదమున కర్హుఁడు.

శీర్షణ్యము సం వి అ, పుం నిర్మలమును, వంకరగాని దియు నగు కేశము,
న 1. శిరస్త్రాణము, ఇనుపకుళ్ళాయి. 2 తలపాగ, ఉష్ణీషము.

శీర్షము సం వి అ న 1. తల శిరస్సు 2. కృష్ణాగరువు

శీర్షకోశము సం. వి అ పుం. తలనొప్పి.

శీర్షోదయము సం వి అ. పుం 1 (జ్యోతి) మిథున, సింహ, కన్యా, తులా, వృశ్చిక, కుంభ, మీనములకుఁ బేరు 2. తల్లిగర్భమునుండి శిశువుతల బైటికివచ్చుట.

శీలఖండనము సం వి అ. న సత్ప్రవర్తనము నతిక్రమించుట.

శీలనము సం వి అ న 1. అభ్యాసము, అలవఱచు కొనుట, మరలమరలఁ జేయుట, 2. ప్రవర్తనము, నడవడి 3. గౌరవించుట 4. ధరించుట. 5. అతిశయించుట, మీఱుట.

శీలము సం వి అ పుం 1. కొండచిలువ, అజగరము న. 1. స్వభావము.
కం ఒలసిమనోవాక్కాయం,బుల ద్రోహాభావమఖిల భూతముల యెడం, గలిమివిను శీల మదిమే, లొలయించును దాన నుల్ల మూన్పుము పుత్రా భార. శాం. 3. 147.
మ. అభిజాతుండవు ధర్మశీలుఁడవు... భార. ఆది. 8. 52.
సీ. శ్రుతము నాచారంబు నతిశయవంతంబు లెడ నహంకార మొక్కింతయేని, లేదు శీలము కడులెస్స వేషము నిర్వికారంబు. భార. శాం. 5. 82
2. ప్రవర్తనము, నడవడి 3 సత్ప్రవర్తనము, మంచి నడవడి 4. మంచిగుణము. 5. రాగద్వేషములను విడుచుట. 6. సౌందర్యము, చక్కఁదనము. 7. అభ్యాసము, అలవాటు.

శీలవంచన సం. వి. అ. స్త్రీ. సత్ప్రవర్తనము తప్పుట.

శీలవృత్తము సం విశ. (అ. ఆ. అ.) మంచినడవడి.

గలది. సత్ప్రవర్తనము గలది.
వి. అ. న మంచి నడవడి.

**శీలవృత్తి** నం. వి ఇ. స్త్రీ సుగుణము, సత్ప్రవర్తనము.

**శీలించు** నం స. క్రి. 1. అభ్యసించు, పరిశీలించు.
మ ... అస్యౌచిత్యముల్ గలయం దైన నెఱుంగ రెంతయును మౌష్కర్యంబు శీలించుటన్. హరి పూ. 9 54.
కం. శీలి ప వలయు మది శబ్దాలంకారంబు లైన యమకాది విచిత్రా లిఖిత బంధ భేదములోలిన యొక కొన్ని వాని నొనరింతుఁ దగన్.
కావ్యా. 6-2.
2. సంస్మరించు, తలంచు.
కం. ఆ లోనఁ జండితో నుద్దాలకుఁ డిట్లనియె సమ్మదంబున విపరీతాలాప సరణి మనమున శీలింపక తుష్టిగా భుజించిన కతనన్. జై. భా 4. 99.

**శీలితము** నం. విణ. (అ. ఆ. అ.) అభ్యసింపఁ బడినది, అలవఱచుకొనఁ బడినది. 2. ధరింపఁ బడినది, 3 దర్శింపఁ బడినది, చూడఁ బడినది. 4. నేర్పుగలది. 5. సంపన్నమైనది, కలిగియున్నది. 6. ఆచరింపఁ బడినది.
వి అ న 1. అభ్యాసము, అలవాటు. 2. నడవడి, ప్రవర్తనము

**శీవము** నం. వి న్ పుం కొండచిలువ

## శు

**శుంగ** నం వి ఆ స్త్రీ 1 లేఁతమొలకపైపొర; వరి మొదలగువాని ముల్లు.

**శుంగము** నం. వి అ పుం 1 మఱ్ఱి చెట్టు.
2. మారేడు చెట్టు 3. వరి మొదలగువాని ముల్లు

**శుంగి** నం. వి. న్ పుం 1. మఱ్ఱిచెట్టు 2 జువ్విచెట్టు.

**శుంఠ** (శుఁడు) నం. విణ. అ. ఆ. అ ) మూఢుఁడు

**శుంఠకాయ** మి వి. (శుంఠ + కాయ) శుంఠ, మూఢుఁడు. ద్వి పరమ. 5. 261 పా.

**శుంఠి** నం వి. ఇ. ఈ. స్త్రీ. సొంటి, మహౌషధము

**శుండ** నం. వి. ఆ. స్త్రీ. 1. ఏనుఁగు తొండము.
సీ. వేదండభయద శుండాదండ నిర్యాంతవమధువుల్ పైజల్లు వారి గాఁగ. మను. 1.142.
2. మద్యము, కల్లు. 3. కల్లంగడి. 4. తామఁతీఁగ. 5. వేశ్య. 6. కుట్టిని, తార్పుకత్తె. 7. నీటియేనుఁగు.

**శుండకము** నం వి. అ పుం. యుద్ధమున సైనికుల కుద్రేకమునుగల్గిఁచుటకు వాయించువాద్యవిశేషము.

**శుండకుఁడు** నం. వి. అ పుం సారాయికాచువాఁడు; సారాయి అమ్మువాఁడు.

**శుండము** నం. వి. అ. పుం. 1. మదపుఁటేనుఁగు గండస్థలమునుండి కాఱెడి మదజలము. 2. ఏనుఁగు తొండము

**శుండాపానము** నం. వి. అ. న. 1. మద్యపానము. 2. మద్యపానశాల. కల్లంగడి.

**శుండారము** నం వి. అ. పుం. ఏనుఁగుతొండము

**శుండారుఁడు** నం. వి. అ. పుం—శుండకుఁడు.

**శుండాలము** నం. వి. అ. పుం. ఏనుఁగు.
వ ......శుండాల సుభట ఘోటకంబుల యంగంబులఁ గ్రమ్ముదెంచు రుధిరం బది యడంచిన... భార. ద్రోణ. 5.57.

**శుండి** నం. వి. న్. పుం. 1. శుండారుఁడు 2. ఏనుఁగు.

**శుండిక** నం. వి. ఆ. స్త్రీ. 1. అంగుడి, కొండ నాలుక 2. గవుదలవాపు, దవుడక్రిందిభాగ ముబ్బుట.

**శుండిమూషిక** నం వి. ఆ. స్త్రీ. చుంచెలుక, గంధమూషి.

**శుంభుఁడు** నం. వి. అ పుం. దుర్గచేఁజంపఁబడిన యొక రాక్షసుఁడు.

**శుకతరువు** నం. వి. ఉ. పుం. శిరీషము, దిరిసెనచెట్టు. ఇట్లే శుకద్రుమము మొ.

**శుకనాస** నం. వి అ. పుం శుకనాసము, చిలుక ముక్కు . అగిసె (వృ. వి.). ఆం. భా. 266.

**శుకపుచ్ఛము** నం వి అ పుం. 1. గంధకము. 2. చిలుకతోక.

**శుకపుష్పము** నం వి. అ. పుం. శిరీషము. దిరిసెన చెట్టు (వృ. వి.).

**శుకప్రియ** నం. వి. ఆ. స్త్రీ నేరేడు, జంబూవృక్షము, ఒకజాతి చెట్టు (వృ. వి ).

**శుకప్రియము** నం. వి. అ. పుం. 1. దిరిసెన చెట్టు.

2.నేరేడు చెట్టు (వృ. వి.).

**శుకము** నం. వి. అ. పుం. 1. చిలుక.

చం. ...నలీలకోకిలనికాయ శుకవ్రజశారికా సము, తర్కభసలి లసద్ధ్వనివిధానములు త్తర జిత్రవర్తినన్. చంద్రి. 4.౮.

2. శిరీషము, దిరిసెనచెట్టు (వృ. వి.). 3. గ్రంథిపర్ణము, గ్రంథిపనము (వృ. వి.). న 1 వస్త్రము, 2. వస్త్రాంచలము, కొంగు. 3. శిరస్త్రాణము, ఇనుపకుళ్ళాయి 4. ఉష్ణీషము, తలపాగ.

**శుకవల్లభము** నం వి. అ. పుం దానిమ్మ చెట్టు (వృ వి.).

**శుకవాహుఁడు** నం. వి. అ. పుం మన్మథుఁడు.

**శుకాదనము** నం. వి. అ. పుం. దానిమ్మ (వృ. వి).

**శుకి** నం. వి. ఈ స్త్రీ ఆడుచిలుక.

**శుకుఁడు** నం. వి. అ. పుం. వ్యాసపుత్రుఁడు, శుకమహర్షి.

**శుక్కు** నం. వి. చ్. స్త్రీ. శోకము, వగపు.

**శుక్తము** నం. విశే. (అ. ఆ. అ.) 1. పవిత్రమైనది. 2. పుల్లనిది. 3. కఠినమైనది. 4. కలసి కొన్నది. 5. నిర్జనము, జనశూన్యమైనది

వి. అ. న. 1. మాంసము. 2. పుల్లనిగంజి, కాంజికము, 3. పుల్లనిద్రవ్యము.

**శుక్తకము** నం వి. అ. న పులిత్రేపు.

**శుక్తి** నం వి. ఇ స్త్రీ 1. ముత్తెపుఁజిప్ప 2. శంఖము, 3. నత్తగుల్ల. 4. పుఱ్ఱె పెంకు. 5. గుఱ్ఱపుమడి. 6 గంధద్రవ్య విశేషము. 7 రెండఱఁ ములయెత్తు. 8. మూలవ్యాధి 9 ఒక విధమగు నేత్రరోగము

**శుక్తిక** నం. వి అ. స్త్రీ. 1. ముత్తెపుఁజిప్ప. 2. పులిచింత (వృ. వి.).

**శుక్తికాస్పర్శము** నం. వి. అ. పుం మౌక్తిక మణి దోషము, ముత్యమునందలి దోషము.

ఆ. మౌక్తికంబునడుమ మత్స్యాక్షయనునది, గానవచ్చు మీనుకన్నులీలెఁ, జిప్పరజము కడలఁ జిక్కిన శుక్తికాస్పర్శమండ్రు రత్నశాస్త్రవిదులు. రత్నపరీక్ష. 50.

**శుక్తిజము** నం. వి. అ. న. ముత్తెము ఇట్లే శుక్తిబీజము మొ.

**శుక్తిపేశి** నం. వి. ఈ. స్త్రీ. ముత్తెపుఁజిప్ప.

**శుక్తిమంతము** నం. వి. త్. పుం. కులపర్వతము. లేడింటిలోనొకటి.

**శుక్తిమతి** నం. వి. ఈ. స్త్రీ ఒకానొకనది.

**శుక్తిస్పర్శము** నం. వి. అ. పుం. ముత్తెము మీఁది నల్లనిమచ్చ.

**శుక్రకరము** నం. విశే. (అ. ఆ. అ.) వీర్యవృద్ధి గలిగించునది.

వి. అ. పుం. మజ్జ. ఎముకలనడుమ నుండెడిక్రొవ్వు.

**శుక్రభు(క్కు)జము** నం. వి. జ్. స్త్రీ. అఁడునెమిలి, మయూరి

**శుక్రభువు** నం. వి. ఉ. పుం. మజ్జ, ఎముకల నడుమ నుండెడి క్రొవ్వు.

**శుక్రము** నం. వి. అ. పుం. 1. జ్యేష్ఠమాసము. 2.అగ్ని. 3. చిత్రమూలము (వృ. వి.) 4. విష్కంభాదియోగములో నొకటి. 5. నేత్రరోగవిశేషము న. 1. పురుషుని వీర్యము. 2. సారము, నిగ్గు.

**శుక్రలము** నం. విశే (అ. ఆ. అ.) 1. శుక్రసంబంధి. 2. శుక్రుఁ డధిదేవతగాఁగలది 3. వీర్యవృద్ధికరమైనది.

**శుక్రలుఁడు** నం విశే (అ. ఆ. అ.) వీర్యవృద్ధి గలవాఁడు

**శుక్రవా(స)రము** నం వి. అ. పుం. భృగు వారము, ఏడువారములలో నొకటి.

**శుక్రశిష్యుఁడు** నం. వి అ. పుం. రాక్షసుఁడు.

**శుక్రిము** నం. విశే. (అ. ఆ. అ.)= శుక్రలము.

**శుక్రుఁడు** నం వి అ పుం 1 ఒక గ్రహము. 2. రాక్షసులగురువు.

**శుక్ల** నం వి ఆ స్త్రీ 1. సరస్వతి. 2. కలకండ. 3. తెల్లని శరీరకాంతి గల స్త్రీ 4. కాకోలి కారుకొల్లి (వృ. వి.).

**శుక్లకంఠకము** నం వి. అ. పుం నీరుకోడి.

**శుక్లకర్ముఁడు** నం. విశే. (న్.) పరిశుద్ధమైన నడవడి గలవాఁడు, సత్ప్రివర్తన గలవాఁడు.

**శుక్లకుష్ఠము** నం. వి. అ. న తెల్లకుష్ఠము.

శ్విత్రము.

శుక్లధాతువు సం. వి. ఉ. పుం. సుద్ద.

శుక్లపక్షము సం. వి అ. పుం. 1. నెలలో వెన్నెల క్రమముగా హెచ్చుగుపక్షము. 2. కొంగ.

శుక్లమండలము సం. వి. అ. న. కంటితెల్లగ్రుడ్డు.

శుక్ల(క)ము సం. విశ. (అ. ఆ. అ.) తెల్లనిది. వి. అ. పుం. 1. తెలుపు, ధవళవర్ణము. 2, శుక్లపక్షము.

శుక్లము సం. విశ. (అ. ఆ. అ.) 1. తెల్లనిది. ధవళము.

క. జీవుఁడు శుక్లచ్ఛాయా, భావితుఁడై నవుడువిష్ణు భావించుటకుందా వెరవరియగు... భార. శాంతి 5. 421.

వి. అ. పుం. 1. తెలుపు. 2. శుక్లపక్షము. 3. విష్కంభాదియోగములలో నొకటి. 4. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

శుక్ల న. 1, వెండి. 2. కంటి తెల్లగ్రుడ్డునందలి జబ్బు. 3. వెన్న, నవనీతము. 4 పులిగంజి. 5. పురుషుని వీర్యము.

గీ. తనకు శుక్లపాతంబైన దానిదెచ్చి. భార. ఆది. 5. 195.

శుక్లవాయసము సం. వి. అ. పుం. 1. కొంగ. 2. తెల్లకాకి.

శుక్లవృత్తి సం. వి ఇ. స్త్రీ. 1. పవిత్రమైనజీవన పద్ధతి. 2. బ్రాహ్మణుల వలన బ్రాహ్మణుఁడు సంపాదించు జీవనాధార ద్రవ్యము.

శుక్లాపాంగము సం. వి. అ. పుం. నెమిలి, మయూరము.

శుక్లామ్లము సం. వి. అ న. అమ్లశాకము, చింతపండు.

శుక్లార్మము సం వి న్. న. నేత్రరోగ విశేషము.

శుక్లిమము సం. వి. న్ తెలుపు, ధవళవర్ణము.

శుక్లోపల సం వి. ఆ స్త్రీ. కలకండ, పటికబెల్లము

శుచి సం. వి. ఇ. పుం. 1. వాయువు, గాలి 2. ప్రకాశము, కా. తి. (అ ని)

౩. అగ్ని (ఆ. ని)

శుచ సం. వి. అ. స్త్రీ. చింత, వగపు, శోకము.

శుచి సం విశ (ఇ) 1. పరిశుద్ధమైనది,

వ....ఎదుర నొక్క జలాశయంబుగని శుచిప్రదేశంబునం దవ చేశి కుండలంబులు పెట్టి ...

భార, ఆది. 1.101.

గీ, కలశమాపూర్ణముగ లోన మలమునిండ, బయలు గడిగిన శుచిగానిభంగి...శివ ధ. 5. 29.

2. తెల్లనిది,

వ...కంసుని వలని వెఱపువ శుచిస్మితయై యిట్లనియె, భాగ. 10. 125.

ఉ...దాని మనోహరాకృతియు దాని శుచిస్మిత వక్త్రకాంతియున్ భార. ఆది. 5 170

3. ప్రకాశమానము, ప్రకాశించునది 4 పుణ్యమైనది, పవిత్రమైనది, కళంకములేనిది, మలినముకానిది. 5. పవిత్రముగాఁ జేయఁబడినది, శుద్ధిచేయఁబడినది. 6. నీతిగలవాఁడు, సత్యవంతుఁడు. 7 నమ్మఁదగినవాఁడు, విశ్వసనీయుఁడు,

వి. ఇ. పుం 1, తెలుపు. 2. పవిత్రత, శుద్ధి.

3. నిష్కపటత, కాపట్యములేమి, మంచితనము. 4. బ్రహ్మచర్యము. 5. బ్రాహ్మణుఁడు. 6. జ్యేష్ఠమాసము. 7. ఆషాఢమాసము. 8. గ్రీష్మఋతువు. 9. నమ్మఁదగిన మిత్రుఁడు 10. సూర్యుఁడు. 11. చంద్రుఁడు. 12. అగ్ని. 13 శృంగారరసము. 14 శుక్రగ్రహము 15. చిత్రమూలము (వృ. వి.). 16. నిర్దోషియని విడిచిపెట్టుట 17 శిశువుయొక్కయన్న ప్రాశవకాలమునఁ జేసెడి హోమము. 18 శివుఁడు 19 జిల్లేడుచెట్టు వృ. వి ). 20. ఉపధాశుద్ధుఁడైన మంత్రి (శ,ర)21. సత్యము, సౌశీల్యము.

శుచిద్రుమము సం. వి. అ. పుం రావి చెట్టు.

శుచిప్రణి సం. విశ. ఈ. పెదవులతో నీరుపీల్చువాఁడు.

శుచిమణి సం. వి. ఇ. పుం. స్ఫటికము.

శుచిరోచి(స్సు)షుఁడు సం వి న్. పుం చంద్రుఁడు.

శుచిశ్రవుఁడు సం. వి న్, పుం. విష్ణువు,

గీ... శుచులు నా చెవుల కింపు లగుట మునులు శుచిశ్రవుఁ డంద్రు నన్ను, భార. శాంతి 6. 436,

శుటీరుఁడు సం. వి అ. పుం శూరుఁడు,

శుటీర్యము సం. వి. న. పరాక్రమము, శౌర్యము.

శుక్యము సం. వి. అ. న. సొంటి. మహౌషధము,

శుద్ధకోటి సం వి ఇ స్త్రీ. (గణిత.) సమ భుజములు గల త్రిభుజము న-దలి యొక భుజము.

శుద్ధచైతన్యము సం వి అ. న. మాయాసంబ ధము లేని చైతన్యము

శుద్ధజంఘము సం వి. అ పుం గార్దభము, గాడిద

శుద్ధము సం విశే (అ ఆ అ.) 1. శుభ్రమైనది, స్వచ్ఛమైనది. 2 పవిత్రమైనది 3, తెల్లనిది, ప్రకాశమానమైనది 4. మచ్చలేనిది, కళంకములేనిది 5. నిష్కపటమైనది, అమాయకమైనది. 6. సత్యమైనది, నిజమైనది. 7. యోగ్యమైనది 8. సరియైనది, తప్పులేనిది 9. విడుదల చేయఁబడినది. 10. కేవలమైనది, తన్మాత్రము

గీ, శుద్ధసాత్త్విక గుణసాంద్ర శుక మునీంద్ర, (శ్రీ)రాధామా. 1. 54.

11. మిశ్రము కానిది, సాకర్యము లేనిది, కలగలపు లేనిది

చం... ... భూ సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధ సువర్ణ గవాశ్వ హస్తులన్. భార. ఆది. 4 109. 12. సాటిలేనిది. 13. నియోగింపఁబడినది, ఆజ్ఞాపింపఁబడినది. 14. వాఁడిగాఁ జేయఁబడినది, పదును పెట్టఁబడినది 15. అనునాసికము కానిది,

వి అ న. 1. పవిత్రవస్తువు, పరిశుద్ధ పదార్థము 2. పరిశుద్ధాత్మము. 3. సైంధవలవణము (వాచ.), జాతి యుప్పు 4 మిరియము.

శుద్ధవంశ్యుఁడు సం విశే. (అ ఆ, అ.) పవిత్ర వంశమునఁ బుట్టిన వాఁడు.

శుద్ధవసంత(ము) సం వి. అ పుం ముప్పది రెండు నపుంసక రాగములలో నొకటి,

గీ. చెంచుమలహారి దేశాక్షి శ్రీవరాళి (వ)సంత సామంత శుద్ధవసంత గుజ్జరియును పాసఁగు ముప్పదిరెండు నపుంసకములు హంస. 1.124.

సీ. రామక్రియయు మేళరామక్రియ వసంత సామంత శుద్ధవసంత మధ్యమాదులు. ప్రబంధ.96.

శుద్ధాంత సం వి అ స్త్రీ, రాజ్ఞి, రాణి

శుద్ధాంతచారి సం వి న్ పుం. అంతఃపుర పరిచారకుఁడు, కంచుకి.

శుద్ధాంతపాలకుఁడు సం. వి. అ. పుం. అంతఃపురపుఁ గావలివాఁడు, ఇట్లే శుద్ధాంతరక్షకుఁడు మొ

శుద్ధాంతము సం. వి అ పుం. 1. అంతఃపురము, అంతిపురము.

మ... వేసారిదిం జూతురు వీర రుద్ర గజరాట్శుద్ధాంతముగ్గాగనల్. మను. 1 30,

2 రాజుభార్య, రాణి

గీ. అరుగుఁ గేళీ కులాయ శుద్ధాంతములకు. శృం. నై. 2. 5

ఉ సంతస మంది యే నపుడు శాప జలంబులు పాఱఁ జల్లి వే, దాంత వచో మహోపనిషదర్థమయిన్ శుభ రూప వృద్ధసీ, ముఁతిరిఁ గాశికా నగర మధ్యనివాసిని విశ్వనాథ శు, ద్ధాంతము డాయఁ బోయితిఁ బ్రియంబును భక్తియునుం దలిర్పఁగన్. భీమ. 2 111.

శుద్ధాత్ముఁడు సం. విశే. (న్) పరిశుద్ధమైన మనస్సు గలవాఁడు, మంచిమనస్సు గలవాఁడు

వి. న్. పుం. 1. పరమాత్మ, పరబ్రహ్మము. 2. శివుఁడు.

శుద్ధాపహ్నుతి సం. వి ఇ స్త్రీ అర్థాలంకార విశేషము, ఒకవిధమైన యర్థాలంకారము.

శుద్ధి సం. వి ఇ. స్త్రీ. 1. పరిశుభ్రత, స్వచ్ఛత.

మ...సామిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జేర్కొందున్ వచశ్శుద్ధికిన్. మను. 1. 7.

2. ప్రకాశము, కాంతి 3. పవిత్రత. పూతమగుట.

కం. తన మనములోన నంతట, ననుమానము తీఱ శుద్ధి యగు నందాకన్ మనుశౌచము చేయుట తగు ...... విజ్ఞా కాం. 1. 40,

4 దోషము పోఁగొట్టుకొనుట.

గీ. అజ్ఞులకుఁ బాపశుద్ధ్యర్థమైనయట్టి, తీర్థము.... శివధర్మ. 2. 122.

5. ప్రాయశ్చిత్త సంస్కారము, సంప్రోక్షణము మొదలగు సంస్కారము. 6. చెల్లించుట, సామ్మిచ్చివేయుట 7. ప్రతిక్రియ. 8. నిర్దోషియనివిడుదల చేయుట. 9. సరియగుట, హెచ్చుతగ్గులులేమి. 10. దిద్దుట, సవరించుట 11. తీసివేయుట, 12 దుర్గ.

శుద్ధికరము సం. విశే. (అ ఈ. అ.) శుద్ధిని జేయునది.

శుద్ధోదనసుతుఁడు సం. వి అ. పుం. బుద్ధదేవుఁడు.

శుద్ధోదనుఁడు సం. వి. అ. పుం. బుద్ధదేవుని తండ్రి

(రూ) శుద్ధోదనుఁడు.

**శునకము** సం. వి. అ. పుం. 1. కుక్క. 2. చిన్న కుక్క, కుక్కపిల్ల.

**శునకుఁడు** సం. వి. అ. పుం. భృగువంశస్థుఁడగు నొకఋషి.

**శునశ్శేపు(ఫుఁ)డు** సం. వి. అ. పుం. అజీగర్తుని కుమారుఁడగు నొకముని.

**శు(ను)నాశీ(సీ)రము** సం. వి. అ. పుం. గుడ్లగూబ.

**శు (ను) నాశీ (సీ) రుఁడు** సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు.

ఉ... సునా, శిరమణి ప్రభాపటల చిత్రితకూటము చిత్రకూటమున్. సింహా. భా. 1. ఆ. 2.72.

సీ. ఆసునాశీరు. నహంకారగరిమకు నిషధాచలము మీఁదినెలవుసాక్షి. హర. 7.

**శుని** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకుక్క.

**శునీరము** సం. వి. అ. పుం. ఆఁడుకుక్కల గుంపు.

**శున్యము** సం. విశ. (అ. ఆ. అ.) శూన్యము, ఏమియు లేనిది.

వి. అ. న. 1. ఆఁడుకుక్కలగుంపు, శునీసమూహము. 2. సున్న, బిందువు.

**శుభ** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకాశము, కాంతి 2. సౌందర్యము, అందము. 3. ఇచ్ఛ, కోరిక. 4. గోరోచనము. 5. జమ్మిచెట్టు. 6. దేవసభ, సుధర్మ 7. తెల్లగరిక (వృ. వి ). 8. వెదురుబియ్యము. 9. ప్రియంగులత.

**శుభంభావుకము** సం. విశ. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినది, ప్రకాశమానము.

**శుభంయువు (ఁడు)** సం. విశ. ఉ అదృష్టవంతుఁడు శుభాన్వితుఁడు.

**శుభకృత్తు** సం. వి. త్. పుం. సంవత్సరములలో నొకటి.

**శుభగంధకము** సం. వి. అ. న. గోపరసము, బాలెంత బోళము.

విశ. (అ. ఆ. అ.) మంచివాసనగలది.

**శుభ (భ్ర) దంతి** సం. వి. ఈ. స్త్రీ. 1. మంచిదంతములు గల స్త్రీ. 2. వాయవ్య మూలనుండు దిగజము భార్య.

**శుభదము** సం. వి. అ. పుం. అశ్వత్థవృక్షము, రావిచెట్టు.

విశ. (అ. ఆ అ) శుభమునిచ్చునది. మేలుకలిగించునది.

చ......అయ్యదియే శుభదంబు కుంభజా! శివధర్మ. 2.128.

**శుభము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రకాశించునది. 2. చక్కనిది. సుందరమైనది. 3. శుభప్రదమైనది, శుభము గలిగించునది.

శా...రా, జీవాతుండు కృతార్థుఁజేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్. మను. 1. 1.

మంచిది, యోగ్యమైనది.

కం......శుభదక్షిణ నామంత్ర తంత్ర దాక్షిణ్యమువన్. భార. ఆది. 2.188.

వి. అ. న. 1. క్షేమము, మంగళము.

శా......వినిపింప నీకు శుభమౌగాకంచుఁ దన్వేఁడినన్. దశా. 7. 100.

ఉ...తెల్పఁగదవే తెలు వెద్ది శుభంబు నీకగున్. మను. 2.39.

2. అలంకారము,నగ. 3. నీరు. 4. పరిమళముగల యొకజాతికఱ్ఱ. పుం. విష్కంభాది యోగములలో నొకటి.

**శుభవార్త** సం. వి. ఆ. స్త్రీ. మంచి వర్తమానము.

**శుభశంసి** సం. విశ. (న్. నీ. న్.) రాఁబోవు శుభమును జెప్పెడివాఁడు.

**శుభస్థలి** సం. వి. ఈ. స్త్రీ. 1. యజ్ఞశాల. 2. మంగళప్రదమైన తావు.

**శుభాంగి** సం. వి. ఈ. స్త్రీ. 1. అందగత్తె,చక్కనిస్త్రీ. 2. మన్మథుని భార్య, రతి. 3. కుబేరుని భార్య.

**శుభాంగుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) అందగాఁడు. సుందరుఁడు.

ఉ. ఓర్పొక యింత లేని వికచోత్పల లోచన చిత్తవీథిఁ బల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వేచనుదెంచె నంచు. పారి. 1. 112.

**శుభాచారుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) మంచినడవడి గలవాఁడు, సత్ప్రవర్తన గలవాఁడు.

శుభావహము సం. విణ. (అ. ఆ. అ.) శుభము గలిగించునది, మంచి గలిగించునది.

కం. ... భావవికార విదూర శుభావహ నామప్రకారా హరాహరనాథా. భార. ఉద్యో 2.1.

శుభోదర్కము సం. విణ. (అ ఆ. అ.) సుఖప్రదమైన యంతము గలది, శుభమైన యుత్తర కాలము గలది

శుభ్రకరము సం. వి. అ. పుం. కర్పూరము.

శుభ్రకరుఁడు సం వి. అ. పుం చంద్రుఁడు

శుభ్రము సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రకాశించునది. 2. తెల్లనిది.

వి. అ. పుం. 1. శ్వేతవర్ణము, తెలుపు. 2. మంచి గంధము.

న. 1. వెండి. 2. అభ్రకము. 3. సైంధవ లవణము 4. కాసీసము, అన్నభేది.

శుభ్రాంశువు సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు, కర్పూరము.

శుభ్రి. సం. వి. ఇ. పుం. బ్రహ్మదేవుఁడు.

శురాంగన సం. వి. ఆ. పుం. దేవవేశ్యలలో నొకతె. (వా)

శుల్క-ఖండనము సం. వి. అ. న. ప్రభువున కియ్యవలసిన పన్ను నపహరించుట.

శుల్క-గ్రాహకుఁడు సం. విణ. (అ. ఆ. అ.) పన్ను వసూలు చేయువాఁడు.

శుల్క-గ్రాహి సం వి. న్. పుం. శుల్క-గ్రాహకుఁడు.

శుల్క-దుఁడు సం. వి. అ. పుం. 1. శుల్కమిచ్చెడి వాఁడు, పన్ను చెల్లించు నతఁడు, అరిగాఁపు. 2. ప్రధానము చేయఁబడిన పెండ్లికొడుకు.

శుల్కము సం. వి. అ. పుం. న. 1. సుంకము, పన్ను (సంత పన్ను, దారిపన్ను మొ.) 2. లబ్ధి, ఆదాయము. 3. పెట్టుబడి సొమ్ము. 4. కన్యాశుల్కము.

వ...వినుము గురుకార్యంబున మీ శుల్కార్థంబుగా...భార. ఆది. 4. 224

తే. గీ. వచ్చి కృతి కన్యకా సముద్వాహమునకు, శుల్కముగ నాయురారోగ్య సుప్రసిద్ధు లిత్తునని యల్లుఁ డగుటకు నిచ్చగించె...

నిరంకుశో. 1. 18.

కన్యకకై కన్య తల్లిదండ్రుల కిచ్చిన సొమ్ము. 5. పెండ్లికూఁతున కిచ్చిన యరణము, స్త్రీధనము. 6. లంచ మిచ్చెడి సొమ్ము. 7. పందెపు సొమ్ము. (వాచ.).

శుల్క-శాల సం. వి. ఆ. స్త్రీ. పన్ను వసూలు చేసెడి చోటు, గాటిపాక, ఘట్టకుటి.

శుల్క-స్థానము సం. వి. అ. న. శుల్కశాల.

శుల్బ(ల్వ)ము సం. వి. అ న. 1. తామ్రము, రాగి 2. రజ్జువు, త్రాడు. 3. జల సమీప ప్రదేశము. 4. యజ్ఞము. 5. ఆచారము, పెద్దలేర్పఱిచిన పద్ధతి, చట్టము.

శుల్లము సం. వి. అ. న. 1. రజ్జువు త్రాడు. 2. తామ్రము, రాగి.

శుల్వజము సం వి. అ న ఇత్తడి. ఇట్లే శుల్వాజము, శుల్బిజము.

శుల్వారి సం. వి. ఇ. పుం. గంధకము.

శుశువు సం వి. ఊ. స్త్రీ. తల్లి, మాత.

శుశ్రూష(ణ) సం. వి. ఆ స్త్రీ. 1. వినవిచ్చ, వినవలయు ననెడి కోరిక, 2. సేవ, కొలువు. 3. విధేయత. 4. గౌరవము. 5. చెప్పుట.

శుశ్రూషకుఁడు సం. విణ. (అ ఆ. అ.) సేవించువాఁడు, కొలుచువాఁడు.

వ...నీవు ధర్మ సూక్ష్మతత్త్వదర్శి వేను శుశ్రూషకుండ నన్ననుశాసింపు మనవుడుఁ గపిలుండు ప్రీతుండై యతని కిట్లనియె. భార. శాంతి. 5. 525.

వి అ. పుం సేవకుఁడు, పరిచారకుఁడు.

శుశ్రూషణము సం. వి. అ. న. శుశ్రూష.

శుశ్రూషువు సం. విణ. (ఉ) 1. వినఁగోరువాఁడు, విననిచ్చగించువాఁడు. 2. సేవింపఁగోరువాఁడు, కొలువనిచ్చగించువాఁడు 3. విధేయుఁడు.

శుషము సం. వి. అ పుం. 1. ఎండుట, శోషించుట. 2. బిలము. 3. రంధ్రము, 4. గర్తము. గోయి.

శుషి సం. వి. ఇ. స్త్రీ. శుషము.

ఇ. స్త్రీ. 1. శోషించుట, ఎండుట. 2. బిలము., రంధ్రము.

శుషిర సం. వి. ఆ. స్త్రీ. 1. నది. 2. నళిని యను గంధ ద్రవ్యము.

శుషిరము సం. విశ (అ ఆ. అ) రంధ్రములు గలది, బెజ్జములు గలది.
వి అ. పుం. 1. అగ్ని. 2. ఎలుక.
న. 1. రంధ్రము, బిలము. 2. ఆకాశము. 3. పిల్లంగ్రోవి మొ.గువాద్యము.

శుషిలము సం. వి. అ. పుం గాలి, వాయువు.

శుష్కము సం. విశ (అ ఆ. అ.) 1. ఎండినది.
గీ అగ్నిశుష్కంబు లార్ద్రింబులైనయట్టి యింధనంబుల వడి దహియించు కరణి. శివధర్మ 2. 109.
2. కాల్చినది 3. శుష్కించినది, సన్నగిల్లినది. 4. వాడిపోయినది 5. తెచ్చిపెట్టుకొనినది, నిజము లేనిది 6. శూన్యమైనది, ఏమియు లేనిది. 7. నిరుపయోగమైనది, వ్యర్థమైనది
శుష్క ప్రియములు శూన్య హస్తములు. (సామెత)
8. ఆధారము లేనిది, కారణము లేనిది.
సీ. ఐతిహాసికమౌళి యనిపించు నొకవేళ నొకవేళ శుష్కతార్కికత నెరపు. నిరం. 4. 74.
9. నొప్పించునది, కఠోరమైనది.

శుష్కలము సం. వి. అ. పుం. న. 1. ఎండిన మాంసము. 2. మాంసము.

శుష్కవ్రణము సం. వి. అ. న. 1. మానిన పుండు. 2. కాయ గాచిన పుండు. కిణ రూపమగు వ్రణము.

శుష్కాంగి సం వి ఈ స్త్రీ ఉడుము, గోధిక.

శుష్కాంగుఁడు సం విశ (అ. ఈ. అ) సన్నగిల్లిన యవయవములు గలవాఁడు.

శుష్కార్ద్రిము సం. వి. అ. న సొంటి.

శుష్కించు సం అ క్రి ఇంకు, ఎండు.

శుష్కీభవించు సం అ క్రి. శుష్కించు, ఎండు.
సీ. సొరిది నంభోనిధుల్ శుష్కీభవించిన......
హరిశ్చ. 1. 166

శుష్ణుఁడు సం. వి అ పుం. 1 సూర్యుఁడు. 2. అగ్ని.

శుష్మము సం వి. అ పుం. 1. అగ్ని. 2. అగ్నిజ్వాల. 3. వాయువు 4 పక్షి.
న 1. బలము. 2. తేజస్సు, వెలుఁగు.
న్. పుం. 1. అగ్ని. 2. చిత్రమూలము (వృ వి)
న. 1 బలము. 2. వెలుఁగు, ప్రకాశము

శుష్మ్ముఁడు సం. వి అ. పుం. సూర్యుఁడు

## శూ

శూక సం. వి. ఆ. స్త్రీ కపికచ్ఛువు, దూలగొండి (వృ వి)

శూకతము సం వి అ పుం. 1 ఒక విధమగు ధాన్యము 2 సౌకుమార్యము, మృదుత్వము.

శూకకీట(క)ము సం వి. అ పుం 1. తేలు, వృశ్చికము, వల్లతేలు. 2. (జ్యోతి.) వృశ్చికరాశి (మేషాదిరాశులలో నెనిమిదవది) 3 కందురీఁగ, 4. గొంగళిపురుగు (వై. ని)

శూకధాన్యము సం. వి. అ. న. యవలు మున్నగు ముల్లు గల ధాన్యము

శూకపిండి సం. వి. ఇ పుం. ఈ స్త్రీ కపికచ్ఛువు, దూలగొండి చెట్టు (వృ. వి). ఇట్లే శూకశింబి.

శూకము సం. వి అ. పుం. న. 1. వరి మున్నగువాని ముల్లు. 2 ఏదుపంది ముల్లు 3. అగ్రము, వాఁడిగల కొన. 4. సుకుమారత, మృదుత్వము.
5. ముఱికి నీటఁ బుట్టునట్టి యొక జాతి విషజంతువు. 6. విషజంతువుల ముల్లు. 7. కనికరము, జాలి, దయ (శ ర).

శూకలము సం. వి అ. పుం. మొండి గుఱ్ఱము, మచ్చికకు సాధ్యముకాని చెడ్డగుఱ్ఱము, శిక్షింపఁబడని దుష్టాశ్వము.
వ. అట్లు నిశ్వాసంబు నిగుడ నొడలుపొంగఁ బటుకశా ఘాతంబునం గెరలు శూకలాశ్వంబు చందంబునం గెరలి... భార. శల్య. 2. 85.
సీ. పెనఁగు శూకలముల బిసుసుతనంబులఁ జలమడింపక తీర్పఁజాలుటయును. భార. విరా 1. 95

శూకవంతము సం విశ. (త్ వ. తీ. త్) ముల్లు గలది.

శూకశింబ(బిక) సం. వి. ఆ. స్త్రీ. శూకపిండి.

శూతి సం. వి. ఇ. స్త్రీ. పెరుఁగుట, వృద్ధి యగుట.

శూద్ర సం వి. ఆ స్త్రీ. శూద్రజాతి స్త్రీ.

శూద్రకుఁడు సం. వి. అ. పుం. మృచ్ఛకటిక నా

కము రచించిన యొకానొక రాజు.

**శూద్రప్రియము** నం. వి. అ. పుం. పలాండువు, ఉల్లి.

**శూద్రప్రేష్యుఁడు** నం. వి.అ. పుం శూద్రసేవకుఁడు, శూద్రుని కంటె నగ్రవర్ణము వాఁడై శూద్రుని గొలుచువాఁడు.

**శూద్రార్త** నం. వి. అ స్త్రీ. ప్రేంకణము (వ్యు. వి.)

**శూద్రావేదనము** నం. వి. అ. న. శూద్రజాతి స్త్రీని పెండ్లాడుట.

**శూద్రాహ్నికము** నం. వి అ. న శూద్రుఁడు చేయఁదగిన నిత్య కృత్యములు.

**శూద్రి** నం. వి. ఈ. స్త్రీ. 1 శూద్రునిభార్య. 2. శూద్రజాతి స్త్రీ.

ఉ. శూద్రియ శూద్ర భార్య యగు శూద్రియు వైశ్యయు వైశ్యభార్యలు...విజ్ఞా. కాం. 1. 98.

**శూద్రుఁడు** నం వి అ పుం. నాల్గవ జాతివాఁడు, విరాట్పురుషుని పదముల వలనఁ బుట్టుటచే పాదజుఁ డనఁబడు వాఁడు.

ఆ. ధర్ము డొంద శూద్రయోనియందు మాండవ్యుచే శప్తుఁడై యదేల సంభవించె. భార. ఆది. 4.260

కం. ...వింటే, శూద్రుని వచనంబు సద్ద్విజుని దీవన ... భోజరా. 4. 65.

**శూన** నం. వి. అ. స్త్రీ. 1. అంగుడి. కొండ నాలుక. 2. జంతువులను వధించు చావడి. 3. సూన, వధస్థానము. (పంచసూనము, 1. చుల్లి ప్రొయ్యి. 2. పేషణి, సన్నెకల్లు. 3. ఉపస్కరము, చీపురు. 4. కండని, రోలు. 5. ఉదకుంభము, నీళ్ళ కడవ అనునవి.

**శూనము** నం. విశే. (అ. ఆ. అ) 1. వాఁచినది, ఉబ్బినది. 2. పెరిఁగినది, వృద్ధిపొందినది.

**శూనారము** నం. వి. అ. పుం. 1. కుక్కపాలు పాముగ్రుడ్డు.

**శూన్య** నం. వి. ఆ. స్త్రీ. 1. బోలువెదురు. 2.వంధ్య, గొడ్రాలు. 3. నాగజాళి, బొమ్మజెముఁడు. 4. మల్లెతీఁగ.

**శూన్యపదవి** నం. వి. ఈ. స్త్రీ. జీవాత్మమార్గము.

**శూల్యమధ్యము** నం. వి. అ. పుం. కిక్కస (వ్యు. వి.).

**శూన్యమనస్కుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) మనస్సు లేనివాఁడు, పరధ్యానముగా నుండు మనస్సు గలవాఁడు ఇట్లే శూన్యహృదయుఁడు ను.

**శూన్యము** నం. విశే. (అ. ఆ అ.) 1.వట్టిది, రిక్తము, ఏమియు లేనిది 2 పరధ్యానముగా నున్నది. 3. ఉనికిలేనిది, లేనిది సత్తారహితము 4. పాడుపడినది, నిర్జనము.

ఆ. శూన్యవిపినమున విదై న్యస్వతంత్రసంచారియై వసించుఁ గౌరవేంద్ర. భార. ఆశ్రమ. 2 57.

5. వివాదగ్రస్తమైనది. 6. రహితము.

గీ. హిమ ధరాధర కన్యకాధీశ చరణసురుచిర ధ్యానసుజ్ఞానశూన్యుడై న బ్రాహ్మణునిజన్మ మరయ నిష్ఫలము సూవె. శివధర్మ. 3. 44.

7. ఉపేక్ష చేయుబడి. 8 నిష్కపటమైనది, అమాయకము 9. నిరర్థకము, అర్థము లేనిది. 10 అసంపూర్ణము, ఊనము 11 దిగంబరము, దిసమొలయైనది.

వి. అ న. 1. శూన్యప్రదేశము, ఏమియు లేని చోటు. 2. ఆకాశము, అవకాశము. 3. సున్న, బిందువు. 4. అభావము, లేకపోవుట, సత్తారాహిత్యము.

**శూన్యముఖుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) 1. వెలవెలఁబోయిన ముఖముగలవాఁడు 2. తిలకము లేని (వట్టి) మొగము వాఁడు. ఇట్లే శూన్య వదనుఁడు.

**శూన్యవాదము** నం. వి అ పుం. శూన్యమే సర్వకారణమనెడి సిద్ధాంతము, బౌద్ధమతసిద్ధాంత విశేషము (దేనికిని అస్తిత్వము లేదని యిందలి సారము).

**శూన్యవాది** నం. వి. న్. పుం. 1. నాస్తికుఁడు 2. శూన్యమే సర్వకారణ మను బౌద్ధుఁడు.

**శూరంమన్యుఁడు** నం. వి. అ పుం. తన్ను శూరునిగా నెంచుకొనెడివాఁడు.

**శూరమాని** నం. వి. న్. పుం. తన్ను శూరునిగా తలంచువాఁడు.

**శూరము** నం. వి. అ. పుం. 1. సింహము. 2. అడవి పంది. 3. సాలవృక్షము. 4. జిల్లేడుచెట్టు 5. చిత్రమూలము. (వ్యు. వి.) 6. గజనిమ్మ (వ్యు. వి.).

శూరసేనము నం. వి. అ. పుం. మధురా పురప్రాంత దేశము.

శూరసేనుఁడు నం. వి. అ. పుం. 1. శూరసేనదేశ నివాసి. 2. శూరసేన దేశాధిపతి.

శూరుఁడు నం. విశ. (అ. ఆ. అ.) ధైర్యముగల వాఁడు, బలము గలవాఁడు, పరాక్రమము గల వాఁడు.

చం. ఇటు దగునయ్య శూరులకు నెల్లను బోకడ యిట్ల కాదె...... భార. ద్రోణ. 2. 267.

వి. అ. పుం. 1. వీరుఁడు, యోద్ధ, పరాక్రమి. 2. సూర్యుఁడు. 3. కృష్ణుని తాతయగు నొకయాదవుఁడు.

శూర్పకర్ణము నం. వి. పుం. ఏనుఁగు (చేటలవంటి చెవులు గలది)

శూర్పకర్ణుఁడు నం. వి. అ. పుం. గణపతి, విఘ్నేశ్వరుఁడు.

శూర్పణఖ నం. వి ఆ. స్త్రీ. చేటలవంటి గోళ్లుగలది, రావణాసురుని చెల్లెలగు నొకరాక్షసి.

శూర్పము నం. వి. అ. పుం. న. చేట.

పుం. రెండు ద్రోణముల పరిమాణము

శూర్పవాతము నం. వి. అ. పుం. చేటతోఁ జెరుగుట వలనఁగలిగిన గాలి, చేటగాలి.

తే. గీ. పామరదిదృక్షు....శూర్పవాతఘటనలఁ బాఱు పెనుపొల్లకట్టువోలె. ఆము. 4. 13.

శూర్పశ్రుతి నం. వి. ఇ. పుం.—శూర్పకర్ణము.

శూర్పి నం. వి. ఈ. స్త్రీ. 1. చిన్నచేట. 2. శూర్పణఖ. 3. పిల్లలయాటవస్తువు.

శూ(సూ)ర్మము నం. వి. అ. పుం. 1. ఇనుపవిగ్రహము ఇనుముతోఁ జేసినప్రతిమ. 2. పట్టెడ, కమసాలి దాగలి.

శూ(సూ)ర్మి నం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. — శూర్మము రూపాం.

శూర్మిక నం. వి. ఆ. స్త్రీ.

శూల నం. వి. ఆ. స్త్రీ. 1. కొఱత వేసెడి కొయ్య, కొఱ్ఱు. 2. వేశ్య.

శూలకము నం. వి. అ. పుం. మొండిగుఱ్ఱము, మచ్చిక చేయరాని గుఱ్ఱము, దుష్టాశ్వము.

శూలగ్రంధి నం. వి. ఇ. స్త్రీ. దూర్వావిశేషము, ఒకజాతి గఱిక (వృ. వి.).

శూలఘ్నము నం. విశ. (అ. ఈ అ) శూలరోగము పోఁగొట్టునది వి. అ పుం ఒక జాతి వృక్షము.

శూలద్వి(ట్టు)షము నం. వి. ష్. పుం హింగువు, ఇంగువ.

శూలధన్వుఁడు నం. వి న్. పుం శివుఁడు.

శూలధరుఁడు నం వి. అ. పుం. శివుఁడు.

శూలధారి నం వి న్. పుం. శివుఁడు.

శూలనాశనము నం. వి. అ. న. సౌవర్చలవణము (వాచ).

శూలపాణి నం. వి. ఇ. పుం. శివుఁడు.

శూలము అ. పుం. న. 1. ఈఁటె.

కం. శూలమున నురము వ్రచ్చినఁ,గూలె గతాసుఁడయి దైత్యకుంజరుఁ డంతన్. మార్కం. 6. 217.

2. శివుని త్రిశూలము. 3. మాంసము కాల్చెడి యినుపకాడ. 4.అపరాధులఁగొఱత వేసెడికొయ్య. 5. ఓర్వరాని బాధ, కడుపునొప్పి. కీళ్ళనొప్పి, వాతరోగము. 8. చావు, మృత్యువు 9. టెక్కెము, జెండా. 10. అమ్ముట. 11. అమ్మఁదగిన వస్తువు.

సీ. .... గుట్టుసూలయనఁ గన్పట్టు శూల అం. భా. 2. 128

పుం. (జ్యోతి. విష్కంభాది యోగములలో నొకటి

శూలశత్రువు నం వి అ. పుం. ఆముదపుఁ జెట్టు.

శూలాకృతము నం. వి. అ. న. శూలమున గాల్చిన మాఁసము.

శూలి నం విశ (న్. నీ న్.) 1. శూల మాయుధముగా గలవాఁడు 2. శూలరోగి.

వి. న్. పుం. 1. ఈటెవాఁడు. 2. కుందేలు. 3. శివుఁడు.

శూలికము నం. విశ. (అ. ఆ. అ) 1. బల్లెము గలది. 2. శూలమునఁ గాల్చబడినది.

వి అ పుం. కుందేలు. న శూలమునఁ గాల్చిన మాంసము.

శూల్యము నం విశ. (అ. ఆ అ.) 1. ఇనుప కాడతో

గాల్పఁబడినది 2. కొలత వేయఁదగినది.
వి. అ. న. శూలముతోఁ గాల్చిన మాంసము.

## శృ

**శృంఖల** నం. వి. ఆ. స్త్రీ. 1. సంకెల, ఇనుపగొలుసు. ఉ. కాలిన లోహశృంఖలలఁ గల్మషకర్ములఁ బట్టి గట్టిగాఁ గీలు బిగించి కట్టి. శివధ. 4. 68 2. గొలుసు 3. ఏనుఁగు కాలిగొలుసు. 4. మొల నూలు. స్త్రీల వడికట్టు 5. కొలత గొలుసు. 6 వరుస, పరంపర.

**శృంఖలకము** నం. వి. అ. పుం 1. గొలుసు. 2. ఒంటె. ఉష్ట్రము పారిపోకుండఁగా గాలికిఁగొయ్యగొలుసు కట్టిన యొంటె

**శృంఖలయమకము.** నం వి. అ. న. యమకాలంకార భేదము, ఒకానొక శబ్దాలంకారము.

**శృంఖలి** నం. వి ఈ స్త్రీ 1. పురుషుల వడికట్టు. వృక్షవిశేషము.

**శృంఖలితము** నం. విశ. (అ. ఆ. అ.) (శృంఖలము గలదిగాఁ జేయబడినది) గొలుసు కట్టబడినది, సంకెల వేయఁబడినది.

**శృంగకము** నం. వి. అ. న. 1. కొమ్ము. 2. బాల చంద్రుని కొన. 3. కొనగల వస్తువు
శా. పూవుందూపుల జోదు పుచ్చుకొనియెన్ భూపాల లీలావతీ భ్రూవల్లీ నిభశృంగకం బగు లసత్పుష్పేక్షుకోదండమున్ భీమ 2 37.
4. చిమ్మనగొట్టము.

**శృంగజము** నం. విశ. (అ. ఆ. అ) కొమ్ముతోఁ జేయఁబడినది
వి. అ పుం బాణము న. గంధద్రవ్య విశేషము. అగరుచందనము (వాచ).

**శృంగనాదము** నం వి. అ. పుం పొడుసుప్పి కొమ్ము తోఁ జేయబడిన యోగుల సుషిర వాద్యవిశేషము. (శ. ర.), సింగినాదము
తే. గీ భూరిమధుపానమునఁ జొక్కి పుష్పరేణు, పటలి భూతిగఁ దాల్చి నేప్రేరితవమున, ఘుంకృతులు శృంగనాదంబు జాడగాఁగఁ, దుమ్మెదల పిండుమించె సిద్ధుల విధమున. చిత్రభా. 2. 107.

**శృంగజాహము** నం. వి. అ. పుం. శృంగమూలము, కొమ్ముకుదురు.

**శృంగప్రహారి** నం. విశ. న్. జీ. న్. కొమ్ములతోఁ బొడుచునది.

**శృంగబేరము** నం. వి అ న. (చూ) శృంగవేరము.
గీ. రాజనంతోడ శృంగబేరములతోడఁ, జిలుగడఁవుఁజెండలముతోడ జేమతోడ, నొప్పు నాలుగు పొలములం దుపవనములు, భువన సారము పీఠికాపురవరమున భీమ, 2. 56.

**శృంగము** నం వి అ. న 1. కొమ్ము విషాణము
సీ......శృగ చతుష్టయాంచిత మస్తకద్వయం బున రత్నకోటీరములు వెలుంగ....
చిత్రభా. 4. 68.
2. పర్వతాగ్రము. కొండకొన.
ఉ. శృంగము లేని నీలగిరి చెల్వున గ్రీడి కిరీట హీనుఁడ, య్యుం గనుపట్టె...భార. కర్ణ. 3. 27.
3 ఇంటిపై కప్పు
గీ. తుగసౌధ శృంగ సంగతాంబర మోచు....
సింహా. భా, 1. ఆ. 2. 113.
4. ఎత్తు, ఔన్నత్యము. 5. ప్రభుత్వము. 6 ప్రాధాన్యము, గొప్పఁదనము 7, చంద్రుని మొన, నెలవంక కొమ్ము. 8. కొన. అగ్రము. 9 (ఊదుట కుప యోగపడెడి) కొమ్ము, కొమ్ముబూరా, 10. చిమ్మనగొట్టము. 11. కామోద్రేకము. 12. గుఱుతు 13. పద్మము. 14. నీటియూట. 15 కోఱ, దంష్ట్ర.
ఆ. ఒక్క శృంగమునన యుర్వియెత్తితి వరహావతారంబిల యతిశయిల్ల భా. శాంతి 6 437.
పుం. జీవక మనుగంధద్రవ్యవిశేషము (శ. ర.).

**శృంగమోహి** నం. వి. న్. పుం. చంపకము, సంపెంగ చెట్టు

**శృంగవంతము** నం. విశ. త్. వతీ త్. కొనగలది. అగ్రముగలది
పుం. 1. కొండ. 2. కురువీంమునకు హద్దుగానుండెడి యొక పర్వతము.

**శృంగవేరము** నం. వి. అ. న. 1. మీర్లాపుగముునకు

సమీపమున గంగాతీరమున నుండెడి యొక పట్టణము. 2. ఆర్ద్రకము, అల్లము.

శృంగాటకము సం. వి. అ. పుం. 1. మూఁడు కొనలు గల కొండ, మూఁడు శిఖరములు గల పర్వతము, న 1. నాలుగు బాటలు కలసిన చోటు నాలుగు వీథులమొగ.

వ. లోకలోచనోత్సవంబుగా శృంగాటక ప్రదేశంబుల యౌవన విలాస సుందరులగు రాజనందులు ....రాధామా. 4. 73

2 భక్ష్యవిశేషము. 3. ద్వారము.

శృంగాటము సం. వి. అ. పుం. 1 ఒకానొకపర్వతము. 2. వృక్షవిశేషము న. చతుష్పథము, నాలుగు వీథుల మొగ.

శృంగారకము సం. వి. అ. పుం. కామము, వలపు న. సిందూరము. విశ. కొమ్ములుగలది.

శృంగారచేష్ట సం. వి. ఆ. స్త్రీ. కాముకచర్య. శృంగారాభినయము.

శృంగారభూషణము సం. వి. అ. న. సిందూరము.

శృంగారము సం. వి. అ. పుం. 1. కావ్యము లందలి నవరసములలో మొదటిది. శృంగార రసము (ఇది సంభోగశృంగారము, విప్రలంభ శృంగార మని రెండువిధములు గలది).

2. కామము, వలపు. 3-శృంగారవేషము సొగసైన వేషము. 4. రతి, సురతము.

వ. ఇవ్విధంబున మృగయోచిత శృంగారంబు నంగీకరించి...చిత్రభా. 3. 127.

5. ఏనుఁగుశరీరముపై సిందూరముతోఁ జేయునలంకారము. 6. అలంకరము.7. చిహ్నము. గుఱుతు. న. 1. లవంగము. 2. సిందూరము. 3. అల్లము. 4. గందవొడి. 5. కాలాగరువు.

శృంగారయోని సం. వి. ఇ. పుం. మన్మథుఁడు.

శృంగారవేశ(ష)ము సం వి. అ పుం. సింగారించుకొనుట, అలంకరించుకొనుట. 2. శృంగారవిలాసమునకుఁ దగినవేషము.

శృంగారి సం. విశ. (న్. బీ. న్.)1. కాముకుఁడు, వలపుగలవాఁడు. విటుఁడు. 2 మంచివేషముగలవాఁడు. 3 శృంగార సంబంధమైనది. 4. సిందూరముతో రంగువేయబడినది.

వి న్ పుం కామోద్రేకము గల నాయకుఁడు. 2. మాణిక్యము, కెంపు. 3. ఏనుఁగు. 4. అలంకారము. సింగారము. 5. పోఁకచెట్టు. 6. తాంబూలము.

శృంగారించు సం. స. క్రి. అలంకరించు.

శా .....మణివిభూషారాశి వంరంబుగా శృంగారించిరి సంభ్రమంబున సుకేశిన్ మిత్రకేశిన్ సఖుల్. వరాహ. 4. 46.

ద్వి. పురము శృంగారింపఁ బురవీథులందు కస్తూరి నలికించి కమ్మపూవిరులు. ద్వి. భా. విరా. 1. 24 పు.

శృంగి సం. వి. ఇ. పుం. నగలకుపయోగించు బంగారము, స్త్రీ. ఒక జాతి యాఁడుచేప

ఈ. స్త్రీ. 1. నగల కుపయోగించు బంగారము. 2. మందున కుపయోగించు వేరు. 3. ఒకదినుసు విషము. 4. ఒకజాతి యాఁడు చేప.

శృంగి సం. విశ. (న్. బీ. న్.) 1. కొమ్ముగలది. 2. శిఖరము గలది.

వి. న్. పుం. 1. పర్వతము. 2. ఏనుఁగు. 3. చెట్టు 4. మేషము, గొఱ్ఱె. 5. శివుఁడు. 6. శివునిపరిచారకులలో నొకఁడు. 7. ఒకజాతి వృక్షము. 8. ఒకానొక ముని.

శృంగికము సం. వి. అ. న. ఒక దినుసు విషము.

శృంగిణము సం. వి. అ. పుం. మేషము, గొఱ్ఱె.

శృంగిణి సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు. 2. ఒక జాతి మల్లె (వృ. వి.). 3. మానేరు తీఁగ.

శృంగికనకము సం. వి. అ. న. నగలకై యుపయోగపడెడి బంగారము.

శృంగోచ్ఛ్రయము సం. వి. అ. పుం. ఎత్తైనకొండపై భాగము, పర్వతాగ్రము.

శృణి సం. వి. ఇ. స్త్రీ. సృణి, అంకుశము.

శృతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. వండఁబడినది. 2. కాఁచఁబడినది. (నీరు మొ.)

శృదరము సం. వి. అ. పుం. పాము.

శృద్ధము సం. విశ. (అ. ఆ. అ.) 1. శరీరమునుండి విడువఁబడినది (గాలి మొ.) (అపానవాయువు).

2. తడుపఁబడినది.

**శృథువు** సం. వి. ఉ. పుం. 1. బుద్ధి. 2. అపాన వాయువు. 3. గుదము, గుదస్థానము.

## శే

**శేకువు** సం. వి. ఉ. పుం. ఒక రకమైన గడ్డి.

**శేఖరము** సం. వి. అ. పుం. 1. తలపై ధరించు పూలదండ.

చం. ధరణి సురాత్మజుఁడు గుణధన్యుఁడు వీఁడని పెద్ద లెన్న నా, దరణముతో నుతింప నముదంచిత కీర్తిసమృద్ధి నంత శే, ఖర మగు పెల్ల వంశఘనకల్మ షవృత్తికిఁ దెచ్చెఁబూడు మా, పురుషుల భాగ్యమున్ జిగురుఁబోణుల చిత్తము నెట్లమాటునో. నిరంకుశో. 2. 15.

2. కిరీటము. 3. కొండకొన, పర్వతాగ్రము. 4. (సమాసాంతమున) స్వజాతిశ్రేష్ఠవస్తువు.

కం. నీ వడిగిన ప్రశ్నంబులు...శైవాగమ శేఖరములు శంభుప్రియముల్. శివధర్మోత్తరము. 1. 138.

5. ఒక జాతి ధ్రువగీతి, సంగీతమునఁ బల్లవి.

న. లవంగము.

**శేఖరించు** సం అ. క్రి. అగ్రగణ్యత వహించు.

వ. కమలరేఖల నంగంబులలోన సకలజననంపే వ్యతన్ ప్రాభవంబుఁ జెందిన శరణి భద్రచామర రేఖల కామితార్థప్రదానంబు సేయ శేఖరించుకొన్న తీరున— పార్వ. 4. 130. నా. పంచ. 1. 222.

**శేఖరితము** సం. విశే. (అ. అ. అ.) శేఖరముగాఁ జేసికొనఁబడినది.

సీ....మృగ పాదఘట్టన మృదులమౌ జేగురుధూళి శేఖరితసిందూర మనఁగ. సింహా. భా. 1. ఆ. 2.76.

శేఖరము గలదిగాఁ జేయఁబడినది.

**శేపము** సం వి. అ. పుం. 1. మేఢ్రము, మగగుఱి. 2. వృషణము, అండకోశము. 3. తోఁక

**శేపస్సు(ము)** సం. వి. స్. న. శేఫము, మగగుఱి.

**శేఫము** సం. వి. అ. న. శేపము.

**శేఫస్సు(ము)** సం. వి. స్. న. శేపము.

**శేఫాలి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. నల్లవావిలి. (వృ. వి.)

**శేఫాలిక** సం. వి. అ. స్త్రీ. శేఫాలి.

**శేముషి** సం. వి. ఈ. స్త్రీ. బుద్ధి, ప్రజ్ఞ.

**శేలువు** సం. వి. ఉ. పుం. శ్లేష్మాతకము, విరిగి. (వృ. వి.) (శ. ర).

**శే(సే)వధి** సం. వి. ఇ. పుం. 1. మహాకోశ గృహము, గొప్ప బొక్కసము, నిధి.

సీ. దేవకీవసుదేవ శేవధివందమం, దిరరసాలా వాసవరభృతంబు.... పాండు. 3. 177.

2. మహాపద్మము మొదలగు కుబేరుని నిధులలో నొకటి.

**శేవము** సం. వి. అ. పుం. 1. మేఢ్రము, మగగుఱి. 2. పాము. 3. ఎత్తు, ఔన్నత్యము. 4. సుఖము, 5. సంపద, ఐశ్వర్యము

న. 1. మేఢ్రము. 2. సుఖము.

**శేవలము** సం. వి. అ. న. 1. నీటిపై బయలుదేఱు నాఁచువంటిపాఁచి. 2. ఒకజాతియోషధి.

**శేవలిని** సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

**శేవాలము** సం. వి. అ. న. శేవలము.

**శేష** సం. వి. ఆ. స్త్రీ. 1. దేవాలయమునఁ బవిత్ర పదార్థముగా భక్తులకీయఁబడెడి దేవతాప్రసాదము, అనుగ్రహించి యిచ్చిన పువ్వులు, అక్షతలు మొ.

సీ. పసిఁడి గిన్నియలు చేపట్టి పుణ్యస్త్రీలు శిరమున మౌక్తికశేష లిడఁగ. సింహా. భా. 1. ఆ. 2. 80.

"తథేతి శేషా మివ భర్తు రాజ్ఞామ్" సం. కు. స. 3. 22.

"ప్రసాదాన్నిజనిర్మాల్యదానే శేషేతి కీర్తితా" విశ్వః.

"మాల్యాక్షతాది దానే స్త్రీ శేషా——" (వైజయంతీ కేశవా)

2. ఉత్కర్షము. విశేషము, ఆధిక్యము.

ఆ. తన్నుఁ గన్న యా విధాతకంటెను దాన శేష గాంచె నఖిల సృష్టిలోన. కు. సం. 1, 74.

"విశేషము" అను పదమున "ము" వర్ణకము

లోపించిన శేషశబ్దము అని కు. సం. వ్యాఖ్య. ఇది యపూర్వ ప్రయోగము.

**శేషకాలము** నం. వి. అ. పుం. 1. మిగిలిన కాలము. 2, మరణకాలము.

**శేషజాతి** నం. వి. ఇ. స్త్రీ. మొదటి పాదహారము కాఁగా మిగిలిన భిన్నమును పూర్వాంశమున యోగము చేయుట.

**శేషభోజనము** నం. వి. అ. న. ఉచ్ఛిష్టము భుజించుట. మిగిలిన యన్నము తినుట.

**శేషము** నం విశ. (అ. ఆ అ.) 1. శేషించినది, మిగిలినది వి. అ. పుం. న. 1, మిగులు,

కం. అతిథు లభ్యాగతులకుఁ బితరులకును వేల్పులకును బెట్టిన శేషం బతిశుద్ధమట్టియన్నము సతతముఁ గుడుచుట గృహస్థసద్ధర్మ మిలన్. విజ్ఞా. కా, 1. 70

(క) మిగిలిన పదార్థము, (ఋణ శేషము మొ.)
(గ) మిగిలిన యంశము. (వాక్య విశేషము మొ.)
(చ) వ్యయము కాఁగా మిగిలిన పదార్థము. 2. అధ్యాహారము, తెచ్చి పెట్టుకొనవలసిన పదము, 3. విడుదల, రప్పించుకొనుట.

పుం. 1. పర్యవసానము, ఫలితము 2. సమాప్తి, ముగింపు. 3. చావు, అంతము. 4, ఏనుఁగు.

న. 1. అన్నశేషము, తినఁగా మిగిలిన యన్నము. ఉచ్ఛిష్టము. 2. నిర్మాల్యము, ధరించి తీసివేసిన పూలమాల.

**శేషరాత్రి** నం. వి. ఇ. స్త్రీ. అపరరాత్రి, కడపటి జాము.

**శేషశయనుఁడు** నం వి. అ. పుం. విష్ణువు.

**శేషశాయి** నం. వి. న్. పుం. విష్ణువు.

**శేషాక్షతలు** (శేష+అక్షతలు) నం వి అ పుం బ. ప్రసన్నతతో నొసఁగు నక్షతలు, నేసఁబ్రాలు.

సీ. సిద్ధాంగనలు చల్లు శేషాక్షతల తోన మెలుపారు కమ్మఁదెమ్మెరలు వీచె—— కు సం. 2. 871.

మ—— ——సురపుష్పవృష్టి గురియన్ శేషాక్షతౌఘంబులో. కు. సం. 11. 178.

**శేషావస్థ** నం. వి. ఆ. స్త్రీ. ముదిమి, వార్ధకము.

**శేషాహి** నం. వి. ఇ. పుం ఆదిశేషుఁడు

సీ. శ్రీసూర్యమునయందు శేషాహిపర్యంకు కంఠంబు క్రొత్త చెంగల్వ దండ. భీమ. 2-81

**శేషి** నం. వి. న్. పుం. సర్వజగద్రక్షకుఁడయిన నారాయణమూర్తి.

**శేషించే** నం. అ. క్రి. మిగులు.

గీ. సాయకంబులు మూఁటి ముజ్జగము గెలువఁ జాలుపెట్టి శేషించిన జాఱయుగళి మదనుఁడే తద్గ్రిగంభోజ పదమునందు, గౌరవం బొప్పఁ బట్టంబు గట్టఁబోలు. శృం. నై. 3. 16-2.

వ. ఇంతయు ముసంహృతంబై నందు విశేషించియుండునది యెయ్యది—— మార్క 4. 6.

**శేషుఁడు** నం. వి. అ. పుం. 1. వేయి పడగలు గల సర్పరాజే. 2. బలరాముఁడు. 3. లక్ష్మణుఁడు.

## శై

**శైక్యము** నం. విశ. (అ. ఈ. అ.) శిక్యమున దీసికొనిపోఁబడినది. కావడి మట్టునగొనిపోఁబడినది.

**శైక్షికుఁడు** నం. వి. అ. పుం. శిక్షయందుఁ (వేదాంగమునందు) ప్రవీణుఁడు

**శైక్షుఁడు** నం. వి. అ. పుం శిక్షాధ్యయనము చేయు విద్యార్థి. శిక్ష చదువు విద్యార్థి 2. శిక్ష యందుఁ బ్రవీణుఁడైన వాఁడు 3. ఆరంభకుఁడు.

**శైఖరికము** నం. వి. అ. పుం. అపామార్గము, ఉత్తరేను చెట్టు ఇట్లే శైఖరేయము

**శైఖ్యము** నం. విశ. (అ. ఆ. అ) శిఖగలది, శిఖరము గలది.

**శైఘ్ర్యము** నం. వి. అ. న. వడి, వేగము. త్వర.

**శైత్యము** నం. వి. అ. న. వడి, చేలి, చల్లదనము.

గీ. తమ తమకు నొద్దికైన సాధనము లొసఁగి సారెఁజేసిరి శైత్యోపచార విధులు. రాధికా. 3. 78

**శైథిల్యము** నం. వి. అ. న. 1. బిగువులేమి. శాసన నిర్బంధములేమి. 2. మాంద్యము. మెల్లన 4. దౌర్బల్యము, పిఱికితనము.

**శైనేయుఁడు** నం. వి. అ. పుం. సాత్యకి, శ్రీకృష్ణుని

పినతండ్రి కొడుకు.

శైన్యుఁడు సం వి. అ. పుం. శైన్యులు. బ. శినివంశస్థులు.

శై (వ్య)బ్యము. సం వి అ. పుం 1. కృష్ణుని నాలుగు గుఱ్ఱములలో నొకదాని పేరు. గుఱ్ఱము.

శై (వ్య)బ్యుఁడు సం. వి. అ. పుం. కురుపాండవ యుద్ధమునఁ బాండవ పక్షమున యుద్ధము చేసిన యొకానొక రాజు.

శైలకము సం. వి. అ. న. శైలేయమను గంధ ద్రవ్యము.

శైలగంధము సం వి. అ. పుం. ఒక విధమగు చందనము.

శైలజ సం. వి. ఆ. స్త్రీ. 1. హైమవతి. పార్వతి. 2.గజ పిప్పలి. (వృ. వి.)

శైలజము సం.వి.అ న. శైలేయ మను గంధద్రవ్యము

శైలతనయ సం వి ఆ. స్త్రీ. పార్వతి.

శైలధన్వుఁడు సం. వి. న్. పుం. ఈశ్వరుఁడు.

శైలధరుఁడు సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు.

శైలపతి సం. వి. ఇ. పుం. హిమాలయము.

శైలపత్రము సం. వి. అ. పుం. బిల్వము, మారేడు చెట్టు.

శైలబీ(వీ)జము సం. వి, అ. న. నల్ల జీడిచెట్టు.

శైలభిత్తి సం. వి. ఇ. స్త్రీ. రాలు చెక్కెడి యులి, టంకము.

శైలము సం. విఅ. (అ. ఆ. అ.) శిలామయము. వి. అ. పుం. 1. పర్వతము, నీటికడ్డముగా వేయు కట్ట. 3. పాషాణము. పెద్దఱాయి. న. 1. వెలిగారము. 2. శిలాజతువు. శైలేయ మను గంధ ద్రవ్యము, ఒక దినుసు కాటుక.

శైలరాజము సం. వి. అ పుం. హిమాలయము.

శైలశిఖరము సం. వి అ, న. సముద్రము,

శైలసారము సం. విఅ. (అ. ఆ అ.) పర్వతము వలెఁ గదలనిది, పాషాణము వలె గట్టిది.

శైలసుత సం, వి. ఆ. స్త్రీ. పార్వతి.

శైలాటము సం. వి అ పుం. 1. సింహము 2. స్ఫటికము. 3. తెల్లనిగాజు. శ్వేతవర్ణకాచము.

శైలాటుఁడు సం వి. అ. పుం కొండవాఁడు, కిరాతుఁడు, బోయ 2. దేవలుఁడు. పూజారి.

శైలాది సం. వి. ఇ. పుం. నందికేశ్వరుఁడు, శివుని ముఖ్యపరిచారకుఁడు.

శైలాలి సం. వి. న్. పుం. నటుఁడు, వర్తకుఁడు

శైలి సం. వి. ఈ. స్త్రీ. 1. వ్యాకరణసూత్రముల సంక్షిప్తవివరణము. 2. అర్థముచెప్పెడి పద్ధతి, మొదటసామాన్యముగా నర్థముచెప్పి పిమ్మట దానిని విస్తరించి వివరించుట 3. నడవడి, ప్రవర్తనము. 4. రచనారీతి.

శైలికుఁడు సం. వి. అ. పుం. కొండవాఁడు, బోయ, కిరాతుఁడు.

శైలిక్యుఁడు సం. వి. అ. పుం. ధూర్తుఁడు, మోసగాఁడు.

శైలూషము సం. వి. అ. పుం. బిల్వము, మారేడు (వృ. వి.)

శైలూషి(కి) సం. వి. ఈ. స్త్రీ. 1. నర్తకి,నటి.

ఆ...పతుల విధము కాక యేశైలూషిఁగా ననంగ రాదు కంకభట్ట. భార. విరా. 2. 152.

శైలూషుఁడు సం. వి. అ. పుం. 1. నర్తకుఁడు, నటుఁడు, ఆటగాఁడు.

వ. ... మత్పతి శైలూషుండ కాడు కితవుండునుం గావున. భార. విరా. 2. 158.

2.గాయకుఁడు. సంగీతపు మేళమునకు నాయకుఁడు, 3. తాలధారకుఁడు. సంగీతపుమేళమునఁ దాళము వేయువాఁడు. 4. ధూర్తుఁడు, మోసగాఁడు. ఇట్లే శైలూషికుఁడు.

శైలేంద్రస్థము సం. వి. అ. పుం. భుజపత్త్రివృక్షము

శైలేయము సం. విఅ. (అ. ఈ. అ.) 1. పర్వతమందున్నది, శైలభవము. 2. జాతినుండి పుట్టినది. 3. పర్వతమువలె నున్నది, శిలామయము.

.......పలే శైలేయస్తని యేలే జాలేందునిటల యేలాఁతినఁటే. విజయ. 2. 193.

వి. అ. పుం. 1. సింహము. 2. తేఁటి, భ్రమరము, న. 1, శిలాజిత్తు, 2, పరిమళముగల ధూపద్రవ్యము, 3. జాతియుప్పు, సైంధవలవణము,

శైలేయి సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

శైల్యము సం విశ (అ ఆ అ.) శైలి. స్త్రీ. రూ. శిలామయము, ఱాతిది. వి. అ. న. కాఠిన్యము, గట్టితనము.

శైవము సం విశ. (అ. ఈ. అ) శివసంబంధమైనది. వి అ. పుం 1. శైవమతము (శివుఁడే పరమాత్మ యనెడి మతము.) 2. ఉమ్మెత్తచెట్టు (వృ. వి.). న. శివప్రభావము తెలుపు పురాణము. పదునెనిమిది పురాణములలో నొకటి.

శైవ(వా)లము సం. వి. అ. పుం. 1. నీటిపాఁచి, నాఁచు.

చం. కమరె నశేషశోకనదకైరవపంక్తులు శైవ లంబులున్. భార. ఆది. 8. 266.

వ శైవాలవల్లికిం దల్లియై చెలువారునూగారును. పాండు. 3. 179

న. పద్మకాష్ఠము, సువాసనగల యొకజాతి చెట్టు.

శైవ(వా)లిని సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

శైవుఁడు సం. వి. అ. పుం. 1. శివభక్తుఁడు, శైవ మతస్థుఁడు.

శైశవము సం. వి. అ. న. 1.శిశుత్వము, పసితనము.

తే. గీ....ఎవ్వఁడొకో వియద్గంగ మీఁది, వాంఛ పుట్టించె శైశవావస్థయందు. భోజరా 6. 324.

2. బాల్యము, పదునాఱు సంవత్సరములలోపు వయసు.

శైశిరము సం విశ. (అ. ఈ. అ.) శిశిరఋతు సంబంధి, శీతకాలము సంబంధమైనది.

వి అ పుం నల్లని చాతకపక్షి.

శైష్యోపాధ్యాయిక సం వి. అ. స్త్రీ. శిష్యోపాధ్యా యుల తనము, విద్యచెప్పుట, చదివించుట.

## శో

శోకచర్చ సం. వి. అ. స్త్రీ. శోకమున మునుఁగుట, శోకాధీరుఁ డగుట.

శోకనాశము సం. వి. అ. పుం. 1. అశోకవృక్షము. 2. దుఃఖనాశము.

శోకము సం. వి. అ. పుం. చింత, దుఃఖము, వగపు, బాధ, గొప్పదుఃఖము.

ద్వి. తమతమవారలు తమబంధుజనులు, కమలుట జూచి శోకము నొందువారు. రం. రా. సుం.

తే. గీ. పుత్రశోకాపహంబును బుణ్యతమము, నైవయాఖ్యానము...భార. ద్రోణ. 2. 217.

శోకలా(సుఁ)కుఁడు సం. విశ. (అ. ఆ. అ.) దుఃఖమునకు లోఁబడినవాఁడు.

శోకవరాళి మి. వి. ముప్పదిరెండు నపుంసకరాగము లలో నొకటి.,

సీ. కాంభోజికేదారగౌళశోకవరాళిపున్నాగగుమ్మ కాంభోజి...హంస. 5. 124.

గీ ...శంకరాభరణమును శోకవరాళి మేఘరంజి. ప్రబంధ. ౫౭.

శోకవికలుఁడు సం. విశ. (అ. ఆ. అ.) శోకముచేఁ గలతనొందినవాఁడు. ఇట్లే శోకవిహ్వలుఁడు, శోకాభిభూతుఁడు, శోకావిష్టుఁడు.

శోకస్థానము సం. వి. అ. న. శోకకారణము, దుఃఖ హేతువు.

శోకాపనోదము సం. వి. అ. పుం. శోకము పోఁగొ ట్టుట.

శోకారి సం. వి.ఇ. పుం. కదంబము, కడిమి (వృ. వి.).

శోకి సం. విశ. (న్. ఈ. న్.) శోకముగలవాఁడు.

శోకించే సం. అ. క్రి. దుఃఖించు.

కం. మతి నొక్కించుకయును నే, సుతునకుఁ గోడలికి నేని శోకించెదనే, కృతకృత్యత్వంబున వి,స్రుతులగు నయ్యిరువురును నశోచ్యులు మనకున్. మార్క. 3. 24

శా...మహాశూరుం డాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్ ...భాగ...7. 38.

శోచకము సం. విశ. (అ. ఆ. అ.) శోకించునది, వగ చునది, బాధపడునది.

శోచనము సం. వి. అ. న. శోకము, వగపు.

శోచనీయము సం. విశ. (అ ఆ. అ.) శోకింపదగినది, వగవఁదగినది, దుఃఖపడదగినది.

శోచిష్కేశుఁడు సం. వి. అ. పుం. అగ్నిదేవుఁడు.

శోచిస్సు సం. వి. స్. న. 1. వెలుఁగు, ప్రకాశము, కాంతి. 2. జ్వాల.

శోచ్యము సం. విశ. (అ. ఆ. అ.) 1. శోకింపదగినది,

వగవఁదగినది. 2. దుష్టము. 3. నీచమైనది. అధమము.

**శౌ(శా)టీర్యము** సం. వి. అ. న. పరాక్రమము, శౌర్యము.

**శోతము** సం. వి. అ. పుం. పావురము. (వాచ.)

**శోతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మూర్ఖుఁడు, తెలివి మాలినవాఁడు. 2. నీచుఁడు. అల్పుఁడు. దుష్టుఁడు, చెడ్డవాఁడు. 4. సోమరి. వి. అ. పుం. 1. మూర్ఖుఁడు. 2. సోమరి, తిండిపోతు. 3. నీచ మనుష్యుఁడు. 4. ధూర్తుఁడు.

**శోణపుష్పకము** సం. వి. అ. పుం. కోవిదారము, ఎఱ్ఱ కాంచనము (వృ. వి.).

**శోణము** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) ఎఱ్ఱనిది, రక్తవర్ణము గలది.

కం. తరుణప్రవాళ శోణో, దరతలమై శంఖచక్ర ధరమై వర పుష్కర పుష్కలమై హరికర, సరసీరుహ మనఁగ గలశజలనిధి చెలగున్. పాండు. 3. 147.

2. కొంచెమెఱ్ఱనిది. 3. వసువు పచ్చనిది.

వి. అ. పుం. 1. ఎఱుపు. రక్తవర్ణము. 2. అగ్ని. 3. ఒక జాతి ఎఱ్ఱగుఱ్ఱము. 4. కొంచెమెఱ్ఱనిగుఱ్ఱము 5. శోణనదము. 6 అంగారక గ్రహము. 7. ఒకానొక సముద్రము. ఎఱ్ఱ సముద్రము. న. 1. రక్తము, నెత్తురు, సిందూరము.

**శోణరత్నము** సం. వి. అ. న. కెంపు, పద్మరాగము.

**శోణాంబువు** సం. వి. ఉ. పుం. ప్రళయకాలము నందు ద్రవించు మేఘవిశేషము,

**శోణాశ్మము** సం. వి. న్. పుం. 1. పద్మరాగము. కెంపు. 2. ఎఱ్ఱనిఱాయి.

**శోణితపారణ** సం. వి. ఆ. స్త్రీ. రక్తపుగూడు, రక్తాహారము.

**శోణితపుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) రక్తము త్రాగువాఁడు.

**శోణితపురము** సం. వి. అ. న. బాణాసురుని పట్టణము.

**శోణితము** సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిది.

వి. అ. న. 1. నెత్తురు, రక్తము. 2. కుంకుమపువ్వు.

**శోణితాహ్వయము** సం వి అ. న. కుంకుమపువ్వు.

**శోణిమము** సం వి. న్ పుం. ఎఱుపు, రక్తవర్ణము.

**శోణితోపలము** సం వి అ. పుం. కెంపు, పద్మరాగము ఇక్లే. శోణోపలము

**శోథఘ్నము** సం విణ. (అ. ఈ. అ.) వాఁపును బోఁగొట్టునది

వి అ. పుం. భల్లాతకి, నల్లజీడి చెట్టు.

**శోథజిత్తు** సం, విణ. త్ = శోథఘ్నము.

వి. త్. పుం. భల్లాతకి, నల్ల జీడిచెట్టు.

**శోథజిహ్మము** సం. వి. అ. పుం పునర్నవ, గజ్జేరు వృ. వి,).

**శోథము** సం. వి అ. పుం. వాఁపు, ఉబ్బు.

**శోథరోగము** సం. వి. అ పుం. రోగవిశేషము, జలోదరము.

**శోథహృత్తు** సం. విణ. (త్) వాఁపును బోఁగొట్టునది. వి. త్. పుం, నల్లజీడిచెట్టు.

**శోధకము** సం. విణ. (అ ధి. కా. అ) 1. పవిత్రము చేయునది. 2. విరేచనకారి. 3. దిద్దునది, సరిచేయునది.

వి. అ. పుం. వ్యాసంకలనము. తీసివేఁత. న. 1. ఒక రకపు మన్ను.

**శోధకుఁడు** సం వి. అ పుం. 1. పవిత్రము చేయు మనుష్యుఁడు. 2. శుభ్రము చేయు మానవుఁడు.

**శోధనకుఁడు** సం. వి అ పుం నేరము చేసిన వానిని శిక్షించు రాజకీయాధికారి, (చూ. మృచ్ఛకటికము)

**శోధనము** సం విణ (అ. ఈ. అ.) 1. పవిత్రము చేయునది. 2. శుభ్రము చేయునది. మొ. వి,

వి అ. న. 1. శుభ్రము చేయుట. 2. పుండు మొదలగు వానిఁ గడుగుట 3 తప్పుదిద్దుట. 4. పరిశీలనము.

ఆ ఆత్మశోధనంబు లవి ముఖ్యములు కాని, బాహ్యశోధనములు పనికిరావు శివధర్మ. 5. 49.

5. (ఋణము. మొ) తీర్చుట 6. ప్రాయశ్చిత్తము, దోషపరిహారము చేసికొనుట. 7. (లోహములు శుద్ధిచేయుట 8 శాస్తి, శిక్ష. 9. (గణిత.) తీసివేఁత 10. అన్నభేది. 11. మలము, పురీషము. 12. విరేచనము. పుం. నిమ్మ (వృ. వి.).

**శోధని** సం. వి ఈ స్త్రీ 1. చీపురుకట్ట, సమ్మార్జని. 2, తమలపాకుల తీఁగ. 3. నీలి (వృ వి).

**శోధము** సం వి అ. పుం 1. పవిత్రముచేయుట. శుభ్రపరచుట. 3.దిద్దుట, సరిచేయుట. 4 (ఋణము మొ.) తీర్చుట. 5. ప్రతిక్రియ, మాఱుసేఁత.

**శోధించు** సం. స క్రి. 1. వెదకు. పరీక్షించు.

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ వేయేటికిన్. భాగ. 7. 183.

కం నానావిహారశైలో,ద్యానసభాతీర్థదేవతాగృహ మృగయా,స్థానమున కరుగు నెడమును, మానుగ శోధింపవలయు మానవపతికిన్. భార. ఆది. 6. 103;

కం. బహువర్ష సహస్రంబులు, ద్రుహిణుండును హరియు నధ్యధోభువనంబుల్, బహుళక్రియ శోధించిరి, దహనస్తంభంబు తుదయుఁ దన్మూలంబున్. శివరా. 1. 101.

గీ.........గూఢచారులు దేవ యీకుక్క వేసి కడుపు శోధింపు సకలంబు గానవచ్చు. వరాహ. 5 67.

2. శుద్ధిచేయు.

వ. యజనస్థానంబును సమ్మార్జనలేపనాదుల శోధించి ....శివరా. 1. 111.

**శోధితము** సం విశే. (అ. ఆ అ.) 1. శుభ్రము చేయఁబడినది. 2. పవిత్రము చేయఁబడినది, శుద్ధి చేయఁబడినది. 3. వస్త్రగాలితముఁ జేయబడినది. 4. దిద్దఁబడినది 5. తీర్పఁబడినది (ఋణము). 6. ప్రతిక్రియచేయఁబడినది, శాస్తిచేయఁబడినది. 7. నిరపరాధియని విడువఁబడినది.

**శోధ్యము** సం. విశే. (అ ఆ. అ.) 1 పవిత్రముచేయఁ దగినది శుద్ధిచేయబడినది. 2. శుభ్రపఱుపఁదగినది. శుద్ధిచేయదగినది. 3. తీర్పఁదగినది. (ఋణము మొ.). 4. ప్రతిక్రియ చేయఁదగినది.

**శోధ్యుఁడు** సం వి. అ. పుం. తనపై నారోపింపఁబడిన దోషము పరిహరించుకొనఁ దగిన పురుషుఁడు, ముద్దాయి, అభియుక్తుఁడు.

గీ. క్రొత్తకుండలోనఁ గ్రూరసర్పమునిడి, యర్చితముగఁ జేసి యందులోన, నిమ్మపండు వేసినెమ్మితోఁ దివియంగ,శోధ్యుఁడైనవాఁడు శుద్ధుఁడయ్యె. విజ్ఞా. కాం. 3. 121,

**శోఫజిత్తు** సం. వి. త్. పుం. నల్లజీడిచెట్టు. భల్లాతకి (వృ. వి.).

**శోఫము** సం. వి. అ. పుం. వాఁపు. ఉబ్బు.

**శోఫహృత్తు** సం, త్. వి, పుం. = శోఫజిత్తు.

**శోభ** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకాశము వెలుఁగు. దీప్తి.

శా...దిశాస్తోమంబు శోభాదరి, ద్రాణం బయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెంగడున్. మను 3. 12.

2. చక్కఁదనము, సౌందర్యము. స్వాభావికసౌందర్యము, సొగసైన వర్ణము 3 అలంకారము. 4. పసుపు. 5. గోరోచనము.

**శోభకృత్తు** సం. వి త్. పుం. ప్రభవాదిసంవత్సరములలో నొకటి.

**శోభన** సం. వి. ఆ. స్త్రీ. 1. పసుపు 2. సౌందర్యవతి యగు స్త్రీ సుగుణములు గల స్త్రీ 3. గోరోచనము.

**శోభనకము** సం వి. అ. పుం. శోభాంజనము, మునగచెట్టు.

**శోభనము** సం. విశే. (అ. ఈ అ.)1. ప్రకాశించునది. 2. సుందరమైనది. 3 శుభప్రదమైనది. 4.బాగుగా నలంకరింపఁబడినది 5 సుగుణములు గలది.

వి. అ. పుం 1 గ్రహము (సూర్యాది). 2. శుభఫలములుకలుగుటకై చేసెడిహోమము. 3. విష్కంభాది యోగములలో నొకటి.

వి. అ. న. 1. స్త్రీలు వివాహాదులందు పాడునొక విధమగు పాట.

కం. ఆ లలనామణి కాగ, య్యాళి యొకానొక్క వేళ వక్కఅతో సు,వ్వాలున్ శోభనములు ధవ,ళాలున్ మొదలైనపాటలం దగ నేర్పున్. శుక. 1. 434.

(శ. ర. ఈప్రయోగమునే "సోబానలు" అని పఠించి "సోబాన" అను వేఱుపదము గానిచ్చెను)

2. పునస్సంధానము గర్భాధానము.

గీ. అపుడు సుముహూర్తమనుచు గర్గాదిమునులు

శోభనముఁజేసి రాసిక్యశోభనములకు. రాధికా. 1. 110.

(ఈ రెండర్థములును తెలుఁగునఁ జే కలవు)

3. సౌందర్యము. 4. పద్మము. 5. శుభము, శుభకర్మము.

సీ. కన్నెదుటను బూర్ణకలశద్వయం బతి, శోభన స్ఫూర్తిమై సొంపుమీఱఁ గని...కళా. 5. 35

కం. లాభంబు ధర్మముఖ్యము, గాఢంపడి మార్గశుద్ధి గనుఁగొని క్రైకోల్లా భూవరునకు నిహపర, శోభనములు సేఁత చెప్పు శ్రుతివాక్యంబుల్. భార. శాంతి. 2. 410.

**శోభాంజనము** సం. వి. అ. పుం. మునగ, శిగ్రువు (వృ. వి)

**శోభి** సం. విణ. (న్. నీ. న్.) 1. శోభించునది.

మాలిని. సుఃపరివృఢ చూడా శోభిరత్నాంశువీచి స్ఫురణ శుభగపాదాంభోజ సంచార కేళి...... భార. విరా. 3. 65.

(ప్రకాశించునది).

2. సుందరము, మనోజ్ఞమైనది.

**శోభించు** సం. అ. క్రి. శోభిల్లు, ప్రకాశించు. (శ.ర.).

**శోభితము** సం. విణ. (అ. ఆ. అ.) 1 అలంకరింపఁబడినది, సొగసుగాఁ జేయఁబడినది. 2. సుందరమైనది, మనోహరమైనది.

**శోభిల్లు(లు)** సం. అ. క్రి. ప్రకాశించు.

మ. సుమహోవర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి... భార. ఆది. 1. 65.

ఉ....అది దీప్తతరంబగు నొడ్డనంబు శోభిల్లుచు వైరిదృష్టులకు భీకరమైచనుఁ గ్రౌంచనామకం బెల్లి ఘటింపు. భార. భీష్మ. 2. 20.

ఉ......వి శుభశ్లోకుని మానసాబ్జమున శోభిలెఁ దాంకహంస మట్టి వాల్మీకిమహర్షి శేఖరు నమేయ గుణాకరు నాశ్రయించెదన్. ఉ. రా. 1. 9.

ప్రకాశితమగు, బయల్పడు, ప్రకటమగు.

శా...మాగధు నెడన్ సామంబు దానంబు సం, భేదంబున్ బని లేదు దండవిధిశోభిల్లన్ బ్రయోగించి... భాగ. 10 పూ. 1580.

వ ఒకవంక కుడ్యనిభంబైనవనభంబుశోభిల్లుచు... శివరహస్య. సభవ. 3. 145.

గీ...కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి. భార. విరా. 11.2.

**శోషణము** సం విణ. (అ. ఈ. అ.) 1 ఎండించునది, శోషిల్లఁ జేయునది. 2. వడలించునది, వాడించునది.

వి. అ. పుం. మన్మథుని బాణములలో నొకటి.

సీ...శుష్కోపవాస సంశోషణములు ... శివధర్మ. 5. 126.

న. 1. ఎండించుట, శోషిల్లఁజేయుట. 2. పీల్చుట, లయముచేయుట. 3. తఱిగిపోవుట, వ్యయమగుట. 4. వడలుట. 5. సొంటి.

**శోషము** సం. వి. అ. పుం. 1. ఎండుట, ఇగిరిపోవుట, కంఠశోషము. 2. వడలుట, వాడుట. (ఉదా. శరీరశోషము) 3. శ్వాసకోశసంబంధమైన క్షయరోగము, క్షయరోగము.

**శోషసంభవము** సం. వి. అ. న. పిప్పలి వేరు.

**శోషి** సం. విణ. (న్. ణీ. న్.) వడలించునది, వాడఁజేయునది.

**శోషించు** సం. అ. క్రి. శుష్కించు, క్షీణించు.

సీ. రమియించుచును గామరాగాధికాసక్తిఁ జేసి శోషించి విచిత్రవీర్యుఁ డమరపురికిఁ జనిన... భార. ఆది. 4. 216.

మ. సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి హైన్యంబుతో, హరమోళిలన్ నిలువంగ లేక వఱచెన్ హాహా నినాదంబులన్. భాగ. 10. 193.

వ...తద్విశిఖంబు లసంఖ్యాకంబులయి నిశాటుల శరీరంబులు శోషింపం జేయుచు...ఉ రా. 2.61

2 (√ శోషిల్లు) శుష్కింపఁజేయు, క్షీణింపఁ జేయు.

మ. ...మానమాత్సర్య దూరులు నాఁజాలిన వారి పల్కులకు వైరుధ్యంబు గావించు నజ్ఞులు భూనాథున కాప్తులున్ సఖులునై శోషింతు రత్యంతమున్. భార. ఆది. 8. 35.

**శోషితము** సం విణ (అ ఆ. అ ) 1. ఎండినది, శోషిల్లినది. 2. వడలినది, వాడినది. 3. తఱిగినది, క్షీణించినది.

శోషిలు(ల్లు) సం. అ. క్రి. అణఁగు, శోషించు. (శోషిలు = వెనుదీయు అని భా.)
సీ. హాటకశోణముల గోహాటికి శోషిలని దుర్వాటగ ర్వాటోప పీఠభటులు. వై. భా 6. 154.

# శౌ

శౌండి సం. వి న్. పుం శౌండికుఁడు.
ఈ. స్త్రీ పిప్పలి (వృ. వి.).

శౌండికి సం. వి. ఈ. స్త్రీ 1. సారాయి మొదలగనవి కాఁచి యమ్మెడి స్త్రీ. 2. ఒక సంకీర్ణజాతి స్త్రీ.

శౌండికుఁడు సం. వి. అ. పుం. 1. సారాయి మొదలగువానిఁ గాఁచియమ్మెడివాఁడు. 2. ఒక సంకీర్ణ జాతి పురుషుఁడు.

శౌండికేయుఁడు సం. వి అ. పుం. రాక్షసుఁడు.

శౌండిని సం. వి. ఈ స్త్రీ. శౌండికి.

శౌండీరుఁడు సం విణ. (అ. ఆ. అ) 1. గర్వించినవాఁడు. 2 ఉన్నతస్థితికి వచ్చినవాఁడు.

శౌండుఁడు సం. విణ. (అ ఈ అ.) 1 మద్యమందాసక్తి గలవాఁడు. 2. మద్యపానాదికముచే మత్తెక్కినవాఁడు. 3. గర్వముచే నొడలెఱుంగనివాఁడు. 4. (సప్తమీతత్పురుషమున) దక్షుఁడు, నిపుణుఁడు,
శా...గిరిరాట్కన్యాంఘ్రిపూజాక్రియా, శౌండ శ్రీధరకామిరడ్డిపురరక్షాదక్షిణ ప్రేక్షణా. శివధర్మ. 4. 118.
(ఉదా, దానశౌండుఁడు, అక్షశౌండుఁడు)

శౌకము సం. వి. అ. న. శుకసమూహము, చిలుకల గుంపు.

శౌక్తము సం. విణ. (అ. ఈ. అ.) పుల్లనిది.

శౌక్తికము సం. విణ. (అ. ఈ. అ.) 1, శక్తిసంబంధి, ముత్తెము సంబంధమైనది,
ఉ. సాగరసారవారిరుహ శౌక్తికమౌక్తికవిద్రుమద్రుమమైలాగురుచందనంబులు... భార. సభా. 2. 110.
2, పుల్లనిది,

శౌక్తికేయము సం. వి. అ. న. ముత్తెము.

శౌక్తేయము సం. వి అ న. ముత్తెము,

శౌక్రము సం. విణ (అ. ఈ అ.) శుక్రసంబంధమైనది, రేతస్సు బంధి.

శౌక్లికేయము సం. వి అ పుం. విషభేదము, ఒకవిధమైన విషము.

శౌక్ల్యము సం. వి. అ. న. శుక్లత్వము, తెలుపు ధావళ్యము.

శౌచకర్మము సం. వి. న్. న. శుద్ధిని గలిగించు హోమాది క్రియ, శుద్ధి సంస్కారము

శౌచకల్పము సం. వి అ. పుం శౌచ కర్మము.

శౌచకూపము సం. వి. అ. పుం మఱుఁగు దొడ్డి.

శౌచము సం వి అ న. 1. పారిశుద్ధ్యము, పవిత్రత, నైర్మల్యము.
వ. సకల కర్మంబుల యందు భావశౌచంబె శౌచంబు; బాహ్యశౌచంబు శౌచంబుగా దని ప్రమాణంబు లున్నవి. శివధర్మ. 5. 46.
2. పవిత్రము చేయుట, ముఱికి పోఁగొట్టుట. 4. యోగ్యత, మంచితనము.

శౌచాచారము సం. వి. అ. పుం శౌచ కర్మము.

శౌతికుఁడు సం. వి. అ. పుం. శుద్ధిచేయువాఁడు.

శౌచేయుఁడు సం. వి. అ. పుం. చాకలి, రజకుఁడు.

శౌటీరుఁడు సం. వి. అ. పుం. 1, గర్వి, గర్వము కలవాఁడు.
వి అ. పుం. 1. శూరుఁడు, 2. గర్వము గల మనుష్యుఁడు. 3. సన్న్యాసి, యతి. 4. నడుమంత్రపు సిరి గలవాఁడు.

శౌటీర్యము సం. వి. అ. న. 1. గర్వము, దురభిమానము. 2. పరాక్రమము, శౌర్యము.

శౌద్ధోదని సం. వి. ఇ. పుం. శుద్ధోదనుని పుత్త్రుఁడు, బుద్ధుఁడు.

శౌద్రము సం. విణ. (అ. ఈ. అ.) శూద్ర సంబంధి. శూద్రజాతి సంబంధమైనది.

శౌద్రుఁడు సం. వి. అ. పుం. ద్వాదశ విధ పుత్త్రులలో నొకఁడు. ద్విజాతులలో (బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులలో) నొకనికి శూద్రాంగన యందుఁ పుత్త్రుఁడు.

శౌనకుఁడు సం. వి. అ. పుం. ఋగ్వేద ప్రాతిశాఖ

మొదలగునవి రచించిన యొక ఋషి.

శౌనము నం. వి. అ. న. పశుహింసా శాలలో నుంచిన మాంసము.

శౌనికము నం వి అ. పుం. వేఁట, మృగయ.

శౌనికుఁడు నం. వి. అ. పుం. 1 మాంస విక్రేత, కటిక వాఁడు. 2. పశులఁ బట్టువాఁడు, వేటకాఁడు.

శౌభము నం. వి. అ. పుం. పోఁకచెట్టు, క్రముకము (వృ. వి).

న. హరిశ్చంద్రుని పట్టణము.

శౌభాంజనము నం. వి అ. పుం. శోభాంజనము.

శౌభికుఁడు నం వి. అ. పుం. గారడివాఁడు, ఐంద్రజాలికుఁడు. 2. వేటకాఁడు.

శౌభుఁడు నం. వి. అ. పుం వేలుపు, దేవుఁడు

శౌరసేని నం వి. ఈ. స్త్రీ. శూరసేన దేశమున వాడఁ బడుభాష, ప్రాకృతభాషలలో నొకటి.

శౌరి నం. వి. ఇ. పుం. 1. కృష్ణుఁడు, విష్ణువు.

గీ. ... రాధ తనలోని వంతఁ దెలియఁ, జేసె శౌరికి నవ్యాపదేశముగను, రాధికా. 1. 141.

2. బలరాముఁడు. 3. శనైశ్చరుఁడు.

శౌర్పము నం. విశ. (అ ఈ. అ) శూర్ప సంబంధి శూర్పముతోఁ గొలువబడినది.

శౌర్యము నం. వి. అ. న. 1. పరాక్రమము.

ఉ. ... చూచెద నుద్ధతద్విష. త్ప్రంతతికంఠ ఖండన విచక్షణ దక్షిణ బాహుశౌర్యమున్. కళా. 4.190. 2. బలము, శరీరకార్ఢ్యము 3. నాట్యకళయందలి వీరవిక్రమము.

శౌల్కికుఁడు పుం వి. అ. పుం. సుంకము వసూలు చేసెడియుద్యోగి.

శౌల్కుఁడు నం. వి. అ. పుం. శౌల్కికుఁడు.

శౌల్బ(ల్వ)కుఁడు నం. వి. అ. పుం. రాగి పని వాఁడు, కంచరి.

శౌవనము నం. విశ. (అ. ఈ. అ.) 1. శునకసంబంధి, కుక్కసంబంధమైనది. 2. కుక్కయొక్క స్వభావము గలది.

వి. అ. న. 1. కుక్క స్వభావము. 2. కుక్కసంతతి ఇట్లే శౌవము.

శౌవస్తికము నం విశ. (అ ఈ. అ.) 1. రేపటికి సంబంధించినది, మఱునాఁటిది, రేపటివరకు నుండునది 2 ఒకదినము మాత్రముండునది, నశ్వరమైనది.

శౌవాపదము నం. విశ. (అ. ఈ. అ) 1. శ్వాపద సంబంధి, అడవిజంతువులవలనఁ గలిగినది. 2. ఘాతుకము, క్రూరమైనది.

శౌష్కలము నం. వి. అ. న. ఎండిన మాంసము యొక్క మూల్యము.

శౌష్కలుఁడు నం. వి. అ. పుం. 1. శుష్కమాంస విక్రేత, ఎండినమాంస మమ్మువాఁడు. 2. ఎండు మాంసమును దినువాఁడు. శుష్కమాంస భక్షకుఁడు

శ్చ్యోతనము నం వి. అ న. శ్చ్యోతము.

శ్చ్యోతము నం వి అ. పుం. స్రవించుట, కారుట.

శ్చ్యోతనము నం వి. అ న. శ్చ్యోతము.

శ్చ్యోతము నం. వి. అ పుం. శ్చ్యోతము.

శ్మశాననివాసి నం. వి. న్. పుం. 1. పిశాచము, దయ్యము 2. శివుఁడు ఇట్లే శ్మశానవర్తి, శ్మశానవాసి

శ్మశానము నం. వి. అ. న. శవములను గాల్చెడి, పూడ్చెడి తావు, వల్లకాఁడు, మసనము.

ఆ. ఆ శ్మశానగమను లంతిమచుట్టంబు, లగ్నిఁగలిపి మరలు వఖిలమైన జ్ఞాతిజనము....భార. శాంతి. 6. 235.

శ్మశానవేశ్మము నం. వి. న్. పుం. పిశాచము, దయ్యము.

శ్మశానవేశ్మఁడు నం. వి. న్. పుం. శివుఁడు.

శ్మశానవైరాగ్యము నం. వి. అ న. శ్మశానము చూచుటవలనఁ దాత్కాలికముగఁ గలిగిన విరక్తి, స్థిరము గాని వైరాగ్యము.

శ్మశానశూలము నం. వి. అ. పుం. న. శ్మశానము నందలి కొఱత వేసెడికొయ్య.

శ్మశానాలయము నం. వి. అ. పుం. శ్మశానస్థలము.

శ్మశ్రుముఖి నం. వి. ఈ. స్త్రీ గడ్డము, మీసములు గల స్త్రీ.

శ్మశ్రులుఁడు నం. విశ. (అ ఆ. అ.) గడ్డము, మీసముగలవాఁడు.

శ్మశ్రువర్ధకుఁడు సం. వి. అ. పుం. మంగలి.

శ్మశ్రువు సం. వి. ఉ. న. పురుషుల ముఖమున నుండు రోమములసమూహము. మీసము గడ్డమును.

వ. ... శుక్లాంబరాభరణ మాల్యానులేపనుండును ప్రవీత పలితకేశశ్మశ్రుశోభిత దేహుండును ... భార. ఆది. 6. 9.

శ్మీలితము సం. వి. అ. న. తటాలునఁ గనురెప్ప వేయుట, ఱెప్పపాటు.

శ్యానము సం. విశే. (అ. ఆ. అ.) 1. పోయినది, 2. పేరుకొనినది, గట్టిపడినది. 3. జిగురైనది, బంకగా నున్నది. ఎండినది, ఇంకినది. వి. అన. పొగ.

శ్యామ సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి.

ఆ రాజకామినీజను డు శ్యామాళామూర్తిఁ, పరఁగు దేచమాటఁ బరిణయించెఁ, గుముదబాంధవుఁడు కువలయానందుఁడై, శ్యామఁ బరిణయించు చంద మునను శివధర్మ 1. 43.

2. యౌవన మధ్యస్థురాలగు స్త్రీ. ...డుచది. 3 నీడ, ఛాయ 4. బిడ్డలను గనని స్త్రీ. 5. నల్లని స్త్రీ 6. పార్వతి 7. యమునానది. 8. ఆవు. 9. పసుపు 10 నల్ల పిప్పిక. 11. నీలి (వృ.వి). 12. ప్రేంకణము (వృ.వి). 13 నల్లతులసి (వృ వి.). 14 మామెన (వృ.వి.). 15. బావంజి (వృ వి.)

శ్యామకంఠము సం. వి. అ. పుం. నీలకంఠము. నెమిలి.

శ్యామకంఠుఁడు సం. వి. అ. పుం. శివుఁడు, నీలకంఠుడు.

శ్యామకర్ణము సం. వి. అ. పుం. అశ్వమేధయాగమున కుపయోగించు గుఱ్ఱము.

శ్యామపత్రము సం. వి. అ. పుం. తాపింఛము, తమాల వృక్షము.

శ్యామము సం. విశే. (అ. ఆ. అ.) 1. నల్లనిది, నీల వర్ణము గలది. 2 గోధూమ వర్ణము గలది. 3 నీడ గలది. 4 ఆకుపచ్చని నల్లవ కలసినది.

వి. అ. పుం. 1. నలుపు, నీలవర్ణము. 2. ఆకుపచ్చ. 3. మేఘము. 4 కోకిలము, 5. యమునా నది తీరమునఁ బ్రయాగ క్షేత్రమునందున్న వటవృక్షము. 6. ఉమ్మెత్త (వృ. వి.).

న. 1. సైంధవలవణము 2. ...ము.

శ్యామ(మా)ల సం. వి. అ. స్త్రీ. ...

శ్యామలము సం. విశే. (అ. ఆ. అ.) 1. నల్లనిది, నీల వర్ణము గలది.

మత్త. శ్యామలావయవం చరాచర సద్గురుం. ధర్మఖం. .. 171

కం. శ్యామలకాలాగురునవ, ధూమ మెడకు ముఖ మొనర్చి. పాండు. 4. 12

వి. అ. పుం. 1. నలుపు, నీలవర్ణము 2. మిరియము. 3. పెద్దతుమ్మెద. 4. వటవృక్షము, (రావి (వృ. వి.) అని శ. ర.)

శ్యామలిక సం. వి. ఆ. స్త్రీ. నీలి (వృ. వి)

శ్యామలిమము సం. వి. న్. పుం. నలుపు, నీలవర్ణము.

శ్యామశబలములు సం. వి. అ. పుం. బ. యముని వెంటనుండెడి నాలుగు కన్నులు గల జంట కావలి కుక్కలు.

శ్యామసుందరుఁడు సం. వి. అ. పుం. కృష్ణుఁడు.

శ్యామాంగము సం. విశే. (అ. ఆ. అ.) నల్లని యవయవములు గలది.

వి. అ. పుం. బుధగ్రహము

శ్యామా(మ)కము సం. వి. అ. పుం. సస్యవిశేషము, చామ (వృ. వి) బ. ఒక దినుసు ధాన్యవిశేషము, చోమలు.

శ్యామిక సం. వి. ఆ. స్త్రీ. 1. నలుపు, కృష్ణవర్ణము. 2 లోహముల మాలిన్యము లోహాంతర సంసర్గాది దోషము.

శ్యామితము సం. విశే. (అ. ఆ. అ.) నల్లగాఁ జేయఁ బడినది.

శ్యాలకి సం. వి. ఈ. స్త్రీ. భార్యసోదరి, మఱఁదలు భార్య తోఁబుట్టినది. శ్లేష శ్యాలి.

శ్యాలకుఁడు సం. వి. అ. పుం. 1. భార్యతోఁబుట్టిన వాఁడు 2. దుష్టుడైన శ్యాలుఁడు.

శ్యాలిక సం. వి. ఆ. స్త్రీ. శ్యాలకి,

శ్యాలుఁడు సం. వి. అ. పుం. భార్య తోఁబుట్టిన వాఁడు.

శ్యావతైలము సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**శ్యావము** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) 1.నలుపు పసుపు కలిసిన వన్నె గలది, కోఁతి వన్నె గలది, కపిశము. 2. నలుపు, పసుపు కలిసిన వన్నె, కోఁతివన్నె. కపిశవర్ణము.

**శ్యేతము** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) తెల్లనిది. శ్వేత వర్ణము గలది.

వి. అ. పుం. తెలుపు, శ్వేతవర్ణము.

**శ్యేనంపాత** సం. వి. ఆ. స్త్రీ. వేఁట, మృగయ.

**శ్యేనచితుఁడు** సం. వి. అ. పుం. డేగతో వేటాడు వాఁడు, డేగను పెంచి వేఁటమప్పువాఁడు.

**శ్యేనజీవి** సం. వి. న్. పుం. శ్యేనచితుఁడు.

**శ్యేనము** సం. విణ. (అ. ఈ. అ.) తెల్లనిది.

వి. అ. పుం. 1. తెలుపు, శ్వేతవర్ణము. 2. డేగ. 3. తీవ్రత, ఉగ్రత్వము.

**శ్యేనావపాతము** సం. వి. అ. పుం. డేగ తటాలునఁ దన్నికొనిపోవుట.

**శ్యేని** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుడేగ.

**శ్యో(శో)నాకము** సం. వి. అ. పుం. దుండిగము, ఒకానొక చెట్టు (వృ. వి.).

**శ్రంథనము** సం. వి. అ. న. 1. కూర్చుట, గ్రథనము 2. వదులుచేయుట, 3. చంపుట, వధింపజేయుట.

**శ్రంథము** సం. వి. అ. పుం. 1. సడలించుట, వదులు చేయుట, నిర్బంధము నుండితొలగించుట. 2.వదులు, బిగువులేమి. 3. కూర్చుట, కూర్పు, గ్రథనము.

**శ్రంథితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సడలింపఁబడినది, నిర్బంధమునుండి తొలగింపఁబడినది. 2. గ్రథితము, కూర్పఁబడినది. 3. గాయపఱుపఁబడినది. 4. జయింపఁబడినది. 5. సంతోషపఱుపఁబడినది.

**శ్రంథుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు.

**శ్రథనము** సం. వి. అ. న. 1. వధము, చంపుట. 2. సడలించుట, వదులుచేయుట, విడుచుట, యత్నము, పూనిక. 4. కూర్చుట, కట్టుట.5. అధిక సంతోషము.

**శ్రద్దధానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) విశ్వాసము గలవాఁడు, నమ్మకమున్నవాఁడు.

ఆ. వె. కాన మేలు శ్రద్ధధాను డగుట. భార. శాంతి. 5. 251.

**శ్రద్ధ** సం. వి. ఆ. స్త్రీ. 1. నమ్మకము, విశ్వాసము. 2. ఆస్తిక్యబుద్ధి, స్మృత్యుక్తములైన ధర్మకార్యము లందలి ప్రత్యయము.

సీ. ...శ్రద్ధా ప్రథమములు సకలధర్మంబులు
శ్రద్ధయ మధ్యాంతసంస్థితంబు. శివధర్మోత్తరము 1. 142

3. మనఃప్రసాదము, మనస్సు కలత నొందకుండుట, శాంతి.

కం. ... శ్రద్ధయనం, జనునది జీవాత్మ సుప్రసన్నత సుమ్మి. భార. శాంతి. 5. 245.

4. చనవు, పరిచయము. 5.ఆదరము. 6. తీవ్రేచ్ఛ, ఆసక్తి 7. గర్భిణి యొక్క కోరిక.

**శ్రద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) నమ్మినది. విశ్వసించినది.

**శ్రద్ధాలు(ళు)వు** సం. విణ. (ఉ) 1. నమ్మువాఁడు, విశ్వసించువాఁడు. 2. కోరువాఁడు.

వి. ఉ. స్త్రీ. ఏవేని వస్తువులను గోరు గర్భవతి, వేవిళ్ళు గలది.

**శ్రపణ** సం. వి. ఆ. స్త్రీ ఉడికించుట, వండుట.

**శ్రపణము** సం. వి. అ. న. =శ్రపణ.

**శ్రపిత** సం. వి. ఆ. స్త్రీ. అన్నము వార్చిన గంజి.

**శ్రపితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉడికింపఁబడినది. 2. వండఁబడినది. వి.అ.న. వండిన మాంసము, పక్వమాంసము.

**శ్రమజలము** సం. వి. అ. న. చెమ్మట, స్వేదము.

**శ్రమణ** సం. వి. ఆ. స్త్రీ. 1. సన్న్యాసిని, యోగిని. 2. భక్తురాలు. 3. మనోజ్ఞురాలు, ఇంపైన స్త్రీ. నీచజాతి స్త్రీ. 5. చిఱువేరు (వృ. వి.). 6. జటామాంసి.

**శ్రమణి** సం. వి. ఈ. స్త్రీ = శ్రమణ.

**శ్రమణుఁడు** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) 1. కష్టపడువాఁడు. 2. నీచకృత్యములవలన జీవించువాఁడు. వి. అ. పుం. 1. సన్న్యాసి, భిక్షువు. 2. బౌద్ధసన్న్యాసి 3. బుద్ధదేవుఁడు. 4. బిచ్చగాఁడు, యాచకుఁడు.

**శ్రమము** సం. వి. అ. పుం. 1. పాటు, కష్టము, కష్ట

పడుట. 2 ఆయాసము, అలసట.

గీ... గూర్చుండెఁ దత్సవిధ ప్రదేశమండపంబున నధ్వశ్రమ బు కతన. కళా. 8. 174.

చం.... శ్రమమున సొలుచుండియు బరాక్రమ సంపద సొంపుమీఱ. భార. కర్ణ. 315.

3. దుఃఖము, బాధ. 4. పాపపరిహారార్థము పడు కాయక్లేశము, తపస్సు. 5. (దేహదార్ఢ్యమునకై చేసెడు) వ్యాయామము. 6. యోధులుచేయు శస్త్రాభ్యాసము.

శ్రమస్థానము నం. వి. అ. న. శరీరవ్యాయామ స్థలము, సాముచేయు చోటు

శ్రమాంబుపు నం. వి. ఉ. న. చెమట, స్వేదము.

శ్రమి నం. విశే. (న్. జీ. న్.) 1. కష్టపడువాఁడు, శ్రమ నొందువాఁడు. 2. కార్యసాధనమునకై యత్నించువాఁడు. 3. ఆయాసపడువాఁడు.

శ్రయణము నం. వి. అ న. — శ్రయము.

శ్రయము నం. వి. అ. పుం. ఆశ్రయము, రక్షకస్థానము.

శ్రవణ గోచరము నం. విశే. (అ. ఆ. అ.) శ్రవణేంద్రియమునఁ దెలియవచ్చునది. వి. అ. పుం. వినఁబడు నంత దూరము, కూఁతవేటు దూరము.

శ్రవణపథము నం. వి. అ. పుం. 1. శ్రోత్రేంద్రియ మార్గము, చెవికి వినఁబడునంత దూరము, కూఁత వేటు దూరము.

శ్రవణపాలి (ళి) నం. వి. ఇ. ఈ. స్త్రీ. చెవిమొన.

శ్రవణపాశము నం వి అ. పుం. చక్కనిచెవి.

శ్రవణము నం. వి. అ. పుం. న. 1. చెవి, శబ్దమును గ్రహించెడి యింద్రియము.

చం........ శ్రవణవిదారణం బయిన శబ్దము దానిది యేమియొక్కొ. భార. సభా. 1. 12

సీ... శ్రవణకుండలములు చంద్రుఁ గెల్చిన నెమ్మొ గమునకు నీరాజనము లొసంగ.

రఘు. రామా. 1. 20

2. శ్రవణనక్షత్రము. 3. (గణిత.) విషమ కర్ణము, త్రిభుజమునందలి సమకోణమున కెదురుగానుండు భుజము. న. 1. వినుట. 2.చదువు, విద్య. 3.కీర్తి. 4. వేదము. శ్రుతి. 5. సంపద, ఐశ్వర్యము.

శ్రవణసుభగము నం. విశే. (అ. ఆ. అ) చెవికిం పైనది.

శ్రవణానందము నం. వి. అ పుం. వీనులవిందు.

శా...మాన జాల నటించు పేఁడు శ్రవణానందం బుగాఁ బల్కుచున్. మను 4. 107.

శ్రవణోదరము నం వి అ న. కర్ణరంధ్రము, చెవిగూఁడు.

శ్రవము నం వి అ పుం 1. వినుట. 2. చెవి, శ్రోత్రేం ద్రియము. 3. విషమకర్ణము. 4 కీర్తి, ప్రసిద్ధి.

శ్రవస్యము నం. వి. అ. న. కీర్తి, ప్రసిద్ధి.

శ్రవస్సు నం. వి. స్. న. — శ్రవము. 1. చెవి, శ్రోత్రేంద్రియము.

శా............ విప్రవే షాఢ్యోదాకృతికృత్యవంచిత బలిన్ జతుశ్రవస్తల్పు .... సింహా. భా. 1. అ. 2. 181.

2. కీర్తి. 3. సంపద, ధనము. 4. మంత్రము, ప్రశంసింపఁదగిన కృత్యము, మంచిపని.

శ్రవాయ్యము నం. వి. అ. పుం. యజ్ఞపశువు.

శ్రవిష్ఠ నం. వి. ఆ. స్త్రీ 1. ధనిష్ఠా నక్షత్రము. 2. శ్రవణనక్షత్రము.

శ్రవిష్ఠాజుఁడు నం. వి. అ. పుం. బుధుఁడు, బుధ గ్రహము

శ్రాంతత నం. వి. ఆ. స్త్రీ. అలసట, అలపు,

ఉ ఇంతకు మున్ను సెల్లె పదియేడుదినంబుల సంగరం, బతిశ్రాంతతఁ గుంది రిందుఁ గల సైనికులు ... భార. శల్య. 1. 50.

శ్రాంత సంవాహనము నం వి. అ. న. అలసినవాని శ్రమము దీర్చుట.

శ్రాంతి నం. వి. ఇ. స్త్రీ 1. ఆయాసము, అలసట, శ్రమము.

సీ. అధ్వనీనశ్రాంతిహరణార్థమై తరు, వాటికావళి పథావళి ఘటించి. ధర్మఖం. 1. 143.

శ్రాంతుఁడు నం విశే. (అ. ఆ. అ.) 1. అలసినవాఁడు, ఆయాసపడినవాఁడు.

శ్రాంత స్త్రీ.

కం.... అచ్చర గర్భశ్రాంతయగుటను గనుఁగొని... మను. 3 124.

శ్రాంతము [illegible]
[illegible] శ్రాంతి [illegible] వహ్యాను వాహాన, [illegible]తానం జెల్లి ...
[illegible]. కీస్వ. [illegible]
[illegible]. మనశ్శాంతిగలవాఁడు, వి అ పుం. సన్న్యాసి, యతి.

శ్రాణ సం. వి ఆ స్త్రీ వతియన్నపు గంజి.

శ్రాణము సం. విశే. (అ. ఆ అ.) 1. పక్వమైనది, ఉడికినది 2. చెమ్మగలది, తడిది. వి. అ. న ఉడికిన మాంసము మొ॥

శ్రాద్ధదినము సం. వి. అ. పుం న. చచ్చిపోయిన బంధువు నుద్దేశించి ప్రతిసంవత్సరమునను శ్రాద్ధము పెట్టెడి దినము, ఆబ్దికము, తద్దినము

శ్రాదదుఁడు సం. వి. అ. పుం శ్రాద్ధము పెట్టువాఁడు

శ్రాద్ధదేవుఁడు సం. వి. అ పుం 1. శ్రాద్ధాధిష్ఠాన దేవత. 2. యముఁడు.

శ్రాద్ధము సం విశే. (అ ఆ అ) విశ్వాసము గలది. నమ్మికగలది. వి. అ. వ 1. ఉత్తరక్రియ. చచ్చిపోయిన బంధువుల నుద్దేశించిచేయఁబడు కర్మవిశేషము.

గీ అగ్నిహోత్రంబు బలికర మతిథిపూజ, శ్రాద్ధమును దానవిధియు నశక్తరతి, సర్వభూతాను కంపయు సంయమీంద్ర, తర్పణంబును గృహికి నుత్తమమతంబు నూత అ 2. 161.

(అది నిత్యము, నైమిత్తికము, కామ్యము అని త్రివిధము.) 2. శ్రాద్ధకాలమున నిచ్చినదానము

శ్రాద్ధికము సం. విశే (అ. ఈ అ.) శ్రాద్ధసంబంధి. వి అ న. శ్రాద్ధమం దిచ్చినదానము.

శ్రాద్ధికుఁడు సం. వి. అ పుం. శ్రాద్ధమందలి దానము పుచ్చుకొనువాఁడు.

శ్రాద్ధీయము సం. విశే. (అ ఆ. అ) శ్రాద్ధసంబంధి.

శ్రామము సం. వి. అ. పుం 1. మాసము, నెల 2. [illegible], వే[illegible]. శాకాకాలికోపయోగమునకై నిర్మి[illegible] కుటీరము.

శ్రాయము సం వి. అ పుం. శరణము, రక్షణ స్థానము, ఆశ్రయము.

శ్రావకము సం. వి అ పుం [illegible] వ్యాప్యసుల [illegible]ము [illegible] శాకి.

శ్రావకుఁడు సం వి అ పుం వినెడివాఁడు, శ్రోత. 2. శిష్యుఁడు 3. బౌద్ధసన్యాసి, బౌద్ధభక్తుఁడు.
మత్తకోకిల శ్రావకాధ[illegible] [illegible]సజాతరే ఫల దిగ్విరామావహంబుగ మత్తకోకిల యంద్రదు దనిఁ గవీశ్వరుల్. కవిజన. ష[illegible] 6
4 తన మతమును విడిచి యన్యమతము నవలంబించినవాఁడు

శ్రావణము సం. విశే (అ. ఈ. అ) శ్రవణసంబంధి, చెవికి సంబంధించినది 2 శ్రవణ నక్షత్రమునఁబుట్టినది
వి అ పుం 1 శ్రావణ మాసము. న. 1. వినిపించుట 2 వినుట వలనఁ గలిగిన జ్ఞానము, శ్రుత పాండిత్యము.

శ్రావణి సం. వి ఈ స్త్రీ 1. శ్రావణ శుక్ల పూర్ణిమ. 2 శ్రావణ శుక్లపౌర్ణమాసి నాటి నూతన యజ్ఞోపవీతధారణ రూపమైన సంస్కారవిశేషము.

శ్రావణికము సం. విశే. (అ ఈ అ) శ్రావణమాసమునకు సంబంధించినది. వి అ. పుం. శ్రావణ మాసము

శ్రావణుఁడు సం. వి అ పుం 1. భిన్నమతావలంబి 2 వంచకుడు, మోసగాఁడు. 3 దశరథునిచేఁ బొరపాటున బాణముతోఁ గొట్టఁబడి చనిపోయిన వైశ్యబుషి

శ్రావము సం వి అ పుం 1. వినుట 2. ప్రావము, కాఱుట.

శ్రావస్తి సం వి. ఇ ఈ స్త్రీ గంగాతీరము నందలి యొకానొక పట్టణము.

శ్రావితము సం. విశే (అ ఆ. అ.) వినిపింపఁ బడినది, తెలుపఁబడినది

శ్రావ్యము సం. విశే. (అ ఆ అ) 1. వినఁదగినది (దృశ్యము కానిది) 2. వినఁబడునట్టిది 3. విన నింపైనది.
శా. శ్రావ్యంబై చెలఁగన్ గభీరమధుర జ్యానాద ముద్దామబీరవ్యాపారిని రూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్. భార. విరా. 5. 182.

శ్రాహి వి (ఈ పదము శాసన వాఙ్మయము నందే కానవచ్చుచున్నది) వర్తమాన సంవత్సరము.

1. ... ... ... ... ... ... ... ... .... ... ... ....

2. వనచక్రవర్తి శ్రీ రాజాధిరాజ దేవర విజయ రాజ్య

3. సంవత్స(ర)ంబులు 31 గుశ్రాహి శ్రీమద్దాక్షా రామమున

4. శ్రీ భీమేశ్వర మహాదేవరకు .... ... ద. శా. 1100

10. శ్రీ రాజరాజ చోడదేవర విజయరాజ్య సంవత్సరగు శ్రాహి దిన 1(౯)ఉణ్ణందు(లో) సంక్రాంతి శుద్ధ 5 బుధవారము.

... .... .... ... ... ... .......ద. శా. 1122., దా శా. 1107., ద. శా. 1152.

శ్ర్యాహ్వము సం. వి. అ. న. పద్మము, తామరపువ్వు.

శ్రితము సం. విణ. (అ. ఆ. అ) 1. ఆశ్రయించినది, దరిచేరినది, పొందినది.

కం. ..... శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్. భాగ. 10. 109.

2. అనుకొనినది. 3. కూడినది. 4. రక్షితము, రక్షింపఁబడినది 5. సేవితము, సేవింపఁబడినది. గౌరవింపఁబడినది. 6. సహాయము, తోడయినది. 7. వ్యాపించినది, క్రమ్మినది. 8. కలిగియున్నది, ఇమిడ్చికొని యుండునది 9. గుంపుగానున్నది, సంఘముగా నున్నది. 10. సంపన్నమైనది, సహిత మైనది.

శ్రితి సం వి. ఇ స్త్రీ ఆశ్రయించుట, దరిఁజేరుట, సాహాయ్యము కోరుట.

శ్రియంమన్యుఁడు సం విణ. (అ ఆ. అ.) 1. తన్ను లక్ష్మిసంపర్కునిగాఁదలఁచుకొనువాఁడు, తాను గొప్పవాఁ డనుకొనెడివాఁడు. 2. గర్వి, గర్వము గలవాఁడు.

శ్రీ సం. వి ఈ. స్త్రీ. 1. శ్రీకారము. 2. లక్ష్మి.

సీ. శ్రీలు దారాట నాశ్రితపద్మకర్ణికాకృతిఁ జెవు లమ్మల కర్ణికల మెఱయ ....... ఆము. 4. 133.

శ్రీ సం. వి ఈ. స్త్రీ. 1 ధనము, సంపద, సమృద్ధి.

కం. ... సునిశితబాణో, ద్దామప్రసా విభవ, మార్తుర కద్భుతంబు సేసెం గడిమిన్ భార విరా. 5. 36.

కం. .... సమస్తభూములు విజయశ్రీమహిమను సాధించె...భార. సభా. 2. 105.

2. రాజ్యలక్ష్మి, రాజ్యసంపత్తు.

ఉ. ....ఉన్నత శ్రీగుణయుక్తిమైఁ బెరుగు...సభా. 2. 100.

కం. ... పాండవేయుల శ్రీ యిమ్మెయిఁ గొనిన నిన్నుఁ జీయవరె యొరుల్. భార. సభా. 2. 185.

3. ఉన్నతస్థితి, గొప్ప హోదా.

తే గీ ..కానఁ బాండవశ్రీ యుపేక్ష్యంబుగాదు, సభా. 2. 145.

4. చక్కఁదనము, శోభ, కాంతి.

ఆ. వె... సిద్ధకన్య యొక్క శ్రీ సమృద్ధి సర్వ లక్షణప్రశస్తాంగి యిది. భార. ఆది 7 72

5. ఛాయ, రంగు. 6. లక్ష్మిదేవి.

ఉ. శ్రీ నతికిం బ్రియం బెసగ జేర్చిన యుయ్యెల లీల...పారి. 1. 1.

7. గొప్పఁదనము, ఉత్తమత్వము 8. అలంకారము. 9. బుద్ధి 10. దివ్యశక్తి, అమానుషశక్తి. 11. ధర్మార్థకామము లను త్రివర్గము. 12. సరళ వృక్షము. 13. మారేడుచెట్టు 14. లవంగము 15. చంద్రుని పంద్రెండవ కళ. 16. సరస్వతి 17 వాక్కు, మాట. 18. కీర్తి, ప్రసిద్ధి. 19. ఒక శ్రీరాగము. సంగీతమునఁ బ్రధానమగునా రాగములలో నొకటి. 20. సాలెపురుగు.

మ. ... శ్రీ కాళహస్తీశ్వరా.

21. కీర్తి. 22 విషము.

కం. శ్రీకంఠ చాప ఖండన పాకారి ప్రముఖ వినుత...భాగ. 1. 1.

23. ఉపకరణము.

(శ్రీకృష్ణుఁడు, శ్రీరాముఁడు మొదలగు దేవతా నామములకును; శ్రీ వాల్మీకి, శ్రీ జయదేవుఁడు మొదలగు మహాత్ముల నామములకును; శ్రీ రామా

యణము, శ్రీ భాగవతము మొదలగు గొప్ప గ్రంథముల నామములకును, వానిగౌరవము తెలుపుటకు నావదములకు ముందుగా నుపయోగింపఁబడెడి పదము. మఱియు పత్రిక (ఉత్తరము)ల మొదటను, గ్రంథారంభమునను శుభసూచకముగా నుపయోగింపఁబడెడి పదము).

శ్రీకంఠసఖుఁడు సం వి అ పుం. కుబేరుఁడు.

శ్రీకంఠుఁడు సం. వి. అ. పుం. 1. శివుఁడు
మ. శివలోకంబున కేఁగియు డు నపడు శ్రీకంఠుఁడై పొందుగన్. శివధర్మ. 3. 25.
2. భవభూతి అనునొక కవి.

శ్రీకరణము సం. వి. అ. న. లేఖని; కలము.

శ్రీకరము సం. వి. (అ. ఈ అ) ఐశ్వర్యమును గలిగించునది.
వి. అ. పుం. పద్మము

శ్రీకరుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

శ్రీకాంతుఁడు సం. వి. అ. పుం విష్ణువు.

శ్రీకారము సం. వి. అ. పుం. జాబులున్నగునవి వ్రాయునపుడు మొట్ట మొదట శుభారంభముగా వ్రాసెడి శ్రీయను పదము.

శ్రీకారి సం. వి. న్. పుం. ఒకజాతి లేడి.

శ్రీఖండము సం.వి.అ పుం న. 1. మంచిగంధము.
శా. ...శ్రీఖండ, కర్పూర క్షోదవిపాండు నిర్మల యశఃపూర్ణ క్షమామండలా. శృం. నై. 1. 111.
2. చందనము. (వృ. వి.).
కం. శ్రీఖండ శీతనగ మధ్యాఖండ క్షోణి మండలాఖండల... మను. 2. 1.

శ్రీగదితము సం. వి. అ. న. చిన్న నాటకము, ఒకవిధమైన యుపరూపకము.

శ్రీగర్భము సం. వి అ. పుం. ఖడ్గము, కరవాలము.

శ్రీగర్భుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

శ్రీగ్రహము సం. వి అ. పుం పక్షులు నీరుత్రాగెడి తొట్టె.

శ్రీఘనము సం. వి. అ న. 1. పుల్ల పెరుగు, మీఁగడ పెరుఁగు.

శ్రీఘనుఁడు సం. వి. అ. పుం. 1. బుద్ధదేవుఁడు. 2. ఒకానొక బౌద్ధసన్యాసి.

శ్రీచక్రము సం. వి. అ. న. 1. భూగోళము. 2. ఇంద్రరథము యొక్క చక్రము. 3. యంత్రభేదము, త్రిపురసుందరి పూజాంగమైన యొకానొక యంత్రము.

శ్రీచూర్ణము సం వి. అ న తిరుచూర్ణము.

శ్రీతాలము సం వి. అ పుం. ఒక జాతి తాటి చెట్టు.

శ్రీదుఁడు సం. వి. అ. పుం కుబేరుఁడు.

శ్రీధరుఁడు సం. వి అ. పుం. విష్ణువు. ఇట్లే శ్రీదయితుఁడు మొ.
గీ. బలిమి కలుముల జులుములు బలియుఁ జొరవ చేసి చూచెద ననుచు వా శ్రీధరుండు. రాధికా. 4. 18.

శ్రీనగరము సం వి. అ. న. ఒకానొక పట్టణము.

శ్రీనివాసుఁడు సం. వి అ. పుం. విష్ణువు.
గీ. సారెకు నొనర్చు శైత్యోపచార విధుల శ్రీనివాసుఁడు మెల్లన సేద దేఱె. రాధికా 3. 168.
ఇట్లే శ్రీనికేతనుఁడు.

శ్రీపంచమి సం వి. ఈ. స్త్రీ. మాఘశుక్ల పంచమీ తిథి.

శ్రీపతి సం వి. ఇ. పుం. 1. విష్ణువు. 2. రాజు, చక్రవర్తి.

శ్రీపథము సం. వి. అ. పుం. రాజమార్గము, పెద్దబాట.

శ్రీపర్ణము సం. వి. అ. న. పద్మము, తామర.

శ్రీపర్ణి (క) సం. వి. ఈ. అ స్త్రీ. 1. శాల్మలి, బూరుగు (వృ. వి). 2. గుమ్ముడు. 3. చేకు.

శ్రీపర్వతము సం. వి. అ. పుం. శ్రీశైల మను ప్రసిద్ధిఁజెందిన దక్షిణాపథమునందలి యొక పవిత్రమైన పర్వతము.

శ్రీపిష్టము సం. వి. అ. పుం. కర్పూర తైలము.

శ్రీపుత్రము సం. వి. అ. పుం. ఉచ్చైశ్శ్రవము, ఇంద్రుని గుఱ్ఱము

శ్రీపుత్రుఁడు సం. వి. అ. పుం. 1. మన్మథుఁడు. 2 చంద్రుఁడు.

శ్రీపుష్పము సం. వి. అ. న. లవంగము, ఒకానొక

సుగంధ ద్రవ్యము (పద్మకాష్ఠము).

శ్రీఫల నం వి. ఆ. స్త్రీ 1 నీలి వృ.వి. 2. ఉసిరిక వృ వి.).

శ్రీఫలము నం. వి. అ. పుం. బిల్వము, మారేడు (వృ. వి.)

శా. నారంగార్జున పాటలీవకుళపున్నాగ మ్లశల్లాతమం,దారాశోకకదంబ పూగ కదళీ ద్రాక్షా వటాశ్వత్థఖ,ర్జూర శ్రీఫలనారికేళ బదరీరుద్రాక్షము ఖ్యావనీ, జారామంబులు ... శివధర్మోత్తరము. 2. 48

న. మారేడుపండు.

శ్రీఫలి నం. వి. ఈ స్త్రీ. శ్రీఫల.

శ్రీమంతము నం. విశ. (త్. తీ. త్.) 1. మంగళాకరము. 2. సంపద గలది. 3. శుభప్రదము.

శా. శ్రీమంతంబు శిరోగ్రధామసుషమా సింధూరిత ద్యోధరమా, సీమంతంబు...

గోమంతంబున కేగి యబ్బలుం డనుంగుందోడుతో నిట్లనున్. దశావ. 8. 30.

నం. వి. త్. పుం. 1. తిలకవృక్షము. 2. అశ్వత్థ వృక్షము, రావిచెట్టు.

శ్రీమంతుఁడు నం. విశ. (త్. మతీ త్.) 1. ధనవంతుఁడు, కలవాఁడు 2. సుఖవంతుఁడు, అభివృద్ధి నొందువాఁడు. 3. సుందరుఁడు, చక్కనివాఁడు. 4. కీర్తిగలవాఁడు, ప్రసిద్ధి కెక్కినవాడు, పేరు పొందినవాఁడు (గౌరవముగలజనులయొక్కయు, వస్తువులయొక్కయు ముందు గౌరవ సూచకముగా నుపయుక్తమగు పదము).

వి. త్. పుం. 1. విష్ణువు. 2. కుబేరుఁడు. 3. శివుఁడు.

శ్రీమస్తకము నం. వి అ. పుం. వెల్లుల్లి, పలాండువు.

శ్రీముఖము నం వి. అ. పుం. ఒక సంవత్సరము. అ న. గురువు మొదలగు పెద్దలువ్రాసి పంపెడు పత్రిక.

శ్రీముద్ర నం. వి ఆ స్త్రీ. వైష్ణవులు నొసట ధరించెడి చిహ్నము, తిరుమణి తిరుచూర్ణములు.

శ్రీమూర్తి నం, వి. ఇ. స్త్రీ. 1. విష్ణుప్రతిమ, లక్ష్మి ప్రతిమ 2. విగ్రహము, ప్రతిమ.

శ్రీరంగము నం. వి అ. పుం. దక్షిణ దేశమందలి యొక్క విష్ణుక్షేత్రము.

వ. ...శ్రీరంగంబునకు రంగేశు సేవింప...ఆము. 6. 10.

శ్రీరంగములు)గాలు వి, బ, ధాన్యవిశేషము.

సీ. గొబ్బికాయలు బలుగుత్తులు పాలుమీఁగడలు శ్రీరంగాలు కామదార్లు....హంస. 4. 128.

వ. కృష్ణనీలాలు ముద్దుంబ్రాలు కస్తూరిపట్టెలు చెన్నంగులు శ్రీరంగాలు చింతపూలు గోరాజనాలు. ప్రబంధ. 112.

శ్రీరసము నం. వి. అ. పుం. 1. కర్పూర తైలము. 2. ధూపద్రవ్యవిశేషము.

శ్రీరాగము నం. వి. అ. పుం. ఎనిమిది పురుష రాగము లలో నొకటి.

సీ. భైరవి మాళవి బంగాళ హిందోళ రాజమంజరియు శ్రీరాగగౌళభూపాల లెన్మిది పురుషరాగంబులు...హంస. 5. 123.

సీ. భైరవ శ్రీరాగబంగాళహిందోళమాళవులును రాగమంజరియును. ప్రబంధ. 9. 5.

శ్రీరామతోపులు మి. వి. బ. వస్త్రభేదము.

వ. తోఁపులును శ్రీరామతోఁపులును జీబులును సుగిపట్టంబులును. ద్వా. శి. 206.

శ్రీలుఁడు నం. విశ. (అ. ఆ. అ) 1. ధనవంతుఁడు. 2. అదృష్టవంతుఁడు. 3. సౌందర్యవంతుఁడు, చక్కనివాఁడు. 4. కీర్తిగలవాఁడు, ప్రసిద్ధుఁడు.

శ్రీవత్సకి నం. వి. న్. పుం. ఱొమ్మున సుడి గల గుఱ్ఱము.

శ్రీవత్సము నం. వి. అ. పుం. 1. విష్ణుని వక్షఃస్థలమునందున్న రోమముల సుడి.

సీ. ... శ్రీవత్సలాంఛనాంచితవిహారు. భాగ. 10. 112.

2. కన్నగానిచేఁ ద్రవ్వఁబడిన కన్నము.

శ్రీవత్సలాంఛనుఁడు నం. వి. అ. పుం. విష్ణువు. ఇట్లే శ్రీవత్సాంకుఁడు.

శ్రీవత్సుఁడు నం. వి. అ. పుం. విష్ణువు.

శ్రీవరాళి బ. వి. (సంగీత.) ముప్పది రెండు నపుంసక

రాగములలో నొకటి.

గీ. చెంచుమలహారి దేశాక్షి శ్రీవరాళి మాళ వియు....హం.స. 5. 124

గీ. ....నాట గౌళి దేశాక్షి తోడివరాళి శ్రీవరాళి హిజ్జిజ్జి కేదార గౌళ. ప్రబంధ. 96

శ్రీవరుఁడు నం. వి అ. పుం. విష్ణువు, ఇక్లే, శ్రీవల్లభుఁడు.

శ్రీవర్ధనుఁడు నం. వి అ పుం శివుఁడు.

శ్రీవాసము నం వి అ. పుం. 1. కర్పూర తైలము, సరళవృక్షద్రవము (అని వాచ.) 2. పద్మము

శ్రీవృక్ష(క)ము నం. వి అ. పుం. 1. బిల్వము. మారేడు వృ. వి )

వ. గోమయంబువలన సదాశివ ప్రీతికంముగ బిల్వ మహీరుహం బదయి చె అయ్యనోకహము పద్మ వాసినికి నివాస బయ్యెఁగావున శ్రీవృక్షం బనం బరఁగె. శివధర్మ 1. 204.

2. అశ్వత్థము, 3. గుఱ్ఱము ఱొమ్మున నుండు నొకవిధమైన సుడి.

శ్రీవృక్షకి నం. వి. న్. పుం. శ్రీవృక్షమను సుడిగల గుఱ్ఱము.

శ్రీవేష్టము నం. వి. అ. పుం 1. కర్పూర తైలము (సరళవృక్షద్రవమని వాచ.) 2. ధూపద్రవ్య విశేషము.

శ్రీశైలము నం. వి. అ. పుం. శ్రీపర్వతము.

క...జనియెను శ్రీశైలమ్మునకును భృగునిపాత లంపటమతియై కళా. 4. 194.

శ్రీసంజ్ఞము నం వి.అ.న. లవంగము, దేవకుసుమము.

శ్రీసూక్తము నం. వి. అ న. (లక్ష్మీస్తోత్రరూపమైన) వేదమందలి మంత్రములు (సూక్తము).

శ్రీహస్తిని నం. వి. ఈ. స్త్రీ. ప్రొద్దుతిరుగుడు పువ్వు చెట్టు, గురుగు భూరుడి (వృ. వి.).

## శ్రు

శ్రుతకీర్తి నం.వి‌శ‌ ‌ 1 కీర్తిగలవాఁడు, ప్రసిద్ధుఁడు. ‌ పుం 1. ప్రసిద్ధపురుషుఁడు. 2. ఒకానొక దేవ ఋషి. స్త్రీ. 1. శత్రుఘ్నుని భార్య పేరు.

శ్రుతదేవి నం. వి ఈ స్త్రీ. సరస్వతి, వాగ్దేవత.

శ్రుతధరుఁడు నం. విశ. (అ. ఆ అ) వినినది జ్ఞప్తి యం దుంచువాఁడు, ధారణాశక్తిగలవాఁడు

శ్రుతపఱచు మి న. క్రి. శ్రుతపడు ప్రేరణరూపము, వినిపించు, చెప్పు.

సీ. చుట్టపక్కాలకు శుభపత్రికలు వ్రాసి, పంప మామకు శ్రుతపఱచరమ్మ. రాధికా. 1. 70

శ్రుతము నం. విశ (అ, ఆ. అ.) 1. వినఁబడినది. 2. తెలుపఁబడినది వినిపింపఁబడినది. 3. నేర్వఁబడి నది. తెలిసికొనఁబడినది.

కం. శతతాళదఘ్నమగున, య్యతులగ్రావంబుఁ జూచి యఖల గ్రామా, గతులైన మానవులు తమ, శ్రుతసాధవ విధులచేతఁ జూర్ణము సేయన్ నిరంకుశో. 4. 88.

4. ప్రసిద్ధమైనది. 5. పిలువఁబడినది.

వి. అ న. 1. శ్రుతిగోచరవస్తువు, వినఁబడువస్తువు. 2. వేదము. 3. శాస్త్రము. 4. వేదశాస్త్రజ్ఞానము

శ్రుతవంతుఁడు నం. విశ. (త్ తీ త్.) 1. వేదము అందు సంపూర్ణజ్ఞానముగలవాఁడు. 2. జ్ఞానముగల వాఁడు, విద్యావంతుఁడు.

శ్రుతశ్రవుఁడు నం. వి. న్. పుం. శిశుపాలుని తండ్రి.

శ్రుతార్థము నం. వి. అ. పుం. వినఁబడిన విషయము, తెలిసిన యంశము.

శ్రుతి నం. వి. ఇ ఈ. స్త్రీ. 1. చెవి, శ్రవణము.

సీ. శ్రుతులేల భవదుదంచితగానసవసుధాద్వీపికో ర్మిరుతముల్ వినకయున్న చంద్రికా 4. 10

2 కింవదంతి, అనుకొనెడి మాట. 3 ధ్వని. 4. వేదము.

సీ. శబ్దశాస్త్రము లందు సకల తత్త్వము లందు, శ్రుత్యంతములయందు శ్రుతులయందు. బిల్హ. 1. 67.

కం. శ్రుతు లభ్యసించి తతుల, క్రతువులు సేసితి కులంబు రక్షించితినీ, వితరులక్రియ మృత్యుభయా న్వితుఁడవు గాఁదగునె మేదినీవర యింకన్. భార. ద్రోణ. 2. 297.

5. వేదమంత్రము 6. వేదజ్ఞానము. 7. (సంగీత.) సుతి.

సీ అవతంస కుసుమంబు నందున్న యెలదేటి రతి కించిదంచిత శ్రుతుల నీన. మను. 1. 5.

8. శ్రవణనక్షత్రము. 9. (గణిత.) విషమ కర్ణము,

రేఖావిశేషము. 10. సూక్తి, సుద్ది (శ. ర.).

**శ్రుతికటము** సం. వి. అ. పుం. 1. పాము. 2. వ్రతము, తపస్సు. 3 ప్రాయశ్చిత్తము.

**శ్రుతికటువు** సం. విణ. ఉ. వినుటకుఁ బరుషమైనది. వి. ఉ. పుం. పరుషధ్వని (కావ్యదోషములలో నొకటి, పరుషము).

**శ్రుతిచోదన** సం.వి.ఆ.స్త్రీ. వేదమందలి విధివాక్యము.

**శ్రుతిచోదనము** సం. వి. అ. న. — శ్రుతిచోదన.

**శ్రుతిజీవిక** సం. వి. ఆ. స్త్రీ. స్మృతి. ధర్మశాస్త్రము.

**శ్రుతిద్వైధము.** సం. వి. అ. న. వేదవాక్యముల పరస్పరభేదము.

**శ్రుతినిదర్శనము** సం. వి. అ. న. వేదప్రమాణము.

**శ్రుతిపథము** సం. వి. అ. పుం. శ్రోత్రమార్గము. కర్ణపథము.

**శ్రుతిప్రసాదనము** సం. విణ. (అ. ఆ. అ.) శ్రావ్యమైనది, చెవి కింపైనది.

**శ్రుతిమండలము** సం. వి. అ. న. కర్ణపుటము, చెవి, పైకిఁగనఁబడెడి చెవి.

**శ్రుతిమూలకము** సం. విణ. (అ. ఆ. అ.) వేదప్రమాణము గలది.

**శ్రుతిమూలము** సం. వి. అ. న. 1. కర్ణమూలము, చెవిగూబ. 2. వేదప్రమాణము,

**శ్రుతివర్జితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెవిటివాఁడు, బధిరుఁడు, 2 వేదజ్ఞానశూన్యుఁడు, వేద మెఱుఁగనివాఁడు

**శ్రుతివిప్రతిపన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1.వేదప్రామాణ్య మంగీకరింపనిది 2. వేద విరుద్ధమైనది.

**శ్రుతివిషయము** సం. వి. అ. పుం 1. శ్రోత్రేంద్రియమునకు గోచరమైన యర్థము; ధ్వని, శబ్దము 2. శ్రోత్రపథము. 3. వేదసంబంధమైన యంశము. 4. వేదవిధి, వేదచోదన.

**శ్రుతివేధము** సం. వి. అ. పుం. శాస్త్రోక్త విధానమున చెవులు కుట్టుట, కర్ణవేధమను సంస్కారవిశేషము.

**శ్రుతిసుఖము** సం విణ. (అ. ఆ. అ.) శ్రావ్యమైనది, చెవి కింపైనది. ఇట్లే శ్రుతిమనోహరము. మొ॥

**శ్రుత్యంతము** సం. వి. అ. పుం. న. ఉపనిషత్తు.

**శ్రుత్యనుప్రాసము** సం. వి. అ. పుం. శబ్దాలంకార విశేషము.

**శ్రు (స్రు) వ** సం. వి. ఆ. స్త్రీ. — శ్రువము.

**శ్రువము** సం. వి. అ. పుం. 1. యజ్ఞము. 2. యజ్ఞసాధనము, స్రువము, నేయి తీసికొనుట కుపయోగించు గరిటవలె నుండెడి సాధనము

**శ్రువావృక్షము** సం. వి. అ. పుం. వికంకతము, పుల్లవెలఁగచెట్టు (వృ. వి.).

## శ్రే

**శ్రేఢి** సం. వి. ఈ. స్త్రీ (గణిత.) ఒక సంఖ్య మొదలు మరియొక సంఖ్యవఱకునైన సంఖ్యలు. వానిసంకలితములు, వర్గములు, ఘనములు; ఆసంఖ్యలలోని విషమాంకములు, సమాంకములు, క్రమమున వృద్ధి నొందిన సంఖ్యలు, ఇట్లు ఏదో యొకక్రమము ననుసరించిన సంఖ్యాశ్రేణి.

**శ్రేఢీఫలము** సం. వి. అ. న. శ్రేణులను సంకలనము చేయగా వచ్చినమొత్తము.

**శ్రేణి** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. పంక్తి, వరుస, పరంపర.

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమున బాఱెన్ పతులు......మను 3. 12.

2. సమూహము, గుంపు, మంద.

శా. అంగవ్రాతములో జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శేషాంగశ్రేణికి రక్షసేయుక్రియ...భాగ. 2. 188.

సీ... విద్యాధరశ్రేణి విహరించు పథమెక్కి కరువలి యేఁగెడు కత్యపొచ్చి. శృం. నై. 7. 37.

3. వణిజులు, శిల్పులు మొదలగు వారి సంఘము, వర్తకుల సమాజము, శిల్పి సమాజము. మొ., నీరు తోడెడి తొట్టి.

**శ్రేణిక** సం. వి. ఆ. స్త్రీ. శిబిరము, గుడారము.

**శ్రేణి(ణీ)బంధము** సం. విణ. (అ. ఆ. అ.) పంక్తిగా నేర్పడినది, వరుసగా నున్నది వి.అ.పుం. పంక్తిగా నేర్పడుట.

**శ్రేధి** సం. వి. ఈ. స్త్రీ. 1. విభిన్నవస్తుపరంపర, వేఱు వేఱగు వస్తువుల వరుస. 2. (గణిత.) —శ్రేఢి. 3. ఫలితము, పర్యవసానము.

శ్రేయఃపరిశ్రమము సం. వి. అ. పుం. మోక్షమునకై యత్నము.

శ్రేయ (స్స) ము సం. విశే. న్. 1 వరము, మంచిది. 2. శ్రేష్ఠము, ఉత్తమము, 3. మిక్కిలి సుఖముగలది. 4. ప్రియతరము, మిక్కిలి నిష్టమైనది, వి. న్. న. 1. ధర్మము. 2. క్షేమము. 3. శుభము.

మ... శ్రేయంబెటు లబ్బు దుర్గతియు గల్గుంగాక యెు.తేశియున్. శివ·హాస్య సం 3. 167

4. శుభసమయము. 5. మోక్షము. 6. ఆనందము. 7. భాగ్యము.

శ్రేయసి సం. వి. ఈ. స్త్రీ. 1. హరీతకి, ఉసిరిక (వృ. వి.). 2. పిప్పలి (వృ. వి ).

శ్రేయస్కరము సం. విశే. (అ. ఈ. అ.) 1. సుఖము గలిగించునది. శ్రేయస్సు గలిగించునది. 2. శుభప్రదము, శుభము గలిగించునది.

శా. ఏవాక్యం బిల రోగదోషరహితం బేవాక్య మత్యంతధర్మావాలంబును నై వినంగ ఘనపుణ్యం బొప్పం జేకూరుచుం, డావాక్యంబు విరూపమైనను సముద్యత్ప్రీతి శ్రేయస్కరం. బై వేద్యం బగుచుండు నెప్పుడు మునీంద్రా యెల్లలోకంబులన్. శివధర్మోత్తరము. 1. 191.

శ్రేయస్సు సం. వి న్. న శ్రేయము.

శా. ఆయుష్యం బతిపావనవస్తుసముదాయం బై హికాముష్మిక, శ్రేయః ప్రాప్తి నిమిత్త ముత్తమ కథాసేవ్యంబు... భార. ఆది. 3. 11.

శ్రేయోర్థి సం. విశే (న్. ర్థినీ. న్.) క్షేమాభిలాషి. మంచికోరువాఁడు. 2. సుఖముకోరువాఁడు

శ్రేష్ఠము సం విశే. (అ. ఆ. అ ) 1. అత్యంత ప్రశస్తము, ఉత్తమము.

వ. ... శివయోగికి మహాయోగంబ శ్రేష్ఠంబు... శివధర్మ. 2. 114.

2. మిక్కిలి సుఖవంతము. 3. ప్రియతమము, మిక్కిలి నిష్టమైనది. 4. జ్యేష్ఠము, కాలముచేఁ బెద్దది.

వి. అ. న. ఆవుపాలు, గోక్షీరము.

శ్రేష్ఠామ్లము సం. వి. అ. న. చింతపండు, తింత్రిణీ ఫలము.

శ్రేష్ఠాశ్రమము సం. వి. అ. పుం. మేలైన ఆశ్రమము, గార్హస్థ్యము.

శ్రేష్ఠాశ్రముఁడు సం వి. అ పుం గృహస్థు.

శ్రేష్ఠి సం. వి న్. పుం. 1. వర్తకులలో శ్రేష్ఠుఁడు, గొప్పవర్తకుఁడు. 2. శిల్పులలోఁ పెద్దవాఁడు, శిల్పిశ్రేష్ఠుఁడు.

శ్రేష్ఠుఁడు సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు. 2. రాజు 3. విప్రుఁడు 4. విష్ణువు

## శ్రై

శ్రైష్ఠ్యము సం. వి. అ. న. శ్రేష్ఠత్వము. ఉత్తమత.

## శ్రో

శ్రోణ సం. వి. అ. స్త్రీ. 1. గంజి. 2 శ్రవణ నక్షత్రము.

శ్రోణము సం. విశే. (అ. ఆ. అ.) కుంటిది, పంగువు. వి. అ పుం. రోగవిశేషము.

శ్రోణి సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. కటిప్రదేశము మొ.. పిఱుఁదు.

శా. ఏణీలోచనఁ బూర్ణచంద్రవదన స్వైమప్రభాంగిన్ ఘన,శ్రోణీమండలఁ బీనబంధురకుచన్....... మార్క. పు. 2, 205.

ఉ శ్రోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కినుతింతు సైకత, శ్రోణికిఁ జంచరీకచయ సుందర వేణికి......భాగ. పీఠిక. 6.

2. బాట, మార్గము.

శ్రోణిఫలకము సం. వి. అ. న. 1. విశాలమగు కటి ప్రదేశము. 2. కటిపార్శ్వప్రదేశము.

శ్రోణిబింబము సం. వి అ. న. 1. గుండ్రని పిఱుఁదు, నడికట్టు.

శ్రోణిసూత్రము సం. వి. అ. న. 1. మొలనూలు, మొలత్రాడు, పట్టాకత్తిలోఁ గూర్చిన నడికట్టు.

శ్రోత సం. వి. ఋ. పుం. 1. వినెడివాఁడు.

కం. శ్రోతకుఁ దనకుం బ్రియమగు, నేతెరువున నట్టి మెయి సమీకిత మైనం, జూ తగువాక్యంబది నృపసూతి పెడపలుకు జాలికుల చొప్పరయన్! భార. శా 3 6. 190.

2. శిష్యుఁడు.

శ్రోతవ్యము సం. విశ. (అ. ఆ. అ.) వినదగినది. విననింపైనది.

శ్రోతస్సు సం. వి. స్. న. 1. చెవి. 2. జ్ఞానేంద్రియము.

శ్రోత్రపేయము సం. విశ. (అ. ఆ. అ.) చెవితోఁ ద్రాగఁదగినది., ఆసక్తితో వినఁదగినది.

శ్రోత్రము సం. వి. అ. న. 1. చెవి. 2. శబ్దమును గ్రహించు నింద్రియము. 3. వేదమందలి ప్రావీణ్యము (విల్యమ్సు).

శ్రోత్రసుఖము సం. విశ. (అ. ఆ. అ.) శ్రావ్యమైనది, చెవికింపైనది.

శ్రోత్రియము సం. వి. అ. న. స్వల్పముగా నిచ్చు పన్ను. (ఈ యర్థమున నిది శాసనవాఙ్మయమునను, వ్యవహారమునను గానఁబడుచున్నది). రథసప్తమి పుణ్యకాలమందు కృష్ణాగర్భమందును సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను శ్రోత్రియం సుంకం తలారికం అంది...యిస్తిమి. 1476 గు. జి. నెకరికల్లు శాసనము.

శ్రోత్రియుఁడు సం. విశ. (అ. ఆ. అ.) వేదములు బాగుగాఁ జదివిన వాఁడు. వి. అ. పుం. 1. వేదము చదువుకొనిన బ్రాహ్మణుఁడు

సీ. ... శ్రోత్రియాగ్రియవృత్తిఁ జూపించు నొకవేళ నొకవేళఁ గడుజ్యోతిషికతఁ దనరు. నిరంకుశో. 4 74.

## శ్రౌ

శ్రౌతము సం. విశ. (అ. ఈ. అ.) 1. శ్రోత్రేంద్రియమునకు సంబంధించినది, చెవిసంబంధమైనది. 2. వేదసంబంధమైనది, వేదవిహితమైనది

గీ. జ్ఞాన మాధ్యాత్మికంబైన శ్రౌతమైన, లౌకికంబైన నేరిచే నాకలించె, మున్నుగా వారికిని భక్తి మ్రొక్కవలయు...... సూత. అ. 2. పు. 114

3. యజ్ఞసంబంధమైనది.

వి. అ. న. 1. వేదవిహితమైన సంస్కారము (కర్మము). 2. వేదోక్తాచారము.

శా... శ్రౌతని, ర్దిష్టాచారధురంధరత్వమున... నిరంకుశో. 1. 59.

మారిని ... శ్రౌతశాఖాగ్రవ...! శాం. విరా. 1. 15

3. సిద్ధాగ్నిహోత్రపాలనము,

పుం, త్రేతా, గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అను మూఁడగ్నులు,

శ్రౌతసూత్రము సం. వి. అ. న. శ్రుతుల నాధారముగాఁ జేసికొని ఆశ్వలాయన సాంఖ్యాయన కాత్యాయనాదులచే రచింపఁబడిన పెన్నబడు కల్పసూత్రములు,

శ్రౌతి సం. వి. ఈ. స్త్రీ. ఇత్యాదిశబ్దప్రయోగము గల పూర్ణోపమాలంకారభేదము.

తే గీ. అందు నుభయాఖ్య మగుఁ బూర్ణ యాద్రిశ్రౌతి, యనఁగ రఘురామసన్నిభుఁ డనెడి చోట, నార్థి కం దప్పుఁడును బోలె నలరు చుండ, నధిపుఁ డనుచోట శ్రౌతియై యతిశయిల్లు న. ౯. 9.

శ్రౌతి సం. వి. న్. పుం. శ్రౌతసూత్రము నెఱిఁగిన వాఁడు.

శ్రౌత్రము సం. వి. అ. న. 1. శ్రోత్రేంద్రియము, చెవి. 2 వేదమందలి ప్రావీణ్యము.

## శ్ల

శ్లక్ష్ణకము సం. విశ. (అ. ఆ. అ.) 1. నున్ననిది, మెత్తనిది. 2. సుందరము, ఇంపైనది.

వి. అ. న. పోఁకచెక్క, క్రముకము.

శ్లక్ష్ణము సం. విశ. (అ. ఆ. అ.) 1. మెత్తనిది, మృదువైనది. పరుషము కానిది (మాట మొ.). 2. నున్ననిది. 3 సన్ననిది, సూక్ష్మమైనది. 4. సుందరమైనది, మనోహరమైనది. 5. నిష్కపటమైనది, మాయ లేనిది.

వి. అ పుం పోఁకచెట్టు.

శ్లథము సం. విశ. (అ. ఆ. అ.) 1 కట్టు బడినది. 2. వదులైనది, పట్టు విడినది, శిథిలము, బిట్టులేనిది. 3. వీడినది, ముడి విడినది (జుట్టు).

## శ్లా

శ్లాఘ సం వి. ఆ. స్త్రీ. 1. పొగడ్త, ప్రశంస.

శా. శ్లాఘాలంఘనజాంఘికోజ్జ్వలగుణాలంకార ... మనుచ. 4. 120.

2. ఆత్మస్తుతి, తన్నుఁ దా మెచ్చుకొనుట. 3. ముఖస్తుతి. ఇచ్చకము. 4. సేవ, కొలువు. 5. అభిలాష, కోరిక.

**శ్లాఘనము** సం. వి. అ. న. 1. స్తుతి, పొగడ్త, 2. ముఖస్తుతి, ఇచ్చకము.

**శ్లాఘనీయము** సం. విశే. (అ. ఆ. అ.) శ్లాఘ్యము.

**శ్లాఘావిపర్యయము** సం. వి. అ. పుం. ఆత్మస్తుతి లేక పోవుట, తన్నుఁ దాఁ బొగడుకొనకుండుట.

**శ్లాఘించు** సం. స. క్రి. కొనియాడు.

కం. ఆఖేటమునకు ధాత్రీ, లేఖర్షభుఁ డనుమతింప లేలెం డనుచున్, శ్లాంఘించుమఁ బడవాళుల, లాఘవమునఁ బనిచి రగ్గలంబుగఁ జాయల్. కృ. శకుం. 1. 51.

ఇందు వర్గప్రాస ముపయోగింపఁబడినది.

**శ్లాఘితము** సం. విశే. (అ ఆ. అ.) కొనియాడఁబడినది, పొగడఁబడినది.

**శ్లాఘ్యము** సం. విశే. (అ. ఆ అ.) 1. కొనియాడఁదగినది, స్తుతింపఁదగినది. 2. గౌరవింపఁదగినది, ఆదరింపఁదగినది.

## శ్లి

**శ్లికువు** సం. వి. ఉ. పుం. 1. వ్యభిచారి, జారుఁడు. 2 హానిసవాఁడు.

న జ్యోతిశ్శాస్త్రము.

**శ్లికుర్రవు** సం. వి. ఉ పుం. వ్యభిచారి, జారుఁడు 2. సేవకుఁడు.

**శ్లిష** సం వి. ఆ స్త్రీ. 1. ఆలింగనము, కౌఁగిలింత. 2. అంటుకొనుట.

**శ్లిష్టము** సం విశే (అ. ఆ అ.) 1. కౌఁగిలింపఁబడినది. 2. అంటుకొనినది, సంసృష్టము, 3. అనుకొనినది 4 శ్లేష (రెండర్థములు) గలది.

కం నిరతము శ్లిష్టవిశేష్యత నరుదఁదును ప్రకృతములను నప్రకృతములున్. నరస. 5. 162.

**శ్లిష్టి** సం వి ఇ స్త్రీ. 1. కౌఁగిలింత, ఆలింగనము. అంటుకొనుట.

## శ్లీ

**శ్లీపదప్రభవము** సం వి. అ. పుం. మామిడి (వృ. వి.).

**శ్లీపదము** సం. వి. అ. న. ఏనుగుకాలు, బోదకాలు.

**శ్లీపది** సం విశే. (న్. నీ. న్.) బోదకాలు గలవాఁడు

**శ్లీలము** సం. విశే. (అ. ఆ. అ.) శ్రాలము 1. అభివృద్ధి గలది, సంపద గలది. 2. శోభ గలది. 3. మర్యాద గలది, సభ్యమైనది (వ్య. అశ్లీలము.

## శ్లే

**శ్లేషము** సం. వి. అ. పుం. 1. కౌఁగిలింత, ఆలింగనము. 2. అంటియుండుట. 3. కలయిక, సంధి. 4. ఒకానొక కావ్యాలంకారము (ఒక పదమునకు రెండర్థములు వచ్చునట్లు రచించుట). 5. దాహము, కాల్చుట, కావ్య గుణములలో నొకటి (బహుపదములు కూడి ఏకపదముగా భాసించునట్లు రచించుట)

**శ్లేషభిత్తికము** సం విశే. (అ ఆ. అ.) శ్లేషమాధారముగాఁ గలది.

**శ్లేష్మకము** సం. వి అ. పుం శ్లేష్మము.

**శ్లేష్మఘ్న** సం వి ఆ స్త్రీ ఒకజాతి మల్లె (వృ. వి). 2 గజ్జేరు (వృ వి.). 3. మానేరుతీగె (వృ. వి ). 4. మొగిలి (వృ వి.).

**శ్లేష్మఘ్ని** సం. వి. ఈ. స్త్రీ శ్లేష్మఘ్న.

**శ్లేష్మణము** సం విశే (అ. ఆ. అ.) శ్లేష్మరోగము గలది.

**శ్లేష్మము** సం. వి. న్. పుం. కఫము.

గీ. ... గుబిలి చెమట పుసులుగోరు శ్లేష్మం బస్రు, జలములివి శరీరమలము లయ్యె. విజ్ఞా. కాం. 1. 42.

**శ్లేష్మలము** సం. విశే. (అ. ఆ. అ ) శేష్మముగలది.

**శ్లేష్మాత(క)ము** సం. వి అ. పుం. శేలువు, విరిగిచెట్టు (వృ. వి.)

**శ్లేష్మికము** సం. విశే. (అ. ఈ. అ.) 1. శ్లేష్మము గలది 2. శ్లేష్మవృద్ధి కలిగించునది.

## శ్లో

**శ్లోకము** సం. వి. అ. పుం. 1. నాలుగుపాదములు గలిగి ఛందోబద్ధమయిన వాక్య విశేషము, 2. అనుష్టుభ్ ఛందమున గూర్పఁబడిన పద్యము. 3. యశస్సు, కీర్తి.

కం. ఆకర్ణింపుము చెప్పెద, నా కథ నేపాళ దేశ మందు నుదాత్త శ్లోకుఁడు, భద్రకుఁడను నొక, భూకాంతాధిపుఁడు వేఁట వోయివచోటన్. భోజరా. 4. 52.

4. లోకోక్తి. 5. సామెత. 6. సూక్తము.

**శ్లోణుఁడు** సం. వి. అ. పుం. కుంటివాఁడు.

## శ్వ

**శ్వగణము** సం. వి. అ. పుం. (వేఁట) కుక్కల గుంపు.

**శ్వగణికుఁడు** సం. వి. అ. పుం. 1. వేఁటకాఁడు. 2. కుక్కలను పెంచువాఁడు,

**శ్వదంష్ట్రి** సం. వి. అ. స్త్రీ. పల్లేరు; గోక్షురకము. (వృ. వి.).

**శ్వధూర్తము** సం. వి. అ. పుం. నక్క.

**శ్వనిశ** సం. వి. ఆ. స్త్రీ. కుక్కలు మత్తిల్లి మొఱఁగెడి రాత్రి.

**శ్వనిశము** సం. వి. అ. న. శ్వనిశ.

**శ్వపచుఁడు** సం. వి అ. పుం. 1. చండాలుఁడు.

తే గీ. శ్వపచతతి నంటి యశుచియై జలము గ్రోలి ... ధర్మఖం. 1. 207.

2. కుక్కలను పెంచువాఁడు. 3. ఉరితీయు తలవరి.

**శ్వపదము** సం. వి. అ. న. 1. కుక్క కాలు, కుక్క పాదము. 2. (దొంగకు గుర్తుగా మొగమున వాఁత వేయఁబడిన) కుక్క పాదము వంటి గుర్తు.

**శ్వపాకుఁడు** సం. వి. అ. పుం శ్వపచుఁడు, చండాలుఁడు.

శుని చైవ శ్వపాకే చ బ్రాహ్మణా స్సమదర్శినః.

**శ్వఫలము** సం. వి. అ. న. మాదీఫలము (వృ. వి ).

**శ్వఫల్కుఁడు** సం, వి. అ. పుం. అక్రూరుని తండ్రి.

**శ్వభీరువు** సం. వి. ఉ. పుం. సృగాలము, నక్క.

**శ్వభ్రము** సం.వి.అ.న. 1. రంధ్రము, బిలము,గుహ.

**శ్వయనము** సం. వి. అ. న శ్వయము.

**శ్వయము** సం. వి. అ పుం వాఁపు, శోఫ.

**శ్వయథువు** సం. వి. ఉ. పుం. వాఁపు, శోఫ,

**శ్వయీచి** సం వి. ఈ. స్త్రీ. 1. రోగము. 2. పీడ, బాధ.

**శ్వవృత్తి** సం. వి. ఇ. స్త్రీ 1. కుక్క బ్రదుకు. 2. దాస్యము, సేవ.

**శ్వవ్యాఘ్రము** సం. వి. అ. పుం 1. ఘాతుక జంతువు. 2. పెద్దపులి. 3 చిఱుతపులి.

**శ్వశురుఁడు** సం. వి. అ పుం. 1. మామ, భర్తతండ్రి, భార్యతండ్రి. 2. గౌరవార్హుఁడు, గౌరవింపఁదగిన మనుష్యుఁడు ద. అత్తమామలు

**శ్వశుర్యుఁడు** సం. వి. అ పుం 1. బావమరిది. (క) శ్యాలుఁడు, భార్యతోఁబుట్టిన వాఁడు. (చ) దేవలుఁడు, భర్తతోఁ బుట్టినవాఁడు. 2. మఱఁది, భర్తతమ్ముఁడు.

**శ్వశ్రువు** సం. వి. ఈ. స్త్రీ అత్త. 1. భార్య తల్లి. 2. భర్తతల్లి.

**శ్వశ్రూశ్వశురులు** సం. వి. అ. పుం. ద్వి. వ. అత్తమామలు.

**శ్వశ్శ్రేయసము** సం. విణ. (అ. ఆ. అ.) శుభ ప్రదమైనది మంగళకరము వి. అ. న. 1. శుభము. 2. సుఖము. 3. పరబ్రహ్మము.

**శ్వసనము** సం వి. అ. పుం 1. గాలి, వాయువు. 2.మదనవృక్షము, మ్రంగ చెట్టు. న. 1 శ్వాసము, ఊపిరి 2. నిట్టూర్పు

**శ్వసనాశనము** సం వి.అ.పుం. గాలిమేపరి, పాము.

**శ్వసనుఁడు** సం. వి. అ. పుం వాయుదేవుఁడు.

శా. త్రేతాద్వాపర సంధి మద్ధతమదాంధీభూత విద్వేషిజీమూతో గ్రశ్వసనుండు ... భార. ఆది. 1. 78.

2. ఇంద్రునిచే జయింపబడిన యొక రాక్షసుఁడు.

**శ్వశనేశ్వరము** సం. వి. అ పుం. అర్జునము. మద్దిచెట్టు.

**శ్వసనోత్సుకము** సం వి అ పుం పాము.

**శ్వసితము** సం. విణ. (అ. ఆ. అ.) ఊపిరి విడిచినది, ఊపిరి విడుచుచున్నది. వి. అ. న. 1. శ్వాసము,

ఊపి ... ట్టూర్పు.

శ్వ స్తనము సం. విశ. (అ. ఆ. అ.) ... భవిష్య త్కాల ... శ్వస్తనము.

ఇక్లే శ్వస్త్యము.

## శ్వా

శ్వాగణికుఁడు సం. వి. అ. పుం. కుక్కల సాహాయ్యము చే వేటాడువాఁడు.

శ్వాదంతము సం. వి. అ. పుం. కుక్కదంతము. కుక్కపల్లు.

శ్వాదంతుఁడు సం. విశ. (అ. ఆ. అ.) కుక్క దంతముల వంటి దంతములు గలవాఁడు, కుక్క వంటి వాఁడు.

శ్వానిద్ర సం. వి. ఆ. స్త్రీ. శునకము యొక్క నిద్ర, గాఢముకాని నిద్ర.

శ్వానము సం. వి. న్. పుం. అ. పుం. కుక్క; నకారాంతములకు సమాసముల భేదముండును. ఉదా: శ్వగృహీతము. శ్వానగృహీతము.

శ్వాపదము సం. విశ. (అ. ఈ. అ.) ఘాతుకమైనది. క్రూరము.

వి. అ. పుం. 1. ఘాతుక జంతువు. 2. పెద్దపులి.

శ్వాపుచ్ఛము సం. వి. అ. పుం. న. కుక్క తోఁక.

శ్వావిధము సం. వి. ధ్. పుం. పెద్ద ముళ్లపంది శల్యము.

శ్వాశ్వఁడు సం. వి. అ. పుం. కాలభైరవుఁడు.

శ్వాసకాసము సం. వి. అ. పుం. ఉబ్బసము, రోగ విశేషము

శ్వాసకుఠారము సం. వి. అ. పుం. ఉబ్బసమును మాన్పెడి యొక యౌషధము.

శ్వాసధారణము సం. వి. అ. న. ప్రాణాయామము, ఊపిరి బిగఁబట్టుట.

శ్వాసము సం. వి. అ. పుం. ఊపిరి.

వ. వికలేంద్రియ వర్గుఁడయి శ్వాసమాత్రంబు దక్కి ... భార. ఆది. 8. ...

2. నిట్టూర్పు 3. వాయువు, గాలి. 4. ఉబ్బసము, రోగవిశేషము. 5. (వ్యాక.) వర్ణోచ్చారణమునకైన బాహ్య ప్రయత్నములలో నొకటి.

శ్వాసరోధము సం. వి. అ. పుం. ఊపిరి నాకట్టుట.

శ్వాసహేతి సం. వి. ఇ. స్త్రీ. నిద్ర.

శ్వాసి సం. విశ. (న్. నీ. న్.) 1. శ్వాసము కలవాఁడు ఊపిరి గలవాఁడు. వి. న్. పుం. వాయువు, గాలి 2. ప్రాణముగల జంతువు. ప్రాణి. 3. ముక్కుమాట లాడువాఁడు

## శ్వి

శ్వితము సం. విశ. (అ. ఆ. అ.) తెల్లనిది. వి. అ. న. తెలుపు.

శ్విత్తి సం. వి. ఇ. స్త్రీ. తెలుపు.

శ్విత్యము సం. విశ. (అ. ఆ. అ.) తెల్లనిది. ఇక్లే శ్విత్న్యము.

శ్విత్రఘ్ని సం. వి. ఈ. స్త్రీ. పీతపర్ణి. తెలుమణి (వృ. వి). తెలుకొండి.

శ్విత్రము సం. వి. అ. న. 1. తెల్లకుష్టము. 2. చర్మముపైఁ బుట్టుకుష్టసంబంధమైన తెల్లమచ్చ

శ్విత్రి సం. విశ. (న్. ణీ. న్.) శ్విత్రముగలవాఁడు. వి. న్. పుం. శ్వేతకుష్ఠరోగి

శ్వేత సం. వి. ఆ. స్త్రీ 1. గవ్వ 2. గజ్జెను (వృ. వి.). 3. తెల్లగలిక (వృ.వి.) 4 స్ఫటికము. 5 పాకము పట్టిన పంచదార, కలకండ. 6. వెదురు బియ్యము. 7. అగ్ని సప్తజిహ్వలలో నొకటి.

శ్వేతకము సం. వి. అ. పుం. గవ్వ. న. రజతము వెండి.

శ్వేతకుటజము సం.వి.అ పుం. పాలకొడిశ (వృ.వి.).

శ్వేతకుష్ఠము సం. వి. అ. న. తెల్లకుష్ఠము, శ్విత్రము

శ్వేతకేతువు సం. వి. ఉ. పుం 1. బౌద్ధసన్యాసి. 2. దుర్భిక్షసూచకమైన ఉత్పాత విశేషము, ఒకానొక ఋషి.

శ్వేతకోలము సం. వి. అ. పుం. శఫరము, ఒక జాతి చేప.

శ్వేతగరుత్తు సం. విశ. (త్). తెల్లని ఱెక్కలు గలది వి. త్. పుం హంస.

శ్వేతగరుతము. సం. వి. అ. పుం. —శ్వేతగరుత్తు.

శ్వేతచ్ఛదము సం. వి. అ. పుం. 1. హంస 2. ఒకజాతి తులసి (వృ. వి.)

శ్వేతద్వీపము సం. వి. అ. పుం. 1. పదునెనిమిది ద్వీపములలో నొకటి. 2. విష్ణుదేవుని నివాసమయిన వైకుంఠము.

శ్వేతధాతువు సం. వి. ఉ. పుం. 1. గనిలో బుట్టిన తెల్లనిధాతు విశేషము. 2. సుద్ద. 3. పాలరాయి

శ్వేతధామము సం. వి. అ. పుం. 1. కర్పూరము. 2. సముద్రపునురుగు. 3. ఒక జాతిచేప వెన్నెముక.

శ్వేతధాముఁడు సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు.

శ్వేతనీలము సం. వి. అ. పుం. 1. మేఘము, మబ్బు. 2. తెలుపు నలుపు కలిసిన వర్ణము. విశ. (అ. ఆ. అ) తెలుపు నలుపు కలిసిన వర్ణము కలది.

శ్వేతపత్రము సం. వి. అ. పుం హంస.

శ్వేతపత్రరథుఁడు హంసవాహనుఁడు, బ్రహ్మదేవుఁడు.

శ్వేతపాకి సం. వి. ఈ స్త్రీ. తెల్లగురిగింజ.

శ్వేతపింగ(ల)ము సం. వి. అ. పుం. 1. సింహము. 2. తెలుపు పసుపు కలసిన వర్ణము. విశ. (అ ఆ. అ.) తెలుపు పసుపు కలసిన వర్ణము గలది.

శ్వేతపింగలుఁడు సం. వి అ. పుం. శివుఁడు.

శ్వేతబృహతి సం వి. ఈ స్త్రీ. తెల్ల ములక (వృ. వి).

శ్వేతమరిచము సం. వి అ. న. తెల్ల మిరియము.

శ్వేతమాలము సం. వి. అ. పుం. 1. మేఘము, మబ్బు 2. పొగ. 3. మునగవిత్తు.

శ్వేతము సం. విశ. (అ. తా. నీ. అ) తెల్లనిది.

సీ. శ్వేతాతపత్రాళి వెలఁది వెన్నెలగాసెఁ గార్తీక శశిపరంపరలఁ బోలి. నార. 2. 98.

కం శ్వేతాశ్వపాటవం బుద్యోతితమై మెఱయఁగా. భార. కల్య. 1. 46.

వి అ పుం. 1. తెలుపు. 2. శంఖము. 3. గవ్వ. 4. శుక్రగ్రహము 5. తెల్లమబ్బు. 6. జీలకము, జీలకఱ్ఱ. 7. ఒకానొక పర్వతము, కైలాసము. 8. శ్వేతద్వీపము. 9. దినముయొక్క రెండవ భాగము.

న. 1. వెండి, రజతము.

శ్వేతరంజనము స. వి. అ న సీసము, లోహ విశేషము.

శ్వేతరక్తము సం. విశ. అ ఆ అ పాటలవర్ణము గలది, కొంచె మెఱ్ఱనిది. గులాబిరంగు కలది.

వి. అ. పుం. పాటలవర్ణము, కొంచె మెఱ్ఱనిరంగు, గులాబిరంగు.

శ్వేతరథుఁడు సం. వి అ పుం. శుక్రుఁడు, శుక్రగ్రహము.

శ్వేతవల్కలము సం. వి. అ. పుం. వృక్షవిశేషము, మేడిచెట్టు.

శ్వేతవాజి సం. వి. న్ పుం 1. చంద్రుఁడు. 2. అర్జునుఁడు. 3. కర్పూరము

శ్వేతవా(స)సుఁడు సం. వి. స్. పుం. తెల్లబట్టలు కట్టుకొన్న సన్యాసి, జైనసన్యాసి.

శ్వేతవాహనము సం. వి. అ. పుం. మకరము, మొసలి.

శ్వేతవాహనుఁడు సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు. 2. చంద్రుఁడు. 3. ఇంద్రుఁడు.

శ్వేతవాహుఁడు సం. వి అ. పుం. 1. అర్జునుఁడు. 2. ఇంద్రుఁడు.

శ్వేతశుం(శృం)గము సం. వి. అ. పుం. యవసస్యము (వృ. వి.).

శ్వేతసురస సం. వి. ఆ. స్త్రీ. తెల్ల వావిలి (వృ. వి.)

శ్వేతాంబరుఁడు సం. వి. అ పుం జైనసన్యాసి.

శ్వేతాశ్వతరము సం. వి. అ. పుం. వేదశాఖా విశేషము, ఒకానొక వేదశాఖ.

శ్వేతుఁడు సం వి అ పుం శుక్రుఁడు, దైత్యులగురువు.

శ్వేతోదరుఁడు సం వి. అ. పుం కుబేరుఁడు.

శ్వేతౌహి సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రుని భార్య, శచి.

శ్విత్రము సం వి. అ న. శ్విత్రము, శ్వైత్రము, ఇట్లే శ్వైత్ర.

## శ్వై

శ్వైత్యము సం వి. అ న. తెలుపు శ్విత్రము.

## శ్వో

శ్వోభూతము సం. విశ. (అ ఆ. అ. మఱునాఁడగునది, పరదినమువం దగునది.

**శ్రోవసీయము** సం. విశే. (అ. ఆ. అ.) సుఖప్రదము, సుఖకరము.
వి. అ. న. సుఖము, మంగళము.
**శ్రోవసీయస్సు** సం. విశే. స్. శ్రోవసీయము.

## ష

**షము** సం. విశే. అ. ఆ. అ. 1. శ్రేష్ఠమైనది. 2. తెలివిగలది.
వి. అ. పుం. 1. ఒక అక్షరము. 2. నాశము. 3. ముగింపు. 4. శేషము 5. ముక్తి. 6. జ్ఞాననాశము 7. స్వర్గము. 8. నిద్ర. 9. చూచుకము. 10. వెంట్రుక. 11. గర్భవిమోచనము.
**షండకుఁడు** సం. వి. అ. పుం. పేడివాఁడు.
**షండము** సం. వి. అ పుం. న. 1. రాశి, సమూహము. 2. గొబ్బిలు మున్నగు వానిమంద.
మ. కమలేందీవరషండమండితలసత్కాసార సేవారతిన్. శృం. నై. 2. 25.
శా... సరోజ షండములు నిద్రాణంబు లయ్యెం గడున్. మ. 8. 12.
వి. అ. పుం. 1. ఆఁబోతు. 2. పేడి. 3. పొగ్గడి.
**షండాలి** సం. వి. ఈ. స్త్రీ. 1. నీటిగుంట. 2. అసఁతి, జారిణి. 3. సేరులో 16వ భాగము.
**షండతిలలు** సం. వి. అ. పుం. 1. మొలవని నువ్వులు! విత్తనమునకుఁ బనికిరాని నువ్వులు. (షండతిలుఁడను పదమును కొంరమాలినవాఁడను నర్థమున నాలంకారికముగా వాడుదురు.)
**షండ(క)ము** సం. వి అ. న. నపుంసకలింగము.
**షండు(డకు)ఁడు** సం. వి. అ. పుం. పేడివాఁడు.
**షట్** సం. విశే. ష్. ఆఱు.
కం. క్రమమునఁ బ్రస్తారము నష్టము నుద్దిష్టమును వృత్తసంఖ్య యనంగా నమరు లగక్రియ యనన ధ్వము నన షట్ప్రత్యయములు దనరున్ గృతులన్. కవిజనా. షట్ప్ర. 2. (ఇది తెలుఁగున సిద్ధసమానములందే కన్పించును.)
**షటి** సం వి. ఈ. స్త్రీ. గంట్ల కచోరము (వృ. వి.).
**షట్కము** సం. విశే. అ ఆ అ. ఆఱు విధములైనది.
వి. అ. న. 1. ఆఱింటి సమాహారము. 2. కామ మదమానలోభహర్ష రోషముల సమూహము.
వి అ. పుం. ఆఱు
**షట్కర్ణము** సం విశే. అ. ఆ అ. ఆఱుచెవులచే (అనఁగా చెప్పువాఁడు - చెప్పఁబడువాఁడు కాక మూఁడవ వానిచే వినఁబడునది) 2. అనేక శ్రోతలకుఁ జెప్పబడినది. వి. అ. పుం ఒక విధమైన వీణ.
**షట్కర్మములు** సం. వి న్. న. 1. బ్రాహ్మణునికి విధింపఁబడిన ఆఱు కర్మములు (అధ్యాపనము, అధ్యయనము, యజనము, యాజనము, దానము, ప్రతిగ్రహము). 2. బ్రాహ్మణునకు ఉచితములైన ఆఱు జీవనోపాయములు (ఉంఛము, ప్రతిగ్రహము, భిక్ష, వాణిజ్యము, పశుపాలనము, కృషికర్మ). 3. మాంత్రికుఁ డొనర్చు ఆఱు విధములైనపనులు (శాంతి, వశీకరణము, స్తంభనము, విద్వేషము, ఉచ్చాటనము, మారణము). 4. యోగాభ్యాసమునకు సంబంధించిన ఆఱు కర్మలు (ధౌతి, వస్తి, నేతి, నౌలికి (నౌలికము), త్రాటకము, కపాలభాతి).
**షట్కర్ముఁడు** సం. వి. న్. పుం 1. అధ్యయనాధ్యాపనాది షట్కర్మనిష్ణాతుఁడైన బ్రాహ్మణుఁడు.
**షట్కాలములు** సం. వి. అ. పుం. శివపూజకు విధింపఁబడిన యాఱు వేళలు. అరుణోదయము, తపనోదయము, సంగవము, మధ్యాహ్నము, సాయాహ్నము, అర్ధరాత్రము).
**షట్కోణము** సం. వి. అ. న. 1. ఆఱుకోణములు గలది (క్షేత్రగణితము). 2. ఇంద్రుని వజ్రాయుధము. 3. వజ్రము.
**షట్చక్రములు** సం వి. అ. న. శరీరమందలి యోగశాస్త్ర ప్రసిద్ధములైన ఆఱు చక్రములు (మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము. అనాహతము, విశుద్ధము, ఆజ్ఞాఖ్యము).
**షట్చరణము** సం. వి అ. పుం. 1. తేఁటి. 2. ఒక విధమైన మిడుత. 3. పేను.
**షట్ఛాస్త్రములు** సం. వి. అ న. 1. ఆఱు శాస్త్రములు (శిక్ష, వ్యాకరణము, అలంకారము, జ్యోతిషము, ఛందస్సు, తర్కము). (తర్కవ్యాకరణధర్మమీమాంసావైద్యజ్యోతిషము లని కొందఱు).

షట్ఛాస్త్రి సం. వి. న్. పుం. ఆఱు శాస్త్రములు జదివినవాఁడు.

షట్త్రింశతి సం. వి. ఈ. స్త్రీ. 1. షడ్దర్శనములు. 2. ఆఱు తీఁగలు గలది.

షట్తిలి సం. వి. న్. పుం. నువ్వులతో నాఱుకర్మము లొనరించు వాఁడు. (తిలోద్వర్తి, తిలస్నాయి, తిలహోమి, తిలప్రదుఁడు. తిలభుక్కు, తిలవాపి.)

షట్పదజ్యము సం. విజ. (అ ఆ. అ.) తుమ్మెదలు నారిగాఁగలది. (మన్మథ ధనుస్సు)

షట్పదప్రియము సం. వి. అ. పుం. నాగకేసర వృక్షము.

షట్పదము సం. వి. అ. పుం. 1. తేఁటి. 2. పేను. 3. ఆఱు పాదములు గల పద్యవిశేషము.

షట్పదాతిథి సం. వి. ఇ. పుం. 1. మామిడి చెట్టు. 2. చంపకవృక్షము.

షట్పదానందవర్ధనము సం. వి. అ. పుం. అశోక (కింకిరాత) వృక్షము.

షట్పది సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతుమ్మెద. 2. ఆఱుపాదములుగల పద్యవిశేషము. 3. ఆఁడు పేను. 4. ఆఱు స్థితులు. (క్షుత్తృష్ణాశోకమతి భ్రంశజరామృత్యువులు.) (కామ క్రోధ లోభ మోహమదమానము లని కొందఱు)

షట్పాదము సం. వి. అ. పుం. తుమ్మెద.

షట్ప్రజ్ఞుఁడు సం. వి. అ. పుం. 1. ధర్మార్థ కామ మోక్షములు, జగత్తత్వము, ఈశ్వరతత్త్వము అను ఆఱువిషయముల నెఱిఁగినవాఁడు. 2. కాముకుఁడు. 3. సౌజన్యముగల ప్రాతివేశికుఁడు. (పొరుగింటి వాఁడు).

షట్ప్రమాణములు సం. వి. అ. న. ప్రత్యక్షము, శబ్దము, ఉపమానము, అనుమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి యను ఆఱు జ్ఞానకరణములు.

వ. అపరిమిత ప్రకారవినిరస్త సమస్త వికార షట్ప్రమాణ పరమదూర ... భార. విరా. 3. 238.

షడంగజిత్తు సం. వి. త్. పుం. విష్ణువు.

షడంగములు సం. వి. అ. న. 1. శరీరమువందలి ఆఱు అవయవములు. (జంఘలు, బాహువులు, శిరస్సు, మధ్యము.) మంత్రోచ్చారణ పూర్వకముగా స్పృశించు నాఱు అంగములు. హృదయ శిరశ్శిఖా నేత్రకవచాస్త్రములు.

శా. పంచబ్రహ్మ షడంగమంత్రసహిత ప్రాసాద పంచాక్షరీ చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠా తత్పరత్వంబునన్. హర. 7. 33

3. ఆఱు వేదాంగములు (శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము) 4. గోవువలన లభించు ఆఱు మంగళ ద్రవ్యములు (గోమూత్రము, గోమయము, క్షీరము, ఘృతము, దధి, గోరోచన.) 5. ఆఱు వస్తువుల సమూహము.

షడంఘ్రి సం. వి. ఇ. పుం. తేఁటి.

షడంశము సం. వి. అ. పుం. ఆఱవ భాగము.

షడక్షీణము సం. వి. అ. పుం. చేఁప.

షడభిజ్ఞుఁడు సం. వి. అ. పుం. దేవతగా నారాధింపఁబడు బౌద్ధ సన్యాసి.

షడరత్ని సం. విజ. (ఇ. ఇ. ఇ.) ఆఱు చిటికెన చాచిన మూరల ప్రమాణము గలది.

కం. షడరత్ని ధనుర్ధరుఁడె య్యెడ నజితుఁడు... భార. ఆది. 7. 16.

షడష్టకము సం. వి. అ. న. (జ్యోతిషము) ఒకానొక యోగము.

షడహము సం. వి. అ. పుం. ఆఱు దినముల కాలము

షడాననుఁడు సం. వి. అ. పుం. కుమారస్వామి (ఇట్లే షడ్వక్త్రుఁడు; షడ్వదనుఁడు షడాస్యుఁడు మొ) తంలము. హరిహరరాజగజాననార్కషడాస్య మాతృ సరస్వతీ గిరిసుతాదిక దేవతాతికి న్నమస్కృతిం జేసి...... భార. ఆది.

షడామ్నాయము సం. వి. అ. పుం. తంత్ర షట్కము.

షడూర్ములు సం. వి. ఇ. పుం. క్షుత్తృష్ణాశోక మోహ జరామరణములు.

షడూషణము సం. వి. అ. న. మిరియములతోఁ గూడిన పంచకోలముల సమాహారము.

షడృతువులు సం. వి. ఉ. పుం. ఆఱు ఋతువులు (వసంత, గ్రీష్మ, వర్ష, శరత్. హేమంత, శిశిర ములు).

షడ్గయలు సం. వి. ఆ. స్త్రీ. గయాగజము, గయాదిత్యము. గాయత్రి, గదాధరము, గయ, గయాసురము అను ముక్తిదాయకములైన యారు గయలు.

షడ్గవము సం. వి. అ. న. 1. ఆఱెద్దుల సమూహము. 2. ఆఱెద్దుల కాఁడి.

షడ్గవీయము సం విశే. (అ. ఆ. అ.) ఆఱెద్దులచే లాగఁబడునది.

షడ్గుణము సం. విశే. (అ. ఆ. అ) 1. ఆఱువిధములైన. 2. ఆఱు గుణములుగల.

వి. అ. న. 1. ఆఱుగుణముల సమూహము. 2. రాజవలంబించు నాఱువిధములైన వైదేశికవిధానము షాడ్గుణ్యము (సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము.)

గీ. అరులు మిత్రు లుదాసీను లనుచు సంధివిగ్రహాది షడ్గుణముల వెరవు లోకరుఁ దలవరించుచు...... భార. శాంతి. 6. 107.

షడ్గ్రంథ సం. వి. ఆ. స్త్రీ. 1. గండ్లకచోరము (వృ. వి.) 2. వస (వృ. వి.)

షడ్గ్రంథము సం. వి. అ. పుం. 1. గండ్లకానుగు (వృ. వి.) 2. కరంజవృక్షము.

షడ్గ్రంధి సం. వి. ఇ. న. పిప్పళ్ళ వేరు.

షడ్జము సం. వి. అ. పుం. సప్తస్వరములలో మొదటిది. (నాల్గవ దని కొందఱు.) ఇది నెమలి కేకను బోలి యుండును.

షడ్జకుఁడు సం. వి. అ. పుం. తోడియల్లుఁడు శ.ర. (ఇది కొన్ని సంస్కృత చాటుశ్లోకములం దున్నది గాని సంస్కృత కావ్యములందు కనఁబడలేదు.)

షడ్దర్శనములు సం. వి. అ. న. ఆఱు విధములైన భారతీయతత్త్వాన్వేషణమార్గములు, (సాంఖ్యము యోగము, న్యాయము, వైశేషికము. మీమాంస, వేదాంతము.) 'షడ్దర్శని'.

షడ్దర్శనుఁడు సం వి. అ. పుం. పై యాఱు విధానములలో నిష్ణాతుఁడైనవాఁడు.

షడ్దీర్ఘములు సం. వి అ. పుం. ఆఱు దీర్ఘాచ్చులు. (ఆ ఈ ఊ ఋూ ఐ ఔ.)

షడ్దుర్గములు సం. వి అ. న. ఆఱు విధములైన కోటలు. (స్థలదుర్గము, జలదుర్గము, గిరిదుర్గము, వనదుర్గము, మృద్దుర్గము, మనుష్యదుర్గము,)

షడ్బిందుఁడు సం వి. ఉ. పుం విష్ణువు.

షడ్భాగము. సం.వి.అ పుం. 1. ఆఱవభాగము (1/6) 2. కప్పము. 3, మిడుఁగురు. శ. ర.

షడ్భావవాది సం. వి. న్. పుం. ద్రవ్యగుణ కర్మసామాన్య విశేషసమవాయము లను నాఱుభాగముల సిద్ధాంతమును బలపఱుచు వాఁడు.

షడ్భుజ సం. వి ఆ స్త్రీ. 1, దుర్గ, 2. పుచ్చకాయ.

షడ్భుజము సం. విశే. (అ. ఆ. అ ) ఆఱు భుజములు కలది.

వి. అ. పుం. (క్షేత్ర) ఆఱుభుజములుగల ఆకృతి.

షడ్రసములు సం. వి అ. న. బహు ఆఱురుచులు. (కషాయము, మధురము. లవణము, కటువు, తిక్తము, ఆమ్లము.)

షడ్రాత్రము సం. వి అ. న. ఆఱురాత్రులకాలము.

షడ్రేఖ సం. వి. ఆ. స్త్రీ. పుచ్చకాయ.

షడ్వర్గము సం వి. అ పుం. 1. ఆఱువస్తువుల సమాహారము. 2. అంతశ్శత్రు షట్కము కాలము క్రోధము, మోహము, మదము. మాత్సర్యము.

షడ్వింశము సం విశే. (అ. ఆ. అ.) ఇరువది యాఱవది.

గీ వినుము కేవలత్వమున షడ్వింశదర్శనంబు పురుషునకొదవి తన్మయత గలుగు. (ఈశ్వర తత్త్వము) భార. శాంతి. 6. 145

సం. వి. అ. న. సామవేదమునకు సంబధించిన బ్రాహ్మణము.

షడ్వింశకము సం. వి. అ. న. ఇఱువది యాఱింటి సముదాయము.

షష్టికము సం విశే. (అ. ఆ. అ ) అఱువదితో గొనబడినది.

వి. అ. పుం. షష్టిక.

షష్టిక్యము సం.విశే. (అ. ఆ. అ ) షష్టికలు పండునది. (పొలము)

షష్టితంత్రము సం. వి. అ. న సాంఖ్యమునకు సంబంధించిన 60 భావములతోఁ గూడిన సిద్ధాంతము.

షష్టిపూర్తి సం. వి. ఇ. స్త్రీ. అఱువది సంవత్సరములు నిండుట.

షష్టిభాగుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

షష్టిమత్తము సం వి. అ. న. అఱువదియేండ్లు కలిగి యా సమయమున మదావస్థ నందిన యేనుఁగు

షష్టియోజని సం. వి. ఈ. స్త్రీ అఱువది యోజనముల పైనము.

షష్టిహాయనము సం. వి. అ. పుం. 1. అఱువదేండ్ల వయసుగల యేనుఁగు. 2. ఒక విధమైన వరి.

షష్ఠము సం. విశే. (అ ఈ అ.) ఆఱవది.

షష్ఠాంశము సం వి. అ. పుం. 1. ఆఱవపాలు 2. రాజునకుఁ బన్నుగాఁ జెల్లింపఁబడు పంట మొదలగు వాని యందలి ఆఱవపాలు.

షష్ఠాన్నకాలము సం. వి. అ. పుం. ప్రాయశ్చిత్తముగా మూఁడుదినముల కొకసారి భోజనమొనర్చుట.

షష్ఠి సం వి ఈ. స్త్రీ 1. తిథులలో నాఱవది, 2. (వ్యాకరణ) ఆఱవవిభక్తి. 3. 16 దివ్యమాతృకలలో నొకతెయైన కాత్యాయనీరూప దుర్గ. 4. ప్రసవించిన ఆఱవనాఁడు పూజింపఁబడు దేవత.

షహరు హిం వి పట్టణము శ. ర.

షహసానువు సం. విశే. (ఉ. ఉ. ఉ.) క్షమాపూర్ణము వి. ఉ. పుం 1. నెమలి 2. యజ్ఞము.

## షా

షా హిం వి. 1. రాజు. 2 చదరంగము నందలి యొక యెత్తు.

షాట్కౌశికము సం. విశే (అ. ఈ. అ.) ఆఱు అవ ణములచే నాచ్ఛాదింపఁబడినది.

షాట్పౌరుషికము సం. విశే. (అ. ఈ. అ.) ఆఱు తరములకు సంబంధించినది.

షాడబము సం. వి. అ. పుం. 1 మధురాది రసము. శ. ర. 2. ఆఱు రుచులలోఁ గూడిన చోష్యము. గీ. శాకపాకరసావళీషాడబము. కాశీ. 4. 119. కం. నానావిధషాడబముల నాను నృపాహార మెపుడు. ఆము. 4. 281

షాడవము సం. వి. అ పుం. 1. సప్తస్వరములలో నేవేని యాఱు స్వరములుగల రాగము. 2. గానము 3. ఖానము. 4. మిఠాయి మున్నగు తినుబండారములు.

షాడవికుఁడు సం. వి. అ. పుం. మిఠాయి మున్నగు తినుబండారములు నమ్మువాఁడు.

షాడ్గుణ్యము సం. వి. అ. న. 1. ఆఱు గుణములసమాహారము (ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అను భగవంతుని షడ్గుణములు) 2. రాజు ప్రయోగింపవలసిన ఆఱు మార్గములు. (సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము) 3 ఆఱు రెట్లు.

షాణ్మాతురుఁడు సం వి అ. పుం కుమారస్వామి.

షాణ్మాసికము సం. వి. (అ ఆ అ.) 1. ఆఱు నెలకొకతూరి వచ్చునది. 2 ఆఱునెలల వయస్సు కలది

షాపు ఆం. వి అంగడి దుకాణము.

షాష్ఠము సం. విశే (అ. ఈ. అ.) ఆఱవది.

## షి

షికారీ హిం. వి. వేటకాఁడు.

షికారు హిం. వి వేట, సంచారము.

షిద్గుఁడు సం. వి. అ. పుం. 1. విటుఁడు, 2. కాముకుఁడు, ఇచ్చ వచ్చినట్లు తిరుగువాఁడు.

## షు

షుఁడు సం. వి. అ పుం. విద్వాంసుఁడు.

షురువు హిం వి. ఆరంభము.

షువు సం. వి. ఉ. పుం. ప్రసవము.

## షే

షేధము సం. వి. అ. పుం నిషేధము.

## షై

షైరు ఆం. వి. విహారము.

## షో

షోకు హిం. వి. అందము, విలాసము.

షోడత్తు సం. విణ. (త్ తీ. త్.) ఆఱుపండ్లు గలది.
షోడశము సం. విణ. అ. ఈ. అ పదునాఱవది.
గీ. సంభవి తు రిట్టు షోడశంబుదాఁక .. భార. అను. 4. 126.
వి. అ న్. త్రి. పదునాఱు.
షోడశ(శి)కము సం. విణ. అ. ఈ. అ. 1. పదునాఱు విధములైనది.
షోడశకళలు సం. వి. అ. స్త్రీ. చంద్రుని యొక్క పదునాఱు వన్నెలు. అమృత, మానద, పూష, తుష్టి పుష్టి. రతి, ధృతి, శశిని. చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, అమృత).
షోడశభుజ సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి.
షోడశమాతృకలు సం. వి. అ. స్త్రీ. పదునాఱుగురు మాతృదేతలు (గౌరి, పద్మ, శచి, మేధ, సావిత్రి, విజయ, జయ, దేవసేన, స్వధ, స్వాహా, శాంతి, పుష్టి, ధృతి, తుష్టి, కులదేవత, ఆత్మదేవత).
షోడశాంగము సం. విణ. (అ. ఈ. అ) 16 భాగములు గలది.
షోడశాంగులకము సం. విణ (అ. ఆ. అ.) పదునాఱంగుళముల వెడల్పు గలది.
షోడశాంఘ్రి సం. వి. ఇ. పుం. పీత.
షోడశాంశువు సం. వి. ఉ. పుం. శుక్రగ్రహము.
షోడశార్చి సం. వి. ష్. పుం. శుక్రగ్రహము.
షోడశావర్తము సం. వి. అ. పుం. శంఖము.
షోడశి సం. వి. న్. పుం అగ్నిష్టోమయాగభేదము.
షోడశోపచారములు సం వి అ పుం. పదునాఱు విధములైన సేవలు. ఆవాహనము, ఆసనము, పాద్యము అర్ఘ్యము, ఆచమనీయకము, అభిషేకము, వస్త్రము యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము నమస్కారము.)
షోఢన్యాసము సం వి. అ. పుం. తాంత్రిక గ్రంథములతో శరీరమును స్పృశించు నాఱు విధములు.
షోఢాముఖుఁడు సం. వి. అ. పుం. కుమారస్వామి.
షోడత్తు సం. వి. అ. పుం. ఆఱు దంతములుచేసిన కోడె.

# ష్ఠ

ష్ఠఘుమము సం. వి. అ. పుం. 1. కాంతి. 2. నీరు. 3. చారము. 4. శుభము.
ష్ఠఘుముఁడు సం. వి అ. పుం. చంద్రుఁడు (ష్ఠ్యముఁడు).

# ష్ఠి

ష్ఠీవనము సం. వి. అ. న. 1. ఉమ్మివేయుట. ఉమియుట, 2. ఉమ్మి. (రూ) ష్ఠేపనము.

# స

స ఉభ. ఒక యక్షరము.
అవ. 1. సమాన పూర్వపదమయిన 'సహ' శబ్దమునకు బహువ్రీహిలో వికల్పము గాను, అవ్యయీభావమున నిత్యము గాను ఆదేశముగా వచ్చు రూపము. (ఉదా. సపుత్రుఁడు, సకర్మము, సతృణము. సచక్రము) 2. సమాన శబ్దమునకు బహువ్రీహి సమాసమున పూర్వ పదమగునపుడు ఆదేశముగా వచ్చు రూపము. (ఉదా. సజాతి, సగోత్రుఁడు మొ.)
సం. ఇది సంస్కృతమున 'సమ్' అను నుపసర్గమునకు హల్లు పరమగుచో మకారమున కనుస్వారమువచ్చిన రూపము. సంస్కృత విశేష్యములకు ముందున్నప్పుడు 'మిక్కిలి' యనియు సంస్కృత క్రియం ముందున్నప్పుడు 'చక్కగా' అనియు అర్థము వచ్చును. (ఉదా. సంరూఢము: సంక్షోభము; సందర్శించు, (శ. ర,)
సంక వి. (సం. శంకా) శంక; సందేహము.
కం, ఆ సభ నమ్మోయి నీ దు, శ్శాసనుఁ డప్పిండు పుత్రసతిఁ గ్రూరాత్ముఁడై సంకలేక పెద్దయుఁ, గాసిం బెట్టంగ........(భార. స్త్రీ 2. 58).
సంకటుపడు మి. అ. క్రి (సంకటము+పడు)
1. ఇఱుకటపడు.
వ. అజుండు జగంబులు సృజియింప జంతు సంతానంబు వెరఁగి సమ్మర్దం బధికంబై యూర్పు వోవని యక్లైన నద్దేవుఁడు సంకటపడి సంహార ప్రకారంబు విచారింప (భార. శాం. 5. 203).
2. బాధపడు.
కం. తనయుని నడిగిన నీఁడని, జనులాడఁగఁ జెవులు

నేఁడు సంకటపడవే. (ఉ. హరి. 2. 77.)

**సంకటపఱచు** (పఱచు) మి. స. క్రి. (√సంకటపడు) బాధించు, పీడించు

కం. దపతపలాడుచుఁ బాడెదు, క్షపణకునిం జూచి బుద్ధసంయమి సిద్ధాధిపమధురసవానంబీ, చపలునికిం గ్రొత్తచేసి సంకటపఱచెన్. (ప్రబోధ. చం. 3. 60)

**సంకటపోటు** సంకటపడుట, బాధ.

కం. అటుగావుననే నిపుడా, జటిశేఖర వరతపంబు సఫలముగ మరుత్పట భేదవపరిపృథుసం, కటనాటుడిగింతు మిమ్ముఁ గడు వలరింతున్. (చంద్రా. 3. 182)

**సంకటపెట్టు** మి స. క్రి. 1 బాధపఱచు, పీడించు,

సీ. విమఁడెల్ల సత్వంబులను బెంటి, జంపుట పాపంబు, గోవుల బ్రాహ్మణులను సంకటపెట్టంగఁ జనదు. (భార. శాం. 3 182)

2. సంమర్దము గలిగించు.

సీ. హిడవన్నగంబున దేను లోకహితార్థమైన మహాతప మాచరింప, గోవులుసుట్టుఁ దేఁకువనెడి తిరిగినన్ సంకటపెట్టివఁ బంకజాక్షి (భార. మను. 4. 433.)

**సంకటము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఇఱుకైనది, అల్పావకాశము గలది.

మ. జవరా లోర్తు ప్రియోపనాయకభుజాసంశ్లేష లీలాసుఖ వ్యవసాయంబు సమాజ సంకటమునం బ్రార్థించి కైకొంచు... శృం. నై. 6. 64.

2. చొరరానిది: ప్రవేశింప శక్యముకానిది. 3.నిండినది; పూర్ణమైనది.

వి. అ. న, 1. ఇరుకు కనుమ, రెండుకొండలసందు త్రోవ, ఇఱుకుసందు త్రోవ. 2. కష్టము. ఆపద.

సీ. గదములు ముందుగఁ గదలు శీఘ్రంబున మారి సంకటములు మందటిల్లు. శివధర్మ. 2. 26.

3. సమ్మర్దము,

గీ....దుఃఖసంకటము ఘనము. శివధర్మ. 5. 23.

వ. అర్భకులు తలక్రిందై యతి సంకటంబులైన నితంబిని యోనిముఖంబుల వచ్చునప్పుడు ... శివధర్మ. 5. 25.

**సంకటి** వి. (త. చంకటి) పండిన రాగిపిండి లోనగునది చిక్కగాఁ గాచిన అంబలి తోఁప.

చం. దిటమున రెడ్డిపాటుపడి తెచ్చి యిడింగను గూటి ప్రొద్దుసం, కటి తటి వెన్నమజ్జిగలు సంకటిపైఁ బవలింటినిద్రలున్. (శుక. 2. 263.)

తే. తే. తెచ్చి సుఖమతియను నామధేయమువను, పరఁగు ప్రియురాలి చేతికేద్పడఁగనీయ నాబిడన్నంబు సంకటి యంబలియను, చేయ సమరేయి వేళబోసేసి పోవు (హంస. 4. 32.)

చం. కాఁగుల నీరు మజ్జనం, బున కమలంచి దేవతల పుట్టమొనంగుచు బొడ్డుగిన్నెలో, నునుతురు రాగి సంకటి తలోదరు లద్భుతశక్తిఁ జూపుచున్. (శుక. 2. 335.)

సీ. కలదండి పసిఁబిండి కాఁచి చేమికిఁ బెట్టి యొఱఁగ కుండగబట్టి యుట్టి నొట్టి, కోళ్ళసంకటి తోడఁ గూడు నీళ్ళడి జాగునెరవక బంటు బానిసలఁ బనిచి. (వే. పంచతం. 4. 414.)

2. పిష్టవిశేషము. పిష్టనామము పిట్టము తద్విశేష మగుఁదోఁప సంకటి. (ఆం. వ. పారి. 78.)

తే. గీ. అమరికల గల్గి సంకటి తమదరొట్టె, వేఁట పొట్టజవ మినుపసిండి మెరిక, లొడికముగ బొక్కదగదీరఁ బడినకోళ్ళఁ, గఱచి కాటుల, గెల్చురక్కాముకోళ్ళ (ప్రబం. 1. 182.)

తే.గీ. ప్రొద్దుకూఁగంగ నిలుఁజేర పెద్దతెలెను బెట్టు సంకటి మెక్కుచుఁ బొట్టనిండఁ జెప్పుకాళ్ళను గుక్కి పైఁజేరి గుఱుక లిడుచు నిద్రించు నారెడ్డి కొడుకు రేలు. (ఉత్తర. హరిశ్చం. 4. 13)

**సంకథ** సం. వి. ఆ. స్త్రీ. సంభాషణము.

**సంకథనము** సం. వి. అ న. పరస్పర కథనము—లెస్సగాఁ (కథాదులను) జెప్పుట.

**సంకపుఁబూస** వి శంఖపు చిప్పతో చేసిన పూస.

**సంకము** వి. (క. సంక) శంఖము.

ద్వి. కలయంగఁజెవుల సంకంపుఁ బూసలును. (పండితా. పర్వ. 343.)

(ఇట శంఖపుఁబూసలు అనియుఁ జతింపవచ్చును)

**సంకరము** సం. వి. అ. పుం. 1. మిశ్రమ వర్ణములకు మూలమును ధర్మవిరుద్ధమునైన అంతర్వివాహము. 2. భేదమెఱుంగరాని కలయిక.

వ. కర్పూర కస్తూరికాకుంకుమ సంకుమద పంక

సి. కనకపుగ ఫణ ఘన ఫణప్పాణతంబుల నలంకరించి. శివభ. 2. 1.
నీరక్షీరన్యాయమున భిన్నములైన అర్థాలంకారం బొక్కచోఁ గలయుట. 2 అల కార విశేషము. 5. అస్పృశ్యస్పర్శమువలనఁ గలిగిన అపరిశుద్ధము. 6. మంటలచిటచిట 7 చీఁపురుతోఁ దుడిచిన పెంట.

**సంకర్షణము** సం. వి. అ. న. 1. కలపుట. దగ్గరగాఁ జేర్చుట 2. ఆకర్షించుట లాగుట. 3. దున్నుట. 4. హ్రస్వము చేయుట.

**సంకర్షణుఁడు** సం. వి. అ. పుం. బలరాముఁడు

**సంకలన** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రోగుచేయుట, ఏక రాశి చేయుట 2. సంబంధము, సంధి. 3. సంఘట్టనము. 4. కలియుట 5. (గణిత) కూడిక.

**సంకలనము** సం. వి. అ. న. సంకలన.
కం. ఓంకార మగ్ని శశి పిత్ర్య, పంకజభవవాయు పద్మబాంధవ దివిజుల్, సంకలన మెనఁగు నువవీ, శాంకమునను సూత్రమునకు నధిదైవంబుల్. విజ్ఞా. కాం. 1. 29.

**సంకలము** సం. వి. అ. పుం. 2. కూడఁబెట్టుట. 2. కలుపుట. 3. సమకూర్చుట.

**సంకలిత** సం. వి. అ. పుం. (గణిత) మొదటిలెక్క

**సంకలితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రోఁగు చేయబడినది. 2. కలుపఁబడినది 3. బలాత్కారముగాఁ బట్టుకొనబడినది 4. చేర్పఁబడినది.
కం. సంకలితోదయరక్తిక, శాంకుఁడు శోభిల్లె... భీమ. 2. 41.
5. మూలఁ బొందఁబడినది. వి. అ. న. 1. కూడిక: సంకలనము. 2. కూడఁగా వచ్చిన లబ్ధము

**సంకలితైక్యము** సం. వి. అ. న. (గణిత) నిసర్గ సంఖ్యా పరంపరల మొత్తములను గూడఁగా వచ్చిన లబ్ధము.

**సంకలియ** వి. (సం. శృంఖలికా) సంకెల, కాళ్ళకుఁ గట్టెడు గొలుసు; గొలుసు; చెఱ.
చం..... చోంతతి కన్నుల నొప్పి తమ బు గొంగ జారుల పెనుఁగాలి సంకలియ రుద్రుని పువ్వు. భా. రా. యుద్ధ. 2847.
చం. అలవి యెఱుంగ నేరక దశాస్యుఁడు లోకము తోడి వానిఁగాఁ దలఁచి జితాఖిలాధ్యుఁ డఁగదా యని నచ్చికడఁగి వచ్చి సంకలియకుఁ జొచ్చె. నిర్వ 7. ఆ. 65.
గీ. సంకలియఁబెట్ట వచ్చిన శంకలేక. దశ. కు. 6. ఆ. 143.
ద్వి. ఆ పర్వతముఁ గృష్ణు నగ్గోధనంబు నా పల్లె యును దమ్ము వణఁగింతు నేను, అని పేర్చి విలయ కారాంభోధరములఁ గనుఁగొని కాళ్ళ సంకలియల నూడ్చి సిం, భాగవతము 2. అ 32 పు.

**సంకల్పజన్ముఁడు** సం. వి. న్. పుం. మన్మథుఁడు.

**సంకల్పజుఁడు** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**సంకల్పము** సం. వి. అ. పుం. 1. మనోనిశ్చయము. 5. ఉద్దేశము: లక్ష్యము: అభిప్రాయము 3. కోరిక; ఇచ్ఛ.
కం. వడిఁ జక్రంబున వైచిన నడుమున గురువందనుండు నఱకెం బున్యం బెడలిన నరుసంకల్పము, వడువునది వమ్ముగాఁగ వసుధాధీశా. భార. ద్రోణ. 5. 71.
4. తలంపు; భావన. 5. మనస్సు. 7, ఒక కర్మమాచరించుటకు ముందు చేయు ప్రతిజ్ఞ. 7. పవిత్ర కార్యమువలనఁ గలుగు ఫలమున కెదురు చూచుట; ఫలనిరీక్షణము, 8. ఆలోచన. 9. భర్తతోఁ గూడ నేకచితిపై దగ్ధమగు సమయమున వితంతువు చేయు ప్రకటన.

**సంకల్పయోని** సం. వి. ఇ. పుం. సంకల్పజన్ముఁడు: మన్మథుఁడు.

**సంకల్పరూపము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మనోనిశ్చయ రూపమైనది. 2. ఇచ్ఛానుకూలమైనది.

**సంకల్పించు** సం. స. క్రి. తలఁచు, ఎంచు, సంకల్పము చేయు.
వ. అవ్విప్రవర్యుండు నియంతుడై యా భూతపతి భార్య యనుకూలయు, సుశీలయుఁ గావఁ యునని సంకల్పించి...పుత్రకామేష్టి యొనర్చె మార్క. 5. 201.

**సంకల్పితము** సం. విశే. (అ. ఆ. అ.) 1 ఉద్దేశింపఁబడినది. 2. నిశ్చయింపఁబడినది. 3. తలపఁబడినది. భావింపఁబడినది.

సంకసుకము సం. విశ. (అ. ఆ. అ.) 1. చంచలము, స్థైర్యము లేనిది. 2. నిశ్చితము కానిది, సందేహాస్పదమైనది 3. దుష్టము చెడ్డది 4 దుర్బలము; బలము లేనిది. 5. సంకీర్ణము, సాంకర్యము నొందినది. 6. అపవాదశీలము.

సంకారము సం. వి. అ. పుం. 1. చీపురుతోఁ దుడిచిన పెంట; అవకరము. 2. అగ్నిజ్వాలల చటచటాత్కారము,

సంకారి సం. విశ. (న్. ఈ. న్.) 1. సంకరమైనది. కలిసిపోయినది. 2. భిన్నజాతి స్త్రీ పురుషుల వలన జన్మించినవాఁడు.

సంకీర్ణజాతివాఁడు. వి ఈ. స్త్రీ. క్రొత్తగాఁ తెలుప బడిన కన్నె,

సంకాశము సం. విశ. (అ ఆ. అ.) (సమాసాంతమున) 1, సమానమైనది; పోలినది.

కం. రాజన్యకకరతలవి, భ్రాజితజంబీర గౌరఫల సంకాశా...సార. 5. 209.

సీ.... ధవళాంశు సంకాశ దశనవిర్యత్ప్రభా సముదయం బతుల దంతములు గాగ, చిత్రభా. 2. 158.

సమీపమందున్నది. వి. అ. పుం. 1. రూపము, ఆకారము, 2. సామీప్యము, సన్నిధి.

సంకిలము సం. వి. అ. పుం. కొఱవి కట్టె: కొఱకచ్చు

సంకిలి వి. శృంఖల. గీ. జనుల సంకిళ్ళు విడిపించి పనిచినారు. కాశీ. 4. 66.

సంకిలియ వి. సంకెల.

గీ. పుష్కలావర్తకాది కాంభోధరముల సంకిలియ లూడ్చి తెప్పించి సత్వరమున. హర. 2. 14.

వ. బడలిక యుడుగఁ గూర్కిలేచి పేరేనుంగు విడిచిన నాము బురదకై నేలమూఁగి జిమ్మిన కెలవఁ బడిన సంకిలియల పొలుపుగల తుమ్మెద కదుపులును అచ్చు. తె భారవి. 8 ఆ. 38. వు.

సంకీర్ణ సం. వి. అ. స్త్రీ. ఒక విధమైన కఠినప్రశ్న.

సంకీర్ణజాతి సం. విశ (ఇ) భిన్నవర్ణముల వారైన తల్లిదండ్రులకుఁబుట్టినవాఁడు (సంకరజాతివాఁడు) 2. భిన్న జాతి జంతువులకుఁ బుట్టినది, (కంచరగాడిద)

సంకీర్ణము. సం.విశ. (అ. ఆ. అ) 1. బహుజనసమ్మర్దమున నిఱుకైనది (స్థలము) 2. వివిధము; నానావిధమైనది. 3. వ్యాపించినది, వ్యాప్తము. 4. భేదము కానరాకుండఁ కలిసినది

మ. జలకంబార్చి, విభూతిఁబెట్టి కటి గుంజాబీజ సంకీర్ణ మేఖల బంధించి .... శ్రీకాళహస్తి. 3-32.

4. మదించినది. 6. సంకర జాతియందుఁ బుట్టినది 7. స్వచ్ఛముకానిది. 8. అన్వయదార్ఢ్యము కలియుటచేఁ జెడినది. అవిశుద్ధము. వి.అ.న. కష్టము; అపద వి. అ. పుం. 1 మిశ్రరాగము. 2. భిన్న జాతి స్త్రీ పురుషులకుఁ బుట్టిన జాతి. 3. మదపు ఏనుఁగు.

సంకీర్తనము సం.వి.అ.స్త్రీ. 1. పొగడుట, స్తోత్రము చేయుట 2. దేవతాగుణములను గానము చేయుట. 3. భగవన్నామము పలుమా రుచ్చరించుట. వి అ. న. సంకీర్తనము.

సంకీర్తించు సం. స. క్రి. ప్రశంసించు; పొగడు.

వ, సేతుబంధనాది ప్రసంగంబులు సంకీర్తించు వంది మాగధాదులస్తుతి వచనంబు లేయ ... భా. రా. యు. 2608.

సంకు వి. 1. శంఖము. (త. చంకు క. సంకు) (సం. శంఖః).

గీ. జాలుపుట్టువు చిందము సంకు బూరగొమ్మ వందగు శంఖమ్ము అం. స. అచం. 48,

ఆం. పాండుసుతులు వారిబలము నొప్పి యార్చి సంకు లొత్తి. భార. భీష్మ. 3-431.

ద్వి. కంతు సంకున బొమ్మ గట్టిన గళము. హరిశ్చ. ఉత్త. 369.

తే.గీ. నురువు లద్దంబు పాలు కప్పురపు బూది సంకు టిక్కలు మంచ నీ రింకు మొగులు, దనయ సంబువ కెనగాక వెనుపు డింప, వెలసెనమన్ను వాలువు వేల్పుతేడు. అ. రా. యుద్ధ. 582.

తే. గీ. సంకు జిగివాఁడు వల కేల జింకవాఁడు, ప్రాత మగవాఁడు వెలిబూది పూఁతవాఁడు, మిక్కుటంబగు మక్కువ నొక్కనాఁడు, దనరఁ గలలోన మ్రోలఁ గన్గొనఁగ వయ్యె.

.అ ర. భాల. 1.

సీ. పాపవానెవిటికిఁ బట్టినసంకను నానుడి బధిరు విన గఁ జేసి ... రాజవాహన. 1. 86.
(చెవిటికిఁ బట్టిన సంకు=నిష్ఫలము) (ఇట్లే చెవిటికి సంకూదినట్లు. సుమతి. 65.)
2. శంఖవలయము
సీ. కాళ్ల యొప్పిద మూఁడు కట్ట మజ్జ్వలనము వేయఁగ సంకుల జాహు లంద మెడల. భార. విరా. 1. 225.
3. 'సంకు' అను పూస. వీనిని చెవుల ఆభరణము లుగాఁ దాల్తురు
వ ... చెవుల సంకులలో వంకభుజ బులు కొంకి సిగలు గాలి దుప్పటులు నొప్ప....
ఆము 4–౩౨,
3. అంచు.
తే. చేతివ్రజంపుఁబిడితోడి. చిక్కటూరి, చాయవలె వాటు దుప్పటి సంకు దోఁప, రాచిలుక తేజినెక్కెడు రౌతనఁగఁ, జక్కఁదన ముప్ప తిల్లంగ జనవిభుండు సారంగ. 1–79

సంకుచత్ సం. శత్రు. సంకోచము నొందుచున్న ముడుచుకొన్న.
గీ. ప్రకట మందాక్ష సంకుచత్పణములైన యురగ ముల యొడ్డుఁబాపి యయ్యుత్పలాక్షి యావ ధుర్యలు గదియించి రవనిభుజులఁ గాలఁమలిఁ దమిన్గఁ బాపి చె.గలువ బోలె.
శృం నై. ౯–౬1.

సంకుచించు సం అ క్రి సంకోచము నొందు.
తే గీ సు దరత్వమునకుఁ జోటిచ్చి తా సంకు, చి.చె నవఁగఁ గడుఁ గృశించె నడుము.
కవిక. 1. అ.

సంకుచితము సం. విణ. (అ. ఆ. అ.) 1. సంక్షేపము చేయబడినది. తగ్గింపఁబడినది 2. ముడిఁగినది ముడుచుకొనినది. 3. మూసికొనినది, వికసించనిది. 4. నిద్రించినది. (వాచ.) 5. కప్పునది,

సంకుటాకు (√ సంకు) వి. శంఖపుఁ జిప్పతో చేసిన చెవిపగ, ఒక విధమగు కర్ణాభరణము.
సీ. కర్ణార్పితంబులై గనుపట్టు సంకుటాకులు కృష్ణ పక్షతారల హసింప. చిత్రభార. 8–125.

సంకుమదము సం వి అ. పుం. జవ్వాజి.

కం. కరికుంభజాతమౌక్తిక, పరికరమును సంకు మదము ఫలములు వింజామరలు మృగమదముఁ గప్పురర, సిరమున్ గొని వచ్చె నొక్క చెం చయ్యో డకున్, చిత్రభా. 3. 116.

సంకులజంగాలు వి. దేవాలయము లందు శంఖము లూఁదు జంగములు,

సంకులము సం. విణ. (అ. ఆ. అ.) 1. కలవరపడినది తొట్రుపడినది. 2. నిండినది; పూర్ణము.
సీ...శృంగాంగనాభంగ సంగీత పరిపాక రుచి సార మాధురిసంకులంబు. శివధర్మోత్తరము. 2. 50.
3. క్రమము లేనిది. 4. పూర్వోత్తర విరుద్ధమైనది. 5. సంకీర్ణము. వి. అ. న. 1. గుంపు, సమూహము 2. దొమ్మియుద్ధము. 3. అసంగతమైన సంభాష ణము; 4 పూర్వోత్తర విరుద్ధమైన ప్రసంగము.

సంకులాఁడు వి. శాంఖకుఁడు.

సంకుపట్టు అ. క్రి. శంఖ మూఁదినట్టు లూఁదు.
సీ. చేసంకు పట్టుచు జిడుపలు పెడకుచు. దశకు. 6. 157

సంకువు సం. వి. ఉ. స్త్రీ. జవ్వాజి పిల్లి.

సంకూజితము సం. వి. అ. న. చక్రవాక పక్షిధ్వని.

సంకెల – సంకలియ, సంకిలి, సంకిలియ, (సం. శృంఖలా, శృంఖలికా. క. సంకలె. త. సంకిలి. మల. సంకల) వి. అపరాధుల కాళ్లకుఁగట్టు నినుపగొలుసు
సీ. శృంఖల నామంబు చెలఁగు సంకెల యన అం. భా. 2. 1౯5.
.... సంకెలనఁగ శృంఖల మలరు ...అం. వ. చం. 105.
వ. నందగోపునిం బట్టి బెక్కు సంకెలలం బెట్టు ుడు దక్కిన గోపకులను దలలు గోసివైపుండు. హరి. పూ. 7. 181.
చం. ... ఘనౌఘము వావకాళ్లకుం బలరిపుఁడాల యాశ్రముల భంగినె సంకెల లూన్పెనో యనన్. ఆము. 4–84,
కం. తెరవరులకాలి సంకెల, యరుదెంచెన్ వానకాల మాళిలంబై. రామ. 6–3

సంకేతకము సం వి. అ. పుం. 1. సమ్మతి, అంగీ కారము, ఒడఁబాటు. 2, నిర్ణయము, ఏర్పాటు 3, కలయుటకు నిర్ణయించుకొన్న చోటు.

సంకేతము (నిర్ణయము చేసిన కాముకుఁడు.

**సంకేతగృహము** సం. వి. అ. న. కాముకులు కలుసుకొనుట కేర్పఱచికొనిన స్థలము (ఇట్లే సంకేతనికేతనము మొ.).

**సంకేతనము** సం. వి. అ. న 1. ఒడబాటు, నిర్ణయము. 2. కాముకులు కలిసికొనుట కేర్ప ఱుచుకొనిన స్థలము.

**సంకేతము** సం. వి. అ. పుం. 1. మనోగత భావమును దెలుపుటకుఁజేయు హస్తాదిచాలనము; 2 సన్న. అర్థమును బోధించు శబ్దగతశక్తి విశేషము (అభిధాశక్తి).

కం. ఆదిమసంకేతగ్రహ, ణాదులు విస్మృతము లగుట....కళా.8. 185.

3. సమ్మతి, అంగీకారము. 4. గుఱుతు;సూచించు చిహ్నము. 5. నాయకునిచేఁగాని నాయికచేఁ గాని చేయఁబడినయేర్పాటు. 6. నాయికానాయ కులు కలయిక కేర్పఱుచు కొన్నస్థలము.

వ....సంజకడందారునొడివిన సంకేతంబుల నుం డక....మనుచ. ౬. 28.

7. నిబంధనము, ఏర్పాటు.

వ హుంకారిణీ మహాదేవికి వివాహసంకేత భవ నంబును.... భీమ. 2 55.

8. (వ్యాక.) లఘువివరణమునకై యేర్పఱిచిన సంజ్ఞ. 9. పేరు, సంజ్ఞ. 10. తెలుపుట.

**సంకేతించు** సం. అ. క్రి. ఏర్పాటుచేయు (గుర్తుచెప్పు).

కం. వెలవక సకేతించిన, తెఱఁగున నయ్యేడకు వరుగు దెంచు నొకో కొం,దఱఁదెచ్చు నొకో వెడఁగై, యటిముటి వెలిపుచ్చునొకొ రహ స్యం బెల్లన్. భార. విరా. 2. 277.

కం. దైతేయకామినీసం,ఘాతము మగ మొలకలైన కడుపులు శిగ సం,కేతించి నట్లు చక్రము, పాతా ళంబునకు వరుగుఁ బ్రతిపన్నానిన్. ఉ. హరి. 3. 157.

వ. అని యిట్లాదేవు దివ్యమహిమ లన్నియు మున్ననేకవిధంబుల వినికిఁజేసి యద్దేవి నిశ్చంచ లంబగు నిశ్చయంబున నిరపోతహాతృష్ణయై నిలిచెఁ గృష్ణుఁడు నట మున్న సంకేతించినవాఁడు గావున వచ్చుడు నన్నుఁగూడ వచ్చిన బలదేవున కొకింత యెఱిఁగించి హరి ఉ. 3. 91

**సంకేతితము** సం. విశే. (అ. ఆ. అ) 1. సంకే తమునఁ (అభిధాశక్తిచే) గలిగినది; వాచ్యము (అర్థము). 2. పిలువఁబడినది. 3. అంగీకరింపఁబడి నది 4. నిర్ణయింపఁబడినది.

**సంకోచనము** సం. వి. అ. న. ముడుఁగుట, ముడు చుకొనుట.

**సంకోచని** సం. వి. ఈ. స్త్రీ. సోఁకుడు ముడుఁగుచెట్టు (వృ.వి.). అత్తిపత్తిచెట్టు (వృ.వి.).

**సంకోచపిశునము** సం. వి. అ. న. కుంకుమపువ్వు.

**సంకోచము** సం. వి. అ. పుం. 1. ముడుఁగుట, ముడుఁచుకొనుట. 2. సంగ్రహ పఱుచుట; సంక్షేపము. 3. భయము, వెఱపు, జంకు.

గీ....కొంతసంకోచ మంద నాకొమ్మ తెఱఁగు, గని తొలఁగి పోయె నొక నెపంబునను మంత్రి. కళా. 8. 175.

4. మూయుట. 5. బంధము కట్టుట. 6. ఒక జాతి చేప. వి. అ. న. కుంకుమపువ్వు.

**సంకోచించు** అ. క్రి. 1. జంకు, వెనుదీయు.

శా. ... శైలారణ్యభాగంబులన్, గోపత్వంబున నుడుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్. భాగ. 10 పూ. 787.

మ. కుముదంబుల్ వికసింపఁ గోకములు సంకో చింపఁ గామిప్రజాళి మనంబుల్ దిలకింప నద్దెశలు తెల్వింతెంది రాజి వ. బిల్హ. 2-25

2. ముడుఁగఁజేయు, సంకుచితముచేయు.

వ. మహీధరసన్నిభంబగు తన గాత్రంబు సం కోచించి యణుమాత్రదేహుం డగుచు భా. రా. సుం. 76.

3. అనుమానించు.

కం. ఇంకని జలములు గలిగిన, నింకొక్కయగాధ సరసి నిశివం జాలున్, సంకోచింపక మము నీ, యంకిలి వాపుటకు నీవ యర్హుఁడ వెందున్. పంచ. నా. 1. 222.

**సంక్రందనుఁడు** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**సంక్రమణము** సం. వి. అ. న 1. చక్కఁగాఁ నడచుట, 2, కలయిక; కూడుట, ఏకమగుట

3. మార్గము. 4. వంతెన మొదలగు తరణసాధనము. (విల్సన్సు) 5. సూర్యుడొక రాశినుండి వేఱొక రాశిలోఁ బ్రవేశించుట. 6. లోకాంతరగమనము, చావు (విల్సన్సు) 7. మకరసంక్రమణము.

**సంక్ర(క్రా)మము** సం. వి. అ. పుం. 1. సహగతి, ఏకముగాఁబోవుట. 2. మాఱుట; మార్పు. 3 సూర్యాదిగ్రహము లొకరాశినుండి మఱొక రాశికిఁబోవుట. 4. ప్రయాణము చేయుట. పుం. న. 1. దుర్గమమార్గము, సందుత్రోవ, ఇఱుకుదారి 2. సేతువు, ఆనకట్ట. 3. కార్యసాధనోపాయము, ఉద్దేశించిన కార్యమును సంపాదించు సాధనము

**సంక్రమించు** సం. అ. క్రి. 1.చొరఁబడు, ప్రవేశించు

ఆ. అగుణ మయ్యు సంగుణతా వ్యాప్తి బొందు నక్షరము ప్రకృతిగుణము సంక్రమించి. భార. శాం. 6. 17.

2. ప్రాపించు, చేరు.

గీ. అఖిలకాలంబు నొక ప్రవాహంబుతోడ, భీమలింగంబు సేవించి బెరసి ప్రేమ యొరసి మది నుబ్బు పాతాళ మొరసి పారి, సప్తసింధువు మున్నీరు సక్రమించె. భీమ. 6. 24.

3. కలయు 4. దాటు 5. కలసివచ్చు 6. చెందు

**సంక్రాంతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సంక్రమించునది, సంప్రాప్తమైనది.

సీ .... గరళసంక్రాంతికంధరదయాసాగర హరిరాజకటక యనంగదళన. నారా 1. 116.

2. చక్కఁగా నడచినది 3. మాఱ్పఁబడినది 4. ప్రతిబింబితము, ప్రతిఫలించునది. 5. చిత్రింపఁబడినది; విస్పష్టమగునట్లు మాటలచేఁ దెలుపఁబడినది. 6. సంక్రాంతికలది. వి. అ. న. భర్తవలన స్త్రీకి సంప్రాప్తమైన యాస్తి.

**సంక్రాంతి** సం. వి. ఇ. స్త్రీ 1. కలిసివెళ్లుట; కలయిక.

ఉ .... మహితంబగు తత్కుచమధ్యరత్నసంక్రాంతిని హృత్ప్రదేశ మెసఁగన్మది నించుక పాఱఁజూచుచున్. కళా. 8. 200.

2. ఒకయంశమునుండి మఱియొక యంశమునకుఁ బోవుట. సూర్యాదిగ్రహముల రాశ్యంతరగమనము 3. ఇతరున కిచ్చివేయుట, అన్యునకుఁజెందఁ జేయుట, 5. ప్రతిబింబము, నీడ. 6. చిత్రము. 7. అర్థము విస్పష్టపడునట్లుచేయుట. 8. బోధనాశక్తి 9. మకరసంక్రమణము.

గీ. శ్రాద్ధయాగగ్రహణ సంక్రాంతి మృతజాత, సూతకముల నంత్యజాతి ముట్టినపుడు పుణ్యనదుల యందును దక్కఁగా స్నాన ముష్ణవారిఁ జన దొనర్ప. విజ్ఞా. కాం. 1. 55.

**సంక్రీడనము** సం. వి. అ. న. కలసియాడుట, కూడియాడుట.

**సంక్రీడించు** సం. అ. క్రి. 1. ఆడు; కలసియాడు.

మ .... కే, శివిలాసంబునఁదాండవారభటి సంక్రీడించుటన్ జెవ్విశ మ,ఖ్యవహరించెఁ గపాలి. నైష. 6. 99.

2. రథచక్రములవలె చప్పుడు చేయుట.

**సంక్రీడితము** సం. వి. అ. న. రథచక్రములధ్వని, బండి చక్రములధ్వని.

**సంక్రోశము** సం. వి. అ. పుం. దుఃఖించుట.

**సంక్లిష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1. గాయపడినది. 2. వలగఁగొట్టఁబడినది. 3 మాసినది, కాంతిచెడినది.

**సంక్లిష్టకర్ముఁడు** సం. విశే. (న...) దేనినైనను కష్టముతోఁ జేయువాఁడు.

**సంక్షయము** సం వి అ పుం. 1. ధ్వంసము, సంపూర్ణనాశనము

ఉ. కావున లోక సంక్షయము గన్గొని యెల్లెడ నిర్గమముండవై నీవును. భార. శాంతి. 5. 388.

2. పూర్తిగా వినియోగపఱుచుట. 3. నష్టము నాశము. 4. సమాప్తి, ముగింపు. 5. ప్రపంచనాశము; ప్రళయము.

**సంక్షయించు** సం అ. క్రి నశించు; క్షయించు.

గీ. కర్మములు సంక్షయించినకతన ... శివధర్మ. 5. 85.

సీ. సకలసస్యంబులు సంక్షయించిన నిమిత్తంబున జీవసంఘంబు నలిగె. వరా. 7. 52.

**సంక్షిప్తము** సం. విశే. (అ ఆ. అ.) 1. రాశి చేయఁబడినది; ప్రోఁగు చేయఁబడినది 2. సంకోచింపఁ జేయఁబడినది. ముడుచుకొనినది. 3. సంగ్రహపఱుపఁబడినది. 4. తగ్గింపఁబడినది. 5. ఆపఁబడినది; అడ్డగింప

బడినది. 6. రుష్టంబడినది, విసరివేయఁబడినది (బాణాది). 7. పట్టుకొనఁబడినది.

**సంక్షిప్తి** నం. వి. ఇ. స్త్రీ 1. కలిపి త్రోసి వేయుట. 2. సంకోచింపఁజేయుట; సంగ్రహపఱుచుట; 3. విసరివైచుట. 4. ఆకస్మికముగాఁ బైఁబడుటకుఁ బొంచియుండుట. 5. ఒక భావము నుండి మఱొక భావమునకు మాఱుట.

**సంక్షీణము** నం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి క్షీణించినది.

మ. ... నిరా, కృతశీలుండగు నాసుయోధనుఁడు సంక్షీణంబు నేనెం గులం,బతనిం బంపఁగఁ గోప మాఱెను... భార. శాంతి 1. 46.

**సంక్షేపణము** నం. వి. అ. న. 1. కలిసిత్రోగుచేయుట. 2. సంగ్రహపఱుచుట; 3. విసరివైచుట.

**సంక్షేపము** నం. వి. అ. పుం 1. కలిపిత్రోయుట. 2. సంగ్రహపఱచుట, సంకోచనము. 3 సంగ్రహము

కం. సర్వము సంక్షేపంబుగ, నిర్వచియించితిన నీకు నిర్మలబుద్ధిన్. సూత సంహిత. ఆ. 2. పు 111

4. సంగ్రహముగాఁ జెప్పుట. 5. విసరివైచుట. 6. తీసికొనుట. 7. ఇతరునిపనిలో సహాయపడుట.

**సంక్షేపించు** నం.న.క్రి. సంగ్రహపఱుచు, సంక్షేపము. చేయు.

**సంక్షోభము** నం.వి.అ పుం. 1. సంచలనము, కంపము. 2. చిత్తక్షోభము, కలత, కలవరపాటు. 3 వ్యత్యస్తమగుట, తలక్రిందగుట. 4. గర్వము, అహంకారము.

**సంక్షోభించు** అ. క్రి తొట్రుపడు, కలఁతపడు.

మ. ... అ, కులమయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్. భార. విరా. 4. 102.

మ. బలియుండా సొబగుండు భావభవదర్పభ్రాంతుడై వచ్చి ని,శ్చల సర్వాంగత నున్న నన్నఁసి నీ చందంబుగాకున్న నా, కులతంబొందెడు నప్డు మండపము సంక్షోభింపఁగా నేతు గట్టలుకన్ బెబ్బులిఁ గోల నేచినటు లుగ్రాకారం మేపారఁగన్ భార. విరా. 2. 281.

వ. నారాయణుండు వరేణ్యమూర్తి నొక్కటి నుత్పాదింప నూహించి తనమనంబు సంక్షోభింప జేసిన. వరాహ. 2. 159.

**సంఖ్య** నం. వి. ఆ. స్త్రీ. 1. లెక్కించుట; ఎన్నుట, గణన 2 ఒకటి రెండు మొదలగు లెక్క.

క. ధన మున్నట్టొనుటు యెఱుకుసు, ధనసంఖ్యయు నిమ్ము వక్షిం దలఁచ. గాలే,నని సాక్షిచెప్పునేనియు, ధనస్వామి లెం దెలుపినపుడు దైవము వలయున్... విజ్ఞా కా. 2. 55.

3 సంఖ్యావాచకము, అంకె 4 లెక్క; గణిత ప్రశ్న 5 సమ్యగ్బుద్ధి, ఆత్మవిషయకజ్ఞానము, 6. విచారణము. 7. ప్రకారము, పద్ధతి,

**సంఖ్యము** నం. వి. అ. న. యుద్ధము, పోరాట.

**సంఖ్యాత** నం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన కఠిన ప్రశ్న.

**సంఖ్యాతము** నం. విణ. (అ ఆ. అ) 1. ఎంచబడినది, లెక్కపెట్టఁబడినది. 2. మిగులఁ ప్రసిద్ధి కెక్కినది. 3. గుణింపఁబడినది. వి అ న. సంఖ్య, అంకె.

**సంఖ్యాతిగము** నం విణ (అ. ఆ. అ) లెక్కకు మించినది (ఇట్లే సంఖ్యాతీతము మొ).

**సంఖ్యానము** నం. వి. అ. న. లెక్కించుట, గుణించుట.

**సంఖ్యావంతుఁడు** నం. విణ. (త్. వతీ. త్.) 1, సంఖ్యగలవాఁడు. 2. ఆత్మవిషయక జ్ఞానము గలవాఁడు. నం. వి. త్. పుం. పండితుఁడు, విద్వాంసుఁడు.

**సంఖ్యావాచకము** నం. విణ (అ. ఆ. అ.) సంఖ్యను దెలుపునది. వి. అ. పుం. సంఖ్యను దెలుపునదము.

**సంఖ్యాసమాపనుఁడు** నం. వి అ పుం శివుఁడు.

**సంఖ్యేయము** నం. విణ. (అ. ఆ అ) లెక్కింపఁదగినది, గణనీయము.

**సంగ** సర్వ. సర్వము.

కం. మనునేడుగడంతెల్ల, న్ననుసంగన సర్వమునకు నలరారును. ఆం. ప. గుణ. 60

వి. (సం. సంఘటనమ్)

**సంగడము** విణ. సాటి, సమానము.

మ పొడువుం దిప్ప తటాలునం దిగిన యంభోజాప్త బింబంబు నం,గడమై రత్నమరీచివీచులు దిగ్వాటిన్ మిటారింపఁగా. సుద 5 27.

మిత్రము, చెలికాఁడు.

కం. కొడుకులుఁ దమ్ములు గట్టుపు, దడములు బెక్కైన బలవితానము దగు మై,నడపించు మెలపు నసం,గడములతో నరుగు శకుని గడు

నొప్పారెన్. భార. భీష్మ. 1. 91.
(ఇచ్చట నర్థము సేన. అని. శ. ర. వి.) 2. జత, స్నేహితుఁడు.
ఉ. మావుల నేలు మన్నెదొర మందసమీరుని సంగడంబు వె,త్తావులతావు తామరలతంపర జాజితొలంగుఁ బావలే,దీవమిటారి జవ్వనపుడీము పికాళుల మెట్టపంట గ్రొం, బూవిలుకాని సాహిణపుఁ బ్రోపరి యామని వచ్చె వత్తఱిన్. కృ. శకుం. 1.70.
3. చెలిమి, స్నేహము.
చం.....జన్మమున వయ్యెడు చుట్టఱికంబు కంటెను,స్థిరతరమైన సంగడముచే నగు బాంధవ మెక్కుడందురు. భార, ద్రోణ. 1. 50.
4. చేరిక, కలయిక (సం. సంగతమ్) (సంగతమని శ. ర. మున వెంగలి విత్తుశబ్దము క్రిందఁ బఠింపఁబడెను.)
కం. వెంగలి విత్తయి తిరుగుచు, గంగారై చెడక ముక్తిఁ గాఁచుంచు నతం, డంగనలతోడ విడువని, సంగడములు వదలవలయు జలజాతముఖీ! భాగ. 9. స్కం. 5. 83.
5. ఉజ్జి, పక్షము.
వ. అందఱు హరిణక్రీడనం బను నాటకుం దొడంగి రెండు సంగడంబులై కృష్ణుండును శ్రీధాముండును బెన్నుద్దులుగాఁ దక్కినవారునుం దమలోనం దొరయు భంగి దోయిగట్టిరి హరి. పూర్వ. 7.92.
6. పరివారము
సీ బిగువు జెన్నుల మీఁదఁ బెనువడంబైన చెంగలువ క్రొవ్విరుల సంగడము లగుచు ఉ. హరి. 1. 161.
ఉ. అంచెలు గట్టి కాలితొడునై చననీవు గదమ్మ ప్రోదిరా,యంచలి వేటి సంగడము లయ్యెను మను 5. 61.
7 సిద్దెమూఁత, కుతూముఖాచ్ఛాదనము, 8. మల్ల సాధన విశేషము, జెట్టిసాధన కుపయోగమైన యినుప గుండు (రాతిచక్ర మని కొందఱు).
మ. ఉరుసంధ్యాతపశోణమృత్క లితమై యొప్పారు బ్రహ్మాండము, న్గరిడిన్ గాలపు హాంకారుఁడు చరమాగస్కంధమున్ జేర్చు ని,బ్బరపున్ సంగడమోయనన్ శశిడిగెన్ బ్రాగ్భూమిభృత్కైతవేతర బాహాప్రసవు సంగడం బనఁగ మార్తాండుండు దోఁచెన్ దివిన్. మను. 6. 53.
సీ. పగతురచక్రంబు లెగుసంగడైతు ని,ట్లను రీతి సంగడాలమరఁ దార్చి. ఇందు. 2. 21.
సీ. సంగడాల్ బూన బుజాలంపు రాయంబు లరిలోడు ద్రిప్పువేల్ బరుల యుబ్బు. ప్రబం. 1. 84.
కం. కెంగేల శైల మెత్తిర,నంగ నగుదు రంత రావణ క్ష్మాధిపులన్, సంగడము కరణి ధరణిభు, జాంగమున్మన నిలువుదురు ధరాధిపతపనుల్. రాజ వాహన. 1. 50.
మ. అంరే యయ్యళి రామరాజు పెదతిమ్మాధీశు బాహాభయంకర కౌక్షేయకధార ఘోరువఁగడంకం ద్రెవ్వువీరారిమ,ల్లురకు న్మట్టి యగుంతదీయ బలధూళుల్ సంగడాలౌ వియ,చ్చర కాంతాస్తన పాళి విన్నరడి కాశ్చర్యంబు చర్చింపఁగన్. రామా.1.57.

సంగడి *విశే*. 1. సంబంధిజనము.
కం దొంగిలి తెచ్చిన దైత్యుని, సంగడులగువాని వాఁసాహస మొప్పన్. సంగరముఖమునఁ జంపక, దొంగిలి కొనిపోవఁదగునె దొంలకు నెందున్. మొ. రామా. సుం. 121.
2. (క. సంగడి.) తోడయినది; జతయైనది.
కం సంగీత విద్యకెలమిన్, సంగడి సాహిత్యవిద్య సరిగా రెండున్, మంగళవతి కలిగినయా, రంగు వచింపఁగఁదర మె లావణ్యనిధీ. బిల్హ. 1. 120.
వి. — సంగడము 1 స్నేహము; మైత్రి, జత.
గీ ... పొత్తు సంగడి గారాము పొందిక ... స్నేహమలరు. ఆం వ. గుణ 14.
సీ నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి...మిత్రభావంబు ఆం. భా. 2. 186.
కం సంగడిఁ దిరిగెడి శంభుఁడు, సంగాశ్రయమైన సిరియు నాత్మజుఁడై యు,ప్పొంగెడి పద్మజుఁడును గో,పాంగనక్రియఁ గరుణవడయ రథతేశ్వరుచేన్. భాగ స్కం. 10. 389.
ద్వి. మునికుమారులార! ముదమున మీరు, చని లోహితాస్యుని సంగడిఁ గూడి. హరిశ్చ. ఉత్త. 1780.
చం. సతులు పదాఱువేవురును సంగడిరావదనాంబుజంబునన్, గృతకనివాస మచ్చుపడ. హరి. 5. 74.

ద్వి. జాడిగ నీకిచ్చి పతిభక్తి సేయు, జాడలన్నియు నీదుసంగడి నేర్చి, నీవు వంకలు దీర్చ నీ పంపువనులు, గావించుచుండెదగాక వేగిర మె. హరిశ్చ. ఉత్త. 1190.

కం. ఇంగిలికము మణిశిలయున్, రంగుగ వైడూర్య రత్న రాజియుఁ దనలో, సంగల్రత్తిశృంగవగమున, సంగడి శోభిల్లు యథసాధ్యపురంబుల్. వరావా. 10. 148.

2. కూడిక. సాహచర్యము.

ఉ. గంగకు నేగి నీసుతునిఁ గంటిమి నెమ్మది నున్న వాఁడు మా, సంగడి వచ్చివచ్చి యొక చక్కటికిం బయనంబు చేసెనో, యంగననేట నెల్లిటను నాతఁడు వచ్చుఁదలంకకుండుమం,చేం గర మర్థి జెప్పునిజ సూక్తులు వీనుల కెన్నఁ దబ్బునో. భోజరా. 6. 306.

3. వలపు: అనురాగము.

ఉ. ... దు,ష్యంతుఁడు మాళకుంతలయు సంగడి నుండుట గాఁదలంపఁగన్. వి. శకుం 4. 91.

4. పార్శ్వము; ప్రక్క; నరన.

ద్వి. శృంగారములు నేసి చెలువలు నడువ సంగడిఁ గొలిచి రాజన్యులు నడువ. రం. రా. బాలకాం. 75 పు. 20 పం.

చం. పడుచును లేచుచు న్నరుఁడు భావము నందలి ముక్తసీమనం, గడిఁ బ్రవహించు శ్రీగగనగంగఁ దలంచి త్యజించుఁ బాపముల్. కాశీ. 5. 40.

కం. సంగడిఁ బిఱుంద ముందట, నింగియు నేల యును నిండి నిష్ఠురభంగిన్, బుంగవకేతను సుభటుల, భంగురవీరప్రతాపభయదస్ఫురణన్. కాశీ. 7. 81.

ద్వి వి సిగ్గురోఁతయు నెనఁగక వానిఁ, గొలిచి సంగడిఁజను గోసంగిబంట్లఁ, గలిసి. హరిశ్చ. ఉత్త. 1571.

గీ. తనకు సురరాజు నిజరాజధాని వైభ,వములు చూపుచు సంగడి వచ్చునపుడు, దను వతఁడు మించి చన నోడఁ దాను నతని, మించి చననోడఁ జౌరులీ డించి రలరి. కకు. 3. 58.

4 చేరువ, సామీప్యము; సాంగత్యము.

ద్వి. అంత సాజనవరేణ్యుండు, తనుజాతయున్న చందము విలోకించి, కడుఁగూర్మి వాదల సంగడి సెజ్జ మీఁద, నిడుకొని. ద్వి. పరమ. 1. 148 పం.

ద్వి. పొంగెడుపొంగళ్ళ పొ గుచునుండ, సంగడిఁ బసులు నిచ్చల మేయుచుండ అ. మ. క. 2. 2111 పం.

సీ. చెలులసంగడినున్నఁ జిత్తము చలియించుఁ గన కంబుఁ బొడఁగన్నఁ గడఁగు నా. నీతి. సీ. శ. 52.

సీ. సంగడికాఁడ్రను ల్పదివెడుకొమ్యాల చెలువునఁ గెలయు కోవెలలు నెలఁగ. చంద్రి. 5. 107.

గీ. రాహుకేతువు లనియెడి రాత్రిచరులు.

వ. తమ యెదిరివంక్తి నున్న చంద్రార్కులసంగడి న్మొఅంగి కూర్చుండిన. హా. 9. 124.

6. వెనుక; పశ్చాద్భాగము, అనంతరకాలము.

ఉ. ..రామునితోఁ దగ మైత్రిసేసె నా, రంగ దినే ద్రవుత్రునకు రామవిభుడు మహామహా యుఁడై, సంగడి వచ్చినాఁ డతఁడు సంగర కర్క శుఁడున్ బలాఢ్యుఁడున్. భా రా. కిష్కిం. 204.

వ. ఇది సిద్ధంబు దానిసంగడిన యస్మద్రవహస్యకథ వెలయుటకు నియంబే. కళా. 5. 64.

7. సంఘాతము; మొత్తము.

కం. సంగడిలోకము లన్నియు, ద్రమింగుచుఁ గ్రక్కు చును బయల మెలగించుచు ను,ప్పొంగెడు వేడుక కాఁడటు, భ్రమి గుడువడె ఒకునిచేత మీఁ దెఱఁగి నృపాభాగ. 10 స్కం. 440.

8. సమూహము; గుంపు

సీ. కరులతొండముల సంగడి నిక్కి తాలాంకువలుద నాఁగటితోడ వక్కణింప. ఉ. హరి. 6. 60.

ఉ. అరతిరాజతాపమున నల్లలనాడు నెలంతమేనిపై, జారినకప్పు పెన్నెరుల సంగడి యొప్పు. మహానిలా హతిం, గారు మెఱుంగుకీ లెడలి... భానుమ. 3.20.

9. చుట్టు, పరివేష్టనము.

ద్వి. కనిగలసిగల సంగళ్ళఁ బూదండ, లొంపరి బాగులై యొనరంగఁ జుట్టి. అ. మ. క. 2. 2065 పం

10. సంగడము, మల్లసాధన విశేషము.

సీ. సాముచేయుచు దివస్పతి కుమారుఁడు భుజార్గళి నెత్తుకెంపుల సంగడి యన ..........

తే. కాంతివిజిత వక్త్రబింబంబు చంద్రబింబంబు

వాడిచె. వరాహ. 4 146.

11. రికాబు, అంకవన్నె

తే గీ. ఇరుగెలంకులఁ గట్టిన యొఱలనున్న ఖడ్గ ములతోడ మెఱుఁగుసంగడుల తోడ, బిరుదు నూపురములతోడ మెఱయు హయము, పార్థివో త్తమునకు నేత్రపర్వమయ్యె చిత్ర. భా 4 19.

12. తొలచిన రెండు తాడిబొందలు చేర్చి కట్టిన తెప్ప.

**సంగడించు** (√సంగడి) స. క్రి. జతపఱుచు; చేర్చు, సంఘటించు.

ద్వి. వలువొంద సంఛన్నవలివమైనట్టి పులినంబుపైఁ, బరంబుల సంగడించి, కరములఁ గరమొప్పఁ గరవీర జాతి, వసూనములచేత వడిజల్లులాడ. అ మ క. 2. 110 పు. 9 పం.

ద్వి. సంగడికాళ్ళును సంకుఁబూసలును, సంగడించిన యట్టి సభలును సభలె. పండితా. వాద. 176.

**సంగడికత్తె** (√సంగడి) వి. చెలికత్తె.

**సంగడికాఁడు** విశ. చెలికాఁడు, మిత్రుఁడు ఆం. భా 2. 183.

చం. వలుకక వేగ బొమ్మకట పాఱుఁడు సంగడి కాఁడె యెందునన్. భార. ఆది 5. 203

సీ ముందర వెలుఁగొందుముక్తాలలామంబు తొగల సంగడికాని తునుక గాఁగ. భాగ 10 స్కం. 297.

దే. వి. స్నేహితుఁడు.

కం అరిగి తన నగరిలోనికి, సరగునఁ బొత్తెంచి యపుడు సంగడికాండ్రం, బెరిమెగల పెద్దలను గని, యిరువుగ మన్నించి...నీలా. 8. 111.

కం. తలఁపగ జగమునఁ గలవే, ల్పులు సంగడి కాండ్రుఁ జుట్టములు మఱి సెప్పం, గలవార లెందఱే నియుఁ, దలిదండ్రుల కెన యెవర్వదగుదురె యెందున్. అ. రా. అయోధ్యా 62.

ఉ. సంగడి కాని పెండ్లి యని సంతసమందుచు రాజరాజు వ, చ్చెం గడుఁ దేజరిల్లుచు. వీర. 3. 83

కం. అని సంగడికాఁ డెఱిఁగిం, చిన వినియత్యంత ముదితచిత్తుం డగుచున్, జనవరుఁ డటఁ దరలి రయం బునఁ బనియె వధూటిఁ జూచు బలుపెడఁ బొద లన్. రసి. 2. 108.

సీ. సంగడికాఁ డిందుఁ జనుదెంచె నా యని వాకిలి ద్రొక్కనివన్నెకాఁడు హంస 5. 217.

**సంగడికాళ్ళు** వి. బ తమలోఁ దాము కూడఁబలికికొని ప్రోఁగైన కాపటికులు; మోసగాండ్రు (సంగడి కాఁడు అనుదానికి బ వ సంగడికాండ్రు, సంగడి కాఱు అని యగును. ఈ క్రింది ప్రయోగమున వ్యావహారిక రూపము ప్రయోగింపఁబడెను)

ద్వి సంగడికాళ్లును సంకుఁబూసలును, సంగడించిన యట్టి సభలును సభలె. పండితా. వాద. 176.

ద్వి సంగడి కాండ్రను జప్పరించుచును. బస పురా. 114 పు. 10 పం.

**సంగడిగొను** (√ సంగడి + కొను) అ క్రి కలియు, పెనఁగొను.

ద్వి దరహాసదీప్తులు దట్టుముట్టదరఁ, జెరలాడు చెయ్వులు సంగడిగొనఁగ పండితా. మహిమ.260.

**సంగడి చేడియలు** వి. బ. (√ సంగడి) చెలికత్తెలు.

తే గీ. పుడమి బొట్టియ యత్తల కడర మ్రొక్కి, తోడికోడండ్ర సంగడిచేడియలను, నెనరు దైవారఁ గౌఁగిటఁ బెనచి జన్ని, కట్టుముత్తైదువులఁ దద్ద గారవించె. అ. రా. యుద్ధ. 587.

**సంగడివలయము** (√ సంగడి) వి ఒకవిధమైన మల్ల సాధనము.

చం అడిదములాను గజ్జలసి యంత్రములున్ దురు గాళ్లుడొళ్లు సంగడివలయంబులున్ మెఱుఁగు కంచము లభ్రతలోన్నతంబు కాగడలు గుడార్లు పగ్గములు కత్తుల బోనులు గడ్డపారలున్, వడిఁగొని మేటి దొమ్మరులు వచ్చిరి బిళ్ళమహీశుపాలికిన్, చెన్నబ. 2. 209.

**సంగడీఁడు** వి (సంగడము + ఈఁడు) స్నేహితుఁడు, మిత్రుఁడు, చెలికాఁడు.

సీ. చుట్టము పక్కము చుట్ట నెచ్చెలి చెలికాఁడు నెయ్యుఁడు సంగడీఁడు పొందు కాఁడంటు చెలి నేస్తకాఁడు, ఆం. భా. 2. 166.

సీ. కొఱ్ఱమీనులఁ దండ్రి కొలువులెంకల కిచ్చె వాలువులను సంగడీల కిచ్చె. ద్వా. 1. 221.

ఆ. సంగడీలనడుమఁ జక్కగఁ గూర్చుండి, నర్మ భాషణముల నగవు నెఱపి భాగ. 10 స్కం. 498.

సీ. క్షీరాబ్ధినందన కూరిమిసైదోడు జలజబాంధవు తోడి సంగడీఁడు. సురా. భాం. 102 వ.
వ. అతఁడు చిఱుత వయసున సంగడీ ద్రయిన బాలకులతోడం గూడి యచ్ఛోదం బనుకొలన పలిల క్రీడలు సలుపుచు. కాశీ. 4. 68
వ. సంగడీలఁ జీరువారును. పారి. 4. 66.
తే. సరవి ఒక్కలయొకిమీఁడు సంగడీఁడు, పసిడి మఁనిల్లు వెన్నుఁడు పొసఁగ నమ్ము, కడలి దొన పాఁపనారయుఁ బుడమి తేరు, గలిగి చెలువొందు ముక్కంటిఁ గొలుతు మదిని. రాజ. 2 ఆ.

సంగడినితనము వి. మైత్రి; చెలిమి,
ఆ. వయవిశాలబుద్ధి నలచక్రవర్తితో, సంగడిని తనము సాలఁజేసి, యక్షహృదయ మతని కవ్యస్తముగ నిచ్చి, యశ్వవిద్య నేర్చె నతని వలన. భాగ. స్కం. 9. 2౨5.

సంగణిక నం. వి. అ స్త్రీ. సాటిలేని సంభాషణము.

సంగతము నం. విఱ. (అ. ఆ. అ.) 1. కలసినది, కూడినది.
మ. .... సౌఖ్యానం. గతమున్ ముక్తికరంబు నైన శివయోగం బర్థిఁ బూనందగున్ శివధర్మ. 2.128.
వ. గాంగేయుఁడు గౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థ సంగతంబును సువిహితంబునుంగా నిట్లను భార, విరా. 4. 220.
2, సమావేశమైనది, ప్రోఁగైనది. 3. పెండ్లాడినది. 4. పొసఁగినది, సరిపడినది.
ఉ మంగళ పాఠక ధ్వనులు మాగధగీతులు వంది బృంద ము,ప్పొంగి యొనర్చు సంస్తుతులుఁ బార్ణ పయోధిరవంబు చాడ్పునన్, సంగతమై శ్రుతిద్వితయసౌఖ్య మొనర్పఁగ ... భోజరా. 2. 119.
6 సంకుచితము, ముడిఁగినది.
వి. అ. న. 1. కూడిక, ఒకచో నుండుట, 2. సహవాసము 3. చేనువు, స్నేహము. 4. ఇంపైనమాట; పరస్పర విరోధము లేనిమాట, యుక్తియుక్తమయినమాట.

సంగతసంధి నం● వి. ఇ. పుం. స్నేహమైన పిమ్మట జేయబడినపొందు.

సంగతి నం. వి. ఇ. స్త్రీ 1. సహవాసము, కూడిక.
కం అగనసంగతి గురువుల, యొంగిలి మధు మాంసనేవ ... వడువునకు నిషిద్ధములు మహిన్. విజ్ఞా. కాం. 1. 65.
ఉ....స గ్రామము నేయుచు దుదును రాజులు దొల్లియు నెంతదిపోకో, భూమి మునీంద్ర సంగతి నుబుద్ధము నీకు బగఁబు నాకు నీ,భూమి తెఱంగు చెప్పుము. భార. భీష్మ. 1. 15.
రసభంగము సంగతిలోన మెత్తురే ఉ. హ. 1. 72.
2. లాగు, విధము. రీతి.
తే. ... శిబి సంగతి మాంధాతనయమునను య,యాతి కరణి దిలీపుని యట్లు రంతి,రీతి నా చక్రవాళ పరీతభూత, ధాత్రిఁ బాలి చు నవిభుండు దద్విభుండు హంస. 1. 42.
చం. సరములలీతి క్రొన్నెలల జాతి వినంబుల భాతిఁ బద్మకే,సరముల భంగిఁ దారకల సంగతిఁ దారుపు మాడ్కిఁ బువ్వమం,ఉసల విధంబునన్ మణుల చాడ్పునఁ జెక్కులు గంధతైల,పాక రచిత ముల్ విచిత్రములు కమ్మని పైఁడపుఁ బిండివంటలున్. జై. భా. 8. 199.
సీ. కలకుట్లు గ్రుచ్చుసంగతి నయ్యిరేపుర గుదురుగా గొరకల గ్రుచ్చి గ్రుచ్చి. కవిక. 2. 169.
ద్వి. అంగగుణాతీతుఁడై లింగమూర్తి, భృంగీశ్వరుఁడు చూచుసంగతిఁ జూచు. పండితా. దీక్షా. 60 పుట.
సీ. పయ్యెదఁ దివనీక పట్టు నింతకుమున్న సిగ్గునే సంగతి దిగ్గనాడె. కవి. 4. 178.
3. సంపర్కము, సంసర్గము.
ద్వి. దొంగలచీరల కొంగులనున్న. వంగకాయలు ప్రాణలింగంబు లయ్యె. సఁగతి దొంగలు సద్భక్తులైరి. పండితా. పురాతన. 104.
4. ఔచిత్యము, తగియుండుట.
తే. సంగతియె యోయి యినుమంత లింగబావు... ఆము. 4. 60.
చం. మనమున నొండు రెండు మరుమంత్రములన్ సరిపోవఁ జెప్పినన్, జనపతు లాతనింబిలువ సాగుదురాగతి సారెఁ బిల్చు న,చ్చనవున కీధనాది గొని సంగతిగానివి క్రొవ్విచేయఁ జెప్పు ..ఆము.4. 265.
5. మైథునము, చూచుట, దర్శనము. 6. ఆకస్మికమైన సంభవము, దైవికముగాఁ దటస్థించుట.

7. జ్ఞానము. 8 (తర్కము) విశేషజ్ఞానమునకై ప్రశ్నించుట. (అవాంతరాభిధాన ప్రయోజకమైన జిజ్ఞాసను గలిగించు జ్ఞానముయొక్క విషయము).

సంగమనము సం. వి. అ. న. సంగమము.

కం. భోజాంధక సంగమన విరాజిత మగుపట్టణంబు భార. మౌసల. 55.

సంగమనుఁడు సం. వి. అ. పుం. యముఁడు.

సంగమము సం. వి. అ. పుం. 1. కూడిక, కలియుట, ఏకీభావము. 2. సాంగత్యము, సహవాసము. 3. స్పర్శము, తాకుఁడు. 4. మైథునము, రతి, పొందు. 5. నదులు కలియుచోటు.

వ. ఇవ్విధ బునఁ బరిభ్రమించుచు నొక్కనాఁడు గంగాసరయూ సంగమ ప్రాంతవనంబు చేరి వర్తిలుచుండ ... కళా. 8. 118.

6. సంధానము, పొందు పఱుచుట. 7. యుద్ధము. 8. (సూర్యాదిగ్రహముల) సంయోగము, ఏకరాశియందుండుట.

సంగము సం. వి. అ. పుం. 1. కలయిక, చేరిక. 2. నదులకూడిక, నదీసంగమము. 3. సంస్పర్శము, సంబంధము. 4. సాంగత్యము, మైత్రి. 5. కోరిక, ఆసక్తి.

గీ. అభవునకు నెవ్వరేనియు నచటనచట, ప్రమదముననైన మఱియలాభముననైన, సంగమునైన మ్రొక్కులొసంగువారు, పెక్కువగ నవ్విమానంబు లెక్కువారు. శివధర్మ. 3. 90.

6. ప్రాపంచిక బంధముల సంబంధము. 7. యుద్ధము. 8. అడ్డంకి, ఆటంకము.

సంగరము సం. వి. అ. పుం. 1. వాగ్దానము, అంగీకారము, ప్రతిజ్ఞ. 2. అవలంబించుట; పూనుకొనుట. 3. క్షేమము. 4. యుద్ధము

వ.... ... రాజునకు సంగరపాటవంబు మాటలు దగుంగాక మాన్యుల నధఃకరింపవగునే యని పెండియు. భార. విరా. 4. 220.

5. జ్ఞానము. 6. మ్రింగుట 7. కష్టము, ఆపద. 8. విషము.

వి. ఆ. న. శమీఫలము, జమ్మిచెట్టు పండు

సంగవము సం. వి. అ. పుం. పగటి యైదు భాగములలో రెండవది ప్రాతస్సంగవమధ్యాహ్న పరాహ్ణసాయాహ్ణము లనెడి యైదు భాగములుగా విభజింపబడిన దివాభాగముల రెండవ భాగము; ప్రాతఃకాలము తరువాతిదయిన యాఱు గడియలకాలము.

సంగాతకత్తె వి. (సంగాతము+కత్తె) స్నేహితురాలు (మొదటిరూపము సంగాతి కత్తియ).

సంగాతకాఁడు వి. (సంగాతము + కాఁడు) చెలికాఁడు, మిత్రుఁడు.

సీ. కరిముత్తియపుఁరేక గనిపట్టు సంగాతకాండ్రు మూకల్లసింగములు సుమ్ము. పారంగ. 1. 73.

సంగాతము వి (సం. సాంగత్యము) చెలిమి; మైత్రి

కం. అతిరుచఁ బలుకఁగరా, దో తెలియదు గాని కౌంత్యభూర్వహా నీనం, గాతముచే నీ మన్నన, చేతం దొడితేరఁ బ్రతిసెఁ జేసితి మనుఁడున్. కువల. 4. 125.

సంగాతి వి. (సంగాతము+ఇ) 1. చెలికాఁడు, మిత్రుఁడు.

ఉ. ఆతని నేత్రగాండ్రు భుజగాత్మజ లవ్వగలెల్లఁ గాంచి య,య్యోతమ వంటివార లిటులుండియు నీ దొరసీ దురంతచిం,తాతతుతానితాంత హృదయవ్యథఁ గూరఁగ నూరకున్న సం,గాతుల మౌదుమే యిపుడు గాక మఱెప్పటి కీవయస్యతల్. కువల. 4. 108.

2. స్నేహితుఁడు, బంధువు,

దండకము. ఈరైదుబండ్లెక్కు రాకల్వసంగాతికిం గూనవై పుట్టి యున్నాఁడవు. అ రా. యుద్ధ. 161.

3. సహచరము.

సీ. బట్ట సంగాతి కవ్వడకున్నఁ జీరెడుకంఠిని వివఁబడు గౌరిగొంతు. పార్శ్వ. 4. 108.

4. ఆప్తుఁడు.

ఉ. జాతితొగల్ వలంగ జలజాతము లెల్లఁ దెలంగఁ గాంతులన్, భీతి తొలంగఁ బైటవశీ బృందములుప్పతిలంగ నెమ్మి సం,గాతి గలంగ బుప్పొడులు కంతునిపావడలై వెలుంగఁ బ్రా,భాతదిశన్ మెలంగెనవపాయబలాతతవాతపోతముల్. ప్రబం. 1. 117.

సంగాపము సం. వి. అ. పుం. సంభాషణము; సంలాపము.

సంగి సం. విశే. (న్. న్. నీ.) 1. కూడినవాఁడు,

కలసినవాఁడు. 2 ఆసక్తి గలవాఁడు. 3. కోరిక గలవాఁడు 4. భోగములయం దాసక్తిగలవాఁడు, విషయలంపటుఁడు 5. విచ్ఛిత్తి లేనిది. అవిచ్ఛిన్న మైనది.

సంగీతకము సం. వి. అ. న. 1. స్వర సమ్మేళనము; స్వరముల పొందిక. 2. పదుగురు జూచుట కేర్పర చిన నృత్య గీత వాద్యముల భోగము; తౌర్యత్రికము.

సంగీతము సం. విణ. (అ ఆ. అ) 1 కలసి గానము చేయఁబడినది. కొందఱు గాయకులు కలిసి పాడినది. 3. చక్కఁగా గానము చేయబడినది.

వి. అ. న. 1. పెక్కండ్రు కలసి పాడినపాట.

2. శ్రావ్యమైన గానము.

సీ. సంగీత విద్యా ప్రసంగ పారంగత గాయకేంద్రులు సమ్ముఖమున మెఱయ విక్ర. 1. 106.

3. తౌర్యత్రికము, నృత్తగీతవాద్యము. 4. స్వర సమ్మేళనము. 5. నృత్యవాద్యములతోఁ గలిపి పాడెడుకళ, ఒకవిధమయిన కళ.

సంగీతశాల సం. వి. ఆ. స్త్రీ. నృత్యగీత వాద్యములు నెరపుతావు.

సంగీతశాస్త్రము సం. వి. అ. న. సంగీతమునకు సంబంధించిన విషయమును వివరించు శాస్త్రము.

సంగీతార్థము సం. వి అ. పుం సంగీత వస్తువు.

సంగీతి సం వి. ఇ. స్త్రీ. 1. స్వరసమ్మేళనము, స్వరముల పొందిక 2 నృత్యవాద్యములతోఁ గలసి యుండు గానకళ. 3 సంభాషణము ఆలాపము 4. (ఛంద.) ఆర్యావృత్త భేదము.

సంగీర్ణము సం. విణ (అ ఆ అ) 1. సమ్మతింపఁ బడినది, అంగీకరింపఁబడినది. 2. శపథము చేయఁ బడినది, ప్రతిజ్ఞచేయఁబడినది.

సంగుప్తము సం. విణ. (అ. ఆ అ) 1. చక్కఁగా రక్షింపఁబడినది 2 చక్కఁగా దాచఁబడినది.

సంగూఢము సం. విణ. (అ. ఆ అ.) 1. పూర్తిగా దాచఁబడినది. 2. సంగ్రహింపఁబడినది, సంక్షేపము చేయఁబడినది. 3. కూడినది; ఏకమైనది. 4 ప్రోఁగు చేయఁబడినది

సంగృహీతము సం. విణ. (అ. ఆ. అ.) సంగ్రహింపఁ బడినది, 1. ప్రోగుచేయఁబడినది. 2 పట్టుకొనఁబడి నది, 3. అడఁపఁబడినది, వశపఱుచు కొన బడినది. 4. తీసికొనఁబడినది. 5. సంక్షేపము చేయఁబడినది.

సంగెడ వి. పాత్రవిశేషము.

వ. ఒక్క శృంగాలక బంగారు సంగెడయు ధరించి డగ్గరి కొలచియుండ. వి. శకుం. 1. 96.

సంగోరు వి. (సగము+కోరు) పంట యందలి సగము పాలు.

సంగ్రహణము సం. వి. అ. న. 1. పట్టుకొనుట. 2. పోషించుట 3. ఇతర గ్రంథముల నుండి యెత్తి యొకచోఁ గూర్చుట. 4. మిశ్రమము చేయుట 5. రతి, మైథునము, పొందు. 6. తాచుట, ఖచితము చేయుట. 7. జారత్వము వ్యభిచారము. 8. ఆశించుట, ఆశ. 9. తీసికొనుట, స్వీకరించుట.

సంగ్రహణి సం. వి. ఈ. స్త్రీ చీమును నెత్తురును మలముతోఁ బడుట యనెడిరోగము.

సంగ్రహము సం. వి. అ. పుం. 1. పట్టుకొనుట. 2. పిడికిలి. 3. గారవించుట, అంగీకరించుట.

సీ. దారసంగ్రహము సంతానసంపాదనంబును నధ్వరక్రియయును నొనర్చి... భార. శాంతి. 6. 272.

4. పాలనము, రక్షించుట. 5. ఆశ్రయమిచ్చుట, పోషించుట. 6. నిలువచేయుట, సేకరించుట.

చం. అతి నిశితానుధారకు మహామహనీయ విచిత్ర వర్ణసంగతికి నిరూఢగూఢసుముఖత్వద సత్యపదార్థ సంగ్రహస్థితికిఁ బహు ప్రయత్ననియతిం జనతా శ్రుతిరత్న కుండలాయితహితసూక్తి యుక్తి నుతియించెద బాణమయూరచోరులన్. పంచతంత్ర. 1. 10.

7. అణచుట, వశపఱుచుకొనుట. 8. ఉండయగుట. 9. కూడిక 10. ఒక విధమైన సంయోగము. 11. కలుపుట, చేర్చుట. 12. ఇతర గ్రంథముల నుండి యెత్తి యొకచోఁ గూర్చుట. 13. సంక్షేపము; పెద్ద గ్రంథమును కొద్ది భాగముగా నిముడ్చుట. 14. మొత్తము, 15. పట్టిక (జాబితా) 16. నిల్వకొట్టు. 17. యత్నము. 18. చెప్పుట, ఉదాహరించుట. 19. ఘనత, గొప్పతనము,

20. వేగము, త్వర. విశే. (అ. ఆ. అ.) 1. పెద్దది. ఎత్తైనది (వే. ని.).

**సంగ్రహశ్లోకము** సం. వి. అ. పుం. వెనుకటి విషయమును సంక్షేపముగా బోధించు శ్లోకము.

**సంగ్రహించు** సం. స. క్రి. 1. సంపాదించు.

సీ. దధిఘృత తైలముల్ మధుగుడశర్కరల్ కదళీఫలాదులు కందమూలములు తెగన్ దెప్పింపు పలు గాయగూరలు చాల నిప్పటినుండి సంగ్రహింపు, మనఘ! ఉ. రా. 8. 19

సీ. అంబరాభరణ మాల్యానులేపనముల సముయోచితమ్మూర్తి సంగ్రహించి. ఉ. రా. 6. 175.

2. గ్రహించు, పట్టుకొను.

కం. మించి ధనమానఁ బ్రజ నెల్లయించు దురాత్ములకుఁ గ్రేణి యిచ్చుట పతి కూర్పించిన నిండిన చెఱువవిఁయించి శకులకులము సంగ్రహించుటగాదే. కవిక. 2. 19.

3. సంక్షేపించు; క్లుప్తపఱచు.

ఆ. వె. తొలుతఁ జేసినట్టి దుష్ట కర్మంబున, సంగ్రహింపరానిశాప మొం(దె)ద. నిరంకుశో. 4. 110.

వ. పరబ్రహ్మమయుండైన తన్ను సేవింప సకల పుణ్య తీర్థంబులు సంగ్రహించి మూర్తరూపంబు వహించి వచ్చిన కమలభవాండంబు చందంబునం గమండలువు దండనుండ. వరాహ. 4. 100.

4. దోచుకొను.

సీ. తద్గిరింద్రమునఁ బుత్రస్త్రీసమేతుఁడై శూరాస్యుఁడను నొక్కచోరకుండు, నిలయంబుఁ గల్పించి నిల్చి త్రోవలు గొట్టి వరులఁ జంపుచు దర్థనంబు లెల్ల, సంగ్రహింపుచు. వా. వరాహ. 3 40.

**సంగ్రహీత** సం. వి. ఋ. పుం. 1. సారథి. విశే. (ఋ. ఈ. ఋ.) సంగ్రహించువాఁడు.

**సంగ్రహుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సంగ్రామము** సం. వి. అ. పుం. యుద్ధము.

మ...కడఁగుండు నాకు నెదురై సంగ్రామరంగంబునన్. భార. సభా 2. 63.

సీ. శక్రాదిసురులతో సంగ్రామ మొనరించి ఖాండవంబేర్చె నొక్కరుఁడ కాఁడె. భార. విరా. 4. 210

**సంగ్రామజిత్తు** సం వి. త్. పుం. యుద్ధమున జయించువాఁడు.

**సంగ్రామపటహము** సం వి. అ. పుం. యుద్ధములందుపయోగించు పెద్దఢక్క.

**సంగ్రాహకుఁడు** సం. విశే. (అ. కా. కీ. అ.) 1. సంగ్రహించువాఁడు: ప్రోఁగు చేయువాఁడు. 2. ఇతర గ్రంథములనుండి యెత్తి యొకచోఁ గూర్చువాఁడు.

**సంగ్రాహము** సం. వి. అ. పుం. 1. పట్టుకొనుట. 2. బలాత్కారముగాఁ బట్టికొనుట. 3. పిడికిలి. బిగించుట. 4. పిడికిలి. 5. డాలుయొక్క పిడి.

**సంఘచారి** సం. వి. న్. పుం. చేఁప. విశే. (న్. ణీ. న్.) కలిసి చరించునది, సంఘీభావమున చరించునది.

**సంఘజీవి** సం. వి. న్. పుం. కూలివాఁడు విశే. (న్. నీ. న్.) కలిసి జీవించువాఁడు.

**సంఘటన** సం. వి. ఆ. స్త్రీ. కూర్పు; సంయోగము, యోగము.

ఉ. అంతట దైవసంఘటన నచ్చటువాసి యతండు దివ్యదేశాంతరముల్ చరించుచు...కళా. 8. 184.

వి. అ. న. కూర్పు.

**సంఘటి(యి)ంచు[1]** సం. స. క్రి. (✓ సంఘటిల్లు) కూర్చు, పొందుపఱుచు.

కం....ఈ, యితిహాసము శ్రుతమైనఁ బఠితమైనను నెఱయ సంఘటించును లక్ష్మిన్. భార. శాం. 5. 16.

వ. ఎదుట వచ్చి నిలుచున్న పుడమికన్నె చిన్నారి నగుముద్దు మొగంపుటద్దంబుం గనుఁగొనుచుఁ బాన్పుడిగ్గి సమయోచితాచారంబులు సంఘటించి. ఉ. రా. 1. 133.

గీ. మొదల సంఘటియించినఁ బొంది కార్య, మవల విఘటించెనేని గౌరవము దప్పు. ప్రాణమైనన్ను రమ్ము పొమ్మను నృపాలు, నెదురఁ దలవంచికొని యుండ నెట్లునేర్తు. శృం. నై. 2. 66.

**సంఘటి(యి)ంచు[2]** సం. అ. క్రి. 1. సమకూడు.

ఉ. నన్నయభట్టు తిక్క కవినాథులు చూపిన త్రోవ పావనం, బెన్నఁ బరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయమాదిదేవుఁడా, వెన్నునివృత్త మీవు కడువేడుకతో విను నాయకుండ వి, ట్లెన్నియొ సంఘటించె మదభీప్సితసిద్ధికి రాజపుంగవా!—హరి. పూర్వ. 1. 40.

2. వీణాదివాద్యములను వాయించు

**సంఘటిల్లు(లు)** నం, అ. క్రి. సమకూడు, కలుగు
ఆ. అమరతృప్తి వలన నవ్యయానందంబు, సంఘ
టిల్లుఁజూవె సంయమీంద్ర ! భార. శాం. 5 238.
కం. ....ఈ, పురుషులు గూడిన సృష్టికి, వెఁడవరుఁడి
సంఘటిలదు వేర్పడి రేనిన్. భార. శాం. 5. 81.

**సంఘట్ట** నం. వి. ఆ. స్త్రీ. పెద్దపేఁగ.

**సంఘట్టన** నం వి. ఆ స్త్రీ. 1. రాపిడి, ఒరయిక.
2. కూర్పు, రచన. 3. అంటుకొనుట, తగిలి
యుండుట. 4. కూడిక, కలయిక. 5. మల్లు
రొండొరులను దాఁకుట 6. తాఁకుట 7. కాము
కుల యాలింగనము, కౌఁగిలింత.

**సంఘట్టనము** నం వి. అ. న. – సంఘట్టన.

**సంఘట్టము** నం. వి. అ. పుం. 1. రాపిడి, ఒరయిక.
2. ఒకదాని కొకటితగులుకొనుట. 3. సంకుల
సమరము, దొమ్మి. 4. కలయిక. 5. కయ్యము.
6. (సవతుల) స్పర్థ. 7. కౌఁగిలింత.

**సంఘతలము** నం. వి. అ. పుం. చాఁచిన వ్రేళ్ళు
కలిసి యొండొంటితోఁ గూడిన యఱచేతుల జంట.

**సంఘము** నం. వి. అ. పుం. సజాతీయ జంతు సమూ
హము. 2. సమూహము; గుంపు.
మ....విజృంభించెద, న్సురసంఘంబులు వచ్చి యడ్డ
పడి నన్దుర్వారదర్పోద్ధతిన్. భార. ద్రోణ 5. 339.
3. సన్నిహిత సంబంధము, కలయిక (అ. ని.).
4. సమాజము.

**సంఘర్షము** నం. వి. అ. పుం. 1. రాపిడి, ఒరయిక.
సీ. కటుదంత సంఘర్ష కిటకిట స్వనముతో శింజినీ
నినదంబు నెవ్వుడు పఱుప. దశా. 6. 117.
2. విసరుట: పిండి చేయుట 3. ఒకదానినొకటి
తాఁకుట. 4. పోటీ, స్పర్థ 5, అసూయ, ఓర్వలేమి.
6. జారుట, మెల్లఁగాఁ బ్రవహించుట.

**సంఘవృత్తి** నం. వి. ఇ. స్త్రీ. కూడిక, సంయో
గము.

**సంఘాటిక** నం. వి. ఆ. స్త్రీ. 1. జత, ద్వయి. జోడు.
2. కుంటెనకత్తె, దూతిక. 3. ముక్కు. 4. వాసన.

**సంఘాణకము** నం వి అ. పుం న. నాసామలము, చీమిడి.

**సంఘాతకఠినము** నం. విశే. (అ. ఆ. అ.) ఘనపదా
ర్థము వలె గట్టిది.

**సంఘాతము** నం. వి. అ. పుం. 1. దృఢ సంయోగము
2. సహస్థితి, సహవాసము. 3. గుంపు, సమూ
హము
తే గీ ప్రకటకటకంబు పావవిభ్రాజితంబు, నైన
యగసంఘ మని చూచి యచలభావ, హైన్యమున
నాగసంఘాతము ద్రుడు సుకవు, లచటిమదకుంజర
ముల నేమని నుతింతు. నిరంకుశో. 1. 53.
4. చంపుట 5. కఫము, శ్లేష్మము. 5. సమాసము
లేర్పడుట. 6. నరకభేదము. 7 (నాటకములందలి)
ఒక విధమైన నడక, గమనభేదము. 8. శ్లోకసము
దాయము,

**సంఘాతశిల** నం. వి. ఆ. స్త్రీ నల్లబాయి, పాషాణము

**సంఘీభవించె** నం. అ క్రి. గుంపుగూడు, ప్రోఁగుపడు.
వ నారాయణ స్థానంబు సొచ్చి యచ్చోట సంఘీ
భవించిన విరించిసము లగుసంయములం గమలాఢీ
సమేతుండై సేవించి. కకు. 1. 19.

**సంఘుష్టము** నం. విశే. (అ. ఆ. అ.) 1. మాఱు
మ్రోయునది. ప్రతిధ్వనించునది. 2. ఘోషింపఁ
బడినది, చాటఁబడినది. 3. క్రయ్యము, అమ్మకము
నకు సిద్ధముగా నుంచినది. వి అ పుం. ధ్వని,
ఘోషము.

**సంతచేకరము** వి. సంతకరువు, సంచకారము, క్రయ
విక్రయములు మొదలయిన వాని గట్టికై
ముందిచ్చెడు ధనము, బజానా. (సం. సత్యంకార,
సంచకర).
తే కమ్మసారాయికై సంచకర మొసంగుఁ జిత్త
జాయత్తయై కాపుచిన్నెలాఁడి, శుక. 2. 434.
మ, వెదకంబోయిన తీవ కాలఁ దవిలెన్ వేయేం
దుర్వానుచే, మొదలం సంచేకరంబు హాసదిథకో
న్మూలక్రియా కేళికిం, గుదురై యున్నది ఉ.హరి.
4. 163.

**సంచేకర్వు** = సంచకరువు. వి. క్రయవిక్రయములు
మొదలగువాని స్థిరతకై మొదటనిచ్చెడి ధనము.
గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని, కామత స్త్రంబు
నకు సంచకర్వుగాఁగఁ, జుంబనము సేయని మ్మోష్ఠ

లింబమిపుడు, గండుఁగోయిల చిగురాకుఁ గమిచి వట్లు. శివరాత్రి. 3. 68.

**సంచేకారము** వి. సంచేకరము.

తే. గీ. కులుకుఁ బ్రాయంపు నెఱనీటు కోడెకాండ్ర, గమికి దన జిగ్గుజిగి సంచకార మొసఁగి. హం. వి 1 ఆ.

**సంచము** నం వి అ పుం. వ్రాయుటకుఁ బుస్తకము గాఁ జేర్చిన తాటియాకులు మొదలగు వానికట్ట, సంచిక.

**సంచము** వి. కాంచనము, బంగారము.

మ. శుకమా పల్కు కళఁకు గన్పడనిమంచున్ జోదు యందంబె నె, మ్మొక్క మామేనుకడానివన్నియ పుటంబుల్ డించ మేల్ సంచపున్, రకమా యక్కమలాక్షి మోవివెల దీర్పన్ రాని నాణెంపునూ, నిక మాదానికి నీడవంగలదె వర్ణింపన్ ద్రిలోకంబులన్. ఉత్తర హరిశ్చం. 2. 44.

ఉ.....చారుకుచదుర్గములన్ వలరాయ లాత్రిమిం చఁగదియించు కాంతిజిగి సంచపునిచ్చెన మెట్ల లీలఁ బూ,డం గనుపట్టె నమ్మరె మిటారి వళితతి మోహనాకృతిన్. ఉత్తర హరిశ్చం. 3. 66.

ఉ. మించులఁ గుంచు మోము రజనీదిటు గుప్పునఁ దప్పు బెంపునున్, సంచేపు రేకు రేకుమడచఁగను వంగన నక్కు జెక్కులున్. రాజవాహన 4 90

వ. సంచేపురేకు బాగాల దంతపు బరణులును మఱియు వినోదోచితంబు లైనవస్తువులు సిస్తుగా నొసంగిన ప్రబం. 1 605.

(క సంచ) జాడ.

సీ. త్రాళ్ళఁ బట్టింపంగఁ దటియైన కొదమల. స చంబు లెఱఁగి శిక్షించునేర్పు (సంచు లెఱింగి. శ. ర పా) భార. విరా. 1. ౬౮.

**సంచయనము** నం. వి. అ. న. 1. ప్రోఁగుచేయుట; నిలువచేయుట. 2, సమూహము 3 శవమును దహనము చేసిన పిమ్మట నెముకలను, బూడిదను ప్రోఁగుచేయుట.

**సంచయము** నం. వి. అ. పుం. 1. ప్రోఁగుచేయుట; నిలువచేయుట. 2, రాశి; ప్రోఁగు. 3. మొత్తము సముదాయము.

గీ. భూమి మానవసంచయంబులకు నెవడు, మారణోచ్చాటన క్రియా మంత్రతంత్ర, గూఢకర్మ ప్రయోగముల్ గూర్చుచుండు, వాని నుపపాతకి యనంగవచ్చు ననఘ. శివధర్మ. 3. 131.

4. కీలుసంధి.

**సంచయి** నం. విశ. (న్. జీ. న్) సంచయముచేయువాఁడు.

**సంచరణము** నం. వి. అ. న. సంచరించుట; తిరుగుట.

మ....నిగమాంతస్ఫీతహర్మ్యాగ్రసం, చరణ ప్రౌఢమయూర. భార. శాంతి, ౭, 467.

**సంచరము** నం. వి. అ. పుం. గ్రహములు రాశి చక్రమున నొక రాశి నుండి మఱొక రాశికిఁ బోవుట. 2. మార్గము; దారి. 3. సందు, సన్ననిత్రోవ, కొండల నడిమి సందు; కనుమ. 4. ద్వారము. 5. శరీరము. 6 చంపుట. 7. వృద్ధినొందుట. 8. ఆనకట్ట.

**సంచరించు** నం. అ. క్రి. తిరుగు; సంచారము చేయు.

ఉ ...నీ,వీపయి వాహనోత్తమము నెక్కి కుమార వరేణ్య నిచ్చలున్, దీపిని సంచరింపు ధరణిన్ ధరణీసురరక్షణార్థమై. మార్క. 3. 6.

**సంచలనము** నం. వి. అ న. కదలిక; క్షోభము, వడఁకు, కలవరపాటు.

**సంచలపఱుచు** స. క్రి. (సంచలపడు ధా. ప్రే.) చలింపజేయు.

కం. తరుణుల చూపులు మాటలు, గరగరికలునగవు బిగువు కౌఁగిటి పొందుల్, పరికింప నేల తత్సంస్మర, ణమె చాలదె మదంబు సంచలపఱుపన్. ప్రబోధ. చం 1. 54

**సంచలము** నం. విశ (అ. ఆ. అ.) చలించునది; కదలునది, కంపించునది, సంచలత, సంచలభావము, చలనము.

మ. కలఁగెం దోయధి సప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం,చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడె ... భార. విరా. 4. 172.

**సంచలించు** అ. క్రి. కంపించు, కలవరపడు.

ఆ అతఁడు రాజసమున నప్పుడు దిగ్గన, లేచిపోయె సంచలించెఁ గొలువు. భార. ఉద్యో. 3. 373.

చం. తనమది కాముబాణములతాఁకువ నెంతయు సంచలింపఁగా. మార్క. 2. ౭౨౮.

చం. .... ఉండ నాస్పదమయి సంచలించె నళిపాత వికంపిత పంకజాకృతిన్. భారం. ఆది. 4.

**సంచాయ్యము** సం. వి. అ. పుం. ఒకానొక యజ్ఞము పేరు.

**సంచారకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) సంచరింపఁ జేయువాఁడు; నడపించువాఁడు. వి. అ. పుం. 1. దారిచూపువాఁడు. 2. పురికొల్పువాఁడు. 3. ఉపన్యాసకుఁడు.

**సంచారణము** సం. వి. అ. న. సంచరింపఁజేయుట; నడపుట. 2. పురికొల్పుట. 3. దారిచూపుట.

**సంచారము** సం. వి. అ. పుం. 1. గమనము,

ఉ. చేరెను లగ్నవేళ యతిశీఘ్రము రమ్మని విన్న వింపఁ బు, త్తేరఁగ నంతనంతఁ జనుదెంతురు కుంతల గౌడచోళగాం,ధార ముఖావనీశులు విదర్భ నరేం ద్రుని యాజ్ఞఁ బాదసం,చారమువన్ శశాంకకుల సంభవుపాలికి భక్తినమ్రులై. శృం. నై. 6. 81. తిరుగుట; పయనము చేయుట. 2. ఒకచోటనుండి మఱియొక చోటికి మాఱుట. 3. దారి, మార్గము. 4 కష్టప్రయాణము. 5. కష్టము, ఆపత్తు. 6. పురికొల్పుట, ప్రోత్సాహపఱచుట. 7. సాహాయ్యముచేయుట. 8. త్రోవచూపుట. 9. రోగ మొకని నుండి మఱియొకని కంటుట. 10. పాముపడగ మీఁది మణి. 11. సూర్యుఁ డొక రాశి నుండి మఱియొక రాశియందుఁ బ్రవేశించుట.

**సంచారి¹** సం. విణ. (న్. ఱీ. న్.) 1. చలించునది, కదలునది. 2. తిరుగునది. సంచరించునది,

మ. హృదయ బ్రహ్మరథం బతిప్రియతమం బెక్కింతుఁ జేతోమరు,త్పదనాస్థానికిఁ దెత్తు మానస వళస్సంచారిఁ గావింతు హృ,ద్విదిత క్షీరసముద్ర ఖేలనమునన్దేలింతు నుత్కృష్ట వస్తుదులం బ్రాజ్ఞుల దిక్కయజ్వ నమరేశునోస్ము శ్రీనాథునిన్ పంచ తంత్రము. 1. 11.

3. మాఱునది, స్థైర్యములేనిది. 4. ప్రయాణము చేయఁ గష్టమైనది, దుర్గమమైనది. 5 స్థిరముకానిది, క్షణభంగురమైనది (భావము). 6. లోఁబఱుచు కొనునది. 7. వంశపు పరగా వచ్చునది (రోగము). 8. అంటుకొనునది (రోగము), 9. పురికొల్పునది.

**సంచారి²** సం. వి. న్. పుం. 1. గాలి, ధూపము, 2. ప్రధానరసమును బలపఱుచు భావవిశేషము (చూ. వ్యభిచారి).

**సంచారించు** సం. అ. క్రి. నడచివచ్చు, బయలుదేరు; పచారుచేయు. ఇటునటు తిరుగు,

వ విరించి ప్రముఖ నిఖిల దేవతా వితాన జయ జయాలాపంబు లాదరించి సంచారించి పంచారిం చిన పంచాననంబు నెక్కి ముక్కంటిం దలంప. వరాహ. 11. 103.

**సంచారిక** సం. వి. ఆ. స్త్రీ. 1. దూతి.

వ ఇట్లు వగలనొగులు నమ్మగువలఁ దగవులఁ మాటల సంచారికా ముఖంబున నూరార్చి .... రాధామా. 4, 19.

2. కుంటెనకత్తె, 3. జత, జోడు. 4. వాసన, గంధము.

**సంచారితము** సం. విణ. (అ. ఆ. అ.) సంచరింపఁజేయ బడినది. నడపఁబడినది. 2. పురికొల్పఁబడినది. 3. తీసి కొని పోఁబడినది.

**సంచాలి** సం. వి. ఈ. స్త్రీ. గుంజ, గురివెంద (వృ.వి.).

**సంచి** వి 1. గోణిభేదము (రూ. సంచీ శ. ర.).

కం. మనుగోనె యనఁగగోణికి, జనునంకెము సంచి లిత్తసలకన...తద్భేదంబులగు ఆం. ప. చర. 16.

2. అసిమి, అల్పగోణి.

గీ జోగపట్టియ కకపాల జోలెసంచి కలికికాటుక గిర్పొట్టు పలుగు పేరు, జాతిగాఁదాల్చి నెఱమిండ జంగ మగుచే హర. 5. 41.

**సంచిక** వి. 1. చేర్చి కట్టిన కొన్ని తాటాకులు, కాగిత ములు 2 వివిధ రచనలతోఁ గూడిన సంకలన గ్రంథము.

**సంచికట్టు¹** వి 1. ఒకేవిషయమునకు సంబంధించిన వివిధ వస్తువులతోఁ గూడిన సంచి, 2. వైద్యుఁడు, సంచికట్టుకొని యదేవనిగాఁ బ్రవర్తించువాఁడు (శ. ర.).

**సంచికట్టు²** అ. క్రి. ప్రయాణమునకు సిద్ధమగు. (వ్యవ.)

**సంచితనము** సం. వి. అ. క. ఆలోచన, యోజించుట.

**సంచితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రోఁగు చేయఁబడినది;

సీ. సిద్ధరామేశ్వర శ్రీ మహాదేవశాశ్వత కృపాసంచితైశ్వర్య పదము. శివధర్మ 1. 15.

2. నిలువ చేయఁబడినది, కూడఁబెట్టఁబడినది.

కం. జతవంబున నర్థము సంచితముగఁ గావించి... భార - శాంతి. 1. 78.

3. లెక్కింపఁబడినది. 4. కూడుకొన్నది; సంపన్నమైనది. 5. ఆటంకపఱుపఁబడినది. 6. సాంద్రమైనది, దట్టమైనది (అడవి).

**సంచితి** సం. వి. ఇ. స్త్రీ. ప్రోఁగు, రాశి.

**సంచిలితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆలోచింపఁబడినది. 2. ఉద్దేశింపఁబడినది. 3. స్థిరపఱుపఁబడినది.

**సంచిమొదలు** వి. మూలధనము. పెట్టుబడిసొమ్ము.

సీ. చలిగాడ్పుకోమటిచాలు సజాతీయ,ములకుఁ దావుల సంచిమొదలొసంగు. కువల. 3. 95.

సీ. అచటి మేటికిరాటు లలకాధిపతికైన మునుసంచి మొదలిచ్చి మనుప దక్షులు. మనుచ. 1 50.

తే. బలయు రత్నాకరములు సంచులుగఁ జేసి, పాదివి నిధులెల్లఁగొని సంచిమొదలు చేసి, శేరమాడెడుపాటి యుదాఁ లక్ష్మి, బచ్చులప్పురినున్నారు పెచ్చు పెరిగి. పాండురంగ. 1. 111.

శా. పయూరం దనయఃగడుల్ నెఱయ నేయేబేరు లెందైన నా,త్మాయత్తైకధన బు సంచిమొదలై యత్యార్జనం బొందఁగా. శుక. 1. 85.

**సంచు** వి. 1. ప్రకారము. 2 అల్పరవము.

గీ. చను ప్రకారాల్పరవములు సంచన. ఆం. వ. నానా. 7.

3. కాంతి.

ఆ. నక్కుచెక్కుఁ జెక్కు నాతుక చెక్కులు, మించు సంచు మించు మెలఁతమేమ. చంద్రాంగ. 4. 145.

ఉ. ... కరారవిందముల నొప్పగు చిమ్మనగ్రోవి మించుతా,మించుల సంచు నొంచ నెలమిం బలిమిం జెలంగుచున్. ఇందు. 3. 54.

తే. మించే మించేసంచే నెంచు మై దులకించే, మిన్ను చెన్నుఁదన్ను సన్ననడుము. హంస. 3. 69.

4. అందము.

కం. మున్నేను మేన నలఁదిన, ప్రసన్ననిభసితంబు నణఁచి శ్రమవారి కడున్, జెన్నెసఁగె మంచు మల సం,చున్నాచికొని ప్రవహించు సురనది పగిదిన్. పాండురంగ. 5. 131.

ఆ. నలినలీలసంచు నలి నలి గావించు, నించు మించు లాడు నించు మించు, లేమనగవుఁ జూపు లేమనగు జూపు, జిగ మెఱుంగుదాని జగ మెఱుంగు విజ. 1. 86.

5. తీరు; పద్ధతి

తే. కాంచి సాగిలఁబడి మ్రొక్కి కడను జంకఁ, జేతులిడి నిల్చి రందఱు చె చుకోదు, లందుఁ జావడి సంచు గన్నట్టిదిట్ట. మాటనేర్పరి యిట్లను మనుజపతికి రామా. ౬. 6.

కం. మునుకొని తత్త్వకృతంబును, దనశక్తియు దేశకాల ధర్మము నృపవ,ర్తనమును రాణువ సంచును, గని మాటాడంగ వలయుఁగద సభలోనన్. శుక. 1. 686

తే మౌనిజల్పితమైన రామాయణంబు, స్వరలయగ్రామమూర్ఛనసంచు దెలిపి, పాడిరాలాపములఁ ద్రిసప్తకము మెఱసి కుశుఁడు వీణయుఁ దాళంబు గొని లవుండు. జై. భా. 6. 96.

6 జాడ, లక్షణము, గుర్తు.

సీ. త్రాడులఁ బట్టంగ దరియైనకొదమలసంచు లెఱింగి శిక్షించు నేర్పు. భా. విరాట. 1.

7 గుట్టు, మర్మము.

సీ. మా యెల్లవిద్యల సంచే తెలుఁగ నేర్తు. విక్ర. 1. 20.

సీ. ... చెల్లబో నడివీథి నెల్ల వారును జూడ, ముద్దాడ వత్తురా ముద్దు కృష్ణ ...

గీ యంచుఁ బ్రక్కను బవళించు మించుబోండ్లు, నిదుర మబ్బున వగలిట్లు చదుర లెల్ల, కలవరించిన యాసంచు తెలియలేరు, పనులఁగాతురు గానఁ దత్ప్రాణవిభులు. దశా. 6. 730.

8. నేర్పు.

గీ. దంష్ట్రికలు పాదమునఁగొని తన్నిసంధి, నున్న యెముకను సంచున నూఁదిపట్టి, పాపి కదలిచి వెడలి

యాపటి యధిక, వేగమునఁ బుటివాగడ వెడలి పోయి. కేయూ. 2. 120.

సీ. వఱజక్కవల కి చువిలుకాని యనిసఁచుఁ దెలుపు వేల్పుతురంగముల జవంబు అచలా 1. 20.

9. అల్పరవము. 10 రతి.

సీ. అల్పరవమును రతిసంచు నాఁదనర్చు. ఆం. భా. 3. 59.

11. విధము, రీతి.

తే. గీ. కమలమధన వదనకళ సంచు నెఁచవు, కమల మదన వదన ఘస్ర మదవ, కమల వదన వద్యభర దృష్టినాఁడేల, కమల వదవ మదన కతినరదవ. రాజవాహన. 4. 59.

సీ... మెలఁత నెమ్మేనుగ్రొమ్మెఱుఁగు సంచువమించ దమకేంద్రచిత్రముల్ తత్తరించె. దశా. 2. 301.

వ. నిశావిశాలలోచన చెదరఁబాఱిన నెఱికురులదవిలి కోఱలు క్రొవ్విరుల సంచువ మించుతరుచ్ఛాయల మించుగల పొడవెన్నెలలు. చంద్రాంగ. 5. 63.

**సంచులమించుబోఁడి** వి. ఎఱుకత: సోదె చెప్పునది.

చం. దిన మొకనోము నోఁచుఁ గులదేవతలంగొలుచున్ గుటుంబినీ, జనుల బహూకరించు వరుసన్ శకునంబులు జూచుఁ బెద్దలం, గనుఁగొని మ్రొక్కు దీవనలు గాంచును సంచులమించుబోండ్లు వచ్చినఁ జెయి జూపి లచ్చనముఁ జెప్పు మనున్ సతి పుత్రకాంక్షచేన్ సుదంతా. 1. 64.

**సంచులు** దే. వి. 1. గుడ్డ, గోనె మొ॥ వానిచే గుట్టబడినతిత్తి. 2. జాడలు, విధములు. ద్వి. పరమ. 6 488.

**సంచోదన** సం వి.ఆ స్త్రీ. ప్రేరణము; ప్రోత్సాహము.

ఉ. కాదన కిట్టిపాటి యపకారముఁ దక్షుఁడేక విప్రసంచోదనఁ జేసి చేసె రిపుసూదన నీవు వనేకభూసురా, పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికాకోదరసంహతిన్. (భా ల. శా పా.) భార ఆది 1. 124.

**సంఛన్నము** సం విశ. (అ. ఆ. అ.) 1. కప్పఁబడినది.

మ. జయకారం బొనరించె నంబరమణీ సాధర్మ్యశ్రీసంపన్నకున్ .... జయజాగ్రజ్జల పక్షపక్ష పటలీ సంఛన్నకుం బెన్నకున్. విక్రమా. 7. 141.

2. ఆవరింపఁబడినది

**సంఛాదించు** సం. స. క్రి. కప్పు.

శా ఐదు న్నాలుగు నాఱు రెండు నిరుమూఁడ శాహిణు ల్పట్టి ... ఛాదించెన్ బు మెల్లమాగధు వెడన్ సామంబు దానంబునం, భేదంబుం బనిలేదు దండవిధి కోళ్ళ ప్రయోగించి భాగ. 10.1580.

**సంఛాదిక** సం. వి. ఆ. స్త్రీ. ఆవరణము· ముసుగు.

మ....లతా,చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్. వసు. 3. 45.

**సంఛేదము** సం. వి. అ. పుం. 1. ఖండించుట. 2.ఛేదించుట; చిక్కు విడఁజేయుట; తొలఁగించుట.

**సంజె** వి. (సం సంధ్యా) సంధ్యాకాలము.

సీ. సంజెపుట్ట పూఁటన సంధ్య దగును. ఆం. వ. ను. 50.

సీ. సంధ్య యొప్పుచుండు సంజెన ... ఆం. భా, 1. 94.

సీ. కంజెరాగము మీఱు సంజకెంజిగిఱు వహియించి కెమ్మోవివన్నె మిగుల. ఉ. రా. 1. 254.

గీ. పొడుచేముక్కున మఱియును బోవు వెదక. సంజెఁ బ్రియుఁబాసి వగ నొక్క చక్రవాకి. మను. 3. 16.

2. సంధ్యారాగము.

గీ. దానవపుఁబువ్వు చాయతోఁ బ్రస్తరించె, నుదయ మయ్యెడు వదె చూడు మొదలిసంజె. క్రీడా. 1. 68.

కం.....చే,య్యన వచ్చి యొక్క నెచ్చెలి, కనుఁగవ నెఱసంజె వాడమగా నిట్లనియెన్. పారి. 1. 70.

కం. చెందు నెఱసంజ కుంకుమ, క్రందునఁ గెంపెక్కు దివికిఁ గాశ్మీరతరా. ఆము. 4. 119.

కం. ఎఱసంజదాసనంబుల తెఱఁగయ్యెను. ఉ హ. 2. 24.

**సంజ** సం. వి. అ. స్త్రీ. ఆఁడుమేఁక; మఱక.

**సంజకెంజాయ** – సంజ సంధ్యాకాలమందగు నెఱ్ఱని చాయ.

తే· గీ. స్వప్రకాశుండ వగునిన్ను సన్నుతింప, తారములు పొందునే పటికంపుఁగొండ, నెన్నఁడేనియుఁ గలలోనఁ గన్నయట్టి,- సంజెకెంజాయ లంటునే యాంజనేయ. సీతారా. 3. 81.

**సంజనము** సం. వి. అ. న, నాలుగిండ్ల బవంతి (శ.ర).

**సంజనించే** సం. అ. క్రి. జనించు, కలుగు, పుట్టు.
చ. అనిన. గృహాంగంబు హృదయాంబురుహంబున సంజనింప న, య్యువకుల రత్న మిట్లను. హరిశ్చం. 1. 216.

**సంజయుఁడు** సం. వి. అ. పుం. ధృతరాష్ట్రుని యాంతరంగిక భృత్యుఁడు. (ఇతఁడు వ్యాసమహర్షి వరముచే యుద్ధ సమాచారములన్నింటిని గ్రహించి జాత్యంధుఁడయిన ధృతరాష్ట్రునకుఁ దెల్పుచుండువాఁడు. కురుపాండవులకు సంధి చేయుటకై యితఁడు జరిపిన రాయబార మద్భుతమైనది).

**సంజల్పము** సం. వి. అ. పుం. 1. సంభాషణము, సంలాపము. 2. అసంబద్ధ సంభాషణము. 3.గోల, కలకలము.

**సంజెపడు** అ. క్రి. సంధ్యాకాల మగు.
కం. నడురేయి సంజెపడున,ప్పుడు వేగెడు వేళఁ జొచ్చి పోటునకు రిపుల్, గడఁగుదురు. భా. రా. యు. 1095.

**సంజవనము** సం. వి. అ. న. 1. పరస్పరాభిముఖముగా నుండు, 2. నాలుగిండ్ల నడిమి ప్రదేశము.

**సంజపఱుచు** (సంజ+పఱుచు) అ. క్రి. ఎఱ్ఱఁ బఱుచు.
సీ. పౌఁదలఁ జదలేటి లేఁదరఁగలు వాలుఁడగు చందమామ నుయ్యాలలూఁపఁ, దొడవుల తలలఁ జెన్నడరు మానికముల చాయ దిక్కుల నెఱసంజ పఱుప. (ఇది శివస్వరూప వర్ణనము) హరి. ఉ. 6. 34.

**సంజాతము** సం. విశ. (అ ఆ అ.) 1. పుట్టినది.
సీ. నిర్నిద్రదారిద్ర్య నిరుపాధియుతసిద్ధ, సంజాత హృద్భల్లి. లంజతల్లి. నిరంకు 2. 41.
తే. గీ. ... శైత్యమాంద్యక సౌరభ్య సహితమైన, మలయ పర్వత సంజాత మారుతంబు. విక్ర. 1.97. పెరిఁగినది. 2. కడచిపోయినది (కాలము).

**సంజీవనము** సం. వి. అ. న. 1. కలసి బ్రదుకుట. 2. మఱల జీవింపఁజేయుట, బ్రదికించుట. 3. నరక భేదము, ఇరువదియొక్క నరకములలో నొకటి. 4. చతుశ్శాల గృహము.

**సంజీవని** సం. వి. ఈ. స్త్రీ. 1. చచ్చిన వారిని మరల బ్రతికించెడి యొకానొక యోషధి.
సీ. ... సకలజీవోన్మేష సంజీవని యనంగ, బ్రకట నిద్రాముద్రఁ బాయఁజేసి. విక్ర. 1. 97.
2. బ్రదికించుట. 3. ఆహారము. 4. రఘువంశ కుమారసంభవ మేఘదూత కావ్యములకు మల్లినాథ కృత మగువ్యాఖ్య పేరు.

**సంజీవనౌషధి** సం. వి. ఇ. స్త్రీ. పునర్జీవము నొసంగునట్టి యోషధి (వ్య. వి.).

**సంజీవప్రభుఁడు** సం. వి. హనుమంతుఁడు.
కం. శుభకరుఁడగు సంజీవ, ప్రభుని చరిత్ర మఁట తత్ప్రబంధము సీతా,విభు పేరిటిదఁట గలవే, యుభయగతుల్ దీనఁగాక యొండొక కృతులన్. సమీర. 1. 29.

**సంజీవరాయుఁడు** వి. హనుమంతుఁడు.
మ. బ్రహ్మకైన మతిసేయన్ రాని సంజీవరాయని చారిత్రము. సమీర. 3. 135.

**సంజుఁడు** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2. శివుఁడు.

**సంజోక** వి. (సం. సంయోగః) 1. సవరణ, పరికరము.
గీ. అవధరింపుము పయిభూషణాంబరాదు, లీవిధంబున దాఁచి తా దేవదేవి,తాను వైష్ణవురాలి చందంబుఁ బూని, చాలఁదగినట్టి సంజోక సవదరించి. విప్ర. 3. 2.
తే. ... ... అంతలోఁ బాదరసము, జోకగల తేజి నిండు సంజోకఁజేసి, యెదుట నటుదెచ్చి నిల్పె సాహిణి యొకండు. శుక. 1. 161.
2. బంధనము, కట్టు, (జీను) కట్టుట.
మ. .... వచ్చునివిల్కాని జయాస్పదం బగుజిరా సంజోకతేజీ విధంబున నివ్వేళఁ బ్రభావతీ సుదతి చూపుల్ వెన్నెలల్ పర్వఁగాన్. శుక. 2. 267.
3. సన్నాహము;
తే. అనిన నంగీకరించి యయ్యంబుజాక్షి, యపుడె పైనంబుసంజోక లమరఁజేసి, చారణుని వెంట నింటివిచార ముడిఁగి, చనియెఁ దొలికోడి కూఁత ప్రొద్దువనె లేఁచి. శుక. 3.138. (సగము+జోక)
4 ఉభయముఖములయందుఁ దాఁకెడి కొనముడిగల దుబుడక్క యొక్క నడిమిత్రాడు (శ. ర.).

**సంజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. 1. చైతన్యము, చేతన.

2. బుద్ధి 3. జ్ఞానము, తెలివి. 4. చిన్న, హస్తచాల నాదులచేత అర్థమును సూచించుట.

కం. కాసార సంజ్ఞతోడను, ఖాసిలుచున్నట్టి యొక్కపట్టణమున ... కళా. 5. 21.

ఉ ఇంతలెకాని నాకుచము లింతకు నెక్కుడులేవు కామినీ,సంతతిలోన లేత వని సంజ్ఞసురాశిక్ జేయుకై వడిం, గంతుని బెట్టుకోల యొకకన్నియ మారెడుపండ్లు పాణి,పద్మాంతరసీమ నుంచె నరసా కృతిఁ గందుకకేళి సల్పుచున్. నారి. 2. 106.
5. పేరు, నామధేయము.

6. (వ్యాక.) సంజ్ఞావాచకము, ప్రత్యేకవస్తు నామము. 7. గాయత్రీమంత్రము. 8. సూర్యుని భార్యపేరు (విశ్వకర్మకూతురు. యమీయ మాశ్వినులతల్లి).

సంజ్ఞపనము సం. వి. అ. న 1. చంపుట. 2. విన్న వించుట.

సంజ్ఞప్తి సం. వి. ఇ. స్త్రీ 1. తెలియఁబఱుచుట. 2. విన్నవించుట. 3. చంపుట 4. బలియిచ్చుట.

సంజ్ఞము సం. విశ. (అ. ఆ. అ ) సంహతజానుకము. లోపలికి వంగినమోఁకాళ్లుగలది, గాడిద మోఁకాళ్ల వంటి మోఁకాళ్లుగలది. 2. చైతన్యము గలది. 3. పేర్కొనఁబడినది; పేరుగలది వి. అ. న. ప్రమానివసువు (వ్య. వి.).

సంజ్ఞానము సం. వి అ. న. జ్ఞానము, తెలివి, అవ బోధము.

సంజ్ఞాపనము సం. వి. అ. న. 1. తెలియజేయుట, తెలుపుట. 2. బోధించుట, నేర్పుట. 3. చంపుట.

సంజ్ఞావంతుఁడు సం. విశ. (త్. తీ. త్.) 1. చైత న్యము గలవాఁడు. స్ఫూర్తిగలవాఁడు. 2. పేరు గలవాఁడు.

సంజ్ఞావిపర్యయము సం. వి. అ. పుం. 1. చైతన్యము పోవుట. 2. తెలివితప్పుట.

సంజ్ఞాసుతుఁడు సం. వి. అ. పుం. శనైశ్చరుఁడు; శని గ్రహము.

సంజ్ఞి సం. విశ. (న్. నీ. న్.) 1. పేరుగలది, పేరు పొందినది

సంజ్ఞితుఁడు సం. విశ. (అ. ఆ. అ.) పేరుకలవాఁడు; పేరు పెట్టఁబడినవాఁడు

సంజ్ఞువు సం. విశ (ఉ. లోపలికి వంగిన మోఁకాళ్లు గలవాఁడు, ముట్టికాళ్లవాఁడు.

సంజ్వరము సం వి. అ. పుం. 1. అధికతాపము.

వ...పురాకృత కర్మవశంబుల గర్భస్థుఁడైన యర్భ కుఁడు సలాకను గమ్మచ్చునఁ దిగిచిన చందంబున యోనిముఖంబున వెల్వడి మూర్ఛిల్లి యున్నయంత ఒహిర్వాయునంబునఁ దెల్పిఁటి యప్పుడు సంజ్వరము జనియించు, అమ్మహాజ్వరమహత్త్వంబున తుత్పి పాసాయాసభేదంబులును మోహంబును బాటిల్లు. శివధర్మోత్తరము ౨. ౬౧.

సీ. ... సంజ్వరా ... ధా గ సమ్మద ప్రతిపాది దారుణతిమిర కా తానవహ్ని. పంచతంత్ర. 1. 265.

2 వేఁడిమి అధికకోపము.

సండిశము సం. వి. అ. పుం. చిన్నపట్టుకాఱు.

సండీనము సం. వి. అ న. పక్షుల గతివిశేషము.

సండుఁడు సం. వి. అ. పుం. – షండుఁడు

సంత వి. 1. అపవాదము. (సం. సంస్థాన. తు. సంతె. త. చంతై )

చం. ఎసగును .... నెగ్గసవడిసంత ... అపవాదమౌ అం. ప. గుణ. 82.

2. (సం, సంస్థా, సంధా) (త. చంతై. తు. సంతె) నిర్ణయింపఁబడిన దినమువం దుంచెడి యంగళ్ల వరుస; 2. కొనువారి యొక్కయు నమ్మెడువారి యొక్కయుఁ గూటమి.

వ. కొండొక సన్నికృష్ట విప్రకృష్టభూముల నుండు గ్రామంబుల నుండి బేహారులు నానారూప వస్తు కలాపంబు లొక్కయూరికిం దెచ్చి సంకేతస్థలమ్మున నమ్ముటయ సంతయనంబడు. నీ. యా. పు. 13.
సీ. చెప్పనిపని నీళ్లుచేఁదెద వని పోవు, పంతకుఁ బొమ్మన్నఁ జింతసేయు. శుక. 2. 208.

ఉ. సంత వెన్నఁడో, జవ్వన మమ్ముకొన్న గడసాని వనుఁ గవయం దలంచితే. ఉ. హరి. 1. 72.

వ. ఊరూరి సంతసంతకుం దిరుగఁ బెద్ద లింటింట సంతరించిన విలుకవాటు గోడిగలం. ఆము. 4. 35.

3. వేదపాఠము.

వ్య. వేదము సంత చెప్పుకొనుచున్నాఁడు.

4. చెంత, పార్శ్వము.

ఆ సతతగ వియోగి సంతతిపై నలు,సంతదయయు లేక సంతసమున, సంతసింపఁజేయు సంతతక్రూరమా సంతరాకు మీఁక వసంత నీవు. రసిక. 6. 66.

5. సామీప్యము.

ద్వి. అంతకాంతకు భక్తులన్యదైవముల, సంతయు నొల్లరు సహజంబు వినుము. బస. పురా. 197. పు. 741 పం.

6. సమీప ప్రదేశము.

ద్వి. సంతల నిలిచి దూషకులు చెలంగ. బస. పురా. 192 పు., 5. 44 పం.

**సంతశిక** సం. వి. అ. స్త్రీ. పట్టుకాఱు; లోహకారుల పనిముట్టు.

**సంతక్షణము** సం. వి. అ. న. ఎత్తిపొడుపుమాట.

**సంతతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వ్యాపింపఁ జేయఁబడినది, విస్తరింపఁజేయఁబడినది. 2. ఎడ తెగనిది, అవిచ్ఛిన్నమైనది.

చం. ... తచ్చ తురవిలాసినీగణము సంతతసేవ యొనర్చు నీ మనోహితముగ నింక నేనవఁగ నెంతటి దాసను. ఉ. హరి. 1. 77.

3. శాశ్వతమైనది, ఎల్లకాల ముండునది. 4. అధిక మైనది; సమృద్ధమైనది. క్రి. విశే. ఎల్లప్పుడు.

ఉ. భంగము తోడ నున్ననను బంపు విరాటుని మీఁద భూమికిం, జెంగట .... నాదయిన జీతపు టూళ్ళలు సంతతంబు నానిం గడు గాసి నేయు వతనిం జెలుపం దటియయ్యె .... భార. విరా. 3. 119.

**సంతతి** సం. వి. ఇ. స్త్రీ. 1. వంశము, గోత్రము. 2. సంతానము, అపత్యము.

ఉ. .... కామినీ, సంతతిలోన లేత నని .... నార. 2. 106.

ఉ.....చూపంబని లేదు వాని సుతసంతతికిన్. విజ్ఞా. కాం. 3. 86.

3. విస్తరించుట, విస్తృతి, వితవి. 4. శ్రేణి, వరుస, సమూహము.

5. వ్యాప్తి. వ్యాపించుట, 6. రాశి, ప్రోఁగు. 7. ఎడతెగ కుండుట, అవిచ్ఛిన్నత.

**సంతన(ము)** వి. (సం. సంధానమ్) 1. అమరుట. 2. కూర్పు, కాపుట.

మ. నెలఱా సంతననిగ్గు లుప్పతిలు తిన్నెల్ మూలఁఱా పెద్దటా,కుల నిద్దంపు జగా హజారమున చంద్రా. 2. 37.

వ. కెంపు రాయోడు బిల్లల సంతన దొంతర చుట్టి బలపంతుల వింతలు సంతరింప. ఇందు. 2. 44.

3. కూడిక, మేళనము.

సీ. తమ్మిమానికపుసంతన పట్టియల చేతఁ జొక్కపు ముత్తెపు సోబనములం. ప్రబం. 1. 566

సీ. శృంగారభవనమాణిగ సంతనవు నునుమ్రాని పల్కల గొప్పమందనంబు. ఉత్తర హరిశ్చం. 2. 130.

సీ. కనువిచ్చి చూచె వాకటికల్వఱేకు దొంతర వసంతముల సంతనము మీఱు. అహల్యా సం. 1. 84.

**సంతనకట్టు**[1] అ. క్రి. (సంతన+కట్టు) 1. సంఘటిత వించు, ఏకమగు.

సీ. సంతనకట్టి యుత్సాహసమేతులై యంతంబు లేనిరథాశ్వములను. భార. ఆది. 2. 21.

ఉ. అంతులు మీటి మిక్కిలిగ ఱాఁగతనంబున దొమ్మిచేసి దు,ర్దాంత పరాక్రమోన్నతులు దానవ దైత్యులు వేల్పు వెజ్జుధ,న్వంతరిచేతి దుగ్ధమయ వార్ధి సుధారస పూర్ణకుంభమున్, సంతనకట్టి పుచ్చుకొని చయ్యన నేగిరి నిర్విశంకతన్. భీమ. 4. 96.

2. ఆయత్తపడు.

ఉ. ఇంతకుమున్న వాఁడు సనియెం గడుదవ్వుగఁ బోవకుండ న,త్యంతరయంబునం బటు రథావలి

యొప్పఁగ నేఁగుఁ దుర్గులై, సంతనకట్టుఁ డస్త్రములు శస్త్రములుం దొడుగుండు. భా. అం. 6. 200.

కం. అంతః కరణంబున వటు, చింతిలి యుండుచుఁ బ్రపంచసృష్టికిని గ్రియా,దంతమ్ము లేక దుర్వ్యథ సంతనకట్టఁగ విధాత చాలండయ్యెన్. శివరాత్రి. 1. 57.

**సంతనకట్టు²** స. క్రి. 1. ధరించు, పూను. (సంతన+కట్టు) 2. ఆయత్తపఱుచు, సిద్ధముచేయు.

ఉ. అంతకుమున్న సిద్ధవగరావనినాథుని దండనాథుఁ డత్యంతబలాభిరాముఁడు మహారథ నాముఁడు సర్వసైన్యముల్, సంతనకట్టె. విక్ర. 4. 76.

**సంతనచే(సే)యు** స. క్రి. (సం. సంధానముచేయు) అమర్చు, తాపించు.

సీ. తలఁపు ఊగసెలసంతన చేసినట్టి పెన్ జగతిపై ముత్యాలచవికె యెదుట. యయా. 4. 71.

**సంతపడు** (√ సంతన) అ. క్రి. వశ మగు, అనుకూల పడు.

**సంతపనము** సం. వి. అ. న. 1. వేఁడిచేయుట; కాల్చుట. 2. మిక్కిలి బాధపెట్టుట.

**సంతపఱుచు** స. క్రి. (√ సంతపడు) వశముచేయు, అనుకూలపఱుచు.

సీ. ప్రముచ్చుమెక్కుటిఁ బట్టి ముకుఁద్రాడు కుట్టించి గంతగోనెకు దాని సంతపఱిచి (శ. ర. పా) నా. పంచ. 5. 13.

**సంతపాక** వి. అంగడి పెట్టుటకు వేయఁబడిన పాక.

**సంతపాకతొత్తు** √ సంత. వి. గుడిసె వేటులంజె.

ఆ. వె. కుక్కయే మెఱుఁగును గురులింగజంగంబుఁ బిక్కయొడిసిపట్టి పీకుఁగాక, సంతపాక తొత్తు సన్యాసి నెఱుఁగునా, విశ్వదాభిరామ వినుర వేమ. వేమ. 2. 33.

**సంతపించు** సం. అ. క్రి. పరితపించు; దుఃఖపడు.

వ. తమయొడయఁడు తమ్ము మిగులఁగూడియుండ మికి దుర్గమస్థల సంస్థిత లగుట జారక్రీడకుఁ బొసఁగమికిఁ గంతుశర సంతత సంతాపంబునకు సంతపించుచు. హంస. 5. 289.

**సంతపెట్టు** స. క్రి. (√ సంత) పొందుపఱుచు, ఒద్దుగ వఱచు.

చం. అనిపలుకఁగ నాసఖికులప్పు డెఱింగి యితండు సెట్టి సీ,యను మొనఁగుర్ గుమారకుని నిమ్మని వారల సంత పెట్టినన్. పంచ. 1.

**సంతపేట** √ సంత. వి. సంతజరుగు నగర భాగము.

తే. గీ. అధ్యులై గోత్రశాలల నధివసించి, విటుల వేశ్యాజనముల చక్కటులఁ దీర్చు, వారలును గల్గి శంఖరమై రి సంత,పేట యన నొప్పు నవ్వేశవాటమునను. వైజ. 3. 69.

**సంతప్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. తపింపఁ జేయఁబడినది, కాల్పఁబడినది. 2. మిక్కిలి బాధపెట్టఁబడినది, బాధపడినది. 3. కాలినది. దగ్ధమైనది. 4. అగ్నిదగ్ధమైనది (బంగారు. మొ.) 5. అలసినది.

**సంతప్తవక్షుఁడు** సం. విశ. (స్.) శ్వాసము తగ్గిన వాఁడు.

**సంతఁబెట్టు** స. క్రి. (√ సంత) విడుచు, త్యజించు.

వ. తదవసరంబున సురాసురవిసర శరనికాయ జర్జరితకాయులై విఱిగి పంతంబుల సంతఁబెట్టి బిరుదులువదలి కఱిమి విడిచి వాసిపెడఁ బాసి మానంబు మాని గుట్టు గట్టిపెట్టి ప్రాణపరాయణత్వంబునం. వరాహ. 11. 65.

తే. గీ. సర్వసంగంబు మిక్కిలి సంతఁబెట్టి, తపసియై యన్నతను జంప దగ్గఱిల్లు, నీదురాచార వర్తనుఁ డెల్లవారి, హతుఁ గావించెఁదివిధి యెంతయధికుఁ డొక్కొ. శేష. 4. 42.

**సంతమకము** సం. వి. అ. పుం. ఊపిరిపీల్చుట మున్నగు వానియందు గలుగునొప్పి, ఊపిరికుట్టు.

**సంతమము** సం. వి. స్. న. 1. దట్టమగు చీఁకటి, గాంఢాంధకారము. 2. మహామోహము.

**సంతమసము** సం. వి. అ. న. — సంతమము

**సంతము** సం. వి. అ. పుం. తెఱచి దగ్గఱగాఁజేర్చిన యఱచేతుల దోయి.

**సంతరణము** సం. వి. అ. న. 1. నది మొదలగువానిని దాఁటుట. 2. గెలుచుట, జయించుట.

**సంతరించు** స. క్రి. 1. గడించు; సంపాదించు.

మ. సరవిన్ దానము భోగమున్ మఱి వినాశం బన్నయిమ్మూఁడునై, ఖరులన్ మర్త్యులు సంతరించు

ధనసంఘాతం బపేతం బగున్, ధరలో నార్యముల్లైన రెండు విధముల్ దప్పన్ ... మల్లభూ. నీతిశ.84
తే.గీ. బాల నీవు గడించిన వమదు నాకొ,ంగ కూడిన మటి నేను సంతరించు,సొమ్ము మీఁదట నీ కియ. శుక 3. 77.
వ....ఊరూరి సంత సంతకుం దిరుగఁ బెద్దలింటింట సంతరించిన .... కొదమతట్టువగుంపు ... ఆము. 4. 85.
వ. ... అమృతంబు సంతరించినం గాని గాత్రంబు యథేష్ట భోగంబులకు పాత్రంబు గాదు. దశా. 2. 141.
సీ. ... సంతరించిన యట్టిసకల పదార్థముల్, తగు లీల నింటిలో దాఁచుటకును. దశా 3. 84.
చం. కిరవలివారి మేనులును గౌనులుఁ గిల్ జడలుఁ జొడల్ నడల్, తలులుఁ గుడుల్ మరుల్ కొలుపఁ దా నివు డెక్కడ సంతరించెనో, శరశత మైదు కైదువుల జంత .... చంపూ. రా. 2. 99
చం. ధనమణి వస్తువాహవనితా జనతాదులు బల్మి సంతరిం,చిన యవి యందు ధర్మములు సేయక యుండినవేమి యంచు న,య్యనివిషు లందఱున్ బగతు రంచు మహోవద లొందనున్నని, న్ననుజుఁడ వన్నఁ గల్గు నిరయంబు రయంబున రమ్ము పోరి తిన్ ఉ. రా. 3. 48.
2 సంగ్రహించు, దొంగిలు, అపహరించు.
తే. గీ. ఇంతబంగారుగిన్నియ సంతరించు, వాఁడు దీనికిఁ జోరైనపైడి పళ్లె, రంబు చిటుపొటి గిన్నెలు చెంబు సంత,రించకుండుహొకో యమ్మయెంచు కొమ్మ. వై జ. 4. 25.
3. కలిగించు, పుట్టించు.
సీ సన్నుత సత్కవీశ్వరగాయక చకోరసమితి కానందంబు సంతరించి. వి. పు. 1. 39.
వ లేటిపిండునకు జలభ్రాంతి సంతరించు నెండ మావుల చుఱుకునఁ బెండివడి గ్రాఁగు. చంద్రాంగ. 2. 84
వ. దుర్గాధిపతు లేమేమ యని పిచు పిచోపు లచ్చుమ్మలగు కౌముదీ గుచ్ఛమ్ముల సంతరింప. మను. 5. 71.
4. తాల్చు, ధరించు.
గీ. గగనలక్ష్మి లతాతన్వికబరిమీఁద, సంతరించిన ముత్యాల జల్లివోలె. కాశీ. 4. 186.
సీ. కేలుఁదామరయందుఁ గేదారవలయంబు, జడ కుచ్చుమీఁదఁ బచ్చడపు దండ సంతరించి. హార.
తే. మగువ దేవర దివ్యనామము జపించు, నెమ్మన మ్మున నిత్యవ్రతమ్ము గాఁగ, వచ్చముక్తాఫలై కావళిచ్ఛలమునఁ, జన్నుఁగవ నక్షసూత్రంబు సంతరించి. శృం. నై. 8. 63.
సీ. పయ్యెదమాటుగాఁ బాఱుటాకు లమర్చి, చాదునఁ దిలకంబు సంతరించి. హార. 5. 87.
సీ. లీల రుద్రాక్షమాలిక దక్షిణశ్రవశ్శష్కులీ శిఖ యందు సంతరించి. కాశీ. 2. 64.
చం. అనవుడు మందహాసరుచి యావన పద్మము నందలిర్పఁ జ,య్యన నిశితాసి పుత్రిక కరాంబురుహంబున నంతరించి. విక్ర. 2. 232.
5. చక్కఁబెట్టు, సవరించు, సరిపఱచు,
చం. నెఱవుగ వన్నెవెట్టి రమణీమణి పయ్యెద సంతరింపఁగా మఱచి. విక్ర. 4. 204.
వ. తదనంతరంబ యంతరంగంబు కొంత సంతరించి కొని యతఁడు నారాయణున కిట్లనియె. ఉ. హరి. 4. 70.
6. రచించు, నిర్మించు.
సీ. సంతరించితి నిండుజవ్వనంబున యందు, హర్ష నైషధ కావ్య మాంధ్రభాష. కాశీ. ఖం. 1. 8.
7. నెఱపు, చేయు, నడపు.
సీ. స్వర్ణాల లాచెట్ల శాఖల చాటున, సంతరింతురు కికురింతలాట, చెన్నబ. 5. 378.
వ. ప్రకృతి కాంత క్రంత సురకాంతలం గూడు కొని సంతరింప ... ఆము. 6. 130.
8. సిద్ధముచేయు, సంగ్రహించు,
తే. నిత్యనైమిత్తికములైన నియమ విధులు, దీర్చి పిండప్రదాన విధిని నదర్ప, మాషగోధూమయవ చూర్ణ మధుతిలాది, సముచిత ద్రవ్యములు చాల సంతరించి. వరాహ. 2. 78.
9. అలఁదు, పూయు.
సీ. కస్తూరి పునుఁగును గంధసారంబును సంపంగి నూనెయు సంతరించి, హార. 4. 78.
10. పూను, వహించు.

వ. విశ్వవిశ్వంభరా క్రీడనంబు దనకు విరచించిన వరమ శాంతి యంతరంగంబున సంతరించి నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. భీమ. 1. 31.

11. చేరఁదీయు, దరిచేర్చు.

కం. పలుఁగూఁత లఱచువానిం, గలుద్రావెడువానిఁ జెవులు గఱచెదువానిం, బొలఁతులఁ దెచ్చెడు వానిం, దొలఁగింపక సంతరింపుదురు రాజన్యుల్. వేం. పంచతం. 1. 448.

12. పోషించు.

సీ. ... సంబళంబు లొసంగి సంతరింపఁగ లేమి విడిచిపోవఁ దొడంగె విబుధబలము దశా. 2. 51.

13. ఆదరించు (కం. సంతయిసు = శాంతపఱచు, తు. సంతెరిసు = ఓదార్చు, ఆదరించు).

వ. అంత వసంతుండు ... మూర్ఛిల్లి ... తన్నుం దాన సవరించుకొని ... రతినేకో పాయంబుల సంతరించి యూఱడం బలికిన ....కుమా. సం. 5. 570.

14. చక్కఁగా దాఁటు.

**సంతరించుకొను** స. క్రి. √ సంతరించు. సరిపఱుచుకొను, చక్కఁబఱుచుకొను.

వ. అని కోపించి నెఱయం దలంచి తపోభంగభీతిం దన్నుదాన సంతరించుకొనుచున్న యగఱంగని... కుమా. సం. 7. 877.

**సంతర్జనము** సం. వి. అ. న. బెదరించుట, భయపెట్టుట.

**సంతర్పణ** సం. వి. అ. న. తృప్తి. (రూ. సంతర్పణము).

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృష్ణం బాసి సంతర్పణ, న్మారింబోనసిఁ ద్రుంచి. ఆము. 6. 25.

2. ఆమెత.

వ్య. బ్రాహ్మణ సంతర్పణ జరిగినది.

**సంతర్పణము** సం. వి. అ న. 1. తృప్తిపఱచుట, తనివి కలిగించుట.

వ...మహాదేవికి సంతర్పణము సేయుట దుష్కర్మం బనరాదు. కళా. 4. 183.

వ. ... తొల్లి లోకోపకారార్థంబు దేవతాసంతర్పణంబు కొఱకు ... శివధర్మ. 1. 204.

2. ఉల్లాసపఱచుట, సంతోషపెట్టుట. 3. సంతోషము గలిగించు వస్తువు, ఉల్లాసకరమైన పదార్థము 4. ద్రాక్షాఖర్జూరాదులు చేర్చి నేయి పంచదారతోఁగూడిన పేలపిండితోఁ జేసినభక్ష్య విశేషము

**సంతసపడు** అ. క్రి. 1. సంతోషించు. (సంతసము + పడు).

కం. మతిఁ బాండుకుమారుల వంచత విని దుర్యోధనుండు సంతసపడియెన్. భా. ఆది 6 190

కం. జనకజకుశలముఁ దెలియం, జనుఁడని సంపాతి తెలుప సంతసపడి యా,తని గాఁ దవించి యంగద, హనుమన్ముఖు లచటుగఁ దలి యటు చని యెదుటన్. చంపూరా. 6. 87.

మ. ... నుతిం,చును సొక్కున్ రమియించు సంతసపడున్ సుజ్ఞాని నైతన్ము. మల్లభూ. శృంగార శత. 41.

కం. వసుదాయినిదైన వసుధ, నొసఁగి నతనిఁదన్నతన్న యొసఁగె వనుచు సంతసపడు భూతము లన్నియు. భా. అను 2. 386.

**సంతసము** వి. సంతోషము, ఆనందము. (సంతోషః క. సంతస).

గీ. చనును సంతోస మనఁగ సంతస మనంగ నలరు సంతోషము. ఆం. వ. గుణ. 2.

చం.... చేసిన నెవ్వరైన మెచ్చునివని యేను జేయుదునె సంతస మందుము కోర్కిఁ దీర్చెదన్. ఉ. హరి 2. 79.

తే. అంతిపురమున నుచితకృత్యములు దీర్చి, చంద్రశాలాస్థితుండైన శౌరికడకు, సంతసంబున వచ్చి యాసంయమీంద్రుడు, నడుగులకు నెఱగుడును వతఁడాదరమున పారి. 2. 22.

కం. రాణింపఁ బల్కి తనపని, జాణైకొను. గొలుచు సంతసపుఁదలి. ఆము. 4. 269.

ఉ. ... వేఱుసేయ కెవ్వానిగృహాంతరంబున భవాదృశ యోగిజనంబు పావన, స్నానవిధాన్న పావములు సంతస మందుచుఁబోవు నిచ్చలున్. మను, 1. 68.

7. తృప్తి.

చం. తను సగఁబాలు గోలువడి దానిన యిప్పుడు గోరువీరికిన్, సముచితవృత్తి నిచ్చి తమసామున సంతస మందియున్కి యుత్తమము. భార. ఉద్యో. 1. 19.

**సంతసించు** అ. క్రి. √ సంతసము, సంతోషించు.

ఆనందించు. (రూ. సంతసిల్లు).

సీ. కృష్ణపక్ష విభావరీవేళలఁ జకోరసమితి చంద్రిక లంచు సంతసింప. ఉ. రా. 1. 54.

**సంతసిల్లు(లు)** అ. క్రి. √ సంతసము 1. సంతోషించు.

ఆ. ఏను జహ్నుకన్య నింద్రసమాన నీసద్గుణావళులకు సంతసిల్లి, భానుతేజ నీకు భార్యగా వచ్చితి. భార. ఆది. 4. 186.

గీ. సర్వభూతానుకంపకు సంతసిల్ల. హర. 1. 7.

చం. ... కంజదళాక్షుఁడు సంతసిల్లె నేర్పడియెను వజ్రనాభవధభారవహుం డిపు డంచు నాత్మలోన్. ప్రభా. 2. 23.

పంచచామరము. పులస్త్యమౌని సంతసిల్లి భూతలేంద్రుతోననున్ ఉ. రా. 3. 263.

ఆ హీనజన్మ మఱుట యెవ్వఁడే నొకప్రాణి, సంతసిలుట ముక్తిపొంత గనుట, మేలె కాదె. ఆము. 6. 29.

సీ. నీతల్లి లచ్చమ్మనే సంతసిల నోరెములు వెట్టుఁబుడమి వేల్పులకు నెల్ల. అ. రా. బాల. 15.

**సంతానకము** సం. వి. అ. పుం. అయిదు విధములగు కల్ప వృక్షములలో నొకటి.

తే. గీ. తరుణ సంతానకచ్ఛాయఁ దలిరుఁజాన్పు, నందు నాసరోవరమున కభిముఖముగఁ,బవ్వళించెమదవ పాద పల్లవంబు, లూరువులఁ జేర్చుకొని వాణి యొత్తుచుండ. కళా. 5. 15.

**సంతానము** సం. వి. అ. పుం. న. 1. వ్యాప్తి, విరివి. 2. అవిచ్ఛిన్నత, ఎడతెగమి. 3. విచ్ఛిన్న ధార, పరంపర. 4. వంశము, కుటుంబము. 5. సంతతి, పుత్త్రాదికము, అపత్యము.

సీ. కానక కన్న సంతానంబు కావునఁ గానక కన్న సంతాన మయ్యె. రామా.

సీ. కానక కన్నసంతానంబు శిశువులు. శృం. నై. 1. 104.

6. నందనవనమునందలి యైదు కల్పవృక్షములలో నొకటి.

కం. సంతానవాటికలును, జింతామణి వేదికలును శృం. నై. 5. 22.

**సంతానసంధి** సం. వి. ఇ. స్త్రీ. బిడ్డనిచ్చి పెండ్లి చేయుట మున్నగు వానిచేఁ గలిగిన పొందు (సంధి).

**సంతానిక** సం. వి. అ. స్త్రీ. 1. నురుగు, ఫేనము. 2. మీఁగడ. 3. సాలెగూఁడు. 4. ఖడ్గధార, కత్తివాదర.

**సంతాపనము**[1] సం. విశే. (అ. ఈ అ.) 1.కాలుచునది, దహించునది వి. అ. పుం. మన్మథునియైదు బాణములలో నొకటి. వి. అ. న. 1. కాలుట, బాధ, నొప్పి 3. భావోద్వేగము గలిగించుట.

**సంతాపము** సం. వి. అ. పుం. వేడి, అధిక తాపము.

సీ. తీవ్రాంశు సంతాపమునఁ జేసి కమరె నాతెక్కలు గమరవయ్యె. భార. అర. 7. 21.

2. బాధ. 3. అధికకోపము. 4. పశ్చాత్తాపము. 5. తపస్సు. తపఃక్లేశము. 6.శరీరమును శుష్కింపఁ జేయుట.

**సంతాపించు** సం. అ. క్రి. పరితపించు, దుఃఖించు, వగచు.

కం. ... అనతిక్రమణీయమైన యాపద్విషయం,బున సంతాపింపంగాఁ, జనదని యెఱిఁగియును దగునె సంతాపింపన్. భార. ఆది. 6. 251.

కం. ఆపౌలస్త్యకుమారుని, శాపము విని పంక్తిముఖుఁడు సంతాపించెన్. ఉ. రా. 4. 237.

**సంతాపితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తపింపఁజేయఁబడినది, మిక్కిలి వేడిమి కలిగింపఁబడినది. 2. బాధింపబడినది,

**సంతి** సం. వి. ఇ. పుం. 1. అంతము, నాశము. 2. కానుక. (చూ. సతి)

**సంతు** వి. (సం.సంతతిః) సంతతి, కొలము, వంశము.

తే, సంతు కొలము. ఆం. ప. నర. 2.

సీ. సంతు కొలము వంగసము వంగడము పదుగవ వంశసంజ్ఞయై యలరుచుండు. ఆం. భా. 2. 170.

సీ. ఇవిగదా తెలిమావురవుతు సంతు పిసాళి, దొడ్డ సెజ్జ బవళించు నొడయ లయ్యె ... అనఁగ శౌరి చిన్నారియడుగు లమరు. (తెలిమావురవుతుసంతు అర్జునుఁడు). ముకుందవి. 1. 43 పు. 1 ప.

2. సమూహము.

సీ. మగువల మొగము లా గగవారనిందంబు లొదవెఁ గాకని తేఁటికొదమసంతు. కళా. 2. 78.

**సంతుష్టి** సం. వి. ఇ. స్త్రీ. సంపూర్ణతృప్తి, పూర్తిగా దనిని వొందుట.

తే. గీ. ... ... నయనసంతుష్టి గాఁగ, నరుగు దెంచుచున్న వాఁడభ్రవీధి, నితఁ డెవ్వాఁడు. నిరంకు. 4. 10.

సంతొసము, సంతసము, సంతోసము, ఆనందము.

చం. అసురుల నిమ్మెయిం బ్రమిదితాత్ములఁ జేసి పయోజనాభి సంతొసమున నాకలోకపతిఁ దోకొని పోవు నెడం దదీయవక్త్రసరసిజంబు లజ్జ యనురాత్రి గడుం జెడియున్కిఁ జిన్ గృపాంచస పరుఁడై హితార్థ మధురస్ఫుట సత్యమృదూక్తి నిట్లనున్. నిర్వ. 7. 14.

**సంతుష్టుఁడు** సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి తృప్తి నొందినవాఁడు.

**సంతోషణము** సం. వి. అ. న. సంతోషపెట్టుట.

**సంతోషము** సం. వి. అ. పుం. 1. తృప్తి. తనివి, ఆనందము, ప్రమోదము.

ఆ. వె. ... పనులదయ్య మెఱుఁగుఁ బడఁతుల సంతోష, మేల వాకు వనిక జాల నేమ. భార. విరా 4. 60.

2. ధైర్యము.

**సంతోషించు** సం. అ. క్రి. హర్షించు, ముద మందు.

వ. ఇట్లు చరాచర ప్రపంచమునకుఁ బ్రాణంబైన సోముండు సంభవించిన సంతోషించి మధుకైటభారాతియు నీరాకర మథనక్రీడ చాలించి వైకుంఠంబు నకుం జనియె. వరాహ. 7. 63.

**సంతోసము** వి. సంతోషము, ఆనందము. (సం. సంతోషః).

గీ. చనును సంతోసమన సంతస మనంగ వలరు సంతోషము. ఆం. ప. గుణ. 2.

కం. ఆ సమయంబునఁ బువ్వులు, గోసి నృపాత్మజుఁడు దండ గొలుసొత్తులుగా, వేసరక కట్టి కదు సంతోసము నివ్వటిలఁ బొదివి తొలఁగఁగఁ బెట్టెన్. భోజరా. 5. 207.

మ. ... మత్సహస్రోత్కర దుద్ధనవేఁ బిల్వఁగఁ బంచికన్న కల సంతోసంబునన్ దెల్పినన్. ఉ. రా. 1. 24.

**సంతోసిల్లు** అ. క్రి. (√సంతోసము) సంతసిల్లు, సంతోషించు, ఆనందించు.

కం. నీసైనికులెంతయు సంతోసిల్లుచు నార్చి, రవుడు దుఃఖితులై కుంతీసుతుల వారు దీన దశానంగతులై రి బాష్పజలములు దొరఁగన్. భార. ద్రోణ. 2. 181.

**సంత్యక్తము** సం. విశే. (అ. అ. అ.) 1. పూర్ణముగా విడువఁబడినది. 2. దొంగిలింపఁబడినది, అపహరింపఁ బడినది (విల్యమ్సు).

**సంత్యజనము** సం. వి. అ. న. పూర్ణముగా విడుచుట; సన్న్యసించుట.

**సంత్రాణము** సం. వి. అ. న. సంరక్షణము.

సీ. విబుధ సంత్రాణ ప్రవీణుఁడై నిఖిలైక, మతిఁ గాంచు నే మానవపతిభవుండు. చంద్రికా. 1. 2.

**సంత్రాసము** సం. వి. అ. పుం. భయము, వెఱపు.

**సందంశ(క)ము** సం. వి. అ. పుం. పట్టుకారు, అక్షరము లుచ్చరించినప్పుడు దంతములను నొక్కుట, వర్ణభేదము. సందడి.

**సందంశిక** సం. వి. ఆ. స్త్రీ. చిన్న పట్టుకారు; శ్రావణము.

**సందడి** వి. ఒత్తిడి, రాయిడి, సమ్మర్దము. (త. సందడి)

సీ. రాజుల సందడి రాలినతొడవులు మురిసి రాలిన పొడిముగ్గు గాఁగ. భార. విరా. 3. 74.

ఉ. చీటికిమాటి కేకపథసీమ మెలంగఁగఁ బాటి గామి కృంగాటక వీథి కేగెఁ బతి కాంతల సందడి కుల్కి. శృం. నై. 3. 93.

సీ. కరుల సందడి నొప్పుఘనసేన దుర్దమలీలతో నడచెఁ బాంచాల విభుఁడు. భార. భీష్మ. 1. 112.

వ. నివారింపరాని మానవపరంపరల సందడుల మంద మందగమనుండై చని చని. చంపూరా. 4. 68.

ఉ.... తెల్పడియె సందడిగాఁ గదియం గదావళుల్ హరి.ఉ. 7. 52.

2. సమూహము.

తే. గీ. సందియంబుల సందడి డిందఁ జేసి, కందు లేనిమనీష సనందనాది, వందనీయుండ నైన నా యందుఁ గలదు, సీతారా. 2. 151.

ఉ. సాంతముగాఁగ శబ్దహృదయజ్ఞులుదా రుచిత ప్రయోక్తలై, వింతలుగాఁ బ్రబంధముల వీధులు ద్రొక్కఁగఁజాల శక్తులై, దొంతర జల్లి బొంతవెడ దూర్చి గతార్థము కూర్చు దుష్కవి, వ్రాంతుల సందడిం దడవఁ బాసెఁసజ్జులకుం గవిత్వముల్. కవి. పీఠి. 1. 16.

3 జనసమూహము.

వ. బలసికొను కోలాహలమ్ము లిమ్ముగ సందడులు నెడ గలుగన్. మను. 5. 71.

కం. సందడిలోఁబడి యిరువుర, ముం దడుణ మాత్ర నరిగి మోదం బలరన్. దశకు. 3 48.

కం, మోహాలం దతివైభవమున, సాహోయని కటిక వారి సందడి జడియంగా హేమరత్న ఖచిత మహా హర్మ్యము చొచ్చి యందు నాసీనుండై. ప్రబోధ చం. 2. 59.

వ. హారవిధాతలు వేత్రహస్తులయి తలంగుండు పాయం దొలంగుం డనుచే సందడి నెడఁగలుగఁ జేయ. హార. 4. 89.

సీ. నందడి గ్రవ్వడి పొంది పెక్కోలంబు లరసి. దశకు. 5. 130.

సీ. శరణీయు లెదురుగా శరణార్థి నేయుచే, నొ య్యొయ్య సందడి కోసరిలుచే. హార. 2. 87.

3. సాంద్రత.

ఉ .... యూప సంఘంబుల సందడిన్ నడువ గాడ్రైరు వైనను లేక సాధురమ్యంబును శత్రు భీషణమునై పుర మొప్పుచునుండు నెప్పుడున్. జై. భా. 2. ౬.

4. అల్లరి, జనసమూహధ్వని.

మ. అవలోకించి వయస్యలార కడురమ్యంబైన యూతోఁటలోన వినోదింతము గొన్నినాళ్ళచటఁ బెంటల్వెట్లు నీపాపి గాంధ్ర వృథా సందడి గాని బొంద మనకేలా పాటిపోవంగఁ జేయవలెం బేటన పెట్టి యంచు పెను పెంపై భీకర ప్రక్రియన్. వరాహ. 11. 75.

5. కలఁత, సంక్షోభము.

చం. వి. చ్చలవిడిఁజేర్పు నెవ్వగల సందడి డెందము గంది చేర్పడున్. భార. విరా. 2. 293.

సీ. ... ఎవ్వనియందుఁ బ్రాకృతములైన, సత్వాది గుణముల సందడి లే దట్టివిమలుని... .... ...అము. 6. 103.

6. ఆటంకము, విఘ్నము.

కం. ... యుష్మత్సమధిక తపమునకు నేను సందడి నేయన్. భార. అశ్వ. 2. 140.

7. ఇఱుకు, సంబాధము.

చం. కనుఁగొని దర్పముందరముగా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజన్మునకు వడిం బెనంగఁగ నను బవ నాత్మజుఁ జూచువేడ్క ని జ్జనతతి యంతకంత కిటు సందడిగాఁ దనయిచ్చఁ గ్రమ్మ దెంచునో. భార. శల్య. 2. 231.

8. స్పర్శ, తాకుడు.

ఉ. ... కోమరు మాలెత గన్నుల నవ్వుదేరగా, సంబళి సంబళీ యళుకు సందడికిం దలమంచుఁ బల్కుచున్. శివరాత్రి. 3. 40.

విఙ. సంకులము.

వ. ... తత్సైన్యంబు లొక్కమొగిన మొనయుటను మనమూఁకలును సోమదత్త బాహ్లిక పురస్సరంబుగా నురవడించిన సందడికయ్యం బయ్యె...భార. ద్రోణ. 5. 86.

**సందడించు¹** అ.క్రి. అతిశయించు, అధికమగు, హెచ్చు (రూ. సందడిల్లు).

తే. ...అవ్వేలఁది సనియె, జనకుఁ జూచెడు వేడుక సందడింప. భాగ. 4 స్కం. 77.

చం. అని ముని పల్కిన న్విని జనాధిపుఁ డూర్పులు సందడింప నెమ్మనము చలింపఁగా నకట! మత్సు కృతం బిటులుండ నేమిసేయవగు ? మార్క. 5. 186.

చం. పలపలఁ దొల్తదొల్త నొకపాటిగ మాటికి నేటవాలుగా, జలకణముల్ నిగుర్చుచు వెసన్ జడి పైబడి సందడింపఁగా, జలధరపంక్తి దారొక్కనుచుఁ బండకరుం గననీక దట్టమై, వెలసి మహాంబుధారల దివిన్ భువి నేకము చేసె నత్తఱిన్. ఇందు 3. 107.

తే గీ సరగ నేతెచి యూర్పులు సందడింప, రాజు ముందఱ నిలిచె న భోజవదన. కాశ. 1. 47

తే. గీ ... వకుల వికసె గౌను బలిసెఁ గోర్కులు మది సందడించె దశకు. 1. 86.

సీ. కనుచూపులను మన్మథుని మోహనాస్త్రంబు లందుఁ గాటుకమప్పు సందడింప. విప్ర. 2. 198.

గీ అమరలోకంబు నిర్జింప వసువఁ బొంగి, సంగరోత్సాహ మెదలోన సందడింప, వడరు పెంపువ నరుగు నయ్యర్జునునకు, నిర్జరులు హర్ష మున నిట్లనిరి కడఁగి. హర. 7. 152.

ఉ....కపోల మండలీ, దానమిళద్ద్విరేఫనినదంబుల ఘీంకృతి సందడింపవె, ల్లేనుఁగు మీద డీకొలిపి యింద్రుఁ డుపేంద్రునిఁ దాఁకె నుద్ధతిన్. పారి. 5. 18.

చం. ... కన్టైదుఁ విరోధిఁ గాంచి యొదవించిన కోపము సందడింపఁగన్. జై. భా. 2. 84.

శా. ...చెక్కిళ్లపైఁ దెల్పు రెట్టించెన్ గూర్కులు సందడించె నడ చండించెన్ మృదామోదముల్, గాంచెన్ వాతెఱ యోసిరించెఁ ద్రివళుల్ నానాఁటికిం బోటికిన్. విజ. 2. 86.

శా. చిత్తేజోమయు నొక్కమౌనిఁ గని భాషింపంగ నూహించుచోఁ, జిత్తానందము సందడింప వనుఁ బిల్చెన్ శాంతవాక్యంబులన్. వరాహ. 6 135.

2. గుమిగూడు, మూఁగు.

ద్వి. రాసిన నవహేమరజములు దొఱుఁగ, సందడించుచు మహాసంరంభ మెసఁగ, బృందారకారి తోఁ బేర్చి యిట్లనిరి.

రం. రా. యు. కాం 288 పు. 18 పం.

వ. కొండగొఱియ ముఱుగుఁడు బొందులకు సందడించు కంకగృధ్రావళుల మొల్లంబుల ముసుంగు పడు పల్లంబులును మను. 4. 87.

చం. గరుడుఁడు రాజహంసమును గంధగజంబును మేకఁపోతు శార్దూలము వరుండు నక్రకుల చంద్రుఁడు నిట్టియు గుజ్జు మెద్దు నిర్జరుల విమానముల్ మొదటి చావడిముందర సందడింప శ్రీహరి విధి వాసవాదులు నిజావసరాళ వసించి యుండగన్. కాళ. 4. 15.

3 క్రాల్కొను, చుట్టుకొను, పెనఁగొను

వ. అగ్రభాగంబున వసచువామనుసై సందడించు వైకుంఠనివాసులతో ముప్పదిమూడు కోట్ల దేవతలతో. ఉ. రా. 8. 294.

వ. కని తదీయమహామహిమకు నంతరంగంబులఁ గౌతూహలాద్భుతానందంబులు సందడింప నందఱుఁ దమలో నిట్లనిరి. నృసిం. హ. 3. 4.

మ. .... మది నీర్ష్యాక్రోధముల్ సందడింప. ఆము. 5. 74.

సీ కమనీయ భూషణగణమణి ద్యుతులును శాతాయుధద్యుతుల్ సందడింప. భా. రా. బాల. 637.

కం. అనుచుఁ బవపునుఁ బివందనములు నెమ్మనమునం దుదంచితసమ్మో, దనితాంతభక్తి సంతత, వినయంబులు సందడింప వేముఁ జేసెన్. రాఘ. 3. 62.

శా. వీక్షించెన్ దరళాక్షియు న్మనమున వ్రీడాప్రమోదక్షమా,దాక్షిణ్యంబులు సందడింప నిలిచెం దత్సన్నిధానంబునన్. హర. 4. 55.

4. గోలపెట్టు.

ద్వి. కంతుహరుఁడ యెగ్గుగా కేమియంచు, సందడింపుచు నున్నజనుల వీక్షించి. పండితా. మహిమా 252.

ద్వి. మాయలు పన్నక మాదికకొయ్య, జూపుము చూపు మెచ్చోట తన్నిత్యవాఁయని సందడించు నయ్యధమపాదులను గని నూరసానమ్మ గారు కోపించి. పండితా. దీక్ష. 45.

5. సాంద్రమగు.

సీ. దైత్యపిశాచ భూతప్రేత ధాకినీ సంరావములఁ తోడ సందడించు. వి. పు. 2. 48.

6. రొదసేయు, ప్రేలు.

ద్వి. చాకి చాకని యేల సందడించెదవు. బస. 82. పుం. 23 పం.

సీ. ఒకతె కప్రపు కళాచికఁ దేంట్లు సందడింపఁగ మిట్టిపడి కేలు బయలు పట్టు. వసు. 4. 75.

గీ. పడఁతి యాలతకూన పుష్పిణి యటన్నఁ, గేల నిపుడంటఁదగునె నీవేల యిప్పు, డలరు కొమ్మ

రజముగలదే౽ దెలిసె, స్పృశించితి ద్విజరాజి సందడిప. ఇందు. 8. 65.

7. విజృంభించు

ద్వి. ఇలవేయు వననేల యీగురుద్రోహి, తలదున్ని దైవక తక్క మేమనుచు, సందడింపఁగ గురుస్వామి తచ్చివ్య, బృందంబు భావించి ... పండి. పురా. 110.

8. సంభ్రమమునొందు, తత్తరపడు.

గీ. ఇందుమతి యేమిదెల్పురు న దుఁ గొంద,రిందు వదనలలో క్షితి గ్రందుకొనఁగ, సందడింపుచు శైత్యోపచారవిధులు, సరగ నొనరింపఁ దెలివొందె జనవరేణ్య. ఇందు. 2. 171.

తే. గీ. అధికతరరోషభీషణవ్యాఘ్రిఁ జూచి, బెగడి నలుదిక్కులకుఁ బోవు మృగముపోలి, సందడింపుచు వచ్చు నాజరతిఁ జూచి, ధారుణీదేవతనయుండు తల్లడిల్లి. నిరం. 2. 121.

9. వ్యాపించు.

సీ. చారు సహస్రమస్తక విభూషణ మణిచ్ఛాయలు దిక్కులు సందడింప. విప్ర. 3. 100.

10. ప్రకాశించు.

సీ. ధాతుమించిన మంచి తమ్మంట రాగంబు శ్రవణ భాగంబుల సందడింప, భ్రమరాస్పదంబైన పట్టు రెంటెము కటీస్థలిఁ గరము విభ్రమము సూప. వరాహ. 11. 8.

**సందడించు**[2] స. క్రి కలవరపెట్టు.

ఉ. అంగన నిన్నుఁ గన్గొనినయంత ననంగుఁడు సంద డించెడున్. భాగ. 6 స్కం. 1 ఆ. 28.

2. హెచ్చరించు.

గీ. ముదితమానస లగుచు నమ్ముదితలెల్ల, విదితమగు వేడ్క దనర వేవేగ నపుడు, పెండ్లిపాటలు దన రంగఁ బ్రియమెసంగ. నొండొరుల సందడింపుచు నుచితలీల. ఇందు. 6. 72.

**సందడికయ్యము** – సంకులయుద్ధము. వి. దొమ్మి యుద్ధము.

వ. పెక్కులు పెక్కులునుం దలపడి యెడనెడంగల యన్ బెరయం గ్రమంబున సందడికయ్యంబు నూలుకొనినఁ గ్రందునం దమకించి యుభయ సైని కులున్మత్తులగతిం గవియ భార. భీష్మ. 1. 267.

వ. ఇవ్విధంబున నుభయబలంబులుం దలపడి సందడి కయ్యంబునం గదిసి. ఉ. హరి. 3. 27.

**సందడిగొను** – సందడించు. అ. క్రి. (√సందడి)

1. మించు; అతిశయించు.

కం. దెండమునఁ గొలువు వేడ్కలు, సందడిగొన నేఁగుదెంచి సంయమివరులన్, బృందారకులు న్నిల్చిరి, క్రందుగ జగదీశు మందిరద్వారమునన్. నృసింహ 1. 78.

2. మూఁగు, క్రమ్ము.

చం. పదువదగండ్లు పెల్లగనుపట్టు మిణుంగురుఁ బుర్వులంచు సం,దడిగొను నింద్రగోపములు. విక్ర. 3. 62.

**సందడి జగడము** – సందడి కయ్యము. వి. సంకుల యుద్ధము.

కం. అసందడి జగడంబున, నాసురపతి మఱిఁది యనుచు నరయక తనపై, డాసిన నీసునఁగత్తిన్, బ్రేసెనడుము రెండుగాఁగ విద్యుజ్జిహ్వున్. ఉ. రా. 8. 384.

**సందడిపడు** – సందడించు. అ. క్రి. కలతపడు, క్షోభ పడు.

ఉ. అంబుజసంభవుండును బలాంతకుఁడున్ మొద లైన దేవసం,ఘంబులు వచ్చి నా కొలువుఁ గాంచఁ గఁగోరి యొకళ్ళొకళ్ళ ని, త్యంబును వాకిటం గవియ దండధరుల్ ప్రహరింపఁగాఁ గిరీ, టంబులు దుల్ల సందడిపడన్ నరవానరులింక లక్ష్యమే, రామా. 7. 167.

2. గుమికూడు.

కం..... క్రిందటి పాతాళమునను గ్రీడించుచు నా, నందము నొందుచునుండుము, సందడిపడి నాగ కులము చతురత తోడన్. భాగ. 5. 2. 120.

3. ధ్వనించు, రొదసేయు.

**సందడిలు(ల్లు)** అ. క్రి. అతిశయించు, మించు.

తే. గీ. సంధడిలు వేడుక ఖలుమారందవాహ, ములు

తదాహారి భూరిసముజ్జ్వల ప్రవాళము లభీష్టఫల ములనోలి నొసఁగు, నావసంతంబు రతిరాజు దీవి నొసఁగ. చమత్కా. 1. 47.

సీ. నాట్యక్రియా సముపన్నత మృదంగ ధ్వనుల్ సౌధాగ్రగృహముల సందడిల్ల. మత్స్యపు. 1.102.

2. ప్రకాశించు.

సీ. కోరకంబులు నిండుకొని, సందడిలునట్టి తార కంబులతోడఁ బ్రస్తరింప. చిత్రభార. 2. 99.

3. పెనఁగొను.

ఉ. మోదము సందియంబు దనమోమున సంద డిలంగ. దశకు. 9. 41

4. మూఁగు, క్రమ్ము.

తే. ఐదువతనంబు ప్రోక మాయమ్మ యనుచు, సతికిఁ గేల్మోడ్చువారు నై సందడిలిరి. రాఘ. 2. 70.

కం. ముందటఁ బిఱుదం గ్రేవల, డెందమునం గరము సందడిల వల దా య, స్పంద శుభావహ ములు గో, బృందము లని మాకుఁ బుట్టుఁ బ్రియ మెల్లపుడున్ కాశీ. 2. 24.

**సందడీఁడు** విశే. (√సందడి) వ్యాపకుఁడు.

ద్వి అలయోగి హృదయంబు నరసెద ననుచు, దల పోసి తవసిడెందపు సందడీఁడు. పరమ. 44 పు. 12 పం.

**సందడికాఁడు** దే. విశే. సామాన్యుఁడు (శ. ర.), అప్రధానుఁడు.

సీ ఉపసర్జనాఖ్యమై యొప్పును సందడికాండ్రు నా జిల్లర వాండ్రు నాఁగ. ఆం. భా. 3. 16.

**సందరము** వి — సంద్రము (సం. సముద్ర, ప్రా. సముద్ద. త. సముద్దిరమ్)

కం. అందంద యుద్భవించెను, సందరమున నింది రానుసంజాతములై, మందారకల్పతరుహారి, చందన సంతానపారిజాతాదు లొగిన్. హార. 6. 81.

కం. సందరమున నురువలరె ము, కుందునిఁ బెండ్లి కని బిలుచుకొని కేగెదుభూ, బృందారకుఁ గన్గొని యా, నందంబున వప్పయోధి నవ్వె ననంగన్. (శ. ర.) రుక్మి. 4 ఆ.

**సందర్భము** సం. వి. అ. పుం. 1. కూర్చుట, గ్రుచ్చుట, 2. రచన సేయుట. 3. ప్రోగుచేయుట, రాశీకరణము 3. (కథయొక్క) పొందిక, పరిష్కృత ప్రబంధము. 4. అన్వయము. 5 ప్రబంధము, కృతి (శ. ని.). 6. ఉక్తివిశేషము.

కం. ఈ సందర్భము వీరలు, సేసినయది మేము వీరి శిష్యులము. విద్వచనో. 1. 124.

కం సందర్భము నవరసరీతి, వ్యంగ్యాదియుతముచుఁ గవుల చెవుల జవులు దవుల నిండ, పొందిన దగుఁగా కూరక, యః దదుకులు గూర్చు కవిత యదంబగునే. రఘురామా. 1. 17.

వ. అనంతరంబ యారాజు రాజకీరాభిలాష గర్భంబులైన సముచితాలాప సందర్భంబు లుపన్య సించిన నద్యోగినీరత్నంబు. విక్రమా. 7. 18.

వ. స్థావరజంగమంబులకు దివ్యంబులకు గర్భసం దర్భ నిర్భరావిర్భావదుఃఖంబులు సమానంబులు. శివధర్మ. 5. 24.

7. సమయము (శ. ర).

**సందర్భశుద్ధము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పొసఁగి యున్నది. 2. ఉచితమైనది. 3. సుసంబద్ధమైనది.

**సందర్భశుద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. కావ్య రచనా వైశద్యము. 2. వస్తువిన్యాసము నందలి యౌచి త్యము.

**సందర్భించు** సం. స. క్రి. కూర్చు, రచించు.

వ. మహాప్రబంధంబు సందర్భింపం బూనియున్న సమయంబున. చం. రా. 1. 16.

**సందర్శనము** సం. వి. అ. న. 1. చూచుట.

తే. గీ. .... ద్వారవతి కేఁగి యతని సందర్శనంబు వడసి కానుకగాఁ బెట్టెఁ బార్థివేంద్ర.

2. నిదానించిచూచుట. 3. పరిశ్రమ విలోకనము. 4. దృష్టి, చూపు, కనఁబఱుచుట. 5. ఆలోచనము. 6. విశదపఱుచుట. 7. కలియుట.

**సందర్శించు** సం. స. క్రి. చూచు.

మ....ఆ, విపులానాగనివాసనాకముల సంవీక్షించి వైభాత్రరా, గ్రపురంబుల్ గని దేవి నిన్నిచట సందర్శింప నేతెంచితిన్. వరాహ. 11. 36.

సందష్టము సం. విశే. (అ. ఆ. అ.) 1. కఱవఁబడినది, కొఱుకఁబడినది. 2. దగ్గఱగాఁ నొక్కఁబడినది. 3. కాటు మొ॥ వానితో నొక్కఁబడినది. వి. అ. న. ఉచ్చారణమునందలి యొక దోషము.

సందానము సం. వి అ. న. 1. త్రాడు. 2. గొలుసు, శృంఖల. 3. ఖండనము, నఱుకుట. సం. వి. అ.పుం. ఏనుఁగు గండస్థలము నందలి మదము కాఱెడిస్థలము (విల్సను) (ఏనుఁగు మోకాలి దిగువ భాగము అని వాచ.).

సందానితము సం. విశే (అ. ఆ అ.) 1. త్రాటితోఁ గట్టఁబడినది. బంధింపఁబడినది.

వ. చంద్రికానఃకాశ కౌశేయశత సహస్రసందానితవితానోపశోభితంబును ... భీమ. 2. 127.

2. గొలుసుతోఁ గట్టఁబడినది.

సందానిని సం. వి ఈ. స్త్రీ. గోష్ఠము, పశులసాల.

సీ. కామధుక్సందానినీ మధ్యదేశంబు రసవతి దేవశాలినిమునకు. (అద్భి.) పాండు. 3. 142.

సందావము సం వి. అ. పుం. 1. పాఱిపోవుట. 2. తిరోగమించుట.

సందాహము సం. వి. అ. పుం. పూర్ణముగాఁ గాలుట, దగ్ధమగుట.

సంది వి. (సం. సంధి) 1. సందు, మందడి, రెండు వస్తువుల నడిమి భాగము.

మ. పురిచేట్టు న్నిశరుండు సారణుఁడు నీభోజాంధకు ల్గాడి క,త్తెర గాయంబులు గండ్లముంగడల సందిం గొమ్మకొమ్మ న్నిరంతఃమున్ సాదన దీవెలెత్తి చనుఁడు. ఉ. హరి. 2. 94.

కం. వడఁతులు వెంటనె ప్రియసతి, వడఁజనఁ బడవైవఁగాఁ గవాటము సందిం,బడి యొక్కతె జడ జిక్కెం, గడు విభునెద నాటు మదనఖడ్గముఁ బోలెన్. రాజవాహన. 5. 88.

మ. ... దం,తెలఁ దాపించిన కెంపుటంటికల సందిం బొంది రావ్రజగా, రెలఁజెన్నొ ... దశా 4.49.

సీ. అచ్చెల్వ చెవిసంది వమరు సంపెంగ పువ్వుచాయల జివ్వాదిసౌరభంబు. ఉ. రా. 4. 184.

2. దండచేయి, బుజమునకు మోచేతికి నడిమి భాగము, సందిలి, ప్రగండము.

చం. వెడవెడఁ జంకఁజిక్కమున వ్రేలెడు చల్దియు సందిలోహపుం, గడియము క్రూరదృష్టిగల కన్నులు. వేం. పంచతం. 2. 8., ఆం. భా. 2. 128.

సీ ఒకకేల భసిత భస్త్రికతోడి బెత్తంబు సందిఁ గట్టిన తరుణేందుధరుఁడు. కాశ. 1. 30.

తే. ... రుదు రాకలిడ్డ సంది, సూతసంహిత లిఖికించి చొరఁదొడఁగిరి. ఆము 4. 46.

తే. గీ. చుట్టుపువ్వుల సిగలు కస్తూరిబొట్లు, సంది తాయెతులునుఁ జెంపగందములును, గలిగి సవయస్కులగు కోఁడెకాండ్రఁగూడి, విటులు విహరింతు రవ్వీట వేశ్యవాటి. వైజ. 2. 45.

వ సోలు బొందులును, వ్రాలుసందులును, విడియగోళ్లును, మిడియు వ్రేళ్లును, వలియు కన్నులును, నులియు వెన్నులును. చంద్రాంగ. 6. 93.

మ. .... సం,దుల దండల్ సవరించి కన్నుఁగవ కాంతుల్ కాటుకందీర్చి మం, దులతాయెత్తులు గట్టినన్. శబరపుత్రుల్ గూడియాడం బురిన్ కాశ. 3. 32.

3. సంధి (వ్యాక.).

తే. గీ. ... సందులు దెలియక కవితాకవితల రాజహంస కవులఁ గదిసి, కావుకావనెడి కాకవులు కవులె. ప్రబం. 1. 16.

4. సంధి విగ్రహాది షడ్గుణములలో మొదటిది. ఆం. భా. 2. 188.

5. జూదమాడుట కుపయోగించుకొను ముద్రా విశేషము.

సీ. మేటిజూదరియన వాటమైతివుటమై నాడు చుండుదు నే నహర్నిశములు, దృష్టియేమరక సందియు జాగరంబును దిగయును గరయు నాఁడేట పడిన యచ్చుఁ లోననే యచ్చైనఁ గైకొని మాటలాడినయట్లు వేటుగలుగ. ద్వా. 10. 88.

6. మంచెము, ఖట్వ.

సందికడియ(డె)ము వి. (సందిలి + కడియము) సందిట వేసికొనుకడియము

సీ. శావడియట్లు చిక్కము సందికడియంబు నూక
లతోఁప పొగాకులి త్తి. హంస. 2. 75.

సందికడెము వి. (సంది+కడెము) దండ కడియము, సందిట వేసికొను కడియము.

చం. మినమిన లీనుమేను నెఱమించుల కొంచెపు టంచుఁగమ్మలుం, గొనబగు ముద్దమోముసమకొన్న మెఱుంగుల కట్లదండయుఁ, గనుఁగవఁ గల్గు. శుక. 3. 105.

సంది క్రంతుజగడములు వి. సందులలోను గొందుల లోను జరిగెడి చిలిపి కయ్యములు

వ. ఈ మహోత్సవంబులలో నిట్టి గలబలు సేయు దురే మేటిబంట్లకు సందిక్రంత జగడంబులు గలవే యని తోడ్కొని చని. ద్వా. 7. 27.

సందిగ్ధబుద్ధి (మతి.) సం. విణ. (ఇ) సంశయాత్ముఁడు నమ్మకము లేనివాఁడు.

సందిగ్ధము సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కఁగాఁ బూయఁబడినది. 2. నిశ్చయము లేనిది, సందేహము గలది. 3. తప్పుగా గ్రహింపఁబడినది 4. సందేహింపఁబడినది. 5. స్పష్టముగా లేనిది (వాక్యము). 6. అపాయకరమైనది. 7. విషము పూసినది (విల్సమ్ము).

వి. అ. న. 1. సందేహము, నిశ్చయము లేమి. 2. పూయుట, రాచుట.

సందిగ్ధార్థము సం విణ. (అ. ఆ. అ.) సందేహాస్పద మైన యర్థము గలది. వి. అ. పుం. 1. సందేహాస్పద మైన అర్థము 2. వివాదాస్పద విషయము.

సందిటిదండ వి. ఆభరణవిశేషము.

సీ. ముత్యాలపేరులు మొలనూళ్ళు దోగిలి సందిటి దండలు సరవణులును ధనాభి. 3. 78.

(కొన్ని ప్రతులలో సందులదండలు అని యున్నది)

సందితము సం. విణ. (అ. ఆ. అ.) బంధింపఁబడినది. కట్టఁబడినది.

సందిదండ వి. బాహుపురి, కేయూరము. సందిటఁ గట్టుకొనెడు భూషణము (సందిలి+దండ).

సీ ... బాహుపురితాయెతు లనంగ, దండకడెము సందిదండనఁ గేయూర మమరును. ఆం. ప. పరి. 12.

సీ .... సందిదండ, అంగుళీయకములు హారికంకణ ములు. దశకు. 3. 77.

మ. ... స్తనవిస్ఫూర్తికి సందిదండల ధళల్ సాహోనినాదం బిడన్. మను. 5. 84.

సీ. అందంపుమైచాయ సందిదండలచాయ నుదిరి సంపఁగి మొగ్గయొప్పుగుప్పె. రాజవాహన. 3. 129.

సీ. సందిదండగఁ బెట్టుసవతివబలు చుట్ట సికజుట్టు తలముళ్ళ వెకలిబట్టు. చంద్రాంగ. 2. 58.

తే. గీ. మెఱుఁగుఁదీగెయుఁ బెద్దముక్కఱయు బెట్టి దండతాయెతులును సందిదండలునిచి, కేల గాజులు గాడసరాలు దొడిగి, ప్రేమఁ గైసేసి యద్దానిఁ బెంపుచేసి. వైజ 4. 30.

తే. గీ. సందిదండలు నొడ్డాణ మందమైన, ముద్రి కలు హంసకంబులు ప్రమోయుగజ్జె. హంస. 2. 190.

సీ. గరుడ పచ్చలకీలు కడియంబు లర్పింతు వందుకు నీయాస నెందదేని, తళుకుఁగెంపుల సందిదండలు చెల్లింతు. హంస. 2. 37.

వ. నిగనిగల తరఁగల యందంబు సందిదండల తళుకులకుఁ జెలికారంబు నెఱప కళా 6. 224.

ఉత్సాహాయు క్తగీతి,—

అందమైన కేలుగొప్పులందుఁ బూలు తేఁయల్, చిందనీక యుంచి సిగ్గు చెంగళించు జాళువా; సంది దండలుంగరాలు సన్నబన్న సరులు హొ,న్నం దెలున్. ప్రబం. 1. 273.

సందియపడు అ. క్రి. సంశయించు.

కం. దరహాసముతో మద్రేశ్వరుఁ డాలింగనము చేసి సందియపడ కీ,వరుగుమని పనుప నాతడు కరి పురికిం జనియె. భార. ఉద్యో. 1. 108.

సందియము వి. (సం. సందేహము) సంశయము.

సీ. ... సందియ మనుమాన మన సంశయంబు. ఆం. వ. గుణ. 88.

సీ. కర్ణార్జునుల యందు ఘనుఁడెవ్వఁ డగునొక్కొ యనుజనంబుల సందియంబు మాన్ప. భార. విరా. 4. 205.

ఎ. గీ. సామిలకు ననాఫ[illegible] వాసమునఁ బాప, సంప్రయోగ మగుట [illegible]. భా. అం. 1. 5.

ఆ. ఈ యుపాయములఁ భజించువాఁడు మోక్ష లక్ష్మికిఁ బతి, యగు నొకింత సందియంబు వలదు. భా. అశ్వ. 1. 225.

కం. ఇందేమియునుంగలదే, సందియ మస్మజ్జ యంబు సత్యము నీపీ,కాందొందని పలుకులు పలు, కందగునే యోడి యకట కక్కుఱితి మెయిన్. హరి. ఉ. 3. 229.

కం. అనిన నబందేశిఁ గృహపతి, కనియెన్ సందియము దెలియ వడుగుట తప్పా. మను. 1. 74.

తే. తెలియ నానతియిమ్ము సందియము దీఱ. పారి. 1. 66.

తే. అతివముష్టి ప్రతిగ్రహార్థావలగ్న, సందియము లేదు వలరాజుచాపయష్టి. శృం. నై. 3. 163.

చం. కలుగుట సందియంబగుట సందియంబయిన కానులు. విక్ర. 1. 27.

సీ. వెన్నెలలు దేంట్లగుట సందియము గలదె ... ఆము. 2. 30.

ఆ. వె. న్యస్తశస్త్రుఁడైన యాచార్యుఁ జంపిన, నెవ్వరొక్కొ వారికివ్విధంబు, బలిమిగలుగఁ జేసి ఠలుకమై వనుచు నందియము వడఁగనేల తెలియ వినుము. భార. ద్రోణ. 5. 347.

సీ. ...... కర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁడగు నొక్కొ, యనుజనంబుల సందియంబు మాన్ప, .. భార. విరా 4. 205.

విశ. (త. సందియమ్) సందిగ్ధము, సందేహము కలది.

సీ. అనుపమంబగు భారతాఖ్యానమున సందియము లైన యర్థంబు లర్థిమిమ్ము, నడుగ నేతెంచితి ననిన. మార్క. 1. 103.

**సందిలి** వి. సంది. ప్రగండము, దండ.

గీ. ...సంది సందిలనఁగఁ బ్రగండంబు చను. ఆం. వ. నర. 81.

తే. గీ. యోగివర్యుని సందిటి యొత్తులకును,రచిత కేయూరమణులు గారణముగాఁగఁ, దలఁపుదురు గాని రమ కుపధానమైన, కొప్పువిరులొత్తు కెలుఁ గరు కొంతయైన. దశా. 3. 148.

సీ. గురు వెందవూసపే రొరయ సందిలిఁగట్టి. నీలా. 1. 81.

ఉ. సందిలి పట్టి యాడు మన నాట్యములాడుచు ముద్దులన్ మహా, నంద మొనర్చె బాలికదిన బును జుట్టపుఁ బూవుఁబోండ్లకున్ కళా. 6. 200

2. రెండుదండల నడిమిభాగము.

గీ. సింహనాదంబు చేసిన సేదదేటి, కనలి శరచాప ములు గదాఖడ్గములును, గొన్ని సందిటఁ దవలావు కొలఁదిఁ బట్టి. ఉ. హరి. 3. 66.

కం. తెలవా సందిట సందెడు, నెలవెంద్రుక లాయతములు నీలము లవి యే, తెలఁగువ ముడిచిన నీకున్, గొలఁతగలదె యవియ జట్టిగొను నీ విభునిన్ ప్రభా. 4. 163.

ఉ. కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జనమాడి యాడి నీ,లాలక యొర్తు గంధసలిలార్ద్రకచంబులు చేన్నుదోయిపై, వ్రాలిన సందిటం బొదివి రాజ పథంబున కేగుదెంచె గో,పాలకమూర్తి గాన శిఖి బర్హము కానుక దెచ్చెనో యనన్. పారి. 3 13.

**సందివీరులు** బ వ వి. పామరులు గొల్చు దేవతా విశేషములు.

సీ. పుట్టలమ్మయటన్నఁబో యెంతలేఁడను, సంది వీరులటన్న జాము గొణఁగు శుక 3. 49.

**సందిష్టము** నం. విశ. (అ. ఆ. అ) 1. సూచింపఁబడినది 2 నిర్ణయింపఁబడినది. 4. తెలియఁజేయఁబడినది, దూత ముఖమునఁ దెలుపఁబడినది. చెప్పఁబడినది. 4. ఒప్పుకొనఁబడినది, సమ్మతింపబడినది. వి. అ న. వార్త, సమాచారము.

**సందిష్టుఁడు** నం. వి అ. పుం వార్తాహరుఁడు, సమాచారము తెచ్చుబంటు, దూత.

**సందిహానుఁడు** నం విశ. (అ. ఆ. అ.) సందేహము గలవాఁడు, సందేహించువాఁడు.

**సందీపనము** నం విశ. (అ. ఆ. అ.) 1. జ్వలింపఁజేయునది, ఉద్రేకముగలిగించునది. 2. కోపము పుట్టించునది.

**సందీపనము** వి. అ. పుం. మన్మథుని యైదు బాణము లలో నొకటి. వి. అ. న. ఉద్దీపనము చేయుట.

**సందీపించు** సం. న. క్రి. 1. ప్రకటమగు.

మ. అపుడాగాకేమి నిజంబు తేటపడఁగా వర్ణించె గంధాక్షతాది విశేషంబుల శాంతిపారమును సందీపించె విశ్వేశ్వరున్ శివు నుద్దేశము జేసి ... భీమ ఖ. 135.

2. ఉద్దీపించు, అతిశయించు.

మ. అల గ్రీష్మర్తువునన్ .... .... వెన్నెలదారా గృహముల్ ప్రసూనములు సందీపింపఁజేయున్నరున్, లలితోత్సేక వికారమున్. మల్ల. శృం. 2. 87.

**సందీపితము** సం. విణ. జ్వలింపఁజేయఁబడినది, అతిశయింపఁజేయఁబడినది.

కం. ...అతం డాపాలఁతి దప్పియును సందీపితజఠ రాగ్ని యైన తెలఁగును గనుచున్. భార. అశ్వ. 225.

**సందీప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. జ్వలింపఁ జేయునది, మండింపఁబడినది.

శా. ...నూతుతల సందీప్తైక బాణాహతిన్, డొల్లం జేసి ... భార. ద్రోణ. 4. 33.

2. ప్రకాశింపఁజేయఁబడినది

మాలిని. అకృతకమధురోక్తి వ్యాప్తసందీప్తసారా. భార. స్వర్గా. 97.

ఉ. సందగుగబ్బిగుబ్బలను జాదెదు తన్నయనాంబు పూరముల్, మందరమేరు శైలముల మాటికిఁ జాఋఝరంబులో యనన్. రాధికా. 4. 99.

3. ఉద్రేకింపఁజేయఁబడినది. 4. ప్రోత్సాహ పఱుపఁబడినది, పురికొల్పఁబడినది.

**సందు** స. క్రి. (త. చంది. క. సందిసు,) కూర్చు, సంధించు.

ఉ. ప్రక్కలు వంచు వంచి మునిపండ్లను రాచును రాచి రాచి ఔ,మ్మక్కిలఁజేయుఁజేసి తలయల్లన గాళుల సందు సంది లో,చక్కికి నొక్కు నొక్కి యిరుచంబడ గుమ్మడిమూట గట్టి వీ, పెక్కి దువాశిచేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేఁకువన్. క్రీడా. 45.

**సందు** వి. (సం. సంధి; క. సందు; త. చంతు) 1. ఎడము.

తే. అమృత [illegible] యదికి, వేయు [illegible] విషము వానిఁ, జేర్చి విధి [illegible] నీ మోము [illegible] శృం. నై. 5. 189.

మ [illegible] హేమక[illegible]ముల తోఁ జేసే [illegible] వెలిం బొలయఁ[illegible] దొలయన్. పారి 2. 11.

2. దేహము.

ద్వి .. తొడిఁబడనిదియె సందుగ వారిమీఁద నడి వైవఁ జూతురు చపలమానసులు. ద్వి. పరమ. 3. 214 పు.

తే, గీ, అఖలమోహిని యైన యయ్యాలరుబోడి, శైశవము వీడుకొన్నది సందు గాఁగ, వనదినంబును రాజవందనులమీఁద, వేఁటలాడుచు మన్నాఁడు విషమశరుఁడు. శృం. నై. 8. 26.

3. ఇంటిప్రక్క నిరుకుగా నుండుచోటు.

చం. జలకము లాడఁగోరి బుక సాపని చీర సడల్చి సందుతో, పలికి జనంగ నీడనును బల్కు వినంబడఁ దల్పుఁ దీయఁగా, వెలువడి వచ్చితిన్. హంస. 2. 64.

4. గొంది, ఇఱుకువీథి.

సీ... బతిమాలి వేఁడినఁ బదముల ప్రాలిన సందులఁ జొచ్చిన శరణ మనిన.... దశా 6. 135.

5. నడిమిభాగము, రెండు వస్తువుల నడిమిభాగము.

చం. జలజదళస్థతోయముల సందులఁ గ్రిందుగఁ దోఁచు మింటిని, డలు గనుపట్టె నత్తఱిఁ దటాకములన్. ఆ. 4. 151.

సీ. అలికనేత్రము కీర్తి యారజ్యమానమై తెప్పల సందుల నిప్పులుమిసె. హార. 7. 79.

6. (అవయవముల) సంధి బంధము, కీలు.

ద్వి. ఇంకఁ జెప్పులతోన యిట్లుంటివేని, శంకింప కిప్పుడ వందుసందులకు నఱకుదు ననవుడు. బసవ. పు. 6. 22 పం.

తే. వాయు వంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి,నొవ్వు దెవులును బుట్టించుఁ గ్రొవ్వు సెఱుచు, సందు లెడలించుఁ గ్రమమున నెందుఁబరఁగి, భార. అశ్వ. 1. 173.

7. వెళవి, మధ్యకాలము.
వ. దేవవ్రతుఁ డు వాని వేయనొల్లని సందువ నా సవ్యసాచి యతనివిల్లు దునిమి. భార. భీష్మ. ౨, 195.
చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహునివిల్లు వ్రేల్మిడిం, దునిమి నితాంతగాఢరయదోర్విభవంబున నొండువిల్లు గై,కొనియెడుసందున న్నినిచెఁ గ్రూరశరంబు లురంబునందు. భార విరా 5.176.
మ. జలశాయిత్ముఁడు విస్మయాత్ముఁ డగుచున్ బ్రాయంబు నీకెంత ని,ర్మల చారిత్ర యనం దపోధనుఁ డు సత్రామాత్మజుం జూచి లెక్క, లెఱుంగన్ మృతులైన రోమశుల మార్కండేయులం జేర్కొనన్, వలువల్ వింశతి సంఖ్య లేనెఱుంగ నంతం బొంది రీసందువన్. జై. భార. 8. 142.
8 అవకాశము, వీలు.
చం అని కొనియాడి యిప్పు డితఁ డాదట నవ్వురికేగెనేనిఁ ద,జ్జనపతియుం బ్రధానులును సర్వ జనంబులు వీని యూరుఁ జే, రు నెఱిఁగిపోదు రిప్పుడొక రుండును గై కొనకుండు నన్ను మ,న్నమమునమన్న యిప్పని యొనర్పుటకు న్మఱి సందు లే దగున్. భోజరా. 5. 35.
కం. చిక్కనలగుడంబునఁ దల, వ్రక్కలుగా మోది చంపివైచిరి మఱియుం, బెక్కుఘసంబులఁ బట్టిరి, యక్కాలసముమాని తనిసి రదిసందగుటన్, నీ కైవర్తకశ్రేణి కనుత్రామి యొక దొడ్డమనికి ప్రత్యుత్పన్నమతి వసించె వే పంచతం. 1 608.
సీ. తన మనోహరు పేరు వినినంతఁ గాంతకు మనసు రంజిల్లిన మదనుఁ డదియె, సందు చేసుక మావన సరోవరము నిండఁ గాలువల్ దీర్చిన.... దశా. 3. 15.
ద్వి. కోరికతో దీనికోన మిందులకు. సారంగధరుఁడురా సందా యె నేఁడు. సారంగ. 1 ఆ. 14 పు. 23 పం.
తే. నీవు మఱి యింటిలోన గుఱ్ఱించుచున్నఁ, గడుపు నిండునె ? దొంగఁజేరి గ్రాసమడుగు, పొన్నుమనుఁ బల్కునాథు నప్పాలఁ తి జార,కాంతు బొందుటకై సందు గలుగవలసి. శుక. 2. 371.
తే అగ్నృహంబున సిచ్చావిహారమునకు, మనసు పరువులు వాఱ నేమాడ్కినైన, సందు గానక యినుప పంజరములోని, చిలుక పోలికఁదలఁకు నక్కులుకులాఁడి. శుక. 2. 175
ద్వి. కలిగెఁబో సందు సాకదఁగినవనికి. హరిశ్చ. పూర్వ. 159,
ద్వి. నెపమున మముఁ బొందు నీకిదే సందు. హరిశ్చ. పూర్వ. 10 30.
9. వీలు, అనుకూల్యము.
సీ. అభ్రమార్గంబున నరుగుచు మదిలోనఁ గల హంబునకు సందుగలిగె నింత, కాలంబునకు నంచు గంతులు వైచుచు. వరాహ. 1. 38.
10. లోపము.
ద్వి. మాటసందులు వట్టి మన సొత్తిచూడ. హరిశ్చ. పూర్వ. 1400.
11. మర్మము, రహస్యము
సీ. సందెఱింగిన, దొంగ సాకెనగొట్టు, పిసాసి దిమ్మరి బెరజము బటాని చెన్నబ. 2. 24.
కం. కొందఱు శూన్యం బనియును, గొందఱు తేజస్స్వరూపగుణనిధి యనియున్, గొందఱు కాలంబనియును, సందెఱుఁగక తలఁతు రుదిత సందేహమునన్. హ. వరాహ. 3. 34 పు.
కం. ఈ సృష్టి విధమే, భానుర ముగ నెట్లు పెక్కు భంగుల నగునో యీ సందు తెలియఁజెప్పుము. భూసురవర తిలక చిత్తమున కింపెసఁగన్. వాసిష్ఠ. 8. 73.
12. మల్లవిద్యావిశేషము.
గీ. మల్ల విద్యా విశేషాల్ప మార్గములకు వలరుసందన... అం. వ. నానా. 9.
ఉ. కొక్కెనచే బిగింప మెడ గొబ్బునకేల్ వడిఁ బెట్టుదీసి మేల్, కక్కితఁబట్టి త్రిప్పి చెయిలావున దున్నక రెండుప్రక్కలన్, డొక్కర సందు వ్రేయఁ దొడనొక్కుచు సందెడఁ జేసి త్రోసి వెన్, జక్కిసురాట మెక్కి వడిజాఱి కడంబడఁ డింకఁ బొర్లఁగన్. ప్రబం. 1. 87.
13. సందర్భము.
సీ, తనమాట యే మెఱుంగని యంగవకు జార,మము

కార మొనరి చు మందుగాఁగఁ, దవప్రౌఢి స దుగా వనిసుఁదరిశి గోడ, చివ్వున దాఁటిని త్రేఁగి. శుక. 1. 42.

కం. మానినిచిత్త, బున గోపము పుట్టఁజే పను షుని దెస నొ, చ్చినసందువ. దశకు. 7. 47.

తే అచట నపుడట్లు నినుఁగూడి యలికివచియు, నట్ల నీ వేఁగుచో వచ్చినదియు దాన,యగుచుఁ దోప సందడికి యెట్లాడనేర్చె మగువ గాదుర యిది పెను దగరగాని. కళా. 3. 156.

**సందుకట్టు** వి. (√సందు) త. సందుకట్టు క.

మ. సందుకట్టు. నడిమికాలము. ఆం. భా. 5, 32.

ఉ. రాజితతేజుఁ డైన దినరాజు తిరోహితుఁ డైన పిమ్మటన్, రా జుదయాద్రి పీఠము తిరంబుగ నెక్కెడు సందుకట్టునన్, భ్రాజితసత్పదంబునకు బాధ యొనర్చుచు జారచోరనం, పూజితమై తమంబు గడుఁ బొంగె నధర్మముతోడి జోడునై. నృసింహ. పు. 3. 81.

**సందుకా** (హిం. సందూక్) చిన్న పెట్టె.

**సందుకొను** స క్రి (√సందు) 1. దక్కించుకొను, వశపఱచుకొను.

కం. ఈగజగామినిఁ గామిని, నేగతి నే సందుగొందు నీక నని విధుఁడున్, వేఁగుచు గురుఁ డిలు వెళ్ళిన, చో గానముచేయు నవ్వుఁ జూచిన మ్రొక్కున్. వరాహ. 7. 20.

ద్వి, తోయజాలయసయిదోడు దా ననుచు, దోయ జనాభు పొందుట సందుకొనియె. ద్వి. ప. మ. 5. 442 పు.

2 గ్రహించు, కూర్చుకొను.

వ. తపని చిగురాకునకుం బ్రదక్షిణంబులు సేయు భ్రమరాళికిఁ దత్ప్రయోజబీజాతమాలిక యని పోలి కల సందుకొనుచు నందంద లతా కుందబృందంబు లకు దూరంబారు నిందిందిరావళి యుందిరావంద నుం డిందీవరగంధులపై వైచువాటు బల్లెం బని చాఁటుచు. రాజవాహన. 3. 114.

**సందుకొ(గొ)ను** అ. క్రి. (√సందు) 1. అవకాశము చేసికొను,

వ. కవులకొమ్ముననం జిక్కి బ్రేలుతురంగంబులును సందుకొని చొచ్చిన సుభటులు. భా. కర్ణ. 1. 163.

కం. ధవళుఁడ పివేనా యని, కవుఁగిటఁ గదియించి నెనడుగల బంధుఁడ వౌ, దువు నేఁటికైన వచ్చితి వవసర మిపుడై నఁ గలిగెనా యని పలుకన్.

తే. వారిమాటలు విని మదపతి మదియ, వచనమేణా ణయో వినివచ్చి యిట్లు, సందుకొన్నాఁడు కార్యం బు చక్కనయ్యెఁ, గాంత యొనఁగూర్చు ధవళుఁడే కలఁ డటంచు. శుక. 2. 517.

చం.... ముద్దియ యేగతి నట్లు రంభరూ, పును ధరి యింప నేర్చితివి పొందుగ నెమ్మెయి సందుకొంటి వాయవఘుని నట్లు గూఁడఁగ జిరాభినుత.విది. కళా. 4. 3.

2. వ్యాపించు.

తే. గీ. శంఖఘుంఘుంనినాదముల్ సందుకొనియె. ఉ. రా. 8. 165.

**సందుగము** సం. వి. అ. న. సంధ్యాగములు.

తే గీ. సకలసందుగములకుఁ దేజంబు గలుగ,మధు మదారంభ మణకువ మణలఁ ద్రోవఁ, దేకువయు నారజంబునుఁ దేటపడఁగఁ, బురమునకు వచ్చె నొక కాపు పూవుఁబోడి.

(* సంధ్యంగములకు అని పాఠాంతరము) క్రీడా. 1 184.

**సందుగొట్టు** అ. క్రి. (సందు+కొట్టు) బిడ్డలకు సందు దోషము తగులు (శ. ర.).

**సందుదవులు** = సందుగొట్టు (శ. ర.).

**సందువడు** అ. క్రి (సందు+పడు) (√ సందు) చిల్లి పడు.

సీ. మొనయించి కుఱుగాడెముఖలోన వేసిన, జముని దూతకు వెన్ను సందువడదె. కళు. 1. 129.

**సందువెట్టు** అ. క్రి. సందు అను మల్లబంధవిశేషమును ప్రయోగించు.

వ. అరణోవైరి వారి కటిచేలంబు పట్టి యెత్తి యెత్తి పడుమ రాగెయిడి సందువెట్టి నవ్వివ నవ్వి రోధికాలు కాలిలో నిడి వేధించి నిరోధించిన. భాగ.

10 స్కం. పూర్వ. 1345.

**సందుష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దోషము గలిగి పాడైనది, చెఱుపఁబడినది. 2. దుష్టము చెడినది.

**సందుసీసము** వి. మల్లబంధవిశేషము.

వ. కక్షికొక్కిస సందుసీసంబును నృసింహంబును నాదియగు ముప్పది రెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి. హంస. 1. 206.

వ. కొక్కెస, కుమ్మరింపు, బోడింపు, సమసీసంబు సందుసీసంబు గొంతుమారును. మల్లుపురా. 3. 69.

వ. సందుసీసంబును కొంతుమారును సమసీసమ్మును చేకందవంబును కర్లవంబును. ప్రబం. 1. 78.

**సందునుడి** విశే. అవకాశమును బట్టి వంచించునట్టి.

చం. ... సందునుడి మాయలుగా మగవారి కృత్యముల్. మను. 3. 82.

(ఇది మాయలు అనుదానికి ముందే కనఁబడుచున్నది.)

**సందూషణము** సం. వి. అ. న. చెఱుచుట, దోషము గలిగించుట, మలినము చేయుట, దోషారోపణము చేయుట, తప్పుపట్టుట, నిందించుట.

**సందూషితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చెఱుపఁబడినది. దోషము గలదిగాఁ జేయఁబడినది. 2. హెచ్చినది, పెరిగినది (రోగము మొ.) 3. నిందింపఁబడినది. 4. అతిక్రమింపఁబడినది. 5. దుర్వినియోగము చేయఁబడినది.

**సందె** వి. (సం. సంధ్యా.) (క. సందె, సంజె.) 1. సంధ్యాకాలము. సంజ.

ఆ. వె. అనిన నట్టిదేవుఁ డంగజునకు లొంగి, సందెలందు దినములందు విడక, వేయివత్సరములు వెల్ఁదితో రమియించి, యర్ధదేహ మొసఁగఁడాయటన్న. దశా. 3 62.

తే. గీ సందెఁ దలయంటుకొనుట వస్త్రంబు లేక, మజ్జనముచేత విరియాకు మట్టగించి, తాల్చుటయు నిరుగేలను దల పుణుకుట భర్తగల భామినుల కశుభప్రదములు. పి. శకుం. 4. 79.

చం. జగమున సందెవేళయను చైత్రుని రాకకుఁ గ్రుంకుగట్టుతా నగమగుఁ గాన నందు జరఠాతపపల్లవరాజిఁ జేర్చి ఖా, గుగఁ బరిపక్వమైన ఫలగుచ్ఛము నిచ్చగ రాల్పు వైఖరిన్, తొగపగదాయ యయ్యపఁ తోయధి మున్గెను గుంకుమచ్ఛవిన్. ఉత్తర హరిశ్చం. 3. 102.

2. సంధ్యావందనము.

ఆ. వె. సందెవార్చ నేమి జపము సేయగనేమి, వేదశాస్త్రములను వెలయనేమి, పడఁతి గనినవాఁడు బాడుగాఁ గాఁడయా విశ్వదాభిరామ వినుర వేమ. వేమ. 2భా. 431.

తే. గడియలోఁ దెల్లవారె భాస్కరుఁడు గ్రుంకె, జాగు లేలంచు సందెపై సందెవార్చు. శుక. 2, 458.

**సందెచీఁకటి** వి సంధ్యాకాలమందగు చీఁకటి.

కం. ఇటువంటయ్యాలె కారా, చిటుకు మనకయుండ సందెచీఁకటి వేళన్, ఘటచేటీవిటులై యి, క్కటకంబునఁ దిరుగువారు కంజదళాక్షీ. వైజ. 2. 18.

**సందెజాము** వి. (√సందె) రాత్రి మొదటి యామము.

గీ. అనిన నట్లకాక యని నల్లియును జీర, పేనునేకశయ్యఁ బ్రీతినుండఁ బేనుకన్ను మొఱఁగి ప్రియపడి ఖూమీకుఁ గదిసి సందెజామె కఱచె నల్లి. నా. పంచ 1. 321.

సీ. కాములఁబడి సందెజాము పోయినదాఁక వరవుడు పనులు సర్వంబుదీర్చి. హరిశ్చం, 5. 55.

**సందెమల్లియ** వి. ఒక తీఁగె, రుద్రాక్షి (వృ. వి ).

**సందేశకము** సం. వి. అ. న. వార్త, సమాచారము.

**సందేశము** సం. వి. అ. పుం. 1. సమాచారము, వార్త. 2. వాచికము, చెప్పి పంపిన సమాచారము. 3. ఆజ్ఞ, నియోగము,

**సందేశవాక్కు** సం. వి. చ్. స్త్రీ. చెప్పి పంపిన వార్త.

**సందేశహరుఁడు** సం. వి అ పుం. 1. వార్తాహరుఁడు, సందేశము తీసికొని పోవువాఁడు, దూత. 2. రాయబారి (ఇట్లే సందేశహారకుఁడు).

**సందేశహారకుఁడు** సం. వి. అ. పుం. చూ. సందేశహరుఁడు.

**సందేశార్థము** సం. వి. అ పుం. దూత ముఖమునఁ జెప్పి పంపిన సమాచార విషయము.

సందేహము సం వి అ. పుం. , సంశయము, నిశ్చయములేనిది. 2. అపాయము, ఎడర విలియమ్ము. 3 (అలం.) అర్థాలంకార విశేషము, సందేహాలంకారము (మమ్మటాదులు దీనిని సందేహమని పేర్కొనిరి) 4. దేహమందలి పాంచభౌతికాంశము సమూహము.

సీ. అల్పాతురం బయ్యె నధికార్థము నొసంగు, సార తరంబు మోక్షప్రదంబు, సందేహరహితమూర్జా నిశ్చితము దృఢం, బక్షసిద్ధిదము శివార్కంబు ... శివధర్మోత్తరము 1. 144.

సందేహడోల సం వి ఆ. స్త్రీ సంశయమను నుయ్యెల. సంశయపరిస్థితి.

సందేహి సం. విశే. (న్. నీ. న్) 1. సందేహము కలవాఁడు 2. నమ్మకము లేనివాఁడు.

సందేహించు సం. అ. క్రి. సంశయించు, సంకోచించు, వెనుదీయు.

శా. ధేనుగ్రాసము మాన్పు దోసమని సందేహించినన్ సస్యమెం, తే నష్టంబగు నైననేమి మఱియు న్వృత్తంగ యామంబులోఁ, నౌనన్నన్ మునులెల్లఁ మిక్కిలియు నేఁ డాఁకొందురు వరాహ. 10. 89.

సందోహము సం వి. అ. పుం. 1. పాలు పితుకుట. 2. సమూహము, మొత్తము.

మహాస్రగ్ధర. ఎకరాలన్ మందు వాసాహిణములఁ గలశద్రేశ సందోహవాహా ప్రకరంబున్ గొంచు... మనుచ. 1. 40.

సంద్రము వి. (సం. సముద్రః) = సముద్రము. జలనిధి (రూ. సందరము)

సీ. సాగరంమంబురాశి సంద్రము కడలి. ఆం. ప. అచర. 37.

ఉ. సంద్రము దుగ్ధబిందువులు సల్లెడు నుత్తర తీర భూస్థలిం జంద్రనగంబు. భా. రా. యుద్ధ. 1092.

ఉ. చందురుఁ గాంచి సంద్ర మతిసాంద్ర సమృద్ధి వహించెఁగాక. శీమం. 2. 20.

శా. ఓ వాచంయమిచంద్ర సంద్రములు నేఁ డొం డైనవేళన్ హాయ, గ్రీవుం డెక్కడ నుండె. దశా. 1. 227.

కం. గొనముల సంద్రము యిత్తెఱఁ, గునఁ జాలుపు తేర్చ కెఁడుగొన యొుకవని పై, పునసలో సుచు నొంనాఁ, డెనమిచిన వేడ్క నుల్లమిగుల్ త్తగన్. అ రా. అయోధ్యా 1.

తే చంద్రగుప్తుడు పూర్ణిమాచంద్రుఁ గనిన, సంద్రమునుబోలె నానందసాంద్రుఁ డగును వి్ర. 1. 171.

సంద్రావము సం. వి. అ. పుం. పాఱిపోవుట, తిరోగమనము

సంద్రుఁడు వి సముద్రుఁడు.

కం. మనవాదై సంద్రుఁడు చె. ప్పిన మాటలు వింటిరింకఁ బిలుతికమలన్, గొనివచ్చి కట్టకట్టుఁడు, చవ వఁయుం గపలిదాఁటి సరకున మనకున్. యయా. 3. 33.

సంధ సం వి. ఆ. స్త్రీ. 1. కూడిక, సహస్థితి. 2 సన్నిహిత సంబంధము. 3. స్థితి, అవస్థ 4. వాగ్దానము, ప్రతిజ్ఞ, ఒడంబడిక,

కం. సంధారఘుపతికి వృషస్కంధున కైదంయుగీవ కర్ణునకు నమిన్మాంధాతకు... పాండు.

5. హద్దు, మితి. 6. స్థైర్యము, చాంచల్యము లేమి. 7. మునిచీఁకటి, సంధ్యాకాలము. 8. (మద్యము) బట్టీనుండి దింపుట, సంధానము. 9. ఒక స్థితిలో స్థిరముగా నుండుట.

సంధాత సం. విశే. (ఋ ఈ. ఋ) సంధానము చేయువాఁడు.

సంధానకరణి సం. వి. ఈ. స్త్రీ. విఱిగిన యవయవము లవతికించు ఓషధి విశేషము.

సంధానము సం. వి. అ. న. 1. కూడుట, కూర్చుట.

సీ.....సూనవితాన సంధానవిధానతఁ చేటికవాసనల్ చేర్చురితి. ధర్మ. 40. 1. 192.

2 అతుకుట 3. మందులు మున్నుగు వానిని కలుపుట. 4. చెడినదానిని బాగుచేయుట. 5. బాణమును వింటి నారియందు కూర్చుట. 6. మైత్రి. 7. సంధిబంధము, కీలు, 8. శ్రద్ధ. 9. కార్య నిర్వహణము. 10. పోషించుట. 11. మద్యమును బట్టీపట్టుట. 12. ఒక విధమైన మద్యము. 13. దప్పిని హెచ్చు

చేయు పద్య పదార్థము. 14. ఊరుగాయలు పెట్టుట. 15. మందుల యుపయోగము వలన వర్ణము నతుకునట్లు చేయుట. 16. పుల్లగంజి. 17. కంచు. 18. సంధి, పొత్తు

కం. అది యట్టిద సంధానము, దుది నెమ్మెయిఁ గల్గు నెట్లు సుయోధనుఁ డు,న్మదుఁడు ధృతరాష్ట్ర భూవిభు, హృదయ బు తెలుంగు గొంత యెఱుఁ గుడు మెలఁదా భార. ఉద్యో 1 359.

**సంధాని[1]** నం **విశే** (న్. నీ. న్.) 1. కట్టువాఁడు, బంధించు ప్రోతా డు. 2. సంధానమున (నారిలో బాణము కూర్చుటయందు) నేర్పుగలవాఁడు. 3. మద్యమును బట్టి నుండి దింపువాఁడు, మద్యము చేయువాఁడు.

**సంధాని[2]** నం. వి. ఈ. స్త్రీ. 1. మద్యములు బట్టీ నుండి దింపుట. 2. **కుప్యశాల**, కంచరివని చేయు స్థలము. 3. మద్యములు చేయుట.

**సంధానితము** నం. **విశే**. (అ. అ. అ.) 1. **అతుకఁ**బడి నది, కూర్పఁబడినది. 2. కట్టఁబడినది, బంధింపఁ బడినది.

**సంధానిని** నం. వి. ఈ. స్త్రీ. గోష్ఠము, పసులసాల.

**సంధాయకుఁడు** నం. **విశే**. సంధానము చేయువాఁడు, కూర్చువాఁడు, కలిగించువాఁడు.

**సంధాయి** నం. **విశే**. (న్. నీ. న్.) కూర్చువాఁడు (విల్లమ్ములనువలె).

**సంధారణ** నం. వి. ఆ. స్త్రీ. 1. అడ్డుపెట్టుట, ఆటంక పఱుచుట. 2. చక్కఁగ జ్ఞప్తి యందుంచుకొనుట. 3. ఓర్చుట, సహించుట. 4. చిత్తము నీశ్వరునం దే కాగ్రము చేయుట (విల్యమ్సు). 5. విన్యాసము, భంగిమ.

**సంధారణము** నం. వి. అ. న. చూ. సంధారణ

**సంధి** నం. వి. ఇ. పుం. 1. కలయిక. కూడిక. 2. ఒడంబడిక, సమ్మతి. 3. పొందు, రాజు కొండొరు లతోడి పొత్తు, మైత్రి, రాజ్యతంత్రమున షడ్గుణము లలో నొకటి.

ఉ. స ధికి నేగి కార్యము పొసంగక కృష్ణుఁడు రాకయునే. భార. ఉద్యో 4. 155.

4. అవయవసంధి, కీలు. 5. (బట్ట) మడత. 6. రంధ్రము. 7. సొరంగము, దొంగలు త్రవ్విన కన్నము. 8. విభజనము, విభాగము. 9. (వ్యాక.) అక్షర సంయోగము. 10. వ్యవధానము, విరామము.

సీ. ఉన్మత్తులనఁ బునుకుత్తులు కావించి సాలిలగతి పడి స ధు లతికి. శివధర్మ. 1. 12.

11. క్లిష్టసమయము. 12. ఉచిత సమయము. 13. యుగసంధి, కృతాది యుగములలో నొక దానికిని మఱియొక దానికిని నడిమికాలము.

కం పపారి తొల్లి త్రేతా, ద్వాపరముల సంధి నొకనాఁటి ధరిత్రి.లావంబుఁ జేసె జనముల, పాపంబున వత్సరములు పంద్రెం డధిపా. భార. శాంతి. 3. 276.

14. నాటక విభాగము, (ముఖాది) (ముఖము, ప్రతి ముఖము, గర్భము, అవమర్శము, నిర్వహణము అని యిది పంచవిధము.) 15. భగము, ఆఁడుగుఱి. 16. మద్యము చేయుట. 17. జ్వరతీవ్రత.

**సంధించు** నం. న. క్రి. 1. కూర్చు, చేర్చు.

మ. అతులంబై యనవద్యమై కువలయోదారప్ర మోదప్రదా,త్మత సంధించి కరంబు రాజిలుచుచంద్ర ప్రాజ్యతేజోవ్రజం, బతివేలం బగుచున్ వెలుంగఁగ. చంద్రికా. 4. 22.

వ. మనంబు సుస్థిరంబు గావించి గుణత్రయవికృతు లడంచి యాత్మని నాత్మయందు సంధించి తన్మ యుండై యోగి నిర్వాణంబుం బొందు. మార్క. 3. 357.

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగమున్ జేదోయి సంధింపఁడు... భాగ. 8. 96.

2. సంధిచేయు, పొందుపఱుచు.

మ. సుతువాఁడై వినయంబు సేకొనక యేచొప్పుం దగం జెప్ప కా, ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగరా దంచు వే,గ తెగం బాఱుకు. భార. ఉద్యో. 3. 25.

3. కలిగించు, ఆపాదించు.

మ. పతత్రుత్కారతా ఘోరంచే, ష్టలు మానంగల వాఁడఁ బతిగురువై సంధించె సద్బోధమున్. భార.

శాం. 3. 225.

4. కలసికొను

మ. ఇది సంధింపంగ వేళ యంచు వసురాజేం ద్రుండు... వసు. 3. 45.

సంధిక నం. వి. ఆ స్త్రీ. మద్యము చేయుట, సంధానము.

సంధికము నం. వి. అ పుం ఒక విధమైన జ్వరము.

సంధిచోరుఁడు నం. వి. అ. పుం. కన్నగాఁడు, కన్నపు దొంగ.

సంధిచ్ఛేదము నం. వి. అ. పుం. కన్నము త్రవ్వుట.

సంధిజము నం. వి. అ న. మద్యము, సారాయము.

సంధిజీవకుఁడు నం. వి. అ. పుం 1. అధర్మజీవనము గడపువాఁడు. 2. కుంటెనకాఁడు.

సంధితము నం. విణ (అ ఆ అ) 1. కూర్పఁబడినది, ఏకము చేయఁబడినది, 2. నిలుపఁజేయఁబడినది. (ఊరుఁగాయ మొ.) 3. బిగింపఁబడినది. 4. సమరస పఱుపఁబడినది. వి. అ. న. 1. ఊరుఁగాయ. 2. మద్యము,

సంధిత్స నం. వి అ స్త్రీ. సంధింపనిచ్ఛ.

సంధిత్సువు నం .విణ. ఉ సంధింప నిచ్ఛ గలవాఁడు,

సంధి దూషణము నం. వి. అ. న. సంధి నిబంధనముల నతిక్రమించుట

సంధిని నం. వి ఈ. స్త్రీ. 1, వెదయావు, కట్టినయావు 2. అకాలమునఁ గూడఁ బిదుకనిచ్చెడి యావు.

సంధిబంధనము నం. వి. అ న. స్నాయుబంధనము, స్నాయువును నెముకలను గలిపెడి త్రాడు వంటి నరము.

సంధిబంధము నం. వి. అ. పుం. 1. రాజులు సంధికై నియమము లేర్పఱుచుకొనుట 2. స్నాయువును నెముకలను గలిపెడి త్రాడువంటి నరము. 3 వృక్ష విశేషము. 4. సిమెంటు, సున్నము

సంధిభంగము నం. వి. అ. పుం. కీలుతప్పుట, బెణఁకు.

సంధిముక్తి నం. వి. ఇ. స్త్రీ. సంధిభంగము.

సంధిమోక్షము నం. వి. అ. పుం సంధిభంగము చేయుట.

సంధిరంధ్రక నం వి ఆ స్త్రీ. గోడయందలి కన్నము.

సంధిల నం. వి. ఆ. స్త్రీ 1. గోడ యందలి కన్నము, దొంగ త్రవ్విన కన్నము. 2. నది. 3. మద్యము. 4. గాయక బృందము యొక్క జంత్రి వాద్యముల ధ్వని.

సంధిల్లు అ. క్రి. 1. సమకూడు, కలుగు.

ఉ... విగతదుఃఖులఁ జేసితిగానఁ బెంపు ... మాకుఁ బ్రాణములు దేహములు న్గలిగె న్మకీశ్వరా. మార్క. 1. 62.

గీ. అఖిలభూమండల శ్లాఘ్య మైనసకల, భాగ్య మహిమ లవ్యాహతప్రౌఢి నసుధ, వి చి రాజసౌ రిక్తుదై మించి పూర్వ, జన్మవై రానుబంధంబు సంధిలంగ, వి పు. 6. 270.

చం. హరిహయదేశికాభుఁ డగు నమ్మహిదైవత మౌళియందు బంగరుపునకున్ మృగిమదనుగంధము సంధిలుభాతి నంబుజో, దరచరణాంబుజంబు సతత స్మృతిలోలుపమైన బుద్ధియున్ బ ... గాంచె... పాండు. 2. 7.

2. ముట్టుకొను, స్పృశించు.

ద్వి. చాటుఁజీరలమాట సంధిల్లి రేని పోటుముందఱ ననుపోటులమాట. బస. పురా. 82 పు. 3 పం.

ద్వి. పరిగొని వచ్చుచోఁ బురవీథి భఫులు, శరణుల వస్త్రముల్ సంధిలి రేని, వోశఁజాఁబోడుతుఁ,జుండో యని. బస. పురా. 100 పు. 16, 17 పం.

ద్వి. వింతవాఁ డొకఁడు మున్ వినమిఁగాఁ జేసి, సంతకుఁ బోవుచో నంధిల్లినంతఁ, బొడిచి మీఁదికిఁ జిమ్మె. 101 పు. 35 పం.

ద్వి. ముట్టినఁ జీరలు ముఱుగునే చెపుమ. 101 పు. 42 పం.

సంధివిగ్రహకుఁడు నం. వి. అ. పుం. విదేశ వ్యవహార ముల మంత్రి.

సంధివిగ్రహములు నం వి. అ. పుం. శాంతి సమర ములు.

సంధివిగ్రహాధికారము నం. వి. అ. పుం. ఇతర రాజు లతో సంధి విగ్రహములు జరిపెడియుద్యోగము, సంధివిగ్రహముల జరుపు మంత్రి యధికారము,

విదేశ వ్యవహా మ త్రిత్వ శాఖ.

**సంధివిగ్రహాధికారి** సం. వి. న్. పుం. ఇతర రాజులతో సంధివిగ్రహములు జరుపు మ ంత్రి విదేశ వ్యవహారముల కార్యాలయాధికారి.

**సంధివిగ్రహి** సం. వి న్. పుం యుద్ధమంత్రి. దక్షిణాయన సంక్రాంతి. త్రికలింగేశ్వరుని సన్ధి విగ్రహి రేచన అఖండవర్త్తి దివియ. వ. శా. 4. 1080.

**సంధివిచక్షణుఁడు** సం. విశే. (అ ఆ అ.) సంధిబంధములు కూర్చుట యందు నేర్పరి.

**సంధివిదుఁడు** సం వి. ద్ పుం సంధి సంప్రదింపులు చేయువాఁడు.

**సంధివిపర్యయములు** సం. వి అ పుం. ద్వివచనము, సంధివిగ్రహములు.

**సంధివేళ** సం. వి. అ. స్త్రీ 1. సంధ్యాకాలము. 2. సంధికాలము (రెండువేళల కలుపు సమయము).

**సంధిశాలము** సం వి. అ. న. అజీర్ణశూల (ఆమవాతము).

**సంధిసంభవము** సం. వి. అ. పుం. సంయుక్తాచ్చు (ఏ. ఓ.).

**సంధిహారకుఁడు** సం. వి. అ. పుం. కన్నగాఁడు, కన్నపుదొంగ.

**సంధుక్షణము** సం. వి. అ. న. 1. జ్వలింపఁజేయుట, మండించుట. 2. ఉద్రేకింపఁజేయుట, ఉద్దీపింపఁజేయుట.

**సంధుక్షితము** సం. విశే. (అ. అ. అ.) 1. ప్రజ్వలింపఁజేయఁబడినది, మండింపఁబడినది. 2. ఉద్రేకింపఁజేయఁబడినది.

**సంధేయము** సం విశే. (అ. ఆ అ.) 1. కలుపఁదగినది. ఏకము చేయఁబడినది. 2. పొందుకూర్పఁదగినది. అతుకఁదగినది. 3. సఖ్యము చేయఁదగినది. 4. గురిపెట్టఁదగినది. 5. సమసంపఁబడు వలసినది.

**సంధ్య** సం. వి. ఆ. స్త్రీ 1. కూడిక. 2 అవయవ సంధి. 3. సంధ్యారాగము, సంజె 4. ప్రభాతము, వేఁకువ. 5. సాయంకాలము. సందెచీఁకటి వేళ. 6. రెండు యుగములకు మధ్యకాలము. 7. సంధ్యాకాలమున బ్రాహ్మణాదులచే నుపాసింపఁబడు దేవత. 8. బ్రాహ్మణాదుల త్రికాలసంధ్యా వందనము తే. గీ. శౌరి సంధ్యాదిసత్క్రియల్ చక్కఁదీర్చి గయోపా. 1. 34.

9 వాగ్దానము, ఒప్పుదల 10 మేర, హద్దు. 11. తలఁపు, ధ్యానము 12. ఒకవిధమగు పువ్వు 13. ఒకానొకనది. 14. బ్రహ్మభార్య 15. పూర్వాహ్ణ మధ్యాహ్నాపరాహ్ణము లనెడి దివాభాగములలో నొకటి.

**సంధ్యాంశము** సం. వి అ. పుం కృతాదియుగముల చరమ కాలము

**సంధ్యాంశువు** సం వి. ఉ. పుం. సంధ్యారాగము, సంజెకెంజాయ.

**సంధ్యాకాలము** సం వి అ పుం. మునిచీఁకటి వేళ, సంజెవేళ.

**సంధ్యాత్రయము** సం. వి అ. న. మూఁడు సందెవేళలు, పూర్వాహ్ణ మధ్యాహ్నాపరాహ్ణములు.

**సంధ్యానాటి** సం వి న్. పుం. శివుఁడు.

**సంధ్యాపయోదము** సం. వి. అ. పుం. సంధ్యాకాల వార్షుకమేఘము.

**సంధ్యాపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. సంజమల్లెపూవు, జాజిచెట్టు.

**సంధ్యాబలుఁడు** సం వి. అ పుం. రాక్షసుఁడు.

**సంధ్యాభ్రము** సం. వి. అ. పుం సంధ్యాకాలపు మేఘము

**సంధ్యామంగళము** సం. వి. అ. న. సంధ్యాకాలమున చేయఁదగిన మతవిధి.

**సంధ్యామంగళదీపిక** సం. వి. ఆ స్త్రీ. శుభప్రదమైన సాయంకాలపు దీపము.

**సంధ్యారాగము** సం. వి. అ. పుం. 1. సిందూరము. 2. సంజె కెంజాయ.

**సంధ్యారాముఁడు** సం. వి. అ. పుం బ్రహ్మదేవుఁడు.

**సంధ్యావందనము** సం వి అ న. సంధ్యా కాలమున నాచరింపఁబగిన వైదికకర్మము

**సంధ్యాసమయము** సం. వి. అ. పుం 1. సాయంకాలము. 2. ప్రతి యుగములలో నొకభాగము.

సంధ్యోపాసన సం. వి. అ. స్త్రీ. సంధ్యావార్చుట: సంధ్యావందనము.

సంప సం. వి. అ. ఈ. మెఱపు.

సంపంగి—సంపఁగి, సంపంగె, సంపంగియ, సంపఁగియ, సంపెఁగ.

సంపెంగ వి. (సం. చమ్మకః. క. సంపంగె, సంపిగె) (త. చంపంకి) చంపకము.

సీ. ... సంపఁగి సంపెఁగ యనఁ జంపకాహ్వయ మగుమ బొగడ. అం. భా. 2. 47.

కం. ... బం,గరు సంపగి సంపంగవ, ధరఁజాం పేయాహ్వయములు. అం. ప. అచర. 71.

ద్వి. పారిజాతములు సంపంగులు తులసి, గోరింట లును గేఁకులు నశోకములు. ద్వి. పఁమ. 42శ్ పు.

సీ. సంపఁగి నౌషధసంప్రయోగము చూపి మొక రితుమ్మెద పిండు మూర్ఛవుత్తు. కవి. ౬. 110.

సీ. సంపంగిముఖకాంతిసంపద వలరించి కరము మాతమ్ముపైఁ గఁము చాచి. ఇందు 3. 51.

మ. అలమాకందము కుండ్ల దావఁదను నియ్యం ట్లొక్కచో వేయఁగా, వలె సంపంగికిఁ ద్రవ్యటం బిడవలెన్. విప్ర. 2. 69.

తే. ... గగన, మండలశ్రీకి సంపంగిదండవోలె... ఆము. 2. 5.

2. ధాన్య విశేషము యొక్క పేరు.

సంపంగికావులు వి. బ. ఒక దినుసు వస్త్రములు.

సీ. సంపంగి కావులుఁ జందురుకావులు వెలిపట్టు జీబులు వేటుచాళ్ళు. ప్రబం. 1. 272., హంస. ౬. 355.

సంపంగిదండ వి. సంపంగి పూవులతో గ్రుచ్చిన దండ.

తే. కనకకర్ణికా ధారాళకాంతు లదికి, బాహులతి కలు బిరుదు సంపంగిదండ, లిరుఁగడల ద్రేలవైచిన కరణిఁ బరఁగఁ, గంబువిజయము వచరించుఁ గంబుగళము. ప్రభా. 2. 78.

సంపంగిపూవడ్లు బ. (√ సంపంగి) ధాన్య విశేషము, సంపంగిపూలవలె పచ్చగా నుండు వడ్లు.

సీ. సంపంగిపూవడ్లు జాజిరాజనములు గంబూర రాజనాల్కన్నె నడులు. హంస. 4. 128.

సంపంగె(గియ) — సంపంగి. వి. (సం. చంపకః).

1. చంపకము (వృ. వి.).

సీ. గంప గె ముఖరాగ సంపద వలరించవ దదుగ కోఁమునన్లై యదఁ నీదు. విక్ర. 1. 183.

సీ. సంపంగె పాదిరి టి చేక్క గోరంట గాంచి యసుర మే వ కి నోరూఁ నవియు. పారి. 3. 51.

సంపఁగి వి — సంపంగి 1. చంపకము.

సీ. సిగఁ జుట్టుకొన్న సంపఁగి మొగ్గికాయెతు చేరు చేరువ తేఁటిబారు దగడు మ. దశా. 3. 14.

2. సంపంగిపువ్వువలె సుందర మగుటచే కుక్కకియ్యఁబడిన బిరుదు.

చం. పులియఁడు బూచిగాఁ డనుర పోతులరా జను మంతిగాఁడు చెం,గలువ సివఁగిభై రవుఁడు గత్తెర సంపఁగి వెండిగుండు మ,ల్లెలగురి. మను. 4. 92.

సంపఁగిదండ వి. (సం. చంపక) సంపెంగ పూదండ.

సీ. తపఃణ్రోవ్వెర తుమ్మెదల దాఁటుదాఁట సం, పఁగిసండ చెరివెఁగోమలి యొకర్తు. వసు. 5. 116. సంపఁగిబంతి.

సీ. .... సంపఁగిబంతి కొసల జోపావ లగుచు. ఉ. హరి. 1. 151.

సంపఁగె వి. సంపెంగచెట్టు.

సీ. సన్నజాజులు సురపొన్నలు గలిగొట్లు మల్లెలు సంపఁగుల్ మొల్లవిరులు ఉ. రా. 3. 201.

సంపగి వి. (సం. చంపకః) — సంపగి; సంపంగి;

కం. ... బం,గరు సంపగి సంపంగవ, ధరఁ జాంపే యాహ్వయము. అం. ప. అచర. 71.

సంపతిలు(ల్లు) అ. క్రి. (సం. సంపత్) సమృద్ధమగు.

కం. సొంపున నిమ్మెయిఁ బెండిలి, సంపతిలన్ సత్య ధర్మ జనపతి చంద్రుం, డంపఁగ నా వంచక పురి, కింపలరఁ గుమారుఁ డరిగె నింతియుఁ దానున్. విక్ర. 7. 81.

సంపత్తి సం. వి. ఇ. స్త్రీ. 1. సంపద. 2. సమృద్ధి. 3. జయము. 4. సిద్ధి. 5. సమగ్రత. 6. అనుకూల స్థితి.

సంపత్తు సం. వి. ద్. స్త్రీ. 1. ఐశ్వర్యము. 2. గుణోత్కర్షము. 3. సమృద్ధి. 4. అదృష్టము. 5. సౌఖ్యము. 6. జయము. 7. అభీష్టసిద్ధి. 8. సమగ్రత.

9 కోశము. 10. లాభము. 11. అలంకరణము. 12. మంచి పద్ధతి. 13. ముత్యాలహారము. 14. ఒకము.

సంపద నం. వి. ఈ. స్త్రీ. సంపత్తు (రూపాం).

ఉ. ... కెఁ పెనలాడు బావలసంపదన్. భార. విరా. 4. 83.

ఉ. .... కేంగఁగ సంపదల కేలవిచారము పద్మగ చ. ఉ. హరి. 1. 64.

తే. గీ. సంపద లబ్బెనేని. శేబరముకారె బిడ్డలు లేని బ్రతుకు. ఉ. హరి. 1. 68.

సంపద్వరుఁడు నం. వి. అ. పుం. రాజు.

సంపద్వసువు నం. వి. ఉ. పుం. సూర్యుని ప్రధాన కిరణముల పేరు.

సంపద్వినిమయము నం. వి. అ. పుం. సంపదల నిచ్చి పుచ్చుకొనుట.

సంపన్నము నం. విణ. అ. సంపదతోఁ గూడినది. 2. సమృద్ధమైనది. 3. సాధింపఁబడినది. 4. పూర్తి చేయబడినది. 5. సమగ్రమైనది.

కం.... రథికుఁ డీతఁడు శల్య, తోకపోద్దీప్తుఁడు మాదెసఁజావ కళావేది దర్పసంపన్నుండున్. భార. ద్రోణ. 3. 180.

6. పరిపక్వమైనది. 7. సరియైనది, ఒప్పయినది. 8. కూడినది. 9. అదృష్టము గలది. 10. సుఖవంతమైనది. 11. నిష్ణాతమైనది. వి. అ. న. 1. సంపద. 2. రుచ్యమైన భక్ష్యము.

సంపరాయము నం. వి. అ. పుం. 1. యుద్ధము, సంఘర్షణము. 2. ఆపద, దురదృష్టము. 3. భావి భవిష్యత్ స్థితి 4. మరణము, వ్యాధి.

సంపరాయ(యి)కము నం. వి. అ. న. యుద్ధము.

సంపరాయుఁడు నం. వి. అ. పుం. కుమారుఁడు.

సంపరిగ్రహము నం. వి. అ. పుం. 1. దయతో నాదరించుట 2. ఆస్తి.

సంపరేతుఁడు నం. విణ. అ. మృతుఁడు.

సంపర్కము నం. వి. అ. పుం. √సంపృచ్. 1. కలయిక, 2. స్పర్శ. 3. సంఘము. 4. సాహచర్యము. 5. రతి. 6. కూడిన మొత్తము.

సంపాకము నం. వి. అ. పుం. 1. పరిపక్వమగుట; 2. రేల (ఆరగ్వధము) (వృ. వి.).

సంపాకుఁడు నం. విణ. అ 1. చక్కఁగాఁ దర్కించువాఁడు; 2. జిత్తులమారి. 3. విషయలంపటుఁడు. 4. అల్పుఁడు

సంపాటము[1] నం. వి. అ. పుం. 1. నడుమ ఖండించుట. 2. కదురు

సంపాటము[2] ఉభ. వి. చెక్కడపు పనియందు ఒమ్మచ్చును, అందుచెక్కిడి రత్నములను అక్కయుఁ గూడఁ జేర్చి తూఁచెడి తూనిక (శ. ర.).

సంపాతము నం. వి. అ. పుం. 1. చక్కనిపాటు. 2. కలసిపడుట. 3. సమ్మర్దము 4. ఎదుర్కొనుట. 5. దిగుట. 6. ప్రాలుట. 7. చలనము. గమనము. 8. పక్షిగమన విశేషము.

ఉ. ...రఁగత్పతసంపాత సం,వృతసంపాతి ఖగోక్త మార్గమున. దశావ. 7. 93.

9. నివేదన శేషము. 10. పంపుట. 11. రేయింబవళ్ళు సమపరిమాణములై యుండు కాలము; సూర్యుఁడు భూమధ్యరేఖను దాఁటు కాలము (వసంత శరత్కాలములందు వచ్చును). 12. రెండు రేఖ లొండొంటిని ఖండించుకొను చోటు.

సంపాతపాటవము నం. వి. అ.న. ఎగురుట యందలి కౌశలము.

సంపాతి (కుఁడు) నం. వి. ఇ. పుం. గరుఁడుని కుమారుఁడు; జటాయువు అన్న.

సంపాతి నం. విణ. (న్) 1. కలిసి ఎగురువాఁడు 2. కలిసి పడువాఁడు.

సంపాతుఁడు నం. వి. అ. పుం. (రూ. సంపాతి) గరుడుని కుమారుఁడు: జటాయువు అన్న.

సంపాదకుఁడు నం. విణ. అ. పుం. 1. నెరవేర్చువాఁడు. 2. గడించువాడు.

సంపాదనము నం. వి. అ. న. 1. గడించుట, సంపాదించుట. 2. పొందుట. 3. నెఱవేర్చుట. 4. శుద్ధపఱచుట. 5. సిద్ధము చేయుట. 6. కలిగించుట.

మహాస్రగ్ధర. కని రంతంత న్నభోమార్గమున ఘనత మస్కాఁడసందేహ సంపాదన లీలా జాగరూకాతను వికటతనూ భామధూమాయితంబున్ శృం. నై. 7. 38.

**సంపాదము** వి పూర్తి చేయుట. 2. నెఱవేర్చుట. 3 పొందుట.

**సంపాదించు** నం. స క్రి. 1. సంపాదిల్లఁజేయు, కలిగించు

కం. నాకు నాత్మజుఁడై సం,పాదించువాఁడ వధికాహ్లాదము భార. శాం. 6. 522.

2. ఆర్జించు, గడించు

మ. వతి యాయాసనసహిష్ణుఁడై కడఁగి సంపాదించు పుణ్యాంబులో, నతిశుశ్రూషలఁ గైకొను మ్మటియుఁదా సాఁబాలు ధర్మస్థితిన్. మార్క. 2. 178.

3. సిద్ధముచేయు.

మ. అతిథ క్తిన్ గృహిణీలలామము వదవ్యాసంగ చంగాత్మయై, ప్రతి వారంబును భక్ష్యభోజ్యములు సంపాదించి వడ్డింపఁగా, నతిథుల్ భోజన మాచరించి సుఖులై యాశీర్వదింపంగ నా,చతురాస్యాన్వయ వార్ధి చంద్రమునకున్ సంతోష మెంతో యగున్. నిరంకుశో. 1. 60.

**సంపాదించుకొను** స. క్రి. కలిగించుకొను, పూను, వహించు.

కం. ఆదివరాహము వెరిఁగిన యాదంష్ట్రిలు వెఱికి తననిజాస్యంబున సంపాదించుకొని నటించుమ, హాదర్పముతోడ నొక గణాధిపుఁడు శివా. శివతత్త్వ 337. ప.

**సంపాదితము** నం. విశే. (అ. ఆ. అ.) సంపాదింపఁబడినది.

**సంపాదిల్లు** నం. అ క్రి. సంభవించు, కలుగు.

కం. అదిని సంయోగవియోగాదిద్వంద్వములు దేహియగు వానికి సం. పాదిల్లక తక్కవు పూర్వో దయకర్మమున నెట్టియోగికి నైనన్. భార. ఆది. 6. 249.

**సంపాసారి** వి. కోమటి, వైశ్యుఁడు.

ద్వి. కోటికిఁ బడగెత్తి కోరు వస్తువులు, పాటించి యొసఁగు సంపాసారులార. హరిశ్చ. ఉత్త. 382.

**సంపాళించుట** వి. కంసాలి కావించు క్రియ. (నెల్లూరు మండలము. వా.)

**సంపిండితము** నం. విశే. (అ ఆ. అ.) 1. ముద్దగాఁ జేయఁబడినది. 2. సంగ్రహింపఁబడినది.

**సంపిడ** నం వి ఆ. స్త్రీ బాధ.

**సంపీతి** నం వి. ఇ. స్త్రీ. కలిపి త్రాగుట.

**సంపీడనము** నం. వి. అ. న. 1. గట్టిగా నొక్కుట, రెండువస్తువులను దగ్గఱగా నొత్తుట. 2. దండించుట 3. బాధించుట 4. ఉద్రేకింపఁజేయుట. 5. ముందుకు నడుపుట.

**సంపీడము** నం. వి. అ. పుం. — సంపీడనము.

**సంపు** స. క్రి. రూ. చంపు.

కం. సారంగా, హితమున్ సంపెఁగనవహర్ష మేపున బొదలన్ (సంపెన్ సంపెఁగన్ అని భేదములు) హ. న. 2 ఆ.

2. సమృద్ధి.

కం. సొంపున నిమ్మెయిఁ బెండిలి, సం వఱిన సత్య ధర్మ జనపతిచంద్రుం డంపఁగ నావంచకపురి, కింప లరఁ గుమారుఁ డరిగె నింతియుఁ దానున్. విక్ర. 7 ఆ. (శ. ర.).

**సంపుట (టి)క** నం. వి. ఆ. స్త్రీ. పెట్టె 2. ఒక విధమైన దుప్పటి. 3. కాగితపు సంచి (కవరు).

**సంపుటము** నం. వి. అ. పుం. 1. బరణి 2 తొఱ్ఱ, రంధ్రము, 3. అర్ధచంద్రాకారముగా నున్న భిక్షాపాత్ర. 4. అర్ధగోళము, 5. నిలువ. 6. ముకుళనము. 7. కురవకపుష్పము. (ఎఱ్ఱగోరింట పూవు) 8. గ్రంథము. 9. పొక్కిటఁ జేయుచుంబనము.

సీ. చిత్తజుగృహమున నుత్తర స్ఫుటితంబు. పొక్కిట సంపుటంబును శిరోధనముపదం బూరుల నన్వితంబవ నొప్పు దళచుంబనములు దత్తత్స్థలములఁ...హంస. 5. 148.

**సంపుటించు** నం. స. క్రి. 1. ముకుళించు.

సీ. జయజయధ్వని దేవసంయమీశ్వరకోటి సంపుటించెఁ గరాంబుజంబు నొసల. భీ.4. ఆ. (శ. ర.).

**సంపుటీకరణము** నం. వి. అ. న. కప్పుట, మూఁతఁ బెట్టుట.

**సంపుష్టి** నం. వి. ఇ. స్త్రీ. 1. సమృద్ధి.

సీ. ఆశివుండు ప్రసన్నుఁ డయిన నెల్లిరకును బుష్కలాభ్యుదయ సంపుష్టి బొడము. సూత సంహిత ఆ. 2. పు. 111.

2. ఎక్కువ బలుపు.

సంపూజనము సం. విశే. 1. స్తుతించునట్టిది, గౌరవించునట్టిది. వి.అ.వ. 1. గౌరవించుట, బహూకరించుట.

సంపూర్ణకాముఁడు సం. వి. అ. పుం. 1. నిండినకోరికలు గలవాఁడు. 2. కోరికలతో నిండినవాఁడు.

సంపూర్ణకాలీనము సం. విశే. (అ. ఆ. అ). సకాలమున సంభవించునది.

సంపూర్ణము[1] సం. విశే. (అ. ఆ. అ.) నిండినది, సమగ్రము.

తే. గీ. బాల్య సంపూర్ణ భావంబు పాయఁ బాయఁ, దరుణయౌవనలక్ష్మి వర్తనము సూఁపె .... నిరంకుశో. 2. 9.

సంపూర్ణము[2] సం. వి. అ. పుం. స్వరగ్రామము లన్నియు నుపయోగింపఁబడు సంగీత విశేషము.

సంపూర్ణము[3] సం. వి. అ. న. ఆకాశము.

సంపూర్ణమూర్ఛ సం. వి. ఆ. స్త్రీ. యుద్ధక్రియా విశేషము.

సంపూర్తి సం. వి. ఇ. స్త్రీ. 1. సంసిద్ధి 2. ముగింపు.

సంపృక్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. సంయుక్తము 2. మిశ్రితము. 3. సంబంధించినది. 4. స్పృశించినది. 5. సన్నిహితసంబంధము కలది.

సంపెంగ వి. చంపకము. రూ. సంపెఁగ.

వ. కరంబు సొంపారు సంపెంగలును. శృం. నై. 1. 95.

గీ. ఓరుగంటి పురంబులో నోరగ్రంత పెద్ద యెలుఁగున నమ్మె నంపెంగనూనె. క్రీడా. 101.

గీ. పెలుచఁ దమదాయయైన సంపెంగవిరిని ... యయా. 4. 38.

గీ. భోగబాహ్య మయ్యెఁ బూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకుఁ బోలె. మను. 1.52.

సీ. కొండ గమ్మడు రేఁగు గోరమి సంపగి కొండ సంపెంగ మాఁరేడు సరళదేవ. హంస. 4. 11.

మ. సొరిదిం బేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబులుం బున్నమం,బరులు న్మామిడి గుత్తులుం గుసుముల్ సంపెఁగలుం బచ్చగ,న్నెరల్ .... చేఁలరుదార న్నగుఁ బువ్వుఁదోఁటల ... ఆము. 1. 66.

2. ధాన్యవిశేషము యొక్క పేరు.

సంపెంగనూనె వి. సంపెంగ పూలరసముతోఁ దయారయిననూనె.

గీ. ఓరుగంటిపురంబులో నోరగ్రంత, పెద్ద యెలుఁగున నమ్మె సంపెంగనూనె. క్రీడా. 101.

గీ. చొక్కటఁపు, ఒగరు సంపెంగ నూనెలు ... హంస. 5. 352.

సంపెఁగ వి చంపకము,

ఉ. ... హిం,సారతి సేయుదర్పకుని సంపెఁగ ములుకులఁబోలె మించఁగన్. మను. 5. 64.

సంపెఁగనూనె వి. - సంపెంగనూనె.

ఉ. సంపెఁగనూనె యంటు నొక చంద్రనిభానన కంసవైరికిన్. పారి. 2. 9.

సంపెఁగబంతి వి. √ (సంపెఁగ) సంపంగి పూలతోఁ గట్టినబంతి.

ఉ. చన్నులు కుంభి కుంభములు సంపెఁగ బంతులు జక్రవాకముల్. విక్ర. 3. 49.

సంపెట వి. సమ్మెట, 1. ఇనుము సాగఁగొట్టెడి సాధన విశేషము, అయోఘనము (క. చమ్మట్టిగె త. చమ్మట్టి).

సీ చటులంబులైన సంపెట లశాఁకులఁ బోలి వజలు తలంబులఁ జఱచి చఱచి. భా. రా. యుద్ధ. 1177.

సీ. విటుల గుండెలలోన విదళించు చిగురాకు సంపెట వ్రేటు కెందు సమసె నేఁడు. వీర. 2. 116.

ఉ. దాఁకటి మీఁదఁ బెట్టి బెడిందంబుగ సంపెట వేయ .... రత్న. శర.

2. చబుకు; కశ.

చం. గొనకొని మొత్తె సంపెటలఁ గొంకక నిర్దయ వృత్తిఁజేసి ... హరిశ్చ. 2. 141.

శా. ఏమేమీ మిము భూవరాధముఁడు దానెంతే వహంకారియై, భీమమూర్తిఁ గశాభిఘాతములచే బిట్కల్క నొప్పించెనే. హరిశ్చ. 2. 142.

సంపేషణము సం. వి. అ. న. 1. వినరుట. 2. దంపుట. 3. రుబ్బుట.

సంప్రకాశించు సం. ● క్రి. 1. ప్రజ్వరిల్లు 2. ప్రకటమగు; బయల్పడు.

గీ. సంప్రకాశించు విరహాగ్ని సాక్షిగాఁగ, బాణ కన్యానిరుద్ధుల పరిణయంబు, వర్ధిగావించె మకర

మీనాధిపతుల, యడను దెలిసిన నవనీతి యాజ్ఞి కుండు, అనిరుద్ధ. ౬. 76 ప్రచురితమగు. 4. వెల్లడియగు.

సంప్రక్షాళనము నం. వి అ. న. స్నానము చేయుట.

సంప్రజ్ఞాతము నం. వి. అ పుం. సవికల్పసమాధి (వ్యతి. అసంప్రజ్ఞాతము).

సంప్రణీతము నం. విశ. (అ. ఆ. అ) రచింపఁబడినది 2. ఒకచోఁ జేర్పఁబడినది.

సంప్రణేత నం. వి. ఋ పుం. 1. న్యాయాధికారి. 2. పాలకుఁడు. 3. నాయకుఁడు. 4. సేనాని. 5. పోషకుఁడు.

సంప్రతాపనము[1] నం. విశ. 1. దహించునది. వేఁడి చేయునది. 2. బాధించునది.

సంప్రతాపనము[2] నం. వి. అ. న. ఒక నరకము.

సంప్రతి[1] 1. లెక్కలుసరిచూచు పెద్దకరణము వాఁడు, లెక్కవ్రాయువాఁడు, గణకుఁడు.

తే. సంప్రతులఁ బిల్చి యెన్నిలక్షలకుఁ గలదు. రాజ్య మెన్నెన్నిగలవు దుర్గస్థలములు బొక్కసం బునఁ గల ధన భూషణాది, వస్తువులు నశ్వవేదండ వర్గ మెంత. కృష్ణ. 2. 67.

సంప్రతి[2] విశ. ఈడు, సమానము.

చం. మెలఁత మొగంబు చందురుని మెచ్చునళం బులు కుందనంపు బిం,చెలకగు సంప్రతుల్ తళుకుదే ఱెడు కన్నులు బిత్తరంపుఁగ, ల్వల పొరుగింద్ర నీలపు సళాకల వంగడ మారుతీవ ... చమత్కా. 2. 42.

సంప్రతి నం. అవ్య. 1. ఇప్పుడు 2. వెంటనే. 3. సరిగా.

సంప్రదించే స. క్రి. 1. సరిచూచు.

సీ. చరణద్వయీ భూరిసౌభాగ్య సంపదఁ బరిభ వింతురు హేమ పద్మవనము, ఘననితంబస్థలీ గౌర వాభ్యున్నతి సంప్రతింతురు నదీసైకతములు, గంభీ తర నాభిగర్త విభ్రమముల ప్రక్కలింతురు జలా వర్తశోభ. భీమ. 1. 91.

2. లెక్కమొదలైనవి సరిచూచు. 3. సలహాఅడుగు.

సంప్రతిపత్తి నం వి.ఇ.స్త్రీ. 1. వచ్చుట, 2. సన్నిధి. 3. లాభము. 4. పొందుట. 5.ఒడంబడిక 6. అంగీకరించుట. 7. ఎదుర్కొనుట. 8. హైరానుట. 9. సంభవించుట. 10. సహాకారము. 11. చేయుట. 12. సమయోచితబుద్ధి.

సంప్రతిపన్నము నం విశ. (అ. ఆ. అ. 1 సమీపించినది 2 అంగీకరింపఁబడినది. 3 చేయఁబడినది.

సంప్రతిపాదకము నం. విశ ఇచ్చుట.

సంప్రతిభాసము నం వి. అ. పుం. సమస్తయజ్ఞానము.

సంప్రతిరోధకము నం. వి. అ. న. పుం ప్రతిబంధకము, నిర్బంధము, చెఱ.

సంప్రతిష్ఠ నం. వి. ఆ. స్త్రీ. ఉన్నతస్థితి; పట్టుదల.

సంప్రతిష్ఠించు నం. స. క్రి. చక్కగా నిలుపు.

గీ. చెప్పనేటికి సకలసంసిద్ధిఁ గోరి, దక్షిణాంభోనిధా నంబుతటమునందు, సంప్రతిష్ఠింపుఁ డీశాముఁ జంద్ర మౌళి, విశ్వలోకాధినాథు నోవిబుధులార. భీమ. 3. ౪9.

సంప్రతీక్ష నం వి. ఆ. స్త్రీ. ఎదురుచూచుట. ఆకాంక్ష.

సంప్రతీతము నం. విశ. (అ. ఆ. అ.) 1. తిరిగి యియ్యఁబడినది. 2. విశ్వసించినది. 3. అంగీకరింపఁబడినది నిరూపింపఁబడినది. 4. సుప్రసిద్ధమైనది.

సంప్రతీతి నం వి. ఇ. స్త్రీ. 1. పరిజ్ఞానము 2. సమ్మతి 3. ప్రసిద్ధి.

సంప్రత్యయము నం. వి. అ. పుం 1. ఉద్దేశము, స్థిర విశ్వాసము.

సంప్రత్తి నం. వి. ఇ. స్త్రీ. పూర్తిగా నొప్పగించు.

సంప్రదానము నం వి. అ. న. 1. చక్కని యీవి, 2. ఒకానొక కారకము (చతుర్థి) 3. కన్యాదానము.

సంప్రదానీనము నం. వి. అ. న. 1. దానము. 2. కానుక.

సంప్రదాయనిగమము నం. వి. అ. పుం. ఆచార క్షయము,

సంప్రదాయప్రద్యోతకుఁడు నం. వి. అ. పుం. వేద సంప్రదాయ ప్రకాశకుఁడు.

సంప్రదాయము నం. వి. అ. పుం. 1. ఆచారము.

గీ. పరమ యోగివరేణ్యు నిర్భరసమాధి, సౌఖ్య సంపద నిరపాయ సంప్రదాయ, సిద్ధిఁ దిలకించు

చోట నశేషభవన వివిధ ధర్మంబు లావిర్భవించు చోట పాండు. ౭. 159.

ద్వి. తరణి! మీ గురు సంప్రదాయంబు వారు ధరణి నేరావునఁ దపము సేయుదురు? బసవ. పు. ౬. 187.

2. పరంపరాగత జ్ఞానము. 3. ప్రత్యేక మతబోధన విధానము. 4. రూఢమైన వ్యవహారము. 5. సంప్రదానము. గురుపారంపర్యము.

సంప్రధానము సం. వి. అ. న. 1. నిజము తెలిసికొనుట. 2. పరిశీలనము.

సంప్రధారణ సం. వి. అ. స్త్రీ. 1. ఔచిత్యానౌచిత్య నిర్ణయము, 2. సమాలోచనము.

సంప్రధారణము సం. వి. అ. న. వ్యవహార నిశ్చయమునకుఁ దోడ్పడు లిఖిత సాక్ష్యాదులు.

సంప్రపదము సం. వి. అ. పుం. న. 1. మునివ్రేళ్ళపై నిలుచుట, త్రిమ్మరుట.

సంప్రపన్నము సం. విశే. (అ. ఆ. అ.) 1. నిశ్చయమునకు వచ్చినది, 2. కూడినది.

సంప్రభవము సం. వి. అ. పుం. 1. ఉదయించుట. 2. ప్రత్యక్షమగుట.

సంప్రభిన్నము సం. విశే. 1. బ్రద్దలైనది, 2. మదావస్థలోనున్నది.

సంప్రమాపణము సం. వి. అ. న. చంపుట.

సంప్రమార్గము సం. వి. అ. పుం. పరిశుభ్రముచేయుట.

సంప్రముగ్ధము సం. వి. అ. న. అధిక సంతోషము.

ఆ. సంప్రమోద మందు సాత్యవతేయుని, గనిప్రదక్షిణంబెగాగ వచ్చి వరుగ నుత్సహించె నారదేయుఁడు... భార. శాంతి. 6. 323,

సంప్రమోషము సం. వి. అ. పుం. 1. సంక్షోభము. 2. కలవరపాటు.

సంప్రయాణము సం. వి. అ. న. విడిచివెళ్ళుట.

సంప్రయుక్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. పూన్పఁబడినది; కట్టబడినది. 2. కలుపఁబడినది. 3. సాంగత్యము కలిగినది.

సంప్రయుక్తకము సం. విశే. (అ. ఈ. అ.) సహకరించునది,

సంప్రయోగము సం. వి. అ. పుం. 1. కలయిక 2. నాటక ప్రదర్శనము. 3. సాంగత్యము. 4. కట్టుట 5. పరస్పర బంధము 6. పరిపాటి. 7. మైథునము. 8. ఇంద్రజాలము. 9. సహకారము 10. చిల్లంగి పెట్టుట.

సంప్రయోగి[1] సం విశే. (న్. నీ. న్.) 1. కలువునట్టిది 2. కామవ్యసనము కలది.

సంప్రయోగి[2] సం. వి. న్. పుం. 1. కలుపువాఁడు. 2. మాంత్రికుఁడు. 3. స్వేచ్ఛావర్తనుఁడు 3. పోకిరి.

సంప్రయోగించు సం. స. క్రి. 1. (బాణము) ప్రయోగించు. 2 ఏయు. 3. వలపు.

వ కాండప్రకాండములు సంప్రయోగించి రథరథ్యకేతు సూతవ్రాతంబుల మర్మఘాతంబుల నొప్పించుచు. అని. 4. 55.

4 చిల్లంగిపెట్టు.

సంప్రవదనము సం. వి. అ. న. 1. (పరస్పర) సంభాషణము. 2. సంవాదము.

సంప్రవర్తనము సం. వి. అ. న. చక్కని నడక, చక్కఁగా నుండుట, చక్కఁగాఁ జరుగుట.

సంప్రవర్తిల్లు సం. అ. క్రి. వర్తించు, చక్కఁగా నడచుకొను.

వ... అట్లజాతశత్రుుండు సమ్యగంగీకృత సామ్రాజ్యుం డయి జనసంపూజ్యుం డగు చరితంబున సంప్రవర్తిల్లుచుండ. భార. అను 5. 449.

సంప్రవృష్టము సం. వి. అ. న. సంపూర్ణ వర్షపాతము.

సంప్రశ్నము సం. వి. అ. పుం. 1. కుశల మడుగుట. 2. అడుగుట. 3. ఆశ్రయము; శరణు (వేద).

సంప్రశ్రయము సం. వి. అ. పుం. వినయము. అడఁకువ.

సంప్రసాదము సం. వి. అ. పుం. 1. వేడికోలు. 2. అనుగ్రహింపఁ జేసికొనుట. 3. అనుగ్రహము. 4. ప్రశాంతి. 5. విశ్వాసము.

సంప్రసాధనము సం. వి. అ. న. 1. భూషణము, అలంకరణము. 2. సుష్ఠుగా నిర్వహించుట లేక ఆచరించుట.

సంప్రసారణము సం. వి. అ. న. 1. యవరలలు,

ఇ ఉ అర్ అల్ లుగాఁ బరిణమించు వ్యాకరణ సంప్రసారణము. 2. చక్కఁగా వ్యాపింపఁజేయుట.

సంప్రసారుఁడు సం. వి. అ. పుం. సర్వమును జక్కఁగా నిర్వహించువాఁడు.

సంప్రసిద్ధి సం. వి. ఇ. స్త్రీ. 1. విజయము. 2 అదృష్టము.

సంప్రస్థానము సం. వి. అ. న. 1. వీడిపోవుట. 2. పురోగమనము.

సంప్రహారము సం. వి. అ పుం. 1. పరస్పరతాడనము. 2. మార్కొనుట, యుద్ధము, సంఘర్షణ. 3. గమనము, చలనము.

సంప్రహాసము సం. వి. అ. పుం. పరిహాసము. హేళన.

సంప్రాణించు సం. అ క్రి. ప్రాణముతోఁ గూడు, బ్రదికియుండు.

సీ... తరువులు దనిగాడ్పు తపనరుచులు, గాంచి సంప్రాణించి క్రమ్మఱఁ గొమ్మల గదలించి వర్తన క్రమ మొనర్చు. హరి. పూ. 7 186.

సంప్రాపించు సం. అ. క్రి. 1. చేరు. 2. పొందు. 3. సంపాదించు. 4. కలుగు.

కం. పాపాత్ముల దండింపని. క్ష్మాపతి కాపాపము నను షడ్భాగము సం, ప్రాపించుఁ గాన ధరలోఁ, బాపము లేకుండ నరసి ప్రజఁ బ్రోవఁదగున్. ఉ. రా. 7. 202.

5. కలసికొను. 6. తారసిల్లు, 7. కలహించు.

సంప్రాప్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁగాఁ జేరఁబడినది. 2. చక్కఁగాఁ బొందఁబడినది,

కం. అనఘా తపోవనమునన, జననంబును మరణదశయు సంప్రాప్తము ల,య్యేనయేని వాఁడు ముక్తుఁడె, మనంబు బహుకామవికృతి మగ్నంబై వన్. భార. శాంతి. 6. 238.

గీ. బ్రహ్మ బ్రహ్మపదైకసంప్రాప్తుఁడగుట. సూత సంహిత. అ. ౨. పు. 110.

3. సకాలమునకుఁ జేరినది. 4. ఉత్పన్నమైనది.

సంప్రాప్తి సం. వి. ఇ. స్త్రీ. 1. లబ్ధి. 2. ఆర్జన. 3. సంపాదన.

సంప్రాప్తించు అ. క్రి. లభించు, కలుగు.

మ ... ఎటు సంప్రాప్తించె సౌభాగ్య మింకతి కంచున్... ఉ. రా. 2. 212.

సంప్రార్థన సం. వి. ఆ. స్త్రీ. = సంప్రార్థనము (అ. న.) వేడుకోలు

సంప్రార్థించు సం. స. క్రి వేఁడు, వేఁడుకొను.

కం. చని సంప్రార్థించి యతనిఁ, గొని పుత్రుని, గాంచి. భార. శాంతి. 6. 117.

శా. స్వారాజ్యప్రముఖామర ప్రవరులన్ వర్జించి లజ్జావరీ, హారంబుం బొనరించె రాజులకు సంప్రార్థించి తా దేవన, త్యాగశైలి యితని న్వరించిన వివేక ప్రౌఢిఁ దద్దేవతా, హ్రీరోమాపయశః ప్రమార్జన మొనర్చెన్ భైమి మేలెంతయున్. నైష. 6. 79.

సంప్రార్థ్యము సం. విశే. (అ. ఆ. అ)

మ.... పదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబుగా జెంపువన్ దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్. భార. విరా. 1.

సంప్రియము సం. వి. అ. న. తృప్తి.

సంప్రీతి సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రేమానుబంధము. 2. అనురాగము. 3. స్నేహపూర్వకమైన అంగీకారము. 4. ఆహ్లాదము, ఆనందము.

శా.... సం. ప్రీతిం బొందితి వేఁడు మిప్పుడు మనోభీష్టంబుల న్నాపుడున్. షోడశ. కు. 7. 55.

సంప్రేక్షణము సం. వి. అ. న 1. పరిశీలించుట. 2. చూచుట. 3. ఆలోచించుట. 4. పరిశోధించుట.

సంప్రేషణము సం. వి. అ. న. 1. ద్వాదశాహ శ్రాద్ధము. 2. పంపుట. 3. వార్తను పంపుట.

సంప్రైషణము సం. వి. అ. పుం. 1. పంపివేయుట, 2. ఆజ్ఞ, శాసనము, నిర్దేశము. 3. నియోగము.

సంప్రోక్షణము సం. న. క్రి. 1. నీరు చల్లుట. 2. అభిషేకించుట. 3. శుద్ధిచేయుట,

సంప్రోక్షించు సం. స. క్రి. 1. చల్లు నీళ్ళు చిలుకు. 2. శుద్ధిచేయు.

వ... కూలప్రోతంబై నశవంబు నొక్కటిఁబుచ్చి ఖడ్గంబున రెండుప్రయ్యలుగాఁ జీరి తారిముందట సమర్పించి సలిలంబున సంప్రోక్షించి ఖడ్గంబుఁ

దొలఁగఁబెట్టి చేతులు మొగిచ్చి. హరి. ఉ 5, 2. 87.

**సంప్లవము** సం. వి. అ. పుం. 1. మునుగుట. 2. వరద 3. శిథిలమగుట. 4. ధ్వంసము.

సీ. శివయోగి కెలమి నిచ్చినదానమాభూత సంప్లవ స్థాయి శశ్వత్ఫలంబు. శివధ. 3. 3.

5. క్రమరహితమైన కూర్పు. 6. గుంపు. 7. జడి వాన. 8. సంక్షోభము. 9. ముగింపు.

**సంప్లుతి** సం. వి. ఇ. స్త్రీ 1. వెనుకనుండి యేనుఁగుపై నెగురుట. 2. చక్కఁగా నెగురుట.

**సంఫాలము** సం. వి. అ. పుం. పొట్టేలు.

**సంఫుల్లము** సం. విణ. చక్కఁగా వికసించినది.

**సంఫేటము** సం వి. అ. పుం. 1. కోపముతో కూడిన పోరాటము. 2. క్రుద్ధుల పరస్పర సంఘర్షణము వర్ణింపఁబడు సన్నివేశము

**సంబంధము¹** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమర్థమైనది. 2. తగినది. 3. సరియైనది.

గీ. వీరు వారును సంబంధ విషయ బంధు, లగుట సరిగాదె హరికి. భార. ఉద్యో. 4. 170.

**సంబంధము²** సం. వి. అ. పుం. 1, కలయిక. 2. చుట్టరికము.

3. వివాహ సంబంధము.

శా. సంబంధం బిటు గూడునే రమణికిన్ క్ష్మాభర్తకున్ నేత్రపర్వంబై యుండె స్వయంవరంబు. శృం. నై. 6. 77.

5. షష్ఠీవిభక్తి సూచించు సంబంధము. (1. పితాపుత్ర సంబంధము. 2. రక్ష్యరక్షక సంబంధము. 3. శేషిశేషసంబంధము. 4. భర్తృభార్యా సంబంధము. 5. జ్ఞాతృజ్ఞేయ సంబంధము. 6. స్వస్వామి సంబంధము. 7. శరీరిశరీర సంబంధము. 8 ఆధారాధేయ సంబంధము. 9. భోక్తృభోగ్య సంబంధము.)

6. స్నేహము. 7. ఔచిత్యము. 8. జయము. 9. వైభవము 10. సంకలనము. 11. సంపుటము.

**సంబంధకము¹** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంబంధించినది. 2. తగినది.

**సంబంధకము²** సం. వి. అ. న. 1. కలయిక. 2. ఒక విధమైన సంధి.

**సంబంధకుఁడు** సం. వి. అ. పుం. 1 మిత్రము 2 రక్తసంబంధి 3. వివాహము ద్వారా ఏర్పడిన చుట్టము

**సంబంధి¹** సం. విణ. (న్. సీ. న్.) 1. సంబంధము కలది 2. అనుబంధించినది. 3. ఒకదానితో చేరియున్నది. 4. సహజమైనది. 5 సద్గుణములు కలది

**సంబంధి²** సం. వి. న్. పుం 1 వియ్యంకుఁడు

వ.... పాంచాలవిభుండు సంబంధితో వలయుమాటలాడం దగువారలఁ బనిచి రావించి భార ఉద్యో 4 391.

2 చుట్టము, బంధువు

మ శరతల్పంబున నున్నశాంతనవు నాజ్ఞాతత్వరుండై యుధిష్ఠిరుతో నర్జునుఁ డిట్లనున్ హరిఁ బ్రశంసింపంగ రారే మునీశ్వరులున్ ద్వారక కేనుబోయితిఁ గదా సంబంధులం జూడనాఁ, డరుదా దేవునియందుఁ గంటి నొక కృత్యం బెవ్వరుం జేయరున్. ఉ. హరి. 2. 3.

**సంబంధించు** సం. అ. క్రి. 1. కూడు, కలియు

వ. విన్నాణంపు గొల్లు చెలుంగులును వేల్పుగాణలు పాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁ బాటలను దిటుకొను తిన్నని రవంబులు న్గలసి బలసికొను కోలాహలము లిమ్ముగ సందడుల నెడగలుఁగ న్జడియు వేత్రహస్తుల సాహోనినాదంబు సంబంధించి పెంపొలయ. మను. చ. 5. 71.

2. బంధించు; నిరోధించు.

ద్వి. ప్రాణునపాను సంబంధించి యాత్రికోణకుండలి మేలుకొల్పి యుందుండి, పశ్చిమనాడీకాపథమును గోరి, నిశ్చంచలతఁ ద్రివేణీసంగమందు. ప్రభులింగ. 2 ఆ. 40 పు 23 పం.

**సంబంధుఁడు** సం వి. అ. పుం. చుట్టము, దగ్గఱి చుట్టము.

**సంబడ(ళ)ము** వి. (సం. శంబలమ్, ప్రా. సంబలి. త. చంపళం. క. సంబళ. మ. చంబళమ్) 1. వేతనము, బత్తెము.

తే. భూవరుం డొక పయనంబు పొమ్మటన్న, మంచిదని వచ్చితిని సమ్మతించి నేను, సంబళము కంబ

ళము కత్తి చద్ది చల్లడంబు కేడంబు ధట్టి తెమ్మంబు జాతి. హంస. 1. 226.

తే. అడుగడుగు కెంజిగురుటాకు కడుపు కూటి, బంటుగములకు దవళిసంబళము లొసఁగ, నిండు మురువున వొకతె కైదండఁబూని, పతి కడకు వచ్చి నిలిచె నా రతిపథూటి. చంద్రాంగ. 3. 53.

సీ. ... సంబళంబు లొసంగి సంతరింపఁగలేమి విడిచి పోవఁదొడంగె విబుధబలము. దశా. 2. 51.

ద్వి. కూర్మిఁ గూర్చుండక కొలుచు వారలకుఁ బేర్మి సంబళము లిప్పింపక జనుల మనవులు వినక. నల. 1. 1006.

తే. అడవిదుంపలె కాని సంబడము లొసఁగఁ, గాను పీసంబు చేత వెక్కడను లేక, మగువఁ గోల్పోయి కడునిడుమలఁ గలంగు, నలఁతి దొరఁ గొల్వఁగడఁగు వెంగలులు గలరె. అ. రా. సుందర. 154.

2. పాథేయము, దారిబత్తెము.

వ. ఆయస్థిపేటికయు లోహండియుఁ దండులంబులు గంబళంబులుం దగిన సంబడంబును వహించి యొక్కరుండును దెరువుతోడువం బెక్కు దేశంబులు గడచి. కాశీ. 5. 62.

కం. అనతిఁ శ్రీఖండా, రానన్ సంబడము తనదు ప్రాయందలమున్. ఆము. 7. 95.

సీ. తీర్థంబులకు నేఁగు దీనమానవులకు నేమైన సంబళం బిచ్చి నతఁడు వనజహితపుత్ర నీ పురంబునకు రాఁడు. రుక్మాం. 2. 88.

చం. తపమునకుం గుశాసనము దానవు విత్తు ఫలించు పాదు ని,క్కపు సుఖసిద్ధిఁ గోరి వెదకందగు నాకర మబ్జజాది విష్టపములకెల్ల సంబళ మొసంగెడు పాలెము మర్త్యము. కవి. 6. 77.

గీ. కాశికాక్షేత్రమున కేగుఘనుల కితఁడు, సంబళంబులఁ బాదరక్షలు నొసంగు, ధర్మబుద్ధిని భద్రరుద్రాక్షమణులు, దానమిచ్చిన దీనమందారుఁ డతఁడు. సానందో. 1. ఆ.

కం. పడఁతుక లచ్చటఁ గలరని, తడవుచే రాకున్న విడుతుఁ దనువు నిజేశా! గీ. అనుచేఁ గందర్ప సంక్రీడ నాత్మనాథు నుల్ల మలరంగ నేర్పుల నోలలార్చి, చలిదియును సంబడంబును జాలనొసఁగి, ప్రొద్దుగ్రుంకెడు వంతన పుచ్చెనతని. పంచ. నా. 3. 222.

కం. పతిన యీకేరళ నర,పాలుఁడు నా కానతిచ్చెఁ బయనము దాంన్, గాలవిలంబన మోమహిళాళిం దెమ్ము సంబళముఁ గంబళమున్. వేం. పంచతం. 3. 252.

తే. పోయి వచ్చెద నీపదాంబురుహచింత, నాకుఁ దగు సంబళముగాఁగ నళిననాథ. జై. భా. 1. 199.

3. ఆయుధ విశేషము.

వ. నేత్రకోణంబుల నగ్నికణంబులు రాల నీక్షించి యొకలు వెడలంగ నడిదంబులు పెకలి ఝళిపించియు సంబళంబులు ద్రిప్పియు. మైరా. 3. 2.

సంబరము[1] వి. (సం. సంభ్రమః) 1. వేగిరపాటు.

ద్వి. హరుఁడు దాబడి వెట్టునది తథ్యమేని, పంచి నీసుతుఁడును బ్రతికెడుగాక, సంబరపడనేల చర్చింపనేల పండితా. మహిమ. 291.

తే. గొప్ప హురుమంజి సుప్పాణి కూర్పడంపు,డంబు పగడంబు జగడంబు సంబరంబు లెసఁగిన గుడార్లు గలుగు నవ్యసుమతీకు పాకెమీక్షించి గజరాజ భయము మించి. కృష్ణ. 3. 75.

3. సంతోషము.

వ. పాండుడిండీర ఖండమండలంబులు సంబరంబులు పొదలింప నమరియు నక్రొకాలంకు మహితాబ్జ కామినీ జాల పరిభ్రాజితంబు గావున నళిమిథున మీన కుళీరమకరాది సంయుతంబై.

4. వేడుక.

వ. పగుఁబెండ్లి శృంగారరసంబు సంబరాల దినుసున దిక్కులు బిక్కటిల్ల ... ప్రబం. 1. 788.

సంబరము[2] సం. వి. అ. పుం. 1. ఆనకట్ట. 2. వంతెన 3. ఒకజాతి లేఁడి.

సంబరము[2] సం. వి. అ. న. 1. నిగ్రహము. 2. నీరు. 3. బౌద్ధుల మతాచార విశేషము.

సంబరి[1] అవ్య. చూడు:— సంబళి.

సంబరి[2] సం. ఈ. స్త్రీ. ఎలుకజీడి (వృ. వి.).

సంబరేను వి. చర్మకము. చర్మకష (వృ. వి.).

చం. .... చఁగ్ణకం, బలరును సంబరే వవఁగ. ఆం. వ. అచ. 87.

**సంబలము¹** సం. వి. అ. పుం. పాథేయము, దారి బత్తెము.

**సంబలము²** సం. వి. అ. న. జలము.

**సంబళకాఁడు** వి. (√ సంబళము) జీతకాఁడు.

**సంబళము** వి. కూలి.

కం. సంబళమ్మనన వేతనమై. ఆం. వ. నర. 117.

గీ. అంటుపడి వచ్చినావు మమ్మంట కేఁగి, శౌరి మాసబళములు తత్సఖుల కొసఁగు, మంటు వడలే దటంచు మిమ్మంటి యిపుడు, బాసలెల్లను జేసెద భాసురా. గి. రాధికా. 4. 10.

**సంబళి** అవ్య. తొలఁగుము. రూ. సంబళీ.

తే. మొగముపైఁ జిమ్మచీఁకటి ముడివడంగ, మాటి మాటికి మీసాలు దీటుకొనుచుఁ,జనియె సంబళి సంబళి యనుచుఁ బంక, జాప్తకులపుంగవుఁడు వచ్చునంగడికిని. హరిశ్చం 4. 215.

ఉ. ... కొమరు మాలెత గమ్మల వవ్వదేరఁగా, సంబళి సంబళీ యనుకు సందళిం దలమంచుఁ బల్కుమన్. శివరాత్రి. 3. 40.

కం. ఇలఁ గోలఁదట్టుచున్ సంబళి సంబళి యనుచు గ్రందువడు జనములకు, న్దొలఁగుచు నొదుగుచు నా భూతల పతికడ కరుగుదెంచి తా నిట్లనియెన్. మార్క. 1. 225.

**సంబళించు** అ. క్రి. (రూ. సంబడించు) (తు. సంబళియు) చాలు, సమర్థమగు.

వ. విష్ణుని మాయవలన నెందును గాల్కొని నిలువ సంబళింపక శతసహస్రసంఖ్యల యేండ్లు చరియించి యుం గుహలోఁ గడవలఁ గానఁడయ్యె నతని నివ్విధంబున. హరి. ఉ. 9. 98.

కం. అకటా యని చింతింపుచు, లికుచకుచల్ నిలువ సంబళింపక శుకముం, బికమున్ మలయానిలకా,ళకమున్ మదిఁ దలఁచి వినయ పాటవ మమరన్. వేం పంచతం. 4. 177.

**సంబళించుకొను** అ. క్రి. తేఱుకొను.

వ. పగతుండు గన్నుదిరిగి నెత్తురు గ్రక్కుచు గ్రక్కువ నొఱిగి యంతలోనన సంబళించుకొని యెగసి బొంకు బొంకని యార్చుచుండ గడంగిన వద్దెన యోధులతని కడ్డంబు వచ్చిరి. హరి. ఉ. 2. 62.

**సంబళిక** (సం. సంపుటక. క. సంబళిగె) వి. అడపము, వక్కలాకులతిత్తి, తాంబూలము.

ఉ. వాదుల గెల్పువాలు చెలువంబుగ దాల్చిన పూలు నొప్పఁగా, నాదొర యొద్ద సంబళిక అందుచు ముందు నతండు ధీరతన్. హంస. 1. 207.

**సంబళిగె** వి. సంబళిక.

సీ. సైన్య నాయక మాన్యసచివ పురోహిత బంధు వర్గముల సంబళిగెలతును. ఉ. హరిశ్చ 1. 68.

**సంబవులు** వి. బ. 1. పావకోళ్ళు.

వ. అనంతరంబ కుంభభవ పులిన సంభవులు సంబవులు దొడిగికొని కదలి. భార. భీష్మ. 3.

2. పాదరక్షలు.

సీ. శశిఁ దెత్తుమే నీకు సంబవు లిడియుండ, ధన నాథు దెత్తుమీ దాసుఁజేసి. కుమా. 6. 17.

ఉ. కాయజవైరి భక్తులకుఁ గాయము చర్మము నొల్చి సంబవుల్ సేయఁగఁజాలు. చెన్న. 4 ఆ.

**సంబవులు** వి. బ. ధాన్యవిశేషము.

సీ. సాలంక లలుగు రాజనములు సంబవు లవె నర దాల్లు మోహనవుసరులు. హంస. 4. 127.

సంభావులు (ముద్రి.) సంభవులు (ప్రా.).

**సంబాకృతము** సం. విణ. (రూ. శంబాకృతము) రెండు చాళ్ళు దున్నినది.

**సంబాగవు** వి. ఏఱుదాఁటెడు సాధనము.

**సంబాధకము** సం. విణ. 1. ఒండొంటి నొరయునది. 2. గుమిగూడునది.

**సంబాధన** సం.వి.ఆ.స్త్రీ. 1. ఒఱయుట 2. కోపించుట.

**సంబాధనము** సం. వి. అ. న. 1. అడ్డుపెట్టుట 2. అదుముట. 3. అడ్డు. 4. శూలాగ్రము.

**సంబాధము** సం. వి. అ. పుం. 1. ఇఱుకు. 2. ఒరపిడి 3. ఆటంకము. 4. అపాయము. 5. నరకమార్గము. 6. భయము, 7. అడుగుఱి. విణ. 1. ఇఱుకైనది. 2. జనులచే నిండినది.

వ. వీథులు సంబాధంబులు గావున పేరంబులై యున్నయవి. శి. యా. పు. ౨.

**సంబారము** వి. (సం. సంభారః) ఉప్పు, కారము మొ. నవి, వేళవారము, ఉపస్కారణ ద్రవ్యము.

సీ. సంబారములతోడి శాకపాకములతోఁ క్రమైన పెసరపప్పుతోడ... భీమ. 1. 60.

సీ. వలయు సంబారాలు వడియాలు ఒలయుంచి, దళమైన క్రొవ్వుతోఁ దాలఁబోసి. హార. 3. 121

సీ...వడిఁ బెట్టిలోఁ జెలకదము సాఁబా లూప్పఁ జెలఁగు సంబారంపుఁ జింతపండు. ఆము. 2. 97.

గీ. సకల సంబారములతోడఁ జంద్రఖండ, పాండురంబైన దధితోడ బ్రాహ్మణులకు, భోజనం బిడు ద్వాదశి పుణ్యవేళ, సద్గుణాలంబ వండుం శంక రాంబ. జాహ్నవి. 1. 98.

ఉ. కూరలు సన్నబియ్యమును గుడ్డుల కోళ్ళను జింతపండు సం, బారము లుప్పు నెయ్యులుపుఁ బప్పు మొదల్గానితెచ్చి. శుక. 2. 18,

**సంబారు** వి. ఉపస్కరము.

సంబారన వేళవారము... అం. వ. పరి. 82.

**సంబాళించు** స. క్రి. (త. సమాళి, క. సంబాళిసు, హిం. సంభాల్నా.) ఆదరించు.

శా. ఒయ్యారమ్ముల తోడి యిక్కలికి నేత్రోత్ఫుల్ల విద్యుల్లతల్, పెయ్యారమ్ముల కమ్మవింటి దొర కున్ వెచ్చించు బొమ్మంచులం, బయ్యాడుందల మంచుబింబముల సంబాళించుఁ గెమ్మోవిడా, లియ్యాఁడుంచలమిన్న చన్నుఁ గవతో నీడా గిరి డావళుల్. పాంచాలి. 2. 39.

**సంబుఁడు** వి. (సం. శమ్భుః) శివుఁడు.

ద్వి. వంబియు గింబియు వంబికి గూర్చు, సంబుండు గింబుండు సకల భక్తులకు, తెలియుజుండో యని వేయించ ఘంట. బస. పురా. 105 పు. 2 పం.

**సంబుద్ధి** సం. వి. ఇ స్త్రీ. 1. పరిపూర్ణజ్ఞానము. 2. పూర్ణచైతన్యము. 3. పిలుచుట. 4. సంబోధన ప్రథమావిభక్త్యేకవచనము. 5. గుణవాచకము.

**సంబెట** వి. 1. సమ్మెట.

సీ.... సంబెట సమ్మెట యనఁగను శంబళంబు. ఆం. వ. పరి. 95.

వ. లోకమాత చేసెటనే... వసించిచిప్పలతోఁ త్రోవ... తోడ సోలుకీలాలపులుసంబె... గుబులతోడి యనుపకటచ్చు... వరాహ. 11. 155.

2. చబుకు.

ద్వి. అవనీశతనయుఁడు పట్టి కానుకను, ఒవనాశ్వములమీఁద సంబెట వైచి, అదియు నూలునఁ ఒట్టిన ట్లుండ వరుని, అవరంబుఁ దోలెవయ్యెడ భీష్మ మీఁద. విరాటపర్వము 4 ఆ. 76 పు.

**సంబెరము** వి. 1. పానుభూతి.

చం... వేడ్కునరశితోడ సంబెరము జూపు విధంబునఁ బొల్చె భూజముల్. కు. స. 5. 69

2. జలాంజలి.

గీ. సంబెరం బిచ్చె రతిదేవి శంబరారికి. హార. 8.92.

**సంబెరమిచ్చు** అ. క్రి. (√సంబెరము) 1. సానుభూతి చూపు. 2. జలాంజలి యిచ్చు.

తే. గీ. సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి కమలిన.. హార. 3. 92.

**సంబెల** వి. వక్కలాకుల తిత్తి.

గీ. జాలుబొజ్జయు మునుదబ్బ సంబెలయును, జెత్త గొడుగును జక్కఁదాల్చి కుతుకమున. హార. 7. 12.

ద్వి. మెడమీఁదికంతియు నీఁచఁబోయిన పిలుఁదును బుస్తుదోవతియు దాయ చగ నిడిన దర్భ సంబెలయు. నవనాథ. 3. 207 పుట. పం. 23.

**సంబెళ** వి. 1. సంపుటము.

సీ...సంబెళ యనఁ సంపుటమగు ... అం. వ. పరి. 45.

ఉ. వీరలు గంగలోఁ బులినవేదులమీఁద బ్రుసీని విష్టులై, నోరు వృథా మెదల్చుచుఁ గనుంగవ మోడ్చుడ వఘమాలికల్, సారెకుఁ ద్రిప్పుచుం గుళలు సంబెళలోపలి దేవపూజలున్, దారును జాంభికుల్ జనధనంబు హరించెద రద్భుతంబుగన్. ప్రబోధ చం. 2. 8.

2. వక్కలాకులతిత్తి. అడపము.

సీ. ఒడ్డె ఫాల్గునాథుఁడు పదవు త్తెంచిన, ఖింబారు ణోష్ణి సంబెళ వహించు. భీమ. 1. 67.

సీ... ...బెళ విదళించి క్రొత్త తాంబూలదళ పూగనివహంబు చాలంగ నించు నుబ్బు ... ఆము. 6. 70.

3. దర్భలు మొ॥ వానితో నల్లిన సజ్జ. (చూ. దబ్బసంబెల)

**సంబోధనము** సం. వి. అ. న. 1. పిలుపు, ఆహ్వానము. 2. వివరణము. 3. సంబుద్ధి.

**సంబోధము** సం. వి. అ. పుం. 1. తెలియఁజెప్పుట, బోధించుట. 2. సమ్యగ్జ్ఞానము. 3. పంపుట. 4. నాశము.

**సంబోధించు** సం. స. క్రి. 1. చక్కఁగా బోధించు, తెలియఁజెప్పు.

వ. అని సముచితముగా సంబోధించిన గురుని సంభాషితంబుల నిర్దోషితుండయి. భార. ఉద్యో. 1. 191.

2. హెచ్చరించు, మేలుకొలుపు.

వ. అనుచు మంద మంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శంబున. భార. విరా. 1. 167.

3. పిలుచు, ఆహ్వానించు.

**సంభ్రమము** వి. (రూ. సంబరము) తొట్రుపాటు, వేగిరపాటు.

మ. అనయంబున్ మది సంభ్రమున్ వగవు నాకంతంతకున్ గ్రమ్మఁగన్. యయా. 3.

**సంభక్తము** సం. విశే. 1. విభజింపఁబడినది, పంచుకొనఁబడినది. 1. తత్పరమైనది. 3. నమ్మకమైనది.

**సంభక్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. పంచుకొనుట, 2. పొందియుండుట. 3. పంచుట. 4. గౌరవించుట.

**సంభగ్నము** సం. విశే. చెదరఁగొట్టఁబడినది.

**సంభగ్నుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సంభజి(యి)ంచు** సం. స. క్రి. సేవించు, కొలుచు.

గీ. కూర్మి రంభోరువుం దాను గుంభభవుఁడు, కుంభినీధర దుహితృ వక్షోజశాత, కుంభికుంభద్వయీపరిరంభణార్తు, శంభు శ్రీమల్లికార్జును సంభజించె. కాశీ. 3. 54,

గీ. ప్రతిదినంబును బ్రాతరారంభవేళ, భక్తి సంభజియింతు రీపద్మబంధు. కాశీ. 3. 174.

**సంభరము** సం. వి. అ. పుం. 1. అధికమైన బరువు. 2. ప్రేగు.

కం. హరుశరమును వరుశరమును, సరి నిరుపక్కియలు దాఁకి జవమఱి శరసంభరమునఁ దిరిగె వరాహము. భార. అరణ్య. 1. 306.

**సంభరించు** సం. స. క్రి. వహించు, పూను, మోచు.

గీ. బ్రహ్మచర్య భిక్షాశనపరత గలిగి, జటిత యొండె ముండిత యొండె సంభరించి. భార. అను. 5. 269.

గీ. ... వీరభద్ర నృపతి, సర్వసర్వంసహాచక్ర సర్వచక్రభరము, పృథుభుజాపీఠమున సంభరించుట. భీమ. 1. 66.

**సంభరితము** సం. విశే. నిండినది, నింపఁబడినది.

**సంభరువు** సం. వి. ఉ. స్త్రీ. పావకోళ్ళు.

**సంభలి** సం. వి. ఇ. స్త్రీ. (సం. శంబలి) కుంటెనకత్తె.

**సంభవము** సం. వి. అ. పుం. 1. పుట్టుక. 2. హేతువు 3. కూడిక. 4. ఆధేయ మాధారమును మించకుండుట. 5. మూలకారణము. 6. సాధ్యత. 7. సామరస్యము. 8. యోగ్యత. 9. అనుకూల్యము. 10. సామర్థ్యము. 11. సమానతను దెలుపు నొక ప్రమాణము. 12. కావ్యగుణవిశేషము. 13. సంభోగము. 14. సంపద. 15. జ్ఞానము.

**సంభవించు** సం. అ. క్రి. కలుగు, పుట్టు, సంభవిల్లు.

ఆ. శాశ్వతకీర్తియు, సంభవించఁ గలుగు సద్గతియును. భార. శాం. 2. 408.

వ. జాతిస్మరణ జ్ఞానంబు శిష్యులకుం బరమజ్ఞానదానంబుఁ జేసిన ఫలంబున నాకీభవంబున సంభవించె. మార్క. 2. 31.

**సంభవిల్లు(లు)** సం. అ. క్రి. సంభవించు, కలుగు, పుట్టు.

సీ. తనదుశక్తిత్రయంబున సమస్త ప్రపంచంబుల కభివృద్ధి సంభవిల్లెన్. కాశ. 1. 28.

తే. గీ. చలువమందుల శైత్యంబు సంభవిలక, యినుఁడు గుడిచిన నీరయ్యె నింతిమేను. పి. శకుం. 3, 44.

**సంభవ్యము** సం. వి. అ. పుం. వెలగచెట్టు.

**సంభారము** సం. వి. అ. పుం. 1. చక్కఁగా భరించుట. 2. సేకరించుట. 3. చక్కఁగా భరించుట. 4. సమూహము.

సీ. హారబద్ధ సంభారవారికాకృతియును. శృం. నై. 7. 24.

5. సామగ్రి. 6. సర్వపూర్ణత్వము. 7. సంపద. 8. సమృద్ధి. 9. అంశము, భాగము.

**సంభావన** సం. వి. ఆ. స్త్రీ. 1. భావించుట, ఊహించుట. 2. సమ్మానము. 3. తలఁపు. 4. ప్రసిద్ధి. 5. సాధ్యత. 6. అర్హత. 7. సామర్థ్యము. 8. సందేహము. 9. అనురాగము, ప్రేమ 10. అలంకారవిశేషము 11. పొందుట. 12. పేరు.

**సంభావనము** సం. వి. అ. న. సంభావన.

వ. ... మత్పురంబునకుఁ దోడ్కొనిపోయి మదీయంబులగు సకల సంపద్విభవంబులుఁ జూపి వివిధ సంభావనంబు లొనరించి. షోడశ. కు 7. 53.

**సంభావించు** సం. స. క్రి. 1. సమ్మానించు, 2. గౌరవించు.

కం. విను ధర్మమునకు బ్రాహ్మణజనము జనన దేశమగుట జనపతి, భక్తిం గొనియాడి యనూయావర్జనుఁడై తగు విప్రకోటి సంభావింపన్. భార. శాం. 2. 402.

వ. .... నన్ను రావించి యుచిత ప్రియసత్కారంబు లొనర్చి సంభావించి యిట్లనియె.మార్కం.పీఠి. 13.

కం. దేవత లచ్చెరువడి య, ద్దేవుని నయ్యెడుపుఁను నుతించి రజుఁడు సం, భావించె ధర్మమును నవనీవర ! యప్పరమవిభుఁడు నిరుపమలీలన్. భార. శాం 4. 170.

2. తలఁచు, ఊహించు.

శా. అంభోజానన భూమిపాలకునిచే నాశ్లిష్టయయ్యెన్ మదిన్, సంభావింప నతం డదృశ్యుఁ డగుటన్. నైష. 3. 114.

3. కొనియాడు, స్తుతించు.

వ. మహానుభావా భవదీయ భాషణ శ్రవణంబునఁ జిత్తంబు కలంకఁదేఱె నని సంభావించు. భార. ఉద్యో. 1. 214.

4. ఆదరించు.

వ. సూర్యుఁడు వసిష్ఠమహాముని నతిగౌరవ మున భావించె. భార. ఆది. 7. 57.

క. రావి పిలిగవుదునై , భావింపవ నాకు నాఁడ పాండవు లలుకన్, బోవిడువరె భార. ఉద్యో. 2. 233.

క.. నావుకు నల్లనఁగుచు న, చ్చైవుఁడు గరుణించి మునుల దేవతలను సం, భావించె. భా. శాం. 5. 442.

5. మన్నించు, క్షమించు.

కం. గోవింద నీ ప్రభమము సం, భావింపుము మాకు నిరియ పరమధనంబు. భార. ఉద్యో. 3. 281.

6. ఓదార్చు.

క. ఎల్లింటినేఁటిలోనన, తల్లి వెదకించి తెత్తు ధన గుప్తిని నీపుత్త్రమున వగవ వలదని, చల్లని మాటలఁ దనూజ సంభావించెన్ విక్రమా. 7. 123.

**సంభావితము** సం. విశ. (అ. ఆ అ.) 1. చక్కఁగాఁ దలఁపఁబడినది. 2. ఊహింపఁబడినది. 3. యోగ్యమైనది. 4. అర్హమైనది 5. ఉత్పాదింపఁబడినది. 6. తృప్తిపఱుపఁ బడినది. సం. వి. అ. న. ఊహ.

**సంభావ్యము** సం. విశ. (అ. ఆ అ.) సంభవింపఁ దగినది.

**సంభాష** సం. వి. ఆ. స్త్రీ. 1. సల్లాపము.

కం. భూతంబుల దర్శింపమి, భూతస్పర్శనము భూతములయొక సంభా, షాతంటలత నొందమి నూ, రేతెరువు విమోక్ష సుఖ గరిష్ఠత వడయన్. భార. శాంతి. 6. 314.

2. అభివందనము. 3. పలుకరింపు. 4. ఒడంబడిక 5. సంకేతపదము. 6. యుద్ధనాదము.

**సంభాషణము** సం. వి. అ. న. సంభాష.

**సంభాషము** సం. వి. అ. పుం సల్లాపము

**సంభాషించు** సం అ. క్రి. మాటలాడు.

వ. తాపసోత్తంస యింతకాలంబునకు సుముఖుండవై నాతోడ సంభాషించుట కంటె వరంబులు గలవె. వరాహ. 7. 90.

**సంభాషితము** సం. విశ. 1. చెప్పఁబడినది. 2. పలుక

[illegible] నం. వి. అ. న. సంభాషణము.

**సంభిన్నప్రలాపము** నం. వి. అ. పుం. వ్యర్థాలాపము.

**సంభిన్నము** నం. విశే. (అ. ఆ. అ.) 1. పూర్తిగా భిన్నమైనది. 2. చెడినది. 3. విరిగినది. 4. కలఁతచెందఁబడినది. 5. బాగుగా వికసించినది. 6. బిగువైనది. 7. [illegible]నది. 8. ఎదురుతిరిగినది.

**సంభిన్నవృత్తుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. [illegible] వర్తనము విడిచినవాఁడు.

**సంభుక్తము** నం. విశే. (అ. ఆ. అ.) 1. తినఁబడినది. 2 బాగుగా అనుభవింపఁబడినది. 3. ఉపయోగింపఁబడినది.

**సంభూతము** నం. విశే. 1. పుట్టినది. 2. కలసినది. 3. కూడినది. 4. చాలినది.

**సంభూతి** నం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక. 2. కలయిక. 3. అర్హత. 4. శక్తి. 5. జ్ఞానము. 6. అతిలోకప్రభావము. 7. అంశము లేక అవతారము.

**సంభూషించు** నం. న. క్రి. 1. అలంకరించు. 2. పొగడు.

శా. జంభారిక్రియఁ జేరి యాత్మపురి నిచ్చల్ తల్లిదండ్రుల్ ప్రజల్, సంభూషింప సమస్త రాజ్య పదవీ సౌఖ్యంబుఁ జెందెం దగన్. రా వి. 5. 101.

**సంభృతము** నం. విశే. 1. చక్కఁగా భరింపఁబడినది. 2. చక్కఁగా ధరింపఁబడినది. 3. సిద్ధముచేయఁబడినది. 4. చేకూర్పఁబడినది. 5. ఉంచఁబడినది 6. సంపూర్ణమైనది. 7. పొందఁబడినది.

కం. అనన్మశీలచేత శశ్వానందుం డధిక సంభృతానందుండై ... కళా. 6. 29.

మాలిని. సకృపకృతవిలాసా సంభృతానందభావా. భాగ. స్వర్గా. 27.

8. పోషింపఁబడినది. 9. గౌరవింపఁబడినది 10. విగ్రహమైనది.

**సంభృతశ్రుతుఁడు** నం విశే. (అ. ఆ. అ.) 1. పండితుఁడు. 2. ప్రఖ్యాతుఁడు.

**సంభృతస్నేహితుఁడు** నం విశే. మైత్రీపరిపూర్ణుఁడు.

**సంభృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. చక్కఁగా భరించుట. 2. చక్కఁగా ధరించుట. 3. సేకరించుట. 4. పోషణము. 5. నిండుతనము.

**సంభేదము** నం. వి. అ. పుం. 1. చక్కఁగా భేదించుట. 2. కలయిక. 3. నదీసంగమము. 4. వికసించుట. 5 కూడిక. 6. సమానత్వము 7. ఎదురుతిరుగుట.

**సంభోగము** నం. వి. అ. పుం. 1. అనుభవము. 2. సురతము. 3. మంచిసుఖము. 4. శృంగారభేదము.

**సంభోగవేశ్మము** నం. వి. న్. పుం. ఉంపుడుకత్తె గృహము.

**సంభోగి** నం. వి. న్. న. విషయలోలుఁడు.

**సంభోగించు** నం. అ. క్రి. 1. కలయు, రమించు.

శా. ... కోడలిని గానా నీకు నీపట్టితో, సంభోగించిన యప్పుడే తెలియు నీ చందంబు దైత్యేశ్వరా ! ఉ. రా. 4. 707.

2. అనుభవించు.

**సంభోజకుఁడు** నం. వి. అ. పుం. భుజించువాఁడు.

**సంభోజనము** నం. వి. అ. న. విందు, కలసి భుజించుట.

**సంభోజని** నం. వి. ఇ. స్త్రీ. కలసి భుజించుట, సంభోజనము, విందులో నిచ్చు దక్షిణ.

**సంభోజము** నం. వి. అ. పుం. ఆహారము.

**సంభ్రమము** నం. వి అ. పుం. 1. గుండ్రముగాఁ దిరుగుట. 2. వేగిరపాటు.

చం. ఉదకముఁ గ్రోల వ్రేలెడుపయోదము పొరుషకేళి సంభ్రమా,భ్యుదయ గళద్రమాకబరి పోలిక నొప్పు ... కళా. 4. 205.

3. కలఁత. 4. భయము. 5. భ్రాంతి. 6. గౌరవము.

మ. హిమశైలేంద్రుఁడు పల్కె మామక మనోభీష్టంబు జేకూర మీకు మదీయాత్మజ నిచ్చి సంభ్రమము దళ్కొత్తన్ వివాహం బొనర్తు ముదం బొప్పఁ బ్రతిగ్రహింపదగు...శివరహస్య. సంభవ. 3. 171.

7. అజ్ఞానము. 8. సంక్షోభము.

**సంభ్రమించు** నం. అ. క్రి. తత్తఱించు, వేగిరపడు.

మ. ఇనుతేజం గడు సంభ్రమింపంగ సుభ్రాంతమై,
భుజాస్ఫాలనధ్వని [illegible]. భా. ౧. ౫.
ఆ వాన గమనంబు పంపుభాయుపు జాజ, వని గ్రహించి ఘటమునందు డించి, వరుణు చెంత మెఱంగ వరుణుండు కామించి, కదియ నకియ పలికె. ఉ. రా. [illegible].

సంభ్రాంతము నం. విశ. (అ. ఆ. అ.) సుడి తిరిగినది. [illegible] కలత నొందినది.

సంభ్రాంతి నం. వి. ఇ. స్త్రీ. [illegible] భము.

సంమంత్రణము నం. వి. అ. న. ఆలోచించుట.

సంమృష్టము నం. విశ. ౧. బాగుగా శుద్ధముగ చేయఁబడినది. 2. తుడుచఁబడినది. 3. వడగట్టఁబడినది.

సంయంత నం. విశ. (ఋ. త్రీ. ఋ.) నిరోధించువాఁడు. అడ్డగించువాఁడు.

సంయంత్రితము నం. విశ. ఆపఁబడినది.

సంయతము నం. విశ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది. 2. అణచఁబడినది. 3. బద్ధము, కట్టఁబడినది. 4. చెఱఁబెట్టఁబడినది. 5. సిద్ధమైనది. 6. పర్చుఁబడినది,

సంయతుఁడు నం. వి. అ. పుం. 1. ఇంద్రియముల నిగ్రహించినవాఁడు; సన్న్యాసి. 2. శివుఁడు

సంయతవాక్కు నం. విశ. చ్. 1. వాఙ్నిగ్రహము కలవాఁడు. 2. నిశ్శబ్దముగా నుండువాఁడు, మౌని.

సంయతాంజలి నం. విశ (ఇ) కూర్పఁబడిన దోసిలి కలవాఁడు, అంజలి పట్టినవాఁడు.

సంయతాక్షుఁడు నం. విశ. (అ. ఈ. అ.) మూసికొనఁబడిన కన్నులు గలవాఁడు.

సంయతాత్ముఁడు నం. విశ. (న్) ఆత్మనిగ్రహము కలవాఁడు.

సంయతాహారుఁడు నం. విశ. (అ. ఆ. అ.) నియమితమైన యాహారము గలవాఁడు, మితముగాఁ దినువాఁడు.

సంయతి నం. వి. ఇ. స్త్రీ. 1. తపస్సు. 2. ఆత్మనిగ్రహము.

సంయతోపస్కరుఁడు నం. విశ. (అ. ఆ. అ.) 1. సిద్ధము చేసికొనబడిన గృహోపకరణములు గలవాఁడు. 2. ఇంటి సామగ్రి [illegible]కొనినవాఁడు.

సంయత్తము నం. విశ. (అ. ఆ. అ.) 1. [illegible]మైనది. 2. కావలిలో నున్నది 3. [illegible]మైనది 4. జాగరూకమై యున్నది.

సంయత్తు నం. వి. త్. స్త్రీ. యుద్ధము, పోరు.

సంయత్వరుఁడు నం. విశ. అ. ఆ. అ. మౌని, మాటలాడనివాఁడు,

సంయద్వరుఁడు నం. వి. అ. పుం. రాజు, నియంతృశ్రేష్ఠుఁడు.

సంయమనము నం. వి. అ. న. 1. నిరోధము, అడ్డగింపు. 2. లోపలికి గ్రహించుట. 3. బంధనము, కట్టుట. 4. చెఱలో నుంచుట. 5. ఇంద్రియ నిగ్రహము. 6. నియమ విశేషము. 7. చతుశ్శాలము, ముండువాలోఁగిలి.

సంయమని నం. వి. ఈ. స్త్రీ యముని పట్టణము.

సంయమనుఁడు నం. వి. అ. పుం. 1. నిరోధించువాఁడు. 2. శాసకుఁడు. 3. రాజు.

సంయమము నం. వి. అ. పుం. 1. (చిత్త) నిరోధము; నిగ్రహము; వశపఱుచుకొనుట. 2. ధ్యానధారణ సమాధులనెడి యోగ సంబంధమైన తుది మూఁడవ స్థలు 3. నియమ విశేషము; హింసాదుల నుండి విరమించుట. 4. తపోఽభ్యాసము. 5. సుఖదుఃఖాద్యనుభవము. 6. వ్రతాంగముగాఁ బూర్వదినమునఁ జేయఁదగిన నియమము. 7. ప్రయత్నము.

సంయమి నం. వి. (న్. నీ. న్.) 1. (చిత్తము) నిగ్రహించిన వాఁడు. 2. నిరోధించినవాఁడు 3. వశపఱుచుకొనినవాఁడు, 4. కామాది వికారముల నణఁచినవాఁడు.

సంయమి నం. వి. న్. పుం. 1. యతి 2. సన్న్యాసి.
ఉ. భ్రాజితవృత్తిమైఁ బరగు భారతసంహిత సంయమీంద్రులా,రా! జయనామకం బగుచు రాజిత భంగి జగత్త్రయంబువన్ బూజిత కీర్తియై నెగడు. భార. స్వర్గా. 89.
ద్వి. సంయమివరుఁడు వాచంయముఁం డగుచు.

పద్మ. 8. పుట. 135.

**సంయమితము**[1] సం. విశే (అ. ఆ. అ.) 1. నిరోధింపఁబడినది: నిగ్రహింపఁబడినది. 2. కట్టఁబడినది. 3. ఆపఁబడినది, నిలుపఁబడినది 4. సంఘముగాఁ జేసినది

**సంయమితము**[2] సం. వి. అ. న. నిగ్రహించుట.

**సంయమము** సం. వి అ. పుం. అస్థిపంజరము

**సంయాత్ర** సం. వి. ఆ స్త్రీ 1 సముద్రయానము. 2. కలిసి పయనించుట.

**సంయానము**[1] సం. వి. అ. పుం పోఁతపోసెడి యచ్చు.

**సంయానము**[2] సం. వి. అ న. 1. అనుసరణము, వెంబడించుట. 2. ప్రయాణము, యాత్ర. 3. శవమును దీసికొనిపోవుట. 4. బండి; శకటము.

**సంయామము** సం. వి. అ. పుం. సంయమము.

**సంయావము** సం. వి. అ పుం. 1. నేయి మొదలగువానితోఁ బక్వము చేసిన గోధుమ భక్ష్య విశేషము: సారెసత్తులు (శ. ర.) (ఘృతక్షీరగుడ గోధూమ పాకజము అని వాచ.).

**సంయుక్తము** సం. విశే (అ. ఆ. అ) 1 చక్కఁగాఁ గూడినది, ఏకమైనది. 2. మిశ్రమైనది; కలసినది 3. అనుసరింపఁబడినది; వెంబడింపఁబడినది, 4. సంపన్నము, కలిగియున్నది.

సీ. శివభక్తి సంయుక్త చిత్తులకును ... శివధర్మ 2. 34.

**సంయుగము** సం. వి. అ. పుం. 1. కలయిక, ఐక్యము 2. యుద్ధము; పోరు 3. సన్నిహితత్వము.

**సంయుగగోష్పదము** సం. వి. అ. న. అల్పకలహము. (గోష్పదము నందలి యుద్ధము.)

**సంయుగమూర్ధము** సం. వి. న్. పుం. అనిమొన, రణాగ్రము.

**సంయుజ** సం వి. అ. కలయిక, సంబంధము.

**సంయుజుఁడు** సం విశే. జ్. 1. సంబంధము కలవాఁడు. 2. సద్గుణ సమేతుఁడు.

మత్తకోకిల :

స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్ భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు ...సభా. 2. 4

**సంయుతము** సం. విశే (అ. ఆ. అ.) 1. కూడినది; కలసినది.

ద్వి. సంయమివరుఁడు వాచంయముం డగుచు, సంయుత విద్యానుషక్తుఁడై యుండె. ప.మ. 8. పుట 135.

2. సంపన్నము, కూడియున్నది; కలిగియున్నది

వ. ప్రదీప్తాక్షత గంధ సంయుతంబును.... శివధర్మ. 2. 38.

**సంయతి** సం. వి. ఇ. స్త్రీ. 1. గ్రహముల కూటము. 2. రెండు సంఖ్యల మొత్తము.

**సంయోగము** సం. వి. అ. పుం. 1. కూడిక, కలయిక. 2. సమాన ప్రయోజనము గల యిరువురు రాజుల మైత్రి. 3 (తర్క.) ఇరువదినాల్గు గుణములలో నొకటి. 4. (వ్యాక.) నడుమ నచ్చులేని హల్లులు, సంయుక్తాక్షరము. 5. రెండుగ్రహముల కూటమి. 6. మైథునము. 7. వైవాహిక సంబంధము. 8. మొత్తము.

**సంయోగ విరుద్ధము** సం. వి. అ. న ఇతర వస్తు సంయోగమున విరుద్ధ గుణము గలిగెడు వస్తువు: వేఱు వస్తువు గలుపుటచే నపాయకరమగు నాహార పదార్థము.

**సంయోగి** సం. విశే. న్. 1. కలుపఁబడినది 2. ఏకము చేయఁబడినది, 3. కలియునది. వివాహితుఁడు.

**సంయోజనము** సం. వి. అ. న. 1. చక్కఁగాఁ గూర్చుట, కలుపుట.

శా. చేసెం గావలయున్ విరించి నిఖిల స్త్రీ పుంస సంయోజనాభ్యాస ప్రౌఢి ప్రకాశమొందఁ గడు పెయ్యం బైనసంసర్గము. శృం. నై. 6. 75.

2 రతిపొందు 3 కలయిక.

**సంయోజించు** సం స. క్రి. చక్కఁగా కూర్చు.

వ. ఎయ్యది యకారాది వర్ణంబు లేకత్వంబు నొందునట్లుగా సంయోజింప నాద్గుణ యను సంధిఁ గూడి మంత్రత్వంబు నొందు. కాశీ. 6. 250.

**సంయోజితము** సం. విశే. (అ ఆ. అ.) మఱియొకదానితోఁ గూర్పఁబడినది.

సంయోధము సం. వి. అ. పుం. యుద్ధము

సంరంభము సం.వి అ పుం. 1. ఆరంభము. 2. సంక్షోభము 3. కోపము. 4. గర్వము 5. ఉద్రేకము.

వ. ... నీరెల్ల గట్టియు నెఱుంగని వాడు కొండొక కౌతుక సంరంభంబున సంభ్రమించుచున్న యది. కళా. 5. 10.

6. ద్వేషము. 7. శత్రుత్వము వహించుట 8. అతిశయము. 9. తీవ్రస్థితి.

సంరంభరసము సం. విశే. (అ ఆ. అ.) 1. మిగుల రేఁగినది. 2. మిక్కిలి కోపము గలది.

సంరంభవేగము సం. వి. అ. పుం. కోపాతిశయము; కోపతీవ్రత.

సంరంభి సం. విశే. (న్. జి. న్.) 1. క్షుబ్ధము; కలత నొందినది. 2 రేఁగినది, ఉద్రేకించినది. 3. కోపము గలది, గర్వము గలది.

సంరంభించు సం. అ. క్రి. 1. వేగిరపడు. 2. తహతహ నొందు.

శా. రక్షస్సంఘము మీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై ... పేఁగుదెంచిన ... భాగ. 7. 223.

సంరక్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యెఱ్ఱనిది.

గీ. ప్రకట తాంబూల రాగ సంరక్తమైన ప్రాగ్దిశా కాంతబింబాధరంబువోలె. భీమ. 2 40.

2. కామాది వికారము గలది. 3. కోపముచే నెఱ్ఱవాఱినది. 4. మోహించినది; వలచినది 5. మనోహరమైనది; చక్కనిది.

సంరక్షణము సం. వి. అ. న. 1. రక్షించుట; కాపాడుట. 2. వశము, అధీనత.

సంరక్ష (ము) సం. వి. అ. స్త్రీ. (అ. పుం.) రక్షించుట; కాపాడుట.

సంరక్షించు సం. స. క్రి. కాపాడు.

కం. జనని యయి తానె కనియెన్, జనకుండై తానె పిదప సంరక్షించెన్, దనయుల వనచరకుల నిధి, ననఁగాఁ జను బుక్షవిభుఁ డర్కకులేంద్రా ! ఉ. రా. 5. 167.

సంరబ్ధము సం. విశే. (అ. ఆ. అ.) 1. రేఁగినది; ఉద్రేకించినది 2. పెర్చ్ఁబడినది. 3. వాఁచినది; ఉబ్బినది. 4. వ్యాకులమైనది, కలత నొందినది 5. దగ్గఱఁగాఁ గలసినది

సంరాధనము సం. వి. అ న. 1. ఆరాధించుట, పూజ చేయుట, తోషపెట్టుట 2 సాధించుట, నెఱవేర్చుట. 3. చక్కఁగాఁ జింతచేయుట, చింతరు ధ్యానము.

సంరాద్ధి సం. వి ఇ స్త్రీ. 1. సిద్ధి 2 జయము.

సంరావణము సం. వి. అ. న. ఉచ్చారావము.

సంరావము సం. వి. అ పుం. 1. అఱపు, గోల; కలకలము. 2. ధ్వని, చప్పుడు.

సంరిహాణము సం. వి. అ. న. ప్రేమతో నాకుట (గోవు వత్సమును వలె).

సంరుగ్ణము సం. విశే. (అ. ఆ. అ.) ఖండ ఖండము లైనది.

సంరుజనము సం. వి. అ. న. బాధ, నొప్పి.

సంరుద్ధము సం. విశే. (అ. ఆ అ.) 1. అరికట్టఁబడినది. నిరోధింపఁబడినది. 2. ముట్టడింపఁ బడినది. 4. కప్పఁబడినది, ఆచ్ఛాదింపఁబడినది. 5. నిరాకరింపఁబడినది. 6. నిర్బంధింపఁబడినది.

సంరూఢము సం. విశే. (అ ఆ. అ.) 1. చక్కఁగాఁ బెరిఁగినది. మొలచినది. అంకురించినది. 3 వేళ్ళు పాఱినది స్థిరపడినది. 4 మానినది (వ్రణము). 5. ధైర్యము కలది.

మ. హరిసంఘుంబులు గొల్చిరా సైన వాలాపత్య సంరూఢుఁడై దశావ. 7. 123.

సంరోధనము సం. వి. అ. న. నిరోధము, అడ్డగింత.

సంరోధము సం వి. అ. పుం. 1. పూర్తిగానడ్డగించుట, నిరోధము 2. ముట్టడి. 3. బంధము; కట్టు. 4. ముందుకునెట్టుట, త్రోయుట (మే. ని.).

సంరోధించు సం. స. క్రి. అరికట్టు, నిరోధించు.

శా. గోపాలత్వ విరూపుఁడై నకతనన్ గ్రో వ్వగ్గలంబై మదిన్, రూపింపంజాల కేను నిన్ను నిట సంరోధించి బాధించితిన్. హరి. పూ. 7. 199.

శా. ... ఇట్టి ఘనులన్ జిత్రంబు నేఁడిట్లు సంరోధించె నృలము నైరల్చె మగధేంద్రుం డంచు ...., భాగ. 10 పూ. 1558.

వ. వేలా తనుగొవ్వసంవసదంబు మఱునాటి యహంబున్న ఘటికాదశకంబునకుఁ బ్రవేశించితి. నీ. యా. పు. 9.

**సంవసించు** సం. అ. క్రి. 1. నివసించు.

సీ. సంవసింతు మహాశ్మశానభూములఁ గాన నేనుం డుట మహాశ్మశాన మయ్యె. కాశీ. 5. 10.

2. కాలము గడుపు.

**సంవహనము** సం. వి. అ. న. 1. త్రోవచూపుట. 2. ప్రకటించుట. 3. వడిపించుట.

**సంవహము** సం. వి. అ. పుం. సప్తమారుతములలో మూఁడవది.

**సంవాదము** సం. వి. అ. పుం. 1. పరస్పర సంభాష ణము. 2. చర్చ. 3. సమాచారము లొకరి కొకరు తెలుపుకొనుట. 4. వార్త, సమాచారము. 5. సమ్మతి, అంగీకారము, ఒప్పుదల. 6. పోలిక, సామ్యము. 7. కలిసికొనుట. 8. అభియోగము.

**సంవాది** సం.విణ. (న్. నీ. న్.) సంభాషించువాఁడు. మాటలాడువాఁడు. 2. పోలినది, సమముగా నున్నది.

**సంవాదించు** సం. అ. క్రి. సంవాదము చేయు.

వ. ఇట్లు తమలో సంవాదించి య య్యవ్వనదమ్ములు మువ్వురు విశక్తులై పిన్నాతని నొంటిఁజేసి పెద్దవా రిద్దఱు వొద్దికయై కలిసియుండిరి. భోజరా. 6. 148.

**సంవారము** సం. వి. అ. పుం. 1. కప్పుట, దాఁచుట. 2. (వ్యాక.) వర్ణోచ్చారణమునందలి ప్రయత్న విశేషము (కంఠబిలమును సంకోచింపఁ జేయుట.). 3. తక్కువగుట, న్యూనమగుట. 4. రక్షించుట. 5. పర్వులుచుట. 6. ఆటంకము.

**సంవాసనము** సం. వి. అ. న. వసతి నిచ్చుట.

ఉ. వ్యాసమునీంద్రు సారకరుణాతిశయంబున భార తార్థ ము,ద్భాసితమైన యట్టి మతభాగ్యవతున్ సకలాగమార్థ సంవాసన మావహిల్లు ... భార. స్వరా. 82.

**సంవాసము** సం. వి. అ. పుం. 1. కలిసి నివసించుట. 2. సహవాసము.

గీ. వైరమత్సర స్నేహసంవాస కార్యగర్వశోకా దులైన హృద్గతవికార, ముల దొరంగి. భార. స్వర్గ. 52.

3. ఇల్లు. 4. పదుగురు సమావేశమగుట కేర్పడిన బయలు. 5. స్త్రీపురుష సంయోగము.

**సంవాసితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సువాసన గలదిగాఁ జేయఁబడినది. 2. దుర్గంధము గలదిగాఁ జేయఁబడినది.

**సంవాహకుఁడు** సం. వి. అ. పుం. 1. ఒడలు పట్టు వాఁడు. 2. చక్కఁగా మోసికొని పోవువాఁడు.

**సంవాహన** సం. వి. ఆ. స్త్రీ. 1. తీసికొని పోవుట, మోసికొని పోవుట. 2. ఒడలు పట్టుట, అంగమర్ద నము. 3. ముందరికి ద్రోయుట.

**సంవాహనము** సం. వి. అ. న. సంవాహన.

**సంవాహము** సం. వి. అ. పుం. 1. తీసికొని పోవుట, మోసికొని పోవుట. 2. దగ్గరగా నొక్కుట. 3. ఒడలు పట్టుట. 4. విపణిస్థలము. 5. వినోద ప్రదేశము.

**సంవాహుఁడు** సం. వి. అ. పుం. సంవాహకుఁడు.

**సంవిలగ్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. భయపడినది. కలఁత నొందినది. వికలమైనది. 2. భయపడినది. బెదరినది. 3. అటునిటు కదలునది.

**సంవిజ్ఞాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అందఱును దెలిసినది. 2. సాధారణముగా నంగీకరింపఁబడినది.

**సంవిజ్ఞానము** సం. వి. అ. న. 1. అంగీకారము. 2. సంపూర్ణావబోధము. 3. జ్ఞానము.

**సంవిత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. జ్ఞానము, ఎఱుక. సుఖ దుఃఖాద్యనుభవము. 2. బుద్ధి, అవబోధము. 3. స్మరణము, జ్ఞప్తి. 4. అంగీకారము, ఒప్పుదల. 5. భావసామరస్యము, మతస్సమాధానము.

**సంవిత్తు** సం. వి. త్. స్త్రీ. 1. జ్ఞానము. 2. స్మృతి. 3. సమ్మతి, అంగీకారము, ఒప్పుదల. 4. ఆచారము. 5. యుద్ధము. 6. యుద్ధసంకేతము. 7. కావలి వాని సంకేతము. 8. నామధేయము, పేరు. 9. గుర్తు, చిహ్నము. 10. సంతోషము. 11.(సుఖ దుఃఖాదుల యందు) పాల్గొనుట, సానుభూతి.

12. సమాధి, ఏకాగ్రత. 13. సంభాషణము. 14. భంగు. 15. వార్త. 16. ప్రణాళిక, పథకము. 17. ప్రతిజ్ఞ.

**సంవిద** సం. వి. ఆ. స్త్రీ. ఒడంబడిక, సమ్మతి.

**సంవిదానము** సం. విశే. (అ. ఆ. అ.) సంభాషించునది

**సంవిదితము**[1] సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁగాఁ దెలిసికొనఁబడినది, 2. గుర్తుపట్టఁబడినది. 3. ప్రసిద్ధమైనది, 4. పరిశోధన చేయఁబడినది, పరిశీలింపఁబడినది, 6, ఉపదేశింపబడినది, బోధింపఁబడినది.

**సంవిదితము**[2] సం. వి. అ. న. ఒప్పుదల, సమ్మతి.

**సంవిధ** సం. వి ఆ. స్త్రీ. 1. ఏర్పాటు 2. జీవిక, జీవనపద్ధతి, జీవనాధారము.

**సంవిధానకము** సం. వి. అ. న. 1 నాటకమున కథా విషయములను క్రమముగాఁ గూర్చుట. 2. వింత పని, అద్భుతకృత్యము.

**సంవిధానము** సం. వి. అ. న. 1. ఏర్పాటు. 2. జరుపుట, ఆచరణము. 3. పద్ధతి. 4. క్రియ, పని. 5. కథావిషయములను క్రమముగా నేర్పఱుచుట, 6. నిర్వహణము.

**సంవిధి** సం. వి. ఇ. పుం. 1. ఏర్పాటు. 2. కూర్పు.

**సంవిభక్తము** సం. విశే. (అ. ఆ అ.) వేఱు చేయఁబడినది, విభజింపఁబడినది,

**సంవిభాగము** సం. వి. అ. పుం. 1. విభజనము. 2. పంచుట. 3. భాగము, పాలు, వాటా, 4. దానము.

**సంవిభాగించు** సం. స. క్రి. పంచు, విభజించు.

సీ. పోష్యుల నెయ్యెడఁ బ్రోవక యుండునువిప్రుల నతిథుల వ్యర్థయ పుచ్చు... ఆ. జనునె నిజధనంబు సంవిభాగించి యీ, వలయు సాధురక్ష వలయుఁ జేయ. భార. అరణ్య. 1. 30.

**సంవిభాగి** సం. విశే. (న్. నీ. న్.) 1. భాగస్వామి. 2. పాల్గొనువాఁడు.

**సంవిష్టుడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. నిద్రించిన వాఁడు. కూడఁబ్రవేశించినవాఁడు. 3. కలిసి కూర్చుండినవాఁడు. 4. దుస్తులు ధరించిన వాఁడు.

**సంవీక్షణము** సం. వి. అ న. 1. అన్ని దెసలకుఁ జూచుట. 2. వెదకుట. 3. తత్పరతతోఁ జూచుట.

**సంవీక్షించు** సం. స. క్రి. చూచు.

మ.... ఆ, విపులానాగనివాసనాకముల సంవీక్షించి వైధాత్రశా. ద్రపురంబుల్ గని దేవి నిన్నిచట సందర్శింప నేతెంచితిన్. వరాహ. 11. 86.

మ. ... ఇది వారణాసి జహ్నుకన్య యిదె సంవీక్షింపుమా శోభన, ప్రదునిన్ డుంఠి వినాయకున్, రుక్మాం. 5. 63.

**సంవీతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దుస్తులు ధరించునది. 2. కప్పఁబడినది. 3. అలంకరింపఁబడినది. 4. పరివేష్టింపఁబడినది. చుట్టుకొనఁబడినది.

**సంవృక్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మ్రింగఁబడినది. 2. నాశనము చేయఁబడినది.

**సంవృతము**[1] సం. విశే. (అ. ఆ. అ.) 1. కప్పఁ బడినది. 2. దాఁచబడినది. 3. రహస్యమైనది, గూఢమైనది. 4. విరమించినది. 5. మునుఁచుకొనునది. 6. ప్రభువు స్వాధీనము చేసికొన్నది. జప్తి చేయఁబడినది. 7. చుట్టుకొనఁబడినది, ఆవరింపఁబడినది. 8. నిండినది. 9. అనుసరింపఁబడినది.

**సంవృతము**[2] సం. వి. అ. న. 1. నిర్జన ప్రదేశము, ఏకాంతస్థలము. 2. (వ్యాక.) వర్ణోచ్చారణ మందలి ప్రయత్న విశేషము (సంవార ప్రయత్నము).

**సంవృతమంత్రుఁడు** సం. విశే. అ. తన ఆలోచనలను లేక ఉద్దేశ్యములను గూఢముగా నుంచువాఁడు.

**సంవృతి** సం. వి. ఇ. స్త్రీ. 2. కప్పుట, ఆచ్ఛాదించుట. 2. దాఁగుట. 3. రహస్యమైన యుద్దేశము.

**సంవృత్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. జరిగినది, సంభవించినది. 2. నెఱవేఱినది, సఫలమైనది. 3. ప్రోఁగు చేయఁబడినది. 4. కడచినది. గతించినది. 5. కప్పఁబడినది. 6. అమర్పఁబడినది.

**సంవృత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. సంభవించుట. జరుగుట. 2. నెఱవేరుట.

**సంవృత్తుఁడు** సం. వి. అ. పుం. వరుణుఁడు.

**సంవృద్ధము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెరిఁగినది,

వృద్ధి పొందినది. 2. ఎత్తైనది. 3. పెంపొందినది. 4. వికసించినది.

సంవృద్ధి సం. వి. ఇ. స్త్రీ. 1. సమగ్రమైన పెరుగుదల. 2. శక్తి, బలము.

సంవేగము సం. వి. అ. పుం. 1. భయహర్షాదులచేఁ గలిగిన త్వర, సంభ్రమము. 2. తీవ్రవేగము, మిక్కిలివడి, 4. మిక్కుటమగు బాధ.

సంవేదన సం. వి. ఆ. స్త్రీ. 1. సంవేదము, 2. అనుభవము.

సంవేదనము సం. వి. అ. న. సంవేదన.

సంవేదము సం వి. అ. పుం. 1. జ్ఞానము, ఎఱుక. 2. సుఖ దుఃఖాద్యనుభవము.

సంవేశనము సం. వి. అ. న. 1. రతి, సురతము. 2 నిద్రకేగుట. 3. ఆసనము.

సీ. నగర సంవేశనావందకళయు. శృం. నై. 7. 24.

సంవేశము సం. వి. అ. పుం. 1. నిద్ర, 2. ఆసనము, పీఠము. 3. రతి, సురతము, రతిబంధవిశేషము. 4. స్వప్నము. 5. నిద్రించుగది.

సంవేశించు సం. అ. క్రి. నిద్రించు.

శా....."చాల్, చాలుం బో"మ్మని యల్కమాఱు మొగమై చంద్రాస్య నిద్రించె న, వ్వేళన్ కాంత మహార్ణవం బనఁగ సంవేశించె నమ్మౌనియున్. అహల్యాసం. 3. 68.

సంవేశిని సం. వి. ఈ. స్త్రీ. మొగసాల.

సంవేల్లితము సం. విశే. (అ. ఆ అ.) 1. సంవర్ధితము. 2. బాగుగాఁ గదలింపఁబడినది.

సంవ్యవహారము సం. వి. అ. పుం. 1. విహితకృత్యము పని. 2. వాణిజ్యము, బేహారము.

సంవ్యానము సం. వి. అ. న. 1. కప్పు, ఆచ్ఛాదనము, 2. వస్త్రము, బట్ట. ఉత్తరీయము, పైబట్ట.

సంవ్యూహము సం. వి. అ. పుం. 1. కూడిక. 2. ఏర్పాటు.

సంశప్తకుఁడు సం. వి. అ. పుం. 1. యుద్ధము నుండి వెనుకకు మరలనని ప్రతిజ్ఞ చేసినట్టియు, నితరులను యుద్ధము నుండి పాఱిపోకుండఁ జేసినట్టియు యోధుఁడు. ప్రతిజ్ఞ చేసి యుద్ధమునుండి మరలని యోధుఁడు అని వాచ. 2. ఎన్నుకొనఁ బడిన శూరుఁడు. 3. సహాయోధుఁడు, కూడి యుద్ధము చేయు యోధుఁడు, 4. ఒకని జంపెదనని ప్రతిజ్ఞ చేసి కుట్ర పన్నినతఁడు.

సంశబ్దనము[1] సం. వి. అ. న. 1. ధ్వని చేయుట 2. స్తుతించుట, పొగడుట. 3 పిలుచుట. 4. ఉదాహరించుట.

సంశబ్దనము[2] సం. వి. అ. పుం. సంశబ్దనము.

సంశమనము సం వి. అ న. 1. ఉపశమింపఁ జేయుట. 2. శమనకరమైన మందు.

సంశమము సం వి. అ. పుం. సౌఖ్యము.

సంశయము సం .వి. అ. పుం 1. సందేహము, నిశ్చయము లేమి.

ఉ. ఆ వసుధాధినాథుని ... ముంచెఁ దాఁ ద్రిలోకీ విజయార్జితంబు లగు కీర్తిభరంబులు సంశయాంబుధిన్. శృం. నై. 1. 81.

2. (న్యాయ) ఇరుతెఱఁగులయిన యథార్థజ్ఞానము లలో నొకటి, ఒక్క ధర్మియందు విరుద్ధధర్మద్వయ ముండుటచేఁ గలిగిన నిశ్చయాభావము. 3. అనుమానము, ఊహ. 4 అపాయము. 5. సంభావ్యత.

సంశయచ్ఛేది సం విశే. న. సందేహము తొలగించునది

సంశయాక్షేపము సం వి. అ. పుం. ఒక అలంకారము.

సంశయాత్ముఁడు సం. విశే. న్. (పుం. లిం.) అనుమానించు హృదయము కలవాఁడు. (స్త్రీ. లిం. సంశయాత్మ) న. లిం. సంశయాత్మము.

సంశయానుఁడు సం. విశే (అ. ఆ అ.) సంశయించువాఁడు.

సంశయాపన్నుఁడు సం. విశే (అ. ఆ. అ. ) 1.సందేహమును బొందినవాఁడు. అనుమానపడినవాడు.

సంశయాళు(లు)వు సం. విశే. ఉ. సంశయించువాఁడు, సంశయానుఁడు.

సంశయించు సం. అ. క్రి. సందేహించు.

ఆ. శిశువు మంట నెద్దుశేయుచుఁ జెఱుచుచు, వాడు నట్లపోలెనఖలభూతసృష్టిఁ దాన చేయుఁ జెఱుచు నప్పఁమాత్మ యిదె నిజంబు సంశయింపవలదు. వరాహ. 2. 19.

ఉ. ఒక్కటి సంశయిం చడుగనొల్లక యొక్కటి గూడఁబోక యే,దొక్కటియైనఁ గోరి. ప్రబోధచం. 5. 12.

**సంశయిత** సం. విశ. (బు. త్రి. బు.) సందేహపడుఁ వాఁడు, సంశయించువాఁడు.

**సంశయితము** సం విశ. (అ. ఆ. అ.) 1. అనిశ్చితమైనది. 2. సందేహింపఁబడినది. 3. సందేహాస్పదమైనది. 4. అపాయము గలది, అపాయమొందినది.

**సంశరణము** సం. వి. అ. న. 1. యుద్ధారంభము 2. శరణము పొందుట.

**సంశితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. వాఁడియైనది, వాఁడిపెట్టఁబడినది. 2. నిశ్చయింపఁబడినది. 3. పనియందు నేర్పుగలది.

**సంశితవ్రతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) వ్రతిన నెఱవేర్చినవాఁడు.

**సంశితాత్ముఁడు** సం. విశ. న్. (అ. పుం.) 1. నియమితమనస్కుఁడు. 2. సన్మార్గము నందేకాగ్రమైన మనస్సు గలవాఁడు. (స్త్రీ. లిం. సంశితాత్మ, న. లిం సంశితాత్మము.)

**సంశితి** సం. వి. ఇ. స్త్రీ. 1. సందేహము, సంశయము.

**సంశీలనము** సం. వి. అ. న. సక్రమమైన అభ్యాసము.

**సంశుద్ధము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పరిశుభ్రమైనది, శుద్ధమైనది, నిష్కల్మషమైనది. 3. ప్రాయశ్చిత్తముచేఁ బరిహారము కలుగఁ జేయఁబడినది. 4. ఋణమునుండి గాని, దోషము నుండి గాని విముక్తి నొందినది. 5. పరిశీలింపఁ బడినది. 6. పరీక్షింపఁబడినది.

**సంశుద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. పాత్రములు మున్నగు వానిని శుద్ధిచేయుట.

గీ. పాత్రసంశుద్ధి కాజ్యంబు వస్తరించి యూరకుండిరి. భీమ. 2. 135.

2. దేహాదులను శుభ్రపఱుచుట.

గీ. ... స్నానమాచరింప సంశుద్ధియగు విజ్ఞా. కాం. 1. 56.

3. తప్పుదిద్దుట. 4. (అప్పు) పూర్తిగాఁ దీర్చివేయుట 5. పరిశుద్ధి, నైర్మల్యము.

**సంశూనము** సం. విశ. (అ. ఆ. అ.) ఉబ్బినది, వాచినది, క్రొవ్వినది.

**సంశోధనము** సం. వి. అ. న. 1. పాత్రాదులను శుద్ధి చేయుట. 2. దేహము మున్నగు వానిని శుభ్రపఱుచుట. 3. అప్పు తీర్చివేయుట.

**సంశోధించే** సం. స. క్రి. పరిశీలించు. విచారమొనర్చు.

సీ. కళవల్లిఁ జింతించుఁ గళము సంశోధించుఁ బ్రాణోపనిషదభిప్రాయ మరయు. కాశీ. 2. 161

**సంశోభిల్లు** సం. అ. క్రి. ప్రకాశించు; ఒప్పు.

శా. జంభధ్వంసి వరంబున న్గనిన యస్త్రంబు న్మహాసారమున్, కుంభద్విక్రమ బాహుదర్పములు సంశోభిల్ల జేసెన్. హర. 7. 174.

మ. .... మహా, సురయోధాన్వితమైన యానమున సంశోభిల్లెఁ బూర్ణేందు సుస్థిరకాంతిన్ బలి చామర ధ్వజచమూదీప్త స్థితిన్ ముందటన్. భాగ. 8. 330

**సంశ్చుత్తు** సం. వి. త్. న. 1. యుక్తి. 2. ఇంద్రజాలము. 3. భ్రాంతి. (పుం.) గారడివాఁడు.

**సంశ్యానము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ముడుఁచుకొనినది, సంకుచితము, 2. పేరుకొనినది, గడ్డకట్టినది. 3. దొర్లినది. 4. ఎండినది, శుష్కించినది.

**సంశ్రయణము** సం. వి. అ. న. ఆసక్తి.

**సంశ్రయము** సం. వి. అ పుం. 1. ఆశ్రయము, అండ. ఉనికిపట్టు 2. ఆశ్రయించుట, రక్షణము నపేక్షించుట. 3. శరణము, రక్షణ స్థానము. 4. ఆసక్తి. 5. అంశము.

**సంశ్రయించే** సం. స. క్రి. ఆశ్రయించు, సేవించు.

తే. ...మహాతత్త్వకలితు, సంశ్రయింతు మహాత్మ ప్రవర్తిఁ గోరి. భార. శాం. 4. 22.

గీ. సర్గ సంసారరూపిని సం[శ్రయింతు, నఖిలపుణ్యమే శ్వరేశ్వరు నఖిలపింతు. భీమ. 3. 204.

సం[శ్రవణము సం. వి. అ. న. 1. చక్కఁగా వినుట. 2. చెవి.

సం[శ్రవము[1] సం.వి.అ.పుం. బాగుగా వినుట, [శ్రద్ధతో వినుట. 2. ఒడంబడిక, అంగీకారము. వాగ్దానము.

సం[శ్రవము[2] సం. వి. అ. న. [ప్రఖ్యాతి.

సం[శ్రితుఁడు సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆ[శ్రయించిన వాఁడు, అండ చేరినవాఁడు. 2. రక్షింపఁబడిన వాఁడు. 3. కలసినవాఁడు. 4. ఆ[శ్రయించిన వాఁడు. వి. అ. పుం. ఆ[శ్రితుఁడు, సేవకుఁడు.

సం[శ్రుతము సం. విశే. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁ బడినది, ఒప్పుకొనఁబడినది. 2. బాగుగా వినఁబడినది.

సంశ్లాఘించు సం. వ. [క్రి. [ప్రశంసించు, మెచ్చు.

మ. ... ఏ, జను లేతత్కథ సర్వకాలముల సంశ్లాఘింతు రవ్వారికిన్.

కం. వెలవాళ్ళలోనఁ జేసిన, కలుషము దొలగంగ వరము గరుణింపుఁడు, వరాహ. 12. 39.

సంశ్లిష్టము[1] సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁగాఁ గలిసికొన్నది. 2. కౌఁగిలింపఁబడినది. 3. చేర్పఁ బడినది, తగిలింపఁ బడినది. 4. సంపన్నమైనది, కలిగి యున్నది. 5. సంబద్ధమైనది, చక్కఁగాఁ గట్టఁబడి నది. సంబంధించినది.

సంశ్లిష్టము[2] సం.వి.అ.న. ఒక విధమైన మండపము

సంశ్లిష్టము[3] సం. వి. అ. పుం. రాశి, గుంపు.

సంశ్లేషణ సం. వి. ఆ. స్త్రీ. 1. దగ్గఱఁగా పదుముట. 2. కలిసికట్టు సాధనము, 3. బంధము, కట్టు.

సంశ్లేషణము సం. వి. అ. న. సంశ్లేషణ.

సంశ్లేషము సం. వి. అ. పుం. 1. కౌగిలింత, ఆలింగ నము,

మ. జవరా లోర్తు [ప్రియోపనాయక భుజాసంశ్లేష లీలాసుఖ, వ్యవసాయంబు సమాజ సంకటముసం [ప్రార్థించి కైకొంచు. శృం. నైష. 6. 84.

2. కలయిక, సంబంధము. 3. (వ్యాక.) మీఁది హల్లుఁతోఁ గూడికొనుట.

సంశ్లేషించు సం. వ. [క్రి. కౌఁగిలించు.

మ. కృతకృత్యుండవు నీ[ప్రతాపజనకీర్తి స్ఫూర్తిఁ గీర్తింపఁగాఁ, జతురాస్యుండును నోపఁ డన్య జనతా సాధ్య[క్రియల్ నీవుచే, నితి గావన్ [బతిగాన నైన నిదె సంశ్లేషింతుఁ బాటింపుమా, [ప్రతికారంబుగ నంచుఁ గౌఁగిటను సంభావించె వాయ్వర్భకున్. సమీర. 3. 131.

సంశ్లోకించు సం. వ. [క్రి. కీర్తించు, పొగడు.

శా. నీ కోడం[డును నీ కుమారవరులుల్ నీనాథు డున్ నీవు నం, శ్లోకింపన్ సతులుం బతుల్ మిగుల సమ్మోదింప రా[త్రించరుల్ శోకింపం భవదీయ గర్భమునఁ దేజోమూర్తి జన్మించెదన్, నాకున్ వేడుక పుట్టె నీసుతుఁడనై వర్తించి వర్తింపఁగాన్. భాగవ. 8. 486.

సంసక్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. మిశ్రితమైనది, కలసియున్నది. 2. లగ్నమైనది, తగులుకొన్నది. 3. అవ్యవహితమైనది, దగ్గఱగా నున్నది. 4. అంత టను వ్యాపించినది. 5. ఏకా[గ్రమైనది. 6. సంప న్నము, కలిగియున్నది, 7. కట్టఁబడినది. లౌకిక సుఖ తత్పరమైనది.

సంసక్తి సం. వి. ఇ. స్త్రీ. 1. కలసియుండుట. అంత రంగిక స్నేహము, మై[త్రి. 2. సామీప్యము. 3. పరి చయము, చేసవు. 4. బంధించుట, కూర్చుట, 5. ఆసక్తి, తత్పరత.

సీ. .... శారీరసౌఖ్య సంసక్తి వదలి. భార శాంతి. 1. 85.

సంసత్తు సం. వి. త్. స్త్రీ. 1. సభ. 2 న్యాయసభ, 3. కొలువుకూటము, 4. సమూహము

సంసదనము సం. వి. అ. న. [కుంగఁబడుట.

సంసరణము సం. వి. అ న. 1. ముందుకుఁ బోవుట. 2. బాట. 3. [ప్రపంచము; [ప్రాపంచిక జీవితము, జనన మరణ [ప్రవాహ రూప సంసారము. 4. నిరా టంకముగా సేనలు వెడలుట. 5. యుద్ధారంభము. 6. రాజమార్గము, ఘంటాపథము. 7. పురద్వార

సమీపమున మార్గస్థులు విశ్రమించు స్థలము. 8. సంగతి, కూడుట (వాచ.) 9. గవను.

**సంసరించే** సం. అ. క్రి. సంసారమునఁ బ్రవర్తించు, జనన మరణ ప్రవాహము నొందు.

వ. విశేషంబుల నెల్లజీవులం దత్తత్కర్మానుగుణంబుగా సంసరింపం జేయుచు లీలాప్రవృత్తుం డయ్యె నీశ్వరుండు. కవిక. 5. 141.

వ. సనందనాదులును బ్రాగ్భవస్థ కల్పంబుల సంసరించుట భావనాబద్ధులై. ఆము. 3. 79.

**సంసర్గము** సం. వి. అ. పుం. 1. కలుపుట, మిశ్రము చేయుట. 2. సహవాసము.

శా. చేసెం గావలయున్ విరించి నిఖిల స్త్రీ పుంస సంయోజనా, భ్యాసప్రౌఢి ప్రకాశ మొందఁ గడు లియ్యంబైన సంసర్గము. శృం. నై. 6. 75.

3. స్పర్శము. 4. చేనవు, పరిచయము. 5. మరతము, పొందు. 6. సహస్థితి. 7. సన్నిహిత సంబంధము కలిగియుండుట. 8. రోగకారణమైన త్రిదోషములలో రెండింటి కలయిక. 9. గ్రహములకూడిక.

**సంసర్గదోషము** సం. వి. అ. పుం. దుష్టుల సహవాసము వలనఁ గలుగు కీడు.

**సంసర్గవిద్య** సం. వి. ఆ. స్త్రీ. సాంఘికశాస్త్రము.

**సంసర్గి¹** సం. విశే. (న్. జీ. న్.) 1. సంసర్గము కలవాఁడు, సహవాసి, సహవాసము గలవాఁడు. 2. సంబంధము గలవాఁడు. 3. పరిచయము గలవాఁడు, చేనవు గలవాఁడు. వి. న్. పుం. సహవాసి, సహచరుఁడు, తోడివాఁడు.

**సంసర్గి²** సం. వి. ఈ. స్త్రీ. (వైద్య.) సంశోధనాని, సహచరుఁడు, శుద్ధిచేయుట.

**సంసర్జనము** సం. వి. అ. న. 1. మిశ్రము చేయుట; కలుపుట 2. విడిచిపెట్టుట, వదలుట. 3. పైకిఁ ద్రోసివేయుట. 4. ఆకర్షించుట.

**సంసర్పణము** సం. వి. అ. న. 1. ప్రాఁకుట. 2. ఆకస్మికముగాఁ బైకివచ్చుట.

**సంసర్పము** సం. వి. అ. పుం. 1. ప్రాఁకుట. 2. క్షయమాసముతోఁ గూడిన సంవత్సరమున వచ్చు నధిక మాసము.

**సంసర్పి** సం. విశే. (న్. జీ. న్.) ప్రాఁకునది.

**సంసాదము** సం. వి. అ. పుం. సభ.

**సంసారగురువు** సం. వి. ఉ. పుం. 1. మన్మథుఁడు. 2. లోకాచార్యుడు, లోకగురువు.

**సంసారచక్రము** సం. వి. అ. న. జనన మరణముల పరంపర.

**సంసారమార్గము** సం. వి. అ. పుం. 1. లోక వ్యవహారపు పద్ధతి. 2. యోనిద్వారము.

**సంసారము** సం. వి. అ. పుం. 1. పద్ధతి, మార్గము. 2. ప్రపంచజీవయాత్ర. 3. జనన మరణ ప్రవాహము. 4. ప్రపంచ సంబంధమైన భ్రాంతి, ప్రాపంచిక వ్యామోహము. 5, గార్హస్థ్యము, 5. కాపురము (ఈ యర్థము తెలుఁగు గ్రంథము లందే కలదు.). శుక. 1. 277.

**సంసారమోక్షణము** సం. వి. అ. న. జన్మ పరంపర నుండి విడుదల, ముక్తి.

**సంసారమోక్షము** సం. వి. అ. పుం. సంసార మోక్షణము.

**సంసారి¹** సం. విశే. (న్. జీ. న్.) 1. ప్రపంచ సంబంధమైనది.

**సంసారి²** సం. వి. న్. పుం. 1. ప్రాణి, జంతువు. 2. జీవాత్మ. 3. గృహస్థు.

**సంసిద్ధము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పూర్తిగా నెఱవేఱినది. 2. స్వభావసిద్ధము. 3. నేర్పుగలది. 4. అమోదింపఁ బడినది.

గీ. ఆదిమం బైన బ్రహ్మచర్యాశ్రమంబు, వేద సంసిద్ధ మెఱిఁగింతు వినుఁడు తెలియ. సూత. ఆ. 2. పు. 112.

**సంసిద్ధి** సం. వి. ఇ. స్త్రీ 1. సంపూర్తి; పూర్తిగా నెఱవేఱుట. 2. ముక్తి, మోక్షము. 3. స్వభావము. నైసర్గిక స్థితి, 4. సులభముగాఁ గోపము వచ్చెడి స్త్రీ, మత్తురాలు. 5. ఫలితము. 6. తుదినిర్ణయము.

**సంసిద్ధుఁడు** సం. వి. అ. పుం. 1. ముక్తిపొందిన

వాఁడు 2. సిద్ధపడినవాఁడు.

సంసూచనము. సం. వి. అ. న. 1. స్పష్టముగాఁ జూపించుట, ఋజువుచేయుట. 2. తెలియఁజఱుచుట. 3. సూచించుట, సూక్ష్మముగాఁ దెలుపుట, దూషించుట, దూఱుట.

సంసూచించు. సం. వ. క్రి. జాడగాఁ దెలియఁజేయు

మ. అట మున్నెక్కడు కేలికైలమును వధ్యారోహణం బాచరించుటకై వెచ్చెలికత్తియల్ నగుచు స సూచించినన్ గాంత యొ,క్కటసంతోషమునొందు. కాశీ. 4. 212.

సంసృతి సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రవాహము. 2. లోకయాత్ర. ప్రపంచ జీవనము 3. జననమరణ ప్రవాహము, సంసారము.

సంసృష్టత (త్వము) అ న. సం. వి. అ. స్త్రీ. 1. సంబంధము, కలయిక. 2. జ్ఞాతులు విభక్తులైన తర్వాతమరల మైత్రితో గలసియుండుట.

సంసృష్టము సం. విశే. (అ. ఆ. అ.) 1. మిశ్రము, కలసినది. 2. కూర్పఁబడినది. 3. చుట్టుకొనినది. 4. సృజింపఁబడినది. 5. మంచివేషము వేసినది.

6. సంసర్గము నందినది 7. వస్త్రము లోనగు వాని శోధింపఁబడినది.

సంసృష్టి[1] సం. వి. ఇ. స్త్రీ. 1. కలయిక, కూడిక. 2.సాంగత్యము, భాగస్థుఁడగుట. 3 ఏకకుటుంబముగానుండుట. 4. సమూహము. గుంపు 5. సభగాఁ జేరుట; సమావేశమగుట. 6. (అలం.) ఒక పద్యమున లేక గద్యభాగమునఁ బరస్పరాపేక్ష లేక యనేక శబ్దార్థాలంకారములు తిలతండుల న్యాయమున నుండుట.

సంసృష్టి[2] సం వి న్. పుం. 1. మొదట విభక్తుఁడై మరలఁగలసిన జ్ఞాతి. 2. భాగస్థుఁడు, భాగస్వామి.

సంసృష్టుఁడు సం విశే. (అ ఆ అ.) 1. భాగస్వామిగాఁ గలసినవాఁడు.

సంసేవించు సం. వం. క్రి. కొలుచు, ఉపాసించు.

మ. శివుఁ గాశీపతి విశ్వనాయకుని సంసేవించి యప్పార్వతీ, ధవు నాజ్ఞ న్గ్రహచక్రవాళమున కూర్ధ్వంబైన లోకంబునన్, ధ్రువ వర్తింపు మనేక కాలమనుచున్ బోధించి యేఁగన్. కాశీ. 4. 285.

2. మద్యాదులను త్రాగుట.

సంసేవ సం, వి. అ. స్త్రీ. 1. తఱచుగా దర్శించుట. 2. మద్యాదుల యుపయోగము, 3. కొలువు. 4. ఉపాసన. 5. పూజ,

సంస్కరణము సం. వి. అ. న. 1. సిద్ధము చేయుట. 2. శవదహనము చేయుట.

సంస్కరించు సం. వి. న. క్రి. 1. చక్కఁజేయు.

సీ. పూజోపకరణపాత్రీజాత మఖిలంబు సంస్కరించిరి భస్మసలిల బుద్ధి. శివరా. 4. 36.

2. (శవమును) దహనము చేయు.

వ. గంధర్వరాజనందన నలంకరించి యుచిత ప్రకారంబునం బురంబు వెలువడంగొని చని సంస్కరించి కృతస్నానుండై కొడుకునకుఁ గోడలికి నుదకకర్మంబు లాచరించి. మార్కం. 3. 34.

వ. అంత వనంతశయనుండు శిశుపాలు సంస్కరింపం బంచి వాని కొడుకుం జేదిరాజ్యంబున నభిషిక్తుం జేసె. భార. సభా. 2. 72.

3. ఉడికించు, పక్వము చేయు.

సంస్కర్త సం. వి. ఋ. పుం. 1. వండువాఁడు. 2. సిద్ధము చేయువాఁడు, 3. సంస్కరించువాఁడు, గుణాధానము చేయువాఁడు.

సంస్కారకుఁడు సం. విశే. (అ. ఆ. అ) 1. శుభ్రము చేయువాడు, పవిత్రము చేయువాఁడు.

సంస్కారము సం. వి. అ. పుం. 1. చక్కఁబఱుచుట.

వ. ... విహిత మంత్రంబుల నుచితతంత్రంబుల ఋత్విక్పురోహిత సహితుండై తత్సంస్కార ప్రకారం బాచరించి. 4. 157.

మెఱుఁగు పెట్టుట. 2. (పదవాక్యాదుల) వ్యాకరణ శుద్ధి. 3. శిక్ష, విద్యనేర్పుట, మంచిగుణము లలవఱుచుట. 5. సిద్ధ పఱుచుట. 5. వండుట. 6. శృంగారించుట. 7. సమర్పించుట; పవిత్ర కార్యమున కుపయోగించుట. 8. అచ్చు, చెక్కిన

రూపము, ముద్ర 9. భావము, సంకల్పము. 10. శక్తి, సవర్ధనము. 11. కర్మఫలము, కర్మవాసన. 12. ... ఇరువదినాలుగు గుణములలో నొకగుణము (ఇది భావన, వేగ, స్థితిస్థాపకము అని త్రివిధము) 13. స్మృతిశక్తి. 14. మతసంబంధమయిన కర్మము. గర్భాధానాదులు (ఇవి పదునాఱని కొందఱు, పదియాఱని కొందఱు).

కం. క్షత్రియసంస్కారమునకుఁ, బాత్రముగా నీవు నన్నుఁ బాటింప విప్రామిత్రఫలములకు నీకేఁ, బుత్రుఁడనని వచ్చు టింకఁ బొసఁగునె చెపుమా. భార. ఉద్యో. 4. 62.

వ. గర్భాధానంబాదిగాఁ బదాఱు కర్మంబులు...

కం. ఆదట గర్భాధానం, బాదిగ సంస్కారములు పదాఱునువరుసన్, భూదేవవంశజులు సమ్మోదముతో మంత్రపూతముగఁ జేయఁ దగున్. విజ్ఞా. ఆ. కాం. 1. 11. 12.

15. పవిత్రము చేయుట. 16. ఉపనయనము. 17. వేదోక్తకర్మము. 18. అపరకర్మము, ఉత్తరక్రియ. 19. సానపట్టుబాయి.

సంస్కృతము[1] సం. విశే. (అ. ఆ. అ.) 1. సంస్కరింపబడినది, చక్కఁజేయఁబడినది, మెఱుఁగుపెట్టఁబడినది, శ్రద్ధతో నేర్పఱుపఁబడినది. 3. వండఁబడినది, సిద్ధము చేయఁబడినది. 4. పవిత్రప్రయోజనమునకు సమర్పింపఁబడినది 5. శుద్ధిచేయఁబడినది. 6. అలంకరింపఁబడినది. 7. ఉత్తమమైనది.

సంస్కృతము[2] సం. వి. అ. పుం. 1. వ్యాకరణశుద్ధపదము, సాధుపదము.

సంస్కృతము[3] సం. వి. అ. న. 1. శుద్ధమైన భాష. గీర్వాణభాష.

సీ. అలవిద్య యనవద్యయై యొప్పు నావిద్య సంస్కృత ప్రాకృతసరణినైన, దేశభాషలనైన దేశికుం డుపదేశ మొసగంగఁదగు శిష్యవిసరము లకు...శివధర్మోత్తరము. 2. 6.

2. శిష్టాచారము, సదాచారము. 3. హోమద్రవ్యము, హవిస్సు.

సంస్కృతి సం. వి. ఇ. స్త్రీ. సంస్కారము.

ఉ. కావున వేగ మగ్నియును గాత్రములున్ సమకూర్చి సద్విధి, శ్రీ విలసిల్లఁ గృష్ణుని శరీరము సంస్కృతిఁ గూర్చి క్రమ్మఱం, బోవుట బుద్ధి యంచు...భార. మౌసల. 171.

2. నాగరికత.

సంస్కృతుఁడు[1] సం. విశే. (అ. ఆ. అ.) గృహస్థధర్మమునఁ బ్రవేశించినవాఁడు, పెండ్లాడినవాఁడు.

సంస్కృతుఁడు[2] సం. వి. అ. పుం. ఉపనయనాది సంస్కారములచే సంస్కరింపఁబడిన ద్విజుఁడు. 2. విద్వాంసుఁడు, పండితుఁడు

సంస్క్రియ సం. వి. ఆ. స్త్రీ. 1. పవిత్రముచేయు కర్మ. 2. పవిత్రముచేయుట. 3. ఉత్తరక్రియ, శ్రాద్ధకర్మ.

సంస్తంభనము సం. వి. అ. న. 1. రోగనిరోధనక్రియ. 2. ఆఁపుట, నిలుపుట.

సంస్తంభము సం. వి. అ. పుం. 1. ప్రాపు, ఆశ్రయము, ఆధారము. 2. స్థిరపఱుచుట, బలపఱుచుట. 3. ఆఁపుట, నిలుపుట. 4. మ్రాన్పడుట, కొయ్యబాఱుట. 5. మొండితనము.

సంస్తంభించు సం. స. క్రి. మ్రానుపడఁజేయు, కదలకుండనిలుపు.

ఈ గరళాగ్నిఁ గంధరా, ఘట్టమునందు నిల్పుము (68) వ. అనుటయు (69) శా. శంభుం డంబికపల్కు గైకొని జగత్సంరక్షణార్థంబు సం, స్తంభించె న్నిజకంఠగోళమున...కాకోలమున్ (70). భీమ. 4. 68-70.

సంస్తబ్ధము సం. విశే. (అ. ఆ. అ.) 1. నిలుపఁబడినది. 2. స్థిరపఱుపఁబడినది. 3. ధీరమైనది. 4. నిశ్చలమైనది. 5. కొయ్యబాఱినది. 6. బలపఱుపఁబడినది.

సంస్తరము సం. వి. అ. పుం. 1. శయ్య, చిగురుటాకులసెజ్జ. 2. యాగము. 3. వ్యాప్తి, ప్రచారము.

సంస్తవము సం. వి. అ. పుం. 1. స్తోత్రము, పొగడ్త. 2. పరిచయము. 3. అనుకూల్యము. 4. సామరస్యము.

సంస్తవప్రీతి నం. వి. ఇ. స్త్రీ. పరిచయమువల్లఁ గలిగిన ప్రేమ.

సంస్తారము నం. వి. అ. పుం. 1. పఱచుట, విస్తరింపఁజేయుట. 2. శయ్య, పఱుపు.

సంస్తావనము నం. వి. అ. న. 1. సంతోషము, ఉల్లాసము. 2. స్తోత్రముచేయుట.

సంస్తావనుఁడు[1] నం. విశే. (అ. ఆ. అ.) 3. బాగుగా స్తోత్రము చేయువాఁడు, వాగ్ధాటిగలవాఁడు.

సంస్తావనుఁడు[2] నం. వి. అ. పుం. 1. ఉద్గాత. సామగానము చేయువాఁడు. 2. ఋత్విజుఁడు.

సంస్తావము నం. వి. అ. పుం. 1. పొగడ్త. 2. కలిసి గానముచేయుట. 3. యజ్ఞమున సామగానము చేసెడి ఋత్విక్కులు కూర్చుండెడి స్థలము.

సంస్తీర్ణము నం. విశే. (అ. ఆ. అ.) 1. విరజిమ్మఁబడినది. 2. పఱచఁబడినది.

సంస్తుతము నం. విశే. (అ.ఆ.అ.) 1. పొగడఁబడినది. స్తుతింపఁబడినది.

సీ గీ. ... మునిసమాజ, సంస్తుతముగ రథంతర సామ శక్తిఁజేసి యమ్మూర్ధపుదేర్చి వసిష్ఠుఁ డతని...భార. శాంతి. 5. 423.

2. కలిసి స్తుతింపఁబడినది. 3. పరిచయముగలది, చేవవుగలది. 4. ఉద్దేశింపఁబడినది.

సంస్తుతి నం. వి. ఇ. స్త్రీ. పొగడ్త, స్తోత్రము.

సంస్తుతి(యి)ంచు నం. స. క్రి. వినుతించు, పొగడు.

సీ. సంస్తుతించిరి బహ్వృచ ప్రపంచంబుల నొక కొంద ఱసితకంఠోపకంఠు. కాశీ. 9. 151.

వ.... అథర్వణవేదం బాధ్యాయం బొనరించు నవియును సంస్తుతియించునవియును నట్టహాసంబు నేయు నవియును నైన యా విధిశిరంబుల చేతం గ్రుచ్చిన దండ .... భీమ. 5. 8.

సంస్తుత్యము నం. విశే. (అ. ఆ. అ.) కీర్తింపఁదగినది.

సీ. సకల రాజాస్థాన సంస్తుత్యగుణ కామరెడ్డి నరేంద్ర సంరక్షితమ్ము. శివధర్మ. 1. 15.

సంస్త్యాయము నం. వి. అ పుం. 1. సమూహము, గుంపు, రాశి. 2. సామీప్యము, ప్రాంతము. 3. విస్తృతి. 4. ఇల్లు. 4. చేనవు, పరిచయము.

సంస్థ నం. వి. ఆ స్త్రీ. 1. సభ. 2. స్థితి, అవస్థ. 3. ఆకృతి. 4. పని, వ్యాపారము, జీవిక. 5. సత్ప్రవర్తనము. 6. సమాప్తి, ముగింపు 7. ఆఁపుట. 8. నాశనము, నష్టి. 9. ప్రపంచనాశము, ప్రళయము. 10. సామ్యము, పోలిక. 11. ప్రాంతమూలమైన రాజశాసనము, రాజాజ్ఞ. 12. సోమయాగములో నొక భేదము, యజ్ఞభేదము. 13. చావు. 14. స్పష్టపరచుట, కనఁబడుట. 15. ఒప్పందము. 16. శవదహనము.

సంస్థము నం. విశే. (అ. ఆ. అ.) 1. ఉండునది, నిలుచునది. 2. (సమాసాంతమున) ఉండునది, నివసించునది. 3. మచ్చికచేయఁబడినది. 4. నిశ్చలమైనది. 5. స్థిరమైనది. 6. చశించినది. 7. సమాప్తమైనది, ముగిసినది. 8. వ్యక్తమైనది, స్పష్టపడినది.

సంస్థాత నం. విశే. (ఋ. ఈ. ఋ.) చక్కఁగా నిలుచుండువాఁడు.

సంస్థానము[1] నం. వి. అ. న. 1. సమూహము, రాశి. 2. పరమాణు సంయోగము, పరమాణువుల కలయిక. 3. ఆకృతి, అవయవ సన్నివేశ విశేషము. 4. స్వరూపము. 5. ఏర్పాటు. 6. సామీప్యము. 7. నివాసస్థలము. 8. స్థితి, అవస్థ. 9. స్థలము, చోటు. 10. చతుష్పథము, నాలుగు వీథుల కూడలి. 11. చిహ్నము, గుర్తు. 12. చావు. 13. ఆస్థానము. 14. ప్రభుత్వ వ్యవహారనిర్వహణము. 15. అంశము, భాగము. 16. సౌందర్యము, శోభ.

సంస్థానము[3] నం. విశే. (అ. ఆ. అ.) స్థావరము.

సంస్థాపకము నం. విశే. (అ. ఆ. అ.) స్థాపించునది, తీర్చునది, కూర్చునది.

సంస్థాపన నం. వి. ఆ.స్త్రీ. 1. నిరోధించుట, ఆఁపుట. 2. శాంతపఱుచు సాధనము.

సంస్థాపనము నం. వి. అ న. 1. స్థాపించుట, నిలబెట్టుట. 2. నిరోధించుట, నిగ్రహించుట. 3. కలిసి యుండుట, ప్రోఁగుచేయుట. 4. చక్కఁబఱచుట, హెచ్చుతగ్గులులేకుండ సరిచేయుట. 5. నిబంధనము, శాసనము.

సంస్థాపించు నం స. క్రి. ప్రతిష్ఠించు (దేవతాదులను), స్థాపించు, (మాట, మొ.) నిలఁబెట్టు, స్థిరపఱుచు.

కం. అమృతమయుఁడైన సోముఁడు, సమయంబున నేమహేశు సంస్థాపించెన్, విమలసుధా జ్యోతిర్లిం, గము సోమేశ్వరుని గంటకంరు భజింతున్. భీమ. 3. 149.

మ. స్వమతిప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు నెవ్వేళ నెద్ది మతం బప్పుడు .... ప్రభా. 4. 62.

సంస్థాపితము సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రోఁగు చేయఁబడినది. 2. స్థాపింపఁబడినది 3. నిరోధింపఁబడినది, నిగ్రహింపఁబడినది నిలబెట్టఁబడినది.

సంస్థితము[1] సం.విశ (అ. ఆ. అ.) చక్కఁగానున్నది.

సీ. శ్రద్ధాప్రథమములు సకలధర్మంబులు శ్రద్ధయ మధ్యాంతసంస్థితంబు. శివధర్మోత్తరము. 1. 142.

2. కలసియున్నది, కూడియున్నది. 3. దగ్గఱగానున్నది, సామీప్యమున నున్నది. 4. పోలి యున్నది. ప్రోఁగుచేయఁబడి యున్నది. 6 స్థిరపడినది. 7. ఒకదానిలో నుంచఁబడినది, 8. స్థిరమైనది. 9. ముగిసినది, పూర్తియైనది. చేచ్చినది.

సంస్థితము[2] సం. వి. అ. న. స్థితి, రూపము, ఆకారము.

సంస్థితి సం వి. ఇ. స్త్రీ. 1. కూడనుండుట, కలసియుండుట, సహాస్థితి. 2. సామీప్యము. 3 నివాసము, ఉనికిపట్టు. 4. రాశి, ప్రోఁగు. 5. ఎడఁదెగకుండనుండుట, అవిచ్ఛిత్తి, విరామము లేకయుండుట. 6. స్థితి, ఉనికి, జీవనస్థితి. 7. ఆటంకము, అడ్డంకి. 8. చావు. 9. ప్రళయము, ప్రపంచ నాశము. 10. సమానస్థితి యందుండుట. 11. అధిష్ఠించుట.

సంస్థుఁడు సం. వి. అ. పుం. 1. నివాసి, కాపురముండువాఁడు, 2. పొరుగువాఁడు. 3. చారుఁడు. గూఢచారుఁడు.

సంస్పర్శ(ర్శి) సం వి. ఆ. (ఈ) స్త్రీ. కోరింద (శ. ర.).

సంస్పర్శ (న)ము సం. వి. అ. పుం. తాఁకుట, తగులుట.

ద్వి. భక్తుల పాద సందర్శనంబునను వ్యక్తిగా నిర్మలత్వంబుఁ బొందుదురు బసవపు. 3. 140.

2. సంబంధము, సాంకర్యము. 3. స్పర్శజ్ఞానము.

సంస్పర్శించు = సంస్పృశించు. సం. న. క్రి. తాఁకు.

వ.... ఐరావణ కుంభ కుంభాస్ఫాలన క్రీడకు కరంబున వాస్తోష్పతి తన్ను సంస్పృశించి గౌరవించిన మన్మథుండు.... హా. 3. ...

సంస్పృశించు - స్పృశించు. సం. న. క్రి. 1. తాఁకు.

చం.... ఇదేమి ఖగేంద్ర యమ శ్రీహరి దన హస్తపద్మమున నాతని హస్తము సంస్పృశించి యా, తురత హరించి. ఉ. రా. ...

2. చల్లు. 3. తాఁకించు 4. పుక్కిలించు. 5. సందర్శించు.

సంస్పృష్టము సం. విశ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా స్పృశింపఁబడినది. 2. మిశ్రము, కలిసినది. 3. కలుషితమైనది.

సంస్ఫాలము సం వి. అ. పుం. 1. గొఱ్ఱెపోతు. పొట్టేలు. 2. మేఘము.

సంస్ఫుటము సం. విశ. (అ. ఆ. అ.) వికసించినది.

సంస్ఫేటము సం. వి. అ. పుం యుద్ధము.

సంస్ఫోటము సం. వి. అ. పుం. యుద్ధము.

సంస్ఫోటి సం. వి. ఇ. పుం. యుద్ధము.

సంస్మరణము సం వి. అ. న. చక్కఁగా జ్ఞప్తికిఁదెచ్చుకొనుట.

వ. తన పూర్వజన్మ వర్తనంబును దజ్జన్మనిమిత్తంబైన తత్పూర్వ వర్తనంబును సంస్మరణ సంబంధ పరంపరా వశంబున సమస్తంబును గరతలామలకంబుగా నాకలించి ....కళా. 5. 10.

సంస్మరించు సం. న. క్రి. తలఁచు.

సీ. సంశ్రమోద్రమముల విశ్వాసపాత్రంబుల, సౌవిదల్లుల నర్థిసంస్మరించు...కాశీ. 2. 14.

సంస్మారణము సం. వి. అ. న లెక్కించుట. (పశువులు, మొ.)

సంస్మృతి సం. వి. ఇ. స్త్రీ. సంస్మరణము.

సంస్ర (స్రా)వము సం. వి అ. పుం. 1. స్రవించుట, కాఱుట. 2. ప్రవాహము బలివిశేషము. 4. బలిశేషము.

సంహతజానువు సం విశ (ఉ) దగ్గఱగా నున్న మోకాళ్ళు గలవాడు, ముడిగాళ్ళవాఁడు,

**సంహతభ్రువు** సం. విఙ. (ఈ) ఒండొంటిఁగలిసిన కనుబొమ్మలు గలవాఁడు, ముడిపడిన కనుబొమ్మలు గలవాఁడు.

**సంహతము** సం. విఙ. (అ. ఆ. అ.) 1. దృఢమైన కీళ్ళుగలది. 2. కొట్టఁబడినది. 3. మూయఁబడినది. 4. చేర్పఁబడినది. 5. దగ్గఱగాఁగూడి యున్నది, కలసియున్నది, కలసినది. 6. ఐకమత్యము గలది. 7. దట్టమైనది. 8. గుంపుగా నున్నది. ప్రోఁగు పడినది.

**సంహతలము** సం. వి. అ. పుం. ప్రేళ్ళు ముక్కుటకు చాచి కూర్చిన చేదోయి. (శ. ర.) (సంఘతలము.)

**సంహతి** సం. వి. ఇ. స్త్రీ. 1. దృఢసంబంధము. 2. కూడిక, ఏకీభావము. 3. దట్టమగుట, సాంద్రత. 4. స్థౌల్యము, లావు. 5. అనుకూల్యము. 6. సమూహము, ప్రోఁగు.

సీ.... ప్రద్యుమ్ను వతుద్ర, శల్లసంహతి మూఁచ్ఛాలు చేసె. చిత్రభా. 7. 122.

7. బలము. 8. శరీరము. 9. మిక్కిలి హింసించుట, చంపుట. 10. గట్టిపడుట, వాచుట. 11. కుట్టుట, అతుకుట.

**సంహననము** సం. వి. అ. న. 1. దట్టముగానుండుట, సాంద్రత. 2. శరీరము. 3. బలము 4. అవయవముల రాపిడి. 5. చంపుట, హననము. 6. సముదాయము, మొత్తము. 7. సంబంధము.

**సంహననీయము** సం. విఙ. (అ. ఆ. అ.) సాంద్రమైనది, ఘనమైనది.

**సంహరణము** సం. వి. అ. న. 1 ప్రోఁగుచేయుట. 2. పట్టుకొనుట. 3. ముడుఁచుకొనుట, సంకుచితమగుట. 4. ఆఁపుట, నిలుపుట. 5. నశింపఁజేయుట, సంహరించుట. 6 వెనుదీయుట, మానుకొనుట.

**సంహరించు** సం. స క్రి. 1. చంపు.

వ.... ధరణి ధరియించి హిరణ్యాక్షు సంహరించి .... మార్క. 1. 116.

2. దగ్గఱకుఁ దెచ్చు. 3. క్షిప్తముచేయు, సంకుచితముచేయు. 4. నిగ్రహించు, నిరోధించు.

ఉ. కోపము సంహరింపు మునికుంజర .... భీమ. 2. 106.

5. ముగించు. 6. పట్టుకొను, గ్రహించు. 7. పెడత్రోవ పట్టించు, అవిశీలి పఱచు.

**సంహర్త** సం. విఙ. (ఋ లీ ఋ.) నశింపఁజేయువాఁడు.

**సంహర్షణము** సం. వి. అ న. 1. అనుకరణము. 2. స్పర్ధ. 3. ఆనందము.

**సంహర్షము** సం వి. అ. పుం. 1. రోమాంచము, గగుర్పాటు. 2 ఆనందము, సంతోషము. 3. స్పర్ధ, అనుకరణము. 4. వాయువు. 5. రాపిడి, సంఘర్షణము, ఒరయిక. 6. కామోద్రేకము.

**సంహాతము** సం వి. అ. పుం. సంఘాతము, నరకభేదము, ఇరువది యొక నరకములలో నొకటి.

**సంహారకము** సం. విఙ (అ. ఆ అ.) 1. సంహారించునది, నశింపఁ జేయునది. 2. ముణుఁచునది. 3. ముగించునది.

**సంహారకుఁడు** సం. విఙ (అ. ఆ అ.) సంహర్త.

**సంహారము** సం. వి. అ. పుం. 1. ప్రోఁగుచేయుట. 2. సంకోచము, ముడుఁచుకొనుట. 3 అస్త్రములను సంహరించుట 4 ఆఁపుట. 5. నాశము, ప్రళయము. 6. ముగింపు, సమాప్తి.

గీ. అనఘ! విష్ణువిహారంబులైన వివిధ నిక్షేప సంహారవృత్తులందు, భ్రమణమొందెడి జీవుని బహుళకర్మముల వశంబున నాతనిఁ బొందుచుండు. భార. శాంతి. 5. 413.

శా. ఆవీరుండును పాదచారియయి బ్రహ్మాండంబు గంపింప గ్రోధావష్టంభమునన్ మరుత్తనయుసంహారంబు గావింపఁగా — చిత్రభారతము. 7. 104.

7 గుంపు, సమూహము. 8. ఉచ్చారణదోషము, పలుకుబడిలోనితప్పు. 9. అస్త్రముల నుపసంహరించు మంత్రము 10. నేర్పు, నైపుణ్యము. నరకమునందలి యొకభాగము.

**సంహారించు** సం స క్రి. వధించు.

కం. సంహృతశివనీభక్తికి, సంహారమతి వక్రులైన నప్పుడ 'తే శీఘ్రం హంతవ్యా' యనుటను, సంహారించుటయ పథము జనకుల నైనన్. శివతత్త్వ. 279.

**సంహిత** సం. వి. అ స్త్రీ. 1. కూడిక, ఏకీభావము.

2. సంకలము, కూర్చుట. 3. క్రమపద్ధతి నేర్పఱుపఁ బడిన పద్యసమూహము. 4. ధర్మశాస్త్ర సంగ్రహము, స్మృతి, (ఉదా. మనుసంహిత) 5. మంత్రరూపమయిన (ఛందోబద్ధమైన) వేదభాగము.

చం. పరమపదాప్తి హేతువగు భారతసంహిత శౌనకాది భూ,సురవరు లింపునం గఁగు జొప్పునఁ జెప్పిన .... భా. స్వర్గా. 94.

వ. అకుంఠితకంఠ కుహరానర్గళ వినిర్గళత్సంహితా పదక్రమాది నానా విధానధ్వాన పరంపరాభంగ గంగా ప్రవాహ వ్యూహ .... శివధర్మ. 1. 23.

6. (వ్యాక.) వర్ణముల యతిశయితసన్నిధి, అక్షరములను మిక్కిలి దగ్గఱగా నుచ్చరించుట. 7. పరమాత్మ. 8. వేదతుల్యమైన గ్రంథము.

సంహితము సం. విణ. (అ. ఆ. అ.) 1. సంధింపబడినది, కూర్పఁబడినది. 2. అనుకూలమైనది. సరిపడినది. 3. సంబంధించినది. 4. ప్రోగుచేయఁబడినది. 5. సంధానము చేయఁబడినది, అమర్పఁబడినది. 6. కలుగునట్లు చేయఁబడినది. 7. స్థిరపఱుపఁబడినది. 8. సంకలితము.

సంహూతి సం. వి. ఇ. స్త్రీ. పెక్కండ్రు పిలిచిన పిలుపు.

సంహృతము సం. విణ.(అ. ఆ. అ.) 1. దగ్గరగాఁ జేర్పఁబడినది. సంకోచింపఁ జేయఁబడినది. 3. వెనుకకుఁ దీయఁబడినది. 4. ఉపసంహరింపఁబడినది.

క. సంహృత నిర్మోక మహాహిలీల విగతక్లముఁడై, కుశుఁడనియె నగుచుఁ గాకుత్స్థునితో. జైమిని. 9. 160.

4. సంఘముగాఁ జేర్పఁబడినది. 5. బలాత్కారముగాఁ బట్టుకొనఁ బడినది. 7. నశింపఁజేయఁబడినది, చంపఁబడినది.

సంహృతి సం. వి. ఇ. స్త్రీ. 1. సంకోచము, 2. ముడుఁచుకొనుట. 2. సంహారము, చంపుట. 3. పట్టుకొనుట. బలాత్కారముగాఁ బట్టుకొనుట 4. అడ్డగించుట 5. సమూహము, గుంపు.

సంహృష్టము సం. విణ. (అ ఆ. అ.) 1. ఆనందించినది. 2. నిక్కపొడుచు కొనునది. 3. పోటీపడినది.

సంహ్రీణుఁడు సం. విణ. (అ. ఆ. అ.) 1. సిగ్గుపడినవాఁడు, హీనపఱుపఁబడినవాఁడు.

సకంటకము[1] సం. విణ (అ. ఆ. అ.) 1. ముండ్లు గలది, కంటకసహితము. 2. బాధకలిగించునది, అపాయకరమైనది.

సకంటకము[2] సం. వి. అ. పుం. శైవలము, నాఁచు.

సకంప(న)ము సం. విణ. (అ. ఆ. అ.) 1. కంపముతోఁగూడినది, వణఁకుగలది. 2. వణఁకునది.

మ. ఘనగర్జల్ సకిలింత లాశ్రితబలాకల్ తెల్లబల్లుల్ సకంపనశంపాలతికల్ ... వరాహ. 10. 98.

సకటము సం. విణ. (అ. ఆ. అ.) 1. దుష్టమైనది. 2. నీచమైనది.

సకటుఁడు సం. విణ. (అ. ఆ. అ.) దుష్టుఁడు, చెడ్డవాఁడు.

సకరము సం. విణ. (అ. ఆ. అ.) 1. చేతులుకలది. 2. పన్నులుభరించునది. 3. తుండముకలది. 4. కిరణములతో నిండినది.

సకరుణుఁడు సం. విణ. (అ. ఆ. అ.) 1. దయతోఁ గూడినవాఁడు. 2. కోమలుఁడు.

సకర్ణుఁడు సం. విణ. (అ. ఆ. అ.) 1. చెవులుగలవాఁడు. 2. వినువాఁడు.

సకర్తృకము సం. విణ. (అ. ఆ. అ.) కర్తకలది.

సకర్మకము సం విణ. (అ. ఆ. అ.) 1. ఏకార్యమునైనను చేయునది. 2. (వ్యాక.) కర్మకలది.

సకలము సం. విణ. (అ. ఆ. అ.) 1. భాగములతోఁ గూడినది. 2. సమస్తము, సంపూర్ణమైనది.

ఆ.వె. అర్థసిద్ధికంటె నరయనెక్కుడు ధర్మ,సిద్ధిదాన సకలసిద్ధులును బ్ర,శస్తిభంగిఁజేరు. భార. శాంతి. 2. 403.

3. అన్ని కళలతోఁ గూడినది (చంద్రబింబమువలె).

వ. అని సకల బ్రహ్మప్రార్థనంబు సేసి... భార. విరా. 1. 2.

4. మృదువును మందమునైన ధ్వనితోఁ గూడినది.

సకలము సం. వి. అ. న. అంతయు, సర్వము.

సకలవర్ణము సం. విణ. (అ. ఆ. అ.) క. ల. యనెడి యక్షరములు గలది (పదము).

**సకలహము** సం. విశే. (అ. ఆ. అ.) కలహము గలది, కలహశీలము.

**సకళా(లా)తు** వి. (తురు. సకలాతి, సకలాతు) సింధూరపు రంగుబట్ట.

2. ఉన్నిబట్ట, కంబళి

సీ. కటిసీమ నెట్టుడాల్ కాసెలపై మందు సకలాతు ముసుఁగు దస్తాఁమర్చి. రంగా. 3. 34.

3. సాలువు. 4. జరీ వ్రాఁతపని,

గీ. పసిఁడి సకలాతు ప్రాఁబచ్చ పసులగండ, పెండరంబులు మొదలైన బిరుదు లలర. సానందో. 3. 34.

**సకల్పము** సం. విశే. (అ. ఆ. అ.) వేదవిహిత కర్మలతోఁ గూడినది.

**సకల్పుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు,

**సకాకోలము** సం. వి. అ. పుం. ఇరువది యొక్క నరకములలో నొకటి.

**సకామము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రేమతోఁ గూడినది. 2. భోగములం దాసక్తి గలది.

**సకాముఁడు** సం. వి. అ. పుం. నెఱవేఱిన కోరికలు గలవాఁడు, తృప్తుఁడు.

**సకారము** సం. విశే. చుఱుకైనది, శక్తిమంతమైనది.

**సకాలము** సం. విశే. (అ. ఆ. అ.) యుక్తకాలమందైనది.

**సకాశము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కనఁబడునది, దృశ్యమైనది. 2. దగ్గఱనున్నది. సం. వి. అ. పుం. 1. సామీప్యము.

కం. శ్రీరుచేర కామిరద్దిమ, హీరమణమణిసమిద్ధకృత సిద్ధసరో, నీరాభిషేకజలధా, రారమ్యసకాశ సిద్ధరామ మహేశా! శివధర్మ. 4. 1.

వ. ఏను గాననంబునకుం జని మునిజనసకాశంబున సుఖనై యుండెద... భార. శాంతి. 1. 48.

2. ఒద్ద.

**సకి** (సం. సఖీ.) వి. చెలికత్తె,ఆఁడుది.

**సకిన** వి. 1. కృత్రిమపక్షి.

చం. ఉకిలిపిసెండి వ్రాఁతనును చెంద్రికవన్నియ మేలుకొట్టునన్, జకచక పవ్వఁ గ్రొవ్విరులు చంపకముల్ సవితేంట్లు మూతిమ, ట్టకనవకంపుఁగెంపు మొగడల్ గని రాఁ దెలిముత్తియంపుబల్, సకినల కూఁకలన్ గిలగిల న్నగు మోహనశయ్య నున్నెడన్ (శ. ర.). వసు. 6. 34.

2. కిచుకిచుమను ధ్వని.

గీ. ఈఁగ వ్రాలిన నందంద యెలుఁగు లొసఁగు వట్టి సకినలమంచము లాదిగాగ. (శ. ర.) స్వా. మను. 6.

3. కిచువిళ్ళు.

సీ. ... నెలవు లేర్పడుచున్న మొలకచన్నుల చెన్ను బంగారు సకినలభంగి మెఱయ. విక్రమా. 7. 89.

4. బొమ్మ.

తే. గీ. సంజ వెదచల్లుచెంగావి సాలువులను నుత్తగజగామినుఁటతడి యొత్తిరపుడు, చాలఁజూపట్టె నా పూర్ణచంద్రవదన, జాజుచేసిన జాళువా సకినవోలె (శ. ర.). భాను. 4 ఆ.

**సకినంపుఁబులుగు** వి. సకినము చెప్పెడి పక్షి విశేషము (చూ. పైడికంటి).

**సకినము** (సం. శకునము) 1. శుభసూచక నిమిత్తము 2. శుభాశుభసూచకవాక్కు.

**సకినలమంచము** వి. కిచుకిచుమని మ్రోగెడు మంచము, రవమంచము.

**సకియ** (సం. సఖీ.) చెలికత్తియ.

కం. సకియఁ గను మొఱఁగి మధుకర, చికురనిజారామవాఁటిఁ జేరి ప్రసూనాం, బకధాటీశుకఘోటి నికరాటీకనము మనము నివ్వెరపఱుపన్. వసు. 3. 117.

సీ. సకియ నీకిల్లడ సరివచ్చె ననిక దా మించికాళియు మర్దించుచెల్ల. రాధికా. 4. 54.

2. ఆఁడుది.

కం. సకియ మగపొడి కొఱకె, న్నికగాఁ బగతుని నడంచి నినుఁ జెఱలోఁ జిక్కక యుండున ట్లొనర్చితి. అచ్చ. యు. కాం.

**సకిలించు** అ. క్రి. హేషించు, (గుఱ్ఱము) ధ్వనిచేయు.

**సకిలింత** వి. గుఱ్ఱము చేయు ధ్వని, హేష.

**సఖుఁడు** వి. (సం. సఖి.) చెలికాఁడు, మిత్రుఁడు.

సకుకి సం. విణ. (ఇ) సగర్భుడు, తోఁబుట్టువు.

సకు (ఒము) లి సం. వి. అ. పుం. ఒక విధమగు చేప.

సకులుఁడు[1] సం. విణ. (అ. ఆ. అ.) 1. గొప్ప కుటుంబమునకు సంబంధించినవాఁడు, గొప్ప కుటుంబమున బుట్టినవాఁడు. 2. ఏక కుటుంబమునకు సంబంధించినవాఁడు. 3. కుటుంబముతో గూడ నున్నవాడు, కుటుంబ సహితుఁడు. సం. వి. అ. పుం. జ్ఞాతి, దాయాదుఁడు.

సకుల్యము సం. విణ (అ. ఆ. అ.) సజాతీయము సదృశము.

సకుల్యుఁడు సం. వి అ. పుం. 1. సమాన కుటుంబము వారిలో నొకఁడు, ఏక కుటుంబములోని వాఁడు. 2. దూరస్థజ్ఞాతి, నాల్గవతరము మొదలు తొమ్మిదవతరమువరకు నుండెడి జ్ఞాతి. 3. దూరబంధువు.

సకృత్తు అవ్య. (సకృత్ అనెడి యవ్యయమునకు సమాసపూర్వపదముగాఁ బ్రయోగ ముండవచ్చును, వ్యస్తముగాఁగూడ వ్యవహారమున వాడుకకలదు.) 1. ఒకమాఱు, ఏకవారము.

ఎ. గీ....సుందరీకాప్రాదంబునను దగఁగ, సకృదువస్పర్శనము చేసి చారుమూర్తియై జనించు. భార. అను. 2. 66.

2. మొదటి పర్యాయము, ముందుగా. 3. తత్క్షణము, వెంటనే. 4. సర్వదా. 5. కూడ, కలసి.

సకృత్ప్రజము సం. వి. అ. పుం. కాకి.

సకృత్ప్రసూత(తిక) సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక బిడ్డను గనిన స్త్రీ, ఒకమాఱు ప్రసవించినది. 2. తొలియీఁత యీనినయావు.

సకృత్ఫల సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటిచెట్టు.

సకృదాకృతము సం. వి. అ. న. ఒక్క పర్యాయము చెల్లించినది (వడ్డి).

సకృద్గతి సం. వి. ఇ. స్త్రీ. ఎప్పుడో ఒకప్పుడే జరుగునది, మిక్కిలి యఱుదుగా జరుగుట.

సకృద్గర్భ సం. వి. ఆ. స్త్రీ. 1. వేసడము, కంచెరగాడిద. 2. ఒకమాఱు గర్భము దాల్చిన స్త్రీ.

సకృత్స్నాయి సం. వి. న్. పుం. అరుదుగా స్నానము చేయువాఁడు.

సకృద్విభాతము సం. విణ. (అ. ఆ. అ.) ఒక్క పర్యాయము మాత్రమే గోచరించినది.

సకృపణము సం. విణ అ. ఆ. అ. దీనము, ఖిన్నము.

సకైతవుఁడు సం. వి. అ. పుం. మోసగాఁడు.

సక్తత సం. వి. ఆ స్త్రీ. న పా ముసః దగులు వడియున్న స్థితి.

కం. నీ, ముక్తత కోఁకని డీని, సక్తతగా నీవు గనుట పాలదె తెలుపవ్. భార, శా. 3. 6. 211. ముక్తత.

సక్తము సం. విణ. 1. అంటుకొనునది

మ....మూర్చలనొందన్ వెనె నెత్తె మేఘయుగళీ సక్తోల్లసద్గైరి కాచల వైహాయస కేళియో యన.... భార అను. 1. 235.

2. ఆసక్తి గలది, ప్రేమించినది. 3. తగులుకొన్నది, లగ్నమైనది, స్థిరమైనది. 4. సంబంధించినది. 5, శ్రద్ధగలది 6. అడ్డగింపఁబడినది

సక్తమూత్రుఁడు సం. వి. అ. పుం. కష్టముగా మూత్రము విడుచువాఁడు.

సక్తవైరుఁడు సం వి. అ. పుం. 1. కలహశీలుఁడు. 2. స్థిరమైన విరోధము కలవాఁడు.

సక్తి సం. వి. ఇ. స్త్రీ. 1. సంబంధము. 2. కూడిక, కలయిక. 3. ఆసక్తి. 4. అనుబంధము.

సక్తుకము సం. వి అ. పుం 1. సక్తువు 2. ఒక విధమైన విషము.

సక్తుఫల (లి) సం. వి. ఆ. స్త్రీ. శమ్మి, జమ్మి (వృ.వి).

సక్తులము సం. విణ. (అ. ఆ. అ.) పేలపిండితో నిండినది.

సక్తువు సం. వి. ఉ పుం. వేఁచి విసిరిన యవ ధాన్యపు పిండి, పేలపిండి. కం. వాపాలిసక్తువిచ్చెద, నీ పురుమునిఁ దృప్తుఁ జేయు మనిన. భార. అశ్వ. 4. 225.

సక్థి సం. వి. ఇ. న. 1. తొడ, ఊరువు. (ఇది యీ యర్థమున బహువ్రీహి సమాసోత్తర పదమగునపుడును, ఉత్తర పూర్వ మృగ శబ్దములకును ఉప

మాన వాచకమునకును బరమైనపుడును అకారాంత మగును ఉదా. మృగసక్థము ఫలకసక్థము మొ.) 2. శకటావయవ విశేషము 3 తొడ యెముక. 4. అస్థి, ఎముక.

సక్రియము సం. విణ. (అ. అ. అ.) చులుకైనది, చలించునది

సక్షణము సం. వి. (అ. అ. అ.) విశ్రాంతిగా నుండుట.

సఖి సం. వి ఇ. పుం (ఇది తత్పురుష సమాసమం దుత్తరపద మైనపు డకారాంత మగును ఉదా. కృష్ణసఖుడు మొ) మిత్రుఁడు, చెలికాఁడు.

చం. కొలఁది యెఱుంగకిట్టి పలుకుల్ పలుకంగనుఁ గారువాకవన్. బలుగుఁదనంబునంబలుకఁ బాడియె నీసఖవంచు. భార ఆది. 5 203.

సహాయుఁడు, ప్రియుఁడు.

సఖి సం. వి. ఈ స్త్రీ. 1. చెలికత్తె.

కం. వనిత సఖుల్గొలువఁ గేళివనమున కరిగెన్. రాధికా. 2 78.

సీ. అంగజ జ్వరతాప మాఱదు సఖముఖపూర్ణ చంద్రోదయంబుననెకాని. రాధికా. 3. 126.

2. ప్రియురాలు. 3. బందుగురాలు.

శం. ...తను నూరార్పఁగ సఖదొరకొనమికి వెనుఁ బడుచుఁ గీచకుం డాసతితోన్. భారం. విరా. 2. 60.

సఖుఁడు సం. వి. అ. పుం. చెలికాఁడు, మిత్రుఁడు, సహాయుఁడు, ప్రియుఁడు.

సీ. నా మోహనాంగునీ నా నీలవర్ణుని నా ఖిటోత్తంసుని నాదు సఖుని. రాధికా. 2. 72.

సఖ్యము సం.వి. అ. న. 1. చెలిమి, స్నేహము.

వ. అని పలికి సఖ్యంబు చేసి చనియె. భార. శాంతి. 2. 343.

వ. నీతోడ బద్ధసఖ్యంబుఁ జేసెద. భార. ఆది. 7. 55.

కం. సూపాధ్యక్షుఁడు గలిగిన నా పురుషుని తోడ సఖ్యమగునట్లుగ. భార. విరా. 1. 79.

2. సమాన ధర్మము, సామ్యము, పోలిక.

సఖ్యుడు సం. వి. అ. పుం. మిత్త్రుఁడు, చెలికాఁడు,

సగంధుఁడు సం. విణ. (అ. అ. అ.) 1. సువాసన కల వాఁడు. 2. గర్వము కలవాఁడు. 3. చుట్టఱికము కలవాఁడు. సం. వి. అ. పుం. బంధువు, జ్ఞాతి

సగటు వి. (సం. శకటమ్. చ. త. కడమ్. క. చగడా. మహా. ఛకడా) చదరంగము నందలి శకటము (బండి)

సీ. ద్యూతశకటంబు సగటనఁ దోఁచు నభవ. ఆం. భా. 4 108.

గీ. మంచిది సగటుపై నిదె మంత్రి కావలున్నదీ చదరంగ మిట్లుండ నిమ్ము. కువల. 4. 108.

2. సరాసరి. సామాన్యము.

సీ. సగటు నాఁగను సరాసరి యనంగ సామాన్య మెసఁగు. ఆ. భా. 3. 25.

సగణుఁడు సం. విణ. (అ. అ. అ) సేనలతోఁ గూడిన వాఁడు, ప్రమథగణములతోఁ గూడినవాఁడు.

కం. ద్రోణునకు కాదు సగణ,స్థాణునకైనను వశంబె

సం. వి. అ. పుం. శివుఁడు (ప్రమథగణములతోఁ గూడినవాఁడు).

సగతు వి. 1. గుజ్జుపుపల్లముమీఁద కెంపులు చిగుళ్లును పచ్చలు ఆకులును రవలు పూవులునుగా సంతరించి యేర్పఱిచిన బంగారుతీగ మోడిపని.

సీ. ఉదిరి బంగరుప్రాఁత హదనిపూపని చొక్క సగతుల హొంబట్టు మొగలిపల్లము. చంద్రాంగ. 2. 69.

వ. అవిరళ కిసలయ విలసిత లతావితానంబులు మరకత కురువింద నిచయంబులగు సగతులపగిదిఁ జూపట్టు. 6. 224.

2. రికాబుల కాధారమైన త్రాడు (ఈ శబ్దము బహువచనాంతముగనే ప్రయోగములందుఁ గాన వచ్చుచున్నది).

మ. ఘనగర్జల్ సకిలింత లాశ్రితబలాకల్ తెల్ల జల్లుల్ సకం,పనశంపాలతికల్ పసిండిసగతుల్ మాహేంద్రచాపంబు మో,హనరత్నంబుల వాగె త్రాడు పడగం డ్లాస్య ప్రవశ్యైనమై, తనరం దజ్జలదంబు కైరఁ దెగయున్ ధారావిహారంబులన్. వరాహ. 10. 93.

చం. సగతులు వట్టి వెంటఁ బరిచారకు లేగి హయంబు మించిపో, జగతి ఖురాగ్రము ల్వడమి జాడ యెఱుంగక వాజివేగముఁ, దగిలెద నంచు వెఱ్ఱను సదాగతి కొట్టువఁ బోవు వట్టు ల్పగలిటి కందు కొంద్రు త్రుటిఁబాయుదు నిచ్చిన తత్పురాశ్వమున్. బహు. 1. 81.

సగపాలు వి. (సగము+పాలు– వృత్తి యందు ముపర్ణకలోపము).

1. అర్ధభాగము, అఱపాలు.

చం. ...అ, ద్దమజుల ద్రుంచి మీకుఁ బ్రమదం బొనరించెదఁ దేఁటమున్ బలం, బును సగపాలు వెట్టి వమ బొందఁగఁ జేయుఁడు మీర లందఱున్. భార. కర్ణ. 1. 277.

సీ. ఈ నీరజాతాక్షి మేనిలో సగపాలు గణుతింప మగపాలు గాఁగ నున్నది. హర. 3. 25.

వ. తపోవిశేషంబునం బర్వతాత్మజ నీ దేహంబున సగపాలు గొనియె. భీమ. 5. 52.

దీనికి సగఁబాలు అనురూపము గూడఁ గానంబడి యెడి.

ఉ. చందనగంధి వెన్నెదుర చందురులో సగఁబాలు బాలము,ద్దుండెలిచూపు లంగజుని తూపుల లోపల మేత్తరంబులు విజ. వి 1. 149.

చం. తమ సగఁబాలు గోలుపడి దానివ యిప్పుడు గోరు వీరికిన్, సముచితవృత్తి నిచ్చి తమసామున నంతసమంది యున్కి యుక్తము. భార. ఉద్యో. 1. 19.

సగమాటదేవర వి. అర్ధనారీశ్వరుఁడు. ద్వి. సగమాటదేవర చర్చించి జూడ, జగదండకోట్ల కీశ్వరుఁ డెట్టు లయ్యె. పండితవాద. 605.

సగము=సవము, సాము. వి. (సం. సామి: అర్ధభాగము, అఱ.

ఉ. ...అ, ఖండలుఁ డున్నగద్దియ సగంబున నుండె మహానుభావుఁ డీ, తం డొకమర్త్యుఁ డేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁ డొకో. భార. విరా. 1. 85.

ద్వి. చక్కఁదనంబున రెండుసగముల గూర్చి, ముక్కంటి తనతోంటి మూర్తి గైకొనెనొ. పండిత. వాద. 220.

ద్వి. సగము కౌసల్యకు సగములోఁ బుచ్చి, సగము సుమిత్ర కాసగములో సగము. రం. రా. బాలకాం 18. 22.

ఉ.....కా,దేనిఁ దపంబులోని సగ మిచ్చెద మాను తపోభిమానమున్. హర. 4. 25.

గీ. సగము గొఱికిన యాకును సఖులు పిలువ, సగ మొసఁగు నుత్తరము. మను. 3. 63.

వ. మృగాంకమండలంబు సగము కబళించిన రాహుగ్రహ భూమికల చందంబున నందంద తిరుగు బొల్లి ఘోరభల్లూకంబులును పారి. 2. 87.

గీ. మర్త్యలోకంబువారి ప్రమాణసంఖ్యఁ, బాఁదు మామందు గడపెను వత్సరయింట, సగము నిద్రయును సగము జాగరంబు, నా విభావరి వేఁగులో కాలువెలలు. హర. 7. 139.

కం. తనమేని రెండుసగములు, వనితా పురుషులుఁగ జేసి స్వాయంభువుఁడన్, మనువును శతరూపాహ్వయ, మనుపత్నియుఁగా నొనర్చె మహిమోజ్జ్వలుఁడై. హరి పూర్వ. 1. 55.

గీ. ఖచరేంద్రుఁ డరిగి యరిగి మింట గ్రహరాజు తనసగ మింట వెలుఁగు, మంథగిరిఁ గాంచి పలికె నమ్మనుజపతికి. మను. 5. 46

శా.....నవస్వర్గ క్రియాకేళిచే, నాదిన్ గాధితనూజుచే సగము సేయంబడ్డ మిన్నేలు ప్రాసాద స్వచ్చరు కూలకై తపమునం బాలంగ నొప్పుంబురిన్. శృం. నై. 2. 41.

సగమగు అ. క్రి. కృశించు. (సగము+అగు)

కం. మృగవల్లభ యాఁకటిచే, సగమైతిని నీకుఁ గైవసముగా నన్నుం, దగదె కమంగొన నీపా,లగుఁ గాదనకుఁ దారగింపు మాచేసేతన్. వేం. పంచతం. 1. 528.

సి. గీ. సగమగుసాత్త్వికోదయ నవానుభావములు సగము జాబిల్లి యమ్ము. వి. అర్ధచంద్ర బాణము.

నది. 2 తడిసినది. 3. తేమగలది.

సజాతము సం విణ. (అ. ఆ. అ.) కలిసి పుట్టినది.

సజాతి[1] సం. విణ (ఇ) 1. ఒక జాతి సంబంధమైనది, ఒక తెగకు సంబంధించినది, ఒక విధమైనది. 2. సమాన మైనది, పోలినది.

సజాతి[2] సం. వి. ఇ. పుం. సమానజాతిగల స్త్రీ పురుషులకు బుట్టిన పుత్త్రుఁడు.

సజాతుఁడు సం. వి. అ. పుం. సోదరుఁడు.

సజాత్యము సం. వి. అ. న. 1. సోదర్యము. 2. బంధుత్వము.

సజావు హిం. విణ. స్పష్టమైనది, క్రమమైనది.

సజుషుఁడు సం. విణ. (ష్.) 1. ప్రేమగలవాఁడు, ఆసక్తిగలవాఁడు. 2. సేవతోఁ గూడినవాఁడు. సం. వి. ష్. పుం. మిత్త్రుఁడు, చెలికాఁడు.

సజ్జ సం. వి. ఆ. స్త్రీ. 1. వస్త్రాదిధారణము, అలంకరణము. 2. సన్నాహము. 3. కవచము.

సజ్జ వి. (సం. శయ్యా; క. సజె) - సెజ్జ 1. పానుపు.

ఉ. ... ఎవ్వరిం, బజ్జకుఁ జేరనీక తన భావము లోపల దాఁపురంబుగాఁ, సజ్జకుఁ జేరియుండె నృపచంద్రుఁడు సాంద్రవియోగ వేదనన్. పి. శకుం. 2. 167.

కం. వేసాలఁ బోకు రమ్మీ,పూసజ్జకుఁ బ్రొద్దు వోయెఁ బలియుట చాలున్. హర. 7. 138.

సీ. మిక్కుటంబుగ మేనియుక్కచేఁ గమలిన విరి పూవుసజ్జల కరణి చూచి. రాజశే. 3. 146.

2. వాసగృహము.

ఉ. మజ్జన భోజనాదులకు మాపు శయించుటకున్ వధూమణుల్, సజ్జనగేహ మొక్కటి విచారము చేసి యొనర్చి వాలిపెన్, సజ్జ దొఱంగి యిచ్చట ప్రసన్నత నిల్పిన లింగమున్ భవా, పజ్జలరాశికుంభజుని భక్తి భజింపఁగఁబోవు నంతటన్. కాశ. 4. 86.

3. ఉప్పరిగ, శిరోగృహము.

ఉ. వేడుక నిట్లగణ్యరుచి విభ్రమధన్య యగేంద్రకన్య రాఁ జూడదలంచి నిల్చిరి వసుక్షితిపాలపురి పురంధ్రికల్, మాడువులన్ హజారముల మచ్చుల సజ్జల గోపురంబులన్. వసు. 6. 64.

4. బుట్ట.

కం. అనుటయు రసలింగము నిడు, తనవట్టు వ్రేఁప సజ్జ దంతపు బరణిన్. మను. 1. 78.

సీ. కృత్రిమగుణముల గేహంబు దేహంబు, చపల దోషంబుల సజ్జపొజ్జ. చంద్రరేఖా 2. 34.

ద్వి. బిల్వ పత్రము లతిప్రీతి సద్భక్తి, నల్వు వాటిల్ల ఘనంబుగాఁ గోసి. సజ్జనిండఁగఁ బెట్టి చాటిట నిటిక్కి. పండితా. పురాత. 727 పుట. 375.

5. శివలింగము నుంచెడి బుట్ట (లేక బరణి).

చం. అని తన సజ్జలింగము దయాతిశయంబున నావతిచ్చినన్. కాశ. 4. 80.

సజ్జ వి. సం. (సర్జః) ధాన్యవిశేషము, గంటె.

మ. పెసరుంగాయకు మెత్తకన్నులకునై వేటాడుమన్ గొఱ్ఱెలన్, నునలం జూచుచు దోసచేల్ చెఱకు చాల్ నుగ్గాడుచున్ సజ్జగో,య నుమాశింపుచు సేవరా పెసగి కాళ్యావంక కిడాంకకై యసదంచం బదరంపుగుం వరిగె నాహా యాశరద్వేళలన్. రాజవాహన. 2. 65.

సీ. బరిగె సజ్జయు గిడగిరసజ్జ మజ్జపాల్గిడ్డ చేస్విద్ద రాగెయును యవయు. హంస. 4. 127.

వ....మాపుమాపున మేపు సజ్జకవణంపు మేపున... పుటపుటనై... కొదమతట్టువగుంపు. ఆము. 4. 35.

సజ్జక సం వి. ఆ. స్త్రీ పడకిల్లు, వాసగృహము.

సజ్జకట్టు విణ. అయితము.

సజ్జకము విణ. (క; సజ్జక=క్రొత్తది, లేఁతది) (సం. సజ్జస్కః. ప్రా. సజ్జోక్కం) . మనోజ్ఞము, క్రొత్తది.

పి. జడగొప్పులోను వచ్చుపుసజ్జకములైన విరవాదులకు వింతవిందు లగుచు. ఉ. హరి. 1. 151.

దండ. గుజ్జే ప్రోయాలికిన్. సజ్జకం బై వ యందం బు నొందింపవే. పారి. 3. 88.

వ. సజ్జకవుఁ బూ మొగ్గలును. శృం. నై. 1. 95.

**సజ్జకాయ** వి. శివలింగ ముంచెడి కాయవంటి బరణి.

సీ. శివలింగవు మెఱుంగు జవగల్లు గొలుసుల సజ్జకాయ మెఱుంగు చౌకళింప. ఇందు. 5. 60.

**సజ్జనకోల** వి. (సజ్జ+కోల) (క. సజ్జనకోలె) బెత్తము

ఎ.గీ. అలుకచే నుండ బుగ్గలు నులిమి తిట్టి, తొడలు వడిపెట్టి కోదండ మదరఁగట్టి, రెట్ట లెగఁబెట్టఁ బట్టించు రేపుమాపుఁ, గొట్టు బెట్టుగ సజ్జనకోల దెగను. హంస. 3. 141.

**సజ్జనము** సం. వి. అ. న. కట్టుట, బంధించుట. 2. వస్త్రాది ధారణము, అలంకరించుట, 3. సిద్ధ మగుట, సన్నాహము, కవచాది ధారణము, 4. కావలి. 5. ఘట్టము, పడవలరేవు.

**సజ్జనుఁడు** సం. వి. అ. పుం. మంచిమనుష్యుఁడు.

**సజ్జము** సం. విణ. (అ.అ.అ.) 1. సిద్ధమైనది. 2. వస్త్రాదికము ధరించువది. 3. ముస్తాబు చేయఁబడినది. 4 కవచము మున్నగువానిని ధరించువది, సన్నద్ధము. 5. సంభృతము, నిండినది. 6. నిశ్చితము, నిశ్చలమైనది. 7. కోట మున్నగు వానిచే రక్షింపఁబడినది.

**సజ్జరసము** వి. ధూపద్రవ్య విశేషము (శ. ర.).

**సజ్జలింగము** = ఇలవేల్పు.

సీ. ఉండు నేపిట మార్కండేయమునినాథు సజ్జలింగ మనంగశాసనుండు. కాశీ. 1. 58.

**సజ్జలు** వి. బ. ధాన్యవిశేషము, గంటెలు (క. సజ్జె. తు. సజ్జిగె).

ద్వి. చణకముల్ గోధుమల్ సజ్జలు లంక, లును యవలును పెస మినుములును. ప్రభులింగ. 4 ఆ. 181 పు. 24 పం.

చం. సనగలు గోధుమల్ పెసలు సజ్జలు లంకలు కొఱ్ఱసిల్ల వడ్లును. బ. ప్రభు. లింగ. 5. 87.

**సజ్జాకారము** వి. సర్జకవృక్షమున నెత్తడియుప్పు (శ. ర.).

**సజ్జారము** వి. (సం. సామజాగారమ్, త. చర్యారమ్) ఏనుఁగులశాల, గజశాల.

సీ. సజ్జార మనఁగను సామజాగార మౌ. అం ధ్రా. 2. 15.

గీ. అష్టమదముల ఘురపూరితాద్రు లనఁగ, మీఱు దంతులఁ దనదు సజ్జాఁమునకు, రావుగా యమ భీతి నై రావతంబు, వెలుకనై యుండె వప్పుడిఁ దర మె పొగడ. శ్రీరంగ. 10. 59.

**సజ్జికము** విణ. సజ్జకము. 1. మనోజ్ఞము, క్రొత్త.

తే. గీ. చిఱుతప్రాయంపునాటి సజ్జికవుచాయ. తొలుసమర్త యకాలంపు విలసనమువఁ, దరుణు లకు....అమరుసునరశేత్తను నీమందు పోఁకివవుడు. క్రీడా. 1. 80.

2. సిద్ధము.

మ. బలుకప్రంపుటనంతటికప్పురపుఁదిప్పల్ గప్పి యుప్పొంగు జాల్,గల గొజ్జెంగుల నీరు సజ్జికవు కేళా కూళికిన్ డిగ్గి. వసు. 1. 159.

**సజ్జితము** సం. విణ. (అ. ఆ. అ.) 1 ముస్తీబు చేయఁబడినది 2. అలంకరింపఁబడినది. 3. సన్నాహము చేయఁబడినది. సిద్ధమైనది. 4. కవచము ధరించినది.

**సజ్జీకరణము** సం. వి. అ. న. 1. అలంకృతముచేయుట 2. సిద్ధము చేయుట. 3. కవచాదులు తొడుగుట.

**సజ్జీకృతము** సం. విణ. (అ. ఆ. అ.) సజ్జితము.

**సజ్జీభూతము** సం. విణ. (అ. ఆ. అ.) సజ్జితము.

**సజ్జె** వి. (క. సజ్జె.) 1. సన్నాహము. 2. కూర్పు.

సీ. హరినీలముల మేడయవల కెంపులసజ్జె కడమ కట్టఁగ నడుగర యొనంగి. కువల. 4. 205.

**సజ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అల్లెత్రాటితోఁ గూడినది. 2. ఎక్కుపెట్టఁబడిన నారి కలది.

సీ. శంఖ చక్రాంకిత చారుభుజాదండముల సజ్య

కోదండములు వెలుఁగ. రాధామా. 4. 26.

**సక్షోత్స్న** నం. వి ఆ స్త్రీ. వెన్నెలరేయి.

**సట**[1] నం శఠమ్ క. సట త. చటమ్) 1. క్రౌర్యము బాధ. (చూ. సటలంబెట్టు)

2. అసత్యము, అబద్ధపు మాటలు, పనులు మొ

సీ. సటహాళిక్కి నా నసత్యమభవ· ఆం. భా. 1. 119.

చం. సటలిఁక మానరోరి హరి సర్వమయుండ టె యంచు. పారి. 3. 32.

3. కపటము, మోసము,

చం. నెటికలు దీసి యిచ్చకము నేర్చి ప్రసంగము దీసి యిప్పట,ప్పటికి నుతించి మాటలను బఁదిరివెట్టి సటల్ ఘటించి ము,చ్చట లెటిఁగించి బాససహజంబు గ నందఱ కన్నిరూపులై, విటులఁ గలంచి తీయఁదగు విత్తము లుత్తమ వారకాంతకున్. విప్ర. 4. 23.

కం. సటలు దడవటలు నటనలు, మటుమాయలు జాటువగలమాటల వింతల్, గుటిలతయుఁ దెలిసి పాటుఁడు, విటవిద్యకు బిరుదువేసి వికవిక నగుచున్. ప్రబం. 1. 614.

ఆ. వె. ద్రోహబుద్ధినైన దొంగతికమునైన, సటల నైన సాహసమునైన, సంపదధికుదేత సాధించి ధనమును, బడుగు కిచ్చి బాగుపడును వేమ. వేమ. 3. 186.

తే. గీ. వారిచొక్కులు వెక్కులు వారివగలు, వారి వన్నెలు చిన్నెలు వారిసటలు, వారి హరువులు మురువులు వారికళలు, వారి వలపులు సొలుపులు వశమె పొగడ. ఉ. రా. 6· 166.

4. మాయ, కపటపుఁబనులు.

తే. జడసముత్సాహి వగుటకు జలధి సాక్షి, వామనుఁడ వగుటకు బలిశ్వరుఁడు సాక్షి, మందమతి వౌట నది మఱపొందెఁ గాక, వరవిఁ జేర్కొనఁ దరమె నీసటలు కృష్ణ. జై. భా. 1. 126.

కం. వలపు సట, వావులా వహి, యల సత్యము సున్న, తలఁపు లభ్రచ్ఛాయల్, తలఁ దడవి బాస చేసిన, జలజాతుల నమ్మరాదు సారంగధరా! సారంగ 2. 8.

5. కొండెము.

సీ చాడికాఁ డనువాఁడు, సంతెల్ల బోధించె నందున కొరులపై నలుగఁదగదు. నీతి. సీ. శ. 46.

**సట**[2] నం. వి. ఆ. స్త్రీ. 1. యోగులజట, జేడకట్టిన జొట్టు, 2. (సింహము మున్నగువాని) కేసరము, జూలు.

వ. అనిన విని జరాసంధుండు సటాసముత్పాటన కుపితకుంజరివైరియుం బోలె గడు నలిగి. భారసభా. 1. 194.

3. పదునంది ముల్లు. 4. జేడ. 5. శిఖ, జుట్టు.

**సటము**[1] నం. వి. అ. న. సట.

**సటము**[2] వి. (చూ. సట) అసత్యము, మాయ (త. చటమ్).

సీ. సటముగా నీక బాసటము వెట్టుకటారికి. సాంబో. 1. 205.

**సటలంబెట్టు** (సటల్ + పెట్టు) స. క్రి. బాధపెట్టు, పీడించు.

కం. ఇటులఁ దమి హెచ్చి మారుఁడు, సటలం బెట్టంగ నొచ్చి సడి నటు నిటుఁ జెందుటకు వెఱ నొచ్చి రతి సంఘటనార్థము మిగుల వేగుకాలము నందున్. హంస. 3. 156.

**సటలమెకము** మి. వి సింహము, కేసరి.

వ. దంతావళావళులం దిలకించి వేసట గొనక సటల మెకంబులు గమకం బగు తమకంబుల పైకి దుమికి. ప్రబం. 1. 186.

**సటలు** వి బ. 1 కపటము 2 బాధలు.

చం. కనుఁగవఁ బాఱఁ జూచెదవు గాని మనంబున: జూడ పుక్కులం, దనిపెదు గాని భావమునఁ దప్ప వొకప్పుడు నీ ప్రవీణతల్, పనువడ వింక నీసటలు బచ్చెనచేతలు చాలుఁ జాలు. వరసఖూ. 2. 14. హంస. 3. 156.

**సటపట** విజ. (క. సటిపటి) కపటము.

చం. కిటుకుఁదనంబులుల్ గపటకృత్య మసత్యపు మాట పల్కులున్, గుటిలము కూచిమూఁ ములు గుచ్చితముల్, దరితీపు చూపులున్ సటవట వందనంబులును జాగులబాగులు నెంచిచూడ నీ, యటవటముల్ ధరిత్రి జలజాతులకున్ సహజ ప్రవర్తనల్. బ. ప్రభులింగ. 2. 93.

**సటాంకము** నం. వి. అ. పుం సింహము.

**సటి** నం. వి. ఇ. ఈ. స్త్రీ. కచోరము (వృ. వి.).

**సటిక** నం. వి అ. స్త్రీ. కచోరము (వృ. వి.). (చూ. సటి).

**సటీకము** నం. వి. అ. న. వ్యాఖ్యానముతోఁ గూడినది.

**సట్టకము** నం వి. అ న. ప్రాకృతభాషలో నుండెడి యొక యుపరూపకభేదము (ఉదా. కర్పూర మంజరి).

**సట్టన** వి. అవ్య. త్వరగ, వెంటనే (అనుకరణము), (దిగ్గనవలె).

ద్వి. సిట్టితాళముపట్టు శివదేవి, నీవు సట్టన నృత్యంబు సరసం బెటింగి. బసవపు. 3. పుట 141.

**సట్రు** వి. సదకు ఊఁతపదము (చూ. సద.).

ద్వి. సదసట్రు నలినట్రు సరిగస్వగట్రు, వెదకియుఁ గానక మది విచారించి. బస. పురా. 58 పు. 27 పం.

**సట్వ** నం. వి. ఆ. స్త్రీ. 1. ఒక జాతిపక్షి. 2. వాద్య విశేషము

**సతి** నం. వి ఈ. స్త్రీ. చూ. సటి (వృ. వి.).

**సడ** వి. దట్టమగు నాఱు వరుస, తసి.

సీ. నారటం చనఁగను మీఱు వాప్యాంకురా,వళి ...తసి యన సడయనఁగఁ దన్నిరంతర పంక్తి దవరుచుండు...ఆం. భా. 2. 35.

**సడకుడకలు** వి. బ. భక్ష్యవిశేషము.

వ. నిడికుడకలు సడకుడకలు – గూళ్ళాపిడలాది గాఁగల భక్ష్యంబులు హంస. 1. 105.

**సడగరము** వి. (క. సడగర) సంభ్రమము, ఉత్సాహము.

ఉ. ఛనుగు....ఇవ్వ దెత్తికొనుఁ దండలమందవు ముట్టువారికిన్, దానవు లిచ్చినన్ సడగరం బవు రెమ్మెగి కిళ్ళెత్తఁగాన్. క మా. సం. 11. 576.

ద్వి. ప్రాలుఁగఁ దిగిచితి రేల ఓ కఁలు, సడగరంబులు వట్టి చాగుఱకాలు గొడుగులు పడగలు తడఁబడుటయును బస. పురా. 180 పు. 2 పం.

**సడపు** స. క్రి. అపహరించు (శ. ర.).

సీ ... సామాజికులు తమ సొమ్ము లెల్ల.

గీ. నొసఁగులుగ నైవ సడవుచు నొప్పుమీఱ యుక్తిఁ మతుఁడు మాయానిరూఢి మెఱసి. ప్రభా. 4 ఆ. 101.

(అచ్చుప్రతిలో నడుపుచు నని యున్నది).

**సడలించు** స. క్రి. (√ సడలు) 1. విప్పు; సడలఁజేయు, వదలు.

తే. గీ....అవికె సడలింప దిలకించి రమణుఁడు... దశా. 8. 76.

తే. గీ. నీవి సడలించి బడలించి నెలఁత నపుడు, కళిక రతుల వలంచె రాజునవిభుండు. ఉ. రా. 4. 217.

సీ. వట్టైద సడలించు పర్యంతమును దాళ కతుల రోషాప్తి నిట్టట్టు బెదఁగు...కు. 1. 170.

వ. వాగె సడలించి పగతుపై నిగిడి.

2. విడుచు, తీయు. మను. 4 117.

సీ. మనసుఁ గామక్రోధమదలోభముల కిచ్చి, సడలింతు రన్వయాచారసంజ. భీమ 5. 178.

సీ. తీరమ్ము లెడలించి బిరుదులు సడలించి డాఁగువారును గొంది నీగువారు. లక్ష్మీవి. 1. 78.

చం. పలుచనిదంతపుందకుకుపాదుకల న్పడలించి కుంచితాంఘ్రుల వలిపంపుఁజేలమునిగొం గొక యించుక యెత్తి చిత్త మింపలరఁగ నొక్క యందమున నందుఁ దగ జ్ఞనియె న్విభుండు. శుక. 1.281.

తే కౌస్తుభాది విభూషణోత్కరము నెల్ల నొయ్య నొయ్యన సడలించి యున్నయంత. పారి. 2. 7.

4. తెఱచు, తీయు.

వ. ... గృహంబునకుం జని పంజరంబు సడలించి యచ్చుంచలాత్ముం గానక. అము. 6. 107.

కం. తలుపు సడలింపు మనుచేం, గులభామను

మాంత్రికు డు కూపెట్టినచోఁ, దలకేఁడి వ్యాపారి మనశ్శ మము పో ంపు అచి సంభ్రమ మొద వన్. వ . 1...

5. ఉడగొట్టు, పోఁగొట్టు.

కం. ఉడుపుం గ్రోధుఁడ హింసను, సడలింపుదు నేను బ్రహ్మచర్యాదులను, క్కడఁగించు లోభుఁ దుద్ధతి, నడవాడలేకుండ సూనృతాస్తేయములన్. ప్రబోధచం. 1. 56.

చం....చిక్కులు సడలించి మేలుపనిఁ గూర్పఁగ నేర్తురె. నీలా. అ. 2. 81.

6. తప్పించు.

కం. అంతటవగ్గటియావే,దాంతసరస్వతి మనంబు సడలించేచుఁ బ్రా,ణాంతవ్యవసాయం బది, యింతు లకుంగాక నీకు నెన్నిక యగునే. ప్రబోధచం. 5. 18.

7. తొలగించు.

చం. అనిలజుఁడా ప్రదోషసమయంబున శాత్రవకీర్తి మండలం, బనువిలసత్తిరస్కరణి యాశుగతిన్ సడ లించి కప్పడెన్. చంపూరా. 6. 24

8. కలఁచు, చలింపఁజేయు.

రగడ. వడిఁద్రిప్పి మరుఁడు జయవంతములు కుంత ములు, సడలించె మునిజనస్వాంతములు శాంత ములు. రాఘ. 2. 6.

9. తీసివేయు.

కం. మలయానిలసంగతిఁజా, తలతిక లంకూరజాల దౌహృదవతులై, యలయిక సడలించిన సొమ్ముల కైవడిఁ బాండుపత్రములు వెసఁజోరెన్. పారి 3. 47.

సడలింపు వి. సడలించుట (√సడలించు).

సీ. కౌగిళ్ళ సడలింపుగాని మైపెనకువల్ కళ రేచు టకుఁ గాని బలు చెఱకులు. ప్రబం. 1. 672.

ఉ. మారునిమాయపంపు దిన్నమానము మేల్ సడ లింపు జారిణీ జారుల కుస్తరింపు.

(ఇది చీఁకటిగుంపు వర్ణనము) లక్ష్మీవి. 4.

సడలు = సడిలు, సళ్ళు. అ. క్రి. (సంశ్లథ, క. సడలు)

1. జారు, శ్లథమగు.

సీ. మఱుఁగువెట్టకడెంద మెఱిగించుకై వడి గొబ్బున బయ్యెఁ కొంగుసడల. విక్ర. 1. 112.

చం. అలికులవేణి యొక్కతె మురారిఁగమంగొని ప్రమానుపాటుమై, నెలకొనసున్నచో సడలు నీవిక వేఁజెమరంటి నిల్చె. పారి. 3. 16.

2. విగిచెడు, వదులగు.

గీ. తరణి మెఱుఁగారు గారుడధ్వజముఁ గాంచి, కలఁగి పరువిడు చిలువ పగ్గములు సడలి, పఱచు హయములసారథి పట్టలేమిఁ, దత్తరించుచు మున్నది తరణిరథము. దశా. 1. 187.

సీ. ...కనుఁగవఁ బొరలు గప్పెనొలేదొ చూతమన్ పోలిక సడలి కన్బొమలుఁ ద్రావాల. దశా. 2. 189.

3. తగ్గు, క్షీణించు.

గీ. మిగులఁ బ్రేఁకని తొడపుల మెచ్చు సడల, గర్వసం పదనొప్పి రక్కమలముఖులు. విక్ర. 1. 166.

చం. వసువు చకోరయాచకుల వాంఛలు దీఱఁగ నిచ్చి చెల్లినన్, విసువును దాఁగె నస్త పృథివీ ధర సీమ వనంగఁ దాల్మి పెం, పు సడలి రాత్రి పుష్పిణి గుముద్వతిఁగూడి విశుద్ధి మజ్జనం, బు,సలుపఁ బశ్చి మాంబుధిఁ బోయె,నవంగ విధుండు గ్రుంకినన్. వరాహ. 4. 167.

కం. నెలవెడలియు నెఱి సడలియు, జేల ముడిగియు నిదుర చెడియు, జంటలెడసియున్, గలహాము లడ గియు బఱిచెన్, బులి, కిరి, కరి మన్నుదున్న మొదలగు మెకముల్. మను. 4. 89.

4. చెడు, పోవు.

గీ. పెంపెడల నిట్టయెడ నీవుసొంపు సడలి, తుంట విలుదంట గొంటరి తంటలకును, దిన్నదనమఱి విన్న నై ఖిన్నపగుచు, వేడ్క దొడరంగ నేటికి వెలఁది మిన్న. ఇందు. 3. 7.

5. గళితమగు, రాలు.

వ కేసరంబులు వీసరవోవ మకరందంబు చిందఁ బొరలు విఱుగం బుప్పొడి సడలన్. హర. 6. 16.

6. పోవు, నశించు.

ద్వి. చంక బొక్కసమును సడలి యున్నయది,శంకిం పకొం చెట్టు నయిరించెదయ్య. బస. పురా. 62 పు. 28 పం.

మ... సో,గనెఱుల్ సంపఁగిమూపెనిగ్గు సడలంగాఁ జైపయి నుఫ్వి నేఁర్పన గంధామలకంబు పెట్టె నొక యంభోజాతి ఘూజానికిన్. వసు. 5. 79.

7. చలించు, కదలు.

మ. సడలెన్ భానుఁడు పశ్చిమంబున వయస్యా పూటకూటింటికిన్, గుడువం బోదము లెక్క యిచ్చి కడు నాఁకొన్నార మిప్పట్టువన్. క్రీడా. 1. 155.

సీ. నిమ్నోన్నతక్షితిని సమంబుగాఁ జేసి, జన్నెల మీఁదెత్త సడలదయ్యె. శుక. 2. 12.

8. స. క్రి విడుచు, త్యజించు.

ద్విరదగతిరగడ. సడలఁ డొక యింతయును శాంతి యును దాంతియును, కడ కరఁగనీడు ముఖ కాంతియును జాంతియును. సీతారా. 3. 111.

సీ. పాయసాన్నంబుల బ్రాహ్మణోత్తముల సం, తృప్తులఁ గావించి భృత్యవర్గ, సహితుఁడై మౌనంబు సడలక పారణచేసిన స్వవ్రతశీలు పుణ్య ఫలము వచింతు. వరాహ. 8. 11.

కం. చింతిలి సుమంత్రు డా జగ, జంతం గైకేయిఁ జూచి సడలం దగదే, యింతట నభిషేకనిదా, ఘూంతావగ్రహము నీ దురాగ్రహ మింతీ. చంపూరా. 4. 54.

సడలుకొను అ. క్రి. తొలఁగు, పోవు (చూ. సడలు కొలుపు).

సడలుకొలుపు స. క్రి. సడలుకొనఁ జేయు, పోఁగొట్టు.

తే అఘ మొకింత యొనర్చిన నది యొకపుడు, గాలములు గొట్టు నాటి దుఃఖములు దెచ్చు, నెదుగఁ జేసిన తలయేరు మొదలుగాఁగఁ, గలుగు తెవులుల వేదన సడలు కొలుపు. మార్క. 2. 87.

సడలుచు స. క్రి. చూ. సడల్చు.

సడలువడు అ. క్రి. (సడలు+పడు) – సడలు.

వ. సడలువడని కడింది. అచ్చ. రా. బాల.

సడలువ(ప)అచు స. క్రి. సడలఁజేయు.

ఎ.గీ....అనేకపదన, పదనసంచార ఖేదంబు సడలు పఱిచి, భారతీదేవి నీ జిహ్వఁ జాదుకొనియె. పరసభూ. 1. 15.

సడల్చు – సడలిచు. స. క్రి. సడలఁజేయు, వదులు చేయు.

ఉ. ... అమ్మహిఁ,కాంతు నముజ్జఁ బెట్టి బిగఁగట్టుల వెల్ల సడల్చ. శుక. 1. 391.

ఎ. గీ. అదర పెడుగైన నిడువాలుజడ సడల్చి, కుప్పెగవ్వద సవరంపు గొప్పువెట్టు. హంస. 1. 216.

చం. జలకము లాడఁగోరి బుగుసాపని చీర సడల్చి సందులో,పలికిఁ జనంగ నీదు మనుఁబల్కు వినంబడఁ దల్చుఁదియఁగా, వెలువడి వచ్చితిన్ వలపు పెల్లువదొట్టఁగ నంచే నాయకుం, గులుకు మిటారిగబ్బి చనుగుబ్బల గౌఁగిటఁ జేర్చి పల్కినన్. హంస. 2. 64.

తే. అటుల పంతఃపురంబున కరిగి విభుఁడు, కొలువు సింగారము సడల్చి కొందఱ నుడి,గంపుఁ గుంభ స్తనుల జలకంబుఁ బట్టుఁడనుచు. సారంగ. 2. 191.

వ. అప్పడంతు లప్పద్మాలయ జలవిహార దోహలంబునఁ జలుగుపుత్తడి వలువలు సడల్చి పావడలు దాల్చి శృంగంబులు గైకొని యొయ్యనొయ్య నొయ్యారంబు మించ డిగ్గి యపుడు. చంద్రికా. 4. 68.

2. తెఱచు.

ఎ. గీ. పాదములఁ గిల్లుకిల్లని పలుకుమెట్లుఁ, గుచ్చు ఒడ్డాలు జేపట్టుకొలయమర, రెడ్డిప్రియురాలి వాకిట బ్రేమ నిలిచి, వాకిలి సడల్చు మనుమఁ బిల్వంగ నపుడు. హంస. 3. 60.

సడవ వి. మార్గము.

సీ. మార్గంబు తెరువుత్రోవ దారి తెమ్ము సరవిచనువ సడవ చొప్పుజాడ డొంక యనంగఁ బొలుచుచుండు ఆం. భా. 2. 8.

సడాక = సలాక (సం. శలాకా) వి. కడ్డి.

కం. మేలి కడానిసడాకల, పోలిక గల యిఱుగు పొరుగు పొలఁతులతో నా, పాలిక జాలిక. శుక. 2. 460.

**నడి** వి. నింద, దూఱు, అపవాదు.

సీ. ఆఱడి యపసిడి యగడౌరు దూఱు దూరుడి సంతు నడిరోయి రోఁతరొచ్చు...అపవాద సంజ్ఞయై యలరుచుండు. ఆం. భా. 1. 115.

సీ. కువలయంబు దినంబుఁ గూల్చునాడిక బంధు, జీవ మూమోదిగాఁ జేయనినడి. వసు. 1. 107.

మ. కడు శేఁత్రాయపుఁబావచన్నుఁగవ శృంగారంబు బోనాడి యీ, కడుపన్ నేనును బోయి త్రోల నిలువం గన్నయ్య శాపత్యమెం, చరె విన్నయ్యలు విశ్వసింపుదురె యే సంబంధమున్ లేని యీ, నడి నావంటిలతాంగికిన్ విధి ఘటించన్ జెల్లునే యక్కటా. ఉ. రా. 1. 185.

2. జాడ.

కం. అప్పుడు గోత్రవిఘాతిక, కుప్పతియుతుఁడై ధరిత్రిఁ గూలివసించెన్, ముప్పిరిగొనియెడి వగ నడి, చప్పుడు గాకుండఁ బ్రాగ్దిశాకోణమునన్. వరాహ. 8. 60.

**నడింపులు** వి. బ. ఎసటిపోఁతలు. ఆహత తండులములు.

సీ. ఆహత తండులాహ్వయము లెసటిపోఁత లవ నడిఁపు లనఁగ నలరుచుఁడు. ఆం. భా. 2. 254.

ఎ. గీ. బ్రహ్మచారి భుజంబు మాత్రకు నడింపుఁ బ్రాలు. ఆము. 6. 71.

**నడికియ** వి. కుక్కమెడకుఁ గట్టుత్రాడు.

గీ. తగును నడికియ యనఁగను శ్వగళరజ్జు. ఆం. భా. 2. 270.

ద్వి. నడికెలు దుయ్యడు సారమేయములు. బస. పురా. 139 పు. 11 పం.

**నడికుడక** వి. భక్ష్యవిశేషము. హంస. 1 ఆ (శ. ర.) (నడకుడక అని అచ్చుప్రతి 1. 105.)

**నడికె** వి. నడికియ.

ద్వి భాగ. 5. స్కంధ (శ. ర.).

**నడిగొట్టు** అ. క్రి. నింద గలిగించే.

ద్వి. కూడుగూరకు నడిగొట్టక యడిగి. హరిశ్చ. ఉత్త. 1686.

**నడిలు** నడలు. అ. క్రి. (క. నడిలు) తగ్గు.

కం. దివమణఁగఁ జీఁకటియును,గోపముడుగ శాంత గుణముఁ గోల్కొను క్రియ నాటోపోద్భటమగు వేసవి నడిలంఁదోఁచెఁ గారుకాలము దళమై. పాండురంగ. 4. 16.

**నడిల్పు** స. క్రి. జాఱఁజేయు (√నడిలు) (శ. నడిలిచు).

చం. కనకపుఁ బేరుసోయగము గల్గినముత్తెపుఁ గ్రొత్త తొట్లలో, నునిచి యనర్ఘ రత్నముల నొప్పగు గుత్తులు ద్రోలఁ ద్రేలఁగఁ,ట్టిన వెలఁగంది తెప్పలు నడిల్పక తారకయోగమార్గ దర్శనరతులట్లఁ గన్గొనఁగ సాగిరి కన్యలవన్యచిత్తలై. కాళ. 4. 12.

**నడిసన్న** విశ. నింద తొలఁగిన, కీర్తికెక్కిన.

నడిసన్న అనఁగా నడిచనిన యని భారత ప్రయోగముల వలన నేర్పడుచున్నది. అయినను పరబంధముగా నిట నీయఁబడినది. నడిసన్నవాఁడు. భార. విరా. 3. నడిసన్న యేత్రైత. విరా.

ఆ. నడిసన్నయాప్తయోధులు శాం. 2. (శ. ర.).

చం. అనుదు వతండు హంసడిభకానుమతంబున రాజసూయమున్ జనపతి పేయబూని భుజసారమునన్ నడిసన్నరాజులన్, ధనములు చోలఁదెండని పదంపడి దేవర యున్న చోటికిన్, వనుఁ బనివంపె నిన్ను యజనంబున మున్నిడిచేయు వాఁడుగాన్. ఉ. హరి. 4. 151.

ద్వి. నడిసన్న శివభక్తి సౌభాగ్య మహిమ, లొడఁ గూడునే వెండి యొండు మార్గమున. బసవపు. 3. పుట 143.

వ. మొదలనుండియు సకల కళల నడిసన్నచదురుల ప్రోదిఁ బెరిగినది గాఁబోలుఁ గాలిపెండెరంబు వొక్కటి గలిగియున్నది. ప్రభా. 3. 86.

సీ. త్రైలోక్య జననియై తనరుశర్వాణికి జనకుండు నా నడిసన్నవాఁడు. కు. సం. 7. 65.

చం. అని నడిసన్న యేత్రైత బృహన్నలకుం గల దంబుజాననా. భార. విరా. 4. 15.

గీ. అతని యాశ్రితులం దెల్ల నధికుఁ డనఁగఁ, జతు రుఁడన ధర్మ్యుఁ డన నడిసన్నవాఁడ. వాసిష్ఠ. 1.40.

చం. గురుఁడును భీష్ముఁడుం జనిరఁ గొంచెపు మూ కలతోడ నేను నం, గర విజయంబు గోరి భుజగర్వ మునన్ నడిసన్న పాండుభూ, వరమతవర్గముం దొడరువాఁ డన నా మది నిశ్చయించె నెవ్వరిఁ గొని యింత నీవెఱుఁగవా నిముఁ గర్ణునిఁ గాదె నమ్మితిన్. భార. కర్ణ. 1. 246.

**సడుగు** వి. 1. వక్రోక్తి.

సీ. ... సడుగునా వక్రోక్తి యడరుచుండు. ఆం. భా. 1. 118.

2. కటి ప్రదేశమందలి కీలు.

కం. ... బాలుం, డడుఁగిడఁ దొడఁగెను శాత్రవు, లడుగులు సడుగులును వదలి యడుగవనిఁబడన్. భాగ. 10 స్కం. పూ. 298.

**సడ్డ**[1] వి. (సం. శ్రద్ధా. క. సడ్డ. ప్రా. సద్ధా) 1. శ్రద్ధ, ఆసక్తి.

గీ. వార లివ్వలికతయును వలను మీఱఁ దెలుపవే యని సడ్డతోఁ బలుకుటయును. నీలా. 1. 116.

సీ. నిను మ్లేచ్ఛనీరీతి విని సడ్డసేయరు మించి నీగుణ మాక్రమించఁగలరు. వేంకటాచలమా. 4. 130.

2. ఆదరము.

ద్వి. వడ్డింపఁ దపసియు వడి నారగింప, సడ్డలు చేయుచుఁ జప్పరింపంగ. బస. పురా. 157 పు. 18 పం.

3. లక్ష్యము, గణుతి.

ఎ. గీ. మఱియుఁ దల కొకమాటఁగా మానినాథ, తాను మన సడ్డసేయక తపని నిజమ్ము,గంబు లెట్టల్ల వారును గన దొలంగి, కలగఁనిమ్మని శాపోదకంబు విడిచె. చంద్రభా. 8. 19.

ఉ. శంకరతుల్యుఁ డైన శరజన్మునిఁ జూడక యేగు చుండఁ ద,త్పంకజ గర్భుపైఁ గినుక పర్వఁగుమా రకుఁడార వీఁడు ని,శ్శంకతఁ బోవుచుండె నను సడ్డ యొనర్పక యంచు నుగ్రుడై, కింకరు చేత రాఁ బనిచి గీష్పతితో నిటుఁ బల్కె నత్తఱిన్. చెన్నబ. 1. 26.

ఉ. బిడ్డయొ పాపయో చిటిమిపెట్టిన కైవడి నున్న నిమ్నుఁ దా, సడ్డ యొనర్ప కవ్వలఁ బిశాచము వంటి గరాముఁ గూడె నీ, యడ్డెఁడు. శుక. 1. 488.

**సడ్డ**[2] వి (సం. స్పర్ధా) ద్వేషము.

ద్వి. చాకి నింతేల సడ్డలు జనులఁ, జెకొన కడిచెదు తేరఁగనీక. బస. పురా. 82 పు. 19 పం.

**సడ్డ**[3] (సం. జడః) జడుఁడు, అల్పుఁడు.

ద్వి. షోడ్డల దేవుతో పోమేశుతోడ, సడ్డల దైవ ముల్ చర్చింప సరియె. బస. పు. 6. 860 పం.

**సడ్డకుఁడు** వి. (సం. షడ్డకః. ప్రా. సడ్డఓ) తోడి యల్లుఁడు.

**సడ్డసేయు** (సడ్డ+చేయు) స. క్రి. 1. సరకు సేయు, లెక్కసేయు.

తే. ఇందు ర మ్మని పిలువఁ గాళింది యతని, మత్తుఁ డని సడ్డసేయక మసలుటయును. భాగ. 10 స్కం. ఉత్త. 499.

కం. ఈకరణిఁ జారుభాస్వతి, యాకాంక్షలుదీఱ వాఁ డహర్నిశ మతనిన్, డీకొల్పి రతులఁ బవురుం జే కత్తివజీరు సడ్డసేయక యుండెన్. హంస. 2. 170

కం. ఈతీరు సకలభోగము, లాతతగతి నడచుచుండ నాధూర్తాఖ్యుం, డాతలిరుఁగుత్తి గల దొర, చేతి కటారికిని సడ్డసేయక యుండెన్. హంస. 2. 208.

చం. సరకు గొనండు నన్నుఁ దనచాయల వాలి నడంచె మత్పురం, దరవిభు సడ్డసేయక యితండని రాఘవునాలి జాలి ము, న్నరకకుఁ దెచ్చు పోలిక ఘనాఘనమాలిక. చంపూరా. 6. 52.

తే. సామివాని చలంబు మచ్చేరము బలిమి, యెక్క దేవంక నేమని యెంచవచ్చు, నొకటి నొక్కటి సడ్డసేయక మెలంగు, నా పొలంబున, దరతరంబై మెకములు. సారంగ. 1. 63.

కం. ఈ కైవడి నెచ్చెలి తన యాకాంక్షలు దీర్ప నిర్భరానందముతో, నా కోడెకాఁడు చివురుం, జే కత్తి వజీరు సడ్డసేయక యుండెన్. శుక. 2.86.

**సడ్డసేయు** అ. క్రి. ఆదరించు.

గీ. తానుగాఁ గోరివచ్చిన తరుణి యగుట, సడ్డ సేయక యాతఁడు చౌకసేయు. పార్వ. 4. 79.

**సడ్డించు** (క. చడ్డిసక్) అ. క్రి. అలక్ష్యము సేయు.

**సత్తి** (సం. శక్తిః, త. చత్తి, క. సకుతి. తు. సకతి.) వి. బలము, సత్తువ.

సీ. లావు సత్తి సత్తువ బల్మి పిఁచ మోపిగ యన వెలయు శక్తి. అం. భా. 2. 221.

ఎ. గీ. హత్తి మిచ్చి చందంబున హత్తి వెడఁద,శత్తి గుత్తికను బిఱావఁ గత్తిరించి, సత్తి మత్తిల్ల బలి చేసె సత్తి నొక్కఁ డవనిపతి యిచ్చుమేలు మే లను చు మెచ్చ. చంద్రా. 2. ఆ. (శ. ర.)

2. శక్తి. ఆయుధ విశేషము.

తే. మున్ను నెత్తమ్మిచూలిచేఁ గొన్నయట్టి, సత్తి యనుతూపు నిగిడింప. అచ్చ. రా. యు. కాం. 218.

ఆ. మత్తగిల్లు వత్తుగిత్త తత్తడినెక్కి మిత్తిమొత్తి సత్తిసత్తిబత్తిఁ, బత్తిరిడిన ముత్తిబుత్తులు రెండును, నొత్తి గుత్తగట్టుచుండు ఱేఁడ. నీలా. 1. 120.

4. శక్తి యను ముని. (వసిష్ఠుని కొడుకు)

ఆ. అప్పుడదను చెయ్యులలరించి సత్తి యబ్బయు. అచ్చ. రా. అ. కాం. 82.

**సత్తిగలాఁడు** సత్తి గలుగు మేటి. వి. కుమారస్వామి ఇక్లే పత్తిబానువలంతి, (సాం. ని దే. 7) (సత్తి తాలుపు అని శ. ర.).

**సత్తితాలుపు** వి. కుమారస్వామి, శక్తిధరుఁడు.

**సత్తు**[1] వి. మెత్తని లోహ విశేషము, తగరము. (వ్యవ. సత్తుగిన్నె., సత్తుకంచము మొ.)

**సత్తు**[2] (సం. సక్తుః) వి. పిండి.

సీ. ... పిష్టంబు పిండినా సత్తునా వెలయుచుండు. అం. భా. 2. 254.

**సత్తు**[3] వి. (సం. శక్తిః) బలము, చేవ.

**సత్తు**[4] వి. సత్యము.

**సత్తు** సం. వి. త్. న. నక్షత్రము.

**సత్తు** సం. విశ. 1. ఉన్నది. 2.చదువరి. 3.పూజ్యము. 4. శ్రేష్ఠము. 5. సత్యము. 6. సాధువు.

**సత్తువ** (సం. సత్త్వమ్, త. సత్తువమ్, క. సత్తు. వ. స తువు, తు. సతువ.) వి. దేహబలము. లావు, సత్తి, సత్తువ, బల్మి, పిచ మోపిక యన వెలయు శక్తి. అం. భా. 2. 221.

**సత్తెనంగ** వి. సస్య విశేషము.

ద్వి. సత్తెనంగ వెడంగ సత్తయ్యె. విష్ణు. పూ. 3. (శ. ర.)

**సత్త్రపరివేషణము** సం. వి. అ. న. యాగమున నాహారము పెట్టుట, యజ్ఞమునం దాహార పదార్థ ములు పంచిపెట్టుట.

**సత్త్రము** సం. వి. అ. న. 1. యాగవిశేషము, పద మూఁడు మొదలు నూఱుదినముల వఱకును జేయఁ బడు యాగము

కం. ... సద్గుణసముదాయ మ్మొనఁగఁజేసి సత్త్ర యాగము నిష్ఠన్. భార. ఆది. 4. 3.

2. యజ్ఞము 3. ఆహుతి, వేలిమి. 4. సదాదనము, దక్షిణతోడి సతతాన్నదానము. 5. దాతృత్వము, ఔదార్యము. 2. ఇల్లు. 7. కప్పు, ఆచ్ఛాదనము. 8. ధనము. 9. అడవి. 10.చెఱువు. 11. మోసము, వంచన. 12. శరణము, రక్షణస్థానము, ఆశ్రయము.

**సత్త్రశాల** సం. వి. అ. స్త్రీ. ధర్మశాల, అన్నదానము చేయుట కేర్పడిన గృహము, సత్తరువు.

ద్వి. చలిపందిరులు సత్రశాలలు గుండ్లఁ జెలమలు నంతంతఁ జేయఁ బంచుచును. పండితా. పర్వత. పుట. 352.

**సత్త్రా** సం. అవ్య. సహార్థకము, కూడ, తోడ (దీనికి సహ యనెడి యవ్యయమునకు వలెనే సమాసపూర్వ పదముగాఁ బ్రయోగ ముండవచ్చును.

**సత్త్రాపశ్రయము** సం. వి. అ.పుం. రక్షకస్థానము, శర ణము, ఆశ్రయము (విల్యమ్సు)

**సత్త్రాయణ(న)ము** సం వి. అ.న. దీర్ఘ కాలము జరుగు యాగమునకు సంబంధించిన సభ.

**సత్త్రి** సం. వి. న్. పుం. 1. అవిచ్ఛిన్నముగా యాగ ము చేయువాఁడు. 2. దాతయైన గృహస్థు. 3. యాగమున నుపద్రష్టగా నుండు ఋత్విక్కు.

**సత్త్రి** సం. వి. ఇ. పుం. 1. మేఘము. 2. ఏనుఁగు.

సత్త్రి సం. విశ. జయశీలుఁడు.

సత్త్వము సం. వి. అ. పుం. న. 1. సత్త, ఉనికి. 2. స్వభావము, నిసర్గము. 3. నైసర్గిక గుణము, పుట్టుకతో వచ్చిన గుణము. 4. ప్రాణము. 5 తెలివి, ఎఱుక, చిత్తము. 6. భ్రూణము, కడుపులోని శిశువు

కం. ఆపన్నసత్త్వయావగ, యాపగిదిన్నీరుమోసి. వసుచ. 3. 21.

7. ద్రవ్యము, పదార్థము. 8. భూమి, జలము, వాయువు మొ. పంచభూత సంబంధమైన పదార్థము. 9. ప్రాణి, జంతువు

సీ. విమదెల్ల సత్త్వంబులమ వెంటజంపుట, పాపంబు ....భార. శాంతి. 3. 182.

కం. ... దుష్యంతమహాబల మందరనగము సత్త్వ భయజనవంబై . భార. ఆది. 4. 11.

10. పిశాచము. దయ్యము. 11. మంచితనము, సుగుణము. 12. సత్యము, యాథార్థ్యము. 13. బలము, శక్తి.

మత్తకోకిలము. పాము లెగ్గొనరించె మత్ప్రియ భామకేను రురుండ నుద్దామ సత్త్వుడ. భార. ఆది. 1. 154.

తరలము. వినుతసత్త్వులఁ గోరెఁ గద్రువ వేపురం గడు వేడ్కతోన్. భార. ఆది. 2. 8.

కం. నారాయణుండు వారిక, వారితజన సత్త్వములు ధ్రువంబుగ నిచ్చెన్. భార. ఆది.

14. జ్ఞానము, మంచితెలివి, వివేకము, 15. సత్త్వరజస్తమోగుణము లనెడి త్రిగుణములలో మొదటిది, సత్త్వగుణము.

కం. ...తమో, ధీనతను రజఃపరత, న్మానవవలయుఁ గాక సత్త్వనైష్ఠికమతియై. భార. శాంతి. 6.281.

గీ. సత్త్వమార్గాభిరతి యాత్మతత్త్వదర్శనంబు గావింపఁ దమఁదావ వరుఁడు గాంచు. భార. 6. శాంతి. 281.

16. విశేషధర్మము. నైసర్గిక లక్షణము, 17. విశేష్యము, నామవాచకము.

సత్త్వమేజయము సం. విశ (అ. ఆ. అ ) జంతువులను బెదరించునది, ప్రాణి భయంకరమైనది.

సత్త్వలక్షణము సం. వి. అ. న. గర్భచిహ్నము.

సత్త్వవంతుఁడు సం. విశ. (త్. వత్. త్.)(సత్త్వము గలవాఁడు) 1. జీవించి యున్నవాఁడు, ప్రాణమున్నవాఁడు. 2. సహజమైన సారము గలవాఁడు 3. మంచివాఁడు, సద్గుణములు గలవాఁడు. 4. ధైర్యము గలవాఁడు.

సత్త్వసంప్లవము సం. వి. అ. పుం 1. బలనాశము, బలక్షయము, ఉత్సాహభంగము, 2. ప్రపంచ నాశము, ప్రళయము.

సత్త్వసంశుద్ధి సం. వి. ఇ. స్త్రీ. స్వభావశుద్ధి, స్వభావము యొక్క పారిశుద్ధ్యము.

సత్త్వసారము సం. వి. అ. పుం. 1. బలము యొక్క నిగ్గు, 2. మిగులబలము గల దేహము.

సత్పత్రము సం. వి. అ. న. క్రొత్త తామర రేకు. సం. విశ. (అ. ఆ. అ ) మంచి పత్రములు గలది.

సత్పథము సం. వి. అ. పుం. 1. ప్రశస్తమైన మార్గము మంచిదారి, 2. సరియగు పద్ధతి, సన్మార్గము, మంచి నడవడి. 3. ప్రాచీన సిద్ధాంతము. 4. నక్షత్ర మార్గము. 5. ఆకాశము.

సత్పరిగ్రహము సం వి. అ. పుం. యోగ్యుని వలన దానము పుచ్చుకొనుట.

సత్పాత్రము సం. వి. అ. న. దానమునకుఁ దగినవాఁడు.

సీ. ...అన్నపాలుం డపూర్వసంబంధి మూరి యాజి తపోనిత్యులందు సత్పాత్రము లెవ్వార లనుటయు. భార. అను. 2. 36.

అర్హుఁడు.

సత్పాత్రవర్షము సం. వి. అ. పుం. తగినవానికి దానము చేయుట.

సత్పాత్రవర్షి సం. విశ. (న్. ణీ. న్.) తగిన వానికి దానమిచ్చువాఁడు.

సత్ప్రతిపక్షము సం. వి. అ. పుం. (తర్క.) హేతు దోషము, హేత్వాభాసములలో నొకటిఁ వ్యతిరేక పక్షమును సాధించుటకుఁ గూడ హేతువగునట్లు చెప్పెడు హేతువు.)

సత్ఫలము సం. వి. అ. పుం. దానిమ్మచెట్టు. (వృ.వి.)

సత్య సం వి అ. స్త్రీ. 1 సత్యము, నిజము. 2. సీత, 3. ద్రౌపది. 4. వ్యాసుని తల్లి యగు సత్యవతి. 5. దుర్గాదేవి. 6. కృష్ణుని భార్య యగు సత్యభామ.

సత్యంకారము సం. వి. అ. పుం. 1. నిజమైనదిగాఁ జేయుట. ధ్రువపఱుచుట, ఒడంబడిక, అంగీకరించుట. 2. ముందుగా నిచ్చెడి సొమ్ము, (ధరావత్తుగా నిచ్చిన సొమ్ము.).

సత్యకము సం. విశే. (అ. ఆ. అ) సత్యము.

సత్యకము సం, వి. అ. న. 1. ఒడంబడిక మొదలగు వానిని స్థిరపఱుచుట.

సత్యదర్శి సం విశే. (న్. ణీ. న్,) నిజమునుగనిపట్టువాఁడు.

సత్యదేవుఁడు సం. వి. అ. పుం. సత్యనారాయణస్వామి.

సత్యపురము సం. వి. అ. న. విష్ణులోకము, వైకుంఠము

సత్య ప్రతిష్ఠానము సం. విశే. (అ. ఆ. అ.) సత్యము మూలముగాఁ గలది, సత్యము నాశ్రయించి యున్నది.

సత్యఫలము సం. వి. అ. పుం. బిల్వము, మారేడు. (వృ. వి.).

సత్యభామ సం వి. అ. స్త్రీ. (శ్రీ) కృష్ణుని భార్యలలో నొకతె. ఈమె సత్రాజిత్తు కూఁతురు.

సత్యము సం. విశే. (అ. ఆ. అ.) 1. నిజమైనది, యథార్థమైనది. 2. కాపట్యము లేనిది.

సత్యము సం. వి. అ. పుం. 1, సత్యలోకము, 2.అశ్వత్థవృక్షము.

సత్యము సం. వి. అ. న. 1. నిజము, యాథార్థ్యము. 2. నిష్కాపట్యము. 3. మంచితనము. 4 ఒట్టు. శపథము. 5. ప్రత్యక్షమైన నిజము, ఋజువు చేయఁబడిన నిజము. 6. కృతయుగము. 7. నీరు, జలము. 8. పరబ్రహ్మము.

సత్యమూలము సం. విశే. (అ ఆ. అ). సత్య ప్రతిష్ఠానము.

సత్యయుగము సం. వి. ఈ. స్త్రీ. కృతయుగము.

సత్యరతుఁడు సం. విశే. (అ. ఆ. అ.) సత్యము నందాసక్తి గలవాఁడు. సం. వి. అ. వ్యాసుఁడు.

సత్యవతి సం. వి. ఈ. స్త్రీ. 1. వ్యాసుని తల్లి, పరాశరుని వలన వ్యాసునిఁ గనిన యామె. 2. నారదుని భార్య 3. ఋచీకుని భార్య.

సద్యవద్యము సం. విశే. (అ. ఆ. అ.) నిజమైన ఖ్యాతి గలది. వి. అ. న. నిజము, సత్య వచనము.

సత్యవాక్కు సం. విశే. చ్. 1. నిజమైన వాక్కుఁగలవాఁడు.

2. నిజము చెప్పువాఁడు.

సత్యవాక్కు సం. వి. చ్. పుం. 1. ఋషి, జ్ఞానదృష్టి గలవాఁడు, 2. కాకి,

సత్యవాక్యుఁడు సం. వి. అ. పుం. నిజమైన వాక్కుగలవాఁడు,

ఉ. మానిత సత్యవాక్య యభిమన్యుకులోద్వహా. భార. ఆది. 2. 231,

సత్యవాది సం. విశే. (న్. ఈ. న్.) 1. నిజమువలుకువాఁడు. 2. కాపట్యము లేనివాఁడు, మనసులో నున్నది పైకిఁ జెప్పువాఁడు.

సత్యవ్రతుఁడు సం.విశే. (అ. ఆ. అ.) సత్యమే వ్రతముగాఁ గలవాఁడు.

ఆ.....పితృ సమర్చకులును భిక్షుకాన్న పూత శాంత భావములు గలవారు సత్యవ్రతులును బూజ్యులవఘ నాకు. భార. అను, 2. 133.

సత్యశ్రావణము సం.వి.అ.న. 1. ఒట్టు పెట్టుకొనుట. 2. శపథము చేయుట.

సత్యసంకాశము సం. విశే. (అ. ఆ అ.) బయటికి సత్యముగాఁ గనఁబడునది.

సత్యసంగరుఁడు సం. వి. అ. పుం. కుబేరుఁడు.

సత్యసంగరుఁడు సం. విశే. (అ. ఆ. అ.) నిజమయిన ప్రతిజ్ఞ కలవాఁడు, ఆడితప్పనివాఁడు.

సత్యసంధ సం. వి అ. స్త్రీ. ద్రౌపది.

సత్యసంధుఁడు సం. విశ. (అ. ఆ. అ.) నిజమయిన ప్రతిజ్ఞ కలవాఁడు. వి అ. పుం 1. రాముఁడు. 2. భరతుఁడు, 3. జనమేజయుఁడు.

సత్యాకృతి సం. వి. అ. స్త్రీ. 1. ముందుగాఁ జెల్లించిన సొమ్ము, ధరావత్తుగా నిచ్చిన సొమ్ము.

సత్యాగ్ని సం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

సత్యానృతము సం. విశ. (అ. ఆ. అ.) 1. నిజమైనదియు నిజము కానిదియు. 2. పైకి సత్యముగాఁ గనఁబడుచు నసత్యమైనది.

సత్యానృతము సం. వి. అ. న. 1. సత్యాసత్యములు. 2. సత్యాసత్యవృత్తి, వాణిజ్యము, వర్తకము.

సత్యాపనము సం. వి. అ. న. 1. సత్యము పలుకుట. 2. ఒడంబడిక, బేరము మొదలగునవి స్థిరపఱుచుకొనుట.

సత్యాభిసంధుఁడు సం. విశ. (అ. ఆ. అ.) 1. నిజమయిన ప్రతిజ్ఞ కలవాఁడు. 2. ప్రతిజ్ఞ ప్రకారము వర్తించువాఁడు.

సత్యుఁడు సం. వి. అ. పుం. 1. రాముఁడు. 2. విష్ణువు 3. నాందీముఖ శ్రాద్ధమున కధిష్ఠాన దేవత

సత్యోద్యుఁడు సం. విశ. (అ. ఆ. అ.) 1. నిజము పలుకువాఁడు.

సత్యోపయాచనుఁడు సం. విశ. (అ. ఆ. అ.) కోరిక నెఱవేర్చువాఁడు.

సత్రము సం. వి. అ. న. సత్త్రము.

సీ. సత్రంబు సాలయుఁ జలిపందిరియు రచ్చకట్టము ప్రచ్చుట. భార. అను. 2. 61.

వ. వేంకటరంగ పిళ్ళ సత్రంబున విడిసితి. సీ యా. పు. 5.

సత్వరము సం. విశ. (అ. ఆ. అ.) వేగముతోఁ గూడినది. త్వరగలది.

కం. విని సత్వరముగ నటఁగొని చని యద్దేశమున గల్గు జనములు. భార. అను. 2. 245.

అవ్య. వేగముగా.

సత్సహాయుఁడు సం. విశ. (అ. ఆ. అ.) మంచి స్నేహితులు గలవాఁడు.

సత్సహాయుఁడు సం వి. అ. పుం. మంచి స్నేహితుఁడు.

సత్సారుఁడు సం. వి. అ పుం. 1. కవి 2. చిత్రకారుఁడు.

సథూత్కారము సం. విశ. (అ. ఆ. అ.) తుంపరలతోఁ గూడినది వి. అ. పుం. 1. తుంపరలతోఁ గూడిన మాట. 2. తుంపరలు పడునట్లు మాట్లాడుట.

సద (సం. ఛదః) (క. సదె=చెత్త) ఆకు, ఆకు మీఁది నూఁగు.

ద్వి. సదవ్రట సరివ్రట సరిగస్పుగ్రట, వెదకియు గావక మది విచారించి. బస పురా. 58 పు. 27 పం.

సదంజనము సం. వి. అ. న. ఇత్తడినుండి తీసిన యొక విధమయిన కాటుక, పుష్పాంజనము. (వాచ.).

సదంశ(క)ము సం. వి. అ. పుం. కర్కటకము, ఎండ్రి.

సదంశవదనము సం. వి. అ. పుం. నారాయణ పక్షి, రాఁబులుఁగు.

సదనము సం వి. అ. న. 1. ఇల్లు, భవనము

కం. ముదమునఁ గృష్ణుఁడు కుంతీ, సదనమునకుఁ జనియె. భార. ఉద్యో. 3. 181.

వ. విచిత్ర తర చిత్ర సదనాలంకృతంబును ..శివరహస్య. సంభవ. 3. 165.

ఉ. వచ్చిన కార్య మేమనుచుఁ బల్కిన వాతఁడు కూతువల్లునివ్, మచ్చికఁ బంపఁగా వలయు మానద నంబున కన్న. రాధికా. 2. 18.

2. క్షయము, తఱుగుదల, నశించుట. 3. అలయిక. 4. జలము. 5. యజ్ఞశాల. 6. యమ నివాసము, యమస్థానము. 7. కూర్చుండుట. 8. పీఠము.

సదమదమగు (√సదమదము) అ. క్రి. వలఁగు, మర్దిత (మృదిత) మగు.

కం. చదురాడ వద్యమని తోఁ, చ దురాడవసత్యమనుచు సదమదమయ్యెన్, మదిరావన వశమైనా, మది రావన వశమె మరులు మరులు మరలుపవింకన్. శృం. కాశం. 2. 22.

సదమదము విశ. నలఁగినది.

కం. ఇది మొన యిది వలు కిది పో, టిది మీ టిది ధుము కిదె యిదె యని శా,రుదిరిపడి పండ్లు గీటుచు, సదమదముగఁ గాలు గేలు జంట బెనంగన్. ప్రబం. 1. 786.

(ఇ. సదమదమగు, సదమదము చేయు, సదమద మొనర్చు)

వ. కళల యిక్కువలు దెలిసిన యదన మదన కద నంబున సదమదంబు లగు నంగంబులు. వసు. 4. 28.

**సదమదము చేయు** √సదమదము. స. క్రి. 1. మర్దిత మొనర్చు, నలఁగఁగొట్టు. 2. చంపు.

ఆ. సదమదంబు చేసెఁ జక్కాడె నుగ్గాడె.... హతము చేసె ననుట కాఖ్య లయ్యె. ఆం. సం. మాన. 47. 50.

**సదమద మొనర్చు** స. క్రి. చంపు, వధించు.

కం. పదిమోముల రక్కసుని క, సదమద మొన రించి కొలుల సంతసమున న,మ్మిదిలదొరబోదఁ జేకొని, మెద వెదలో దిటము విడకు మింతయుఁ దండ్రీ. అ. రా. కిష్కింధా. 51.

**సదము** సం. వి. అ. పుం. చెట్టుపండు.

**సదము** సదస్సు. సం. వి. న్. స్త్రీ. న. సభ.

ఆ. సదములోని విప్రజనుల మీఁద నెగడుపడఁగ. భార. ఆది. 2. 180.

ఉ. ధీయుత! యంచు ధర్మజనదీసుత కృష్ణుల నెగ్గ లాడుచుం, బోయె సదంబు వెల్వడి సపుత్రబలుం డయి చైద్యుఁ డల్కతోన్. భార. సభా. 2. 15.

**సదయము** సం. విశ. (అ. ఆ. అ.) దయతోఁ గూడి నది.

మ. ఇదిగో వచ్చెదనంచుఁ బోయె బహు వాళ్ళెగెన్ మహాబ్దంబులై, సదయుండేటికి రాఁడు నా యెడ కటాక్షంబెల్ల బో నాడెనో. రాధికా. 2. 61.

**సదరహి** హి. విశ. (రూ. సదరు) పైని చెప్పినది.

**సదరుబోయలు** వి. బ. ఒకజాతి బోయలు.

**సదనద** విశ. సదమదము. (క. సదె, సదెబడి. తు. సది, సదనదవు)

చం.... కక్కసంబులన్, సదనద గాగ వ్రేసియును. జై. భా. 4. 77. (శ. ర,)

**సదసద్వివేకము** సం. వి. అ. పుం. 1. మంచిచెడ్డలు వేఱుపఱుచు తెలివి.

కం. ఎట్టి విశిష్టకులంబునఁ, బుట్టిన సదసద్వివేకము లు గలిగిన. ... భార. ఆది. 5. 58.

**సదస్యుఁడు** సం. వి. అ. పుం. 1. రాజసభలో నున్న పురుషుఁడు.

చం. అనిన సదస్యులందఱుఁ బ్రియంబున. భార. ఆది. 2. 232.

శా.... సుతశిష్యబ్రహ్మసంఘంబుతో సద్వంద్యుండు సదస్యుఁ డయ్యెననివన్.. భార. ఆది. 2. 228.

సభాసదుఁడు. 2. యజ్ఞమున సాహాయ్యము చేయు ఋత్విక్కు. యజ్ఞమున న్యూనాతిరిక్తతా విపర్యయ పరిహారమునకై విధానమును జూచుచుండెడి ఋత్విక్కు.

**సదస్సు** సం. వి. స్. న. 1. నివాసము, ఉనికిపట్టు. 2. సభ.

**సదా** సం. అవ్య. ఎల్లప్పుడు.

కం. ఈ రెండు కారణముల ము,రారాతియయర్ఘ్యలి మునకు నర్హుఁడు జగదా,ధారుండు మాకకాదు స,దారాధ్యుఁడు విష్టపత్రయావాసులకున్. భార. సభా. 2. 26.

శాశ్వతముగా,

**సదాగతి** సం. వి. ఇ. పుం. 1. వాయువు. 2. సర్వేశ్వరుఁడు. 3. సూర్యుఁడు. 4. మోక్షము, శాశ్వతానందము.

**సదాచారము** సం. వి. అ. పుం. 1. మంచి నడవడి, సత్ప్రవర్తనము.

కం. సాగగదాధారసదా, చారసదాతమని నూత్న చారుతరోద్య, న్మారజితాకారయుతా. రాధికా. 4. 112.

2. శిష్టాచారము.

**సదాటు** విశ. వక్రోన్నతము.

ఒప్పును సదాటు నాగ వక్రోన్నతంబు. ఆం. భా. 8, 19.

2. దృఢము, బలము గలది.

సీ. గాటంపు వీఁక సదా నైన మేనుల నెఱిమట్టి నిగనిగల్ వారువుమీఱ. శశాం. 2. 16. (శ. ర.)

సదాతమఁడు నం. విశే. (అ. ఆ. అ.) ఎల్లప్పుడు నుండువాఁడు. వి. అ. పుం. విష్ణువు.

సదాతోయ నం. వి. ఆ. స్త్రీ. 1. కరతోయానది. 2. ఎల్లప్పుడును నీరు గల నది, ఎప్పుడును ప్రవహించు నేఱు.

సదాత్ముఁడు నం. విశే. (న్.) మంచివాఁడు, మంచి మనస్సు గలవాఁడు.

సదాదానము నం. విశే. (అ. ఆ. అ.) 1. ఎల్లప్పుడును దానము కలది. 2. ఎల్లప్పుడును దానము చేయునది. 3. ఎల్లప్పుడును మదముకార్చునది (ఏనుఁగు). వి. అ. పుం. 1. ఐరావతము. 2. గంధద్విపము, మదపుటేనుఁగు.

సదాదానుఁడు నం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు. 2. విఘ్నేశ్వరుఁడు.

సదానందుఁడు నం. విశే. (అ. ఆ. అ.) ఎల్లప్పుడు నానందము గలవాఁడు, నిత్యసంతోషి. వి. అ. పుం. శివుఁడు.

సదానర్తము నం. వి. అ. పుం. కాటుకపిట్ట, ఖంజరీటము.

సదాప (హిం. సదాప్. త. సదాప్పు. క. సదాప, సజాబు. తు. సదాపు, సదాబు. సం. శతపుష్ప అని కిట్టెలు) వి. ఒకానొక చెట్టు, మధురిక.

సీ.....అలరుసదాప యంచన మధురిక. ఆం. భా. 1. 59.

సదాపుష్పము నం. విశే. (అ. ఆ. అ.) ఎల్లప్పుడును పువ్వులు గలది.

సదాపుష్పము నం. వి. అ. పుం. నారికేళము (వృ. వి.).

సదాప్రసూనము నం. వి. అ. పుం. 1. రోహితము, ములుమోదుగ (వృ. వి.). 2. అర్కము, జిల్లేడు (వృ. వి.). 3. కుందము, మల్లె (వృ. వి.).

సదాఫలము నం. విశే. (అ. ఆ. అ.) ఎల్లప్పుడు పండ్లు గలది.

సదాఫలము నం. వి. అ. పుం. 1. బిల్వము, మారేడు చెట్టు. 2. పనసచెట్టు. 3. ఉదుంబరము, మేడిచెట్టు. 4. నారికేళము, కొబ్బరిచెట్టు.

సదాభవ్యుఁడు నం. విశే. (అ. ఆ. అ.) ఎల్లప్పుడు సన్నిధి నుండువాఁడు.

సదాముస్తె వి. ఒకానొక చెట్టు (శ. ర.). జెముడు అని బ్రౌ.

గీ. నేలతీట కసిందయు గోలజెముఁడు, బొంతజెముడల్లియును సదాముస్తె మొదలు, గాఁ గలుగునట్టి చిఱుచెట్లఁ గాంచి యంత. హంస. 4. 10. (బ్రౌ. పా.)

సదాయోగి నం. వి. న్. పుం. 1. కృష్ణుఁడు. 2. విష్ణువు.

సదాశివుఁడు నం. వి. అ. పుం. శివుఁడు.

కం. జయ జయ శర్వ! సదాశివ!, జయ జయ రతిరాజ విజయ! జయజయమృత్యుం, జయ... నిరంకుశో. 3. 53.

సదృక్షము నం. విశే. (అ. ఈ. అ.) 1. పోలినది, సమానమైనది.

కం. దశారామంబునకు స, దృక్షంబగునట్టి పుణ్యతీర్థము గలదే. భీమ. 2. 20.

2. యుక్తమైనది, ఉచితమైనది. 3. అర్హమైనది, తగినది.

సదృశము నం విశే. (అ. ఈ. అ) సదృక్షము.

సీ. సంకల్పభవభూత సదృశకర్ణాకల్ప కల్హార సౌరభాగత మదాళి. శృం. నై. 5. 5.

సదృశస్పందనము నం. వి. అ. న. ఉచితవిధముగ (నాడి) కదలుట, ఇట్లే సదృక్షస్పందనము.

సదేశము నం. వి. అ. పుం. సామీప్యము, చేరువ.

వ. రామధేను రామానుజ నాయక నామధేయుని సదేశంబునకుం బోయి యా రేయి తన్నివేశంబున నిష్టగోష్ఠిం బరితుష్టుండనై. సీ. యా. పు. 3.

సదేశుఁడు నం. విశే. (అ. ఆ. అ.) 1 దేశముతోఁ గూడినవాఁడు. 2. సమాన దేశపువాఁడు. 3. పొరుగువాఁడు.

సదోషము నం విశే. (అ. ఆ అ.) 1. దోషముతోఁ

గూడినది. 2. లోపములు గలది. 3. తప్పయినది, తగనిది.

**సద్గతి** నం. వి. ఇ. స్త్రీ. మంచిస్థితి, ఉత్తమలోకము.

గీ. రెండుకులములయందు గలుగు పితృగణంబుల నెల్ల సద్గతిక బుచ్చు... భార. అను. 2-111.

**సద్గుణము** నం. విశే. (అ. ఆ. అ.) మంచిగుణములు గలది,

**సద్గుణము** నం. వి. అ. పుం. మంచిగుణము, మంచితనము.

**సద్దు** వి. (సం. శబ్దః. ప్రా. సద్ద. త. సద్దమ్. క. సద్ద, సద్దు) ధ్వని, చప్పుడు.

సీ. మ్రోఁత నాదు రవళి మ్రోఁగుడు సద్దులి వలికిడి చప్పు డలుకు డనఁగ శబ్దం బొప్పు. ఆం. భా. 1. 121.

**సద్దుసేయు** అ. క్రి. √సద్దు. శబ్దమొనర్చు, ధ్వనించు, చప్పుడు సేయు.

**సద్ధర్మము** నం. వి. అ. పుం. ఉత్తమధర్మము.

ఆం. నాకుఁ జూడ మత్స్య నరపతి సద్ధర్మవర్తి. ... భార. విరా. 1. 64.

**సద్ధేతువు** నం. వి. ఉ. పుం. దోషము లేని హేతువు.

**సద్భావము** నం.వి.అ.పుం. 1. సత్త, ఉనికి, ఉండుట. 2. యాథార్థ్యము.

మత్తకోకిలము.

...ఎల్లయందును ధర్మసద్భావ మొక్కని కేర్పరింపఁగ బ్రహ్మకైనను బోలునే? భార. సభా. 2. 236.

3. మంచి స్వభావము, సుశీలము, మంచితనము. 4. సౌజన్యము.

కం. నావుడు హరి యిట్లను సద్భావమున ... భార. ఉద్యో. 4. 28.

శా. ఈ వంశంబునకెల్ల .... సద్భావంబారసిలోని పొత్తు. భార. ఉద్యో. 2. 260.

**సద్మము** నం. వి. న్. న. 1. ఇల్లు, వాసస్థానము.

కం. శ్రీకరణనిపుణ పద్మసద్మా కేవలసత్వసద్మ... భార. శల్య. 2. 1.

2. స్థానము, చోటు. 3. ఆలయము, గుడి. 4. దేవుని పీఠము 5. పీఠము, ఆసనము. 6. యుద్ధము, 7. జలము, నీరు.

శా. అందుండుం ద్వయ సద్మపద్మవదనుం డద్వంద్వుఁడు... ఆముక్త. 1. 77

**సద్యఃకాలము** నం. వి అ. పుం. అప్పుడు జరుగుచున్న కాలము

**సద్యఃకాలీనము** నం. విశే. (అ ఆ. అ.) జరుగుచున్న కాలమున నున్నది, ఆధునికము.

**సద్యఃప్రాతి** నం. విశే. (న్. జీ. న్.) అప్పుడు పడిపోవునది, నశించునది.

**సద్యఃప్రాణకరము** నం. విశే. (అ. ఆ. అ.) వెంటనే బలము గలుగఁ జేయునది. శ్లో. సద్యోమాంసం నవాన్నం చ బాలా స్త్రీ క్షీరభోజనమ్, ఘృతముష్ణోదకం చైవ సద్యః ప్రాణకరాణి షట్ (వాచ.).

**సద్యఃప్రాణహరము** నం. విశే. (అ. ఆ. అ.) త్వరగా బలమును పోగొట్టునది. (శ్లో. శుష్కం మాంసం స్త్రియో వృద్ధా బాలార్క స్తరుణం దధి,ప్రభాతే మైథునం నిద్రా సద్యః ప్రాణహరాణి షట్ (వా. చ)

**సద్యము** నం అవ్య. న్. 1. వర్తమానదినము, జరుగుచున్న రోజు, 2. తత్క్షణము, వెంటనే.

కం. గంగా తరంగశీకర, సంగతమగు మారుతమున సద్యస్స్పర్శం, బంగీకరించు నెవ్వఁడు, భంగపఱుచు నతఁడు ఘోరపాపచయంబున్. భార. అను. 2. 106.

కం. అద్యంతంబును నీయన, వద్యకథ వినంగఁ గనిన వారికిఁ బాయున్, సద్యంబ బ్రహ్మహత్యా, వద్యము మొదలైన పాప వర్గంబెల్లన్. భార. స్వ. 89.

3. వేగముగా. 4. ఇంతకు మునుపు, కించిత్పూర్వకాలమున.

సీ. సద్యోవినిర్భిన్న సారంగనాభికా హృతమై పిసాళించు మృగమదంబు. మను. 2. 55.

**సద్యశ్శౌచము** నం. వి. అ. న వెంటనే కలుగు పారిశుద్ధ్యము.

సద్యస్కము సం. విశే. (అ. ఆ. అ.) సరిక్రొత్తది. 2. తత్క్షణమే యైనది.

సద్యస్స్ఫూర్తి సం. వి. ఇ. స్త్రీ. తక్షణమే స్ఫురించుట, వెంటనే తోఁచుట.

సద్యోజాతము సం. విశే. (అ. ఆ. అ.) అప్పుడే పుట్టినది, తక్షణమే యైనది.

సద్యోజాతము సం. వి. అ. పుం. లేదూడ. అ. న. పంచబ్రహ్మ మంత్రములలో నొకటి.

సద్యోజాతుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సద్యోభావి సం. విశే. (న్. నీ. న్.) అప్పుడు పుట్టినది, క్రొత్తగాఁ బుట్టినది.

సద్యోభావి సం. వి. న్. పుం. లేదూడ.

సద్రువు సం. విశే. (ఉ.) ఆఁగునది. 2. పోవునది.

సద్వంద్వము సం. విశే. (అ. ఆ. అ.) కలహ స్వభావము గలది, తగవులాడుట యందాసక్తి గలది.

సద్వసథము సం. వి. అ. పుం. పల్లె, చిన్న గ్రామము.

సద్వస్తువు సం. వి. ఉ. న. 1. మంచివస్తువు. 2. మంచి ప్రబంధిక. చక్కని కథాకల్పన, మంచికథ.

సద్వృత్తము సం. విశే. (అ. ఆ. అ.) మంచి నడవడి గలది, సుశీలమైనది.

సద్వృత్తము సం. వి. అ. న. 1. మంచి నడవడి.

కం....రామధరణీపతి సద్వృత్తము ని. రా. 1, 11.

2. సౌజన్యము,

సద్వృత్తి సం. వి. ఇ. స్త్రీ. 1. మంచి నడవడి, సాధు వర్తనము. 2. చక్కని వ్యాఖ్యానము.

సద్వృత్తి సం. విశే. (ఇ) మంచి నడవడి గలది.

సధర్మచారిణి సం. వి. ఈ. స్త్రీ. 1. కలసి ధర్మ కార్యముల నాచరించునది. 2. అగ్ని సాక్షికముగఁ బెండ్లాడిన భార్య, ఇల్లే సధర్మిణి.

సధర్మి సం. విశే. (న్. నీ. న్.) సధర్ముఁడు.

సధర్ముఁడు సం. విశే. (న్.) 1. సమాన ధర్మములు గలవాడు, సమానమైన గుణములు గలవాఁడు. 3. సమాన జాతి కలవాఁడు, ఒక తెగవాఁడు. 4. పోలికగలవాఁడు, సమానుఁడు. 5. ధర్మముతోఁ గూడినవాఁడు.

చ... వినుము సుయోధనాదులగు వీరు సధర్ములు గాక. ... భార. ఉద్యో 3. 181.

సధి సం. వి. ఇ. పుం. అగ్ని (త్రి ని.).

సధిస్సు సం. వి. స్. పుం. వృషభము, ఎద్దు.

సధ్రీచి సం. వి ఈ స్త్రీ సహచరురాలు.

సధ్రీచి సం. విశే కూడఁబోవునది.

సధ్రీచీనుఁడు సం విశే (అ. ఆ. అ.) కూడఁబోవువాఁడు, సహచరుఁడు.

సధ్ర్యంచుఁడు సం. విశే. (చ్. చీ చ్. కూడఁబోవువాఁడు.

సధ్ర్యంచుఁడు సం. వి. చ్. పుం. సహచరుఁడు (శర్ద).

సనకుఁడు సం. వి. అ. పుం. బ్రహ్మ మానస పుత్త్రులైన నలువురు ఋషులలో నొకఁడు.

సనగలు, సెనగలు. (సం. చణకః, త. చణగమ్. క. చణక, చణఁగి, దే. వి. బ. ధాన్యవిశేషము.

చం. సనగలు గోధుమల్ పెసలు సజ్జలు లంకలు కొఱ్ఱపిల్ల వడ్లును ఐ. ప్రభులి గ. 5 87.

సనగపొంపు జడంగె సమసె బొబ్బరలు. విష్ణు. పు. 8 ఆ. (శ. ర.)

(సెనగకు మొదటి రూపము.)

సనత్కుమారుఁడు సం. వి. అ. పుం బ్రహ్మదేవుని మానసపుత్త్రు లయిన నలువురు ఋషులలో నొకఁడు.

సన(తుఁడు)త్తు సం. వి. త్. పుం. బ్రహ్మదేవుఁడు.

సనత్తు సం. అవ్య. ఎల్లప్పుడు.

సనము సం. వి. అ. పుం ఏనుఁగు చెవుల చేటవు, గజ కర్ణముల యాస్ఫాలనము.

సనయము సం. విశే. (అ. ఆ. అ.) సనాతనము, ప్రాచీనము (వైది.).

సనాతనము సం. విశే (అ. ఈ. అ.) శాశ్వతమైనది.

కం. మనుజుఁడు శరణం బని యాశ్రయింప జాహ్నవి సనాతన పదోపలబ్ధి సంపద నొసఁగున్. భార. అను 2. 119.

సనాతని సం. వి. ఈ. స్త్రీ 1. లక్ష్మి. 2. పార్వతి.

3. సరస్వతి.

**సనాతనుఁడు** సం. విశ. (అ ఈ. అ.) 1. శాశ్వత మైన వాఁడు, ఎల్లప్పుడు నుండువాఁడు. 2. స్థిర మైన వాఁడు. 3. ప్రాచీనుఁడైన వాఁడు.

**సనాతనుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు, 2. శివుఁడు. 3. బ్రహ్మ. 4. పితృదేవతల యతిథి. 5. బ్రహ్మపుత్రులలో నొకఁడు.

**సనాథ** సం. వి. ఆ స్త్రీ. 1. భర్తతోఁ గూడియున్న స్త్రీ. 2. బ్రతికియున్న భర్త గలది, సువాసిని.

**సనాథము** సం. విశ. 1. పరిపూర్ణమైనది.

గీ. హరుని చేత సనాథమై యతిశయిల్లు, మోక్ష భోగ నివాసంబు దక్షవాటి. భీమ 2. 21

2. కూడియున్నది.

వ. సర్వక్రియా సమగ్రం బయి షడంగ సమృద్ధం బయి సంపూర్ణ దక్షిణా సనాథంబయి సకల జనా నందకరంబయి రాజసూయం బతి రమణీయం బయిన. భార. సభా. 1. 292.

**సనాథుఁడు** సం.విశ (అ. ఆ. అ.) 1. యజమానుఁడు గలవాఁడు, రక్షకునితోఁ గూడినవాఁడు. 3. ఆక్ర మింపఁ బడినవాఁడు. 4. కూడినవాఁడు, పూర్ణుఁ డైనవాఁడు.

కం. అనఘా యీ యజ్ఞము విధి, సనాథ ఋత్వి క్ప్రయోగ సంపూర్ణం,బయ్యెను గడచన నేరదు....భార. ఆది. 2. 210.

కం. జలనిధి...సౌందర్య స్ఫురదలఘు తను స్త్రీ సనాథ హరిహరనాథా ! భార. విరాట. 1. 40.

**సనాభి** సం. విశ. (అ.) గర్భ సంబంధము గలవాఁడు. 2. సంబంధము గలవాఁడు. 3. పోలిక గలవాఁడు. సమానుఁడు.

చం. నవ విదళత్కుశేశయ సనాభిశయద్వయ ! యుర్వసుంధరా,ధవుడు కుశాంకితంబగు ప్రభావపు దీవికధీశుడు. శృం. నై. 5. 59

4. ప్రేమగలవాఁడు.

**సనాభి** సం. వి. ఇ. పుం. 1. సోదరుఁడు. ఏక గర్భ జాతుఁడు. 2. జ్ఞాతి. 3. ఏడవ పురుషాంతరము వఱకు నుండెడి జ్ఞాతి. దూరపు జ్ఞాతి.

**సనాభ్యుఁడు** సం. వి. అ. పుం. ఏడుతరములు దాఁటని బంధువు.

**సనామకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) సనాముఁడు.

**సనాముఁడు** సం. విశ. (న్.) సమానమైన పేరు గల వాఁడు.

**సని** వి. (సం. శని: క. శని. త. చని) 1. నవగ్రహము లలో నేడవది, శని (శ. ర.). 2 దురదృష్టము. (గ్రా.).

కం. ఈ నటనల మేమును మీ, మౌనియు నిన్నాళ్లు గూడిమాడి మెలంగన్, నా వోటను బుట్టునె సని,యె నెఱుఁగనె బేలనే మహీసురముఖ్యా. విక్ర. 4. 68.

3. పాపము, అసత్యము.

**సని** సం. వి. ఇ. పుం. 1. పూజ, ఆరాధనము. 2. దానము, ఈవి. 3. లబ్ధి, పొందుట, సంపాద నము. 4. ప్రార్థనము, మనవి. 5. దిక్కులు చూపు యంత్రము యొక్క యొక భాగము. (ఈ స్త్రీ. 1. ఏనుఁగు చెవుల చలువు, 2. జ్యోతిస్సు, ప్రకా శము. 3. గౌరి, పార్వతి.

**సనికలు** వి. నూఱుఱాయి.

కం. వనితామణి పాదాబ్జము, తనహస్తాబ్జములఁ బట్టి దరహాస రుచుల్, కనురెప్పలలోఁ దాఁచుచు, సనికల్ ద్రొక్కించె రాజు జవ్వనిచేతన్. కవిజనరం. 3. 45.

**సనికల్లు** నూఱుఱాయి.

సీ వనజగేహినిచేత సనికల్లు మెట్టించి ధ్రువు నరుం ధతి వేడ్కతోడఁ జూచి. ప్రబం. 1. 603.

**సనితము** సం. విశ. (అ. ఆ. అ.) 1 ఈయఁబడినది. దత్తము. 2. పొందఁబడినది, సంపాదింపఁబడినది.

**సనీడ(ల)ము** సం. విశ. (అ. ఆ అ.) 1 కూడ నివ సించునది, ఒక గూడులో నుండునది 2. సమీపమున నున్నది, దగ్గఱగా నున్నది.

**సను** అ. క్రి. రూ. చను.

**సనె** వి. (రూ. సన్నె)

**సనెకలు** వి. నూతెదుఱుటాయి.

చం. సనెకల్ దాఁచినఁ బెండ్లి మాను నౌకా. కాశీ. 5 ఆ. (శ. ర.).

మ.... కోర్కి దైవాఱ వమ్ముగువన్ బాదతలంబు వట్టిసనెకల్ మట్టించె మోదంబునన్. మను. 5. 93.

మ. జనకోత్సంగ నివాసవాసవనౌ రాజన్య ప్రహ స్తాభిమ, ర్శనసౌఖ్యామృత పారవశ్యమునవౌ సైకెన్ శిలాయోజనం,బని సాధ్వి ల్వొగడం బ్రియాంఘ్రి సనెకల్ హత్తించె భూజాని. వసు. 6. 32.

**సన్న**[1] (సంజ్ఞా) సంజ్ఞ.

తే. అపుడు రుక్మిణి కనుసన్న నబ్జముఖులు రత్న సింహాసనంబు నారదున కిడిరి పారి. 1. 46.

చం. ... మేలమలాడెదు సత్యభోట్ల స, న్నల నెసకొల్పుచుం గెలన నవ్విరి ధర్మజభీమఫల్గునుల్. పారి. 5. 81.

వ. పార్వతి యమ్మిథ్యావటునకు దన మనోరథం బెఱిగింప నొల్లక వయస్యం గనుసన్న చేసిన. హర. 4. 26.

ద్వి. గౌతముఁ డత్రికిఁ గను దీఁచె నతఁడు కాశ్యపుని వైపు సన్నగావించె. ద్వి. హరిశ్చ. పూర్వ. 22.

తే. గీ. కనుసన్నల శుద్ధాంతకాంత లాచ, రించు సేవలు మెచ్చని కాంచనాంగి, యొగ్గె ముని ముగ్ధ కాంతాకృతోపచార, విధికి నెంచ నసాధ్యంబు విధికిఁ గలదె. ఉ. రా. 6. 320.

చం....చిటకంపుఁద్రా, గుడు గనుసన్నల న్నగిరి కొందలు పాంథుఁ బ్రపాప్రపాలికల్. ఆము. 2. 56.

**సన్న**[2] వి. గుర్తు, జాడ.

సీ. ... ధార్తరాష్ట్రులు మాతతనయ పొలయులను తెలుపనవేతురు చిన్నసన్న యెఱిఁగి రేని చాల నెగ్గు వాటిల్లు. భార. విరా. 1. 47.

**సన్న** విశే. (సం. సన్నమ్. త. సన్నమ్. క. తు. సన్న.) చిన్నది, స్వల్పము, కొంచెమైనది.

తే తనరు నంబుద కాండవేదండయూథ. గర్జితో ర్జిత భూరి భూత్కార గళిత వమధుశీకర వార దుర్వారమగుచు, జలువ తెమ్మెర లేలేర సన్న తూర. శుక. 2. 342.

2. వలుచనిది, సూక్ష్మము

చం. వలుచని సన్నగాలి వలిపంబులు గట్టఁగ విచ్చి వెచ్చెలుల్. విక్ర. 1. 136.

సీ. తె. అచ్చ తెలుపుగ నపుడు బ్రహ్మాండమండపంబు వెన్నెల సన్నసున్నంబు సేసె. మనుచ. 5. 88

కం తడియొత్తి సన్నవలిపం, బిడి. ఆము. 6. 127

3. మెల్ల, మందమైన

సీ. కట్టికవాని యాగ్రహవృత్తిఁగని పేరులంతంత సన్నగ నరుగుదేర. కువల. 4. 164.

ఉ. పోరణగండి మార్గమున బొచ్చిన సన్నని గాలి... శృం. నై. 3 59.

**సన్నకంఠుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) నొక్కఁబడిన కంఠము గలవాఁడు. ఊపిరి తిరుగకుండఁగఁ జేయ బడినవాఁడు.

**సన్నకద్రువు** నం. వి. ఉ పుం ప్రియాలవృక్షము.

**సన్నకము** నం. విశే. (అ. అ. అ.) పొట్టిది, తక్కువది.

**సన్నకము** నం. వి. అ. పుం. ప్రియాలవృక్షము.

**సన్నకల్లు** సన్నెకల్లు.

సన్నెకల్లనఁ గను సన్నకల్లనఁగను బేషణశిల పేరు వెలయుచుండు. ఆం. భా. 2. 299.

**సన్నకసన్న** అవ్య. మెల్ల మెల్లగా.

కం. సన్నపువారల నధిపతి, మన్నించినఁ బ్రావుఁ దైవమంత్రికి బతు కే,మున్నది మునుమున్న తఁడును సన్నకసన్నటఁ గాని చనకున్న జెడున్. పంచ వా. 1. 405.

అన్నిగిములు సన్నక సన్నదూఁటి. నీలా. 1. 76.

తే. గీ. అనుచు నెమ్మొగముల విన్నఁదనము దోఁప, జఱిగి యూరక సన్నకసన్నఁ గొంద, ఱొక్క కొందరు దొరలు విల్లెక్కిడంగఁ, బూని కదలింప నోడియు భ్రమానుపడిరి. అ. రా. బాల. 174.

2. నిగూఢముగా.

ద్వి. సన్నకసన్న నా శత్రుండుగానఁ, జిన్నిపావనిఁ బరిచ్ఛిన్నుఁ జేసితివి. రం. రా. బాలకాం. 48 పు.

11 పం.

**సన్నకారు** వి. కమసాలి. కమ్మరి మొదలైన వారి పని ముట్టు.

**సన్నకాళియలు** వి. వాద్యవిశేషము, ఒక విధమైన బూఁగొమ్ము.

ద్వి. అటిమటి మురువేపనా వాద్యగతులఁ, గఱు చలఁ నిడుఁదల గూడి వాయింప, సన్న మెఱింగి యాసన్న కాళియలు, సన్నతోనుగఁ గూడి జమళిఁ బూరింప. అ. మ. క. 5. 241 పు. 17 పం.

**సన్నగఱుకు** వి. గఱుకు, ముడత.

సీ. భూరిదిగ్గిత్తులతో రాచికొన సన్నగఱుకెక్కి కప్పారుకంఠ మొప్ప, నలఘువాయుస్కంధములు దాఁకి శాఁలుదోఁగ నాడెడు నిండుతోఁక యలర. (ఇది వృషభవాహన వర్ణనము) హరి. ఉ. 7. 79.

**సన్నగాఁడు** వి. చీము. విశే. అల్పుఁడు. అవర.

తే. గీ. సన్నగాండ్రను బోఁదోలి సరగవారి, నెఱపు లెల్లను గైకొని చెలఁగుచుండు, తులువ విసదారి రాకూటువలకు నెందుఁ, దలఁప నొక్కించుకయు మంచితనము గలదె. (రెండర్థములకు నిదియే యుదా.) అ రా. బాల. 106.

**సన్నగాజె** వి. పొన్నాయి.

కం కొమ్ములు నివదమ్ములు కం, ఖమ్ములు శబ్దములు సన్నగాజెల సం, రావమ్ములు నాగస్వరంనా, దమ్ములు వపిరీరవంబు దరులం బర్వెన్. రాజ వాహన. 5. 60.

**సన్నగాలి** వి. మందమారుతము.

తే. గీ వల ప్రేలెడు తేఁటి యింతేటికలుగ, సంత్రి తల సన్నగాలియో సన్నగాలి. రామా. 6 అ. (శ. ర.)

**సన్నగాశె** వి. వాద్యవిశేషము తిరుచిన్నము (శ. ౨దశఖ్యా

యువ్వసుంధరా,ధవుడు కు
దివిరధీశుడు. శృం. నై. 5.ా. సన్నగిలు).
జాజిపూవులు.
4. ప్రేమగలవాఁడు.

**సనాభి** నం. వి. శ. పుం. 1. సో చాయనె యున్న
జాతుఁడు. 2. జ్ఞాతి. 3. ఏడ 3, 8.

**సన్నతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. వంగినది, వ్రమమైనది. 2. క్రుంగినది. 3. ముణుఁచుకొనినది. 4. ధ్వనికలది.

**సన్నతాంగి** నం. విశే. (ఈ.) అందముగా వంగిన యవయవములు గల స్త్రీ.

**సన్నతి** నం. వి. ఇ. స్త్రీ. 1. నమస్కారము. 2. వ్రమత, వంగుట. 3. ధ్వని, చప్పుడు. 4. ఒక విధమైన హోమము. 5. అడఁకువ, విధేయత.

**సన్నదు** హిం. వి. 1. యోగ్యతా పత్రిక. 2. ఆజ్ఞా పత్రిక.

**సన్నద్ధము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది. 2. కవచమును ధరించినది. 3 ఆతతాయి, ఇండ్లు కాల్చుట మొ. చెడ్డపనులు చేయునది. 4. మంత్ర తంత్రములతోఁ గూడినది. 5. వ్యాపించినది. 6. సన్నిహిత సంబంధము గలది 7. వికసించుటకు సిద్ధముగా నున్నది. 8. వ్యూహములు పన్ని యుద్ధమునకు సిద్ధముగా నున్నది.

శా. ఈ రీతిం జనులెల్ల నుల్లముల నూహింపంగ శంపారుచి, స్ఫారజ్యాయుత చాపరోపధరుఁడై సన్నద్ధసైన్యంబుతో సింహా. 1. 1. 228.

**సన్నద్ధయోధుఁడు** నం విశే. కవచాది సాధన సహితులైన యోధులు కలవాఁడు.

**సన్నద్ధుఁడు** నం. వి. ఆ. పుం. 1. సంసిద్ధుఁడు. 2. కవచాదులు ధరించి యున్నవాఁడు.

సీ. చైద్యునకై వూని సన్నద్ధులై యున్న యీ రాజులిందఱు. భార. సభా. 2. 38.

**సన్నన** వి. సన్నఁదనము.

**సన్నపిల్ల** వి. సాలెపురుగు (సన్నబిల్లి ప్రా. పా.).

సీ ....జానకాడు చెలఁది సన్నపిల్లి, పాదొట్టనఁగ లూఁతపరగు. ఆం. భా. 2. 87.

**సన్నపువాఁడు** విశే. అల్పుఁడు.

సన్నంపువారితో జగడమేల. రా. యు. కాం. (శ. ర.).

**సన్నమండెగలు** వి. ఐ. శాలిధాన్య విశేషము.

**సన్నము** విశే. 1. స్థూలము కానిది.

ఉ. సన్నఁపు సెఱఁగోఁక జేఁక నిటల. నీలా. 1. 81.

2. మృదువైనది.

ఉ. .... ఒక్క యం, భోరుహపత్రనేత్ర నునుఁ బోఁకపుఁ జన్నుల మీఁది సన్నపుం జీర జెఱంగు వాయఁగిలఁ జేసిన. శృం. నై. 2. 89.

3. చిన్నది, అల్పము.

ఉ. సన్నపునిబ్బెముల్ గలుగుచన్నులఁ బయ్యెద కొంగు జారఁగా. పాండు. 3. 118,

4. పరిమితము, కొలదియైనది.

వ. కృతజ్ఞతాగుణలేశంబు క్లేశపఱుచుచున్నయది సన్నంబు దొడ్డ యను విశేషంబు విచారింపక హస్తకల్పజనాంతరం బైన దైవంబు ప్రశస్తి విమర్శించినా చేయు ప్రయోజనం బంగీకరింపుము. శృం. నై. 7. 8.

5. అలఁతి, మందమైన

గీ. శిర సొకింత యెత్తి సన్నంపుఁబలుఁకుతో నిట్టు లనియె. మను. '. 97.

వ. మారాజు దేవరకు విన్నవింపు మని సన్నం బుత్తెంచె నన్ను సన్నంపునవ్వు నివ్వటిల్ల. వరాహ. 5. 12.

**సన్నము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కూర్చుండినది, పరుండినది. 2. క్రుంగినది. 3. వ్రేలాడునది, వదులయినది. 4. దుర్బలమైనది, 5. క్షీణమయినది, క్షీణించినది, హీనమైనది. 6, నశింపఁ జేయఁబడినది. 7. నిశ్చలము, కదలిక లేనిది. 8. ముణిగినది. 9. సమీపమున నున్నది, 10. పోయినది, విడిచి పోయినది. 11. హీనమైనది. (కంఠస్వరము మొ.)

**సన్నము** సం. వి. అ. పుం. ప్రియాలవృక్షము, అ. న. కొంచెము, అల్పభాగము.

**సన్నయనము** సం. వి. అ. న. 1. దగ్గఱగాఁ జేర్చుట కూర్చుట. 2. కలుపుట, సంబంధింపఁ జేయుట.

**సన్నయము** సం. వి. అ. పుం. 1. సైన్యము యొక్క వెనుకభాగము. 2. సమవాయము. 3. సమూహము, గుంపు.

**సన్నయేలకి** వి. చిట్టేలకి (వ్యు. వి.).

**సన్నరాస్నము** వి. రాస్న (వ్యు. వి.)

**సన్నవలిపెములు** వి. బ. సన్నని చీలలు, వస్త్రవిశేషములు.

వ. శ్రీరామతోపులను జీబులును సుగివట్టులును సన్నవలిపెంబులను పెకపట్టులను హొంబట్టులను. రాధా. 2. 206.

**సన్నవాలు** అ. క్రి. (సన్న + పాలు) 1. సూచితమగు బయల్పడు.

వ. కృష్ణుండును.... తాను శక్తుం డయ్యును గొవనొల్లక యయ్యె ప్రసంగంబులం గోర్కి సన్నవాలం బలుకుచుండ. హరి. పూ. 3. 177.

2. సన్న యేర్పడు, భావము సూచితమగు.

తే. గీ. అనుచుఁ బెక్కుమారు లత్యాదరంబునఁ గన్నె పేరు మరయుచున్నఁ జూచి, సన్నవాలి నగుచు సకియ ప్రియంవద పార్థివేంద్రుఁ జూచి పలికె నిట్లు. కృ. శకుం. 3. 13.

**సన్నసన** విశే. (సన్న + సన్న) సులభము.

**సన్నసున్నము** వి. పాలగారె, మెఱుఁగు సున్నపు పూఁత.

వ. అప్పురంబు దాఁటువాఱించు సన్న సున్నంబు చేత శేత వెన్నెలలు వెమ్మించు క్రొమ్మిగించులుం గల మేడలును. పి. శకుం. 1. 86.

**సన్నసూదులు** వి. బ. ధాన్యవిశేషము.

సీ. సన్నసూదులు పచ్చగన్నేర్లు గోదండరామము గ్గేసర్లు రాయసర్లు. హంస. 4. 128.

వ. నివ్వరులు నీరుకావులు రెడ్డివంకెలు చ్వాటవరులు తీగెమల్లెలు సుఖభోగులు సన్నసూదులు గోరవంక రాజనాలు కాటుకరేకులు. ప్రబం. 1. 112.

**సన్నహనము** సం. వి. అ. న. 1. సిద్ధము చేయుట, సజ్జీకరణము, కవచాదులు ధరించుట. 2. సన్నాహము. 3. బిగువుగాఁ గట్టుట. 4. గట్టి హానిక. 5. పరిశ్రమ. 6. త్రాడు.

**సన్నాహపడుచు** అ. క్రి. (సన్నాహము + పడు) సిద్ధపడుచు.

తే.గీ..... లంకఁ జేరంగ శీఘ్రముగను, సాహసోన్నతి మీఱ సన్నాహపడెచె. వినత నీలనలాంగద ద్వివిద

కుముద, జాంబవద్రథంక శరభాది సైన్యములను. చం.పూరా. 8. 6.

**సన్నాహము** సం. వి. అ. పుం. 1. యుద్ధమునకు సంసిద్ధమగుట, కవచము తొడుగుకొనుట, 2. యుద్ధ ప్రయత్నము. 3. కవచము.

సం. వి. పూనిక, ప్రయత్నము, సన్నహనము.

తే. ఇట్లు బలదేవరుక్మిల సిద్ధజకును, గయ్యమునకు సన్నాహంబు గలుగదయ్యె. భార. ఉద్యో. 4. 161.

కం. మోహరములు రెండును స, న్నాహంబునఁ బారసించినన్. చిత్రభా. 7. 66.

**సన్నాహ్యము** సం. వి. అ. పుం. యుద్ధపుటేనుఁగు.

**సన్నికర్షణము** సం. వి. అ. న. 1. దగ్గఱగాఁ దీసికొనుట. 2. సమీపించుట, దగ్గఱగా వచ్చుట. 3. సామీప్యము, ప్రాంతము, చేరువ. 4. సంబంధము. 5. (తర్క.) విషయేంద్రియ సంయోగము (ఇది యాఱువిధములు). 6. అర్వాచీనమైనది.

**సన్నికర్షము** సం. వి. అ. పుం. సన్నికర్షణము.

**సన్నికల్లు** వి. నూఱుడాయి. (రూ. సనికల్లు, సనెకల్లు)

సీ. పొరుగూరి కేగినఁ బోవునే దుర్దశ కాదె పెండిలి సన్నికల్లు దాఁచ. రామ. 59.

**సన్నికృష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కొంచెమించుమించైనది, రమారమిగా నున్నది 2. దగ్గఱగా నున్నది:

వి. అ. న. సామీప్యము, చేరువ.

**సన్నిచయము** సం. వి. అ. పుం. సమూహము, సంగ్రహము.

**సన్నిచితము** సం. విశే. అ. 1. మలనిరోధకము కలది 2. నిలువయుండి చెడిపోయినది.

**సన్నిధము** సం. వి. అ. న. సామీప్యము, చేరువ.

**సన్నిధాత** సం. వి. ఋ. పుం. 1. దగ్గఱగాఁ దీసికొని వచ్చువాఁడు, 2. నిక్షేపించువాడు. 3. దొంగ సొమ్ము (దొంగిలింపఁ బడినసొత్తు) పుచ్చుకొను వాఁడు. 4. రాజసభయందు జనులను ప్రవేశ పెట్టెడి యధికారి. 5. అన్యుని బాధ్యత వహించి ద్రవ్యాదులను బుచ్చుకొనెడి వాఁడు.

**సన్నిధానము** సం. వి. అ. న. సమక్షము, సామీప్యము.

వ. అవిముక్త శివసన్నిధానంబువ నశేష జగజ్జనని యగు మహాదేవికి నమస్కరించి స్తుతియించిన... శివరహస్య సంభవ. 5. 314.

2. చేర్చియుండుట, కలిపియుండుట. 3. కనఁబడుట, గోచరమగుట. 4. ఆధారము, ఆశ్రయము, 5. పుచ్చుకొనుట, ఒప్పగించుకొనుట. 6. కలయిక. 7. మొత్తము. 8. ముందుగా నిక్షేపించుట. 9. ఇంద్రియార్థము.

**సన్నిధి** సం. వి. ఇ. స్త్రీ. 1. సామీప్యము, చేరువ. 2. సాక్షాత్కారము, ప్రత్యక్షము.

ఉ... ఏలనినుబోఁటికిఁ గ్రూరత నాథు సన్నిధిన్. భార. అను. 1. 12.

వ. ఈదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధనవిశేషం బగుటంజేసి. భార. విరా. 1.

**సన్నిధియగు** అ. క్రి. సమీపించు, ప్రత్యక్షమగు.

తే. మందిరోద్యానకేళిసానందవిభవ, మవధరించెదు తారావిటార్ధమౌళి, జివురుగుత్తులవిరులఁ బూజించుటకునో, యాఱుఋతువులు సన్నిధియయ్యె నచట. పాండురంగ. 1. 180.

**సన్నిధిసేయు** మి. అ. క్రి. సమీపించు, ప్రత్యక్షమగు.

గీ. ఎలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు. భార. విరా. 1.

కం. సన్నిధిసేసి తపము మెయి, నున్నఁ బ్రయోజనము గలదె? యడుగుము పుత్రీ. భార. శాం. 5. 203.

**సన్నిపాతజ్వరము** సం. వి అ. పుం. ధాతుదోషము వలనఁ గలుగు నపాయకరమైన జ్వరము.

**సన్నిపాతనిద్ర** సం. వి. అ. స్త్రీ. మూర్ఛ, అపస్మారము, మైకము.

**సన్నిపాతనుదము** సం వి. ద్. పుం. ఒక విధమైన వేపచెట్టు (వృ. వి.).

**సన్నిపాత(క)ము** సం. వి. అ. అ. స్త్రీ. 1. పడుట,

ప్రాలుట. క్రిందికి దిగుట. 2. రెండునదుల కలయిక, వదీ సంగమము. 3. సంఘట్టనము, ఒకదానిపై నొకటిపడి కొట్టుకొనుట 4. వివిధ వస్తువుల కలయిక. 5. కూడికకు హేతువైన ధాతుత్రయ దోషము. 6. సంగీతము నందలి కాలభేదము, 7. మైథునము. 8. యుద్ధము. 9. ఒక విధమగు గ్రహముల కూటమి.

సన్నిపాతి సం. విణ. (న్. సీ. న్) ప్రధానకర్మ తోడి ప్రత్యక్ష సంబంధము వల్లగాని సన్నిహిత సంయోగము వల్లఁగాని దాని యొక్క ప్రయోజ నమును నెఱవేర్పఁగల అప్రధానకర్మ.

సన్నిపాతితము సం. విణ. అ. 1. విడువబడినది (బాణము మొ॥). 2. ఒకచోటికిఁ జేర్పఁబడినది. 3. కూర్ప బడినది.

సన్నిపాత్యము సం. విణ అ. 1. విసరివేయఁ దగినది, ప్రయోగింపఁదగినది (బాణము మొ॥).

సన్నిబద్ధము సం. విణ. అ. 1. కలుపఁబడినది, అతుకఁ బడినది. 2. అమర్పఁబడినది, సిద్ధము చేయఁబడినది

సన్నిబర్హణము సం. వి. అ. న. 1. వశపఱుచుకొనుట. 2. నిరోధించుట.

సన్నిభము సం విణ. (అ. ఆ అ.) (సమాసాంతమున) తుల్యము, సదృశము.

కం. ఈశ్వరసన్నిభులగు యోగీశ్వరులకు .... శివ ధర్మ. 3. 23.

సన్నిభృతము సం. విణ. అ. 1. గూఢము. 2. ఉచి తము. 3. వినీతము.

సన్నియ దే. వి. సన్నెకల్లు (రూ. సన్నె)

సీ. పువ్వులతొడిమలు పుచ్చు నయంబున ... చంద నంబు రాచి సన్నియఁ బెట్టు. (సన్నియఁ బెట్టు సన్నెకంటిపై నూఱు) కుమారసం. 5. 618.

సన్నియోగము సం వి. అ. పుం. 1. కలయిక, కూడిక. 2. నియమించుట (ఉద్యోగాదులందు) 3. విధి, ఉపదేశము.

సన్నిరుద్ధము సం. విణ. 1. అడ్డగింపఁ బడినది. 2. అణచఁబడినది. 3. రగుల్కొల్పఁబడినది (నిప్పు మొ॥). 4. కప్పఁబడినది. 5. నింపఁబడినది.

సన్నిరోధము సం. వి. అ. పుం. 1. అడ్డంకి, అవ రోధము. 2. నిర్బంధము. 3. ఇఱుకుఁదనము 4. ఇఱుకుత్రోవ.

సన్నివాయము సం. వి. అ. పుం. కూడిక, గుంపు, సమూహము.

సన్నివిష్టము సం విణ. (అ. ఆ. అ.) 1. ప్రవేశిం చినది. 2. ప్రోఁగైనది, కూడినది 3. తత్పరమైనది, ఒకదానియందే లగ్నమైనది 4. నివసించు నది, ఆశ్రయమేర్పఱుచు కొన్నది; 5. సమీపమున నున్నది, దగ్గఱగా నున్నది. 6. విడిసినది, బస చేసి నది (దండు మొ॥).

సన్నివృత్తము సం. విణ. (అ ఆ. అ.) 1. మరలినది, నివర్తించినది. 2. ఆఁగినది, 3. వెనుదీయునది

సన్నివృత్తి సం. వి, ఇ. స్త్రీ. 1. మరలిరాక 2. నిరో ధము, సంయమము, సహనము, 3. విముఖత్వము వహించుట.

సన్నివేశము సం. వి. అ. పుం. 1. (మనస్సు) గాఢ ముగా మగ్నమగుట. 2. సమూహము, గుంపు. 3. కూడిక, కలయిక. 4. స్థానము, స్థితి, స్థలము, 5. సామీప్యము. 6. మూర్తి, ఆకృతి. 7. ఉచితా సనములఁ గూర్చుండబెట్టుట. 8. కుటీరము, గుడిసె. 9. తూర్చుట, చొనుపుట. 10. వినోదార్థము గాని వ్యాయామార్థము గాని పురజనులు చేరెడి పుర బాహ్యప్రదేశము. 11. నక్షత్ర సముదాయ స్థితి. 12. విడిదల.

సన్నివేశనము సం. వి. అ. న. నివాసము, ప్రతిష్ఠా నము.

సన్నిసర్గము సం. వి. అ. పుం. సౌజన్యము, సాధు త్వము.

సన్నిహితము సం విణ. (అ. ఆ. అ.) 1. దగ్గఱగా నున్నది, ప్రక్కనున్నది. 2. ప్రత్యక్షముగ నున్నది, ఉంచఁబడినది. 3. సిద్ధముగా నున్నది. 4. దగ్గఱగా నున్నది, సమీపమైనది.

వ. మఱియు నపరిమిత పరార్ధ్యరత్నరజతసువర్ణ పరిపూర్ణంబై మహామేరుశైలంబు సన్నిహితంబైన యట్టు... భార. సభా. 1. 273.

వి. అ. న. సామీప్యము.

సన్నిహితాపాయము సం. విశే. అపాయము చేరువగాగలది, నశ్వరము, క్షణికము. దుర్బలము.

సన్నుతము సం. విశే. (అ. ఆ. అ.) పొగడఁబడినది, కొనియాడఁబడినది.

ఆ. సన్నుతములునైన యన్నపానాదుల ననుభవించి. భార. ఆశ్ర. 2. 69.

సన్నుతి సం. వి. ఇ. స్త్రీ. స్తుతి, పొగడ్త.

సన్నుతించు సం. స. క్రి. స్తుతించు,

వ. మమ్ము నిర్మించిన నీవ విగతస్థాములం జేయక మన్నింపుమని సన్నుతించిన. వరాహ. 5. 80.

సన్నె వి. (కన్న. సన్న, సణ్ణ) సన్నెకల్లు.

కం. అంతటఁ గనుపట్టెను భా, స్వంతుఁడు చరమాద్రిమీఁద వారుణదిక్సీ,మంతిని జలకేళికిఁ జిరు, బంతి పసుపుముద్ద సన్నెపై నిడుభంగిన్. జై. భా. 2. 100.

సన్నెకల్లు వి. నూఱుఱాయి.

సీ. గడపమీఁదను సన్నెకల్లున ఱోటిమీఁదను నున్కి చేతను దఱుగుయశము. పి. శకుం. 4. 79.

2. హోమద్రవ్య విశేషములు, చిన్న సమిధలు.

ద్వి. సకసాక్షతలును లాజలు సన్నెకల్లు సురభి గంధము నేయి స్రుక్స్రువంబులును, మొదలైన సాధవంబులు గూర్చి క్రియలు వదలక యవ్వధూ వరుల వేల్పింప... ద్వి. భార. విరా. ప. 5. 104.

సన్న్యసనము సం. వి. అ. న. విడుచుట, త్యజించుట. 2. సర్వసంగములను బరిత్యజించుట, సన్న్యసించుట 3. ఒప్పగించుట. 4. పదిలముగా నుంచుట.

సన్న్యసించు సం. స. క్రి. 1. త్యజించు, విడుచు, కామ్యకర్మలను విడుచు.

తే. గీ. అతఁడు సన్న్యసించె నఖలభోగంబులు. పాండు. 5. 93.

2. కలిపియుంచు.

సన్న్యస్తము సం. విశే. (అ. ఆ. అ.) 1. విడిచిపెట్టఁబడినది, త్యజింపఁబడినది. 2. ఉంచఁబడినది, అధీనము చేయఁబడినది. 3. విడిచినది, మకాము చేసినది (దండు).

సన్న్యాసము సం. వి. అ. పుం. 1. విడుచుట, త్యజించుట. 2. ప్రాపంచిక సంబంధమును పూర్తిగాఁ బరిత్యజించుట, సన్న్యసించుట 3. నమ్ముట, నమ్మి (సొమ్ము మొదలగునవి) దాఁచఁబెట్టుట 4. పందెమొడ్డుట. 5. ఒడంబడిక, పొత్తు. 6. దేహము విడుచుట, మరణము. 7. జటామాంసి (వృ. వి.).

సన్న్యాసి సం. వి. న్. సం. 1. ఉంచువతఁడు, (సొమ్ము) పదిలముగా నుంచువతఁడు. 2. ఐహిక విషయములను విడిచిన యతి, సన్న్యాసాశ్రమము గ్రహించిన యతఁడు 3. త్యక్తాహారుఁడు, తిండి మానినవాఁడు.

కం. సన్న్యాసి వేషమున రాజన్యునిఁ గని. భార. విరాట. 1. 69.

సన్న్యాసిని సం. వి. ఈ. స్త్రీ. సన్న్యసించిన స్త్రీ.

సన్మాత్రము సం. వి. అ. పుం. (కేవలము సత్త గలవాఁడు) జీవాత్మ.

సన్మానము సం. వి. అ. గౌరవించుట, సమ్మానించుట.

సన్మానించు సం. స. క్రి. సమ్మానించు, గౌరవించు.

వ... కురంగాంక శేఖరుండు... సనక సనందన సనత్కుమారాది మహామునుల సంభావించి దేవతల మన్నించి హిమవన్నగ చక్రవర్తి సన్మానించి. వరాహ. 6. 48.

మ. ... సన్మానించి యేనత్తటిన్. గనుదో యల్లన విచ్చి మేదినియు నాకాశంబునున్ జూచితిన్ పగు.
దశకు. 9. ఆ. 5.

ాఠ.

సన్య వి. కాంతవప్రతికృతి.

సీ. కాంతవ ప్రతికృతి పేరు దవరి యుండు సన్యాజ యనన్. ఆం. భా. 2. 295. 5.

సపక్షము సం. విశే. (అ. ఆ. అ.) 1. పక్షములు (ఱెక్కలు) గలది. 2. ఒక పక్షము గలది. 3. ఒక పక్షమునకుఁ జెందినది, సమాన పక్షమున నున్నది. 4. సమానము 5. (తర్క.) పక్షము (విషయము) గలది.

సపక్షము సం. వి. అ. పుం. 1. సమానమైన యుదాహరణము. 2. (తర్క.) నిశ్చితమైన సాధ్యము గలది.

సపక్షుఁడు సం. విం. అ. పుం. 1. అనుసారి. సమాన పక్షమున నుండువాఁడు. 2. బంధువు.

సపత్నము సం. విశ. (అ. ఆ. అ.) విరోధము కలది.

సపత్ని సం. వి. ఈ. స్త్రీ. సవతి.

సపత్నీకుఁడు సం. విశ. (అ) భార్యతోఁ గూడిన వాఁడు.

సపత్నుఁడు సం. వి. అ. పుం. శత్రువు.

ఉ. ... అశేషరా, జావళిలోన సత్యధికులైన సప త్నుల పేర్మిఁ జూచియేఁ, జూచె సహింప నోపక కృశుండ వివర్ణుఁడనైతి నెంతయున్. భార. సభా. 2. 114.

సపత్రాకరణము సం వి. అ. న. 1. బాణము యొక్క ఱెక్కలు గల భాగము శరీరమునఁ జొచ్చునట్లు గాయపఱుచుట. 2. మిక్కుటమగు బాధ గలిగించుట.

సపత్రాకృతము సం విశ. (అ. ఆ. అ.) తీవ్రముగా గాయపఱుపఁబడినది

సపత్రాకృతి సం. వి. ఇ. స్త్రీ. మిక్కుటమగు బాధ. అధిక బాధ.

సపది అవ్య. (ఇది సంస్కృత సమాసములందే కానఁ బడును) తత్క్షణమే, వెంటనే, వేగముగా.

మ. ....సపదిస్ఫూర్తిఁ జరణద్వంద్వంబు రాకుండి నన్. మను. 2. 14.

సపరిచ్ఛదము సం. విశ. (అ. ఆ. అ.) ఆవశ్యకము లతోఁ గూర్పఁబడినది.

సపరివాహము సం. విశ. (అ. ఆ. అ.) అంచువఱకు నిండినది

సపరివ్యయము సం విశ (అ ఆ .అ.) మిరియములు మొదలగు సంబారములతోఁ గూడినది.

సపర్య సం వి అ. స్త్రీ. 1. పూజ. 2. గౌరవము. 3. సేవ.

ఉ. అండజయాన నీ వొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె. మను. 2. 45.

సపాట (ము) విశ. (కి సపాట.) 1. నేలమట్టము.

చం. పటియలు వాటి ధాత్రిఁ బడు పర్వతమో యనఁ దేరితోడ నిర్భయముగ ఖడ్గరోము డు సపాట గఁ గూలె దురంబు లోపలన్. మొ రా. యు. 3. 37.

కం. వడిఁ దేటిఁ దోలి రా జు,ర్విడి దొంకిసపాటఁగా మరస్థలి యపుడా, పిడికిటి గొంకన్ వేయన్, బిడి కిటిబి ట్టెగసి బిల్ల బీటునఁ బడియెన్ సా. 1. 94. (శ. ర.).

2. సమమైనది, సమానమైన మితిగలది.

వ. తవమేని పాదవు నేల సపాటంబుగా వంచి వింధ్యాచలం బమ్మహామునిభావు నెదుర్కొనియె. కాశీ 2. 159.

3. మట్టమైనది, సమమైనది.

ఉ. దానవుఁ డద్ధరారమణుఁ దాఁకె మదగ్రపదా గ్రఘట్టన, గ్లానిసపాటమై యచటి కానన.ట్టవిఘ ట్టితాకృతిన్, బూని చెడన్ గిరిశగళ మూల హాలా హలకాలకాంతితో, మే న ఱికంబులాడు తపమేటి త్రిశూలముఁ బూని యుద్ధతిన్. మను. 4. 93.

ఉ. పటిగుఱించి పల్కు విను మేటికి నీభయ మోకు భాంగి యె, ప్పాట భవత్సమాన మగు పాటినరిన్ని కరంబు లేదు వా,పాటవ మొప్పు. మత్పదముపైఁ బ్రవహింపు మదాజ్ఞ వన్నన, చ్చోట సపాటమై కదలి జోటియుఁ గొల్చె నిజప్రవాహమున్. పాండు రంగ. 2. 135.

సపాటము = సపాట. వి. 1. ఒక్కుమ్మడి, ఒక్క మాట. 2. చదరము.

కం. తన దృష్టియు ముష్టియుఁ దగు, వనువున మున్నెత్తి యేయునతఁ డప్పుడు డిం,చనకాయముల సపాటం, బునఁ బదియుఁ బదేను మచ్చిపోయెం గోలన్. భార. విరా. 5. 82.

3. నేలమట్టమగుట నాశము,

ఉ. .... యి,ప్పాటి ఉపాటకోటికి సపాటము గాటముగా ఘటిల్ల దే. సమీర. 4. 18.

సపాద వి. (హిం. శై.) మహమ్మదీయ ప్రభువు.

గీ. అనుచు శిరముంఁ దాల్తు రెవ్వని సమగ్ర, సైన్య ధుతధూళిఁ జకితులై చను సపాద, కుతుపశాహి

నిజామాపిక తిలపతులు. వసు. 1. 48.

**సపాదము** నం. విణ. (అ. ఆ. అ.) 1. పాదముతోఁ గూడినది 2. నాల్గవవంతు అధికముగాఁ గలది.

**సపాలము** నం. విణ. (అ. ఆ. అ.) (గొల్లెం) కాపరి కలది 2. రాజుతోఁ గూడినది.

**సపిండీకరణము** నం. వి. అ. న. 1. చనిపోయిన వాని నుద్దేశించి ప్రేతత్వ విమోచనము కొఱకు సంవత్సరాంతమున చేయఁదగిన శ్రాద్ధ విశేషము. (ఇది తఱచుగా చనిపోయిన తర్వాతఁ బన్నెండవ దివమునఁ జేయబడుచున్నది) 2. సపిండుని (జ్ఞాతి) యొక్క యధికారమిచ్చుట.

**సపిండుఁడు** నం. వి. అ. పుం. 1. సమాన పిండము గలవాఁడు. 2. శ్రాద్ధ సంబంధమైన పిండము మూలమున సంబంధించిన జ్ఞాతి.

**సపీతి** నం. వి. ఇ. స్త్రీ. కలిసి త్రాగుట.

**సపౌష్ణమైత్రము** నం. విణ. (అ. ఆ. అ.) రేవతి, అనూరాధ అను నక్షత్రములతోఁ గూడినది.

**సప్త** నం. వి. ఆ. స్త్రీ. ఏడు తంతులు గల వీణ. పరివాదిని. (శ. ర.)

**సప్తకము** నం. విణ. (అ. ఆ. ఈ. అ.) 1. ఏఁడుగలది 2. ఏడు.

**సప్తకము** నం. వి. అ. న. ఏడింటి సమూహము.

**సప్తకి** నం. వి. ఈ. స్త్రీ. స్త్రీల మొలనూలు.

**సప్తగంగము** నం. అవ్య. ఏడుగంగలు (గంగా ప్రవాహములు) కలసిన చోటు.

**సప్తగుణము** నం. విణ. (అ. ఆ. అ.) ఏడు రెట్లయినది.

**సప్తచత్వారింశత్తు** నం. వి. త్. స్త్రీ. నలువదియేడు.

**సప్తచత్వారింశత్తు** నం. వి. త్. స్త్రీ. నలువది యేడు సంఖ్య గలది.

**సప్తచ్ఛదము** నం. వి. అ. పుం. ఏడాకుల అరటిచెట్టు. ఇట్లే సప్తపత్రము, సప్తపర్ణము మొ.

**సప్తజిహ్వుఁడు** నం. వి. అ. పుం. అగ్ని (ఏడు నాల్కలు గలవాఁడు) (కాళి, కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణ, ఉగ్ర, ప్రదీప్త అనునవి అగ్ని యొక్క యేడు నాలుకల పేర్లు.) ఇట్లే సప్తజ్వాలుఁడు మొ.

**సప్తతంతువు** నం. వి. ఉ. పుం. యాగము, ... సీ. మహిత పంచాక్షరీ మహిమంబు నెఱుంగ మఱి సప్తతంతు కర్మంబులేల? శివధ. 1. 158.

**సప్తతి** నం. వి. ఇ. స్త్రీ. డెబ్బది.

**సప్తతి** నం. విణ. ఇ. స్త్రీ. డెబ్బది సంఖ్య గలది.

**సప్తతిమము** నం. విణ. (అ. ఆ. అ.) డెబ్బదియవది.

**సప్తత్రింశత్తు** నం. వి. త్. స్త్రీ. ముప్పదియేడు.

**సప్తత్రింశత్తు** నం. విణ. త్. స్త్రీ. ముప్పది యేడు సంఖ్య గలది.

**సప్తదశ** నం. వి. న్. పదునేడు.

**సప్తదశ** నం. విణ. పదునేడు సంఖ్య గలది.

**సప్తదశారత్నదానము** నం. వి. అ. ఏదైన నొక పదము దేని విషయమున వాడఁబడినదో దానికిఁ జెందుటకు వీలు లేనప్పుడు దానియందలి యంశము నకుఁ గాని తత్సంబంధికిఁ గాని చెందునట్లు గ్రహింప వలెనని జైమిని, శబరులచే స్థాపింపఁబడిన ఒక న్యాయము.

**సప్తదీధితి** నం. వి. ఇ. పుం. అగ్ని.

**సప్తద్వారములు** నం. వి. అ. న. పంచేంద్రియములు. మనస్సు, బుద్ధి అనునవి.

**సప్తద్వీప** నం. వి. ఆ. స్త్రీ. భూమి.

**సప్తధాతువులు** నం. వి. ఉ. పుం. రస, అస్ర, మాంస, మేదోఽస్థిమజ్జా శుక్రములను శరీరమందలి యేడు మూల వస్తువులు.

**సప్తనలి** నం. వి. ఈ. స్త్రీ. పక్షులను పట్టుట కుప యోగించు చింక.

**సప్తనవతి** న. వి. ఇ. స్త్రీ. తొంబదియేడు.

**సప్తనవతి** నం. విణ. (ఇ) తొంబది యేడు సంఖ్య కలది.

**సప్తనాడీచక్రము** నం. వి. అ. న. (జ్యోతి.) భవిష్యత్కాలమున వర్షములఁ దెలిపెడి జ్యోతిశ్శాస్త్ర సిద్ధమైన యొకానొక యంత్రము.

**సప్తపది** నం. వి. ఈ. స్త్రీ. 1. వివాహము నందు దంపతులు కలిసి యేడడుగులు వేయు క్రియా విశేషము.

1. ఏడడుగుల సహాహారము.

సప్తపదులని బహువచనరూపమును గొందఱు వాడినారు.

... సప్తపదులు మెట్టింపు మనిన గంగాధర ... డమర నాయకుఁడు...భామినిచే సప్తపదులు మెట్టించి హేమాంబరుఁడు తొంటి యురవున నున్న ద్వి. పరమ. 5. 482. పు.

సప్తపర్ణి సం. వి. ఈ. స్త్రీ. అత్తపత్తిచెట్టు, సోఁకుడు ముడుఁగు చెట్టు.

సప్తపాతాళము. సం. వి. అ. న. అతలము, వితలము, సుతలము, మహాతలము, రసాతలము, తలాతలము పాతాళము, అను ఏడు భూభాగములు.

సప్తప్రకృతులు సం. వి. ఇ. స్త్రీ. బ. వ. స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రి దుర్గ బలము లనెడి యేడు రాజ్యాంగములు. (చూ. ప్రకృతి)

సప్తభద్రము సం. వి. అ. పుం. శిరీషవృక్షము. (వృ. వి.).

సప్తభూమ(మిక)ము (సప్తభౌమము) సం. విశే. (అ. ఆ. అ.) ఏడంతస్తులు గలది (ప్రాసాదము).

సప్తభౌమ సం. వి. ఆ. స్త్రీ. ఒక వరక భేదము.

సప్తమంత్రుఁడు సం. వి. ఇ. పుం. అగ్ని,

సప్తమము సం. విశే. (అ. ఆ. అ.) ఏడవది

సప్తమాతృకలు సం. వి. అ. స్త్రీ. బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ అను ఏడ్గురు తల్లులు.

సప్తమి సం. వి. ఈ. స్త్రీ. 1. (వ్యాక.) సప్తమీ విభక్తి. 2. (జ్యోతి.) పక్షము నందేడవ తిథి.

సప్తముష్టికము సం. వి. అ. న. జ్వరమును బోఁగొట్టు ఔషధ విశేషము,

సప్తరక్తుఁడు సం. వి. అ. పుం. 1. అఱచేతులు, అఱకాళ్ళు, నేత్రాంతరము, నఖములు, తాలుకము, అధరము, జిహ్వా అనెడి ఏడు భాగముల యందును ఎఱుపు గల మనుష్యుఁడు.

సప్తరాత్రము సం. వి. అ. న. ఏడు రాత్రుల కాలము.

సప్తరుచి సం. వి. ఇ. పుం.అగ్ని.

సప్తల సం. వి. అ. స్త్రీ. విరజాజితీగ (వృ. వి.).

సప్తలోకములు సం. వి. అ. పుం. బ. వ. ఏడు లోకములు, భూర్భువస్స్వర్మహార్జన స్తపస్సత్య లోకములు.

సప్తవింశతి సం. వి. ఇ. స్త్రీ. ఇరువది ఏడు సంఖ్య.

సప్తవింశతి సం. విశే. (ఇ.) ఇరువది యేడు సంఖ్య గలది.

సప్తవిధి సం. విశే. (ఇ) 1. ఏడు రెట్లైనది. 2. ఏడు విధములైనది.

సప్తవ్యసనములు సం. వి. అ. న. ఏడు వ్యసనములు.

వ. కామజంబు లగు వేట, మృగయా, స్త్రీ, పానా, ర్థదూషణంబులును గ్రోధజంబు లగు వాక్పారుష్య దండ పారుష్యంబులును నైన సప్త వ్యసనంబులం దగులక. భార. శాం. ?. 28?.

సప్తశతము సం. వి. అ. న. ఏడునూఱులు, నూట యేడు.

సప్తశతము సం. విశే. (అ. ఆ. అ) ఏడు నూఱులు సంఖ్య గలది.

సప్తశతి సం. వి. ఈ. స్త్రీ. 1. ఏడు నూరుల పద్యముల సమూహము 2. ఏడు నూఱులు సంఖ్య గల వస్తువుల సమూహము.

సప్తశలాకము సం. వి అ. పుం. జ్యోతి) వివాహముహూర్తములను స్థిరపఱుప నుపయోగించెడి జ్యోతిశ్శాస్త్రమందలి యొక చక్రము.

సప్తశిర సం. వి. ఆ స్త్రీ తములపాకుల తీఁగ.

సప్తసప్తి సం. వి. ఇ. పుం సూర్యుఁడు, సప్తాశ్వుఁడు.

సప్తస్వరములు సం. వి. అ. పుం. బ. వ. స. రి, గ. మ. ప. ధ. ని అనెడి సంగీతము నందలి యేడు స్వరములు.

సప్తాంగము సం. విశే. (అ. ఆ. అ.) ఏడంగములు గలది (రాజతంత్రము). చ. సప్తప్రకృతులు.

సీ. వర్గత్రయంబున వలనను సప్తాంగ, ముల యందు జిత్తంబు మెలఁగుచుండ...భార. శాంతి. 3. 200.

సప్తాంశుపుంగవుఁడు సం. వి. అ. పుం. శనిగ్రహము,

సప్తాంశువు సం. వి. ఉ. పుం. అగ్ని.

సప్తాత్ముఁడు సం. వి. న్. పుం. బ్రహ్మదేవుఁడు.

సబ్రహ్మచర్యము సం.వి.అ న. ఒక గురుని యొద్దఁ గలసి చదువుకొనుట, సహపాఠిత్వము.

సబ్రహ్మచారి సం. వి న్. పుం. 1. ఒక గురువు నొద్దఁ గలిసి వేద విద్యాభ్యాసము చేయు సహపాఠి, 2. సుఖదుఃఖములందు సానుభూతి గలవాఁడు. 3. సమానుఁడు.

సభ సం. వి. అ. స్త్రీ. 1. పరిషత్తు, సమాజము, ఓలగము.

ఉ. ఆ సభ కేక వస్త్రనగ నట్టి ననున్ గొనివచ్చి ... భార. ఉద్యో.3. 111.

2. (జన) సమూహము. 3. సభాభవనము., కొలువు కూటము.

సీ. తన సద్గుణచ్ఛటా తనువటాళికి నృపో త్తమసభల్ వృత్తరంగములుగాఁగ. శివధర్మ. 1. 20.

4. న్యాయస్థానము. 5. ఆస్థానము. 6. ధర్మశాల. 7. భోజనగృహము. 8. జూదిపుటిల్లు.

సభక్తికము సం. విశే. (అ. ఆ. అ.) భక్తితోఁ గూడినది.

సీ. ఎద్దాని నెఱుఁగుట యెఱుకల కెల్లను నెక్కుడని సభక్తిక నమ్మతిఁ బ్రార్థించి యడిగిన... భార. అను. 1. 163.

సభరువాఁడు వి. (హిం. సఫర్) అశ్వరక్షకుఁడు, గుఱ్ఱములను కాయువాఁడు.

తే. నడుమ పీలున్నతోలుడా ల్పైడఁగు మూవ, సభ యముగ వెంట వరుదెంచె సభరువాఁడు, సమరుము నైదు తేజితో నరుగుదెంచె, దారుణాకారుఁ డైన యుద్దారుఁడొకఁడు. శుక. 2. 426.

సభర్తృక సం. వి. ఆ. స్త్రీ. బ్రదికి యున్న భర్త గల స్త్రీ. ఐదువ.

సభాకారుఁడు సం. వి. అ. పుం. సభా గృహ నిర్మాత.

సభాగృహము సం. వి, అ. న. జనులు సమావేశమగు భవనము.

సభాచారము సం. వి అ. పుం. 1. సమాజ వర్తనము. 2. కొలువున వర్తింప వలసిన రీతి.

సభాజనము సం. వి. అ. న. 1. ఆలింగన కుశల ప్రశ్నాదులచే సంతోషపెట్టుట. 2. అభినందనము. 3. సన్మానము, మర్యాద. 4. సేవ.

సభాజితుఁడు సం. విశే. (అ ఆ. అ.) 1. గౌరవింపఁ బడినవాఁడు. 2. ప్రశంసింపఁబడినవాఁడు.

సభానాయకుఁడు సం. వి. అ. పుం. సభాపతి.

సభాపతి సం. వి. ఇ. పుం. 1. సభకుఁ బ్రభువైన యతఁడు. 2. రాజు. 3. అధ్యక్షుఁడు. 4. ద్యూత గృహ యజమానుఁడు.

సభాపరిషత్తు సం. వి. ద్. స్త్రీ. సభా సమావేశము.

సభాపూజ సం. వి. సభ యందు సభ్యుల కొనర్చు గౌర వము.

సభామండపము సం. వి. అ. న. సభాగృహము.

సభాయోగ్యము సం. విశే. సమాజమునకుఁ దగినది.

సభావనుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సభాసదుఁడు సం. వి. ద్. పుం. సభ్యుఁడు, సభయం దుండు ధర్మజ్ఞుఁడు.

చం.... అట్టిచో, నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై . భార. సభా. 2. 30.

సభాసాహుఁడు సం. వి. అ. పుం. సభలో జరిగిన వివా దమున విజయమును బొందినవాఁడు.

సభాస్తారుఁడు సం. వి. అ. పుం. 1. సభ్యుఁడు, సామా జికుఁడు. 2. తన ధర్మ వాక్యోపన్యాసములచే వర్థి ప్రత్యర్థులను లేఖక ప్రేక్షకాదులను రంజింపఁజేయు సభ్యుఁడు.

సభి(భీ)కుడు సం. వి. అ. పుం. 1. జూదమాడించు వాఁడు.

గీ. సత్యములు చేసి సభికులసాక్షి గోరి. దశకు. 5. 64.

2. న్యాయవాది. 3. సభాసదుఁడు. (ఈ యర్థము తెనుఁగునఁ గానబడుచున్నది.)

శా. విద్యారణ్యు లనంగ నెవ్వ రతఁడే విద్యం బ్రకాశించె నీ, హృద్యంబై నపురం బొనర్చు విభవం బేలాగునం గాంచెనో, చోద్యం బయ్యెడి మీరు విన్న కథ యిచ్చో లెస్సగాఁ దెల్పుఁడీ, యాద్యంతంబు నటన్న దత్సభికు లాహ్లాదంబుతో నుండఁగన్. కృష్ణ. 2. 15.

సభయుఁడై వేగ మచ్చటియధికారి సభికుల . . . న స్థానంబు వారి రావించి. ద్వి. ప. మ. 4 520.

**సభోచితుఁడు** సం. వి. అ. పుం. 1. పండితుఁడు, విద్వాంసుఁడు. విణ. (అ. ఆ. అ.) సభకుఁ దగిన వాఁడు.

**సభోద్దేశము** సం. వి. అ. పుం. సభకుఁ జేరువ నుండుస్థలము.

**సభ్యము** సం. వి. అ. పుం. 1. పంచాగ్నులలో నొకటి. 2. సభకు నుచితమైనది.

**సభ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. సభయందుండు వాఁడు.

గీ. సభ్యులెంచిన పంచయజ్ఞముల లోన జ్ఞాన యజ్ఞంబు ధ్యానయజ్ఞంబు మేలు. శివధర్మ. 2. 82.

ఆ. సభకువచ్చి ధర్మసందేహమడిగిన, నెఱిఁగి చెప్ప కుండిరేని సభ్యు, లనృత దోష ఫలమునం దర్ధ మొందుదు, రనిరి ధర్మవేదులైన మునులు. భార. సభా. 2. 237.

2, సభయం దుండఁదగినవాఁడు. 3. నాగరకుఁడు, 4. సుశీలుఁడు, మంచి నడవడి కలవాఁడు.

ఆ. ... సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకు. భార. సభా. 2. 288.

5. విశ్వసనీయుఁడు. నమ్మఁదగిన వాఁడు. వి. అ. పుం. 1. న్యాయాధికారికి సహాయుఁడు. 2. సద్వం శమునఁ బుట్టినవాఁడు. 3. ద్యూతకారుఁడు.

**సమ** సం. వి. ఆ. స్త్రీ. సంవత్సరము, ఏడాది.

**సమంగ** సం. వి. ఆ. స్త్రీ. 1. మంజిష్ఠ. 2. ముడుగుఁ దామర (శ. ర.).

**సమంచితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వక్రమైనది. 2. సుందరమైనది.

కం. రతిపంచబాణజాయా, పతికేళీ సౌధ యుగళ పర్యంత సమంచిత కాంచన కలశములీ, శతపత్ర దళాయతాక్షి చారుస్తనముల్. శృం. నై. 5. 14.

**సమంజసము** సం. విణ. (అ. ఆ. అ) 1. ఉచితము. అర్హము, యుక్తము. 2. స్పష్టము, 3. ధర్మ సహితము. 4 అనుభవ సహితము.

క... కల్పన హేతువులైన నీ సమంజస ఫణితుల్. భా. . అ. న్య. 7. 285.

**సమంజసము** సం. వి. అ. న. 1. ఔచిత్యము, 2. సమాధానము. 3. సమానత్వము. 4. సరియైన సాక్ష్యము.

**సమంతదుగ్ధ** సం. వి. ఆ. స్త్రీ. జెముడుచెట్టు.

**సమంతపంచకము** సం. వి. అ. న. కురుక్షేత్రము. లేక దాని సమీప ప్రదేశము (చూ. శమంత పంచకము.)

**సమంతపర్యాయి** సం. వి. న్. పుం అన్నింటికిని సంబంధించినది.

**సమంతప్రాసాదికము** సం. విణ (అ ఆ అ) అన్ని విధముల సాయము చేయునది.

**సమంతభద్రకము** సం. వి. ఒక రకమైన దీర్ఘ కంబళము.

**సమంతభద్రుఁడు** సం. వి. అ. పుం బుద్ధదేవుఁడు.

**సమంతభుక్కు** సం. వి. క్. పుం, అగ్ని.

**సమకక్ష** సం. వి. ఆ. స్త్రీ. సరితూకము.

**సమకక్షము** సం. విణ. (అ. ఆ. అ.) సమానమైన బరువు గలది.

**సమకట్టు** అ. క్రి. 1. కడఁగు, యత్నించు.

కం. .... కా, మవనయవము నేయఁ గశ్యపముని సమకట్టె. సకల సంభ్రమ మలరన్, దశా. 5. 70.

తే. గీ. అలర నీ వని చెప్పి నే వనుప నతఁడు వరుగ సమకట్టియున్నచో వచ్చు డెఱిఁగి. యయా. 3. 148.

వ. కావ్యకథవంబునకు గ్రథనంబు సమకట్టి యున్న సమయంబున. రాజవాహన. 1. 14.

కం. వనగతులని వారలపైఁ, జని భంగముఁబొంది రాఁగ సమకట్టెదు నీ, తనయుఁడు గావున నీ వా, తని వారింప నది యనుచితం బని నెమ్మిన్. భార. అర. 1. 78.

కం. ... అమృతము వడయన్, సమకట్టి సురేంద్ర పురోగములై హరిహరహిరణ్య గర్భులతోడన్. భార. ఆది. 2, 8.

**సబ్రహ్మచర్యము** సం.వి.అ.న. ఒక గురుని యొద్దఁ గలసి చదువుకొనుట, సహపాఠిత్వము.

**సబ్రహ్మచారి** సం. వి. న్. పుం. 1. ఒక గురువు నొద్దఁ గలిసి వేద విద్యాభ్యాసము చేయు సహపాఠి, 2. సుఖదుఃఖములందు సానుభూతి గలవాఁడు. 3. సమానుఁడు.

**సభ** సం. వి. అ. స్త్రీ. 1. పరిషత్తు, సమాజము ఓలగము.

ఉ. ఆ సభకేక వస్త్రసగవట్టి వనున్ గొనివచ్చి ... భార. ఉద్యో.3. 111.

2. (జన) సమూహము. 3. సభాభవనము., కొలువు కూటము.

సీ. తన సద్గుణచ్ఛటా తనువటాళిక్ నృపోత్తమసభల్ వృత్తరంగములుగాగ. శివధర్మ. 1. 20.

4. న్యాయస్థానము. 5. ఆస్థానము. 6. ధర్మశాల. 7. భోజనగృహము. 8. జూదపుటిల్లు.

**సభక్తికము** సం. విశే. (అ. అ. అ.) భక్తితోఁ గూడినది.

సీ. ఎద్దాని నెఱుఁగుట యెఱుకల కెల్లను నెక్కుడని సభక్తిక సమ్మతిఁ బ్రార్థించి యడిగిన... భార. అను. 1. 163.

**సభరువాఁడు** వి. (హిం. సఫర్) అశ్వరక్షకుఁడు, గుఱ్ఱములను కాయువాఁడు.

తే. వడుమ పిలువున్నతోలుడా ల్పెడఁగు మూప, వశయముగ వెంట వరుదెంచె సభరువాఁడు, నమరుము న్నైదు తేజితో వరుగుదెంచె, దారుణాకారుఁ డైన యుద్దారుఁడొకఁడు. శుక. 2. 426.

**సభర్తృక** సం. వి. అ. స్త్రీ. బ్రదికి యున్న భర్త గల స్త్రీ, ఐదువ.

**సభాకారుఁడు** సం. వి. అ. పుం. సభా గృహ నిర్మాత.

**సభాగృహము** సం. వి, అ. న. జనులు సమావేశమగు భవనము.

**సభాచారము** సం. వి అ. పుం. 1. సమాజ వర్తనము. 2. కొలువున వర్తింప వలసిన రీతి.

**సభాజనము** సం. వి. అ. న. 1. ఆలింగన కుశల ప్రశ్నాదులచే సంతోషపెట్టుట. 2. అభినందనము. 3. సన్మానము, మర్యాద. 4. సేవ.

**సభాజితుఁడు** సం విశే. (అ అ. అ.) 1. గౌరవింపఁ బడినవాఁడు. 2. ప్రశంసింపఁబడినవాఁడు.

**సభానాయకుఁడు** సం. వి. అ. పుం. సభాపతి.

**సభాపతి** సం, వి. ఇ. పుం. 1. సభకుఁ బ్రభువైన యతఁడు. 2. రాజు. 3. అధ్యక్షుఁడు. 4. ద్యూత గృహ యజమానుఁడు.

**సభాపరిషత్తు** సం. వి. ద్. స్త్రీ. సభా సమావేశము.

**సభాపూజ** సం. వి. సభ యందు సభ్యుల కొనర్చు గౌరవము.

**సభామండపము** సం. వి. అ. న. సభాగృహము.

**సభాయోగ్యము** సం. విశే. సమాజమునకుఁ దగినది.

**సభావనుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సభాసదుఁడు** సం. వి. ద్. పుం. సభ్యుఁడు, సభయందుండు ధర్మజ్ఞుఁడు.

చం....అట్టిచో, నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై. భార. సభా. 2. 30.

**సభాసాహుఁడు** సం. వి. అ. పుం. సభలో జరిగిన వివాదమున విజయమును బొందినవాఁడు.

**సభాస్తారుఁడు** సం. వి. అ. పుం. 1. సభ్యుఁడు, సామాజికుఁడు. 2. తన ధర్మ వాక్యోపన్యాసములచే వర్థి ప్రత్యర్థులను లేఖక ప్రేక్షకాదులను రంజింపఁజేయు సభ్యుఁడు.

**సభి(భీ)కుడు** సం. వి. అ. పుం. 1. జూదమాడించు వాఁడు.

గీ. సత్యములు చేసి సభికులసాక్షి. గౌరి. దశకు. 5. 64.

2. న్యాయవాది. 3. సభాసదుఁడు. (ఈ యర్థము తెనుఁగువఁ గానబడుచున్నది.)

శా. విద్యారణ్యు లనంగ నెవ్వ రతఁడే విద్యం బ్రకాశించె నీ, వ్యాద్యంబై నపురం బొనర్చు విభవం బేలాగునం గాంచెనో, చోద్యం బయ్యెడి మీరు విన్న కథ యిచ్చో లెస్సగాఁ దెల్పుఁడీ, యాద్యంతంబు నటన్న దత్సభికు లాహ్లాదంబుతో నుండఁగన్. కృష్ణ. 2. 15.

సభయుఁడై వేగ మచ్చటియధికారి సభికుల . . . న స్థానంబు వారి రావించి. ద్వి. పరి. 4. 520.

**సభోచితుఁడు** సం. వి. అ. పుం. 1. పండితుఁడు, విద్వాంసుఁడు. విశ. (అ. ఆ. అ.) సభకుఁ దగిన వాఁడు.

**సభోద్దేశము** సం. వి. అ. పుం. సభకుఁ జేరువ నుండుస్థలము.

**సభ్యము** సం. వి. అ. పుం. 1. పంచాగ్నులలో నొకటి. 2. సభకు నుచితమైనది.

**సభ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. సభయందుండు వాఁడు.

గీ. సభ్యులెంచిన పంచయజ్ఞముల లోన జ్ఞాన యజ్ఞంబు ధ్యానయజ్ఞంబు మేలు. శివధర్మ. 2. 8౭.

ఆ. సభకువచ్చి ధర్మసందేహమడిగిన, నెఱిఁగి చెప్ప కుండిరేని సభ్యు, లనృత దోష ఫలమునం దర్ధ మొందుదు, రనిరి ధర్మవేదులైన మునులు. భార. సభా. 2. 237.

2. సభయం దుండఁదగినవాఁడు. 3. సాగరకుఁడు, 4. సుశీలుఁడు, మంచి నడవడి కలవాఁడు.

ఆ. ... సభల నెవ్వఁడేని సభ్యుడై పలుకు. భార. సభా. 2. 238.

5. విశ్వసనీయుఁడు. నమ్మఁదగిన వాఁడు. వి. అ. పుం. 1. న్యాయాధికారికి సహాయుఁడు. 2. సద్వంశమునఁ బుట్టినవాఁడు. 3. ద్యూతకారుఁడు.

**సమ** సం. వి. ఆ. స్త్రీ. సంవత్సరము, ఏఁడాది.

**సమంగ** సం. వి. ఆ. స్త్రీ. 1. మంజిష్ఠ. 2. ముడుగుఁ దామర (శ. ర.).

**సమంచితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. వక్రమైనది. 2. సుందరమైనది.

కం. రతిపంచబాణజాయా, పతికేళీ సౌధ యుగళ పర్యంత సమంచిత కాంచన కలశములీ, శతపత్ర దళాయతాక్షి చారుస్తనముల్. శృం. నై. 5. 14.

**సమంజసము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉచితము. అర్హము, యుక్తము. 2. స్పష్టము, 3. ధర్మ సహితము. 4. అనుభవ సహితము.

కం. కల్మష హారణములైన నీ సమంజస భణితుల్. భా. ఆను. 7. 292.

**సమంజసము** సం. వి. అ. న. 1. ఔచిత్యము, 2. సమాధానము. 3. సమానత్వము. 4. సరియైన సాక్ష్యము.

**సమంతదుగ్ధ** సం. వి. ఆ. స్త్రీ. జెముడుచెట్టు.

**సమంతపంచకము** సం. వి. అ. న. కురుక్షేత్రము. లేక దాని సమీప ప్రదేశము (చూ. శమంత పంచకము.)

**సమంతపర్యాయి** సం. వి. న్. పుం. అన్నింటికిని సంబంధించినది.

**సమంతప్రాసాదికము** సం. విశ (అ ఆ అ.) అన్ని విధముల సాయము చేయునది.

**సమంతభద్రకము** సం. వి. ఒక రకమైన దీర్ఘ కంటకము.

**సమంతభద్రుఁడు** సం. వి. అ. పుం బుద్ధదేవుఁడు.

**సమంతభుక్కు** సం. వి. క్. పుం. అగ్ని.

**సమకక్ష** సం. వి. ఆ. స్త్రీ. సరితూకము.

**సమకక్షము** సం. విశ. (అ. ఆ. అ.) సమానమైన బరువు గలది.

**సమకట్టు** అ. క్రి. 1. కడఁగు, యత్నించు.

కం. .... కా, మపనయనము నేయఁ గ,శ్యపముని సమకట్టె. సకల సంభ్రమ మలరన్, దశా. 5. 70.

తే. గీ. అలర నీ వని చెప్పి నే ననుప నతఁడు వరుగ సమకట్టియున్నచో నప్పు డెఱిఁగి. యయా. 3. 148.

వ. కావ్యకథనంబునకు గ్రథనంబు సమకట్టి యున్న సమయంబున. రాజవాహన. 1. 14.

కం. వనగతులని వారలపైఁ, జని భంగముఁబొంది రాఁగ సమకట్టెదు నీ, తనయుఁడు గావున నీ వా, తని వారింప వది యనుచితం బని నెమ్మిన్. భార. అర. 1. 78.

కం. ... అమృతము వడయన్, సమకట్టి సురేంద్ర పురోగములై హరిహరహిరణ్య గర్భులతోడన్. భార. ఆది. 2, 8.

కం. అమితభుజశక్తి నంతక, సము లప్పొందు మతు లిందు సౌభ్రాతృస్నే,హమునకు విచ్ఛేదముగా సమయాతిక్రమము సేయ సమకట్టరుగా. భార. అర. 1. 97.

వ. సూర్యమండలంబు భక్షింప సమకట్టి పొదువు నప్పుడు. వి. పు. 3. 179.

చం. కలి దమయంతిఁ బాప సమకట్టు నతిం బలి వాయనోపఁడు. భార. అర. 2. 78.

ఉ. ...నాకలో, కంబునకుం జనంగ సమకట్టెఁ బితామహు కూర్మిపట్టి. శృం. నై. 3. 3.

2. సన్నద్ధమగు, ఆయితమగు.

చం. ...భీ, కరసమరంబు సేయ సమకట్టిన యట్లు మహోమరాగని, రథమున నున్నవాఁడు. భార. ఆది 6. 273.

సీ. యాదవులును దొంటియట్టుల సమకట్టి వెడలి ఖేచరదృష్టి వెక్కసమున, మునుగంగఁ జొరికట్లె నసిన పోరాట పదునెనిమిది మాఱు లెదిరి రిపుఁడు. హరి. ఉ. 3. 63.

3. కలుగు, సమకూరు.

సీ. విమతకీర్తి ప్రతాపములు నీచే సమకట్టునే యుభయరగండబిరుద, యరివిధూతాటంక గరిమంబు నీచేతఁ గలుగునే గండరగండ బిరుద. నరసభూ. 5. 167.

4. సరిపడు, తగు.

రగడ. నిలువు నిలివెడు సోగ వగ పెన్నెఱుల కవి సమకట్టు జల్లులు. శుక. 1. 133.

**సమకట్టు** స. క్రి 1. ఏర్పఱుచు, నిర్ణయించు.

ఆ. భోగితలలపట్టు పూర్వదేవతలను, దోఁక పట్టు సురలు వీఁకఁ బట్టి, త్రచ్చునట్లుగాఁ గ దామోదరుఁడు సమ,కట్టె వారివారి కడల నిలచి వి పు. 1. 180.

కం. పాయక భూధేనువునకు స్వాయంభువు క్రేపు గాఁగ సమకట్టి మహీ, నాయకుఁడు పిదికె దుగ్ధ, ప్రాయంబై జగము లెల్లఁ బరిపూర్ణము గన్. వి. పు. 2. 174.

వ. మానుషవ్యూహంబు సమకట్టిన వెన్నండును నిట్టి దృఢవ్యూహంబు గనియును వినియు నెఱుంగమని యెల్లవారు నచ్చెరువునం బొందయుచు. భార. భీష్మ. 1. 103.

2. సమకూర్చు, ఘటించు.

ఆ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి వలయు తెఱఁగు,సమయ సముచితముగ సమకట్టు మయ్య. భార. విరా 1. 181.

3. కల్పించు, సిద్ధము చేయు.

వ. అర్ఘ్యోసాధనంబులు సమకట్ట సముచిత పరివారంబునకుం జెప్పెడు. భార. భీష్మ. 1. 82.

సీ. మరున కర్పింప నామని సమకట్టిన పచ్చఁజూబరి తెల బాగు గాంచి. ఉ. రా. 6. 14.

4. సంపాదించు.

కం. విదితముగ నిన్నుఁ జేయిం,చెదఁ గ్రతువు ధరాధినాథ చేయుము నీక,భ్యుదయంబగు సంభారస,ముదయము సమకట్టు మనిన మునివచనమునన్. భార. అర. 3. 189.

5. ధరించు, కట్టుకొను.

ద్వి. జంగమం బడిగిన సమకట్టనిచ్చు. బస. పురా. 83 పు. 24 పం.

కం. తోరపులత్తుక చాయల, వారువములు గట్టి మహిమ వరకేతువు నె,ల్వార సమకట్టి తేరాసారథి గొనితేర నెక్కె సంరంభమునన్. ఉ. రా. 3. 343.

**సమకట్టు** వి. కూర్పు, రచన, వేషరచన.

సీ. సర్వంసహాకుఁ గానె సమకట్టు పుట్టంబు, గగనంబునకు నెల్లఁ గలువసెజ్జ .... తే. ఘుమఘుమారంభ గంభీర ఘోష ఘటిత, లహరికా ప్రతికల్లోలబ్ధి యబ్ధి భీమ. 3–61.

కం. అల్లువ కిచ్చెను బచ్చల, పల్లకియును దమ్మి కెంపుఁ బడకపు జోడున్, జల్లుల సమకట్ల లరన్, బల్లించిన వారువమును బంగరు గొడుగున్, యయా. 4. 123.

ద్వి. కట్టితి సర్వాంగ కచ్చడం బమచుఁ, గట్టిన సమకట్టు కాంత చూపుడును. బస. పు. 42. 27 పం.

వ....పార్శ్వంబులం గట్టు కెంబట్టులాలసరి పమకట్టు

తొక్కలుగా (గుజ్జము వర్ణన). మను. 4. 115.

సమకన్య సం. వి. అ. స్త్రీ. పెండ్లి యాడుటకుఁ దగిన పడుచు.

సమకర్ణము సం. వి. అ. పుం. (క్షేత్ర.) సమ చతుర్భుజము, సమానమగు నాలుగు కోణములుగల యాకారము.

సమకాలము సం వి అ. పుం. ఏకకాలము. ఒక్క సమయము.

సమకాలము అవ్య. అప్పుడే; ఆసమయమందే.

సమకాలీనుఁడు సం. విశే. (అ. అ. అ.) ఏక కాలమున నున్నవాఁడు.

సమకుఱు అ. క్రి. లభించు.

కం. సరసగుణా చనుము మేలు సమకుఱు వచటన్. భాగ. 4 స్కం. 246.

సమకూడు — సమకూరు. అ. క్రి. కలుగు.

కం. ఇమ్ముగ నున్నేమనిమే, షమ్ములు మనుజులకు నెల్ల సమకూడెను. నే, త్రమ్ముల లోపలనే రూ,పమ్ములుఁ బొడచూపఁ బోఁడగె పరమ మునీంద్రా. వి. పు. 5. 301.

సమకూరు అ క్రి. 1. శక్యమగు.

కం. నిమిషాంతరమున నిట్లు, శ్రమమున మర్త్యులకు నేయ సమకూరునె ? యు,త్తముఁ డితఁడు బ్రాహ్మణ రూపమున సురేశ్వరుఁడొ ? భార. ఆది. 7. 184.

చం. వన నిధిలోని రత్నములు వాసుకి మూర్ధజరత్న సంఘముల్, గొనఁగ నశక్యమున్ జనులకున్ సమ కూరదు గాన నెప్పుడున్. భార. ఆది. 8. 78.

2. సంఘటిల్లు, తటస్థించు.

ఈ బ్రాహ్మణునకు నేమిప్రియము సేయ సమ కూరునో యని చింతించుచు. భార. ఆది. 6. 240.

వ. మనకు సుఖనివాసంబు నేసి పరమోపకారియైన బ్రాహ్మణునకుఁ బ్రత్యుపకారంబు నేయ సమకూరె. భార. ఆది. 6. 282.

తే. నీకు నిష్టంబు సేయంగ నెమ్మితోడ గోరు చుండుదు నది సమకూరె నేఁడు. భార. సభా. 1. 150.

3. లభించు, చిక్కు.

ఉ....సవ్యసాచిపైఁ గోపము పెద్ద వాఁడు సమ కూరిన బిట్టలఁ జంపుమం చామి. భార. ఉద్యో. 4. 88.

మ....వా, విర బ్రహ్మాస్త్రము నిన్న రేశ్వరునిపై వేగం బ్రయోగింపు మస్థిరశీలన్ సమకూరు నీకు జయలక్ష్మి నిత్యసాంగత్యముల్. విక్ర. 4. 128.

4. కలుగు, సిద్ధించు.

సీ. సరవితో వర్షంబు సమకూర కుండుటఁ బంట లెబరమయ్యెఁ బాడితోడ. కాశీ. 1. 187.

తే. పూర్వజన్మ మహాతపఃస్ఫూర్తిఁ జేసి, నీదుసన్నిధి సమకూరె నిధియుఁ బోలె. కృ. నై. 2. 28.

వ. సందేహంబు వాసి మనంబునకుం జూపునకును సంవాదంబు సమకూఱినం గందర్ప మందాతంబు లకు వశంవదయై. కృ. నై. 5. 133.

కం. తలంపులు సమకూరెం గద, వెలితేమియు లేక యింక వేంచేయఁ దగున్. యయా 5. 1. 48.

ఉ. తామర కెంపు లంతటను దాచి ముక్కాలి పీఁట మీఁదటన్, గోములు లంతఁ బెండ్లి కొడుకుం దగ నుంచినఁ బొల్పు మీఱఁగాఁ, బ్రామినుకుం దెఱంగు నను రక్షసి యొజ్జ యొసంగెఁ గూతుమన్, గోమునబెంచు కోర్కె సమకూరుటకుం దనజాన మెచ్చగన్. యయా. 4. 104.

5. కూడుకొను, ప్రోగగు.

చం. ఎనయఁగ నొక్క వల్లెదొం యింటను బండుగు వాఁడు కాంత లెల్లను సమకూరి చేయు పములం బడియుండెడు వేళ నొక్క కామినియును గాముకుం డొకఁడు మెల్లనె మూలకు నేగి శయ్యపై వెనఁగిరి కంఠసీమలను బెక్కు కవుంగిటఁ జేర్చ గుట్టు గాన్. గంధ. 1. 146.

సమకూరుట వి. సిద్ధించుట.

కం. అంత వియచ్చరుఁ డభిమతఁ, మంతయు సమ కూరుటయును వచ్చెర గర్భ, శ్రాంత యగుటయును గనుగొని, యింతట నిచ్చోటు వాయ నౌనిఁక మన్నన్. మను 3. 124.

**సమకూర్చు** సమకూడచు స. క్రి. 1. కలిగించు; ప్రాప్తింపఁజేయు.

సీ. శాత్రవ విజయంబు సతతంబు సమకూర్చుఁ దూలించు బహువిధ దుఃఖములను. సీతారా. 1. 63.

సీ. సమధికావష్టంభ సంరంభ జృంభణ సమకూర్చె నిజభుజాస్తంభమునకు. హర. 6 44.

ఎ. గీ. మేలు సమకూర్చి త్రైలోక్య మేలువాని. దశా. 2. 257.

2. నెఱవేర్చు, సిద్ధింపఁజేయు.

సీ. ఓ మహీధరరాజ యుర్వీశపతి యైన, దశరథ మహారాజనందనుని యాజ్ఞ, సమకూర్ప వచ్చితి సర్వలోకములకు హితమైన సత్కార్యమెల్ల భంగి భా. రా. యుద్ధ. 17. 22.

తే. గీ. నేర్పు మెఱయగ వడి సమకూర్పవయ్య. నీలా. 1. 97.

చం....అంగవలం గరఁగింప నేర్చి కోర్కులు సమకూర్పఁజూచి కడుఁ గొండొక ప్రాయము గల్గువాని. శుక. 1. 46.

3. సిద్ధముచేయు.

వ. వాహనంబులు మొదలుగాఁ గలుగు దానద్రవ్యంబులు సమకూర్చు నధికారుల సంభ్రమాలాపంబులవలన. పారి. 5. 75.

4. ఘటిల్లఁజేయు.

తే. ప్రబల దీర్ఘాయురారోగ్య భాగ్యకరము, లగు వరంబులు సమకూర్చి రఖిలమునులు, నూతన వివాహ కౌతుక ద్యోతమానమానసీయాకృతికిఁ జేదిమనుజపతికి. వసు. 6. 43.

చం. అడిగిన యంతలోన సరసాన్నములన్ సమకూర్చు. పారి. 1. 61.

శా... ఈ పాత్ర దివ్యాన్నముల్, చాలంగా సమకూర్చుఁ గోరినతటిన్. విక్ర. 2. 7.

**సమకొను** అ. క్రి. సిద్ధించు, కలుగు.

ఆ. మమ్ముఁ గరుణఁ జూడు మా మ్రొక్కుగై కొను, సకలలోక హితము సమకొనంగ, విన్నపంబు సేయుచున్నారు మునులెల్ల, నవధరించి ప్రోవు మంబికేశ. భా. రా. బాల. 352.

సీ అన్యాయవర్తనులైన రాజులచేత, సమకొన్న దుర్వ్యసనములచేత. జై. భా. 8. 212.

కం. వననిధి దాఁటుట వచ్చుట, యనిసేయుట చాక మనుట యది సమకొనునే, మనుజుఁడు నిముఁగొనిపోయెడి, ఘనుఁ డెవ్వం డేమునీకుఁ గావలి యుండన్. భా. రా. సుంద. 283.

2. లభించు, ప్రాప్తించు.

ఆ. వె. కానజున్ను రేఁచి తేనియసమకొన్నఁ గ్రోలకున్నవాఁడు బేలఁగాడె, యువిదఁ దెచ్చి యూరకుండుదురే శ్రామ, చూడకేళి కింకఁ జొత్తుఁగాక ! భార. రా. యుద్ధ. 109.

ఎ. గీ. తనకు సమకొన్న యా రాజ్యమును నొసంగి, తండ్రి తాతల నాటిదై తనరు వేంకటగిరి రాజ్యమ్మునకును దిరుగఁ జనియెను. రంగా. 1. 116.

3. పూను, యత్నించు.

కం. అమరాజయ్యలు దితిజులు, సమరంబున నాఁడు నాఁడు సమయుచు నుండన్, సమకొనడు సీతఁ బుచ్చఁగ, భ్రమసి యొకో యకట యిట్టి పాపము గలదే. భా. రా. యుద్ధ 1475.

ద్వి. అమరేంద్రుచే జన్నమట వసిష్ఠుండు, సమకొనియే నూఱు సంవత్సరంబు లంచాఁక చేయించి యది దీర్చి మరలి. రం. రా. ఉ కాం. 128 పు. 12 పం.

ద్వి. అమరేంద్రుఁ డేతెంచి యశ్వమేధంబు, సమకొని కావించి సకల సామగ్రి, యాగంబు నిండంగ నట బ్రహ్మహత్య, వేగ నింద్రుని జూచి బెగడియు నిలిచి.

రం. రా. ఉ కాం. 165 పు. 4 పం.

4. ఒప్పు, తగు.

చం. మిసమిసలీను మేను నెఱమించుల కొంచెపు టంచుఁ గమ్మలుం, గొనబగు ముద్దుమోము సమకొన్న మెఱుంగుల కట్లదండయుం, గముఁగనఁ గల్గుతేఁటి యొడికంబును. శుక. 3. 105.

కం. అజ్ఞానంబున హరున క, వజ్ఞుఁ దలఁచి యతని నొసలి వ్రాఁత ఫలమునన్, యజ్ఞము సేసెను మఱలయ, నుజ్జ్వలంబరవృద్ధి కప్పునులు సమకొనునే. భీమ. 2. 8.

5. అనుకూలమగు.

చం. తమకము నాగి ముచ్చటకుఁ దార్చి నెపంబున సోఁకి హ స్తసం, గమమున కియ్యకొల్పి పులకంబులు మై బొడవించి వంచన, క్రమముల నొయ్యఁ బయ్యెదయుఁ గంపమునం దొలఁగించి పూన్కికిన్, సమకొని సిగ్గునంతయును జార్చియెడన్ సతిఁ గూర్చు చెన్నఁడో. కవి. 3. 54.

6. రూపొందు, ఏర్పడు.

కం. వాసుకి పిలికెడు వాఁడుగ భాసిత ఫణ పాత్ర గరళ బహుదుగ్ధము లు, ల్లాసమునఁ బ్రేపుతక్షకు, లై సమకొనఁ గొనిరి దారుణాద్భుతభుజగుల్. హరి. పూర్వ. 1. 140.

సమకొను స. క్రి. వహించు, పూను.

ఉ. అర్జున వింటినారి బిగియం దగిలించి విరోధి మోముకు బెట్టి వహించు కన్నుల నిరీక్షణ మొప్పఁగఁ దెచ్చి వేఁటకాఁ డిట్టియుఁ బోలె వవ్వుచు నుపేంద్రుని ముందటఁ బెట్టి వీఁడుగో, గుట్టువుదొంగ చిక్కె సమకొన్న ప్రతిజ్ఞ ఫలించె నావుడున్. జై. భా. 3. 114.

సమకొల్పు స. క్రి. (√సమకొను) 1. వహించు, పొందు.

కం. ... జగదే, కత్రాణపరాయణ విను, శత్రులు భీతిల్ల వలుక సమకొల్పుమదిన్. భా. రా. యుద్ధ. 10.

కం. దితి మానుఁదునిమి మఱియును. దితిజకులము పెంచమడఁచు తే,కువ మదిఁ బూ,నితి నేని మమ్ము నేలుట, సతమగు నమ్మొయికిఁ గరుణ సమకొలువ గదే. హరి. పూర్వ. 4. 31.

కం. జననీ యిట్లనుటను మ,జ్జనకు పలుకు మీఱఁగాదు సమకొల్పు ధృతిన్, మనమున వగవకుము. భా. రా. అయో. 88.

2. నెఱవేర్చు; పూర్తిచేయు,

ద్వి సర్వకార్యంబులు సమకొల్పి వచ్చి యుర్వీశు లెప్పుడు లోగిఁ గొల్చియుండ. రం. రా. ఉ. కాం. 182 పు. 18 పం.

3. సిద్ధము చేయు కూర్చు.

వ మఱియు మడుఁ జివురగండెలు మారమ్మలు మొదలగు మృగయాసాధనంబులు సమకొల్పముఁ లయిచ్చియు. చంద్రాంగ. 2. 84.

4. కలిగించు.

సీ. వరసంబు పొందించి వల్లంబు కల్పించి నిగుడంబు సమకొల్పి నెఱను నెఱపి. ఏ. శకుం. 1. 112.

5. పూన్చు; పురికొల్పు.

చం. ఇల వెలదోఁటలందుఁ జరియింపఁగ సాధము తెక్కఁ జిత్రపం,క్తుల మృగరాజుఁ జూడ సమకొల్పుదు రాఁదనుకూర్చు నెయ్యపుం, దెలుంకు పాళ్వమాకవ్యపశేఖరు దమ్మ నృపాల చంద్రుతోఁ గలసను మార్కొనం గడఁగు గల్పివిరోధులదేమి చిత్రమో. విప్ర. 1 51.

కం. స్నేహార్ద్రహృదయరైు యతి, సాహసకృత్యములు మాన సమకొల్పుటకై, యూహాపోహ విచారస, మాహితగతిఁ దల్లి సుతుని మఱి శోధించున్. కాశీ. 4. 89.

సమకోటిక సం విశే. (అ ఆ. అ.) సరియైన పరిమాణము కలది.

సమకోలము సం. వి. అ పుం. పాము

సమకోలు వి. (సమకొనుట) లభించుట, సిద్ధించుట. (శ. ర.).

సమక్షము సం. విశే. (అ. ఆ. అ.) కన్నుల యెదుట నున్నది, ప్రత్యక్షమైనది.

సమక్షము అవ్య. కన్నుల యెదుట, ఎట్ట యెదుట.

సమక్షము వి. సన్నిధి.

వ. ధర్మరాజును జగదర్చితుండయిన...నాప్తమంత్రులయు సమక్షంబున ... భార. సభా. 1. 275.

(ఇది సాధారణముగా సమక్షమునకు, సమక్షమున, సమక్షము నందు అను రూపము తోడనే వాడఁబడుచున్నది )

సమగతి సం. వి. ఇ. పుం. వాయువు.

సమగంధకము సం. వి. అ. పుం. ధూపము.

సమగంధికము సం. వి. అ. న. వట్టివేరు.

సమగ్రణి సం. వి. ఈ. పుం. అందఱిలో మొదటి వాఁడు.

సమగ్రము సం. విశ. (అ. ఆ. అ.) 1. సకలము, సమస్తము. 2. పూర్ణము, నిండినది.

కం. రసకర్మజ్ఞుఁడు దారము, పసిండిసేఁతకుఁ బ్రయత్నపరుఁడై శుద్ధత్వ సమగ్రము సేయు క్రియ, స్వీసువక పరిశుద్ధి జీవునికిఁ జేయుటురున్. భార. శాంతి. 5. 417.

మ. ... విస్ఫారోల్ల సన్మార్గణా హాతికిం దప్పక యుండు వట్లుగ సమగ్రాశ్చర్య సంపాదకోద్ధత భావాభివంబు చూపె... భార. శల్య. 1. 32.

సమచక్రవాలము సం. వి. అ. న. వృత్తము.

సమచతురస్రము సం. విశ. నాల్గు వైపులు సమముగ నున్నది, చదరమైనది. వి. చతుష్కోణము.

సమచతుర్భుజము సం. వి. అ. న. అ. పుం. నాల్గు కోణములు సమములు కాకుండియు నాల్గు భుజములు సమములైనది (రోంబస్).

సమచిత్తుఁడు సం. విశ. (అ. ఆ. అ.) అన్నిటి యందును సమానమైన మనస్సు గలవాఁడు. 2. తత్త్వజ్ఞానము కలుగువాఁడు.

కం. సమచిత్త వృత్తులగు బుద్ధిమంతులకు నిపుడు ద్రౌపదీ ప్రశ్న విచారము సేయవలయు .... భార. సభా. 2. 226.

3. ఉదాసీనుఁడు.

సమచౌకము (మి) విశ. సమమగు చదరము (పొడవు, వెడల్పు) గలది, చతురస్రము.

చం. మునివరులార తత్కుధరమూర్ధమునం బదు నాల్గువేల యోజనములఁ జూడ నొప్పు సమ చౌకపు వెత్తము నిండి రత్న కాంచనమయ తోరణావరణ సౌధ విలాసము చేతఁ జాల వర్ణన మునకెక్కు నొక్క నగరంబు మనోవతి నాఁగఁ బత్పురిన్. వ రాహా. 10. 112.

సమచ్ఛేద(న)ము సం. విశ. (అ. ఆ. అ.) (గణిత.) సమానమైన హారము గలది.

సమజము సం. వి. అ. పుం. 1. పశుపక్షి సమూహము. 2. మూర్ఖుల సమూహము, 3. సమూహము.

సమజము సం. వి. అ. న. వనము, అడవి.

సమజాతి సం.విశ. (ఇ) మిశ్రితము కాని, ఒకే జాతికిఁ జెందినది.

సమజ్ఞ సం. వి. ఆ. స్త్రీ. కీర్తి, యశస్సు.

సమజ్య సం. వి. ఆ స్త్రీ. 1. సభ. 2. కీర్తి.

సమత సం. వి. ఆ. స్త్రీ. 1. సమత్వము, సమానత్వము.

ఉ. కావున లోక సంశయము గన్గొని యెల్లెడ నిర్మ ముండవై, నీవును శాంతియున్ సమత నిష్ఠయు బూని ... భార. శాంతి. 5. 388.

2. కావ్య గుణములలో నొకటి. 3. పోలిక.

సమతిక్రమించు సం. వ. క్రి. అతిక్రమించు, మీఱు.

చం. అట సని యాశ్రమంబున హిమాచలమున్ సమతిక్రమించి వారు ... భార. మహా. 33.

సమత్రిభుజము సం. వి. అ. (క్షేత్ర.) మూఁడు భుజములు సమానముగా నుండు త్రిభుజము.

సమదండ వి. మల్లవిద్యా సంబంధమగు పది రెండు దండలలో నొకటి.

వ. అవ్వీరుండు సమదండ గజదండ కుక్కుటపు దండ మొదలుగాఁ గల పది రెండు దండల పాం డిత్యంబు దెలిసి. హంస. 1. 203

సమదర్శనుఁడు సం. విశ. (అ ఆ అ) 1. అందఱను సమముగాఁ జూచువాఁడు. 2. పక్షపాతము లేని వాఁడు.

సమదర్శి సం. విశ. (న్. నీ. న్.) అన్ని వస్తువులను బ్రహ్మభావముతోఁ జూచువాఁడు.

శ్లో. శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః. సమదర్శనుఁడు.

సమదుఃఖుడు సం. విశ. (అ. ఆ. అ.) 1. ఇతరుల యెడ సానుభూతిని జూపువాఁడు. 2. పరులతో బాటు దుఃఖించువాఁడు.

సమదృష్టి సం. విశ. (ఇ) సమదర్శి.

సమదృష్టి సం వి. ఇ. స్త్రీ అన్ని విషయము లందును సమానమైన భావము,

**సమధర్మము** సం. విశే. (న్) 1. సమానమైన స్వభావము కలది. 2. పోలియున్నది.

**సమధికము** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి యెక్కువైనది, అత్యధికమైనది.

మాలిని. సమధికవదస్యైవః నిత్య ప్రభుత్వాభా. శాంతి. 2. 449.

**సమధిగమము** సం. వి. అ. పుం. సమగ్రముగా నెఱుఁగుట.

గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద సమధిగమము సత్యంబుతో సరియుఁగావ... భార. ఆది. 4. 96.

**సమధిగమనము** సం. వి. అ. న. 1 అతిశయించుట. 2. ఓడించుట.

**సమధృతము** సం. విశే. (అ. ఆ. అ.) సమానమైనది.

**సమధ్వఁడు** సం. వి. అ. పుం. జతగాఁ బయనించువాఁడు.

**సమనంతరము** సం. విశే. పిమ్మట.

కం.... ఫలాహారంబు లొసఁగి తుష్టపరిహారం బొనరించి యలఁత యంతయుఁ దీర్చెన్.

కం. సమనంతరంబ మీ కీ క్రమమున శెట్టలయనేల ఘర్మాంత. పరిభ్రమణమున నిల్త పుట్టెను విమతుల వధియింపఁ గడఁగి వెమతగిలిరొకో. ద్వా. 11. 12.

**సమనీకము** సం. వి. అ. న. యుద్ధము.

**సమనీకమూర్ధము** సం. వి. అ. పుం. అనిమొన.

**సమన్యుఁడు** సం. విశే. 1. కోపముతోఁ గూడినవాఁడు. 2. దుఃఖముతోఁ గూడినవాఁడు.

**సమన్యుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సమన్వయము** సం. వి. అ. పుం. 1. క్రమము. 2. పరస్పరసంబంధము. 3. సంయోగము.

**సమన్వితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సంబంధము కలది. 2. కూడినది.

గీ. వ్రతసమన్విత భూసురవర్యుఁ డొండె... భార. శాంతి. 1. 19.

3. క్రమముతోఁ గూడినది. 4. నిండియున్నది.

**సమపదము** సం. వి. అ. న. 1. యుద్ధమున విలుకాండ్రు నిలుచు నిలుకడలలో నొకటి, రెండు కాళ్ళను సరిగా నిలిపి నిలుచుండుట. 2. సురత మందలి బంధ విశేషము.

**సమబుద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. భేదభావము లేమి, పక్షపాతము లేమి.

కం. సమబుద్ధి తోడఁ దత్త్వముచితకర్మ ఫలమ్ముల జంతుతతులకున్. భా. అరణ్య. 7. 250.

**సమభిద్రుతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మీఁది కురుకునది. 2. ముట్టడింపఁబడినది.

**సమభిధ** సం. వి. ఆ. స్త్రీ. పేరు.

**సమభిప్లుతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముంచఁబడినది. 2. తగ్గింపఁబడినది 3. పొరలి పోవునది. 4. క్రమ్మఁబడినది. 5, గ్రస్తము.

**సమభివ్యాహారము** సం. వి. అ. పుం. 1. కలిపి చెప్పుట. 2. సంఘము. 3. సుబోధమైన అర్థము గలపదముల తోడి సంబంధము.

**సమభివ్యాహృతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కలిపి పలుకఁబడినది. 2. కలిసి యున్నది, కూడి యున్నది.

**సమభిసరణము** సం. వి. అ. న. 1. సమీపించుట 2. వెదకుట, వెంబడించుట. 3. కోరుట.

**సమభిహారము** సం. వి. అ. పుం. 1. పునరుక్తి. 2. కలిపి గ్రహించుట. 3. ఆధిక్యము.

**సమభ్యర్చనము** సం. వి. అ. న. 1. పూజించుట. 2. గౌరవించుట.

**సమభ్యాహారము** సం. వి. అ. పుం. 1. అనుసరించుట, 2. కూడియుండుట.

**సమము** సం. వి. అ. తుల్యమైనది, సరియైనది.

కం. కృత మెఱుఁగుట పుణ్యము సన్మతి దానికి సమము సేఁత మధ్యము మఱి. భార. ఆది. 6. 241.

గీ. హరజటాజూట చంద్రరేఖామృతంబు, వనజనిదగు దంతచ్ఛదామృతంబు, సమముగా రెండు జిహ్వలఁ జవులు మాచి, నేర్పుఁబో వీఁడు చవివాని నిశ్చయింప. శృం. నై. 5. 27.

సమరథుఁడు సం. వి. అ. పుం. ఒక విలుకానితో సరిగా నిలిచి యుద్ధము చేయు యోధుఁడు.

సమరము సం. వి. అ. పుం. న. యుద్ధము, పోరు.

సమరమూర్ధము సం. వి. న్. న. 1. అనిమొన. 2. సంగ్రామాంగణము.

సమరశిరము సం. వి. స్. న. సమరమూర్ధము.

సమరసము సం. విణ. (అ. ఆ. అ) సమానమైన యనురాగము కలది.

సమరసము సం. వి. అ పుం. సమానమైన యను రాగము. 2 అభేదము, వేఱుకామి.

సమరించు వ. క్రి. (త. చమరు) సంహరించు.

సీ. గౌడవాయకుఁ దురంగముతో సమరించెఁ, గాళ భర్తద్భుణంబుగాఁ బెగల్చె, మత్స్య వల్లభుఁ బట్టి మర్దించె మిట్టిపాటం గేళుఁదను బలాఢ్యతుఁ జేసె. రాజవాహన. 2. 75.

సమరోద్దేశము సం. వి. అ. పుం. యుద్ధభూమి.

సమర్చనము సం. వి. అ. న. 1. పూజించుట, 2. గౌరవించుట.

సమర్చించు సం. న. క్రి. పూజించు.

మ. అనుమానింపకు రమ్ము నే ననఘుని కాయుప్ర దుండై తన,ర్చిన దేవుండ నిరంతరంబును సమర్చింపంగ నర్హుండ ... హరివం. ఉ. 9. 106.

సమర్దుఁడు సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి పీడింపబడినవాడు: నొప్పింపఁబడినవాఁడు. 2. ప్రార్థింపఁ బడినవాడు, వేఁడుకొనబడినవాఁడు.

సమర్త వి. (సం. సమర్థా. త. సమత్తి) 1. యౌవనము (చూ. సమరత) 2. స్త్రీ ప్రథమ ఋతువు.

ఎ. గీ. చిఱుతప్రాయంపు నాఁటి సజ్జికపు ఛాయ, తొలు సమర్తయ కాలంపు విలసనమునఁ, దరుణికి ... అమరు, నుసరభేత్తను నీమందు సోఁకినపుడు. క్రీడా. 1. 80.

సీ. మాచకమ్మ సమర్త మఖపుబ్బహస్త చిత్తైననేమి పునర్వసైననేమి. వేణు. 23.

తే. తొలి సమర్తైన ముద్దుకోమలి విధాన. మల్లుపురా. 1. 88.

సమర్తగు సమర్త+అగు. వి. క్రి ఋతుమతి యగు. ప్రథమ రజస్వల యగు.

సమర్తపెట్టు=సమర్తాడు.

ఎ. గీ. ఆఁగవ సమర్తపెట్టిన యపుడె నన్ను, గుప్త రింపని విటులెరి నేస్తమునకు. బహు. 577 పు.

మొన్న సమర్తపెట్టైనని ముద్దియ డబ్బిన నుబ్బె నయ్యోడన్ (చూ. డబ్బు)

సమర్తాడు అ క్రి. ప్రథమ రజస్వల యగు.

సీ. నేఁడు నాసతి సమర్తాడిన వేళయు నంతకన్నను గ్రూరమదివచింప, నోరు నాడదు. ఉత్తర. హరిశ్చం. 2. 33.

సమర్థకము సం. వి అ. న ముసాంబరము, అగరు.

సమర్థకుఁడు సం. విణ (అ. ఆ. అ) ఇష్టమైన ఫలముల నొసఁగువాఁడు (దేవుఁడు మొ.).

సమర్థన(ము) సం. వి అ స్త్రీ న. 1. ఇదియే యుక్తమని నిశ్చయించుట. యుక్తాయుక్తములం దిది యుక్తమని సమర్థించుట, వాదించుట, 2. స్థాపించుట, 3. చర్చించుట. 4. సామర్థ్యము, 5. వ్యతిరేకించుట. 6. పొందుకూర్చుట.

ఉ ....ఇ, ష్టార్థ సమర్థన క్షమమునై తమమున్ విరియించుఁ బాతఁ, నర్థము పౌండరీకమును నర్థము. పాండు. 3. 123

సమర్థము సం విణ. (అ ఆ అ.) 1. శక్తి కలది: బలము కలది.

కం. సమయ...నిశాంతో, త్తమ సరళ మార్గ దర్శన సమర్థ పుణ్యాభిధాన సకృదుచ్చరణా. భార. ఉద్యో. 4. 427.

2. హితమైనది. 3. తగినది: అర్హమైనది. 4. (వ్యాక.) సంగతమైన యర్థము గలది. (సమాసాది.) 5. నేర్పు కలది: నిపుణమైనది.

సమర్థించు సం. న. క్రి. 1. తలఁచు; విశ్వసించు.

కం. వినుము యుధిష్ఠిరు నైరణ, మనవారలు వెలపుగా సమర్థింతురు. భాం. ఉద్యో. 2. 12.

2. స్థిరపఱుచు; బలపఱుచు; ఋజువుపఱుచు. 3. ఆలోచించు; చర్చించు. 4. సిద్ధముచేయు. 5. సిద్ధాంతీకరించు; ధ్రువపఱుచు.

వ. వేదమున్న భేదంబునఁ గదా బోధినత్వంబు సత్త్వహేతువుగా జగం బస్థిరం బని సమర్థించె.... నైష. 7. 64.

6. సూచించు; వ్యంజించు. 7. నిరూపించు.

**సమర్థితము** సం. *విశే.* స్థిరపఱుపబడినది 2. భావింపబడినది. 3. నిశ్చయింపఁబడినది.

**సమర్థుఁడు** సం. వి. అ. పుం. 1. గట్టివాఁడు. 2. నేర్పరి. 3. యోగ్యుఁడు.

**సమర్పణము** సం. వి. అ. న. 1. ఇచ్చుట.

వ. అని సమర్పణము చేసిన నమ్మహీసురోత్తముం డాఁకు వుపయోగించె. భార. అశ్వ. 4. 224.

వ. ఫలంబులు సపరిమళంబుగా నుపహారంబు లిందురేఖా కిరీటునకు సమర్పణంబు గావించిన. శివధర్మ. 3. 21.

2. అప్పగించుట. 3. అందఁజేయుట. 4. నియోగించుట.

**సమర్పించు** స. *క్రి.* 1. (పూజ్యభావముతో) ఇచ్చు; ఒసంగు.

తే. ఒడలు సిరియును నాకు నీ యొసగినవియ, కానఁ దగ సమర్పించెదఁ గరుణ నీవు, నమ్మతించి యి మ్మత్స్యదేశంబుఁ గావు. భార. విరా. 3. 322.

కం. ...మఱి నా, సూను సమర్పించితి మ, త్సూను వధింపంగ రక్కసునకు వశంబే. భార. ఆది. 6. 273.

2. ప్రతిష్ఠించు.

వ. ధర్మరాజుఁ బాండురాజు రాజ్యంబునందు సమర్పించిన. భార. సభా. 2. 267.

3. నియోగించు.

వ. పాండవుల నిందులకుఁ దోడ్కొని వచ్చువారుగా దుశ్శాసన వికర్ణ ప్రభృతుల సమర్పింపు మనిన ద్రోణు వచనంబులు .... భార. ఆది. 8. 37.

**సమర్పితము** సం. *విశే.* 1. ఉంచఁబడినది. 2. నిలుపఁబడినది. 3. అప్పగింపఁబడినది. 4. నియమింపఁబడినది. 5. పునః ప్రతిష్ఠింపఁ బడినది.

సీ. కౌంతేయ ఖ్యాతిగల పాండవంబున సమర్పిత మయ్యె నీ యందు పేర్మితోడ. భా. సభా. 2. 102.

**సమర్యాదము** సం. *విశే.* అ. అ. అ. 1. సమీపమైనది, చేరువైనది. 2. హద్దుతోఁ గూడినది, హద్దు గలది. 3. గౌరవము గలది.

**సమర్యాదము** సం. వి. అ. పుం సామీప్యము, రావు.

**సమలము** సం. *విశే.* 1. మురికితోఁ గూడినది. 2. అపరిశుద్ధమైనది. 3. దోషముతోఁ గూడినది.

**సమలము** సం. వి. అ. న. విరేచనము. మలము.

**సమవకారము** సం. వి. అ. పుం. రూపకభేదము. (దేవాసురాశ్రయమైన ప్రఖ్యాతవృత్తము, విమర్శ సంధి తప్పు తక్కిన నాలుగు సంధులు గలిగిన మూఁడంకముల రూపకము). సా. ద.

**సమవతారము** సం. వి. అ. పుం. 1. దిగుట, నది మున్నగు వానియందు స్నానార్థము దిగుట.

**సమవధానము** సం. వి. అ. న. 1. అతిశయమైన శ్రద్ధ. 2. సంసిద్ధత 3. సన్నాహము.

**సమవర్తి** సం.వి. న్. పుం. 1. యముఁడు.

గీ. గురుభయంకర కింకరకోట్లు గొలువ, మూర్తి దీపింప వల సమవర్తి నిలుచు. శివధర్మ 4. 51.

కం. సమబుద్ధితోడఁ దత్తత్సముచితకర్మఫల మఖిల జంతుతతులకున్, సమకూర్చుట నీకయ్యెమ, సమవర్తియనంగఁ జేసు జగదభిమతమై. భార. అరణ్య. 7. 230.

**సమవర్తి** సం. *విశే.* (న్. సి. న్.) అంతటను సమముగా వర్తించువాఁడు.

**సమవస్థ** సం వి. అ. స్త్రీ. 1. నిశ్చలమైన స్థితి. 2. తుల్యస్థితి. 3. ఉనికి.

**సమవస్థితము** సం. *విశే* (అ. అ. అ) 1. స్థిరముగా నిలుపఁ బడినది. 2. నిశ్చలమైనది. 3. సంసిద్ధమైనది.

**సమవాకారము** సం. వి. అ. పుం. పది విధములగు రూపకములలో నొక భేదము. (చూ. సమవకారము)

**సమవాప్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రాప్తి, లబ్ధి, సిద్ధి.

**సమవాయము** సం. వి. అ. పుం. 1. సమూహము, గుంపు. 2. (తర్క.) నిత్య ద్రవ్యములు మున్నగు వానియందు జాత్యాదుల సంబంధము, అవినాభావ సంబంధము.

**సమవాయి** సం. విణ. (న్. సీ. న్.) (తర్క.) సమవాయ సంబంధము గలది, అవినాభావ సంబంధము గలది.

**సమవేతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కూడినది. 2. సమూహముగా నున్నది.

సీ. సమవేత గౌరవక్ష్మాధర పవిధార పటుదైన్య సస్య సంపాతవృష్టి (యాచవ) శివధర్మ. 5. 98. 3. (తర్క.) సమవాయ సంబంధము గలది.

**సమశనీయము** సం. వి. అ. పుం. వివాహానంతరము దంపతులు చక్కఁగ భుజించుట కేర్పరచిన స్థాలీ పాకము.

**సమష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. సమస్తము, నిఖిలము, మొత్తము. చక్కఁగా వ్యాపించుట.

**సమష్ఠి(ష్ఠీ)ల** సం. వి. ఆ. స్త్రీ. 1. పెఱువంగ (వృ.వి.) 2. తురుజ(వృ.వి.). 3. ఒక జాతికూరాకు మొక్క.

**సమసకము** వి. శుద్ధాంధ్ర పదముల సమాసము (శ. ర.).

**సమసనము** సం. వి అ. న. 1. కలయిక, కూడిక. 2. సంక్షేపము, సంగ్రహము. 3. సమాసము.

తే గీ. ఒక్క సమసనమున శబ్దయుగము గూడి పదము లేర్పాటుగాఁ గానఁబడని ... అప్పక. 3. 135.

**సమసీసము** వి. మల్లబంధ విశేషము.

వ. సీసంబు, సమసీసంబు, గొంతమారును. మల్లపురా. 3. 69.

వ. సందుసీసంబును కొంతమారును సమసీసమ్మును. ప్రబం. 1. 78.

2. సీసపద్య భేదము :— ఆటెంద్ర గణములపై రెండు సూర్యగణములు గల పాదములు నాల్గు చెప్పి యామీఁద నొక యాటవెలఁది గాని చేర్చినచో సమసీస మేర్పడును.

**సమస్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సర్వము, నిఖిలము, అంతయు.

శా.....ఈ, యాదేశం బవనేల చూచితి సమస్తాశావకాశంబులన్. మను. 1. 71.

2. సంక్షిప్తము, సంగ్రహింపఁబడినది. 3. అంతటను వ్యాపించునది. 4 (వ్యాక.) సమసించినది, సమాసముగాఁ జేయఁబడినది. (పదము. వ్యతి: వ్యస్తము) 5. కలుపఁబడినది.

**సమామ్నాయము** సం. వి. అ. పుం. పశువులు మున్నగు వాని యన్నిటినుండి గృహస్థునకు వచ్చు రాబడి. ద. శా. 4. 1288.

**సమస్య** సం. వి. ఆ. స్త్రీ. కవుల సామర్థ్యములను బరీక్షించుటకై పూరింప నిచ్చెడు పద్య పాదాదికము.

**సమాంతరము** సం. విణ. (అ. ఆ. అ.) సమానమైన (ఎడము) గలది.

**సమాంశము** సం. వి. అ. పుం. సమానభాగము.

**సమాంశము** సం. విణ. (అ. ఆ. అ) సమానమైన భాగములు గలది.

**సమాంశహారి** సం. వి. న్. పుం. సమాన భాగము పుచ్చుకొనెడి దాయాదుఁడు.

**సమాంసమీన** సం. వి. ఆ. స్త్రీ ప్రతి వత్సరమును దూడను బెట్టెడి యావు.

**సమాకంపించు** సం. అ. క్రి. మిక్కిలి వణఁకు, వణఁకు.

మ. కలహక్షోణియు నాకసంబు దిశలున్ గాండప్రకారంబులం, గలయం గప్పి యదల్చి యార్చిరి సమాకంపింప భూతావళుల్. హర. 7. 161.

**సమాకర్షి** సం విణ. (న్. ణీ. న్.) 1. చక్కఁగా నాకర్షించునది, బాగుగా లాగునది. 2. సువాసనను వ్యాపింపఁ జేయునది. పరిమళమును వెదజల్లునది. 3. దూరముగా వ్యాపించునది.

**సమాకర్షి** సం. వి. న్. పుం. దూరముగా వ్యాపించు సుగంధము.

**సమాకర్షించు** సం. స. క్రి. ఆకర్షణము చేయు: లాగు

శా. ... సాంకేతిక స్థానముల్, కందర్పుం డను మంత్రదేవత సమాకర్షింపఁగా నయ్యెడన్. అనిరుద్ధ. 3. 14.

**సమాకులము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిండినది 2. క్రందైనది. 3. కలవరపడినది. 4. కలఁత పడినది.

**సమాక్రమణము** సం. వి. అ. న. 1. నడచుట. త్రొక్కుట. 2. దండెత్తుట. 3. స్వాధీన పఱచుకొనుట. వశపఱచుకొనుట.

**సమాక్రమించు** సం. స. క్రి. ఆక్రమించు, క్రమ్ము.

శా. రోదోంతంబు సమాక్రమించి గురుచిద్రూపంబు నీవై బహుప్రాదుర్భావము నొంది యుండుదువు కుంభ్రాత్ప్రభవస్ఫూర్తివై. భా. రా. యు. 2380.

**సమాక్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా నాక్రమింపఁబడినది. 2. గడువఁబడినది. 3. స్వాధీనము చేసికొనఁబడినది. 4. చుట్టుముట్టఁబడినది.

**సమాఖ్య** సం. వి. ఆ. స్త్రీ. 1. యశస్సు, కీర్తి.

ఉ. ఈ యవనీశ్వర ప్రవరు లిందఱు నిన్ను నగంగ నిట్లుగాఁ, జేయుదె ధర్మరాజను విశేష సమాఖ్య నిరర్థకంబుగా. భార. సభా. 2. 15.

2. పేరు, నామధేయము. 3. యోగము చేత నర్థమును దెల్పుట. 4. బందుకట్టు, జాతి కట్టుబాటు (శ. ర.).

**సమాఖ్యాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. గణింపఁబడినది, లెక్కింపఁబడినది. 2. ప్రకటింపఁబడినది. చాటింపఁబడినది. 3. ప్రసిద్ధి కెక్కినది, ప్రఖ్యాతి చెందినది.

**సమాగతము** సం.విణ. (అ. ఆ. అ.) 1. కలసికొన్నది. 2. వచ్చినది, 3. పొందియున్నది. 4. సమీపించినది, దగ్గఱకు వచ్చినది.

**సమాగతి** సం. వి. ఇ. స్త్రీ. 1. కలయిక. 2. రాక, వచ్చుట, చేరుట, దగ్గరకు వచ్చుట. 3. యథాస్థితి, సమానస్థితి.

**సమాగమము** సం. వి. అ. పుం. 1. కలయిక, కూడుట.

గీ. ఎట్టి కార్యము గలిగిన బుధుమతీ సమాగమము దప్పు నీకున్న కాయుదెక్కు. భార. అను. 4. 126.

2. సహవాసము. 3. రాక, వచ్చుట, దగ్గఱకు వచ్చుట.

చం.... సముదీర్ణ వసంత సమాగమంబులం, దువిద యనుగ్రహింపుము ఘృతోదధితీర వనీవిహారముల్. శృం. నై. 5. 59.

4. (జ్యోతి.) గ్రహముల సంయోగము.

**సమాఘాతము** సం. వి. అ. పుం. 1. యుద్ధము. 2. పెద్ద దెబ్బ. 3. వధము.

**సమాచరణము** సం. వి. అ. న. చక్కఁగా నాచరించుట.

సీ. ఆ. ఏకాగ్రత గలుగు నెట్లు, మాకు నియమవిధి సమాచరణములపై. భార. ఆశ్రమ. 2. 14.

**సమాచరించు** సం. స. క్రి. చక్కఁగాఁ గావించు: కావించు.

వ. అని స్నానంబు సమాచరించి, హోమంబు యథాపూర్వంబుగాఁ బ్రవర్తించి. భా. రా. యు. 1576.

**సమాచారము** సం. వి. అ. పుం. 1. నడచుట: ముందుకు సాగిపోవుట. 2. సమానమైన నడవడి. 3. తగిన యథ్యానము. 4. వృత్తాంతము. వార్త.

**సమాజము** సం. వి. అ. పుం. 1. మనుష్యాదుల సమూహము, సమూహము, గుంపు.

కం. రాజమహేంద్ర కవీంద్ర సమాజమర[illegible]... భార. ఆది. 2. 288.

2. సభ. 3. ఏనుఁగు.

**సమాజికుఁడు** సం. వి. అ. పుం. (చూ. సామాజికుఁడు) 1. సభ్యుఁడు. 2. ప్రేక్షకుఁడు.

**సమాజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. కీర్తి, ఖ్యాతి.

**సమాదానము** సం. వి. అ. న. 1. చక్కఁగా గ్రహించుట. 2. బౌద్ధుల నిత్యకృత్యము.

**సమాదేశము** సం. వి. అ పుం. 1. ఆజ్ఞ, శాసనము. 2.నిర్దేశము, శిక్షణము.

**సమాధానము** సం. వి. అ న. 1. అంగీకారము, ఒప్పుదల. 2. ఉత్తరము, ఆక్షేపమును తొలఁగించుట. 3. కలుపుట, కూర్చుట. 4. నిశ్చల ధ్యానము. సమాధి. 5. నిశ్చలత.

వ. ... ఇమ్మహనీయేతిహాసంబు సమాధాన మానసుండవై యాకర్ణించి నీవును బహుళ పుణ్యాత్ముండవుఁ గృతార్థుండవుఁ బరమార్థవిదుండవు నైతివి. భాగ. స్వర్గా. 75.

కం. భూనాథ! విప్రులు సమాధానంబున మున్నఁ బొదలు ధరణికి శుభముల్. భార. అను 2. 140.

6. శాంతి. సుఖము.

ఉ. .... విషయార్థంబుల్ కవల్ సమాధాన సమేతులే... భార. ఉద్యో. 5. 188.

**సమాధి** సం. వి. ఇ. పుం. 1. నిరంతర ధ్యానము, ధ్యేయమునందే కాగ్రముగ మనస్సు నిలుపుట. మనోలయము. 2. మౌనము. 3. ప్రతీకారము, ప్రతిక్రియ. 4. నియమము, 5. ఇంద్రియ నిగ్రహము. 6. తపస్సు. 7. సంయోగము, కూడిక. 8. ఒద్దిక, ఆనుకూల్యము. 9. అంగీకారము. 10. ముగింపు, సమాప్తి. 11. అభినివేశము, 12. పట్టుదల. 13. (కఱవు కాలమున) ధాన్యాదులను నిలువ చేయుట. 14. సంస్థాన విశేషము, స్థితి విశేషము. 15. ఒకానొక యర్థాలంకారము. 16. కావ్య గుణ విశేషము. 17. సమర్థనము. 18. అర్థోత్కర్షము హేతువుగాఁ గల జనుల యాదరము.

**సమాధ్మాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1 ఊదఁబడినది (శంఖాది). 2. గర్వించినది. గర్వితము. 3. ఉబ్బినది. పొంగినది.

**సమానము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తుల్యము.

శా. అభ్రధ్వాన సమానశార్ఙ్గ నినదం బాకాశ సంచారులన్, విభ్రాంతిం బొరలింప....చిత్రభారతము. 3. 107.

వ. ఒకచాయఁ గుడ్య సమానంబులగు వళివవ ద్వార పంక్తులఁ జెలువొందుచు ... శివరహస్య. సంభవ. 3. 145.

2. ఏకము, ఒకటి, 3. సాధువు.

**సమానము** సం. వి. అ. పుం. శరీరమున నాభి యందుండు వాయువు.

**సమానయనము** సం. వి. అ. న. 1. ఒక్కచోఁ జేర్చుట. 2. ప్రోగుచేయుట, 3. తీసికొనివచ్చుట.

**సమానించు** సం. స. క్రి. సమానము చేయు, పోల్చు.

దం. ...వింతగాఁ గ్రొత్తగా జంట ముత్తెంబులన్ గూర్చు చెల్వావఖంబుల్ విలోకించు వారల్ప దోర్శ్మసమాయస్కృత త్వద్మమంచున్ సమానింప నింపౌ పదాంభోరుహంబుల్, దశా. 4. 232.

**సమానోదర్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తోడఁ బుట్టినవాఁడు.

**సమాపకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముగించునది. సమాప్తి చేయునది. 2. సంహరించునది. చంపునది.

**సమాపత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. తారసిల్లుట, తటస్థపడుట, దైవికముగ సంభవించుట.

**సమాపనము** సం. వి. అ. న. 2. ముగించుట, ముగింపు. 2. సంహరించుట, చంపుట.

**సమాపన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంప్రాప్తమైనది. పొందఁబడినది. 2. తటస్థమైనది, సంభవించినది. 3. వచ్చినది, చేరినది. 4. ముగింపఁ బడినది. అవసితము, 5. ప్రవీణత కలది, నేర్పు కలది. 6. క్లేశపఱుపఁ బడినది. బాధ పెట్టఁబడినది. 7. సంపన్నమైనది, కూడియున్నది. 8. చంపఁ బడినది.

**సమాపన్నము** సం. వి. అ. న. 1. సమాప్తి, ముగింపు.

**సమాపాదనము** సం. వి. అ. న. 1. పూర్తి చేయుట. 2. తిరిగి పొందించుట.

**సమాప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముగిసినది, సమాప్తి నొందినది. 2. చచ్చినది. 3. నేర్పుకలది, నిపుణము. (అ. ని.) 4. చక్కఁగాఁ బొందఁబడినది.

**సమాప్తాలుఁడు** సం. వి. అ. పుం. భర్త, పెనిమిటి, ప్రభువు.

**సమాప్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. ముగింపు. అవసానము. 2. సమర్థించుట, సమర్థనము (మే. ని.). 3. నెఱవేఱుట, సఫలమగుట, సిద్ధి. 4. పరిపూర్ణత.

ఉ. నీకరుణం గరంబు రమణీయతరం బయి సర్వవిఘ్న దూరీకృతమై సమాప్తి నొనరెన్. ... భార. సభా. 2, 81.

**సమాప్తించు** స. క్రి. సం. (సమాప్తి + ఇంచు. నామ ధాతువు) పూర్ణము చేయు, ముగించు.

కం. ధరణీదేవుఁడు తెలివిం, బొరసె సకలభూమి సురులు కోరిన భూతే,శ్వరు వినుతించి సమాప్తిం, చిరి తత్క్రియ గోపరులు చెన్నెసలారన్. హరి. పూర్వ. 9. 67.

వ. అనంతరంబ విధివిశేషంబు సమాప్తింపంగోరిచ కోరలోచనం గడకంట వీక్షించుచు నిషధాధ్యక్షుం డగ్నిహోత్రగృహంబునకుఁ జని.
నైష. 8. 86.

**సమాప్తికము** సం. విశే. 1. చివరిది, ఉపసంహరించునది. 2. పరిమితము, సాంతము. 3. పూర్తి చేయునది.

**సమాప్తికుఁడు** సం. వి. అ. పుం 1. పూర్తిచేయువాఁడు. 2. వేదాధ్యయనాదికమును బూర్తి చేసినవాఁడు.

**సమాప్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముగియదగినది. 2. వ్యాప్తి నొందఁదగినది.

**సమాప్లుతము** సం. విశే. 1. పొంగి పారలినది, వఱద యెత్తినది. 2. నిండినది. 3. స్నానమాడినది. ముంపఁబడినది.

**సమాభాషణము** సం. వి. అ. న. సంభాషణము, ఒకనితో భాషించుట.

**సమామ్నానము** సం. వి. అ. న. 1. పునః పునరుచ్చరణము, సంత చెప్పుట 2. చెప్పుట, పేర్కొనుట. 3. లెక్క పెట్టుట. 4. సంప్రదాయము ననుసరించి సంత చెప్పుట.

**సమామ్నాయము** సం. వి. అ. పుం. 1. సంప్రదాయ సిద్ధమయిన తిరిగి చెప్పుట, గురుపరంపరగా చెప్పినది చెప్పుట, సంత చెప్పుట. 2. ఆమ్నాయము, వేదము, వేదభాగము, సంప్రదాయము. 4. పఠించుట, కంఠపాఠము, పాఠము. 5. సమూహము, మొత్తము. (ఉదా. అక్షర సమామ్నాయము)

**సమాయము** సం. వి. అ. పుం. 1. రాక, చేరిక. సందర్శనము, చూడఁబోవుట.

**సమాయితము** సం. విశే (అ. ఆ. అ.) 1. విస్తరింపచేయఁబడినది, వ్యాపింపఁజేయఁబడినది. 2. పొడిగింపఁబడినది, దీర్ఘీకృతమైనది.

**సమాయుక్తము** సం. విశే. (అ. ఆ అ.) 1. కలిసినది, కూడినది. 2. ఏకాగ్రమైనది. ఒక విషయమందు లగ్నమైనది. 3. సిద్ధపరుపఁబడినది, సంసిద్ధమైనది. 4. సంపన్నమైనది, కలిగియున్నది. 5 నియుక్తము, నియోగింపఁబడినది.

**సమాయుతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కలిపియుంచఁబడినది, కూర్పఁబడినది. 2. చేర్పఁబడినది, ప్రోగుచేయఁబడినది. 3. కూడఁబడినది, సంపాదింపబడినది.

**సమాయోగము** సం. వి. అ. పుం. 1. కలయిక, సంబంధము. 2. ప్రయత్నము. 3. కూర్పుట, సంధించుట (బాణము) 4. గుంపు, ప్రోగు, సమూహము. 5. కారణము, ఆశయము. 6. సంఘము.

**సమారంభము** సం. వి. అ. పుం. 1. ఉపక్రమము. 2. యత్నము. 3. కార్యము, పని. 4. గాయములకుఁ బూసెడు తైలము.

**సమారబ్ధము** సం. విశే. మొదలు పెట్టఁబడినది, యత్నింపఁబడినది.

**సమారాధనము** సం. వి. అ. న. 1. సేవించుట, పూజించుట.

సీ. అధ్వపరిశ్రాంతుఁ డగు వింతవానికి పన్నంబిడిన ఫలం బట్టి దిట్టిదనఁ బెద్ద యగ్ని సమారాధనము నకు.... భార. అను. 1. 143.

2. తృప్తి కలిగించుట, సంతోషపెట్టుట.

**సమారూఢము** సం. విశే. 1. ఎక్కఁబడినది. 2. దృఢముగా నాటుకొన్నది. 3. స్థాపింపఁబడినది.

**సమారూఢి** సం. వి. ఇ. స్త్రీ. ఎక్కుట.

గీ. జ్ఞానవిజ్ఞాన దృష్టి శాశ్వతికతత్త్వఁ, డయ్యు నేనియు విడువరా దాశ్రమములఁ, గ్రమసమారూఢి

యనునె వేదములు దీనిఁ, దెలియఁ జెప్పెనె మోక్ష విత్తిలకజన్మ. భార. శాంతి. 6. 275.

సమారోపణము సం. వి. అ. న. ఒకదానిపై నుంచుట. 2. అధీనము చేయుట, ఒప్పగించుట. 3. (బీజాదులను) నాటుట.

సమారోపితము సం. విణ. (అ. ఆ. అ.) ఒకదానిపై నుంచబడినది. 2. ఎక్కుపెట్టఁబడినది (ధనుస్సు). 3. నాటఁబడినది, ఒప్పగింపఁబడినది.

సమారోహము సం. వి. అ. పుం. 1. ఎక్కుట, అధిరోహించుట, స్వారిచేయుట. 2. అంగీకరించుట, ఒప్పుకొనుట.

సమాలంబనము సం. వి. అ. న. 1. పట్టుకొనుట, వ్రేలాడుట. 2. ఆనుకొనుట. ఆధారపడుట.

సమాలంబి సం. విణ. (న్.) 1. పట్టుకొని వ్రేలాడునది.

సమాలంబిని సం. వి. ఈ. స్త్రీ. ఒక విధమగు గడ్డి.

సమాలంభనము సం. వి. అ. న. =సమాలంభము.

సమాలంభము సం. వి. అ. పుం. 1. పరిమళద్రవ్యములతో శరీరమును నలుగు పెట్టుట. సుగంధద్రవ్యములను శరీరమునఁ బూసికొనుట. 2. యజ్ఞమునఁ బశువుల విశసనము చేయుట. 3. గ్రహించుట, పట్టుకొనుట.

సమాలాపము సం. వి. అ. పుం. సంభాషణము.

సమావర్తనము సం. వి. అ. న. వేదాధ్యయనమును ముగించి గృహస్థాశ్రమమును స్వీకరించుటకై గురుకులము నుండి వచ్చినపుడు చేసికొనెడి యొకానొక వైదిక సంస్కారము. 2. తిరిగివచ్చుట.

సమావిష్టము సం. విణ. (అ. ఆ. అ) 1. చక్కఁగాఁ బ్రవేశించినది. 2. ఆక్రమింపఁబడినది. 3. (విగ్రహాదులచే) ఆవేశింపఁబడినది. 4. సంపన్నము 5. అభినివేశము గలది, పట్టుదల గలది. 6. స్థిరపడినది. 7. దృఢముగాఁ గూర్చుండినది. బాగుగా బోధింపఁబడినది.

సమావృతము సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆవరింపఁబడినది. చుట్టువారు కావఁబడినది. 2. తెరవేయఁబడినది. 3. ముఖుగు వేయఁబడినది. 4. రక్షింపఁబడినది 5. బహిష్కరింపఁబడినది, వెడలఁగొట్టఁబడినది. 6. అడ్డివేయఁబడినది, నిలిపివేయఁబడినది.

సమావృత్తుఁడు సం. వి. అ. పుం. సమావర్తన సంస్కారమును పొందినవాఁడు
(రూ. సమావృత్తకుఁడు.)

సమావృత్తి సం. వి. ఇ. స్త్రీ. 1 తిరిగిరాక. 2. పూర్తి చేయుట.

సమావేశము సం. వి. అ. పుం. 1. ఒకచో గలసియుండుట, సహస్థితి. 2 కలసికొనుట, సంఘముగాఁ గూడుట 3. కలుపుట, అనేకార్థములనొక్క వాక్యములోఁ గలుపుట. 4. మనోభావము (కామక్రోధాది) 5. గ్రహావేశము, దయ్యముపట్టుట. 6. అభినివేశము, పట్టుదల.

సమావేశితము సం. విణ. (అ ఆ అ.) ఒకచోట కూడియుండునది. 2. ప్రవేశించినది.

కం. నీవును మృత్యువుఁ బాపసమావేశిత మతుల దొడఁగ నాడిన యంతన్.... భార. అను. 1. 29.

సమాశ్రయము సం. వి. అ. పుం. 1. శరణొందుట, రాజ్యతంత్రము నందలి షడ్గుణములలో నొకటి. 2 రక్షణము. 3. రక్షణస్థానము. 4. నివాసస్థానము, ఇల్లు.

సమాశ్రయించు సం. న. క్రి. ఆశ్రయించు, అవలంబించు, అండగొను.

ఆ. కీడు గని యొకండు గృహధర్మ ముడిగి సమాశ్రయించు నాశ్రమాంతరంబు, దావ సంగముడుగఁ గానేర దదియొల్ల, మియును వలపుగాన మీననయన. భార. శాం. 6. 177.

చం.... కంబళవాండము మోదలీలమై, బెనిచిన దంభవామను మహేంద్రుని నిన్ను సమాశ్రయించెదన్. మనుచ.6. 110.

ఉ.... శాశ్వతా,ఖండ సుఖాత్మ విష్ణు నధిక స్థిరభక్తి సమాశ్రయింపు.... భార. శాం. 6. 472.

చం. కవులు సమాశ్రయింపఁ దగి కర్పురగర్భిత శ్రీ గురుత్వమున్, దవులు సరస్వతీశ్వరుఁ డుదారత

మాకుఁ జిరాయు వీవుతన్. ఉ. రా. 1. 5.

సమాశ్లేషము సం. వి. అ. పుం. గట్టి కౌఁగిలింత, గాఢాలింగనము.

సమాశ్లేషించు సం. స. క్రి. చక్కఁగాఁ గవుఁగిలించు, కవియు.

శా.... మరు, ద్యోషారత్న కిరీట ఝూటసుమమా ఘోయుజ్య మానాంఘ్రిరి, శ్రీపత్ర్ విరిదిమ్మి గద్దియ సమాశ్లేషింపఁ గొల్వు డు నా, భాషాదేవిఁ దలంచెదన్. నిరం. 1. 7.

సమాశ్వాసము సం. వి అ. న. తెప్పఱిల్లఁజేయు. 2. ఓదార్చుట.

సమాశ్వాసము సం. వి. అ. పుం. 1. ఊర్పు. 2 తెప్ప ఱిల్లుట. 3. విశ్వాసము, నమ్మకము. 4. ఓదార్పు.

సమాసంగము సం. వి అ. పుం (మా) సమాసక్తి.

సమాసంజనము సం. వి. అ. న. 1. కలుపుట. 2. సంగ్రహపఱుచుట.

సమాసంజితము సం. విశే. తగుల్పఁబడినది.

వ. పురోవర్తి శాఖాసమాసంజిత సమంజసరత్న వంజగంబున నున్న నన్నుంజూచి. కళా. 3. ఆ. 20

సమాసకము సం. వి. అ. పుం. సమసకము.

సమాసక్తము సం. విశే. (అ. అ. అ.) 1. తగిలియుండు నది, లగ్నమైనది. 2. కలసియున్నది, ఏకమైనది. 3. చేరఁబడినది, పొందఁబడినది. 4. మార్పఁబడినది.

సమాసక్తి సం. వి. ఇ. స్త్రీ. 1. కలయిక, తగులు, తగులము. 2. గ్రహణము, లోఁగొనుట.

సమాసమ సం. వి. అ. స్త్రీ. ప్రతివత్సరము, ప్రతియేట. ఈ క్రింది ప్రయోగమున 'అమ్' ప్రత్యయరహిత ముగ 'సమాసమనియు దంపతిపద మేకవచ నాంతముగను గనుపట్టుచున్నవి.

ఉ. ఆ విపినంబునన్ దొక మహామహిజ మున నగ్రశాఖపై, దా వసియించి యొక్కఁబకదం పతిపిల్లలఁ జేయుఁ జేయనా, శీవిసమా సమీప బిలసీమమునన్ వసియించి యుండి కాణో నగ్గి నన్నిటిన్ మెసవి బోవుసమాసమ నిర్వి ధంబునన్. వేం. పంచతం. 1. 720.

సమాసము సం. వి. అ. పుం. 1. సంక్షేపము, సంగ్రహ పఱుచుట.

క. వ్యాససమాసైకరూప హరిహరనాథా. భార. విరా. 5. 1.

2. సమర్థించుట. 3. సమూహము. 4 (వ్యాక.) అనేక పదముల నేకపదముగాఁ గలుపుట. 5. కలు పుట మొత్తము, వెరసి.

సమాసర్జనము సం. వి. అ. న. పూర్తిగా విడిచి పెట్టుట. 2. అర్పణము చేయుట.

సమాసాదము సం. వి. అ. న. 1. సమీపించుట. 2. కనుఁగొనుట, పొందుట. 3. పూర్తిచేయుట, సిద్ధింపఁజేయుట.

సమాసాదితము సం. విశే. (అ. అ. అ.) పొందఁబడి నది.

కం. సతతాభ్యాస వికాసి సమాధి సమాసాదిత శాంతిలోల హరిహరనాథా: భార. అశ్వ. 2. 1.

సమాసార్థ సం. వి. ఆ. స్త్రీ. సమస్య (శ. ర.)

సమాసోక్తి సం. వి. ఇ. స్త్రీ. ఒక విధమైన యర్థాలా కారము. (విశేషణాది సామ్యముచేతఁ బ్రస్తుత వర్ణనముచేత నప్రస్తుతము గమ్యమాన మగ చో సమాసోక్తి).

సమాస్ఫోటించు సం. స. క్రి. పగుల్చు. భేదించు.

శా. ఆటోపారభటీసముద్భటత రాహంకార బాహో ధనుర్జ్యాటంకార రవంబు లంబుజభవాండాభ్యంత రంబున్ సమా, స్ఫోటింపంగ ... శివరా. 4, 73.

సమాహరణము సం. వి. అ. న. 1. ఐతపఱుచుట. 2. కలుపుట. 3. ప్రోఁగు చేయుట 4. తెచ్చుట.

సమాహరించు సం. స. క్రి. తెచ్చు; కొనివచ్చు.

తే... మీకు, వలయునట్టి పదార్థ మవశ్యమును సమా హరింతు నేనమటయు నయ్యహల్య. భార. అశ్వ. 3. 83.

సమాహర్త సం. వి. ఋ. పుం. 1. ప్రోగుచేయువాఁడు. 2. సమూలు చేయువాఁడు.

సమాహారము సం. వి. అ. పుం. 1. సమూహము, స్పష్టపడని యవయవ భేదము గల పదార్థ సము దాయము (వాళ.)

**సమాహితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా నుంచఁబడినది. 2. స్వస్థము, నిశ్చలమైనది (మనస్సు). 3. ప్రతిజ్ఞ చేయఁబడినది 4. వెలివేటి నది. 5. పరిశుద్ధమైనది. 6. చేర్పఁబడినది, 7. ఏకాగ్రమైనది, ఒక్క విషయము నందు లగ్నమైనది.

**సమాహృతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. సంక్షేపింపఁబడినది, కుదింపఁబడినది. 2. ప్రోగు చేయఁబడినది, కూర్పఁబడినది. 3. సమృద్ధమైనది. అధికమైనది. 4. స్వీకరింపఁబడినది, అంగీకరింపఁబడినది.

**సమాహృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. కుదింపు, సంక్షేపణము. 2. కూర్పు, సంకలనము.

**సమాహ్వ** సం. వి. ఆ. స్త్రీ. 1. నామధేయము, పేరు.

**సమాహ్వము** సం. వి. అ. పుం. 1. ధిక్కారము, 2. తిరస్కారము. 3. అధిక్షేపము.

**సమాహ్వయము** సం. వి. అ. పుం. 1. పిలుచుట. 2. పేరు, నామధేయము. 3. జంతువులను సాధనములుగాఁ జేసికొని యాడు జూదము (ఉదా. కోడి పందెములు మొ.) 4. ద్వంద్వ యుద్ధము. యుద్ధము. (ఆ. ని.)

**సమాహ్వానము** సం. వి. అ. న. 1. చేరఁబిలుచుట. 2. సమావేశ పఱచుట. 3. ఆక్షేపించుట, ధిక్కరించుట.

**సమింధనము** సం. వి. అ. న. 1. మండునట్లు చేయు, రగుల్చుట. 2. వంటచెఱకు.

**సమికము** సం. వి. అ. న. బల్లెము, శూలము.

**సమిత** సం. వి. ఆ. స్త్రీ. గోధుమపిండి.

**సమితము** √సం+ఇ+త. సం. విశ. (అ. ఆ. అ.) 1. కలుపఁబడినది. 2. ప్రోగు చేయఁబడినది. 3. కూర్పఁబడినది, అతుకఁబడినది. 4. చేరికయైనది, అంటియున్నది. 5. సమాంతరమైనది. 6. వాగ్దత్తమైనది. 7. పూర్తి చేయఁబడినది.

**సమితి** సం. వి. ఇ. స్త్రీ. 1. సమూహము.

ఆ. వె. పాపభీతి దోఁచఁ బల్క నమ్మౌని దనదైన శిష్య సమితి తోన మనిచె. భార. అను. 1. 125.
2. యుద్ధము. 3. సంగమము (శ. ర.).

**సమితింజయుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) యుద్ధమున జయించినవాఁడు.

**సమిత్తు** సం. వి. త్. స్త్రీ. యుద్ధము.

ఉ. అద్దారుణ శక్తి నవ్విభుఁ డుదాత్త సమిత్కృతి కల్య కల్యవిన్. భార. కల్య 1. 282.

**సమిద** వి. (సం. సమిధ) చిదుగు.

సీ. వేలిమి సమిద క్రోలియు వేణుదండంబు, వల కేల డాకేల వ్యజన మొకటి. ఇందు. 2. 115.

**సమిద్వత్తు** సం. విశ. 1. సమిధలు గలది, 2. కట్టెలు వేసి మండింపఁబడినది.

**సమిధ** సం. వి. ధ్. స్త్రీ. 1. చిదుగు. 2. వంటచెఱకు (శ. ర.).

**సమిధము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. ఇంధనము.

**సమిద్ధము** సం. విశ. (అ. ఆ. అ.) 1. రగుల్పబడినది, మండింపఁ బడినది. 2. నిప్పు తగిలింపఁబడినది. 3. మండింపఁబడునది, ఉద్రేకించునది.

**సమిరము** సం. వి. అ. పుం. వాయువు. (చూ. సమీరము.)

**సమీకము** సం. వి. అ. న. యుద్ధము.

**సమీకరణము** సం. వి. అ. న. 1. సమము చేయుట, మట్టము చేయుట, 2. లోఁగొనుట, తనలోఁ గలుపుకొనుట. 3. సమానము చేయుట. సమాన స్థితి. (4. గణితము.)భిన్నాంకములను ఒకే హారము గలవిగా మార్చుట.

**సమీకృతము** సం. విశ. 1. సమము చేయఁబడినది 2. మట్టము చేయఁబడినది. 3. ఏకము చేయఁబడినది.

**సమీక్రియ** సం. వి. ఆ. స్త్రీ. సమీకరణము.

**సమీక్ష** సం. వి. ఆ. స్త్రీ. 1. పరిశీలన, పరిశోధన. 2. విమర్శ, ఆలోచన. 3. అవగాహన, బుద్ధి. 4. సత్యము యొక్క పాఁము. 5. సారభూతమైన సిద్ధాంతము 6. మీమాంసా దర్శనము, 7. ప్రయత్నము. 8. సాంఖ్యదర్శనము.

**సమీక్షణము** సం. వి. అ. న. 1. అన్వేషించుట. 2. సూక్ష్మముగాఁ బరిశోధించుట. చూపు, 3. వీక్షణము.

ఉ....దుః, ఖేంధనపావకాయిత సమీక్షణ, చైత్య మహోద్భుతప్రదా. భార. విరా. 1. 333.

సమీక్షము సం. వి. అ. పుం. 1. సమాలోచనము, సమ్యగ్దర్శనము. 2. పూర్ణజ్ఞానము.

సమీక్షము సం. వి. అ. న. 1. సమగ్ర పరిశీలనము. 2. సాంఖ్య దర్శనము.

సమీక్ష్యకారి సం. విశే. (న్. పు. న్.) 1. వివేకము గలది. 2. ఆలోచన గలది. 3. మంచి చెడుగులు విచారించి యాచరణకుఁ బూనుకొనినది.

సమీచకము సం. వి. అ. పుం. సంభోగము, రతిక్రియ.

సమీచము సం. వి. అ. పుం. మహాసముద్రము.

సమీచీనము సం. విశే. 1. సత్యమైనది. 2. పరిశుద్ధమైనది. 3. తగినది.

సమీచీనము సం. వి. అ. న. 1. సత్యము. 2. ఔచిత్యము.

సమీదము సం. వి. అ. పుం. మెత్తని గోధుమపిండి.

సమీనము సం. విశే. 1. వార్షికము, ఏటికొకతూరి యగునది, ఒక్క యేఁడాది యర్దెకుఁ దీసికొనఁబడినది. 3. ఏఁడాది విమ్మటిది.

సమీనిక సం. వి. అ. స్త్రీ. ప్రతి సంవత్సరము ఈనెడి ఆవు.

సమీపము సం. విశే. దగ్గఱిది, ప్రక్కనున్నది, అందుబాటులో నున్నది.

ఉ. దీని భరియించి పురంబు సమీపభూమికిం దెమ్మని చెప్పు ... భార. విరా. 1. 154.

సమీపము సం. వి. అ. న. దగ్గఱ, చేరిక.

సమీపవర్తి సం. విశే. (న్. పు. న్.) సమీపస్థము, చేరువనున్నది, పొరుగున నున్నది.

సమీపించు సం. అ. క్రి. చేరువ యగు, డాసగు.

సీ. పితృకార్యవిధి సమీపించినఁ గడపనీ కడపనీ ముట్టంటు గలిసెనేని. కాశీ. 7. 139.

సమీరణము సం.వి.అ.పుం. 1. వాయువు. 2. ఊర్పు, ప్రాణము. 3. యాత్రికుఁడు, పాంథుఁడు. 4.మరువక వృక్షము (వృ. వి.).

సమీరణము సం. వి. అ. న. 1. విసరుట. 2. ప్రసరింపచేయుట.

సమీరము సం. వి. అ. పుం. 1. వాయువు, జమ్మిచెట్టు (వృ. వి.).

సమీరితము సం. విశే. (అ. అ. అ.) 1. పీవఁబడినది, విసరఁబడినది, రేచఁబడినది.

చం....వి,ర్దయతర రోషమారుతనితాంత సమీరితమై తనంబునన్. భార. సభా. 2. ఆ.

2. పలుకఁబడినది.

సమీహ సం. వి. ఆ. స్త్రీ. కోరిక, ఇచ్ఛ.

సమీహితము సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడినది. ఆశింపఁబడినది.

సమీహితము సం. వి. అ. న. కోరిక, ఇచ్ఛ.

సము సం. వి. అ. పుం. 1. పాము. 2. వాయువు,గాలి 3. పక్షి. 4. సంగీతమున షడ్జస్వరమునకు సంకేతనామము. 5. (ఛంద.) సగణము, రెండు లఘువులపై నొక గురువు గల గణము.

సము సం. వి. అ. న. 1. జ్ఞానము. 2. సమాధి, ధ్యానము, 3. బండ్లదారి. 4. కంచె, ఆవరణము.

సముంధనము సం. వి. అ. న. తడియుట, తేమము (శ. ర.).

సముఁడు సం. విశే. సాధువు. సమబుద్ధి గలవాఁడు.

కం. ... సముఁడై యుయుత్సుఁ డయ్యన్నము దుష్టంబగుటఁ జెప్పినను. భార. ఆది. 5. 179.

సముక్షణము సం. వి. అ. న. 1. ప్రసరింపఁజేయుట, వెలిజిమ్ముట. 2. చల్లుట, చిలుకరించుట.

సముఖము సం. విశే. మాటలమారి. మాటకారి.

సముఖము సం. వి. అ. న. ఎదురు.

చం. కని కొనిపోయి తండ్రి సముఖంబునఁ బెట్టిన. హై. 3 ఆ. (శ. ర.)

సముఖా అవ్య. ప్రభువులను గూర్చి వేత్రహస్తులు పలికెడి హెచ్చరిక మాట.

మ. సముఖా యంచును వేత్రహస్తులు వచింపన్ డిగ్గనన్ లేచి య,య్యమరారాతి యహార్య వక్షఃఫలకాహంకారి లే లెమ్మటం, చమితోత్సాహము

మీఱ నెత్తె.... దశా. 2. 124.

ఉ. కట్టికవారు సారె సముఖాయన వామపదంబు కెంపురా, మట్టిక సిబ్బి గద్దె పయి మార్చెడ వేఱొక జాను పూది .. చంద్ర 2 79.

సముచ్చయము సం. వి. అ. పుం. 1. ఒక్కచోఁ జేర్చుట, ప్రోఁగు చేయుట. 2. సముదాయము. 3. పదములను గాని వాక్యములను గాని కలుపునది 4. ఒక అర్థాలంకారము. (పెక్కు గుణములకుఁ గాని క్రియలకుఁ గాని ఒక్కతాని యందు సమావేశము కలిగించుట)

సముచ్చరము సం. వి. అ. పుం 1. ఎక్కుట, 2. దాటుట. కడచుట.

సముచ్చరించు సం. స క్రి. చక్కఁగా వాక్రుచ్చు. పలుకు, చెప్పు.

మ. శుకవాణీ! యొక యేకతం బనుచు తచ్ఛ్రోత్రంబులో పంచసా, యకమంత్రంబు సముచ్చరించున్. నిరం. 2 76.

సముచ్ఛిన్నము సం విశే. పూర్తిగా నాశము చేయఁబడినది.

సముచ్ఛేదము సం. వి అ పుం. 1 సంపూర్ణనాశము 2 సమూలముగ బడికిపెట్టుట.

సముచ్ఛ్రాయము సం వి. అ పుం. 1. మిక్కిలి పొడుగు 2. ఎత్తుగాఁ బెరుగుట. 3. విరోధము, ప్రాతికూల్యము. (రూ. సముచ్ఛ్రాయము)

సముచ్ఛ్రితము సం. విశే. 1. మిక్కిలి పొడుగైనది, 2 మిగుల పై పొందినది,

సముచ్ఛ్వసితము సం. వి. అ. న. 1. గాఢముగా నిట్టూర్చుట, 2. గాటపు నిట్టూర్పు. రూ. సముచ్ఛ్వసము. అ. పుం.)

సముజ్జృంభణము సం. వి. అ. న. 1. ఆవులింత. 2. పొంగుట, చెలరేఁగుట. 3 తీవ్రముగా యత్నించుట.

సముజ్జ్వలము సం. విశే. మిక్కిలి ప్రకాశించునది.

సముజ్ఝితము సం. విశే. విడువఁబడినది.

సముతు వి. 1. కట్టుబాటు.

మ. ఒక యేకాదశినాఁటిరేయి సముతై యున్నట్లు రోవెట్టవేఁ,డుక కాంద్రెవ్వరు రామిఁ బల్లవుఁ డొకండున్ తేకలోఁ గ్రాగి శ,య్యకడన్ నిల్వ సహింపకి త్వెడలి ... వైజ. 2. 89.

(ప్రౌ. పా. సముతై. యున్నట్టి. అపముద్రి)

2. తాలూకాలో నొక భాగము (శ. ర.).

సముతుపడు స. క్రి. కట్టుపడు.

తే. మస్తకము దువ్వి పలుమాఱుఁ గుస్తరించి, సమర సముఁ జూపి మెల్లన సముతుపఱచి, వాగె విగియించి తమ్మినూల్ వాగె సడలి, పన్నె సోఁకిన ముందఱఁ బఱవదయ్యె. చంద్రాంగ. 3. 86.

సముత్కర్షము సం. వి. అ. పుం. 1. ఔన్నత్యము. 2. గొప్పదనము సంపాదించుకొనుట.

సముత్క్రమము సం. వి. అ. పుం 1, పైకి లేచుట, ఎక్కుట. 2. హద్దు మీరుట, మర్యాద నతిక్రమించుట.

సముత్క్రోశము సం. వి. అ. పుం. 1. బిగ్గరగా నఱచుట. 2. పెద్దకేక. 3. చేపలను భక్షించు నొక విధమైన పక్షి.

సముత్థము సం. విశే. 1. పైకి లేచునది. 2. పుట్టినది, పొంగినది. 3. సంభవించినది, జరిగినది.

సముత్థానము సం. వి. అ. న. 1. లేచుట, నిలుచుండుట. 2. తిరిగి ప్రాణము వచ్చుట 3. రోగము పూర్తిగాఁ గుదురుట. 4 మాన్పుట (గాయము). 5. రోగ లక్షణము, 6. ప్రయత్నము, కృషి, 7. వృద్ధి, పెరుగుదల,

సముత్థాపించు సం. స క్రి. నిలుపు, నెలకొలుపు.

సీ. రంభాతరుస్తంభ సంభారములు సముత్థాపించి రొగిఁ బ్రతిద్వారమునను శివరా. 4. 86

సముత్థితము సం. విశే. అ, ఆ. అ) 1. లేచినది పైకెత్తఁబడినది. 2. నెమ్మదించినది, కొలుకున్నది. 3. ఉదయించినది, ఉత్పన్నమైనది, జన్మించినది.

కం ... పదప సముత్థిత వేదామదవదసురహరణ కరణమంత్ర వినోదా! భార. ద్రోణ. 2. 482

సముత్పతనము సం. వి. అ. న. ఎగురుట, ఎక్కుట, ధుముకుట. 2. పుట్టుట, ఉదయించుట. 3 విర్గమిం

చు· బయటపడు·, వెలికుబుకుట. 4. పైఁబడు·, ... నుట. 5. వెడలిపోవుట, అదృశ్యమగుట.

**సముత్పతితము** సం. విశ. 1. ఎగిరినది, దుమికినది. 2. నిర్గమించినది.

**సముత్పత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక. 2. సిద్ధి. 3. సృష్టి.

**సముత్పన్నము** సం. విశ. 1. పుట్టింపఁబడినది. 2 సిద్ధింపఁబడినది 4. ప్రాప్తినది.

**సముత్పాటనము** సం. వి అ. న. 1. చీల్చుట. పెల్లగించుట.

వ. అనిన విని జరాసంధుండు సటాసముత్పాటన కుపితకుంజరవైరియుం బోలెఁ గదు వలిగి. భార. సభా. 1. 194.

నాశము చేయుట.

**సముత్పాటకము** సం. వి. అ. పుం. సముత్పాటనము.

**సముత్పాటించు** సం. న. క్రి. పెకలించు.

**సముత్పాదనము** సం. వి. అ న. 1. పుట్టించుట. 2. కలిగించుట 3. సిద్ధము చేయుట.

**సముత్పాదించే** సం. న. క్రి. పుట్టించే, కలిగించే.

మ. ధరపై నీవు నిజాంశ మొక్కటి సముత్పాదించి దేవాంశజో, త్కరము౦ జాలవసేయు పేర్మి నెసఁగంగా ... హరి. పూ. 5. 56.

**సముత్పింజ(ల)ము** సం. విశ 1. మిక్కిలి కలఁత పడినది. 2. క్రమరహితమైనది.

**సముత్పింజ(ల)ము** సం. వి. అ. పుం. 1. మిక్కిలి కలఁగఁ బాఱిన సేన. 2. కల్లోలము, కలఁత.

**సముత్సర్గము** సం. వి. అ. పుం. 1. విడిచిపెట్టుట, త్యజించుట. 2. దానము చేయుట. వదలివేయుట, విసరివేయుట. 3. మలాదులను విసర్జించుట.

**సముత్సవము** సం. వి. పుం. గొప్ప పండుగ.

**సముత్సాహరణము** సం. వి. అ. న. 1. పాఱఁ దోలుట. 2. వెంబడించుట, తఱుముట. 3. వేటాడుట.

**సముత్సుకము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యాతురము, సహనము లేనిది. 2. అత్యాసక్తము.

శ ... ... ... ... నృపతి సుత ... ... ముత ... ... నిలా. 1.

3. విషణ్ణము, తపించునది.

**సముత్సేధము** సం. వి. అ. పుం. 1. ఎత్తు, ఔన్నత్యము. 2. లావు, స్థౌల్యము.

**సముదంచితము** సం. విశ. (అ ఆ. అ) 1 మిక్కిలి ప్రకాశించునది. 2. ఒప్పియునది

**సముదక్తము** సం. విశ. అ. ఆ. అ. 1. పైకెత్తఁబడినది 2. పైకి తోడఁబడినది (నీరు మొ)

**సముదయము** సం. వి. అ. పుం 1. చక్కని యుదయము. 2. సమూహము, మొత్తము.

చం. అమరకిరీట కోటి కలితాగ్రిణ ... త్న మరీచి మాలికా, సముదయ ఖేలనోల్లసిత చారుపదాంబుజ కా లిపూ ... భార. ద్రోణ. 5. 13.

ఆ. .... సిద్ధరాజ సముదయోచ సేవితమును... భార. శాంతి. 6. 323.

కం. సమయింతుఁ బోదిని సాత్త్విక సమయంబున, పెల్లడంగిఁ జతురంగ సమేత, సముగాగఁ ... జాండు నృపసుత, సముదయమును గ్రుగనదభూపసంతానంబున్. సాత్త్విక. 1. 75.

3. యుద్ధము. 4. ఆదాయము. 5. ప్రయత్నము. 6. దినము, పగలు. 7, సేనాపృష్ఠము.

**సముదయము** సం. వి అ న. 1. గ్రహముల యుదయము. 2. శుభ ముహూర్తము, లగ్నము.

**సముదాగమము** సం. వి. అ పుం. పరిపూర్ణజ్ఞానము.

**సముదాచారము** సం. వి. అ పుం. 1. యోగ్యమైన యనుష్ఠానము: సరియైన నడవడి 2. ఉచితమైన సంబోధన. 3. ఆశయము, ఉద్దేశము, పథకము;

**సముదాయము** సం వి. అ. సమూహము.

కం. అమరాసుర పైన్యద్వయ, సముదాయం బప్పుడధిక చండం బయ్యెన్, సమసుప్తి సమయజృంభిత, సముద్రయుగ సన్నిపాత సమత యొలప్పెన్. హరి. ఉ. 10. 47.

కం ... సప్తగణ సముదాయ ... గఁ జేసె నత్త్రియాగము నిష్ఠన్. భార. ఆది. 4 3.

**సముదాయించు** స. క్రి. ఓదార్చు. ఊరడించు.

**సముదాహరణము** సం. వి. అ. న. ప్రకటించుట. 2. తీర్మానించుట. 3. చక్కఁగా ఋజువు పఱుచుట.

**సముదితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పైకెక్కినది, లేచినది.

కం. సముదిత సూర్య సహస్రోపమదుస్సహతేజ... భార. ఆది.,1. 142.

2. ఎత్తయినది, ఉన్నతము. 3. పుట్టింపఁబడినది, కల్పింపఁబడినది. 4. కూర్పఁబడినది, ప్రోగు చేయఁబడినది. 5. పొందింపఁబడినది. సమకూర్పఁబడినది. 6. సంభాషింపబడినది. 7. పలుకరింపఁ బడినది, పిలువఁబడినది. 8. అంగీకరింపఁ బడినది. 9. అలవాటయినది, పరిపాటియైనది.

**సముదీరణము** సం. వి. అ. న. 1. ఉచ్చరించుట, పలుకుట. మాటాడుట. 2. వల్లించుట, తిరిగి తిరిగి యుచ్చరించుట.

**సముదీరితము** సం. విణ. (అ. ఆ అ.) 1. పలుకఁబడినది, ఉచ్చరింపఁ బడినది. 2. వల్లె వేయబడినది, తిరిగి తిరిగి పలుకఁబడినది.

**సముదీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.) అధికము.

మ. పతియయ్యె సముదీర్ణ విక్రమకళా పారీణుఁడై. భార. శల్య. 1. 327.

ఉదారము, గర్వితము, శ్రేష్ఠము, సిద్ధము, ఉచ్చరితము.

**సముద్గకము** సం. వి. అ. పుం. 1. బరణి, సంపుటము. 2. పూర్వోత్తరార్థములందు అర్థ భేదముండియు శబ్దభేదము లేని పద్యము.

**సముద్గతి** సం వి. ఇ. స్త్రీ. 1. పైకి లేచుట.2.పుట్టుట. 3. ఉత్పన్నమగుట,

**సముద్గమము** సం. వి. అ. పుం. 1. ఉదయించుట, ఎక్కుట. 2. పుట్టుట, ఉత్పన్నమగుట. 3.జననము, ఉత్పత్తి.

**సముద్గమించు** సం అ. క్రి. మీఁదికిఁ బోవు, ఎగయు.

కం. అని పలికి తానుఁ బ్రేయసియును వవ్వల వరుగఁదగు ప్రయోజనము మదంబువఁ దెలిపి పోయివచ్చెద. మని చెప్పి సముద్గమించె నంబర వీథిన్. కవిరా, 3. 173.

**సముద్గము** సం. వి. అ. పుం. చూ. సముద్గకము.

**సముద్గయమకము** సం. వి. అ. న. (అలం.) ఒక విధమైన యమక భేదము

శ్లోకమందలి యర్ధభాగమును అర్థభేదము గలుగునట్లు పునరుక్తము చేయుట. 'అర్థాభ్యాసః సముద్గః స్యాత్' అని దండి. 3. 53.

**సముద్గిరణము** సం. వి. అ. న. 1. క్రక్కుట, ఎగజిమ్ముట. 2. వాంతి, క్రక్కఁబడినది. 3. పైకెత్తుట, లేపుట.

**సముద్గీతము** సం. వి. అ. న. బిగ్గరగాఁ బాడబడినపాట.

**సముద్ఘాటించు** సం. స. క్రి. భేదించు, పగుల్చు. వ్రచ్చు.

శా. ...పా, తాళక్రోడ మహాకటాహము సముద్ఘాటింపఁ దత్కంధరా, గోళస్థాయినియైన భూమి పృథు వక్షోజ ప్రదేశంబునన్, శీలా వత్సలకాంకురంబు లెగయన్. శివరా. 1. 59.

**సముద్ధకము** సం. వి. అ. పుం. బరణి, సంపుటము. (శ. ర.).

**సముద్దారు** (సముతు — దారు.) హిం. వి. సముతుకు అధికారి.

**సముద్దిష్టము** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా నుద్దేశింపఁబడినది.

**సముద్దీపించు** సం. అ. క్రి. మండు, విజృంభించు, చెలరేఁగు.

(గర్దభాసురుఁడు) పదవిక్షేపములన్ సవృక్ష ధరణీభాగంబు గంపింపఁగా, రదముల్ దీటుచుఁ గత్తిరించిన చెవుల్ రాజిల్ల వాలంబు ఖీ,లిదమై తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్, బెదరన్ రాముని బొమ్ముఁదన్నె వెనుకై బీరంబు దోరంబుగన్. భాగ. 10 పూ. 517.

**సముద్దీప్తము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి మెఱయునది, చెలరేగునది.

గీ. విడిచి చని సముద్దీప్తమైన తేజంబు వారిజాప్త బింబంబు సొచ్చె.... భార. కర్ణ. 3. 363.

**సముద్దేశము** సం. వి. అ. పుం. 1. చక్కఁగాఁ జూపుట. చక్కఁగా నిర్దేశించుట. 2. సమగ్ర వర్ణనము, సంపూర్ణ వివరణము. 3. వెలువఱచుట. 4. లెక్కించుట.

**సముద్ధతము** సం. విశే. (అ. అ. అ.) 1. పైకెత్తబడినది, ఎగురఁగొట్టఁబడినది, లేఁబడినది. 2. ఉద్రిక్తమైనది, ఉప్పొంగినది. 3. గర్వముచే పొంగినది, పొగరెక్కినది. 4. ఒద్దిక లేనిది, దుర్నయమైనది. 5. మొఱకైనది.

**సముద్ధతి** సం. వి. ఇ. స్త్రీ. గర్వము, విజృంభణము,
మ. అమరేంద్రుఁడు సముద్ధతిన్ వెడలి దేవానీకముల్ తోడ్పడన్. భార. అను. 1. 257.
ఉ. దంతి సవంగ భూరిమదధారల గాలి యెఱింగి కూర్మి మత్యంతసముద్ధతిం గొలని కడ్డవడన్ వెనవచ్చె... భార. అను. 1. 231

**సముద్ధరణము** సం. వి. అ. న. 1. పైకెత్తుట, లేవనెత్తుట. 2, రక్షించుట, తప్పించుట. 3. ఏరుట, బయటకుఁదీయుట. 4. తొలగించుట, అంతమొందించుట. 5. ప్రక్కఁబడిన యాహారము.

**సముద్ధరించు** సం. స. క్రి. 1. పైకెత్తు, లేవదీయు. 2. రక్షించు, తప్పించు. 3. వెలికితీయు, వెలుచేయు. 4. వేళ్ళతోఁ బెకలించు, సమూలముగా నాశముచేయు. 5. పొగడు, గౌరవించు. (2. రక్షించు).
గీ. నిత్యకృత్యము ల్సలుపంగ నిజగృహమున, కిపుడ యరుగంగవలయు నా కిందువదన, చను నుపాయ మేది చెప్పు నను సముద్ధరింపు నిత్య క్రియాహాని చెంపు నడచు మార్కం. 4. 288.

**సముద్ధూళించు** సం. స. క్రి. విభూతి మున్నగునవి పూసికొను.
సీ. భూతిసర్వాంగీణముగ సముద్ధూళించు, ధరియించు రుద్రాక్షదామకములు. కాశీ. 7 ఆ. (శ. ర.).

**సముద్భటము** సం. విశే. (అ. అ. అ.) అతిశయముతో గూడినది.
చం. నినదసముద్భట స్ఫురణ నింగి వగుల్పఁగ ... భార. కర్ణ. 3. 261.

**సముద్భటించు** సం. అ. క్రి. అతిశయించు.
వ. కలకల వగుచుఁ గిలకిలారభటి సముద్భటించి మోఁకారించి. పమీ. 4. 129.

**సముద్భవము** సం. వి. అ. పుం. పుట్టుక, ఉత్పత్తి, మూలము, జన్మస్థానము.

**సముద్భవించు** సం. అ. క్రి. పుట్టు, ఆవిర్భవించు, కలుగు.
గీ. ఆగమంబులు నాలుగు నాననముల, ప్రణవ మాత్మ సనాతన బ్రహ్మతేజ, మున మొదలుగ విరించి సముద్భవించి, భువన నిర్మాణ కర్మవై పుణి వహించె. మార్కం. పీఠి. 26.
కం ... సంకల్పం బే, వంకను సముద్భవించును సంకటమై యచట మానసంబును నుండున్. శివయోగ. ఉ. 1 ఆ. 21 పు.

**సముద్భాసిలు (ల్లు)** సం. అ. క్రి. ప్రకాశించు, ఒప్పు.
మ ... మస్తం చామరద్వివినీ సరసాంభః కణ మాలికా భరణ శస్తంబై సముద్భాసిలెన్. చ. రా. 7. 12.

**సముద్భూతము** సం. విశే. (అ. అ. అ.) పుట్టినది; ఆవిర్భవించినది.
కం. జనవినుతబాదరాయణ మునీంద్రవాగమృతనిధి సముద్భూతాహ్లాదన కీర్తి సుధాకిరణా ... భార. ద్రోణ. 5. 432.

**సముద్భాషించు** సం. స. క్రి. 1. స్తుతించు; సంభాషించు.
మ. కెలన మ్మందర సిద్ధకింపురుషులుం గీర్వాణులు న్నాగసా, ధ్యులు విద్యాధర కిన్నరేంద్రులు సముద్భాషింప దివ్యాప్సరో, లలనాబృందము లాడ ...... భీమ. 4. 191.
2. అలంకరించు.

**సముద్యమము** సం. వి. అ. పుం. 1. పైకెత్తుట. 2. గొప్ప ప్రయత్నము లేక శ్రమ.
కం. మానుషము దుర్లభము సో, పానంబగునది విముక్తి పదము గమటకున్, దాని గని తొంటి చందము, రానీక సముద్యమమునఁ బ్రాఁకఁగ వలదే. భార. శాంతి. 6. 287.
3. ఆరంభము, పూనిక.
చం. ... దంతియు నీరువట్టున నుదగ్రపుఁగోపము నందడింప నత్యంత సముద్యమం బెనఁగ దాని

జడినది. నడిపింపఁ బడినది. 10. పెండ్లి యాడఁబడినది.

**సమూరకము** సం. వి. అ. పుం చూ. సమూరువు.

**సమూరము** సం. వి. అ. పుం. చూ. సమూరువు.

**సమూరువు** సం. వి. ఉ. పుం. 1. తెల్లని జూలును, లావు మెడయును మెఱుఁగెక్కిన మన్నని వెంట్రుకలును గలిగి గోధుమ వర్ణముగా నైనను కృష్ణ వర్ణముగానైనను ఉండెడు మృగ విశేషము. (శ. ర.) 2. ఒక విధమైన లేడి.

**సమూలము** సం. విశే. 1. వేళ్ళతోఁ గూడినది. 2. మొత్తము.

**సమూహ** సం. వి అ. పుం. విచారణ, బాగుగా నాలోచించుట.

కం. వినుమీ గోమాయువు వ, చ్చిన యంతట నుండి మనకుఁ జేసిన హితముల్, గనికొనవలవదె యీ తఱి,మున వాఁ డిటు సేయఁడను సమూహాయు వలదే ? భార. శాం. 3. 72.

**సమూహనము** సం. వి. అ. న. 1. ప్రోగుచేయుట. 2. ప్రోగు; సమృద్ధి.

**సమూహని** సం. వి. ఈ. స్త్రీ. చీఁపురుకట్ట.

**సమూహము** సం. వి. అ పుం. 1. గుంపు, సముదాయము, మొత్తము.

సీ. వదనపద్మనిధిపై వ్రాలిన యునమనో మోహాంధకార సమూహ మనఁగ. పాండు. 3. 201.

సంఖ్య, 2. శ్రేణి, సేన.

**సమూహి** సం. వి. ఇ. సమూహము. (ఇది శైవకవుల కృతులయందే ప్రయుక్తము).

ద్వి. పసగొని సకలభక్త సమూహి చూడ. బస. పురా. 205 పు. 26. పం.

కం. వారక కలహంసావలి, ఘోరవ వక్కాలని కెఱఁగి పాలు పమరె మహాంభోరాశి నెలమి కెఱఁగెడు శారదనీరద సమూహిచాడ్పునఁ బోలెన్. కు. సం 10. 20.

ద్వి. భక్తి సమూహికి బసవయ్య మహిమ వ్యక్తిగాఁ తెప్పంగ వట్ల నే వింటి. బసపు. 52 పు. 643 పం.

**సమూహ్యము** సం. వి. అ. పుం. 1. యాగాగ్నియందుపయోగింపఁదగిన పేరు. 2. ఉపచాయ్యము.

**సమృద్ధము** సం. విశే. 1. పెంపారునది, వర్ధిల్లునది. పెఱుఁగునది. 2. సుఖము గలది, పుష్కలమైనది. 3. ఐశ్వర్యము గలది, సంపన్నము. 4. అతిశయముగా గలది, నిండుగాఁ గలది. 5. ఫలవంతమైనది, సఫలము. 6. బాగుగాఁ జెరిగినది, పెంపొందినది. 7. పూర్ణము, సర్వము. 8. వలసినంత మెంతైనది.

**సమృద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. పెంపు, పెఱుఁగుదల, వృద్ధి.

ఉ. జ్ఞాతుల నమ్మి తోడుకొని శత్రులనోర్చి యహీన రాజ్యమును, శ్రీతియెలర్పఁ జేకొనిన పిమ్మట సౌఖ్య సమృద్ధి తోషిత జ్ఞాతిని బాయఁడై మది వజ్రసము నమ్మక సర్పసంయుతం,బై తనరారు రమ్యనిలయంబున నున్నటు లుండగాఁదగున్. భార. శాంతి. 4. 269.

2. సంపన్నత, ధనికత్వము. 3. సంపద, ఐశ్వర్యము. 4. పుష్కలత, పుష్టి, నిండుదనము. 5. అధికారము, ఆధిపత్యము.

కం. అతని రాజ్యంబున నుర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి ... భార. ఆది. 4. 9.

**సమృద్ధుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి సంపద గలవాఁడు. 2. నింపు గలవాఁడు. (శ. ర.).

**సమేతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కూడుకొన్నది.

వ. పాండవులు... ధృతరాష్ట్ర విదుర సర్వభరత భార్యా సమేతంబుగా వచ్చుట మాస మాత్రంబు నిలిచిరి. భార. శాంతి. 1. 2.

శా. అక్షీణోత్సాహసమేతులై రయమునన్. భార. ఆది. 2. 12.

2. ప్రోగువడినది. 3. కలుపఁబడినది, కూర్పఁబడినది 4. చేరవచ్చినది, సమీపించినది 5. అనుసరింపఁబడి

నది. 6. ఎదురైనది, తారసిల్లినది. 7. అంగీకరింపఁ బడినది.

సమేధితము సం. విశ. (అ. ఆ. అ.) బాగుగాఁ జెంపఁ బడినది. 2. బలమైనది, సుపుష్టమైనది 3. సంఘీభూతము, ఏకీభూతము.

సమేల(ళ)ము (సం. సమ్మేళనమ్) వి. 1. కలసినది, జతగూడుట, చేరిక, గుమి.

ఉ. మేలము లాడువేళల సమేలములై చెలులెల్లఁ గూడి యో, బాలిక శ్రీ నృసింహ నరపాలు వరించెదవే యటన్న. వరసభూ. 3. 148.

ద్వి. పర్విన యచ్చరపడఁతు లేనూరు,లు ... ... మెలగుచుండుదురు సమేలంబుతోడ. ద్వి. పరమ. 12 పు.

వ. ఆ లీలావతి విలోచనంబులం బోలయు లజ్జావినయ దరహాసంబులకుం దవమేలంబునుం గరుణయు సమేళంబున నెదుర్కొన. ఉ. హరి. 2. 83.

2. ఒద్దిక.

సీ. అలవోకగా వచ్చి యప్పటప్పటికి సమేలంపు మాటల మేలమాడు. వి. పు. 5 ఆ. (శ. ర.)

సమేల(ళ)ము విశ. కూడినది, కలసినది.

ఉ. మేలిపసిండిగాజుల సమేళపుఁబచ్చల కీల్కడెంపు డా, కేలు మెఱుంగుగబ్బిచనుఁ గ్రేవకుఁ దార్చుచు. విజ. 1. 79.

సమోదకము సం. వి అ. న. సగము చల్లయు సగము నీరును గలిపినది, సమముగా నీరు గలిసిన మజ్జిగ.

సమోదకము సం. విశ. (అ. ఆ. అ.) 1. మోదకములతోఁ గూడినది. 2. సంతోషముతోఁ గూడినది

సమోపమ సం. వి. ఆ. స్త్రీ. ఉపమాలంకార విశేషము.

సమ్మంత్రణము సం. వి. అ. న. ఆలోచించుట.

సమ్మతము సం. విశ. (అ. ఆ. అ.) 1. సమ్మతియైనది. 2. ప్రియమైనది. 3. మిక్కిలి గౌరవింపఁ బడినది. 4. సహితమైనది.

సమ్మతము సం. వి. అ. న 1. అంగీకారము, ఇష్టము.

తే. ఇద్ధరాటోద్ధిఁ గ్రేవుల నెఱసి ... ... ... ననిననె సమ్మతము మిగుల ... పూ... 1. 181.

2. అభిప్రాయము.

సమ్మతి సం. వి. ఇ. స్త్రీ. 1. అంగీకారము.

ఉ. .... సమ్మోటపోటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె ... భాగ. 1. 12.

2. అభిలాష.

సీ. కేలు మొగిడ్చి యొద్దాని నెఱుగుఁ యొఱుకలకెల్లను నెక్కుడని సభక్తికసమ్మతిఁ బ్రార్థించి యడిగిన .... భార అను. 1. 16.

3. ఆత్మజ్ఞానము. 4. గౌరవము 5. ప్రేమ.

సమ్మతించు సం. అ. క్రి ఇష్టపడు, అంగీకరించు, (√సమ్మతి.).

చం. అవ్వుడు నట్లకాక యని యా నరనాయకుఁ డాత్మ సమ్మతించిన .... మార్కం. 8. 26.

తే. వీరువడిరను పలుకులు విందుగాక, శకుని కర్ణ దుశ్శాసనుల్ సమ్మతింప. భార. ఉద్యో. 2. 156.

గీ. పుణ్యచిహ్నంబు లవఘనంబున ఘటింప, సిగ్గువడుఁగాని కరనఖశిఖరలిఖిత,జాత మాత్మజుకాంకముల్ సమ్మతించు ....పాండు. 3. 12.

సమ్మతిలు(ల్లు) అ. క్రి. ఇష్టపడు, సమ్మతించు, ఇష్టపడు.

తే. కమ్మవిలుకానియమ్ముల కుమ్మలించి, నెమ్మినే వేడ నెమ్మది సమ్మతిలక, బొమ్మనియె ... అహల్యాసం. 2. 72.

కం. అని తాత బోధసేసిన, పనికిన్ సమ్మతిలకతడు ప్రత్యాఖ్యానం బొనరించెన్ ... ఉ. రా. 2. 226.

సమ్మతిపత్రకము సం. వి. అ. న. సభ్యాధికారి సమూహము మొసంగిన తీర్పు.

సమ్ముత్తము సం. విశ. (అ. ఆ. అ.) 1. అధికముగా

మదించినది. 2. సంతోషవివశమైనది, 3. ముదావస్థలో నున్నది

**సమ్మదము** సం. వి. అ. పుం. 1 అధిక సంతోషము. 2. సౌఖ్యము. 3 ఆనందము.

ఉ. సమ్మదమంది చూచిరి భృశం బుగ భూజనులెల్ల బ్రహ్మతే, జమ్మును. భార. సభా. 1. 287.

కం ప్రతీణదప్పు ద్రుపదు రంథాతముతోఁ గట్టి తెచ్చి యర్జునుఁడు క్రియా, దక్షుండయి గురునకు గురు, దక్షిణఁగా నిచ్చి చేసెఁ దత్సమ్మదమున్. భార. ఆది. 6. 87.

ఆ. నఖ్యులెల్ల ముదితసమ్మదు లయిరి దుఃశ్శాసనుండు వస్త్రచయము పర్వ,తోపమానమయిన వొలువంగ చోపక. భార. సభా. 2. 231.

**సమ్మదించు** సం. అ. క్రి. సంతోషించు.

కం. అనుచుం బశ్చిమవేలా, వనమునకుం బక్షివిభుఁడు వరుణునిపురికిం, గొనిపోయె సమ్మదించుచు వననిధి మధ్యంబు చొచ్చి వనజదళాక్షున్. ఉ. హరి 6. 247.

**సమ్మర్దనము** సం. వి. అ. న. సమ్మర్దము.

**సమ్మర్దము** సం. వి అ. పుం. 1. ఒరయిక, ఒరపిడి. 2. కుంపు. 3. పోరాటము. 4. శత్రువుల పెదు ర్కొనుట. 5. త్రొక్కుడు.

ద్వి. ఇమ్మాగా వటమీఁద నిడి తపంబునకు సమ్మర్ద మిక్కడ జాలంగఁ గలుగు. రం. రా. బాలకాం. 58 పు. 31 పం.

**సమ్మర్షము** సం. వి అ పుం. ఓర్పు; సహనము.

**సమ్మహస్సు** సం. వి స్. పుం. పరస్పర సంతోషము.

**సమ్మాదము** సం.వి.అ.పుం. 1. మత్తు 2. ఉన్మత్తత.

**సమ్మానసము** సం. వి. అ. న. 1. పూజించుట. 2. గౌరవించుట. 2. బోధించుట, ఉపదేశించుట.

**సమ్మానము** సం. వి. అ. పుం. గౌరవము.

**సమ్మానము** సం. వి. అ. న. 1. కొలత. 2. పోల్చుట.

**సమ్మానించు** సం, న. క్రి. గౌరవించు. (శ. ర.).

**సమ్మాను** వి. నౌకావిశేషము.

ఉ. శరధిం గప్పలితోఁగువల్లివరితా సమ్మాన్లఁ దెప్పించు. (ఆనంద ముద్రణాలయ ప్రతిపా.) హర. 1. 27.

జోగులనివ్వరివిగా సామాన్లు అని పూర్వముద్ర.పా.

**సమ్మార్జకము** సం. వి. అ. పుం. చీఁపురు.

**సమ్మార్జకుఁడు** సం. వి అ. పుం. ఊడ్చువాఁడు.

**సమ్మార్జనము** సం. వి అ. పుం. 1. తుడుచుట. 2. శుద్ధిచేయుట. 3. పులికాపు. 4. భోజనపాత్రల నుండి తుడిచివేయఁబడిన భుక్తావశేషము.

**సమ్మార్జని** సం. వి. ఈ. స్త్రీ చీఁపురు.

**సమ్మాళి(గ)** వి. పాదరక్ష, పాదుక.

సీ. పాదరక్షాభిధ పరఁగును జెప్ప న,మలకడమ్మనఁగ సమ్మాళి యనఁగ. ఆం. భా. 2. 298.

ఎ. గీ. సూన్పృతమె కాని నాలుకఁ జొనుపనట్టి, నాయకాగ్రణిదబ్బుఱ ల్గాయసాగెఁ. బసిఁడి సమ్మాళిగలు లేక పాద మిడఁగ, భరముపడు రాజు బరిగాళ్ళఁ బఱవసాగె నిరం. 4. 67.

సీ. అట్టటు దొడిగిన యంఘ్రులరత్నంపు సమ్మాళిగలు సారె జారుచుండ. కళా. 2. 17.

**సమ్మాళిగతొండలు** వి. బ. (భగవంతుని) పాదుకా సేవకులు

ద్వి. పేరుపెంపులు పెట్టి బిడ్డలై నిన్నుఁ, జేరి సమం చితశ్రీలఁ జెంపొంది, తుదిని సమ్మాళిగ తొండలై యుండి, బ్రదుకంగఁ గోరు నీ పరిచారజనులె, యీ విధ బుల ద్రోహ మేల సేసెదరు? ద్వి. పరమ. 3. 212.

**సమ్మితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కొలవఁబడినది. 2. సమానమైన పరిమితి కలది. 3. సమానమైనది. 4. కూడినది.

చం ... అన్వసుమతీశ్వరుఁ డద్దినశేష యామినులోచతురము భక్తియుక్తమును సంప్రమదంబునుఁగా వయించె సమ్మితమృదుసాంత్వవచన సమీరణతం దము పాంతవర్తియై. భార. శాంతి. 6. 270.

5. సమాన ప్రాధాన్యము కలది.

**సమ్మితము** సం. వి. అ న. 1. దూరము.

**సమ్మితి** సం. వి. ఇ. స్త్రీ 1. సమానము చేయుట. 2. పోలిక.

సమ్మిశ్రము సం. విశే. (అ. ఆ. అ.) ఒండొంటితోఁ గలపఁబడినది.

సమ్మిశ్రణము సం. వి. అ. న. కలపుట.

సమ్మిశ్రితము సం. విశే. (అ. ఆ. అ.) ఒండొంటితోఁ గలపఁబడినది.

సమ్మిశ్రుఁడు సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

సమ్మీలనము సం. వి. అ. న. 1. ముడుచుకొనుట. 2. కప్పుట. 3. పరిపూర్ణ గ్రహణకాలము. 5. నిష్క్రియత్వము.

సమ్ముఖము సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎదురుగా నుండునది. 2. ఎదుర్కొనునది. 3. అనుకూలమైనది. 4. తగినది.

సమ్ముఖము సం. వి. అ. దర్శనము, సన్నిధి.

ద్వి. ఇది యెంతపెద్ద నా యిందీవరాక్షి, ముదమున నాకు సమ్ముఖమిచ్చి చూడు. పండితా. 114.

సమ్ముఖి సం. వి. ఇ. పుం. అద్దము.

సమ్ముఖీకృతము సం. విశే. (అ. ఆ. అ.) గురిపెట్టఁబడినది.

సమ్ముగ్ధము సం. వి. అ. పుం. 1. మూర్ఛనొందినది. 2. కలఁతనొందినది. 3. అందమయినది.

సమ్మూఢము సం. విశే. (అ. ఆ. అ.) 1. స్మృతి తప్పినది. 2. మూర్ఖమైనది. 3. కలత నొందినది. 4 అవ్యవస్థితమైనది. 5. బ్రద్దలయినది.

సమ్మూర్ఛణము సం. వి. అ. పుం. గడ్డి.

సమ్మూర్ఛనము సం. వి. అ. న. 1. మూర్ఛనొందుట. 2. అంతటను వ్యాపించుట, అభివ్యాప్తి. 3. దట్టముగుట. 4. కలయిక.

సమ్మూర్ఛనోద్భవము సం. వి. అ. పుం. 1. చేప. 2. చేపవంటి జలచరము.

సమ్మూర్ఛము సం. వి. అ. పుం. 1. ఆధిక్యము. 2. వ్యాప్తి.

సమ్మెట – సంపెట వి. (క. చమ్మట్టిగె. త. మ. చమ్మట్టి తు. చమటిగె) ఇనుమును సాఁగఁగొట్టు పెద్దసుత్తి, కమ్మరిపని ముట్టు.

ఆ. గీ. తంబళి చెలంగు సంబెల సమ్మెట యవ నల్పమై యున్న పదె మత్తి యనఁదగు హర! ఆం. భా. 1. 298.

ఉ. ... దిమ్ముగఁ గోళ్ల పచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలఁచే, సమ్మెట ప్రేటులం బరక సన్నికతో మఱికొన్ని చెక్కిన, బమ్మెర పోతరాజొకఁడ. భాగ. ప్ర. స్కం. 18.

చం. ... జనము ను ఇట్టి యగ్ని సెయిందవదె సమ్మెట పోటు భాస్కరా! భా. శ.

సమ్మెట² సంజ్ఞ. వి. కశః చబుకః కొరడా.

వ. అందఱును దిగ్గనడిచి యసంఖ్యంబుగా నందఱి నడఁగిపోయినం గలంగి రాజన్యులందఱు సమ్మెటలు పెట్టి గజ్జ బట్టఁ దోలియు పంకించబు లూని యేను గులం దఱిమియు హరి. ఉ. 1. 136.

సీ. వాని యశ్వంబులుఁ జేతిసమ్మెటలను జేరు కొలందఁ బ్రేని యంకుశంబుల మొనఁటి యతిరయము వాహనంబులఁ దోలువారును. భార. భీష్మ. 3. 284.

వ. అమాత్యపుంగవుం డగు సత్యకీర్తి కడియం బును దెచ్చి కరసరోజంబు పట్టి సమ్మెటం దొలఁగఁ దిగిచి తోమైచి మనఃబునం గారణ్యంబు పూరించి నిలిచి. హరిశ్చం. 2. 129.

సమ్మేల(న)నము సం. వి. అ. న. కూడిక, కలయిక. గుమిగూడుట.

సమ్మోదము సం. వి. అ. పుం. 1. అధికమైన సంతోషము.

కం ... తూర్యవ్రాతంబు సెలఁగ సమ్మోదాతిశయము నొందె ... భార. కర్ణ. 3. 267.

2. వాసన.

సమ్మోదించు సం. అ. క్రి. సంతోషించు. (రావణుఁడు)... సమ్మోదింప నర్హుండిలన్. భాస్క. రా. యు. 2260.

సమ్మోదితుఁడు సం. వి. అ. పుం. మిత్రుఁడు.

సమ్మోహకము సం. విశే. 1. కలఁత నొందించునది, 2. ఆకర్షకమైనది.

సమ్మోహనము సం. వి. అ. స్త్రీ. 1. ఆకర్షణము, 2. ఆయుధవిశేషము,

సమ్మోహనము సం. వి. అ. పుం. మన్మథుని పంచ బాణములలో నొకటి.

సమ్మోహని సం. వి. ఈ. స్త్రీ. మాయ.

సమ్మోహము సం. వి. అ. పుం. 1. కలంత. 2. మూర్ఛ. 3. అజ్ఞానము. 4. సంక్షోభము, అక్షణము

సమ్యక్ప్రయోగము సం. వి. అ. పుం 1. సరియైన ప్రయోగము, 2. సరియైన ఉపయోగము.

సమ్యక్పాఠము. సం. వి. అ. స్త్రీ. సరియైనపాఠము.

సమ్యక్స్థితి సం. వి. ఇ. స్త్రీ. కలిసియుండుట.

సమ్యగ్దర్శనము సం. వి. అ. న. అంతర్దృష్టి.

సమ్యగ్జ్ఞానము సం. వి. అ. పుం. (సమ్యక్ + జ్ఞానము) సరియైనజ్ఞానము.

సమ్యగ్వృత్తి సం. వి. ఇ. స్త్రీ. సిరమైన అభ్యాసము. 2. సక్రమవిధినిర్వహణము.

సమ్రాట్టు సం. వి. ట్. పుం. చక్రవర్తి.

శా. ... శ్రీగోవిందుఁ డంభోజినీ, మాధుర్యంబున కగ్గలించు పశిసమ్రాడాకృతిం గైకొనున్. పాండు. 3. 209.

రాజరాజై రాజసూయయాగము చేసినవాఁడు; పదికోట్లకర్షముల వార్షికాదాయము గలవాఁడు.

సయాట – సయ్యాట. వి. పరిహాసము.

ఉ. మౌనులపై ననుగ్రహము మైత్రి మహోరథుఁడై రమాయుతం, బానలినాకరంబున సయాటల నాటలఁ బాటలన్ దయా, ధీనుఁడు ... శ్రీరంగ. 5. 77.

సయికము – సైకము వి. సూక్ష్మదృష్టి.

తే. కలహశీల రాక్షసి సయికంబు లేదు, కొంకు పల్కు నెప్పుడు నిద్రపోవు. శా. అమ. 5. 277.

సయూథ్యుఁడు సం. వి. అ. పుం. ఒకేజాతి లేక తెగకుఁ జెందినవాఁడు.

సయోని సం. విణ. 1. సహోదరము, ఏకగర్భ జనితము. 2. దగ్గఱసంబంధముగలది, పోలినది.

సయోని సం. వి. ఇ. పుం. 1. సహోదరుఁడు. 2. ఇంద్రుఁడు. 3. అడకత్తెర.

సయ్యాటము – (సయాట) వి. సహక్రీడ, క్రీడ.

సీ. అమనితోడి సయ్యాటకై యచ్చోటి కరుదెంచి యయా. 3. 42.

కం. కయ్యముఁ బార్చి యనంగుని, సయ్యాటపుఁ జిట్టకంపుఁ బదురుల కపు డా, యయ్యెదొరకొని... రామా. 4. 161.

2. పరిహాసము.

శా. అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకురముల్ లోచనా పాంగప్రాంతములం దిగుర్ప నొక సయ్యాటంబు కల్పించి ... కాశీఖం. 4. 103.

కం. అయ్యా వగ వేటికి నే, నియ్యెడ నిదె యున్న దాన నివ్విభుడు పమన్, నెయ్యమునఁ దెచ్చె నిట్లొక, సయ్యాటపుమాయ నెదురు సమదెంచి పెనన్. పర. 4. 115.

ఉ. ... వ్యాళకవ్యళ కెంగేల నొసంగఁ గైకొని యొ సయ్యాటంబు వాటిల్లగన్. విజ. వి. 1. 171.

సయ్యాటించు అ. క్రి. (√సయ్యాట) పరిహసించు.

శా. ఆ మందోద్భవ భీతమందరుచి సయ్యాటించుచున్ మఱి శా, స్తోమం బాతతపక్షగుచ్ఛముగుచున్ దోతేరఁగా .... పాండు. 4. 254.

సయ్యొద్ద వి. (సయి+ఒద్ద) చేరిక.

(వారు మిక్కిలి సయ్యొద్దగా నున్నారు. ఇది సయ్యోద్దె అని వాఁడఁబడుచున్నది. శ. ర).

సరంగము సం. వి. అ. పుం. 1. నాల్గుకాళ్ళ జంతువు. 2. పక్షి.

సరంగు వి. ఓడమాలిమిగాఁడు, నావికుఁడు (శ.ర.).

సరంజాం హిం. వి. సరకులు, సామాను.

సరండము సం. వి.అ. పుం 1. పక్షి. 2. స్వేచ్ఛాచారి, త్రిమ్మరి. 3. బల్లి. 4. మోసగాడి. 5. ఒక విధమైన యాభరణము.

సరంతిలు వి. బ. వస్త్రవిశేషములు.

రగడ. శాంతితతి వెదచల్లగల్గిన సడతిలు, దుద్దు

కంబళ్ళు చంద వలు తివాచీలు. హంస. 5. 358.

నరంబీ అవ్య. వి. ఒల్లకూరన్న (శ. ర.).

నరకట్టు వి. వీణాసోపానము, వీణమెట్టు. (ఆం. స్వరము, శ. స.).

వ. వెట్టిసారకాయలబుఱ్ఱలం గట్టిన నరకట్ల తీగ రలు మెఱయ మొరయించు మ్లేచ్ఛుల పాటల యాన మానంబులును. కాశ. 3. 66.

సీ. తరుణాంగుళిచ్ఛాయ దంతపునరకట్టు లింగిలీకపు వింతరంగు లీన, మను 1. 5.

నరకము నం. వి. అ. పుం. ఆ.న. 1. తిన్నని మార్గము లేక వీథి. 2. సారాయము. 3. సురాపానము. 4. సురాపానపాత్రిక. 5. సురను పంచిపెట్టుట.

నరకము నం. వి. అ. న. 1. గమనము, పోవుట. 2. చిన్న నరస్సు. 3. స్వర్గము.

నరకారు వి. (హిం. సరకార్ సర్కారు, ప్రభు త్వము.

సీ ... తెల్లజెండా నవుబత్తను ఢక్క యాది, కలి గిన రాజచిహ్నా లొసంగఁబడె నుత్తరపు నరకారులం దవుడు. రంగా. 1. 116.

నరకు¹ వి. (క. కు. త. సరక్కు. కు. సరక్కు) సామగ్రి, వస్తుసముదాయము, వస్తువు.

నీ సరకు మూఁడవవాఁడు మరల నీఁదలఁచిన వెల వదేనవపాలు విడువవలయు. విజ్ఞా. ప్రా. కాం. 30.

కం. నరకులు భారవహులకును, భరియింపఁగఁ గొలఁదియైన భంగిని మోపుల్, వెరవుపడఁగఁ గట్టుఁడు భార. మౌస. 1. 132.

కం. శాకపునరకులఁ బోఁకలు, నాకులు గొంగళ్ళు దుడుపు టంబరములు కుం, దీ కాలాగురువుల్ గొన, గై కొనఁ బ్రియ మయ్యె శీతకాలము నందున్. వేం. పంచతం. 1. 671.

'తమరు గొని సన్న సరకు లెంతయును బత్తినవ్ప నము చేసి. నీలా. 2. 51.

కం. నరకుఁడు యాగంబులకున్, కొరకుఁడు మీర నుము ఋత్విజుల నడచేటయున్, సరకులు చూఱా డుటయును, వంకుల కన్యకలఁ బట్టి వాఁ డేగుట యున్. ఉ హరి. 110.

2 అమ్మకపు వస్తువు

తే. ... నివాడును విచ్చేసెకు టు గజ్జెఁ గొలుచు ఒమ్మకపోఁ గ్రమ్మలు గలిపి సరకు దూఁచి పెట్టెడు చోటులఁ దూర్చి ... భారు. అను. 5. 104.

సీ. ... కు సరకట మన జనును ఒణ్యద్రవ్యమమరు. ఆం. భా. 2. 275. (ప్రా).

మ ఘనసౌధాళి వియద్ధునీ జలధి వీఁక ప్పానవలై నీక దోఁచ నెల.తల్ వణిగాకృతిన్ సరకు మా ... ఆము. 2. 12.

3. ... మ్ము.

కం విను నప్తనకలధను లగు, జనములు నిజేవ మి... సరకులు దొలుఁకా, మున మగుడ నీక నెవ మిడి. భార. అను. 5. 136.

ద్వి. చంద్రుని ధరియించి నర్వజ్ఞ గొలిచి, చంద్రత్వ మది దవనరకుగాఁ బడ వె. పండితా. దీకా. 19 పు.

నరకు² వి. లెక్క; లక్ష్యము.

కం. ఏ వలిగిన వారిని నుర, లైనను, రక్షింవ నోప రమను లలిగినం బూని చెడకుడఁ గాతును, మానవు లొక సరకె నాకు మనుజాధీశా. భార. ఉద్యో. 2. 263.

కం. చని యాజనార్దమనిచే, ఘనమగు లవణంబు మనకుఁ గప్పమడుగు మే, ధనములును నరకు గావు. ఉ. హరి. 4. 184.

ఉ. వకమవస్కులై తగుల మెందుమ లేక విరక్త ధర్మిణి, హాకరులైన వారి నొకనందున డెందముఁ జొచ్చి చించి బల్, కాఁకలు సేయు నీకు మహిళా నహచార దృఢావివేకు ని,ఞ్ఞాకుఁ బరాభవించు టనగా నరకా వరకాంతకాత్మజా! వై. శ్రీరంగ. 2. 266.

కం చిరజీవము మానామము, నరకే మా కొకటి యిష్టసంచారము మై, నరుగక మీరిట నాపినఁ బరిభవములఁ బొంద నాపఁబడితిమి మీచేత్, కేయూర. 3. 102.

ద్వి. భరతునిచేఁ నాకుఁ బ్రాణంబులైన, నరకుగా నవియు రాజ్యము నాకు నరకె.

రం. రా. అయోధ్యాకాం. 97 పు. 9 పం.

తే. లావునను గూడి పాడిపల్లవయుగమున, నొత్తి పట్టిన నరకుగా కుల్లసమున, హారకాంతిచ్ఛలంబున నల్ల నవ్వి, తరుణి చన్నులు రాజు చిత్తము హరించె. శృ. నై. 7. 179.

ద్వి. అరు దగు లింగనమర్థుల యిండ్ల నరవుడ నానొక నరకె యర్థంబు. బస. పురా. 44 పు. 2 పం.

కం. మనుజులు పాండుతనూజులు, జననాయక నాకు నొక్క నరకే తలఁపన్. భార. కర్ణ. 1. 241.

కం. హరిహర కమలభవాదుల, నరకుగొనక గెలుచు నీకు సామాన్య మునీశ్వరులను జయించు టవఁగా, నరకా నరకాంతకాత్మసంభవ తలఁపన్. చిత్ర భార. 2. 78.

నరకుగఁజూచే క్రి. నరకుసేయు.

నరకుగాఁగొను న. క్రి. లెక్కసేయు, లక్ష్యపెట్టు.

ఉ. మూన్నత మూఁడి జన్మముల మూడక లోన నడంచి పట్టి కో,పానల మెండియున్న నిలిచాటవి నైఁ జచరించే తీవ్ర దా, వానలుఁ బోలి శాత్రవచ యంబు నయిం గవియించి నిల్చినం, గాని యుధిష్ఠిరున్ నరకుగాఁ గొన రా ధృతరాష్ట్రనందనుల్. భార. ఉద్యో. 2. 137.

కం. శినిమనుమఁడు గవలును దో,డన యురవడి నదరి పొదువుటయు వగ్గలికం, బెనఁగె నతం డా వలువుర, కనలుఁ గడంకయును నరకుగాఁ గొన కధిపా! భార. శల్య. 1. 208.

చం. అనికి బలారి వచ్చిన బురారిగణంబులుఁ దామఁ జన్నినం, గినిసి కడంగి క్రీడియును గృష్ణుఁడుఁ దాఁకిన నే జయింతుమా,రొక్కని యను చుండుదున్ నరకుఁ గొందునె ద్రోణునిఁ దోడి యోధులన్. భార. ద్రోణ. 2. 15.

సీ. కుల మొక్కఁడై నఁ దేకువ లేక బుద్ధియుఁ శౌర్యంబుఁ బెంపును నరకుఁ గొనక. భార. శాం. 3. 408.

తే. గీ. తన వెనుక క విభీషణుఁ దలఁగఁ దిగిచి, తూఁటి యా శిపైఁ బెక్కుతూపు లేయ, నరకుగొన కది నిగిడి యబ్బిరుదుమగని, లొమ్ము గాఁడిన ద్రెళ్ళి వే సొమ్మసిల్లె. అ. రా. యుద్ధ. 387.

చం. నరకు గొనండు నన్నుఁ దన దాయలవారి నడంచె మత్పురం,దరవిభు నడ్డసేయక యితండని రాఘవునాలి జాలి మున్నరకకుఁ దెచ్చు పోలిక. చంపూరా 6. 52.

కం. అనుపలుకులు విని దుశ్శా,సనుఁ డేమియు నరకు గొనక సమదవిలాసా,ననుఁడై నిజాగ్రజున్నని, గనుగొని యిట్లనియె గాఢగర్వస్ఫూర్తిన్. భార. విరా. 3. 94.

అ. కడిమి మెఱయంగఁ బోరు త్రిగర్తనాథు, రథముఁ గనుగొని కడఁగి విరాటవిభుఁడు, వరపు నకు వల్గినట్టుల నరకుఁ గొనక, యతుల రథసారి రేకత నతనిఁ దాఁకె. భార. విరా. 3. 185.

కం. గురుఁడను జలనిధి గడచితి, నొరులు దలం పంగ నాకు నులిగాలువ లీ,వరపతుల నరకుఁ గొన నీ, వరదము సననిమ్ము నేఁటి యని కలయకుమీ. భార. ద్రోణ. 4. 63.

ఉ. ... రాజను విద్యలు నచ్చునంచు నేఁ, గ్రొవ్విన విప్రులన్ నరకుఁ గొక తిరస్కరణంబు చేసినన్. వరాహ. 7. 84.

చం. తిరిసినకూడు దెచ్చి నలుదిక్కుల బోదలు తిండి పెట్టఁగా, బెరిఁగిన పొట్టతోడ నొకపీఁట నయిం దొరనోలె నెవ్వరిన్, నరకుగొనండు పట్టు కొని దాఁగఱగొన్న బలె యెఱుంగుఁ డ,క్కరి బలుమోవు మోచు నయగారితనం బది యట్టి గట్టినన్. ఉ. హరి. 4. 46.

కం. పురి వజ్రఖచితమణిగుణ, సురుచిర దీధితుల వలన సొరిదిని దివియల్, నరకుఁగొన రెట్టి రాత్రులఁ, గర మరు దప్పురముకోట శావలి వారల్. విక్ర. 1. 66.

వ. ప్రతికూల మారుతంబు లెదురుకొన నరకు గొనక పశ్చిమోమ్ముఖుండై పంక్తిముఖుండు తత్తటి నీతటంబునన్ జని చని. ఉ. రా. 3. 228.

తే. అరిగె సపరిచ్ఛదముగ రాజాన్వయమువి, తనదు దుఃఖవిరహవర్తనలు సరకుఁగొనక సమవర్తి తన యుండు జనకుఁ డేలుపుఁడమున కరాళగతి వాసి సరళసరణి. రాఘ. 2. 35.

**సరకుఁగొను** అ. క్రి. లక్ష్యపెట్టు.

రగడ. కొండ లగ్గల సరకుగొనని పేరాయులును పి. శకుం. 3. 225.

**సరకుసేయు** ద్వి. స. క్రి. 1. లక్ష్యపెట్టు, సరకుగొను.

కం. ఇలఁ గ్రీడగఁ బుట్టిన వీరలఁ గేవలమర్త్యులని సరకుసేయని వారలు సెదురు రెఱిఁగిఁ భక్తిం, గొలిచిన వారలకు శుభ మగును విను డెందున్. భార. భీష్మ. 2. 271.

వ. గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు సరకుసేయక ... భార. విరా. 2. 127.

ఆ. సరకుసేయ వను చద్దమాటలు గొన్ని యాడినంత నేమి యయ్యె నింద్ర! భార. శాం. 4. 248.

సీ. .... అతఁడు తన్మహిమ పెంపు నరాతి మత్సర విధి, నాత్మలో సరకుసేయక సంభ్రమించె. రాఘు. 2. 32.

2. గణించు, ప్రేమించు.

సీ. వాదురూపంబు మనంబునఁ జిక్కనతరుణి దక్కొరు నేల సరకు సేయు. భార. విరా. 2. 355

**సరగు** అ. క్రి. ద్రు. (సం. ప్రాక్.) త్వరగా, చేప్పున.

సీ. .... వెన్నుని చెంత కరిగి చాగిలి మ్రొక్కి సరగ లేచి. నీలా. 1. 70.

కం. జలధిన్ రఘుపతికరుణన్, జలధిం గానీక కాచి సరగఁ దదాజ్ఞన్, వలచే రిపుసైన్యదవా, వలచే సేతువు క్రియంబునన్ గట్టించెన్. ఉ. రా. 1. 128.

తే. సకలపూజలు వేడ్కతో సరగఁజేసి. శృం. నై. 6. 46.

వ. మహోరగంబులు సరగ వరుగఁగూడక. ఉ. రా. 3. 78.

వ. సత్యధన్వ మహీకాంతుఁడు సరగ నగరంబు నలంకరింపం బనిచి. విక్ర. 7. 78.

**సరగు** వి. వేగము.

కం. మనవాఁడె సంద్రుఁడు చె, ప్పిన మాటలు వింటి రింకఁ బిఱుతికమంలన్, గొనివచ్చి కట్ట కట్టుఁడు చనవలయున్ గడలిదాఁటి సరగున మనకున్. యయా. 3. 33.

చం... ఒక్క వరాహ మేఁగెఁ జే,వకలిమి నవ్వు దా యెఱుకువాండ్ర దరింపులకేమి సద్దసే, యక తన యిచ్చగా సరగున న్విడివడ్డ మదేభమో యనన్ సారంగ. 1. 94.

కం. తరుణులు తఱుములు పెట్టుచు. సరగునఁ దో తేరఁ దెలియఁ జాలినమతిఁ ద, త్పురమును జేరు నెఱింగినఁ, బరితాపము కొంత డిందుపడదే నాకున్. రాజశే. 3. 96.

కం.హరిగిరి ధరించి యిటువలె, సరగున జనగరుడు వెంటఁ జనలేకమురా, సురుల ... దశా. 2. 175.

సీ. శరణాగతుండయి సరగునఁ దద్రామునువ ఘృణార్ణవమున మునుఁగ బట్టి, కొనిపోయె. రాఘు. 3. 119.

**సరఘా** సం. వి. ఆ. స్త్రీ. తేనెటీఁగ.

**సరజ** సం. వి. ఎ. స్త్రీ. రజస్వల.

**సరజము** సం. వి. అ. న. సరిక్రొత్త వెన్న.

**సరజస** సం. వి. ఆ. స్త్రీ. రజస్వల.

**సరజస్క** సం. వి. ఆ. స్త్రీ. రజస్వల.

**సరటము** సం. వి. అ. పుం. 1. వాయువు. 2. బల్లి. 3. తొండ (శ. ర.).

**సరటి** సం. వి. ఇ. పుం. 1. వాయువు. 2. మేఘము.

**సరటువు** సం. వి. ఉ. పుం. 1. బల్లి. 2. తొండ.

**సరడు** వి. భూషావిశేషము; స్త్రీలు మెడలను దాల్చు బంగారు అల్లికతీగ (శ. ర.).

**సరణము** సం. విణ. నడచునది, కదలునది, ప్రవహించునది.

**సరణము** సం. వి. అ. న. 1. నడచుట, సాగిపోవుట, పారుట. 2. ఇనుము, త్రుప్పు.

**సరణి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. త్రోవ, మార్గము, వరుస.

కం. ... బదరీ తరుష౦డ ము వలా౦తర సరణిన్, ధరణీసుర౦డు .... మను. 2.

2. తీరు, రీతి, విధము. 3. బుజారేఖ, 4. తిన్నని గీత. 5. ఒక విధమైన కంఠరోగము.

7. విధము (దీని కీ యర్థ మాంధ్రగ్రంథముల యందు మాత్ర మగపడుచున్నది.)

తే. శివి తెలుంగున మాంధాతృ చెలువమున యయాతిరీతి దిలీపు మర్యాద ఎంతి, సరణిఁ బాలించి యలరు నా చక్రవాళ, వసుమతీచక్ర సమ్మహీ వల్లభుండు. శుక. 1. 10.

గీ. చక్రవర్తుల ఖ్యాతిని షడ్గుణముల, సరణి బురు షార్థముల లేవఁ బతుకుపాయ, ముల విధంబునఁ బ్రఖ్యాతి వెలసి రందు. విక్ర. 1. 30.

గీ. ప్రబలె వవ్వేంకటాద్రి నృపాలవరున, కవని రెండవభార్య వెంగమ్మ యనఁగ, జలజలోచను నకుఁ బంట వలఁతి కరణిఁ, గవకగిరిచాపునకు బహ్నికన్య సరణి. ఇందు. 1. 2.

సీ. నే వధింపఁజాలక నిన్ను నీ సరణిఁ గరంబురు, వ్యనుసరించుట వన్నసదుగాఁగఁ దలఁచెదు గాఁబోలు. కళా. 6. 67.

సీ. నెగకుల్కి మఱుఁగుఁ జొచ్చిన జవ్నురవిజల సరణి మల్లెలతోడి జడలు మెఱయ ... అము. 2. 58.

**సరణ్యువు** సం. వి. ఉ. పుం. 1. వాయువు. 2. మేఘము. 3. జలము. 4. వసంతర్తువు. 5. అగ్ని. 6. యముఁడు.

**సరత్తు** సం. వి. ద్. పుం. 1. గాలి, వాయువు. 2. మేఘము. 3. బల్లి. 4. తేనెటీఁగ.

**సరత్ని** సం. వి. ఇ. పుం. స్త్రీ. ఒక విధమైన కొలత. (చూ. రత్ని లేక అరత్ని.)

**సరథుఁడు** సం. వి. అ. పుం. 1. ఒకే రథమున నున్న వాఁడు. 2. రథమెక్కి యుద్ధము చేయు వీరుఁడు.

**సరదా** అవ్య. వి. వినోదము, విలాసము.

**సరదారు** (హిం. సరదార్) వి. నాయకుఁడు. ప్రధా నాధ్యక్షి.

, వారలు ప్రమ్మగిన వీగి యని వీఁగు సరదార్లు శివనోసరిలు వారులు. చంద్రాంగ. 6. 112

మను మావులను మావు లెనసిన కోయిల సర దార్ని కెల్లను సారిఁ జెప్పి. శశాం. 4. 86.

మొగలాయి ప్రభులకై పూని పేర్మహమదు ఖాను వినెడు పేరు గగ్గినట్టి, సరదారుఁడు మన దేశమును జయింపఁగ వచ్చె ... రంగా. 1. 115.

**సరిచు** అ. క్రి. 1. పంచు, విభజించు.

గ. చలిది యతఁ డందఱకు నిట్లు సరిది పెట్టె. పరమ. 4. 236. (శ. ర.).

2. నెఱపు, వ్యాపింపఁజేయు.

తే గీ. కప్పురము పొదులోపలఁ గరము సరది, నాటి వెన్నెల యను తేటనీటఁ దడప, మొనలు చూపిన ముత్యాలమొలక లనఁగ, నొరపు తోఁడుతఁ జెలివలువరుస దనరె. యయా. 4-38.

**సరదుకొను** స. క్రి. పంచుకొను. ద్వి. ఒండొరులకు మనమొద్దికై సరదు, కొందము రమ్మంచుఁ గూడి ముప్పురును.... ద్వి. పరమ. 1. 44.

**సరపణి** సరిపణి, సరిపెణ, సరిపెణము, సరిపెణీ, సరిపెన, సర్పెన, (త. చరిప్పణి, క. సరపణి) వి. 1. ఇనుపగొలుసు, భ్రమరపంక్తుల సరపణులతోఁ దూగు. ద్వి. పరమ 1. 38 పు.

2. గొలుసు.

తే. సుమపరాగముల్ శేఖి పాంసువులు గాఁగ, భ్రమరపంక్తులు పై సరపణులు గాఁగఁ, బుడమి నెల్లెడ వాహ్యాళి వెడలుమదను, మదపుఁ ఏనుగుఁ బోలె నామని దనర్చె. రాఘ. 2. 5.

3. అలంకారముగా నుపయోగించు బంగరు గొలుసు, అలంతిక.

ద్వి. బంగారు సరపణిని బాగుగా నునిచి, గణికా శిరోమణి ..ద్వి. పరమ 4.274.

సీ. అంఘ్రిపద్మముచుట్టు నతివలయంటగా నీలాల సరపణుల్ నీటు నూప. వాల్మీకి. 3. 30.

ఎ. గీ. పచ్చల కడెంబులును సరపణులు పూని, భద్ర దంతావళం బెక్కి ప్రభువరుండు, నుదయగిరిఁ దోఁచుభాను వట్టుల్లసిల్లె. కవిజనరం. 3. 11.

**సరపత్త్రిక** సం. వి. ఆ స్త్రీ. 1. క్రొత్తతామరాకు 2. తామరపువ్వు.

**సరపువ్వులు** వి. బ. (సరము+పువ్వులు) దండగా గ్రుచ్చు పువ్వులు. (సరము. స. ఆయు వి. వి. అనియు అము. వ్యాఖ్య కాని సరము శబ్దము అచ్చ. రా. కిష్కి. 40 లో నుడుటచే అన్వితలుగ గవ వలెను.)

తే. గీ. ... బంటి కుసువేరు పోచకుఁ గంటగింప. రైరి తుటిమెడు సరపువ్వులం దతివలు. ఆము. 5.106.

సీ. సరపువ్వులుగ మాలకరి పెక్కు తెలుఁగుల విరుల నెత్తులుగఁ గావించినట్లు. పి. శకుం. 1.27.

**సరఫరా** హిం. వి. కావలసినవానిని సంపాదించుట.

**సరబడి** (సరస+బడి) వి. ద్వారము, ఆశ్రయము. (త. సరసడి, సంపడి — కుటుంబము)

సీ కోటకొమ్మలు క్రొత్తడంబులు పెద్దగవఁకులు సరబళ్ళుగట్టివటిచి (అల్లవర్లు అని ము. ప్ర) అచ్చ. యు. కాం. 73.

సీ ఇనవంశమణి యొద్ద నెవ్వారి సరబడిఁ గొలువు పట్టితివి. రామా 6. 128.

ఎ. గీ. తలఁచిన తన సరబడి నెల్ల దశముఁ గూర్చు (తలఁచి దృఢతరముగ అని ము ప్ర.) పంచ. వా. 1 ఆ.

**సరభసము** సం. విశే. 1. వేగముతోఁ గూడినది. 2. ఉగ్రమైనది, ఉద్ధతమైనది.

కం. సరభసపరిచలిత మహోశరభ ద్విపరిపువరాహ శార్దూల మద, ద్విరదాది ప్రకరభయంకర వనమధ్యమున నృపతి కడుఁ గడిమి మెయిన్. భార. ఆది. 4. 12.

3. ఉద్రిక్తమైనది. 4. హర్షముగలది.

**సరభసిల్లు** సం. అ క్రి. (సరభసము+ఇల్లు) త్వరపడు (గ్రా.).

సీ. పేరు విన్నప్పుడే దూరమై చను ఘాతచయములు దిగులువ సరభసిల్లి. హంస 3. 63.

**సరమ** సం వి. ఆ. స్త్రీ. 1. విభీషణుని భార్య. 2. ఆడుకుక్క, దేవశుని. 3. దక్షుని పుత్త్రిక.

**సరమ** వై. వి. శ్రమము.

**సరమగొను** సం. శ్రమః (సరమ+కొను) అ. క్రి. శ్రమపడు.

వ పరమపుణ్య సరమ సరమగొనక జనకజం గూడి భయనివారణంబు సేయుచు. రామా. 7.2.6.

**సరము** సం. వి. అ. పుం. 1. హారము, దండ. 2. మీఁగడ. 3. గమనము, చలనము. 4. అవణము. 5. బాణము. 6. జలపాతము.

**సరము** సం. వి. అ. న. 1. నీరు. 2. కొలను.

**సరము**[1] వి. మాలిక, దండ. (సం. సరః. త. చరమ్. క. సర.)

కం. ఒదయని యదుగులఁ బడి కదు, బడలిన నూరార్చి మఱల నరుగు మటంచున్. మెడనొక పూలసరం బిడి, వడి ననిచిన నేఁగి పెనకువకుఁ బిల్చుటయున్. అ.రా. కిష్కింధా. 40. "పున్కసరములు కుదురుపటిచి" నీలా. 1.18.

సీ సరము లెత్తులు దండలు సరు లవంగ నామధేయంబులగుఁ బుష్పదామములకు. ఆం. సం. స్థావ. 17.

**సరము**[2] వి. (సం. స్వరః) ముక్కుగాలి.

సీ. తేగిణి గొపరి తైనుక వెట్టి పలకపై సారెలు వోయించి సరము చూచి. ఉ. హరి. 3.120.

**సరము** (సం. స్వరః. ప్రా. సర. త. చరమ్. క. సర.) స్వరము. చూ. సరికట్టు.

**సరయువు** సం వి. ఉ. పుం. గాలి. వాయువు.

**సరయువు** సం. వి ఉ, ఊ స్త్రీ. అయోధ్యానగర సమీపమందలి నదిపేరు.

**సరళ** సం. వి. ఆ. స్త్రీ. తెల్ల తెగడ (వృ.వి.) (శ.ర.).

**సరళద్రవము** సం. వి అ. పుం. దేవదారుబంక.

**సరళము** సం. వి. అ. పుం. పూతికాష్ఠము (వృ. వి.).

సీ. కొండగుమ్ముడు రేఁగు గొంరమి పంపగి కొండ సంపెంగ మారేడు సరళ దేవదారు. హంస. 4. 11.

(సరళ అని స్త్రీ సమముగాఁ గవఁబడుచున్నది. సరళమునకు 'సరళ' అనియు, దేవదారువు, దేవదారు అనియు ప్రయుక్తములు. చూ. దేవదారు.)

**సరళము** సం. విశ. 1. తిన్నని, వక్రముకానిది. 2. ఋజువైన, త్రికరణశుద్ధమైన. 3. అకృత్రిమమైన, సహజమైన.

**సరళము** సం. వి. అ. పుం. 1. ఒక విధమైన దేవదారు వృక్షము (వృ.వి.). 2. అగ్ని. 3. గకారాది వర్గతృతీయాక్షరము.

**సరళాంగము** సం. వి. అ. పుం. దేవదారు వృక్షద్రవము.

**సరళి** (క. సరళిస్వరగ్రామము. త. సరళి) కలయికలుగల సరిగమపధని యను సప్తస్వరముల గ్రామము.

తే. గీ. ఛత్రకత్రత బొ ధారణి ఝుంకెసరళి, పాటనైసిక యువఝుంకె మీటుకంపి, కాహతంబులు పాళియుఁ బ్రత్యాహతమును, స్ఫురితములు వాద్యము లవయ సరళిమీఱి". ప్రబం. 1. 100.

**సరళిస్వరము.** వి.√ సరళి. వివిధములగు కలయికలతోఁగూడిన సరిగమపధని యను సప్తస్వరముల వరుస.

ఉదా. ముందు సరళిస్వరములు నేర్చి పిదప జంటస్వరములు నేర్తురు (వ్య).

**సరవ** వి. చిన్నకడవ, బుంగ, బుడ్డి.

**సరవడి** వి. ఈడిక, గడ్డిలోనగు వానిని దెచ్చెడి బండి వరమువంటి సాధనవిశేషము.

సీ. అలరుఁ దృణాద్యానయన సాధన విశేష సంజ్ఞ యీడిక యన సరవడి యన. ఆం. భా. ద్వి. 8. (శ. ర.).

**సరవత్తి** వి. ఒకదిమను, బాణసంచు.

వ. సరవత్తుల వేగమున రంజకంబు దిమసున సురటి దిప్పినట్లు, తోకచిచ్చు నాఁగ నెదిర్చిన వగర గుండెలు చిద్రుపలుగ విదిర్చువరె నిలవద్రువ వగుచు. ప్రబం. 1. 798.

**సరవి** వి. 1. క్రమము, వరుస.

"వావలు సరవితో వర్షించె" స్వా. 6. (శ. ర.).

తే. నాటిపిన్నాతఁడీ యదువంగనుండు,సరవి మిముఁ గూడి తిరిగి యీ చందమయ్యె. జై. భా. 8. 143

"క్రమమొప్పుచుండు సరవి యనంగ" ఆం. భా. 3. 30.

సీ. వావలు సరవితో వర్షించె. మను. 6. 121.

2. తీరు, విధము.

కం. వరుఁడు సమాగమకాంక్షన్, ద్వరితపడుచుండ నిచటఁ దడయుట తగదో, వరవర్ణిని రారమ్మిక, సరవినిఁ దమియుండ దెల్లసమయము లందున్. ప్రభా. 5. 23.

తే. నీవు నాదాయతోఁగూడి నీచబుద్ధి సెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు, కడగి నీమంత్రులును నీవుఁ గంటిలోన నెరసుసరవిగ నున్నారు నిశ్చయముగ. మొ. రామా. యు. 1. 20.

3. ఒప్పు, అందము.

వ. భగీరథురథంబు వెంటనంటి పంటవలంతి కంటసరి, సరవిమీఱి నీహారగిరికుమారి భాగీరథీ ప్రధానమాకలితయై. చంపూరా, 3. 25.

మ. భరతుండా రఘురాము పాదుకలపై భక్తిం బ్రతిష్ఠించి నిర్భర భూచక్రము రామరాజ్యముగ మర్యాదానయౌదార్యసుస్థిర కార్యంబుల నేలుచుండెఁ జని నందిగ్రామసంస్థాయియై, సరవిం దత్పరాగమక్రమదిదృక్షాదక్షదీక్షాధృతిన్. రామా. 6. 101.

చ. సరవిని దమ్మిక్రొవ్విరి హజారమునం గొలువుండు భారతీశ్వరుఁడు చిరాయు రున్నతు లొసంగును మాకయతిమ్మకారికిన్. విప్ర. 1. 3.

**సరవెంద** వి. సెరవెంద. తీక్ష్ణగంధ (వృ.వి.) (శ.ర.).

**సరవ్యము** సం. వి. అ. న. మా. శరవ్యము.

**సరస** వి. 1. ఆసనార్థము

సీ. తక్కటి యనంగఁ దీతంబు దనరుచుండు, గద్దె గద్దియ పీఁట నాఁగను గటాసనమ్ము చదరిక యనఁ జర్మకమ్ము దనరు నాసనార్థంబు సరసనా వలరుచుండు. ఆం. భా. 2 165.

2. సమీపము.

ఉ. కూరిమి నేఁడు మీసరసకుం జనుదెమ్మని యానతిచ్చుటో, సూరివరేణ్య నన్నొరసి చూచుటకో మఱి నిక్క మో యనన్. వైజ. 3. 6.

కం. రాజసుతుఁడు సవినయమతియై తనగద్దె సరస నుంచి తా, సనయుక్తులఁజేసి యను ప్రసన్నాననుఁడై. సారంగ. 2. 265.

ఆ. వె. అచట వారి నునిచి యపుడె కోఁతుల జేని, సరస కేఁగి తాను జన్న తెఱఁగు, విన్నవం బొనర్చి ప్రేల్మిడి నతని న, ద్దొరలకడకుఁ బెద్దకుఁ దోడితెచ్చె. భా. రా. కిష్కింధా. 16.

3. దాపు, పార్శ్వము, ప్రక్క.

క. కరితురగ రథపదాతులు, పరివేష్టింపంగఁ గొలుచే వ్రజ ముందఱగా, సరస జనార్దనుఁడుం జన, వరిగిరి వేఁటాడ ధరణి యల్లల నాడన్. ఉ. హరి. 4. 21.

4. సమతము.

తే. అప్పు డయ్యేలదోఁటలో నతని సరసఁ, బరిజనంబులు పరిపక్వ ఫలసుగంధ, కుసుమరస పల్లవంబుల గొల్లలాడి. శుక. 1. 285.

5. వరుస, శ్రేణి.

సీ. ఒకమొలనాఁగ చేయూఁదినాఁ డిక్కడ సరస నున్నవి నాల్గు చరణములును ... ఒక యింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రు లొప్పె. భాగ. 10 పూర్వ. 1048.

కం....ముదితలు దారున్, సరసన్ గంధర్వపతుల్, వరుసన్ హరిఁజాడి రపుడు వసుధాధీశా! భాగ. 10. పూర్వ. 1086.

సరస సం. వి. అ. తెల్లతెగడ. (వ్ర. ని.).

సరసమాడు (సరసము + ఆడు) అ. క్రి. హాస్యమాడు, సరసముగాఁ బలుకు.

తే. తెలివ యొక్కతె ముందర తెలవుమాప. సకియ యొక్కతె యొయ్యన సరసమాడు. చంద్రాంగ. 2. 118.

గీ. చదువఁ బాడంగ నర్తింప సరసమాడఁ, గథలు సెప్పంగ నగ్గింపఁ గన్నులార్ప. కాశీ. 5. 316.

2. పోలు, సాటియగు, కలియు, మిళితమగు.

సీ. చరమసంధ్యాకాల సంపుల్లమల్లికా స్తబక పంక్తులతోడ సరసమాడి. శృం. నై. 1. 87.

సీ, ఆతపత్ర ధ్వజకేతనచ్ఛాయలు చామరప్రభలును సరసమాడ. భా. రా. బాల. 687.

సీ. స్ఫురితవిద్రుమనిభాధర బింబరుచితోడ దరహాస చంద్రిక సరసమాడ. భాగ. 10. ఉత్త. 6. 88.

తే. జలకణంబులుఁ జెమటలుఁ జెలిమిచేయ, నళి రవంబులుఁ బలుకులు ననఁగిపెనఁగ, వెన్నెలలుఁ జిన్ని నగవులు వియ్యమందఁ, జల్లగాడ్పులు మూర్పులు సరసమాడ. వరాహ. 4. 65.

సీ. కంపాలతాంగుల చరణకాంతులు కుశేశయ కదంబముతోడ సరసమాడ. అని. 2. 57.

సరసము సం. విణ. (అ. అ. అ.) 1. రసముతోఁ గూడినది. 2. రుచి గలది. 3. తడి గలది. 4. చెమటచే తడియైనది. 5, ప్రేమ గలది, భావపూర్ణమైనది. 6. అందమైనది, రమణీయమైనది. 7. అభినవము, వికాసము గలది. 8. శృంగారాది రసములతోఁ గూడినది. 9. సారము గలది. 10. ఊట గలది.

(రస యుక్తమైనది.)

సీ. కన్నుల కార్పర్య గరిమఁ జెందనివాఁడు సరస భావముకు మెచ్చని నరుండు .... గీ. నాస్తి యన్యతంబు దల్పర నహి హాళక్కి. హంస. 2. 14.

సరసము సం. వి. అ. న. 1. సయ్యాట, (స్త్రీ పురుషుల) పరిహాసము, నవ్వులాట.

సీ. .... ... ఏ సీమ సరసంబు లివి యమ్మ నేఁ జెల్లి యనిన నీ వెఱుగవే వనిత యింత, జాణ యయ్యును మాసీమ సరసమంచు. దశా. 7. 41.

2. పరిహాసవాక్యము.

సీ. పొరిగింటి చెలిఁ గూడి సరసముల్ పలుకుచోఁ జెంత నిల్చితి ఁ బుమా దంతిగమన. శుక. 3. 500.

మ. సరసాలుం జిఱునవ్వులున్ మురిపెముల్ సయ్యాటలున్ వింతలున్, గరగింతల్. హంస. 1. 241.

జ. సరసమా (ములా) డు.

సరసర (క. చరచర త, సరసరప్పు) చరచర. వి. గమనాదులందగు ధ్వని కనుకరణము, శీఘ్రము.

ద్వి. కూటకూటములందు గృహముల యందు, సరసి యాజంగమం బడుగుల కెరగి, సరసరఁ దో త్తెంచు ఛన్నుఁడు మీరనుచు. పండితా. దీక్షా. 81 పు.

ద్వి. సరసర గీత బందరు కవిలియలు, సరయుఁడు శోధింపు దవ్వనములు. పండితా. దీక్షా. 90 పు.

ద్వి. సరసర లింగవసాయిత శస్త్రు కరతలుఁడై చూడ కమదృష్టి మున్న. బస. పురా. 2. 482 పం.

**సరసర** క్రి. విశ. మిక్కిలి వేగముగా.

ద్వి. అరుగఁగ సరసర లింగావసరము సేయించి బస. పురా. 2. 885.

**సరసి** సం. వి. ఈ. స్త్రీ. సరస్సు, కొలను.

వ. శుకు డు మృగపక్షిశైల సరిత్సరసీ తరు గుల్మ లతలం గలయం గనుఁగొని .... భార. శాంతి. 6. 630.

గుఁట.

**సరసికము** సం. వి. అ పుం. సారసము, బెగ్గురుపక్షి.

**సరసిజనాభుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు.

**సరసిజభవుఁడు** సం. వి. అ. పుం. బ్రహ్మ.

**సరసిజము** సం. వి అ. న. పద్మము, తామర.

**సరసీరుహము** సం. వి. అ. న. సరసిజము.

**సరసీరుహము** సం. వి. అ. పుం. బెగ్గురుపక్షి.

**సరసు** విశ. (తు. సరసు.) రుచి గలది, స్వాదువు, గాటు తక్కువ కలది, ఆకృతిలోఁ బెద్దది.

మ. సరసారస్వత పట్టభద్రులు కవుల్ వర్ణించి వర్ణించియున్, సరసావంతయుఁ గానలేరు తుద యోషావిభ్రమాంభోధికిన్. పాండు, 5. 215.

**సరసు** అ. క్రి. 1. సరదు, పంచు. (సమముగాఁ బంచు అని శ. ర.)

సీ. స్తనభార మొక్కంత సరసుక వచ్చెద నని గబ్బి చనుగుబ్బ లంటు నెవరు. దశా. 8. 81.

తే. జంత యిటు లగ్గి యుండ రాజంత వచట, సరసి చెంత బిసాగ్రంబు సరసికొంత, మగని కందిచ్చు కోరి ప్రేమగని తనదు, దుండి యెడదగు లెంచి యందుండి యపుడు. సారంగ. 2. 152.

2. క్రమ్ముకొను.

**సరస్వంతము** సం. విశ. త్. 1. నీరు కలది. 2. రసము కలది. 3. అందమైనది. 4. రుచిగలది. 4. శృంగారాది రసములు గలది.

**సరస్వంతము** సం. వి. త్. పుం. 1. కొలను, 2. నదము. 3. మహిషము. 4. సముద్రము. 5. వాయువు.

**సరస్వంతుఁడు** సం. వి. త్. పుం. 1. కుబేరుఁడు. 2. రసికుఁడు. 3. తెలిసినవాఁడు.

**సరస్వతి** సం వి.ఈ.స్త్రీ. 1. పలుకుఁజెలి, వాగ్దేవత. 2. పలుకు 3. నది. 4. ఒక నది పేరు.

సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి. భార. శల్య, 2. 150.

5. ఆవు. 6. స్త్రీలలో శ్రేష్ఠురాలు. 7. మనువు భార్య. 8. దుర్గ. 9. సోమలత (వ్య. వి.). 10. జ్యోతిష్మతి (వ్య. వి.).

**సరస్సు** సం. వి. స్. న. 1. కొలను. 2. జలము

**సరహస్యము** సం. విశ. 1. మార్మికమైన, మాంత్రికమైన, అనిర్వచనీయమైన. 2. తాత్త్వికమైన, మంత్రోపదేశపూర్వకమైన.

**సరాగము** సం విశ. (అ. ఆ. అ.) 1. రాగముతోఁ గూడినది, ప్రేమ గలది, 2. రంగు గలది. 3. రక్తవర్ణము గలది.

**సరాగము** సం విశ. (అ. ఆ. అ.) 1. రాగముతోఁ గూడినది, ప్రేమగలది. 2. రంగు గలది. 3. రక్తవర్ణము గలది.

**సరాగము** వి. 1. ఒద్దిక, అనుకూల్యము. (క. సరాగ =అడ్డులేనిది; సూటియైనది. – బాట మొ. త. చరాచం =సూటియగు బాట).

"అన్నదమ్ముల సరాగము వారలదే సుమీ." విజ. వి. 1. 71.

కం. రాగము చిగురాకున కను, రాగము బొజుఁగులకు ఘనపరాగము వనికిన్, రాగము మధుకరములకు స, రాగము గృహులకును గల్గె రహి నవ్వేళన్. రసి. 2 ఆ.

2. ఒప్పిదము.

ఉ. ... ఆ చాయలకెంపు టోవరుల చందము నాచలువల్దొలంకు రే, రాయల రాయ రంగుల సరాగము నా మణికుడ్యభాగముల్. సారంగ. 2. 62.

**సరాతి** వి. గోడవలె గుడారము చుట్టు నేర్పఱచిన తెర. (శ. ర.).

మ. అమరం జుట్టు సరాతిపోల్కి వలయాహార్యం బువేలోర్వధ్ధి మహాసీమల చాలుగాలి తెరపై పెంపొంద దంష్ట్రాంకురా, గ్రముసన్ ధారుణి యొంటి కంబము గుడారంబై తగన్ ద్యావశా, రశ్మితేజోహతిఁ గందకుప్పెనఁగె మాయాదంష్ట్రి విన్నెన్నెదన్. చంద్రాంగ. 1. 76.

చం. తడవుగ నెంతయేని వడి దవ్వుఁ జరించుటఁజేసి మిత్రుఁ డబ్బడలిక దీర్పఁ జేరుటను బల్పుమదిక్పతి నిల్పు వేడుకన్, విడిది ఘటించి చుట్టు నొదలించిన చొక్కపు టింద్రగోపపుం, బెడఁగు సరాతిరీతిఁ గని పించెను దద్దిశ సాంధ్యరాగముల్. సమీర. 3. 67.

గీ. రంజిలఁగ నాతిగోడ సరాతి యనఁగ, వసన నిర్మితకుడ్యభావంబు గాను. అం. భా. 2. 157.

సీ. పాథోధిసుతవీడు పట్టుచొక్కపు గుడారంపు పొంబట్టు సరాతియనఁ ... ఉ. రా. 1. 316.

**సరాళము** సం. విశే. (రూ. సరళము).

సీ. కల్లోలడోలాసముల్లోల లీలాసరాళ మరాళ వాచాలఖురము. రామా. 5 అ.

**సరావము** సం. విశే. ధ్వని చేయునది, మ్రోగునది.

**సరావము** సం. వి. అ. పుం. 1. మూఁత. 2. మూఁకుడు; ముంత. (చూ. శరావము)

**సరాసరి** వి. వి. (సరసిన+సరి) సరిచూడఁగా నైన సమత్వము.

ఉ. ఈ కెంపులన్ని సరాసరికి ఏమి వెల ? (శ. ర.)

**సరి** సం. వి. ఇ. స్త్రీ. నీటిబుగ్గ.

**సరి¹** వి. 1. తగిన సమాధానము.

కం. వరవర యీ ప్రశ్నమునకు, సరి చెప్పఁగ రాదు వేమ సామర్థ్యముచేఁ, బరికించి నీకుఁ జెప్పెద. భాగ. 11. స్కం. 3.

2. సామ్యము; పోలిక.

ఆ. వె. అమ్మృగాక్షిఘన కటీమండలంబుతో, సరికిఁ బెనఁగవచ్చు సైకతముల, గౌరవంబు గుట్టు గాంచం గవచ్చుఁ బో, తెలియ నేరుపాటు గలిగె నేని. వరాహ. 11. 46.

చం. .... ప్రోల్ .... అలనాకపున్ సరికై పెనంగి ఆము. 2. 9.

ఉ. కాచన మంత్రిశేఖరుని గాదిలిపుత్రి హరిప్రియే కనా, శివతురాస్య కాంతలసరిన్ గణుతింపఁగ వచ్చు ... ప్రబోధ చం. 1. 11.

3. సాటి.

చం. ... ... నీకు నెవ్వరు సరి సర్వశిల్పవిభవంబున యందు సమర్థ మెందు స్వచ్ఛరుచు భవత్ప్రభావము ప్రసిద్ధముగాదె సురేంద్రపూజితా. పారి. ఉ. 2. 156.

మ. బలధారేయతలందు నీకు సరిచెప్పన్ నీవకా కెవ్వరుం, గలరే యన్యులు గంధవాహభువన ఖ్యాతంబు నీవిక్రమం, బలఘున్యూర్తియుతుండవు. పారి. ఉ. 2. 172.

మ. సరి లే రీజలరాశివేష్టిత మహీచక్రంబు నవ్విక్రమా, సరి గాండీవికి. కాశీ. 1. 53.

సీ. వెలదులు పదియాఱు వేవురలో నెన్న సరిలేదు సౌభాగ్యగరిమ నీకు. పారి. 1. 58.

**సరి²** (సం. సరః) వి. దండ; (పూవుల) దండ; సరము.

సీ. కురులు మవ్నగ దువ్వి కొప్పు వెట్టునె గాని తోరంపువిరిసరుల్ తుఱుమఁబోదు. దశా. 4. 58.

కం. విరితేనె మే సరులకున్, హరినీలఁపుసరుల కురులకళికురుల్, గురులై వెడవిలుతుని బెడ, గురులై తగు వెమ్మిపురుల కొకదాఁపరులై. చంపూ రా. 3. 75.

కం. తా రెట్టట్లుగఁ దమ్ముం, జేరిన ముత్తెంపు సరులఁ జేదిన చన్నుల్, లో రెంట లుడిపె.... ఆము. 5. 23.

వ. సన్నజాజివిరులసరుల సిరులం గడలుకొని. ఉ. రా. 4. 163.

గీ. ఇరులసరులను బెన్నెలు లిరువుకొనఁగ. ఉ. రా 1. 254.

సీ. భుజగమధ్యమునఁ బ్రాలు భుజగహారంబులు, గుచ్ఛపూగుచ్ఛ [illegible] హం. 7. 41.

"ముత్యాల సరులతో ముద్దుగుఱిసె". శృం. నై. 2. 118.

సీ. సీతాంబుజాతాక్షి చెలువవ్వుఛాయతో సవరైన విరిమల్లె సరులు కొన్ని. ఉ. రా. 6. 29.

సీ. తెలిముత్తియపు సరుల్ దిద్దునెపంబున, గుబ్బచన్గొగడలఁ గోరఁ జెనకి. నీలా. 3. 108.

ఉ. వియన్నదీ నవాంభోరుహనాళ మాత్రములఁ బొందుగ దీని లతాంతము ల్సరుల్గా రచియించి నిండఁ గుతుకంబున వీఁగు మెఱుంగు బ్రోవ్వైరన్. పారి. 1. 8.

తే. విరులసరు లిచ్చె నొక యరవిందగంధి. పారి. 2. 12.

2. సమయము. వ్యవ. అతఁ డీసరికి రావలసినదే.

సరి సం. విశే. (సం. సదృశమ్; ప్రా. సరి. త. చరి. క. సరి) సమము; పాటియైనది.

కం. సురసిద్ధ మునీంద్రతపశ్చరణలు నా తపము తోడ సరి గావంటిన్. భార. 3, 216.

కం. మనవీటన కాదయ్యర్జునునకు సరివింటివానిఁ జూడఁగ లోకంబున నెందు లేమిఁ దెల్లంబు. భార. ఉద్యో. 2. 167.

2. సమానము.

చం. దురమున బంధుమిత్రులకుఁ దోడ్పడు పెంపును ధాత్రియెల్ల భూసురులకు నర్థి నిచ్చుటయు మారి జముల్ సుకృతంబు లెన్నుచోఁ, సరియుగఁజేసి చెప్ప దురు. భార. ద్రోణ. 3. 231.

ఉ...ధారాసలిలప్లవం బఖిలరంజకమై యొలయంగ జేయవే, నీసరి యెవ్వఁడిప్డు విధి నిర్దయుఁడై నవశంబె యేలికిన్. హరి. పూ. 9. 156,

సీ. సరిసిద్ధ్యసిద్ధులు సమలోష్టకాంచనమై యుండు. భార. శాం. 5. 225.

చం...బ్రహ్మభావనా, జనత ఘటింప దీని సరినమ్యగుపాయము లెందు లేవు. భార. శాం. 5. 632.

చం...చైద్యవసుధావరముఖ్యనృపుల్ ఫణీంద్రభో, గము లన నొప్పు బాహువులు గల్గిన నిమ్న భజించు గోపికల్. క్రమమున నేమునున్ సరియకామె భవత్కృపఁ బంకజోదరా! భాగ. 0 స్కం. ఉ. 1. 110.

సీ. పరశురామునకు మేల్సరియైన తనయందుఁ గలిగె భంగంబు శిఖండిచేత. భార. భీష్మ. 1. 47.

కం. దానంబునఁ గర్ణుని సరి, మానంబున పేర్మి ననుపమానుఁడు. హరి. పూర్వ. 1. 131.

సీ. చిరమరలకుఁ జొరక నిందాస్తుతుల్ సరిగఁ గొనుచు. భార. శాం. 1. 58.

కం. హరి యిట్లు సతులనందఱి సరిగాఁ జూచియును. పారి. 1. 41.

గీ. ప్రాణనాథునిసరియె యే బంధువులును. కాశీ. 2. 82.

గీ. భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె. మను. 1. 66.

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కటి పెద్దధృతిన్ భుజంగమ, స్వామికి మేలుచేయి పటువాగ్విభవంబున బుద్ధిసంపదం, దామరచూలికిన్ సరి ప్రధానులు దక్కినవారు పాటియే. శృం. నై. 1. 28.

3. అనుకూలము, తగినది.

సీ. హరి తమ్ము వంచించె సరివేళగా దని దైత్యులు చేనిరి పాతాళమునకు. హర. 6. 129.

మ....తదీయధ్వనిన్, సరిగాఁ గైకొనియె న్వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్. వసు. 1. 180.

4. యుక్తము, సమంజసము.

శా. కారుణ్యంబున నమ్మహీసురుఁ డొగిన్ ధర్మార్థకామక్రియాచారంబుల్ సరిగాఁ జరించి తుద మోక్షశ్రీ నపేక్షించి. విక్ర. 1. 194.

5. సమర్థత గలవాఁడు.

కం. ఆ యజుని చక్కఁదన మిఁక, నా యజుఁడే యెఱుగుగాని యవనీస్థలిలో, నే యజనీయు లెఱుంగరు, కాయజుఁడైనను నుతింపఁగా సరి యగునే. ఇందు. 4. 38.

6. సమాప్తము.

సీ. చదివిన చదువులు సరి శరీరముతోనె తలఁపులు ముడిచినందముక నుండు. నీతిశ. 48,

3. చేయు.

కం. అనింద్యమతి వసుమతి, ధవగుర్వాదేశము నను దా నెద్దానిన్, సవరించిన నది యిష్టము, నని లంబత వొసఁగు ఁదియము వలదెందున్. రాఘ. 1. 51.

సీ. నానాథునకుఁ బ్రణామంబు సవరించి విశ్వనాథునకును వినతి సలిపి. వాల్మీకి. 2. 40.

4. సంగ్రహించు.

సీ. పాపాత్ముఁ డొకఁడోయ పశుల వధియించి తినియును జెక్కుమ్మిగొనియు నదియ, బ్రదుకుగా దానికి బహు సాధనంబులు సవరించుకొని మహాటవిఁ జరింప. భార. శాం. 3. 307.

5. అనుభవించు, పొందు.

కం. శ్రవణమున నుపవసించుచు, నవహితభక్తులను గృష్ణు నలినాక్షుని గేశవుఁ బూజించిన మనుజులు, సవరింపుదు రిహపరైకసౌఖ్యము లెల్లన్. శివ. 5. 238.

కం. భవదంఘ్రిదూరునకుఁ బుణ్యవనతి మలభంజ వెలితునయ్యర్థవంబుల్, సవరింప యుష్మదర్పా, ప్రవణమతిం జేయు నన్నుఁ బరధామపతీ. పాండురంగ. 4. 90.

6. చక్కఁబఱచు, సరిచేయు.

చం. ప్రిదిలినసీవిఁ గేల సవరించు తలోదరి నోర్తుఁ గాంచి లోఁగదరిన పావకిఁ బడి. వైష. 3. 86.

ఉ. ...చ, స్నిగ్ధవల జోలుకొప్పు సవరించుచు పిడిన కొప్పుఁ బల్మఱుం, జేవెటఁ బోవుచుం బలికెఁ జెందొవ చూపులు క్రేళ్లుదాఁటఁగన్. పారి. 4. 57.

7. కలిగించు.

సీ. వీ ధర్మ్యబాహోధరాధరాభోగంబు భోగంబు సవరించు భూమినతికి. వసు. 1. 30.

సీ. నాలుగు వాకిళ్ళ నలువంద వేడుకల్ సవరించు ముత్యాల చవికెయైన. రామా. 6. 129.

8. ధరియించు, తాల్చు.

చం. కలన మలంది క్రొమ్ముడిని గమ్మవిరు ల్సవరించి. పారి. 5. 56.

సీ. కమికి పాముఁదోడి సాగరం బొల్లక సవరించు బంగారుకచ్చిదములు. హం. 5. 5.

9. వహించు, చేకొను.

సీ. కచ్ఛపి యనుపేరఁ గరము శోభిలు వీణె సవరించి జగదంబ శారదయును. కళా. 2. 61.

10. పూను, (కోపము) వహించు.

2. సవతి పట్టున నీవు సవరింప కేవట్ల గారాబమునఁ జెంచువారు లేరె. సారంగ. 3. 47.

సీ. తమ తండ్రి శుంభపాదమునిఁ బంపిన యీర్ష్య సవరించి తత్స్వామి శంఖశబకుఁ, దమవాఁడు మత్తభమై శాలుమీటి. సమీర. 2. 77.

11. సమకూర్చు.

కం. నవనవ వివయముఁ బల్కుచు, నవనతగతిఁ దోడితెచ్చి యాతిథ్యంబుల్, సవరించిన నమ్ముని పతి యది గైకొన కనియె. చంద్రభా. 3. 22.

12. రచించు, నిర్మించు.

కం. భువనంబులు మెచ్చఁగ నైశవ, యానవనంధి నప్త సంతానములున్, సవరించె నానితెవ్వరు నవతు సుధాంధములు దక్క సర్వంసహాపైన్. వరాహ. 1. 88.

13. చక్కఁజేయు, సరిపెట్టు.

సీ. ధనమున కెన్నినా శ్చిదగానియెడు చెప్పు మంతలో నవరింపకుండిన శాపమిత్తు. మార్క. 1. 170.

సవరించుకొను స. క్రి. 1. సిద్ధము చేసుకొను.

కం. మును సహదేవుం డెగవం, జనినప్పుడ యొండు దేరు సవరించుకొనంగమట నదివేర్చి యతనిం, గొనిపోయెను సంగరమునకుం దొలఁగంగన్. భార. కర్ణ. 2. 367.

2. చక్కఁబఱచుకొని.

వ. అంత వసంతుఁడు ... మూర్ఛిల్లిపడి క్రమ్మఱ సచేతనుండై తన్నుం దాను సవరించుకొని. కుమా. సం 5. 570.

3. చేసికొను.

ద్వి. ధనశాతు,సిరంగధరుని నల్లునిగ సవరించుకొన్న యాజగదేకవీరుండు. ద్వి. పరమ. 5.441వ

నవరింత వి. నవరించుట.

నవరింతసేయు స. క్రి. (నవరింత+చేయు) నవరించు, చక్కఁబఱచు (శ. ర.).

చం. పొదువుగఁ గాంచికాగుణ మొయారముగా నవరింతసేయు నా, వెరపునఁగేలఁబోకముడి వీడెనె. రస. 2. గుచ్ఛము.

నవరిల్లు అ. క్రి. ఒప్పు.

సీ. నవరిల్లు నెచ్చోట నగడగ్గరగనీక, సంతత యౌవన సౌష్ఠవంబు. కాశీ. 228.

ద్వి. నవపుష్పగంధముల్ నలువొప్పఁ దెచ్చి, నవ రిల్లఁ బుప్పొడిఁ జల్లుచుమండ. రం. రా. ఉ. కా. 67. 11 పం.

నవరు విశే. చక్కని, అందమైన.

సీ నవ్వుననరు మొవ్వ నవరైన విఱు దొప్ప అలిక కనక కుండలములు వొప్ప. వీర. 1. 177.

సీ. లవలీదళములట్ల నవరైన చెక్కులు వాడు వాఱఁగ ముద్దులాడి యాడి. ఉ. రా. 4. 217.

చం. నవరగు నొక్కయద్దమునఁ జయ్యన జూచి కపోలబింబితుం,డవు వృపుఁ గాంచి సిగ్గు మెయి వంతట నివ్వెఱవోయె నెంతయున్. కవలి. 5.35.

సీ. నవరైన రతనాల బవిరెకమ్మల నిత్తు నవి నీకు మననురావంటివేని, యాణిముత్యమ్ముల హారమ్ము లొసఁగుదు. హంస. 2. 87.

ద్వి. నవరైన వల్లిపూవులపేరు. ద్వి పరమ. 3, 14 పు.

నవరుచే(ర్చు) స. క్రి. 1. కూర్చు. 2. చిత్రించు.

కం. జనకుఁడు భువిఁగల ప్రాయవు, జవవతులం బటములందు నవరిచి యమఁగుం, దనయ కడ కనువ నితరము, గనవొల్లదు నీపటంబెకాని మురారీ. ముకుందవి. 2. 123.

సీ. నమరోయి వన వంటుకొని ఘుమ్మురన జాంబ వతి నవర్చిన వల్లెవాటు మెఱయ. ముకుందవి. 1. 50 పు. 4. పం.

నవరేయి వి. (నవము+రేయి) అర్ధరాత్రము.

సీ. సంజెప్రొద్దున నుండి నవరేయి గడవ నమ్ము తమ్ములఁ గొల్చి సంపసించు. పాండు రంగ. 5.28.

ద్వి. నవరేయిమైఁ జొక్కి చల్లి సంధించి తివుటమై రొంగిల తెమ్మని మఱిగి. ద్వి. పరమ. 6. 488.

ద్వి. దొంగను నాతోడి దొంగలు మీరు, దొంగిలుం డని గడిదొంగయై కారి, నదనముల్ నొరఁబాఱి నవరేయి యాలఁ బిదికి వెండియు నదరు తెమరింత శేష. ఆ. ను. క. 1. 32. పుం. 25. పం.

నవర్ణనము సం. వి. అ. న. భిన్నాంకములను తుల్య లవములు గల వానినిగా మార్చుట.

నవర్ణము సం. విశే. 1. తుల్యవర్ణము గలది. ఒకే రంగు గలది. 2. పోలినది, సరూపము, 3. ఒకే కులమునకుఁ జెందినది. 4. ఒకే జాతికిఁ జెందినది, సధర్మమైనది. 5. తుల్యాస్య ప్రయత్నమైన వర్ణము.

నవనవ చూఛాయ, మెల మెల్ల.

వ. నా దౌష్ట్యంబు నవనవగాఁ దెలిసెఁ. మను. 5. 27.

వ. జానకీరూప్యంబైన రథంబునున్. గనుంగొని పురజనములు గుంపులు గూడుకొని నవనవగా నివ్వ మనము విన్నది నిజంబై తోఁచుచున్నది. ఉ. రా. 6. 843.

2. క్రమక్రమము.

చం. నవనవగా వెలింగి తమజాతుఁడు నేనును మందఁ గొల్చులో, దివిజవిభుండు లేవగఁ దెచ్చి కొనన్ శిలి యల్కఁ జాడ గైతవమునఁ బిల్వనంపి నమఁ దప్పక చూచుచు సొమ్ములెల్ల, మ,క్కువ నొసఁగున్ జరుక్కురని కోడలి జుంకెనచే నవల్చు చున్. కువల. 4 173.

చం. నవనవ దీపపంక్తులు వెనన్ దెలుపెక్కఁ దలంప మిత్రులన్, దవిలిన యాత్రి దెందములఁ దాల్చితె స్నేహదశానువర్తనల్, ప్రబంధ. 1. 118

3. కొంచెము, అత్యల్పము.

కం. అని విన్నవించి యతఁ డో. జనార్దన ? యిప్పు డేను నవనవగా నేర్చిన పాట యొక్క గీతము, వినిపించెద. చంద్ర. 1. 124.

4. సంభ్రమము, తొట్రుపాటు.

**సవితర్కము** సం. విశ. (అ. అ. అ.). ఆలోచనము గలది.

**సవితృఁడు** సం. వి. ఋ. పుం. సవిత.

చ. ... జట్టల మనుఁ క్రూర వృత్తికిఁ గడంగుడురే సవితృఁడు ... భా. అను. ౨ 281.

కం. భువనైక దీపకుఁడగు, సవితృనకుఁ దమాజ మఱియు. భా. ఆది. 7. 80.

**సవిత్రము** సం. విశ. సూర్య సంబంధమైనది.

**సవిత్రము** సం. వి. అ. న. ఉత్పత్తి కారణము.

**సవిత్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. తల్లి, 2. ఆవు.

**సవిత్రియము** సం. విశ. సూర్య సంబంధియైనది.

**సవిధము** సం. విశ. 1. సమీపమైనది. 2. ఒకే విధమైనది.

**సవిధము** సం. వి. అ. న. చేరువ, సమీపము.

**సవినయము** సం. విశ. వినయముగలది, విలాసము గలది.

**సవిభ్రమము** సం. విశ. ఒయ్యారము గలది, విలాసము గలది.

**సవిమర్శము** సం. విశ. సవితర్కము.

**సవిలాసము** సం. విశ. (అ. అ. అ.). సవిభ్రమము.

**సవిశేషకము** సం. విశ. 1. భేదకలక్షణములు గలది. 2. వేఱుచేయఁబడినది.

**సవిశేషకము** సం. వి. అ. న. 1. భేదకలక్షణము. 2. ప్రత్యేకధర్మము.

**సవిశేషము** సం. విశ. 1. ప్రత్యేక గుణములు గలది. 2. వింతయైనది. అసాధారణమైనది. 3. విలక్షణమైనది. విశిష్టమైనది. 4. ఉత్కృష్టమైనది. శ్రేష్ఠమైనది. 5. భిన్నమైనది. వేఱైనది.

**సవిస్తరము** సం. విశ. వివరములతోఁ గూడినది, మాహాత్మ్యములతోఁ గూడినది, సమగ్రమైనది.

**సవిస్మయము** సం. విశ. 1. ఆశ్చర్యాన్వితమైనది. 2. సందేహము గలది.

**సవుఁడు** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు, చంద్రుఁడు.

**సవురు – సౌరు** వి. 1. అందము, ఒప్పిదము, వైభవము.

ఆ నవ్వుఁబువ్వునవ్వు జవ్వని నాసిక, చివురు సవురు జవురు నవిదమోవి, మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోక వతి వేణి, మెఱుపు నొఱపుఁ బఱవుఁ దెఱవ మేను. విజ. 1. 84.

చం. చలువలఱేఁడ నీసవురు సన్నము గాని ... నిందురాకుమీ. నీలా. 2. 20.

సీ. అవికఁ బూన్చిన శీల సవురొందు గండములందిత చందంబు వందమయ్యె. ఉ. రా. 6. 118.

ఎ. గీ. ... అవయవంబుల సవురు రాజాధిరాజ, చర్యలను బోల ... దశా. 2. 273.

2. కాంతి.

కం. చివురావాతెఱ నల్లని. కవురా నునుసోఁగ వెండ్రుకలు వుత్తడిమేల్, సవురా దేహము ముద్దుల, దవురా యని జనులు పొగడ వాలిడ యమరున్. హంస. 3. 193.

3. నిగ్గు, సారము.

తే. గీ. అవుర శృంగార రసములో సవురు దీసి, నేర్పున నొనర్పఁ బోలునీ నేత ధాత, లేక నేతాదృశ విలాసలీల గనునె, దానవారాతి మానినీ మానహేతి. ముకుందవి. 3. 236.

4. విధము.

కం. నవపల్లవానురక్తిం, దవిలెడు కొమ్మల రమించఁ దమ కిది యుచితం, బవునె యని కడఁక వరిగెడు, సవురునఁ గాఁ రాకులురివె సకి కనుఁగొంటే. సమీర. 1. 124.

వ. కురువేరు సవురున గుబాళించు మరువంపు వలపులతో. ఉ. రా. 6. 24.

**సవృద్ధికము** సం. విశ. వడ్డీకలది

**సవేశము** సం. విశ. 1. సమీపమైనది. 2. అలంకృతము, పరిష్కృతము.

**సవైలక్ష్యము** సం. విశ. 1. అసహజము, కృత్రిమము, బలాత్కృతము. 2. భీతము, లజ్జితము.

**సవ్యపేక్షము** సం. విశ. (అ. అ. అ.). ఒకదానికి సంబంధించినది, ఒకదానిపై నాధారపడినది.

**సవ్యభిచారము** సం. వి. అ. పుం. (తర్కమున)

వేశ్యాభాసము నందలి యైదు ప్రధాన విభాగము లలో నొకటి. అనైకాంతిక మను దోషము.

సవ్యము సం. విశ. (అ. ఆ. అ.). 1. ఎడమ. 2.కుడి. దక్షిణము, 3. ప్రతికూలము.

సవ్యసాచి సం. వి. న్. పుం. అర్జునుఁడు.

సవ్యాజము సం. విశ. (అ. ఆ. అ ). 1. కృత్రిమము, కపటము. 2. మిషతోఁ గూడినది, ప్రయోజనా పేక్ష గలది.

సవ్యాపారము సం. విశ. (అ. ఆ. అ). 1. క్రియాత్మ కము. 2. నియుక్తము, ఉద్యోగవంతము.

సవ్యుఁడు సం. వి. అ. పుం విష్ణువు

సవ్యేతరము సం. విశ. (అ. ఆ. అ.). కుడి. దక్షిణము.

సవ్యేష్ఠ సం వి. ఋ. పుం. సారథి.

సవ్యేష్ఠుఁడు సం. వి. అ. పుం. సారథి.

సవ్రీడము సం. విశ. అ. ఆ. అ. 1. లజ్జగలది. సిగ్గుపడినది.

సవ్వడి (సవ+వడి) వి. జాడ (స్వార్థమునవడి)శ. ర

సశబ్దము సం. విశ అ. ఆ. అ. 1, ధ్వనిచేయునది. 2. ప్రకటింపబడినది.

సశల్యము సం విశ. (అ ఆ. అ.) 1. ముండ్లుగలది. 2. శరములులేక ముండ్లుగ్రుచ్చుకొనునది. 3. కష్ట మైనది, బాధలతోఁగూడినది.

సశస్య సం. విశ. ధాన్యము నుత్పత్తి చేయునది, ధాన్యముకలది.

సశస్య సం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన ప్రొద్దు తిరుగుడుపూవు.

సశ్మశ్రుకువు సం. విశ. ఉ. ఉ. ఉ. గడ్డము, మీసము గలది.

సశ్మశ్రుకువు సం. వి. ఉ. స్త్రీ గడ్డము, మీసములుగల స్త్రీ.

సశ్రీకము సం. విశ. (అ ఆ. అ.) 1. సంపదగలది, శుభముగలది, అదృష్టముగలది. 2. ముచ్చటైనది, అందమైనది.

ససందేహము సం.విశ. (అ.ఆ.అ.) సందేహము గలది.

ససందేహము సం. వి. అ. పుం. ఒక యర్థాలంకారము చూ. స దేహము

ససంధ్యము సం. విశ. అ. ఆ. అ. సాయం కాలము, సంధ్యకు సంబంధించినది, సంధ్యలందు సంభవించు నది.

ససంభ్రమము సం. విశ. అ. ఆ. అ. తొట్రుపాటు, తొందరకలది, కలవరపడినది.

ససత్త్వ సం. వి. ఆ. స్త్రీ. గర్భవతి.

ససత్త్వము సం. విశ. (అ. ఆ. అ ; 1. బలముగలది, వీర్యముగలది, 2. గర్భము ధరించునది. 3. జంతువు లతో నిండినది, ప్రాణులతో నిండినది.

ససనము సం. వి. అ. న. బలిదానము. అర్పణము, త్యాగము.

ససాధ్వసము సం. విశ. అ ఆ. అ. బెదరినది, భయపడినది, భీరువైనది పిరికిది.

ససి[1] విశ. నిగ్గుగలది.

వ. ససిమెఱుంగు ముత్తంబులు. మను. 3. 28.

ససి[2] క్రి. విశ. బాగుగ.

ఉ. నీటను దేమయొక్క ససినిల్పి యొకింతుక వాటి ధృతి,పాటవ మొప్ప వతం డొనర్చు నప్పాటునఁ జెన్నుమీఱ పరిపాటిగఁ గెంజిగు రెక్కడక్కడన్, మోటకలెత్తి క్రొవ్విరులు మొగ్గలు వెగ్గలమయ్యె నయ్యెడన్. విక్ర. 2. 23.

మ. విను వాక్యింతయులేక తాపనలయున్ వీని వృథాకాలమున్, ససిఁజక్కంగఁ క్రియుండు వర్ధిలుటకై నాశీకవత్రాతుకిన్. కాశీ. 1. 73.

ససి[3] వి. 1. బాగు.

చ. దొసగులు వచ్చువేళ గుణధుర్యులధైర్య గుణంబు సర్వముం, బసచెడు వంచుఁ జూపెదవు పాపపుదైవమ యీదురాగ్రహ, వ్యసనము మాను మాను ప్రళయంబున వీతనిజక్రమంబులై ససిచెడ వించుకంతయును సాగరముల్ గులపర్వతంబులున్. భర్తృ. 1. 90.

2. విధము.

తే. అర్ధచంద్రత సమయంబునలర మించి, పూర్ణ తను జెందు ససిని యప్పుడమిఱేఁడు, యావరా జ్యోత్తరమునందు నాధి రాజ్య, మంది వాపియించి మిక్కిలి యంద మందె. రఘువం. 7. 65.

3. నిగ్గు.

చ. ... అ, త్తింటిని యొప్పుమీఱ పసిడిరవ మారుని వాలుపోలికన్. కృ. శకు. 2. 172.

4. ఆరోగ్యము.

**ససి⁴** వి. (వైకృతము) (సం. సస్యా. క౦. ససి) పైరు, సస్యము.

కం. ఖండించి వేఱ యొకశశ,కాండంబున వాని తలయు ఖండించె మణి,మండల కాంతుల వసుధా, ఖండంబున రత్నకోరకవు ససులెత్తన్. మద. 5.18.

సీ. పసుఁగంప తొడుగు లిడ్చిన మొల్క ససియయ్యె, గగనంబుతో రాయు కావనములు ...

తే. కమల సంభవవరదాన గర్వితాసు, రవర పట్టణ నిర్భరాక్రమణ విక్రృతి .... పాండురంగ. 5. 128.

కం. ఒనఁగి రగస్త్యాబ్ధిముఖం, గొనరి జమల్ వార్ధి నీరు గ్రోలితి వినిన్, ససికై మాకిమ్మని కన్నీ నరుఁడు గంగావ నర్పగించెడు మాడ్కిన్. ఆము. 5. 127.

సీ. అసమాయుధుని కీర్తి ససులకైవడి మల్లికా కుంజవితతి మొగ్గలు దనర్చె వైజ. 292. (శ్రా. పా.).

ఎల్లకడల మెలఁగుచే ససినెల్ల మేయుచు. నీలా. 2. 43.

చం. చక్కనిమింట నేగునెఱచందురు జింక నవేందు కాంతవుం, జక్కటిఁ దోఁచు రత్నమయ సౌధము లందుఁ గిరీటి పచ్చఱా, మొక్కల డాలు పేరి ససి మొత్తము నిచ్చలుఁ జొచ్చి మేతకై, ద్రొక్కవటంచు బందిచొరఁ దోలెఁ బురేందిర నాఁగరా కలన్. చంద్ర. చ. 63.

**ససియాడు** (క, ససి) దే. అ. క్రి. చెల్లచెదరుగా విసరి వేయు.

సీ. గజయూథముల......భీషణాకారములు దాల్చి పెచ్చు వెఱిగి చంపి ససియాడి రొక నిమిషమున సమయ. కుమా. సం, 12. 88,6.

**ససులెత్తు** అ. క్రి. మొలకెత్తు, అంకురించు.

ద్వి. సిరులఁ జూపట్టు కానికములు గట్టి, సరస రత్నముల మూసకము లమర్చి, ససులెత్తునగువుల సయ్యాటయాడు నొసపరి నెమ్మోము సొకగొంత సంగీ. అ, మ క. 5. 263 పు. 5 పం.

**ససువు** విశే. సాఘువు.

సీ. మంచివాఁడు ససువు మంచి సాదువన సజ్జనుం డొప్పు. అం. శా. 2. 170.

కం. అసురుల మాయోపాయలు, గసినుసఁగఁగవఁట మఖంబు గావఁగ వఁట ! శా. పసుఁ డొకఁడఁట ససువులఁ గ్రొన్ననువుల నడిగె నట మునులు నిర్లోమపులశా. రామా, 4. 8.

**ససువు** స. క్రి. విజృంభించు, ఖండించు.

**ససేమిరా** అవ్య. మొండి పట్టుదలను సూచించు పలుకు.

వ్యావ. ఎంత చెప్పినా వాడు ససేమిరా నేను రానన్నాడు.

**ససైన్యము** సం. విశే. (అ. ఆ. అ) చతురంగ బలముతోఁ గూడినది.

**సస్కాని** వి. రెండు డబ్బుల నాణెము. (శ. ర.)

**సస్పృహము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కోర్కె గలది. 2. ఆశ గలది. 3. అభిలాష కలది.

**సస్మితము** సం. విశే. (అ ఆ. అ.) చిఱునవ్వు గలది. మందహాసముతోఁ గూడినది.

**సస్యకము** సం. విశే. (అ ఆ. అ) మంచి లక్షణములు కలది. గుణవంతము, శుభము.

**సస్యకము** సం. వి. అ. పుం. 1, ఖడ్గము. 2. ఆయుధము. 3. ఒక విధమైన రత్నము.

**సస్యప్రదము** సం. విశే. (అ. ఆ. అ.) సారవంతమైనది. 2, చక్కని ఫలము నొసఁగునది.

**సస్యమారి** సం. విశే. (స్. జీ. స్.) పైరును నాశము చేయునది.

**సస్యమారి** సం. వి. స్. పుం. ఒక విధమైన ఎలుక.

**సస్యము** సం. వి. అ. న, (రూ. శశ్యము) 1. పైరు. 2. వృక్షాది ఫలము. 3. ఆయుధము. 4. సుగుణము, శుభలక్షణము. పుణ్యము.

**సస్యసంవరము** సం. వి. అ. పుం. సాలవృక్షము.

**సస్యేష్టి** సం. వి. ఇ. స్త్రీ. క్రొత్తపైరు పంటకు వచ్చు సమయమున చేయు యజ్ఞము.

సస్వేద సం. వి. అ. స్త్రీ. అప్పుడే చెఱచఁబడిన కన్య.

సస్వేదము సం. విశే. చెమటచేఁ దడిసినది, చెమర్చినది.

సస్యెము వి. (సం. సస్యం) పైరు, సస్యము

సహ సం. అవ్య. సాహిత్య బోధకము.

కం. మీరును గుంతియు సహ వసి,వార మహామాత్య కృత్యపరులరై. భాగ. ఆది. 6. 188.

సహ సం. వి. అ. స్త్రీ. 1. భూమి. 2. చేమంతి (వృ. వి.) 3. చిన్న గోరంట. (వృ. వి.) 4. పిల్లిపెసర (వృ. వి.).

సహ సం. వి. స్. పుం. 1. మార్గశీర్ష మాసము. 2. హేమంత ఋతువు.

సహ సం. వి. స్. న. 1. వెలుఁగు, తేజస్సు. 2. బలము, శక్తి. 3. జయము. 4. ఔద్ధత్యము. 5. జలము.

సహకరించు సం. అ. క్రి. తోడుపడు, కలిసి పని చేయు.

సహకారభంజిక సం. వి. అ. స్త్రీ. ఒక క్రీడా విశేషము.

సహకారము సం విశే. "హ" కారముతోఁ గూడినది.

సహకారము సం. వి. అ. పుం. 1. తియ్య మామిడిచెట్టు 2 కలిసి పని చేయుట. 3. తోడ్పాటు, 4. ఐకమత్యము.

సహకారి సం. విశే (స్. జీ. స్.) తోడు పడునది, కలిసి పనిచేయునది.

సహకృతము సం విశే. (అ. ఆ. అ.) సహకరింపబడినది, కలిసి చేయఁబడినది.

సహకృత్తు సం. విశే. త్. సహకరించునది.

సహకృత్తు సం. వి. త్. పుం. సహాయుఁడు, తోడివాఁడు, కలసి మెలసి యుండువాఁడు.

సహగమనము సం. వి. అ. న. 1. కూడఁబోవుట 2 భర్తతోఁగూడ చితిఁజొచ్చుట. (దీని సాగుమానము అందురు).

సహచరము సం. విశే. (అ. ఈ. అ.) 1. వెంటఁబోవునది 2. కలసియుండునది.

సహచరము సం. వి. అ. పుం. 1. హామీ. కురువ. 2. పచ్చపువ్వుల ములు గోరింట.

సహచరి సం. విశే. వెంట వచ్చునది.

సహచరి సం. వి. ఈ. స్త్రీ. 1. స్నేహితురాలు, చెలికత్తె 2 భార్య. 3 పచ్చపువ్వుల ములుగోరింట

సహచరితము సం. విశే (అ. ఆ. అ). 1. వెంటను డునది. 2. కూడియు డునది. 3. ... యు డునది.

సహచరుఁడు సం. వి. అ. పుం 1. వెంటను డువాఁడు. 2. మిత్రుఁడు. సహాయుఁడు. 3 సేవకుడు, అనుచరుఁడు. 4. భర్త.

సహచారము సం వి. అ. పుం. 1 అనుసరించుట. వెంటఁబోవుట 2. అంగీకారము. సమ్మతి. ఐకమత్యము. 3. (తర్కము న) హేతుసాధ్యముల యొక్క యవినాభావసంబంధము. 4. సామ్యము. 5. కలసియుండుట, విడిపోకుండుట.

సహచారి సం. విశే. న్. 1 స్వతస్సిద్ధమై పుట్టుకతో వచ్చినది. సహజమైనది. 2 వంశక్రమాగతమైనది, పైతృకమైనది.

సహజ సం. వి. అ. స్త్రీ. తోడఁబుట్టినది, పోదరి.

సహజమిత్రులు సం. విశే. ఆజన్మమిత్రుడు.

సహజము సం. విశే. (అ. ఆ. అ.) 1. కూడఁబుట్టినది. 2. స్వాభావికము. 3. జన్మసిద్ధమైనది.

సహజము సం. వి. అ. పుం. స్వభావము.

సహజాతము సం. విశే. (అ. ఆ. అ.) తోడబుట్టినది, కలిసి పుట్టినది.

సహజారి సం. వి. ఇ. పుం. అజన్మ శత్రువు.

సహజీవనము సం. వి. అ. న. 1. సంఘ జీవనము. 2. కలసి మెలసి జీవించుట. 3. మైత్రి, సాహచర్యము.

సహజుఁడు సం వి. అ. పుం. సోదరుఁడు, తోడఁబుట్టినవాఁడు

సహత సం. వి. అ. స్త్రీ. కలయిక, కూడిక, ఐకమత్యము, కలసికట్టుతనము.

సహదారుఁడు సం. వి. అ. పుం. భార్యతోఁ గూడినవాఁడు, వివాహితుఁడు.

సహదేవుఁడు సం వి. అ. పుం. పంచ పాండవులలో

చివరివాఁడు.

**సహధర్మచరి** నం. వి. ఈ. స్త్రీ. భార్య.

**సహధర్మచారి** నం. వి. న్. పుం. 1. భర్త. 2. కలిసి పని చేయువాఁడు, సాటి కార్మికుఁడు.

**సహధర్మచారిణి** నం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షిగాఁ బెండ్లాడఁబడిన భార్య.

**సహధర్మము** నం. వి. అ. పుం. సమాన ధర్మము, తుల్యగుణ కర్మాదికము.

**సహధర్మి** నం. విశే. న్. పుం. సమాన ధర్మము గల వాఁడు, పాటివాఁడు.

**సహధర్మిణి** నం. వి. ఈ. స్త్రీ. సహధర్మ చారిణి.

**సహనము** నం. విశే. ఓర్చునది.

**సహనము** నం. వి. అ. న. ఓర్పు, క్షమ.

**సహపథి** నం. వి. న్. పుం. తోటిబాటసారి, సహయాత్రికుఁడు.

**సహపాంశుకిలుఁడు** నం. వి. అ. పుం. పసితనము నుండియు గలసి మెలసి యున్న మిత్రుఁడు.

**సహపాఠి** నం. వి. న్. పుం. తోటి విద్యార్థి.

**సహభావి** నం. వి. న్. పుం. 1. మిత్రుఁడు. 2. భాగస్వామి. 3. అనుచరుఁడు.

**సహభువు** నం. విశే. (ఉ. ఉ. ఉ.) సహజమైనది, స్వాభావికమైనది.

**సహభోజనము** నం. వి. అ. న. బంధు మిత్రులతోఁ గలసి భుజించుట.

**సహమరణము** నం. వి. అ. న. సహగమనము.

**సహమృత** నం. వి. ఆ. స్త్రీ. భర్తతో సహగమనము గావించినస్త్రీ.

**సహయుధ్వ** నం. వి. న్. పుం. సాటియోధుఁడు, కలసియుద్ధము చేయువాఁడు.

**సహరక్ష (స)ము** నం. వి. న్. పుం. మూఁడు విధములైన యాగాగ్నులలో నొకటి.

**సహరి** నం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

**సహర్షము** నం. విశే. (అ. ఆ. అ.) సంతోషముతోఁ గూడినది.

**సహవసతి** నం. వి. ఇ. స్త్రీ. సహవాసము.

**సహవాసము** నం. వి. అ. పుం. కలసి యుండుట, మైత్రి.

**సహవాసి** నం. వి. న్. పుం. కలసియుండువాఁడు, ఒకయింట నివసించు వాఁడు, మిత్రుఁడు.

**సహసా** అవ్య. 1. బలాత్కారముగా 2. తొందరపాటుతో. అనాలోచితముగా. 3. అకస్మికముగా, ఏక కాలమున, 4. చిఱునవ్వుతో, స్మితముగా.

**సహసానము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఓర్పుగలది. 2. జయించునది.

**సహసానము** నం. వి. అ. పుం. 1. నెమిలి. 2. బలి. త్యాగము. 3 యాగము.

**సహస్యము** నం. వి. అ. పుం. పుష్యమాసము.

**సహస్రకరుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు.

**సహస్రకాండ** నం. వి. ఆ. స్త్రీ. తెల్లగఱిక.

**సహస్రకిరణుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు

**సహస్రతయము** నం. విశే. (అ. ఆ. అ.) వేయి రెట్లు.

**సహస్రతయము** నం. వి. అ. న. వేయి.

**సహస్రదంష్ట్రము** నం. వి. అ. పుం. వేయి కోఱలు గల చేప, పాఠీనము.

**సహస్రదీధితి** నం. వి. ఇ. పుం. సహస్ర కిరణుఁడు

**సహస్రదుఁడు** నం. వి. అ. పుం. శివుఁడు.

**సహస్రదృక్కు** నం. వి. క్. పుం. 1. ఇంద్రుఁడు, 2. విష్ణువు.

**సహస్రధా** నం. అవ్య. 1. వేయిశకలములుగా. 2 వేయి రెట్లుగా.

**సహస్రధార** నం. వి. ఆ. స్త్రీ. దేవతా విగ్రహములను కడుగుటకై పెక్కు రంధ్రముల పాత్రనుండి విడువఁబడు జలధార.

**సహస్రధారము** నం. వి. అ. పుం. విష్ణు చక్రము.

**సహస్రనయనుఁడు** నం. వి. అ. పుం. సహస్రదృక్కు

**సహస్రనేత్రుఁడు** నం. వి. అ. పుం. సహస్రనయనుఁడు.

**సహస్రపత్రము** నం. వి. అ. న. కమలము 2. బెగ్గురుపక్షి.

**సహస్రపాత్తు** నం. వి. ద్. పుం. 1. విరాట్పురుషుఁడు. 2. విష్ణువు, 3, శివుఁడు. 4. బ్రహ్మ.

సహస్రబాహు సం. వి. ఉ. పుం. 1. కార్తవీర్యార్జునుఁడు, 2. బాణాసురుఁడు. 3. శివుఁడు. 4 విష్ణువు (అని కొందఱు).

సహస్రభుజ సం. వి ఆ స్త్రీ. దుర్గ

సహస్రభుజుఁడు సం వి అ. పుం. విష్ణువు.

సహస్రము సం. వి. అ. న. 1. వేయి, పది నూఱులు 2. పెక్కు, పెద్ద మొత్తము.

సహస్రమూర్ధుఁడు సం. వి. న్. పుం. విష్ణువు. సహస్రమౌళి.

సహస్రమౌళి సం వి. ఇ. పుం. విష్ణువు.

సహస్రరశ్మి సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

సహస్రరోమము సం. వి న్. న. కంబళము.

సహస్రలోచనుఁడు సం. వి. అ. పుం. సహస్రనేత్రుఁడు.

సహస్రవదనుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రవీర్య సం. వి. అ. పుం. గఱిక. (వృ. వి.).

సహస్రవేధము సం. వి. అ. పుం. 1. పుల్లప్రబ్బ (వృ. వి.). 2. పుల్లగంటి.

సహస్రవేధి సం. వి. న్. పుం. కస్తూరి.

సహస్రవేథి సం. విశే. వేయింటిని వేధించునది.

సహస్రవేధి సం. వి. న్. న. ఇంగువ.

సహస్రశః సం. అవ్య. వేలకొలఁదిగా, వేయి విధములుగా.

సహస్రశిఖరము సం. వి. అ. పుం. వింధ్య పర్వతము.

సహస్రశీర్షుఁడు సం. వి. అ. పుం. విరాట్పురుషుఁడు.

సహస్రశ్రవణుఁడు సం వి అ. పుం విష్ణువు.

సహస్రహర్యశ్వము సం. వి. అ పుం. ఇంద్రుని రథము.

సహస్రహస్తుఁడు సం. వి. అ. పుం. శివుఁడు

సహస్రాంశువు సం వి. ఉ. పుం సూర్యుఁడు, వేవెలుఁగు.

సహస్రాక్షుఁడు సం విశే. 1. వేయికన్నులు కలవాఁడు 2. జాగ్రత్త గలవాఁడు.

సహస్రాక్షుఁడు సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు 2. విరాట్ పురుషుఁడు. 3. శివుఁడు. 4. విష్ణువు.

సహస్రాధిపతి సం. వి అ పుం. వేయిగ్రామములకు అధికారుఁడు.

సహస్రాననుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సహస్రార్చి సం. వి. స్. పుం. సహస్రాంశువు.

సహస్రావరము సం. వి అ పుం. ఐదువందలకు పైఁబడి వేయింటికిలోఁబడిన పణములజరిమానా.

సహస్రి సం. విశే. న్. 1. వేయికలది 2. వేలతోఁ కూడినది. 3. వేయి మొత్తమైనది. (జరిమానా మొ)

సహస్రి సం. వి. న్. పుం. 1. వేయిమంది యొక్క లేక వేయింటి సమూహము. 2. వేయిమందిగల సేనకు నాయకుఁడు.

సహస్వత్తు సం. విశే. బలిష్ఠము, శక్తిమంతము.

సహాధ్యయనము సం. వి. అ. న. 1. కలసి చదువుకొనుట. 2. సహాధ్యాయిత్వము.

సహాధ్యాయి సం. వి. న్. పుం. సహపాఠి.

సహాయత సం. వి. ఆ. స్త్రీ. 1. సహాయుల సమూహము. 2. కలయిక, మైత్రి. 3. సాయము, తోడ్పాటు.

ఉ. ఆమ్మెయి బంధుమిత్త్రుల సహాయత కల్మి ప్రయోజనంబు లేదు. భార. అశ్వ. 1. 118.

సహాయము సం. వి. అ. పుం. తోడ్పాటు, పోషణ. 2. ఎఱ్ఱజాతు 3. ఒక విధమైన పరిమళము. 1. తోడ్పాటు.

కం. అనుటయు నాతఁడు హరి కిట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్. భార. ఉద్యో. 1. 86.

కం. అలఘు బలవిక్రమో దాత్తులకైనను బలములేక దోర్గర్వముమై, గెలువఁగ వశమె సహాయము భాగ. 1. 15.

కం. తగిన సహాయము గలిగిన, పగతుని యెడ మొక్కలంపుఁబనిగా దనివన్. ప్రబోధచం. 1. 52.

సహాయుఁడు సం వి. అ. పుం. 1. మిత్రుఁడు, సహచరుఁడు. 2. అనుచరుఁడు, అనుసారి. 3. తోడ్పడువాఁడు, పోషకుఁడు. 4. శివుఁడు. 5. తోడైనవాఁడు.

... సహాయ ... శాస్త్ర విద, ఘనుఁ గన్న సహాయ ... భా. ఆది. 6. 6..

సహారము నం. వి. అ. పుం. 1. మామిడిచెట్టు వృ. వి. 2. సర్వనాశనము, మహాప్రళయము.

సహారిపు వి. జూదము వంటిలి పరిభాష.

ఉ. ఇంతయు నేల మీకు వెదురొక్కటిలో మునిసింబరాలు వెల్లి తుఁ గడక్ల తాఁకున వెలింబడ పారెఁ ... దత్తు ... తవ సంగ్రహంబున సహారవుతోఁ గనుమూడిపోయినం, బంతముతో దొహారమునఁ బెట్టరఁ బాసి బొమ్మ గట్టదన్. ఉ. హరి. 3. 117.

సహార్థము నం. విశ. (అ. అ. అ.). 1. సమాన లక్ష్యముగలది. 2. సమానమైన యర్థము గలది.

సహార్థము నం. వి. అ. పుం. సమానలక్ష్యము లేక ప్రయోజనము.

సహాసనము నం. వి. అ. న. ఒకే ఆసనమునఁ గూర్చుండుట.

సహి(యి)ంచు నం. స. క్రి. 1. క్షమించు.

వ. వాఁడును గడు భీతుండయి యగ్నిదేవునకు నమస్కరించి మహాపురుషా! నా యజ్ఞానంబు సహింపవలయునని. భార. సభా. 1. 255.

ఉ. అక్కమలాక్షి పొందు దగనాడితుదిన్ నిజమేది వేఁటిరే యిక్కకు రాక తక్కిన సహించునె నన్ మరుఁడు. భార. విరా. 2. 196.

2. ఓర్చు.

చం. ... విను మాతుల! మానవనాథుఁ డైన భూపతి సహింపవోపునె! సపత్నుల వృద్ధియు నాత్మహానియున్. భార. సభా. 2. 78.

దశగ్రీవదో᳚, ర్బలమైనన్ సహియింపవచ్చు. ఉ. రా. 1. 157.

సహిత నం. విశ. ఋ. సహించునది, ఓర్చుకొనునది.

సహితము నం. విశ. (అ అ అ). 1. కూడి యున్నది. కలిసియున్నది. 2. సహింపఁబడినది. ఓర్వఁబడినది.

సహిష్ణువు నం. విశ (ఉ. ఉ. ఉ.). ఓర్చుకొనునది, సహించుశీలము గలది.

సహురి నం. వి. ఉ. పుం. సూర్యుఁడు.

సహురి నం. వి. ఈ. స్త్రీ. భూమి

సహృదయము నం. విశ. (అ. అ. అ.). 1. మంచి హృదయముగలది, దయగలది 2. చిత్తశుద్ధిగలది.

సహృదయుఁడు నం. వి. అ. పుం. 1. విద్వాంసుఁడు. 2. సజ్జనుఁడు. 3. విమర్శవంతుఁడు, వివేకి.

సహేలము నం. విశ. విలాసముతోఁ గూడినది, వినోదముతోఁ గూడినది.

సహోక్తి నం. వి. ఇ. స్త్రీ. ఒక యర్థాలంకారము.

సహోఢుఁడు నం. వి. అ. పుం. 1. వివాహ కాలమున గర్భవతియై యున్న భార్యకుఁ బుట్టిన వాఁడు. (ద్వాదశ పుత్రులలో నొకఁడు). 2 దొంగిలింపఁబడిన సొత్తుతోఁ బట్టుపడిన దొంగ.

సహోదరి నం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టువు, సోదరి.

సహోదరుఁడు నం. వి.అ. పుం. సోదరుఁడు.

సహోపమ నం. వి. అ. స్త్రీ. ఒక విధమైన ఉపమాలంకార భేదము.

సహోరము నం. విశ. మేలయినది. శ్రేష్ఠమైనది.

సహోరుఁడు నం. వి. అ. పుం ముని, ఋషి.

సహ్యజ నం. వి. అ. స్త్రీ. కావేరినది.

సహ్యము నం. విశ. 1. భరింపఁదగినది, ఓర్వఁదగినది, సమర్థింపఁదగినది. 2. ఓర్వవలసినది. 3 ఓర్పుగలది. 4. సరిపడినది. సరియైనది. 5. తీయనిది, పథ్యమైనది. 6. బలమైనది. శక్తిమంతమైనది

సహ్యము నం. వి. అ పుం సప్త కులపర్వతములలో నొకటియైన సహ్యము అను పశ్చిమ సముద్రతీర పర్వతము.

సహ్యము నం వి. అ. న. 1. ఆరోగ్యము, రోగోపశాంతి. 2. సహాయము, తోడ్పాటు. 3. యోగ్యత, పర్యాప్తి.

సహ్యాత్మజ నం వి. అ స్త్రీ. సహ్యజ.

సళాది పెద్దయధికారి నౌకరు, మఱియగాని కింకరుఁడు

ఎ. గీ. ముద్రగరిటియ భుజముపై మొనయఁబెట్టి, ఘంట ఖంగని మ్రోయనంగళ్ల బడిని, మరిగితిరుగు సళాదికి మఱియకాంద్ర, కవని బడికాఁపునా వింత సళరు పంత. హంస. 2. 40.

**సళించు** అ. క్రి. దళించు.

కం. శేమా! నీ వెత మానుమ, శేమా? మోమోట
మున సళింపఁగ నిపుడే.లే? మాఱుమాట యొసఁ
గుము. నీలా. 2 ఆ. (శ. ...).

**సళిగె** (సం. సలాక. క. సలిగె) బద్ద.

ద్వి. ... అల, వట్టముల్ నిలువుల వల్లిక వెదురు
సళిగెలున్ సంబెనల్ సానలు ముగ్గు (వెదురుసల
గెల సంబెలల్ (కావు)). పండితా. పర్వత. 648.

**సళియము** వి. కలయంపి.

ద్వి. ఎల్లెడ సళియంబు లిప్పించి రంగ, వల్లులు
బెట్టించి వాడవాడలను. పండితా. మహిమా
259.

ద్వి. ... సిద్ధేశ్వ, రము నాదియవనీశ్వర స్థానము
లును, సల్లలితములుగా సళియమిప్పించి, పెల్లుగా
ముగ్గులు పెట్టంగ బంచి. పండితా. పర్వత. 668.

**సళుపరించు** అ. క్రి. వ్రణములోనగునది పోటెత్తు.

**సళుపరింత** వి. సళుపరించుట, సళుపు.

**సళుపు** అ. క్రి. వ్రణము లోనగునది పోటెత్తు.

**సళుపు** వి. వ్రణముతోనగు దానిపోటు.

**సళువు** విశే. ఘారమైనది.

**సళ్లబెట్టు** (సళ్లన్ + పెట్టు) స క్రి. సడలఁజేయు.

సీ. సనక సనందనాది నిఖిలాంతర్వాణి వ్యాల్లీన
భావంబు సళ్లఁబెట్టి. పాండురంగ. 2. 10.

ఉ. చంచలనేత్ర దాల్పు జలజాతమృణాల సరంబు
వేగ సళ్లించిన బాఱు తెంచి కబళించి ... ఆము.
5. 150.

**సళ్లు** అ. క్రి (సడలు యొక్క రూపాంతరము)
1. వెనుకకు తగ్గు.

కం. అనివదము విని యాదవ, సేవలు పొంగారె
నెదిరి సేవలు సళ్లెన్.

చం. చొరఁబడి కాంచి ప్రాంతలును చుట్టియు
గుత్తులు వ్రేసి నందిటం, బెరయగఁ బట్టి చెక్కు
గఱపించి గిరేప్పడగీచి నిల్పి కొ,క్కెరయ గఁ
జూచి పందియవు చెంకువ దిద్దుచేఁ జిక్కె వేసి
సళ్ళిలివుసి వోయట సము ఋకిదెళిష జాలు దమ్ము
లాడగన్. హా. ౯. 1. 218.
2. సళి చు, జాఱు.

తే. గీ. ఓటలో మిడిమేలపువిటుని విఘము, సాగఁ
గొన్నాళ్ళు నిజ పిత్ర సంచితంబు, బొల్లుగాఁ జల్లి
యదియెల్ల సళ్ళయుమ, దల్లడిల్లుచు దుర్మార్గ
తల్లజుండు. ప్రబం. 1. 875.

**సళ్ళు** స. క్రి. విడుచు, వదలు.

చం. కలిసిన కాటపిఁ కొడిగంబుగఁ బట్టిన వట్టు
సళ్ళఁ, త్త జీఁగిలకొట్టి వల్కు బెదిరపుఁ బెన కుద
గోళ్ళ నొక్కుచున్. చ ద్రా గ. 5 152.
చం. కలిచియుఁ గాళ్ళఁ దాచియును గట్టులు
చెట్టులు చిట్టువై చియున్, ... చిగవు సళ్ళక తోఁక
లఁ జుట్టి కొట్టియున్, వజివుఁజి యాము చేమఁ
గుల మావుల లొట్టియల. గడిదిగా, మఱుమొన
రించి హెచ్చరిక మూల్కొ వఁదేసులు పిండి సేయు
చున్. అ. రా. యుద్ధ. 181.

# సా

**సా అను ఒక అక్షరము**

**సా** సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి 2. పార్వతి. 3. దేహ
కాంతి.

**సా** వై. విశే వృత్తియందు సాము శబ్దమునకు అంత్య
వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.
(సాఁబాలు, సామేను మొ)

**సాంకర్యము** సం. వి. అ. న. మిశ్రణము, కలయిక,
భిన్న ద్రవ్యాముల కలయిక, కలగలుపు.

**సాంకలము** సం. వి. అ. న. సంకలనము వలన నేర్పడి
నది.

**సాంకలి** సం. వి. ఈ. స్త్రీ. సాంకలము.

**సాంకవము** సం. వి. అ. పుం. సంకుమదము, జవాది.

**సాంకాలిక** సం వి. ఆ. స్త్రీ. ప్రతి దినము నిచ్చెడి
వడ్డి.

**సాంకాశ్య (ము)** సం. వి. అ. స్త్రీ. అ. న. జనకమహా
రాజు తమ్ముఁడగు కుశధ్వజుని రాజధాని.

**సాంకేతికము** సం. విశ. (అ. ఈ. అ.) 1. సంకేతము లేక చిహ్నములకు సంబంధించినది. 2. సాంప్రదాయము. 3. ప్రయోగ నైపుణ్యమునకు సంబంధించినది. 4. సంకేతము వలన తెల్పఁబడినది.

**సాంక్షేపికము** సం. విశ. (అ. ఈ. అ.) సంక్షిప్తము, క్లుప్తము, సంగ్రహము.

**సాంఖ్యము** సం. విశ. (అ. అ. అ.) 1. సంఖ్యకు సంబంధించినది. 2. లెక్కించునది, గణించునది. 3. వివేకించునది. 4. పరిశీలించునది, చర్చించునది. తర్కించునది.

**సాంఖ్యము** సం. వి. అ. పుం. న. షడ్దర్శనములలో నొకటి (చూ. దర్శనములు.).

**సాంఖ్యుఁడు** సం. వి. అ. పుం. 1. సాంఖ్య దర్శనానుయాయి. 2. శివుఁడు.

**సాంఖ్యముఖ్యుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**సాంగకము** సం. వి. అ. న. ఒక చేయి మాత్రమే ప్రయుక్తమగు పసంయుత హస్తాభినయము నందలి యొక ముద్ర.

**సాంగతికము** సం. విశ. (అ. ఈ. అ.) 1. సంఘమునకు సంబంధించినది. 2. జత కూర్చునది. కలుపునది.

**సాంగతికుఁడు** సం. వి. అ. పుం. 1. అతిథి, ఆగంతుకుఁడు. 2. కార్యార్థమై వచ్చినవాఁడు.

**సాంగత్యము** సం. వి. అ. న. 1. కూడిక, కలయిక, చేరిక. 2. మైత్రి, స్నేహము. 3. ఒక సారస్వత ప్రక్రియ.

**సాంగమము** సం. వి. అ. పుం. కలయిక, సంఘము, సమావేశము.

**సాంగము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అవయవములు లేక భాగములు గలది. 2. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, అను వేదాంగము లారింటితోఁ గూడినది.

సీ. ... అపస్తంబసూత్ర పవిత్రశీలుఁడు సాంగవేదవేది. భార. విరాట. 1. 10.

సీ. సాంగంబు లగుమంద సకల వేదంబులుఁ జదివె వసిష్ఠుతో ... భార. ఆది. 4. 16?.

4. సంపూర్ణమైనది.

తే. సాంగముగఁ దండ్రి కగ్నికార్యములు దీర్చి, వివిధభంగి యథావిధి విప్రవరుల, నిష్టనిఖిలార్థ దానసంతుష్టిఁ దేల్చి, యడలు రఘువీర వనయాత్ర నాత్మ దలఁచి. రామా. 5. ?9.

**సాంగుబలా** వి. 1. వేత్రధరులు హెచ్చరిక చేయునపు డుపయోగించు పదము. (రూ. సా(ం)గుబళా.)

కం. కంచుకియు వేత్రధరు లొత్తిలి సాంగుబళా యనంగఁ దేరు డిగి. వసు. 1. 150.

ద్వి. కోతికట్టికలు సాంగుబలా యనఁగ. రం. రా. కిష్కిం. చి. ని. పా.

2. పతి విశేషము, ఎరఁగుడు.

వ. ప్రయాగ యందలి మాధవునకు సాంగుబలా గయయందలి గదాధరునకు మోడ్పు. ప్రబం. 1. 880.

రగడ. విక్రమస్థలి త్రివిక్రమ హరికిని సాలెకు సాలెకు సాంగుబళా యని. హంస. 4. 218.

**సాంగోపాంగము** సం విశ. (అ. ఆ. అ.) అంగముల తోడను, ఉపాంగముల తోడను గూడినది. సవిస్తరమైనది, సంపూర్ణమైనది.

**సాంగ్రామికము** సం విశ. (అ. ఈ. అ.) 1. యుద్ధసంబంధి. 2. కలహశీలి. 3. ఉగ్రము, ఉద్ధతము.

**సాంగ్రామికుఁడు** సం. వి అ. పుం. సేనాపతి.

**సాంఘాతికము** సం. విశ. (అ. ఈ అ) వినాశకరము, మృత్యుకరము.

**సాంఘికము** సం. విశ. (అ. ఈ. అ.) సంఘమునకు సంబంధించినది.

**సాంజనము** సం. వి అ పుం. బల్లి.

**సాంతపనము** సం. వి. అ న. మూఁడు దినములు పగళ్లును మూఁడు దినములు రాత్రులును భోజనము చేసి మూఁడు దినములు అయాచిత లబ్ధపదార్థంబులను భుజించి పిమ్మట మూఁడు దినములు నిట్రుపాసముండెడు వ్రతము. (పంచగవ్యమును కుశోదకమును పుచ్చుకొని ఒక రాత్రి యుపవాసముండుట అని కొందఱు) శ. ర.

**సాంతము** సం. విణ. (అ. ఈ. అ.) అంతము గలది. 2. పూర్ణము, పూర్తియైనది, 3. మొత్తము. 4. సకారము అంతముగాఁ గలది.

**సాంతరము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఎడము గలది, విరళమైనది, విరామములు గలది. 2. జల్లినేఁత గలది. జల్లి కూర్పు గలది.

**సాంతానికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. వ్యాపించినది, విస్తరించినది. కొనలు సాఁగునది. 2. సంతానమునకు (వంశమునకు) సంబంధించినది. 3. సంతాన వృక్షమునకు సంబంధించినది.

**సాంతానికుఁడు** సం. వి. అ. పుం. సంతానము కొఱకు పెండ్లాడఁగోరువాఁడు (బ్రాహ్మణుఁడు).

**సాంత్వన (ము)** సం. వి. అ. స్త్రీ అ. న. 1. శాంత పఱుచుట, ఓదార్చుట. 2. సంధి చేయుట, సామోపాయము, 3. సాదర వచనము. సామవచనము. 4. శాంతము, మార్దవము. 5. ఆదరము తోడి పలుకరింపు, పరామర్శ.

**సాంత్వము** సం. వి. అ. పుం. సాంత్వనము. విణ. అ. ఈ. అ. మృదువైనది, మధురమైనది, స్నిగ్ధమైనది (వాక్కు).

**సాందీపని** సం. వి. అ. పుం. ఒక ఋషి (శ్రీకృష్ణ బలరాముల యుపాధ్యాయుఁడు).

**సాందృష్టికము** సం. విణ. (అ. ఈ. అ.) తత్కాల ప్రత్యక్షమునకు సంబంధించినది. అప్పటికప్పుడు కనిపించునది.

**సాందృష్టికము** సం. వి. అ. న. సద్యఃఫలము, తత్క్షణ ప్రయోజనము.

**సాంద్రము** సం. విణ. (అ. ఈ. అ.) 1. చిక్కనిది. దట్టమైనది, ఎడము లేనిది.

సీ. తే. సాంద్రతర చంద్రికా కేళీచంద్రమములు. పారిజా. 1. 65.

2. మోటైనది, మురుకయైనది. 3. కిక్కిరిసినది. ప్రోగైనది. 4. బలిసినది, దృఢమైనది. 5. అతిశయమైనది, సమృద్ధమైనది. 6. గాఢమైనది, తీవ్రమైనది. 7. ద్రవమైనది, స్నిగ్ధమైనది, జిడ్డు గలది. 8. నున్ననిది, మెత్తనిది. మనోహరము, సుందరము.

**సాంద్రము** సం. వి. అ. పుం. 1. ప్రోగు, రాశి, గుంపు. 2. పొద, అడవి, గుబురు.

**సాంధికుఁడు** సం. వి. అ. పుం. సారాయము బట్టి పట్టువాఁడు.

**సాంధివిగ్రహికుఁడు** సం. వి. అ. పుం. విదేశ వ్యవహారములు నిర్వహించు మంత్రి.

**సాంధ్యము** సం. విణ. (అ. ఈ. అ.) 1. సాయంసంధ్యా సంబంధి. 2. ఉదయ సంధ్యా సంబంధి.

**సాంధ్యరాగము** సం. వి. అ. పుం. ఉదయ సాయంసంధ్యలకు సంబంధించిన యెఱుపు.

సీ. స్నాతకవల్కల జాతనోద్ధత కాంతి సాంధ్యరాగద్యుతి సంహరింప. ఉ. హ. 2. 111.

**సాంపరాయము** సం. విణ. (అ. ఈ. అ.) 1. యుద్ధసంబంధి, ఉద్ధతము 2. ఆముష్మికము, భవిష్యము. వి. అ. పుం. న. 1. విరోధము. కలహము. 2. భవిష్యత్తు, ఉత్తరజన్మము. 3. పరలోక ప్రాప్తి సాధనము. 4. భావిని గూర్చిన చింత. 5. విచారము, పరిశోధన. 6 సందిగ్ధావస్థ, అనిశ్చయము.

**సాంపరాయకము** సం. విణ. (అ. ఈ. అ.) చూ. సాంపరాయము.

**సాంపరాయికము** సం. వి. అ. న. యుద్ధము, కలహము.

**సాంపరాయికము** సం. వి. అ. పుం. యుద్ధ యోగ్యమైన రథము.

**సాంప్రతము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఉచితము, తగినది 2. అనుకూలము, సంబద్ధము.

**సాంప్రతికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. తగినది, ఉచితమైనది, ఒప్పయినది. 2 వర్తమాన కాలమునకు సంబంధించినది.

**సాంప్రదాయికము** సం. విణ (అ. ఈ. అ.) 1. ఆచారమునకు సంబంధించినది 2 వంశపరంపరాగతమైనది

**సాంబంధికము** సం. విణ (అ. ఈ. అ.) చుట్టఱికము వలనఁ గలిగినది.

**సాంబంధికము** సం. వి. అ. న. చుట్టఱికము, సంబంధము.

**సాంబరము** సం. వి. అ. న. సాంబరమున ఉత్పన్నమైన ఉప్పు.

**సాంబరి** సం. వి. ఈ. స్త్రీ. చూ. శాంబరి. 1. ఇంద్రజాలము, మాయ, 2. మాంత్రికురాలు.

**సాంబారు** వి. (తమిళం) ఒక విధమైన పప్పుచారు.

**సాంబుఁడు** సం. వి. అ. పుం. 1. అంబ (పార్వతి)తోఁ గూడినవాడు. 2. శివుడు. విశ. అ. ఆ. అ. తల్లితోఁ గూడినవాఁడు.

**సాంబ్రాణి**[1] వి. 1. సాంబ్రాణి చెట్టు వలనఁ గలిగెడు ధూపద్రవ్య విశేషము 2. ఉత్తమాశ్వము,
తే. "పసిఁడి పక్కెఱ తేజి సాంబ్రాణి నెక్కి" రామా. 4 ఆ. (శ. )

**సాంబ్రాణి**[2] సామ్రాణి (క సాంబ్రాణి) 1. ఒకానొక దేశము. 2. ఆదేశపు గుఱ్ఱము. విశ. సామ్రాణి దేశమందు బుట్టినది. ఆదేశపు గుఱ్ఱము.
సీ. తోరంపు సాంబ్రాణి ధూపధూమము గట్టు పగదారి జాబాలజాయఁ దీర్చి. దశావ. 1. 265.
వ. తుమ్మెదల దొమ్మెల కిమ్ముల జావు సాంబ్రాణి ధూపధూములతో. ఉ. రా. 1. 188.
తే. గీ. లలిత కలకంఠ కోలాహలంబు లెసఁగు, దళముకొని తెఱుగెడలఁ గాదంబకోటి, గొల్వరాచిల్క సాంబ్రాణి గుఱ్ఱ మెక్కి, దర్పకుఁడు పాంథజనులపై దండు వెడలె. ఉ. రా. 4. 156.
తే. గీ చిలుక సాంబ్రాణి తేజి వజీరుఁ గేరు, కమ్మ నెమ్మేన ... దశా. 9. 214.

**సాంబ్రాణివత్తి** వి. ఊఁదువత్తి.

**సాంభవి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఎఱ్ఱ లొద్దుగ (వృ. వి.). 2. సంభవత, కాఁగలది.

**సాంయాత్రికుఁడు** సం వి. అ. పుం. సముద్రము మీఁద వాణిజ్యము చేయువాఁడు, నౌకా వాణిజ్యము చేయువాఁడు, పోతవణిజుఁడు

**సాంయుగీనము** సం విశ. (అ. ఆ. అ.) యుద్ధసంబంధి, కలహశీలి, సమర కుశలి.

**సాంయుగీనుఁడు** సం. వి. అ. పుం. యుద్ధ వీరుఁడు, సమర కుశలుఁడు.

**సాంరావిణము** సం. వి. అ. న. పెద్ద కేక, ఉచ్చైర్నాదము, అఱుపు, బొబ్బ.

**సాంవత్సరము** సం. విశ. (అ. ఈ. అ.) వార్షికము, ఏడాదికొకతూరి జరుగునది.

**సాంవత్సరికము** సం. విశ. (అ. ఈ. అ.) వార్షికము, ఏటికొకతూరి జరుగునది.
సం. వి. అ. న. ఆబ్దికము. ఏడాదికొక తూరి పితృదేవతలనుద్దేశించి చేయుశ్రాద్ధకర్మ. దీనికి సంవత్సరికము అని వ్యవహారము కలదు.

**సాంవత్సరికుడు** సం. వి. అ. పుం. (రూ. సాంవత్సరుఁడు) 1. జ్యోతిష్కుఁడు. 2. పంచాంగకర్త ముహూర్తములు పెట్టువాడు. 4. జ్ఞాని 5. గణకుఁడు

**సాంవాదికము** (సం. విశ. అ. ఈ. అ.) 1. వ్యావహారికము, వాడుకలో నున్నది, ప్రజలు మాటాడునది. 2 వివాదాస్పదమైనది.

**సాంవాదికుఁడు** సం. వి. అ. పుం. వాది, తగవు తెచ్చినవాఁడు.

**సాంవృత్తికము** సం విశ. (అ. ఈ. అ.) క్షణభంగురము, ప్రాతిభాసికము.

**సాంశయికము** సం విశ. (అ. ఈ. అ.) 1. సందిగ్ధము. 2. అనిశ్చితము, అనిర్ణీతము. సం. వి. అ. న. సంశయాస్పదము, ఉపద్రవకారియైన పని.

**సాంశసంఖ్య** సం. వి. అ. అంశము అనగా ఒకటియందలి భాగము దానితో కూడిన సంఖ్య సాంశసంఖ్య. ఉదా: 1 1/4, 2 1/2, 3 3/4. (చూ. వాచ.)

**సాంసారికము** సం. విశ. (అ. ఈ. అ) 1. సంసారిక సంబంధి. 2. ఐహికము, ప్రాపంచికము.

**సాంసిద్ధికము** సం.విశ. (అ. ఆ. అ.) ప్రకృతి సిద్ధము, స్వాభావికము, సహజము 2 స్వతస్సిద్ధము, అయత్నసిద్ధము. 3. కేవలము, అకారణము. 4. దైవికము.

**సాంస్థానికుడు** సం. వి. అ పుం సజాతీయుఁడు, తన దేశపువాడు.

**సాంస్రావిణము** సం. వి. అ. న. ప్రవాహము, నది.

**సాంహననికము** సం. విశ. (అ. ఈ. అ.) శరీర సంబంధి, దైహికము.

**సాఁకించు** (సాఁకు + ఇంచు-స్వార్థమునందించుగాగమము) స. క్రి. రక్షించు, కాపాడు.

ద్వి. అఁకొనకుండంగ నరసి పాలిచ్చి, సాఁకించి పెనుపదే ఉనని గల్గినను. బస. పురా. 52పు.46వం.

**సాఁకు** స. క్రి. 1. రక్షించు. కాపాడు. 2. పెంచు (క. సాకు) క. ర., చి. ని., ధాతుమాల.

క. అడవులఁ బదునాల్గేడులు, గొడిపెలకొడిగట్టి సాఁకుకొంటివి సుమ్మా, బడలిక నిపు డిట్లగడవు, పుడమిం బవళించి నిదు^వోయితొ తండ్రీ! అ రా యుద్ధ. 193.

ఉ. అక్కట దోసతోఁట యిదియైనఁదదీయ ఫలంబు లమ్మి యీ,డొక్కమ సాఁకఁ గోరితి. శుక. 2.379.

గీ, జాగరూకుఁడవై నన్ను సాఁకుమయ్య, రామ లింగేశ! రామచంద్రపురవాస! రామ. శ. 105.

**సాఁకుడుపులుగు** వి. కోయిల.

**సాఁగడీయు** స. క్రి. (సాఁగన్ + ఈయు) 1. ప్రార్థించు, బతిమాలు 2. పొడిగించు.

**సాఁగఁబడు** అ. క్రి. (√సాఁగు) శరీరమంతయు భూమిమీఁద తాకునట్లుపడు, సాష్టాంగముచేయు.

ఉ. ముందఱ వచ్చి సాఁగఁబడి మ్రొక్కిన శౌరి కృపార్ద్రచిత్తుఁడై. పారి. 5-35.

**సాఁగిలి** వి. (√ సాగు) నతివిశేషము. సాష్టాంగ నమస్కారము.

వ. మధుర నున్న బాలకృష్ణునకు సాఁగిలి మాయా స్థలమందున్న మధుసూదనునకుఁ గోటి. ప్రబం. 1. 890.

**సాఁగిలు(ల్లు)** = చాఁగిలు. 1. నేలకువ్రాలు.

చం....సుమోదభక్తి త,త్పరత దలిర్ప లేచి వరపాలుఁడు సాఁగిలి మ్రొక్కె వారికిన్. కళా. 4. 163.

2. సాష్టాంగ నమస్కారముచేయు, మ్రొక్కు.

శా....జగద్గురునకున్ సాఁగిల్లి యీభూవరున్ దీనున్ బ్రోవు కృపాసముద్ర యని యెు తేఁ ప్రార్థనల్ చేసినన్. శ్రీరంగ. 6.66

**సాఁగు**[1] = చాఁగు[1] అ. క్రి. 1. సాష్టాంగ నమస్కారము చేయు.

గీ. ఇట్లు నేత్రోత్సవముగ లక్ష్మీశుఁ జూచి, భయము విడిచి మునర్వులు ప్రమదమొంది, సాఁగి పడిమిల్లి లేచి హస్తములు మొగిచి, వినతు లొనరించి తగ విన్నవించి రిట్లు. జాహ్నవి. 1. 75.

2. దీర్ఘమగు.

అ. దివముకాని యుఁక భువనంబున దిశ, వట్టి రాత్రిలేనియట్టుగాఁగఁ, జేసి నొక్కొ విం విశేషించి కాక కా. నేఁడ దివముసాఁగి నిలిచె నొక్కొ. భార. విరా. 2 318.

వ. ఇంతులతో బింతులుసాఁగి. ఉ. రా. 4 183

3. పోవు, నడచు.

ద్వి. పుట్టుబను లాద్యులై పుఁపుఁ బోక, పురము వెల్వడి సాఁగిపోవుచు నుండె పారిజా.పురా. 1.180.

4. అడుగున బ్రాఁడుగట్టిన కటారియలుగువంటి ఆయుధము (వాచ.).

**సాఁగుడుమానిసి** వి. పొడగరి.

**సాఁచు** స. క్రి చూ. చాచు.

**సాఁచు** వి. రేతస్సు (స్త్రీసంబంధి).

**సాఁతు** వి. గోనెలు నేయువారిజాతి.

వ....అవ్వీటి యేటిసాలె యగసాలె పటుసాలె వాని వైజాతి సాఁతు సెట్టుల కోమిటెలు...అము భార. 4. 85.

తే. కోటిసంఖ్యల మాదలఁగూడఁ బోయు, నవ సరంబున నొక్కసాఁ తరుగుచెంచి. దశకు. 3 52.

**సాఁబంతి** విశే. సహపంక్తి (భోజనాది) : ఒకే వరుస యందలిది.

**సాఁబాలు** వి. సగముపాలు, అర్ధభాగము.

సీ. ఖర్జూరఫలములు గణకుండు కొనితెచ్చి సాఁబాలు మోహంపుసతికి నిచ్చె. పావులూరి మల్లన.

**సాక** వి. (సం. చషకమ్, త. చరక) 1. కల్లు త్రాగెడి పాత్రము.

సీ. గ్రుక్కెఁడు చవిజూడు మక్క యీ మధువని తీవులు దమలోనఁ జూపికొనుచు. గీ. నెట్ట వస్తువు గడియించె పీతఁ దనుచు, బ్రహ్మ గొనియాడి యిది సాకఁబట్టు మనుచుఁ, బొట్ట కొలఁదిగ బోట్లకు బోసి పోసి, వరిణమించిరి యొుఁడొండ తరుణులెల్ల. ద్వా 4. 259.

కం. చెఱకులఁ బన్నిదమాడిన, తెఱఁగున మీ రూపు లొక్కతేవనె యనిచే, వఱుకుచు బేకాటన కే, డ్రెఱ

నెత్తుకు సాకసాక గిరిన సేతుక్. ప్రబ. 1. 779.

2. జాడ హా. సాకా

ద్వి. పలికె నిచ్చ ము పెఁ బసితేము మనకు, వలయు నెచ్చటికైన నడిఁ బనవాయు, గాకున్న సాకసాకల నిత్తెఱంగు, లోకు పెల్లి గిన లోకంబులోన నవసిరి వచ్చు. అవసి ముప్పి. నవనాథ 4. 148 పు. 9 పం.

ద్వి నా వాడు డిగొక్కనాఁడు నా కల్ల సాకసాకల బట్టి చంపించుదావు, మెయిగొంటి యొక్కటి మీఁదటి తగవు నెయ్యంబుగలదిః నీకును నాకు. నవనాథ. 1. 33 పు. 8 పం.

సాకతము వి. 1. అనుగ్రహము.

ఆ. పీను గట్టివాలుదాన నా కెవ్వరు, గడుపు కూడు పెట్టి కట్టఁజీ, యిచ్చి సాకతమున నేలుదు రట్టి వా, రలకుఁ బనులు సేసి మెలఁగు బుద్ధి. భార. విరా. 1. 26.

చం. ... నేఁ గిరటికిఁ దనదివ్య రథంబుతోడ సా, కతమునఁ బంపె నెంత పనిగల్గెనొ గాక శచీవిభుండు విక్ర. 2. 75.

2. దయ.

కం. ఈ కృత్రిమసతి యిప్పుడు, మీ కులమున నెల్ల దాన మృత్యువ నగా, దూఁకొని మునలముఁ గను నని, సాకతమటి వారి కతఁడు శాపం బిచ్చెన్. పద్మ 10. 270.

3. పోషణము.

కం. పేరు వలలు డు గూడుఁ, జీఁ యు నిడి సాక తంబు సేసినఁ జాలుం భార. విరా. 1. 29.

4. ఊరడింపు.

కం. కైకొను మర్చిన మనవుడు, నా కోమలి దెలిసి యర్థిమందికొనియె సుశ్లోకుఁ డగు నమ్మునీశ్వరు, సాకతమున శోకవహ్ని శాంతత బొందన్. నిర్వ. 9. 46.

5. చేపట్టు (వాచ.).

సాకము వి. 1. వ్యాజము. నెపము, కపటము, 2. ఉత్సవము.

గీ. సాక మనఁగను వ్యాజ ముత్సవము దోఁచు ... ఆం. భా. 3. 59. ప్రా.

సాకము సం. వి. అ. న. (చూ. శాసము) పై దానితోఁ గూడ అనుటకు పేరు. (ధనం.)

సాకరము సం. విశే. (అ. అ. అ.) ఆధారము గలది, ప్రమాణము గలది, సప్రమాణము.

సాకల్యము సం. వి. అ. న. సకలత్వము, పూర్ణత్వము.

సాకాంక్షము సం. విశే. (అ. అ. అ.) 1. కోర్కె గలది. 2. ప్రయోజనము గలది. 3. ప్రమాణమును కోరునది.

సాకారము సం. విశే. (అ. అ. అ.) రూపము గలది, శరీరము గలది.

సాకి (రి) వి. (సం. సాక్షి, త. చాక్కి. క. సాక్కి) సాక్షి.

సీ వేఁడి సెగల్ గల్గువేల్పు సాకిరియైన యప్పుడు గాని కే లంటరాదు. (కువల. 4. 49.)

సీ. సాక్షి యొప్పగు సాకె సాకిరి కరి యన ... ఆం. భా. 2. 304 ప్రా.

తే. గీ. మీరు సాకిరు లని పల్కి భూరి ముదముఁ దాను వ్రాసిన యట్టి పత్రంబు నజునిఁ, జదువుమన నబ్జభవుఁ డంత సరవి దానిఁ, జదివె నీరీతి ధవదుఁ డీశ్వరుఁడు వినఁగ. వేంకటాచలమా. 5. 159.

చం. ... దుర్దశా, సమితికి నీ నిమిత్తములె సాకిరి గావె వృపాలవందశా. ఉ. రా. 6 289.

సాకు వి. మిష, వ్యాజము, నెపము.

ఉ. ఎన్నక బంటవీవు నిను నేలికపిల్చి ప్రియంబు చెప్పి నన్, సన్నకసన్నఁబోక పెఱసన్నల సాకులు పన్ను టొప్పునే. పంచ. వా. 3. 220,

సాకురుండము సం. వి. అ. పుం. కర్పురంఫలము (వాచ.).

సాకూతము సం.విశే. (అ.అ అ) 1. సాభిప్రాయము, అర్థవంతము. 2. ఉద్దేశపూర్వకము. 3. సకామము, ప్రీతితోఁ గూడినది, విలాసముతోఁ గూడినది.

సాకె = సాకిరి. వి. సాకి.

సీ. సాటి యొప్పగు సాకె సాకిరికి రియన .... అం. ఖా. 2. 308.

సాకేతకుఁడు సం. వి. అ. పుం. అయోధ్యా నగర వాసి.

సాకేతము సం. వి. అ. న. అయోధ్యా పట్టణము (వాచ.).

సాకేతులు సం. వి. అ. పుం. (నిత్య బహు.) అయోధ్యా నగర వాసులు.

సాక్తుకము సం. వి.అ. న. పుం. అ. న. (Barley) వేలాలరాశి, అ. పుం. యవధాన్యము.

సాక్షాత్కరణము సం. వి. అ. న. 1. కన్నుల కగ పడునట్లు చేయుట. 2. మానస ప్రత్యక్షము.

సాక్షాత్కరించు సం. అ. క్రి. ప్రత్యక్షమగు, కనఁబడు.

గీ. తన పదాంభోరుహములు తత్పరతఁ గొలువఁ, గడఁగు వారికి నేవేల్పు కల్పవృక్ష, మట్టి వేల్పు గదాధరు నాశ్రయింతు, ననిన సాక్షాత్కరించి నారాయణుండు. వరాహ. 2. 15.

సాక్షాత్కరించు సం. స. క్రి. ప్రత్యక్షము చేయు, కనిపింపఁజేయు.

సీ. పవమాన మానుండు పగలు దివటిఁబూని స్వప్రతాపంబు సాక్షాత్కరింప. దశా. 7. 186.

సాక్షాత్కారము సం. వి. అ. పుం. 1. ప్రత్యక్షమగుట. 2. ఇంద్రియ గోచరమగుట. 3. జ్ఞానము.

సాక్షాత్కృతము సం విశ. (అ. ఆ. అ) 1. ప్రత్యక్షము చేయఁబడినది, ఇంద్రియ గోచరము చేసి కొనఁబడినది. 2. భావనాదృష్టమైనది.

సాక్షాత్కృతి సం. వి. ఇ. స్త్రీ. = సాక్షాత్కారము.

సాక్షాత్తు సం. అవ్య. 1. ఎదుట, కండ్ల ముందు, బహిరంగముగా. 2. సాకారముగా, యథార్థముగా. 3. మాటిగా, తిన్నగా, స్వయముగా.

సాక్షి సం. విశ (న్. నీ. న్.) 1. చూచునది, గమనించునది. 2. ఋజువు చేయునది, నిరూపించునది, నిర్ధారించునది.

సాక్షి సం. వి. న్. పుం. 1 [illegible] 2. ప్రత్యక్ష జ్ఞానము [illegible] 3. [illegible] కార్యమును [illegible] తెలిసినవాఁడు.

సీ. [illegible] [illegible] విప్ర వంశ [illegible] [illegible]. వ్యవ. 106.

తే గీ. [illegible] సాక్షిఁ [illegible]. దశకు. 5. 6[illegible].

సాక్షులు పద [illegible] అకృత సాక్షు లేవురు, అకృత సాక్షు [illegible], కృతసాక్షులు:- లేఖకుఁడు, స్మారితుఁడు, యదృచ్ఛాభిజ్ఞుడు, గూఢుఁడు, ఉత్తరుఁడు అకృతసాక్షులు :- గ్రామస్థులు, ప్రాడ్వివాక లేఖక భిక్షువులు, రాజ కార్యాధికారి, వాదిచేఁ బంపఁబడినవాఁడు, కుల వివాదము లందు) కులము వారు. కృతసాక్షులు అనఁగా నిర్ణయించుకొనఁబడిన సాక్షులు అకృతసాక్షు లనఁగా నిర్ణయిఁచుకొనఁబడని సాక్షులు. శ. ర.

సాక్షిపలుకు స. క్రి. సాక్ష్యమిచ్చు.

సీ. కైవెట్టమియె కాని వైకొనుతమికల్మి, నత్తని పులకలు సాక్షి పలుక. కవి. 3. 218.

సాక్షేపము సం. విశ. (అ. ఆ. అ.) తిరస్కారముతోఁ గూడినది. నిందాత్మకమైనది, ఎత్తి పొడుచునది.

సాక్ష్యము సం. వి. అ. న. 1 సాక్షి కని విని చెప్పిన మాట. 2. ఋజువు. 3. ఏకాదశాహ శ్రాద్ధము, షోడశము. చనిపోయిన వారికి పదునొకండవ దినమున జరుగు శ్రాద్ధకర్మ.

సాఖేయము సం. విశ. (అ. ఈ. అ.) 1. మిత్రసంబంధి 2. స్నేహపూర్ణమైనది.

సాఖ్యము సం. వి. అ. న. స్నేహము, మైత్రి. చెలిమి.

సాగగడ్డ వి. పాడవై నగట్టు. తే. గీ. గగనమిరవైన నిడు సాగగడ్డ తోడ, కట్టెమట దోచె నఘశోక్య కమ్ము కొలను. కకు. 2. 8 గు.

సాగతము వి- (సం. సాంగత్యమ్) 1. సంబంధము.

సీ. జమిలి పాములతోడి సాగతంబొల్లక నవరించె బంగారు జెన్నిదమ్ము. హర. 5. 6.

2. మైత్రి.

ఉ. పట్టికరంబు తిన్నఁపటుపావకకీలలఁద్రోఁచి

ఉ. శయు, గట్టిది తండ్రి నిన్ను నిటుగాల్పఁగ వచ్చిమ పోల్చి వానితోఁ, బెట్టిదమాడ నిన్నెదలఁ బెట్టిన చుట్టలతోడి సాగతః, బిట్టిరియయ్యె వార ళలుఁ జేమి యెఱుఁగు మహోపకారముల్. వృసి.వాపు. 4. 10.

**సాగనంపు** స. క్రి. (సాగన్+అంపు) ప్రయాణమై పోవు వానిని కొంత దూరము తీసికొనిపోయి విడుచు. శ. ర.

**సాగనంపు** అ. క్రి. అనుగమించు, వెంటవెళ్ళు.

ఆ. వె. కాలయాపనంబు గావించి భూపతి, సాగ నంపి తండ్రి న [illegible]దప్పు, నింక నిల్చుకావ నేనంచు మది నిళ్ళ, యుంచి యతనితోడ నిట్టు లనియె. చెన్నబ. 5 178

**సాగరగ** సం. వి. అ. స్త్రీ. సాగర గామిని. సం. వి. ఈ స్త్రీ. 1. నది. 2. గంగానది.

**సాగరము** వి. నెయ్యి, నూనె మొదలగువవి నింపిన పిడైలజోడు.

**సాగరము** సం. వి. అ. పుం. 1. సముద్రము.

ప్రస్విణి. సాగరాంతమహా సంపదేశాన్పురా. పారిజా. 2. 106.

2. నాలుగు లేక పదు సంఖ్యకుగుర్తు 3. ఒక విధమైన జేడి. 4 పనుఁగు చెవియందలి మదము. 5. అనం తము పిమ్మటి సంఖ్యామానము (వాచ).

**సాగరమేఖల** సం. వి. అ స్త్రీ. భూమి, సాగరము (ల) చేత ఒడ్డాణము వలె చుట్టుకొనబడినది.

**సాగరాంతము** సం. విశ. (అ. ఆ అ) సముద్రముచే అంతముగాఁగలది. సముద్రముల వఱకు వ్యాపించి నది.

**సాగరాంబర** సం. వి అ. స్త్రీ భూమి

**సాగరానుకూలము** సం విశ. (అ. ఆ అ.) సముద్ర తీరము వెంటనున్నది.

**సాగరాలయుఁడు** సం. వి. అ పుం. వరుణదేవుఁడు.

**సాగరిక** సం వి. అ. స్త్రీ. ఒకవీణ పేరు. పండితా. 2. 414.

**సాగరోత్థము** సం. వి. అ. న. సముద్రలవణము.

**సాగవచ్చు** అ. క్రి. కూడవచ్చు, వెంటవచ్చు.

తే. గీ. సాగరమ్మును పలుకు మించంగఁగరము, పిచిరైటికిఁ జెత్తలద్రోచివైచి, వాహినీ నాథుఁ డొకఁడొకఁ డాహవమున, గలయఁ బడుటయుఁగను వట్టై ఖచరతతికి. రాజవాహన. 5. 8,

**సాగవేయు** స. క్రి. పంపు, పుచ్చు, తరలించు.

వ్యవ. అనామ్మంతయు నింటికి సాగవేసినాఁడు.

**సాగా** అవ్య. సైతము.

కం. వారిసాగా నీరూపము, శిరమున ధరియించి కాదె శిక్షించెనరు, త్పురిపంథిం గనకకశిపుం, గరి వైరి నిన్నుఁ బొగడగా మా వశమే. వేం. పంచకం. 1. 849.

సీ. కశినతకాత్రవుని సాగా వి త్తవంతుని వేల్పుగాఁ జూచి సేవింతు రెపుడు. వేం. పంచకం 3. 37.

**సాగించు** స. క్రి. √ సాగు. 1. జరుపు, కావించు.

గీ. అతివపగలైన మూపైన నతనితోడ, నిచ్చనొక పారి సాగించు నిధువనంబు. శివరాత్రి 3. 114.

గీ. శివుడు దాతభోక్త (శ్రీ) మహాదేవుండు, సర్వ మును హరుండు శాశ్వతుండు, శంభు వేఱునేసి సాగింపవచ్చునే, క్రియలు వెజ్జివేల యయితి చెప్పుమ. కాశీ. 7. 72.

2. నిర్వర్తించు.

మ.... ప్రియునిం గూర్చున్ మరుం డెంతయున్, గెలవిన్ దానికిఁ బెండ్లి పీడియము సాగింపన్ మదిం జూచెనో. చంద్రాంగ. 4. 154

3. నెరవేర్చు.

సీ. కృత్యపంచకము సాగింపలేఁడియుంతి ప్రాపు లేక కృతాంత భంజనుండు కాశీ. 4.150

కం. అధవము నీకు వచ్చిన, సాధనముగ నధ్వరంబు సాగించి బుధా, రాధనముచేయు నిరతా, యోధన చణులైన తమ్ము లూఱట గాఁగన్ జై.భా. 1.88.

4. వడిపించు.

సీ. పాలదిండిజేని మావుల దేరుగై దువులరదంబు సాగించు వతఁడు సిడము అ. రా. యుద్ధ. 222.

5. నిర్వహించు.

గీ. పేరటాండ్ర నర్పింపఁగ నేరవైతి, నలిల పత్రంబు సాగింపఁజాలవైతి. కాశీ. 3.81.

6. ప్రవర్తించు 7. యత్నించు.

**సాగింత**. వి. నమస్కారవిశేషము (వాచ.).

సాగిపోవు. అ. క్రి. చెల్లు, సమర్థుఁడు.

ఆ. వె. ఉచితవంతుఁడైన, మద్యోగపరుఁడైన సాగి పారియున్న సమయమునను, పరుల కుపకరించి పరుల రక్షించును విశ్వ. వేమ. 8. 186.

సాగివచ్చు. అ. క్రి. జరిగివచ్చు.

ఉ....రిపుగర్వహారుఁడు మురాంతకుండనీ, గర్వము నెల్ల నిచ్చటన కాకిట వల్లెదు సాగివచ్చునే. హరి. ఉ. 6 ఆ. 112.

చం. అలవరో యెందు నీవిఁక గులాముపకుం జవవద్దు మాకునిచ్చలు పెరుమాళ్ళ కోవెలఁ బ్రసాదము కట్టడి సాగివచ్చునా తళియ ప్రసాదమీవు సతతంబుఁ బసాపడుము. వైజ. 2 ఆ. 28 పు.

సాగు. వి. కృషి, వ్యవసాయము.

సాగు.1 (క. సాగు) అ. క్రి. గమనించు, వెడలు, పోవు, బయలుదేఱు.

ఉ. పైనముతైరి పాండువరపాలతనూజులు యజ్ఞసేనభూ, జానియమజ్ఞ వశ్వములు సాగె రథప్రకరంబు వెళ్లె పాంచాలీ. 5. 47.

చం. అమరపతి పతివ్రతల కాదిమదైవతమైన పార్వతిం, బ్రమథవిభుండు గైకొనెఁ గృపావరతన్ బరిచర్యసేయ నీ, సమయమునందు మన్మథుఁడు సాగి శరాసనకౌశలంబునన్, హిమగిరిరాజకన్యపయి నీశుని చిత్తముఁ జేర్చ వోపినన్. ఉ. హరి. 2. 170.

తే. గీ. పుష్పకవిమాన మటుసాగిపోక నిలిచె. ఉ. రా. 8. 66.

2. ఎగిరిపోవు.

ఉ. .... శ్రవఃశకుంతముల్, చట్టువలెత్తి ముందటికి సాఁగదలంప. పాండు. 5. 249.

3. కదలు, చలించు (రథము).

సీ. తమతమ శక్తి యెంతయుఁ బురికొల్పఁగా జనులు ప్రార్థించిన సాగదయ్యె. శుక. 2. 1?.

కం. అంతట నేడు నగరంబులు, నంతర్ధానంబు చేసి యటచనఁగాన, త్యంతభయంకర కర్దమ, సంతమసంబున రథంబు సాగక నిలిచెన్ ఉ. హరి. 2. 49.

4. తిరుగు, సంచరించు. (చూ. కొరు)

5. ప్రవహించు, పాఱు.

6. జరుగు, ప్రవర్తిల్లు.

కం. ఈ గర్భము రక్షించిన, నా గౌరవమేమిఁ జెడక నారాయణనా, నా గుణసంపన్నులలో, సాగుదు నటుగాక యున్న సమయుదు నగలన్. ఉ.హరి.2.17

గీ. సాగుఁ గర్మార్థమఁ దాముపంగిక మయి, యాధికారికమందు బ్రహ్మోద్ధగరిమ. కాశీ. 1.75.

తే....తొడఁగినట్టి, పిపినవానకార్య మనవిఘ్నమై సాఁగఁ, బ్రథమ హతమగు బలివకుపుఁజోలె. రాఘ. 3. 81.

శా. సద్గస్థిత్య నహోదికర్మ నవదీక్షావేళ బ్రహ్మాస్వభూ, ఖర్గుల్ విఘ్నము లేక సాగుటకునై ప్రార్థింపఁగా, దక్షక్రియా, దౌర్గత్యంబు వదల్చి వంన్మరణమాత్రం బ్రాప్తి గావించు దృ, క్పర్గచ్యుత్కరుణాకదంబుఁ గొలుతు న్నిత్యంబు హేరంబునిన్. కాశీ. 1. 5.

ఎ. గీ. దూరదేశసమాగత ధూర్తపాంథ, జనసమూహంబు పయనంబు సాగలేక, తెక్కు లరించి కుత్తుక ల్నిక్క మించి, కొక్కురోకో యటంచును గోళ్ళు గూసె. హంస. 1. 187.

సీ. తత్ప్రీతిని యంతయు మనకబ్బినఁ బను లన్నియుఁ గొదవవదక సాగు. పర. 5.14

వ. యాజకస్వాహా స్వధాకారకల కలాటోపంబులు బధిరిత దిక్కులాపంబులై కొనసాగ యాగంబు సాగుచుండ. వరాహ. 5. 108.

చం. సతతము వహ్నిహోత్రములు సాగునె భూరుహముల్ ఫలించునే? హరి. వరాహపు. 1. 8 పు.

7. కూడవచ్చు, వెంటవచ్చు. 8. చెల్లు.

చం. నవదు వినోదకోప మిఁక సాగవు బింకము లాలకింపుఁడీ, మనసిజుఁ డానతిచ్చిన క్రమం బిదియంచు విటీవిటాళికిం, బనుప వసంతు డక్షర సమూహము వ్రాసిన కాగితంబులో, యనఁ దనరెన్ నభంతర

**సాగ్రము** సం. విశే. అ. ఆ. అ. 1. మొత్తము, సర్వము. 2. అధికము, మిగులుకలది.

**సాచి** సం. అవ్య. వక్రముగా, కుటిలముగా, అడ్డముగా, ఓరగా.

**సాచివాటిక** సం.వి.ఆ.స్త్రీ. తెల్లపూలు.(Hog-weed)

**సాచివిలోకితము** సం. వి. అ. న. ఓరచూపు, కటాక్షము.

**సాచివ్యము** సం. వి. అ. న. 1. మంత్రిత్వము, మంత్రిపదవి. 2. మంత్రిమండలి, పాలకవర్గము, పాలనము. 3. మైత్రి, స్నేహము.

**సాచీకృతము** సం. విశే. అ. ఆ. అ. 1. వంకరగాఁ ద్రిప్పఁబడినది. 2. అడ్డముగాఁ ద్రిప్పఁబడినది.

**సాజము** (సం. సహజం. క. సాజ.) విశే. స్వభావముచేఁ గలిగినది.

చం...ఒక వన్నెలాఁడి మొగమంటి కమంగొనుచు న్విరాళిచే, సతమని నమ్మియందు రిది సాజమెకా మగవారి కారయన్. శుక. 3. 147.

శా. శ్రీ లీలావతి నవ్వనేఁటి కని ఘూర్ణింపంగ నే నవ్వనో, బాలా సాజము సింహావక్త్రిమువకీ పారీంద్రచిత్రంబు. దశా. 4. 3.

మ. హరికిన్ సాగరకన్య శంకరున కయ్యార్యా మహాదేవి తోయరుహాసీనునకున్ సరస్వతియునైన ట్లందమై యున్నదీ, ధరణీనాథ కుమార రత్నమునకీ తన్వంగి సాజంబు లీ, వరలావణ్య వయోవిలాస గరిమల్ వర్ణింపఁగా నెంతయున్. ఇందు. 6. 10.

**సాజము** =సహజము, వి. స్వభావము.

ద్వి. వజ్జంబో వారంబో వారిసాజంబో, వెజ్జుఁ జూపింపరు వేల్పుల కిడరు. ద్వి. పరమ. 3. 164.

**సాజాత్యము** సం. వి. అ. న. 1. ఒకే జాతికి కులమునకుఁ జెందియుండుట. 2. జాతిసామ్యము, తుల్యజాతిత్వము. 3. సామ్యము, ఐక్యము.

**సాటు** వి. 1. పరివర్తకము. 2. వినియమము. 3. వర్తకులు ఒక వస్తువునిచ్చి మరియొక వస్తువును పుచ్చుకొనుట.

**సాటా** వి. సాటు.

**సాటాకోటి** వి. సాటాబేరము వస్తుపరివర్తనపు బేరము.

**సాటి**[1] విశే. సమానము.

తే. గీ. లేపు లింగము ... సాటి వేయంగ ... కాశీ. 2. 187.

గీ. సాటి సాటువ ... సరి పాటి పోటియుక్తి యనఁబడి .... ఆం. భా. 2. 802.

ఉ ... బుద్ధి ..., ... ప్రధానులు దక్కినవారు సాటియే, మూవిడి ... కమాత్యశిఖామణి ... శృం. నై. 1. 28.

చం.... తత్పురము సాటిగ వన్యపురంబు లెన్నఁగా నమరు నటన్న హస్తిమశకాంతరం మింతియ దాని చూసినన్. కాశీ. 1. 22.

ఉ. తిమ్మనమంత్రి సాటి జగతిస్థలిలోపల మంత్రి గల్గునే ? దశా. 1. 86.

**సాటి**[2] (క. సాటి) వి. ఉపమానము, పోలిక.

వ. నీకు నితర పర్వతంబులకును సాటియే ? హర. 4. 62.

ఉ. ...సంగ్రామములోన నొక్కఁడను గానికి వాని దొలంగఁ దీర్చె, ... మనోహరుని సాటియె యీశ్వరుఁ డెన్నిక గుణన్. పారి. పీఠి. 9.

సీ. సాటికిఁ బోటికి సరస సంగీత సాహిత్యాది విద్యలు నృత్యమాడ. సారంగ. 1. 62.

ఉ. బిడ్డలకు మేల్తరంబు ఘనవేదికమందొమదోయి బంగరుం,గిడ్డకు మేటిసాటి తులకించు చనుంగవ లేఁతతమ్మిపూఁ, దూండ్లకు మిన్న యన్నతికి దొల్కెడుచేతులు లోకమందుఁ బూబోండ్లకుఁ గానమో వినమొ పోలరు తత్సతి కాలిగోరునన్. హంస. 1. 61.

ఉ. ఆర్వురుచక్రవర్తులు పదార్వురు రాజులు విశ్వధారిణి, నిర్వహణ ప్రభావమున వేర్పరులైనను వీని సాటియే. విక్ర. 2. 34.

**సాటి** వి. (సం. శాటీ క. సాటీ త. చాటి.) కానెకోక

సీ. గడిదంబు మట్టిచల్లడముపై బంగారుసాటి చెంగు లొకింత జాఱఁగట్టి. ఉత్తర హరిశ్చం. 2. 52.

**పాటిక** (సం. పాటికా.) వి. పాటి.

**పాటికిబేటికి** అవ్య. మాటిమాటికి.

కం. బేటికి వేడుక యగువని, దేవంయును వరము లొనఁగ దేవఁ గనుచున్, దేవియు సాటికి బేటికి దీవింపఁగ దైత్యశిశువు తేజము నొందెన్. ఉ. రా. 1. 265.

సీ. గీ. ప్రియునిచే వేగిరము పొకి తయును మించ, వీక పాటికిబేటికి విందువరన (పాటికిమాటికి, సాటికి బేటికి వని ముద్రిత ప్రతులుపా.) కళా. 7. 76.

చం. నలిపిరి దోలికావిహ్వాలి పాటికి బేటికినింతు లిద్దఱున్. రామా. 1. 181.

**పాటివచ్చు** అ. క్రి. (√పాటు) ఈడగు, సమానమగు.

తే.గీ. తోయజామోదలాజలు దోయిలించి, ప్రమద మున వేల్వ నొకకొన్ని చెమట వంట, ప్రేల్చు గమ వట్టెఁ గెంజాయ వీతివాోత్రు, వాలుకలు సాటి రాకున్న వవ్వెవనఁగ. మను. 5. 81.

**పాటిచే(సే)యు** స క్రి. (√సాటి) ఉపమించు.

సీ. అతనుండు మొదట హ్రస్వాకారుఁ డాటచే తెలువంబునకు సాటిసేయరాదు. దశా. 1. 52.

తే. గీ. విదుషి యాయింతి తలబాల్చు వెంట్రుక లకు వహహ! యెబ్బంగి సాటిసేయంగవచ్చు, బసువు చేతఁ బరన్ముక్తిఁ బడయలేక చాపలంబున వర్తించు చామరములు. శృం. నై. 2. 18.

**పాటియగు** అ. క్రి. సమానమగు.

చం. ఇతని కితండె సాటియగు, నీతని కీతఁడె సాటి. పారి. 5. 29.

**పాటువ** విశ. ఉచితము.

ఉ. సాటువ యైనత్రోవ మనసా విను మున్ను భవాంబురాశిలోఁ, గోటుల సంఖ్యలైన జనముల్ బహుఘాతమాధవుల్, గాటపుఁబుట్టు వొందరో పొకాలరో వీరల సంగమంబు మి,థ్యాట పొరిం బొరిం దలఁపుమాకృతకృత్యుఁడ వయ్యె దిత్తటిన్. ప్రబోధచంద్రో. 5. 28.

**పాటువ** వి. 1. సామ్యము.

గీ. సాటిసాటువ తరబడి సవతుతరము దీటునరి పాటిపోటి యుద్ది యనఁబాడి, యీడనఁగ సదృశార్థ్యులై యొసఁగుచుండు .... ఆం. భా. 2.302.

2. ప్రసిద్ధి.

ఉ. ఘోటకముల్ రథావలులు కుంజరముల్ బహు వాహినీ పతుల్, సాటువకెక్కు వీరభట సంకుల ముందగు నప్పురంబునన్. రుక్మాం. 1. 73.

**సాటెనగొట్టు** విశ. దుష్టుఁడు, దుష్టురాలు.

సీ. సంటెటింగినదొంగ సాటెనగొట్టు పిసాని దిమ్మరి బేరజముబటాని. చెన్నబ. 2. 24.

**సాటోపము** సం. విశ. అ. ఆ. అ. 1. గర్వించినది, విజృంభించినది, ఉప్పొంగినది. 2. గంభీరమైనది, ధీర మైనది. 3. పొంగినది, ఉబ్బినది, నిండినది. 4. ఆటోపముతోఁ గూడినది.

**సాడంబరము** సం. విశ. అ. ఆ. అ. 1. దర్పముగలది, వటాటోపముగలది. 2. ఆడంబరముతోఁ గూడినది.

**సాత్** సం. తద్ధితప్రత్యయము, కృత్స్న (అంతయు) మను వర్థమిచ్చును. (విభాషా సాతికార్త్స్న్యే. 5. 4. 52. పాణి. సూ.) తదధీనము. 2. తద్రూపము.

చం. అతిరుచిరక్రియాభిరతుఁడైన పురోచనుతోట భస్మసాత్కృతమయి చెడ్డతద్విపులగేహము (భస్మసాత్కృతం గేహం కృత్స్నం గేహం భస్మకృతం భస్మసాత్కృతం, ఇల్లంతయు భస్మముచేయఁ బడినది). భార. ఆది. 6. 164.

**సాతత్యము** సం వి. అ. న. నైరంతర్యము, అఖండ వ్యాప్తి. శాశ్వతత్వము, నిత్యత్వము.

**సాతని** వి. (త.చత్తాదవన్) జందెములేని వైష్ణవుఁడు.

వ..... వరస్థలంబులనుండి చూడవచ్చిన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను — వడసాలె సాలెన సాతని కటికభట్టుకెట్టి జాంగ్ర తొగటగాండ్ల వారును. హంస. 3. 29.

**సాతము** సం. విశ. అ. ఆ. అ. 1. ఈయఁబడినది. 2. నాశము చేయఁబడినది.

**సాతము** సం. వి. అ. న. ఆహ్లాదము, ఆనందము.

**సాతల** సం. వి. అ. స్త్రీ. సంబరేను (వ్య. వి.).

**సాతాని** = సాతని. వి. శూద్రజాతివిశేషము.

గీ. వీథి నేతెంచె సాతాని వేడ్కలాడ. వీథి. 17.

వ. మగలం గికురించ కంకణంబులు గట్టినరితి వత్తమిల్లు వుత్తడి కంకణంబులుగల సాతాని జాతి నీటుకత్తెలు. ప్రబం. 1. 70.

**సాతాను** అవ్య. వి. సైతానుకు రూపాంతరము.

**సాతాళించు** స. క్రి. నానిన విత్తులు మొదలగు వానిని జమురు కొంచెముగా వేసి పక్వముచేయుట (చి. ని. ధాతుమాల)

వ్యవ. ఆనెనగలు సాతాళించినారు. నానిన పెసర పప్పు సాతాళించుము.

**సాతి** సం వి. ఇ. స్త్రీ. 1. దానము, ఈవి. 2. లాభము, ప్రాప్తి. 3. సాయము. 4. నాశము. 5. అవసానము, ముగింపు. 6. తీవ్రమైనబాధ, పోటు. 7. సమాప్తి, నిలుపుదల. 8. ధనము, సంపద.

**సాతిన** వి. (త. చాత్తినవర్) జందెము వేసికొనిన వైష్ణవుఁడు.

వ. కమ్మరి వడ్రంగి కాశె కంచెర యగసాలె వడసాలె సాతిన సాతని కటికభట్టు శెట్టిజాంద్రఠాగట గాండ్ల వారును. హంస. 3. 29.

**సాతిన(క)ము** సం. వి. అ. పుం. జటానీచెట్టు (వృ వి.).

**సాతిలకము** సం. వి. అ. పుం. సాతిల(క)ము, సాతిన(క)ము.

**సాతు** వి. (సం. సార్థ) వర్తకజనసమూహము.

ఆ. సాతులోన కుటిల జనముల నున్మద,లీల నేలఁ బెట్టి కాలఁజమర (వనగజంబు) భార. శాం. 3. 474.

గీ. తాను నిల్లాలుఁ గొమ్మయు దనయయుగము, మొలల దీనారముల జాళెములు ధరించి, సాతుఁ గూడి చనంగఁ దన్కరులు దాటి, వలుగురం బట్టి ధనమెల్ల నొలిచికొనిరి. కాశీ. 7. 250.

క... విఱువిఱ్ఱున ఈలువడెం, దెఱపియెఱఁగనరేమి సాతు విరుగుడు పడియెన్. అము. 6. 74.

ద్వి చలువపట్టున విశ్వసా తెల్లననుచు పడితాం పర్వత. 329.

**సాత్కరణము** సం. వి. అ. న. 1. స్వాధీనముచేయుట. 2. తాద్రూప్యము పొందించుట.

**సాత్కరించు** సం. స. క్రి. అధీనపఱచు.

(తదధీనవచనే 5. 4. 43. పాణిని సూత్రమున బ్రాహ్మణసాత్కరోతి ఇత్యాదికముగా నామవాచకముపైని తద్ధితమౌ సాతిప్రత్యయము వచ్చును. ఇటనామవాచకము లేకయే కేవలమును బ్రత్యయమునకుఁ గృఞ్ ధాతువుతోఁ బ్రయోగము వింతయని యెఱుఁగునది. మఱియు దూ. శ్లో. నై. సర్వంకషావ్యాఖ్య).

తే. పృథుఁడు నేసె నానాధ్వరము లవి, సెప్పనేల, సకలధాత్రి బ్రాహ్మణులకు సాత్కరించె. భార. శాం. 1. 248.

ఉ. దివ్యసారభవిభూతి యెలర్పఁగ సాత్కరించెఁ దెం,పగ్గలమైనభక్తి మహిపాలుఁ రజఃప్రసరేణు సమ్మిళద్గుగ్గులు ధూపధూమములు గోమలకాంక రాజమౌళిన్. నైష. 8. 103.

**సాత్కాలు** వి. జాతకమున కపభ్రంశరూపమా ?

మ. కలలో దేవరచెప్పె రేయియొకటం గన్పించి నెయ్యంబువా,టిల నీపాలికి దేవుఁడింక బనవీఁడే యంచుఁదా నాడఁగా, వలెనే జావనమొప్పెనైన నరియే వారెల్ల సాత్కాలు నీ,వలె గోరంచిరె నిన్నె కొల్తుననుచు న్వర్ణించుచో నంతటన్. శుక. 2. 415.

**సాత్కృతము** సం. వి. (అ. ఆ. అ.). స్వాధీనము చేయఁబడినది, తాద్రూప్యము పొందింపఁబడినది. అసుర భస్మసాత్కృతుఁ డయ్యెన్. భార. ఆది. 1. 132.

**సాత్కృతి** సం. వి. ఇ. స్త్రీ. సాత్కరణము.

**సాత్తని** – సాతాని. వి. (క. చాతాణి, చాతాళి, సాతాని. త. చాత్తాని.) సాతాని జాతివాఁడు.

సీ. కొంద సాత్తని వైష్ణవులు ద్రోవుద్రోపాడ వలవ పంక్తి రథపదరులు చనఁగ. విప్ర. 5. 10.

**సాత్మించు** వై. స. క్రి. సహించు, సైఁచు (సం. సాత్మ్య.)

కం. ఆయాసము ప్రాప్తించని, మీ యొదలు తపః క్రియఁకు మెయికొనియెనె. భా. అర. 2. 58. తద్రూపార్థమునకే నన్నయ ప్రయోగించినట్లు. సంస్కృత వివరణము.

**సాత్యకి** సం. వి. ఇ. పుం. శ్రీకృష్ణుని తమ్ముఁడు. సత్యకుని పుత్రుఁడు. సాత్యకి శ్రీకృష్ణునకు తమ్ముని వరుసైనవాఁడు.

**సాత్వతి** సం. వి. ఇ. స్త్రీ. 1. నాట్యవృత్తులలో నొకటి (భారతి, ఆరభటి. సాత్వతి, కైశికి అని వృత్తులు నాలుగు) 2. శిశుపాలుని తల్లి పేరు (శ్రీకృష్ణుని మేనత్త).

**సాత్వతుఁడు** సం. వి. అ. పుం. 1 విష్ణువు, కృష్ణుఁడు. 2. బలరాముఁడు. 3 కులభ్రష్టుడైన వైశ్యుని పుత్రుడు. 4. (బహు. వ.). యాదవ వంశము నందలి యొక తెగవారు. 5. పురుహోత్రుని పుత్రుఁడైన అంశువు కుమారుఁడు.

**సాత్వత్తు** సం. విశే. పుం. శ్రీకృష్ణుని యనుచరుఁడు. శేష భక్తుడు. 2. యాదవ వంశమునకు చెందిన వాఁడు.

**సాత్త్వికము** సం. విశే. అ. కే. అ. 1. యథార్థము. సారభూతము. 2. నిజమైనది, శుద్ధమైనది, సహజమైనది. 3. నిష్కపటము, మంచిది. 4. గుణవంతము, సాధువు. 5. శక్తిమంతము, 6. తత్త్వగుణము కలది. 7. సత్త్వగుణమునకు సంబంధించినది, 8. మనస్సున బుట్టినది. అంతము మానసికము.

**సాత్త్వికము** సం. వి. అ. పుం. సత్త్వగుణము వలనఁ బుట్టిన భావ విశేషము (స్తంభము, ప్రలయము, రోమాంచము, కంపము, స్వేదము, వైస్వర్యము, వైవర్ణ్యము, అశ్రుపాతము, ఈ ఎనిమిదియు సాత్త్విక భావములు)

**సాత్త్వికి** సం. వి. ఈ. స్త్రీ. దుర్గ.

**సాత్త్వికుఁడు** సం. వి. అ పుం. 1. బ్రహ్మ. 2. బ్రాహ్మణుఁడు. 3. సత్వగుణముకలవాఁడు.

**సాదన** (సం సాధనమ్) 1. మల్లవిద్య.

సీ.... శస్త్రురతుఁ గీ. డలరఁ దద్విద్యసాదన యనఁగ నెగడు ఆ. భా. 2. 205.

2. నైపుణ్యము.

ఉ. వేదన మించు నీవిరహవేదన తాళఁగఁజాల గంటునిన్, సాదనరాదుగా తనదుసాదన చూపఁ దొడంగె గాడ్పుదా, నీఁదనవచ్చునే మెదల నీదన లాకృతి వేఁడిసూపుచున్, బోదనఁ జెల్లువాకడకుఁ బోదనయంబుకుకంబు ప్రేలుచున్. సారంగ. 1-5.

3. అభ్యాసము. (సం. సాధనము)

ఉ. సాదనమేలు చెంపపయి జగ్గుగట్రేలు రుమాలు. హంస. 1. 207.

తే. గీ.... ఒక, గరిడిలో వింతసాదన క్రమము కాదు. దశా. 7. 144.

ఆ. వె. కదలిగట్టు పనికి గరిడిసాదన వీరి, కిది యటంచుఁ దజ్జలెంచు కొనఁగ, జనకరాజకన్య యను రామభద్రుండు, గట్టిరధికమైత్రిఁ గంకణములు. చంపూరా. 3. 129.

సీ. మినుకు బజ్జెట్టి సాదనకును నెవ్వాని, లాలితరసన విలాసఖురళి. విప్ర. 1. 40.

4. సాము.

రగడ. మొనల ముందట సబళముల సాదనలు సేయ. పి. శకుం. 3. 225.

కం. కలవే యిహపరసుఖముల్, దలఁపఁగ మద్భక్తి విరహితములగు యజ్ఞాదుల యందు నెందునైనను, జలజానన నేలవిడిచి సాదనగలదే? విప్ర. 4. 61.

తే మరుఁడు మఱచినసాము వేమఱునుజేయఁ, దలఁచి సాదనగరిడిలో దట్టి గట్ట. శుక. 3. 482.

5. మల్లవిద్యాప్రదర్శనము.

తే. గీ గడలు బాగాల్పటాలు వగ్గలికఁబూవి, పరువడుల్ ద్రొక్కుకొనుచే నిబ్బరపుబీం, ములగనం బడ పామరుల్ మోలఁజెలఁగి, సాదనలొనర్పఁ. జెల్లు హెచ్చరికఁ బెనఁగ. రసి. 1. 81.

**సాదనకాఁడు** విశే. (సాదన+కాఁడు) శస్త్రురతుఁడు, ఆయుధవిద్యయం దారితేఱినవాఁడు.

సీ. సాదనకాఁడన శస్త్రురతుఁడు... ఆం. భా. 2. 205. బ్రా. పా.

కటారి సాదనకాఁడు=కత్తిసాము సేయువాఁడు, మల్లుఁడు.

వ. ఒక్క యత్యంత చాతురీధురంధరుఁడైన కటారి సాదనకాని వలన నేకకాలం బభ్యసించి, కళా. 8. 106.

**సాదనజోదు** వి. మల్లుడు. ఆం. భా. ద్వి. 108.

**సాదనదీవె** వి. గస్తితిరుగు యోధులు, రాత్రిపట్టెడి దీపము.

మ. పురిచుట్టు న్నిశిరుఁడు సారణుఁడు నిత్యో త్సాంధకు ల్మాడిక, త్తెరగాయంబులు గండముంగిళులు సందిఁగొమ్మ కొమ్మన్నిరం,తరమున్ సాదన దీవె లెత్తి చనుఁడు... ఉ. హరి. 2. 74.

**సాదనపెనఁకువ** వి. గదాయుద్ధము.

వ.... బెట్టిదంపు సాదన పెనఁకువలన్ శేర్పుచు. ఉ. రా. 3. 246.

**సాదనము** నం. అ. న. 1. శ్రమించుట, అలయుట. 2. అలపు. 3. ఇల్లు, నివాసము. "మృత్యుసాదన మునకున్" భార. అర. 1. ఆ. (శ. ర)

**సాదని** నం. వి. ఈ. స్త్రీ. అలపు, క్లాంతి, సత్త్వ సంక్షయము, బలహీనత.

**సాదము** వి. అన్నము.

సీ. వినుమేము ప్రాలుమాలిన దీవెనుడిగాక తినినిన రెండు గుగ్గిళ్ళుగాక, తక్కినవింత గంధప్రసాదము గాక మనసైనవొక వడతునకగాక, యటమటించినఁ గుంచెడంత సాదముగాక కాదేని యొక గుల్లకాసు గాక. విప్ర. 5. 10.

**సాదము** నం. వి. అ. పుం. 1. క్రుంకుట, దిగబడుట, కూలబడుట. 2. అలపు, విసువు. 3. కృశించుట, బక్కచిక్కుట. 4. వశించుట, క్షీణించుట. 5. బాధ, యాతన. 6. స్వచ్ఛత, నిర్మలత. 7. గమనము, చలనము, నాశము.

అ. అల్పమైనయగ్ని యడఁగునింధనములు, మీఁద వైనబలము మిగులలేని, యోగమట్లతనకు మరునట్టి దానవ, సాదమొందు సకలజనమనోజ్ఞ. భార. శాం. 5. 579.

**సాదరము** నం. విశ. అ. అ. అ. 1. ఆదరముతో గూడినది. 2. దయగలది.

ఉ. సాదర వృత్తి సాష్టాంగ ప్రణామ మేకుఁ జేయఁబూని సం,భ్రమముసేసె దేవముని సద్యుఁ డణుం డని. భార. శాం. 5. 570.

**సాదరు** వావి. వాడకపుసొమ్ము. 2. కలిమి.

**సాదా**[1] హిం. విశ. సాధారణము, నగిషిలేనిది.

సీ. సాదావని తెలుఁగు గాంచు సొనారి, కుంద నంబున మణుల్ గూర్పఁగలఁడె? రామలిం. 86. 2. కలుపులేనిది.

**సాదా**[2] వి. మల్లవిద్యావిశేషము.

వ. సాదా, బొంబా మొదలగు కొడితావరుసలను మల్లుపురా. 3-69.

వ. అష్టాదశజాతి ప్రభూతంబులై శుద్ధభిన్నగౌళ శేసరిసాదాదితోపరాగసంజ్ఞలప్రసిద్ధంబులైన శుద్ధ రాగంబులును. శ్రీరంగ. 3. 780.

**సాది** నం. విశ. ఇ. ఈ. ఇ. 1. మొదలుగలది. 2. పుట్టుకగలది.

**సాది** నం. వి. ఇ. పుం. 1. సారథి, 2. రథికుడు, యోధుఁడు. 3. నిర్విరద్యుఁడు, అమర్త్యాహి. 4. వాయువు.

**సాది** నం. విశ. న్. వి. న్. 1. కూర్చుండినది. 2. అలసినది. 3. నీరసమైనది, ఖిన్నమైనది.

**సాది** నం. వి. న్. పుం. 1. గుఱ్ఱపురౌతు. 2. మావటి వాఁడు, గజాధిరోహి 3. సారథి.

**సాదితము** నం. విశ. అ. అ. అ. 1. కూర్చుండబెట్టఁ బడినది. 2. నీరసము, అలసము. 3. శ్రాంతము, అలసినది. 4. నాశముచేయఁబడినది, అంత మొందింపఁబడినది. 5. క్షీణించినది, శిథిలమైనది.

**సాదించు** అ. క్రి. మాటలతోబాధించు. బాధించు

ద్వి. మానమేరికిని సమానంబుగాన, మానంబుగాచి మామణులుబుట్టములు, సాదింపకింకఁ బ్రసాదింపు మయ్య, కాదన్న నిను మీఱఁగల మె యేమనిన. అ. మ. క. 2-75 పు. 5 పం.

ద్వి. మగడి వద్దిపడిగు మాయి: తునమచు,జగజాంగ ముద ౯ లి సాధించుచుం దె. ద్వి. పరమ. 4.302.

సాదు. విశ. (సం. సాధు: క. సాదు. చ. దాతు) యోగ్యుఁడు, మంచివాఁడు.

ఉ. ఎక్కడి కేగుదెంచితి వహీనవిహారచికిత్స నీకు నేఁ, జక్కనివారెఱుంగం దెలుచుఁ జంపితి దొంగిలి మున్నదీ యులన్,దక్కనులన్ నిమంబోదివి ప్రాణముగొందుఁ గడఁగిసాదువై, త్రుక్కిడియున్నఁబోవిడువఁదొల్లిటి త్రుళ్ళిక చెల్లదిచ్చుటన్. పాండురంగ. 5. 107.

2. సాధువు.

ఉ. వేదవమించు నీ విరహవేదన శాకఁగఁజాలఁ గంతునిన్, సాదవరాద గా తనదుసాదన చూపఁ దొడంగె. సారంగ. 2. 125.

సాదు[1] వి. సాధువైన పశువు.

ఉ.... శారదల పొలంబున నిల్చునె సాదు రేగినన్. విప్ర. 8. 41.

తే. మన్మథావేశ విలసన మహిమనెఱవు తవని, గని సాదురేఁగినఁదల పొలావ, నిలువదను మాట నిజమయ్యె నేఁడటంచు, మగువ నవ్వుచు కేఁత కుమారుచేసె. కళా. 3. 37.

కం. అనుజులకు నడ్డపడియే, మిని తేయఁగ నీమిఁ జూచి మెచ్చితిగాకీ, వును సాదురేఁగెనేనిన్నీను తల పొలమువనగాని నిలువదనుమ్మీ. భార. ఉద్యో. 2. 13.

ద్వి ఉతినిన పుండ్లపై నుప్పునుజల్లి, కెరలఁ జేసెదవు నేఁగినిచితినేని, చక్కఁబెట్టఁగలేరు సాదు రేగినను, బొక్కినిల్వను తలపొలమునఁగాని. హరిశ్చ. ఉత్త. 1. 259.

2. సాధువు. (సన్యాసి)

ఉ. ఆజిని తేజుగల్గి యలరారెడు నయ్యెకిమీడు వేయునూ, జాజుల రొక్కముల్ తొడవు లంద ము లన్ వలిపంపుఁ జీరలుం, జాజులుగాఁగ నింట గల సొమ్ములు నెమ్మినొసంగి యత్తటిన్, జాజుల కీదసాదులను బందుగులన్ దనియించె నెంతయున్. అ. రా. బాల. 196.

దుర్జనులఁగూడి పేదసాదులను గొట్టు. భల్లాణ. 3. ఆ. ౹శా.

సాదు[2] అవ్య. బాగు, మేలు.

కం. వేదాదివిద్య లెఱిఁగెన్ వేదండవిరోధి చండ విక్రముఁడు బుధుల్, సాదన శాస్త్రవులెల్లహా, సాదన తెవజెట్ల దొడరిసాదన సేయున్. రామా. 3. 149.

తే. నంతసంబయ్యె సుర రాజు సాదుసాదు. శృం. నై. 3. 16.

సాదు[3] న. క్రి. 1. సంరక్షించు, పెంచు. 2. సరిదిద్దు, అదుపులోనుంచు.

సాదుతనము వి. సాధుత్వము.

కం, సాదుతనంబునఁ దనరెడి, గాదిలినుతుఁజూచి మున్నుగైకొనిన మనః,ఖేదంబు వాసి. సమీర. 2. 201.

సాదృశ్యము సం. వి. అ. న. 1. పోలిక, సామ్యము. 2. ప్రతిరూపము, ప్రతిమ, ప్రతిబింబము.

సాద్యంతము సం. విశ. అ. అ. అ. మొత్తము, సర్వము, సకలము.

సాద్యస్కము సం. విశ. అ. ఈ. అ. తత్క్షణము, శీఘ్రము.

సాధంతుఁడు సం. వి. అ. పుం. సన్న్యాసి, భిక్షువు.

సాధకము సం. విశ. అ. ఆ. అ. సాధించునది.

సాధన సం. వి. ఆ. స్త్రీ. 1. సిద్ధి - సమాప్తి, పూర్తి. 2. పూజనము, ధ్యానము, అర్చనము. 3. ప్రసాదనము, సమాధానము.

సాధనక్రియ సం. వి ఆ. స్త్రీ 1. సమాపకక్రియ. (A Finite Verb) 2. కారకయుక్తమైనపని.

సాధనత సం. వి. ఆ. స్త్రీ. 1. సాధనము కలిగియుండుట, సాధించు సామర్థ్యము. 2. సంపూర్ణత.

సాధనపత్రము సం. వి. అ. న. సాక్ష్యముగా నుపయోగపడు పత్రము.

సాధనము సం. వి. అ. న. 1. సాధించుట. 2. ఉపకరణము. 3. ఉపాయము. 4. ధనము. 5. వధము

6. మృతసంస్కారము. 7. గమనము. 8. అను గమనము. 9. ఋణదానము. 10. నివర్తనము. 11. సైన్యము. 12. మగగుఱి. 13. తృతీయా విభక్తి. 14. ద్రవ్యము, పదార్థము. 15. సహాయము. 16. ఋజువు, సాక్ష్యము. 17. హేతువు (తర్కము). 18. జయము. 19. వశీకరణము. 20. తపస్సు. 21. ముక్తి. 22. ఔషధము. 23. అంగము, అవయవము. 24. మైత్రి. 25. లాభము.

సాధర్మ్యము సం.వి.అ.న. 1. సామ్యము, ఔపమ్యము. 2. సమానధర్మము కలిగియుండుట. 3. సమానగుణ శీలలక్షణములు కలిగియుండుట. 4. ఒకే మతము నకుం జెందియుండుట.

సాధారణత సం. వి. ఆ. స్త్రీ. సమానత.

సాధారణత సం. వి. అ. న. సాధారణత్వము.

సాధారణధనము సం. వి. అ. న. సమిష్టిస్వత్వము.

సాధారణము సం. విణ. అ. ఆ. ఈ. అ. 1. సామాన్యము. 2. విశ్వజనీనము. 3. తుల్యము, సదృశము. 4. అనైకాంతికము (తర్క). 5. సమానము.

సాధారణ సం. వి. అ. పుం. ఒక సంవత్సరము పేరు.

సాధారణము సం. వి. అ. న. 1. ఎల్లఅకు వర్తించు విధి. 2. సామాన్య నియమము. 3. జాతిలక్షణము.

సాధారణస్త్రీ సం. వి. ఈ. స్త్రీ. 1. సామాన్యస్త్రీ. 2. కులట.

సాధారణి సం. వి. ఈ. స్త్రీ. 1. వెదురుకొమ్మ. 2. తాళపుచెవి.

సాధారణీకరణము సం. వి. అ. న. 1. సామాన్యము చేయుట. 2. విశ్వజనీనముచేయుట. 3. స్వగతత్వ పరగతత్వాదిభేదము లేనిదిగాఁజేయుట (అలంకా). 4. నిర్విశేషము చేయుట. 5. పరిశుద్ధము చేయుట.

సాధారణీకృతి సం. వి. ఇ. స్త్రీ. సాధారణీకరణము.

సాధారణ్యము సం. వి. అ. న. సాధారణత.

సాధి సం. వి. ఈ. స్త్రీ. అత్త, శ్వశ్రువు.

సాధించు సం. స. క్రి. 1. పూర్తిచేయు, నిర్వర్తించు. 2. జయించు. 3. సంపాదించు, సమకూర్చు. 4. వశపఱచుకొను. 5. నేర్చు, గ్రహించు. 6. మానుచు, శమింపజేయు. 7. పోవు, తన త్రోవను తానుపోవు. 8. సమాలుచేయు (అప్పు మొ.). 9. పరిపూర్ణము చేయు. 10. సంహరించు, నాశనము చేయు 11. జయించు.

సీ. పెనుగొండ సాధించె. వరాహ. 1. 80.

తమకసాధ్యుల సాధింపఁదలఁపఁదగునె. కుమా. సం. 4. 78.

12. సంపాదించు.

వా. సంసారస్థితినుండి యోగగరిమన్ సాధించెనేనిన్. బుధో, త్తంస! జాతఁడెయంత దైర్ఘ్యమహిమన్ కాల్పంగఁ డాపోవునే, సంసారంబును జాని యైన సమమప్యంబైనచో నుండి వి,ద్యాంసుం డక్కన వంబు సేయఁగగుని ర్వాంఛా స్వభావంబునన్. శివ యోగ. ఉ. 1 ఆ. 18 పుట.

13. వశపఱచుకొను.

వ. ఇట్లు మాహిష్మతీపురంబు సాధించి నీలుచేత పరిఁగొని సహదేవుండు. భార. సభా. 1. 260.

14. నేర్చు, గ్రహించు.

మ....విశ్వామిత్రుఁడి ట్లయ్యెడన్, సతతాఖ్యాన కుతూహలాగ్రనియతిన్ సాధింపఁగా విద్యలా తతిఁ త్రావ్రి భయంబునన్ దలఁచి యత్యంతంబు వాపోయెడిన్. మార్క. 1. 149.

15. సంహరించు.

మ.... లతలన్ రోధించి సాధింపుమా. ఉ.రా.7.72.

సాధిక సం. వి. ఆ. స్త్రీ. 1. నిపుణురాలైన స్త్రీ. 2. గాఢ నిద్ర.

సాధికారము సం. విణ. అ. ఆ. అ. 1. ప్రభుత్వము గలది, అధికారముగలది. 2. రాజనియోగ బలము గలది.

సాధిక్షేపము సం. విణ అ. ఆ. అ. 1. తిరస్కారము. 2. అధిక్షేపముతో గూడినది.

సాధితము సం.విణ. అ. ఆ. అ. 1. వెలవేర్పఁబడినది. 2. పూర్తి చేయఁబడినది. 3. నిరూపింపఁబడినది. 4. పొందఁబడినది. 5. నిర్వర్తింపఁబడినది. 6. శిక్ష విధింపఁబడినది.

ఉ. సాధితసర్వధర్మ! యవసాదిత దుర్జనకర్మ. హరి. ఉ. భా. 9. 284.

6. వశః అవశకొనఁబడినది. 7. తిరిగి పొందఁబడినది. 8. దండుగఁదనము విధింపఁబడినది. 9. శిక్ష విధిం ప బడినది.

సాధ్వము సం. వి స్. పుం. 1 సౌజన్యము. 2. ఉత్కృష్టత. 3. శ్రేష్ఠత. 4. పరిపూర్ణత.

సాధిష్ఠము సం. విశ (సాధు, సాధీయాన్, సాధిష్ఠ) అ. అ. అ. సాధుతమము, మిక్కిలి సాధువైనది, మిక్కిలి వరిలమైనది

సాధిష్ఠానము సం. విశ. అ. అ అ. ఆశ్రయముగలది. ఆధారముగలది.

సాధీయము సం. విశ. స్. ఈ. స్. సాధుతరము.

సాధీయముఁడు సం. వి. వ పుం. 1. చాలగట్టివాఁడు. 2. చాల మంచివాఁడు.

సాధు సం అవ్య. మేలు, బాగు, బళా, చాలు, సరి.

సాధుజము సం. విశ. అ. అ. అ. సత్కులమున బుట్టినది. ఉన్నతసంభవము.

సాధుఁజేయు స. క్రి. చక్కఁజేయు.

సీ. వకులుని వైదుసాయకముల గ్రుక్కించి, సహదేవు నేడింట సాధుఁజేసి నవవిశిఖముల మాత్స్యవరేణ్యు వడఁగించి, యేడింట సాత్యకి యేపుమాపి. భా. ద్రోణ. 1. 205.

సాధుత సం. వి. అ. స్త్రీ. (రూ. సాధుత్వము. అ. న.) మంచితనము, సౌజన్యము, సౌశీల్యము, యోగ్యత, పరిపూర్ణత.

సాధుదర్శనము సం. విశ. అ. అ. అ. 1. అందమైనది. 2. ఆలోచనగలది, జాగ్రత్తగలది, దర్శనయోగ్యమైనది.

సాధువాదము సం. వి. అ. పుం. 1. మేలుమేలనుమాట. 2. పొగడ్త.

చం. ...దివంబునన్, వెలయఁగ సాధువాదములు వింటె. భార. సభా. 2. 31.

సాధువాహము సం. వి. అ. పుం. (రూ. సాధువాహి. న్. పుం.) సుశిక్షితమైన యశ్వము.

సాధువు సం. విశ. ఉ. త్రి. ఉ. 1. మంచిది, శ్రేష్ఠమైనది. 2. తగినది, ఒప్పయినది. 3. గుణవంతమైనది, పవిత్రమైనది, శుద్ధమైనది. 4. దయగలది. శాంతమైనది. 5. ఆహ్లాదకరమైనది, సుందరమైనది. 6. ఉదారమైనది. 7. ఉదాత్తమైనది, ఉత్తమవంశమున బుట్టినది. 8. సమర్థమైనది.

సాధువు సం. వి. ఉ. పుం. 1. సత్పురుషుఁడు, సుజనుఁడు. 2. ముని, యతి.

కం. అధునిక సాధునికరస, మాధిదురారాధితామహత్తర వార్తా,రోధార్థ విహితమచ్ఛి,త్రాధిగమా! పెద్ద వేంకటాధిప సుగమా! రాఘవపాం. 3. 143.

3. వణిజుఁడు. 4. జైనముని. 5. వడ్డీ వ్యాపారస్థుఁడు. 6. చక్కని (వాఁడు).

సాధువృక్షము సం. వి అ. పుం. కదంబము, కడిమిచెట్టు (వృ వి.).

సాధువృత్తము సం విశ. అ. అ. అ. 1. మంచి నడవడికగలది. 2. మంచి వృత్తాంతము గలది. 3. మంచి వర్తులాకారము గలది. 4. మంచి పద్యములు గలది.

సాధువృత్తము సం వి అ.న. సత్ప్రవర్తన, ఆర్జవము, సౌజన్యము.

సాధ్వృతము సం. వి. అ. న. 1. అంగడి, దుకాణము. 2. ఛత్రము. 3. నెమిళ్ళగుంపు.

సాధ్యఋషి సం. వి. ఇ. పుం శివుఁడు.

సాధ్యత సం. వి. అ. స్త్రీ. 1. సాధింపఁదగియుండుట. 2. సాఫల్యావకాశము. 3. నివర్తనయోగ్యత.

సాధ్యపక్షము సం. వి. అ. పుం. అభియోగమున వాది విన్నపము.

సాధ్యము సం. విశ. అ. అ. అ. 1. సాధింపవలసినది. 2. సాధింపఁదగినది. (చూ. సాధించు.) 3. శాస్త్రము వలన రూపొందినది.

సాధ్యము సం. వి. అ న. 1. సిద్ధత, పూర్ణత. 2. నిరూపింపవలసిన యంశము. 3. (తర్కము) అనుమేయము.

సాధ్యము సం. వి. అ. పుం. 1. దేవత. 2. ఒక మంత్రముపేరు.

సాధ్యసిద్ధి సం. వి. ఇ. స్త్రీ. 1. అభీష్టప్రాప్తి ఉద్దిష్టార్థలాభము 2. సిద్ధాంతము, సమాప్తి.

సాధ్యుఁడు సం. వి. అ. పుం. 1. ఒకజాతి దివ్యపురుషుఁడు. 2. గణదేవతావిశేషము, పన్నిద్దరు గణదేవతలలో నొకఁడు (వాచ.).

కం. సాధ్యుఁడు మూర్ఛ మునిగి రథ, మధ్యంబున ప్రాలి వేగమ ప్రబుద్ధుఁడై. పారి ఉ.భా. 10. 93.

శా. సాధ్యాది త్రిదశావలీస్తుతగుణ కృష్ణాతుంగభద్రాపగమధ్యద్వీప.... రాఘవాభ్యుదయము. 6. 863.

సాధ్వసపడు అ. క్రి. భయపడు.

కం. ఉసురుకొనం గనరివవెర, దెసచెడి యుక్కొండ నెక్కితి వతండిటు దాఁరసమై వచ్చుటకున్ సాధ్వస పడఁగాఁ ణము తేటపడ వినుమింకన్. చంపూరా. 6. 226.

సాధ్వసము సం. వి. అ న. 1. భయము. 2. ఉద్వేగము, ఉత్తలపాటు.

సాధ్వి సం. వి. ఇ. స్త్రీ. 1. పతివ్రత, క్రొత్తది, శీలవతి 2. ఒక దినుసుదుంప. 3. భ. వ. జ. న. స. వ. వ. భ. గురువుగల వృత్తము; 8. 12. 22. యతులు.

సాన వి. (సం. శాణః. ప్రా. సాణ) 1. ఒఱపుఱాయి, అస్త్రము మొ॥ పదునుపెట్టు ఱాయి. 2. గంధముకొఱకు గంధపుచెక్కతో రాచెడి ఱాయి. 3. మణులమొక్కలు బోఁజాచెడు ఱాయి 4. గంధము తీసుకొనుఱాయి.

ద్వి. ముదమున వలపలి మోఁచేయిసాన, గదియించి తిగిచి శ్రీగంధంబు వడసి బస. పు. 4. 87వ పం.

సానందము సం. విశే. అ. ఆ. అ. ఆనందముతోఁ గూడినది, సంతోషపడినది.

సానకత్తి వి. సాదనకత్తి.

వ. పులులెక్కిన యంగములు దుఱంగలింపఁజూ పట్టుకరమ్ముకరంబుల నిలుపు సానకత్తుల వెగు ఘుణంబుల నిక్కనొరిగి. ప్రబం. 1. 78.

సాన(ల)దీఁరు అ. క్రి. సాన యొఱపిడిచే మెఱుగెక్కు.

ఉ. సత్కవికల్పనా విశేషావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్ .... వసు. 1. 19.

సీ. అంగనాంగ్రాతి సంగోపమాపఁబు వనవిల్తు సానదీర్చిన కోరు బది క్రొవ్విరివన్నెవము రాజవాహన. 3. 75.

చం. అరుకొనఁ యింత లేఁకుచుమాష్టుఁడు క్రొన్నెలం సానదీరు చెంగలువలకోలలన్. దశా. 3. 43.

సీ.... ముద్దియకమ్మ కెమ్మోవి మాణిక్యము సానదీరవరితి ఛాయయాపె. దశా. 9. 107.

సానఁదేఱు అ. క్రి. మెఱుఁగారు, పదునెక్కు.

సీ.... తెలివాలుగను కెలంకుల సానఁదేఱెడి చికిలి చూపు లొకింత సిగ్గుగులుక .... దశా 6. 15.

సానఁబట్టు స. క్రి. పదునుపెట్టు, మెఱుఁగుపెట్టు.

చం....అమ్మునిపాలికివచ్చె వేల్పుఁడో, య్యలి మను సానఁబట్టిన యనంగుని మోహనబాణమో యనన్. మను. 6. 21.

గీ. సానఁ బట్టిన రాపాడి చేల్లి మెరిసి. మను. 2. 86.

తే. సానఁబట్టిన మకరాంకు శస్త్రమువఁగ. పారి. 1. 78.

సానఁబెట్టు స. క్రి. (సానన్+పెట్టు) సానపై నూఱి పదునుపెట్టు.

తే పెడమరలి యేసె వాని వప్పుడమునందు, సానఁ బెట్టిన మోహనాస్త్రంబు దొడిగి. శృం. నై. 5. 116.

సానలము సం. వి. అ. పుం. సాంబ్రాణిపువుంక.

సానలవాఁడు వి. మణికారుఁడు, మణులను బాగుచేయువాఁడు.

సీ. సానలవాఁడు పూసలవాఁ డనంగను, మణికార సంజ్ఞయై మనుచునుండు .... ఆం. భా. 2. 286.

సానసి సం. వి. అ. పుం. బంగారము.

సానాకత్తి వి. సానకత్తి.

సీ. వనవింటి వాని సానాకత్తి పరుజుటెక్కుల చొక్కటపు సాముకొంటెలర. కువల. 1. 86.

సానాగడ వి. సాదనకట్టి.

కం. కాంచిన వనసానాగడ, కెంచపు మాస్టీఁడు బెట్టుగెంలుచు. ఉ. హరిశ్చ. 4. 114.

సాని వై. వి. (సం. స్వామినీ. త. చాని. క. సాని)
1. స్త్రీ.

సీ అయ్యిద్దఱును గృష్ణవర్ల్గొప్పఁ దోఁడ్కొని చని యొక్క ముదుసలిసాని కవుడు. భార. ఆది. 7. 221.

2. అధిపురాలు, రాణి.

కం. మానిని విను నావట్టపు, సానిగ నొనరించి సకలసామ్రాజ్యంబున్, మామగ నీకిడి కొలిచెద. రసిక. 6. 114.

సీ ఏమన్నదని యెంగాకేమి మీ యేలికసాని వచ్చితి వీవ చాలు మాకు. కాశీ. 6. 221.

3. భార్య. చూ. ఒజ్జసాని.

తె. పెట్టుపోతల నాగసాని పెట్టిసాని, యింటికడ మండి యజ్ఞాదులంటువాఁడు. కుశ. 2. 203.

4. వేశ్య, వారస్త్రీ.

ఉ.... సామలకూటముల్ గలుగు జాణలు నీటులు వెట్టకుందురే? దశా. 2. 155.

ఉ.... దేవుని సానివారికి మద్దెలకానికి పుల్లాయ యముల వారికి క్షేత్రమగు. 2000. 1161. వె. శా. 8. 1058.

సీ. తే.... శ్రీమేశ్వరునిగొల్తు రవ్వురమున, సాను లను పేరి యప్సరశ్చంద్రముఖులు. భీమ. 1. 89.

5. స్త్రీల పేళ్ళచివఱ అమ్మయను వర్థమున వచ్చు ప్రత్యయము.

ఉ. ...మంత్రి శ్రీధరుఁడు వానికి మారవసానికిని బృహస్పతి నిభుఁ డుద్భవించె బుధబంధు నిధానుండు గంటడిమ్మహిన్. వా. శా. ద. శా. 4. 695.

వెంటిసెట్టకిం పేకసానికి సుపుత్రుండైన కానిసెట్ట. దా. శా. 1147.

వశిష్ఠ గుణవతి తన్య యొఱియాసానికి విప్రకులా. దా. శా. 1164.

తమతల్లి మల్లాసానికిం బెట్టిన అఖండవర్తి. దా. శా. 1068.

దండనాయక చోడవనాయకునితల్లి కొమ్మసాని పెట్టిన. దా. శా. 1079.

వృత్తిగల స్త్రీ (మంత్రసాని), దేవదాసి. శ్రీమేశుండు సాని వాడకరుగున్. భీమ. 1. 112

(పెమ్మసాని, అల్లసాని ఇత్యాదిగా గృహనామ ముల యందును కనిపించుచున్నది) (దేశప్రాంతీయ నామముగాగూడ కలదు. కురాసానియోమము (వాచ.).

సానిక సం. వి. ఆ స్త్రీ. 1. గొట్టము, వెదురు గొట్టము. 2. మురళి, పిల్లనగ్రోవి.

సానిక వి. వెలుపాటి తట్ట. ఆం. భా. 2. 245.
2. మట్టికంచము. 3. మల్లె. (శ. ర.)

సానికరణము లెక్కలు సరిచూచు(ట)వాడు.

సానిప (రూ) సామ్పు, సానుపు, సానిపి. వి. వాకిలి తుడిచి కళ్ళాపు నీళ్ళుచల్లుట. (వాచ).

సానివాడ వి. 1. వేశ్యవాటి. 2. దేవదాసీలు నివ సించు పేట.

"శ్రీమేశుఁడు సానివాడ కరుగున్. భీమ. 1. 112.

సానివాఁడు వి. భోగము కులమువాఁడు.

సానుకంపము సం. విశే. అ. ఆ. అ. దయగలది, సాను భూతిగలది, జాలిగలది, అనుకంపగలది.

సానుక్రోశము సం. విశే. అ. ఆ. అ. సుకుమారము, దయగలది, జాలిగలది.

సానుతాపము సం. విశే. అ. ఆ. అ. పశ్చాత్తాపము గలది, సంతాపముగలది.

సానునయము సం. విశే. అ. ఆ. అ. 1. వినయము గలది. 2. మర్యాదగలది. 3. ఆదరముగలది. 4. నాగరికమైనది.

సానుబంధము సం. విశే. అ. ఆ. అ. ఎడతెగనిది. నిరంతరమైనది.

సానుమంతము సం. వి. త్. పుం. త్. తీ. త్. పర్వతము.

సానుమంతము సం. వి. ఈ. స్త్రీ. సానుమతి, ఒక యప్సరస.

సానురాగము సం. విశే. అ. ఆ. అ. ప్రేమగలది, చనవుగలది, ఆసక్తమైనది.

సానువు సం. వి. ఉ. పుం. 1. శిఖరము, శృంగము.

2. కొండనెత్తము, ఉపరితలము. 3. మొలక. 4. అడవి. 5. బాట, పథము. 6. పైభాగము, అగ్రము. 7. పర్వతప్రాంతము. 8. సుడిగాలి. 9. విద్వాంసుఁడు. 10. సూర్యుడు.

**సానేయి** సం. వి. ఈ. స్త్రీ. సానిక.

**సానేయిక** సం. వి. అ. స్త్రీ. సానిక.

**సాన్నాహనికము** సం. విశ. అ. ఈ. అ. 1. కవచము ధరించువది. 2. యుద్ధమునకుఁ బురికొల్పువది.

**సాన్నహనికుఁడు** సం. వి. అ. పుం. కవచధారి, కవచవాహి.

**సాన్నాయ్యము** సం. వి. అ. పుం. హవిస్సు, దధి పయోరూపమైన హవిస్సు (అని కొందఱు). శ. ర.

సీ. ప్రాగ్వంశబంధుర బహుగంధ సాన్నాయ్య మాగ్నీధ్ర ముఖ్య ర్త్విగాశ్రయంబు. ఉ. హ. 2. 108.

**సాన్నిధ్యము** సం. వి. అ. న. 1. సామీప్యము. 2. ప్రత్యక్షము, సాక్షాత్కారము. 3. పొందు.

**సాన్నిపాతికము** సం. వి. అ. ఈ. అ. 1. మిశ్రము, సంకరము, కలగాపులగము. 2. క్లిష్టము, సంకీర్ణము. 3. వాతపిత్త శ్లేష్మదోషముల సాంకర్యము.

**సాన్యాసికుఁడు** సం. వి. అ. పుం. 1. తురీయాశ్రమస్థుఁడగు బ్రాహ్మణుఁడు. 2. సన్యాసి.

**సాన్వయము** సం. విశ. అ అ. అ. 1. సంబంధము గలది. 2. వంశపరంపరాగతమైనది. 3. పైతృకము.

**సాపడు** = సాదము + పడు (త. చాప్పిడు) వ. క్రి. తిను, భుజించు.

చం. మరలి వసుంధరామరకుమారుఁడు వైష్ణవ రాజమందిరాం, తరముల కేగి యందు నియతంబగు మాధు కరంబుఁదెచ్చి శ్రీ,హరికి సమర్పణం బని తదన్నము సాపడి రేవగళ్ళు దా,వరముగనుండె నయ్యుటజవాటికఁ దోఁటకుఁ బ్రోది సేయుచున్. విక్ర. 2. 33.

ఉ. శీతలవారిఁ ద్రావువడఁ జెందినవాఁడు క్షుధార్తుడిష్టమృష్టా, తరభక్ష్యమాంసకలితాన్నము సాపడు. భర్గ. 3. 19.

**సాపత్నము** సం. విశ. అ. అ. అ. 1. పతివల్ల కలిగినది, సవతికి సంబంధించినది.

**సాపత్నులు** బహు. సం. వి. అ. పుం. సవతి బిడ్డలు.

**సాపత్న్యము** సం. వి. అ. న. 1. సవతితనము. 2. వైరము, స్పర్ధ, పోటి.

**సాపత్న్యుఁడు** సం. వి. అ. పుం. 1. సవతి కొడుకు. 2. శత్రువు.

**సాపరాధము** సం. విశ. అ. అ. అ. నేరముగలది, అపరాధముతోఁ గూడినది.

**సాపవాదము** సం. విశ. అ. అ. అ. 1. అపనిందను ప్రచారము చేయునది. 2. అపవాదము పాలైనది.

**సాపాటు** √సాదము. వి. ఆరగించుట.

తే. గీ. ధాన్యముష్టి గులామెత్తి దావనిత్య. మేక తంబువఁ దా స్వయంపాక మాచరించి సాపాటుఁ జేయుదువంచు వదని, మొఱఁగి తన యింటి కేగి ముమ్మాఱు భుజించు. వైజ 2. 122.

**సాపించు** వ. క్రి. (సం. శాపించు) శపించు, తిట్టు. ద్వి. కటకటా! సాపించెఁగాక యత్తపని. బస. పు. 149 పే. 12 పం.

**సాపిండ్యము** సం. వి. అ. న. 1. ఒకే పితృదేవతావర్గమునకు పిండము లర్పించు సంబంధము. 2. బంధుత్వము, రక్తబంధము. 3 జ్ఞాతిత్వము.

**సాపెనలమారి** వి. శాపనశీలుఁడు, తిట్టుబోతు.

తే. గీ. చేటపెయ్యకళ్ళుచ్చు చెడుగుసాపెనమారి. హంస. ౯. 113.

**సాపేక్షము** సం. విశ. అ. అ. అ. 1. సంబంధించినది, అన్యముపై నాధారపడినది. 2. కేవలముకానిది. (వ్యతి. నిరపేక్షము)

**సాప్తపదము** సం. విశ. అ. ఈ. అ. కలిసి ఏడు అడుగులు నడచుటవలనఁ గాని ఏడు మాటలు పలికికొనుట వలనఁగాని ఏర్పడినది.

**సాప్తపదము** సం. వి. అ. న. 1. వధూవరులు అగ్నికి ప్రదక్షిణముగా ఏడు అడుగులు వైచుట. 2. మైత్రి, స్నేహము.

సాప్తపది సం. వి. ఈ. స్త్రీ. చూ. సాప్తపదము.

సాప్తపదీనము సం. విశే. సం. వి. అ. న. చూ. సాప్తపదము.

సాప్తపౌరుషము సం. విశే. అ. ఈ. అ. ఏడు పురుషాంతరములకు సంబంధించినది.

సాఫల్యము సం. వి. అ. న. 1. ఫలప్రాప్తి, ప్రయోజనము. 2. లాభము. 3. జయము.

సాఫీ హిం. వి. శుభ్రత, తిన్నదనము.

సాఫు హిం. విశే. తేట, శుభ్రమైన, వంకరలేని, సూటియైన.

సాఫు వి. తుడుపులు, తప్పులులేనివ్రాత.

సాబాధము సం. విశే. అ. ఆ. అ. 1. క్రమరహితమైనది. 2. చెల్లాచెదరైనది.

సాఁబాలు వి. (సాము+పాలు) సగము, అర్ధభాగము, సగముభాగము, పంగోలు.

సీ. గోరఁబోఁజిమ్మినమాడ్కి గొన్నింటి జక్కసాఁబాలుగా వ్రయ్యలు వాపి పాపి. భార. విరా. 5. 35.
(వృత్తియందు సాముశబ్దమున కంత్యవర్ణలోపము)
(సగమునకు సాయాదేశము)

మ. వశి శుభ్రూషలఁ గైకొనున్ మఱియుఁదా సాబాలు ధర్మస్థితిన్. మార్కం. 2. 179.

సీ. ఏగంధగజయాన హృదయ మువ్విళ్ళూర్చి భవుని మైఁ జక్కసాఁబాలుఁగొనియె. కాశీ. 4. 150.

సీ. .... వడిబెట్టులోఁజెఱకడవము సాఁబాలూన తెంగుసంబారంపుఁజింతపండు. ఆము. 2. 97.

సీ. పచ్చకప్పురము సాఁబాలు కూర్చికుంకుమ మదమున గీలువాయుంబు దిద్ది. కువల. 2. 4.

సాఁబాలు వి. సమాంశము, అర్ధాంశము.

ఉ. కేలనుబోటువాలు దులకింపఁదలందొగ మేలు మేలిసాఁబాలున నాలుకెం జడల పట్టున దొన్కినలాడుచుండు పెన్ జాలు విరుందగల్పి పాదచారల పన్నె మెకంబుతోలు డాకాలునగండ పెండెపు చౌకారపుడాలును గల్గు సామికిన్. చెన్న. 3 ఆ. 33 ప.

సాబ్లి సం. వి. ఈ. స్త్రీ. ఒక విధమైన ద్రాక్ష.

సాబాసు[1] (సేబాసు) అవ్య. ప్రశంసార్థకము.

శా. ....మఝ్ఝూరే శిరము బాగురే స్ఫురితముల్ సాబాసు ధాలంచు. చంద్ర. 1. 129.

సాబాసు[2] వి. మెచ్చుకోలుపదము.

కం. జాబొమ్మకు గిలిగింతలు, నీబోటునిబేలు వలచి నెపిదెచుట్టంబై బమయించెను నన్నున్, సాబాసేబాస వాని సరసకుఁ దియకే. ప్రపం. 1. ఆ. 680.

సాభిప్రాయము సం. విశే. అ. ఆ. అ. 1. ఉద్దేశపూర్వకము. 2. సార్థకము. 3. రత్యాదిభావసహితము. 4. వ్యంజకము.

సాభిమానము సం. విశే. అ. ఆ. అ. 1. అహంకారముగలది. 2. గర్వముతోఁ గూడినది. 3. అభిమానముతో కూడినది.

సాభోగము సం. విశే. అ. ఆ. అ. విస్తృతిగలది, విశాలమైనది.

మ. అవితోర్వీ నవఖండ! ఖండపరశుజ్యాభోగి సాభోగ భాగవిభాస్వద్భుజదండ .... వసు. 1. 164.

సాభ్యసూయము సం. విశే. అ. ఆ. అ. 1. ఈర్ష్యగలది 2. అసూయతోఁగూడినది. 3. ఓర్వలేనిది.

సామంజస్యము సం. వి. అ. న. 1. ఔచిత్యము, యోగ్యత. 2. అన్యూనాధిక్యము. సరిపడియుండుట, ఒప్పు.

సామంత సం. వి. అ. పుం. ముప్పదిరెండు నపుంసకరాగాలలో నొకటి.

సీ. మధ్యమావతియును ముఖారి మలహరి సామంత పంతువరాళియు బౌళిరాగ. హంస. 5. 124.

గీ. చెంచు మలహరి దేశాక్షి శ్రీవరాళి మాళవియుఁ బాండిసింధురామక్రియయు వసంత సామంత శుద్ధవసంత గుజ్జరియును హెజ్జిజి నీలాంబరియు ననంగ

తే. గీ. పొసఁగు ముప్పదిరెండు నపుంసకములు హంస. 5. 125.

వి. ఒకానొకరాగము.

సీ. శుద్ధ వసంత మధ్యమానతులు సామంతమనువారు ఇను చెంచు మహారియు ముఖా మారి వియును. ప్రబం. ఆ. 1, 68.

సామంతము సం. విణ. అ. ఆ. అ. 1. పొరుగున నున్నది, పొలిమేరనున్నది. 2. సార్వజనీనము, సామాన్యము.

సామంతము సం. వి. అ. న. ఇరుగుపొరుగు, చుట్టు పక్కములు, ప్రౌఢిమ, దిట్టతనము. (క. సామన్త) కం. అంతట నాగసరంబుల, నింతులు శానములు మిగుల హెచ్చింపుచు, సామంతము వరపన్ ఖరియు వసంతములోనైన దనుచు జనుచే మఱి యున్. యయా. 4. ఆ. 147.

సామంతరాగోల వి. ఆయుధవిశేషము.

ద్వి. సామంతరాగోల చంకనబెట్టి. పల్నా. వీర. పుట. 11. 119.

సామంతుఁడు సం. వి అ. పుం. 1. ఒకదేశము వెల్లకు చేరికనున్న రాజు. 2. పొరుగున నున్నవాఁడు. 3. అరిగాపు 4. నాయకుఁడు.

సామంతవళు(దు)లు వి. వి. వస్త్రవిశేషము.

సీ. నిండువన్నెలు మంచినిగమ గోచరులు సామంత వళులు ప్రతిమలును బొగడవచ్చులును. ప్రబం. 1. ఆ. 272.

సామకము సం. విణ. అ. ఆ. అ. సామవేదసంబంధి.

సామకము సం వి. అ. న 1. అసలుసొమ్ము. 2. ఋణమిచ్చిన ధనము.

సామకము సం న. అ. పుం. 1. సాన. 2. ఒఱపిడి రాయి

సామగర్భుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సామగాయనుఁడు సం. వి. అ. పుం. సామగానము చేయు బ్రాహ్మణుఁడు.

సామగ్రి సం. వి. ఈ. స్త్రీ. 1. వస్తుసముదాయము, సాధనసంపద. 2. నిలువసరుకు, పదార్థసంచయము. 3. ద్రవ్యసంభారము.

సీ.... సారెకనుష్ఠాన సాధనసామగ్రి, నతఁడు తెమ్మనక యాయితముఁజేసి. రాఘవాభ్యుదయము. 3. 53.

సామగ్ర్యము సం. వి. అ. న. 1. సంపూర్ణత.

శా. ... గోష్ఠీ సముల్, మాంగల్యోత్సవ గ్రాం నె. తియను పావగ్ర్య బనం ఒదలు, ర్వ్యాంగ గన్. పాం. పూర్వ. 8. 22.

2. పాత్రము, ... 3. ... సంభారము, అమరర వస్త్రము. 3. సాధనసంచయము. 4. సంభారము, నిలువ.

సామజ(జాత)ము సం. విణ. అ. ఆ. అ. 1. సామవేదమునుండి పుట్టినది 1. సామోపాయమువలనఁ గలిగినది.

సం. వి. అ. పుం. ఏనుఁగు.

మ. కరదీపంబులతోడ సామజ తురంగస్యంద నౌఘంబుతో.... ఉ. హ. 3. 26.

సామనము సం. విణ. అ. ఆ. అ. (వైదికము) శాంత మైనది, సౌమ్యమైనది.

సామని(మ్ని) సం. వి. ఈ. స్త్రీ. పశువులను గట్టి వేయుత్రాడు.

సామన్యుఁడు సం. వి. అ. పుం. న. 1. సామవేద నిష్ణాతుఁడు. 2. ఋగ్గానవిపుణుఁడు.

సామము సం. వి. న్. న. 1. శాంతపఱచుట, ఓదార్చుట, అనునయించుట. 2 సంప్రదింపు, నచ్చ చెప్పుట, హితము (చతుర్విధోపాయములలో మొదటిది. చూ. శ. ర.) 3. మృదువచనము. 4. సౌజన్యము, సౌమ్యము. 5. స్తుతిరూపమైన పద్యము లేక పాట. 6. సామవేదమందలి మంత్రము, చతుర్వేదములలో నొకటి.

సీ. తే .... సామగానారవంబు, వంతకంతకుఁ దెలంగ .... ఉ. హ. 2. 111.

సామయాచారికము సం విణ. అ. ఈ. అ. 1. సమయములకు, ఆచారములకు సంబంధించినది. 2. సాంప్రదాయికము.

సామయికము సం. విణ. అ. ఈ, అ. 1. ఆచారమునకు సంబంధించినది, సాంప్రదాయికము. 2. సమ్మతము, అంగీకృతము. 3. నిర్ణయానుసారి. 4. వేళ తప్పనిది, సకాలము. 5. న్యాయము, సముచితము. 6. అప్పుడప్పుడు జరుగునది. తాత్కాలికము.

సామయికాభావము సం. వి. అ. పుం. 1. నిలకడలేమి, క్షణికత్వము. 2. మిథ్య, అసత్తు.

సామయోని సం. వి. ఇ. పుం. 1. బ్రాహ్మణుఁడు. 2. ఏనుఁగు.

సామరస్యము సం. వి. అ. న. సమరసభావము, మైత్రి, ఐకమత్యము, చెలిమి.

సాముఁరి (సాము + అరి) విశే. సామునేర్చినవాఁడు, సాముచేయువాఁడు.

ఉ. సంవెఁగ మొగ్గముల్కి గదసాముఁరి .... విజ. 1. అ.

తే. గీ. గడలు కాడా ల్పటాలు వగ్గలికఁబూని, పరు వడల్ ద్రొక్కుకొనుచు విల్పఁపుబీఁటములు గనం బడ సాముఁరుల్ మ్రోల వెలఁగ, సాదన లొనర్చు వెల్లు పొచ్చరిక లెవఁగ. రసిక. 1. 81.

సామర్థ్యము సం. వి. అ. న. 1. శక్తి, బలము, వీర్యము, దక్షత. 2. ఏకలక్ష్యత, ఏకాశయత్వము, ఏకార్థకత్వము, ఏకప్రయోజకత్వము. 3. యోగ్యత, ఔచిత్యము. 4. అర్థసమర్పణశక్తి, సంకేతశక్తి, అభిధాశక్తి. 5. లాభము, వద్ధి. 6. ధనము, సంపద. 7. ఉత్పాదకత్వము. 8. కారణత్వము. 9. సాధకత్వము.

సామవాయికము సం. విశే. అ. ఈ. అ. 1. సాముదాయికము. 2. అవినాభావ సంబంధముగలది.

సామవాయికుఁడు సం. వి. అ. పుం. 1. సచివుఁడు, మంత్రి. 2. సంఘాధ్యక్షుఁడు, నాయకుఁడు.

సామవేదము సం. వి. అ. పుం. నాల్గువేదములలో నొకటి. (ఋక్, యజుర్, సామ, అథర్వణము అని వేదములు నాలుగు.)

ద్వి. అనుపమ సామవేదాన్విత మహిమఁ జనిన రుద్రప్రశంసాపరోక్తులను. పండితా. పుట. 1.504.

సామవేది సం. వి. న్. పుం. సామవేదాధ్యాయియైన బ్రాహ్మణుఁడు.

ద్వి. శ్వపచయ్య నాఁగ నాసామవేదులకు పండితా. 1. 151.

సామవేదీయుఁడు సం. వి. అ. పుం. ఛాందోగ్యుఁడైన యాజకుఁడు.

సామాజికుఁడు సం. విశే. అ. ఈ. అ. 1. సమాజమునకు సంబంధించినది. 2. సభాసంబంధి. 3. సంఘ సంబంధి.

సామాజికుఁడు సం. వి. అ. పుం. 1. సమాజమందలి వాఁడు. 2. ప్రేక్షకుఁడు, శ్రోత. 3. సహృదయుఁడు, రసికుఁడు.

సామానాధికరణ్యము సం. వి. అ. న. 1. సమానావస్థయందుండుట, తుల్యస్థితికత్వము. 2. ఏకాధికారమునకు లోఁబడియుండుట. 3. ఏకాశ్రయత్వము, ఏకాధారత్వము.

సామాను హిం. వి. సామగ్రి, వస్తువులు.

సామాన్య సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక నాయికాభేదము. (స్వీయ, పరకీయ, సామాన్య అని నాయికలు ముత్తెఱఁగు) 2. వేశ్య, కులట.

సామాన్యజ్ఞానము సం. వి. అ. న. 1. జాతిలక్షణము లను మాత్రమే యెఱుఁగుట. 2. ఎల్లరకుఁగల జ్ఞానము.

సామాన్యపక్షము సం. వి. అ. పుం. 1. ఉభయమునకు సంబంధించిన విషయము. 2. మధ్యస్థము.

సామాన్యము సం. విశే. అ. ఆ. అ. సాధారణము. 2. సదృశము, తుల్యము. 3. మధ్యమము. 4. గ్రామ్యము, అవిశేషము. 5. మొత్తము, సర్వము.

సామాన్యము సం. వి. అ. న. 1. సమాజము, జాతి, సమూహము. 2. సమానధర్మము, జాతిధర్మము. 3. మొత్తము, సర్వస్వము. 4. జాతి, తెగ. 5. ఐక్యము, అభిన్నత్వము. 6. సమానత్వము, తుల్యత్వము. 7. ప్రజావ్యవహారము. 8. సార్వవిషయికమైన యర్థమును ప్రతిపాదించు వాక్యము.

సామాన్యలక్షణము సం. వి. అ. న. 1. జాతి గుణ ధర్మములను మాత్రము వివరించు నిర్వచనము (తర్క.). 2. సముదాయమైన గుణక్రియాదికము.

సామాన్యశాస్త్రము సం. వి. అ. న. 1. నిత్యముగా సర్వమునకు వర్తించు నియమము, సాధారణవిధి. 2. సాధారణమైన ఆధునిక విజ్ఞానశాస్త్రము.

సామాసికము సం. విశే. అ. ఈ. అ. 1. సామూహికము, సాంగోపాంగము, సమగ్రము. 2. సంక్షిప్తము,

సంక్షిప్తము, క్లుప్తము, లఘువు. 3 సమస్త పదము నకు సంబంధించినది. 4. సమసించినది, సమస్తము.

**సామానికము** సం. వి. అ. న. సమాసములకు సంబంధించినది, సమాస సమూహము.

**సామి** వి. 1. రాజు. 2. దేవుడు. "ఓ సామి యిపుడేమి సేయుదు". ఉ. రా. 1. ఆ.

వి. (సం. స్వామి) ప్రభువు.

కం. మాయాతు మలానినయది

పాయక నం తోసమున్న నలమిఁ సామీ! కళా. 6. 161.

వై. వి.

సీ. వెలిదమ్మి రేకు బొత్తుల చిన్నిపాపఁడు.

వలుమోముదమ్ముల వెలయుస్వామి. దశా. 2. 62.

3. పెనిమిటి.

గీ. ఒక యలాబు కలాటుకుండోదరమున, బాన్పి యటుడించి తాను బొత్తుగలన్, సామి దప్టాన్న కబళముల్ సామికొనగు, ననుచు జను లెచ్చరిల్లుచు నిగుడఁబోడి. పాండు. 8. 87.

సీ ఏ సామి సామేన వేప్రొద్దు. సీలా. 1. ఆ. 128.

గీ. పోదెమూసామి వేఁటాడిపూడరాదె. ఉ. రా. 1. ఆ.

గీ. సామి నముఁగూర్చి నీతోడ నేమిపలికె". (అచ్చు. సుం. కాం.- క. ర)

[illegible]. కుమారస్వామి.

[illegible]మి సం. అవ్య. 1. సగము, అసంపూర్ణము. 2. నింద్యము, నీచము.

"దంతమరీచులసామి నిర్గమంబు" విరాట. 1. ఆ.
"హరి యిచ్చుటనె సామి హరియై హిరణ్యకశిపుజీరె ఖండనఖశిఖరములను". వాల్మీకి 2. ఆ. 56.

**సామిగట్టు** స్వామిమల, కుమారస్వామి యున్న కొండ
వలిచెట్టునాకుఁ గానలిగట్టు దేవఁ సామిగట్టుకు నేను సామినౌదయు. చంద్రా. 3. ఆ. 45.

**సామిధేని** సం. వి. ఈ. స్త్రీ. 1. సమిధ. 2. ఋగ్విధ (యాగమునందు అగ్ని ని జ్వలింపఁ జేయునపుడు చదివెడు ఋక్కు.)

**సామిమల** వి కుమారస్వామి నసించియుండు నొకా నొక పర్వతము.

వ. "సామిమలకుంజని మహాముని ఘటోద్భవుఁడు" కాశీ. 4. ఆ. 80.

**సామిద్రోగి** వి స్వామిద్రోహి.

వ. సామి గుల్లై పాపహోయెడివారు తిరుగ రానే ద్రురా. ప్రబ. 1. ఆ. 155.

**సామీచి** సం. వి. ఈ. స్త్రీ. స్తుతి, శ్లాఘ, నమస్కారము.

**సామీప్యము** సం. వి. అ. న. చేరిక, సాన్నిధ్యము, సమీపత్వము.

**సామీప్యుఁడు** సం. వి. అ. పుం. 1. పొరుగువాఁడు.

**సామీరి** సం. వి. ఇ. పుం. 1. హనుమంతుడు. 2. భీముడు.

**సాము** వి. 1. సగము, సగభాగము, అర్ధము.

గీ. అజుసాము సగము సవము నాఁగ వర్ధావ్హ్య యంబులొ నాగభూష. ఆం. నం. 78.

చం. కన్నులు సామమూయుచుం, బొరిబొరిదేటి చూచుచును. భా. రా. కిష్కిం. 875.

చం. కవిసి ధరంబులైన మునికార్యము వేయఁగ సామునీరిలోను వెదలకుండి కూర్మము. భార. అను. 1. 232.

తే. గీ అతని దేహంబునందు సామాలిఁజేసి. కుమా. సం. 4. 52.

2. వ్యాయామము.

ఆ. వె. చదువుసాముగలిగి క్షత్రియుల్ న పూర్ణ విద్యలనఁగ నీటవిసుతికెక్కె. కవి. 1. ఆ.

క. సాము దిగవిడిచి యొడలిటు, సాముగ వట్టి దని నిడు...వమూని... అని రెండ్ఘములకను లక్ష్యము వాసి. 2 ఆ.

**సాము** విశే. సగము.

కం వృధుమేనిసాముకూతురు, జడనిధిచెలికాని కొడుకు నగ్ని సహితన్. గొంకోలకదలికదలకు, వడకుం గుబ్బలి సరియొసమధార్థముల్. హర. 6. 24.

**సాము** వి. వ్యాయామము.

గీ. సాముగండిలు మాకు గోత్రామరేంద్ర. మను. 2. 48.

**సాముకంటిచుక్క** వి. (సాముకన్ను+చుక్క) పూర్వ ఫల్గుణి నక్షత్రము. శ. ర.

**సాముకొప్పు** వి. అరకొప్పు.

వలిచుట్టి పూదండ వెలిచుట్టుగవకొప్పు: శవ్వు చిప్పిలు సాముకొప్పుదనర వాసి. 2. ఆ. 18.

**సాముదాయికము** సం. విశే. అ. ఆ. అ. 1. సామూహికము, 2. మొత్తమునకు లేక సర్వమునకు సంబంధించినది.

**సాముద్రము** సం. విశే. అ. ఆ. అ. సముద్రమునం బుట్టినది.

**సాముద్రము** సం. వి. అ. న. 1. సముద్ర లవణము. 2. సారచేవ యొముక, 3. భాగ్యసూచక దేహలక్షణము.

**సాముద్రికము** సం. విశే. అ. ఈ. అ. 1 సముద్రమునం బుట్టినది, సముద్రసంబంధి, 2. అదృష్ట సూచక దేహలక్షణములకు సంబంధించినది.

**సాముద్రికము** సం. వి. అ. న. సాముద్రికశాస్త్రము; శరీరావయవములను బట్టియు హస్తరేఖలను బట్టియు ఫలమును చెప్పునట్టి శాస్త్రము.

**సాముద్రికుఁడు** సం. వి. అ. పుం. 1. సాముద్రిక శాస్త్రవేత్త. 2. హస్తరేఖలబట్టి భవిష్యత్ఫలములు తెలుపువాఁడు.

**సాముద్రుఁడు** సం. వి. అ. పుం. 1. సముద్రయాత్ర చేయుచుండువాఁడు. 2. నావికుఁడు.

**సామునెలముల్కి** — అర్ధచంద్రబాణము.

సీ. సామునెలముల్కిదోయి నిశ్చలముగా బఱగించి కాళ్ళురెండును ద్రుంచి కలువదాయ. అ. రా. యుద్ధ. 247.

**సామూహికము** సం. విశే. అ. ఈ. సాముదాయికము.

**సామెత** వి. లోకోక్తి.

గీ. రాజముగదైన వెనుకను గాజుకడియ మన్న సామెత నిక్కంబె యయ్యె మాకు. యయా. 3 ఆ. 107.

ద్వి. కామసించినవాఁడు దామసియన్న సామెత నిజ మాయె నేమాటలకును. సారం. 3 ఆ. 112 పు 18 పం.

**సామేను** వి. సగముమేను, అర్ధశరీరము.

గీ. సామి సామేను చేకొన్నదాన. ఆంధ్రనామ సంగ్రహము.

గీ. హరిభుజాంతర వాసినియైన లక్ష్మి వైరి శివునకు సామేనవై తినీవు. మార్కం. 6. 120.

సీ. ఏసామి సామేన నేప్రొద్దు వలిగట్టు దొరపట్టి వర్ధిలితోడబాసె. నీలా 1 ఆ-12

సీ. అర్ధనారీశ్వరుండగుట నీశాసుండు సామేని యంశలి జాగకుండె. శృ. నై. 4. 129.

తే గీ. ఏమి వినుజాలు కనువాలు నిట్టకేలు, ఏది తోల్బీర మెడచార యొముకకోర, యేది నెలకూన సామేన నిడివచాన, యితఁడు శివేలదొరయని యెటులవందు. చెన్నబ. 3 ఆ. 52.

సీ. ప్రియుని సామేననుండియును దత్తెజంబు సైరింపజాలని కాంతవినగి, ఉ. రా. 1. 34.

**సామోద్భవము** సం. వి. అ పుం. ఏనుగు.

**సామోపచారము** సం. వి. అ. పుం. సామోపాయము; శాంతిమార్గము.

**సాముఖ్యము** సం. వి. అ. న. 1. అనుకూల్యము, ఆదరము. 2. దయ, ప్రసాదము. 3. ప్రత్యక్షము, సమక్షము.

సామ్యము సం. వి. అ. న. 1. సమత్వము, సమానత్వము. 2. పోలిక, సాదృశ్యము. 3. సామరస్యము. 4. అవైషమ్యము, పక్షపాతరాహిత్యము. 5. అభేదము, ఏకమత్యము.

సామ్రాజ్యము సం. వి. అ. న 1. చక్రవర్తిత్వము, ఏకచ్ఛత్రాధిపత్యము. 2. సువిశాలమైన రాజ్యము. క. అతతసామ్రాజ్య మంతకంతకుఁ బేర్చెన్. నృసిం. పు. 2.

సామ్రాజ్ఞి వి. (రూ. సాంబ్రాణి) ఉత్తమాశ్వము.

క. తామ్రధ్వజ ధూపరుఁ డా, తామ్రనయనుఁ డగుచుఁ గవలి తంత్రాధిపునీ, సామ్రాజ్ఞెవ్వరిదన విని, వప్రుఁ డగుచు లిఁ గవలి పకుంధ్యలుడున్. జై. 7 అ.

సాయమ్, సం అవ్య. అపరసంధ్యాకాలమున, సాయం ప్రాతర్హుతప్రజ్వలిత....భార. సౌప్తిక.

సీ. సాయం సమారంభ చక్రవాళద్వంద్వ విరహాత లోకవ విభ్రమములు. పారిజాత. 1 ఆ. 95. (ఇది సమాసగతమై ప్రయుక్తమగుచున్నది)

సాయంకాలము సం. వి. అ. పుం. అపరసంధ్య వేళ.

సాయంగేహి వి. సాయంకాలమున ఇల్లు చేరువాఁడు.

ద్వి... వెదకుచు నొక్కచో వీసమంతయును, వాసక్తి లేక సాయంగేహులగుచు. ద్వి. పరమ. 1-42 పా.

సాయంతనము సం. విశే. అ. ఈ. అ. సాయంకాల సంబంధమైనది.

వ... హృదయంబు ప్రియంబునం శివంగొన సాయ తన సమయంబున. ఉ. హ. 2-110.

సాయంధృతి సం. వి. ఈ. స్త్రీ. సాయంసంధ్యాబలి.

సాయంప్రాతలు వి. ఉభయసంధ్యలు.

సాయంమండనము సం. వి. అ. న. 1. సూర్యాస్తమయము. 2. సూర్యబింబము.

సాయంసంధ్య సం. వి. ఆ. స్త్రీ. 1. సంధ్యారుణకాంతి. 2. సాయంసంధ్యోపాసన 3. సంధ్యాదేవి (సాయం సంధ్యకు సరస్వతియని పేరు)

సాయంసంధ్యా దేవత సం. వి. ఆ. స్త్రీ. సరస్వతి.

సాయ వి ఒక రాగ విశేషము. సంగీతా. 2-455.

సాయకపుంఖము సం. వి. అ. పుం. బాణము యొక్క ఈకలు కట్టఁబడిన భాగము.

సాయకము సం. వి. అ. పుం. 1. బాణము. 2. ఖడ్గము. ఉ. ఒండొరు నేయు సాయకము లుక్కున నిద్దఱు ద్రుంపఁగా హరి, ఉ. భా. 10. 86.

సాయగౌళ వి. ఒక రాగవిశేషము. సంగీతా 2 454.

సాయనము సం. వి. అ. న. విషువద్బిందువు నుండి గుర్తింపబడిన గ్రహము యొక్క రేఖాంశములు.

సాయబు హిం. వి. (హిం. సాహెబ్) ప్రభువు.

ఉ....దిట్టతనంబునఁ జొచ్చి కచ్చిమేల్, రాయని దాని బారి నిగళంబునఁ బెట్టున కంటగట్టి తేఁ, బ్రాయపుఁ బెంపొకండు తనుఁబల్మలు సాయబు జూడ వేడుకన్. చంద్రాంగ. 2. 97.

సాయము వి. సాహాయ్యము, తోడు.

సాయము సం. వి. అ. పుం. 1. అంతము. అస్తమయము, సమాప్తి. 2. దినాంతము. 3. బాణము.

సాయరు హిం వి. సుంకము.

సాయాహ్నము సం. వి. అ. పుం. దినాంతము, ప్రొద్దు క్రుంకువేళ.

వ. వాయుతనయుండు వాయువేగంబున జనిఁ సాయాహ్నంబున నొక్కవటమహీజాత శీతల శిలా తలంబున నునిచె. భార. ఆది. 6. 171.

సాయి సం. వి. న్. పుం. అశ్వికుఁడు, గుఱ్ఱపు రౌతు.

సాయిల వి. దుబుడక్కవాఁడు. (బుడుబుక్కలవాడు)

సాయు అ. క్రి. తొలఁగు, వళించు.

తే. గీ అపుడు చంద్రమతీదేవి యాత్మలోన, శేక మాత్రంబు చలనంబులేక దైవ, మెల్ల వగపులు సాయంగ నిచ్చెవరము, తగదు చింతింపనింక డెంద మున వనుమ. హరిశ్చం. 5. 125.

సాయుజ్యము సం. వి. అ. న. 1. ఐక్యము, లయము. 2. పోలిక, సాదృశ్యము. 3. చతుర్విధ ముక్తులలో నొకటి.

సామెబు = సాహేబు వి. హిం. మా. సాహెబు, సాహేబు.

సామేబు = సాహేబు వి. హిం. మా. సాహెబు, సాహేబు.

సార నం. వి అ. స్త్రీ. 1. గటిక. 2 దర్వి.

సారంగ వి. ఇరువది నాలుగు స్త్రీరాగములలో నొకటి.

గీ. ... మలహరి సారంగ రామక్రియలు వసగ్, గన్నడ యనంగ మంగళ కౌశికయన, వెలయు నారాయణియు, ఇతుర్వింశతి విధముల దనరారు స్త్రీరాగములను హంస. 5 128.

తే. గీ. పూర్వగౌళ సారంగమంగళ కౌశికలును, కన్నడయు ఛాయయును గౌళ కదుబవపూర్విమైన భల్లాతకియును నారాయణియును,గ్రమత నిరువదినాల్గు స్త్రీరాగములును, ప్రబం. 1. 95.

సారంగము నం. వి అ. పుం. 1. త్వరగా బోవునది. 2. చిత్రవర్ణము. 3. ఏనుగు. 4. లేడి

శా. సారంగాతుల చూపు చోరంగములజ్జగ్గొండ లవోష్ణహ దు,ర్వారావర్తముల వ్యనింగి....పారిజా 2. 100.

5. సింహము. 6. సమగు 7. తుమ్మెద. 8. కోయిల. 9. పెద్దకొంగ, కొక్కెర. 10. నెమలి. 11. ఛత్రము 12. పక్షివిశేషము (Flamingo) 13. మేఘము. 14 ఉదుపు. 15 జుట్టు, కేశము. 16. శంఖము 17. కమలము. 18. కర్పూరము. 19 విల్లు. 20. చందనము. 21. జంత్రవాద్యము. 22. ఆభరణము. 23. బంగారము 24. భూమి. 25. చాతకపక్షి. 26 పుష్పము 27. రాత్రి. 28. వెలుతురు. 29. ఒక రాగము.

సారంగవీణ నం. వి. అ. స్త్రీ తంత్రీవాద్యవిశేషము. వంచితా. 2. 448.

సారంగి నం. వి. అ. స్త్రీ. 1. ఆడులేడి. 2. తంత్రీ వాద్యవిశేషము.

సారంగుడు నం. వి అ. పుం. పక్షులవేటకాడు, వ్యాధుడు.

సారంగుడు నం. వి. అ పుం. 1 శివుడు. 2. మన్మథుడు.

సారండము నం వి. అ పుం. పాముగ్రుడ్డు, సర్పాండము.

సారంభము నం. విశే. అ. అ. అ. ప్రయత్నముతో గూడినది (ఆరంభముతో గూడినది).

సారకము నం. విశే. అ. అ. అ. 1. విరేచనకారి, మలమోచనకారి. 2. జాళనము చేయునది, శుద్ధి చేయునది

సారగంధము నం వి. అ. పుం. చందనము.

సారగ్రీవుడు నం. వి. అ. పుం శివుడు.

సారఘము నం. వి అ. న. మధువు, తేనె.

సారటు అం. వి రథము, గుఱ్ఱపుబండి,

సారణ నం. వి. అ. స్త్రీ. 1 పాదరసమువంటి లోహములకు చేయు సంస్కారవిశేషము 2. షడ్జస్వరమునుబట్టు వీణయొక్క తీగె.

ద్వి తాళవట్టియయుగ త్తరి చోళవడియు లీల సారణయుదలిర్చ.... బస. పురా. 70 పు. 29 పం.

సారణము నం. విశే. అ అ అ. 1. కదలునట్లుచేయునది. ప్రవహించునట్లు చేయునది.

సారణము నం. వి. అ పుం. 1. అతిసారరోగము. 2. ఒక విధమైన జీడిమామిడి (వృ. వి.).

సారణము నం. వి. అ. న. ఒక విధమైన సుగంధ ద్రవ్యము.

సారణము వి. శ్వేతభేదము, దేగలలో నొక జాతి.

ద్వి సాళువంబుల మంచి జలకట్టియలను, పెద్ద సారణముల బెట్టుగా విడిచి. హరిశ్చ పూర్వ. 6. 27.

సారణి నం. వి. అ. ఈ. స్త్రీ. 1. కాలువ బోదె. 2. చిన్ననది, వాగు. 3. షడ్జస్వరము బలికెడు తంతి.

సీ జవ్వాదిబదనిచ్చి సారణుల్ సారించి సరసత విరడలు చక్కనొత్తి. వాల్మీకి. 3. 133.

సారణికము సం. విశ. అ. ఈ అ. పయనించునది, కదలునది.

సారణికుఁడు సం అ. పుం. యాత్రికుఁడు, బాటసా.

సారణుఁడు సం. వి. అ పుం. 1 రావణుని వేగుల వాండ్రలో నొకఁడు (శుక, సారణులు) 2. రోహిణి వసుదేవుల కుమారుడు.

సారతరువు సం. వి. ఉ. పుం. అరఁటిచెట్టు (వృ. వి).

సారథి సం. వి. ఇ పుం. తేరు గడపువాఁడు, రథ చోదకుఁడు.

తే. గీ. రథికునకుఁగల మరికి సారథియుఁ గర్ణ ధారుడునుబోలె భార. శాం. 5. 588.

2. సహాయుఁడు. 3. సముద్రము.

సారథ్యము సం వి. అ. న 1. రథమునడుపుటని, రథచోదకత్వము. 2. నియంతృత్వము, నాయకత్వము.

సారద సం. వి ఆ. స్త్రీ. 1. సరస్వతి. 2. దుర్గ.

సారద్రుమము సం. వి. అ. పుం. ఖదిరవృక్షము (వృ. వి).

సారభాండము సం. వి. అ న. 1. సహజమైనయానపాత్ర. 2. సరకులు, ఓడయందలి పణ్యద్రవ్యములు. 3 సాధనములు, ఉపకరణములు.

సారమితి సం వి. ఇ. స్త్రీ. వేదము.

సారము సం విశ. అ. అ అ. 1. ముఖ్యము. 2. శ్రేష్ఠము. 3. యథార్థము, సత్యము. 4 దృఢము, వీర్యవంతము 5. బుజువైనది, సిద్ధాంతము, నిశ్చితము. 6 సర్వోత్తమము

సారము సం వి. అ. న. 1. జలము. 2. ఔచిత్యము, యోగ్యత. 3 అడవి. 4 ఉక్కు.

సారము సం వి. అ పుం 1. ముఖ్యాంశము. 2. నిగ్గు, ఆయువు పట్టు

తే. వేదసారంబు సత్యంబు విమఁడు సత్య సారమూర్తిదమము దమసారలార మోక్షమీపరిపాటి భార. శాం. 5.54.

3. రసము, జీవము. 4. తత్వము, పరమార్థము. 5. రసము, చేవ.

సీ. తే... అచల స త్త్వశాలి బల నదీనసా గిరుల ధాగూర్చెఁ జావము వెరఁగుపడగ. రామపరా. 3.121.

6. సంక్షేపము, సంగ్రహము. 7. బలము, వీర్యము, శక్తి. 8. ఉత్సాహము, విక్రమము, శౌర్యము. 9. స్థైర్యము, ధైర్యము, దార్ఢ్యము. 10 సంపద, ఐశ్వర్యము 11. అమృతము. 12 వాయువు. 13. మీఁగడ. 14. రోగము. చీము పదార్థము. 15. విలువ, అతిశయము, చదరంపుపావు. 16. ఒక అర్థాలంకారము. 17. హృదయము.

సారమేయము సం. వి అ పుం. మగకుక్క

సారమేయి సం. వి. ఈ స్త్రీ. ఆడకుక్క.

సారలోహము సం వి అ. న. ఉక్కు.

సారల్యము సం. వి అ న. 1. ఋజుత్వము 2. నిష్కపటత్వము. 3. తిన్నఁదనము, సూటితనము.

సారవంతము సం విశ (త్ త్ తి. త్.) 1. దృఢమైనది. సరుకు గలది. 2. ఫలప్రదము, బలము గలది 3 రసము గలది.

సారవము సం విశ (అ. ఈ. అ.) సరయూ నది సంబంధమైనది. (శ. ర.).

సారస(శ)నము సం. వి. అ. న. 1. మూఁడు పేటలు గల అడుదాని మొలనూలు. 2. కవచము తొడిగిన వాని నడికట్టు.

సారసము వి. వినోదము,

తే ఆధిప నీ తనయుండు గయ్యంబు బోడుచు, తెంపు వదలక విభవంబు పెంపు మెఱసి, సారసానకు వచ్చిన చందమునను, చెలిమిఁ బొందిరి పాండవేయులును హాయయు భార. భీష్మ. 1. 142.

సారసము సం. విశ. (అ ఈ అ.) 1. సరస్సునకు సంబంధించినది. 2. బెగ్గురు పక్షికి సంబంధించినది.

సం. వి. అ. న 1. తామరపువ్వు. 2. స్త్రీ మొలనూలు.

సం వి అ. పుం. 1. బెగ్గురుపక్షి. 2. పక్షి.

సారసి(శ) సం. వి. ఇ. అ. స్త్రీ. బెగ్గురు పెంటి.

సారసుఁడు సం. వి. అ. పుం. చంద్రుఁడు.

పారస్యము సం. వి. అ. న. సరసత్వము.

పారస్వతము సం. విశే. (అ. ఈ. అ.) 1. సరస్వతికి సంబంధించినది. 2. సరస్వతి నదికి సంబంధించినది. 3. వాగ్ధాటి కలది, వాచాలము. 3. పారస్వత దేశమునకుఁ జెందినది.

పారస్వతము సం. వి. అ. పుం. 1. సరస్వతి ప్రాంత మందలి దేశము. 2. సరస్వతీ పూజాంగము. 3. బిల్వదండము.

పారస్వతము సం. వి. అ. న. వాఙ్మయము, వాగ్ధాటి, వాక్కు. జడుని కైవము గల్గు సారస్వతమ్ము ద్వి. పరమ. 3. 179 వ

పారస్వతుఁడు సం. వి. అ. పుం. 1. ఒక తెగ బ్రాహ్మణుఁడు, 2. దధీచి వీర్యమును సరస్వతీ నది ధరించుటచే జన్మించిన పుత్రుఁడు.

నారదుని పూర్వజన్మపు బ్రాహ్మణనామము.

పారాంశము సం. వి. అ. పుం. 1. ముఖ్య విషయము. 2. పిండితార్థము.

పారాయము వి. మద్యము, మదిర.

పారాయి వి. (సం. సురా. క. సారాయి. త. స్మ్ర సారాయి) మద్యము,

తే కమ్మ సారాయికై సంచకర మొసంగుఁ, జిత్త జాయత్తయై కావు చిన్నెలాఁడి. శుక. 2. 484.

పారా(యి) సారాయము యొక్క రూపాంతరము.

పారాలము సం. వి. అ. పుం. నువ్వు, తిల (వ్య. వి.).

పారి[1] వి. 1. యుద్ధయాత్ర.

సీ. మనుమావులను మావులెనసిన కోయ సరదార్ల కెల్లను పారిఁ జెప్పి. శశాం 4. 66.

వ. కంసారి మునుపు సారి వెడలిన దారిని దుము దారిగా వేగంటిదు నేదారి రాజసమ్మునగు మీసర మ్మున. ప్రబం. 1. 605.

సీ. సారిగా నీ వొక్కసారి గాటపువీథి దూరుఁచోఁ బొదలఁ బోదూరు రిపుఁడు. అహల్యా. సం. 1. 32.

2. వేఁట.

తే. సామి నా విన్నపము విని సారివెడలి, యొక్కమల చెంతగదె తడవున్న జాలుఁ, జెందు జెందాడి మెకముల జెండువఱచి. దేవరకు వేడ్కఁబుట్టింతు దేవునాన. శుక. 1. 158.

3. చక్రము (కుమ్మరి వానిది)

సీ. జలభేదికరి .... ... చిజ్జిన సారివోలె నొక్క గోరఁ దిరిగె కుమా. సం. 10. 481.

చం. కర మవిరాటి తద్దయు వికారి మనంబది సారి వోలెనే, దిరిగెడుఁ గాని నిల్వదెద. కుమా. సం. 6. 304.

పారి[2] వి. తూరి, తడవ.

వ. ఒక్కొక్క మాఱు విధూత పక్షతియు, నొక్కొక్కసారి యూర్ధ్వాయన దుర్విభావంబును శృం. నై. 2. 85.

ద్వి. నీ శౌర్ద మునులును నీ నియోగంబు, సభయును నీవు నీ సారి నూడుఁడు. పండితా. మహిమ 252.

సీ. ఒడి మీఁద నిడుకొని యురముపైఁ జేర్చుట చేరికకది కడసారియేమొ. ఉ. రా. 6 302.

పారి సం. విశే (న్. ణీ, న్.) 1. వడమునది. 2. సారము గలది.

పారి సం. వి. ఇ ఈ. స్త్రీ. 1. పాచిక. 2. పక్షి విశేషము.

పారించు సం. వ. క్రి. 1. చాఁచు.

సీ. కేలు సారించి జంకించి యల్లల్లన పట్టెనఁగుటు చలకాటి తెరుగు. చిత్రభార. 4. 86.

వ. అత్తళంబులు క త్తళంబుల వారిచేఁ బూరించియు సారించియుఁ జంకువులు పరకూరుల కొనంగియు వెనంగియు ఉ. హరి. 6. 50.

వ. వింశతి కరంబులు సారించి హుంకరించి. ఉ. రా. 3. 78.

కం. వారిధి రంగస్థలమునఁ, జేరి తరంగంబులనెడు జెట్టులు పైపైఁ. బోరంగ నడుమ జలు పిరి,సారించిన సరణి .... జెలఁగెన్. వాల్మీ. 2. 10.

2. ప్రిప్పు, ఆడించు.

మ. గద సారించుచు వంత్యగాల విచలత్కాలా కృతిన్ భీముఁడు. భార. ఉద్యో. 2. 188.

మ. కవిసెన్ గుంత కుకుంది కోమరగదా ఖడ్గాది శస్త్రాస్త్ర తీవ్ర విహారంబు విరోధి దుర్విషహ సంరంభంబుగా నొక్కపెట్టునడిం దద్బల మెల్ల నారదుండు వేడ్కం గుంచె సారింపఁగన్. భార. విరా. 8. 101.

3. ఆకర్షించు, లాగు.

సీ. సారెసారెకు శిల సారించు మౌర్వులు, పటుతటిల్లతలఁ నగిది గాఁగ. భా. రా. సుంద. 369.

4. సరిదీయు, చక్కఁజేయు.

సీ. ఆజ్యాదిఁ బదనిచ్చి సారణుల్ సారించి విరదలు చక్కనొత్తి. వాల్మీకి. 8. 188.

వ. గుణంబు సారించి మార్గణంబు నిగిడించి. మార్కం. 2. 3?5.

5. ప్రయోగించు.

ద్వి. ఆ రాక్షసునితోడ నిఖిలాయుధములు, సారించి విడువక సరిపోరి పోరి. రం. రా. ఉ. కాం. 74 పు. 25 పం.

6. వెలకొల్పు. సవరించు.

కం. ఏ వనులకు దీపము దగు వేవములకుఁ దగదటన్న నింతియిటులనెన్, దీపము మవనందు చిరతెర సారింతున్. వైజ. 8. 80.

7. తెలుచు.

కం. ఈ కోటకు నొక దిక్కున వాకిలి సారించి యానవాలుగఁ జారుల్, రాకలఁ బోకలఁ ఇక్రముఁ జేకొని రక్షకులతోడఁ జెప్పి చనఁదగున్. ఉ. హరి. 2. 98.

7, మెరుపు.

సీ. మృగమదపంకంబు మృదువుగా సారించి తిలకంబు పెట్టుదుఁ జెలువు మిగుల. భార. విరా. 1. 107.

9. వినరు.

వ. కాంచనగర్భ సంభవుండు నిన్నురాత్రిఁదంబువలెగు చెపారించి యుంతకాలంబునకు. వరాహ. 8. 88.

10. ప్రసరింపఁజేయు, పఱవు.

మ. ...కే, వల రౌద్రోక్తులంబల్కుచున్నె విశరుల్ వాచితుతేమీరు విద్దలమీఁదన్ గృపవివ్వటల్లు కడకంటం జూడ్కి సారింపఁగన్. రంగా. 2. 96.

సారిక సం. వి. ఆ. స్త్రీ. పక్షివిశేషము.

సారిక వి. (సం. చర్చరిక. క. చారికె) నాట్య విశేషము.

సారికలుగొను అ. క్రి. వర్తించు.

వ. ఈరికలెత్తిన కోరికలు సారికలుగొన హొసంగుచు. భాగ. 8. 507.

సారిణి సం. వి. ఈ స్త్రీ. తూవురాళి (ప్రవాళిక).

సారిఫలము సం. వి. అ. పుం. జూదపుఁబలక.

సారు వి. నాట్యగతిభేదము. ఆం. భా. 1. 120.

సారుగా సేలపైఁ జమరువారు. కుమారసం. 12. 105.

సారు వి. ద్రవపదార్థము. (తమి. సాఱు. క. సారు = చారు)

సీ. గజయూథముల ....... దముజాలఁబ్రతుకుపాద తలహాతి వడిఁజంపి సారుగా సేలపైఁ జమరు వారు .... కుమారసం. 12. 366.

సారువ వి. 1. సోపానపంక్తి. (?)

వ. అదియును బరంబు .... బహు ప్రకారంబులైన సారువులమం జేసి యొప్పుచు. భార. ఆది. 7. 166.

2. అడ్డకట్ట.

కం. ఆ రీతి సేవపోరఁగ హేరాళము రక్తనదము తీరదఁగఁ రామిన్, సారువగట్టెన్ వివిహిత, వైరి మహీభృత్కబంధవారము చేతన్. చంద్రా. 6.109.

సీ.... అధిప! యిది మానికపుఁగొనయది లతాంతరజము సారువ యిది కప్పురంపుటనంటి, చప్పరంబిల్లయది కాంతసదనము. వసు. 2. 52.

కం. సారెయదె పొడవు మని యొక, సారె యొకతె యతనికి నమయంబున నిద్రా" తి నొకతెకుఁ జెప్పిన, సారెకనకపంజరమున సాధ్వీ మందెన్. శృ. నై. 8. 103

7. కూతునత్తవారింటి కనపునపుడు ఇచ్చెడి వారిచ్చు అరణము మొ॥ 8. పగడ సాల కాయ (శ. ర.)

సారె 2 అవ్య. మాటికి.

సీ. గోరంబుగా సారెగుంటకన్నులు ద్రిప్పు. శుక. 3.74.

(ఇది షష్ఠ్యంతమై యామ్రేడితార్థమున వాడఁబడును. సారెకన్, సారెసారెకున్, ద్వితీయాంతమయి కూడ నిట్లుప్రయోగింపబడినది)

కం. వలవని మాటలు సారెం, బలుకం బనియేమి. విప్ర. 2 81.

చం... జగా తివాచిపై, సకియలు గొల్వ నిండుమతి సారె మనోజ శరార్తిఁ గ్రాగఁగన్. ఇందు. 3. 70.

చం.. ఘటఘట ధ్వని సారె మలంగి చూచుచున్. ఆము. 3. 77.

ఉ.....వా, సాంపచో విజృంభణలు సారె వినందగు నంచు నిట్లనున్. ఉ రా. 1.164.

సారెకు అవ్య మాటికి. సారెసారెకు అని ద్విరుక్తముగను షష్ఠియుక్తముగను దఱచుగ వాడఁబడు.

క. ద్వారక వైకుంఠపురం బీ, రుక్మిణి లక్ష్మి మీర లిచ్చట మునికిన్, సారెకుఁ గొల్వఁగ వత్తును, గోరికతోఁ గంసహర ముకుందమురారీ! పారి. 1. 61.

వ. సారెకున్ దారకల నీరికలెత్తు పొంగరన. మను. 3. 9.

(ఆమ్రేడిత మగుచో సారెసారెకు లేక సారెకు సారెకు.)

వ. ఇత్తెఱంగుఁ జెప్పడలంచిన సారెసారెకుం గిలకిలలాడుచున్. నీలా. 2. 81.

ఉ...నూతన మీనకేతన వినోదపరిశ్రమ ఖిన్నులై నయ,జ్ఞాత ముఖీ నృపోత్తముల సారెకు సారెకుఁ సేదఁదేర్చు. విక్ర. 7. 115.

సారె(సె)సత్తులు వి. భక్ష్యవిశేషములు; జంతికలు

వ. చక్రకాంతంబులు మణుగులు సారెసత్తులు చలువ వర్గ లెక్క లేని ... కాయలు మొదలుగాఁగల ... భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాదులు. ప్రబం. 1. 102.

సీ. వడలు మండెఁగలుంద్రములును పేణిలును సారెసత్తులు పొత్తై బూరియలును. బ. ప్రభులింగ 6. 82.

గీ. హంసడిభకులు రాజసూయంబు చేయ మనము గన్పింబుఁగొని పోక మంచిమాట, నేఁడు సారె సత్తుల మొసల్ వాఁడి చేసి, నోరి చూరవ భూతే శుండు వారిఁ జెఱిచె. ఉ. హరి. 4. 157.

ద్వి. వడలు మండెగ లడ్వములు పేణీలు, కడు మెత్తనగు పాలగారెలు సారె, సెత్తులు నవుగులు చిమ్మిటుండలను. ప్రభులింగ. 4. 150. పుట. 22 పం.

సారోష్ట్రికము నం. వి. అ. పుం. ఒక విధమైన విషము.

సార్గళము నం, విశే. అ. ఆ. అ. 1. అడ్డగింపబడినది 2. నిరోధింపఁబడినది.

సార్జంతు (ఆం. సార్జంట్) వి. సేనాధికారులలో నొకఁడు, భటులమీఁది యధికారి, (శర, జాతి బంట్రోతు. బ్రౌ.)

మ.సమరోజ్జృంభిత శౌర్యధుర్యులగు సార్జంతుల్ మయూరుల్ కుమందములున్ వీరులు సోలు దారులు సుబేదారుల్ మొదల్గల్గు సైన్యములు. రంగా. 1. 147.

సార్థకము నం. విశే. అ. ఆ. అ, 1. అర్థవంతము 2. ప్రయోజనవంతము. 3. ఫలవంతము, లాభకరము.

సార్థము నం. విశే. అ. ఆ. అ. 1. అర్థముగలది. 2. ప్రయోజనము గలది. సమానార్థకము 4, ఉపయోగకరమైనది. 4. ధనవంతము, సంపన్నము.

సార్థము నం. వి. అ పుం. 1. ధనవంతుఁడు 2. వర్తక సమూహము. 3. మనుష్యసమూహము 4. ఒకే

జాతికి [illegible] జంతువులగుంపు 5. సమూహము, గుంపు 6. యాత్రికుడు.

సార్థసంకేతము సం. విశ. త్రి. లి. త్రి. 1. అర్థముగలది. [illegible] గలది.

సార్థవాహుడు సం. వి. అ. పుం. 1. వణిక్సమూహనాయకుడు. 2. వణిజుడు.

సార్థవాహుడు సం. విశ. 1. ముఖ్యుడు. 2. నాయకుడు "[illegible] మా మంబ కృతార్థసార్థవాహం"

సార్థికుడు సం. వి. అ. పుం. వర్తకుడు, వణిజుడు.

సార్ద్రము సం. విశ. అ. ఆ. అ. తడిసినది, తేమగలది.

సార్ధము సం. విశ. అ. ఆ. అ. సగము పెరిగినది.

సార్ప(ర్ప)ము సం. వి. అ. పుం. అశ్లేషా నక్షత్రకూటమి.

సార్పిషము సం. విశ. అ. ఈ. అ. నేతితో వండబడినది. (రూ. సార్పిష్కము)

సార్లా విశ. అనుకూలము, సఫలము (శ. ర.).

సార్వకామికము సం. విశ. అ. ఈ. అ. సర్వకామములు తీర్చునది.

సార్వకాలికము సం. విశ. అ. ఈ. అ. శాశ్వతము, నిత్యము.

సార్వజనికము సం. విశ. అ. ఈ. అ. సర్వజనులకు సంబంధించినది.

సార్వజనీనము సం. విశ. అ. ఈ. అ. సార్వజనికము.

సార్వజ్ఞము సం. వి. అ. న. సర్వజ్ఞత్వము, అన్నియు తెలిసియుండుట.

సార్వత్రికము సం. విశ. అ. ఈ. అ. సర్వప్రదేశములకును సంబంధించినది, అన్ని సందర్భములకు దగినది.

సార్వధాతుకము సం. వి. అ. న. లట్. లోట్. లఙ్. లిఙ్. లయందు ధాతువులకు చేర్పబడు ప్రత్యయములు.

సం. విశ. అ. ఈ. అ. వికరణ ప్రత్యయాదులు చేర్చిన పిమ్మట చేర్పదగు క్రియాప్రాతిపదికకు సంబంధించినది.

సార్వభౌతికము సం. విశ. అ. ఈ. అ. 1. సర్వప్రాణులకు సంబంధించినది. 2. పంచభూతములకు చెందినది.

సార్వభౌమము సం. విశ. అ. ఈ. అ. సర్వభూమికిని సంబంధించినది.

సార్వభౌమము సం. వి. అ. పుం. ఉత్తరదిగ్గజము పేరు.

సార్వభౌముడు సం. వి. అ. పుం. 1. సర్వభూమండలాధిపతి, చక్రవర్తి, సమ్రాట్టు. (సర్వభూమి పృథివీభ్యామణ ఞా. 5.1.4.1 పాణి. మా. సర్వభూమేర్నిమిత్తం సార్వభౌమ అనుశతి కాదిత్వా దుభయపదవృద్ధిః).

చం. ధర్మజుం, డలఘుడు యావరాజ్యయుతుండయ్యును జెంపున సార్వభౌముడై. భార. ఆది. 6. 92.

2. అహంయాతి యనువాని పుత్రుడు.

సర్వము సం. విశ. అ. ఈ. అ. 1. సర్వమునకు దగినది.

సార్వము సం. వి. అ. పుం. సార్వుడు; బౌద్ధసన్యాసి.

సార్వవేదసుడు సం. వి. అ పుం. యాగమునందన సర్వస్వమును దానము చేయువాడు.

సార్ష్టి సం. విశ. ఇ. ఈ. ఇ. 1. తుల్యబలము గలది. 2. తుల్యావస్థ యందున్నది. 3. సమానాధికారము గలది.

సార్ష్టిత సం. వి. అ. స్త్రీ. 1. తుల్యబలత్వము, సమానాధికారము. 2. ఈశ్వరసామ్యము, సాయుజ్యము.

సార్ష్ట్యము సం. వి. అ. న సాయుజ్యము.

సాల సం. వి. ఆ. స్త్రీ. 1. గోడ, వప్రము, ప్రాకారము. 2. గృహము.

సాల వి. (సం. శాలా. క. సాలె. త. చాలై) 1. ఇల్లు సాటకశాల, గుఱ్ఱపుశాల, వంటశాల. 2. చావడి. మొగసాల, కొలువుసాల; జన్నసాలవడి జన్నసాల నివాసంబుగొని. 2. 66.

సాలంకలు వి. ఒ. ధాన్యవిశేషము.

సీ. సాల ంకలు రాజనములు సన్నాపువసర దాష్టి మోహనపురసులు. హంస. 4. 128.

సాలంకారము నం. విణ. అ. ఆ. అ. అలంకారము లతోఁ గూడినది.

సాలంకృతము నం. విణ. అ. ఆ. అ 1. చక్కఁగా నలంకరింపఁబడినది. 2 అలంకారములతోఁ గూడి నది.

సాలకటంకటేయుడు నం. వి. అ పుం. (శ్రీ) మద్రా మాయణోత్తర కాండమున బ్రసిద్ధుడగు నొక రాక్ష సుని వంశమున బుట్టిన వాఁడు; రాక్షసుఁడు.

మ. అనిన సాలకటంకటేయుఁడు సాల కటకటం బడి— ఆము ర. 66.

సాలకరి నం. వి. న్ పుం 1. ఇంటివానివాడు యుద్ధమున బందీగా గొనబడినవాఁడు.

సాలగ్రామము నం. వి అ. పుం. విష్ణుమూర్తి చిహ్నిత శిలా విశేషము విష్ణ్వాత్మకమైన గండకీ నది యందలి శిల "సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు''...మనుచ. 1. 55.

సాలనము నం. వి. అ. పుం. 1. సాలవృక్షపు బంక.

సాలపర్ణి నం వి. ఈ. స్త్రీ. ముయ్యారు పొన్న (వృ. వి.).

సాలపోతకుఁడు నం. వి. అ. పుం. ఒక సర్పరాజు.

సాలభంజిక నం. వి. ఆ. స్త్రీ. వస్త్రదంతకాష్ఠాదుల చేత చేయఁబడిన బొమ్మ; పుత్తళిక. "వేళాభంజనిమై యపుడు సాలభంజిక పలికెన్. సింహా. ప్ర. ఖా. ఆ. 2. 61.

సాలము నం. వి. అ. పుం. 1. మద్దిచెట్టు.

సీ. తే. దావపావక ఘనశిఖాదగ్ధశాల, సాల సంకాశ మగు పిశాచద్వయంబు. ఉ.హ. 2. 122.

2. మద్దిబంక. 3. చెట్టు! 4. గృహావరణము; ప్రాకా రము. 5. గోడ. 6. ఒక విధమైన చేప.

సాలమిశ్రి వి. ఒక మందు దినుసు.

సాలారము నం. వి. అ. వ. గోడలో బిగింపఁబడిన చిలుకకొయ్య.

సాలావృకము నం. వి. అ. పుం. శాలావృకము. 1. కుక్క. 2. కోతి. 3. తోఁడేలు. 4 పిల్లి.

సాలియ వి. సాలె, నేఁత నేయువాఁడు.

ఉ. రాంతదశం గృశియించి యిచ్చలో వేసరి నిల్చె సంజకడ వేళాని సాలియవాని లోఁగిటన్. పంచతం. 1. 61,

గీ. సాలీఁడు గాఁబోలు సమదవేద దండు తెలి వారచీరెలు దులిచి తెచ్చె. కువల. 2. 69

సాలీఁడు వి. (సాలె+ఈఁడు) సాలెవాఁడు.

గీ. మేషయుద్ధ మధ్యంబున మెలఁగి యొక్క, శివయు నాషాఢభూతిచే సిద్ధమునియు, దొడరి సాలినిచేత దూతికయును, నాత్మకృత దోషమున గాదె హానిఁబడిరి. పంచ. నా. 1. 164.

2. సాలెపురుగు.

సీ. చెవిగూట నెలకొన్న కవపిట్ట కవకవల్ మొరసి నాదబ్రహ్మ మినుమడింప, మైనిండు సాలీని మగ్గంపుఁ జకచకల్ బూదిపూఁతకు రెట్టిపుట్ట సేయ. చంద్రాంగ. 3. 89.

కం. బోయయు సాలీఁడును మా, కాయజహరుఁ గొలిచి ముక్తిఁగాంచిరి గాదె. శివతత్త్వ. 172. వ.

సాలీయానా హిం. విణ. (యూ. సాల్యానా) సంవత్స రపు. (శ. ర).

సాలు వి. రాంకవము.

సీ.... ముత్యాల మొలనూలు ముసురుచుందురు కావి జిలుగు సాలామీఁదఁ జెలువుమీఱ. భాను. 4. 62.

2. సాలువ; శాలువ; ఉన్నితోఁ దయారైన వస్త్రోత్తరీయము. ఏమేలు సరిపెనో పాలంబట్టుసన్న సాలు. నీలా. 1. 109.

3. సన్నని వస్త్రము.

చం. జిలుఁగగు నాభినామములు చెంపల గంధము లోరసాగలున్, వలిపపుసాలు వింతవలెవాటులు లాగులు రావిరేకులుం, గలిగిన గుజ్జురూపములు. సారంగ. 1. 116.

సీ. వలువ బంగరు సాలు వలెవాటుగాఁ జైచి కేయూరహారముల్ గీలుకొలిపి. కవిజన... 6. 11.

వ. బూరుగొమ్మునఁగల తుపాకి, జాళువాసాలు శాలువు జయ్యి. ప్రబం. 1. 28.

ఉ...శుభరేఖ వ్రాసివే చె. ద్రికపెట్టి యందువయింజెం ద్రిక వన్నియసాలు మట్టినీ, స్వంద్రికఁ దానె ముద్రయిడి చారులచేఁ బనిచెన్ రయంబువన్. విజ. 3. 181.

**సాలు** హిం. వి. ఏడాది, సంవత్సరము.

**సాలువ=సాలు** (త. చాల్వె. క. శాలువె) వి. ఉన్నివస్త్రము, ఉత్తరీయము.

కం. నందనము వెడలి పయనపు, టందముగ జవాది పూఁతలందఁ దొడవులుఁ, గుందనపుటంచు వగ జిలుగుంజెలిసాలువలు జారుగొప్పులు నొప్పన్, (ఇది రంభోర్వశుల శృంగార వర్ణనము). వాల్మీకి. 3. 79.

సీ. నీలి సాలువ మీఁదఁగీలుకొల్పినయట్టి నెలవంక కత్తుల తళుకులెనఁగ. చిత్రభార. 3. 125.

2. సన్నవస్త్రము.

సీ. తనుకాంతి గమపింపఁదనరు వంగీజోడు వలి పెంపు సాలువ వల్లెవాటు. శుక. 2. 426.

3. తృణభేదము.

తే. గీ. తొప్పరంబ్రటింత సాలువ యుప్పుగడ్డి, వరిక మల్లాచి మొదయము బైటి తుంగ, మొదలుగాఁ బూరిం వలింపఁబొదలు వెడలు. ప్రబంధ 1. 201

**సాలువు** వి. సాలువ.

**సాలువరి** హిం. విశే. ఏడాదికి సంబంధించినది.

**సాలూరము** సం. వి. అ. పుం. (రూ. శాలూరము) కప్ప; మండూకము.

**సాలె(లియ) వై.** వి. (సం. శాలికః ప్రా. సాలి ట. క. సాలిగ.) బట్టలునేసి జీవించు జాతి.

వ.... అవ్వీటి మేటి సాలెయగసాలె పటుసాలె వావె వైజాతి సాఁతు జేతుల కొమిరెలు తుము లమై...ఆము. 4. 35.

**సాలెత** వి. తంతువాయస్త్రీ, సాలెజాతి యాడుది.

ఉ. .... అ, శాలిక కూలికమ్ము కొన బట్టలు నేసెడి వానికిచ్చె హా,సాలెత గాదు రా కుసుమ సాయకు పట్టపుదంతి యింతియే. వీథినాటకము. 26 ప.

**సాలెపట్టు** వి. 1. సాలెపురుగు చేసిన నేఁత. 2. ఆశా బంధము. (శ. ర.)

**సాలెపురుగు** వి. బొడ్డునందలి నూలు విడిచి నేతనేసెడి యొక పురుగు, తంతువాయము.

**సాలెవాఁడు** వి. నేతనేయువాఁడు.

**సాలేయము** సం. వి. అ. న. (రూ. శాలేయము) సొంపి చేను.

**సాలోక్యము** సం. వి. అ. న. 1. తుల్యలోకమునం దుండుట. 2. ఇష్టదేవత యున్నలోకము నందుట. (చతుర్విధ ముక్తులలో నొకటి.

**సాల్వడు** అ. క్రి. (సాలు+పడు) (చూడు. చాల్పడు) చీలికారులకట్టు.

మ...వారిద, ప్రతతుల్ సాల్వడ. భార. ఆది. 2.ఒ౧గు.

ఉ. మహామారుత మప్డు వీచెను.... ధరిత్రీరుహశాఖ లున్ విఱిగి త్రెళ్ళఁగ గుల్మలతాళి సాల్వడన్. భార. అర. 3 ఆ.

3. ధారగా ప్రవహించు.

చం. అని మొన విశ్వభూవిభుని హస్తకృపాణము చంద్రహాస మ,య్యును మఱి చిత్రభాను వన ముజ్జ్వలమయ్యెడు చోట నప్పరో, వనితల చన్నులం బులుకవర్గము నెక్కొనువైరి ఖీరులో, చనముల వస్రువారములు సాల్పడునందును నిందునుం బొరిన్ కావ్యా. 5. ఉల్లా. 63 ప.

**సాల్వఖుచు** (పేర.) సాల్వుఁడు.

చ. ప్రతిబలివార్ధి బాడబము భంగి దహించును రామపోలికన్. శితశతధార సాల్వఖుచు. విక్ర. 6 ఆ. (శ. ర.)

**సాల్వహుండు** సం. వి. అ. పుం. సాల్వుఁడను రాజ ముని జంపినవాఁడు, విష్ణువు.

**సాల్వికము** సం. వి. అ. పుం. ఒకవిధమైన పక్షి.

**సాల్వుఁడు** సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు. 2. సాల్వదేశపు రాజు 3. సాల్వదేశస్థుఁడు 4. శిశుపాలుని తమ్ముఁడు.

**సాల్వేయుఁడు** సం. వి. అ. పుం. నితంతుని కుమారుఁడు (శూ: సేనాదులయన్న).

**సాళఁగనాట** వి. ఒక రాగవిశేషము. పండితా. 2-45ం.

**సాళగము** సం. వి. అ. న. శిలశాంకుల న్యాయమున నయిన రాగమేళనము.

ద్వి. లాలిత శుద్ధ సాళగములు బెరయఁ, గ్రాలుచు దేశిమార్గంబులు వెలయ. బస పురా. 71 పు. 5 పం.

కం. క్రమ మొందనాళటావళి, గమకముగా శుద్ధ సాళగములును సం, కీర్ణములోగి పుంఖావఁగ మం, ద్రము మధ్యము తార మత్యుదాదరతమీఁబన్. సమీర. 6. 205.

**సాళగించు** సం. అ. క్రి. (—సాళగము) మిశ్రమగు, కలియు.

వ. కమ్మకసింద గంధంబుదోడం దార్కొను నేలకుల సౌరభంబులును, నేలకుల సౌరభంబులతో సాళగించు కాలాగురు కురంగనాభి కర్పూర గంధసార నీహారవారిపూరంబుల వలిపులును. కాశీ. 7.185.

ఉ. ... ప్రాంతదేశిక మంగళధ్రువలు వీనులకింపుగఁ బాడి రంగవల్, దేశివిధంబు మార్గమునఁ దేటయు నొక్కట సాళగింపగన్, శృం. నై. 7. 16.

ద్వి. చిఱునవ్వు వెన్నెల జిగినెఱయించు మోవి వెన్నెల సాళగించి. ద్వి. పరమ. 2. 58.

**సాళగింపు** √ సాళగించు. వి. కలగలుపుఁదనము. మేళనము,

సీ. కేరడంబులు సాళగింపులు. శిల్పిసాక్రీడనంబులు నడకించువగలు...దుర్గుణంబుల ప్రోపులు ద్రోహమతులు, వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు. పాండురంగ. 3. 43.

**సాళి** వి. రాగములలో నొకటి. [illegible] ద్వి. సాళి పెళ్ళి పెళ్ళి [illegible] ఉచిత మొయ్యా[illegible] [illegible] 71 పు. [illegible] పం.

**సాళించు** స. క్రి. బలియిచ్చు.

వ. దేవిచేరువ గమ్మని ముందట నిడి [illegible] అమె మెచ్చుగాక యుట్టి మేకము సాళించెద, నమచుఁ బండి మంత్రి మొదః జెప్పి, పూజకు దొరకందు భూమీశుతలఁ ద్రెంప, బెడిదమైన వాఁడి యసిద మెత్తె. ద్వా. 11. 60.

**సాళియలు** వి. బ. వస్త్రవిశేషములు, అంగవస్త్రముల మీద వేసికొను పైఁటలు.

ఉ. చందురుకావిపావడల జాజాపిటు పులిఁజెందు ద్రొక్కఁగాఁ, గందుపిసాళి సాళియలుగట్టి ...దాటు లవఁ జెన్నగు కీలుజడల్ వటించు నా, సుందరులందఱున్ వనము సొచ్చి చలన్నణి నూపురంబుగన్. వాల్మీకి. ౯. 112.

**సాళువము** సాళ్వము వి. శ్యేనవిశేషము, ఒకజాతి డేగ.

తే. విజయ విఖ్యాత గుండభూవిభునృసింహ, సార్వభౌముని బిరుదైన సాళువంబు. జై. భా 1. 45.

చం... మట్టి కాసెలన్, బిడియము బంటబోఁవి పృథుభీషణ బాహుల సాళువంబులన్, దడవి కెరల్చుచున్ జనిరి నాథునిముం మోల నృపాల నందనుల్, మను. 4. 30.

తే. గీ. మృగయుబంతటఁ దెచ్చిరి లగుడుగిడుగు, జాలె జలకట్టె కణుజువేసడము బైరి, కురుజు వారిణ యను డేగ కొలము సాళు, వములఁ బిలుపును వేఁటకు వచ్చువాని. పి శకుం. 1. 110.

2. వేఁటకుక్క కీయబడిన పేరు.

సీ గీ పుణ్య తీర్థంబు చేమంతి పోతురాజు, సాళువము నాఁగఁ బెద్దజాగిలములు. రాజేశ్వరమా. 5. 7-.

2. పందెపు కోడిపుంజున కీయఁబడిన పేరు.

ఎ. గీ. శూలము పిరంగి వెలినక్క సాళువంబు కాళరాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చులవెడు పేరుల పుంజులగొని ముగించి. హంస. 3. 215.

సాశ్వము సాశ్వుఁడు=సాశువము వి. 1. ఒక జాతి చేఁగ.

క. నా చిన్ని ముద్దు కూఁతురు, నా చక్కని తల్లి పిథివసయాడఁ గవ, స్నిదుకొనిపోయె సాశ్వము, లా చిలుక గొంచు లోవృక్షమమునఁ దండ్రి' రాజశే. ౨. ౬౧.

ద్వి. ముప్పుఁ గిలగిల మెఱయజాడించి. క్రొవ్వున నుప్పొంగు కొమరు సాశ్వములు. అ. మ. క. ౯ అ. ౨౨౧ పు. ౨౭. వం.

2. తృణవిశేషము.

ఎ. గీ. వాలిక పసు కెడ కుఁదేటి పొసుజుగంకపరిత సాశ్వముసాఁకె కుఁదురు గరిమిడి. హంస. 5.45.

సావకము నం విశ. అ. అ. అ. ప్రసవించునది, ఉత్పాదించునది, పుట్టించునది.

సావకము నం వి. అ. పుం. జంతు సంతానము, శాబకము.

సావకాశము నం. విశ. అ. అ. అ. విశ్రాంతి గలది, తీరికగలది, వీలుకలది.

సావజ్ఞము నం. విశ. అ. ఆ. అ. అనూయగలది, ద్వేషముగలది, తిరస్కారముగలది.

సావద్యము నం. వి. అ. న. యోగిసాధించు సిద్ధులలో నొకటి. ఐశ్వర్యము, (నిరవద్యము, సావద్యము, సూక్ష్మము, యోగసిద్ధులు).

సావధానము నం. విశ. అ. ఆ. అ. 1. చిత్తైకాగ్రత గలది, శుద్ధిగలది, అప్రమత్తమైనది.

కం. అనురక్తి సావధానం, బనుచుండెరఁ బట్టికొని మనోనుకల్పం, బనఘమతి మచ్చరింపుచు, మొనసి వధూవరులఁ దార్పముదమిం బొందన్. రాఘవాభ్యుదయము. 8. 44.

3. పరిశ్రమించునది.

సావధి నం. విశ. ఇ. హద్దుగలది, పరిమితము, సంకుచితము.

సావనము నం. విశ. అ. ఈ. అ. సవనములకు సంబంధించినది.

సావనము నం. వి. అ. పుం. 1. సవనాంతము, సవనాంతమునఁ జేయుకర్మ. 2. ముప్పది సూర్యదినములుగల నెల. 3. సూర్యోదయాది సూర్యాస్తమైన దివసము. 4. ఒక విధమైన సంవత్సరము.

సావనుఁడు నం. వి. అ. పుం. 1. యజమానుఁడు, యాగకర్త. 2. వరుణదేవుడు.

సావము నం. వి అ. పుం. బలి, హవిస్సు.

సావయవము నం. విశ. అ. ఆ. అ. 1. అవయవములు కలది. 2. భాగములతోఁ గూడినది.

సావరణము నం. విశ. అ. ఆ. అ. 1. కప్పబడినది, దాచఁబడినది. 2. ఆచ్ఛాదితము, పిహితము. 3. ఆవృతము, నిరుద్ధము.

సావరము నం. వి. అ. పుం. 1. దోషము, నేరము. 2. పాపము, క్రౌర్యము, హింస. 3. లొద్దుగచెట్టు. (వృ. వి.)

కం. నావుడు వతఁడొక కీరం, బై వెసఁజని నింగి నిలిచి యగచరపతితో రావణు సందేశముగడు, సావరమునఁ జెప్పి మఱలి చనఁ దోనకపుల్. భా. రా. యుద్ధ. 203.

సావర్ణము నం. విశ. అ. ఈ. అ. ఒకే వర్ణమునకు జెందినది, ఒకే కులమునకుఁ జెందినది.

సావర్ణలక్ష్యము నం. వి. అ న 1. ఒకే కులమునకు చెందుటను సూచించు చిహ్నము. 2. చర్మము.

సావర్ణి నం. వి. ఇ. పుం. అష్టమ మనువు పేరు. (సూర్యునివలన సవర్ణకుఁ బుట్టినవాఁడు)

సావర్ణుఁడు నం. వి. అ. పుం. అష్టమ మనువు పేరు.

సావర్ణ్యము నం. వి. అ. న. 1. వర్ణతౌల్యము. 2. సమానకులత్వము. 3. అష్టమ మనువు యొక్క మన్వంతర కాలము.

సావలి వి. దుబుడక్కవాఁడు.

సావలీఁడు వి.=సావలి

సావలేపము నం, విశ. అ. ఆ. అ. గర్వముగలది.

సావశేషము నం. విశ.అ . ఆ. అ. 1. మిగులుగలది, శేషము గలది. 2. అసంపూర్ణము, లోపము గలది.

సావష్టంభము సం. విశ. అ. అ. 1. గర్వముగలది, ధీరమైనది, గర్వితమైనది. 2. స్థిరమైనది, దృఢమైనది. 3. శక్తివంతమైనది, ఉగ్రమైనది, తీవ్రమైనది.

సావహేళము సం. విశ. అ. అ. తిరస్కారముగలది ద్వేషముగలది.

సావాసము వి. (స. సహవాసః త. చాకవించమ్) కలిసియుండుట, స్నేహము, పొత్తు.

సావాసి వి. సావిడిల్లాఁడు, అంతఃపురపు కావలివాఁడు.

ద్వి. సేవాగతాంగనాళిఁజితంబులును, సావాసులదరించు చండహుంకృతులు. రం. రా. యు. కాం. 280 పు. 6 పం.

కం. నావుడు సంతోషించిరి, సావాసులు వీరవచన చతురత సత్యా, దేవియు నెత్తపు మాటలు,గా విని తెలిసికొని మెచ్చఁ గంసారాతిన్. ఉ.హరి. 3.142.

సావి 1. కాలము.

సీ. తటి తతి పదను హదను సావియదను నాఁగా లాభిధానంబుగాఁ జెలంగు. ఆం. భా. 1. 86.

సీ. వానకాలమువచ్చె వర్షంబు లందందు, జడివట్టి కురిసె నాసావియందు. కాశీ. 7. 40.

చం. విలిఖితమో శిలాకృతియొ విస్మృతిరూపు వహించెనో యనన్, జలన విదూరుఁడయ్యెఁ దొలుసావి పయోధర ధారఁదోగునయ్యల దకుత్తు క్రొత్తపులుపేపువ వేపులకల్ తమాలతన్, మొల వఁగనున్న నవ్వి యదుముఖ్యుఁడు తాపసముఖ్యు నిట్లనున్. పాండురంగ. 2. 52.

సీ. కాదంబినీ మార్గ కేదారమున నిండ మొలచిన వెన్నెల మొలకలనఁగ, వడిసావి మొలుకుల్వ్ బడి గంటబలు మబ్బు కొక్క గుంపులకిడ్డ కొఱకు లనఁగ. చంద్రాంగ. 5. 52.

2. భ్రాంతి భ్రమ.

కం. నీవిందు సుధన్వునియెడ, సావిం దునిమించి తెందు సాగెద వనుచున్. జై. భా. 5. 60.

వ. తన నీడ నీటిలోపలంగని యది ప్రతిగజము సావి కదుకొని. కుమా. సం. 1. 65.

3. సాము.

సీ. మెఱసి సిల్కాడచూపు మెఱపులో యొఱపు బిత్తఱపులో తరము నిద్రావసించి, పసిమిలో మిసిమి నిబ్బరపు సంపఁగి పూతావిలో సావి కందర్ప చేతి, తిరుసులో బిరుసు చిత్తరవు పుత్తడిప్రాఁత. (ఇది స్త్రీ వర్ణనము). ఘటికాచల. 2. 87.

సావి విశ. మనోజ్ఞము.

ఉ. తుమ్మెద కంటువ్వా మొగడతోఁడుల దూగుఁలతాంగి ముక్కు నెత్తమ్మికి జాతిదాయవనితా జనతామణి మోముక్రంతు క్రొత్తమ్ముల తమ్ము లిందు కళికాలిక వాలిక చూపుఁగోపుల, క్రొమ్ముకు సావిమావి సెలగొమ్మకు సాటియొకోటు లెయ్యెడన్. రామా. 4. 66.

ద్వి. సావి గన్నేరుపూపుఛాయ నీర్కావి, దోవతి మీగాళ్ళతో నెఱయంగ. ద్వి. పర మ. 3. 225.

సావి=సవి (అవ్య.) అని. (అని భ్రాంతిపడి).

కం. తన నీడ నీటిలోపలం గని, యది ప్రతి గజము సావి కదుకొని కోపం, బునఁదాఁకి పోఁకొల్చెను. కుమా. సం. 1. 65.

ఉ. ఛాయన భోగిరాట్కటక సన్నిధి దీపితదీప మాలికా,ఛాయఁ బురఃప్రదేశమునఁ జాగిన నిర్ఝర వాహినీమహా, తోయము సావిచీర యొగఁద్రోచి చొరంగఁదలంచె నెంతలో, తోయని కొంకి కొంకి పతితుం దతఁ డాసవపాన విక్రియన్. శివరాత్రి. 4. 40.

సి. ఇందుబింబంబుఁ జూచి చెందుప్పుగలుసావి, యఱులెత్తి నాకంగ నాసపడిన. కాశీ. 3. 12.

సావిక సం. వి. ఆ. స్త్రీ. 1. మంత్రసాని, 2. కాన్పు చేయు స్త్రీ.

సావిత్రము సం. విశ. (అ. ఈ. అ.) 1. సూర్యునకు సంబంధించినది. 2. సూర్యుని వలనఁ బుట్టినది. 3. గాయత్రీ సహితమైనది.

సావిత్రము సం. వి. అ. పుం. గర్భము, పిండము.

సావిత్రము సం. వి. అ. న. యజ్ఞోపవీతము.

సావిత్రి సం. వి. ఈ. స్త్రీ. 1. సూర్యకిరణము. 2. ఒక మంత్రము.

క. భూమ్యాది వత్స్యంతముగ వ్యాహృతుల తోడ సావిత్రి మున్నాటు చదువుటయును... ... విజ్ఞా. ఆచా. 62.

3. ఉపనయన కర్మ, 4. బ్రహ్మ యొక్క భార్య. 5. పార్వతి. 6. కశ్యపుని యొక్క భార్య. 7. సూర్యుని పుత్త్రి. 8. సత్యవంతుని భార్య. 9. సంధ్యాదేవతకు మధ్యాహ్న కాలపు పేరు.

సావిత్రీపతితుఁడు సం. వి అ. పుం. యథాకాలమున ఉపనయనము చేసికొనని ద్విజుఁడు.

సావిత్రీవ్రతము సం. వి. అ. న. వైధవ్యము ప్రాప్తించకుండుటకై స్త్రీలు జ్యేష్ఠమాస శుక్లపక్షాంతమున మూఁడు దినములు చేయు వ్రతము.

సావిత్రుఁడు సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. బ్రాహ్మణుఁడు. 3. శివుఁడు. 4. కర్ణుఁడు. 5. ఒక వసువు.

సావిలి వి. బుడబుక్కలవాఁడు.

ఉ. ఆ వనజాప్తుఁ డద్రిపయి నంబుధి స్వప్రతిబింబముం దగన్, గేవలమైన యద్భుతము గేల్కొను చక్రయుగంబుగా మయూఖావళి మాత్రసంహతి యుగా భువిఁ గాంఛుల మేలు తూరుపన్. సావిలి డెల్పు ఢక్క యనుచాడ్పున నొప్పె విచిత్రభంగియై ప్రబం. 1. 121.

సావిష్కారము సం. విణ. (అ. ఆ. అ.) 1. అహంకారము గలది. 2. స్పష్టమైనది; సువ్యక్తమైనది.

సావు వి. (రూ. చావు)

సాశంకము సం. విణ. (అ. ఆ. అ.) 1. బెదరు గలది. 2. సందేహము గలది. 3. అనుమానించునది. 4. భయపడునది.

సాశంయదకము సం. వి. అ. పుం. ఒక విధమైన బల్లి.

సాశంసము సం. విణ. (అ. ఆ. అ.) కోరిక గలది; ఆశ గలది; ప్రతీక్షించునది

సాఘూతము సం. వి. అ. పుం. కంకణము, దప్పటి.

సాశ్చర్యము సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్చర్యము గలది, విస్మయము చెందినది.

సాశ్ర(స్ర)ము సం విణ. (అ.ఆ.అ.) 1. సాకోణములు గలది. 2. అశ్రువులు గలది.

సాశ్రుధి సం. వి. ఈ. స్త్రీ. అత్త, శ్వశ్రువు.

సాశ్రువు సం. విణ. (ఉ. ఉ. ఉ.) అశ్రుపూర్ణమైనది.

సాష్టాంగము సం. అవ్య. దండాకారముగా, ఎనిమిది యంగములు నేలకు దగులునట్లుగా.

మ. అవలం దఁడిసేసె నంతకుఁడు సాష్టాంగంబు గావించె... పారిజా. 3. 7.

సాసువులు వి. బ. ఆవాలు.
వాంస. 2. ఆ.

సాసూయము సం విణ. (అ. ఆ. అ) అసూయఁగలది, ఈర్ష్య గలది.

వ. సత్యభామ సాసూయంబుగా వాసుదేవున కిట్లనియె. ఉ. హ. 3. 114.

సాస్న సం. వి. ఆ. స్త్రీ. గంగడోలు.

సాహంకారము సం. విణ. అ. ఆ. అ. అహంకారము గలది. గర్వము గలది.

సాహచర్యము సం. వి అ. న. 1. సహవాసము, కలసియుండుట. 1. అవినాభావ సంబంధము.

సాహనము సం. వి. అ. న. సహనము.

సాహసము సం. వి. అ. న. 1. బలాత్కారము ఔద్ధత్యము. 2. నేరము, చౌర్యాది దోషము. 3. క్రౌర్యము. 4, తెగింపు

శా. ఓరీ బ్రాహ్మణధూర్త నా యెదుర నో హో సాహసం బెట్టిదో, వైరిం గోరి నుతించుమాట లెటు గావచ్చెం గృతఘ్నా.... ఉ. హ. 4. 187.

5. తొందరపాటు; అవిమృశ్య కారిత, 6. దండన, శిక్ష. 7. కీర్తి (ధనం).

సాహసాంకుఁడు సం. వి. అ. పుం 1. విక్రమాదిత్యుఁడు. 2. ఒక కవి పేరు. 3. ఒక నిఘంటుకర్త పేరు.

సాహసి సం. విశే. (న్. ఈ. న్.) ఉగ్రమైనది, క్రూరమైనది. 2. నిశ్చయమైనది, గర్వము గలది.

సాహసించు సం. అ. క్రి. తెగించు చొరవ.

మ. శస్త్రాస్త్రములు బోరాడ మెత్తురు మే ల్మేలని సాహసించుతటి నెంతో ప్రాణపర్యంత నిర్భర దుస్సంకటమైన నవ్వుదురు. చంపూ. రా. 8. 12.

సాహసికము సం. విశే. (అ. ఈ. అ.) 1. బలప్రయోగముచేయునది, తీవ్రమైనది, ఉద్ధతమైనది, తొందర పడునది, వేగిర పడునది, ముందు వెనుకలు చూడనిది.

సాహసికుఁడు సం. వి. అ. పుం. 1. తొందరపాటు కలవాఁడు, ఉద్ధతుఁడు. 2. క్రూరుఁడు, అహంకారి, నిర్భికుఁడు. 3. దోపిడికాడు. 4. వ్యభిచారి 5. బలికుమారుఁడు.

సాహస్రము సం. విశే. (అ. ఈ. అ.) వేయింటికి సంబంధించినది. 2. వేయింటితోఁ గూడినది. 3. వేయింటిచే కొనఁబడినది. 4. వేయింటికిగాఁ జెల్లింపఁబడినది. 5. వేయి రెట్లు యినది.

సాహస్రము సం. వి. అ. పుం. వేయి మంది గల సేనా దళము.

సాహస్రము సం. వి. అ. న. వేయింటి మొత్తము. సహస్ర వస్తు సమాహారము,

సాహస్రుఁడు సం. వి. అ. పుం. సహస్ర బలమున కధికారి.

సాహాయకము సం. వి. అ. న. 1. తోడ్పాటు, ఆదరణ, అండ. 2 సాహచర్యము, 3. మైత్రి. 4. సహచర వర్గము. 4. సహాయ సేనాదళము.

సాహాయ్యము సం. వి. అ. న. 1. తోడ్పాటు, అండ. 2. మైత్రి, స్నేహము.

సాహిణము వి (సం. సాధనమ్. ప్రా. సాహిణి) 1. సేన. చూడు. సాహిణి.

2. గుఱ్ఱపుసాల.

కం. సాహిణమనఁ జాశాయన,వాహాగారంబునకును వర్తిలు బేర్లై. ఆం. శే. 25.

మహాప్రగ్గర, ఎకరాలన్ మందువా సాహిణములఁ గలభ్రేథసందోహ వాహ ప్రకరంబుం గొంచు. మను. 1. 40.

ఉ....క్రొం, బావిలుకాని సాహిణపుఁద్రోవరి యామని వచ్చె వత్తరిన్. కృ. శకుం. 1. 70.

3. గజశాల.

సీ. రక్షోభయంకరై రావణ మదగంధ నాగంబు దన సాహిణమున నుండ. వరాహ. 3. 65.

4. గుఱ్ఱము.

ఎ. గీ. పవన పౌలస్త్య పశుపతు ల్జవనరూఢిఁ బరఁగు తమ సాహిణముల నిబ్బరము చూప. నిరం. 3. 36.

సాహిణి = సాహిణి వి. (సాహిణము+ఇ) 1. గుఱ్ఱాలసాలపై నధికారి.

గీ. పిలికుంచె తలాటంబు బేరజంబు, మణుల మొగ ముట్టువన్ని సాహిధి యొకండు, కర్త యొదుటికిఁ గొనివచ్చె గంధవాహా, బాంధవం బగునొక మహా సైంధవంబు.

2, గుఱ్ఱపురౌతు, సాది.

ఉ. అక్కలకంఠకంఠి తెలియం గనివప్పుడె ధిక్కరింపుచున్, జక్కెర భాణవుందురికి సాహిణిరాయల జంట దారిమేల్, చొక్కపువాఁడి చెంగలువ సూరి కటారినిఁ బోటుప్రేటు పెం, పెక్కఁగ నొక్కటన్ వలిపుటక్కువఁ బక్కువ లేచి యార్చినన్. ఉత్తర హారిశ్చం. 2. 58.

3. గుఱ్ఱపువాఁడు.

తే. ఉత్తమాశ్వంబు సాహిణి యొకఁడు నిలుప. సారంగ. 1. 31.

చం. ... మోముపట్టని, టలరిచి రాజు మ్రోలకు హాయం బొక సాహిణి దెచ్చె చెచ్చెరన్. పె శకుం. 1. 113.

సాహిణీ వి. = సాహిణి. రౌతు, గుఱ్ఱపు రౌతు.

చం. .... సాహిణీలు మావుల బఱపంగ. ఆము. 8. 22.

సాహిత్యము సం. వి. అ. న. 1. సాహచర్యము మైత్రి, సంపర్కము, సంఘటన. కావ్య వాఙ్మయము.

సీ. నానా కథాలాప సంగీత సాహిత్య చతురాశక స్తోమ సంచితంబు. ఉ. హ. 3. 28.

2. కవిత్వము. కావ్యశాస్త్రము. 4. సామగ్రి సంకలనము. 5. భోజనావసర వస్తువుల మొత్తము.

సాహిబా హిం. వి. సాహేబు. (ప్రభువు)

మ. పలుకుం జిల్కల కొల్కి రాచిలుక బాబా సాహిబా జెయ్యవుంగలవన్ సౌఖ్యము గాంచి. దశా. 1. 298.

సాహు వి. (క. సాహుకారు, త. సావుక్కారన్. హిం సాహుకారన్) వడ్డి వ్యాపారము చేయువాఁడు.

సీ. ఇడ్డవడ్డికి కోర్చి మృత్యురూపములైన, సాహు లచే ఋణగ్రాహి యగుచు. పాండురంగ. 3. 16.

సాహుకారు హిం. వి. సాహూకారు, సాహు. (రూ. సాహుకారి. క. ర.)

సాహూకారు హిం. సాహుకారు.

సాహెబు=సాహేబు. వి. ప్రభువు, సామంతరాజు.

శా. ఢిల్లీ పాదుషహా నియోగమున రూఢిన్ రాజ రాజౌ నిజామల్లీ పేరిటి మేటి సాహెబు. రంగా. 1. 138.

ఉ. మాయల్బవరంబు లాన నిజమాడెద హైదరు జంగు సాహెబా. రంగా. 2. 80.

సాహేబు హిం. వి. సాహేబు, సాహెబు, సాయిబు, (హిం. సాహిబ్).

1. ప్రభువు.

తే. గీ. ఉభయకటముల శ్రీముద్ర లూర్ధ్వపుండ్ర, సంగతాంగార నవయవ జారలోహి, శాశత శ్రీల హేజీబు లపుడు వచ్చి, రగణితస్థితి సాహేబునగరి కడకు. రాజవాహన. 5. 35.

2. మగఁడు, భర్త.

సీ. దంబెచ్చు తవని కమ్మంబావ పేరెక్కు వందలి ఖుంబేటికంచు వొకటి, చాయలెక్కిన వంటి సాహేబు పావని తుఁకమాని కనుగుదుంత యొకటి. ప్రబం. 1. 162.

సాహో హిం. అవ్య. పరివారజనము సేయు హెచ్చరిక.

కం. నిశ్వాణంబుల జరణవ్ర, శాశ్వంగద భూష లదర ధరవల్లభసౌ, ధశ్వంగణ భాగంబున శాశ్వర వతి డిగ్గి మరలు సాహో యనఁగన్. వరాహ. 6. 42.

కం. మోహనం దతివైభవమున, సాహో యని కటిక వారు సందడి జడియం,గా హేమరత్న ఖచిత మహా హర్మ్యము చొచ్చియందు నాసీనుండై. ప్రబోధచం. 1. 19.

ఎ. గీ. స్వామి! సాహో వరాకు హెచ్చరిక యనుచు వేత్రహస్తులు పలుమాఱు విన్నవింప. అని. 4.

కం. ... కర్ణపుట. రసాయన సౌవిదల్లసాహో, నివరం బెసఁగంగ నెక్కి నృపుడు నిపుణుఁడై. శుక. 1. 62.

సాహ్యకృత్తు సం. వి. త్. పుం. సహచరుఁడు, మిత్రుఁడు.

సాహ్యము సం. వి. అ. న. 1. సంయోగము, సహ భావము, సఖ్యము, సహాజము. 2. తోడ్పాటు, అండ.

సాహ్వయము సం. వి. అ. పుం. పొట్టేలు మున్నగు వానితో జూదమాడుట.

## సి

సింగఁడు వి. (స సింహ) 1. ఎఱుకువాఁడు. 2. నృసిం హుఁడు.

కం. మా సింగఁ డల్లతరి గుండతటిఁ దలమోచి తెచ్చిన యని శుక. 1.

సింగఁడు విశ. కోపించినవాఁడు.

ఉ. చెప్పిన నద్దురాత్మకుఁడు సింగఁడు బూరఁడునై. పంచ. వేంకటనాథుఁడు ఆ. 1.

సింగనాదము కంటివల్ల గ్రుడ్డు

సింగన్నదాటులు వి. బాలక్రీడా విశేషము.

**సింగపుఁబీట** వి. (సింగము+పీట) సింహాసనము. తమ్మిపూ సింగపుఁబీట. పాంచా. 1. ఆ.

**సింగపుగొంగ** వి. ఖడ్గమృగము, శరభము.

**సింగపుదండ** వి. మల్ల (శాస్త్రములోని) బంధ విశేషము.

**సింగపురాసి** వి. (సింహము+రాశి) సింహరాసి.

**సింగము** వి. 1. సింహము.

శా. సింగం బున్న గుహానికేతమునకున్. భార. విరా. 2. 330.

పదోత్తరఘటితమై శ్రేష్ఠవాచక మగును ఉదా. రాచసింగము

2. మల్లబంధ విశేషము.

**సింగరవళి** వి. సింహరావము

**సింగళము** వి. సింహళద్వీపము.

**సింగాణి** వి. (సం. శార్ఙ్గమ్) రూ. సింగిణి, సింగిణీ. 1. శృంగిణి. శృంగధనువు. 2. బాణము. 3. ఒక రకము కుక్క.

సీ. బిగు వంటి నటుల వెన్దగిలి పోనీక యీ సింగాణిమనుఁబోతుఁ జెండివైచు. సా. 1.

**సింగారపుఁదోఁట** (సింగారము+తోఁట) వి. శృంగార వనము, ఉద్యానవనము.

**సింగారము** విణ. మంజులము, హృద్యము.

**సింగారము** వి. శృంగారము, అలంకారము, అందము.

సీ. కొమ్మ సింగారంపుఁ గొలఁకునఁ దేలక బలు విరాలపు వెట్ట దొలఁగు టెట్లు నీలా. 2. 36.

వ. అని పనిచి తానును యోధ వీరోచిత ప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసికొని. భార. విరా. 3. 144.

**సింగారి** వి. శృంగారి, శృంగారవతి.

**సింగారించు** స. క్రి. (శృంగారించు) శృంగారము చేయు, అలంకారము చేయు, కుస్తరించు, దిద్దు, పారాణించు, సవరించు, హావణించు.

**సింగి** వి. ఎఱుకలసాని, చెంచుది.

**సింగిణి** వి. (శార్ఙ్గమ్) రూ. సింగాణి, సింగిణీ, ధనువు, విల్లు.

సీ.... రాణ నొప్పారు పైతాణంబు సింగిణి, తళుకుల కోరుల తరకసంబు. మనుచ. 4. [illegible].

**సింగితమనుకువల** వి. చేపలఁబట్టుట కుపయోగించు నొక విధమైన వల.

**సింగినాదము** వి. 1. శృంగనాదము, కొమ్ము వాద్యము.

2. పొడలుగల దుప్పికొమ్ముతోఁ జేయఁబడి యోగులచే నుపయోగింపఁబడు సుషిరవాద్య విశేషము, పిల్ల యోగుల వాద్యవిశేషము.

చం. లలిఁ గనుపట్టు కిన్నెరయు లాహిరి మోదము సింగినాదముం, జెలు వలరంగ, కళా. 2. 50.

3. చెప్పుకోఁదగినది కానిదానిని గూర్చి తీసివేఁతగా మాటాడునప్పు డీమాట వాడఁబడును. ఉదా, (వ్య) ఆ! ఏమున్నది? సింగినాదము.

**సింగిలికకము** వి. రూ. సింగిలీకము. పెద్ద నల్లకోఁతి. శిరములు దెగిపడు సింగిలికకములు. వశి. 3. భా.

**సింగులు** వి. బొందిలీలని, బాలాజీ అని పిలువఁబడు వట్టి యొకజాతి జనులు.

**సింగోట** వి. రెం డిఱ్ఱికొమ్ములు జతచేసి యేర్పరచిన ఆయుధవిశేషము.

సీ. జింకకొమ్ములు రెండు చేర్చి యల్లు లమర్చి డాకేలఁ బూవ నొడ్డగవఁ బొడువ సంగతి గల యది సిరగోట యనఁగను దివిదారికొమ్ములనాఁ దేజరిల్లు. ఆం. భా. 2. 206.

**సింఘ(ఘా)ణము** సం. వి. అ. వ. రూ. సింఘాణకము. 1. నాసామలము. 2. ఇనుపత్రుప్పు. 3. గాజుగిన్నె.

**సింఘిణి** సం. వి. ఈ. స్త్రీ. ముక్కు.

**సింఘేపోత్రేబ్రాహ్మణులు** వి. బ. కపూరియై బ్రాహ్మణులు.

**సించ(చి)త** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి.

**సించనము** సం. వి. అ. న. సేచనము, చల్లుట, నీళ్ళు పోయుట.

**సింజ** (రూ. శింజ.) సం. వి. ఆ. స్త్రీ. అందెలు మున్నగు దాని రవళి.

**సింజితము** సం. వి. అ. న. ఆభరణముల మ్రోఁత.

**సింజిని** సం. వి. ఈ. స్త్రీ. వింటినారి.

**సిందుకము** సం. వి. అ. పుం 1. వావిలి. (వృ. వి.) 2. సిందువార వృక్షము.

**సిందురము** వి. (సం. సిందూరమ్) 1. చెందిరము, నాగసంభవము.

కం. వగడము మంచివ విరియుకు జిగురాకును దొండపండు సిందురమును సొంపగు తమ్మికెంపు గుంపును నీలా. 2. 22.

3. వావిలి.

వృషభగతిరగడ :— చెలువ చెలువపుఁ దావి యూరుపు సిందుసిందుర మింపుమీఱఁగ. వసు. 3. 149.

4. పెద్దరేకు. 5. అందుగుచెట్టు (వృ. వి.)

**సిందువార(క)ము** సం. వి. అ. పుం. వావిలి చెట్టు.

సీ. ....కర్ణికారముఁ బొడగన్న మాటాడుదు, సిందువారము మీఁద తేప్ప దూర్చు. విక్ర. 1. 188.

**సిందూరతిలక** సం. వి. అ. స్త్రీ. ఐదువ, పుణ్య స్త్రీ.

**సిందూరతిలకము** సం. వి. అ. పుం. ఏనుఁగు.

**సిందూరపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. వక్కెచెట్టు.

**సిందూరము** సం. వి. అ. పుం. 1. ఒక విధమైన వృక్షము, వావిలి. (వృ. వి.)

**సిందూరము** సం. వి. అ. న. చెందిరము, జేగురు రాయి రాగద్రవ్య విశేషము.

**సిందూరరసము** సం. వి. అ. పుం. పాదరసముతోఁ చేయఁబడిన యొక యౌషధము.

**సిందూరి** సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్ల తెగడ చెట్టు. 2. ఎఱ్ఱని వస్త్రము. 2. ఆరెచెట్టు.

**సిందూరిక** సం. వి. అ. స్త్రీ. సిందూరము, జేగురు రాయి.

**సిందూరితము** సం. విశే. ఎఱ్ఱగాఁ జేయఁబడినది. జేగురు రంగు గలది.

**సింధుకన్య** సం. వి. అ. స్త్రీ. లక్ష్మి.

**సింధుకఫము** సం. వి. అ. పుం. ఒక విధమైన చేప యొక్క యెముక.

**సింధుకము** సం. వి. అ. పుం. రూ. సిందుకము, వావిలి చెట్టు (వృ. వి.) ఏనుఁగు.

**సింధుకము** సం. విశే. సముద్రమునకు సంబంధించినది.

**సింధుజ** సం. వి. అ. స్త్రీ. లక్ష్మి.

**సింధుజ(న్మ)ము** సం. విశే. అ. (న్.) 1. జలమునఁ బుట్టినది; జలసంబంధి. 2. నది యందుఁ బుట్టినది. 4. సింధు దేశమునఁ బుట్టినది.

**సింధుజ(న్మ)ము** సం. వి. అ. న. రాతి ఉప్పు; శేక సైంధవ లవణము.

**సింధుజుఁడు** సం. వి. అ. పుం. (సింధువందనుఁడు; సింధుపుత్త్రుఁడు) చంద్రుఁడు.

**సింధునాథుఁడు** సం. వి. అ. పుం. (సింధుపతి, సింధురాజు) సముద్రుఁడు. 2. సింధుదేశపు రాజు. జయద్రథుడు.

**సింధుపిబుడు** సం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

**సింధుపుష్పము** సం. వి. అ. పుం. శంఖము.

**సింధుమంథజము** సం. వి. అ. న. సైంధవ లవణము.

**సింధులవణము** సం. వి. అ. న. సైంధవ లవణము.

**సింధువారము** సం. వి. అ. పుం. 1. జాత్యశ్వము. 2. సింధుదేశమునఁ బుట్టిన యుత్తమజాతి యశ్వము 3. వావిలిచెట్టు.

**సింధురము** సం. వి. అ. పుం. 1, ఏనుఁగు.

తే. గీ గంధసింధురకుండా ప్రకాండకరభ, కదళికా కాండ కాంతవర్గములతోడి, పెందొడలు కాంత పెందొడ లెందు వరయ, మదనరేఖకు సరియైన మగువ గలదె- విక్ర. 1. 119.

2. అష్ట సంఖ్య.

**సింధురవదనుఁడు** సం. వి. అ పుం. విఘ్నేశ్వరుఁడు.

**సింధువు** సం. వి. ఉ. పుం. 1. సముద్రము.

ఉ...ప్రమోదరససింధు తరంగల నోలలాడ. భోజ. 4. 40.

2. సింధునది. 3. సింధునది చుట్టుప్రక్కలఁ గల దేశము. 4. మాళవ దేశమందలి యొక నది పేరు. 5. ఏనుఁగు తుండము నుండి యెగఁజిమ్మఁబడిన జలము. 6. ఏనుఁగు కణతలనుండి స్రవించు మదము 7. ఏనుఁగు. 8. విష్ణువు నామము. 9. తెల్లని లవణము. 10. ఒక రాగ భేదము.

**సింధువు** నం. వి. ఈ. స్త్రీ 1. నది, మహానది. 2. సింధు నది.

**సింధువృషుఁడు** నం. వి. అ. పుం. విష్ణువు.

**సింధుశయనుఁడు** నం. వి. అ. పుం. విష్ణువు.

**సింధుసంగమము** నం. వి. అ. పుం. 1. నదులు సముద్రములోఁ గలియుట. 2. రెండు నదులు కలియు చోటు.

**సింధూఫలము** నం. వి. అ. న. సైంధవ లవణము.

**సింధూరి** నం. వి. ఈ. స్త్రీ. సీరపుష్పి, వృక్షవిశేషము.

**సింబ** నం. వి. అ. స్త్రీ. రూ. శింబ, సింబి. పెసర మున్నగువానిపై పొట్టు.

**సింబ (బి)** నం. వి. అ ఈ. స్త్రీ. గింజ, బీజము, ద్విదళ బీజము, ఒక విధమైన మొక్క. (వృ. వి).

**సింబి** నం. వి. ఈ. స్త్రీ. సింబ.

**సింహ** నం. వి. అ. స్త్రీ. నరము, రక్తనాళము.

**సింహకర్ణము** నం. వి. అ. పుం. సింహపు బొమ్మలతో గూడిన మూలమున్న దావరము.

**సింహకర్ణి** నం. వి. ఈ. స్త్రీ బాణము వేయునపుడు ఏర్పడు కుడి చేతి విన్యాసము.

**సింహకేస(శ)రము** నం. వి. అ. పుం. 1. వకుళ వృక్షము. (వృ. వి.) 2. సింగపు జూలు. 3. భక్ష్య విశేషము.

**సింహకేళి** నం. వి. అ. పుం. పూర్వ జైన విశేషము.

**సింహగర్జనము** నం. వి. అ. న. 1. ఏనుఁగులు మున్నగు జంతువులు భయపడునట్లుగా వీరులు చేసెడి ధ్వని. 2. వీరావేశముతో బెట్టు బొబ్బ. 3. సింహరావము.

**సింహగుఁడు** నం. వి. అ. పుం. శివుఁడు.

**సింహఘంటాన్యాయము** నం. వి. అ. పుం. సింహము మెడను గంట నెవ్వరును కట్ట లేరను రీతి.

**సింహతలము** నం. వి. అ. న. తెఱచిన యఱ చేతుల జంట.

**సింహతలాటము** నం. వి. అ. న. కవి పండితులకు సన్మానముగ నిచ్చు సింహపు బొమ్మలతోఁడ గూడిన మురుగు.

**సింహతుండము** నం. వి. అ. పుం. ఒక విధమైన చేప.

**సింహదంష్ట్రుఁడు** నం. వి. అ. పుం. శివుఁడు.

**సింహదర్పుఁడు** నం. విశే. సింహము వలె నుద్ధతుఁడు.

**సింహద్వారము** నం. వి. అ. న. ప్రధాన ద్వారము; భవనము యొక్క ముఖ్య ద్వారము.

**సింహధర** నం. వి. అ. స్త్రీ. పార్వతి.

**సింహనందనము** నం. వి. అ. పుం. జన్య తాళ విశేషము.

**సింహనర్ది** నం. విశే. సింహము వలె గర్జించువాఁడు.

**సింహనాదము** (సింహధ్వని, రూ. సింహనాదకము.) 1. సింహము యొక్క గర్జనము 2. యుద్ధవీరుని కేక. 3. శివుని యొక్క నామములలో నొకటి. 4 నమ్మకముతో నొక్కిచెప్పుట. 5. సింహముచేయు నాదమువంటి నాదము.

సీ. సముద్భట సింహనాదవదనుడై యున్న నా వాసుదేవుఁడు. ఉ. హరి. 3. 67.

**సింహపర్ణ** నం. వి. అ. స్త్రీ ఒకానొక యోషధి విశేషము.

**సింహపీఠము** నం. వి. అ. న. సింహాసనము.

**సింహపీఠిక** నం. వి. అ. స్త్రీ. సింహాసనము.

శా. ... సింహపీఠికఁ జలత్వం, బొందు మాతంగ్రి మం,జీరం బించుక ఘల్లుమన్న. మనుచ. 4. 76.

**సింహపుచ్ఛి** నం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న, నక్కతోక పొన్న,సింహపు తోకవంటి బొమ్మలుగల పొన్న. (వృ. వి.).

**సింహబలుఁడు** నం. వి. అ. పుం. కీచకుఁడు. (విరాట రాజు బావమఱఁది.)

**సింహమలము** నం. వి. అ. న. ఒక రకమైన యుత్తడి.

**సింహము** (√హింస్.) నం. వి. అ. పుం. 1. మృగరాజు. 2. సింహరాశి. 3. (ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము.

**సింహముఖము** నం. వి. అ. న. అసంయుత హస్త విశేషము

**సింహముఖి** నం. వి. ఈ. స్త్రీ. ఒకానొక యోషధి.

సింహయాన నం. వి. అ. స్త్రీ. పార్వతి.

సింహరథ నం. వి. అ. స్త్రీ. పార్వతి.

సింహరేఖ నం. వి. అ. స్త్రీ. ర, జ, గగములతోనగు నొక వృత్తము.

సింహలము నం. వి. అ. న. 1. తగరము. 2. ఇత్తడి. 3. బెరడు లేక పెంకు. 4. ఒక ద్వీపము.

సింహలీలము నం. వి. అ. పుం. 1. ఐన్నృతాళ విశేషము 2. రతిక్రీడావిశేషము.

సింహలుడు నం. వి. అ. పుం. సింహళద్వీపవాసి.

సింహవాహనుఁడు నం. వి. అ. పుం. శివుడు.

సింహవాహిని నం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

సింహవిక్రమము, సింహవిక్రాంతము నం. వి. అ. పుం. గుఱ్ఱము.

సింహవిక్రీడితము నం. వి. అ. న. 1. 108 కరణములలో నొకటి. 2. ఐన్నృతాళ విశేషము.

సింహవిష్టరము నం. వి. అ. పుం. సింహాసనము.

సింహసంహననము నం. వి. అ. న. సింహమును జంపుట.

సింహసంహననుఁడు నం. విశే. 1. సర్వాంగసుందరుఁడు 2. సింహము యొక్క శరీరమువలె శ్రేష్ఠమైన శరీరము గలవాఁడు.

సింహాకర్షితము నం. వి. అ. న. కరణ విశేషము.

సింహాణము నం. వి. అ. న. రూ. సింఘాణము. 1. చీమిడి ఇనుపత్రుప్పు. 2. పాండురోగమును బోగొట్టు నినుపనిట్టెము.

సింహారావము నం. వి. అ. న. సింహగర్జనము.

సింహావలోకనన్యాయము నం. వి. అ. పుం. సింహము ముందుకుఁ గొంతదూరము సాగిపోయి ఒక్కసారి నిలఁబడి వెనుకకుఁ దిరిగి చూచుకొనుచుండునట్లు పదైన నొక కార్యము కావించి మరల దాని వంతను పరామర్శించుట.

సింహావలోకనము నం. వి. అ. న. 1. వెనుకచూపు, పునరాలోచనము. 2 సింహము యొక్క చూపు. 3. శబ్దాలంకారమైన యమకములో నొక భేదము. ఇందు వాక్యము మొదటిమాట తిరిగి తుదను గూడ వచ్చును

ఉదా :— క. మనవేటికి నూతనమా, తనమా, యొడఁ బ్రేమ తనకుఁదక్కితి ననుమా, నను మావరయ దనరం, దనరంతులు మాని నంసభవు రమ్మనవే. కావ్యాలం. 4.

సింహాసనము నం. వి. అ. న. 1.సింహాముఖ మేర్పఱిచిన స్వర్ణమయమైన యున్నతపీఠము, రాచగద్దె.
సీ. సింహాసనస్థులై సిరులు నించినవారు భోగసంపద లచేఁ బొదలువారు .... నార. 5. 101.

సింహాసనము నం. వి. అ. పుం. రతిక్రీడా విశేషము.

సింహాసనాంశ (అం) అయిదు వర్గంబులు స్వవర్గంబు వచ్చెనేని సింహాసనాంశ యగును (వాచస్పత్యము)

సింహాస్యము నం. వి. అ. పుం. 1. ఒక విధమైన హస్తముద్ర. 2. ఒక విధమైన యోషధి విశేషము, అడ్డసరపు చెట్టు (సింహము నోరు వంటి పువ్వులుగలది) (వృ. వి.)

సింహి నం. వి. ఈ. స్త్రీ. 1. సింగపుఁ బెంటి. 2. రాహువు యొక్క తల్లి పేరు. 3. అడ్డసరము. (వృ. వి). 4 ములక. (వృ. వి.)

సింహిక నం. వి. అ. స్త్రీ. రాహువు యొక్క తల్లి పేరు, అడ్డసరము.

సింహుండము నం. వి. అ. పుం. బొమ్మజెముఁడు.

సిక వి. శిఖ.

సికగన్నుదాఁటుట వి. బాలక్రీడా విశేషము,

సికత నం. వి. అ. స్త్రీ. 1. ఇసుకనేల. 2 మొరపనేల. 3. ఒకానొక రోగము. 4. ఇసుక.
వ .... ఉత్పాదిత గగనకోటర విపాటనంబు లయ్యె నయ్యెడ. నార. 5. 89.

సికతాకూపన్యాయము నం. వి. అ. పుం. ఇసుకనేలఁ ద్రవ్విన నూతి యొల్లెప్పటికప్పుడే విఱిగి పడిపోవుచుండును. బలిష్ఠములైన యుక్తులు లేకుండ చేయువాదము మొదలైనవానిని గూర్చి చెప్పునపు డీన్యాయమును వాడుదురు.

సికతాతలము నం. వి. అ. పుం. ఇసుకతిన్నె.
సీ, సికతాతల నితంబ వికచబంధూకోష్ఠ, వరతరంగావళీ వళివిలాస .... విక్రమా. 7. 139.

సికతాప్రాయము నం. వి. అ. న. ఇసుకతీరము.

సికతామయము సం. విణ. ఇసుకతోఁ గూడినది.

సికతామయము సం. వి. న. పుం. 1. ఇసుక దిబ్బ. 2. ఇసుకతో నిండిన తీరముగల ద్వీపము.

సికతావంతము సం. విణ. (లీ. తీ. లీ.) సికతామయము.

సికతాసేతువు సం. వి. ఉ. పుం. ఇసుకగట్టు.

సికతిలము సం. విణ. (అ. ఆ. అ.) ఇసుక గలది. (నేల).

సీ.... కాంచన వేద్యలంకార చూర్ణాయిత, ప్రకటిత కర్పూరసికతిలము, నిరంకుశో. 1. 62.

సికఫలము సం. వి. అ. న. సీకాయ.

సికా వి. ముద్ర.

సికాయుంగరము వి. ముద్రగల యుంగరము, ముద్దుటుంగరము.

సికారు రూ. షికారు. హ. అ. వాహ్యాళి.

సిక్తము సం. విణ. (అ. ఆ. అ.) 1. తడిసినది, చిమ్మఁబడినది, నీరు పైని జిలుకరింపఁబడినది 2. తడుపఁబడినది, నానఁబెట్టఁబడినది. 3. గర్భాధానము చేయఁబడినది, తడిసినది.

మం. ... పంచాస్త్ర గురుండు భూరికరుణాసిక్తేక్షణాం భోజుఁడై. నార. 5. 88.

సిక్తి సం. వి. ఇ. స్త్రీ. 1. చల్లుట. 2. చిమ్ముట. 3. వెలిగ్రక్కుట.

సిక్థకము సం. వి. అ. న. మైనము.

సిక్థము సం. వి. అ. పుం. 1. ఉడికిన బియ్యము. ఉప్పుడు బియ్యము. 2 అన్నపుముద్ద.

సిక్థము సం. వి. అ. న. 1. మైనము. 2. నీలి మందు.

సిక్యము సం. వి. అ న. చూ. శిక్యము. 1. ఏనుఁగు స్తనాగ్రమందలి మదము.

మ. కరపాద స్తనరోమ కూపకట సత్కర్ణాక్షి కోశాలికి, కరమేఘూతత సిక్యమర్మ జలరంగద్దాన సంపూర్ణ సాగర శీధూన్మద సమ్మత్తాష్ట మదముల్ గ్రమ్మం దదష్టాంగలం, ధురమై సింధుర మొప్పు చుండె వలగీతుల్ వించు సోలంబునన్. కు. సం. 2. 90.

2. ఉట్టి. 3. చిక్కము.

సిక్వము సం వి.అ.పుం. 1. స్ఫటికశిల. 2. అద్దము, గాజు.

సిగ వి. 1. శిఖ. 2. సీకాయ చెట్టు. 3. వెమ్మిజుట్టు.

సీ. పొగసుగా విరిసరుల్ చుట్టి, గట్టిగనిడ్డ సిగపెంపు వాఁడెంపు సిరుల సీవ విలా. 2. 50.

సిగదంత వి. 1. శేఖరము. 2. భూషణ విశేషము.

సిగపట్లు వి దెబ్బలాట.

చం. వలుకులు వాదులేపి సిగపట్లకు దగ్గఱ చేసి. కువల. చరి.

సిగబంతి వి. 1. శేఖరము. 2. భూషణ విశేషము.

గీ. అమ్ముగాడ వేల యలగక యమ్ములకును, ఖడ్గ మంటింపఁగా నేల ఖడ్గములకు, భల్ల మదియేల వాయిత భల్లములకు, వయ్య యీ బంతి సిగబంతి యయ్యెనేమొ. చంద్ర. 2.

సిగపువ్వులంజుట్టు స్వేచ్ఛగా నుండు, అభయం బనువది సిగపూవులు జుట్టి. (ధర్మజరాజసూయము)

సిగము వి. రూ. సివము. దేవతావేశము.

సిగర వి. రూ. సిగరి. 1. మెంతి మజ్జిగ. 2. మజ్జిగ పులుసు.

సీ. ఒక కొన్ని సిగరులు కొక కొన్ని యంబళ్ళు. పాండు. 4. 184.

దధిశర్కరాదికృత లేహ్యము.

సిగరము వి. శిఖరము.

సిగరి వై. భస్మము.

సిగరెట్టు అన్యదే. వి. కాగితపు తొడుగు గల పొగ చుట్ట.

సిగినాలు వి. నాజెమైన వక్కలు.

సిగు వి. సిగ్గు.

సిగ్గరి విణ. 1. సిగ్గు గలవాఁడు. 2. సిగ్గు గలది.

సిగ్గటికత్తియ (పూ. సిగ్గరికత్తె) వి. సిగ్గు గలది.

ఎట్టకేలకుం జెట్టకాలకుం జెవియొగ్గివ సిగ్గటికత్తియలకు. వసు. 428.

సిగ్గఱు అ. క్రి. సిగ్గుచెడు.

చం. .... సిగ్గఱి తుది నట్లు పొలు టెరి కర్జమె. భార. ద్రో. 4.

సిగ్గిడి (సిగ్గు + ఇడి) విశే. నిర్లజ్జము. 2. సిగ్గు చెడిన వాఁడు. 3. సిగ్గు చెడినది.

సిగ్గు వి. విడియము, లజ్జ.

తే. కన్నియవుగాని ప్రోఢవుగావు నీవు. పువ్వుబోఁడి రో సిగ్గెల్లఁ బోవవిడిచి. బలుదొనంగులఁ బొరలఁగఁ బాలె నీవు. నించుకేనియు మఱిలోన వెంచ వకట. నీలా. 2. 87.

వ. ...ఇంక సిగ్గుమాలి రణంబు సేసె నేనియు ద్రోణుండు చేయుంగాని యే నిట్టిదాని కోర్వ వదియు నుంగాక. భార. విరా. 4. 95.

సిగ్గుపడు అ. క్రి. లజ్జ చెందు.

సిగ్గుపాటు వి. సిగ్గుపడుట.

సీ. వంచనమై దాగి వర్తించు టది యేమి ప్రాభవం బని సిగ్గుపాటు చెందు. వైష. 8. 84.

సిగ్గువోవు (సిగ్గు + పోవు) అ. క్రి. సిగ్గుపడు.

ఎ. గీ. అమరచిత్తంబు గావఁగ నలవి గాక సిగ్గువోయిరి యచ్చర చెలువ లెల్ల. లక్ష్మి. 2. 90.

సిచయము సం. వి. అ. పుం. 2. వస్త్రము; ఉడుపు. 2. చినిగిన ప్రాఁత యుడుపు.

సిడము వి. రథాదులపై నుంచబడు టెంకా.

వ. సిడంబులు ముడివడ వెడలించి. ఉ. హరి. 4. 213.

2. ధ్వజస్తంభము.

కం హయములఁ బూన్పుము రథమున రయమున సిడ మెత్తు మిపుడ.... భార. విరా. 4. 4?.

సిడి వి. అంకుశము.

మఱుమఱ మదకరికి సిబ్బు చూపిన భంగిన్. కుమా. సం. 10. 144.

2. సిడిమ్రాను. 3. సిడ్రమాను.

సీ. అంబోధరము క్రింద వనియాడు నైరావతియుఁ బోలె సిడ్రవేలె తెలవ యొఱ్ఱ. పాండు. 3. 77.

4. గ్రామదేవత జాతరలో నొకని వీపున గాలము గ్రుచ్చి గాని ఒకనిని గంపలోఁ గూర్చుండఁబెట్టిగాని త్రిప్పునట్టి దూలము.

సిడిముడి వి. 1. చిడిముడి 2. రోషము. 3. కోపము.

సిడిమ్రాఁకు వి. గ్రామదేవతల జాతరకు నాటిన స్తంభము.

సిడులు (రూ. సిబ్బు) వి. అంకుశము, బరిగోల.

సిత సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కెర. 2. వెన్నెల. 3. అందగత్తె. 4. సారాయము. 5. తెల్ల గరికె. 6. అరబ్బీ మల్లె.

సితము సం. విశే. 1. తెల్లనిది. 2. కట్టఁబడినది, బంధింపఁబడినది. 3. చుట్టఁబడినది. 4. ఎఱుఁగఁబడినది; తెలిసికొనఁబడినది. 5. పూర్తి చేయఁబడినది. ముగింపఁబడినది.

సితము సం. వి. అ. పుం. 1. తెల్లని రంగు 2. శుక్లపక్షము. 3. శుక్రగ్రహము. 4. బాణము. 5. పంచదార.

సితము సం. వి. అ. న. 1. వెండి. 2. చందనము. 3. ముల్లంగి.

సితపాటల సం. వి. ఆ. స్త్రీ. తెల్లకలిగొట్టు చెట్టు.

సితచ్ఛత్ర సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్ద సదాప, కుప్పిచెట్టు, 2. తెల్ల గొడుగు వంటి పువ్వులు గల చెట్టు.

సితచ్ఛత్రి సం. వి. ఆ. స్త్రీ. సదాప మొక్క.

సితపర్ణి సం. వి. ఈ. స్త్రీ. (చూ) సింహాస్యము.

సితమాషము సం. వి. అ. పుం అలచంద.

సితవాలుకము సం. వి. అ. పుం. గురుగు

సితవీర్య సం వి. ఆ. స్త్రీ. జీలుగుచెట్టు.

సితశింబికము సం వి. అ. పుం. గోధుమ.

సితశివము సం. వి. అ. న. రూ. శితశివము. 1. ఇందుప్పు. 2. సైంధవ లవణము.

సితశూకము సం. వి. అ. పుం. యవధాన్యము.

సితాంకము సం. వి. అ. పుం. వాలుగాగడమను చేప.

సితాంగము సం వి. అ. పుం. శ్వేతరోహిత వృక్షము. (వ్య. వి.)

సితాంభోజము సం. వి. అ. న. తెల్లతామర.

సితాంశువు సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు.

2. పొంరతి కర్పూరము.

సితాగురువు సం. వి. ఉ. న. క్రథవకము; గంధద్రవ్య విశేషము.

సితాగ్రము సం. వి. అ. పుం. ముల్లు.

సితాతపవారణము సం. వి. అ. న. రాజలాంఛనమైన తెల్ల గొడుగు

సితాపాంగము సం. వి. అ. పుం. నెమలి.

సితాశ(శ్ర)ము సం. వి. అ. పుం. కర్పూరము.

సితాది సం. వి. అ. పుం. పంచదార మడ్డి.

సితారు వి. వాద్య విశేషము.

సితార్జకము సం. వి. అ. పుం. 1. తెల్ల తులసి (వ్య. వి.) 2. తెల్ల గగ్గెర (వ్య. వి.).

సితాలిక సం. వి. అ. స్త్రీ. పసుగు జలగ.

సితావరము సం. వి. అ. పుం. శాక విశేషము.

సితాసితుఁడు సం. వి. అ. పుం. బలరాముఁడు.

సితి సం. విశే. 1. తెల్లనిది, 2. నల్లనిది.

సితి సం. వి. ఇ. స్త్రీ. 1. తెలుపు లేక నలుపు రంగు. 2. బంధనము.

సితికంఠము సం. వి. అ. పుం. నెమలి.

సితికంఠుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సితుఁడు సం. వి. అ. పుం. 1. శుక్రుఁడు. 2. తెల్లని వాఁడు.

సితేతరగతి సం. వి. ఇ. పుం. అగ్ని.

సితేతరము సం. విశే. (అ. అ. అ.) నల్లనిది.

సితోదరుఁడు సం. వి. అ. పుం. కుబేరుఁడు.

సితోద్భవము సం. వి. అ. న. తెల్ల చందనము,

సితోపలము సం. వి. అ. పుం. స్ఫటికము.

సితోసీరము సం. వి. అ. పుం. వట్టి వేరు.

సిద్ధ కిన్నెర వి. తంత్రీవాద్య విశేషము.

సిద్దాయము వి. 1. వెచ్చపు సొమ్ము వందు గూడఁ బెట్టిన ధనము. 2. కప్పము. 3. వ్యయ విశేషము.

సిద్ది అధికబలము గల నీగ్రో జాతివాఁడు.

సిద్దియ వి. బుంగ వలె తోలుతోఁ గుట్టిన పాత్రము.

సిద్దీ వి. సిద్ది.

సిద్దె వి. సిద్దియ; తోలుతోఁగుట్టినపాత్రము.

సిద్ధకము సం. వి. అ. పుం. సాలవృక్షము. (వ్య. వి.)

సిద్ధక్రియ సం. వి. అ. స్త్రీ. పరమహంస క్రియ.

సిద్ధజలము సం. వి. అ. న. పులిసిన బియ్యపు గంజి, బియ్యపు కడుగు.

సిద్ధధాతువు సం. వి. ఉ. పుం. పాదరసము

సిద్ధనది సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగానది.

సిద్ధపఱుచు అ. క్రి. సంసిద్ధము చేయు.

సిద్ధపుష్పము సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు (వ్య. వి.)

సిద్ధభైరవ తంత్రము 1. శివప్రోక్త తంత్ర విశేషము.

సిద్ధమగు అ. క్రి. 1. సన్నాహమగు. 2. సంపూర్ణమగు. ఉ. ... నా మనోరథం, బక్కడ సిద్ధమయ్యె ఫల మబ్బెను ... హంస. 1. 84.

సిద్ధము (√సిధ్) సం. విశే. 1. నెఱవేర్పఁబడినది, చేయఁబడినది, సాధింపఁబడినది, పూర్తి చేయఁబడినది. 2. పొందఁబడినది, ఆర్జింపఁబడినది. 3. జయించినది. విజయవంతమైనది. 4. స్థిరీకరింపఁబడినది. స్థాపింపఁబడినది, 5. ధ్రువపఱుపఁబడినది, నిరూపింపబడినది, దృష్టాంతీకరింపఁబడినది. 6. ప్రమాణీకరింపఁబడినది, హేతుబద్ధమైనది. 7. సత్యముగా నంగీకరింపఁబడినది. 8. నిశ్చయింపఁబడినది, తీర్మానింపఁబడినది. 9. చెల్లింపఁబడినది, తీర్పఁబడినది (ఋణము మొ.) 10. వండఁబడినది. 11. పక్వమైనది, పరిణతమైనది. 12. చక్కగాఁ గలిపి. వండి తయారు చేయఁబడినది (ఔషధము మొ.) 13. చేకూరియున్నది (ధనము మొ.) 14. వశపడియున్నది. (మంత్రము చేత) 15. లోఁబఱుచు కొనబడినది. 16. నిష్ణాతమైనది, నిపుణమైనది. 17. శుద్ధము లేక పవిత్రము అయినది. (తపస్సు చేత) 18. విముక్తమైనది. 19. అతీంద్రియ శక్తుల గలది. 20. పవిత్రము, పుణ్యము. 21. దివ్యము అమరము, శాశ్వతము. 22. ప్రఖ్యాతము, సువిదితము. 23. ప్రకాశించునది, తేజరిల్లునది.

సిద్ధము సం. వి. అ. పుం. 1. అభియోగము. న్యాయ విచారణ. 2. ఒక విధమైన కండ చక్కెర. 3, నల్ల యుమ్మెత్త.

సిద్ధము సం. వి. అ. న. సముద్రలవణము.

సిద్ధయోగి సం. వి. న్. పుం. శివుడు.

సిద్ధరసము సం. వి. అ. పుం. 1. పాదరసము. 2. మణి శిలలోనగు ఔషధ విశేషము.

సిద్ధరసుడు సం. వి. అ. పుం. స్వప్నయోగి, రస యోగి.

సిద్ధసాధనము సం. వి. అ. న. 1. అతీంద్రియ శక్తులను సంపాదించుటకొఱకు మాంత్రిక కర్మల నాచరించుట, 2. మాంత్రిక కర్మలందు గాని, రసాయనిక ప్రక్రియలందు గాని యుపయోగింపఁబడు ద్రవ్యములు.

సిద్ధసింధువు సం. వి. ఉ. స్త్రీ. దేవగంగ. (గంగానది)

సిద్ధసేనుఁడు సం. వి. అ. పుం. కుమారస్వామి

సిద్ధస్థాలి సం. వి. ఈ. స్త్రీ. మంత్రసిద్ధుని పాత్ర, కోరినప్పుడు కోరిన యాహార పదార్థములతో నిండియుండు పాత్ర

సిద్ధాంతకోటి సం. వి. ఇ. స్త్రీ. వాదమునఁ దార్కికమైన నిర్ణయముగాఁ బరిగణింపఁదగిన యంశము,

సిద్ధాంతకౌముది సం. వి. ఈ. స్త్రీ. పాణినీయ వ్యాకరణముపై భట్టోజీ దీక్షితులు రచించిన వ్యాకరణము.

సిద్ధాంతము సం. వి. అ. పుం. 1. వాద ప్రతివాదముల పిదప నిశ్చయపఱుపఁబడిన పక్షము. 2. వననిధి జ్యోతిష గ్రంథములు. (శ. ర.) 3. పూర్వ వాద భేదము. 4. నిర్ణయము.

క. సంతతి యొడ తెగినంతన, సెంతటి పుణ్యగతులైన చెడ తెగునని సిద్ధాంతము విను వా తమ్ముఁడ! చింతిపకు మొక్క తెలివి చెప్పెద నీకున్. భోజరా 6 49.

సిద్ధాంతి సం. వి న్. పుం. 1. పూర్వ పక్షముఖండించి సిద్ధాంతమును స్థాపించువాఁడు. 2 శాస్త్ర గ్రంథములందు నిష్ణాతుఁడు. 3. మీమాంసా దర్శనమును అనుసరించువాఁడు. 4. తత్త్వశాస్త్రము నెఱింగినవాఁడు.

సిద్ధాంతీకరించు సం. వ. క్రి. సిద్ధాంతము చేయు.

సిద్ధాయము సం. వి. అ. పుం. కప్పము

సిద్ధార్థమునం. విశే. 1.తీఱినకోరికలు గలది.

సిద్ధార్థము సం. వి అ పుం. తెల్లయావాలు

సిద్ధార్థి సం. వి. న. పుం. ఒకానొక సంవత్సర నామము.

సిద్ధార్థుఁడు సం. వి. అ. పుం. తీరిన కోరికలు గలవాఁడు. 2. శివుఁడు. 3. బుద్ధుఁడు

సిద్ధాశ్రమము సం. వి. అ. పుం. 1. క్షేత్రవిశేషము. 2. ఋష్యాశ్రమము.

సిద్ధాసనము సం. వి. అ. న. యోగాభ్యాసమందలి యొక విధమైనయాసనము.

సిద్ధి సం. వి. ఇ. స్త్రీ 1. లాభము, ప్రాప్తి, సమగ్రత, సంపూర్తి. 2 జయము, వృద్ధి స్వస్తి. 3. ప్రతిష్ఠాపనము, స్థాపనము 4. నిరూపణము, నిదర్శనము, నిర్ణయము. 5. సామ్రాజ్యము, యాథార్థ్యము. 6. తీర్పు, నిశ్చయము, పరిష్కారము. 7. నిష్కర్ష, నిజము 8. చెల్లింపు, ఆనృణ్యము. 9. మందులు మొదలగు వానిని వండి తయారు చేయుట. 10. చిక్కు విడఁదీయుట, సమస్యలను బరిష్కరించుట 11. సంసిద్ధత 12. పరిశుద్ధత, పవిత్రత. 13. అతి మానుషశక్తి, (సిద్ధులు ఎనిమిది. అణిమ, మహిమ, లఘిమ. గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.) 14. మంత్రౌషధాదులవల్ల అతిమానుష శక్తులు సంపాదించుట. 15. అద్భుతమైన నైపుణ్యము లేక శక్తి. 16. సత్ఫలితము. 17. పరమానందము, మోక్షము. 18. అవబోధము, బుద్ధి. 19. విధానము, అంతర్ధానము. 20. మంత్రసాధకుడు. 21. ఒక విధమైన యోగము 22. ప్రయోజనము. ఉపయోగము. 23. పరిపూర్ణ జ్ఞానము. 24. దుర్గాదేవి పేరు. 25. శివుని పేరు. 26. ధరించినవాని నిచ్చవచ్చిన చోటికిఁ గొనిపోవు పావుకోళ్ళు.

సిద్ధించు సం. అ. క్రి. 1. తటస్థించు. 2. ఫలించు, ఈడేరు. 3. ఒడఁగూడు.

వ.... జన్మత్రయంబున దద్దర్శనంబు సిద్ధించు ననుట సిద్ధంబు. భోజరా. 6 312.

సిద్ధిదము సం. విశే. 1. విజయము నిచ్చునది. 2. అష్టవిధ సిద్ధుల నిచ్చునది.

సిద్ధిదుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సిద్ధియాల వి. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక శాఖ.

సిద్ధుఁడు సం. వి. అ. పుం. 1. అణిమాదులైన యష్ట సిద్ధులు గలిగిన దివ్యపురుషుఁడు. 2. అతీంద్రియ దర్శనము గల ఋషి. 3. యోగి, ముని, ఋషి. 4. ఇంద్రజాలమునం దారితేరిన వాఁడు. 5. మంచి మేధ కలవాఁడు. 6. ముక్తుఁడు.

వ. యక్షపక్షి రక్షో గంధర్వ సిద్ధసాధ్య తపోధనాది వివిధామర విశేషంబులును. నార. 5. 117.

సీ. అట్లు కర్ణాకర్ణి నవ్వార్త విని భూమిఁ గల సిద్ధులెల్ల నయ్యాలఘువిద్యఁ బరికించు వేడుక నరుదెంచుచుండంగ .... భోజరా. 2. 140.

సిద్ధురాలు (సిద్ధ+ఆలు)=సిద్ధిపొందిన స్త్రీ.

తే. గీ. సిద్ధురాలు హేమావతీసితకరాస్య, వలపు రేఖాతిశయమైన భవమును దెల్ప ...హంస. 1. 78

సిధ్మము సం. వి. అ. న్. న. 1. మచ్చ. పొడ. 2. కుష్ఠవ్యాధి. 3. కుష్ఠవు పొడ.

సిధ్మల సం. వి. ఆ. స్త్రీ. 1. ఉప్పుచేప. 2. సిధ్మము గలది. 3. బొల్లి, పొడ.

సిధ్మలము సం. విణ. అ. అ. అ. 2. మచ్చలు గలది. 2. పొడలు గలది. 3. కుష్ఠువ్యాధి గలది.

సిధ్యము సం. వి. అ. న. పుష్యమీ నక్షత్రము.

సిధ్రక సం. వి. ఆ. స్త్రీ. వృక్షవిశేషము.

సిధ్రకారణము సం. వి. అ. న. దేవోద్యానము.

సిధ్రకి సం. వి. ఈ. స్త్రీ. లింగపొట్ల.

సిధ్రము సం. విణ. 1. పూర్ణము. శుభము. 2. సంరక్షణము.

సిధ్రము సం. వి. అ. పుం. వృక్షము.

సిధ్రుఁడు సం వి. అ పుం. పుణ్యపురుషుఁడు.

సినీవాలి సం. వి. ఈ. స్త్రీ. 1. చంద్రకళతోఁ గూడిన యమావాస్య. పార్వతి

సిపాయి హిం. వి. 1. కాలిబంటు. 2. భటుఁడు.

సిపారసు హిం. వి. 1. యోగ్యతా వచనము. 2. యోగ్యతాపత్రిక. (శ. ర.)

సిప్ర సం. వి అ. స్త్రీ. 1. స్త్రీ యొక్క కటిచక్రము. 2. మహిషి–గేదె. 3. ఉజ్జయినీ సమీపమునందలి యొక నది పేరు.

సిప్రము సం. వి. అ. పుం. చెమట, స్వేదజలము.

సిప్రుఁడు సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సిబ్బంది హిం. వి. 1. సేవకులు. 2. సైన్యము.

సిబ్బి వి. 1. ఇత్తడి మున్నగువానితోఁ జేయఁబడిన అంచులులేని గుండ్రని పళ్ళెము. 2. మూఁకుడు 3. పళ్ళిక.

సిబ్బితి వి. సిగ్గు.

కం. ఇవ్వని దలిదంద్రులకుం, జెప్పఁగ నలె నాచుఁ గలఁప సిబ్బితి మిగులున్, ముప్పిరిగొనుచుం జైనయి, గప్ప నొరుల చాటువారు గారే కన్నెల్. నీలా. 2. 80.

సిబ్బితికత్తె విణ. సిగ్గు గల యాఁడుది.

సిబ్బితికాఁడు విణ. సిగ్గు గల పురుషుఁడు.

సిబ్బిపళ్ళెక వి. వెడల్పు మూతిగల గంప.

సిబ్బిమనిమెకము వి. పనుఁగు.

సిబ్బియము (రూ. సిబ్బెము) వి. బొల్లి, పొడ.

సిబ్బుద్ది

వ. అని యనేక ప్రకారంబులఁ దమ్ము సిబ్బుద్ది నడలఁ బలుకుచున్న వారి సందడిం గటాక్షించి. కు. సం. 6. 18.

సిబ్బెత వి. సిగ్గు.

సిబ్బెము వి. (సిబ్బియము) 1. బొల్లి, పొడ. 2. శోభ.

సిఖాండి సం. వి. ఈ. స్త్రీ. అగ్ని, మేడివృక్షము.

సిర సం. వి. ఆ. స్త్రీ. రూ. శిర. 1. నాడి. 2. బోలు నరము. 3. ఈనె.

సిరంగఁడు వి. శ్రీరంగఁడు.

సిరంగము వి. శ్రీరంగము.

సిరకా వి. 1. పులిమెట్టు. 2. పులియఁబెట్టిన కడుగు నీళ్ళు.

సిరము సం. వి. అ. పుం. పిప్పలి కట్టె.

సిరము సం. విణ. చల్లనిది.

సీ. సిరమైన పచ్చకప్పురము గందంబుతోడఁ గలిపి పాలిండ్లపై నలఁది యలఁది. విక్రమార్క. 4.162.

2. శిరస్సు.

వృషభగతిఁ గడ. గానిగా సిర ముంచె వంపక కవ్వు కవ్వుర మేం అంతులు. వసు. 2. 148.

3. సీ. తెక్కులఁ గ్రేవం సిరవుమించుచుఁ జోడఁ దరి పాల తరుకులు తడఁబడంగ. విక్రమా. 7 116.

**సిరము** వి. శిరస్సు.

**సిరస్తేదారు** హిం. వి. 1. ఒకానొక యుద్యోగి 2. లెక్కలు చూచువారికి పై యుద్యోగస్థుఁడు (శ. ర.)

**సిరా** సం. వి. అ. స్త్రీ. 1. రక్తనాళిక. ధమని —, గొట్టము వంటి పాత్ర. 3. ప్రవాహము. పఱు.

**సిరా** హిం. వి. కలముతోఁ గాగితము మున్నగువాని పై వ్రాయుట కుపయోగించు ద్రవపదార్థము.

**సిరాజాలము** సం. వి. అ. పుం. 1. కంటి యందలి ధమనులు ఉబ్బుట. 2. నాడుల సమూహము.

**సిరాజి** వి. ప్రవాహము. 2. ఒకానొక దేశము.

**సిరాజి** విశే. శ్రేష్ఠమైనది.

**సిరాజీ** వి. 1. సిరా. 2. సంపూర్ణమగు నాణెముకలది. 3. దేశవిశేషము.

**సిరాణము** వి. ఆయుధ విశేషము.

వ. సెలకట్టె పట్టెంబు సిరాణంబు చక్రంబు మొదలగు కైదువులు. ఉ. హరి. 4. 413.

**సిరామోక్షము** సం. వి. అ. పుం. ధమనులను ద్రుంచుట.

**సిరావ్యధము** సం. వి. అ. పుం. ధమనులను ద్రుంచుట.

**సిరి** వి. 1. లక్ష్మి. 2. సంపద. 3. శోభ.

ఆ. వె. అంత నీలఁగూడి ... ... బలుగుదాత్వే లువు తలఁకు లేవి సిరులఁ దనరుచుండె. నీలా. 3. 112.

సీ. బాగముగా విరివయల్ చుట్టి గట్టిగ విడ్డనిగ వెంపు వాఁడెంపు సిరుల నీవ. నీలా. 2. 60.

4. పీఠంబి యందు ముమ్మొదు వచ్చినవారికి చెప్పెడు గుర్తు.

**సిరికమ్మి** వి. అడ్డకమ్మి. 2. తోరణపుఁ గమ్మి.

**సిరిగంధము** వి. రూ. (శ్రీగంధము) 1. చందనము. 1. శ్రీ చందన వృక్షము.

వృషభగతి బగడ, అలసి యలసిరి గంధ మదరెడు నాకనాడ భుజంగి వగుకుచె వసు. 3. 149.

**సిరిగట్టు** వి. శ్రీశైల పర్వతము.

**సిరిచూలి** వి శ్రీ పుత్రుఁడు, మన్మథుఁడు

**సిరిమంతుఁడు** విశే శ్రీమంతుఁడు.

**సిరివసుఁడు** వి. విష్ణువు

**సిరిసింగనాలవృత్తి** బాలక్రీడా విశేషము (రూ సిరి సింగణాలవృత్తి).

సీ. వీమతుఁ డెందేగిన వెమకెద నన్న యున్నతి వాఁడు సిరిసింగనాల వృత్తి రా. వి. 2. 23.

సీ. చిట్లబొట్లకాయ సిరిసింగణావృత్తి. గుడుగుడు గుంచాలు కుందెనగుడి. శ్రీ కాళహస్తి. 3 33.

**సిరోత్పాతము** సం వి అ. పుం. 1. ధమనులకు సంబంధించిన వ్యాధి. 2. కంటికలఁక.

**సిల** వి. (రూ. సెల ) నీరు పట్టు తావు.

**సిలము** సం వి అ. న. (రూ శిలము) ఉంఛవృత్తి.

**సిలాజిత్తు** వి. (రూ. సిలాజిత్తు) ఒకానొక మందు దినుసు

**సిలుగు** వి. 1. ఉపద్రవము

కం. ప్రుచ్చులు జారులుఁ బోరిఁబోరి, జిచ్చులఁ గలవులను రాచసిలుగులఁ జెడియున్, బచ్చియుఁ బ్రబలొంచెముగా, నెచ్చోట్లును బాడయగు మహీతల మెల్లన్. హరి. 9. 47.

2. హాని. 3. కష్టము

**సిలువ** వి క్రీస్తును బంధించి వధించిన కొయ్య.

**సిల్హము** సం వి. అ పుం. 1. చిల్లమడ్డి. 2. అదుగుబంకతోఁ జేసిన సుగంధ ధూపద్రవ్యము.

**సివంగి** వి. 1. సివ్వంగి 2. సివంగివలె మండు కుక్క 3. కస్తూరి.

చం. పులియఁడు బూచిగాఁ దనుంపోతులరా జను మంతిగాఁడు చెంగలు వనివంగి భైరవుఁడు ... ... మనుచ 4. 32.

**సివము** వి (రూ. సిగము) 1 ఆవేశము. 2. దైవము మేని మీఁదికి వచ్చుట.

**సివమెత్తు** అ. క్రి దైవావేశమగు.

సివరము సం. వి. అ. పుం. వసుఁగు.

సివా అవ్య. (రూ. సివాయి) తప్ప, కాక.

సివారు వి. (రూ. శివారు) పెద్ద గ్రామమునకుఁ జేరి యుండు చిన్న పల్లె.

సివిలు ఆం. విశే. ఆస్తి విషయమైనది. (శ. ర.)

సివ్వఁగి వి. సివంగి.

సిషాధయిష సం. వి. అ. స్త్రీ. 1. సాధించు కోరిక. 2. నిరూపించు కోరిక.

సిసల్(లు) హిం. విశే. నిర్ధారణమైన (శ. ర.)

సిసువరకము వి. శుశ్రూష.

సిసువు వి. (రూ. శిశువు) బిడ్డ.

సిసువుఁడు వి. శిష్యుఁడు.

సిసృక్ష సం. వి. అ. స్త్రీ. సృష్టింపవలెనను కోరిక.

సిసృక్షువు సం. విశే. సృష్టింపవలెనన్న కోరిక గలవాఁడు.

సిసృప్స సం. వి. ఆ. స్త్రీ. పోవలెనన్న కోరిక.

సిసృప్సువు సం. విశే. పోవలెనన్న కోరిక గలవాఁడు.

సిస్తు వి. 1. కప్పము. 2. పన్ను. 3. రాజ సంవర్శన వేళ నిచ్చెడు కానుక. 4. అందము. 5. సొంపు.

సిహుండము సం. వి. అ. పుం. జెముడు. (వ్యా. వి.)

సిహుల్లిక సం. వి. అ. స్త్రీ. కాళ్ళు చేతులు పగిలిన కుష్ఠువు.

సిహ్లకము సం. వి. అ. పుం. (సిల్హము. రూ.) ధూపము.

సిహ్లకి సం. వి. ఈ. స్త్రీ. (సిహ్లా) సాంబ్రాణి చెట్టు.

సిహ్లభూమిక సం. వి. అ. స్త్రీ. 1. సిల్హము. ధూపము.

సిహ్లము సం. వి. అ. న. 1. సిల్హము. 2. ధూపము.

సిళ్కు వి. (సిడులు) 1. ములుకోల. 2. అంకుశము. 3. ఐరికోల.

కం. చెలులు విడు మనిన వలుకెద, గొలవిం గొని చూడినట్లు గొని కాలఁగ బి,ట్టలఁ గోవ వహ్నిఁ ఱాచెం, జులచుటి మదకరికి సిళ్కు మూపివ్స్తంగిన్. కు. సం. 10. 144.

# సీ

సీ అవ్య.) జుగుప్సా సూచకమైన యవ్యయము.

సీ వి. శ్రీ, సంపద (శ. ర.)

"సీ రాము సేన వాలు మెకంబుల్" మను. 4 ఆ.

సీకరము సం. వి. అ. పుం. తుంపరలుగాఁ బడు వాన తుంపర (శీకరము).

సీకాయ వి. శిఖాఫలము. నూనె మొదలగువాని జిడ్డును పోగొట్టు దినుసు

సీకారి వి. గాయకుఁడు.

సీత సం. వి. అ. స్త్రీ 1. శ్రీరాముని భార్య. 2. నాఁగటి చాలు. 3. దున్నఁబడిన భూమి. 4. గంగ (తూర్పు శాఖ). 5. మద్రపతి కేతనపు గుర్తు. 6 వ్యవసాయము. 7. ఇంద్రుని భార్య. 8. ఉమ. 9. లక్ష్మి. 10. మద్యము.

సీతభేది వి. ఆమవిరేచనము.

సీతాకోకచిలుక వి. చిత్రవర్ణమయమైన పెద్ద రెక్కలు గల యొక పురుగు.

సీతాద్రివ్యము సం. వి. అ. న. వ్యవసాయపుఁ బనిముట్లు.

సీతాధ్యక్షుఁడు సం. వి. అ. పుం. వ్యవసాయ పర్యవేక్షకుఁడు.

సీతా(తి)నకము సం. వి. అ. పుం. బటాణి గింజ.

సీతాపతి సం. వి. అ. పుం. శ్రీరాముఁడు.

సీతాఫలము సం. వి. అ. పుం. 1. ఫల విశేషము. 2. సీతాఫలపు చెట్టు.

సీతాభోగములు (బహు) సం. వి. అ. పుం. శాలి ధాన్యము.

సీతి వి. శైత్యము.

సీతు(వు) వి. 1. చలికాలము.

సీ. వానయు సీతును వర్జించి ముందు కేపని గాక మున్న సస్యముల పంట లొదవెడు తఱి నెత్తువడి శత్రువయి. భా. శాం. 2 ఆ.

2. చలి.

సీతు సకలాంగక బులు ప్రీతున్నము లయ్యెడు. భా. క. 8. అ.

సీతోసీరము సం. వి. అ. పుం. వట్టి వేరు.

సీత్కారము సం. వి. అ. న. ఊపిరిని నోటితో లోనికిఁ పీల్చునప్పుడు చేయు ధ్వని.

(సిట్టూర్పు చలిబాధ మున్నగువాని నిది సూచించును.)

సీత్కృతము సం. వి. అ. న. సీత్కారము.

ఉ. నాన దొఱంగి చుంబన మొనర్చుచు కాదొకఁ డొక్క చంద్రబిం, కాననమోముఁ జ ద్రుఁ జప కాంతర బింబితుని బునఃపునః పావక పావకర్మము నెసఁబునఁ జేసి తదోష్ఠ పల్లవం, బానుచు నాచరించెను సముచిత సీత్కృత చూత్కృతంబులన్. శృం. నై. 6. 188.

సీత్కృతి సం. వి అ. స్త్రీ. 1. సీత్కారము. 2 రతి ధ్వని విశేషము.

సీత్యము సం. విశ. (అ. అ. అ) దున్నఁబడినది (నేల).

సీత్యము సం. వి. అ. న. బియ్యము; వరిధాన్యము.

సీదరపుఁబెద్ద వి. ఆదిశేషువు.

సీదరము వి. (రూ. సీద్రము.) 1. ఎద్దడి. 2. శీద తనము. 3. సర్పము.

సీ. అనయంబు వడకతప్పని గోత్రపతు లెప్పుడును సీదరము తెలి యనసుభోగులు. వసు. 1 ఆ. 98. (చివరి రెండర్థములకు)

సీ. తరిత్రాదు సీద్రంబు పొం లంటి గాలిచే జడియు చందమున సంచలు భ్రమింప. పాండు 3. ఆ.

సీద్యము సం. వి. అ. న. సోమరితనము.

సీధుగంధము సం. వి. అ. పుం. 1. వకుళ వృక్షము. 2. మద్యవాసన.

సీధుపము సం. విశ. (అ. ఆ. అ) మద్యము త్రాగు నది.

సీధుపానము సం. వి అ. న. మద్యము త్రాగుట.

సీధుపుష్పము సం. వి. అ. పుం. కదంబ వృక్షము. వకుళ వృక్షము.

సీధుపుష్పి సం వి. ఈ. స్త్రీ. ధాతకి, ఆరెపువ్వు

సీధురసము సం. వి. అ. పుం. 1. మామిడిచెట్టు. 2. మద్యరసము.

సీధువు వి. (రూ. శీధువు. 1. పక్వమైన చెఱకు రసము నుండి చేయఁబడిన కల్లు. 2. మద్యము. 3. ఏనుఁగు కన్నుల యందలి మదము.

తరల. పదను మీఱ రసాలపేశల పల్లవావళి ముక్కునం, జిదిమి కుత్తుకబంటి తద్రస సీధువుంగొని చొక్కి వక్కొ్రదమ కోయిల గుంపు నార. 2. 110.

సీధుసంజ్ఞము సం. వి. అ. పుం. వకుళ వృక్షము.

సీధ్రియము సం. వి. అ. న. గుదము (?)

సీనా వి. మెత్తని చక్కెర.

సీపము సం. వి. అ. పుం. పడవ రూపమున నుండు యజ్ఞపాత్రము.

సీపి హిం. వి. ముత్యపుఁ జిప్ప.

సీమ సం. వి. అ. పుం. ఎల్ల, సరిహద్దు. 2. ఎల్ల క్షేత్రాదుల యెల్లలను సూచించు గుట్ట. 3. గుర్తు. 4. తీరము. 5. తిలకము. 6. పుఱ్ఱె యందలి వాని వంటి కుట్టు. 7. ఔచిత్య మర్యాద 8. అత్యున్నతి. 9. బాలము. 10. మెడ వెనుక భాగము 11. అండకోశము. 12. కేశాభరణము.

సీమ సం. వి. న్. స్త్రీ. 1. ఎల్ల, సరిహద్దు, పొలిమేర, 2. అండకోశము, 3. పెదదల 4. వరిమడి.

సీమ సం. వి. ఆ. స్త్రీ. 1. ఎల్ల. 2. ప్రదేశము. 3. పరిమాణము. 4. వరి మడి. 5 వృషణము. 6. ఉనికి 7. చెఱువు మొదలగు వాని గట్టు.

సీ. అమృత పూరాశ్చర్య తమవిరజానదీ సీమావరుద్ధ సంసృతి కథంబు. కళా. 8. 204.

చం. లలన యొకర్తు వగ్గు కృకలాసముఁ దేరఁగ దెచ్చివంచవన్, వలువకుఁ బంచె వట్టు నెలనాగ పద ద్వయ మధ్యమంబునన్, నిలిపిన గాల్పుప్రాక నది నివియ సీమకు. శృం. నై. 6. 111.

సీమంతకము సం వి అ. పుం. పాపట దిద్దుట.

సీమంతకము సం. వి. అ. న. సిందూరము, కెంపు.

సీమంతకుఁడు సం. వి. అ. పుం ఒకానొక నరకవాని.

సీమంతమండనము సం. వి. అ. న. సిందూరము.

సీమంతము సం. వి. అ. పుం. 1. పాపట.

శా..... పౌరాంగనా, సీమంతంబులఁ బుష్పరేణు పుమమన్ సింధూర రేఖాకృతిన్. విక్ర. 1. 84.

2. గర్భ సంస్కారములు 4, 6 లేక 8 వ నెలలో చేయునట్టి కర్మ విశేషము.

గీ. పొలఁతికిని గర్భ మేర్పడఁ బుంసవనము, మానుగా నాలు నెలలసీమంతవిధియుఁ, జేయఁదగు విజ్ఞా. కాం. 1. 14.

3. సరిహద్దురేఖ 4 పొలిమేర.

సీమంతితము సం. విశే. (అ. అ. అ) 1. పాపటవలె విడఁదీయఁబడినది. 2. గీఁతచే విడఁదీయఁబడినది.

సీమంతిని సం. వి. ఈ. స్త్రీ. అఁడుది, ముత్తైదువు.

సీ. సుమతి సీమంతినీ కమనీయ శశికాంత పాంచాలికా శితభానుఁ డగుచు. విక్ర. 1. 163.

సీమంతోన్నయము సం. వి. అ. పుం. 1. సీమంతము. గర్భవతులకు 4 వ 6 వ లేక 8 వ నెలలో పాపట తీయు నుత్సవము.

సీమఅగిసె వి. ఒక విధమైన అగిసె.

సీమక సం. వి. అ. స్త్రీ. 1. చీమ. 2. చీమల పుట్ట. 3. చాలుక క్రింద నుండు కురుపు.

సీమకము సం. వి. అ. పుం. 1. వృక్షవిశేషము. 2. చీమలపుట్ట. 3. చీమ లేక చిన్న కీటకము.

సీమకరక వి. శ్లేష్మమును హరించు ఓషధి విశేషము.

సీమటపాకాయ హి. వి. చిన్నరకము టపాకాయ.

సీమరేఁగు వి. పెద్ద రేఁగుపండు (యాపిల్)

సీమలింగము సం. వి. అ. న. సరిహద్దు గుర్తు

సీమవంగ వి. రామమునగకాయ (టొమాటో).

సీమాంతము సం. వి. అ. పుం. సరిహద్దురేఖ.

సీమాంతపూజనము సం. వి. అ. న. 1. గ్రామపు సరిహద్దును బూజించు నుత్సవము. 2. గ్రామపుఁ బొలిమేరకు వచ్చినప్పుడు నూతన వరుని సత్కరించుట.

సీమాటి వి. సౌభాగ్యవతి.

సీమాధిపుఁడు సం. వి. అ. పుం. పొరుగురాజు.

సీమానిశ్చయము సం. వి. అ. పుం. సరిహద్దు విషయమై చేయఁబడిన న్యాయస్థానపుఁ దీర్పు.

సీమాలింగము సం. వి. అ. పుం. సరిహద్దురేఖ.

సీమావివాదధర్మము సం. వి. అ. పుం. సరిహద్దు వివాదములకు సంబంధించిన న్యాయము.

సీమావివాదము సం. వి. అ. పుం. సరిహద్దుల విషయమై యేర్పడు తగాదా.

సీమావృక్షము సం. వి. అ. పుం. సరిహద్దు గుర్తుగా నుండు చెట్టు.

సీమాసంధి సం. వి. ఇ. పుం. రెండెల్లలు కలియు చోటు

సీమాసేతువు సం. వి. ఉ. పుం. సరిహద్దుగా నుండు గట్టు లేక వంతెన.

సీమోల్లంఘనము సం. వి. అ. న. సరిహద్దు నతిక్రమించుట.

సీరము సం. వి. అ. పుం. నాఁగలి.

సీరకుఁడు సం. వి. ఉ. పుం. సూర్యుఁడు.

సీరధ్వజుఁడు సం. వి. అ. పుం. జనకుఁడు.

సీరపాణి సం. వి. ఇ. పుం. బలరాముఁడు.

సీరము సం. వి. అ. పుం. 1. నాఁగలి. 2. జిల్లేడు మొక్క.

సీరయోగము సం. వి. అ. పుం. ఎడ్లను నాఁగలికిఁ గట్టుట.

సీరవాహకుఁడు సం. వి. అ. పుం. కర్షకుఁడు.

సీరాంగము సం. వి. అ. న. నాఁగటి కట్టు.

సీరాయుధుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సీరాసనము సం. వి. అ. న. సీరము.

సీరి సం. వి. న్. పుం. బలరాముఁడు.

గీ. వడుము వయిదు బాణంబుల వలెనె సీరి. ఉ. హరి. 3. 76.

సీరుఁడు సం. వి. అ. పుం. సూర్యుఁడు.

సీర్ణము సం. వి. అ. న. చల్లబడినది.

సీల రూ. చీల. మేకు, మొ.

సీలంధము సం. వి. అ. పుం. ఒక విధమైన చేప.

సీలమండ వి. (రూ. చీలమండ) చరణ గ్రంథి.

సీలము సం. వి. అ. న. నాఁగలి.

సీలు ఆం. వి. 1. ముద్ర. 2. అచ్చుపోఁత. 3. తిరుగుట.

సీవకుఁడు సం. వి. అ. పుం. కుట్టువాఁడు.

సీవనము సం. వి. అ. న. 1. బట్ట మొదలగువవి కుట్టుట. 2. కుట్టు.

సీవని సం. వి. ఈ. స్త్రీ. 1. సూది. 2. గుజ్జము గుద స్థానము క్రింది భాగము.

సీవిరి వి. ఆలవట్టము. 2. విఁజామర. 3. కల్లు.

సీసకము సం. వి. అ. న. 1. సీసము. 2. సత్తు. 3. మల్ల బంధ విశేషము.

వ. వాసుదేవుండు సీసకంబు పూచిన కై వేయుండు. ఉ. హరి. 3. 64.

సీసజము సం. వి. అ. న. సింధూరము.

సీసము సం. వి. అ. న. 1. సీసకము. 2. సత్తు 3. ఛందో విశేషము. 4. వెట్టి. 5. రోషము.

సీసా వి. గాజు పాత్ర విశేషము.

సీహుండము సం. వి. అ. పుం. జెముడు చెట్టు

# సు

సు ఉపసర్గము. 1. మంచి. 2. తగిన. 3. పూర్ణము. 4. సమృద్ధము. 5. ఆశ్రమము. 6. అందమైన.

సు = చు. అవ్య.

చు అను నవ్యయము కళల మీఁద గసడదవాదేశముచే సు అగును. చూ; చు.

సుంకపుఁగానులు అడవుల నుండి కట్టెలు మొ. తెచ్చుకొనుటకై చెల్లించెడి రొక్కము,

చం. వలనగు పుట్టగోఁచి బిగివాళ్ళను సుంకపుఁ గానులు న్విభా, సిలు కరసాన గొడ్డలియు జిక్కము నన్ సొరకాయ బుఱ్ఱలోఁ, జలిదియు మంచి బంధు జన సంతతి దర్శనభీతి లోఁగుచున్. గెళవులఁ బ్రాము కొంచు వరిగెన్ హసనంబునకై రయంబునన్. శుక. 3. 548.

సుంకమడుగు సుంకమిమ్మని నిర్బంధించి యడుగు.

సీ. ... నవ పింఛమయ భూష లవధరించి నటించు వంకజాతుని చెల్వు సుంక మడిగి; ... మను. 3. 19

సుంకము (సం. శుల్కమ్. ప్రా. సుక్కో. సుంగో. క. సుంకె.) వి. వస్తువుల పైని విధించెడి పన్ను.

సీ. తే గీ. .. సుంక మన దాణ మనఁగను శుల్కమెసఁగు ... ఆం. భా. 2. 192.

సీ. ...ధాన్యములు సువర్ణాదాయములును దుర్గాదుల నుడియు శేహారుల సుంకములును. ఉత్తర హరిశ్చం. 1. 67.

2. వివాహము నందుఁ గన్యక కిచ్చు ధనము.

ఎ. గీ. ఉఁకువన నోలియనఁగను సుంకమనఁగను బైఁడి యనఁగన్యకాశుల్క వాచకమగు. ఆం. భా. 2. 179.

(సంకవంగ అని ముద్రిత పాఠము)

3. ప్రతిబంధము.

చం. అతఁడు తదల్ప పాపఫల మందుట సుంకము లేకపోయి త, చ్ఛతదళపత్ర నేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కి. ఆము. 6. 44.

సుంకము పట్టు, పన్ను రాఁబట్టు.

చం. సుంకము పట్టువళాంకు రాంకము. శృం. నై. 5. 105.

సుంకరి వి. శుల్కాధికారి, పన్ను రాఁబట్టువాఁడు. (సుంకము+అరి)

సీ. ... శుల్కాధికారి, చనును సుంకరి యనఁగను ... ఆం. భా. 2. 183.

కం. నమ్మకు సుంకరి జూదరి. సుమతి. శ. 62.

కం. నరక మ్మెడు శేహారులు, నరపతి సుంకరుల కెక్క నమ్మిక తోడన్, నరకమ్మిన సొమ్మునఁదా, రరువది యగు పాలు సుంకమీఁదగుఁ బ్రీతిన్. విజ్ఞాప్రాయ. కాం. 88.

సీ. కాలంబు పేరి సుంకరి యంబరంబునఁ దొడిచి నట్టి యరుణముద్ర యనఁగ. (సూర్యోదయ వర్ణనము). రాజవాహన. ౩. 29.

కం. నీ వడకలు గంటిఁగదే, కానవవే నగరఁ జెప్పి కాఁపెంచెద ని, న్నేనంచుఁ గుంటిసుంకరి, పూనిక బెద రించుఁ బోలఁతి బొమముడి వెట్టన్. శు. ౪. ౭౯౬.

గీ. మాట నిలకడ సుంకరి మోటకేల, చెవిటివానికి సత్కథాశ్రవణ మేల. రామ. ౯. ౬౮ ప్రా.

**సుంకరీఁడు** వి. (సుంకరి+ఈఁడు) శుల్కాధికారి, సుంకము తీయువాఁడు.

కం. అడిగిన పతితో నిట్లను, దడవాయెను సుంక రీఁడు తమ లెక్కలకై వడియున్నాఁ డిదె కమమని, వడఁతి యతనిఁ జూవఁ జూచి భయ ముప్పొంగన్. హంస. 4. 115.

**సుంకిఁడు** వి. శుల్కము పుచ్చుకొనువాఁడు, పన్ను రాఁబట్టువాఁడు.

ద్వి. లెంకదామంచయ్య లీల మీనగరి, సుంకిఁడు సుంకేశుబంకయ్యగారు. బస. పురా. 2 ఆ. 37 పు. 488 వ.

**సుంకు** వి 1. సస్యకుసుమరజము, పువ్వాళ, రజస్సు, దుమ్ము.

సీ.... సస్యకుసుమసంఘ చమ సుంక వంగము ... ఆం. భా. 2. 187. ప్రా.

మ. బిరుదున్ గంటలు గట్టి సుంకు పెలయన్ బింకంబుతో నెంతగాఁ, గఱకల్ జూపెమ బోదు దన్ విరిసి ముక్కన్ ప్రాలుచున్ గంకిగాఁ, బరు చొందం దెగువందెగాఁ గమల గర్భంబుల్ దృణ ప్రాయమై, నఁసీజావవ జ ఘికా ప్రతిభ కెంచన్ సాటిరా నేర్పునే. ఉత్తర హారిశ్చం. ౪. ౬8. ప్రా.

ద్వి కరమూల యుగళి బంగరు సుంకురాల విరి బంతి కెంగేల వికసింప మఱియు. ద్వి. పరమ 2 57. ప్రా

మ. అనుచుం గాంచన కింకిణీనవముతో నాబద్ధ మాల్యాసితో, మినుకుల్ దట్టవుఁ బట్టైనామము లతో మేలుక్కువన్ బోసి తె, చ్చినదుడ్లున్ గుది కోలలుం దరుముచున్ శేకొల్దులన్ మోది యెు, క్కనిఁ బోనీయక సుంకు రాలిచిన రక్తస్రావ గాత్రంబునన్. శ్రీరంగ. ౪. 98 ప్రా.

2. ప్రతిబంధము.

సీ. మీసులఁ బట్టి వి మొఱఁగులఁ బట్టించి శుక్లుఁ బట్టించి సుంకణచి. కవిక. ౪. 47. శ. ర పా.

౩. పెండ్లియందుఁ బళ్ళెముపఁ బోసి వధూ వరుల మీఁద జెరుగు వస్తుపాట్టు.

కం. కంకణరాజత్కరులకుఁ, బంకజ నేత్రులకుఁ బుణ్యభాగులకు మమా, శంకర భక్తుల కప్పుడు, సుంకులు చల్లిరి శశాంక సుందర వదనల్. బ్రహ్మోత్తర. ౪. 170.

కం. పల్లవపాణులు గొందఱు, పళ్ళెరములఁ బూని నవలబంగరు గాజుల్, ఘల్లురవ సుంకుఁ జెరిగిరి. యల్లోనేరేడటంచు న య్యందిరకున్. ప్రబం. 1. 151.

వ. బెగ్గురు పెండ్లికొడుకువకు సుంకులు చల్ల ఘన వేదికా సమాజంబు. చంద్రికా. 4. 68.

కం. సుంకులు జెరిగిరి మునివర, పంకజలోచవలు సువ్విపాటలతోలే, యంకురము లెత్త సభ వా రింకను వివహెవటందు రేమవశక్తిన్. పాంచ 5. 121.

వ. ఇరుగెలంకుల కుంకుమపు సుంకుల వెనపల్లు బింకెపు చంకల పొంకంబును. ప్రబం. . 7.

**సుంకేసరి** వి. వృక్షవిశేషము.

సీ గొగుపొగడములు గోరంటలును తెద్దవెలమ సుంకేసరి వెట్టి చిక్కి. హంస. 4. 1 .

సుంకేసల సుంకాసరి, అని ప్రా.

**సుంకేసలము** వి. వృక్షవిశేషము.

**సుంత** వి. కొంచెము; ఇంచుక.

కం. ఏ నింతవాఁడ నేనయి, పూనుదునఁట యెద్ది గాకపోయెడు వని సుంతైన ఫల మంద రీఱదు మానవులక కాను వినుమ మర్త్యులకైవన్. పాండు రంగ 5. 238.

ద్వి. చూడు మేమందు నీచుఁడ సుంతలోన, నాడు దానిది యను ంటకపోదు. సారంగ. 1. 81 పు. 9. పం.

సీ. వరశంఖ పూగసంపద గళస్థము నీకు సతితోఁక ముకి సుంత నపల రాదె. చంద్రికా. 6, 188.

సుందరము సం. విశే. అ ఈ అ. 1. అందమయినది. 2. అదరపాత్రమయినది.

సుందరి సం. వి. ఈ. స్త్రీ. 1. అందగత్తె. 2. ఒకానొక చెట్టు.

సీ. చిటిగాడు సుందరి చీకెట్టుకుమ్మయుఁ దెల్లదుమ్మల్లి ంఁదకళ్ళు జొట్టి. హంస. 4 9.

సుకంటక సం. వి. అ. స్త్రీ. ఔషధమునకుఁ బనికివచ్చు నొక మొక్క (వృ. వి.).

సుకండువు సం. వి. ఉ. పుం గజ్జి, చీడ.

సుకందకము సం వి. అ. పుం. ఉల్లి.

సుకందము. సం. వి. అ పుం. 1. ఉల్లి. 2. తృణవిశేషము. 3. చిలకడ దుంప.

సుకల సం. వి. అ. స్త్రీ. సాధువు కాని యావు, ఒట్టియ. (శ. ర.)

సుకదట్టము వి చిలుకవచ్చు వన్నె గల బట్ట.

రగడ. గింజెంబులు బతి సీల్దసలిలును గిముకాశకులు సుకదట్టమ్ములు ... కలిగిన వలువన్నెల పట్టెఁబులు. కవి. 8. 195.

సుకము (సం. సుఖమ్) వి. హాయి.

సీ. తే. గీ ... హాయి సుకము సుమాళమం చవఁగ సుఖము .... ఆం. భా. 1. 93.

ద్వి. వకవకలై యింతవ్రతము దక్క వను-సుకము దక్కఁకపోయెఁ జూచిరే యనుచు. ద్వి. వే. ము. 4. 302 పు. వ్రా.

సుకర సం. వి అ. స్త్రీ. సాధువైన యావు; తేలికగా మాలిమియైన యావు.

సుకరము. సం విశే (అ. ఆ. ఈ. అ.) సులభమైనది, సులభముగాఁ జేయఁదగినది.

సుకరము సం. వి అ న వితరణము; ఔదార్యము; ఈవి.

సుకర్మము సం వి. న్. న. 1. మంచిపని. 2 ఒక గ్రహయోగము.

సుకర్ముఁడు సం. వి. న్. పుం. 1. ధర్మకర్మము చేయువాఁడు. 2 విశ్వకర్మ.

సుకలుఁడు సం వి. అ. పుం. దాతయు, భోక్తయునైనవాఁడు, దానధర్మముల చేత ఖ్యాతి గడించినవాఁడు.

సుకవాసి విశే. కష్టపడక సుఖముగా నుండువాఁడు.

ద్వి. ధనరాశి యిచ్చోటఁ దఱుల యిత్తు, నొకవిరామము మాకు నొదవె నీరాజ, సుకవాసి వనివంద చూపు గుట్టంబు. హంస. ఉత్త. 1 96. వ్రా.

సుకసుకము వి. మిక్కిలి సుఖము. (సం. సుఖసుఖమ్)

ద్వి. లోలత నలచేతిలో నిమ్మపండు. లీల బోషింపలాలితవైభవమున సుకసుకంబుననుండి స్రుక్కక దావఁ గెకరిఁచెదవు విధి గెలువ నీ వశమె. నవనాథ. 1. 67 పు. 15 పం.

ద్వి. సుకసుకంబున నుఁడి సుత సోదరాది, సకలబాంధవులతోఁ జావఁగోరెదవు రం. రా. అర. కాం. 171 పు. 7 పం. వ్రా.

సుకాండము సం. వి అ పుం. కారవేల వృక్షము. (వృ. వి.).

సుకాండి సం. వి. న్. పుం. తుమ్మెద.

సుకాండిక సం వి అ. స్త్రీ. కాండీరలత

సుకాష్ఠము సం వి. అ న. వంటచెఱుకు

సుకారి వి ఎద్దులమీఁద సరకెత్తి-సుకాని యూరూరు తిరిగి వర్తకము చేసెడి యొక జాతి.

సీ అడుబిడ్డ సుకారియల్లుఁడు పిండారిమఱఁదలుగోడలు మారువాడి. శతకము. శర.

సుకించు (సం. సుఖించు) అ క్రి. సుఖపడు. సుఖముగా నుండు.

కం. వినుగులు మేమును నీదయ, నని బొప్పడ వడవిఁ గడపు చల్లఁగ దలకె, ద్దెన ప్రొద్దు వాడుచు చెలుఁగక, యొనవరిగీముల సుకించి యుంటిమి హామీ. రామేశ్వరమా. 5 69. వ్రా.

సుకిని వి. సుఖవతి.

సుకియ వి. అ భక్ష్యవిశేషము, బూరెలు అని వ్రా.

ద. అప్పములు వెన్నప్పములు సుకియ లమృత కలశంబులు లాగులు చక్కెఁబూరు లుక్కెరలు ప్రబం. 1. 1 2.

మ ఇడి రమ్మోని కుపాయనంబులు మనోభీష్టంబుగా బూరియల్, వడలుం బక్కెర కజ్జికాయలును లాడ్వా లుక్కెరల్ పూర్ణపుం, గుడుముల్ గారెలు జెల్లమండిగలు నౌఁగుల్ కమ్మచాఁవట్లు నూఁటిడులున్ దోసెలు నప్పముల్ సుకియలున్ హేరాళమై కన్పడన్. రామా. 2. 115 ప్రా.

సీ. కుడుములు సుకియలుఁ గడియంపు టట్లు వెన్నప్పాలు వడియంబు లప్పడాలు. కళా. ¯. 81. ప్రా.

**సుకియించు** అ. క్రి. సుఖించు.

ఎ గీ. గుండియలు మ్రింగి దిగకున్న గ్రుడ్లు మిడిచి ధరణిఁ బొంలాడు పెనుముదికయ్యములును, ముడుసు వంజుళ్ళు ముచ్చటమునుఁగ మెసఁగి, చొక్కి సుకియించు ఒలితంపురక్కసులును. మైరా. 8. 142. ప్రా.

**సుకుందకము** సం. వి. అ. పుం ఉల్లి.

**సుకుమార** సం. వి. ఆ. స్త్రీ. 1. దొంతరమల్లె. 2. అరటి.

**సుకుమారము** సం. విణ అ.ఈ అ.) 1. మృదువైనది. 2. అందమైనది. 3. లేఁతది.

**సుకుమారము** సం. వి. అ పుం. 1. శాలిధాన్యము. 2. ఒకవిధమైన చెఱకు గెడ 3 శ్యామాక ధాన్యము. 4. ఆవాలు. 5. అడవి సంపంగి.

**సుకుమారము** సం వి అ న. తమాలపత్రము

**సుకుమారి** సం వి. ఈ స్త్రీ వనమల్లిక (వ్య. వి.).

**సుకుమారుఁడు** సం వి. అ. పుం. 1 లేఁతవయస్సువాఁడు. 2 యువకుఁడు 3. అందగాఁడు.

**సుకృతము** సం. విణ అ. ఆ అ. 1. చక్కగాఁ జేయబడినది. 2. పూర్తిగాఁ జేయఁబడినది. 3. యోగ్యముగా నిర్మింపఁబడినది. 4. సహాకరింపఁబడినది 5. పవిత్రమైనది, పుణ్యమైనది. 6. అదృష్టవంతమైనది.

**సుకృతము** సం. వి. అ. న. 1. ధర్మకర్మము, మంచిపని. 2. పుణ్యము. 3. అదృష్టము, శుభము. 4 ప్రతిఫలము, లాభము

**సుకృతి** సం. విణ ఇ. 1. మేలుచేయునది 2. శుభమైనది, పుణ్యమైనది. 3. తెలివిగలది, వివేకము గలది 4. ఉదారమైనది, దయగలది. 5. అదృష్టము గలది.

**సుకృతి** సం. వి. ఇ. పుం. 1. మంచిపనిచేయువాఁడు. 2. పుణ్యశాలి, అదృష్టవంతుఁడు, కృతార్థుఁడు.

**సుకృత్తు** సం. విణ. త్. త్. త్. 1. మేలుచేయునది. 2. లాభకరమైనది. 3. పవిత్రమైనది. 4. విజ్ఞమైనది, తెలివిగలది. 5. మంచియాగములు చేయునది.

**సుకృత్తు** సం. వి. త్. పుం. 1. నిపుణుడైన పనివాఁడు. 2. త్వష్ట.

**సుకృత్యము** సం.వి.అ.న. 1. మంచిపని. 2. సత్కార్యము.

**సుక్కురుఁడు** వి. (సం. శుక్రః) శుక్రాచార్యుఁడు.

ఆ వె. అనుచు దాని చందమంతయు వెఱఁగంది, సుక్కురుండు వనుప సోఁకుఱేఁడు, మరల దీవి కఁగి మఱిమీఱికోటలు, గట్టినేసి మూఁకఁ గాపు పెట్టె. అచ్చ. రా. యుద్ధ. 487, ప్రా.

**సుక్కుఱుళ్ళు** (స్రుక్కుఱుళ్ళు రూ.) వి. బ. ముడతలు.

సీ. మృదు తనూసుమవల్లి మిగులఁ గ్రాఁగఁదొడంగె నీకైన మైపూఁత పేటు లెత్తె, సొగసులేఁతెక్కుల సుక్కుఱుళ్ళు గనుపట్టె వదనారవిందంబు వాడుపాఱె. (సుక్కుఱుళ్ళు (బౌ. పా ) భోజరాజీ. 6. 17.

**సుక్రతువు** సం వి ఉ. పుం 1. ఇంద్రుఁడు 2. మిత్రావరుణుఁడు 3. అగ్ని. 4. శివుఁడు. 5. సూర్యుఁడు. 6 సోమము.

**సుఖ** సం. వి ఆ స్త్రీ వరుణదేవుని రాజధాని.

**సుఖంఘుణము** సం. వి. అ. పుం. 1. ఖట్వాంగము. 2. కపాలము 3. అగ్రమునఁగల దండము.

**సుఖంబు** క్రి. విణ సుఖముగా.

ఆ ....రుజము వెఱుఁగకముం, భావమున సుఖంబు జీవించుచుండె. భార. ఆది 4. 158.

**సుఖంబుండు** అ క్రి సుఖముతో నుండు.

ఆ. వె ఇట్టితలఁపు లుడిగి యింటికిఁ జని సుఖంబుండుమని పురోహితుండు పలుక, విని మనంబు

లోవ దెలసిన వైరాగ్య. మగ్గలింపఁ బల్కి తతని తోడ జాహ్నవి. 4. 158. ప్రా.

సుఖచారము సం. వి. అ. పుం. ఉత్తమాశ్వము.

సుఖద సం. వి. ఆ. స్త్రీ. 1. దేవవేశ్య. అప్సర. 2. గంగానది. 3. జమ్మిచెట్టు (వృ. వి.).

సుఖదము సం. వి. అ. క్లీ. విష్ణుపదము.

సుఖబోధము సం. వి. అ. పుం. 1. సుఖజ్ఞానము. 2. సులభమైన జ్ఞానము.

సుఖభోగులు వి. బ. ధాన్యవిశేషము.

సీ. వచ్చునరుల్ రెడ్డిపాలవంకెలు సుఖభోగులు వచ్చ కర్పూరంవరులు. హంస. 4. 128. ప్రా.

వ. సుఖభోగులు సన్నమూదులు గౌరవంకరాజనాలు కాటుకరేకులు.... ప్రబం. 1. 112. ప్రా.

సుఖము సం. విశే. అ. ఆ. అ. సంతోషకరమైనది. 2. తృప్తికరమైనది, ఇష్టమైనది. 3. మధురము అనుకూలము. 4. సులభము, సుకరము.

సుఖము సం. వి. అ. న. 1. ఆనందము. 2. తృప్తి. 3. దుఃఖరాహిత్యము. 4 సౌలభ్యము. 5 స్వాస్థ్యము భద్రత, ఆరోగ్యము, క్షేమము. ఐశ్వర్యము. 6. సౌకర్యము 7. స్వర్గము. 8. జలము. 9. ఇంద్రియములకు సుష్ఠుగా నుండునది.

సుఖము అవ్య. 1. ఆనందముగా. 2. స్వస్థముగా. 3. సుకరముగా. 4. శాంతముగా. 5. స్వచ్ఛందముగా.

సుఖముండు మి. అ. క్రి. సుఖముతో నుండు.

తే. .. సురేశ్వరుఁడుదనదు, పురమునకు వేఁగి సుఖముండెఁ గురువరేణ్య! భార. శాం. 4. 158. ప్రా.

కం. ...అవిషా, దమ్మున సుఖముండిరి వినయమ్మొప్పఁగ శాలిహోత్రు వాశ్రమభూమిన్. భార. ఆది. 6. 227. ప్రా.

సుఖవర్చకము సం. వి. అ. పుం. 1. సజ్జీకారము. 2. క్షారము.

సుఖవాసము సం. వి అ. పుం. పుచ్చకాయ.

సుఖవాసి సం. వి. న్. పుం. 1. కారుబుడమ (వృ. వి.) సుఖముగా వసించువాఁడు.

సుఖశ్రవము సం. విశే. (అ. ఆ. అ.) 1. సులభముగా వినఁదగినది. 2. చెవికి ఇంపైనది.

సుఖసంకథావినోదంబులు వి రాజు కొలువు దీర్చి జరుపు ఇష్టగోష్ఠి.

(శ్రీ) మన్మహామండలేశ్వర కాకతియ్య గణపతిదేవ మహారాజులు ఓరుగల్లు నిజరాజధానిగా సుఖసంకథా వినోదంబులం బృథివి రాజ్యంబు సేయుచుండగా 1173 దుర్గికాశాసనము. గు. జి.

సుఖసంగి సం. విశే (న్. న్. ఈ. నీ. న్) సుఖమునం దాసక్తి కలది.

సుఖస్పర్శము సం. విశే అ. ఆ అ. 1. అహ్లాదకరమైన స్పర్శ కలది. 2. సంతోషప్రదము. 3. రమణీయము.

సుఖాంతము సం. విశే. (అ ఆ. అ.) 1. సంతోషమునఁ బర్యవసించునది. 2. అనుకూలము. 3. మైత్రీపూర్ణము.

సుఖాయతము సం. వి. అ పుం. సుశిక్షితమైన అశ్వము

సుఖాయనము సం వి. అ. పుం. సుఖాయతము.

సుఖావహము సం. విశే. (అ ఆ అ.) సుఖము గలిగించునది.

సుఖాశకము సం. వి. అ. పుం. దోసకాయ

సుఖాశము సం వి. అ. పుం 1. సుఖముగా భుజించుట. 2. అహ్లాదకరమైన ఆహారము.

సుఖాస్వాదము సం. విశే. (అ. ఆ అ.) 1. మంచి రుచి గలది, అహ్లాదకరమైనది. 2. సుఖానుభవము.

సుఖి సం. వి న్. పుం. 1. యతి. 2. సుఖము గలవాఁడు.

సుఖి(యిం)చు సం. అ క్రి సుఖపడు; సౌఖ్యమనుభవించు.

కం. ... అ, క్కుంజరసుతతో నక్కపి, కుంజరుఁడొక కొన్ని యేండ్లు కూడి సుఖించెన్. ఉ. రా. ౬. 89.

చం. ... ఈ ద్విజుం, డవయము లజ్జిపోవుఁడు విశాలముయుఁడున్ దృఢయౌవనుండు నై, వనితయుఁ

దానుఁ గూడి శతవత్సరముల్ సుఖయించు చుండె డున్. మార్కం. 2. 195.

వ. ... వరు లీచరిత్రంబు విన్న రోషనిర్ముక్తులునై సుఖయింతుము. వరాహ. 5. 97.

సుఖైషి సం. విశ. న్, న్. ఈ. న్. 1. సుఖము నపేక్షించునది 2. సుఖమును ఆశాసించునది.

సుఖోదర్కము సం. విశ. (అ. అ. అ.) 1. సుఖమున బర్యవసించునది. 2. సుఖప్రదము. 3. సుఖోత్పాదకము

సుగంధ సం. వి. ఆ. స్త్రీ. తులసి (వృ. వి.).

సుగంధకము సం. వి. అ. పుం. 1. గంధకము 2. ఎఱ్ఱ తులసి (వృ. వి.). 3. నారింజ (వృ. వి.).

సుగంధము సం. వి. అ పుం. 1. సువాసన. 2. గంధకము.

సుగంధము సం. వి. అ. న 1. చందనము. 2. నీలోత్పలము. 3. ఒక విధమైన సువాసన గల గడ్డి. 4. Small cumin seed.

సుగంధారుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సుగంధి సం. విశ. సువాసన గలది. 2. పవిత్రమైనది. సుగుణములు గలది.

సుగంధి సం. వి. ఇ. పుం 1. మంచి వాసన. 2. పరబ్రహ్మము. 3. నూగుదోస (వృ. వి.). 4. ఒక విధమైన సువాసన గల మామిడి (వృ. వి.).

సుగంధి సం. వి. ఇ. న. 1. పిప్పలివేరు. 2. ఒకవిధమైన సువాసనగల గడ్డి. 3. ధనియాలు.

సుగంధిత్రిఫలా సం వి. ఆ. స్త్రీ 1. జాజికాయ, పోకచెక్క. 3. లవంగము.

సుగంధిమాల సం వి. ఆ. స్త్రీ. మావలి (వృ.వి.). శ.ర.

సుగంధిమూలము సం వి. అ. న. వట్టివేరు.

సుగంధిమూషికా సం. వి. ఆ. స్త్రీ. 1. చుంచు. Musk rat ?

సుగంధుఁడు సం. వి. అ. పుం. వర్తకుఁడు.

సుగతుఁడు సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

సుగమము సం. విశ. అ. అ. అ. 1. సుఖముగాఁ బొందఁదగినది. 2. సులువైనది 3. స్పష్టమైనది, సుగ్రహమైనది.

సుగమము సం. విశ. అ. అ. అ. (వ్యతి. దుర్గము) 1. చక్కగా నడచునది. 2. పొగసైనది, ఒయ్యారము గలది. 3. సుఖముగాఁ బొందఁదగినది. 4 సుబోధము, సుగ్రహము

సుగము సం. వి. అ. న. 1. మలము. 2. సుఖము.

సుగము వి. సుఖము, సుకము.

సీ.... సంతన ముం చన సంతోస ముంచన నలరు సంతోషంబు వెలయుసుగము.

తే. గీ. పోయి సుకము సుమాళముం చనఁగసుఖము అం. భా. 1. 98.

సుగవాసి = సుకవాసి. విశ. సుఖవాసి సుఖముగా నుండువాఁడు.

ఉ. వచ్చినఁ బెద్దరెడ్డి సుగవాసివి మే లివురైన నీద కున్, వచ్చితె యంచు. శుక. 2. 443. ప్రా.

సుగహన సం. వి. ఆ. స్త్రీ. భూతపిశాచాదులు చొరకుండునట్లు యజ్ఞభూమిచుట్టు నిర్మింపఁబడిన ఆవరణ.

సుగాలము వి. ఆయుధ విశేషము.

తే. గీ. చిఱుతచెయ్యమ్ము గండక త్తెర తుపాకి గౌరకను సుగాలమును గ్రద్దగోళ్ళు బుట్టి. చూరికాద్యాధరించు న వీరుఁ డెవుడు హంస. 1. 205.

సుగిపట్టములు వి. బ వస్త్రభేదము

వ .... శ్రీతోపులును శ్రీరామతోపులును జీబులును సుగిపట్టంబులును సన్నవలిపెంబులును. ద్వా. 3. 206. ప్రా.

సుగుడి విశ. పరుసుఁడు, గుణవంతుఁడు, యోగ్యుఁడు,

తే. వలచి పట్టినవారిమి వదల కిప్పు, డెన్ని చెప్పెరు తగవు వివేకతమున, మొదని యూరకె రతిరంగము నకు రాని నుద్దు లివియేల చాలింపు సుగుడివౌదు. (సుగడి యని ముద్రితపాఠము) సారంగ. 2, 117 ప్రా.

కం. మునలి కపియించెనవు డ, య్యనిమిషాధీశులు రాజయక్ష్మ శోకం, బెనఁగ వశియించ నగు న ద్దినఁబాలుఁడు సుగుడిగామి తెల్లమియొ కదా! మను. 4. 91. ప్రా.

సుగుడితనము వి. యోగ్యత. మంచితనము.

గీ. అని విచారించు తనకు చింతై వరేక, సుగుణితవ మును మాకెల్ల యగుచుఁ దిరుగ వాదిధమునెల్లఁ గడు దేవదేవి రోసి. విప్ర. 4. 15. ప్రా.

**సుగృహీతనాముఁడు** సం. వి. న్. పుం. 1. పవిత్ర మైన నామము గలవాఁడు. 2. సార్థక నాముఁడు.

**సుగృహీతము** సం. విశే. అ. ఆ. అ. 1 గట్టిగాఁ బట్టుకొనబడినది. 2. ఉచితముగాఁ బ్రయోగింపఁ బడినది. 3. తగినట్లుగా స్వీకరింపఁబడినది.

**సుగ్గడి** విశే. (ప్రా. సుగ్గమ్ = విదగ్ధితమ్ దేశీయ నామమాల) నీతి కావ్యుఁడు.

ఉ. ...సుగ్గడి వైతి నీ మొగము చూడగ వెట్టులు వేర్తు చెప్పుమా. దశకు. 4. 48. ప్రా.

**సుగ్గడితము** విశే (సం. సుఘట్టితమ్) సుఘట్టితము, తలుచయిన నేత గలది.

ఉ. కుమ్మలు పావ్యవాహములు గుత్తపు సుగ్గిడి తంపుఁ దోఁపు రెం,టమ్మలు. అం. కా. 2. 152. ప్రా.

చం. పడఁతి యొకర్తు చెందిరిక పావడఁవై తడి యొత్తినైన సుగ్గడితపుజీలు నేత్ర మొక కామిని గట్టె వొనగ నంజకెం, పెడలిచి నిండు వెన్నెల వహించి పయోనిధి మండలంబు వెల్వడు మడు రాజు నానల కళానిధి యంబుగ్నహంబు వెల్వడన్. వసు. 5 81. ప్రా,

మ సిరిమైగోనజవాజి పూఁత కలిమిన్ కెంతన్ గుకాళింప గుజ్జరి నిద్దాతగటీకురాళములలో నంపంగిపూఁకామ్మతన్, నరిగంచున్ బనిపట్టు సుగ్గడి తపున్ పయ్యాటపున్ గప్పులన్ దరుణుల్ గాంచిరి సౌఖ్య సంపద నికాంతశ్లేషలై యత్తటిన్. చంద్రాంగ. 4. 70.

సీ. బంగారు సరిగంచు రంగు సుగ్గడితంపుఁ దెలి దువ్వటము కెళకెళల నీన. ఘటికాచల. 2. 15.

**సుగ్రాసము** సం. వి. అ. పుం. సరసమైన యాహారము,

**సుగ్రీవము** సం. వి. అ. పుం. 1. మంచి మెడ గలది. 2. హంస. 3. ఒక విధమైన ఆయుధము, 4. (శ్రీ) కృష్ణుని రథాశ్వములలో నొకటి.

**సుగ్రీవుఁడు** సం. వి. అ. పుం. 1, వీరుఁడు. 2.శివుఁడు 3. ఇంద్రుఁడు. 4. వాలి తమ్ముఁడు.

**సుగ్లము** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి యలసినది.

**సుచకము** సం. వి. అ. పుం. మొఱఁగెడి కుక్క.

**సుచక్షువు(స్సు)** సం. వి. స్. పుం. 1. మంచి కన్నులు గలవాఁడు. 2. వివేకము గలవాఁడు. 3. మేడిచెట్టు (వృ. వి.).

**సుచరిత(త్ర)** సం. వి. ఆ స్త్రీ. పతివ్రత.

**సుచరిత(త్ర)ము** సం. విశే. (అ. ఆ. అ.) మంచి నడవడి గలది.

**సుచరిత(త్ర)ము** సం. వి. అ. న. 1. సత్ప్రవర్తనము 2. సుకృతము; పుణ్యము.

**సుచర్మము** సం. వి. న్. పుం. భూర్జ వృక్షము (వృ. వి.).

**సుచింత** సం. వి. ఆ. స్త్రీ. గాఢమైన ధ్యానము.

**సుచింతనము** సం. వి. అ. న. సుచింత.

**సుచిత్ర** సం. వి. ఆ స్త్రీ ఒక విధమైన కాయ.(పొట్ల కాయ?).

**సుచిత్రకము** సం వి. అ. పుం. 1. లకుముకిపిట్ట. 2. పొడలపాము.

**సుచిరము** సం. అవ్య. 1. చాలకాలము. 2. చాల సేపు.

**సుచిరాయువు (స్సు)** సం. వి. స్ పుం. దివ్యుఁడు; దేవత.

**సుచూలి** సం. వి. ఈ స్త్రీ. పట్టుకారు

**సుచేలకము** సం. వి. అ. పుం సన్నని వస్త్రము.

**సుచ్ఛత్ర** సం వి ఆ, స్త్రీ. సట్లెజ్ నది.

**సుచ్ఛత్రుఁడు** సం వి అ పుం. శివుఁడు.

**సుజనత** సం. వి. ఆ. స్త్రీ. 1. మంచితనము, సాధుత్వము, 2. సుజనుల సమూహము. 3 ధీరత్వము ఉదారత్వము.

**సుజనుఁడు** సం. వి. అ. పుం 1 సాధు పురుషుడు 2. దయ గలవాఁడు. ఉదారుఁడు. 3. ఇంద్రుని సారథి.

**సుజన్మము** సం. విశే. న్. 1. మంచి వంశమునఁ బుట్టుక గలది.

**సుజలము** సం. వి. అ. న. తామరపూవు

**సుజాతము** సం. విశే. (అ ఆ. అ.) 1. చక్కగాఁ బెరిగినది. 2. చక్కగా ఉత్పాదింపఁబడినది. 3. ఉన్నత వంశమునఁ బుట్టినది. 4. అందమైనది.

**సుడాలము** వి. అశ్వగతి భేదము.

తే. గీ. తనకుఁ బ్రతిదేవుఁ డెందు లేడనుచు నెమకు, పగిది తగునడ్డవేడెము ల్పరపి మఱియు, భంజికి మురళి ఝుళిపిఝుంపయు సుడాల, మనఁ గతు లెనఁగఁ జూపుచు హాళిమీఱ (సుధాలము: ముద్రిత పాఠము) ప్రబం. 1. 186. ప్రా.

చం. పతిగవిభుండు మింటిపయి భంజలికా మురళీ సుడాల వ,ల్గితముల రా నెదుగ్పడిన ఖేచరవర్గము లోనరించి యద్భుతముగ మ్రొక్క లేనగవుతోఁ గనుగొంచు .. పారి. 2. 102.

**సుడి** వి. 1. గాలిలి చక్రభ్రమణము, బ. సుడులు, సుళ్ళు మొ.

చం. ...తాచకటతాకృతి సుళ్ళ మెలంగె గాడు పుల్. ఆము. 5. 128.

చం. కురిసిన క్రింది పుప్పొడులఁ గొంచు వగంబుల మీఁదికై పిశం, గరుచుల గొన్ని పెల్లగసె గాడ్పుల సుళ్. ఆము. 5. 124.

2. జలావర్తము.

వ. పూఁదేనియ కాలువ వాళ్ళ సుళ్ళంబడి పడిపడిం దిరుగు కెంపు బొంగరంబులుం బోని మెట్ట దామర మొగడులను. యయా. 4. 13.

ప్రసుక్కులు తరఁగలు పొక్కిలిసుడి. నీలా. 2. 17.

3. రోమావర్తము.

చం. అనువగు సుళ్ళ నొప్పు మలయానిలవాహము నెక్కి.. మను. 6. 26.

4. పట్టువసుడి.

సీ. పట్టైపట్టుపయను బరిపష్టి తలకట్టు గ జీనున్న కియ్యాయి సుడియు ముడియుఁ గలుకొవ వ్రాయ వంబులు వ్రాయ వ్రాయఁ గొంతు కొసరుమ లేతవ్వుఁ గొనకయు డు లలితముక్తా ఫలాకార విల సనమున, మతిముద్వ్మ త్రివరుఁడు పాండురంగ. 1. 71.

5 కష్టము, బాధ.

కం. సుడి యొఱఁగని హరి, సుడివడ సుడిగాలి తెలంగు రక్కసుఁడు విసరెడి యా, సుడిగాలి ధూళి గన్నుల, ముడిసిన గోపకులు చెగడి సుడివడి రథిపా! భాగ. 10. 265.

6. రాజులకు కోటల నుండి వచ్చు ఆదాయభేదము.

సీ. ...ధాన్యములు సువర్ణాదాయములును దుర్గాదుల సుడియు జేహారల సుంకములును ఉత్తరహరి శృం. 1 67.

7. అదృష్టము.

వ్యవ. వాని సుడి బాగున్నది. చూ. సుడిగొను.

**సుడిఁబడు** = సుడివడు అ. క్రి. బాధపడు, కలవరపడు.

ఉ. ....గ, ర్వాలసుఁడై సుడిం బడక. భా. 11. 100. ప్రా.

సీ. వతనాభిసాభి సౌందర్య మెంచిన యంతఁ బలు వివేకము సుడిఁబడఁ దొడంగె. శకాం. 4. 58.

**సుడికయిదువ** వి √సుడి చక్రము.

తే. గీ. వలమురి సుడికయిదువయుం బులుఁగు సిడము, పసిఁడినుమువలువ కలిమి పడఁతుకయును, గలుగు మగఁడగు నిను మదిఁదలఁచినపుడె విడిచి చనుఁగదె బలుకొల లిడుమగములు. అ. రా. అరణ్య 114.

**సుడికొల్పు** స. క్రి. కష్టపెట్టు; బాధించు.

ద్వి. "సురుచిరావర్తంబు సుడికొల్పు వాలి, గురు చక్రములఁ దిరుగుడుపెట్టు పిఱుఁదు" ద్వి. పరమ. 2. 222 పు.

**సుడిగట్టు** √సుడి వి. చక్రవాళపర్వతము.

సీ తన యాన సుడిగట్టువెనుకఁ బర్విఁగఁ జోల లేఱవ మించె నేరాజుతాత. యయా. 1. 19.

**సుడిగాడ్పు** √సుడి. వి. సుడిగాలి (సుడివలె గుండ్రముగఁ దిరుగుగాలి)

ఉ. నేను మెఱపొంగా గొడుగుపై వహించు వసుంధరాస్థలి, కీమనె యొక్క యాడెను విచిత్రగతిం దుగగోత్తము లు వా, భూవిభుండు తద్రథములు నో యెదతెవ్వక యర్థ్యించు వా, క్ష్మాయవచక్ర చంక్రమణహా ములన్ సుడిగాడ్పు లిప్పుడున్. నైష. 1 85.

సీ. సుడిగడ్పు తేరివల్నట్టుఁ బట్టలు వెట్టి గడఁది మంటలు వెళ్ళఁగ్రక్కె వర్గ. ఉ.రా.6 286.వ్రా.

**సుడిగాలి** దే. వి. 1. సుడియు (చుట్టుచుట్టి వీచు) గాలి. వాత్య

కం. కదువర్మిలిఁ గ్రేపుం బను, గడువఁదొడఁగె వొక్క సురభిగురు పార్శ్వరయం, బడువత్స వక్త్ర ఫేనము సుడిగాలిం దూలిపడియె నొదపై ననఘా! భార. శాం. 3. 5. 17.

తే. ఇల కుడిగి చుట్టుచుట్టి దుమ్మెత్తి యెగసి, పోయి తము ముందు సుడిగాలి .... ఆము. 4 81.

2. ఒకానొకజాతి పందెపు కోడిపుంజు.

తే. (చిలుకు) ఓమ్ము సుడిగాలి చక్రంబు నల్లజ దరి. కూలముపిరఁగి వెలివక్క సాలువంబు కాశ రాత్ర్యంతకుఁడు పందెగాండ్రు మెచ్చులనెడు పేరుల పుంజుల గొని ముగించి. పంప. 8. 215.

**సుడిగొను** అ. క్రి. 1. కలతనొందు, బాధపడు.

శా. జాలిం బొందె బలాయముల్ సుడిగొనె న్నారంగముల్ నిచ్చె నే, గోలంబుల్ బెదరెన్ జమూరుగణ మాక్రోశించెఁ బంచాస్యముల్, తాలాంకావరజుండు మందరమహాధాత్రీధరం బెత్తినన్. హర. 6. 46.

కం. శూద్రుండు పిలిచె నేనియు. శూద్రుం డనుమతి యొసంగ శూద్రుఁడు చూడన్, శూద్రునియింట భుజించిన, శూద్రాదిక నీచజాతి సుడిగొండ్రు ద్విజుల్. శివ. 8. 18.

2. భ్రమించు, తిరుగు.

కం. బలువిడి మొఱయఁగ పతంగంబులఁ దలలుం బగిలి వారి బొందులు సుడిగొం, చిలఁ గూలజాచి. భా. రా. యుద్ధ. 5. 12. వ్రా.

3. చుట్టుకొను, పెనఁగు.

సీ. సుడిగొని వెదలంగఁ గడఁగు క్రొత్తావి యల్లన మీఁది కెగయఁగ మొనలు విచ్చి. నిర్వ 6, 58 వ్రా.

కం. సుడిగాలి వచ్చి నిమ్మన్, సుడిగొని కొనిపోవ మింట సుడిసుడిగొనుచున్, బెగఁ డడరెడి నా ముద్దుల కొడుకా. భాగ. 10. స్కం. 68.

4. అదృష్టము ఫలించు.

చం. సుడిగొని రాముపాదములు సోఁకిన ధూళి వహించి రాయి యే, ర్పడ నొకకాంత యయ్యె నఁట వమ్మగనీతిని పాదరేణు వి, య్యెడ వడినోడసోఁక నిది యేమగునో యని సంశయాత్ముఁడై, కడిగె గుహుండు రామపద కంజయుగంబు భయమ్ము పెంపునన్. మొల్ల. రామా. అయో. 52.

**సుడిగోరు** వి. తంతి మీటుటకు బంగారు లోనగు వానితోఁ జేసి వ్రేలికి వేసికొనెడు గోరు.

ద్వి. శ్రుతిగూడఁ దంత్రులు సుడిగోళ్ళ మీటుచు. హరిశ్చ. 2.

**సుడిపురువు** √సుడి. వి. అరణ్యజంతువిశేషము.

తే. గీ. సుడిపురువు నుస్తెపదులును మిడుత మెదుకు, చెలుకుపాల్ పారెరకుఁ గ్రోలి యరతిఁ గెంలి. ప్రబం. 1. 150.

**సుళ్లయ** వి. తమలపాకుల బరువునందు సగము.

**సుడియ** విశే. తులువ శ. ర.

**సుడియాఁడు** అ. క్రి. పరిభ్రమించు

ద్వి. పుడమిలోపల సాలెపోలయుబండి. సుడియాడె నిని చెప్పు చొక్కపుమాట, విధమాయె ముంచె నా విధమెల్ల దెలిసి. సారంగ. 2. 52 పుట 4. పం.

**సుడియు** అ. క్రి. తిరుగు, భ్రమించు.

కం. మాతతనయనారాచ. ప్యూతములై వారణంబు లొఱలుచు సుడియన్, భూతలమునఁ బొరలుఁ దెరలు, వే తూలుచు జిఱ్ఱఁదిరుగు విచ్చుం జచ్చున్. భార. కర్ణ. 1. 88. వ్రా.

సీ. కరులదానంబులకు మధుకరము లెఱఁగి, కుంజరమ్ములు నీరిలో గ్రుంకియున్న. మీఁద సుడియుచు నుండెఁ దుమ్మెదలు .... కుమా. సం. 1. 65.

ఆ. వె. గీము విడిచి సుడిని గిక్కురుమనకుండు, జీవు విడుచువేళ శివుని దలచు, మనసుగొల్పకయును

మాయచేఁ బొంరెడు, పాపపరులకేటి పరము వేమ. వేమ. 3. భా. 105.

2. ప్రసరించు, వ్యాపించు.

సీ. ఎడ మేని నెత్తావి సుడియంగఁ బయ్యెద సగము దూలించి పై మగుడఁ దిగిచి. భార. విరా. 2. 64.

సీ. అరుణాంఘ్రితలదీప్తి నవనీతలంబెల్ల ....తనులత సుడియునెత్తావి గైకొని సమీరుఁడు గంధవహుఁ డనురూఢిఁ దనర .... కుమార. సం. 6. 690. ప్రా.

తే. అనుచుఁ గరములు మొగముల కడ్డమిడుచుఁ గోసినటువలె మనసున రోసి రోసి, ప్రాసి యుమియుచు సుడియు దుర్గంధమునకు, నాసికలు మూసికొనుచు సన్న్యాసివరులు. వాల్మీకి. 2. 39.

సీ. క్రొవ్విరు లెసఁగి .... కమ్మవాతెఱవాసన గలసి కలయ నోడుముట్టుచు మార్పులు సుడియుచుండు. కుమా. సం. 8. 9.

3. చుట్టుకొను, క్రమ్ము, వ్యాపించు.

సీ. మధుసమాకలిత మై ... తరుణిచే నోఁచినఁదావి పొంపిరివోవు తమ్మిసాఁ దగు సుగంధంబు సుడిసె. కుమా. సం. 2. 317.

వ. వెన్నెలలు అరవిరిచెందొవ మొగదలం బడి సుడియుచు. పారి. 2. 52.

కం. సుడి యెఱుగని హరి సుడివడ, సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా, సుడిగాలి ధూళి గమ్మల సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా. భాగ. 10 స్కం. 265.

4. అడ్డువచ్చు, వచ్చు.

స్రగ్ధర. చొచ్చున్ గేహాంతరంబుల్ సుడిసిన మగలన్ జుట్టలన్ బిట్టుపాట్టల్. ప్రచ్చున్ శాతాసి ధారన్. ఉ. రా. 4. 92.

సీ. అంతంతఁ బసిబిడ్డలడ్డంబు సుడిసిన జంకించి మిన్నంటఁ జౌకళించి. భోజరా. 9. 25. ప్రా.

కం. తొడుకుఁ దివటోవు పసరము, బడఁబోకుము తురగ గార్దభ ద్విరదాదుల్, వడమువథంబున కడ్డము, సుడియకు దుర్జనులు మెలఁగుచో నిలువకుమీ. భోజరా. 6. 34.

గీ. దేవి యిటగాక మఱియును లావు ముట్టి, బలియుబికరంబు జోగు గోపాళమనుచు, వీధికెవ్వారు సుడిసిన వెక్కిరించు, నయ్యనమగన్న కొయ్య గయ్యాళితల్లి. విప్ర. 3. 15.

5. డాయు, సమీపించు.

కం. నా వదనము కమలం బని, తావికి నొక మత్త షట్పదము సుడిసిన నే, నా వేగంబున దానిలు, బోవఁగఁ జోఁపంగ ... దశకు. 4. 93.

సీ. ఉపహారి గావింప నొకకాక మేతెంచి, సుడియంగ బలుమాఱుఁ జోఁపి చోపి, కడుఁదయ్యుటయును. భా. రా. అయో. 164.

సీ.... సుడిసిన మొగమెత్తి చూడకుండు, పరాకు కుసుమబాణుని నైవఁగువిటుశేయు .... పాత్ర ముల్ నెత్తమాడు, ఆము. 1. 59.

(వి. రూ. ఇద్వ్యక్ర. సుడిసి, సుడిసెను. సుడిసెదను)

6. వీఁచు.

మ....నానాలతాం, తవనామోదముఁ బొందుచున్ సుడియు నిత్యంబుం గరం బిష్టమై. భార. ఆది. 8. 79.

సీ. కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు నెఱవిరి తమ్ముల నుఱక తెగడి. భార. విరా. 2. 33. ప్రా.

సీ. దశదిశాంతరములఁ దఱచుగా విస్ఫులింగములు గ్రక్కుచు వడగాలి సుడియ. వరాహ. 2. 64.

7. సుడిగా వీఁచు.

ఆ. సుడియు గాలిఁ బువ్వుబోడి దన్నుఁ గప్పునో యనుచు బెగ్గలించు. విరా. 2. 304.

సీ. బడిబడిఁ గమ్మపుప్పొడి నివ్వటిలు చల్లి వెదవెదగా గాలి సుడిసె నేని. రాజశే. 3. 30.

ఆ. వె. కనినయప్పు డచటఁ గడునుగ్ర మగు రక్త, వృష్టి గురిసె నుల్క లష్టదిశల బడియె, వఱడు లఱచె బిడుగు లుర్విని బడి, మ్రోసె గాడ్పుసుడిసె మాసె నిముఁడు. నిర్వ. 3. 56.

8. మెదలు, ఆడు.

సీ. సుధఁ జిందు మోవిపై సుడియు తేనియ లొలుక క్షీరోదకన్యాయసార మెనయ. ఉత్తర. హరిశ్చం. 1. 34.

ఆ. వె. మాన్పతంబుగాని సుడియదు [illegible]

గోంకఁగాల వాతు గొంకులేదు. భాగ. 9. స్కం. 848.

కం. అనిలుండ వయ్యు నయ్యో చనవే యుల మెంగ నంబుజముఖియతు లా,అమలకడ సుడియ వేలా, నను వేచెద వింతచలమునం బవమానా! రామా. 6. 28.

9. చలించు, కదలు.

సీ. అంకలన్ దరుణుల నార్చుచు దారాడిచూపు వర్తకు లవ సుడిసె గోమలు .... కుమా. సం. 8. 179.

10. సంచరించు, మసలు.

ద్వి. చోరుల జారులసుడియంగనీక వాడల దండింతె వదలక పట్టి. రం. రా. అయో. కాం. 18 పు. 6 పం.

కం. ఆ కేసరి వరకేసరి, కాకున్న మదీయదేశ కాన నగిరులన్, భీకరహరిదర్వీకర, సూకరనికరముల కెట్లు సుడియఁగ వచ్చున్. జై. భా. 7. 212.
తే. గీ. చూచి యా దివ్యపురుషుండ నూచు వేఁడి. చూపులకు జెంకెలకుఁ జెంత సుడియ వెఱచి. ఉ. రా. 4. 11.

11. లీనమగు, అణఁగు.

కం. చక్కెరయును లవణంబును గ్రక్కున మదరక ములయందుఁ గరగినరీతిన్, మిక్కిలి తనుఁగను ఘను మది, చొక్కుచు నానందజలధి సుడిసి నశించున్. సీతారా. 3. 58.

12. కలఁత నొందు.

కం. నీ కోడలు కొడుకునకై, శోకం బుడిగింపలేక సుడిసినయది యస్త్రోకబలంబునఁ దమ్ముఁడ, వే కదఁగనలయు కాలు విడిపించుటకున్. హరి. ఉ. 3. 46.

**సుడివడు** = సుడిఁబడు అ. క్రి. (సుడి + పడు) పరిభ్రమించు, (అవశతచే) గిరగిరఁ దిరుగు

కం. పడుచును లేచుచుఁ గాలుచు సుడివడుచును దెసలు గలయఁజూచుచు. భా. రా. అర. 2. 284.

కం. సుడిగునితల గదడుఁడు గాని యరిగెడుఁ దెమ్మునిన కాతఁ దచటికిఁ జని త, ద్గుర దని లావులతి సుడివడి, సురగాలిం బడిన చొప్ప చొరుగును బోలెన్. జై. భా. 5. 88.

2. చుట్టుకొనుచు రాలు, పడు.

ఉత్సాహ. చుక్క ద్రొక్కు దెక్కడైన సుడివడంగఁ దొడఁగె. రామా. 6. 108.

3. ఆవర్తములు గలదియగు, సుడులుగలది యగు, సంక్షోభించు.

కం. సుడివడి యడలుచు బన్నము, లెడనూపక పొడమవంత వెలయఁగఁ గడలో, సుడుకుచు నుండెడి వారల, యెడ దారకుఁ గినియ బోలునే యొకి మీఁడా? అం. రా. యుద్ధ. 77.

సీ. తొగఱేని పరివార మగుతార సంఘంబు శంఖరింఖన్మణిసరణిఁ జూప, జననీతవారిదంతజలధర వ్రాతంబు కూలశైవలజాలలీలఁ దోప, సుడివడి తిరిగెడు సురవిమానశ్రేణి లెడనెడఁ బడువల పడువు దెలుప చంపూరా. 3. 20.

వ. వలిమించు క్రొమ్మించే ఱొదులీఁది యీఁది పడినదలి సుడివడుచు పొదలోమ నొవరి గాలియల వోక పోకలకు మను. 2. 28.

4. చిక్కువడు.

తే. గీ. అనుచు లావణ్యనిధి కామిని సరోజ, నేత్ర తన కూర్మి గానరా నిలిచి సరస, కానుకూల వాక్యముల లహరి గొలిపె వ, సుంధరాభర్త చిత్తంబు సుడివడంగ. వరాహ. 6. 123.

సీ. ఒకచోఁ బువర్గ్యను వూఁగె వృతముకొమ్మ సుడి వద్ద ముత్యాలజోగువోలె. కాశీ. 1. 188.

5. కలఁతపడు, బాధనొందు.

చం. ...నీదు సైన్యముల్, సుడివడ భీష్ముఁడాఁకుటయుఁ జూచి మనంబున నాఁటదానితోఁ, బోడుతునె యంచు మార్కొనక పోయెఁ దొలంగి యతండు భూవరా! భార. భీష్మ. 2. 285.

కం. కురువంశము ద్రుంచుటకుం, జోరజాలక నామనంబు సుడివడియెడు. భార. ఉద్యో. 4. 66.

వ. కొడుకు చెడువడవడికి వడలుకడలిం బడి సుడివడియెడు తల్లిదండ్రుల. పాండురంగ. 3. 24.

శా. వైశంపాయనుఁ డెంతయున్ సుడివడెన్ వాడె

స్సుమతుం డతి, క్లేశం బొందిరి పైలకై మిమలు దుఃఖ చెన్ మదిన్ దేవలుండు భీమ. 2. 69.

వ. అమ్మొన నిక్కువడియును సుడివడియును గలంగియుఁ దొలంగియు. భార. ద్రోణ. 2. 18.

6. చెదరు.

కం. నిను గనినప్పటఁ గోలెను, దవమది సుడివడఁగ రామధరణీశుఁడుఁ నిన్ గను గొనఁ గోరెఁడు దడ యంజన దిర్యోడ వదినెపైతి చను మయ్యోడకున్. భా. అర. 149.

కం. వేణీభుజంగకుచకుంభ, శ్రోణీభారములఁ గొను సుడివడఁగ గదా, పాణిఁ గరుడించి పల్లవ, పాణికి గర్భంబునందుఁ బ్రాపై నిలిచెన్. రామా. 8. 85.

సీ. గళగళధ్వనులతోఁ గంఠశృంఖల లూడ్చి సుడివడఁ గుక్కల వడవిఁ గలిపి. మను. 4. 108.

7. సంక్షోభించు, తొట్రుపడు

వ.... బయలుపడి చేయునదిలేక యాకడకు మగిడి తులుము విచ్చుచుఁ దద్వారశాఖినయవత్పురాచీనక రాజ్ఞులై సుడివడు నెడం బొడము .... ఆము 4. 85.

చం. అడరుచు హుంకరించుచు నహంకృతిఁ జూపుచు నస్త్రధారలన్, సుడివడఁజేయుచున్ బెగడుచున్ బెగడించుచు నిర్వరించుచున్, గడఁగుచు గోసరించుచు ముఖాముఖి నిల్చుచు బిట్టదల్చుచున్, జడియక పోరి రయ్యుభయ సైన్యములన్ గలయోధు లుద్ధతిన్. ఉ. రా. 4. 295.

8. దుర్బలమగు, నిస్సత్త్వమగు.

కం. కడిమిం దాకిన యుంపడిఁ,బడు గడిచిన భంగి హైనబమ్మటితోడన్, సుడివడుచు నుండి కొండొక, రడవువకున్ దెలిసి నిలిచి తాలిమికలిమిన్. భా. రా. సుంద. 29.

సీ. అనికంబు వీఁడు వాఁ డనక యొక్కఁగ వేల్పు, చేమఁగునకు వీపుగూనుబోయె, వరుసలు పెట్టి దువాళింప సుడివడి, వెలిమావు మోపదు వెనుక కాలు. వరాహ. 10. 15. వ్రా.

9. తిరుగు, వెనుదిరుగు.

ద్వి. సుడివడ కెగరక సొలయక జడు, వడక వెన్దడక తప్పక జారువోక. పండితా. దీక్షా. 61.

వ. పెకలినకుటిపరి యసురవరు కరాంగుళంబులు వెగనడిచె వడిచిన సుడివడక మదమల దాటించిన. మను. 4. 115.

కం. నీచత్వమునకు రోయక, చూచిన వరులెల్ల వేఁడి సుడివడక కడున్, యాచన చేసి పదార్థము, గోచరముగ సంగ్రహించుకొని వచ్చెదవన్. చంద్ర రేఖా. విలా. 1. 56.

10. చెడు; నశించు.

సీ. చెరువు గట్టించిన శెట్టిధర్మం బెల్ల, సుడివడకుండంగ నడుపుతల్లి. ద్వా. 4. 146. వ్రా.

కం. ఏ కర్మంబున విభుఁడగు, శ్రీకంఠుని యాగము మయునిచే సుడివడియెన్ వైకుంఠుఁ డేవిధంబునఁ, గైకొని తక్కిత్రి చక్కఁగా నొనరించెన్. భాగ. 7 స్కం. 389.

సుడివఱచు స. క్రి. √సుడివడు. సుడివడఁజేయు.

వ. తనవారి గ్రోలినవారి జఠరగోళంబులం గల సకల రోగంబు లిట్లు సుడివఱతు నను చందంబునం దంతరాంతరంబులు సొచ్చి సంహారకరత కార్యాదిమృగంబుల సుడివఱచుచు. వరాహ. 10. 62.

సుడివాలు వి. చక్రాయుధము.

సీ. సుడివాలుచిందంబు వదరఁ బూనినవాని. శ. ర. అచ్చ. బాలకాం. 62.

సీ. తెల్లదేవిరాజ సుడివాలు కేలునఁ దవరిచ యొడయ. ప్రబం. 1. 216.

సుడివా(ల్దా) లు దా (ల్పు) లుపు వి. విష్ణుమూర్తి.

కం. సుడివాలుదాల్పు నడుగునఁ, బొడమిన పెన్వెల్లి దరిసి పొలుపొందఁగ నక్కడ గుహుఁడని యొకు చెంచుల, యొడయనిఁ బొడగాంచి వాని యొద్దికి వలనన్. అ. రా. అయోధ్యా. 100 వ్రా.

మ ...నీ కిప్పుడా,సుడివాల్దాలుపు కన్న వేఱు కలరే చుట్టంబు లేవంకలన్. నీలా. 1. 90. వ్రా.

సుడివాల్దొర వి. విష్ణువు.

కం. పలుమురి సుడివాల్దొర వంటి యొప్పుగల దేవఁ జాణయ మీసుభాన వలపుల తేఁడా! యయయా. 5. 1.

సుడిపోవు అ. క్రి. (సుడి+పోవు) చెడు, నశించు, సుడివడు.

సీ. ప్రవిమల కుసుమ సంపద యెల్ల సుడివోయి, రూపు దక్కిన మహీరుహము భంగి. మార్క. 1. 168. ప్రా.

సుడిసుడిగొను వ. క్రి. = మిక్కిలి సుడిగొను; మిక్కిలి తిరుగుడువడు.

కం. వీఁక సెడి ఘనగదాహతిఁ, దోఁకయుఁ గద లింపలేక దుస్సహపీడన్, మోఁకటిలఁ బడియె నేలను, పోఁకోర్వక దిగ్గజాలు సుడిసుడి గొంచున్. భాగ. 8 స్కం. 861.

కం. సుడిగాలి వచ్చి నిన్నున్, సుడిగొన కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్, జెడఁ గడరెడి నా ముద్దులఁకొడుకా ! భాగ. 10 స్కం. 268.

సుడిసుడులుగట్టు మిక్కిలి సుడులుకట్టు; అవిచ్ఛిన్నముగా ప్రసరించు.

గీ. కన్ను వెన్నవకుండఁ జీకాకుపఱచె; సుడిసుడులుగట్టి యగ్గుంజ్ల పోసవాన. రంగా. 3. 90.

సుదుము వి. 1. కంటకాది భారము; కంప తొడుగు. విత్తనములు చల్లిన పిదప చేను చదును చేయుటకై యీడ్చెడి కంప. 2. నూలు గొత్తెల గుంపు. శ. ర.

సీ. ... తొడుగట్టి యీడిక సుదుము కంప, యన దనర్చును గంటకాది భారము ... ఆం. భా. 2. 88.

సుత సం. వి. అ. స్త్రీ. కుమార్తె.

సుత దే. అవ్య. ప్రత్యుత్పర్థకము; మొదలుకొని (అది సుత; నాటి సుత మొ.) శ. ర.

సుతంగముఁడు సం. వి. అ. పుం. పుత్రుని గన్న తండ్రి.

సుతంత్రి సం. విణ. (ఇ. ఈ. ఇ.) 1. మంచి తీగెలు గలది; 2 శ్రుతి రమ్యమైనది

సుతనువు సం. విణ. 1. అందమైన శరీరము గలది. 2. సుకుమారమైనది. 3. సన్ననిది; కృశించినది.

సుతనువు సం. ఉ. ఊ స్త్రీ సుందరి, కోమలి.

సుతపము సం. విణ. స్. 1. తీవ్రమైన తపస్సు చేయునది. 2. మిక్కిలి వేడి గలది.

సుతపము వి. స్. న. తీవ్రమైన తపస్సు.

సుతపుఁడు సం. వి. స్. పుం. 1. తాపసుఁడు; యోగి, సూర్యుఁడు.

సుతమామ్ సం. అవ్య. 1. సర్వాతిశయముగా 2. సర్వోత్తమముగా.

సుతము సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్పన్నము; జనితము. 2 పిండఁబడినది. 3. పోయఁబడినది.

సుతము సం. వి. అ. న. సోమరసము.

సుతరామ్ సం. అవ్య. 1. మిక్కిలి మేలుగా. 2. గుణోత్తరముగా. 3. బొత్తిగా; పూర్తిగా. 4. ఫలితముగా, పర్యవసానముగా.

సుతర్దనము సం. వి.అ. పుం. కోకిలము.

సుతలము సం. వి. అ. న. 1. అగాధత్వము. 2. సప్త పాతాళములలో నొకటి. 3. మందిరము యొక్క ఆధారబంధము, మూలబంధము.

సుతవస్కర సం. వి. అ. స్త్రీ. ఏడుగురు బిడ్డల తల్లి.

సుతశ్రేణి సం. వి. ఈ. స్త్రీ. ఎలుక చెవి, మూషకపర్ణి (వృ. వి.).

సుతారము విణ. (హిం. సుతార్) సుకుమారము, శ్రేష్ఠము.

కం. అర లేక చుక్క తెఱఁగున, మెఱయు సుతారంబు మేలిమి నిట్టువలె. రత్నపరీక్ష. 49.

గీ. తళుకు లీను సుతారవు ముత్తెముల పెద్దచొకట్లు చెక్కులఁ జౌకళింప. శ్రీరంగ. 10. 112.

సుతారి వి. సురంగము త్రవ్వెడి సాధనము.

శా. జెట్టిం జీమలు బట్టిన ట్లపుడు నిశ్రేణుల్ శిర స్త్రాణముల్, కట్టుంగోలలు పాఱచిప్పలు సురంగంపున్ సుతారుల్. రంగా. 3. 60.

సుతాళము వి. అతిశయము.

గీ. రాగమా యిది మది కను రాగ మనుచు ...... తాళమా యిది రతికి సుతాళమనుచు. కవిరా. 497 పొరట.

సుతి వి. (సం. శ్రుతిః) కంఠస్వరాదులకు సహాయమగు తంతి తోనగు వాని ధ్వని.

తే. గీ. తొలుత సుతికోయిల యొసంగరోడగోర, వంక తాళము లుగ్గడింపంగ నెమలి, సకియ వటి యింప మరునాట్యశాలలీల, వంతువగఁ బొల్చు కేళి గృహాంతరమున. ప్రబం. 1. 706.

ఉ. వెన్నెల రాచజాచలువ విప్పుట రంగులఁ జేరి జాలువా, కిన్నర లూని జాను తిలకింపఁగఁ జాటలు వాడు జాసవా,ల్కన్నియమిన్న గాణలకు గాటముగా సుతు లిచ్చు నచ్చుటన్, గ్రొన్నన కమ్మ దేని యలు గ్రోలుచుఁ దుమ్మెద బోటి కూటువల్. ఆ. రా. బాల. 120.

సుతిగూడు = సుతి కూడునట్లు చేయు, శ్రుతి గలుపు.

కం. గానము సొంపుల పోనై, తేనెలవానై సరస్వతీకరవీణా, తానవుటక్కై యమృతపి, తానము తానై తగును సుదతి సుతిగూడన్. రాజవాహన. 4. 108.

సుతిగూరుచు(ర్చు) = సుతి గూడునట్లు చేయు.

సీ. నారదసుతిఁ గూర్పనేరవు నీవు తెమ్మని వీణె టుంగు టుంగునను మీటు. దశా. 4. 119.

సుతిమీటు = సుతి యేర్పడునట్లు తీగ మీటు.

వ. ప్రియుండు పని డిదండియఁ బూని సుతి మీట విభుని చెంత వసియించి చిన్ని కిన్నెరం బూని పంచ చర దేవతా విజయ ప్రపంచ సముచితంబు లగు నూతన గీతంబులు పఠించి. చంద్రికా. 4. 107.

సుతి సం. వి. ఇ. స్త్రీ. సోమరసము పిండుట.

సుతి సం. వి. న్. పుం. సంతానము గలవాఁడు, తండ్రి.

సుతికాఁడు (√సుతి) వి. సుతి వేయువాఁడు.

సీ. ... సుతికాఁడవంబను శ్రుతి విధాయి. ఆం. శా. 2. 287. ప్రా.

సుతిక్తము సం. వి. అ. పుం. పగడపు చెట్టు (వృ. వి.). (Coral Tree)

సుతిని సం. వి. ఈ. స్త్రీ. సంతానము గల స్త్రీ; తల్లి.

సుతీక్ష్ణదర్శనుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సుతీక్ష్ణము సం. విశ. (అ. అ. అ.) 1. మిక్కిలి కారమైనది. 2. మిక్కిలి పదునైనది, 3. మిక్కిలి బాధ కలిగించునది.

సుతీక్ష్ణము సం. వి. అ. పుం. శిగ్రు వృక్షము (వృ. వి.).

సుతీర్థుఁడు సం. వి. అ. పుం. 1. మంచి గురువు. 2 శివుఁడు.

సుతుంగము సం. విశ. అ. అ. అ. మిక్కిలి ఎత్తయినది.

సుతుంగము సం. వి. అ. పుం. కొబ్బరి చెట్టు (వృ. వి.).

సుతుఁడు సం. వి. అ. పుం. 1. కొడుకు. 2. రాజు.

సుతేజము సం. విశ. స్. 1. మిక్కిలి పదునైనది. 2. మిక్కిలి ప్రకాశించునది. 3. మిక్కిలి శక్తి గలది

సుతేజుఁడు సం. వి. స్. పుం. సూర్యుని ఆరాధించువాఁడు.

సుత్తడువు వి గజశాల మొ. నిర్మించుటకు పాతెడు మేకు.

కం. నేలల సుత్తడవులతోఁ, గీలిత శృంఖలములైన కీలకములతో, నాలానంబులతో గజ, శాలలు ప్రథవించె వతివిశాలలు పెక్కుల్. వరా హ. 4. 113.

సుత్తి = సుత్తె వి. 1. చిన్న సమ్మెట, కంచరి మున్నగువారి పనిముట్టు. మట్టు కమ్ము సుత్తి, అడ్డ కమ్ము సుత్తి, బొద్దు సుత్తి, గుబ్బసుత్తి, మొనిసుత్తి. ఆం. శా. 2. 298.

వీని భేదములు = పొడసుత్తి, పెద్ద సుత్తి, జాతి సుత్తి. నూరకవి తిట్టు కంసాలి సుత్తి పెట్టు. (చాటువు)

సుత్తె = సుత్తి వి. రాగలి మీఁద బంగారు లోనగు వాని మంచి సాఁగఁగొట్టెడు సాధనము, చిన్న సమ్మెట, అల్పసంఖ్య.

చం. కమలము కట్లసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్, ధమనియు శ్రావణంబు మొల ప్రాసను బట్టెడ నీరుకాయకా.ణము వలుకారు మూస బలువాడె పరీక్షల మద్దులాదిగా సమరఁగ భద్రకారక సమాప్తియఁ దొంతొక దుండు నప్పు రిన్. హంస. 2. 181.

సీ. సుత్తెవాటుల వారు వెత్తని పొమ్ము సొం పల
రించె నెవ్వాఁడు పాంబువకును. రాజవాహన. 1. 9. ట్రా.

తే. గీ. పొలఁతికుచయుగళంబుతోఁ బోరుటకును, గాదె చక్కని పొవర్ణ కలశతతులు, నొక్కలై చిక్కువడి చాలఁ దుక్కువట్టి సుత్తె పెట్లకు లోనయ్యెఁ జోద్యముగను. సీతా. 2. 123.

సుత్య నం. వి. ఆ స్త్రీ 1 సోమలతను కొట్టి పిడుచుట, సోమపానము 2. స్నానము.

సుత్రాముఁడు నం. వి న్. పుం. ఇంద్రుఁడు.

సుత్వుఁడు నం. వి న్. పుం యజ్ఞము నందు సోమలతను కొట్టి పిడిచినవాఁడు. (శ. ర.)

సుద తు. వి. కొన, అగ్రము.

సీ. సొగటాలపైఁ గోర్కి సుదకు వచ్చిన యంత వింతమాటల గాంచింపనేస్తు. నిరం. 2. 83.

సుద విశే. చివరిది. కడపటిది.

సీ. ఇటు జేసి తేజీల నెరయు మిన్నుల తేరి జోదు పుట్టినకొండఁ జూచినాఁడ, విటునేల తేశేం కెలుకైన చెంగావి సుదసంజఁ దగుకొండఁ జూచినాఁడ. వరసభూ. 5. 22.

సీ. అధిపుమై ముద్రించ నసియు వేటాక రాము, సుదగోళ్ళఁ గుసుమముల్ చిదిమితెచ్చు. కవి 6. 65.

సుదకొమ్మ = కొమ్మకొన.

ద్వి. మనమున నెదిరించి మగకోకిలములు, ముక్కల తెక్కలు మురువుగాఁ దీర్చి, చొక్కంపు లేమావి సుదకొమ్మ లెక్కి నవనాథ. 1. 12 పు. 2 పం.

సుదంతము నం. వి. అ. న. వేత్రము, వేపబెత్తము.

సుదంతి నం. వి. ఈ. స్త్రీ. వాయవ్య దిగ్గజము యొక్క భార్య.

సుదంతుఁడు నం. వి. అ. పుం. నటుఁడు.

సుదక్షిణ నం. వి. ఆ. స్త్రీ. దిలీప మహారాజు భార్య.

సుదక్షిణము నం. విశే (అ. ఆ. అ.) 1. హృదయపూర్వకమైనది. 2. వదాన్యమైనది. 3. మంచి దక్షిణ గలది (యజ్ఞము).

సుదతి నం. వి. ఈ. స్త్రీ. మంచి దంతములు గల స్త్రీ.

సుదర్శన నం వి ఆ స్త్రీ. 1. అందగత్తె, 2. స్త్రీ 3. ఆజ్ఞ. 4. ఒక ఓషధి (వ్యా. వి )

సుదర్శనము నం. విశే. అ. ఆ. అ. 1. అందమైనది 2. సుఖముగాఁ జూడఁగలిగినది.

సుదర్శనము నం. వి. అ. పుం విష్ణుచక్రము పేరు.

సుదర్శనము నం. వి. అ. న. 1. అమరావతి. 2. జంబూద్వీపము. 3. మేరు పర్వతము నందలి నేరేడు (వ్యా. వి ).

సుదర్శనుఁడు నం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. మేరు పర్వతము. 3. రాబందు.

సుదానము నం. వి. అ. పుం. 1. మేఘము. 2. పర్వతము. 3. సముద్రము. 4. ఐరావతము.

సుదాయము నం. వి. అ. పుం. 1. శుభప్రదమైన కానుక. 2. పెండ్లి యందు అల్లునికి, ఆడుబిడ్డకు నిచ్చెడి అరణము.

సుదినము నం. వి. అ. న. 1. మంచిరోజు. 2. మబ్బు లేని దినము,

సుదీర్ఘము నం. విశే. అ. ఆ. అ. మిక్కిలి పొడవైనది.

సుదీర్ఘము నం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన దోసకాయ,

సుదుర్లభము నం. విశే. (అ. ఆ. అ.) అరుదైనది. కొత్తిగా లభించనిది.

సుదూరము నం. విశే. అ. ఆ. అ. 1. మిక్కిలి దూరమందున్నది. 2. ఎక్కువ దూరము.

సుదృక్కు నం. విశే. అందమైన కన్నులు గలది. వివేకము గలది.

మ. గురు విద్వేషికి ... పికస్వరముం బంచమ శబ్దమిందుకు సుదృగ్జాలంబు రాఁజెల్లునే? వసు. 3. 124,

సుదృక్కు నం. వి. స్త్రీ. అందమైన కన్నులు గల స్త్రీ.

సుదృఢము నం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి గట్టిది మిక్కిలి బలమైనది.

**సుద్ద** శుద్ధమృత్తిక, తెల్లమట్టి.

సీ... శుద్ధమృత్తిక, యొప్పు సుద్దయం చన మీఱు, బంకమ న్ననఁగఁ గుంభకఁమృత్తు. ఆం. భా. 2. 5. వ్రా.

**సుద్దంతట్టుట** వి. కమ్మరి క్రియలో నొకటి. (నెల్లూరు తిరుపతి దత్తమండలముల వాడుక)

**సుద్దగించు** అ. క్రి. కమసాలి. బంగారు లోనగు వానిని సుత్తెపిడితో మిట్టపల్లములు లేకుండఁజేయు.

చం. కరఁగను తోతపోయఁగను గ్రాఁచగ దించను గమ్మిఁదియఁగా, నొరయఁగ వన్నియల్ మిగుల నుండఁగఁ జూఁపఁగ బూదెగట్ట జే, కరయఁగఁ దీర్పఁ జెక్కఁబడి యచ్చునవేయఁగ సుద్దగింపగా సారిదిని జిత్రచిత్రముగ సొమ్ములు సేయ నతండు నేరుచున్. హంస. 2. 182. వ్రా.

**సుద్దము** విశే. నిర్మలము. (సం. శుద్ధమ్) (త. సుత్తమ్)

సీ. నిడుదచేతులవాఁడు నిద్ద పుటద్దంపు నెఱిచెక్కు జోటివాఁడు, అ. రా. సుందర. 88.

సీ. మక్కు మాసినదినా మలినంబు విలసిల్లు, సుద్దమం చనఁగను శుద్ధ మొప్పు, ఆం భా. 8. 25. వ్రా.

**సుద్ది**[1] వి. సల్లాపము, ముచ్చట.

ఉ.... మునిదారులతోఁదగ సుద్దులాడుచున్, నిద్దపు వేడ్క.... దశా. 6. 88.

సామెత (సం. శ్రుతిః).

సీ. ప్రజలఁ గాననివాని పాయనం బనుసుద్ది తునుమ వాదృష్టి యంధునకు నిచ్చి ... రాజవాహన. 1. 36.

గీ. అబాలగోపాల మైనసుద్ది వగవారి వగవారు చుట్ట లగుట· కాశీ. 5. 292.

3. సుడి, మాట, (స. సూక్తి).

ద్వి. సుధ లొల్కు తియ్యని సుద్దులవాని, బుధులకు హితవాత్మఁ బూనెడువాని. రం. రా. అయోధ్యా కాం. 64. పు. 13. పం.

ఉ. ఇప్పటి నీతలంపు తెఱఁ గిట్టిదయా నిటమీఁద నెప్పు డే, చొప్పున నుండునో నిజము సుద్ది యొఱుంగము. శృం. నై. 2. 67.

కం. ...పె, న్నుదుట మద్దుల ముద్దుల సుద్దుల కాలకుఁడు ద్రొచె కోడిఁ బడఁగన్. వి. పు. 7. 18.

4. వృత్తాంతము, వార్త.

సీ. నిషధదేశపు విప్ర నికరంబు పూజించి యలయక ప్రియుసుద్ది యడుగఁ దలచు. శృ. నై. 1. 74.

వ. ఇట్లు గావించి యక్కురువలిపట్టి క్రమ్మఱ యక్కొమ్మ చేతిగుఱుతు గొనివచ్చి ముద్దియ సుద్దవిడి వెల్లింగించినం బొంగి రాముండతని గౌఁగిటం జేర్చి గరవించి యుడుగర లిచ్చి యనిచిన. యయా. 8. 27.

5. ప్రసంగము.

తే. స్వామి యుత్తరపథిక పాశ్చాత్యు లెల్ల, వేదముల సుద్ది మొదలంట విడిచిరి. ప్రబోధచం. 2. 46.

6. జాడ.

తే. గీ. అందు వేశ్యాగృహ మున హైమపాత్రఁ, గన్న యగపాలిటత్తుఁ డాగిన్నె సుద్ది, నేకతంబునఁ దలవరి కెఱుకచేసి, చని యొ ఘనమైన మెచ్చుగైకొని ముదమున. నైజ. 4. 76.

కం. ఆకన్న ప్రతిమసుద్దులు, మాకు మునుపు కలిమి జేసి మహనీయ తదీయాకృతి పొలుపంతయు, భవదాకృతి గని యతండ యనుకొంటి మొగిన్. ప్రభా. 2. 104.

**సుద్ది**[2] (సం. శుద్ధిః. క సుద్ది. త. చుద్ది) విశే. ధౌతము. శుచియైనది.

సీ.... అద్దేవి దర్శింప నమఁగుఁజెలులఁ గెడఁగూడి కన్నియ వడుచనై యొకవాఁడు నీరాడి కడుసుద్ది చీఁగట్టి. చమత్కా. 2. 12.

సీ సుద్దిగా మన్నాను సుదతి ముట్టకు మన్న గబ్బిగుబ్బల గ్రుమ్మి కౌఁగిలించు. రాధికా. 3. 127.

సీ. సుద్దిగమన్నాను వద్దుర మైత్రవాల, వతివ బంగారాన కంటుగలదె. అహల్యా. 4. 211. వ్రా.

**సుద్దిగాఁడు** పరిశుద్ధుఁడు.

అటువంటి సుద్దిగాఁడు కాడటందురు. శుక. 1.

**సుద్దిచేయు** స. క్రి. శుద్ధిపఱచు.

**సుద్దులకత్తె** వి. మాటకారి, మంచిమాటలు చెప్పునది.

ఉ. సుద్దులకత్తెయై యొచటఁజూచిన నేచి చరించు నేరికిన్, బుద్ధులు చెప్పిరాము పలుకోఁకలు బోవఁ దొడంగు నంచు నో, పద్దను బాయకుండి తలవాఁకిలి దాఁటఁగనీక వాలి నే, బ్రొద్దున గాచు బ్రోంబసిఁడి బొజ్జగురుస్సును బ్రస్తుతించెదన్. (ఇచట బ్రకరణ మునుబట్టి వాగ్దేవత యని యర్థము వచ్చును.) ఉత్తర హరివం. 1. 6.

**సుద్దులకన్నె** వి. సరస్వతి.

ఉ. సుద్దులకన్నెకమ్మఁగవ చొక్కపుఁజెక్కులు మోవి నొక్కు మై, ముద్దిడు వేళ మోవికిని మోవికొలంతఁ దలఁచి వేలుపుం, బెద్దకుఁ బంచవక్త్రి గని పెంచిన మేటికి పంచవక్త్రి వౌ, దద్దిర యంచు నవ్వు చతురాస్యుఁడు మాకుఁ జిరాయు వీవుతన్. రాజవాహన. 1. 3.

**సుద్దులకుమారుఁడు** (ళ్ళు) వి. (బ)? గొల్లసుద్దులు పాడువారు?

వ. పరిహాసకులు సుద్దుల కుమాళ్ళు కొమ్మ్నారి దాసళ్ళు తవిరుదాసళ్ళు .... హంస. 3. 29.

**సుద్దులమారి** వి. అడిబంద, వాదాలుఁడు, ప్రేలరి.

సీ. వలువిత్తు వలుగాకి ప్రాడ్వాకుఁడుచ్చిష్ట మొందు సుద్దుమారి యుచితపికట్టై. హంస. 5. 118.

**సుద్దులాడు** అ. క్రి. (సుద్దులు+ఆడు) మాటలాడు

సీ. పోరోగిరవు జడదారిఁ గాంచిన వేల్పు పెద్ద ముద్దియతోడ సుద్దులాడి. సేతుఖం. 1. 6. పుట. తాళపత్ర.

**సుధ** సం. వి. అ. స్త్రీ. 1. అమృతము. 2. పాలు. 3. సున్నము. 4. జెముడు (వృ. వి.). 5. దాఁగ (వృ. వి.). 6. ఇటిక. 7. రసము. 8. తేనె. 9. మెఱపు తీఁగ.

**సుధన్వుఁడు** సం. వి. న్. పుం. 1. మంచి విలుకాఁడు 2. ఆదిశేషుఁడు. 3. విశ్వకర్మ.

**సుధర్మ** సం. వి. న్. పుం. వి. అ. స్త్రీ ఇంద్రుని సభ

**సుధర్ముఁడు** సం. వి. న్. పుం. ధర్మములను చక్కగా నిర్వర్తించువాఁడు.

**సుధాంగుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**సుధాంశువు** సం. వి. ఉ. పుం. చంద్రుఁడు. కర్పూరము.

**సుధాకరుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**సుధాజీవి** సం. విశే. న్. పుం. సున్నపు పనివాఁడు; గోడ కట్టువాఁడు.

**సుధానిధి** సం. వి. ఇ. పుం. చంద్రుఁడు. కర్పూరము.

**సుధాపాణి** సం. వి. ఇ. పుం. ధన్వంతరి.

**సుధాభిత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. సున్నముచేసిన గోడ. 2. ఇటుకగోడ. 3. అపరాహ్ణమున ఐదవ ముహూర్తము.

**సుధాభుక్కు** సం. వి. క్. పుం. దివ్యుఁడు, దేవత.

**సుధాభృతి** సం. వి. ఇ. పుం. 1. చంద్రుఁడు. 2. కర్పూరము. 3. యజ్ఞమందలి బలి.

**సుధాయిన** దే. వి. ఒక స్వరస్థాయి.

ద్వి. నిగిలిసుధాయిన నిగితంబు ... ఆదిగా నొగయుతాయములు. బస. పురా. 71 పు. 11 ప.

**సుధారత్నము** సం. వి. అ. న. ముత్యము.

**సుధావర్షి** సం. వి. న్. పుం. 1. బ్రహ్మ. 2. చంద్రుఁడు. 3. కర్పూరము.

**సుధావాన** సం. వి. అ. స్త్రీ. ఒక దినుసు దోస.

**సుధాసూతి** సం. వి. ఇ. పుం. 1. చంద్రుఁడు. 2. యజ్ఞము, 3. కమలము.

**సుధాస్రవ** సం. వి. అ. స్త్రీ. చిఱువాలుక, కొండనాలుక.

**సుధాహరుఁడు** సం. వి. అ. పుం గరుత్మంతుఁడు.

**సుధితము** సం. విశే. అ. ఆ. అ. 1. దృఢము, పూర్ణము. 2. మంచిది దయగలది. 3 సుఖముగలది, సమృద్ధమైనది. 4. చక్కఁగా గుఱిపెట్టబడినది (బాణాది).

**సుధితి** సం. వి. ఇ పుం. గొడ్డలి.

**సుధీ** సం. విశే. ఈ. మిక్కిలి తెలివి గలది.

**సుధీ** సం. వి. ఈ. పుం. మేధావంతుడు, విద్యావంతుఁడు.

**సుధీ** సం. వి. ఈ. స్త్రీ. మేలయిన మేధాశక్తి.

సుధోద్భవుఁడు సం. వి. అ. పుం. ధన్వంతరి.

సుధ్యుపాస్య సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి. 2. పార్వతి చెలికత్తె. 3. స్త్రీ. 4. ఒకరంగు పరాగ్గము.

సుధ్యుపాస్యము సం. వి. అ. పుం. రాజప్రాసాదము. వి. అ. న. బలరాముని గద.

సుధ్యుపాస్యుఁడు సం. వి. అ. పుం. శ్రీకృష్ణుని పరిచారకుఁడు.

సుధూమ్రవర్ణ సం. వి. ఆ. స్త్రీ. అగ్నిదేవుని సప్త జిహ్వాలలో నొకటి.

సునయన సం. వి. ఆ. స్త్రీ. 1. అందమైన కన్నులు గల యాడుది. 2. ఆడుది.

సునయనము సం. వి. అ. పుం. హరిణము, లేడి.

సునయము సం. వి. అ. పుం. 1. సత్ప్రవర్తన. 2. మంచి యాశయము, మంచి విధానము.

సునాభము సం. విశే. (అ. అ. అ.) 1. మంచి బొడ్డు గలది. 2. మంచి కేంద్రము గలది.

సునాభము సం. వి. అ. పుం. 1. సత్వరము. 2. మైనాక పర్వతము. 3. తెల్లగినియ. (వృ. వి.) (శ. ర.)

సునామణి హిం వి. చదివి వివిపించుట.

సునాయాసము విశే. మిక్కిలి సులభము

శా. ఆరామంబులు పెక్కు గల్గును సునాయాసంబుగా నేచి. విక్ర. 1. 97.

సునారము సం. వి. అ పుం 1. కుక్క పొదుగు. 2. పాముగ్రుడ్డు. 3. పిచ్చుక.

సునావము సం. వి. అ న. నౌకాయానమునకు యోగ్యమైన జలము.

సునాసీరుఁడు సం. వి అ పుం. ఇంద్రుఁడు.

సునిభృతము సం. విశే. (అ అ. అ.) ఏకాంతము, దృఢము, రహస్యము.

సునిశ్చలుడు సం, వి. అ పుం. శివుఁడు

సునిషణ్ణకము సం. వి. అ. న. నీరుచెంచలి. (వృ. వి)

సునీతము సం. విశే. (అ. అ. అ) 1. మంచి వడవడి గలది 2. నాగరకము, మర్యాదకలది.

సునీతము సం. వి. అ. న. 1. సత్ప్రవర్తన. 2. సన్మార్గము, మంచిపద్ధతి, వినయము.

సునీతి సం. వి. ఇ. స్త్రీ. 1. సత్ప్రవర్తన. 2. యోగ్యత. ఔచిత్యము. 3. సన్మార్గము, సదాచారము. 4. ధ్రువునితల్లి పేరు.

సునీథము సం. విశే. అ. అ. అ. 1. మంచిది, యుక్తమైనది 2. ధార్మికము, సుశీలము.

సునీథుఁడు సం. వి అ పుం. 1. బ్రాహ్మణుఁడు. 2. శిశుపాలునిపేరు (?) 3. మంచినాయకుఁడు. (వైదికము).

సునీల సం వి ఆ. స్త్రీ నారపీచు, గోగునార.

సునీలము సం. విశే. అ. అ అ. వల్లనిది, నీలమైనది.

సునీలము సం వి అ. పుం. దానిమ్మచెట్టు. (వృ.వి.)

సునీలము సం వి అ. న నీలమణి

సున్న వి. (సం శూన్యమ్) (ప్రా. సున్న, సుణ్ణ.) అనుస్వారము, బిందువు. ఇది నిండుసున్న యరసున్న యని ద్వివిధము

తే. గీ.... మానధైర్యము బ్బున్న లమరు, సుదతి కోంట్లకుఁ ద్రవద్రావి చూపెననఁగ. ఆము. 5. 154.

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమొగం బపురా తల కట్టు తమ్మిపూ,పున్నమచంద మామలకుఁ బొక్కిలి చక్కఁదనంబు, చెప్పఁగా సున్నదె మేలుబంతులు పయోధరముల్ మఱి కౌనుసున్నయా, వేన్నిక కెక్కు బ్రాతఫలమివ్వరవర్ణినికి న్నిజంబుగన్. విజ. 2. 104.

2. అంకెలలో శూన్యస్థానము దెలుపు వర్తులరేఖ. సారంగ. 2. 5.

ఆ. అధ్యుఁడొక్క డున్న నందఱు పూజ్యులే లెక్కమీఁద సున్న లెక్కినట్లు, అతఁడు పోవుచెనుక నందఱుఁ బూజ్యులె. లెక్కచెంత సున్న లేఁగినట్లు. బ్రౌ.

సున్న విశే. (సం. శూన్యమ్) లేనిది. శూన్యము.

ఉ. ... ఎప్పటిం, జూచిన వబ్బమానవుఁడు సున్న తదీయ నదస్యకోటిలోన్. విక్ర. 5. 128.

కం. వలపువటవావులా వహి, యలవత్యము సున్న

తలఁపు లగ్రభర్త్యాయల్.

చం. కపటము లేదు సంగముకుబున నోట పాలికిం బెట్టితోఁ, గృపణవిధంబునాస్తి నహి కిల్బిషవర్తన మిల్ల కల్ల యెల్లప్పుడును సున్న యన్న తయవాంకరణం బెటువంటిదో కదా, కుపితవిరోధి హార్త యగు గొబ్బురి తిమ్మ నృపాలమౌళికిన్. రామా. 146.

మున్నగిల్లు అ. క్రి. గుంద్రనగు.

మున్నగు (మున్న + అగు) అ. క్రి. సున్నయగు, శూన్యమగు, క్షీణించు, తగ్గు.

ఉ. అన్నము లేక యుండిన లయం బగు దేహము రక్తమాంసముల్, సున్నగునింద్రియస్ఫురణ లుక్కుమదాతిశయంబు దూఱమౌ, వన్నెల మీఁద ప్రేమ చెడు నచ్యుత నీవయి నిల్చు మానసం, బెన్నటికైన ప్రాణులకు హెచ్చు దరిద్రతపాటియే సిరుల్. కుచేల. 3. 53.

కం. అన్నవఁ గనుమూయుట రొద, సన్నగిలుట. గౌఁగిలింత సడలుట నేర్పుల్, మున్నగుట వరూధినిరతి, కన్నెతనవు రతియుఁబోలెఁ గడునిం పొనఁ గెన్. మను. 3. 117.

మున్నచేట్టు అ. క్రి. శూన్యముచేయు, లేదను.

సీ. ఒకటి పంక్తిని వ్రాయనూహ నేర్చినవాఁడె మున్న చుట్టక వ్రేలు చూపినావు .... భవ్యభర తుండ రాయన భాస్కరుండ. చాటుపద్య మణి మంజరి. 1 వ భా. 80. పా.

మున్నపుఁగాయ వి. √ సున్నము. చూర్ణకరండము.

సీ ... మున్నపుఁగాయనాఁ జూర్ణకరండ మౌ .... ఆం. భా. 2. 167.

మున్నము వి. (సం. చూర్ణమ్. ప్రా. చున్నం. త. చున్నమ్. క. సణ్ణ. హిం. చూనా) ముత్తెము మొ. కాల్చిన తెల్లని యొక దినుసు పదార్థము.

కం. అ...భ్యున్నత సౌధము మీఁదను, సున్నము నిగుడించినట్టి జోడరుగులపై. భీమ. 2. 126,

సీ మేనఁ బొక్కులు పొక్క మెదియించి సున్నంబు మెత్తఁ దెల్లనె మీకు మెలఁతలార! నీలా. 3. 34.

శ్లో ,,, తన శాంబు వోయిన నేను బోవుదున్ మఱపక వేటఁబోవ జలమగ్నత గానది సున్నముం అము. 5. 61.

సున్నమెత్తు అ. క్రి. 1. శిథకై సున్నపుబొట్లు పెట్టు. 2. సున్నము చేయు.

వ. ... సున్న మెత్తుటయుం బొట్టుకారులం బట్టుట యు సౌధసౌవర్ణభూషణాది నిర్మాణంబు లయ్యెంద. అము. 4. 1'8.

సున్నచేయు (సం. శూన్యమ్) శూన్యము చేయు.

చం. ఇలువడి సున్న చేసి హృదయేశుల సిగ్గులు పుచ్చి యత్త మామల నెరియించి. భాగ. 10 స్కం. పూర్వ. 9. 77.

సున్ని (సం. చూర్ణమ్) వి చూర్ణము, బియ్యము మొ. పిండి.

ఉదా మినుప సున్ని. చెన్న. బ. 2. 7'. చోడి సున్ని = చోడిపిండి ఆం. భా. 2 2:0 ప్రా

కం. కమఁగొనిన మది కసహ్యాత, దనిఁజెడి యీ పాతసున్ని తగ నాకైదా, చివదానవె చాలు సుమా, యని మిగిలిన దచట మునిచి యతఁడేఁగె వెసన్. చెన్న బ. 2. 46.

సున్నితము విశే. కచ్చితము.

సుపంథ (సుపథిన్) సం. వి. న్. పుం మంచి దారి.

సుపక్వము సం. విశే. (అ. ఆ అ.) 1. చక్కఁగా పండఁబడినది. 2. చక్కఁగా వండినది.

సుపక్వము సం. వి అ. పుం. ఒక రకము మామిడి పండు.

సుపత్ని సం. వి. ఈ. స్త్రీ. మంచి భర్త గల స్త్రీ.

సుపథము సం. వి. అ పుం. 1. మంచి మార్గము, మంచి త్రోవ. 2. మంచి విధానము. 3. సత్ప్ర వర్తన.

సుపద్మ సం. వి. ఆ. స్త్రీ వస వేరు.

సువర్ణ (ర్ణి) సం వి. ఆ ఈ. స్త్రీ 1. పద్మముల సమూహము. 2. తామర కొలను 3. గరుడుని తల్లి పేరు.

సువర్ణము సం. విశే (అ. ఆ. అ) 1. మంచి రెక్కలు గలది. 2. మంచి ఆకులు గలది,

సువర్ణుఁడు సం. వి. అ. పుం. 1. గరుత్మంతుఁడు. 2. సూర్యకిరణములతో నొకటి. 3. దేవయోని విశేషము. 4. అప్రాకృతిక పక్షి విశేషము. 5 కోడి పుంజు.

సుపర్యాప్తము సం. విణ. (అ. అ. అ.) 1. మిక్కిలి విశాలమైనది. 2. మిక్కిలి యోగ్యమైనది.

సుపర్వ(ము) సం. విణ. (న్. ఈ. న్.) 1. మంచి కణుపులు గలది. 2 పెక్కు అతుకులు కలది.

సుపర్వ(ము) సం. వి. అ. పుం. 1. వెదురు. 2. బాణము. 3. ఒక తిథి (పూర్ణిమ, అమావాస్య అష్టమి, చతుర్దశి) 4. పొగ.

సుపర్వుఁడు సం. వి. న్. పుం. దేవత, వేలుపు.

సుప్పా(ప్పా)ణి వి. (సాం.ని. స్థా. 91) 1. ముత్యము.

తే. గొప్ప పొలుసుమంజి సుప్పాణి కూర్పరంపు, దంబు వగడంబు జగడంబు వంబరంబు, లెసఁగిన గుడార్లు గలుగు నవ్వనుమతీశు పాశెమీఁటించి గజ రాజు భయము మించి. కృష్ణ. 3. 76.

చం. వడిగల కెంపుటారవల వింతపసల్ గల తాళి వజ్రపుం, గడియములున్ సుపాణులు చొకాటపు చౌకళికట్టు వర్గము ల్గడుఁ బ్రియమొప్ప నిచ్చి శుక. 1. 166.

2. శుభ్రమైన నీరు గల ముత్యము.

సీ. నలు వొంద నునుకుందనపు గంద మెరఁబూని యొగిఁ బాడి సుప్పాణి యొంట్లు దాల్చి. లక్ష్మీ. వి. 5. 4.

వ. చూచువారి పెదవులకు, జవు లొదవించు వాడెంపు టాడిసుప్పాణి ముంగురులు గలుగు బరాతి హొంతకారులును. ప్రబం. 1. 78.

3. ముత్తెములం దుండెడి తళుకు ఛాళధళ్యము.

ఉ. తోడి బలారికిన్ బలనిషూదనదత్తము లైన గొప్ప క,ట్టాణి సుపాణి యొంటు లలరారె. వసు. 5. 87.

తే. దాడిమీ బీజరాజి కెందళుకు మొల్ల, మొగ్గల విసాళమును ముత్యముల సుపాణి, తమ్మి పువ్వింట గొలువున్న వెమ్మెవడయు, దంతురాలక సుస్నిగ్ధ దంత పంక్తి. పాండురంగ. 3. 192.

తే. ఈ వెం డిరయొంబల్ పైఁడిలో వెలంది, ఈవె [illegible] బ లేనెలఁత, యీ సుపాణి రద [illegible] సుపాణి యీ బిటారు మృగీమద [illegible] విజ. 1. 150.

సుపార్శ్వము సం. వి. అ. పుం. 1. ప్లక్షము. (వృ. వి [illegible] ఒక విధమైన మేకిచెట్టు. (వృ. వి.) [illegible] పాశి పుత్రుని పేరు.

సుపితము సం. వి. అ. న. పచ్చ ముల్లంగి.

సుపీతము సం. వి. అ. పుం. ఐదవ ముహూర్తము.

సుపుంసి సం. వి. ఈ. స్త్రీ. మంచి భర్త గల స్త్రీ.

సుపుష్పము సం. వి అ. పుం. 1. శిరీషము. (వృ. వి.) పగడపు తీగ.

సుపుష్పము సం వి అ న. 1. లవంగము. 2. స్త్రీ రజస్సు.

సుపుష్పి సం. వి. ఈ. స్త్రీ అరటిచెట్టు.

సుపూరకము సం. వి. అ పుం. ఒక పుష్ప వృక్షము (వృ. వి )

సుపూరము సం. విణ. (అ. ఆ. అ.) 1. తేలికగా నింపదగినది. 2. చక్కఁగా నిండినది.

సుపూరము సం. వి. అ పుం. ఒక విధమైన నిమ్మ. (వృ. వి.)

సుప్తము సం. విణ. (అ. ఆ. అ.) నిద్రించినది.

సుప్తి సం. వి ఇ. స్త్రీ. 1. నిద్ర. 2. తిమ్మిరి. 3. నిద్ర యందలి వథము.

సుప్పనక చుప్పనాక. వి. శూర్పణఖ,

తే.గీ. చని వెరపుమీఱ నొకయాకుఁ జవిరె వచట, నిలుపుకొని పండ్లు దుంపలు నెలమిఁ దినుచు, నున్న చో నబ్బురం బొప్ప నొక్కనాడు, సుప్పనక యను రక్కసి జోటి యొకతె. అ. రా. అరణ్య. 8.

సుప్పనాతి = చుప్పనాతి వి. శూర్పణఖ.

తే. గీ. అట్లు వాండ్రదు ముప్పు రడఁగిన వడలుచు సుప్పనాతి మిగులఁ బ్రుక్కి లంక, కరిగి తోడఁబుట్టు వగు రావణుని గాంచి, తన తెఱంగు దెలియ నివుచుటయును. అ. రా. అరణ్య. 15.

సుప్పాణి విణ. నీరు గల, ఛాళధళ్యము గల.

వ. పోఁడగండి గొప్ప సుప్పాణి ముత్తెంపుటారి తొడంబులు. ఉ. రా. 1. 158.

వ. సుప్పాణి ముత్తియంపుఁ గ్రమ్మ టోవరులఁ గ్రమ్ముకొని, ఉ. రా. 6. 158.

**సుప్రకాశము** వం. విశ. (అ. ఆ. ఆ.) 1. స్పష్టమైనది, వ్యక్తమైనది. 2. బహిరంగమైనది, ప్రసిద్ధమైనది.

**సుప్రతర్కము** వం. వి అ పుం. ఉత్తమ నిర్ణయము, ప్రశస్తమైన తీర్పు.

**సుప్రతిభ** నం. వి. అ. స్త్రీ. 1. సారాయము.

**సుప్రతిష్ఠ** నం. వి. ఆ. స్త్రీ. 1. మంచి స్థితి, 2. కీర్తి, ప్రసిద్ధి. 3. స్థాపన, నిర్మాణము 5. ఐదవ ఛందము. 6. ప్రతిష్ఠించుట.

**సుప్రతిష్ఠితము** నం విశ. అ. ఆ. అ. 1. చక్కఁగా నెలకొల్పఁబడినది. 2. ప్రతిష్ఠచేయఁబడినది. 3. ప్రసిద్ధికెక్కినది.

**సుప్రతిష్ఠితము**నం. వి. అ. పుం. ఉదుంబరవృక్షము. (వృ. వి.)

**సుప్రతిష్ఠాతము** నం. విశ. 1. పరిశుద్ధము చేయఁబడినది. 2. పరిశోధింపఁబడినది. 3. నిర్ధారణచేయఁబడినది, అంతేరినది, సంపూర్ణజ్ఞానముగలది.

**సుప్రతీకము** నం. విశ అ. ఆ. ఆ. 1. ఒక చక్కని రూపముగలది, అందమైనది. 2. మంచి శరీరము గలది.

**సుప్రతీకము** నం. వి. అ పుం. ఈశాన్యదిక్కు నందలి యేనుఁగు.

**సుప్రతీకుఁడు** నం వి. అ. పుం. 1. కామదేవుఁడు. 2. శివుఁడు.

**సుప్రపాణము** నం. వి. అ. న. మంచికొలను.

**సుప్రభ** నం. వి. ఆ స్త్రీ. అగ్నిదేవుని నప్తజ్వాలలో నొకటి.

**సుప్రభము** నం. విశ. అ. ఆ. అ. మిక్కిలి కాంతి గలది, ఉజ్జ్వలమైనది.

**సుప్రభాతము** నం. వి. అ. న. 1. పవిత్రమైన ఉదయము లేక దినము. 2. తొలిప్రొద్దుపొడుపు, వేకువ, వేగుఁబోక.

**సుప్రయోగము** నం. వి. అ పుం. 1. ఒక చక్కని నిర్వహణము. 2. సన్నిహిత సంబంధము. 3. నైపుణ్యము, కౌశలము.

**సుప్రసన్నుఁడు** నం. వి అ. పుం కుబేరుఁడు

**సుప్రసాదుఁడు** నం. వి. అ పుం. శివుఁడు.

**సుప్రియ** నం. వి. ఆ స్త్రీ. 1. మనోహరి, అందగత్తె. 2. ప్రియురాలు.

**సుప్రియము** నం. వి అ. పుం. రెండు లఘువుల పాదముగల వృత్తవిశేషము.

**సుఫల** నం. వి. ఆ. స్త్రీ. 1. గుమ్మడి (వృ. వి.) అరఁటి. (వృ. వి.). 3. ద్రాక్ష. (వృ వి.). 4. వెఱ్ఱిపుచ్చ. (వృ. వి.).

**సుఫలము** నం. వి. అ. ఆ. అ. 1. మచిఫలము గలది.

**సుఫలము** నం వి అ పుం 1. దానిమ్మ. (వృ. వి). 2. రేఁగుచెట్టు (వృ. వి.). 3. కర్ణికారము. (వృ. వి.). ఒకవిధమైన చిక్కుడు. (వృ. వి ).

**సుబంధము** నం. వి. అ. పుం. నువ్వులు.

**సుబలుఁడు** నం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. శకుని తండ్రిపేరు.

**సుబా** వి. (హిం. సుబా) 1. రాజ్యభాగము. రాష్ట్రమం దొకభాగము.

సీ. ప్రబలి సాహెబు సుబా యెంత యేలిన బేగంబు లకుఁ గుట్టుపోఁగులేను. వేణుగో. ౪. 14.

శా. ఢిల్లీ పాదషహా నియోగమున రూఢిన్ రాజరాజా నిజా, మల్లీ పేరిటి మేటి సాహెబు సుబాయాత్మం గళింగంబు రా, జల్లీలన్ ఘనుడా ఫరాసువకు మూసా బూసి యన్వాని క,త్యుల్లాసంబున నాధిపత్య మొసఁగన్ యోజించి రావింపుచున్. రంగా. 1. 138.

2. మండలాధిపతి.

కం స్త్రీ బాల వృద్ధ జనముల,తో బహుకాలంబు నుండి నోఁచనవుఁబసన్ శాబానిగాలు గొంటిమి మీ బోటి సుబాల వద్ద మే మలఁతులమే. రంగా. 1. 172.

మ. అధికారంబు వహించి వచ్చిన సుబావామీఁద భావంద లె,వ్విధినైన న్సరుకారు శిస్తు భణితిన్

విత్త బుచిత్తంబు రాజ్యశ్రీలు. గొల్పక కొలఁదు సేవనక మీరాకోట ఫేటిఫ్రడన్, పథము ల్దప్పిన పల్కు వల్కఁగనే సాక్షాత్య లోకేశ్వరా' రంగా. 2. 74.

**సుబాంధవుఁడు** నం. వి. అ పుం. శివుఁడు.

**సుబాహువు(ఁడు)** నం. వి. ఉ. పుం. 1. మంచి బాహువులు గలవాఁడు. 2 మారీచుని సోదరుఁడు.

**సుబేదారు** వి. సేనానాయకులలో నొకఁడు.

మ. సమరోజ్జృంభిత శౌర్య ధుర్యులగు సార్జంటుల్ మయూరల్ కుమండములన్ వీరులు సోలు దారులు సుబేదారుల్ మొదల్గల్గు సైన్యముల. రంగా. 1. 147.

**సుబోధము** నం విశే (అ. ఆ. అ.) సులభముగా అర్థమగునది.

**సుబోధము** నం వి అ. పుం. 1. మంచి వార్త. 2. హితవు.

**సుబ్బనచూలు** వి √సుబ్బ (సుబ్బన్+అ+చూలు) ప్రకటితమగునట్లు చేసెడి కొల్లి, పెద్ద కొల్లి. (చూలు + చూలు=చుబ్బన చూలు. అని శ. ర.) జుబ్బనజూలు — జుబ్బనజూలు, —సుక్కనమూలు అని ప్రౌ. జుబ్బనజూలు అని. చి ని. 'చుబ్బన చూలు'అని ముద్రితములు. ఈ పాఠములన్నియును వ్యుత్పత్తి శూన్యములగుట చేత పై విధముగా గ్రహింపఁబడినది.)

చం. ... రాము పెన్మ్మలుకుల పాలివార లయి మోహము సు(చు)బ్బన చూలు గాఁగ ... .... భా. రా. యు. 1453.

గీ. జరయుఁ దెవులును పగయును భోరయ నవఘ సుఖము లెప్పుడుఁ జు(సు)బ్బన చూలులు ... ... మార్క. 4. 128.

(పుష్కలములు అని భావము)

**సుబ్బనచూలులాడు** న. క్రి. (√సుబ్బ) —సుబ్బన చూలులు+ఆడు) పెద్ద కొల్లగొను.

సీ. ఇప్పురాణం బెప్పు డింపార జిహ్వకు నమృతంబుగాఁ గ్రోలునట్టివారు, దుఃఖనిర్ముక్తులై సార సంసార సుఖములు సుచు(బ్బన చూలులాడి వారు. ఉ. 8. 68.

ఉ. ... వేల్పు వెలగుబ్బెతలఁ గవగూడి పైబయిఁ జుబ్బన సూ(చూ)లులాడుటకుఁ జొత్తురు. తన్మధు రాధరామృతంబు .... రామా. 1. 45.

(పుష్కలముగా ననుభవించు అని భావము)

**సుబ్బు** అ. క్రి. బయటపడు, ప్రకాశమగు. (క సుబ్బ = శుభ్ర)

సీ. నా ప్రాణ సఖుల చందము నమ్మరాదు మా సుబ్బుసుబ్బుల దూలు జాతురోకొ్ల. కృ శకుం. 2. 42.

శా ...దవికం గ్రొమ్మించు పుట్టించుచన్ గుబ్బల్ పాదవుఁటట్లు కమ్మల ముసుఁగుల్ సుబ్బలి ల్పోకమాన్, విప్పి గప్పి మిటారు లెక్కు తుఁగి బృందంబు చిందెన్ వడల్. రాజవాహన. 2. 60.

2. వ్యాపించు, ప్రసరించు.

కం. ఆ చిత్రఫలక మెవ్వరు, చూచిన వెలి వినక యపుడు సుబ్బెడునది నీ, వే చూడు చేనుచూచుట, యోచించల నయన! యింతయు నెఱుఁగుదువే? ప్రభా. 165.

3. లోక ప్రవాదము, జనశ్రుతి.

సీ. నా ప్రాణసఖుల చందము నమ్మరాదు మా సుబ్బుసుబ్బుల దూలుఁజాతు రొకొ్ల. కృ. శకుం. 3. 43.

**సుబ్రహ్మణ్యుఁడు** నం. వి. అ. పుం. 1. కార్తికేయుఁడు, కుమారస్వామి. 2. యజ్ఞము నందు నియుక్తులగు పదునార్గురు యాజకులలో నొకఁడు.

**సుభంగ** నం. వి. ఆ. స్త్రీ. కొబ్బరిచెట్టు.

**సుభగ** నం. వి. ఆ. స్త్రీ. 1. భర్త యొక్క ప్రేమకు పాత్రురాలైన భార్య. 2. పూజనీయమైన మాతృదేవి. 3. అడవి మల్లె. 4. పసుపు. 5. ప్రియంగు లత. 6. తులసి.

**సుభగంమన్యుఁడు** నం వి. అ. పుం. 1. అదృష్టవంతుడను, అందగాడను అని తలఁచువాఁడు. 2. ఆత్మశ్లాఘాపరుఁడు, స్వాభిమాని.

సుభగము సం. విశ. (అ. ఆ. అ.) 1. అదృష్టము గలది. 2. అభివృద్ధి గలది. ప్రియమైనది, ఆదరమైనది. 3. ఇష్టమైనది, ఇంపైనది, మధురమైనది. 4. ప్రసిద్ధమైనది, ఉదాత్తమైనది.

సుభగము సం. వి. అ. పుం. 1. అశోకము. (వృ. వి.) 2. చంపకము. 3. వెలిగారము. 4. ఎఱ్ఱ కలువ. (వృ. వి.)

సుభద్ర సం. వి. ఆ. స్త్రీ. అర్జునుని భార్య, అభిమన్యుని తల్లి

సుభద్రకము సం. వి. అ. పుం. 1. దేవతా విగ్రహము లను ఊరేగించుటకైన రథము. బిల్వ వృక్షము (వృ. వి.)

సుభద్రము సం. విశ. (అ. ఆ. అ.) సురక్షితమైనది. సుఖమైనది, అదృష్టము గలది.

సుభాషితము సం. విశ. (అ. ఆ. అ.) చక్కగా బలుకబడినది.

సుభాషితము సం. వి. అ. న. 1. ధారాళమైన వచనము. 2. చమత్కారమైన వాక్యము. 3 సూక్తి. 4. హితవచనము 5. మంచి యభిప్రాయము.

సుభిక్ష సం. వి. ఆ. స్త్రీ. ఆరెపువ్వు.

సుభిక్షము సం. వి. అ. న. 1. మంచి బిచ్చము. 2. ఆహార సమృద్ధి. 3. పాడిపంటల కలిమి.

సుభీరకము సం. వి. అ. పుం. పలాశ వృక్షము. (వృ. వి.)

సుభూతికము సం. వి. అ. పుం. బిల్వ వృక్షము (వృ. వి.)

సుభ్రువు సం. వి. ఊ. స్త్రీ. మంచి కను బొమలు గల స్త్రీ.

సుమంగలము సం. విశ. (అ. ఈ. అ.) 1. శుభప్రదమైనది 2 యజ్ఞ సమృద్ధి గలది.

సుమంగలి సం. వి. ఈ. స్త్రీ. పుణ్య స్త్రీ; ముత్తైదువ.

సుమంతుఁడు సం. వి. ఉ. పుం. మంచి యాలోచన చెప్పువాఁడు.

సుమతి సం. వి. ఇ. పుం. మంచి బుద్ధి గలవాఁడు.

సుమతి సం. వి. ఈ. స్త్రీ. 1. మంచి బుద్ధి దయ, మైత్రి. 2. దేవతా వర ప్రసాదము. 3. ఆశీస్సు, వర ప్రదానము. 4 ప్రార్థనా గీతము (మంత్రము) 5. కోరిక. 6. సగరుని భార్య పేరు.

సుమదనము సం. వి. అ. పుం. రసాలము.

సుమధ్య(మ) సం. వి. ఆ. స్త్రీ. చక్కని నడుము గల స్త్రీ.

సుమన సం. వి. ఆ. స్త్రీ. బొండు మల్లె.

సుమనము సం. వి. అ. పుం. 1. గోధుమ 2. ఉమ్మెత్త.

సుమనస్సు(ము) సం. వి. స్. న. మంచి మనస్సు, తృప్తి, సంతోషము, దయ.

సుమనస్సు (ము) సం. వి. స్. పుం. 1 దేవత, దివ్యుఁడు. 2. విద్వాంసుఁడు. 3. వేదాధ్యాయి. 4. గోధుమ. 5. వేపచెట్టు. (వృ. వి.)

సుమనస్సు(ము) సం. వి. స్. స్త్రీ. 1. బొండు మల్లె. 2. మాలతిలత.

సుమనఃఫలము సం. వి. అ. పుం. ఉమ్మెత్తపండు.

సుమనఃఫలము సం. వి. అ. న. జాజికాయ.

సుమనోరజముసం. వి. స్. న. పుప్పొడి.

సుమము సం. వి. అ. న. పువ్వు.

సుమము సం. వి. అ. పుం. 1. కర్పూరము, 2. ఆకాశము

సుమారు హిం. వి. కొంచెమెచ్చు తగ్గు. (శ. ర.)

సుమాళము వి. సంతోషాతిశయము.

మ....అంత వారదుఁడుగయ్యం బింతటం గల్గెఁబో, గనుఁగో నా కనుచున్ సుమాళమునఁ జంకల్ వేసి కొంచున్ వడిన్, వినువీథిం జనుదెంచి. వరాహ. 11. 92.

2. సంతోషాదుల వలనఁ గలిగిన పారవశ్యము.

వ. కంతు నాలోకించి నేత్రంబోక పలుక యాడు దమే యని యుబ్బుమై మాటగాఁ బలికిన నతండు నీవు సుమాళంబున నున్నవాఁడవు నేఁడు నీ తోడ వాడి జయింపరాదు. భాగ. విరా. 5. 244.

కం. సంతోష కలకలంబున వింత సుమాళమున వచ్చు విభుని కెదురుగా, నెంతయు వేడుకఁ జని త,

త్యాంత గని యెయ్ వతని చేతఁదవరెడు వాఁడన్. వర. 1. 154.

తే. ఔం మధుమద మమరెఁ బుష్పాసవంబు, గ్రోలిన సుమాళ మపుడు తత్కోకిలకుఁ జూత పున్నాగ కురువ కాశోకతరులు, వన్నె నవ్వులు పువ్వులై నివ్వటిల్లె. రామా. 2. 100

3. మూర్ఛ.

సీ. సొరుగు సొలుపు సొమ్మ సొలిమిడి సోలును, మాళము బవిళి మైమఱపు భ్రమరి, యవఁగ మూర్ఛాహ్వయం బలరారుచుండును ... ... ఆం. భా. 2. 228. వ్రా.

4. మత్తత; గర్వము.

మ. .... ఆశ్లీల ము,ద్దెన వాదికుక్కవ దుస్సమాన మిది సందేహాస్పదం బీడవం.చు సుమాళంబునఁ బాండితుల్ వెలువు నీచున్ రోఁత వ్రాకువ్వగన్. వంచతం. 1. 13.

5. సుఖము.

సీ. తే. గీ. ... హాయి సుకము సుమాళ మం చవఁగ సుఖము ... ఆం. భా. 1. 98. వ్రా.

6. వినయము.

చం. కొమ్మ యెుక్కర్తు వచ్చి సుమాళంబున మ్రొక్కి తాను కొనఁగెన్ బెంగల్వలాతేనికన్. యయా. 5. 46.

సుమాళి విఱ. (సుమాళము + ఇ) సుమాళము గల వాఁడు, గర్వముగలవాఁడు.

కం. జూదరివి సుమాళివి నెఱవాదివి తమకరివి గెలువవచ్చునకే దా, మోదర నిను మాళమటయు, వాదెనఁ గనుఁగొనక పిలువుమనె జాంబవతిన్. "సుమాణి" యని పుస్తకమునందలి పాఠము. ఉ. హరి. 5. 118.

సుమాళించు అ. క్రి. 1, సంతోషముచే పరవశమగు.

ద్వి. ఎత్తినవేడ్కతో నృపుఁడొక్కవలక, నెత్త మాడుదమన నృపుఁ జూచి యతఁడు, నీవు సుమా ళించి నన్ను నీ వెఱుఁగ, వీవెంత నేనెంత నేనాడ ఁగనివ, విరాటపర్వము. 4. 64. వృ.

తే. కాంత కరికరా బను కాసుమొగులు, వితత ముగ నారె బకు వియ బాతె, దమ్ముఁగని సుమాళించు దవుని హ్యా యు, నవమయూరము చెలరేఁగి నాట్యమాడె. కళా. . 63.

2. ఉత్సహించు, వేడుకపడు.

మ. పెనఁగ గాయకు మెత్తకమ్ములకునై వేటాడు మన్ గొట్టెలన్, మనలంజూచుచు దోనచేల్ చెఱకు చాల్ మగ్గాడుచున్ సజ్జఁగో,య సుమాళించుచు సేవరా పెగసి. రాజవాహన. 2. 65.

సుమిత్ర నం. వి. అ. స్త్రీ. లక్ష్మణశత్రుఘ్నుల తల్లి.

సుముఖము నం. విఱ. అ. అ. ఈ. అ. 1. మంచి ముఖముగలది, అందమైనది. 2. ఆనందము గలి గించునది. 3. సిద్ధమైనది, అనుకూలమైనది, అను రక్త పడుచున్నది.

సుముఖము నం. వి. అ. న. వ్రేలిగోటిగీరు.

సుముఖ(ఖి) నం వి.అ.ఈ.స్త్రీ. 1. అందమైన ముఖము గల స్త్రీ. 2. అద్దము.

సుముఖుఁడు నం. వి. అ. పుం 1. విద్వాంసుఁడు. 2. గరుత్మంతునిపేరు. 3. గణపతిపేరు. 4. శివుని పేరు.

సుముఁడు నం. వి. అ. పుం. చంద్రుఁడు.

సుమూలకము నం. వి. అ. న. ముల్లంగి.

సుమేఖలము నం. వి. అ. పుం. ముంజగడ్డి.

సుమేధ(ధసు)ఁడు నం. వి. స్. పుం. పండితుఁడు, ప్రాజ్ఞుఁడు.

సుమేరువు నం. వి. ఉ. పుం. 1. మేరుపర్వతము. 2. శివుఁడు

సుమ్నము నం. వి. అ. న. 1. బుక్క. 2. ఆనం దము, సుఖము. 3. వరము, రక్షణ, ప్రసాదము. 4. యజ్ఞము.

సుయవసము నం. వి. అ. న. మంచిగడ్డి, పచ్చిక.

సుయామునుఁడు నం. వి. అ. పుం. విష్ణువు పేరు.

సుయుత్తుఁడు నం. వి. అ. పుం. శివుఁడు.

సుయోధనుఁడు నం. వి. అ. పుం. దుర్యోధనుఁడు.

సుర వి. గాలిషుడి,

సుర సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లు, సారాయము. 2. జలము. 3. పానపాత్రము. 4. పాము.

సురకపుపలి వి. సు గాలి, సుడిగాలి.

కం. ఇడగు క సుడి వంపున, న గి తృణావర్తు డవని కవచాటముగా సురకపువలియై బిస బిస, వరుదరుదవ ముసరి విసరి హరిఁ గొనిపోయెన్. భాగ. 10 స్కం. 264.

వ. ప్రళయకాలంబున సురగరువలిచే దిద్దిరం దిరి గెడు కులనగంబులం బ్రేడిసేయ. భార. భీష్మ. 1. 287.

సురంగ(ము) సం. వి. ఆ. స్త్రీ. 1. సొరంగము. భూగర్భ మార్గము.

కం. సురంగసేయ నొక్కెడ మూసెన్. దశకు. 6. 140.

2. కన్నము. రంధ్రము.

సురంగంబు (క. సురంగొ) వి. ప్రకాశము.

వ. మఱియు ... వసించి యాయగంబున నుఱియ సురంగంబుగాఁ దొంగరి పట్టియంగట్టి చెన్ను మిగులం గై సేసిన. కుమార సం. 9. 224.

సురంగము సం. వి. అ. పుం. 1. మంచి రంగు, 2. నారింజ (వృ. వి.) 3. సొరంగము. కన్నము.

సీ. ఎరుటి సురంగంబు లెఱిఁగి యాచాయఁగాఁ గల్పి చు ప్రతి సురంగములగములు. కువల. 3. 18.

సురంగము సం. వి. అ. న. రక్త చందనము, ఎఱ్ఱ గంధము. 2. సిందూరము, ఇంగిలీకము.

సురంగయుజుక్-(జుండు) సం. వి. క్. పుం. కన్నపు దొంగ.

సురంగిక సం. వి. ఆ. స్త్రీ. మూర్వా వృక్షము. (The MURVA Plant)

సురంజనము సం. వి. అ. పుం. పోకచెట్టు.

సురంటి వి. సురఁటి. వీవన.

ఉ. కప్పురంపున్ తఱంబునఁ బొగల్ జలియించి సురంటి గాడ్పుచే. కవిరాజ. 3. 108.

సురంటి వి. సురఁటి. విసనకఱ్ఱ.

మ. నిను పొరఁగపుర ఫు లేఁబొండి సురంటి గాడ్పు ఓమంపు వె ,ఁను గైకో గమకి బఁ ప్రాణసఖు డాడన్ దెల్ల మయ్యెన్ జమీ. చంద్రాంగ 4 :67.

మ. ఒకనాఁ డి బ్రేఁడు వైజయంత మణిరాధో ద్రగ్రభాగంబునన్, సకియల్ కొందఱు కుంచెగిండి సురఁటీ సామ్రాణి ... పూని కొల్వగ ... దశా. 4. 18.

సురఁగ(సం. సురంగా) వి. వృక్ష విశేషము, రక్త చందన వృక్షము ? (ఇది తరంగము, తరఁగ వంటిది)

ద్వి. పొరి వశోకంబులు బోకబోదియలు, సురఁగలు బొన్నలుఁ జూతపోతములు. రం. రా. ఉ. కాం. 116. పు 6. పం.

ద్వి. పఱపైన గురువింద పందిరుల్ దాఁటి, సురఁ గల పొరుగున సురుగుచు డాసి, చూతపోతమ్ముల సుదగొమ్మ లెక్కి. నవనాథ. 3 ఆ. 222 పు. 16 పం.

సురఁటి(టీ) వి. 1. వట్రువ విసనకఱ్ఱ.

ద్వి. మరువంపుఁ గొనలఁ నమర్చిన యట్టి, సురఁటి వట్రువ గాలి సుడియంగఁ ద్రిప్పు. హరిశ్చ. పూర్వ 782.

మ....ఘుసృణలవంబుల్ దొలఁగింపఁగా సురఁటిరై రంజిల్లు నిచ్చాగతిన్. పారి. 1. 60.

సీ. వేయి గన్నులు గల వేల్పు తొయ్యలి చేతఁ జా పట్టు చెంబట్టు సురఁటి యనఁగ. విక్ర. 6. 67.

2. మల్ల విద్యా విశేషము.

వ. మొగ్గ వ్రాలుటలును సురఁటి పల్లటి మొదలగు లాగు వరుసలును. మల్లు పురా 8 69.

3 పారావత విశేషము, పారావతము.

సీ. ... ... నేల, పల్లటి యంతర పల్లటి సురఁటి లకోరి బట్టి యొడ్డికూకి బకదారి, దూరబారు లనంగ శారికాఖ్య ... ఆం. భా. 2. 68.

4. గళరవము.

వెలయుఁ జామర గళరుతములు సురఁటన. ఆం. షద. నానా. 72. ప్రా.

సురఁటితానము వి (సురఁటి, విసన కఱ్ఱయే పట్టుకగ గలది, గాలి.

ఇట్లే సురఁటి వీవుల పట్టు. ఆం. సం. దేవ. 22 వ్రా.

సురకరువలి వి. సుడిగాలి.

వ. ... తమ తమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్న వని సురకరువలి చేతం బ్రేరితంబు లయి కలిసిన ఆది. 3. 134.

సురకాని వి. కానిలో నాలుగవ భాగము

కం. హరి యుత్తర భాగంబునఁ బురుషుఁడు దాఁ బాపమైనఁ బుణ్యం బైనన్, సురకాని యెత్తు చేసిన బరిణతిమై మేరుకుధర భారముఁ బూవున్. పాండు. 4. ఆ.

సురకారువు సం. వి. ఉ. పుం. విశ్వకర్మ.

సురకార్ముకము సం. వి అ. న. ఇంద్రధనుస్సు

సురకోలి వి. ఒకదినుసు ఫిరంగి.

సురక్తకము సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱనుద్ద 2 చూత వృక్ష విశేషము. (వృ. వి.)

సురక్రోవి వి. ఒకవిధమైన ఫిరంగి. అ. భా. 2. 218.

సురగజ్జెలు వి. బ. చిఱుమువ్వలు. ఒక విధమగు గజ్జెలు.

సీ. ధ్రువమండలము కులపర్వతంబులు బలసి తద్దయు రమ్య మగుసురగజ్జలవగిది గాఁగ .... కుమా. సం. 8. 22. వ్రా.

సురగవి సం. వి. ఈ. స్త్రీ. కామధేనువు, వేల్పుటావు

సురగాడ్పు వి. సుడిగాలి.

చం....మబ్బు స్రోవకుం బలుపుగఁ గ్రమ్మి దుమ్మొగసి పాటి వడిన్ సురగాడ్పు పెంపుపున్. అ. రా. కిష్కింధా. 80.

చం....అ, త్తటి సురగాలి సుళ్ళుగతిఁ దార్కొని మించె ధరాతలంబునన్. చంద్రాంగ. 2. 28. వ్రా.

సురగాలి వి. 1. సుడిగాలి.

సీ. సురగాలి తిరువుల సురుఁగదే యీ తన్వి యచలంబులై చన్ను లమరకున్న. హరిశ్చ. వల. 3. 85.

వేటకుక్క కియఁబడిన పేరు.

ఉ. బెబ్బులికూన దానవుఁడు భీముఁడు గామిడి గట్టిగట్టి వా,గబ్బిర రాతితాతి సురగాలి గయాళి వయాళి పట్టెసెం, దుబ్బిసింగిణి మిసిని. రాజ వాహన. 3. 54.

సురజఃఫలము సం వి. అ. పుం. జీడిమామిడి చెట్టు. (వృ. వి.)

సురజ్యేష్ఠుఁడు సం. వి అ. పుం. బ్రహ్మ. వేలుపుఁబెద్ద.

సురటి సం. వి. ఈ. స్త్రీ. రాగవిశేషము.

సురతము సం. విశే. అ. అ అ. 1. చక్కగా క్రీడింపఁ బడినది. 2. ఖేలనశీలము గలది. 3. బాగుగా అనుభ వింపఁబడినది. 4. దయగలది, మృదువు.

సురతము సం. వి. అ. న. 1. ఆనందము. 2 మిథున క్రియ.

సురతాణి విశే. మేలైనది.

రగడ. భాకచూపట్టు సురతాణి పింగాణీలు. కళలు దేరు పిరఁగి కత్తులు జూరీలు. హంస. 5. 856.

సురతాణి వి. = సురధాణి, సురధాణ, వి. రాణి, స్వతంత్రురాలు.

గీ. రేయి సురతాణి జగ మావరింపఁదలచి, పొలుచు నిరులను బలురికిబులను బనిచి, కొలల నెత్తిన సున్నంపుగుండ లనఁగ, జాలగనుపట్టెఁ దారకానముదయంబు. విప్ర. 3. 28.

గీ. మేటి రతులకు సురతాణిమించుబోఁడి. దాని కెనయైనదాన జగానఁ గాన. క్రీడా. 1. 50.

2. చక్రవర్తి, రాజు, సామంతరాజు.

కం. ఈ రీతిం గెందలియల కోరిసురతాణి గాఁకఁ గూర్చుఁజకోరిమత్తమ, యూరీరవములకు నులికి యుగ్మలి మదిలోన్. చంద్రాంగ. 4. 179.

సురతాణిలగ్గ వి. నలుమూలలను డి లగ్గపట్టుట.

సీ ... లగ్గనా సురతాణిలగ్గ యనఁగఁ, బాపాణ దార్వగ్ని భాండాదికాభిన, లగ్గరిం పనఁగఁ దెలంగు.... ఆం. భా. 2. 219. వ్రా

కం. మనుజేంద్రుఁ డంత సేనల, బనుపుచు సురతాణి లగ్గఁబట్టించిన న,ద్దనుజపతి పిరధర్మం,బునఁ బెగు వకు బొచ్చియెసర ముదిరిన కిమ్ముకన్. కువల 3.12.

సురతాణిసలాము వి. నమస్కారభేదము.

వ. వారి క్షేత్రమందలి సాలగ్రామస్వామి సురతాణి సలాము, అయోధ్యయందలి రఘూద్వహునకు దోయిలి. ప్రబం. 1 850.

సురతాని వి. వాద్యవిశేషము. (ఒక విధమగు వీణ)

సురతాళి సం. వి. ఈ. స్త్రీ. 1. చేటిక. 2. కార్యకర్త. 3. శేఖరము, శిరోమాలిక.

సురతి సం. వి. ఇ. స్త్రీ. 1. సుఖానుభవము. 2. సంతృప్తి.

సురతోషకము సం. వి. అ. పుం. కౌస్తుభరత్నము.

సురదన సం. వి. అ. స్త్రీ. మంచిదంతములు గల స్త్రీ.

సురదీర్ఘిక సం. వి. అ. స్త్రీ. ఆకాశగంగ.

సురదుందుభి సం. వి. ఈ. స్త్రీ. తులసి. (వృ. వి.)

సురద్విషుఁడు సం. వి. ష్. పుం. అసురుఁడు, వేల్పుదాయ.

సురధాణ = సురిధాణి. పార. 1. 22. ప్రా.

సురధాణి = సుఁధాణ, తురకదొర. వి. (హి. సుల్తాన్) చక్రవర్తి.

సీ. గజపతి సురధాణి గడిదుర్గముల కెల్లనే రాజు వజ్రంపుబోరు తలుపు. ప్రబోధచం. 1. 16.

సురధాని = సురిధాణి. వి.

కం. సురధాని యేల రక్కసి, సురధానీలీల నముచిసూదనముఖ్యుల్, దరిదాపెఱుఁగక మేరువు, దరిదాపునఁ గూడి మిగుల దహతహపడుచున్. దశా. 4. 122.

సురనిమ్నగ సం. వి. అ. స్త్రీ. ఆకాశగంగ.

సురపతి సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

సురపొది వి. ఒకానొక చెట్టు. కాకాంగము.(వృ వి.)

సురపున్నాగము చూ. సురపొన్న.

సురపొన్న వి. (సం. సురపున్నాగః) సురపున్నాగము, సుమేరువృక్షము. (వృ. వి.)

గీ. వనమున సురపొన్నఁ గనుగొన్న నవ్వదెవుడు పొగడఁడ ఱక్కిటిమధువున బ్రోదిసేయ దిందుముఖ దోహదక్రీడ కిడ విడిచె వలరువిలుకాని ములుకుల కాత్మ మలికి. విక్ర. 1. 133.

సీ. వాడువ సురపొన్నవారిజమును బొన్న నెల్లి మూలుగ విల్లునెమిలి యడుగు. హంస. 4 11.

సీ. తోడి కన్నెలుఁ దానుఁ గూడి మాడి చరించు సుఁపొన్ననీడలఁ జూచి చూచి. రాజశే 2. 25.

వ. మదనరావ విముక్తంబులై మొదలం గ్రోలిన భవళరిఃభస్మాంగరాగంబు వరాగ వ్యాజంబున వెదలం గ్రాయుచున్న సురపొన్నలు. కృ. నై. 1 95.

చం కవఁ దిలకంబుఁ గేసరముఁ గల్గుమియన్ రహిఁ కాడఁ ప్రేంకనం, బునిమురమావి నవ్వ సురపొన్న సుఖాంబుజ మెత్తఁ జంపకఁ,బు నెటిగ వుంగిలం గొరవి మూర్కొన వావిలి దన్న వంజుళం,బు నుడువ గోఁగునై తరుణి పూచు సురద్రుమ మన్నిపువ్వులన్. పారి. 4. 9.

సురభి సం. విణ. అ. ఈ. అ. 1. మంచి వాసన గలది 2. మనోజ్ఞమైనది.

సురభి సం. వి. ఇ. స్త్రీ. 1. కామధేనువు. 2. ఆవు. 3. అందుగు. (వృ. వి.) 4. మురయనెడు గంధద్రవ్యము. 5. తులసి. 6. మల్లె. 7. సువాసన గల చెట్టు. 8. మద్యము. 9. భూమి. 10. ఆవు. 11. సప్తమాతృకలలో నొకటి. 12. తూర్పుదిక్కు. 13. సీమసాంబ్రాణి చెట్టు. (వృ. వి.)

సురభి సం. వి. అ. న. 1. బంగారు. 2 వాసన గల కలువ. 3. గంధకము.

సురభి సం. వి. అ. పుం. 1. వసంతఋతువు. 2. చైత్రమాసము. 3. సంపెంగ. (వృ వి.) 4. జాజికాయ. 5. సుగంధము. 6. సాలవృక్షపు బంక. 7. జమ్మి. (వృ. వి.) 8. కదంబము. (వృ. వి.) 9. సువాసనగల ఒక దినుసు గడ్డి. 10. వకుళము (వృ. వి.).

సురభిసాయకుఁడు సం. వి మన్మథుఁడు

తే.....ఆ కుమార. హంసమలకేళి కాననాభ్యంతరమున, సురభిసాయక సాయకజ్వరితుఁడగుచు. చంద్రాంగ. 4. 94.

సురభిక సం. వి. అ. స్త్రీ. ఒక దినుసు అరటి.

సురభితము సం. విణ. అ. అ. అ. 1. సువాసనగలది,

2. సుగంధిఫలము.

**సురభిత్రిఫలి** సం. వి. ఈ. స్త్రీ. 1. జాజికాయ. 2. లవంగము. 3. పోకచెక్క.

**సురభిత్వక్కు** సం. వి. చ్. స్త్రీ. పెద్ద యేలకి.

**సురభిదారువు** సం. వి. ఉ. పుం. సాలవృక్షము. (వృ. వి.)

**సురభిళము** సం. విశే. అ. ఆ. అ. మంచివాసన గలది.

సీ. నిశ్వాససురభిళానిలముల సంపద సరసవసంతర్తుసరణిఁ జేయ. కవి. 3. ఆ.

**సురభీకరించు** సం. స. క్రి. పరిమళింపఁజేయు.

మ. క్రమపాకంబునఁ గెంపుతోడివబు పెక్కన్ మిక్కుటంబైన గంధము దిక్కుల్ సురభీకరింపరస మంతర్గామి యయ్యెన్. హరి. పూ. 7. 77.

**సురయాయి** విశే. మిక్కిలి చల్లనిది.

సీ. పడగలు తడఁబడఁ దొడరుభోగుల గెల్చి సురమాయి జల్లులఁ గాంచె భామ. 4. ఆ.
(దీనికి వృత్తియందు వికల్పముగా అంత్యవర్ణలోపము.)

చం. చటులతఁ గాంధులం గెలువఁజాలిన కంబరదైత్యభేదికిన్, జటువగు తెక్కు జోడు సురమా జగజల్లుల మేటిరౌతు బం,ట్లను కలకంఠముల్ మనకు కావళి వచ్చుని ఢాలు పావురాలచె వన వాటిలోవ జలజానన యే గతిడాఁగ వచ్చితే. భామ. అ. 3.

**సురమాలి** విశే. గాలి నించినది. (చూ. జాలీసు). శ. ర.

**సురర్షి** సం. వి. అ. పుం. దేవ ఋషి.

**సురలాసిక** సం. వి. అ. స్త్రీ పిల్లనగ్రోవి.

**సురలోకము** సం. వి. అ. పుం. స్వర్గము, వేల్పుప్రోలు.

**సురవన్నెలు** వి. బ. వస్త్ర విశేషము.

వ. ముయ్యంచులును వెంటపాళ్ళును నిండువన్నెలును సురవన్నెలును పుప్పొడి వన్నెలును. ద్వా. 3. 206.

**సురవర్త్మము** సం. వి. న్. న. ఆకాశము, వేల్పుఁ దెరువు.

**సురవల్లిక** సం. వి. అ. స్త్రీ. తెల్ల గఱిక.

**సురవల్లి** సం వి. ఈ. స్త్రీ తులసి (వృ. వి.)

**సురస** సం. వి. అ. స్త్రీ. 1. సింధువారము (వృ. వి.) 2. దుర్గాదేవి. 3. తులసి (వృ. వి.) 4. నాగమాత.

**సురసము** సం. విశే. (అ. ఆ. అ.) 1. స్వాదువు. రసభరితము. 2 మధురము. 3. సుందరము.

**సురసము** సం. వి. అ. న. 1. తులసి. 2. గోపరసము (ఒక దినుసు బంక) 3. పరిమళము గల గడ్డి. 4. నల్ల గగ్గెర (వృ. వి.)

**సురసుందరి** సం. వి. ఈ స్త్రీ 1. దేవతా స్త్రీ. 2. దుర్గాదేవి.

**సురసుర** వి. స్రుక్కుట యందలి యనుకరణము.

చం. ...గొజ్జెఁగ తూపుచేత వ్రచ్చెవుగఁ గొంచి కంటికి వినింపనివాఁ టవుదేసి యార్చెఁ డో, సురసురసుక్కు మెత్తనగుచోటనె గ్రుద్దలి వాఁడియౌఁ గదా. సారంగ. 3. 33.

కం. చెరవుగ నాకటి పెల్లున సురసుర సుక్కెదరు మన శిశువులం జూడన్, దురితము దారిద్ర్యంబులఁ బోఁ యక మనుచున్న వారె పుణ్యులు జగతిన్. (ఇచట తీవ్రముగా నని యర్థము). కుచేల. 1. 49.

2. కాలుటయం దనుకరణము.

మ. ప్రతి బాణ ప్రకరంబులన్ నిజముఖ ప్రాదుర్భవద్దుర్భరా, ద్భుతకీలా పటలాహుతిన్ సురసురం బోఁ బెట్టుచుం జావకి, పతి బాణంబులు ముంచె నేని శలభప్రాయుండవు. రామా. 6. 163.

ద్వి. కుటుచముటల జీబుకొని యన్నకసవు, చేజచుటఁ గమరంగ సురసుర పుట్టి. హాంశ్ప పూ. 2232.

**సురస్థానము** సం. వి. అ. న. దేవాలయము.

**సురాకారము** సం. వి. అ. పుం. సారాయపు బట్టీ. కొబ్బరిచెట్టు.

**సురాచార్యుఁడు** సం. వి. అ. పుం. బృహస్పతి, వేల్పుటొజ్జ.

శార్దూలదృష్టిఁ బైఁబడిన సురియశాంబ్ర వంత మిదియె. ద్వా. 7. 47.

సురియాళు(వు) వి. మాలవాడు. ఆం. భా. 2. 289 వ్రా.

సీ. తే. గీ.... వచ్చు సేవించు సురియాళు వైష్ణ వుండు.... ఆము. 9. 9.

"ఆళు" అన్నది అరవపదము అని శబ్దరత్నాకరము.

సురిపట్టము వి. సూరతుదేశ సంబంధమైన పట్టు సేలువు.

కం. అట్టియెడఁ బెండ్లిపనులన్, రిట్టలగు పురంధ్రులచట నిలిపిరి వహ్నిన్, బెట్టిరి మణిపీఠిసురి, పట్టముపైఁ బఱచి రందుఁ బతియున్ సతియున్. మను. 5. 89.

సురుంగా నం. వి. ఆ. స్త్రీ. సురంగము, రంధ్రము.

సురుఁగంబడు అ. క్రి. అదృశ్యము. (రూ. సురుఁగఁబడు.)

చం. చిదియవు కొండపైబడినఁ జీమ చిటుక్కనినం గరంబులుం, బదములు దోఁకయుం దలయు బల్యగు పూన్కివడం డొకింతయున్, గదలక నిల్చియుయ్య సురుఁగంబడ పోవఁగ చేస్తుబాగుమై, మదకములోని కట్టిలెఱుఁ గున్నదియే పెరసత్త్వకోటికిన్. హరి. ఉ. 5. 20.

సురుఁగు అ. క్రి. 1. అదృశ్యమగు, కనబడకపోవు.

ఉ.... వరాహము కడంకవదర్శితమయ్యె నయ్యెడన్.

ఉ.... పంది సురింగిపోయిన వృషాలతమూలఁడు చిన్నవోయి (మొఱింగిపోయిన అని. శ. ర. పా.) విక్ర. 8. 77.

కం. వచ్చి తపోవిఘ్నమునకుఁ, జొచ్చినఁగాకున్న మగుడి సురిఁగిరి యంతన్, జిచ్చెగనె బ్రహ్మవాదిని, యచ్చెరుతెరువునకు వెరచి రసురులు సురలున్. శేష. 1. 90.

2. మరలు, పరాఙ్ముఖమగు.

చం. తిరుగని మందరాద్రికళడియని పూర్ణశశాంకుడాజులన్, సురఁగని పార్థుఁడీకు కనుపోఁకని మన్మథుఁ డొక్కఁడొంకునుం బోరయని ధర్మమూతి యుడివోవని కల్పమహీరుహంబవన్, వరగుణధాముఁడైన పెదవల్లభ భూవరుఁడొప్పు నెంతయున్. వంచ నా. 1. 30.

కం. పెరిగిన చీఁకటి తమి గని, సురిగి యరిగి వరుణునగరుఁ జొచ్చినదానిన్, మెరిగిన వెంబడిఁ దానును, వరిగిన క్రియ నినుఁడు గ్రుంకె నపరాంబుధిలోన్. వై జ. 2. 62.

3. తప్పించుకొను.

వ. అన్నాతి యల్లన సురిఁగి ధేనుకాశ్రమంబున కరిగి. భార. శాం. 5. 207.

చం. సురిఁగెదు వారి గొందులకుఁ జొచ్చుచు దాఁగెదు వారి మద్దశాతురమునబాలు వారివని దూఁపము లేగినవారిఁ గ్రంతలం, దిరిగెదు వారి మాటుకొని క్రమ్మరు వారిని బట్టి కీశులు,ద్దరగతి మంటలోవలను ద్రోతురు విక్రమ దుర్నివారులై. భా. రా. యుద్ధ. 1154.

చం.... వీ, వెరపున నింక మా బుణము వేగమె తీర్చెదొకాక మిన్నకే. సురిఁగెదవో వివేక గుణశూన్యతఁ బొంది యసత్యవాదివై. హరిశ్చం. 4. 28.

కం. తిరుగరు పలు కర్థులకును, సురుఁగరు ధనమిత్తు రితర సుదతీమణులన్, మరుగరు.... భాగ. 10. స్కం. పూర్వ. 1604.

తే. గీ. వను యాతుధానుఁడనైన నితరజనుఁడ, నైన వెఱిఁగి నివారింతురవుడు నన్ను, గాలికైన రక్కసులకుఁ గానఁబడక. మరిఁగి యీ పుర ద్వారము పొరఁగరాదు. భా. రా. సుంద. 69.

ద్వి. తిరుగునే ముట్టిన ధీరుండు గలన, మురుగునే ముట్టినమూరుఁ డెవ్వలన. పండి తా. పురాతన. 90.

4. తప్పించుకొనిపోవు.

ద్వి. తమ్ము మోచినచోటఁ దగవట్టి పెట్టి, మిన్నక సురిఁగిన మెత్తురే జనులు. హరిశ్చ. ఉత్త. 2. 488.

తే. గీ. కపటములు వన్ని యిపుడు వన్నన్ను మొఱఁగి. మరుఁగఁ జూచెద వేమఱఁజుమ్ము నిమ్ముఁ, గనికరము మానసంబునఁ గదియనీక, దాపిగాఁ జేసి యేలుదువాని యుడిపి. హరిశ్చ. 4. 151.

ద్వి. సురఁగక వంటయిల్ సొచ్చిన శశము౽ గరు
ణసేయక కూరగా వండఁదగునె హరిశ్చం. పూర్వ.
1293.

5. విభ్రమించు, తొలఁగు.

సీ. నెమ్మి యేమయ్యెనో నే దాట గలవక
యరుగు దెంచితి వని సురిగె నొకతె. యయా. 5.
22.

గీ. అని గిఱుక్కునఁ యయ్యమరనాథ, పుత్త్రిఁ
దండటి నిండ్లకుఁ బోవఁ బనిచి, సురఁగ దురదుర
నా యింటి కరుగుదెంచి, యేమి చెప్పుదుఁ బొద
రింటి కేఁగుదెంచె. కువల. 5. 58.

6. దాఁగు.

చం. తరులు గిరుల్ నదుల్ సురలు దైత్యులు
పతులు లోనుగాఁ బరా, చరతతి చూడఁ బొడ
వవనన్నత నెందడగెం దముంబు నిర్భర మయి
యిమ్మెయిం బొదల భావ్యం చంద్ర విలాస
మెచ్చుటన్, సురిఁగె మహాబలం బఖిల కూవ్యతఁ
చేర్చుట యేమి చందమో! హరి. ఉ. 9. 95.

సీ. చందురు నిట్టితో సమరంబునకు నేఁగువగిదిఁ
గుప్పించి యుప్పరం మెగయును, సురిఁగిపోయెన
వన్నఁ జొఁ జోటులే దిక, నీవె దిక్కను.గి
నెదురువచ్చు భార. అర. 2. 53.

సీ. ఏ దెస వచ్చునో యిది యని పలుమాఱు,
సురుఁగుచుఁ గ్రిగంటఁ జూచువాని. భాగ. 10.
స్కం. 378.

చం. .... అల ఘోషయాత్రలోఁ గురుపతి డించి
క్రీడికృపకుం దగు పాత్రము సేసి యెక్కడన్.
సురిఁగితి చెప్పుమా నిజము సూతతనూభవ వాకు
చేర్పడన్. భార. కర్ణ. 2. 83.

ద్వి. వరుసత్రొక్కు నీఁబడి పడఁజాలలేక నిరిగిరి
మంతఁగ సురుఁగ వచ్చితివా. బస. పురా. 62 పే.
18 పం.

7. పాఱిపోవు.

వ. విఱిగి సురుఁగు వారును క్రేఁగి తోఁగువారును
గుంది కుందువారును వ్రాలి కూలువారును వెఱచి
పఱచువారును నై పలుదొసఁగుల నెసంగుచుండి
రప్పుడు. అ. రా. యుద్ధ 364.

తే. సురిఁగి భయమున గొంగులు సొచ్చువారు,
నెగిచి పరతేర నందుల కేఁగువారు. భా. రా.
యుద్ధ. 1845.

చం. అరుదుగఁ దమ్మభూవిభుని యన్నను దాడికి
నోడి శాత్రవుల్, దిరుగని డొంకలుం బడని తెక్కలి
బెంకులు పాదచారులై, యరుగనికానలుం జొరని
యీాఱమి కోనలు భీతచిత్తులై, సురుగని త్రోవలు
న్నిలువఁజూడని క్రేవలు లేవు భూస్థలిన్. వి పు.
1. 44.

తే ఓలిగట్టినయట్లకు మఱికి వెద్ద,బానలం దున్న
వెన్నలు కావుకొనుచు, నుట్టులను వ్రచ్చిబానల
మరలద్రోచి, సురుఁగుఁ జెలికాండ్ర కెల్లను జూఱ
విడిచి హరి. పూర్వ 5 205.

8 చొచ్చు, ప్రవేశించు.

కం. కరవాల భైరవునిచే నరుగుదు రరు లక్కమం
డలాకారములో, సురిఁగి యన నధికపదమగు,
నరయఁగ నాకార శబ్ద మధికం బగుటన్. కావ్యా.
6. ఉల్లా 109.

9. మృతి పొందు.

చం తుఁగము చన్న మార్గమును, దూకొను
వృషము కొమ్ము మాలవాఁ, డంసిన చేను వాని
మఠ యన్నము పెట్టినతావు, దానిఁ జెచ్చెర వరి
యించి కాపురము సేసిన యిల్లును నాలుబిడ్డలున్,
సురిగినచోటు దాను సొద చొచ్చిన భూమియుఁ
జూచెఁ దెల్లగన్. వాసిష్ఠ. 2. 255.

ఆ. వె. అప్పు పుచ్చుకొన్న యతఁ డిచ్చిన నరుండు,
సొమ్ము దెగకమున్న సురిఁగిరేని, వడ్డి చెల్లకున్న
వర్తింతురే రీతి,నందు నిందుఁ దెలుపుమయ్య తాత.
శేష. 3. 241.

10. తగ్గు, నశించు.

సీ. శ్రుతి పుటంబుల శక్తి సురిఁగిపోవకమున్న, వళు
లాననమునఁ బర్వకయమున్న. కాశీ. 3. 84.

11. భగ్నమగు, విఱుఁగు.

వ. భుజావష్టంభంబున విజృంభించిన మరలు మాతం
గంబులును సురుఁగు రథంబులును దిరుగు పదా

తులు నై తమసైన్యంబు దైన్యంబు వహించిన. వరాహ. 5. 25.

12. వాడు, మ్లానమగు,

సీ. అంగజ నీ లోచనారవిందములు సురిఁగి యున్నవి గాని సొంపులేదు. వీర. 2. 63.

కం. పరభూమి ప్రజయుఁ జేరుమ, తిరముగ ధర యేలు రాజు దేశంబునకున్, సురుగుదు రెవ్వటి ప్రజలును, నరపతి న్యాయంబు దప్పి నడచిన యేనిన్. రుక్మాం. 2. 26.

13. వెనుదీయు.

ద్వి. మరగి చొచ్చినయట్లు మత్తపోవనము సురుఁగక చొచ్చి కానుగ నన్నుఁ గొనక. హరిశ్చ. పూర్వ. 1198.

14. బాధపడు.

సీ. నురగాలి తిరువుల సురుఁగదే యాతన్వి యచలంబులై చన్ను లమరకున్న. హవ. 3.

సురుగాడ్పు వి. సుడిగాలి.

ఎ. గీ. దొనఁగు లెనగించే సురగాడ్పు తుటుము ధాడి, కదలి తద్దయు గడగడ వడఁకుగాని, వేల్పు రాకన్నెఁ గాంచి రా వెలఁదు లపుడు. రసి. 4.47.

సురుఁగుడు వి. ఒకానొక యెఱ్ఱచాయ చెక్క చెట్టు, సురుగుదు చెట్టు,

సీ. జువ్వి మామిడి జీడి సురుగుదు మొలుగు పావట చంద్ర వనిక పాలరేల. వెం. పంచతం. 4. 471.

ద్వి. సురుగుశ్యమారేళ్ళ జాతపోతములను, గురు వకంబులఁ గేఁదగుల వశోకముల. హరిశ్చ. పూర్వ. 725.

సురుఁడు వి. దివిటీకి మాఱుగా కాల్చి పట్టుకొనెడు వెలుతురు కట్టెలకట్ట. ఆ. భా. (శ. ర.).

సురుమా-సుర్మా (ఉర్దూ. సుర్మా) కాటుక. చంద్ర. 2. 131.

సురుమాయి వి. కాటుక.

సీ. వడగల తొడిఁబడఁదొడరు భోగులగెల్చి సురు మాయి జల్లుల సొబఁగుఁ గాంచె,మద్దండగతి విల్లు మత్పలంబుల గెల్చి యతనుధ్వజశ్రీల వందుకొని యె, బాణాసనపదాబ్జాగ్ర తూణీరముల గెల్చియుదు కాహళుల విన్నాణము మెఱసె, గ.ధోత్కటంబులై కదియ గుత్తుల గెల్చి ఘనవాద్య కుంభలాం ఛనముఁ గాంచె, తిరిత దశమెత్తు పోకబోదెల హసించి, విజయ మంగళ శంఖాంక విఖ్యాతి గాంచె, వటల వేనలి నతిచూపు నతినఖంపు. కలికి చనుదోయి తొలి వాగ కంధరమును. భాను. 4. 15,

చం. చటులతఁ బాంథులన్ గెలువఁజాలిన శంబర దైత్య భేదికిం బటువగు తెక్కటీలు సురుమాయి గజల్లుల మేటి రాతు బంట్లఁట కలకంఠముల్ మదకుకావళి వచ్చనిడాలు పావురాలఁట వనవాటి లోన బలజావన యేగతి డాఁగ వచ్చితే. భానుమ. 3. 14.

సురుము వి. చూర్ణము, పొడి.

సురూపము నం విశ (అ. అ. అ.) 1. సుందరము. 2. విజ్ఞము, తెలివిగలది.

సురూపుఁడు నం. వి. అ. పుం. శివుడు.

సురూపుఁడు నం. వి. అ. పుం. చక్కనివాఁడు విద్వాంసుఁడు.

సురె నై. వి. (ప్రాకృ. ఛురికా) రూ. సురియ, కత్తి.

ద్వి. వెలువడియై సురె వెఱికి ప్రాణమున కొర గోపినట్టుల నొకదెసఁ జేర్చి. బస. పురా. 186 పు. 16 పం.

సీ. గాటంపునూఁగారు ఘనకృపాణము గాఁగ పోక ప్రొంటెలి గోళ్ళు సురెలు గాఁగ. రసిక. 5. 176.

సీ. జాతి నీలపుఁ దాళి చాకచక్య ప్రభల్ కస్తూరి వెలిపూఁతఁ గుస్తరింపఁ, పొగను మూర్ఛ వట్టంపు సురెనాలుమై తళుకు హొంబట్టు దట్టపై హొలసింప. సారంగ. 1. 79.

కం. విరసమునఁ గొట్టునతి నా, సరిగరితలలోన ప్రతుకు నైతునె నే, సురెఁబోదు ప్రాటఁ బోదున్. వెం. పంచతం. 4. 480.

తే. ... సాయకములు మరువ కేమ గల్గి గ్రేదఁగి సురె యొక్కుడయ్యె. అము. 4. 114.

సీ. కరవాడి చికురాళి సురెకత్తితే నొత్తి మగల ఘూనము గొను ఘూనటేఁడ. షుదక్షి. 5.59.

సురెయాకు వి రూ. సురియాకు.

సురేకారము వి. ఒక దినుసు ఉప్పు.

సురేభము సం. విశే. (అ. ఆ. అ.) మంచి కంఠ స్వరము గలది.

సురేభము సం. వి. అ. న. తగరము.

సురేష్టము సం. వి. అ. పుం. సాలవృక్షము (వ్య. వి.).

సురోత్తరము సం. వి. అ. పుం. చందనము.

సురోదము సం. వి. అ. పుం. కల్లు సముద్రము.

సుఱసుఱ వి. ముక్కుటయందగు ననుకరణము.

చి.....సుఱసుఱం దుదసుక్కుగ ముక్కెవోయనన్. ఆము. 5. 128.

సుఱ్ఱు వి. ముక్కుటయందగు ననుకరణము.

సీ. సుళ్ళన్ని గలిగిన సుఱ్ఱున ముక్కక యను వయ్యుఁ బరులకు దలపుగాక, తనలోని బడబాగ్ని దరికొన మండియు పడగాలి మీలనై సుడియనీక. శ్యా. 2. 160.

చం. వెలుఁగుల తేని వేవెలుఁగు వేడిమి సుఱ్ఱున ముక్కు వావగా, కలశనమున నిమ్మదుల కాయము లన్. చంద్రాంగ. 2. 52.

సులక్షణము సం. విశే. (అ. ఆ. అ.) 1. శుభ లక్షణములు గలది 2. అదృష్టము గలది.

సులక్షణము సం. వి. అ. న. 1. పరిశీలనము, పరీక్ష, నిర్ణయము. 2. మంచిలక్షణము లేక చిహ్నము,

సులతాను హిం. వి. తురుష్క ప్రభువు.

చం. జవజితవైనతేయములు వాహనము ల్బల కాను చూడ్కికిన్, దవిలిచె నత్తరిన్ మదము ధారిత రేచిత వల్గితప్లుత, ప్లవన పులాయితాది గతులన్. రంగా. 3. 18.

సులభకోపము సం. విశే (అ. ఆ. అ.). శీఘ్రముగాఁ గోపించునది, చిరాకు గలది.

సులభము సం. విశే. (అ. ఆ. అ.) 1. సుఖముగా లభించునది. 2. తేలికగాఁ జేయఁదగినది. 3. యోగ్యమైనది, సిద్ధమైనది. 4. సహజము. స్వాభావికము.

సులభము సం. వి. అ. పుం. సులువు, అల్పయత్నము.

కం. సుఃఖమునఁ దీర్పవనికై, బలువగుయత్నంబు సేయఁ బరిచూచిన యేములు ముంటఁ దివియ కడిదము, జళిపించిన యట్టిచేల చందము వచ్చునన్. కవి. 2. 48.

సులువు వి.

గీ. అన్నియును జోచుచుండెన నఁతో యింతో, యంతచను మానమునకు రా నింతెకాని, నేను బట్టెద వన్నచో నౌనె ధనము, తులిచివప్పుడు తెలియ నా సులువు తెల్ల.

విశే. సులకనైనది

సులోచన సం. వి. అ. స్త్రీ. 1. అందమైన. కన్నులు గల స్త్రీ. 2. ఇంద్రజిత్తు భార్య పేరు.

సులోచనము సం. విశే. (అ. ఆ. అ.) అందమైన కన్నులు గలది.

సులోచనము సం. వి. అ. పుం. లేడి

సులోహకము సం. వి. అ. న. ఇత్తడి.

సులోహిత సం. వి. అ. స్త్రీ. అగ్నిదేవుని సప్త జిహ్వలలో నొకటి.

సులోహితము సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి యెఱ్ఱనైనది.

సుల్తాను వి. ఒకానొక తురక పేరు.

కం. సిరిగుబ్బ చన్నుగొండల, దరులం గటిమొగుల వగిదిఁ దవిలి తిరుగు న.మ్మరు తంద్రి మనువు వనముల, నెఱయఁ నమీన్ భావ సింగిణీ సుల్తానా. యయా. 3. 1.

సువక్త్రము సం. వి అ. న. 1. మంచి ముఖము లేక నోరు. 2. సుష్ఠూచ్చారణము

సువక్త్రుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సువచనము సం. వి. అ. న. మంచిమాట. 2. వాగ్ధాటి.

సువచస్సు సం. వి. స్. న. చూ. సువచనము.

సువదన సం. వి. అ. స్త్రీ. అందమైన ముఖము గల స్త్రీ.

సువర్చకము సం. వి అ పుం క్షారము, లవణము.

సువర్చల సం. వి. అ స్త్రీ. నింగిమిరి (వ్య. వి.)

సువర్చలము సం. వి అ. న. అవిసె (వ్య వి.)

సువర్చసుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సువర్చి సం. వి. న్. పుం. సువర్చకము.

సువర్చిక(ము) సం. వి. అ. పుం. అ. స్త్రీ. సువర్చకము.

సువర్ణ సం. వి. ఆ. స్త్రీ. 1 అగ్ని యొక్క సప్త జిహ్వలలో నొకటి. 2. నల్ల కలబంద (వృ. వి.) 3. పసుపు. 4. పటిపుచ్చ. వెఱ్ఱిపుచ్చ. (వృ. వి.)

సువర్ణకము సం. వి. అ. న. 1. ఇత్తడి, కంచు 2. సీసము. 3. బంగారము.

సువర్ణకారుఁడు సం. వి. అ. పుం. కంసాలి.

సువర్ణపుష్పము సం. వి. అ. న. చెంగల్వ.

సువర్ణపుష్పితము సం. విశే. (అ. ఆ. అ.) బంగారము సమృద్ధిగాఁ గలది.

సువర్ణపృష్ఠము సం. విశే. (అ. ఆ. అ.) బంగారు పూత గలది. బంగారు నీరూరినది.

సువర్ణబిందువు సం. వి. ఉ. పుం. 1. విష్ణువు. 2. శివుని మూర్తివిశేషము.

సువర్ణము సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచి రంగు గల. 2. మంచి కులమునకుఁ జెందిన. 3. మంచి కీర్తి గల.

సువర్ణము సం. వి. అ. పుం. 1. మంచి రంగు. 2. మంచి కులము 3. ఒక యాగము. 4. ఉమ్మెత్తకాయ.

సువర్ణము సం. వి. అ. న. 1. బంగారము. 2. బంగారు నాణెము. 3. పదునారు మాషముల యెత్తు బంగారము. 4. ధనము, 5. మంచి గంధపు చెక్క (వృ. వి.) 6. సిందూరము (Red Chalk) 7. నాగకేసరము (వృ. వి.) 8. మంచి వర్ణము గలది. 9. మాడ. 10. ఒక పువ్వు. 11. నల్ల అగరు.

సువర్ణయూథి సం. వి. ఈ. స్త్రీ. పచ్చమల్లె.

సువర్ణరేతుఁడు సం. వి. స్. పుం. శివుడు.

సువర్ణవత్ సం. విశే. (త్. ఈ. త్.) 1. బంగారముతోఁ జేయఁబడినది. 2. బంగారు రంగు గలది. 3. అందమైనది.

సువర్ణవర్ణ సం. వి. ఆ. స్త్రీ పసుపు.

సువర్ణవర్ణుఁడు సం. వి. అ. పుం. విష్ణువు.

సువర్ణాక్షుఁడు సం. వి. అ. పుం. శివుఁడు,

సువశేఁడు వి. శివుఁడు (?)

సీ. తులకించు తన కీర్తి తొవశేని సువశేని కవశేని చకచకచ్ఛవి హసింప. రఘువం. 1. 52.

సువసంతకము సం. వి. అ. పుం. 1. మంచి వసంత ఋతువు. 2. చైత్ర పూర్ణిమ. 3. వసంతోత్సవము. కామోత్సవము.

సువహ సం. వి. ఆ. స్త్రీ. 1. వీణ (Lute). 2. అంమగు (వృ. వి.) 3. కారేంకి (వృ. వి.) 4. చెప్పుతట్టు (వృ. వి.) 5. నల్ల వావిలి (వృ. వి.) 6. సర్పాక్షి (వృ. వి.)

సువహము సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కగా మోయునది. 2. సహనము గలది, ఓర్పునది. 3. తేలికగా మోయదగినది.

సువారము వి. వంట.

ఉ. అక్కన్నియ యిల్లు నిల్చు తెలి గన్నులు ద్రొక్కులు గన్న ఫాలముల్ పెన్నులు చిందవం దలుమ జేరి సువారవుటింటి ముగిటన్ బహు. 3. 4.

కం. వంటయొకించుక చేయుం, డంటన్ విన్నారొ లేదొ యచటి సువారం, బిటి కలకంతు లొగగదె, యంటవె కావించి కీశ్వరాయుతమునకున్. పాంచాలీ. 4. 89.

చం. పొడి మిరియంబుగా వెడలిపోయెడు కొండల నుగ్గు చేసి యె.క్కుడు జలజంతులం బొలసుకూరలు వండి వెసంద చిప్పలం, దుడుకఁగఁ బెట్టి ముత్తియపు టోగిరముల్ కడు గ్రుమ్మరించె న,య్యెడ రఘువీర సాయకము లెక్కడ నేర్చె సువారపుంబనుల్. రామా. 7. 107.

సువాల వి. ఆడువారు పెండ్లిండ్ల యందు సువ్వి యను పదముతో నాలాపము చేసి పాడెడు పాట.

శా. నీ కే వచ్చు సువాలయున్ ధవళమింతే యల్లో వేరేల్పుగా, కీశర్యాణములంచు నింటికడి నే కికిన్ విజృంభింతువే, వాకీలిచ్చుట వంచు నిద్దలు సతుల్

వాక్యోపవాక్యంబులన్, గాకై ముందల పట్లకుం బొడగిరా కళ్యాణ వేది స్థలిన్. పాంచాలీ. 4. 24

సువాళించు స. క్రి. త్రిప్పు.

తే. వింత గాంగ పొకాపొక విలపప బుం, జూప నయ్యింతింగరుం దాను జూడవెఱచి, కడమ పూదండ లెల్ల నొక్కటగం బట్టి, బాలకపుడు సువాళించి పాఱవైచె. (దృష్టి దోషము తీయునపుడు శిఃస్సునకుం జుట్టు త్రిప్పుట యని తోంచెడిది) కళా 7. 68.

సువాసము సం. వి. అ. పుం. 1. మంచి నివాసము. 2. మంచి వాసన.

సువాసిని సం. వి. ఈ. స్త్రీ. 1. భర్త బ్రతికియున్న స్త్రీ, సుమంగళి. 2. కన్య.

సువాసుండు సం. వి. అ. పుం. శివుండు.

సువిత్తు సం. వి. ద్. పుం. 1. పండితుండు. 2. తెలివి గలవాండు. 3. వేర్పరి.

సువిదల్ల సం. వి. అ. స్త్రీ. వివాహిత. పెండ్లి అయిన స్త్రీ.

సువిదల్లము సం. వి. అ. న. అంతఃపురము,

సువిదల్లుండు సం. వి. అ. పుం. (రూ. సౌవిదల్లుండు) అంతఃపురము కావలివాండు.

సువిదితము సం. విణ. (అ. ఆ. అ.) చక్కగా నెఱుంగంబడినది. స్పష్టముగాం దెలిసినది.

సువిచిత్రము సం. వి. అ. న. 1. కుటుంబము, సంసారము. 2 సంపద, ధనము.

సువిదుండు సం. వి. అ. పుం. 1. అంతఃపుర పరిచారకుండు. 2. రాజు.

సువిధానుండు సం. వి. అ. పుం. ప్రధానుండు.

ద్వి. ద్వారపాలుర సువిధానుల వింద్ల వారిం దలారులం వారికయేరి. బస. పురా 3. 512 పం.

సువిహితము సం. విణ. (అ. ఆ.అ.) 1. చక్కంగా నుంచంబడినది. 2. చక్కగా వలంకరింపంబడినది 3. చక్కగా పనుష్ఠింపంబడినది;

సువీ(బీ)జము సం. విణ. (అ. ఆ. అ) మంచి గింజలు గలది,

సువీ(బీ)జము సం. వి. అ. పుం. గసగసాల కాయ.

సువీ(వి)జము సం. వి. అ. న. మంచి గింజ.

సువీ బీ జుండు సం. వి. అ. పుం. శివుండు.

సువీర్య సం. వి. ఆ. స్త్రీ. అడవి ప్రత్తి (వృ. వి.)

సువీర్యము సం. వి. అ. న. 1. గొప్ప పరాక్రమము. శౌర్యము. 2. వీరుల సమూహము (సమృద్ధి) 3. రేగుపండు

సువృత్తము సం. విణ. (అ. ఆ. అ) 1. మంచి ప్రవర్తన గలది 2. మిగుల గుండ్రనైనది.

సువృత్తము సం. వి. అ. న. 1. మంచి నడవడి. 2. మంచి పద్యము.

సువృత్తి సం. వి. ఇ. స్త్రీ. సుగవాం.

సువేలము సం. విణ. (అ. ఆ. అ.) 1. నిశ్చలము, ప్రశాంతము 2 వినీతము, అనుద్ధతము.

సువేలము సం. వి. అ. పుం. త్రికూట పర్వతము.

సువ్వాలు వి. బ. వ. పాటలో విశేషము.

కం. ఆ లలనామణి కాగ, య్యాళి యొకానొక్క వేళ వక్కఱతోను, వ్వాలు నోళిపములు ధవళాలున్ మొదలైన పాటలందగు నేర్పున్. శుక. 1. 484.

సుప్రవత సం. వి. ఆ. స్త్రీ. 1. పతివ్రత. మంచి యిల్లాలు. 2. సాధువైన ఆవు.

సుప్రవతుండు సం. వి. అ. పుం. నియమవంతుడైన విద్యార్థి (A Religious Student)

సువ్వలాల వి. చూ. సువ్వాల.

సువ్వాల వి. ఆడవారు పెండ్లిండ్లలో సువ్వి యను పదముతో ఆలాపము చేసి పాడెడు పాట.

కం. ఆ లలనామణికాగ, య్యాళి యొకానొక్క వేళ వక్కఱతో సువ్వాలలు సోబానలు ధవళాలున్ మొదలైన పాట లాదగ నేర్పున్. శుక. 1 ఆ (శ. ర.)

సువ్వి వి. దంచుట యందగు ధ్వన్యనుకరణము.

సుళకము సం. విణ. (అ. ఆ. అ) సులభముగాం జేయ వీలయినది, సుకరము,

సుశర్ముఁడు సం. వి. ఒకని పేరు. రూ. సుశర్మ.
కం. ఇలఁబడిన సహచరులఁగని.యలిగి సుశర్ముండు దాకె నర్జునున్. భా. భీష్మ. 3. 55.

సుశల్యము సం. వి. అ పుం. ఖదిర వృక్షము. (వృ.వి.)

సుశవి సం. వి. ఈ. స్త్రీ. చూ. సుషవి.

సుశాకము సం. వి. అ. న. అల్లము.

సుశారదుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సుశిక్షితుఁడు సం. విశ. (అ. ఆ. అ.) 1. చక్కగా నేర్పబడినవాఁడు. 2. వినీతుఁడగువాఁడు.

సుశిఖ సం. వి అ. స్త్రీ. 1. నెమలి నెత్తి మీది కుచ్చు. 2. కోడిపుంజు నెత్తి మీది కొండె.

సుశిఖము సం. వి. అ. పుం. అగ్ని.

సుశీతము సం వి. అ. న. పచ్చని చందనము. (శ్రీ చందనము)

సుశీమము సం. విశ. (అ. అ. అ.) మిక్కిలి చల్లనైనది.

సుశీమము సం వి. అ. పుం. చల్లఁదనము.

సుశీల సం వి. ఆ. స్త్రీ. 1. మంచి శీలము గల స్త్రీ. 2. యముని భార్య. 3. కృష్ణుని అష్ట మహిషులలో నొకతె.

సుశీలము సం. విశ. (అ. ఆ. అ.) మంచి గుణము గలది, మంచి నడవడిక గలది.

సుశ్రుతము సం. విశ. (అ. ఆ. అ.) 1. చక్కగా వినఁబడినది 2. వేద విజ్ఞానము గలది.

సుశ్రుతము సం. వి. అ. న. సుశ్రుతాచార్యునిచే రచింపఁబడిన ఆయుర్వేద శాస్త్ర గ్రంథము.

సుశ్లిష్టము సం. విశ. (అ. ఆ. అ.) 1. చక్కగాఁ గూర్పఁబడినది. 2. గుప్తముగా ధరింపఁబడినది.

సుషమ సం. వి ఆ. స్త్రీ మిక్కిలి శోభ.

సుషవి సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక దినుసు గుమ్మడి. 2. నల్ల జీలకఱ్ఱ 3. కాకర, (వృ. వి.) 4. జీలకఱ్ఱ.

సుషాఢుఁడు సం. వి. అ. పుం శివుఁడు.

సుషి సం. వి. ఇ. స్త్రీ. 1. రంధ్రము, బెజ్జము. 2. గొట్టము.

సుషి(షీ)మము సం. విశ. (అ. ఆ. అ) 1 చల్లని. 2. ఆహ్లాదకరమైన.

సుషి(షీ)మము సం. వి. అ పుం. 1. చలి 2. ఒక దినుసు పాము. 3. చంద్రకాంత శిల.

సుషిమము సం వి. అ. న.. చల్లదనము.

సుషిర సం. విశ. బెజ్జము గలది.

సుషిర సం వి. అ. న. 1. బెజ్జము. 2. పిల్లనగ్రోవి లోనగు వాద్యము.

సుషిర సం. వి. ఆ. స్త్రీ. గువ్వగుత్తిక (వృ. వి.)

సుషిర సం. వి. అ పుం. కిక్కస (వృ వి) (శ. ర.)

సుషుప్తి సం. వి ఇ. స్త్రీ 1. ఒళ్ళెఱుఁగని నిద్ర. 2 గాఢ నిద్ర.

సుషుమ్నము సం వి. అ. పుం. సూర్య కిరణములలో నొకటి.

సుషుమ్న సం. వి ఆ. స్త్రీ. ఒక నాడి.

సుషేణము సం. వి. అ పుం 1. ఒక చెట్టు, కరమర్దము. 2. పేము, వేత్రము.

సుషేణము సం వి. అ. పుం. కలివి.

సుషేణిక సం. వి. ఆ. స్త్రీ. నల్ల తెగడ (వృ. వి.)

సుషేణుఁడు సం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. ఒక వానర నాయకుఁడు.

సుష్ఠు అవ్య. 1. బాగుగా, చక్కఁగా 2. ఎక్కువగా. 3. నిజముగా, యుక్తముగా.

సుష్మము సం వి. అ. న. త్రాడు, దారము.

సుసత్య సం వి ఆ. స్త్రీ. జనకుని భార్య.

సుసరభేత్తు సులువుగా రోమములఁ దొలఁగఁ జేయు మందు.

సుసరము విశ. సూక్ష్మము, సన్నము.
మ. వసుధా నాయక వేటకుఁ గనలు సత్త్వంబెక్క మేనింతకున్, సుసరంబై లఘువౌ మృగంబుల భయ క్షోభంబులన్ దగ్గుణ, ప్రసరంబేర్పడఁ జేసి మాటి మెఱయింపన్ జోటగున్ వేఁటయుర్వ్యశ్వవనం బింద్రుదు ధరిత్రి నిట్టగతి సౌఖ్యం బొందుదో కల్గునే ? ద్వా. 3. 20.

సుసికత సం. వి. అ. స్త్రీ 1. మంచి యిసుక. 2. పంచదార.

సుస్తీ హిం. వి. సోమరితనము.

సుస్థత సం. వి. అ. స్త్రీ. 1. క్షేమము, ఆరోగ్యము. 2. భద్రత.

సుస్థము సం. విశే. (అ. ఆ. అ.) 1. యుక్తమైనది. సరియైనది. 2. ఆరోగ్యవంతము, భద్రము. 3. ధనవంతము. 4. సుఖవంతము. అదృష్టవంతము.

సుస్థితి సం. వి. ఇ. స్త్రీ. సుస్థత.

సుస్థిరము సం. వి. అ. న. సుస్థిరత్వమని భావప్రధాన నిర్దేశము, నిలుకడ,

కం. రాజునకు విజయమూలము, రాజితమంత్రంబు సుస్థిరంబున దానిన్, రాజాన్వయ రక్షించితె. భార. సభా. 1. 27.

సుస్మిత సం. వి. అ. స్త్రీ మంచి చిఱునవ్వు గల స్త్రీ.

సుస్వపనుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

సుస్వరము సం. విశే. (అ. ఆ. అ.) 1. చెవికింపైనది 2. ఉచ్చధ్వని గలది.

సుహిత సం. వి. అ. స్త్రీ. అగ్నిదేవుని సప్త జిహ్వలలో నొకటి.

సుహితము సం. విశే. (అ. ఆ. అ.) 1. యోగ్యము. ఉచితము. 2. ఉదారము. ఉపకారము. 3. అనుకూలము, అనురక్తము. 4. తృప్తము, ప్రీతము.

సుహృత్తు సం. విశే. ద్. మంచి హృదయము గలది. దయ గలది. ప్రేమ గలది.

సుహృత్తు సం. వి. ద్. పుం. 1. మిత్రుఁడు. సఖుఁడు 2. సహాయుఁడు.

సుహృదయము సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచి హృదయము గలది. 2. ప్రేమ గలది. 3. దయ గలది.

సుహృదయుఁడు సం. వి. అ. పుం. మిత్రుఁడు, సఖుఁడు.

సుహృదుఁడు సం. వి. అ. పుం. మిత్రుఁడు, సఖుఁడు.

సుళి వి. ఋకారము.

సుళిగవ = ఋకారము, ౠకారమును.

కం. చెలులు తలకట్టు లాచా. పులుసైవతత్వా ములు మిత్రములు గుడిగవయున్. సుళిగవయు నేత్వ యుగమును, జెలువగు చుట్టములు ద్వివిధ శృంగాత్వమ్ములన్. అప్పక. 3. 46.

సుళువు విశే. తేలికైనది.

సీ. వలెవాటు వైచిన సుళువు చెందిర కావి వలిపపముల్ పదపల్లవముల జీర. చంద్రికా. 1. 107.

సీ. సుళువు చాయల పేరి తెలినీరు బుగ్గలయొద్ద పట్టైపుఁ గత్తి నొనరఁ బట్టి, పచ్చకాసితదట్టి పస మించు పచ్చరాచిలుక క్రొంబిడి వంకి వలవఁగించి. చంద్రాంగ. 2. 68.

సుళ్ళఁబెట్టు స. క్రి. (సుళ్ళువ్ + పెట్టు) 1. సుడిగుండము వేయు. 2. చిక్కులు వెట్టు.

సీ. వక్రగతులు మాఱు వర్తించు చందంబు బెట్టుగా వడిసుళ్ళఁబెట్టునట్టు ... గీ. మదిదలంచియె యెందును గొదవలేక, సకల సౌభాగ్యము గ్రాంచు జహ్ను కన్య, యంచిరప్ప నృపాలు భార్యావతంసమైన గంగాంబయై కీర్తివంరె జగతి. (రెండర్థముల కిదే). ఇందు 1. 77.

సుళ్ళసూరి విశే. 1. సుడులు గలవాఁడు 2. చుట్లఁ బెట్టువాఁడు.

కం....అనిలుడు సుళ్ళసూరి కమలారి నిశాచరుఁడ. శృం. 1. అ.

సుశ్లెములు

సీ. చతురతై కొప్పుల జడ సుశ్లెములు వెట్టి లీలమై పుష్పమాలికలు జేర్చి. వీర. 3. 149.

సుళ్వు వి. వీలు, అవకాశము (రూ. సుళువు. సులువు)

సీ. ఇనుఁడు గన్పడని సుళ్వెఱిఁగి ముందేహులు కొంచకయిల వల్లుకొనిరనంగ. ప్రబం. 1. 64.

## సూ

సూ = చూ. అవ్య. 'చూ' అను అవ్యయమే కళల మీఁద గసడద వాదేశముచే "సూ"గా మారును. (చూడు. అవ్య).

1. నిశ్చయార్థకము.

కం. శ్రీమంతుఁడె కులవంతుఁడు, శ్రీమంతుఁడె సుభగరూపజితకంతుఁడు సూ, శ్రీమంతుడె గుణవంతుఁడు, శ్రీమంతుఁడె సిద్ధశేముషీ మంతుండున్. విక్ర. 2. 175.

సూ (ఉత్తర పదముగా) నం విశే. ఈ = జనకము ఉత్పాదకము.

సూ నం. వి. ఈ. స్త్రీ. కన్నతల్లి, జనని.

సూకము నం. వి. అ. పుం. 1. బాణము, 2. గాలి, 3. కమలము.

సూకరము నం. వి. అ. పుం. (రూ. శూకరము) 1 పంది 2. ఒకవిధమగు లేడి.

సూకరి నం వి. ఈ. స్త్రీ. 1. ఆడు పంది. 2. ఒకవిధమగు నాచు.

సూకరుఁడు నం. వి. అ. పుం. కుమ్మరవాఁడు.

సూక్ష్మతండుల నం. వి. అ. స్త్రీ. 1. పిప్పలి. (వృ.వి.) 2. ఒక దినుసు గడ్డి.

సూక్ష్మ తండులము నం. వి. అ. పుం. గసగసాలు. (వృ. వి.)

సూక్ష్మదర్శి నం. విశే. (గ్. సి. న్) 1. చురుకైన చూపు గల. 2. వివేకము గల. 3. కుశాగ్ర బుద్ధి గల.

సూక్ష్మదర్శిత నం. వి. అ. స్త్రీ. 1. చురుకైన చూపు గలిగియుండుట. 2. తీక్ష్ణదృష్టి. 3. తెలివి. 4. భవిష్యద్దర్శనము, ముందు చూపు.

సూక్ష్మదేహము నం. వి. అ. పుం. లింగ శరీరము.

సూక్ష్మపత్రము నం. వి. అ. పుం. 1. కొత్తిమిర, ధనియము (వృ. వి.). 2. అడవి జీలకఱ, చిన కంటకాలు. (వృ. వి.) 3. అడవి చెఱకుగడ (వృ. వి.) 4. తుమ్మ చెట్టు (వృ. వి.) 5. ఒక దినుసు ఆవాలు.

సూక్ష్మపర్ణి నం. వి. ఈ. స్త్రీ. ఒక దినుసు తులసి.

సూక్ష్మబీజము నం. వి. అ. పుం. గసగసాలు.

సూక్ష్మమక్షిక(ము) నం. వి. అ. న. అ. స్త్రీ. దోమ.

సూక్ష్మమానము నం. వి. అ. న. సున్నితమైన కొలత. సరియైన కొలత.

సూక్ష్మము నం. విశే. (అ. అ. అ.) 1. అగోచరము, స్థూలము కానిది. 2. అల్పము, చిన్నది. 3. సుకుమారము. పలుచనిది 4. సున్నితము. 5. తీక్ష్ణము. చురుకైనది. 6. నిపుణము, చతురము 7 సరియైన, కచ్చితమైన, ఒప్పయిన.

సూక్ష్మము నం. వి. అ. పుం. 1. అణువు. 2. ఇంగుది. (వృ వి.) నం. వి అ. న. 1. సర్వవ్యాపియైన చైతన్య తత్త్వము. 2. పరమాత్మ 3. అల్పత్వము. 4. ఒక యోగసిద్ధి (సావద్యము, నిరవద్యము, సూక్ష్మము) 5. నైపుణి. చాతుర్యము. 6. కపటము, మోసము. 7. సన్నని దారము. 8. ఒక అర్థాలంకారము. (అసంలక్షిత సూక్ష్మార్థ ప్రకాశః సూక్ష్మ ఉచ్యతే ప్ర. రు(ద్రీ.)

సూక్ష్మవాక్యము నం వి. అ న ఉత్తరసాక్షి చెప్పిన మాట.

సూక్ష్మశర్కర నం. వి. అ స్త్రీ సన్న యిసుక.

సూక్ష్మశాలి నం. వి. ఇ పుం. సన్న బియ్యము.

సూక్ష్మషట్చరణము నం. వి. అ. పుం చిన్న పేను. మలి పేను.

సూక్ష్మాత్మ నం. వి. న్. పుం. శివుఁడు.

సూక్ష్మీకరించే నం. వ. క్రి. సూక్ష్మముగాఁ జేయు, సంగ్రహ పఱుచు.

వ. ... సర్వోపమా ద్రవ్య సముచ్చయం బగు సౌందర్యం బనేకశ్రా వస్థానదిదృక్షచే విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశ నివేశితంబుగా నొనర్చెనో యని. హరి. 3. 23,

సూక్ష్ముఁడు నం. వి. అ. పుం. శివుఁడు.

సూక్ష్మైల నం. వి. అ. స్త్రీ. చిన్న ఏలకి.

సూచ నం. వి. అ. స్త్రీ. 1. వేధ, గ్రుచ్చుట. 2. అంగాభినయము. 3. గూఢచర్య. రహస్యాన్వేషణము. 4. అభినయ విశేషము.

సూచకము నం. వి. అ. పుం. 1. గ్రుచ్చునది, 2 సూది, 3. భూతము, పిశాచము. 4. కుక్క. 5. కాకి. 6. పిల్లి. 7. సన్న బియ్యము.

సూచకము నం. విశే. అ. (స్త్రీ. సూచికా) 1. చూపునది, నిర్దేశించునది. 2. వెల్లడి చేయునది. ప్రకటించునది. 3. నిరూపించునది.

**సూచకము** సం. వి. అ. స్త్రీ సూచనము, సూచకమగు చిహ్నము.

కం. ఒక పర్వతము దిశా, యక సంయుతుఁడగుచు గురునియాగమనము సూ,చుక యున్నతటిన్ శుభ సూ,చకములఁ తోఁడుత గురుఁడు శక్రుని కనియెన్.. దశా. 2. 96.

**సూచకుఁడు** సం. వి. అ. పుం. 1. కల్లలమారి. చాడీకోరు. 2. రహస్యము బయట పెట్టువాఁడు. 3. గూఢచారి. 4. కథకుఁడు. బోధకుఁడు, ఉపాధ్యాయుఁడు. 5. సూత్రధారుఁడు. 6. ఒకానొక బుద్ధుఁడు. 7. ఒక సిద్ధుఁడు. 8. కపటి, మాయావి,

**సూచన(ము)** సం. వి. అ. స్త్రీ. అ. న. 1 పొడుచుట. కుట్టుట, రంధ్రము చేయుట. 2. నిర్దేశించుట, ప్రకటించుట. 3. నేరము బయటపెట్టుట, నిరూపించుట 4. అభినయించుట, అభినయము. 5. వ్యక్తము చేయుట. 6. వార్త. 7. ప్రదర్శనము, వర్ణనము. 8. లక్షించుట. 9. రహస్యముగా పరికీలించుట, 10. కపటము, ద్రోహము. 11. క్రౌర్యము, హింస.

**సూచము** సం. వి. అ. పుం. 1. కుశాగ్రము. 2. తెల్లమొలక.

**సూచి** సం. విశ. న్. (స్త్రీ. సూచినీ) 1. గ్రుచ్చునది. కుట్టునది. 2. చూపునది, నిర్దేశించునది. 3. వెల్లడించునది. బయట పెట్టునది.

**సూచి** సం. వి. న్. పుం గూఢచారి, ఉత్త సాక్షి.

**సూచి** సం. వి. అ. ఈ స్త్రీ. 1. గ్రుచ్చుట, కుట్టుట, కెజ్జము వేయుట. 2. సూది, కుట్టని, 3 కుశాగ్రము. 4. అగ్రము, కొన. 5 మొగ్గ చివరి భాగము. 6. సేనా ముఖము, వ్యూహభేదము. 7. త్రికోణము. 8. శంకువు. 9. ఆంగికాభినయము. 10. నాట్య విన్యాస భేదము. 11. గ్రంథస్థ విషయముల పట్టిక. 12. పట్టిక, జాబితా. 13. సూది. కంటకురాలు. సూది వంటిది.

తే. లోకముల కెల్ల సూచి యల్లుంద్ర బూచి, ...అయ్యెంతి తల్లి. శుక. 3. 18,

**సూచించు** సం. స క్రి. 1. చూపించు, నిర్దేశించు, 2. ప్రకటించు. 3. వ్యక్తము చేయు. 4. బయలు పఱుచు, వెల్లడించు. 5. అభినయించు. ప్రదర్శించు. 6. అన్వేషించు, కనిపెట్టు, గమనించు.

**సూచిక** సం. వి. అ స్త్రీ. 1. సూది. 'దుర్వాచిక సూచికాంకుర పరంపర' నైషధ. 2. ఏనుఁగు తొండము తెలియఁజేయునది.

**సూచికాధారము** సం వి అ. పుం. ఏనుఁగు.

**సూచికాముఖము** సం. వి. అ. న. శంఖము, వత్తగుల్ల

**సూచికుఁడు** సం. వి. అ పుం. దర్జీవాఁడు.

**సూచితము** సం. విశ. (అ. అ. అ.) 1. కుట్టఁబడినది. 2. రంధ్రము వేయఁబడినది. 3. నిర్దేశింప బడినది. 4. ప్రకటింపఁబడినది. 5. వెల్లడింపఁబడినది. తెలుప బడినది 6. గ్రహింపఁబడినది. విదితమైనది.

**సూచిని** సం వి. ఈ. స్త్రీ. 1. సూది. 2. రాత్రి.

**సూచిదంతుఁడు** సం. వి. న్. పుం. గరుత్మంతుఁడు, సం విశ. (న్. న్. న్.) కొన గలది

**సూచీకటాహన్యాయము** సం వి అ. పుం సూది, గుండిగ అను రెండు వస్తువులను ఉత్పత్తి చేయవలసి నప్పుడు ముందు సూదిని, తరువాత గుండిగను ఉత్పత్తి చేయవలెను. రెండు పనులు ఏకకాలమున కలిగినప్పుడు సుకరమైన దానిని ముందుగా చేయవలెను.

**సూచీపత్రకము** సం. వి. అ న. విషయముల పట్టిక.

**సూచీపత్రకము** సం. వి. అ. పుం ఒక ఓషధి.

**సూచీపుష్పము** సం. వి అ పుం. మొగలి, కేతకి.

**సూచీ(చి)భేద్యము** సం. విశ. (అ. అ అ) 1. సూదితో పొడువఁదగినది. 2 దట్టమైనది. చిక్కనిది, సూచిభేద్యైస్తమోభిః — మేఘ.

**సూచీముఖము** సం. విశ. (అ. అ. అ.) 1. సూది వంటి సన్నని ముక్కు గలది. 2. సూదివంటి మొన గలది.

**సూచీముఖము** సం. వి అ. పుం. 1. ఒక పక్షి. 2. తెల్ల దర్భ, 3. అభినయ హస్త విశేషము.

**సూచీముఖము** సం. వి. అ న. వజ్రము.

**సూచీరోమము** సం. వి. న్. పుం. అడవి పంది.

**సూచీవదనము** సం. వి. అ. పుం. 1. దోమ, 2. ముంగిస.

సూచీశాలి సం. వి. అ. పుం. సన్న బియ్యము.

సూచ్యము సం. విణ. (అ. అ. అ.) 1. సూచింపఁదగినది. 2. ప్రదర్శనయోగ్యము కానిది. నీరసమైనది- సం. వి. అ. న. ప్రదర్శన యోగ్యము గాని ఇతివృత్త భాగము.

సూచ్యాస్యము సం. వి. అ. పుం. ఎలుక.

సూటి వి. 1. విధము,

తే. తత్తఱింపఁ దొణఁగి యిత్తఱి నిదియేమొ, సూటి గాదు తలఁపఁ బాటిగాదు, తగదు మాను మన్నఁ బగవార మగుదు మి,క్కటికి మనము పులిన కటికి మనము (పోడచేడియల్. కర్తృపదము) సారంగ. 2. 68.

చం. వడి నవరాత్రిఁ జెందనని వాసిగఁ బద్మిని నెత్తి మీఁదఁ జే,యిడి కరసంగతిన్ సమయ మేగఁ దరాళ గురించి రాగ మేర్పడఁగఁ బనంగఁ దేజమెదఁ బాయఁడె యీయినుఁ డంచు ప్రోఁత పెల్లడరఁగ జాటు సూటి నరసాళితముల్ మొఱసెం గొలంకులన్. కువల 4. 7.

సీ. చివురాకుఁ జేసినఁ జేసెఁ గాకఁబుండుఁ దాజేటినే సూటిఁదారు కొలిపె ... అనుచు జనులెల్ల నచ్చెరువందఁ బాద,ములను మీఁగాళ్ళు జంఘు లూరులవలగ్న,మును గుచంబులు మోముఁ గొప్పును మెఱయఁగ, నా మహాశ్వంబు నీరజా కాక్షి యయ్యె. చిత్ర భార. 5. 81.

మ. జననాథాగ్రణి యొక్కనాఁడు హిమవజ్జాతుండు కోలాహలా, ఖ్యనగాధీశుఁడు ప్రాలి శుక్తిమతినాగన్ వేగవేగవ్వ మీ,టిన సూటిన్ బొటప్రేలి గోట నెగమీటుం గుంతికాహార్యం. కానవగర్వాగ్రహుఁడై బలారి తనతో సఖ్యంబు వాటింపఁగన్. వసు. 1. 119.

సీ. త్రిమ్మరుమేర రసమ్ము కదలు మాడ్కి నీట మునిఁగి లేచు సూటి కాటి, కాణ మేగు వితాన. ప్రబం. 1. 181.

సీ. దేవపూజాపేటిఁ దిగిచి నంబులసూటి కడుమించు తెలనాకుగములు నించి నంబి వాని విధము) ఇది మునిని మోహింపఁజేయుటకు ప్రయాణమగు మేనక వర్ణనము) చంద్రాంగ. 3. 12.

2. గురి, లక్ష్యము.

రగడ. సూటిదప్పక యేమి చొక్కంపు కోదులును. పి. శకుం. 2. 155.

చం. సమదగజంబుపై కుటుకుసామజ వైరికి సూటి వెట్టునా, గమకముఁ జూచి భూపతి ముఖంబున వ్యాధులమూఁక నిల్వలే, కమిత భయాప్తి నోరసితె సారంగ. 1. 100.

మత్తకోకిల. కోటి సూర్యులు కోటిచంద్రులు కోటి కోటి తటిల్లతల్, సూటిగాఁ బరిపాటిగా నొకచోట నిల్చిన కిరి వ,మ్మెటి వెల్గు దగన్ త్రికూటము మీఁదఁ జూడుము దృశ్యమున్, దాఁటి మాయగు మాట మాటికిఁ దాల్మినేపటు మీటుచున్. పీఠాధా. 1. 156.

తే. తెరవ నెరవంక బొమలును మెఱుఁగు వాడి, చూపులును జూచి తనచేతి సూటి రోసి, యన్నరున న్యాయ మొనరించినట్టి సుమశ,రాస నుండనఁ జెలి మీఁదియాన మండె. విజ. 2. 168.

3. ప్రతి.

ఉ. బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ మీల సూటి త,క్కుంగను. దోయి చంద్రు ప్రతి కోటి మొగం బెలదేఁటి ధాటికన్నం, గడు మేటి వేఁడి పులినంబుల సాటి పిఱుం దయారె చి,త్రాంగద పాటికోటి గలదా యని మెచ్చుఁ గిరీటి మాటికిన్. విజ. 1. 150

సూటుకాఁడు విణ. 1. గురికాఁడు. 2. అందగాఁడు.

సూటిగొను అ. క్రి. లెక్కసేయు, లక్ష్యపెట్టు.

తే. కుత్రవర్యుండు హైదరుజంగుఁ గలిసి, చూచితి రెమి మ్మొకింతైన సూటిగొనక, రావు కులసంభవుం డైన రంగ నృపతి, కార్యమితర ప్రపంచంబుగా నొనర్చె దంగా 2. 187.

సూటిపడు అ. క్రి. 1. సరిపాటు.

మ.... అపంచనాయతి యాన్పచ్చిక సూత్రి సూటి పడ ... వసు. 2. ఆ. (శ. ర.).

2. జరుగు, సంభవించు.

తే. తగవుదప్పని ధర్మ మీతరుణి లందు, సూటిపడె మేలు మే లనిజోకఁ జెలులు, నరన మాడంగ విరుల వసంత మాడి, రాలకాంగులు వం జేయుచా కరమ్మున. కవిరాజ. 4. 98.

ద్వి. టక్కులు నేవలు దంబకంబులును. పొక్కులు నేర్పులు మాటిమాటలను. పండితారాధ్య చరిత్ర. పురాతన. 122.

**సూదరి** (సూఁడరి). విశే. (సూడు+అరి) పగ గలవాఁడు. ఈసు గలవాఁడు.

కం. వేఁడెదు నర్థులఁ గనుగొన, వాఁడికుఠారముపఁ జెండవలదా యను నీ, సూఁదరి మాటల పరుసము, పోఁడిమి చెడుపట్టి యర్థములఁ గల్పములన్. కావ్యా. 6. ఉల్లా. 128. ప.

**సూది** వి. గుటి.

ద్వి. వడి సూదిపట్టి యవ్వలను గువ్వలను గెరవుచు వేఁట నీ క్రియఁ జల్పువేళ. అ. మ. క. 5. 250. పు. 8 ప.

**సూదించు** అ. క్రి. పగగొను.

కం. చేదియ చూపులు దమలో సూదించె... విక్రమా. 8. అ. (శ. ర.).

**సూదిగము** వి. 1. చేతికడియము. ఆభరణ విశేషము.

కం. ఎనలేనిగొనలు వాఁడా, పెను మిమకుంచెగలు వాఁగడు వేఁదిమివాఁడా, చెవటి పొలదిండ్ల సూఁడా, కమవినకుం రాచసూదిగంబుల జేఁడా. అ. రా. సుందర. 1. 81.

సీ. గిల్లు రాతత్తడి జెల్లుటితోలును గాలిమేవరి సూదిగముల జోడు. రామ. క. 1.

సీ. తీఁగయు నాణి ముత్తెపుఁ జేర్లు పందిరం, దలు సూదిగములు గొడిసరములుఁను. కళా. 7 66.

2. ఆడుదాని చేతి గాజులు.

గీ. లలన సాక్షాత్కరించిన లక్ష్మివోలెఁ గంకణంబులతో సూదిగముల రాయ, విశ్వనాథుని కళ్యాణ వేదియందు, ముగ్గు వెట్టంగ మోహించుముజ్జగంబు. కాశీ 5. 146.

**సూదిద** వి. కానుక.

ద్వి. విదులక గొనిపోయి భీషణుం దవెడి, మొదలితలారి సమ్ముఖమునఁ బెట్టి, కా సూఁగె వాపోరుఁడు. హరి ఉత్త. 2330.

ఉం. అతుల మహానుభావ మని యవ్విరిఁ దానొకపెద్దసేసి యచ్యుతునకు నిచ్చకం బొదవ సూదిద యిచ్చిన నిచ్చఁగాక. పారి 1. 85

చం. అభినవ భోజరాజ బిరుదాంకుఁడు శ్రీరఘునాథశౌరికిన్ శుభమతి నేలినందులకు సూదిద చేసితి నేర మిక్కిలిన్. సకల గణింప మన్నన లొనర్పఁ బ్రబంధము నింతయుత్తమ, ప్రభునకు వంశితం బొనరుపఁగలిగెం గదయంచు వేడుకన్. విజ వి. పి 53.

**సూదిదపెట్టు** స. క్రి. కానుకయిచ్చు.

సీ. తరుణియొక్కతె పూవుదండ సూదిద బెట్టి, హేలాపరిరంభ మెచ్చరించె జై. భా. 8. 76.

**సూడు** స. క్రి. 1. కాల్చు, అంటించు.

కం. ఇట్టిక సూడిన వాఁడో. యెట్టిడు కొన్నాడో యనుచు మల్లన మాడం, బట్టగుచు మగిడి చూడక, పట్టణమున కేఁగె లజ్జ బండతనమునన్. ఉ. హరి. 1. 36.

అ. కోటకొక్కరాయిఁ గూల నొక్కఁగఁజేసి, ముండ్లకట్టె నొకనికఁడ్లు పెటికి, వేఁడి కొఱువులెత్తి సూడుదు రొక్కని భల్లకతుల నొకనిఁద్రుళ్లడంచి. పావందో. 2 అ.

2. నాటించు.

చం. అగు పగు బైసి మాలిచితి వంచు విజృంభణ వృత్తి నివ్విధన్, సొగయని మాటలం జెవులు సూఁడకు పైఁడివ దానఁ గాను నా, మగనికి నిన్నువంటి కొఱమాలిన మానిసు లీడె భర్తతోఁ, దెగి యెడఁద్రెవ్వకం బ్రదికి తేమని యైదువనై సుఖం చెదన్. వేం. పంచతం. 2. 260.

**సూడు** వి. 1. ఈర్ష్య.

కం. సూడొక్కటియును మఱి దాఁగిడొక్కటియును జగంబు కీర్తించుటకై, యీడొక్కటియును గలదే, పోఁడిమిగా మీ కటంచు బోధించవలెన్. ఉత్తర హరివం. 4. 209.

2. వైరము. పగ, కసి, కక్ష, విరోధము

ద్వి. సోముఁడు కామారి సూడు సాధింపఁ, గాముపమ్ములు విల్లుఁ గైకొన్న కరణి, మురిపెంబు నిండారు ముఖమండలమున, సొరిది చెన్నగు వాఁడి చూపులు బొమలు.

రం. రా. ఉ. కాం. 99 పుట. 21 పం

ఆ. అయ్యె పగకు రాముఁ డలయక రాజుల, నిరువదొక్క మాఱు వరసి చంపె, జగతి మీఁద రాజ

శబ్దంబు లేకుండ, సూడు దీర్పలేని సుతుఁడె. భాగ. 6. స్కం. 486.

చం. కనుఁగవఁదన్ను గెల్వఁగ మృగం బలమూడు న కిందు రేకు నే, నని .... అము. 5. 12.

కం.... నాదృష్టి పథమున ధృతితో, నిలిచిన నిష్ఠుర వి శిఖా, ర్చుల ముంచి మదీయ సఖుని సూడిటు దీర్తున్. భాగ. 10. స్కం. ఉత్త. 895.

గీ. హరధమర్భంగకార్య మెవ్వరికిఁ దెలిసి, సూడు పుట్టింతు నని నిల్చుచో నిలువక, కలహభోజనమౌని వల్గడలఁ దిరుగ శివుని విల్విఱుచె రఘువీర శేఖ రుండు. ఉ. రా. 1. 88.

కాలనేమి కొడుకు లేడ్వురుఁదన చేత మడిసికొంటి సూడుఁ దీర్పఁగఁ బూని యిచ్చోట, బుట్టి రిపుడు. నీలా. 3. 69.

వ. మహిషాసురునిఁ జంపిన సూడు తన మనంబు నంబాయక యివ్విధంబున దుర్గయందు బద్ధ మత్స రుండై యారాతుసుండు, కళా. 9. 23.

సీ. పలుకేఁడులకు సూడు బలియించి పొలియించి బలిఁగేరు వంట వలంతి సరియె. నీలా. 1. 52.

3. విరోధి, వైరి, శత్రువు.

కం. చెవటి పొలదిండ్ల సూడా, కను వినుకుల రాచ సూడిగంబుల తేఁడా! అ. రా. సుందర. 181.

కం. తవసూడగు ధనదదిశాంగన నిముఁ దొడిగూడ బోకగని యామ్యదిశాంగన మెచ్చి... కుమా. సం. 4. 442.

ఉ. ...నె, త్తామర సూడు రాగరసధాముఁడు సోముఁడు దోఁచెఁ దూర్పునన్. వరాహ. 4. 13.

కం. రాకొమరుఁజూచి యచ్చి గు,రాకుం బోఁడియు వలంతిరె యిట్లను నౌ, సోఁకుడుల సూడ వినుమా, నీకుం దన మొదలి తెఱఁగు నెఱిఁ నెఱిఁగింతున్. అ. రా. బాల. 145.

సూడుకాఁడు వి. పగవాఁడు, శత్రువు. అం. భా. శ. ర.

సూడుకొను అ. క్రి. పగఁగొను. విద్వేషించు.

ఎ. గీ. ఇరుగు పొరుగుల వారినిం టింటి వారి సూడు కొనఁదిట్టె మటి కాని కూడు గుడువదు. భోజరా. 3. 37.

సూడుపట్టు అ. క్రి. పగకొను.

ఉ. తండ్రికి సూడు పట్టక వృథాస్థితి నుండితి నింట నిందతో, మంత్రె మహాస్త్ర సాధనులు. భా. రా. యుద్ధ. 1289.

సూడుపట్టు స. క్రి. విరోధించు.

కం. హరు సూడుపట్టు కొఱకై, హరిఁ బొరి తన మ్రొచెంచు పుష్పాస్త్రుఁడుగా, కరయఁగ త్రిభువన ముల నెవ్వరి యందుల నిట్టి రూపవంతుఁడు గలఁడే. పద్మ. పు. 2. 121.

సీ. భాను చంద్రుల సూడు పట్టి గెల్వ ననంగఁ గంధర పటలాంధకార మడరె, విక్ర. 4. 81.

తే. చూడ వేటికి నిడువాలు సోగమీల సూడు పట్టంగఁ జాలెడు చూపుఁగొనల. శృ. నై. 8. 50.

సూడుపట్టె వి. — క్రీడా విశేషము.

కం. కొందఱు గణపతు లత్తఱి, మంద రహిమ వస్త్రప్రధానసహిత మహిశృ, శృంగోహంబులు గొని కడు, నందముగా సూడుపట్టె లాడుదురు శివా. శివతత్త్వ. 384. వ.

సూడుబంటు వి. పగఁదీర్చుకొను శూరుఁడు.

సీ.... రాజరాజు, నయిదోడు సూడుబంటయి మనము బఘూతి, నిమ ముమ్ము దెగటార్తు నని సనవరు, తే. భీముఁదాకె. రాఘ. 4. 242.

సూత(త) సం. వి. ఆ. స్త్రీ. ప్రసవించిన స్త్రీ, పురిటాలు, బాలెంతరాలు.

సూతకము సం. వి. అ. న. 1. పుట్టుక, 2. పురుడు; జాతాశౌచము. 3. పాదరసము.

సూతకము వి. మృతాశౌచము, జాతాశౌచము.

కం. ద్విజులకుఁ బదిదినములు భూ, భుజులకుఁ బంద్రెండు దివసములు నిలెశూద్ర, వ్రజములకుఁ బతుమాసము లు జనాధిప సూతకంబులు సుమీ వరు సన్. వి. పు. 4. 253.

కం. సూతకము బొద్దుఁ గోయగ, నాతతముగఁ బొందుఁగాని యంతకు మును నం, జాతుఁడగు సుతువికతమున, సూతకమును లేదు ద్రవ్యశుద్ధియుఁ గల్గున్. విజ్ఞా. ఆచార కాం. 19.

సూతము సం. విశ. (అ. ఆ. అ.) 1. జనితము,

ఉత్పన్నము, కనఁబడినది. పుట్టినది. 2. ప్రేరేపింపఁ బడినది. వెలువరి పంపఁబడినది.

సూతము సం. వి. అ. పుం. న. పాదరసము.

సూతిరాజము సం. వి. అ. పుం. పాదరసము.

సూతి సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక, ప్రసవము, కాన్పు 2. బిడ్డ, సంతానము, 3. మూలము, జన్మస్థానము. 4. సోమరసము పిండుచోటు.

సూతికా) గృహము సం. వి. అ. న పురిటిల్లు.

సూతికాషష్ఠి సం. వి. ఈ. స్త్రీ. ప్రసవించిన ఆఱవ నాఁడు పూజింపఁబడు ఒక దేవత.

సూతుఁడు సం. వి. అ. పుం. 1. రథచోదకుఁడు. సారథి. క్షత్రియునకు బ్రాహ్మణ స్త్రీ యందు జన్మించినవాఁడు. 3. వైశ్యునకు క్షత్రియ స్త్రీ యందు జన్మించినవాఁడు. 4. వంది; భట్టు; మాగధుఁడు 5. వడ్రంగి; రథకారుఁడు. 6. సూర్యుఁడు. 7. వ్యాసుని శిష్యులలో నొకఁడు,

సూత్థానుఁడు సం. విశే (అ. ఆ. అ.) నేర్పరి, (శ.ర.)

సూత్పరము సం. వి. అ. న. సారాయము బట్టీపట్టుట.

సూత్య సం. వి. అ. స్త్రీ. చూ. సుత్య.

సూత్రకంఠము సం. వి. అ. న. పావురము; కాటుక పిట్ట; మందపిచ్చుక.

సూత్రకంఠుఁడు సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుఁడు

సూత్రకర్మ సం. వి. వి. న. వడ్రంగిపని, వడ్రంగము

సూత్రకృత్తు సం వి. త్. పుం. సూత్రములు రచించువాఁడు.

సూత్రకోణ(క)ము సం. వి. అ. పుం. డమరుకము.

సూత్రగండిక సం. వి. ఈ. స్త్రీ. దారమునకు పురి పెట్టు సాధనము.

సూత్రచరణము సం వి. అ. న. 1. దారమున గ్రుచ్చుట. 2. కూర్చుట, ఏర్పఱుచుట, క్రమబద్ధము చేయుట. 3. సూత్రములుగాఁ గూర్చుట.

సూత్రతర్కుటి సం. వి. ఈ. స్త్రీ. పంటికోల, నూలు చుట్టెడు కొయ్య.

సూత్రధారుఁడు సం. వి. అ. పుం, 1. ప్రస్తావనను నిర్వహించు ప్రధాన నటుఁడు. (నాట్యవస్తు యదస్థానం తత్ సూత్రం స్యాత్సజీవకం, రంగదైవత పూజాకృత్. సూత్రధార ఇతీరితః") 2. వడ్రంగి. శిల్పి. 3. కొన్ని సూత్రములను రచించినవాఁడు. 4. ఇంద్రుఁడు.

సూత్రపట్టు అ. క్రి. (సూత్రము+పట్టు. ముడివేయు.

సీ. కొలిచి మింటికి నేలకును సూత్రపట్టంగ నేనేర్తు మఱియుచు నేననేర్తు–విప్ర 4. 28.

2. సూత్రము వేసి తిన్నగా నుండునట్లుచేయు.

సీ. తేః పరఁగు వీథులు పురిసూత్ర పట్టినట్లు. ఆము, 1. 52.

సూత్రపట్టు వి. నూలువేఁత.

(సూత్రము+పట్టు).

ఆ. గాడ్పు వేల్పు పట్టి గట్టెక్కి యుక్కునఁ జూచె నూటి నేటి కోటిమగని; కావినేతు వచ్చు వడలంక కడకును సూత్రపట్టు మాడ్కిఁ జాడ్కి వెలుఁగ. రామా. 9. 62.

సూత్రపడు ము. అ. క్రి. జేతపడు.

కం. తేత్రంబు పురుష కారము, ధాత్రీశ్వర ! బీజ మరయ దైవము రెండున్, సూత్రపడఁ గూడె నేనిన్. భార. అను. 1. 134.

సూత్రపఱుచు స. క్రి. సూత్రపడు ధా. పే. (సూత్రము+పఱుచు) సూత్రించు, సూత్రముగాఁ జేయు.

సీ. ప్రామినుకులు సూత్రపఱిచి లోక హితంబుగా నిర్వహించె నెవ్వాని బుద్ధి. వరాహ. 1..6.

సూత్రపిటకము సం. వి. అ పుం. బౌద్ధమతమునకు సంబంధించిన త్రిపిటకములలో నొకటి.

సూత్రపుష్పము సం. వి. అ. పుం. ప్రత్తిచెట్టు

సూత్రపెట్టు అ. క్రి. ముడివేయు.

ద్వి. నేలకు నింగికి సూత్రపెట్టఁ జాలెడు నాబుద్ధి నమసె. హరిశ్చ. ఉత్త. 2714.

సూత్రభిత్తు(దుఁడు) సం. వి. ద్. పుం. దర్జీవాఁడు.

సూత్రభృత్తు సం. వి. త్. పుం. సూత్రధారుఁడు.

సూత్రము సం. వి. అ. న. 1. దారము, త్రాడు, 2. మాలిపోగు. 3. తీగె, తంత్రి, 4. యజ్ఞోప

పీతము 5. ఆట బొమ్మలకు గట్టఁబడు దారము. 6 అల్పాక్షరము, అసందిగ్ధము అయినవాక్యము 7. సూక్తి, సంక్షిప్త విధి వాక్యము. 8. సూత్ర గ్రంథము. 9. నియమము, నిబంధన. 10. ఏర్పాటు.

**సూత్రము** వి పన్నుగడ.

వ. దైవగతిం జేసిన యొడ్డిన సూత్రంబునకు సుయోధనుం డొడంబడియె నేనియు నదియు సకలజన సమ్మతంబయిన విధంబగు. భార. ఉద్యో 1. 90.

**సూత్రయంత్రము** సం. వి. అ. న. 1 మగ్గములోని కండె. 2. మగ్గము.

**సూత్రల** సం. వి ఆ స్త్రీ పంచెకోల, నూలుచుట్టెడు కొయ్య.

**సూత్రవతీశుఁడు** సం. వి. అ. పుం విష్వక్సేనుఁడు.

ఉ. ... త, త్సూత్రవతీశు వందనముతోఁ గని యాతఁడు పూజసేయఁగా. ఆము. 9. 95.

**సూత్రవేష్టనము** సం. వి. అ. న. మగ్గములోని కండె.

**సూత్రాత్మ** సం. వి. న్. పుం. సర్వాంతర్యామియైన ఆత్మ.

**సూత్రాముఁడు** సం. వి. న్. పుం. సుత్రాముఁడు

**సూత్రాలి** సం వి. ఈ స్త్రీ 1. రుద్రాక్షలు మొ॥ వానితోఁ గూర్చబడిన శావళము. 2. కంఠహారము

**సూత్రి** సం. విశే. వ్. సీ. న్. 1 దారములు గలది. 2. నిబంధనలు గలది.

**సూత్రి** సం. వి. ఇ. పుం. కాకి.

**సూత్రించు** స. క్రి. 1. బంధించు, గ్రుచ్చు. 2. లక్షణము నిబంధించు; సూత్రవాక్యము రచించు. 3. ఆలోచనముచేయు, పథకము వేయు; క్రమబద్ధము చేయు. 4. సడలించు. 5. కూర్చు, జతపఱుచు.

శా. శ్లోకంబుల్ శతకోటిఁ గాండములుగా సూత్రించి రామాయణం బేకైకాక్షర మెల్ల పాపముల మాయింపంగ నిర్మించి ... ... భీమ. 1. 5.

**సూత్రిక** సం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన గిన్నె, మూఁకుడు.

**సూత్రితము** సం. విశే. (అ. ఆ. అ.). 1. కూర్చఁబడినది, గ్రుచ్చఁబడినది. 2. క్రమబద్ధము చేయఁబడినది. 3. సూత్రములుగా రచింపఁబడినది.

**సూదంటు** వి. అయస్కాంతము.

ద్వి. సూదంటు శిలయును సూదియుఁ జేర, సూది మోహంబునఁ జువ్వన నెగసి, అంటుకొన్న విధాన. ప్రభులిం. 3. 75. పు. 13. పం.

**సూదకర్మ** సం. వి. న్. న. వంటపని, పాచనము.

**సూదనము** సం. విశే. (అ. ఈ. అ.). 1. చంపునది. చెఱుపునది. 2. ప్రియమైనది.

**సూదనము** సం. వి. అ. న. 1. చంపుట. చెఱుపు, వధము. 2. అంగీకారము, వాగ్దానము. 3. చిమ్ముట, పారవేయుట, విసరివేయుట.

**సూదము** సం వి. అ. పుం 1. నాశనము, సంహారణము వధము. 2. వడపోఁత, పారఁబోయుట. 3. కావి. ఊట. 4. వండినపప్పు. 5. వంటకము. భోజనపదార్థము. 6. బఠానీ బ్రద్దలు. 7. బురద, రొంపి. 8. పాపము, దోషము. 9. రథచోదకత్వము. 10. లొద్దుగ చెట్టు.

**సూదశాల** సం. వి. ఆ. స్త్రీ. వంటసాల.

**సూది** వి. సూచి, గుడ్డలు కుట్టుసాధనము (సం. సూచి).

ఉ, సూదులు ద్రిప్పుచంద మగుచు న్వెతవెట్టక యుండి నెచ్చెలు, ల్లూదులు వెట్టరే చెవులలోపల. పి. శకుం. 3. 194.

ద్వి. పాలుపొందఁ దా దారపోసినదైన సూది మోపెడు నంత చోటునా భూమి, లేదని కడపిన లెక్కింప హరిశ్చ. ఉత్త. 1746.

తే. గీ. కటిక చీఁకటి పుడమి యాకసము జతయొనర్చి కాటుక బరిణచందమునఁ జేసి, చెలఁగు నభిసారికల దీవనలను బెరిగి, సూదిమొన కెడమీక హెచ్చువను నెరపె. ప్రబం. 1. 64.

కం. కరవాడి సూది తుదమొన. నరదరనం బడిన ముత్తియంబును లోలెన్. శృ. నై. 8. 6.

**సూదిగొంటు** వి. ఒక దినుసు పోఁక, లతాపూగము.

**సూదితము** సం. విశే. (అ. ఆ. అ.). చంపఁబడినది.

**సూదిమల్లె** వి. ఒక దినుసు మల్లె (వ్యా. వి.).

**సూదుఁడు** సం. వి. అ. పుం. వంటవాఁడు.

**సూన** సం. వి. ఆ. స్త్రీ. 1. కబేళా 2. మాంస విక్రయ శాల. 3. వధ, నాశనము 4. కొండ నాలుక. 5. మండలము, మేఖల. 6. గవద బిళ్ళలు. 7. కాంతి కిరణము. 8. నది. 9. కుమార్తె. 10. వసుఁగు కొండము.

**సూనగాఁడు** మి. గ్రా. విశే (సూన+కాఁడు) చంపువాఁడు. ఖట్టికుఁడు. కటికవాఁడు.

గీ. చాకిలోయవాఁడు జలగరిగొడగరి. కుక్క సూనగాఁడు కోడివంది, బొద్దు క్రింది యంగములు విప్రు పోఁకిన వచటు గడుగ వలయు నంద్రుడు బుఘులు. విజ్ఞా. ఆచార. కాం. 63.

**సూనము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పుట్టినది. ఉత్పన్నము. 2. వికసితము, పుష్పితము 3. రిక్తము, శూన్యము.

**సూనము** సం. వి. అ. న. 1. ఉత్పాదనము, ప్రసవము. 2. పూవు. 3. మొగ్గ.

**సూనరి** సం. వి. ఈ. స్త్రీ. సుఖవతియైన స్త్రీ. 2. సౌభాగ్యవతి.

**సూనరి** మి. గ్రా. విశే. (సూన+అరి) చంపువాఁడు. (సూన=వధస్థానము) "పంచసూనా "గృహస్థస్య శాలిస్స్వర్గం న విందతి"

చం. చెఱఁబెట్టి గిరిప్రజ మన్పురఁబులోఁ జొలయక నిత్య మొక్కొకని సూనరివోలె వధించి నేమమున్. భార. సభా. 1. 118.

**సూనరి** మి. గ్రా. విశే. పూలమ్మువాఁడు.

"సూనరి యన్నంబు జూదరియన్నంబు" (శ. ర.)

**సూని** సం. వి. న్. పుం. 1. కసాయివాఁడు. కటికవాఁడు. 2. వేటకాఁడు.

**సూనుఁడు** సం. వి. ఉ. పుం. 1. పుత్త్రుఁడు. 2. బిడ్డ, సంతానము. 3. దౌహిత్రుఁడు. 4. తమ్ముఁడు. 5. సూర్యుఁడు 6. జిల్లేడు చెట్టు. (వృ వి.).

**సూనువు** సం. వి. ఉ. స్త్రీ. పుత్త్రిక, కూఁతురు.

**సూనృత** సం. వి. ఆ. స్త్రీ 1. సత్యవాక్కు. సత్యవాగ్దేవత. 2. శ్రవ్యమైన గేయము. మధుర గీతి. 3. ఉపస్సు. 4. అన్నము, ఆహారము.

**సూనృతము** సం. విశే. (అ. ఆ. అ.). 1. సత్యమైనది. 2. శుభ్రమైనది, సుభగమైనది. 3. ప్రియమైనది.

**సూనృతము** సం. వి. అ, న. 1. సత్యవచనము. 2. సాధుభాషణము. 3. శుభము, శోభనము.

**సూపకారుఁడు** సం. వి. అ. పుం. వంటవాఁడు.

**సూపధూప(క)నము** సం. వి అ. న. ఇంగువ.

**సూపము** సం. వి. అ. పుం. 1. సుఖ పేయమైన వంటకము. వండినపప్పు. వంటమనిషి. 4. వంటపాత్ర. 5. బాణము. 6. బతాణీ బ్రద్దలు.

**సూపాంగము** సం. వి. అ. న. ఇంగువ.

**సూమము** సం. వి. అ. పుం. 1. జలము, 2. క్షీరము. 3. ఆకాశము, స్వర్గము.

**సూయాణము** వి. శత్రు భయంకరమైన దండయాత్ర.

సీ. తగువాణ్ణ సూయాణముగ నొనరించె మంచిగ నేలనాలుగు చెఱఁగులకును. భార. విరా. 5 ఆ. 320.

(సం. సూచీయానమ్, క. సూయాణ.) సూచీముఖ వ్యూహముతో వెడలు దండయాత్ర. అని కొందఱు (సం. సూచీవానమ్, క. సూయాణ) సూదితో కుట్టి చేయు బటావని అని మఱికొందఱు.

**సూరకరుఁజు** వి. పక్షివిశేషము (రూ. సూరకురుంజు)

వ. వలుదపడలు వలుఁదవడలుగా సదామోదకములుగా మెసవుబ్రహ్మరాక్షసులును దరిసూరకురుంజుల సందడింజొరకు నంజులంబలెఁ దలపుత్తెంగుఁజుంజుట్టుఁ గొఱుకు జుంజురుపిశాచంబులును (ఇది యుద్ధవర్ణనము) చంద్రాంగ. 6. 93.

**సూరణము** సం. వి. అ. పుం. ఒక విధమైన గుజ్జుగల దుంప. కందగడ్డ.

**సూరత** సం. వి. ఆ. స్త్రీ. 1. పాడియావు. 2. సాధువైన అవు.

**సూరతము** సం. విశే. అ. ఆ. అ. 1. దయగలది. మృదువైనది. 2. శాంతమైనది.

**సూరత్తు** వి, ఒకానొక దేశము.

సీ. రత్నకంబళ్లు సూరత్తుకుత్తిని పట్టుదిండ్లు సేమంతి పూచెండ్లు గంధ,వొడులు ధూపములు పుష్పాదులు

తళుకులుగుల్కు నిలువుటద్దములును. సావందో. 1. అ.

సూరము సం. వి. అ. పుం. 1. జిల్లేడుచెట్టు (వృ. వి.) 2. సోమము.

సూరసూతుఁడు సం. వి. అ. పుం. అనూరుఁడు, సూర్య సారథి.

సూరి సం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు. 2. పండితుఁడు, ఋషి. 3. పురోహితుఁడు. 4. పూజారి, అర్చకుఁడు. 5. జైనాచార్యుల బిరుదము. 6. శ్రీకృష్ణుఁడు.

సూరి సం. విశే. న్. జీ. న్. 1. తెలివిగలది, విద్వత్తుగలది.

సూరి సం. వి. ఇ. పుం. విద్వాంసుఁడు, పండితుఁడు.

సూరి సం. వి. ఈ. స్త్రీ. 1. సూర్యునిభార్య. 2. కుంతీదేవి. 3. నల్లావాలు.

సూరి వి. చిన్నకత్తి.

ద్వి. చికిలిచేసిన మరుచే సూరి యనఁగ, వొక వింత సొగసుతో నుమ తేజరిల్లె. మృత్యుంజయ. 1. 11.

ఉ. అక్కలకంఠి తెలియం, గనివప్పుడె దిక్కరింపుచున్, జక్కెరజాణవుందురికి సాహిణి చాయలజంటదారి మేల్, చొక్కపువాఁడి చెంగలువ సూరి కటారినిఁ బోటుప్రేటు పెం, పెక్కఁగ నొక్కటన్ వలపుటిక్కవఁ బిక్కన రేచి యార్చినన్. ఉత్తర. హరిశ్చం. 2. 63.

సూరుఁడు సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. విద్వాంసుఁడు. 3. వీరుఁడు, శూరుఁడు. 4. రాజు.

సూరెగిలు అ. క్రి. (సూరెగిల్లు రూ.) ప్రక్కకొదుగు.

సీ. కమనీయబాహుచిత్రగతుల నేపారుచో సుర విమానంబులు సూరెగిలఁగ గదలి బాలేందుశేఖరుం దెదురునడవ నిగిడె గరుడుండు కైలాసనగముపైకి. భోజరా. 7. 34.

సూరెగిల్లు అ. క్రి. సూరెగిలు. రూ. ప్రక్కకొదుగు.

మ. అసురాధీశ తనూజు కోత్తలకుఁగా కల్పాంత భీతిం గలంగి సురానీకము సూరెగిల్లినరణ క్రీడాదరం బారఁగా. నిర్వ. 6. 103.

సూరెపాను అలవట్టము (క. ర.) వస్త్రముతో గుండ్రముగాఁ జేసిన విసనకఱ్ఱ.

సూరెపుటము వి. (సం. సూర్యపట) మేలుతరపు మొకమాలు, సూర్యపటము.

సీ. సూరెపుటంపు బల్ జోగంటఁ గట్టిన పట్టబాళి ధయోధుదట్టి యనఁగ (ఇది పరిఖావర్ణనము) రాజవాహన. 1. 6[illegible].

సీ. జంపు సూరెపుటంపుఁ గెంపునిద్దఁపు తేవ గుత్తంపుబంగరు కొమ్ముకట్లు. ప్రబం. 1. 63.

చం. విరితొగచందువా తెగల వేడుకయావడి యంగణంబులోఁ, బఱచిన రత్నకంబళిని బాగుగ సూరెపుటంపుగద్దియన్, వఱలు మెఱుంగు బంగరపువన్నె జగాబురుసాళివాసిపై, ధరణిజతో వసించెఁ బతి తళుకుతలాడలఁ జేతులూనుచున్. ఉ. రా. 6. 118.

సూరెలు వి. బ. వ. పార్శ్వములు, ఇరుగెలంకులు.

వ. అందు నడుమ నరనాథుం డొప్పియుండెఁ దమ్ములుఁ జేయంగల దొరలును సూరెల నిలిచిరి. భార. భీష్మ. 3. 10.

చం. సునిశిత శస్త్రపాణులొగి సూరెలఁ గొల్వఁగ. భా. రా. కిష్కిం. 125.

క. సూరెలను వందిజను లిం,పారఁగ నుతియింప నొప్పునట్టి మహీశుల్. భార. స్త్రీ. 2. 19.

ఉ. ఆతని సూరెలం దమయుదంచితయానము లుల్లసిల్ల న,త్యాయతవైభవంబు లెలరార నలంకృతులై దిగీశ్వరుల్; ప్రీతిఁ దనర్చి రెంతయును జెంపున. హరి. ఉ. 4. 108.

ఉ. కోరి చళుక్యనాథుకడకున్ జమనింతికి రత్నకాంచనా,కారములైన భూషణ నికాయములం దడవంగనేల యీ,సూరెలగ్రాలు వంగములు సోయగ మెంతకు లేదు చూడుఁడా మారుని పూవుదూపులకు మాఱట రూప మనంగ నొప్పెడున్. కావ్యా. 2. ఉల్లా. 27.

ఉ. ... రాజు సూరెలన్ సారెకువైచు నయ్యుభయ చామరలో యనమించె నెంతయున్. దశా. 2. 276.

సీ. హేమాద్రివిస్తా మెంత నప్తాశ్వుఁడు నిచ్చలు సూరెల వచ్చునట్టె....కుమారసం. 3. 248.

ఉ. సూరెల నున్న మంత్రులను జుట్టములం గడుఁ గూర్చుమిత్రులన్. భార. ఆది. 2. 198.

చం. హెచ్చరిక యటంచుఁ గంచుకులు సారెకు సూరెల మగ్గడింప ... దశా. 1. 233.

చం. అన విని నవ్వి యొక్కఁడు మదస్త్రబలంబున కోర్వఁ డోపిరన్, సునిశిత బాణముల్ వఱపి సూరెల నందఱు నొక్కపెట్ట యేపునెఱుపఁ దన్న. భాం. భీష్మ. 2. 327.

కం. నమ్ముము వెఱవకు మేనును దమ్ములునుం గోట నీకుఁ దాత్పర్యముమై నిమ్మేటిమగలు సూరెల నెమ్మి నిలువ నింద్రుండైన నీ కెదురగునే. భార. ద్రోణ. 2. 295.

**సూరెలువాటు** దే. అ. త్రి. (సూరెలు + పాటు) ప్రక్కకొదుగు.

**సూర్క్షణము** సం. వి. అ. న. అగౌరవము, అవమానము.

**సూర్క్ష్యము** సం. వి. అ. పుం. ఒక దినుసు చిక్కుడు (వృ. వి.).

**సూర్ణము** సం. విశే. అ. ఆ. అ. బాధితము, క్షతము, హతము.

**సూర్పము** సం. వి. అ. పుం (రూ. శూర్పము) చేట.

**సూర్మి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. లోహప్రతిమ. 2. ఇంటి స్తంభము. 3. కాంతి, ప్రకాశము. 4. జ్వాలామయము.

**సూర్య** సం. వి. ఆ. స్త్రీ. 1. సూర్యునిభార్య. 2. సూర్యునిపుత్రిక. 3. సూర్య వివాహసంబంధమైన మంత్రము. 4. క్రొత్తపెండ్లికూతురు. 5. ఒక ఓషధి. 6. వెఱ్ఱిపుచ్చ (వృ. వి.).

**సూర్యకమలము** సం. వి. అ. న. ప్రొద్దుతిరుగుడు పూవు.

**సూర్యకాంతము** సం. వి. అ. పుం. 1. సూర్యకాంతమణి, శిల. 2. స్ఫటికశిల.

**సూర్యకాంతి** సం. వి. ఇ. స్త్రీ. 1. సూర్యుని వెలుఁగు. 2. ఒక దినుసుపూవు. 3. నువ్వుపువ్వు.

**సూర్యక్రాంతము** సం. వి. అ. పుం. వృక్షవిశేషము.

సీ. కుప్పి సూర్యక్రాంత మప్పుడునరవండు గాడిదె కడపరకన్నెకోమం. హంస. 4. 10.

**సూర్యగ్రహణము** సం. వి. అ. న. రాహువు సూర్యబింబమును మ్రింగుట.

**సూర్యగ్రహము** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. సూర్యగ్రహణము. 3. రాహుకేతుగ్రహములు. 4. జలకుండిక అడుగుభాగము.

**సూర్యజ** సం. వి. ఆ. స్త్రీ. యమునానది.

**సూర్యజుఁడు** సం. వి. అ. పుం. 1. సుగ్రీవుఁడు. 2. కర్ణుఁడు. 3. శని. 4. యముఁడు.

**సూర్యతనయ** సం. వి. ఆ. స్త్రీ. యమునానది, కాళింది.

**సూర్యనక్షత్రము** సం. వి. అ. న. తత్కాలమున సూర్యుడుండు నక్షత్రము.

**సూర్యపటము** సం. వి. అ. పుం. మేలుతరపు మొకమాలు.

ఎ. గీ. "చాయసూర్య పటంపు గుళ్ళాయపోసఁగ" చంద్రా. 2. ఆ.

**సూర్యపర్వము** సం. వి. న్. న. సూర్యసంబంధమైన పుణ్యదినము (గ్రహణసంక్రమణాదులు).

**సూర్యపుత్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. యమునానది. 2. మెఱుపు, విద్యుత్తు.

**సూర్యభక్తము** సం. వి. అ. పుం. బంధూకవృక్షము (వృ. వి.).

**సూర్యము** సం. వి. అ. పుం. 1. అర్కవృక్షము (వృ. వి.). 2. ద్వాదశసంఖ్య 3. గోబి (కాబేజి).

**సూర్యయంత్రము** సం. వి. అ. న. 1. ఉపాసనార్థమైన సూర్యమండలరేఖాచిత్రము. 2. సూర్యగమనాదికమును కనిపట్టుసాధనవిశేషము.

**సూర్యవిలోకనము** సం. వి. అ. న. నాల్గు నెలల వయస్సుగల శిశువుచేత సూర్యదర్శనము చేయించుట.

సూర్యసంక్రమణము సం. వి. అ. న. సూర్యుఁడు ఒక అయనము నుండి వేరొక అయనమున ప్రవేశించుట.

సూర్యసంక్రమము సం. వి. అ. పుం. చూ॥ సూర్య సంక్రమణము.

సూర్యసంక్రాంతి సం. వి. ఇ. స్త్రీ. చూ॥ సూర్య సంక్రమము.

సూర్యసంజ్ఞము సం. వి. అ. న. కుంకుమపువ్వు.

సూర్యసిద్ధాంతము సం. వి. అ. పుం. ఒక ప్రసిద్ధమైన జ్యోతిషగ్రంథము. ఇది సూర్యునిచే నావిష్కృత మైనదని కొందఱి విశ్వాసము.

సూర్యహృదయము సం. వి. అ. న. ఆదిత్యహృద యము అను మంత్రము.

సూర్యానువర్తిని సం. వి. ఈ. స్త్రీ. ప్రొద్దుతిరుగుడు (వృ. వి.).

సూర్యాపాయము సం. వి. అ. పుం. సూర్యాస్త మయము, ప్రొద్దుక్రుంకుట.

సూర్యాలోకము సం. వి. అ. పుం. 1. సూర్యకాంతి, వెలుఁగు.

సూర్యావర్తము సం. వి. అ. పుం. ప్రొద్దుతిరుగుడు పూవు

సూర్యాహ్వము సం. వి అ పుం. పెద్దగోబి (కాబేజి వంటిది).

సూర్యాహ్వము సం వి. అ. న. రాగి.

సూర్యుఁడు సం. వి అ. పుం. 1. రవి. 2. శివుఁడు.

సూర్యోఢుఁడు సం. వి. అ. పుం. 1. సాయంవేళ వచ్చిన యతిథి 2. ప్రొద్దుక్రుంకువేళ.

సూర్యోపస్థానము సం. వి అ, న. సూర్యోపాసనము.

సూలవై వి రోగ విశేషము, కడుపులో నొప్పి,

తే. దోలికొని వారి నిలిపితి సూల వొడిచి. దశకు. 6. 163.

సూలచేకటులు వి. బ. (యా. సూలచేకట్లు) కంకణ విశేషము (శ. ర.).

స్త్రీ షూలచేకటులు దాల్చి శుక. 1. 148,

సూషణ సం వి. అ స్త్రీ జనని, తల్లి.

సూష్యతి సం వి. ఈ. స్త్రీ. గర్భిణి, ఆసన్న ప్రసవ మైన స్త్రీ.

సూసకము వి. స్త్రీలు తలను ధరించెడు తిరుగుడు బిళ్ళ.

సీ. చెంగల్వ పూదండఁ జెక్కు పెందురుముపై, ఘనసారమున సూసకము ఘటించి. మను. 6. 5,

ద్వి. సిరులఁ బాపట్టు శానికములు గట్టి, వరసరత్న ముల సూసకము లమర్చి. అ. మ. క. 5 ఆ. 288. పు. 3. పం.

ద్వి. సేసమత్యము లొల్కు సీమంతవీథి, గానిగాఁ దెసి సూసకము మణుల్ దొరఁగ. రం. రా. ఉ. 65. పా. 5. పం

సూసరి వి. సున్నము పూయువాఁడు, వేవకుఁడు

సూసవి (?) అర్థ నిర్ణయము చేయుటకుఁ బ్రయో గాంతరము కనఁబడలేదు. (సూ+సవి. అని విడ దీయవచ్చు నేమో)

కం. కేడెము కత్తి తుపాకి కాడియు విండ్లమ్ము లీటెలం గొని తొలుతన్ జోటులు దాలిచి మేనులు జోటులు తమకన్న లేదు సూసవి కినుకన్. ప్రబం. 1. 782.

సూహోత సం, వి. విధుని యేవురు పుత్త్రులతో నొకఁడు.

సీ. సుతుల సుహోత్రుఁడు సూహోతగయుఁడు కపిలుం డవఁగోరి కనియె నేవుర. హరి. పూర్వ. 3. 86.

సూళ వి. రాగవిశేషము. (అనితోఁచెడిని)

సీ. కెలకుల గుజరాతి కెంపు జంత్రవు బొమ్మ లలఁతి వాయించు మద్దెలల రవళి, కెరలి కుందనవుఁ బంజరము వెల్వడి చిల్క లొయ్యన సూళాదులుగ్గ డింప, నెడనెడ గొరవంక లివురు గైదువుబోదు బిరుదు వక్కాణించి పేరువార. (ఇది కేళీగృహ వర్ణనము) చంద్రాంగ. 6. 131.

సూళగేరి వి. నాగవాసము (అని తోఁచుచున్నది).

సీ. చెలువొయెనా యేమి జేజేవగరి సూళగేరి ళోవలి మిటారిరిత్తైన. చంపూరా. 4, 83,

**సూళ(ళ్ళ)గే(కే)రి** వి (క. సూళ (ళె)గే(కే)రి). వేశ్యవాటిక.

గీ. అనుచు దమలోన గుజగుజలాడు కొనుచు, వలు గడలఁ బాఱఁ జిడిముడి గలిగి మెలఁగు, మురసతుల సద్దు నను వేల్పు మూళగేరి, వంతటమ వాల్లకల్లోల మయ్యె. వసుచ. చంద్ర. 3. 37.

తే. గీ. వలవు తలకెక్కి వాని మందులకుఁ జిక్కి జాతమెల్ల ను రోయు నీజన్మమేల, యొక్కనికి దక్కి చొకలైయున్న చెలిని, మూళగేరిని వెదకిపఁ జూపఁగలవె?. ప్రబం. 1. 951.

**సూళ్ళు** వి. బ. బాలక్రీడా విశేషము.

సీ. గచ్చకాయలు, కిట్టుగామగ్రిప్పు, గుజ్జ పెట్కుడు, మంటి గూళ్ళు మూళ్ళు. హంస. 3.149

## సృ

**సృంక** సం. వి. అ. స్త్రీ. ఆభరణముల ధ్వని, మార్గము

**సృంజయులు** సం. వి, అ. పుం. బ. ఒకజాతి ప్రజలు.

**సృకండువు** సం. వి. ఉ. పుం. గడ్డి, చీడ.

**సృకము** సం. వి. అ. పుం. 1. గాలి. 2. బాణము. 3. పిడుగు. 4. కలువ, కైరవము.

**సృకాలము** సం. వి. అ పుం. (చూ. సృగాలము) నక్క

**సృక్కణి** సం. వి. ఈ. స్త్రీ. పెదవి; పెదవి మూల.

**సృక్కము** సం. వి. అ. న. న్. న. సెలవి, పెదవి మూల.

**సృక్కి(ణి)** సం. వి. న్. న. ఈ. స్త్రీ. చూ. సృక్కము.

**సృక్వణి** (సృక్వణి) సం. వి. ఈ.స్త్రీ. చూ, సృక్కము.

**సృక్వము** సం. వి. ఈ, స్త్రీ. చూ. సృక్కము.

**సృక్విణి** సం. వి. ఈ. స్త్రీ. చూ. సృక్కము. పెదవి మూల.

**సృగము** సం. వి. అ. పుం. 1. బాణము. 2. భిండి వాలము. 3. సాఁగు. (శ. ర.).

**సృగాలము** సం. వి. అ పుం. నక్క. (రూ. సృకాలము).

**సృజన** సం. వి అ. స్త్రీ. సృష్టి.

తే గీ. ఇంద్రుతో పాటిగాఁగఁ బఱింద్రుఁ దొల్లి, సృజనసేయఁ డెయా విశ్వసృజుఁడు గడఁగి. భోజరా. 4, 67.

**సృజించు** దే. స. క్రి. పుట్టించు; నిర్మించు.

తే. కమల గర్భు సృజించి సకల జగద్ధు, రాని యు క్తినిఁ గావించి. భార. శాం. 9. 387.

కం. కమలభవుండు దాఁదపము కల్మినకాదె సృజించె నెల్లలో, కములను. భార. శాం. 5. 478.

**సృజికాక్షారము** సం. వి. అ. పుం. మూలక్షారము; స్థిర క్షారము.

**సృజి(యి)ంచు** సం. స. క్రి. 1. నిర్మించు.

సీ. అతనికి నాతఁడిట్లను బ్రహ్మ జగములు సృజి యించి భూత సంసృష్టిసేయ. భార. శాం. 3.442.

సీ. నిండారు చందురు నినుపాలు నమఁగాంతి చెలు వగా మరుఁడు సృజించినట్లు. మార్క. 3. 64.

వ. .... ఇమ్మహాద్యాది భూతంబు లేడును నానా విధ వీర్యంబులు వెలిగాఁ బ్రజల సృజియింపం జాలవు.... మార్క. 4. 8.

**సృజ్యము** సం. విణ. (అ. ఆ. అ.) సృజింపఁదగినది.

**సృణి** సం. వి. ఇ. స్త్రీ. ఈ. స్త్రీ అంకుశము.

కం. ... కుటిలాభల దముజగజ, స్ఫుటన కళా సృణికదేవ చూడా మణికిన్, నిరంకుశో. 1. 25.

**సృణి** సం. వి. ఇ. పుం. 1. శత్రువు. 2. చంద్రుఁడు.

**సృణి(ణీ)క** సం. వి. అ. స్త్రీ. లాలాజలము; ఉమ్మి.

**సృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. నడక, గమనము, గతి, 2. మార్గము, బాట. 3. పీడనము, హింసనము.

**సృత్వరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలుచున్న, నడచుచున్న, 2. ప్రవహించుచున్న. 3. వ్యాపించు చున్న.

**సృత్వరి** సం. వి. ఈ. స్త్రీ. 1. నది; ప్రవాహము. 2. తల్లి.

సృదరము సం. వి. అ. పుం. సర్పము.

సృదాకువు సం. వి. అ. పుం. 1. వాయువు. 2. అగ్ని. 3. వేడి. 4. వజ్రాయుధము. 5. సూర్యబింబము. 6. తొండ.

సృదాకువు సం. వి. ఉ. స్త్రీ. నది; ప్రవాహము.

సృపాటము సం. వి. అ. పుం. 1. కొలమానము లేక పరిమాణము.

సృపాటి సం. వి. ఈ. స్త్రీ. చూ. సృపాటము.

సృపాటిక సం. వి. ఆ. స్త్రీ. పక్షిముక్కు.

సృప్రుఁడు సం. వి. అ. పుం. చంద్రుఁడు.

సృమరము సం. విశే. (అ. ఈ. అ.) 1. పడచు చున్నది. 2. కదలుచున్నది. 3. ప్రవహించు చున్నది.

సృమరము సం. వి. అ. పుం. 1. ఒక విధమైన లేడి. 2. పెద్ద చమరమృగము. (శ. ర.)

సృష్టము సం. విశే. (అ. ఆ. అ.) 1. సృజింపఁబడినది; నిర్మింపఁబడినది. 2. విడువఁబడినది. 3. త్యజింపఁ బడినది. 4. నిశ్చయింపఁబడినది. 5. అధికమైనది.

సృష్టి సం. వి. ఇ. స్త్రీ. 1. సర్గము; ఉత్పత్తి. 2. ప్రపంచోత్పత్తి. 3. ప్రకృతి, ప్రపంచము. 4. సృజింపఁబడినది; భూతము. 5. స్వభావము. 6. త్రిగుణాత్మక స్థితి.

సృష్టించే సం. స. క్రి. సృజించు, సృష్టిచేయు.

సీ. మలయాచలంబునఁ గలశతమూఁజుఁడు ద్రావిడ శాస్త్రము నిఘంటువు ... లక్షణస్థితియు మొదల సృష్టింపఁదలపోసి ... కాశి. 3. 141.

సృష్టికర్త సం. వి. ఋ. పుం. 1. ధాత, బ్రహ్మ. 2. సృజించువాఁడు. 3. నిర్మాత, ఉత్పాదకుఁడు.

సృష్టిచేయు మి. స. క్రి. సృజించే.

మ. ... గ్రక్కునఁ దైత్రిలోక్యము సృష్టిచేయుమని శ్రీకాంతుండు పంపన్. దశా. 1. 301.

## సె

సెంజెన్ను అ. వి. 1. శిఖావిధి. (శ. ర.) 2. వాక్యము.

సెక వి. తాపము, కాఁక, వేఁడిమి, సెగ.

ఉ. ... సెకలెల్లఁదొలంగ మెలంగెఁదమ్మి పూ, చెంతకరళ్ల తుంపరలచేఁ గయిదండ యొసంగు తెమ్మెరల్. అచ్చ. తె. భార. వి. 3. ఆ. 41 పు.

ఉ. ఆసతిగూడి యానఁటి వవ్వమెఱుంగక యుండ నీమనం, గానివితత్పవత్ని బరగల్భితనంబునఁ జెంపఁ గొట్టుచుం,దా సెకపుట్టియప్పుడు తనద్పురతిన్. ముఖ చుంబనంబునుం జేసెవొ కోయనంగ. పర. 2. 46.

చం. ... కరిమరుడా కెఁదేంట్లు సెకగందిన ముత్తెపు సేసతో యవన్. ఆము. 4. 151.

మ. సెకలిమ్ముల్కి యొకండు ప్రేని కలఁద్రుంచెన్ జెల్పులగ్గింపఁగాన్. ఉ. రా. యుద్ధ. 498.

సీ. అగరుధూపముచేత వయ్యోతనూవల్లి సెక పోఁకె వని యొదజెయ్యివెట్టె. మను. 6. 8.

అకటా బెడిదపు వలపుల సెకలంబడి. నీలా. 1. 112.

సెకకంటి వి. ఫాలాక్షుడు.

చం. కళలకు సొమ్ము...సెకకంటికి మింటికిఁ జెన్ను లెన్ను తొయ్యలి నయిదోఁడు. పారిజ. పం. 4. 16.

సెకలి(లిం)పు వి. సకిలించుటకై హేష.

ద్వి. అలవిష్ణుచిత్తకన్యకతోడఁ గూడఁ జిక్కని తొలుబల్కు సెకలింపు జేసి, నెక్కసొంపెక్కి. ద్వి. పరమ. 5. 440 పు.

ద్వి. మించి మేఘంబుల మీఁదఁ దాటుచును జెలు వారు తోలుఁబల్కు సెకలింపుతెసగ. ద్వి. పరమ. 3. 286 పు.

సెకవెలుగు వి. సూర్యుఁడు.

కం.... అవరుం గ్రక్కున సెదమకన్ను సెకవెలుగు నకున్. య. 1. అ.

సెగ వి. అగ్ని.

తే. పురుము మదనసేత దృఢమైనఁ బుప్పఁబోడి వికృతిఁ జైకొన్న సెగపాత వెన్నగారె. కవిరాజ. 2. 17.

"ఏమి చేసెనా సెగకంటి సామిగూర్చి" నీలా. 1. 109.

2. వేడి, వేడిమి.

వెక్కసమగు పంరాతి సెగలఁ గ్రాఁగుచు. నీలా. 2. 48.

వ. నిట్టూర్పుసెగలం బొగులు వాతెఱలతో. ఉ. రా. 4. 94.

వ. మిగుల సెగలెగయు రవికాంత శిలాతలంబులం దెకతెక నుడుకెత్తి. పారి. 2. 87.

కడుపుమండించు నాఁకటిచిచ్చు సెగదాఁకి గదం జై యున్న కన్గవలవారు. కృ. జై. 7. 52.

3. తాపము, గ్రీష్మము.

సీ. సెగకుల్కు మెఱుఁగుఁ బొల్చిన జవ్వనరవిజల సరబి మల్లెలతోడి జడలు మెఱయ. ఆము. 2. 58.

సెగకంటి వి. శివుఁడు.

సీ. ఒక్క కాత్యాయని పొందంగ సెగకంటి పౌరుషం బరజేసి గ్రహలు నేర్పు. చంద్రికా. 2. 58.

సెగతేఁడు వి. అగ్ని.

సెగతేని దావ గొఱ్ఱెఁగలబంతి. య 1 ఆ.

సెగ్గము వి. నింద్యము; రోత.

మ. మగవా నీవు జగంబు చొప్పుమిగులన్ మానంబు వాటింతువా, లిగ సెగ్గంబగు మాట వాటిలెనె. నిర్వ. 5. 101.

కం. సెగ్గంబుల దెనఁబోవక, సిగ్గులు గైకొనక మానసీమ జనకపే, రగ్గలిక రెండు మనసులు దగ్గటి చూపుబడి నుత్కటంబుగఁగలసెన్. హరి. ఉ. 7. 176.

ఉ. ఇంతకుమున్న యిచ్చెలువ లెవ్వరుఁబూదరు నిమ్ము నేదకా వింతగ వచ్చితే కతలు వేయును నేటికి నవ్వనక్షమై, చింతయు భాషణంబుల్లను చేఁతలు నీ త్రివిధంబు నీడుగా, కింత దలంకనేల కలదెవ్వఁడు దగ్గఱనేని సెగ్గమే (చెలు లుషాకన్యతో నన్నమాటలు) ఉ. హరి. 5. 94.

సెగ్గించు స. క్రి. 1. రోయు.

ద్వి. తమసేయు క్రమముఁ దత్క్రియముఁ గద ముట్టఁ దెలిపి భూకాంతు సెగ్గించి. ద్వి. పరమ. 6. 488.

సీ. కడు వశక్తుఁడు ప్రోవఁగాఁజాలఁ డితఁడని సెగ్గింతు రర్థిఁ గృపీవలుండుబడుగు మునలెద్దు రోసినదగిది. భాగ. 8 స్కం. 981.

శా. ఏ నుండఁగ నరేంద్రసింహముల నీ విక్షేల సెగ్గించె దిచ్చో మృగాటవిలోన నాఁడటు పశుప్రోమంబులం గాచుప, ల్లానే కేళన లావుఁ జేవయును ధైర్యంబుం గలం డంద్రు. హరి. ఉ. 1. 118.

ఆ. దానవ సంఘంబు గాలవశతఁ బొందుచేటికి సెగ్గింపఁ బొమ్ము నీవు.

2. నిందించు, తెగడు, దూఱు.

ద్వి. అట్టి తండ్రికిఁ బుట్టి యభిమాన ముడిగి, ఎట్టకో నేర్పితి యీ కష్టదశకు, సెగ్గింపఁ బడిన యీజీవనం బేల వహ్నిలోఁ బడి చత్తు నవమానమున. రం. రా. ఉ. కాం. 181 పుట. 22 పం.

కం. తన హృదయమునం దెన్నఁడు, నను నించుక పొందనీఁడు నా యెదలోఁ దా, ననిశము నుండు నిదేమిటఁ, జనువని మది మన్న విభుని సతి సెగ్గించెన్. కుమా. సం. 8. 147.

గీ. అనుచు తెఱసాలవారికి నప్పగించి, యాదవకుమారుఁ గూఁతును ననురవిభుఁడు, మనసు లోపల సెగ్గించి మరలిపోయె, నాత్మమందిరమునకుఁ గుంభాండుఁ గూడి. ఉ. హరి. 5. 274.

సెగ్గింపు వి. రోఁత

సెగ్గు వి. (సెగ్గము) వి. రోఁత.

సెజ్జ వి. శయ్య, పానుపు. (సం. శయ్యా)

తే. రాలియున్న పుష్పప్రకరము విదిర్చి, చెన్నుగా

మన్న నేసిన సెజ్జ యనఁగ వేగుటయుఁ జుక్క-లన్నియు విరిసి విశద, భాతిఁ జెలువొందె జూడ వంబరతలంబు. భార. విరా. 2. 239.

ఆ. సెజ్జయందు మేను సేర్చి యర్జునకార్యచింతఁ బలుకకుండ. భార. ద్రోణ. 2. 340.

సీ. స్వాంసహాకు, గాసె నమకట్టు వుట్టంబు, గగ నంబునకు నెల్లఁగలువసెజ్జ. భీమ. 3. 51.

గీ. దేవదేవుని విరిసెజ్జఁ దిరము సేసి. హర. 2. 37.

సీ. సెజ్జపైఁ బఱచిన చేమంతిరేకులు కలయ నిండీ వరదళము లయ్యె (ఇట యతి మైత్రిని బట్టి సెజ్జ యనియే రూపము గాని "సజ్జ" యని కాదు) విక్ర. 1. 137.

సీ. చెయిపట్టి వయమున సెజ్జసేర్చె. మను. 6. 8.

సీ గీ. అరజేపువన్నెఁ బఱిసెజ్జ కరుగుఁ గూర్మి. ఆము. 4. 50.

సెజ్జ = సెజ్జవేయువాఁడు? (1085) దా. శా. 1112.

సెటిసాని వి. వైశ్యభార్య. (రూ. సెట్టిసాని)

చం. జడమతిభార్యయొక్క- సెటిసాని విదర్భుని పీటనుండి నొంపదరఁగఁ గర్మలబ్ధిఁ గడుపై కడుఁ బైకొనుదండి నొప్పులం బడు. వేం. పంచత. 5. 39.

సెట్టి వి వైశ్యుఁడు. వర్తకుడు. (సం. శ్రేష్ఠిః)

సీ. హరిదత్తుఁ డనుపేరఁ బఱగుకోమటియింటి వరవుడు శూద్రావ్యవాయమున జ. శే నించి దానికి విటుఁడవై నీవు నిట్టి సంజ్ఞనా వైశ్యునకుఁ బరిచర్య నేసి తిరుగుదువు సెట్టియు మురారి చరణ కమలయుగళ నిశ్చలభక్తి సంయుతుఁడు గావ. వరాహ. 8. 97.

కం. ధనమిత్రుం డనుసెట్టికి నమ వాగ్దత్తంబు చేసినం. దశకు. 5. 77.

ఉ. అందఱిసెట్టు లందఱు దయామతి నన్ దిగి తెచ్చి యొందలో, వందమయొద్ద పెట్టుకొని. దశకు. 10. 59.

గీ. సింహవిక్రమపట్టణ శ్రేష్ఠు డయిన సెట్టి. హర. 1. 17.

2. కోమట్లు లోనగువారి పట్టుపేరు.

సీ. కాంచిలోఁ జిరకీర్తిఁ గాంచి మించినయట్టి శ్రీగుప్తుఁ డనియెడు సెట్టి వట్టిఁ... విక్ర. 7. 105.

సెట్టిశ్రేష్ఠి = పెద్దకోమటి.

సెనగ = సనగ.

ఉ. చిఱుసెనగలు (వ్యవహా.)

సెనగలు వి. బహు. వ. ధాన్యవిశేషము.

(సం. చణకాః)

కం. అనుములు గోధూమంబులు సెనగలును బండు మేదిని.... భీమ. 4. 67.

సెపియించు స. క్రి. (రూ సెపించు) శపించు.

కం. నృప నీవు మదియం బగు, జపముఫలం బడిగి తేమ నమ్మతి నీఁగా, విపరీతఫణితు లాడిన సెపియించుఁ జమీ యెఱుంగఁజెప్పితి నీకున్. (శ. ర.) భా. కాం. 4. 157.

సెబాసు హిం. విశ. ఆశ్చర్యకరమైన, వి. ఆశ్చర్యము.

చం. సెబాసగు ఘోడ యటంచు మెచ్చుచున్. ఇందు. 5. 53.

సెబాసు అవ్య. ప్రశంసార్థకము.

చం. తెలుఁగునఁ జెప్పఁజెప్పిన సుధీజనులెల్ల సెబాసు ధూర్జటీ, బళి యని తక్కుగుల్కునగఁ బాటిలు తేట మెఱుంగు మాటలన్, మెఱుకువ గాంచు తెక్కు- జిగిమించు ప్రబంధతతుల్ ఘటి.తు వౌఁ,బలు కుల ముద్దరాలిమిహి బంగరుటందెరవల్ సెలంగ గన్. ఇందు. 1. 311.

చం. పక పక నవ్వి రావణి సెబాసుర యోరి జయంత దేవకా, నికరములో బలాఢ్యుడవు. ఉ. రా. 4. 318.

సెబాసురె అవ్య. (సెబాసు+రె) ఆశ్చర్యమును దెలుపు నవ్యయము.

చం. ... వన్నువంటి తొ,య్యలి విడనాడ నీ యెడ వయారె సెబాసురె యింటి వారి యం,దుఱ మహా

ముంబు గాక నిను దూఱంగఁ బల్కఁ బనేమి? శుక. 4. 40.

సెబ్బర విశే. చెడ్డది. (రూ. సెబ్ర)

సెబ్బర వి. చెడుదు.

సెబ్ర విశే. చెడ్డది.

మ. ... గుణమా సెబ్ర, వివేకమా నహి మనోగూఢత్వమా లేదు భాషణమా కల్ల. హంస. 5. 111.

సెబ్రచెంచరము వి. చెడ్డదేగ, ప్రాణిహింస చేయువాఁడు.

తే. తలచు బ్రహ్మస్వ దేవస్వములకు నెగ్గు,కుప్పఁ జిచ్చిడి పేలాలు కొఱకఁ దివురు, గ్రహణ కాలంబునందు ముగ్గఁడు జలములు, సెబ్రచెంచరమా బ్రాహ్మణ బ్రువుండు. పాండురంగ, 4. 165.

సెమ్మె వి. దీప స్తంభము.

సెర వి. (సం. శిరా.) రేఖ, కంటిలోని జీర

వ. ... నెరండ నిడువాలు కెంజిగ సెరల కన్నులన్. ఆము. 6. 98.

వ. ఎఱ్ఱ సెరలతోడి కపిలకన్నుల వెరంగు చూపులను. హరి పూర్వ. 5. 143.

సీ. చెలువంబులగు నెఱ్ఱ సెరల విశాల విర్మలనేత్రములు పవత్మ్రకురాజి. హరి. ఉ. 8. 191.

ద్వి. చేవ విండ్లును నెఱ్ఱ సెరల కన్నులును. హరిశ్చం. పూర్వ. 562.

తే. లేచి కూర్చుండి కలయంగఁ జూచి యెఱ్ఱ, సెరల కాంతియు దంతరుచియును బెరయ. భార. అశ్వ. 4. 84.

కం. వరుఁ డలుక వొడమియును సుస్థిరుఁడై తన యెఱ్ఱసెరల చెలువునఁ గెందామర లందెగడెకు కన్నుల, వరుణచ్చని నెఱయనిట్టు లనియె నరేంద్రా. భార. ఉద్యో. 2. 132.

కం... అవ్వన జాతు లెఱ్ఱసెరలొప్ప నతని వీక్షించి యార్చి బరవన మలరన్. భార. ద్రోణ. 3. 173.

సీ. కఱ్ఱెఱ్ఱ సెరల దీర్ఘ విలోచనంబుల కడల నగ్ని స్ఫులింగంబు లురల. కృ. నై. 7. 46.

సెరగు దే. వి. అవద.

కం. ధరణీసుర వరులకుఁ గడు, సెరగై నెడ నెఱిఁగి యొదయు జేయుదురె మహాపురుషులని భార. ఆది. 8. 118.

సెఱవు దే. వి. (రూ. సెఱగు) ఆపద, హాని.

తే. గీ. భక్తిగిడ్డడి పేనాని పనుపునేసి తడవు లేదేని గలిగిరేవడవు మొఱడె. కుమార. సం. 10. 50.

సెల వి. 1. కొండ, రాయి (సం. శిలా)

సీ. కొండ మల్లయ్యచే నుండునందురు గాని జంకను గావ మేనంక నైన... అలకంబయ్య కానైనదేమో కాని సింగ మొక్కటయైన సెలల లేదు. యయా. 1. 106.

వ. సెలయేటి చిలువ చిలువ నీరు వగలు గగనమణి ధగధగని కిరణముల మిగుల సెగయు. పారి 2. 82.

కం. సెలయేటులలోఁ జిల్లులు, చిలుకుట నాడు దురుముసుల చివురుంబోణుల్. హర. 5. 56.

2. సెలయేటు, కొండవాగు. నిర్ఝరము.

సీ. సెలవెవ్వకొని రొప్పువులినైనఁ డిడించి పడనైతుఁ దెచ్చి నీ పాద మాన. మను. 4. 184.

వ. ఎఱకలు విఱుగ నఱికిన యెడల సెలలకు నిగిడిన తెంగల పొలుపు నంకెఱుల నెరగొని పొరలు బరద జగర నికరంబులును. పారి. 2. 86.

సీ. చలి గాలి దిండి మేఁతల జాతికొమ్మల యాటల కిరవైన యట్టి సెలలు. ప్రబం. 1. 155.

కం. తలవరుల్ నెలవరులుం, బొలవరులున్ వచ్చి యంత భూపాలునితో, మలలందున్ సెలలందున్, శిలలందును నెల్ల వారసిరి మే మందున్. సారంగ. 8. 289.

3. బాణపు ములికి. (శల్యమ్. సం.)

కం. ఆతతబలుఁడగు భీష్ముని, చేతిబలుపు ద్రోణునంపసెల లనియుటయుం, జూతురు. భార. ఉద్యో. 4. 192.

సీ. అలిగిన గాండివి యమ్ములొత్తుకమ్మడి, ముందటి దెసను బిఱిందివలన వలపట దాపట సెలలు వెక్కవిసిన తెఱఁగునఁ గవిసిన విఱుగు విల్లు, దునియు ఖడ్గంబును. భార. ద్రోణ. 3. 48.

కం. గొడుగునను వింటికొమ్ముల, పిడమున వరదంబు సెల లవిసి కడున్. వడి నిగిగెడు దాడ్పున వ్యవ్వడ ముడి దెసనమ్ము లడరె వసుధాధీశా. భార. ద్రోణ. 4. 422.

చం. .... అంపపెన్ సెలగతి మాగతిన్ వెమకఁ జిక్కక మావరు. ఆము. 2. 27.

కం. వలచుట్టి పిడుకొనుచుం, బలుగు దొరల్ విభుని బొగడి పోవ నసుర గ్రక్కిలి యేసెఁదామ పాత్రముఁ సెలలవిసె ననంగఁ గప్పి చీఁకటు లెసఁగన్. రామా 8. 219.

తే. అచటి పందులఁ జెప్పంగ వలవి యగునె, చప్ప రింపంగ సెలవుల జాలుపొంగ, సెలల బెడిదంపుఁ గోలల సెలగఁ బుట్టి, మట్టుమీఱిన కాఱగ్గిఁ బుట్టు మంచు. చంద్రాంగ. 2. 60.

4. (బాణముల) పాది.

5. పిదుపంది ముల్లు.

వ. లకోరికోలల చందంబున నందం బగు సెలల బృందంబు ఘలుఘలు మనంగఁ బొంగి బెదారున కొన్నింటి యవయవంబులు తూటుల కావలరితిబల్లి దల భాతి జోరున నెత్తురు గురియు వెడఁద గండ్ల బోఁడిమి వెడఁదాఁకి వెన్నున తెన్నారు ముండ్లు బొమ్మున నాఁటి పిఁపున వెడల నెగిరి పైఁబడి కొలతంబడిన లాగున గోరలు కొన్నింటి గవుల కిద్బుక వరుగు నేదులు మెలంగు నెలవులును. చంద్రాంగ. 284.

6. పశురోగ విశేషము.

ద్వి. మొలవిడి సెలతెవుల్ ముగుబంతికవట, తల యేరు తొడకు వాతము కల్లవావు, వలదొల్ప తెవులును నాదిగా నెన్నఁగల పసరాల రోగములకు నెల్ల. నవనాథ. 1. 41. పు. 4 పం.

సెలకట్టియ వి. బాణము (రూ. సెలకట్టె)

చం. గఱులు మునుంగఁ దూలు సెలకట్టియ వాటులఁ గుంతకూలమున్. భా. రా. యుద్ధ. 977.

చం. కనుఁగొను వంతలోన సుమకార్ముకుఁ డాత్మ విరోధి కల్పునిన్. ఘమని మడింగలంచఁ దటి గప్పడె నంచుఁ గుతూహలాత్ముఁడై, కనుగల వింట దమ్మి సెలకట్టియఁ దెక్కడి చక్కగా నుర, మ్మున గురివేసిన సముత్కట మోహము నిల్పఁజాలమిన్. చెన్నబ. 2. 241.

ద్వి. సెలకట్టియలు గొప్పతేవడంబులును సిల కట్టియలు పెక్కు చిక్కుల వలలు అ. మ. క 5 ఆ. 221 పు. 28 పం.

సీ. ఎగిరి పైకొనిమీఁద నెవ్వఁడు దలమూపకుండంగ దినము బాణోత్కరముఁ గప్పుటిచెల సెలకట్టియలను ద్రేయుఁడు. హరి. ఉ. 1. 88.

ఉ. కట్టిన నీలిదిండ్లు సెలకట్టియ విండ్లును. మను. 4. 83.

వ. కట్టలుకం గట్టలు వడనేయు కట్టడి మరుని యంప సెలకట్టియలు వసు. 2. 141.

వ. అంగళపు కొంగవాలు లవ సిరివట్టి సెలకట్టియ లవనలరాజు భిండివాలంబులన. భీమ 1. 117.

2. బాణమువలె వేగముగాఁ బాఱు శ్యేన విశేషము.

ద్వి. సెలకట్టియలు పెక్కు చిక్కుల వలలు. అ. మ. క. 5 ఆ. 221. పు. 29. పం.

సెలకట్టు అ. క్రి. మొనకట్టు.

కం. సెలకట్టుకటులు నిభలా, కలకట్టకడలకుఁ దక్కు జనములు తమ బం, తెలు కొట్టఁబడుచుఁ బరువన్ గిలకొట్టుచు నప్పురవుడు ఖేచర వీరుల్. లక్ష్మి. వి. 2. 89.

సెలకట్టె సెలకట్టె వాటునఁ జెలఁగి రెంటివి మూటఁ గూడ గుజ్జంబుల గుదులు గ్రుచ్చు. కేయూర. 1. 29.

వ. కాడినంటిజి నలకయూచె సెలకట్టె సిళ్ళను ద్వాత్రింశదాయుధంబులు. ప్రబం. 1. 78.

మ. వలువందం గడు పిట్టతెట్టరొద నన్నన్ సద్దు గావింపుచున్, సెలకట్టెం గొని జేఁదుమైల మృగయుల్ చెట్లొక్కటం గొట్టఁగన్. చంద్రాంగ. 2. 107.

తే. గీ. అర్కనందను సెలకట్టెయంపకోల, పులుఁగు రాయని కాక్కాల పుణ్యభిత, కేతకీ పుష్పవానవా

కృత్రిమాని, వర్యతేంద్రంబు తరిత్రాదు పావతేరు క్రీడా. 1. 221.

ఆ. వె. చేత దేగఁబట్టి సెలకట్టె గైకొని, ప్రొద్దు పోక పాలము వోయెనేని, దినము వలసినన్ని తేవచ్చు పురుగుల. చంద్ర. 2. 12.

గీ. గొత్తి త్రొవ్వియు సెలకట్టెఁ గొట్టినట్లు. భీమ 4. 48.

2. బాణమువలె వేగముగాఁ బాఱుశ్యేన విశేషము, డేగ.

కం. మొలదట్టి చెఱఁగుఁ జెక్కుచు, బలుదిట్ట కిరాఁతు డొక,డు పటువగుముష్టిన్. సెలకట్టెఁ బట్టి వేటాక సెలకట్టెన్ గొట్టవై చెఁ, జెమరుం గాకన్. మను. 4. 57.

సెలకొట్టు అ. క్రి. కుమ్ము, పొడుచు (?)

ఉ. ... ఏకలంబు లా, హా మనవచ్చునే యని మహారథటన్ సెలకొట్టి రొప్పినన్. చంద్ర. 1. 8.

సెలకొయ్య వి. (వి. సెలమకొయ్య? వృక్ష విశేషము తిరుపతి మండలము వాడుక) వడ్రంగి యుపయో గించునది.

సెలగ(వ) వి. ఉపశాఖ, రెమ్మ.

సీ. రెమ్మ రెబ్బరి వటరివ్వ సెలగ చివ్వచివర మల్లె జబర చివర మరిగ. అం. భా. 2. 37.

సెలవ(గ)లు వలవలు = శాఖోపశాఖలు. ఉదా. ఆ శెట్టు సెలవలు వలవలుగా పెరిఁగినది.

2. ధాన్యములను కొల్చు మావ విశేషము. పాం. ని మావ. 52.

3. అమ్మువాఁడు కొనువానికి అదనముగా నిచ్చు సరుకు.

ఉదా. కొబ్బెర కాయలు మొ. వానికి సెలగ చేతులు వేయుదురు. ద్వి. వ. యో. వి. 66. 480.

4. దోసెడు గింజలు. శ. ర.

పందికోల యొక్క అగ్రము - (అని తోఁచినది) ?

తే అచటి పందులఁ జెప్పంగ నలవి యగునె, చవ్వ రించిన సెలవుల జారు నొంగ, సెలల బెడిదంపు గోలల సెలగబట్టి, మట్టుమీఱిన కాఱగ్గిఁ బట్టు మంచు. చంద్రాంగ. 2. 60.

సెలగట్టె వి. (సెల+కట్టె) సెలగొయ్య, గుదికఱ్ఱ. మెడలోఁ గట్టెడు కఱ్ఱ

తే కుడిచి కూర్చుండి మీ రేల కొఱఁత యైన, కుమ్ములాడెదరో యన్నదమ్ములార ! గొత్తి త్రొవ్వియు సెలగట్టెఁ గొట్టినట్లు, కటకటా మీ వివేకంబు గాడుపడఁగ. భీమ. 4. 58.

సెలగత్తి వి. (సెలకొ+కత్తి) కల్లుగీఁచువాని కత్తి.

సీ. ...అడిద,మున బల్లెముల నీఁటియల సెలగత్తుల గుదియలఁ దూపుల గొడ్డళులను జెండు చెండాడి. అ. రా యుద్ధ. 2. 89.

సెలగదోసిలి వి కొలతలో ధాన్యమునకు నూటి కొక సారిగాని యిరువదింటి కొకసారె కాని వ్యవహరింపఁ బడుమాట, ఇట్లన్నతరువాత మొత్తము లెక్క తెలి యుటకై వేఱుగాఁ బోసిన దోసెడు గింజలు.

సీ. వెలయు రాసులఁ బోల్చు విమవీథి కళ్ళానఁ జెన్నందు సెలగదోసిళ్ళ) వంగ. విప్ర. 3. 28.

సెలగనిపించు స. క్రి. (సెలగ+అనిపించు) సమృద్ధి సేయు.

గీ. అన్ని వస్తువులు సెలగనిపించుఁ దైత్రిలోక్య భద్రకరులు వీటి శూద్రవరులు. కకు. 1. 129.

సెలగు(వు) స. క్రి. ఖండించు.

స్రగ్ధర. చెండాడెన్ సెలగె సెలుఁగులన్ జించెఁ గాఱ్పోతులన్ మైకండల్ గాఁచేసె నిల్లన్. యయా. 2. 32.

సెలగు అ. క్రి. ధ్వనించు, మాఱు సెలఁగు. అ. క్రి. మాఱుమ్రోయు.

ఉ. .... ఇంకఁ గథలిన్నియే నేటికిఁ జావుదక్కనే, దిక్కున నొందుతే దనుచు దిక్కుల మాఱుసెలంగ నేడ్చుచున్. భా, రా. అర. 174.

సెలకొమ్మ వి. (సెలగ+కొమ్మ) ఉపశాఖ.

ఆ. కొమ్మకు సామిమావి సెలగొమ్మకు సాటియె కోటులయ్యెడన్. రామా. 4. 66.

సెలగోల వి. 1. పసుల మేపుగొల్లవాఁడు. ధరించుకోల (చేతికఱ్ఱ) (సెల+కోల)

కం. మొలసీలి కాసెయును బదనుల నోరచ్చులు ధరించి ముదము దలిర్పన్, సెలగోలయు ములు బంతియు, బలపముఁ గత్తియును బూని పటు సాహసియై. హరిశ్చం. 5. 111.

చం... కాఁచీరయు సెలగోల కత్తి. దశకు. 5.72.

చం. మనుసెలగోల సేకొని మనోహర మౌ తన మేనురాజుచూపున బ్రజచూర్కులం దిగువ. భార. విరా. 1. 279.

మ. కనిచేతన్ సెలగోల పట్టికొనుచున్ గానిమ్ము గానిమ్మురా తనయా. భాగ. 10 స్కం. 362.

"సన్నంపు సెలగోల చేంకనిటికి" నీలా. 1.31.

2. త్రవ్వుట మున్నగు వానికై దొంగ లుపయోగించెడి సాధనము, ఆయుధ విశేషము

ఉ. కత్తెరం గావికన్నడము కాటుకయున్ సెలగోల చీరయున్, గుత్తపుటట్ట నంబువులు కుక్కల కట్టును పిండిబల్పమున్. చెన్నబ. 3. 294.

ద్వి. సెలగోల యొంటట్ట చెప్పులు పీక. బస. పురా. 128. పు. 1. పం.

3. బాణవిశేషము.

కం. సెలలగోలలచేఁ బులుగుల, బలుకోలల మృగకులములఁ బరిమార్పఁగతిన్, సెలగోసెల గని పారిఁ గొని, రెలకోలలనే పదాతు లితరేతరులన్. లక్ష్మి. వి. 2. 78.

సెలగోసెలగ వి. యుద్ధమందు పదాతులనుకొను మాట.

కం. సెలగోలలచేఁ బులుగుల, బలుకోలల మృగకులములఁ బడిమార్పఁగతిన్, సెలగోసెల గని పారి గొని, రెలగోలలనే పదాతు లితరేతరులన్. లక్ష్మివి. 2. 79

సెలపంది వి పదుపంది, ముండ్ల పంది.

సెలపుండు వి. నారికురుపు, నాడీవ్రణము.

సెలబుగ్గ వి. చిన్న సెలయేఱు.

ద్వి. ఉన్నతోన్నతమైన యుదయ శైలమునఁ, జెన్నొందు నమృతంపు సెలబుగ్గ యనఁగ, ద్వి. 4, 303. పు.

సెలయు = చెలయు న. క్రి. 1. చిమ్ము శ. ర. 2. కొమ్ములు మొ॥ వానితో పొడుచు.

సీ. అలవోకఁ గనకాద్రి సెలయుచో విరిసిన హరి వరాహము దంష్ట్రవివతరించె, పాండు 1.

సీ. కలంచి కలశవారిధి బయల్ సెలసి కొమ్మున గొట్టనంటి వచ్చిన నాఁచుటుంటపుడమి. శ. ర. చంద్రాంగ. 1. 75.

సెలయు అ. క్రి. విజృంభించు.

సీ. కొన్ని జాగిలములు కోలాగ్రమున నిల్వ నొక కొన్ని వెనుకకాలికిని నొడియు, నొడియుచో గ్రోడంబు వెడమరఁదిరిగి వని జారి యెదిరికి నట్లు కవియుఁ, గవియుచో మఱి యేకలమంది సెలసిన పెట్టుచే నని కిటి వెంటఁ బెట్టు. రాజవాహన. 8. 66.

ద్వి. ముక్కుల తెక్కలు మురువుగాఁ దీర్చి, చొక్కంపులేమావి సుదకొమ్మ లెక్కి, సెలసి లేఁగొన లెత్తి సెలవులఁ ద్రుంచి కలగొనలు కలుగవా నవ్వశించి (ఇది కోకిలవిషయము) నవనాథ. 1 ఆ. 12 పు. 8 పం.

ద్వి. చేలఁ గట్టఁగ నన్ను సెలసి పట్టెదవు మేలమో యిది మందమేలమో యనుచు. అ. మ. క. 5 ఆ. 245 పు. 28 పం.

మహాస్రగ్ధర. గుబుమట్టం బైన తోకం గొని విసరు వెసం గూలఁగాసాలపంక్తుల్, పటుచుం దాటించి దాడల్ పయికొను సెలయున్ బల్మటుం గల్లు పెట్టున్. వరాహ. 12. 82.

సెలయూట (సెల + ఊట) వి. కొండయూట. (శ. ర.)

సెలయేఱు వి. (సెల + ఏఱు) పర్వతమునుండి పాఱెడు నది, నిర్ఝరము.

చం. ఒక సెలయేటిచెంతఁ గననొప్పు రసాలసువర్ణ పాటలీ, వకుళకదంబనింబవనవాటి. పె. శకుం. 2. 195.

తే. కపులు గొందఱు నెత్తురుగాఱఁ గూలి, తఱుచు జేవురుసెలయేళ్ళ నొఱపుగలిగి. భా. రా. యుద్ధ. 1259.

కం. కలువలు కిలకిలనవ్వెన్, దోకముసెలయేటి యవలితుహినాంశుకరం,బులు గని యవుదేటావళి గిలిగింత లటంట వానికిన్ సరిదాంకెన్. సారంగ. 2. 162.

తగడ శ్రీకరముగ నగ్గిరి మందాకిని సెలయేరై యనిశముం బ్రవహించు. వరాహ. 10. 144.

చం. ఎలమి పూరి మేసి సెలయేటులనీరలు ద్రాగి .... కుమారసం. 6. 107.

మ. సెలయేటుల్ గడలొత్తఁ జేయుచు లతానీమంతినీవర్ణనం,బులు గల్పించుచు మత్తభృఙ్గ రుతముల్ పాల్పొందఁగాఁ జేయుచున్, వలనై తానవ మారుతంబు దనకున్ వాంఛానురూపంబుగా. హరి. ఉ. 1. 57.

సీ. కుందకంబు మదంబు కలసైలకూటంబు సెలయేటియాటలోఁ జెలిమిసేయ. రాజవాహన. 2. 50.

ఆ. చెలువు రెట్టిగాఁగఁ జేలువు సెలయేటు, లున్నతాచలమున నురలువట్లు. భార. భీష్మ. 3. 146.

తే. అనుచుఁ దోటులఁ దొరుఁగురక్తాంబుధార, లంగ మెల్లను గప్పిన నవ్వు దోప్పెఁ, గావి సెలయేటు లెల్లడఁ గలయఁబర్వఁ, దోలుచే కులపర్వతంబు డాల్పున నతండు. భార. శల్య. 2. 191.

చం. సురపతిదాడి వంబునిధిఁదొచ్చిన యదుద్రిలు విచ్చ లప్పుడిన్, దిరుగగ వాత్మఁగోరి శరధిన్ బరిభాగ్యుతిఁ గాపుపెట్టి తా, రయుదుగ భద్రసామజముతై సెలయేటులు శావధారలై ...విక్ర. 186.

సీ. .... తే. నిద్ర మేల్కాంచి సెలయేట నీడఁ గాంచి ... విడుచు గజరాజు నీధాటి వింధ్యవాటి. ఆము. 1. 89.

సీ. సెలయేటి యినుక లంకల వరాహంబులు మొత్తంబులై త్రవ్వికుస్తె లెత్త. మను. 2. 7.

వ. ప్రవహించు సెలయేటి నీటితుంపరల్ దొరసి. ఉ. రా. 3. 191.

సెలర్పు అ. క్రి. ఉత్సహించు.

చం. ఉరుటఁ దెమల్చి మ్రింగు...ఉప్పరం బెగయఁ జాతకపోతముల్ సెలర్పుచున్. కమా. సం. 6. 99.

సెలలుపాలు అ. క్రి. (సెలలు+పాలు) సెలలు వేయు.

గీ. పటుపోటు ప్రేటు సేవియు లేక వస్త్రములు సెలలుపాలి మానవట్టి, భీకరంబులైన శోకవ్రణంబుల కౌషధంబచింత యఁద్రుబుధులు. ప్రబోధచం. 5. 3'.

సెలపడు (సెలవు+పడు) అ. క్రి. (కులువు) రంధ్రముపడు; సెలపాఱు.

కం. హరునంటా లం బోఅంబడి శిరమునకున్ వెడలె నీరు సితఖండము చంద్రుర యది సెలపడి వేఁడున్, దొఱఁగెడు పులినీరు గాంగ తోయము పేరన్. చంద్రాంగ. 5. 75.

సెలపాఱు ద్వి. అ. క్రి. (సెల+పాఱు) సెలవేయు.
గీ. త్రిపుర సంహార మొనరించునపుడు హరుఁడు, బండికల్లుగ నిమేము గండిచేసె, వదియు సెలపాఱి తెగటాఱవైరి చంద్ర, యకట రోహిణియొద్ద నవత్యముఁ జేసి. మను. 8. 40.

సెలవి వి. (సం. సృక్వి.) పెదవిమూల.

మ. సెలవింబాఱఁగ నవ్వుచుం బలికె నా శేషించి యీ వేర్పుమాటలు మా ముందర సాగిరావు హరిశ్చ. 2. 190.

కం. డాలఁగ నిచ్చలు వెన్నయుఁ, బాలుం గుడక గాని తల్లి వట్టిక సెలవిన్. వ్రేలిడి యింతింతయకాఁ గోలించును. హరి. పూర్వ. 1. 197.

ద్వి. సెలవిపైఁ జిఱునవ్వు చిలికెడుమోము. హరిశ్చ. ఉత్త. 133.

కం. అని సెలవి బాఱనవ్విన, వనితం దిలకించి కోపవహ్నికణంబుల్, గముఁగొనల జారఁగా నిట్లని యెన్ మిహిరాధరాధరాత్మజ పెలుచన్. చెన్నబ. 1. 147.

సీ. తటినీ తటంబులు దఱిసి యోరగ నిల్చి సెలవి కొమ్ములఁ గ్రుచ్చి చిమ్ముకొనుచు. శ. రా. 2. 6.

ఆ. చేతఁ దాడిక్రింది సెలవికేలను బట్టి యసమ

చం ...తమ దండపుఁ గోలల నున్న మాఱుగోచులు వెనుచ్చిపై చి కడు సొంపులుగాఁ బొగడించుకోలు మీ, తలఁపఁగ నివ్వు డింత తెగదారుల మైత్రిమి భద్ర నావుడున్. ప్రభా. 1. 102.

కం. చెప్పంగఁ దగిన మాటలు సెప్పి మరాళంబు నమువఁ జిత్తంబున సొం, పుప్పతిల నిల్లు వెలువడి, యప్పగిదిన్ విష్ణుదాసుఁ డరిగెడు వేళన్. హంస. 1. 111.

9. కాంతి, ప్రకాశము.

వ. పొడవు కెంపుసొంపునింపు ... కెంపురవ చెక్కడంపు .... దశా. 1 14.

10 విధము, రీతి.

"కలుకుటమ్ముల గుంపుఁ సొంపునఁ జెంపారు కలువల క్రొవ్విరులును. నీలా. 8. 10.

చం....వారి బల్లోడవుల రాలి ముత్యములు తోరముతై తోరగెం బురఁబునల్లడలఁ బ్రసూన కోరకని కాయము నింపిన సొంపు పెంపులన్. వసు. 1. 147.

సీ. వల్లవిగపాదపంబుల ఫలిత భూజములను బుష్పిత తరువుల ముద్దుగుమ్మ, పికవిలాసినికై వడి శుకవధూటి, పొల్కు మధుకరరమణి సొంపువ జరంచె. కవిరాజ. 2. 147.

11. దృష్టి విశేషము.

తే. గీ. సొగసు తెలివాలుమను సోగసొంపు తళుకు, బెళుకు చికిలి యొయారంపు దేలింపు చుఱుకు టోర,కలికి బెదరెచ్చు చూపుల కలికిఁ జూచి. ప్రబం. 1. 108.

సొంపుగను అ. క్రి. (సొంపు + కను) సొంపగు. ఒప్పు.

గీ. కుందకళికాఖ్యఁ దగు ననంగుడు ధరించు, ప్రవర మెదరించాపళి కదిరి చెదరి, ప్రథమవర్ణరహిత దరగతిని దిరిగి, పెంపఱియుఁ దద్రదైక్యపు సొంపుఁ గనియె క. 113.

సొంపుడుగోల వి. (అర్థము విచార్యము) చేత ధరించు నొక రకమైన కఱ్ఱ:

ద్వి. సోగైన వలకేలి సొంపుడుగోల బాగైన ముంగేలిపై జాళిడిగ. ( , సరసు. ౩. ౩౭౬ వు

సొంపెనయు అ క్రి. (సొంపు + ఎనయు) సొంపగు.

సీ బహుసిధోపాయుంబుల సుఖ్య మెనిమిదికోట్లు సొంపెనయఁగూర్చి. జాహ్నవీ. . ౬.

సొంపెనయు స. క్రి. (సొంపు + ఎనయు) సొంపొందు.

సొంపొందు అ. క్రి. ఒప్పిదమగు, ఎసఁగు.

మ. కరిగ-దస్రుత దానవారి యమునాకల్లోలముల్ వాహలాబాంబువుల్ సుకల్లోలినిగాఁ ద్రివేణికరుణన్ సొంపొందె జ్ఞాతేయ సంగర భూభాగము. దశా 2 438.

సొంపొనరించు అ. క్రి. సొంపొందు, సొంపగు.

ఉ. చొచ్చి చతుర్దశాతపుల సొంపొనరించు ప్రసూన సందడిల్, మెచ్చుచు నొండొరుం గడచి...యింద్రువనంబున సంచరించు నయ్యెచ్చర ముద్దుగుమ్మల క్రియం బువుఁదోఁట మెలంగి రంగవల్. ఇందు. 2. 51.

సొక్కు వి (సుఖము) 1. ఇంచుకంత శరీరవిస్మృతి (రూ. చొక్కు).

తే. గీ. శ్రుతులు బెడయుట స్వరముల చొప్పువిడక, చాలఁ శుద్ధతఁ గనుట దోషములఁబాసి, ఘనవిధము గాన షడ్జంబు గలసిమెలసి, యక్కవలవారి గానంబు సొక్కనర్చె శు. రా. 8. 52.

సీ. కస్తూరిసూశిన నూన్నారి ధాతమును బోలెఁ జక్కఁగ నిక్కమై సొక్కు మంచె ... తే. గీ. కాలకంఠుండు త్రిపురాసురుఁడు మొనరు, నెక్కువెట్టిన యపుడు భోగీశ్వరునకు. భీమ. 4. 180.

ద్వి ముడుపులు కతిరి పు మొగిసొక్కుఁ జల్ల, నడుగు దాచేశపోయి యాపల నడవ, నాయంత పొలుపరి వలితాయతాక్షి, బోయరాజులలోనఁ బొడగావ మెందు, వల. 4. 267.

వ. ఈ యింటువగవ యుండుము చందము తక్కులు సొక్కులు వన్నెలు చిన్నెలు చూపులు కోపులు చూచి. మృత్యుంజయ. 1. 19.

ద్వి. టక్కులు దేవలు డంబకంబులును సొక్కులు

నేర్పులు సూటిమాటలను పండితా. పురాతన 122.

సీ. సున్నంబులోపల సొక్కుమందులు పెట్టి కలిగిన వంశించి తలఁగువారు ప్రబం. 1. 770

2. పారవశ్యము.

ఎ గీ. మదిం సొక్కున గోపికామానవతులు. దశా 9. 125

సొక్కు అ. క్రి (రూ. చొక్కు) పరవశమగు

ఎ గీ. ... రత్నకాంతులు వెలయంగ రాణివాస, సతులసేవల సొక్కు శ్రీపతిని గాంచి. దశా. 4 103

సొగటాలు వి బ. 1. బాలక్రీడా విశేషము.

సీ దాయాలు సొగటాలు దాల్రాయి చదరంగ మును కోటురాళ్లును మూఁతపొదువు హంస. 3. 146.

2. పగడసాలాట.

మ. జగదాశ్చర్యకరప్రభావ మగు నీ సర్వజ్ఞ విఖ్యాతి యేనుఁగు దిన్నట్టివెలఁగకాయ గతి నొందున్ లోన లోపై బయల్, సొగసై యుండె డిదో విశుద్ధతరమో చూడంగ నాతోడుతన్ సొగటాలాడెద వేనవేలుదుకు సమస్తోత్తవ్యజాటాంతికా. నిరం. 3. 8.

3. పాచికలు, ఆడదమాడెడు సారెలు.

కం. నిరతముఁ జదరంగంబున గిరిజల సొగటాల నారికేళఫలములన్, సరిజేసి యొడ్డువిడువులు, చెలులఁ బందె మిడి గెలువుఁ జేకొని యవలన్. ప్రబం. 1. 615.

కం. మిగులగు నేర్పరి ననఁదగి, తిగుటన్ సొగటాలనే నతిప్రౌఢుండన్. ద్వా. 10. 92.

సీ. కచ్చించి సొగటాలు గడికలతోఁ గుక్కుటాండముల్ పణముగా నాడువారు. వై జ. 3. 69.

సీ. సొగటాలపైఁ గోర్కి సుదతువచ్చినయంత వింత మీటల గారవింపనేర్పు. నిరం. 2. 88.

4. పాచికలు సారెలు గల సొగటాలపలక.

సీ. పట్టుపుట్టంబు సొగటాలపాళి నేత్రప్రాంత చిటి చాప మంచివిపంచి. బహు. 5. 179.

సొగటు వి. మ్లాని, వాడు.

సీ పగలింటి సెగలచే సొగటొందు పూఁదీఁగె వడువున నెమ్మేను వాడుదేఱె. అని. 3. 131.

తే కృష్ణు ననుమతి రుక్మిణికిరహాణి. వచ్చి భోజన మిసదలపంచి యగ్గలంబయినచింత వలని యొల్లమి నతండు, సొగటులను బోయి కసిగాటులుగ భుజించె. విజ. 3. 4.

సొగపు వి. చొక్కు, పారవశ్యము (దా. కృ. సొగయుట).

ద్వి. నిడుద తుమ్మెదకప్పు నెఱివేణిఁగట్టి, మిగిలిన జడ లేని మెయినిండ నూలు, సొగపున నిరుమూడు, చుట్టలుసుట్టి. ద్వి పరమ. 4. 369.

కం. అడియు నదియు నేటిది యో, మది నెఱుఁగని కనని సొగపుమఱువని వలపున్, బొదలఁగ గేవల దర్పోన్మదలై క్రీడింతు రా సమస్తాంగనలున్. హరి పూ. 6. 23.

చం. మగువ ముఖేందువం దమృతమధ్యమునన్ మునుఁగంగఁ బాఱి యో, మగువ కుచద్వయంబు నదుము బడి రాయిడి దండసిల యో, మగువ గభీరనాభిబిలమార్గము దూరి పరిభ్రమించి యో, సొగపున రాజనందనుని చూపులు నిల్చు దదంతరంబులన్. కృ. వై. 3. 149.

చం. దిటమున రెడ్డిపాటుపడి తెచ్చియిడంగను గూటిప్రొద్దు నంగటితటి వెన్నమజ్జిగలు కంకటిపైఁ బవలింటినిద్రలుం, బెటుకు.... శుక. 2. 334.

సొగయించు స క్రి. (సొగయు. ధా. ప్రే.) సుఖంపఁ జేయు.

కం ప్రేపల్లెనుండి ప్రేతల, పైపాటున పిచ్చుగించు పని యేమిటి కిట్లీ ప్రోలి మించుఁబోణుల, చూపులు మేఁగందకుండ సొగయింపంగన్. అచ్చతె. భారవి. 1. 3 పు.

పి. బిగువుఁగౌఁగిటిలోన సొగయించి సొగయించి సపురుగా మైదీవ నివిరి నివిరి. కృ. శకుం. 1. 141.

సీ. పరిరంభణములచే భావంబు సొగయించి యథధా

మృతమున మోహంబు నిలిని, —, అర్ధచంద్రాసనము లాదియైన బంధభేదముల నోలి వలపించు విన రుహాక్షి. రుక్మాం, 2. 121.

ఎ. గీ. ఎడద సొగయించు మాటల నెలమి మిగుల నిన్ను వనరక్తిఁ గొలుచు నన్నెలఁత లుండ, నీర జాకార సైరంధ్రిఁ గోరఁ దగునె. భార. విరా. 2. 64.

సొగయించు అ. క్రి. సుఖయించు.

చం. వడఁతుక యేను రావణుఁడ బాహుబలంబున నింద్రుపీటపై, వడచుచునుండి యున్నగమువన్ విడియించితి సేన నిప్పుడి,య్యెడ కలవోక వచ్చి సొగయించు విధంబునఁ బోవుచున్న నిన్, బొడగని కాముబల్మతకముల్ వను నిమ్మోయి వెట్టిఁజేసివన్. నిర్వ. 6. 62.

సొగయిక వి. 1. చొక్కు, పారవశ్యము, సొగపు.

సొగయు అ. క్రి. పరవశ మగు, చొక్కు.

కం. సాదుతొగలఁ సెగమిగులన్, మోదముగల వాని వేదుముల పోఁడిమిచే, నైదువగల కైదువు గలి,జోదువగల మిగుల నొగిలి సొగయుచునుండెన్. ఇందు. 4. 73.

సీ. ఒడలెల్లఁ జూపుగాఁ గడు వ్రబపడి చూచు, సొగయ నొయ్యారంపుఁ జూడ్కిఁ జూచు. కవిరాజ. 2. 13.

ద్వి. వ్రతయుక్తి రుద్రాక్షవలయా యనంగ, సొగసి శుభ్రభాజటాజూటా యనంగ. పండితా. దీక్షా 14.
కం. గిరిజ లలితాంగకమ్ములు పొరిఁబొరిఁ గనుఁగొని సొగసి....మహేశ్వరుమనము వికలంబయ్యెన్. కుమా. సం. 5. 516.

సీ. బాణప్రయోగపారీణత యొలక, నారీకటాక్షబాణముల సొగయు. విక్ర. 3. 14.

సీ. అతడు కళారహస్యంబుల యిక్కలు సొగసి యొండొరులంటు చోటులెల్ల. ఉ. రా. 5. 116.
2. సుఖించు.

చం. గగనతరంగణీ వికచకాంచనకంజవనీ గృహాంబులన్, సొగసి రమింపుచున్నయవి చూచితె చారుచకోరలోచనా! వాల్మీకి. 3. 92.

3. మూర్ఛిల్లు.

సీ. శుకశారికలు రాత్రి సొగసె విస్వరముల జంతువు వేఱొక్క జంతువుఁ గనె. భార. 11. స్కం. 87.
సీ. శోకాగ్ని తనికిన సొగయు సీతమ్మల మవ పన్నవాక్యామృతోపయుక్తి. భార. శాం. 1. 87.

సీ.....దైవతకులేంద్రుఁ. నద్దానవుండు మాయాబలంబున మోహితునిఁ జేయ సొగయుడు ముని సమాజ. తే. సంస్తుతముగ రథంతర సామశక్తిఁ జేసి. భార. శాంతి. 5. 428.

తే. ఇట్టు లొండొంటిఁ గదియంగ నెలమి నడచి. బలము లొక్కింతసేపు నిశ్చలతఁ బొలిచె, మవ్వ మెసఁగువనంబులు మావు లెంత,యైనఁ జెలువార సొగసియున్నట్ల పోలె. భార. ద్రోణ. 1. 186.
4. నొచ్చు.

కం. ఎఱుకలు విచ్చుదుఁ దుండము, తెఱచుచు వ్రేగదరి సొగసి, త్రెళ్ళి వివశుఁడై, యఱచిన నోడకుమని హరి, నెఱిఁపక్కఁగఁ ద్రోచియెత్తె నెగయంగఁ గృపన్.

"అత్తి" మూ. భార. ఉద్యో. 3. 301.

5. విహరించు.

సీ. చంద్రి కామధు వాని చాకోరము ల్నిక్కి దేవతా సౌధ వీథికల సొగయు. భీమ. 2. 42.

6. చొచ్చు.

వ. కిసలయముకుళకుసుమకలాటు భరితంబై విన రుహబాంధవుని కిరణవివరంబుల సొగయనీయక మనమనసై యిరు లనలుకొనుచు. కాశీ. 1. 93.

సొగసు వి. అందము (దీనినిఁ జూచువారు సొగయుదురని వ్యుత్పత్తి).

ద్వి. సొగసులు నిగుడ నామరలెల్లఁ బొగడ. ద్వి. పరమ. 3. 17౦. పు.

ద్వి. సొగసులై పొలయక పొలయు భావములఁ

గలిగి యొప్పారు జగన్మోహనాంగి. ద్వి. పరమ. 2. 103. వు.

గీ. ప్రొద్దుపోకకుఁ గస్తూరిబొట్టుఁ బెట్టి, కీలుజడ యల్లి సురపొన్నపూలు చుట్టి, సొగసుఁ జేసి యొగాదిగఁ జూచి సిగ్గు, మురిపెమును బొందు నమఁ జేరి ముద్దు పెట్టి. కువల. 4. 177.

సీ. పతిపత్ని వని మేనఁ బసపు పూసికొనంగ సొగసులా యని ముంతపొగ ఘటించు. శుక. 1. 115.

తే. అనుచుఁ దమలోనఁ గడు నొచ్చుకొనుచుఁ బనుల సోగసొగసును గల వృషమును వగరి శేఁగి, సారంగ. 2. 264.

"సొగసుల దీవులో" నీలా. 1. 40.

"క్రొడుగట్టక సొగసెల్లఁ దఱిమి. నీలా. 1. 103.
శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లె... ఆము. 2. 55.

2. ఒయ్యారము.
తే. చెలివలుకుఁ గేరడించుచుఁ జిలిగోళ్ళ, సొగసు నోకులఁ గళలు నించుచు. వసు. 5. 76.

3. ఆనందము,
కం. విడువక మీ గానము సొగసిడుటయు మఱి పాడుఁడమట యొగ్గె ... ఆము. 5. 58.

4. సౌఖ్యము.
తే, పెట్టుపోతల సొగసాని సెట్టిసాని, యింటికడ నుండి యజ్జాడు బంటువాఁడు. శుక. 2. 203.

5. దృష్టి విశేషము.
తే. గీ. సొగసు తెలివాలి మను సోగసొంపు తళుకు, బెళుకు చిరిలి యొయారంపుబేరె ముదుటు, సొలఁపు విడియంపు దేలింపు చుఱుకు టోర, కలికి బెదరెప్పు చూపుల కలికిఁ జూచి. ప్రబం. 1. 108.

6. విధము, రీతి
వ. కాంతలు పొలయల్కల మాటు మొగంబులు బెట్టిన సొగసున నిరువాగిరు వారై జోడువట్ల వీడిన జాడతోడనె నిజబలంబులఁ బద్మాతుండు చిఱునగవు మొగమునఁ దెంగలింప కాంత స్వాంతం బుతో దయ దైవాఱఁ గనుంగొని. ప్రబం. 1. 788.

వ, దట్టంపు నిట్టూరుపు పొగలు నిగుడు సొగసున్. వసు. 2 140.

సొగసు వి॰. ఇంపు పుట్టించు.
తే. గీ. చుంబనంబులఁ జొక్కించు సొగసువగలు. దశా. ... 8. 141.

సొగసుకత్తె వి॰. అందగత్తె.

సొగసుకత్తె వి. విటకత్తె.

సొగసుకాఁడు వి. విటుఁడు, అందగాఁడు.
సీ. వేఱొక్కకడ కేగు వేళల నటు తొంగిచూచి పోఁదలఁ చని సొగసుకాఁడు హంస. 5. 217.

మ. వలుముద్దుల్ వలురజ్జులన్ బదరునల్ప ప్రజలున్ గుబ్బచన్నులు గుల్కించు మెలంతలున్ సొగసు కాంద్రుం గూడ నొ నాటిపాటల వాంద్రున్ గొలు గాక రాజులకు. మల్లభూ. వైరాగ్యశ. 56.

ఉ. గ్రక్కున నేగి యా సొగసు కానికి నా వెత లెల్ల దెల్పి యా, చక్కికిఁ దోడితెచ్చి మది సంతస మందఁగఁ గూర్చువారు నా కిక్కడ నెవ్వరు? చెన్నబ. 4. 269.

సొగసులాఁడి వి. సౌందర్యము గలయాడుది.
సీ. కలువకంటి యొకర్తు చలువ పావడ వైచె సొగసులాఁడి యొకర్తు సురటి విసరె. ఉ. రా. 6. 131.

సొగియించు అ. క్రి. (స. సుఖయించు) సుఖము నొందు.
కం. తగుమాటలఁ జిత్తంబులు, సిగురొత్తఁగఁ గలసి మెలసి చెన్నగుగోష్ఠిన్, సొగియించు వెడ ముకుందుని, మగువకు కచి యిట్టు లనియె. మంజుల ఫణితిన్. హరి. ఉ. 4. 992.

సీ. బిగియారు కౌఁగిట సొగియించి సొగియింపఁ జిట్టంటుచేఁతలఁ జెనకి చెనకి. విప్ర. 3. 90.

ఉ. చందనచారు వక్త్రకము సంస్తుత కౌస్తుభ కర్ణి కంబు వ,స్యందిత లాంఛన భ్రమర సంగమనోజ్ఞము నైన యట్టి గో,విందు మురస్థలంబ యరవిందముగా సొగియించి యున్నయయ్యిందిర చూచుఁగాతఁ

గృప నింపగ చూపుల భక్తసంతతిన్ నృసింహ పు. పీఠి 2.

సొగియించే స క్రి సొగియు ధా ప్రే. సుఖింపఁజేయు, చొక్కించే.

చం. వెడవెడ నిద్రవోంది కనువిచ్చిన పాంథుల మీఁద చాడివోఁ, దడఁబడ నొండొరుం బిలుచే దర్పుకు వంపు బలంబులోని యల్కుడు కరణిం జెలంగె శుకకోకిల భృంగతతుల్ వనంబులం దెడ నెడఁ బల్కఁ గూయ సొగియింపఁగ మ్రోయఁగఁ దద్విరావముల్. భార. ఉద్యో. 2. 111.

కం. చెవిని సొగియించే వీణారవమును గానంబు వేణురావము నిత్యోత్సవముగ విను రాజుల కడ. భార. స్త్రీ. 2. 15.

సొగియు అ. క్రి. సుఖించు, ఆనందపడు.

తే. సురుచిరోక్తులు నాచెవుల్ సొగియఁ బల్కు కాముకేళిఁ గైకొని నన్నుఁ గావు. భా. రా. సుంద. 185.

సీ. రాజ్యలక్ష్మీ మందిర ప్రాంగణంబైన, వక్షస్థలంబున వ్రాలి సొగియ.

గీ. నవ్వళించుఁ దివురు నబ్జాడు మదిలోన. కేయూర. 4 9.

కం తగుమగనిఁ బడసి కౌఁగిట, సొగియఁ గనుట గాదె యంయ జోటికి నధికం, బగు భాగ్యఫలము నాకిం,పుగ నింకెన్నఁడొకో యిట్టి పోఁడిమి గలుగున్. హరి. ఉ. 7. 61.

మ. అలపన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలఁగా వున్న వె,గ్గలపుం దాపము శాపనా నిజమనఃకంజాత సంజాత పు,ష్కల మాధ్వీకఝరిన్మురారి సొగియుంగాఁ జొక్క ధన్యాత్ములౌ, నిలపన్నిద్దఱు సూరులం దలఁతు ... ఆము. 1. 10.

సొచ్చెము వి పెచ్చు, అధికము.

ఉ. .... ధనేశునిధుల్ తమ యప్పునద్దికిన్, వచ్చిన సొచ్చె మెంతనుచు నవ్వుదు రప్పురిలోని కోమటుల్. శశాంక విజయ 2.

సొజ్జి వి. భక్ష్యవిశేషము.

ద్వి. చాఁపట్టులును శాయసము సొజ్జి బూరె, లోఁపిన వారల కోఁపంతకొలది.

అ. మ. క, 5. అ. 285 పు. 13. పం.

సొజ్జె వి. వేయించిన బియ్యముతోఁ జేసిన పిండి మొదలగునది.

ఉ. కమ్మని శాలిపు సొజ్జెపిండితో, నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాఁకటి చిచ్చు పెచ్చువన్. భీమ. 2. 189.

సొజ్జెబూరియ దే. వి. భక్ష్యవిశేషము, బూరె.

సీ. వడలు మండెఁగ లుండ్రములును పేణీలును సారెసత్తులు సొజ్జెబూరియలును. బ. ప్రభులింగ. 5. 82.

సొజ్జెబూరె వి. భక్ష్యవిశేషము.

ద్వి. జోరువ నెయిగారు సొజ్జెబూరులును. ప్రభులింగ. 4. అ. 150. పు. 24 పం.

సీ. బొంగరంబులు పొజ్జెబూరె .... గులుసేవలుక్కెర లరిసెలుఁ జక్కిలములు. కళా. 7. 81.

సొటసొటలు వి. బ. కార్శ్యము.

సీ. ... గీ. ఇట్టి రాతిరిపూటనే నేమిసేతు. సొటసొటలువోయె నాకట మ్రుక్క నొడలు, నింట నిల్లాలు బిడ్డలు నెదురుచూతు, రకట నే నిందునుండ నేమగుదురొక్కొ. సాన దో. 5. అ.

కం. కటపెట తొటతొట రాలెడు, పొటపొట చినుకుల ధరిత్రి పొడనట్టునడన్, సొటసొట నాఁకట పోలుచుఁ, దటతటపడు చాతకముల దైన్యము వాసెన్. నైష. 2. 146.

2. కారుటయందగు ననుకరణము

కం. నిటలమ్ము లవిసి నెత్తురు సొటసొట వడియంగ నమరశూరోత్తముల్లై క్రీడా. 1. 229.

3. నెత్తురు చిమ్ముటయం దగు ననుకరణము

సీ. కుటిల నఖంబుల సొటసొట నెత్తురు చింద రక్కసి బొఱ్ఱఁ జీఱుచు కినుక. సిం. నారసిం. శ. 14.

సొటసొటలువోవు అ. క్రి. (సొటసొట + పోవు) రూ. సొటసొటవోవు. కృశించు, చిక్కు.

సీ. ఈ నిండు వెన్నెల లామచకోరముల్, గనుగంద కున్న వా కంబుకంఠి, యీతూఁడ్లు భుజియించు జాతి యంచలు సొటసొటలు వోకున్న వా శోభనాంగి.

తే. తెలిసి రా మ్మ కలద సందియము చాల, నుళికి పడ కవి లెస్సలై యుండెనేని, వజ్రకాయముతే యాను వాని కెల్ల, నపుడు విరహులయవధికి నవధి లేదు. విజ. 3. 62.

(ఈ యర్థమున సొటసొటలాడు అనురూపము మిక్కిలి వాడుకలో నున్నది)

తే. ఎంత పాపాత్మురాలని యింక మీఁద, బ్రహ్మ నిజఫాల ఫలకాక్షరములు గట్టి, పెట్టువట్టులఁ గస్తూరి పట్టు వెట్టి, సొటసొటలువోవు విన్నపై సొంపు దఱిఁగి. సారంగ 2. 150

సొట్ట వి. వంకర.

సీ. లొట్టి పిట్టలకును సొట్టచాల దలంచు గొఱతఁ దెల్పుచు నుండు గూనుమేను. పార్వ. 4 108.

చం. రసములు భుక్తిలోధ్వని పిరంగి రవుల్కొనుచో నలంక్రియ, ల్పసిఁడిని గొన్న వేళ యని భావము గల్గిన (దుష్కవుల్కటా, వినువక సత్కవి) బంధములు విన్నను డిప్పనుకొందు రౌ మదా, లసగజగామి నీగతి విలాసము సొట్టని పేరు లాఁకరే. పార్వ. 1. 8.

2. చెంబు లోనగు వానికి దెబ్బ తగిలినప్పుడు పడు నొక్కు (వ్యవ.) ఆ చెంబునకు నాలుగు సొట్ట లున్నవి.

3. రోగాదులవలన దేహమునందు కలుగునొక్కు (వ్యవ) ఉబ్బురోగమునందు నొక్కినచోట నెల్ల సొట్టలు పడును.

సొట్ట విశే. రోగాదులచేత నొక్కుపడినది, గుంట పడినది

చం. ... ఇప్పటుకు సిద్ధముగా దని యాడినన్ బ్రకంపనునకుఁ గేలుసొట్ట యని పల్కుదురే సద లోకు లిద్ధ న్ ·సిక. 1. 81.

ద్వి. సొట్టైన రత్నంబు జుట్టును బసిఁడి, గట్టిన భావన ... పండితా. దీక్షా. 6. పు.

సొట్టనలు వి. పరిహాసములు, వంకరమాటలు.

ఉ. ఒక్కవ లంచు నొక్క చెలిచన్నుల నొక్కతె పట్ట నాచెలిఁ, గెక్కడఁ బడ్డదంచు నల యింతియు నచ్చెలి యారుఁద్రోయ మేల్పొక్క మటంచు నిర్వురికి సొట్టనలాడుచు నోర్తు వారి బల్పికలఁ జూచి హా మొసలిపిల్ల లటం చని పాఱు నచ్చటన్. పార్వ. 1. 72.

సొడసొడ వి. క్రమ్ముటయం దగు ననుకరణము.

చం. అడిదపు వ్రేటునం బఱియలైన శరీరమునందు నెత్తురుల్, సొడసొడఁ గమ్మఁ నెమ్మనము సొమ్మలు పైకొన. హరి ఉ. 4. 28.

సొడసొడల్వోవు స. క్రి. మాఱుకొను, ఎదుర్కొను.

ద్వి. ... అటు ద్విజునిఁ బొమ్మని త్రోవ, సొడ సొడల్ వోవుచే సోలుచు శాకి, బడిపూజకుండలు బగులదన్నుచును. పండితా. మహిమా. 2. 7?.

సొడ్డు వి 1. కొఱత, న్యూనత. (శ ర).

చం. పడినరపాలు భోగపతి వావులు నాకుఁ బనేమి యంటి వం, గడమున కెల్ల సొడ్డనిడఁగా దటునే నల చిన్నవాఁడ వే, ర్పడితి వటన్నఁ బోవునె స్వభావము సారంగ. 2. 108.

2. ఆటలో నొక వానిమీఁద వేయుదెబ్బ

ఆ. వె. సోమయాజిఁ బట్టి సొడ్డువేసెను రంభ, యొంటె సోమయాజి నొంగఁబెట్టి. క్రతువు జేయు ఫలము గల్గెరా చేకేత విశ్వదాభిరామ వినురవేమ. వేమ. 2. 59.

సొత్తు వి. సొమ్ము.

ఆ. వె. వేదశాస్త్రములను విన నేమి గుడిచిరి, యరిగి తిరిగి సొత్తు లందరిల్లు, బ్రహ్మమహిమ దెలిసి బ్రతుకుట నిజమయా, విశ్వదాభిరామ వినురవేమ 3. 188.

**సొద** వి. ఏడ్పు (సం. చితా)

ద్వి. సొదసేయుచు దనంత చోటుకు మాజ ద్వి. హరిశ్చ ఉ 114.

కం. అని నిశ్చయించి సొదపేర్చి నిజేశున్ సుతులఁ దండ్రిఁ జేర్చి హుతాశం, బొనగూర్చి తాను దటియన్, వనితారూపంబు మాని నాఁడుఁ డగుచున్. వరాహ. 106.

ఆ. వె. దేవి యేఁడ మయుండు సావును ముదిమియు, గలుగ కుండునట్లుగా నొనర్చె, నట్టులగుటఁ జేసి యకట నీతో సొద, సేరఁబోల దేమి సేయుదాన. ఆ. రా, యుద్ధ. 4. 70.

ద్వి. ఆ సుమిత్రాపుత్రుఁ డతని తల్లియును ఈ సొద విని శోక మెట్లణంచెదరు.

రం. రా అయోధ్యాకాం. 84. పుట. 5 పం.

కం. కృపిమున్నగ శిష్యులు సొద, యపసవ్యము గాఁగఁ దిరిగి యరిగిరి శోకా, ర్తపు టొడళులతో. భార. స్త్రీ. 2. 124.

కం. సొదపైనుండఁగ వారలు, పదుంద్రునుం జూచి దాని భక్షింపంగా. భార. ఆ. 3. 2.210.

కం. కడు నర్మిలిఁ గ్రేపుం జను, గుడుపఁ దొడఁగె నొక్కనుంభి గురుపాల్పరతుం, బడు నత్స వక్త్రి ఫేనము, సుడిగాలిం దూలిపడియె సొదపై ననఘా భార. శాం. 2. 517.

వ. బగబగన మండు చిదుఁగు సొద మంటల కడ్డంబు వట్టి. మను. 4. 60.

కం. అని నిశ్చయించి సొద పేర్చి నిజేశున్ సుతులఁ దండ్రిఁ జేర్చి హుతాశం, బొనఁగూర్చి తాను దటియన్, వనితారూపంబు మాని నాఁడుఁ డగుచున్. వరాహ. 9. 106.

**సొదగొను** అ. క్రి సొదచొచ్చు?

ద్వి. చోడని దేశంబు సొదగొనఁ జొచ్చె, చోడండు చెఱుపంగఁ జూచె నిప్పురము. పండితా. మహిమా. 256.

**సొద్దెము** విశ. ఆశ్చర్యకరమైనది.

ఉ. సొద్దెపుఁదేఁటి ఱెక్కకొన సోఁకులచే రవళించు తమ్మిపూ, ముద్దెడ మామి నద్దడర మోదుగు నేఁజయు గల్వకీడిమున్ గద్దువలాడు పూబొమిడి కంబు దలిర్చి. ప్రబం. 1. 514.

**సొన** వి. నూఁగు.

తే. జాఱునలరుల తేనియ గార యిచ్చి. గాడ్పు సంధించునయ కాని యూర్పు వెఱచు, నెందు నయ్యాఁక విరితోఁట నింద ముఖుల, నగవు నును మంచు సొనవోలె నయము దఱుగ. పాండురంగ. 5. 295.

2. ఆకులు మొదలగు వాని నుండి వచ్చు ద్రవము.

సీ. సొనదేఱి పొటమరించి నెఱెవాసిన యట్టి యాకురాలుపు గండ్లయందుఁ దొఱఁగి. సొన దేఱు.

అ. క్రి సొనస్రవించు. మను. 6. 27,

**సొనచికుఁడు** వి. ఉలవకాయ వంటి కాయలు గల ఒకచెట్టు.

**సొనారి** వి. కంసాలి.

సీ. సాదాపని మెఱుంగుజాడఁ గాంచు సొనారి కుందనంబున మణుల్ గూర్పఁగలఁడె. రామ. శ. 88.

**సొన్నము** వి. (సం. సువర్ణము) 1. మాడ, అరవరహా

కం. జాలెలఁ బట్టింపుము పది,వేలు నయిదు వేలు రెండువేలు నరయు సొ,న్నాలరి కుంతలునకు మన, యేలిక తన్మంత్రి యతని యింటికిఁ బనుపన్. జై. భా. 8. 54.

సీ. ... వన్నె మించినవాఁడు సొన్నంపుఁ బడి యాఱు వన్నె మించిన వజీరాటువాఁడు. దశా. 9. 171.

2. బంగారము.

ఉ. సొన్నపు సన్నచేలఁ గటి జుట్టి కిరీటము మౌళిఁ దాల్చిరే, మన్ని ... తోడఁ ... పెను మాని ... మక్కువఁ జేర్చిన ... చెంత ... పూర్ణిమా విశదంబ్జ ... చారువక్త్రిఁడై. విజ. 2. 84.

(వృత్తియందు దీనికి మువర్ణమునకు దీర్ఘమును నగును. ఉదా : సౌన్నాటంకము)

సౌన్నా వై. వి. సొన్న (సం. స్వర్ణ) బంగారము.

వ. అత్తలోదరి తనమగని చేతికి నొక్క సౌన్నా టంకం బిచ్చి యిప్పట్టణంబున నాహారం బడిగి, తెమ్మనుటయు విక్ర. 6. 100;

కం. అన్నరపతి తగులాగువ, వన్నగరము చొచ్చి యెల్లయంగళ్ళందున్, సౌన్నాటంకం బిచ్చెవ, నన్నమిడెదు వారు గలరె యని యడుగు తఱిన్. విక్ర. 6. 101.

సౌన్నారి వి. (సం. సువర్ణకారుఁడు. హిం. సోనార్) సువర్ణ శబ్దవికృతి (సొన్నము+అరి), బంగారపుపని చేయువాఁడు. అగసాలెవాఁడు. స్వర్ణకారుఁడు.

గీ. వాని పిలువువాఁడు వరరత్న భూషణ, వ్రజము బూను తెల్లవాఁడు రత్న, శుద్ధి యెఱిఁగి యెఱుఁగు సౌన్నారి కపటంబు, గాన వానిఁ దాల్తు వాని యొద్ద. కేయూర. 2. 61.

కం. మున్నొక్క పట్టణంబున, సౌన్నారి మిటారి నేర్పుకూరత్వము గై, కొన్నదియై నడచిన కథ చెన్నుగ విని పొమ్ము కడువిచిత్రము కొమ్మా హంస. 2. 177.

మ. .... కావించు సిద్ధాటంకమున్ గన్పడన్, జత సౌన్నారి బెడంగువన్ దనరె వర్షావేళ విన్నంగడిన్. చంద్రాంగ 1. 11.

సొన్నలాపురి వి. ఒకానొక గ్రామము

ఉ. ఆ విధ మానతీవలయు నన్నఁ గటంబులు మోడ్చి పల్కె నో ధీవరులార తత్క్రమము దెల్పెద నెప్పుడు సొన్నసాపురిం దా విహరించు ముద్దయ యనన్ భవపాదపయోజభక్తుఁ డా, పావనుఁ డిఁకనిం గనియె భర్గజయాప్తి శుభాంగియందువన్. చెన్నబ. 3. 29.

సొబగారు వ. క్రి. సొంపొందు, సొగసును వహించు.

కం. సొబగారు విశ్వభూవరు, ప్రబల జయశ్రీలఁ జూడఁ బఱితెంచు తఱిన్, గబరీకుచజఘనంబుల, నిబిడిత వసియాడెఁ బురిము సెలఁతల నడుముల్. కావ్యా. 1. 82.

సొబగు వి (సం. సుభగః) చక్కఁదనము.

ఉ. వాసవికూప చిహ్నములు వార్తలు మున్ విని యుండుదుం గదా, యాసొబగెల్ల నేఁడు గన నయ్యెడు వీరల యందునైన స, న్యాస్య మసంగతం బగు. విజ. 2. 189.

సీ. మఱుచితప్పియు నన్యమహిమ విమర్శింపఁ జూడ వీఁనుఁబని సొబగు వేడ్క. కళా. 4. 129.

వ. అరవిందమందిరకుం బుట్టినింటి సొబగుచూపి. మను. 3. 28.

సీ. రమణీయ సిందూరజము సొబగు. కాశీ. 7. 75.

ఉ. ... అ, వ్యాదృత రాంగిమూర్తి సొబగెల్ల నొకం తగఁ జూచు నాత్మలోన్. ప్రభా. 2. 109.

సీ. పగి తటాలున నెదురైనఁ దొరయుఁ సిగ్గునఁ దల వాంచి కన్నొనలఁ జూచుఁ జూచి రాకొమరుని సొబగు భ్రమసి మాటిమాటికి వలవు సెమ్మదిని నిలుపు. విజయ వం వి 2. 8.

సీ. లలిత కస్తూరికాతిలక మధ్యంబున సొబగొందు ముత్యాలచుక్క నిలిపి. కృ. నై. ౨౩.

సీ. మకరంద నిష్యంద మందార మాలిక కబరీభరంబున సొబగు మీఱ. విక్ర. 1. 8.

కం. గానము సొబగుఁ సోనై, తేనెలరానై, సరస్వతికరవీణా, తానవుఁ క్కై యమృత వి, తానము తానై తగును సుదతిగూఁడన్. రాజవాహన. 4. 108.

మ....జిగిసెమ్మోని సొబంగు వింతయయి భాసిల్లఁగ నెల్లప్పుడున్, దగుదుగ్ధాబ్ధితనూజ మాకొసఁగు గాతన్ నిత్యకల్యాణముల్. ప్రద్యుమ్న చరిత్రము. 1. 2.

సీ. వీని చెవ్వము వార్త విన్నదియంబున వ్రీహి గర్భంబులు విరియకున్నె

గీ. సోయగముచేత ఒటువైన సొబగుచేత, బోల్ప నొండొంటిఁదమలోనఁ బోలుఁగాక, వీని కుపమాన ముండునే వేఱ యనుచు, విభుని జంఘలఁ బొగడ రవ్విబుధవరులు. కవి. 3. 154.

ఉ. కొమ్మ మెఱుఁగుఁ జన్నుఁగవకోత్త లభిన్నము లైన యాత్మకుంభమ్ములఁ జూచి యాచవి సొబంగు తొడల్ దొడఁన్ వగర్పు హస్తమ్ములఁ జూచి తన్మృదుపదంబులు పుష్కరమూన ప్రవాలుచా, గమ్ములఁ ద్రోవ బాల గజగామిని యన్ బిరుదంబు గైకొనెన్. కృ శకుం. 2. 16.

2. (సం. శోభ) ఒప్పిదము.

సీ. .. ఘన భర్తృహరి శతకత్రయంబునఁ బ్రతి శ్లోకంబునను వింతఁజూపు సొబగు...దశా. 1. 43

సీ. రత్నంపుఁ జిలుకలు రాయంచప్రతిమలు, పసిడి పువ్వులవ్రాత పనులసొబగు. కళా. 2. 15

కం సుబలతనయ గుణమహిమన్, ప్రబలిన తన కులాచారధర్మపాలనలీలన్. సొబగొంది వన్నెఁదేఁగా, విబుధస్తుతుఁ డవ్విభుండు వెలసెన్ ధరణిన్. రామ.

(భారతార్థమున:- సౌభాగ్యము, సుమంగళియగుట, రామాయణార్థమున ఒప్పిదము రెండర్థములందును సరిగా - సొబగొంది = ఒప్పినదై అని వ్యాఖ్యానము )

3 సౌభాగ్యము.

వ. శోంతి - సొబగు. కాశీ. 3. 185.

4. విధము, శోభ.

వ. మానధనుని చరిత్రంబు సొబగున నకల్మష జీవనంబై భాగ. 10 స్కం. పూర్వ 765.

వ. బ్రహ్మలయందు భృగువు సొబగున సిద్ధులయందుఁ గపిలునిలీల భాగ. 12 స్కం. 48.

సొబగు విశే. సుందరము.

సీ. హరినీలములు చాయ నతిగోళమ్ములు సొబగుగాఁ, కన్నిటిసోన గురియ. హర. 3. 92.

సొబగుఁడు వై వి. 1. చక్కనివాఁడు, (ప్రకృ. సుభగః) అందగాఁడు.

సీ. స్వర్గార్థి...దీనిఁ దగిలించి తగులక తాన ధైర్యవంతుఁడై యున్న సొబగుఁ డెవ్వండొ జగతి. కుమా. సం. 7. 846.

ద్వి. చందనసిద్ధికై సొబగుఁడు మఱియు, మానిని తోడ నవాత్మారసగోచరానంద మొంది యొయ్యన యనివార్య కేళులఁ దెలిఁ గఱఁగించి తా గఱఁగి. మృత్యుంజయ 3. 86.

తే. పద్మకోశాభినయహస్తపల్లవంబుఁ జూపె నొక మచ్చెకంటికి సొబగుఁ డొకఁడు. శృ. నై. 6. 135.

2 విటుఁడు, పల్లవుఁడు.

మ బలియుండా సొబగుఁడు భావభవదర్ప భ్రాంతుడై వచ్చి. భార. విరా. 2. 281.

సొబగుఁడు విశే. చక్కనివాఁడు, రూపరి, అందగాఁడు

కం. వామాక్షి నీకుఁ గుశలమె, నీ మన సెవ్వారి యందు నిత్యప్రేమ ,బై మెఱయునట్టి సొబగులు, నీ వగలేపురకు నిపుడు నెమ్మదియె మదిన్. భార. విరా. 6. 120.

సీ. వీఁడె గోవిందవివిఁశతి యీతండు సొబగుండు మెలఁతలు సుట్టునెపుడు. భార. స్త్రీ. 2. 60.

సొబగుమించు అ. క్రి. శోభిల్లు.

సీ. వింజాతటీవని విగళత్కదంబ ప్రసూన పఙ్క్తుల తోడ సొబగు మించి.

గీ విమల కైవల్యపదము శ్రీ విష్ణుపదము. ఇందు. 1. 45.

సొబగుమీఱు ఒప్పు

సీ మకరందనిష్యంద మందారమాలిక కబరీభరంబున సొబగుమీఱ. విక్ర. 1. 8.

సొబగులాడి వి. అందగత్తె, స్త్రీ

తే. గీ. పూన్చె మణిభూషణము లొక్కపువ్వుఁబోణి, చూపె ముకురంబు సతి కొక్క సొబగులాడి. చంపూరా. 3. 115.

సొబసు వి. బడబచూలు. అం. భా. (శ. ర.)

సొమరు దే. అ. క్రి. వికాసము తప్పు, వెలవెలఁబాఱు.

తే గీ. పుడికివైచిన మవ్వంపుఁ బొఱయపోలె, వాడి సొమరుచు మేఁదీగ వంది కంది ... కుమా. సం. 6. 660.

**సొమ్మ** వి. మూర్ఛ.

కం... అత్తులువ మొరవాలుచే గ్రక్కలియని దొక బొడిచి సొమ్మపాలుగఁ జేసెన్ అ. రా. యుద్ధ. 2౬౩.

చం. అడిదము వ్రేటునం బఱియలైన శరీరము నందు నెత్తురుల్, సొడనాడఁ గ్రమ్మ నెమ్మనము సొమ్మలు పైకొన మూర్ఛ లొక్కటై, నిడుగలు గాఁగఁ బ్రాణములు నిల్వక తల్లడిలంగ. హరి ఉ. 4. 28.

**సొమ్మగొను** అ. క్రి. మూర్ఛిల్లు.

కం. నొప్పివడి వాఁడు దద్దయు, నుప్పర మగ్రదు వంగ నార్చి యొక వాలుండూ, వప్పాలము ద్రిమ్మరిపఁయిన్, గుప్పున నడరింప సొమ్మగొని యుండునెడన్. అ. రా. యుద్ధ. 191.

**సొమ్మఁబోవు** అ. క్రి. (సొమ్మ+పోవు) సొమ్మసిల్లు, మూర్ఛనొందు.

చం. వెదకితి మెల్లచోటఁ బృథివీసుతఁ గానమ యింక నేమిసేయుదు మని సొమ్మఁబోవు మఱి యొయ్యనఁ దేఱు విషాదమొందు. భా. రా. అర. 2, ౬01.

**సొమ్మల** వి. సొమ్మసిలుట.

కం. అనయము నెమ్మనమునఁ జాయఁ, సొమ్మల పేరు మూర్ఛయనఁగాఁ బరగున్, దనరెడు నింద్రియ గుణవర్తన వైకల్యమున నెఱుఁగఁ దగుఁ దత్‌జ్ఞులకున్. కా. వ్యా. 2. ఉల్లా. 82 ప.

**సొమ్మలఁబోవు** దే. అ. క్రి. మూర్ఛిల్లు.

పతిసొమ్మలఁ బోయె రథోపరిస్థలిన్. దశకు. 2. ౬6.

**సొమ్మలువోవు** అ. క్రి. (సొమ్మలు+వోవు) రూ. సొమ్మవోవు. మూర్ఛిల్లు.

వ. కుఱియు వానజల్లు పెల్లుగ నిమ్మలుగాని సొమ్మలు వోయి గోకులం బాకులం బయి. భాగ. 2. 186.

వ. విద్యుల్లతా విలోకంబున రిమ్మలు గొని సొమ్మలు వోవుచున్న లేఁగలు భాగ. 10 స్కం. పూర్వ. 634

ఉ. ఉప్పరిఁ జిమ్మునన్ బాఱి యుప్పరి మెల్లన బ్రాలఁ బాన్పుపై... సొమ్మలు వోవుటన్ సఖులు చూచి భయంపడఁ గానువవనన్. కుమా. సం. 5. 632.

సీ. కముఁ దెక్కుపోటుఁ బడి రక్తమిమ్ముగా వడిసి సొమ్మలు వోయి వ్రాలుచోట...కుమా. సం. సం. 11. 702.

చం. హలధరుఁ డేసె హంసు బదియమ్ముల నైదిట నేసె హంసుఁ డా హలధరు నాతఁ డాశరము లైదిట నైదిట నాఁగి రేఁగి మొక్కలమున నారిసం బొకటిగాఁడఁగ వానిలలాట మేయుచున్, సొలసి యతండు తేరిపయి సొమ్మలువోయె నచేతన స్థితిన్. ఉ. హరి. 4. 242.

ఉ. ... గాఢతరక్షతిఁ దూలి నేలపై, జానులు మోపి మాగధుఁడు సత్త్వముఁ జెడి సొమ్మవోయినన్. హరి. ఉ. 1. 198.

వ. తన కొడుకుల గెలుపున నాసమాలుటం జేసి ఆ॥ సొమ్మవోయి పడిన సుదతు లాక్రందన, రవము తోడ సత్వరముగ నెత్తి, యా నృపాలు సెజ్జయం దిడి మెలపున, శిశిరవిధులు సేయ సేదదేఱె. భార. ద్రోణ. 1. 95.

కం. ఒలుఁడు గదఁ బూన్చి ధ్రువు నదు, తలవైచిన సొమ్మవోయి తత్క్షణమాత్రన్, దెలిసి. హరి. ఉ. 10. 62.

వ. భీషణశక్తి వైచిన నొడిసిపట్టి మగుడఁ దద్వితుంబు లత్యంబుగా వైచిన నప్పాటున నమ్మేటి మగండు సొమ్మవోయి తేరి పయిఁ బడినంగని. హరి. ఉ. 6. 181.

తే. పొడవు నిడు వాలుగొమ్ముగాఁ బొడిచి యెత్తి, ధరణిపై వైచి వెసపట్టి ఖురపుటములఁ, జిమ్మిటయు దవ్వగాఁ దూలి సొమ్మవోయిం పడియె నాతఁడు చూపఱు భయము నొంద. హరి. పూర్వ. 6. 150.

చం. అలులకు నుల్కు ... నిండు వెన్నెలఁ గని

సొమ్మవోపు ధ జీభనందన కామవేదనన్ కుమా. సం. ౧. ౬౩౨.

తే. గీ. అనుచుఁ గడలేని మక్కువ నలచి యలచి సైఁపఁజాలక యా రాచచలిచెలుంగు, నేలఁబడి సొమ్మవోయి జేజేల ప్రోలి, కేగెనట రాముఁడుకు ద్రోవ నేఁగి యేఁగి. అ. రా. అయోధ్యా. 99.

సొమ్మసిల్లు అ. క్రి రూ. సొమ్మసిలు, మూర్ఛిల్లు.

మ. అనినం గాలినకూలము ల్పైవులలో నఁటించి వచ్చెన నూఁదిన పెందిమ్మన సొమ్మసిల్లి మగుడ న్వేతేరి. సారంగ 2. 99.

సీ. మాకుఁ జూడఁగ సొమ్మసిలి పడ్డదిగాని, తెగ టారఁ జచ్చుట తెలియరాదు, కావున నీపాతకం బసివోవ జాహ్నవిఁ దెచ్చుటకుఁ బ్రయత్నంబు నీవు చేయుము. వరాహ 10. 45.

తే. గీ. అనుచుఁ దన తొంటిరూపుఁ జూపిన పడంకి, యన్నుతలమిన్న బెబ్బులిఁ గన్న లేడి, బోటియుం బోలె నేలపై సొమ్మసిలినఁ జూచి యబ్బెరజపు రక్కసుండు వేగ. అ. రా. అరణ్యా. 6. 1.

చం... దానవవీరుఁ డుగ్రసధారలు దొంగంగ సొమ్మసిలి రౌద్రరసం బొదవంగఁ దేటి. భా. రా. యుద్ధ. 1750.

చం. జడసిన చిల్వగుంపు నొకసారియు బ్రమింగమి సొమ్మసిల్లి భ్రమ, వ్వుడనగుజాని నొల్లని దిటాయని కిన్. శుక. 2. 458.

"డిల్లపడి మెల్లన సొమ్మసిల్లిన" నీలా. 3. 32.

వ. అరామ .... సొమ్మసిలం బోయి లేచి వనం తునిం గనుంగొని. హంస. 3. 98.

"అక్కుకుఁ జిడిముడిపడు సొమ్మసిలు దటమ్ము లేక కన్నీరు నించు. నీలా. 2. 85.

తే. గీ. మోదమున నైదు తూపుల పాదుషాహు, తమ్మిదొదున్మిఁగొంటి జెందమ్ము గ్రుమ్మి, క్రమ్ము కొని దొమ్మి సేసిన సొమ్మసిల్లి, యమ్మహామహుఁ డిట్లను నెమ్మనమున. ఉ. రా. 7. 456.

ఉ. క్రౌంచ విభేదశాలి యగుస్కందుని చందముఁ జెంది ముందెన, క్రౌంచరాజు పేరుంము గాడఁగ ముద్గం మెత్తి వ్రేసి నొప్పించిన సొమ్మసిల్లి ధృతి పెంపువఁ దెప్పిటి వాఁడు రాజ నిన్నంచెద నేఁడు దండికదకం చతిరోషకపాయితాడుఁడై. ఉ. రా. 4. 67.

సొమ్ము వి 1. ద్రవ్యము, ధనము.

ఎ. గీ. కురుకుమారుల నలి ప్రమింగి నకు మొదుల, సొమ్మునకు నానపడఁ దగ దమ్మ వారి, పాలు వారలతోఁగూడి బ్రదుకు మనుము. భార. ఉద్యో. 1, 376.

సీ. అవనీశ త్రిదశేంద్రుచూపు బరికన్యాగండ పాళిన్వయీ, నవలావణ్యానంబుఁ గొల్లగొని యంతం జెంత ఫాలవు రాజు విలోకించి చలించి కైకొనిన యా సొమ్మెల్ల ఘర్మాంబుకైతవ మొప్పన్ వెసడించి తూటెఁ గవరీతాపించకుంజాం తమున్. మను. 5. 82.

వ. ... దక్కె సొమ్మని ... అము. 4. 35.

గీ. జెంసి చేఁదప్పిపడ్డ సొమ్మునినట్టు. హంస. 2.44.
"ఎలమి వల్వలును సొమ్ములు నొసఁగు" నీలా. 1. 49.

సీ పరుల సొమ్ముల కాసపడెడు వారు. శృం. నై. 7. 52.

ఉ ... నీ, సొమ్మది యెంత యంతయును. విక. 5, 62.

తే. సొమ్ము గోరిన యంతన సుఖముగలుగ, దదియు పార్జింపఁగా సిద్ధియగుట నిజమె, కలిగెనేని యనేక చింతల నొనర్చు. భార. శాం. 4. 47.

2 అధీన వస్తువు, హక్కు.

సీ. అత్యద్భుతములైన యన్యుల సొమ్ములు కుటిల మార్గమునఁ గైకొనఁగ వచ్చు. విక్ర. 4 113.

కం. రమ్మనుమా తమ్మునిఁ దన, సొమ్మును మా లంక. ఉ. రా. 2. 242.

ఆ. వె. అతఁడు వీక్యకుల్క యగు రాజనుక వట్లు దనదు, సొమ్ముఁ జేసికొని భృశప్రకాశితాస్మ, వంశుఁడై శోభిలెను మామక సదృశ ప్రమోద మావహిల్ల. రాఘ. 2. 57.

సీ. కొంతే యిదియేమి యొకరి సొమ్మొ. పారి. 4. 58. (సొక్కు)

ఉ....కొమ్ము సీ, సొమ్మని వజ్రమిచ్చి మధుసూదనుఁ డాలిఁ సీ దలంచినన్. పారి. 5. 59.

తే. అస్త్ర వీర్యంబుఁ జెటిచె నట్లగుట వీఁడు, పార్థు మార్కొని మానంబుఁ బ్రాణములును, దనకు సొమ్ముగ దక్కించుకొనగ లేమి, యెల్లవారికి నెంతయుఁ దెల్ల మధిప. భార. ఉద్యో. 4. 234.

ఉ. ఏకడ సర్వభూత దయయే తమ సొమ్ముగ దీన మానవ వ్యాకులతాపనోదన ధనాఢ్యులనన్ విల సిల్లి రేవురున్ పాండురంగ. 4. 265.

కం. వినినంతఁ జెన్నిధానముఁ, గనుఁగొన్న దరిద్రుఁ బోలి ఘనుఁ డాజయకే, తనుఁ డలతలో దరిమణి, తన సొమ్మని తలఁచి యతులిత త్వరమతియై. కు. 1. 330.

కం భండారముతో హయమద శుండాల ఘటాళి దనదు సొమ్మై. అము. 4. 237.

ఉ. ఎమ్మెలు సెప్పనేల జగ మెన్నఁగఁ బన్నగ రాజశాయికిన్, సొమ్ముగ వాక్యసంపదలు సూజలు నేసిన వాని. భాగ. 6. 12.

3. ఆభరణము; తొడవు.

సీ మణుల సొమ్ములు మేన మట్టు పఱిచి మను. 6. 5.

ఉ వేల పుష్యాని పూవు చేసిన సొమ్ముఁ బంగ ములఁ జేర్చి శ్రధూళిని నాదరించుచున్. పారి 5. 42.

ద్వి నా సొమ్ములను నీవు నగచరాధీశ, నీసొమ్ము లని చూడు నీదుచిత్తమున. రం రా. ఉ కాం. 4 పు. 27. పం.

వ. ఎన మేళగాంబ్రి నాలోకించి యిబ్బాలికలు మన వాలకపు సొమ్ము లందు నేమేసియు నహహ రించుటకు నర్తాడుచున్న వారు నీరు కొమ్ము దప్ప నెచ్చరిక గనిపట్టుకొని యుండుఁ డనుటయు. ప్రభా. 1. 107.

కం నుళయానిల సంగతిఁ జూతలతిక లంకూర జాలరౌహస్యకపతులై, యలయుఁ సడలించిన సొమ్ములకై వడిఁ బాండు పత్రములు వెసజాఱెన్. పార. 3. 47.

ఆ. వెన దియొక్కు గిత్త నాగులు సొమ్ములు, చేదు మెడను బునుక చెరుబాది, నుదుట సరలు గొప్పనదురాక లెదఁగల్గు,నయ్యొ యొరపు దెలుప వలవియగునె. చెన్నబ 5. 59.

ద్వి. సూర్యుండు ధరియించి సుమతి భజించి, సూర్యోశ్వ మని దనసొమ్ముగాఁ బడసె. పండితా. దీక్షా. 19, పట.

చం సొంది విచిత్రచిత్రముగ సొమ్ములు నేయ నతఁడు నేరిచెన్ హంస. 2. 182.

ఉ కాఁకళావమౌళి దినకాంతి హసంతికలోన యమినీ-జాలకు సొమ్ముసేయుటకు భాస్కరుఁ డన్ కనకంబు గ్రాఁచి కల్లో వతివరాంతరము లోనిడఁ దోఁచిన ధూమ మన్ తమో, జాలము పర్వె చాఁవలచాడ్పునఁ దాఁలు వాల్పె నెంత యున్. హంస. 1. 117.

ఉ. పెచ్చిన మైత్రిఁ బద్మినుల కెల్లి ఘనాత్మయ కాఁకుండు సొమ్మచ్చ వడంగఁ జేయుటకునై ... ఆము 4. 145.

గీ. చిలువ సొమ్ములు విసనాడి చెఱువు మెఱయ, ఒలిసి నవరత్న భూషణంబులు ధరించి. జాహ్నవీ. 0. 18.

4. గోధనము, ఆభరణము.

సీ. దొడ్డిపట్టుల గొప్పకొండసానుల యొడళ్ళ సొమ్ములు, సొమ్ములు సొంపు నెఱప. (ఇది రెండర్థములకు నుదాహరణము). శ. ర. అచ్చు బాల. కాం.

5. అలంకారము.

శ. గీ కడలిఁ బొడమిన సిగ్గు చొక్కంపు గెంపు. సొమ్మునాడు నెమలి కుంచె సొమ్మువాఁడు. రాజ వాహన. 1. 71.

వ. వగ లొలుకు భాగధగ్యపు. జిగి గుల్కెడు నుబ్బి

గడ. సొరిది మధువృష్టి వంజులకములఁ దిలకములఁ గురిసెఁ జెదరుచు దేంట్లకులకములు జలకములు. రాఘ. 2. 6.

. వరుస, పంక్తి.

మ. సొరిదిం జేర్చినతీఁగ మల్లియలు. ఆము. 1. 66.

తే గీ సొరిదిఁ గనుపట్టి హేమకుంభములు సెలంగఁ, బొడవుకత మవ సూక్ష్మమై పొల్చుఁజూడఁ, బట్ట ణము కోటకొమ్మలపంక్తి గగన, మండల శ్రీకి సంపఁగిదండవోలె. ఆము. 2. 5.

మ. ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీగతిన్ వింధ్యగ,హ్వరముల్ దూఱఁగఁ జొచ్చి తార చటఁ,గాఁపై యుండుటం జాల వ,చ్చెరువై యొట్టిని వింతచీకటులు వచ్చెం జూడరే యందు వే,సొరిదిం జొచ్చెరు వీరరుద్రగజరాట్పుద్ధాంతముగ్ధాంగనల్ మను. 1. 88.

3. శీఘ్రము

తే. గీ. చోద్య మప్పుడు భవరోగవైద్యుఁ డైన, యంబుజోదరు డాసిన యంతమాత్ర, నవగతా సాధ్యగదుఁ డయ్యె యఙకర్త, సొరిది రుద్రులు నిర్ముక్తశూలురైరి. పారి 5. 11.

4. యుక్తముగా,

తే. మరుని నాళీకసాయకోత్కరము కరము, ధరముఁ దర మిడి మెరముశే యరిదిసొరిది, మరిదివవి మెట్లు తెగఁగోయ మరునదీయు,రంబుల జనింపవో శతారములు గావొ వసు. 2. 115.

సొరిదోఁకి విశ. క్రూరుఁడు, దుర్మార్గుఁడు, దురాచారుఁడు (శ. ర.)

సీ. (చెలికత్తె చిత్రపటము చూపి) సుదతి నీమది లోని సొరిదోఁకి మదనుండు తన కొండు చోటింక్క దడవుఁగాక, కాంత నీపలుకులు గరజాణ చిలుకల వెదకి నాలుకముల్లు విఱుచుగాక. ఉ. హరి. 5. 141.

సొరుగు అ. క్రి. మూర్ఛిల్లు.

తే. గీ. (వనస్థ) పుట్టలను దిట్టలను జెట్ల బొట్ల గట్ల, వంకలను డొంకలను బీళ్లఁ బాళ్ళ జాళ్ళఁ, గుప్పలను దిప్పలను మళ్ళ గుళ్ళ నూళ్ళ, దిరిగి యాహార మందక సొరిగి యరిగె. హంస. 1. 169.

వ అని పలికి యశరీరవాణి యరుగ వెఱఁగుపడి రాకొమరుండు పైఁబైఁ బెరుగుసొరుగువన్ ధరం బడి పొరలి మొఱ లిడుచుండె. సారంగ. 3. 174.

కం. మది సిగ్గు వెలికి త్రేయఁగ, మదనుఁడు మధుకసము నించి మఱిపాతగలం, గదలింప నూఁగు పోలిక, సుదతికి మధుసేవఁ దనువు సొరుగఁగఁ జొచ్చెన్. కవి. 4. 159.

సీ. పొగసె దిక్కులు మొకంబుల యంగములు పెల్లె సొరిగెఁ బిట్టలు చెదఁదిరిగె మరుఁడు. (గ్రీష్మవర్ణనము) చంద్రాంగ. 2. 84.

కం అతను శరహతుల సొరిగెను, సతి విరహతపస్సమాధిజనితవ్రత యై. నరసభూ. 3. 81.

వ. మరుమరీచివీచికల దిర్గి తిరిగి సొరిగి హరిణాంకోపలఫలకకులకలితాలవాల జాలమ్ముల నిండిన వజ్జ వలరుగొజ్జఁగినీవల నీరుఁ గొంతసేపు త్రావుచు. అచలా. 2. 71.

తే. గీ. దరికొని వహించునక్కాఁకఁ దాళలేక, తెంలి మృగములు మృగతృష్ణకరిగి సొరుగు, మండువేసవిఁ బంచాగ్నిమధ్యమునను, గుంభకర్ణుఁడు గావించె ఘోరతపము. ఉ. రా. 2 161.

మ. అనినన్ జిత్తము జల్లనన్ సొరుగు నయ్యుంభోజపత్రాక్షి లో,చనగోళంబులఁ జిమ్మలై చిలుపలై జాలై తరంగంబులై, చనుదోయిన్ గొనబౌ కురంగమదచర్చల్ జారెపో నొక్క యొ,డ్డున బాష్పాంబుపూరంబు లుప్పతిలెఁ బోటుంబాటుగా నెంతయున్. మను. 3. 186.

తే. గీ. ఏ సుఖము నింక నేలని యెంచి యెంచి, నేత్రముల శోకబాష్పముల్ నించి నించి, సొరిగి పలుమాఱుఁ దామ్పపై వొఱిగి యొఱిగి, యలయు విభుఁ జూచి లక్ష్మణుం డార్తుఁ డగుచు. ఉ. రా. 6. 344.

సొరుగుపోవు అ. క్రి. మూర్ఛపోవు.

శా. నిన్నున్ మించితి సైన్యముల్ సొరుగువోనీ దీన నా కేమియున్, విన్నంబాటు ఘటింపనేరదు. పి. శకుం. 3 132.

సొరువు వి సొరుగు. ఎండిన (యాకు', అట్టి సొరుగు

సొలఅ వి తుంబి, అనుగు (వ్య. వి.)

సొలఅపుంగాయ వి (సొలఅము + కాయ) తుంబి, అనుగవుఁగాయ.

వ. కతఁ బున ధరియించిన యా సొలవుంగాయ లోని భస్మ బిచ్చిన. హరి. 1. 29

సొజ్జ = సొల

వ ... చిచికి కంపలఁ గాచిన పెట్టె సొజ్జలీపలు.... పంచ.

సొలచు అ క్రి. 1 తగ్గు

కం తలయాగతి నరవలియై, సొలవక నెత్తురులు గ్రక్కుచును దైవమ్ములోఁ, బొలుపటిన కాశి యాహిని, తెలుచవ నొక్కెత వెలితి పీనుగుఁ జేసెన్ వి పు. '' 6.

2 విజృంభించు, చెలరేఁగు

కం అమశార శిలీముఖహతి, సుమనోగణ ... మణ గె సొలవక .. ఉ. న. 1. 905.

3 వైముఖ్యము నొందు.

సీ. సొలవకు మదిగొనవచ్చునటన్న ( బోలివాఁ డిటు వచ్చి యెంత రాకెంత యనుచు కువల. 5. 39.

సొలపు విశ. పరవశత కలుగనది.

మ సొలపుఁజూపులు జెక్కు జేడినలటంచున్ ఒట్ట న కించి ... దశా. 3 64.

వి పారవశ్యము.

ద్వి పొలుపులై సొలపులై పూవిల్తువా మెలుపులై వలపులై మించు పాదములు. ద్వి. గరుడ 3 183. పా

గీ. వారచొక్కులు టెక్కులు వారి వగలు, వారి వన్నెలు చిన్నెలు వారి సరులు,....... వారి వలపులు సొలపులు వశమె పొగడ ఉ. రా. 6. 166.

గీ. సొలపు వలపును గొలుపు నిచ్చలపుఁ దెలుపు, వగవు మల్లెల కొక విఁతనయము దెలుపఁ, గోడె కాంద్రకు విరులమ్ము కొందు రెపుడు, పువ్వుల మ్మెడి ప్రోడ లాప్రోలిలోన యయా. 1 12.

2. శ్రమ, బడలిక.

ద్వి నిలిచెద మిచ్చోట నీసమీపమున, సొలపు దీఱఁగ మునిసుతులతోఁగూడి ద్వి. హరిశ్చ. పూ 1806.

ద్వి ఇవియన్ని యేటికి నీ ... కుఁడు, తివిరి విప్రుఁడు గాక తిరిగెడు వాఁడు, సొలపు దీఱఁగ వసిష్ఠుని యింటఁగుడిచి, తొలఁగిపోవుచు నెన్ని దొసఁగులు సేసె. ద్వి. హరిశ్చ. ఉత్త 446.

3 మూర్ఛ

(గడ. మితిలేక పరగెంతి మెలపులను సొలపులను, నతివ కెంతయు మఱచి వలపులును సొలపులును. రాఘవ. 2. 6.

4 దీనభావము.

చం. చిత్రగృహంబున నుండి పోవుచున్, సొలపున నీవు నన్మరలి మాడఁ దిరుద్ధిగ నేలితంచు నే వలరతిఁగాని భావజుని కగ్గము సేయు తెఱుంగ భామినీ వసు. 4. 64.

5. వంతి.

చం తెలిమగజాల కంబములఁ దీటిన బంగరు కీలు బొమ్మగుఁ, పులకు మెఱుంగుఁ గొప్పు సొలపుల్ మొలిపించెడు కప్పురాలలో, పలఁగల కల్వచప్పరపు వన్నెలఁ జెన్నగు నొక్క మేడలో. ఉ రా. 1. 317.

లయవిభాతి .. వెన్మెన్మె, యలపులకుఁ బాదపపు సొలపులకుఁ గ్రమ్ముకొను తలఁపులకు ముమ్మరపు వలపులకుఁ జెల్వె, న్నెలలకును గొమ్మగను కలల కును కెంతఁదగు మలలకును గోర్కులను వలలకును లోఁగున్ యయా 5. 104.

6. విధము.

వ. మరుని మెఱుఁగమ్ములు తమకు హస్తగత మ్ములై యున్నవని తెలుపు సొలపున గనుపుండ

రీః ఖండంబులంబోని బంగరు కోలలు కేలం బూని. ల. వి. 1. 74.

సీ వగవు వెన్నెలజాలు మగఱాలపిడివాలు సొగసు సొమ్ములడాలు సొలపువెలయ. చెన్న. 4. 264.

7. విలాసము.

సీ. చెమటచేఁ దిలకమ్ము చెదరెనోయని వింత సొల పుతో వద్దంబు చూచి చూచి కువల. 4. 98.

కం కులుకు నెఱవంక కన్నొము, సొలపులనీయింతి వాలుఁ జూపులఁ జూడన్, వలరాజు వంటి వాఁడును, విలువమ్ములు వైచి దాసవృత్తికిఁ జొరఁడే. శశాంక. 3. 46.

8. మృదుత్వము.

సీ తళుకు కెంజిగురాకు సొలపూను నీయంఘ్రి నూచిపై మెట్టిన పొంపు చెడదె. చంద్రికా. ౭. 107.

9. దృష్టి విశేషము.

గీ. సొగసు తెలివాలునను సోగసొంపు తళుకు, బెళుకు చికిలి యొయారంపుఁ బేరెముదుటు, సొలపు యంపు దేలింపు చుఱుకుటోర, కలికి బెదరెచ్చు చూపుల కలికిఁజూచి. ప్రబంధ. 1. 108.

అ. క్రి. వెనుదీయు, జంకు.

చ. వలపులరాయ! యిచ్చిగురు వాతెఱకొమ్ము నలంచుటెల్లవ, బ్బాలసుల బోవపుం దొరకుఁ బుట్టిన గాదిలి కూతురంచునో, సొలవక యాడు దానిఁ దెగఁజూచిన రోయరె నిన్ను వయ్యయో, తెలియవు నీకుఁ దండ్రి పగదీఱునె దీనిఁ గలంచినంత టన్. యయా 5. 78.

సొలయించు స. క్రి సొలయఁజేయు.

ద్వి. విలసించు నలయించు విలుమించు బొమలు, బొలయించి సొలయించి పొలఁతులవ్వేళఁ, గొంచ పట్టుటకునై కొంచనియించ, గొంచ బోనీకువే యలివేణి వేణి అ. మ. క. 2. 115 పా. 18 వం.

సీ. అలయించు నొకవేళఁ బొలయల్క చిక్కుల సొలయించు నొకవేళ సొగసువగల. శశాంక. 4. 86.

సొలయిక వి. వైముఖ్యము.

వ. అలయిక సొలయికల నొక వింతయొయ్యా రంబు చూపుచూపుల వసకుంజాల వసివాళ్ళు వాడిన క్రీడావతంసితకర్ణ నీలోత్పల దళంబులు కళా. ౮. 224.

సొలయు అ క్రి. 1. పరవశమగు

గీ. సొలసి మూర్ఛిల్లి యొక్కింత దెలియువారు, దెలిసి క్రైదువు లంకించి నిలుచువారు. భా. రా. యుద్ధ. 1349.

గీ. అతివ యాగతి నుపరతి నలసి సొలసి, యప్పళిం చుక వ్రాలె నాయకుని యెదను. దశా. 7. 163.

2. వైరస్యము నందు; వైముఖ్యము నందు.

చం కలఁగెడు బంధువర్గమును గారియఁబొందెడు తల్లిదండ్రులన్, సొలయు సభాజనావళులఁ జూచి విపక్ష పక్షాపహారసం, కలనముఁ గ్రోధదేవతకు గ్రక్కునఁ జేయఁ దలంచి ..హరి. పూ. 9 133.

రగడ. సొలయక జయించు నతిను ప్తియు వసు ప్తి యును. దెలిసికను నాత్మసుఖతృప్తియును జ్ఞప్తి యును సీతారా. 3. 111.

కం. సొలయక తూవిగలం గొట్టులఁ బెట్టితి నీవు నీ చిఱుతకాలము ... భార. ఆది. 4. 270.

గీ అతిథిఁ బూజించు వేడ్క సాకగ్గలంబు, వెలఁది నీవును వనుకూలవృత్తిఁ దాల్చి, సొలయ కప్పని నడపఁగావలయు ... ... భార. అను. 1. 66.

కం. జననీ యిట్లగుటను మజ్జనకు పలుకు మీఱఁ గాదు సమకొల్పుధృతిన్, మనమున వగవకు మిట్టిట్టని సొలయకు రాజువలన.... భా. రా. అయో. 66.

3. వెనుదీయు, జంకు

చం. పొలసుగవుల్ గడుంగదురఁ బొట్టకుఁ గగ్గ నటంచు నార్చుచున్, సొలయక వచ్చుతాటకఁ గనుంగొని రా జడదారి తాముతోన్. యయా. 2. 7.

గీ. ... నిదిగో వచ్చెదఁ బదఁపడి. యని సొలయు సీతత్రోవలోఁ జనుచునపుడు. దశా. 6. 18.

4. మిక్కిలి యలసటనొందు, బాధపడు.

మ. సొలయున్ జూచు వగున్ బయల్ పలుక రించున్ బల్కు నూకొట్టు బిట్టలుగున్ గ్రుక్కు...చంద్రా. 3. 4.

సీ. పవలెల్ల దీర్ఘికాంబువుచల్లు పోరాడ సొలసి మృణాళికోజ్జ్వలములైన, బాహువుల్ తమదు కూర్పరముల కెదురుగా మలఁచి మూఁపులఁ గర తలము లునిచి. ఆము. 2. 61

చం. సొలసి తటిల్లతాంగి జిగిసూపు వెలుంగలచేఁ గలధ్వనుల్, గలకలకంఠులన్ గదిమి ... వసు 3. 67.

గీ. అచ్చరలు దక్కఁగలవార లలసి సొలసి, ప్రాణ ముక్తియ యుక్తిగా ననుమతించి ... నైష. 3. 96.

కం నీవేమిచేయు దింకను, నీ వలవన్ సొలయ నేను నిను వేడెద స,ద్భావమున నాదుకోరిక, గావిం పుము సమ్మదమున గాంధమారన్ భా. రా. బాల. 488

5 మూర్ఛపోవు

గీ. సొలసి మాటాట నుంకింపఁదలఁచి మోము, దేఁకొని చూచునపుడ కన్నీరు వొడమె. మనుచ 3. 9 .

కం. అనునంతట నయ్యంగన, యనయముఁ బ్రబల మగునట్టి యంగజ తాపం,బున నుస్సురుస్సు రనుచుం, గను తెప్పలు దేలవైచి కడు సొలయుట యున్. కళా 6. 149

గీ. ఆయదూద్వహు వైవంగ నది వెరవున, నొడిసి పట్టి యాబలియుఁ దత్క్షుగ్రశిల, మగుడ నతనిన వైచె నమ్మగధపతియు, సొలసి వేగ యాలోచన తెలిసి నిలిచి హరి. ఉ. 1 120.

6. విసుగుపడు.

చం. సొలయక యెల్లదేశములఁ జూచితి వందుఁ బ్రసిద్ధులైన రాజుల . భాగ. ఆది. 7. 3.

చం. పులుఁగులఁ జూడమే యెసద బోధము గల్గియు మోహ మెట్టిదో, సొలయక యాకటన్ నవయు చున్ జని మేఁపొగి తెచ్చి తెచ్చి....మార్క. 6. 30.

7. ఒప్పు

సీ. ఇనునితో జోడుగాఁ దవరెద ననుచునో యుగ్ర రూపస్ఫూర్తి యొనరుచెల్ల, సోమనామము దాల్చి సొలసెద ననుచునో వేడి వెన్నెలలచే వేఁచు చెల్ల. కృష్ణ 4. 84.

8. వ్యాపించు.

సీ ఇవిపొత్తి సొలసిన మృగనాభి మృగినెత్తురులు గప్పళించిన నెలవులయ్యె. రా. వి. 3 57.

9. పరిమళించు, వలచు.

సీ. ఇంచువిల్తుఁడు ప్రయోగించు వాల్తూపులు సొలసి యొండొరుఁజూచు చూపులెల్ల. ఉ. రా 6. 166.

సొలుగు అ. క్రి. వశించు, తీఱు.

కం. ఋభులోక విభుని యంతటి, శుభలక్షణ లక్షితు నకు సొలిగెనె నహుష, ప్రథవాపప్రథ యిప్పటి, కభిమానం బెడలుకంటె హైన్యము కలదే ? రంగా. 2. 240.

సొలుపు(ల్పు) వి. 1 గర్భిణీ స్త్రీ లక్షణ విశేషము.

కం. అలపున్ సొలపున్ వేసట, తలఁపున్ జన్మో వలనలుపు తమమధ్యమునన్, బలుపున్ మై తెలుపున్ జెలి, పొలుపున్ గాంచి గుసగుసలఁ బోవుచుఁ గాంతల్. ఉ హరిశ్చ. 2. 92.

2. విధము

చం పెదవుల కెంపులున్ మదుటఁ జేరిన కప్రము సొల్పుఁ జూపులున్, నిదురలు లేమిఁ గన్గొనల నిండిన జాజు లెలర్పుచుండఁగా ... యయా. 4. 149.

కం. వేల్పు చెలి మెట్టులత్తుక, చాల్పున్ జాల్ పువ్వు బంతి జారెడు సొల్పున్, సొల్పువిరులొత్తు సెజ్జలు, వాల్పడ వాల్పడఁతిఁ గూడు వలనున్ దెలిపెన్. అచ్చ. భారవి. 2 28. పొ.

సొవ వి. సవ్వడి.

గీ. ఇరుగుపొరుగుల దంపతు లేపు రేఁగి, సంగమ క్రీడలోలాడి సరసమాడు, సొవసొవలు విన్నమాత్ర నుస్సురుమటంచు, మన్మథుని కారి గొజ్జెయై మగువ దలఁతు. హంస. 5. 158.

# సో

సోఁకించు స. క్రి. సోఁకఁజేయు.

ద్వి. సోఁకు పొంకములుగా శ్రుతిపుటంబులకు, సోఁకించి మాయన్న సుఖమెల్ల నడిగి. ద్వి. భార. విరా. 3. 52. పొ.

సోఁకు సోఁకు, వి. స్పర్శ, తాకుడు.

కం. పోఁక నళినీ రజస్వల, సోఁకున దోషంబు వాయ సూర్యుఁడు గళితా, శంకను సవరాం బుధిలో, గ్రుంకెనొకో యనఁగఁ బ్రొద్దు గ్రుంకుడు నంతన్. కు. సం. 8. 89.

ద్వి సోఁకు పొంకములుగా శ్రుతిపుటంబులకు, సోఁకించి మాయన్న సుఖమెల్ల నడిగి. ద్వి. భార. విరా 3 52. పొ.

సోఁకించు స. క్రి. సోఁకఁజేయు, తగిలించు; కొట్టు; తాఁకించు.

సీ. తరళాక్షి తనులతఁ దవసుందరాంగంబు సోఁకించి సంస్పర్శ సుఖముఁ బొందు. మార్క. 5. 126

మ. జలజాప్తోగ్ర మయూఖపుం జెకుముకిన్ సప్తాశ్వ కాంతోపల,మ్ముల సోఁకించి తదుద్గతాగ్నిలవముం బోధించి ... శుక. 3. 449.

వ. గదలు సోఁకించియు ... ఉ. హరి. 3 70

సోఁకు స. క్రి. 1. స్పృశించు, తాఁకు.

శా. భేటం భేటముగా నిభంబు కరిణిం బ్రేమం బుతోఁ జేరి ... వరాంగములు సోఁకుం బుష్కరా గ్రంబునం, దాటోపం బొనరించుఁ గూడఁ బ్రియఁ గామాసక్తి నాసక్తిమై. కు. సం. 1. 100.

సీ బరిమేని గరుడుని మరువడిమైనెక్కి పటపటమని సారెవన్నె సోఁకి. వాల్మీ. 1. 106.

మ పదియార్వన్నె పసిండి పట్ట మవనీపాలావతం సంబు నె, న్నుదుటం గట్టె లతాంగి యొర్తు కడ వీనుల్ సోఁక నేర్పొప్పఁగా. నైష. 8. 68.

సీ. వింహాలమై సోఁకి వేడియౌ వెన్నెలఁ బచ్చి వెన్నెల నులివెచ్చఁ జేసి. పారి. 2. 48.

దం. నీ మెట్టకెంజాయరం బుట్టి చెవ్వారు మిన్నేటి నీరింతమై సోఁకఁ బున్నెంబు లెన్నేనియుం గల్గు... .. నీలా. 2. 41.

గీ. సుకృతహీనుల తనువులు సోఁకెనేని, కజ్జలము భావమున నొందుఁ దజ్జలంబు. విక్ర. 5. 70.

ఉ. ఎవ్వడు గౌఁగిలింతు వల యింతికుచాద్రు లురంబు సోఁకనా, కప్పుడుగాదె సౌఖ్యపదమం దుట.... శుక. 1. 80.

గీ. అకట యాతనియందు నమ్మయ్యె నాదు, శక్తి యుపలంబు సోఁకిన శస్త్రమట్ల. వా. రా. 2. 10.

ఉ. ఉత్కళమైన మంచి మనువొప్పెడు నాహ యరత్న మెక్కినన్, గక్కనమేమి లేక రవగాలును జోడన యడ్డవేడెముల్, దుక్కు దువాళి జంగ వడలున్ గనిపించుచుఁ బోయిపోయిరా, జక్కడ వన్నెసోఁక నటు వా యనివం గదలెం బరిలునన్. సారంగ. 1. 82.

2. ఆవేశించు.

సీ. పరవధూటుల మైల పరిధానములు గట్టు చూలాంద్రఁ గొందఱు సోఁకుఁడనియు. వరాహ. 11. 131.

సీ. విరహామాలిన్య దుర్విధుఁ గాని సోఁకవు, కలి దోషమవె నీవు కాయజుండ. నైష. 2. 138.

ఆ అదియుఁగాక రాజ్యమున్నమహా భూతంబు, సోఁకి నప్పు డెట్టి సుజనులకును, లేనిచీఁకుదనము లేని మూఁగతనంబు, లేని చెవుడు గొంతయైనఁ గలదు. కళా. 5. 290.

అ. క్రి. తగులు, సక్తమగు.

గీ. అనుపనీతద్విజుండును వాడుదియును, శూద్రుఁ డును నీకులోకమాటు సోఁకఁ బెదవి, యంటు నప్పుడె శుద్ధాత్ములగుట నిక్క, మనిరి ధర్మజ్ఞులైన

మహోత్ఫుల్లెల్ల. విజ్ఞా. ఆచా. కాం. 54.

గీ. అడుగులో త్తెడు నప్పు డప్పుడమివడఁతి, గబ్బి గుబ్బలయంగరాగంబు సోఁకె, నవరుకెంజిగి చరణం బులంబుజములు, గానఁ బుప్పొడి యందురు పొని వరలు దశా. 3. 151.

2. ప్రవేశించు, చొచ్చు

మ. అని యీరీతి హితంబు దెల్పు చెలివాక్యాం బింతయున్ సోఁకద, య్యో నిశాలోకనబద్ధకోశజల జాతేంద్వంకువుం బోలి య,వ్వనజాతాయత నేత్ర నెమ్మనమునన్... ఇందు 5 160

మ. ఒకమాటెవ్వనిపేరు కర్ణములలో నొయ్యార్యాగమై సోఁకినన్, సకలాఘంబులుఁ బల్లటిల్లి తొలఁగున్... భాగ. స్కం. 9. 142.

కం. ఆఁకొన్న మృత్యువో వెలిఁ, బ్రాఁకిన లయ కాలరుద్రఫాలానలమో, యూఁకొవఁ దడవయ్యో డువది సోఁకినచోఁ జెల్లఁ గాలుఁ జొరనిచ్చెదవే. ఉ. హరి. 8. 188.

3. ఘటిల్లు, రగులు.

గీ. కన్నెమరునకుఁ బూఁదూఁపు లెన్నిలేవు, కన్నె గేదంగివిరి కెనగావుగాక, మూవజాజాభియాతికి దీనిగాలి, సోఁకినను గాదె తలయేలు సోఁకునెవుడు. వసు. 3. 145.

చం. సునియలి నిల్పు మానహాని సోఁకకయుండఁ గఁజేసి యుత్తటిన్. రాఘవ. ౬. 21.

4. ప్రసరించు.

ఉ. శ్రీపతిమీఁది గీతముల ప్రేమవిపంచిక నంటఁ జాడిసం, తాపముసోఁకి మెట్లమయినంబు కరంగిన .... ఆము. 5 15౽.

5. ఆవేశించు.

ద్వి. సొలయక భూతంబు సోఁకినరీతి. ద్వి. హరిశ్చ. పూర్వ. 1. 485.

వి. 1. స్పర్శ, తాఁకుడు.

చం. గరుడుని తెక్కలం బొడముగాడ్పుల సోఁకునఁ దక్కువేలుపుం, దరువులుఁ బెల్లగిల్లి గగనంబునఁ బ్రోడన వెంటనంటిరాన్. పారి. 4. 55.

మ. .. సితకోటి యూ,తువకశ్రేణి వధింతు నేఁడని మొనన్ సోఁకోర్చి వర్తించినన్. భాగ. 3. 655.

ఉ. ... సత్యభా, పాచతురుండు ద్విత్రిదివసంబుల లోఁ గరుణింతునన్ దయం, జూచెఁ గదమ్మ యమ్మురుని సోఁకుల కుల్కకుమమ్మ నెచ్చెలీ. పా. వి 4. 117

ఉ. సొద్దెపుఁదేఁటి తెక్కగొన సోఁకులచే రవళించు తమ్మిపూ, ముద్దెడమామి సద్దడర మోదుగునేజయుఁ గల్వకేడెమున్, గద్దువలాడు పూబొమిడికంబు దలిర్చి... ప్రబంధ. 1. 514.

సీ. పలుమారు సోమరిచలిగాలిసోఁకునఁ గదలెడు నీలాలకములు చూచి వరాహ. 6 52.

ఉ. జట్టులుచేరి లేఁతవిడి చెందొవ ప్రాఁత రుమాలు వున్ సిగం, జుట్టి యలందు కుంకుమపు సోఁకుల బంగరుతీఁగె రంగుని, ట్టట్టవ నీని జందెము భుజాగ్రమునం బడవైచి సీత్కృతుల్, దట్టముగాఁగ వింత వగలన్ మెయి మర్దనసేయు నత్తటిన్. కువల. 4. 107.

2. మేళవము, కలుపుట.

చం. సురభికురంగనాభి కటుచొక్కపుఁ గుంకుమఁ గప్పి కుంకుమ, స్ఫురితమహోష్మఁ గప్పుగపు సోఁకుల మానిపి కప్పురంపుఁ జల్మిరి మెఱుఁగుం జవాది నెడలించి కదంబముఁ గూర్చి నెచ్చెలు, ల్దరుణికలంది రన్నియును దత్తనువాసనఁ బూవు గట్టుచున్. వసు. 5. 121.

3. కష్టము, ఇక్కట్టు.

కం. సోఁకోర్చువాఁడె మనుజుఁడు, తేఁకువ గల వాడె వంశతిలకుఁడు సుమతీ. సు. శ. ౫.

వ. మూర్ధాభిషిక్తుఁడు సోఁకోర్చి యిలకు నగు వలజల్లు తీర్చినం గాక జన్మంబు సఫలం బగునె. ఆము. 4. 285.

4. రాక్షసుఁడు.

ఉ. పాముగీము దోఁపఁ జాల్చిమ్మి రెక్కొండ, వేల్పు సోఁకులోఁద వెన్నుకడలి, చిలువతేలి చుట్ల చిన్నెతో నిత్తతి, గట్టుమిన్ను నొఁయి గతిఁ దవర్చె. అచ్చ. భా. 2 29. పా.

సీ. మునుసోఁకుమూఁకల మోవనోపక...నీలా. 1. 70.

**సోఁకుఁజుక్క** వి. (సోఁకు + చుక్క) మూలానక్షత్రము.

**సోఁకుటింతులు** వి. బ. రాక్షస స్త్రీలు

గీ. సోఁకుటింతులు నలువంకఁ జుట్టియున్న, జనకతనయామణి వశోకవని ఛజిఁచెఁ, గేసరితనూజ వాలాగ్ర కీలితాగ్ర, వాతవహ సంధ నౌషధలతిక వోలె. చం. రా. 5 [illegible].

**సోఁకుటొజ్జ** వి. శుక్రాచార్యుఁడు.

ఉ. ఎల్లియ సోఁకుటొజ్జ యతఁ డేవఁ జేయును గూఁతుపెండ్లి.. యయా 4. 83

**సోఁకుడు** వి. 1 పిశాచము.

కం. నీవేమొ కొలమొనర్చితి, వీవగవది సోఁకు డగుచు నేచఁ దొడంగెన్. శుక. 1. 235

2 రాక్షసుఁడు.

సీ. ముద్దుగుమ్మకు శిఖిముఖమయ్యెఁ దుమ్మెదయలి కుంతలకు సోఁకుడయ్యె గాడ్పు. రసిక. 4. 39.

సీ. జక్కులరాయిక్కఁ జొక్కు నెక్కటియుద్ది కడిఁదిముక్కోటిక సోఁకుడుల దిగులు. అచ్చ రా. బాల. 8

3. ఆవేశము; గ్రహావేశము.

గీ. క్రాఁగియున్నది మిగుల నగంబు చూడఁ, గలవరించుచు నున్నది కలదొ యేమొ, సోఁకు డల్ల నన్న్యాసికే చూపవలయు, భామ నని పల్కె నా సత్యభామ నగుచు విజ. వి. 3. 65.

4 స్పర్శము, తాఁకుడు, దెబ్బ.

ఉ. దయ్యము వేలు పేరికుచితంబగు సోఁకుడు సోఁకుసేతలో, నొయ్యనఁ దెబ్బఁ జాలు ప్రపడి యుండు ప్రభంజన శక్తి యుండఁగన్. చంద్రా. 5. 102

ఉ. క్రొమ్ముగ్గెడు పాదముల్ మసుల ముంచినఖేదము లెండ సోఁకుడున్, వెగ్గలమైన యార్పులును విన్నని మోతులుగానిపింపఁగన్. విప్ర. 2. 43.

**సోఁకుడుతనము** వి. రాక్షసత్వము.

సీ. గుదియఁ జేకొని తద్దఁ గుంటిపాటు జముండు. గుదిరె రక్కసుఁడు సోఁకుడుతనమున అచ్చ. రా. బాల. 68.

**సోఁకుడుముడుఁగు** వి. ఓషధి విశేషము (వృ. వి.)

**సోఁకుదయ్యము** వి. వాయువు, గాలి.

గీ. అపుడు రాముఁడు సోఁకుదయ్యంబువలనఁ, బొలనుమేవరితెఱఁగెల్లఁ దెలిసి కొండ, నత్తమిలు మేటి దేవరయమ్ము దొడిగి, యేయుటయు నత్తి రూపరిపోయె మింట అచ్చ. రా. యు. 369.

**సోఁకుదొర** వి. రాక్షసరాజు (రావణుఁడు).

గీ. అడ్డుకొని సోఁకుదొరకుఁ బ్రహస్తు డనియె. అచ్చ. రా. యు. 39.

**సోఁకులజేఁడు** వి. నైరృతిమూలజేఁడు.

**సోఁగు** వి. సరము, హారము.

సీ. ఒకచోఁ బువ్వుసు పూగె వృక్షపుఁ గొమ్మ సుడివడ్డ ముత్యాల సోఁగువోలె. కాశీ 1. 138.

గీ. కలుకు పొంబెరు చందురుకావిజిలుగు, పావడ మెఱుంగు చిన్నారిపైఁడి సోఁగు, గిలుకుటందెల బలురవల్ వలనమీఱఁ, దప్పుటడుగుల వృపపుత్రి దనరె నంత. ఇందు. 2. 141.

**సోఁపు** వి. ఒకానొక సంబారపు దినుసు.

**సోఁపుఁబిండి** వి. చణకపిష్టము, సెనగపిండి.

**సోగ** విశే. దీర్ఘమయినది, పొడవయినది,

సీ. వైమానికాంగనా సీమంతములఁ బొల్చు సోగ ముత్యపుఁజేరు చుక్కలనఁగ. దశా 1. 202.

చం. ... చందురు నునుసోఁగ వెన్నెలలతోఁ దులఁతూఁగెడు తద్గుణంబులన్ నై. ష. 1. 48.

చం మలయసమీరణచ్యుత సముంచితపాండు పలాశ లైన పాఁదుల నునుసోగతీఁగలు యదుప్రభునిన్ దలఁపించె ... పారి. ౪ ౫0, రసిక. 3. 57.

వి దైర్ఘ్యము, పొడవు.

సీ కుచకుంభము లివేమి గొప్పవై నవికావు, కౌను సన్నఁదనఁబు గాంచలేదు, నెమ్మేనసోగలు నిలిచి యున్నవిగావు, పలుఁదు లేమియుఁ జెక్కు బిరుసు లేవు గంధ. 1. 134.

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడు వాలుగు సోగల నేలదెంచి. భార. విరా. 2. 83.

గీ పుట్టె వన్జనకినాముపుత్త్రి మెఱుఁగుఁ, దీఁగె కైవడి రతిరాజు తియ్యవింటి, చేగపోలిక వెన్నెల సోఁగపగిది. వరాహ. 2. 110.

2. రేఖ.

ద్వి సొబగొందు క్రొన్నెల సోగబాగునను, మలసి మండెడు పెనుమంటలలోన. ద్వి. హరిశ్చ. పూర్వ. 2876.

సోగచిలుక వి. ఒక జాతి చిలుక.

గీ. గనగనలు వీకవిండ్లు సోగచిలుకలును, సింగ ములు పులిపిల్లలు జింక లేదుగములు మానిసి కోతులు...ప్రబంధ. 1. 115.

సోగలాగలు వి. కిరాతావయవ విశేషము.

సీ మెడతెరువులు నల్లిపొడలు కాలీకలు సోగ లాగలు నిక్కు రాగికాళ్లు....ప్రబంధ. 1. 130.

సోగులు వి. బ. భక్ష్య విశేషము.

వ. ... అతిరసంబులు సుకియ లమృతకలశమ్ములు సోగులుఁ జక్కెర బుడగలు...ఆదిగాఁ గల భక్ష్యం బులు...హంస. 1. 105.

సోచ్ఛ్వాసము నం. విశే. (అ. ఆ. అ.). సంతోష ముతోఁ గూడినది

సోడంబు వి. బ్రహ్మరంధ్రము, మాడపట్టు.

ది. సోడంబు ముక్కును మోదుగాఁ గోసి. బస. పు. 201. పా. 6 వం.

సోడు వి. బ్రహ్మరంధ్రము, మాడబట్టు. (చూ సోడు ముట్టు ).

సోడుముట్టు స. క్రి బ్రహ్మరంధ్రము స్పృశించు; తాఁకు.

కం నీరగు తనువున దివ్యా, మోదము సాంద్ర మయి సోడుముట్టెడు... భార. అను. 2. 452.

సీ. కనకహార్మ్యములతో ....ముల్లోకముల సోడు ముట్టెడి నవపుష్పదామంబు లదిపుష్పదంతపురము. కు. స. 7. 983

చం. దళమగు పచ్చకప్పురపుఁ దావులు పైవయి సోడుముట్ట ...విక్ర. 1. 133.

అ. క్రి. 1. అతిశయించు, తలమునుఁకలగు.

గీ రమణితోడి సతతరతిరాజతంత్ర మోహమున రాజతంత్ర విముఖుఁడయ్యె. నవనిపతికి యోషి రమరాగవారాశి, సోడుముట్ట నోలలాడుచుండు. కేయూర. 1. 70.

2. వ్యాపించు.

సీ. తన కొప్పులోని కమ్మని పూవు తావుల సొబగు దిక్కులనెల్ల సోడుముట్ట. వి. పు. 5. 68.

గీ. అలరుగుత్తులు మకరంద మలక నెఱయ, విచ్చి సోడుముట్టఁగ వనవీథికలను, తరుణ భావంబు నొందించెఁ దరులతల, నభినవంబైన నవవసంతా గమంబు. పి. శకుం. 2. 126.

వ. .... సతత వికసిత కుసుమ సౌరభంబు శతయో జనంబులు సోడుముట్ట సిద్ధాధ్యుషిత జలాశయం బులు గవ్వట్ట ...వరాహ. 10. 132.

సోఢ నం. విశే. (బు, స్త్రీ. బు.) 1. ఓపువాఁడు 2. సహనము కలవాఁడు. 3. సమర్థుఁడు.

సోఢము నం. విశే. (అ. ఆ. అ.) సహింపఁబడినది, ఓర్వఁబడినది.

సోఢవ్యము నం. విశే. (అ. ఆ. అ.) సహింపఁదగినది.

సోణము వి. నాసామూలము.

శా. ... మున్, రాట్కంఠీరవమై యొనర్చె వడి

సోణాలంట ఘోణాచ్ఛిదన్. ఆము. 5. 50.

గీ. ధాతసతిముక్కు సోణంబు దాఁకఁగోసె. కాశీ. 7. 84.

**సోత్కంఠము** (సోత్కము) నం. విశే. (అ. ఆ. అ.) 1. అధికమైన కోరిక కలది. 2. ఆత్రముతోఁ గూడినది. 3. శోకయుక్తమైనది.

**సోత్తరము** నం. విశే. (అ. ఆ. అ.) పందెముతోఁ గూడినది.

**సోత్ప్రాసము** నం వి. అ. పుం. అట్టహాసము. న. 1. ఎత్తిపొడుపుమాట. 2. పరిహాసపుమాట.

విశే. (అ. ఆ. అ.) 1. అధికమైనది. 2. అతిశయోక్తితోఁ గూడినది. 3. పరిహాసముతోఁ గూడినది.

**సోత్సంగము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కలఁత నొందినది. 2. నిరుత్సాహము చెందినది.

**సోత్సవము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఉత్సవముతోఁ గూడినది. 2. సంతోషయుతమైనది.

**సోత్సుకము** నం. విశే. (అ. ఆ. అ.) 1. సోత్కంఠము. 2. ఆత్రముతోఁ గూడినది.

**సోత్సేకము** నం. విశే. (అ. ఆ. అ.) ఉద్ధతమైనది, గర్వముతోఁ గూడినది.

**సోత్సేధము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఉన్నతమైనది. 2. ఉదగ్రతమైనది.

**సోద** వి. 1. సంగతి.

చం. పతిహిత భక్తిచే వెలయు పద్మదళప్రతిమాననేత్రకున్, వ్రతముల సోదలేటికి ధ్రువంబుగఁ బుణ్యము లబ్బు నెప్పుడున్. హంస 1. 128.

2. గచ్చు, గార (శ. ర.).

**సోదన** వి. (సం. శోధనమ్) శకునార్థము రామాయణాది గ్రంథములందు దారమువేసి శోధించుట.

సీ. పతి నన్నుఁ జనవునఁ బాలించునా యని ధైర్యంబు వదలి సోదనలుచూచి. రుక్మా. 3. 223.

**సోదయము** నం. విశే. (అ. ఆ. అ.) లాభాధిక్యము గలది. 2. అభ్యుదయముతోఁ గూడినది.

**సోదరము** నం. విశే (అ. ఆ. (ఈ). అ) ఏకయోని సంజనితము, తోడఁబుట్టినది.

**సోదరి** నం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టినది, భగిని.

**సోదరుఁడు** నం. వి. అ. పుం. తోడఁబుట్టినవాఁడు.

**సోదర్యుఁడు** నం. వి. అ. పుం. సోదరుఁడు.

**సోదించు** స. క్రి. శోధన చేయు.

**సోది** వి. ఎఱుక.

ద్వి. వరదగోపికుల వర్ధనదేవ, బిరుదయాదవ రాజుఁ బేర్కొందమనుచు, నుడుకుచు సోదికి నున్న పాయసము, దొడికి జుట్టుమఁ గంపతొడగు లెక్కచును. అ. మ. క. 2. 83 పా. 27 పం.

**సోదిక(త్తియ)త్తె** వి. సోదె చెప్పునది.

సీ. త్రిశిరఃపురంబునఁ దిరుగు చేడెకు సోదికత్తుగా నున్నది కలదొ లేదొ. పార్వ. 4. 100.

**సోదె** వి. రాఁగల మేలుకీడులను గూర్చి చేయు ప్రశ్నము. (స్మృతి విశేషము.)

ఉ. జోకఁగఁ జేరి వారలకు సోదె నిజంబుగఁ జెప్పకుఁడినన్, నాకడుపెట్లు నిండునని నవ్వుచుఁ బల్కుచు మూల్గి యిట్లనెన్. వేం. మా. 5-18.

చం. అనఘుఁడ నిన్ను సోదె గొనునంతటి దానవె యేను దప్పులే,దుసు దలపోయ నీవలన...ప్రభా. 5. 122.

(ఇట వడుగఁదగిన ప్రశ్నమని యర్థము.)

**సోదెము** వి. ఆశ్చర్యము, చోద్యము.

ఉ. సోదెముఁ జూచువారలకుఁ జూపుచు నుందుము నాఁడు నాఁటికిన్. ప్రబంధ. 1. 156.

గీ. సోదెమా సామి వేఁటాడి నూదరాదె. ఉ. రా. 7. 390.

**సోదెలసాని** వి. ఎఱుకఁ జెప్పునది. ఎఱుకత.

మ. .... ధరాకాంత దా,నిని బంగారపుఁ బీఁటపై నునిచి మన్నింపంగ వీక్షించి యి,ట్లనె నా సోదెలసాని నవ్వుచు మహాహ్లాదంబు దీపింపఁగన్. వేం. మా. 5. 16.

సోద్దెము, సోదెము వి. ఆశ్చర్యము. విశే. ఆశ్చర్య కరము.

సోద్యోగము సం. విశే. (అ. ఆ. అ.) 1. తీవ్ర యత్నము చేయునది 2. పట్టుదల గలది. 3. తీవ్ర మైనది. 4. బలమైనది.

సోద్వేగము సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆత్రముతోఁ గూడినది, 2. దుఃఖితమైనది.

సోంధ్రకము సం వి. అ. పుం. విల్లుచెట్టు, (వృ. వి)

సోన వి. 1. వర్షము; అల్పవర్షము.

కం. ... రాధా, సూనుండును సాయకముల సోనలు గురిసెన్. భార. ద్రో. 4. 190.

సీ. ఫణిలోక విజ్ఞాన పాటవాంతర్మీన వినుత సత్య వితానమునకు సోన. శుక. 1. 376.

కం. గుమగుమ యను నెత్తావులు, ఘుమఘుమరెన్ విరులసోన గురిసెన్ మొరసెన్, ధిమిధిమిదివ్య ద్దుందుభు, లమరమనోహర్ష హేతువగు నివ్వేళన్. విప్ర. 1. 74.

కం. ... కన్గోవల శాపోదకములు, సోనలుగా గురియఁ గుంభజుఁడు దర్శించెన్. కాశీ. 1. 148.

చం. అనిశల నిట్టు లగ్గలములాడిన యట్టులుగాదు నేఁత చొప్పనయము వ్రేఁగొకింత దడవాత్మఁ దిరంబుగనైఁచి నిల్వుమా, సునిశిత మామకాస్త్రముఁ సోన మునింగి పరేతభర్తతో, నొనరఁగ నేఁడ చేసెదవనుత్తమసఖ్య విశేషభద్రముల్. హరి. ఉ. 1. 114.

2. బిందువు. బొట్టు.

సీ. హరినీలములఛాయ నతిగోళమ్ముల సొబగుగాఁ గన్నీటిసోన గురియ. (జాత్యేకవచనము సోనలని యర్థము) హర. 3. 92.

ఉ. లోఁగక వారలవ్వనములో విహరించిరొ కళ్ళా కళ్ళకై, యేఁగుచుఁ గమ్మపూఁబొదరుఁ లీఁగుచుఁ దేనియసోనవానలం, దోఁగుచు ... కళా. 3. 15.

3. ప్రవాహము.

కం. గానము సొబగులసోనై, తేనెలవానై సరస్వతీ కరవీణా,తానవుపుష్కై యమృత వితానము తానై ... రా. వి. 4. 103.

4. ధార.

ఆ. పౌరసతుల సరసభాషామృతంబుల, సోన లిఁటని చెవుల సోఁకెనేని, గొల్లసతులతోడి కూరిమిఁ దల పోసి, యితఁడు చౌకసేయకేల మాను. వి. పు. 7. 374.

సోనంగి జోనంగి. వి. శునకజాతి విశేషము.

సోనవాన వి. ముసురువాన.

సీ. దుర్దమకర్దమస్తోమసంఛన్నభూముల సోనవానలు ముంచుకొనివ. పాండు. 4. 28.

సోనహము వి. వెల్లుల్లి.

సోన్మాదుఁడు సం. విశే. (అ. ఆ. అ.) 1. భూతా వేశమువలన నొడలెఱుఁగనివాఁడు. 2. పిచ్చి వాఁడు.

సోపకరణము సం విశే. (అ. ఆ. అ) 1. కావలసిన సాధనము లన్నిటితోఁ గూడినది. 2. సుసన్నద్ధ మైనది.

సోపకారము సం. విశే. (అ. ఆ. అ.). 1. సోపకర ణము. 2. లాభకరము. 3. సహాయ సంపన్నము.

సోపక్రమము సం. విశే (అ. ఆ అ) ఆరంభింపఁ బడినది.

సోపచయము సం. విశే (అ. ఆ. అ) లాభకరము, అభివృద్ధిగలది.

సోపచారము సం. విశే (అ ఆ. అ) వినయముతోఁ గూడినది.

సోపద్రవము సం. విశే. (అ. ఆ. అ.) హానితోఁ గూడినది.

సోపధము సం విశే (అ. ఆ. అ.) 1. వంచనతోఁ గూడినది. 2. సవ్యాజవృత్తమైనది. 3. ఉపధాక్షర ముతోఁ గూడినది.

సోపధానము సం విశే (అ. ఆ. అ.) 1. సద్గుణ సంశో భితము 2. మెత్తలతోఁ గూడినది. 3. సుసంపన్న మైనది.

సోపధి సం. విణ. (ఇ. ఇ ఇ.) మోసము గలది.

సోపనము వి. (సం. సోపానమ్. మెట్టు, సోపానము.
ఆ. నేతెకుండ మోచి యే తెరఁగున సోప,నాలు
ప్రాఁకు నైపుణంబు గలుగు....భార. శాం. 5. 7.

సోపన్యాసము సం. విణ అ. ఆ. అ.) సోపపత్తికము,
అధారయుక్తము.

సోపప్లవుఁడు సం. విణ. (అ. ఆ. అ.) రాహువుచేతఁ
బట్టకొనఁబడిన చంద్రుఁడు, లేక సూర్యుఁడు. 2.
ఆపన్నుఁడు. 3. శత్రువులచే మార్కొనఁబడిన
వాఁడు.

సోపరోధము సం విణ. (అ. ఆ. అ) 1. ఆతంక
ముతోఁ గూడినది. 2. అడ్డగింపబడినది. 3. అభిమా
నింపఁబడినది.

సోపసర్గము సం. విణ. (అ. ఆ. అ) 1. ఉపద్రవ
ముతోఁ గూడినది. 2. ఉపసర్గతోఁ గూడినది.
3. పిశాచముచే నావేశింపఁబడినది. 4. ఉత్పాత
సూచకము.

సోపస్నేహత సం. వి. ఆ. స్త్రీ తేమ.

సోపాకుఁడు సం. వి. అ. పుం. నీచజాతివాఁడు.

సోపాదానము సం విణ (అ. ఆ. అ.) సర్వవస్తువు
లతో సమకూర్పఁబడినది.

సోపాధి = సోపాధికము సం. విణ (ఇ. ఇ. ఇ.) 1.
అన్యగుణము కలది. 2. హద్దు గలది. 3. కొన్ని
నియమములచేఁ బరిమితమైనది. 4. ప్రత్యేకమైనది.

సోపానత్కము సం. విణ. (అ ఆ. అ.) సోపాన
హము, చెప్పులతోఁ గూడినది.

సోపానము సం వి. అ. న. మెట్టు; నిచ్చెన.

ద్వి. భూపాలకవములఁ బొందొంద దివికి, సోపాన
ములు చేసి సొరిదియై చనిరి. రం రా. బాల.
78 పు. 17 పం.

సోబ వి. (సం. శోభా.) 1. కాంతి.

ఉ. జేవురసోబ కన్గొవలఁ జిప్పిల నూర్పుల వెంట
నుజ్జ్వల, త్పావకకీల లోలిఁ గనుపట్టఁగ... వెం.
పంచ. 1. 648.

2. వ్యాధివిశేషము, వాఁపురోగము (సం. శోఫః).

సోబనము వి (సం. శోభనమ్) 1. మంగళము

కం. వివరింపనెడము లేదిఁక, మవివకు సోబనవు
జలక మొనరింపంగా, జవరాంద్రఁ బనుపు మనవుకు
.... యయా. 4. 85.

2. ముగ్గు.

సీ. తమ్మిఁ మానికవు సంతనపట్టియలచేతఁ జొక్కపు
ముత్తెపు సోబనములు. ప్రబంధ, 1. 466.

సోబనలు వి. బ. మంగళగానములు.

వ. ... సోబనలుపాడు ముత్తైదువల చెలువున
మ్రోయు తేఁటి నీటుకత్తియల తేటపాటలకుం
జొక్కెనో యన.. కువల. 3. 141.

సోబాన వి. (సం. శోభనమ్) శోభనపుపాట; ఒక
దినుసు పెండ్లిపాట.

సీ. ఉడుటుచొకాటంపు టొయ్యారిచేష్టలు సోభాన
పాటలు సొగసుగుల్క, హంస. 5. 27.

సీ. తేఁటిపూఁబోడులపాట ముత్తైదువల్ పచరించు
సోబనపాట గాఁగ. ఘటికా. 1. 66.

మత్తకోకిల. గానవైఖరినందుఁ గొందఱు కాంతల
య్యెడఁ జేరి సో,బానయంచొక పాటఁ బాడఁగ
బాడినంతనె వింతయై, కానుపింపఁగఁ బూన్పశోభన
గాథలెల్లను మీఱఁగా, మానినుల్ గనగూడిపాడిరి
మత్తకోకిలరీతులన్. ప్రబంధ. 1. 490. ద్వి.
పరమ 5. 430.

సోబ(బియ) వి. లీల, విలాసము.

కం. ఈబాళిమందు మసగొని, యాబిడ తన కండ్లు
గట్టినట్లుండ నతం,డే బుద్ధిలేక యచ్చెలి, సోబెలకెదఁ
జిక్కిజిక్కి చొక్కుచుఁ దిరుగున్. హంస. 5. 153.

సోమ వి 1. శ్రమ.

ద్వి. జననాథ నీతోడఁ జనుదెంచు నితఁడు, సోమ
కోర్వఁగ లేడు సుకుమారమూర్తి. నామాటుగాఁ
జూచి నయమునఁ బ్రోచి. ద్వి. హరిశ్చ పూ. 1618.

2. పరాక్రమము.

ద్వి. ఉరు మదేభంబులు నుత్తమాశ్వములు, నరిది రథంబులు నలరు కాల్బలము, సోమమైనవనంబు చుట్టుముగాచి. రం రా. యుద్ధ?

3. సొమ్ము.

ఆ. కౌముబలిసెఁ జన్నుఁగవ దోరమై తోఁచె, మోము వెలుకపాఱె సోమలోదవెఁ, గడుపు వళులు విరిసె నడుము భారంబయ్యె, గర్భ చిహ్న తెలమిఁ గానఁబడియె. పద్మ. 7. 44.

సోమ నం. వి అ స్త్రీ. సోమలత

సోమకర్కటి నం. వి. ఈ. స్త్రీ. (వృ. వి.) 1. కరవుచ్చ, 2. కరబూజా, 3. ఒకానొకదోస.

సోమకాంతము నం. వి. అ పుం. చంద్రకాంత శిల. విశ (అ. ఆ అ.). చంద్రునివలె నందమైనది.

సోమక్షయము నం. వి. అ. పుం అమావాస్య; చంద్రుని క్షీణభావము.

సోమగర్భుఁడు నం. వి అ. పుం. విష్ణువు.

సోమగ్రహము నం. వి. అ. పుం. సోమరసము ముంచెడి పాత్రము.

సోమజము నం. విశ. (అ. ఆ. అ.) చంద్రుని వలనఁ బుట్టినది వి. న. పాలు.

సోమజుఁడు నం. వి అ. పుం. బుధుఁడు.

సోమధార నం. వి. అ. స్త్రీ 1. ఆకాశగంగ 2. నది. 3. ఆకాశము 4. పాలవెల్లి.

సోమపతి నం. వి. ఇ పుం. ఇంద్రుఁడు.

సోమపానము నం. వి. అ. న యజ్ఞమందు సోమలత నుండి పిండి రసమును ద్రాగుట.

సోమపీతి నం. వి. న్. పుం. యజ్ఞముచేసి సోమపానము చేసినవాఁడు, సోమయాజి. ఇ. స్త్రీ. 1. సోమపానము. 2. సోమయాగము.

సోమపీథి = సోమయాజి.

సోమపుఁడు నం. వి. అ. పుం. 1. సోమయాజి. (బహువచనాంతమైనపుడు పితృదేవతలు).

సోమప్రవాకుఁడు నం. వి. అ. పుం. సోమయాగమునకై శ్రోత్రియులను నియమించువాఁడు.

సోమబంధువు నం వి. ఉ. పుం. 1. సూర్యుఁడు. 2. తెల్లకలువ.

సోమము నం వి అ. పుం. 1. సోమవల్లి, తీఁగ. 2. సోమరసము. 3. జలము. 4. కర్పూరము. 5. దినమువందుఁ బదునొకండవ భాగము 6. కాంతి కిరణము. 7. వాయువు. 8. వానరము. 9. సోమవారము. 10. ఉత్తర పదమైనపుడు శ్రేష్ఠ వాచకము.

సోమము వి. పరాక్రమము.

కం. అమిషమని డానింగొనఁ, గామది సమకట్టి యొక్క ఖగ మాఖగమున్, సోమమునఁ డాఁక దివి నంగ్రామంబా రెంటికయ్యె కడు రభసమునన్. భార. ఆది. 3 ఆ. (శ. ర.).

సోమయజ్ఞములు నం. వి. అ పుం బ. అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, అతిరాత్రము, అప్తోర్యామము, వాజపేయము అనునవి.

సోమయాజి నం వి. న్. పుం. యజ్ఞము చేసినవాఁడు

సోమయోని నం వి. ఇ. పుం సువాసనలతోఁ గూడిన పసుపు పచ్చని చందనము.

సోమరాజక నం. వి. అ స్త్రీ. సోమరాజి.

సోమరాజము నం. వి. అ. పుం. కారుగచ్చ (వృ.వి.).

సోమరాజి నం. వి. ఈ స్త్రీ 1. కారుగచ్చ (వృ.వి.). 2 చంద్రవంక

సోమరి వి. (√ సోము) 1. పనిచేయక కాలము గడపువాఁడు.

కం. అమానవపతి చిత్తా, రామము లో నుండ మఱఁగి రాజత భూభృత్సీమకయిపోఁ దలంపక, సోమకళాధరుఁడు మిగుల సోమరియయ్యెన్. రాజ. వి. 1 76.

2. అలసుఁడు, చుఱుకు లేనివాఁడు.

వ. .... గుండియలవిసి యవనిపై ప్రాలి శవనిచయంబుల కరణి నిశ్చేష్టితులై వడియేమఱించి చమసోమరి దొరపోతులును .... రా. వి. 5. 82.

విశ. 1. మందము, అలసము.

ద్వి. వీచె సోమరి గాలి విరహులు చెదర. ద్వి. హరిశ్చ. పూ. 484.

సీ. పలుమాఱు సోఁమరి చలిగాలి సోఁకునఁ గదలెడు నీలాలకములు చూచి. వరాహ. 6. 62.

**సోమరితనము** వి. అలసత్వము,

గీ... సోమరితనానఁ బవళించెఁ జూడరమ్మ, రంగఁ డని గొల్లు రాదిత్యరాజముఖులు. శ్రీరం. మా. 2. 48

**సోమరిపోతు** వి (√. సోమరి.) అలసుఁడు. సోమరి.

చం. పనినడి నారికేళఫల పాకమునం జవిరైన భట్ట హార్షుని కవితాను గుంఫములు సోమరిపోతులు గొంందఱయ్యెలొ,నని కొనియాడ నేరరు .... నైష. 1. 17.

**సోమరోగము** సం. వి. అ. పుం. స్త్రీలకుఁ గలుగు నొక వ్యాధి.

**సోమలత** సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగ, 2. పుల్ల తీఁగ. 3. సోమవల్లరి. 4. గోదావరినది.

**సోమలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కోమలమైనది. 2. మెత్తనిది.

**సోమవల్క(ల)ము** సం. వి. అ. పుం. 1. వెలిచంద్ర. 2. ఉేకుచెట్టు (వృ. వి.).

**సోమవల్లరి** సం. వి. ఈ స్త్రీ. పొన్నగంటికూర (వృ వి.)

**సోమవల్లి(క)** సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

**సోమవారము** సం. వి. అ పుం. వారములలో నొకటి, ఇందువారము.

**సోమవీథి** సం. వి. ఈ స్త్రీ. చంద్రమండలము.

**సోమవృక్షము** సం వి. అ. పుం. వెలిచంద్ర (వృ.వి.)

**సోమశకల** సం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన దోస.

**సోమసంజ్ఞము** సం. వి. అ. న. కర్పూరము.

**సోమసంస్థ** సం. వి. ఆ స్త్రీ. ఒక విధమైన సోమ యజ్ఞము.

**సోమసదులు** సం వి. అ. పుం. ఒక జాతి పితృదేవతలు.

**సోమసింధువు** సం. వి. ఉ. పుం. విష్ణువు.

**సోమసిద్ధాంతము** సం. వి. అ. పుం. కాపాలిక సిద్ధాంతము.

**సోమసుత** సం. వి ఆ. స్త్రీ నర్మదానది

**సోమసుత్తు** సం వి. త్. పుం సోమసుతుఁడు, సోమ రసమును వడియఁగట్టువాఁడు

**సోమసూత్రము** సం. వి. అ. న. 1. పానవట్టము నుండి నీళ్ళుపోవుట కేర్పఱుపఁబడిన సన్నని దారి. 2. సోమసూత్రమువంటి ముఖభాగము కలిగిన లోహ పాత్రము.

**సోమ సూర్యవీథులు** సం. వి. ఈ. స్త్రీ. బ. వేఱుపడి విడివడిన వీథులు.

కం. విడువకపట్టిన మునుమున్, గడకేఁజెఁచి బలము రెండుగా నొనరించెన్, వడి నారెంటికి నడుమన, వెడలెన్ మఱి సోమసూర్య వీథులుగాఁగన్. కాశ. 2. 42.

(ఇది తెలుఁగుననే జాతీయముగా వాడఁబడెను)

**సోమాఖ్యము** సం. వి. అ. న. ఎఱ్ఱతామర.

**సోమాభిషవము** సం. వి. అ. పుం. సోమరసమును పిండుట.

**సోమాయనము** సం. వి. అ న ఒక విధమైన తపస్సు. చాంద్రాయణము.

**సోమాలకము** సం. వి. అ. పుం గోమేధికము.

**సోమాలము** సం. విణ. (అ. ఆ. అ ) సుకుమారము.

**సోమాసి** వి. (సం. సోమయాజీ) సోమయాగము చేసినవాఁడు.

**సోమాస్త్రము** సం. వి. అ. న. ఒకానొక యస్త్రము.

**సోమి** సం. విణ. (న్. నీ. న్.) సోమయాగము చేయువాఁడు.

**సోమించు** అ. క్రి. 1. పరాక్రమించు, విజృంభించు.

శా. శుంభద్విక్రమ కేళిలీల లెసఁగన్ సోమించి యేకాఢ్డ ము,జ్జృంభోత్సాహము లుల్లసిల్లఁగ జయశ్రీలోలతంబోర .... మార్క. 2. 320.

కం. తామసుఁ డితండు విష్ణు మ,హామహిమల కొలఁది యెఱుఁగఁ డద్దేవు దెసన్, వేమాఱు

వలుగ నడంచియు, సోమించినవుడిని బ్రదుకు సుఖం బగునే. నృసిం. 5. 13.

ద్వి. .. బద్ధశాసనుండు, సోమించి నిజమంత్రి సుతు లైన వస్త్రరోముని శలజిహ్వు దుధిఁ లోచనుని .. బిలిచి. రం. రా. సుం. కాం. 282 పా. 20 పం.

2. తృప్తినొందు.

గీ. ఇట్లు బంధించి కారాగృహంబు నందుఁ, గూఁతుతోఁగూడ యాదవకులజు మనిచి, రాతను లను బెట్టించె(?) ను రాకుమారు, మీదఁ గావలి యుంచి సోమించియుండె. వి. పు. 8. 168.

3. వ్యాపించు.

కం. నేమమున నఖిలచిదచిత్, స్తోమంబున నాత్మ వగుచు సోమించుటచే, నేమయి పరులయి సర్వ ము,నై మెఱసెద వీవొకండ వంబుజనాభా. కవిక. 6.

4. (సం. సమమ్) సరిపోలు.

కం. తామరరేకులుఁ గన్నులు, సామజహస్తములుఁ దొడలు శశిమండలమున్, మోమును మెఱపును నొడలును, సోమింపఁగ దివ్యరూప సుందరుఁ డయ్యెన్. ఉ. హరి. 2. 152.

స. క్రి. సగముగాఁ బంచుకొను.

కం. విను నీ వదితిసుతుండవు, వినతకొడుక నేను పిత్రువీఁగెడు మనకున్, జనకుండు కశ్యపుఁ డొక్కంట, దనుజుల సోమించి చంపుదము యిరుపుర మున్. భార. ఉద్యో. 3. 255.

**సోమింత** వి. వృక్షవిశేషము (వృ వి.). (సోమిదము అని. శ. ర.)

('సోమికట్టె' అని విజయనగరము, వలూరు. నెల్లూరు ప్రాంతముల వాడుక. వడ్రంగి కుపయోగించు చెట్టు.)

**సోమింద** వి. సోమవల్లరి, సోమెద.

గీ. .... శాన్గుసన్న, విరిగి సోమిందగున్నంగి దిరిసె నంబు, మొదలుగాఁ గల్గు బహువిధ భూరుహములు, నిండియుండెడు కానలఁబిండులంసి. హంస. 4. 11.

**సోమిద** వి. తిప్పతీఁగ. (వృ. వి.),

**సోమిదము** వి. శణపర్ణి. (వృ వి.).

**సోమిదమ్మ** వి. సోమయాజి భార్య.

కం. పూచిన తంగెడుగతి వి,ద్యాచతురుం డతని సోమిదమ్మ పొరువునన్, వాచాలరత్న కంకణ, సూచిత విభవమున మెఱయఁ జూడంగలనే. రాజ. వి. 3. 22.

సీ. తానిచ్చె నెద్దాని ధర్మగేహినియైన సోమి దమ్మకు మనః ప్రేమమలర. కాశీ. 1. 99.

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడునై కమ నీయ కౌతుక, శ్రీవిధిఁ గూకటుల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ ... మనుచ. 1. 53.

**సోమిసాని** వి. (సోమిద+సాని) సోమయాజి భార్య (శ. ర).

**సోము** వి. (సం. సుఖమ్.) సుఖము విశే. ఆసక్తము.

ఉ. చూపులు విష్ణుమూర్తులకు సోముగ జిహ్వలు విష్ణుమూర్తి నామాలాప సుఖంబుఁ జెందఁగఁ దలం పులు విష్ణుమాహాత్మ్య చింతకుం, బైకడుచుండ నిట్టు లగు భాగవతోత్తమ కోటిచే జగ,ద్దీపితమైన యవ్వి మల తీర్థము నందతఁ డుండె వేడుకన్. (శ. ర పా. సొమ్ముగ. కం. వీ పా.) భోజరా 2. .6

అ. క్రి. 1. సుఖపడు. 2. ఆసక్తమగు.

చం. పటికపుఱోల ముప్వేదురుఁ బ్రాలొగిఁ బోయుచు గౌరుకొమ్మరోఁ, కటఁగొని దంచుచున్ శబరకామిని లెక్కలు రాగముల్ మదో,త్కట ముగఁ బాడెఁ జుట్టిన మృగంబులు సోమ .... కు. సం. 6. 704.

**సోముఁడు** సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2. శివుఁడు 3. వాయువు. 4. పితృదేవతలలో నొకఁడు. 5. బుధుఁడు 6. అష్టవసువులలో నొకఁడు. 7. కుబేరుఁడు 8. యముఁడు 9. సుగ్రీవుఁడు.

**సోమెద** వి. ఒక దినుసుకూరాకు, సోమవల్లరి. (వృ. వి.).

సోమేశ్వరుఁడు సం. వి. అ. పుం. ఒకానొక శాస్త్ర ప్రవర్తకుఁడు.

సోమోద్భవ సం. వి. ఆ. స్త్రీ. నర్మదానది.

సౌమ్యము సం. విశ. (అ. ఆ. అ.). 1. సోమాకారము గలది. 2. సోమమునకుఁ దగినది. 3. మృదువైనది. 4. మేలైనది. 5. సోమరసము నొసంగునది.

సోయగము వి. 1. సౌందర్యము, చక్కఁదనము.

గీ. చూడఁజూడంగ మరుఁడయ్యెఁ సోయగమునఁ, దలఁపఁదలఁపంగ రాజయ్యెఁ గళితకళల, నిందు కేమి వచ్చెఁతువే యిందువదన. విల్హ. 2. 127.

వ. ... శిఖరంబుల సోయగంబులు గల యంగనం గొనుట .... మనుచ. 1. 72.

గీ అట్లు తేజవ్వనమ్ము సోయగము గల్గి నీలా. 1. 59.

సీ ఉడిము త్తెముల సోయగము మించిన వ్రాలు వరుసతో నిరుగేల వ్రాయనేర్చె. విక్ర. 1. 50.

2. విలాసము.

సీ. సోయగంబున వీణవాయింప మాయంపు జటిలుఁ డచ్చటికి నేమిటికివచ్చె. వసు. 3. 116.

3. విధము, రీతి.

వ. ... ఆయుధంబులఁ గార్ముకంబు సోయగంబున యజ్ఞంబుల జపయజ్ఞంబు చాడ్పున ... భాగ. 12. స్కం. 48.

వ... కౌశికారాధనీయ చిత్రభాను నిరోధకంబైన ధారాధర నికాయంబు సోయగంబున ... చం. రా. 1. 83.

వ ... కుంజరంబుల పోల్కిని వృషభంబుల విధమున శంఖంబుల సోయగంబున భాసిల్లు మేఘంబు వర్షించు ... రెట్టమత 2. 42.

సోయింబరకడ్డి వి. కంసాలి పనిముట్టు. (నెల్లూరు రాయల సీమల వాడుక)

సోరంగి వి. మత్స్యవిశేషము.

సోర(ర్ణ)ణగండి వి. గవాక్షము, జాలకట్టు. (దీని వ్యస్తరూపము బహువచనాంతముగనే కన్పట్టుచున్నది.)

వ. .... సోరణగండి గొప్పసుప్పాణి ముత్తెంపుజాల తండంబులు ... ఉ. రా. 1. 158.

సీ. సీడాడు నీలాలగోడలతో మౌక్తికంబుల సోరణగండ్లకోడ. వరాహ. 4. 111.

ద్వి. సోరణ గండ్లలోఁ జూడఁగవచ్చు, నారయ వేగరండని నాతి పిలువ. రం. రా. బాల. 64 పొ. 8 పం.

ఉ. సోరణగండ్లనన్ నిలిచి చూచుచునుండుము మమ్ము జాయగ, ప్రేరిత ముష్టి నిర్దళ దుదీర్ణ విరోధి శరీరముల్ ... హరి. ఉ. 3. 198.

ఆ వెలరు వాలుదీవియల వల్ల నల్లార్చు, సోర్ణగండ్ల యందుఁ జొచ్చి సుడిసి, తిరిగి వేఁగుబోక తెమ్మెర లెలదీఁగ, కొనలవంక లొత్తు నవలఁ ద్రోచు. భార. ఉద్యో. 2. 112.

సీ సోర్ణగండులఁ జొచ్చి సురతఖేదము నందుఁ జెలువలఁ జెలువుర నేదదేర్చి, ... మంద సంచారముగ సుకుమారవగుచు, మెఱసెఁ బ్రత్యూష సమయ సమీరణంబు. వృసిం. 3. 111.

చం. మినుకుఁ గడాని బంగరువు మేడల సోరణగండ్ల వెంట. ... నీలా. 1. 29.

సోరణము వి. గవాక్షము, కిటికీ.

సీ. పెద్ద తామర కెంపు బిగివట్టియలచేత సొబగైన ముత్యాల సోరణముల. యయా. 1. 25.

సోరు వి. సోరువ్వు, పెట్లుప్పు.

సోర్ణభ్రువు సం. విశ. (ఊ. ఊ. ఉ). కనుబొమల నడుమ రోమవలయము కలది.

సోల వి. నికుంచకము, తవ్వలో సగము.

ఉ. యాదవులుప్పు మోవఁగ మురారికి సోలలు మోవకింకఁ బోరాదు ... ఉ. హరి. 4. 160.

సీ. సోలనీటను నీకఁ జూచుచుఁ బట్టె వర్ధనము నిండఁగ నక్షతలను మెత్తి. శుక. 2. 486.

సోలగించు అ. క్రి. (√ సోలము) పరవశమగు.

ఉ. లాలిమనోహరాంగి ... లాలియటంచు సువర్ణ ఢోలికాందోళన ఖేలనంబులను నున్నని నిద్దుర సోల

గీ వనా,జాలికఁ బాడుచుండుసురు పాటలగండులు జోలపాటలన్. విప్ర. 3. 88.

సోలము విశ మందము.

సీ. తరుణి సోలంపు టూర్పుతావి యొంగిలి ప్రమింగి తేంట్లు నీలె కలై తిరుగుచుంగాక. కవిక. 3. 164.

వి. వివశత్వము, పారవశ్యము.

సీ. చూపుల నిగురొత్తు సోలంబుతోడన సోలంబు తనువున మేళవింప విక్ర. 1. 166.

గీ ఒండొరుల చిత్తముల నాఁటి యొలయుచున్న చొక్కుఁ-లెక్కుడు నేయంగ సోల మడరి, యిగువు రును సౌఖ్యరసములఁ గరువు గట్టి, పోసి చేసిన రూపుల పోల్కుఁ-లైరి నిర్వ 8. 80.

ఉ. .... మృదు ప్రచార ము,త్సన్నపు సోలముం దెలుప భామకు లోఁదమకం బొకింతయున్, సన్న ముగాక విశ్వవరనాథునిపై దగులంబ చూపెడున్. కావ్యా. 2. 37.

2. మదము, మత్తు.

సీ, అలరుఁ దేనియఁ గ్రోలి యన్ను పోలంబుల మరియు తేఁటుల నును ప్రమోఁతయింపు. భార. అను. 1. 181.

మ. కరతాలు స్తన ... సింధుర మొప్పుచుండె నలి గీతుల్ వించు సోలంబునన్. కు. సం. 1. 90.

మ. తెలివిం గైకొని యొత్తు సాంగముగ వర్తిం చున్ గళాసించు ను,గ్మలి యొర్తొక్క-తె ప్రాలు సోలములతోఁ గాదంబరీగోష్ఠిచేన్. కావ్యా. 3 120.

3 మాంద్యము, అలసత.

సీ. చూపుల నిగురొత్తు సోలంబు తోడన సోలంబు తనువున మేళవింప. విక్ర. 1. 166.

సోలము సం. వి. అ. పుం. చల్లఁదనము.

సోలవెల్తి వి నైచ్యము, తక్కువ.

ద్వి. ఏల యీ బహురూపు లేమేని నిన్ను, సోల వెల్తిగ నేను జూచితినయ్య, బస. పు. 97. పా. 14 పం.

సోలి వి. వినోదము.

ద్వి. కేలుకేలువ బిగ్గఁగిలించిపట్టి, సోలికి నిలుచుండి సోలియాడుచును అ. మ. క. 2. 63. పా. 16. పం.

సోలిగోఁచి వి. సన్న్యాసులు దండమునకుఁ గట్టు వచ్చునిగోఁచివంటిగుడ్డ.

ద్వి. సోలిగోఁచుల వొప్పు చూపు దండములు. ద్వి. పరమ. 4. 308. పా.

సోలించు స క్రి. (√ సోలు) సోలఁజేయు.

వ. ... కురువిందమ్ముల యందమ్ములను మోదిం చుచు నరవిందబృందంబులను సోలించుచు మొల్లలకు నరుగుచు మల్లెలకుం దిరుగుచు విరవాదులం జిదు ముచు. రా. వి. 3. 114.

సోలింత వి. వివశత్వము నొంది వ్రాలుట.

మ. సొరపయ్యెం దనువల్లి బాణుసుతకున్ సోలిం తలం దూలుటన్. ఉ. హరి. 5. 100.

సోలు అ. క్రి. 1. వివశత్వము నొందు, పరవశమగు.

సీ. సోలెదు నెలదిఁగలీలఁ గ్రాలుచు వింతచెలు వంబు దలకొనఁజేరి నిలిచి. భార. విరా. 2. 64.

సీ. అరవిరివిరవాది విరుదు పెండెములతో సోలు కోయిలమూనటీలతోడ. విక్ర. 8. 5?.

...నిచ్చలును సోలుకొనుచుఁ గ్రాలు జగములేలు వేలుపా. నీలా. 1. 119.

ఉ. ... కడువృద్ధులాకటన్, సోలుచుఁ జింతతో నెదురుచూచుచునుందురు ... మనుచ. 2. 53.

2. వ్రాలు, ఒరగు

కం. అనిఁ దెగువీరులు దివికిం, జనుచుందనుఁ జించి కొనుచుఁ జనఁజన సంధ్యా, ఘనదీప్తిరుధిర మొలు కఁగ, నునువరియినుఁడస్తశిఖరి నల్లన సోలెన్. కవిక. 2. 200.

కం. అర్చినగని రాకొమరుడు, పేర్చివరోసమున నైదు పెనుదూపు లరిం, గూర్చి తొలివేల్పు బోరయ, మేర్చి నిగుడ్చుటయు నాతఁడేవరి సోలెన్. అచ్చ రా. యు. 352.

3. ప్రసరించు, వ్యాపించు.

లయగ్రాహి .... అరాళచికురంబుల్, ఫాలముర ప్రాల నిడువాలుమగమీలగమిడీలువడఁ దోలెడు పిసాళికను గ్రేవల్,సోల శరదంబుర మృణాళహిమ వాలుకల నేలెడు రుచిన్ వలిపచేలలు కుచాలం, దూలఁ జని ...వరాహ 3. 96.

కం. కని సతులకుఁ జూపెడుతటి, ఘనముగఁ దమ చెవుల వాలుఁగన్నులు సోలన్. మనుచ. 6. 78.

4. వ్రేలాడు.

సీ. వలఁకెడు కాలాకు లలితాస్థిచయముగా సోలు కొమ్మలు వలుకేలుగాఁగ ... శంభుమూర్తిఁ దాల్చి సహకార భూరుహచక్రవర్తి ... అతిశ యిల్లుచుండె. కు. సం. 4. 457.

5. నశించు, చెడు.

గీ. కళవసంబాడ జలకముండలుపు వీడ,జకలు మహి జీరఁజే జవసరము జాఱ,దర్భముడి వ్రేల ధ్యాన తత్త్వంబు సోలఁ,గడఁగి నిలుచుండి యాగ్రహా గ్రహముఁ జెంది. కువల. 2. 35.

**సోలుఁదనము** వి. (సోలు+తనము) మూర్ఛ, పార వశ్యము.

సీ విశ్వంభరుని మనోపీథి నిల్పిన వృత్తిఁ దాల్చు టవన సోలుఁదనము మిఁచె. విప్ర 1 2.

**సోలుదారు** అన్య వి. సోల్జరు, యుద్ధభటుఁడు

మ. సమరోజ్జృంభిత శౌర్యధుర్యులగు సార్జంతుల్ మయూరుల్ కుముఁదముఖన్ ... సోలుదారులు సుబేదారుల్ మొదల్గల్గు సైన్యములు ... రంగా. 1. 147.

**సోలువట్టు** అ క్రి. (సోలు+పట్టు) వివశత్వము నొంద వ్రాలు.

గీ. మధుమదోన్మత్తలై యల్కమఱచి సఖులు, సూరెలకుఁ దాఁటఁ బతులపై సోలువట్టు, చేశియల మన్మథుఁడు వెట్టిచెఱకు వింట, నేసె సుమ్మెత్త విరులచే నేసరేఁగి. కవిక. 4. 166.

**సోల్లుంఠనము** సం. వి. అ. న. ఎత్తిపొడుపు, దెప్పుడుమాట

**సోళాదొప్పి** వి ద్యూతవిశేషము (సోళాందొప్పి అని ర.).

శా. సోళాదొప్పియు నెత్తమున్ మొదలుగా జూదంబు నీవాడు నా,వేళం గాదని జాంధవుల్ శకుని దుర్వృత్తం బెఱింగింపరే. జై. భా 5. 42.

**సోవస్తియము** సం. వి. అ. న. శుభము.

**సోవాలము** సం. విణ (అ ఆ అ.) 1. నల్లనిది. 2 పొగచూరినది.

**సోహము** వి రక్షణ కీవలసిన సొమ్ము?

మ ... మా,వెరువెంటన్ జనుదెంచు నమ్మఁడు నిశావేళన్ బ్రయాణంబు రం,డన భక్తిన్ శరణార్థిఁ జేసి తమసోహం బెల్లఁ జెల్లించుచున్. కాళ. 4. 58.

**సోష్ణిషము** సం. వి అ. న. ముందువరండాగల యిల్లు.

**సోష్ణము** సం. విణ (అ. ఆ అ. న్. న్. న్.) వేడిగలది

**సోష్మము** వి. ఒత్తక్షరము.

## సౌ

**సౌండి** సం. వి. ఈ. స్త్రీ. మిరియము

**సౌందర్యము** సం. వి అ న. చక్కఁదనము.

గీ చిత్రసౌందర్యధుర్యులై చిగురుఁ బోఁడు, లప్పురిఁ దనర్తు రెక్కుడు నొప్పినములు ... విక్ర. 1. 78.

**సౌందర్యవంతము** సం. విణ. (త్. తీ. త్.) చక్కఁ దనము కలది.

**సౌందర్యోత్పాదనము** సం. వి. అ. న. భేరత్రయ ములో నొకటి (స్నేహారాగాపవయము, సౌంద ర్యోత్పాదనము, సంతర్జనము)

**సౌకరము** సం. విణ. (అ. ఈ. అ.) సూకరములకు సంబంధించినది.

**సౌకరికుఁడు** సం. వి. అ. పుం. 1. సూకరములను వే టాడువాఁడు.

2. పందులవ్యాపారము చేయువాఁడు.

సౌకర్తవ్యము సం. విశ. (అ. ఆ. అ.) సుకరము, మిక్కిలి సులభము

సౌకర్యము సం. వి. అ. న. 1. అనాయాసము. 2. సూకరభావము 3. వసతి. 4. అనుకూల్యము. 5. నేర్పు. 6. ఆహారమునుగాని యౌషధమునుగాని యశ్రమముగా సిద్ధము చేయుట.

సౌకుమార్యము సం వి. అ. న. 1. మృదుత్వము. 2. కావ్యగుణములలో నొకటి. 3. యౌవనము.

సౌక్ష్మకము సం వి. అ. పుం. చిన్నకీటకము.

సౌక్ష్మ్యము సం. వి. అ. న. 1. సూక్ష్మత్వము. 2. నైశిత్యము 3. కావ్యగుణములలో నొకటి.

సౌఖయానికుఁడు సం వి. అ. పుం. సుఖకరమైన యానము కలుగవలెనని కోరువాఁడు.

సౌఖరాత్రికుఁడు సం వి. అ. పుం. రాత్రి సుఖముగాఁ గడచినదా? యని యడుగువాఁడు.

సౌఖ(ఖ్య)శాయని(శాయి)కుఁడు సం. వి. అ. పుం. 1. మహారాజులను నిద్రమేలుకొలుపువాఁడు. 2 సుఖనిద్ర కలిగినదాయని ప్రశ్నించువాఁడు.

వ. ... సౌఖశాయనిక సౌవస్తిక బుధనామ సచివ సుకవి గాయక వైణిక మార్దంగిక నికరంబు ... నైష. 2, 3.

సీ సౌఖశాయనికులై సంవర్తభృగ్వాది మునులు హస్తాంభోజములు మొగుడ్చ. కాశీ.

సౌఖ(ప్ర)సుప్తికుఁడు సం. వి. అ. పుం. సౌఖశాయనికుఁడు.

సౌఖికుఁడు సం. విశ. (అ. ఈ. అ ) 1. సుఖమునకు సంబంధించినవాఁడు. 2. ఆనందకరుఁడు 3. సుఖమును గోరువాఁడు.

సౌఖీయము సం. విశ. (అ. ఈ. అ.) సౌఖికము.

సౌఖ్యము సం. వి. అ. న. 1. సుఖము. 2. తృప్తి. 3. ఆనందము. 4. భోగానుభవము.

వ. ... ఇప్పటి దేవర పాదపద్మసేవ పరిపూర్ణ సౌఖ్యంబు నొసంగుచున్నది...కళా. 3 201.

సౌగంధికము సం. విశ. (అ. ఈ. అ.) సువాసన గలది. వి. అ. పుం. 1. మలకోశమునుండు పురుగు. 2. గంధకము.

అ. న. 1. ఎఱుపును దెలుపును గలిగి మిక్కిలి పరిమళముగల కమలము. 2. కామంచిగడ్డి. 3. పద్మరాగము.

సౌగంధికుఁడు సం. వి. అ. పుం. 1. సుగంధ ద్రవ్యముల వ్యాపారము చేయువాఁడు. 2. లైంగిక దౌర్బల్యము గలవాఁడు.

సౌగంధ్యము సం. వి. అ. న. 1. సువాసన. 2. మధురపరిమళము.

సౌగమ్యము సం. వి. అ న. 1. సౌలభ్యము. 2. సౌకర్యము.

సౌచి సం. వి. ఇ. పుం. కుట్టుపని చేయువాఁడు.

సౌచికము సం. వి అ. పుం. 1. అతుకు. 2. కూర్పిక.

సౌచికుఁడు సం. వి. అ. పుం. 1. కుట్టుపనిచేయువాఁడు. 2. కైవర్తకన్యయందు శౌండికునకుఁ బుట్టినవాఁడు.

సౌజన్యము సం. వి. అ. న. 1. సుజనత్వము, మంచితనము. 2. దయ 3. ప్రేమ 4 ఔదార్యము.

కం. అమ్మహితాత్ముని తనయుఁడు, సమ్మానదయానిధాన సౌజన్యరమా, సమ్మోదిత బాంధవుఁడై ... విక్ర. 1. 34.

సౌజ(స)ము సం. విశ. (స్. సీ. స్ ) బలమైనది, శక్తిమంతము.

సౌతి సం. వి. ఇ. పుం. 1. సూతుని కుమారుఁడు. 2. రౌమహర్షణి. 3. కర్ణుఁడు.

సౌత్యము సం. విశ. (అ. ఆ. అ ) సోమపీడనమునకు సంబంధించినది. అ. న. సారథ్యము. 2. సవనీయమను యజ్ఞకర్మము.

సౌత్రము సం. విశ. (అ. ఈ. అ.) 1. సూత్రము కలది. 2. సూత్రమునకు సంబంధించినది. వి. అ పుం. వ్యాకరణ సూత్రములందు వచ్చు కృతక ధాతువు.

సౌత్రాంతికులు నం. వి. అ. పుం. బ. బౌద్ధమత శాఖలు నాలుగింటిలో నొకదానికిఁ జెందినవారు.

సౌత్రామణి నం. వి. ఈ. స్త్రీ 1 తూర్పు. 2. ఒకవిధమైన యజ్ఞము.

సౌత్రామణేష్టి నం. వి. ఇ. స్త్రీ. హవిర్యజ్ఞ విశేషము.

సౌత్రికము నం. వి. అ. పుం. నేయఁబడిన వస్త్రాదికము.

సౌత్రికుఁడు నం. వి. అ. పుం. సాలెవాఁడు.

సౌత్రుఁడు నం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

సౌదర్యము నం. వి. అ. న. సోదరత్వము నం. విశే. (అ. ఆ. అ.). సోదరత్వముతోఁ గూడినది.

సౌదాగరు వి. 1. గుఱ్ఱముల బేరగాఁడు. 2. వర్తకుఁడు.

సౌదామని నం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక యచ్చర. 2. మెఱుపు. 3. ఐరావతము భార్య.

సౌదామిని(మ్ని) = సౌదామని.

సౌదాయికము నం వి. అ. న. 1. వివాహ సమయమున వధువునకుఁ బితృభ్రాత్రాదులచే నొసంగఁబడు ద్రవ్యము. స్త్రీ ధనము.

సౌధానము నం. వి. అ. న. 1. రాజగృహము. 2. మేడ.

సౌదాసుఁడు నం. వి అ. పుం. కల్మాషపాదుఁడను రాజు.

సౌధన్వనము నం. వి. అ. పుం. త్రైవర్ణికుల పిమ్మటను శూద్రులకు ముందును గణింపఁదగిన యొక వర్ణము

సౌధము నం. విశే. (అ. ఈ. అ) 1. అమృతమునకు సంబంధించినది. 2. సున్నముతోఁ జేయఁబడినది. వి. అ. న. రాజగృహము, నగరు. 2. వెల్ల వేయఁబడిన హర్మ్యము 3. వెండి. 4. ఒకవిధమైన రాయి.

సౌధర్మ్యము నం. వి. అ. న. 1. అర్జనము. 2. ధర్మవర్తనము.

సౌధవాసము నం. వి. అ. పుం. పెద్దప్రాసాదము.

సౌధోత్సంగము నం. వి. అ పుం. ప్రాసాదోపరిభాగము

సౌనందము నం వి. అ. పుం. బలరాముని రోకలి.

సౌనంది నం. వి. న్. పుం బలరాముఁడు.

సౌనధర్మ్యము నం వి. అ. న. ఘోరశత్రుభయము.

సౌనము నం. విశే. (అ. ఈ అ.). కసాయి గృహమునకు సంబంధించినది. వి. అ.న. కసాయివాఁ డమ్ము మాంసము.

సౌనికుఁడు నం. వి అ. పుం. 1 పశుపక్ష్యాదులను జంపి యమ్ముకొనువాఁడు, కటికవాఁడు 2. వేటకాఁడు.

సౌనుఁడు నం. వి. అ. పుం కసాయివాఁడు.

సౌపము నం. విశే. (అ. ఈ. అ.). సంస్కృత విభక్తిప్రత్యయములకు సంబంధించినది.

సౌపర్ణము నం. విశే (అ. ఈ. అ ). గరుడునకు సంబంధించునది. వి. అ న. 1. సొంటి 2 గరుడపచ్చ.

సౌపర్ణేయుఁడు నం. వి. అ పుం. గరుడు డు.

సౌపాకము నం వి. అ. పుం. ఒకమిశ్రజాతి.

సౌపానము = సోపానము.

సౌపికము నం విశే. (అ ఆ అ.) పప్పు, పులుసు మున్నగు వానితోఁ గూడినది

సౌప్తికము నం. విశే. (అ. ఈ. అ.). 1 నిద్రకు సంబంధించినది. 2 నిద్రను గలిగించునది. వి. అ. న. 1. భారతములో నొకపర్వము. 2. నిద్రించు సమయమున శత్రువులపై బడి చంపుట.

సౌప్రతీకము నం. విశే. (అ. ఈ అ ). సుప్రతీకమను నేనుఁగునకు సంబంధించినది.

సౌబలి = సౌబలేయి నం. వి. ఈ. స్త్రీ. గాంధారి, సుబలుని కూతురు.

సౌబలుఁడు నం. వి. అ. పుం. శకుని, సుబలుని కొడుకు.

సౌభగము నం. వి. అ. పుం. 1. క్షేమము. 2. సౌఖ్యము. 3. అదృష్టము. 4. భాగ్యము.

సౌభద్రుడు = సౌభద్రేయుఁడు సం. వి. అ. పుం. అభిమన్యుఁడు, సుభద్ర కొడుకు

సౌభపతి సం. వి. ఇ. పుం. సాల్వరాజు.

సౌభము సం. వి. అ. న. 1. హరిశ్చంద్రుని పట్టణము. 2. సాల్వనగరము.

సౌభరి సం. వి. ఇ. పుం. ఒక వేదర్షి.

సౌభాగినేయి సం. వి. ఈ. స్త్రీ. ప్రియతము రాలైన భార్య కూతురు

సౌభాగినేయుఁడు సం. వి. అ. పుం. ప్రియతము రాలైన భార్యకొడుకు.

సౌభాగ్యకృత్తు సం. వి. త్. పుం. స్వరతాన విశేషము.

సౌభాగ్యతంతువు సం. వి. ఉ. పుం. మంగళసూత్రము.

సౌభాగ్యతృతీయ సం. వి. ఆ. స్త్రీ. భాద్రపద శుక్ల పక్ష తృతీయ.

సౌభాగ్యము సం. వి. అ. న. 1. అదృష్టము. 2. ధన్యత్వము. 3. సౌందర్యము.

సీ. బహుదివ్యఫల పరిపాక సౌభాగ్యంబు పెంపు నెమ్మోవిమానికముతోడ. వసు. 1. 2.

4. వైభవము.

సీ. సౌభాగ్యగరిమ నీసాధ్వికి నుపమింప లక్ష్యంబు వేరు శ్రీలక్ష్మి దక్క. విక్ర. 1. 47.

5. సుభగత్వము. 6. ప్రేమ. 7. అనుగ్రహము. 8. సిందూరము. 9. శుభాకాంక్ష. 10. వెలిగారము. 11. యోగవిశేషము.

సౌభాగ్యవతి సం. వి. ఈ. స్త్రీ. 1. పుణ్యస్త్రీ 2. భాగ్యశాలిని. 3. మంచిభార్య.

సౌభికుఁడు సం. వి. అ. పుం. ఇంద్రజాలము చేయువాఁడు, గారడీఁడు.

సౌభిక్షము సం. విశే. (అ. ఆ. అ.). సౌఖ్యమును ఆహార సమృద్ధిని గూర్చునది.

సౌభీకుఁడు సం. వి. అ. పుం. ద్రుపదుఁడు.

సౌభ్రాత్రము సం. వి. అ. న. సుభ్రాతృత్వము. మంచి తోఁడబుట్టుఁదనము.

సౌమంగల్యము సం. వి. అ. న. 1. సంక్షేమము. 2. వైభవము. 3. సౌభాగ్యము.

సౌమకి సం. వి. ఇ. పుం. ద్రుపదుఁడు.

సౌమనస సం. వి. ఆ. స్త్రీ. జాజికాయపై బెరడు,

సౌమనసము సం. విశే. (అ. ఆ. ఈ. అ). 1. ఆహ్లాదకరమైనది. 2. పూవులకు సంబంధించినది. వి. అ. న. దయ, ఔదార్యము, 2. ఆనందము. 3. సంతృప్తి. 4. జాజికాయ.

సౌమనసా(స్యా)యని సం. వి. ఈ. స్త్రీ. 1. మాలతీలత. 2. మాలతీపుష్పము. 3. జాపత్రి.

సౌమనస్యము సం. విశే. (అ. ఆ. అ.) చిత్తానందము కలిగించునది. వి. అ. న. 1. మనస్తృప్తి. 2 పువ్వు. 3. దేవతాభావము. 4. శ్రాద్ధకాలమునఁ బిండప్రదానము పిదప బ్రాహ్మణున కిచ్చు పుష్పదానము. 5. అస్త్రవిశేషము.

గీ. అబల నఖములు క్రూరంబులని తలంచి, సౌమనస్యంబు గుణమున సంతరించె. విక్ర. 4. 17.

సౌమము సం. విశే. (అ. ఆ. అ.) సోమమునకు సంబంధించినది.

సౌమాయనుఁడు సం. వి. అ. పుం. బుద్ధుఁడు. (తండ్రి మున్నగు పూర్వులవలనఁ గలిగిన పేరు)

సౌమికము సం. విశే. (అ. ఆ. అ.) 1. సోమరసమునకు సంబంధించినది. 2. చంద్రునికి సంబంధించినది. 3 యాగవిశేషము.

సౌమితికము సం. వి. అ. న. ఒక విధమైన యున్ని వస్త్రము.

సౌమిత్రి సం. వి. ఇ. పుం. లక్ష్మణుఁడు.

సౌమిత్రుఁడు సం. వి. అ. పుం. లక్ష్మణుఁడు.

సౌమిల్లుఁడు సం. వి. అ. పుం. కాళిదాసునకుఁ బూర్వుఁడైన యొక సంస్కృతనాటక కవి.

సౌముఖ్యము సం. వి. అ. న. సుముఖత్వము, ప్రసన్నత.

సౌమేచకము సం. వి. అ. న. బంగారము.

సౌమేధికుఁడు సం. వి. అ. పుం. 1. ఋషి. 2. ద్రష్ట. 3. అతిలోక ప్రతిభాశాలి.

సౌమేరవము సం. వి. అ. న. సుమేరు సంబంధి, బంగారము.

సౌమ్య సం. వి. ఆ. స్త్రీ. 1. ముయ్యాకు పొన్న (వృ. వి.) 2. ఒకానొక సంవత్సరము. 3. దుర్గ. 4. ముత్యము. 5. మృగశిరోనక్షత్రము.

సౌమ్యగంధి సం. వి. ఇ. ఈ. స్త్రీ. భారతదేశ మందలి తెల్లని రోజా పువ్వు.

సౌమ్యగోళము సం. వి. అ. న. ఉత్తరార్ధగోళము.

సౌమ్యగ్రహము సం. వి. అ. పుం. శుభగ్రహము. (బుధుఁడు, గురుఁడు, శుక్రుఁడు, చంద్రుఁడు.)

సౌమ్యత సం. వి. ఆ. స్త్రీ. 1. ఔదార్యము. 2. తిన్నన; రమ్యత.

ఉ. ప్రాజ్ఞులు మూర్తి సౌమ్యతయు బాహులదీర్ఘ తయుం భటత్వ త, త్త్వజ్ఞతయున్ గతిస్ఫుర దుదాత్తతయున్ గని సంశయంబుతోన్.....భార. విరా. 4. 74.

సౌమ్యధాతువు సం. వి ఉ. పుం. శ్లేష్మము.

సౌమ్యనాముఁడు సం. విశ (న్. నీ. న్.) హృద్యమైన పేరుగలవాఁడు.

సౌమ్యము సం. విశ (అ. ఆ. అ. అ.) 1. చంద్రునికి సంబంధించినది. 2. సోమరసగుణములు కలది. 3. అందమైనది. 4. సమ్మతమైనది. 5. శాంతమైనది. 6. మృదువైనది. 7. ఋజువైనది. 8. శుభమైనది. 9. ప్రకాశవంత మైనది. 10. చల్లనిది.

వి. అ. పుం. 1. ఉదుంబర వృక్షము. 2. ఎఱుపు రంగు పొందక మునుపటి రక్తము. 3. జఠర రసము. 4. ప్రపంచ నవఖండములలో నొకటి. 5. శుభగ్రహము. 6. సామకృచ్ఛ్రమను తపస్సు. 7. ఎడమచేయి. అ. న. 1. అర్జవము. 2. మృగశిరోనక్షత్రము. 3. ఎడమకన్ను. 4. హాస్తమధ్యము. 5. ఉత్తానకరణబంధ విశేషము.

సౌమ్యవారము సం. వి. అ. పుం. బుధవారము.

సౌమ్యి సం. వి. ఈ. స్త్రీ 1. చంద్రకాంతి. 2. పితృదేవతాగణము.

సౌమ్యుఁడు సం. వి అ. పుం 1. బ్రాహ్మణుఁడు 2. సోమరసము త్రాగు బ్రాహ్మణుఁడు. 3. అనుచరుఁడు. 4. బుధుఁడు.

సౌరతము సం విశ. (అ. ఈ. అ) సురతమునకు సంబంధించినది. వి. అ. న. 1. రతి. 2. రేతస్సు.

సౌరత్యము సం. వి. అ. న. 1. భక్తి. 2. విశ్వాసము.

సౌరథుఁడు సం. వి. అ. పుం. యోధుఁడు.

సౌరభము సం విశ. (అ. ఈ. అ.) సువాసనగలది. వి. అ. న. 1. ఆమోదము, సువాసన 2. కుంకుమ పువ్వు. 3. బోళము, గంధరసము 4 ఎద్దు. 5. తానవిశేషము. 6. మైత్రి.

సీ. ఘనసౌరభములలోఁ గస్తూరియే మేలు....... బిల్హ. 1. 77.

సీ. ... పుష్పసౌరభములఁ బొలుపు మిగిలి....... విక్ర. 1, 33.

సౌరభేయము సం. విశ. (అ. ఈ. అ) 1. సురభికి సంబంధించినది. 2. సువాసన గలది. వి అ పుం. ఎద్దు

సౌరభేయి సం. వి ఈ స్త్రీ. 1. సురభికూఁతురు, నందిని. 2. ఆవు.

ఉ. పెద్దరికంపవైతి సద్ధర్మగతిఁ జూపు, శాదమగ్నయైన సౌరభేయి ధర్మ 1. 148.

సౌరభ్యము సం. వి. అ. న. 1. సుగంధము. 2. సౌందర్యము. 3. కీర్తి. 4. సౌశీల్యము.

సౌరభ్యుఁడు సం. వి. అ పుం. కుబేరుఁడు.

సౌరమానము సం. వి. అ. న. సూర్యగతినిబట్టి యేర్పడిన కాలమానము.

సౌరమాసము సం. వి. అ. పుం. సూర్యుఁ డొక రాశి యందు సంచరించు కాలము.

సౌరము సం. విశ (అ. ఈ. అ.) 1. సూర్యసంబంధ

మైనది 2 సూర్యునారాధించునది. 3. దివ్యమైనది. 4. మద్యమునకు (సురకు) సంబంధించినది. నం. వి. అ. న. సూర్యునకు సంబంధించిన కొన్ని బుక్కుల సముదాయము. 2. కుడికన్ను. వి. అ. పుం. 1. సౌరమాసము. 2 సౌరదివసము. 3. ఒక విధమైన మొక్క. 4 ఒకానొక మతము. 5. ఉపపురాణములలో నొకటి. 6. ఒకానొక యంత్రము.

సౌరస నం. వి. ఆ. స్త్రీ. కొండరేగు.

సౌరసము నం. వి అ పుం. 1. ఉప్పువైచి కాచిన ద్రవాహారము 2. ఒక విధమైన వేము

సౌరసేనము నం. వి అ. పుం. ఒక దేశము, తద్దేశ ప్రజ.

సౌరసేని నం వి. ఈ. స్త్రీ. ఒకానొక దేశభాషా విశేషము.

సౌరసేయుఁడు నం. వి. అ. పుం. కుమారస్వామి.

సౌరసైంధవము నం. విశే. (అ. ఈ. అ.) గంగకు సంబంధించినది. వి అ పుం సూర్యుని గుఱ్ఱము.

సౌరస్యము నం. వి అ. న రుచి.

సౌరాజ్యము నం. వి. అ. న. సుపరిపాలనము.

సౌరావము నం. వి. అ. పుం ఉప్పువేసి కాఁచిన ద్రవాహారము.

సౌరాష్ట్రికము నం. వి. అ. పుం. ఒక విధమైన కంచు.

సౌరాష్ట్రము నం. వి. అ. న. 1. కంచు. 2. ఇత్తడి. పుం. 1. ఒకానొక రాగము. ఒక దేశము.

సీ. సౌరాష్ట్రపతికంటె సంపాతి యెంతవాఁ డటు చూడు వాని సప్తాంగములును భోజరా. 4. 34.

సౌరాష్ట్రి నం. వి. ఈ. స్త్రీ. 1. కరవీరక మను సస్యము. 2. సుగంధముగల భూమి.

సౌరాష్ట్రికము నం. విశే. (అ. ఆ. అ.) సౌరాష్ట్రదేశ సంబంధి. వి. అ. పుం. విషభేదము. న. 1. కంచు. 2. ఇత్తడి.

సౌరి నం. వి. ఇ పుం. 1. శని 2. యముఁడు. 3. విష్ణువు. 4. సుగ్రీవుఁడు. 5. వేఁగిసచెట్టు (వృ వి.). ఈ. స్త్రీ 1. సూర్యుని భార్య. 2. ఆవు.

సౌరికము నం. విశే. (అ. ఈ. అ.). 1. దివ్యమైనది. 2. మద్యమునకు సంబంధించినది. వి. అ. పుం. 1. స్వర్గము. 2. కల్లు

సౌరికుఁడు నం వి అ. పుం. 1. కల్లమ్ముకొని జీవించువాఁడు. 2. శని.

సౌరీయము నం. విశే. (అ. ఆ. అ). 1. సూర్యునకు సంబంధించినది. 2. సూర్యున కర్హమైనది.

సౌరు=సవురు విశే. మనోజ్ఞము. వి. 1. విధము. 2 చక్కఁదనము.

సీ. తనరాదు సిరిసౌరు తనివారఁగలవారు కమ గూర్క మదిఁగోరి కన్నుమూయ హంస. 1.182.

సౌర్యుఁడు నం. వి. అ. పుం. 1. సూర్యారాధకుఁడు. 2. శని. 3. యముఁడు.

సౌరేయ(క)ము నం. వి. అ. పుం. ఒకవిధమైన మొక్క. (వృ. వి.).

సౌలక్షణ్యము నం. వి. అ. న. సులక్షణ భావము, మంచి లక్షణము కలిగియుండుట.

సౌలభ్యము నం. వి. అ. న. సులభత్వము, తేలికగా లభించునది యగుట.

సౌల్వికుఁడు నం వి అ. పుం రాగివనిముట్లు చేయుఁవాఁడు.

సౌవగ్రామికము నం. విశే. (అ. ఈ. అ.) సొంత గ్రామమునకు సంబంధించినది.

సౌవము నం. విశే. (అ. ఈ. అ.). 1. సొంతయాస్తికి సంబంధించినది. 2. స్వర్గమునకు సంబంధించినది. వి. అ. న. అఁదఱికిని జెందుశాసనము.

సౌవరము నం. విశే. (అ. ఈ. అ.). స్వరమునకు సంబంధించినది.

సౌవర్చలము నం. విశే. (అ. ఈ. అ.). సువర్చల దేశము నుండి వచ్చినది. వి అ. న. సౌవర్చ లవణము, సర్జ వృక్షము నుండి తీయునట్టి యుప్పు.

సౌవర్ణకరణి నం. వి. ఈ. స్త్రీ 1. వృక్ష విశేషము 2. ఇతర లోహములను బంగారముగాఁ జేయు నోషధి విశేషము.

సౌవర్ణకుడ్యక నం. వి ఆ స్త్రీ. ఒకవిధమైన పట్టు దుస్తు.

సౌవర్ణభేదిని నం. వి ఈ. స్త్రీ. ప్రియంగు వృక్షము.

సౌవర్ణము నం. విశ. (అ. ఈ. అ.). 1. స్వర్ణ వికార మైనది 2. ఒక కర్షము తూగునది. వి. అ. పుం. 1. బంగారు కర్షము (నాణెము) 2 బంగారు టుంగరము. న. పుం. బంగారము.

సౌవర్ణికము నం. విశ (అ. ఆ. అ.). బంగారుతోఁ జేయఁబడినది

వి. అ. న. నాలుగు మినువగింజల యెత్తు

సౌవర్ణికుఁడు నం. వి. అ. పుం. అగసాలి.

సౌవస్తికము నం. విశ,-(అ. ఆ. అ.). ఆశీః పూర్వక మైనది వి అ. న స్వస్త్యయనము.

సౌవస్తికుఁడు నం. వి. అ. పుం కుల పురోహితుఁడు.

వ. .... శౌఖశాయనిక సౌవస్తిక బుధనామ సచివ సుకవిగాయక వైణిక వాంశిక మార్దంగిక నికరంబు ... నై ష. 2 3.

సౌవాధ్యాయికము నం. విశ. (అ ఆ అ.). స్వాధ్యా యమునకు సంబంధించినది

సౌవాస్తవము నం విశ. (అ. ఈ. అ.). మంచిస్థితి కలది.

సౌవిదల్లకుఁడు నం. వి. అ. పుం. అంతఃపురము కావలివాఁడు.

సౌవిదల్లుఁడు నం వి. అ పుం. అంతఃపురము కావలి వాఁడు.

సౌవిదుఁడు నం వి అ. పుం. సౌవిదల్లుఁడు, కంచుకి.

చం అతఁ డొకనాఁడు నాఁడు విహారవశంబున నాత్మసత్సభా,గతుఁ డగువాని సద్వినయ గౌరవ పూజలఁ దన్పి సౌవిద, ప్రతతులఁ గూర్చి లోపలికిఁ బంచెను ... ప్రభు 4. 13.

సౌవీరకము నం వి. అ. పుం. రేఁగుచెట్టు న. పులియఁ బెట్టిన కడుగు నీళ్ళు.

సౌవీరకుఁడు నం. వి. అ. పుం 1. సువీరదేశము వాఁడు.

2 జయద్రథుఁడు.

సౌవీరము నం. వి. అ న. 1. పులియఁ బెట్టిన కడుగు నీళ్ళు, 2. అంజనము. 3. రేఁగుపండు. 4. ఒకా నొక ప్రదేశము - లేక - అందలి ప్రజ.

సౌవీరసారము నం. వి. అ. న. కపోతాంజనము.

సౌవీరి=సావీరి నం. వి. ఈ. స్త్రీ. మధ్య గ్రామగత మూర్ఛనలలో నొకటి.

సౌవీర్యము నం. వి. అ. న. గొప్ప పరాక్రమము, శౌర్యము.

సౌశబ్ద(బ్ద్య)ము నం. వి. అ. న. నామక్రియా రూప ములను సరిగా నిర్మించుట, ఒకానొక శాబ్దిక గుణము

సౌశామ్యము నం. వి. అ. న. లెస్సగా నణయించుట.

సౌశీల్యము నం వి. అ. న. సుశీలత్వము.

సౌశ్రవసము నం. వి. అ. న. ప్రతిష్ఠ, కీర్తి.

సౌశ్రియము నం. వి. అ. న. గొప్ప యదృష్టము, సౌఖ్యము.

సౌషిరము నం. వి. అ. పుం. ఒకవిధమైన దంతరోగము న. వేణువు మున్నగు సుషిరవాద్యముల సమూహము.

సౌషిర్యము నం వి. అ. న. బోలుఁదనము.

సౌష్ఠవము నం. వి. అ. న. 1. సుష్ఠుభాగము. 2. నాట్యాంగ విశేషము. 3. చక్కఁదనము. 4. నేర్పు. 5. ఆధిక్యము. 6. సౌలభ్యము. 7. పరి శుభ్రత.

వ. గోవుల గోష్ఠంబులు దినదినంబును సౌష్ఠవంబు గావించి యరయు పుణ్యాత్ముండు .... శివధ. 8. 39.

సౌస్నాతికుఁడు నం. వి అ. పుం. సుఖముగా స్నాన మైనదా యని యడుగువాఁడు.

సౌస్వర్యము నం. వి. అ. న. సుస్వరత్వము శ్రావ్య ధ్వని.

సౌహార్దము నం. వి. అ. న. 1. మహృత్వాపము. మైత్రి. 2 ప్రేమ.

మ. జవమాన్యున్ సభలోన మాన్యుఁడని సౌహార్దంబునన్ గాంచ, స్థవి. ప్రేంణ నిన్ను జాండు తన యుల్ తప్పంగఁ బూజించిరి. ... భార. సభా ౨ ర౩.

సౌహార్దుఁడు నం. వి. అ. పుం. మిత్రుని కుమారుఁడు.

సౌహార్ద్యము నం. వి. అ. న. సౌహార్దము, అనురాగము.

సౌహిత్యము నం. వి. అ. న. 1. ఆప్యాయము. ౨. పర్యాప్తి. ౩. దయ. 4. స్నేహము ౫. ప్రీణనము, తృప్తి.

గీ. .... నాస్థానమండపమున, జనిత సాహిత్య సౌహిత్య సరస గోష్ఠిఁ, జిత్త మిగురొత్త జన్నయ సిద్ధమంత్రి, కొలువు కూర్చుండి ... విక్ర. 1. 19.

సౌహృదము నం. వి అ. న స్నేహము, సౌహార్దము.

సీ ప్రథమ జామాత కిచ్చె భూపాలతిలకుఁ, డగ్ని శోభంబులైన దివ్యాంబరములు, సౌహృదంబు ఘటింప వైశ్వానరుండు, దనకు నెయ్యవి పుత్తెంచెఁ దాను మొదల ... నైష. 6. ౪8.

సౌహృదయము=సౌహృదము.

సౌహృద్యము=సౌహృదము.

## స్క

స్కంత్త (ఋ. త్రి. ఋ.) గంతెడివాఁడు.

స్కందకము నం. వి. అ. న. ఒక వృత్తము.

స్కందకుఁడు నం. వి. అ. పుం. 1. గంతెడివాఁడు. 2 సైనికుఁడు.

స్కందజిత్తు నం వి త్. పుం. విష్ణువు.

స్కందనము నం వి. అ. న 1. స్రవించుట. 2. నడచుట ౩. కదలుట. 4. ఎండిపోవుట. 5. శీతలోపాయములచే రక్తస్రావము నాపుట. 6. విరేచనము.

స్కందపురాణము నం. వి. అ. న అష్టాదశ పురాణములలో నొకటి.

స్కందము నం. వి. అ. పుం. 1. దుముకుట 2. పాదరసము ౩. శరీరము 4 నదీతీరము. 5 పిల్లలకు వచ్చు నొక రోగము 6. నాశము

స్కందషష్ఠి నం. వి. ఈ. స్త్రీ. 1. కార్తికేయుని గౌరవార్థమై చైత్రశుద్ధ షష్ఠినాఁడు జరుగు నొక పండుగ. ౨. మార్గశీర్ష శుక్లషష్ఠి.

స్కందాంశకము నం. వి. అ. పుం. పాదరసము.

స్కందితము నం. విశే. (అ. ఆ. అ.) 1. వెకలింపఁబడినది. ౨. స్రవింపఁజేయఁబడినది.

స్కందుఁడు నం. వి. అ. పుం. 1. కుమారస్వామి. 2. శివుఁడు. ౩ రాజు. 4. తెలివికలవాఁడు, ధీమంతుఁడు.

స్కందోలము నం. వి. అ. పుం. చల్లఁదనము.

స్కంధ నం వి. ఆ. స్త్రీ. 1. కొమ్మ. 2. లత.

స్కంధఘనము నం. వి. అ. పుం. తెలిసికొనుట.

స్కంధచాపము నం. వి. అ. పుం. కావటిబద్ద.

స్కంధజము నం. వి. అ. పుం. మఱ్ఱిచెట్టు, స్కంధము నుండి పుట్టు చెట్టు.

స్కంధతరువు నం వి. ఉ. పుం కొబ్బరి చెట్టు.

స్కంధదేశము నం. వి. అ పుం. 1. ఏనుఁగుమూఁపు. 2. భుజము ౩. చెట్టుబోదె, ప్రకాండము.

స్కంధపట్టిక నం. వి. ఆ. స్త్రీ తలుపువ కమర్చెడు గందపట్టె

స్కంధపరినిర్వాణము నం. వి అ. న ఐహిక జీవిత బంధములను రూపుమాపుట. (బౌద్ధ)

స్కంధపీఠము నం. వి. అ. న. ఱెక్క యెముక గూడు.

స్కంధఫలము నం. వి. అ. పుం. 1. కొబ్బెర చెట్టు. 2. బిల్వవృక్షము. 3. అత్తిచెట్టు. న. కొబ్బెరకాయ.

స్కంధబంధన నం. వి. అ. స్త్రీ. ఒక విధమైన మొక్క

స్కంధమల్లకము నం. వి. అ పుం. నారాయణపక్షి.

స్కంధము సం. వి. అ. పుం. 1. అంసభాగము, భుజాగ్రము. 2. మూఁపురము.

స వెడఁగు సయ్యాదవబాదిరి స్కంధావారంబునకు గాఢభక్తిఁ బ్రణామంబు లాచరించి ... ... పారి ...

3. చెట్టుబోదె, వేళ్ళు మొదలు కొమ్మలవఱకుఁగల ప్రమాణము. 4. పోరు 5. సమూహము 6. బౌద్ధశాస్త్రోక్తములైన పంచస్కంధములు. 7. శరీరము. 8. ఛందోభేదము. 9. పెద్దకొమ్మ 10. గ్రంథభాగము. 11. సేనావిభాగము. 12 అయిదు జ్ఞానేంద్రియములు. 13. మార్గము 14. ఒడంబడిక 15. నారాయణ పక్షి. 16. రాజాభిషేక సమయమున నుపయోగింపఁబడు వస్తువులు.

స్కంధరుహము సం. వి. అ. పుం. మఱ్ఱిచెట్టు.

స్కంధవాహ(క)ము సం. వి. అ. పుం. 1. బండి లాగెడి యెద్దు 2. బరువు మోయు యెద్దు.

స్కంధశాఖ సం. వి. ఆ. స్త్రీ. మ్రాని మొదటికొమ్మ.

స్కంధశృంగము సం. వి. అ. పుం. దున్నపోతు.

స్కంధస్సు సం. వి. స్. న. 1. భుజము. 2. చెట్టు మొదలు.

స్కంధాగ్ని = స్కంధానలము సం. వి. అ. పుం. 1. నిప్పుపెట్టఁబడిన చెట్టు మొదలు. 2. పెద్దదూలములతో మండుచున్న యగ్ని.

స్కంధాటిక సం. వి. ఆ. స్త్రీ. 1. కావడి. 2. మూఁపుమీఁది బరువు.

స్కంధావారము సం. వి. అ. పుం. 1. దండు విడిసిన చోటు, బిడారము. 2. దండు.

వ. ... కౌరవేశ్వరు స్కంధావారంబు వారణపురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు రాచందంబున నందంబై యొప్పె ... భార. ఉద్యో. 4. 164.

3. రాజధాని.

స్కంధి సం. విశే. (న్. నీ. న్.) 1. భుజములు గలది. 2. కొమ్మలు కలది. వి. న్. పుం. చెట్టు.

స్కంధితము సం. వి. అ. పుం. స్కంధవాహము.

స్కంధపుఁడు సం. వి. అ. పుం. 1. పశ్చిమదేశపు రాజు. 2. విభాగింపుఁడు. 3. రాజు.

స్కంధోపనేయము సం. విశే. (అ. ఆ. అ.) భుజములచే మోయఁదగినది. వి. అ. పుం. ఫలము కాని ధాన్యముకాని వినతికి సూచనగా నర్పింపఁబడు సంధివిశేషము

స్కంభనము సం. వి. అ. న. 1. బలపఱచుట. 2. ఆధారము. 3. ప్రాపు.

స్కంభము సం. వి. అ. పుం. ప్రాపు, ఆధారము

స్కంభుఁడు సం. వి. అ. పుం. 1. పరమాత్మ, 2. వైదిక దేవతా విశేషము.

స్కన్నము సం. విశే. (అ. ఆ. అ.) 1. జాఱిపడినది. 2. ఎండినది. 3. ప్రసరింపఁజేయఁబడినది. 4. చల్లఁబడినది, వికీర్ణము.

స్కబ్ధము సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆపఁబడినది 2. బలపఱుపఁబడినది

## స్కా

స్కాందపురాణము సం. వి. అ. న. అష్టాదశ పురాణములలో నొకటి.

స్కాందము సం. వి. అ. న. స్కాందపురాణము. విశే. (అ. ఈ. అ.) 1. స్కందునకు సంబంధించినది. 2. శివునకు సంబంధించినది.

## స్కో

స్కోటిక సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన పిచ్చుక.

## స్ఖ

స్ఖదనము సం. వి. అ. న. 1. ముక్కలుగా ఖండించుట. 2. హానిచేయుట. 3. చంపుట. 4. స్థిరత్వము

స్ఖలనము సం. వి. అ. న. 1. జాఱుపాటు. 2. స్వధర్మచ్యుతి. 3. పొరపాటు. 4. అపజయము.

5. తడఁబాటుతోఁ బలుకుట 6. డీకొనుట. 7. రేతః స్ఖలనము.

స్ఖలి(యి)ంచు నం. అ. క్రి. జాఱు.

స్ఖలితము నం. విశే. (అ. అ. అ.) 1. జాఱినది. 2. సంభ్రమించినది. 3. యుద్ధమర్యాద తప్పినది. 4. పడినది. 5. కదలుచున్నది. 6. మద్యపానముచేఁ బరవశమైనది. 7. కలఁత నొందినది. 8. పొరపడినది. 9. అడఁపఁబడినది. 10. గాయపడినది. 11. అసంపూర్ణమైనది. వి. అ. న. 1. స్ఖలనము. 2. మోసము. 3. కష్టము.

## స్ఖా

స్ఖాలిత్యము నం. వి. అ. న. పొరపాటు, 2. జాఱుపాటు 3 పొరపాటు. 4. మోసము.

## స్త

స్తంబకము నం. వి. అ. పుం. గుత్తి, గుచ్ఛము.

స్తంబకరి నం. విశే. (ఇ. ఈ. ఇ.) 1. నీతము. భోగ్యము, 2. పనలుగా నేర్పడునది. వి. ఇ. పుం. ధాన్యము.

స్తంబకరిత నం. వి. ఆ. స్త్రీ. 1. పనలుగా నేర్పడుట. 2 పైరు వెఱుగఁబడుట.

స్తంబఘనము నం. వి. అ. పుం 1. వరి మున్నగు పైరులను కోయుటకగు పనిముట్టు, కొడవలి, 2. వనధాన్యమును పోయుట కుపయోగించు గంప. (ఇట్లే స్తంబఘాతము, స్తంబహాము, స్తంబహననము, స్తంబహనని, మొ).

స్తంబఘ్నము నం. వి. అ. పుం. 1. గుద్దలి 2. స్తంబఘనము.

స్తంబపురము నం. వి. అ. న. ఒకనగరము.

స్తంబము నం. వి అ. పుం. 1. చెట్టుమ్రాను. 2. ఆకు అధికముగాగల పొద. 3. తృణాదుల గంట 4. వరి మున్నగువాని సమూహము. 5. ఏనుఁగును గట్టు స్తంభము. 6. మ్రానుపాటు 7. పర్వతము.

స్తంబేరమము నం. వి అ. పుం. ఏనుఁగు.

స్తంభకము నం. విశే. (అ. ఆ. అ.) 1. ఆఁపునది. 2. రక్తస్రావ మధికమైనది.

స్తంభకి నం. వి. న్. పుం. చర్మాచ్ఛాదితమైన సంగీత పరికరము.

స్తంభనము నం. వి. అ. న. 1. మ్రాన్పడఁజేయుట. 2. మంత్రశక్తిచే నగ్నిమొదలగువాని శక్తి నణఁగించుట. 3. నిరోధము. 4. అణఁచుట. 5. శాంతపఱుచుట. 6. స్థిరముచేయుట 7. బలపఱుచుట 8. రక్తస్రావము నాఁపుట 9. రక్తస్రావమునాపు మందు. వి. అ. పుం. మన్మథుని పంచబాణములలో నొకటి.

స్తంభబలి నం. వి. ఇ. పుం. 2. కంబవల్లి. 2 ఉపనయనమున నాల్గవదినమునఁ జేయు పంచాశహోమము.

స్తంభము నం. వి. అ. పుం. 1. కంబము, గుంజె, 2. పడినమ్రాను. 3. ఒకానొక సాత్త్వికభావము. 4. స్థిరత. 5. తెలివిలేమి 6. అడ్డుపాటు. 7. నిష్ప్రతిధము. 8. ఆధారము. 9. మొద్దు. 10. సహజశక్తులను నిలుపుట.

స్తంభయిత నం. విశే (ఋ త్రీ ఋ) స్తంభింపఁజేయునది.

స్తంభి నం. వి ఇ. న్ పుం సముద్రము విశే. న్. నీ న్. 1 బలపఱుచునది, 2. ఆపునది. 3. స్తంభములతోఁ గూడినది. 4. గర్వించునది

స్తంభించు నం. అ క్రి మ్రాన్పడు. స క్రి మ్రాన్పడఁజేయు.

స్తంభిక నం. వి. ఆ. స్త్రీ. కుర్చీకాలు.

స్తంభితము నం. విశే (అ ఆ. అ.). 1. అడఁపఁబడినది. 2. మ్రాన్పఱుపఁబడినది. 3. శాంతపఱుపఁబడినది. 4. ఊరురోగవిశేషము.

స్తంభిని నం, వి ఈ స్త్రీ. 1. భూమి 2. తంత్ర విశేషము.

స్తతకము నం. వి. అ పుం. బిందువు, చుక్క.

స్తనంధయ నం వి ఆ స్త్రీ 1. పాలుత్రావెడి యాడుబిడ్డ.

స్తనంధయము సం. విశ. (అ. ఆ. అ.) చన్నుకుడుచు వది.

స్తనంధయి సం. వి. ఈ స్త్రీ. చన్నుగుడుచు చిన్న పాప.

స్తనంధయుఁడు సం. వి. అ పుం. పాలుత్రాగు బిడ్డఁడు.

స్తనక్షీరము సం వి అ. పుం. ఒకవిధమైన మామిడి.

స్తనగ్రహము సం వి. అ. పుం. చన్నుగుడుచుట.

స్తననము సం. వి అ. న 1. ధ్వనించుట. 2 గర్జించుట. ౩. మూల్గుట, 4. దగ్గుట.

స్తనపము సం. విశ. (అ. ఆ. అ.) చనుగుడుచునది.

స్తనభరుఁడు సం. వి. అ. పుం. స్త్రీవలె స్తనములుకల పురుషుడు

స్తనభవము సం. వి. అ. పుం. రతిబంధ విశేషము.

స్తనమధ్యము సం. వి. అ పుం. స్తనచూచుకము. అ. న. చనులనడిమి ప్రదేశము.

స్తనము సం. వి. అ. పుం. 1. కుచము. 2. కుచాగ్రము.

స్తనముఖము సం. వి. అ. న. చూచుకము.

స్తనయిత్నువు సం. వి. ఉ. పుం. 1. మేఘము. 2. ఉఱుము. ౩, మెఱుపు, 4. రోగము. 5, చావు 6. ఒకవిధమైన గడ్డి.

స్తనరోహితము సం. వి. అ. పుం. న. కుచమునందలి యొక భాగము.

స్తనవృక్షము సం. వి. అ. పుం. నల్లమామిడి.

స్తనాంతరము సం. వి. అ. న. 1. హృదయము. 2. చనులనడిమి ప్రదేశము. ౩. (వైధవ్యసూచకమైన) స్తనమందలి గుర్తు.

స్తనాంశుకము సం. వి. అ. న. పైఁట.

స్తనాభుజము సం. విశ. (అ. ఆ. అ.) పొడుగు కుడుపునది.

స్తనాభోగము సం. వి. అ. పుం. 1. స్తనవైశాల్యము. 2. స్తనమండలము.

స్తనాభోగుఁడు సం. వి. అ. పుం. స్త్రీవలె స్తనములు కల పురుషుఁడు

స్తనితకుమారుఁడు సం వి అ పుం జైనదేవతా వర్గములో నొక దైవము.

స్తనితఫలము సం. వి అ. పుం. పుల్ల వెలఁగ. (వ్య. వి).

స్తనితము సం. వి అ. న. 1. ఉఱుము. 2. రతిధ్వని విశేషము ౩. చప్పట్లధ్వని. ౪. వింటినారి శబ్దము. విశ. (అ. ఆ. అ) 1. ధ్వనితము 2. గర్జించునది.

స్తన్యదము సం. విశ (అ. ఆ. అ.) చనుబాలను వృద్ధి చేయునది

స్తన్యము సం వి అ. న చనుబాలు.

స్తబకము సం. వి. అ. పుం. 1 పూలగుత్తి. 2. గ్రంథ భాగము.

స్తభము సం. వి. అ పుం. 1. మేకపోతు. 2. గొఱ్ఱెపోతు.

స్తభి సం, వి. ఇ. పుం. 1. పారుష్యము. 2. స్థిరత్వము ౩. కాఠిన్యము.

స్తబ్ధకర్ణము సం. విశ (అ ఆ. అ) నిక్కపొడుచుకొనిన చెవులుగలది.

స్తబ్ధత సం వి. ఆ. స్త్రీ. 1. దృఢత. 2. కాఠిన్యము. ౩. మ్రానుపాటు.

స్తబ్ధపాదము సం. (అ. ఆ అ.). కుంటికాలు కలది.

స్తబ్ధము సం. విశ. (అ. ఆ. అ.) 2. అణఁగినది. ౩. చేష్టారహితము 4 నిక్క పొడుచుకొనినది. 5. ఆఁపఁబడినది 6 స్థిరమైనది. 7. కఠినమైనది. 8. మందమైనది

స్తబ్ధరోమము సం. వి. న్ పుం. బిరుసైన వెండ్రుకలు గల యడవిపంది.

సీ. ఒకసారి సారమేయోద్ధతి నుద్ధర స్తబ్ధరోమంబుల సంహరించి. కాశ. ౩. 47.

స్తబ్ధలోచనుఁడు సం విశ (అ. ఆ. అ.) ఱెప్పపాటు లేని కన్నులు కలవాఁడు, దేవతాది.

స్తబ్ధి సం వి. ఇ స్త్రీ. 1. స్థిరత్వము. 2. కాఠిన్యము ౩. చైతన్యరాహిత్యము. 4. మొండితనము.

స్తమితము సం. విశే. (అ. ఆ. అ.) 1. తడిసినది. 2. శాంతమైనది. 3. మూయఁబడినది. 4. మెత్తనిది. 5. తృప్తినొందినది.

స్తరణము సం. వి. అ. న. 1. పఱచుట. 2. గోడకు సున్నము వేయుట.

స్తరము సం. విశే. (అ. ఆ. అ.) 1. వ్యాపించునది. 2. కప్పునది. వి. అ. పుం. 1. పాన్పు. 2. పఱపు.

స్తరి సం. వి. ఈ. స్త్రీ. 1. పొగ. 2. ఆవిరి. 3. ఆవు నెయ్యి. 4. గొడ్డుటావు.

స్తరి(రీ)మ సం. వి. న్. పుం. పఱపు.

స్తవకము సం. వి. అ. పుం. 1. స్తోత్రము. 2. పూలగుత్తి. 3. గ్రంథభాగము. 4. సముదాయము. విశే. (అ. ఆ. అ.) పొగడునట్టిది.

స్తవకితము సం. విశే. (అ. ఆ. అ.) గుత్తులతోఁ గూడినది.

స్తవనము సం. వి. అ. న. 1. పొగడ్త. 2. ఋక్కు.

స్తవము సం. వి. అ. పుం. 1. పొగడుట. 2. స్తుతి.

స్తవరకము సం. వి. అ. పుం. కంచె, ఆవరణము.

స్తవి సం. వి. ఇ. పుం. స్తోత్రపాఠకుఁడు.

స్తవేయుఁడు సం. వి. అ. పుం. ఇంద్రుఁడు

## స్తా

స్తాఘము సం. విశే. (అ. ఆ. అ.) లోఁతులేనిది.

స్తావకుఁడు సం. వి. అ. పుం. పొగడువాఁడు.

స్తావము సం. వి. అ. పుం. స్తుతి

స్తావ్యము సం. విశే. (అ. ఆ. అ.) పొగడఁదగినది.

## స్తి

స్తిభి సం. వి. ఇ. పుం. 1. ఆటంకము 2. సముద్రము. 3. గుచ్ఛము

స్తిభిని సం. వి. ఈ. స్త్రీ. గుత్తి

స్తిమితము సం. విశే. (అ. ఆ. అ.) 1. నిశ్చలము 2. తడిసినది. 3. ఆర్ద్రమైనది. 4. శాంతమైనది. 5. మూయఁబడినది. 6. స్థిరమైనది. 7. తృప్తినొందినది. వి. అ. న. 1. తేమ. 2. స్థిరత్వము.

## స్తి

స్తిర్వి సం. వి. ఇ. పుం. 1. యజ్ఞములోని ఋత్విక్కు. 2. గడ్డి. 3. ఆకాశము. 4. నీరు. 5 నెత్తురు. 6. దేహము. 7. భయము. 8. ఇంద్రుఁడు

## స్తు

స్తుక సం. వి. ఆ. స్త్రీ. 1. కేశపాశము. 2. ఎద్దు కొమ్ముల నడుమ నుండు రోమజాలము. 3. కటి ప్రదేశము. 4. తొడ.

స్తుకము సం. వి. అ. పుం. 1. కేశసమూహము. 2. జుట్టుముడి.

స్తుతము సం. విశే. (అ. ఆ. అ.) స్తుతింపబడినది. వి. అ. న. పొగడ్త.

స్తుతి సం. వి. ఇ. స్త్రీ. 1. స్తోత్రము. 2. పొగడ్త 3. స్తుతివేగము. 4. ముఖస్తుతి. 5. దుర్గ.

స్తుతించు సం. స. క్రి. 1. స్తోత్రముచేయు. 2 అభినందించు. 3. ప్రశంసించు, పొగడు.

స్తుతిపదము సం. వి. అ. న. స్తోత్రలక్ష్యము.

స్తుతివ్రతుఁడు సం. వి. అ. పుం. స్తోత్రపాఠకుఁడు

స్తుతుఁడు సం. వి. అ. పుం శివుఁడు.

స్తుత్య సం. వి. ఆ. స్త్రీ. 1. సువాసనగల యొక విధమైన చెట్టుబెరడు. 2. పటిక పలక.

స్తుత్యము సం. విశే. (అ. ఆ. అ.) స్తోత్రము చేయఁదగినది.

శా. లోకస్తుత్యవిభూతి నన్యప్రసవావాలుంటాక బాహా బలా. శ్రీకృష్ణ .......

స్తునకము సం. వి. అ. పుం మేక.

స్తుభము సం. వి. అ. పుం. మేక.

స్తువము సం. వి. అ. పుం. స్తుతి.

స్తువి సం. వి. ఇ. పుం. 1. పూజించువాఁడు. 2. యజ్ఞము.

## స్తూ

స్తూపపృష్ఠము సం. వి. అ. పుం. తాబేలు.

స్తూపమండలము సం. వి. అ. న. స్తూపపంక్తి.

స్తూపము సం. వి. అ. పుం. 1. దేవాలయ విమానము 2. మట్టిదిబ్బ. 3. బౌద్ధస్మృతిచిహ్నము. 4. చితి, పొద. 5. శక్తి, బలము.

## స్తృ

స్తృతి సం. వి. ఇ. స్త్రీ. 1. పఱచుట. 2. కప్పుట.

## స్తే

స్తేనము సం. వి. అ. న. దొంగతనము. పుం. ఒక విధమైన సుగంధము.

స్తేనుఁడు సం వి అ పుం దొంగ.

స్తేమము సం. వి అ పుం. తేమ.

స్తేయము సం. వి. అ. న. 1. దొంగతనము. 2. దొంగి లింపఁబడిన వస్తువు. 3. రహస్యము.

స్తేయి సం వి. న్. పుం. 1. దొంగ, 2. కమసాలి.

## స్తై

స్తైన(న్య)ము సం. వి. అ. న. దొంగతనము.

స్తైన్యుఁడు సం. వి. అ పుం. దొంగ.

స్తైమిత్యము సం వి. అ. న. 1. స్తిమితత్వము. 2. స్థిరత్వము. 3. నైశ్చల్యము.

## స్తో

స్తోకకము సం వి అ. పుం. 1. చిందవు. 2 చాతక పక్షి. 3. అగ్నికణము. 4 ఒకవిధమైన విషము.

స్తోకకాయుఁడు సం. విశే. (అ ఆ. అ) 1. చిన్న శరీరము గలవాఁడు. 2. పొట్టివాఁడు

స్తోకము సం. విశే. (అ. ఆ. అ.) 1 చిన్నది. 2 అల్పమైనది. 3. నీచమైనది.

స్తోత, సం. వి. ఋ. పుం. పొగడువాఁడు.

స్తోతవ్యము సం. విశే. (అ. ఆ. అ.) పొగడఁదగినది.

స్తోత్రపాఠకుఁడు సం. వి. అ పుం. 1. స్తుతివచనము లను పలుకువాఁడు. 2 వంది.

స్తోత్రము సం. వి. అ. న పొగడ్త

గీ బిల్హణుం డనువాఁడు గంభీరుఁ డధిక, తముఁడు కవిరాజవంగ స్తోత్రములు వదసె బిల్హ. 1. 76.

స్తోత్రవాదము సం. వి. అ పుం. స్తుతివచనము

స్తోత్రియ సం. వి. ఆ స్త్రీ. ఒకవిధమైన పద్యము స్తోత్రియము.

స్తోభము సం. వి. అ. పుం. 1. ఆఁపుట. 2 విరామము 3 అగౌరవము. 4. ద్వేషము. 5. స్తుతి 6. సామ వేదభాగము. 7. క్రొత్తగాఁ జేర్పఁబడినది. 8 ఋగ క్షరములకంటె వదికమును అపవర్ణమును అయిన ధ్వని (ఋగక్షరేభ్యోఽధికః నచ తై స్సవర్ణ. స స్తోభో నామ. శాబరభాష్యము. 9. 2. 39.) 9. జడత్వము.

స్తోమక్షారము సం. వి. అ. పుం. సబ్బు.

స్తోమము సం. వి. అ. పుం. 1. సమూహము 2. స్తోత్రము. 3. యజ్ఞము 4. ఆయుధవిశేషము 5 సోమాహుతి. 6. పెద్దమొత్తము. 7. తొంబది యాఱంగుళముల కొలత. వి. అ. న. 1. తల 2. సంపద 3. ధాన్యము. 4. ఇనుపదండము.

స్తోమ్యము సం. విశే. (అ. ఆ. అ.) స్తుత్యము పొగడఁదగినది.

## స్థౌ

స్థౌపికము సం. వి. అ. న. బౌద్ధస్మృతి చిహ్నము.

స్థౌధికము సం. వి. అ. న. సామసంహితయందలి రెండవభాగము.

## స్త్యా

స్త్యానము సం విశే. (అ. ఆ. అ.) 1. ఘనీభవించినది. 2. సాంద్రమైనది. 3. మృదువైనది. 4. ధ్వనించునది. వి. అ. న. 1. ఆలస్యము. 2. ప్రతిధ్వని 3. ఘనీభావము. 4. అమృతము. 5. దళసరి.

స్త్యాయనము సం. వి. అ. న. 1. సంఘాతము. 2. ఘనీభవించుట.

## స్తై

స్త్యైనము సం వి. అ. పుం. అమృతము.

స్త్యైనుఁడు సం. వి. అ. పుం. దొంగ.

## స్త్రీ

స్త్రీ సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది.

కం. సాగరమున బడి దుఃఖ, ప్రాగల్భ్యము వెలయ వెతలఁబడు దేహిగతిన్. స్త్రీగర్భగహ్వర జలములఁ, దోఁగుచుఁ దేలుచును శిశువు దుఃఖమునొందున్. శివధ. 5. 20.

2. భార్య. 3. చెద. 4. ప్రియంగులత. 5. ఆఁడు జంతువు.

స్త్రీకరణము సం. వి. అ. న. రతి సంబంధము.

స్త్రీకార్యము సం. వి. అ. న. 1. ఆఁడువారి వ్యాపారము, 2. స్త్రీలకుఁగాని స్త్రీలుండునంతఃపురమునకుఁగాని కావలియుండుట.

స్త్రీకితవుఁడు సం. వి. అ. పుం. 1. స్త్రీలను మోసగించువాఁడు.

స్త్రీకుసుమము సం. వి. అ. న. 1. ఋతుస్రావము 2. స్త్రీకృతము. 3. రతిబంధము

స్త్రీకేసరము సం. వి. అ. పుం. అండకోశము.

స్త్రీకోశము సం. వి. అ. పుం. ఖడ్గము.

స్త్రీక్షీరము సం. వి. అ. న. తల్లి పాలు.

స్త్రీగవి సం. వి. ఈ స్త్రీ. పాలిచ్చునావు.

స్త్రీగృహము సం. వి. అ న. 1, స్త్రీల నివాసము. 2. అంతఃపురము.

స్త్రీగ్రాహి సం. వి. న్. పుం. స్త్రీలరక్షకత్వము నంగీకరించువాఁడు.

స్త్రీఘోషము సం. వి. అ. పుం. వేకువ, ప్రాతఃకాలము.

స్త్రీచిహ్నము సం. వి. అ. న. 1. ఆఁడుదనమును సూచించు గుర్తు. 2. యోని.

స్త్రీజనని సం వి. ఈ. స్త్రీ. ఆఁడుసంతానమునే కనునట్టి స్త్రీ.

స్త్రీజితుఁడు సం. వి. అ. పుం. ఆఁడుదానికి లోఁబడి యుండుమగఁడు.

స్త్రీతమ = స్త్రీతర సం. వి. అ. స్త్రీ. సంపూర్ణ లక్షణములు గలయాడుది

స్త్రీదేహార్థుడు సం. వి. అ. పుం. శివుడు.

స్త్రీధనము సం వి అ. న. స్త్రీకిఁ దల్లిదండ్రులు సోదరులు మున్నగువారి వలన లభించుసొత్తు. (1. అధ్యగ్ని 2. అధ్యావాహనికము 3 ప్రీతికర్మద త్తము 4 భ్రాతృ,మాతృ పితృప్రాప్తములు, అని స్త్రీధనము ఆఱు విధములు)

స్త్రీధర్మము సం వి. అ. పుం. 1. ఆఁడుది లేక భార్య నిర్వహింపవలసిన విధి 2. స్త్రీలకు సంబంధించిన ధర్మదత్తము. 3. ముట్టు. 4. సంభోగము

స్త్రీధర్మిణి సం. వి ఈ. స్త్రీ. 1. ముట్టుది. 2 స్త్రీమదము

స్త్రీధ్వజము సం వి అ పుం 1. ఆఁడుజంతువు 2 ఏనుఁగు.

స్త్రీనాథుడు సం. వి. అ. పుం. ఆఁడుదానిచేఁ బోషింపఁబడనవాఁడు.

స్త్రీనిబంధనము సం. వి. అ. న. 1, గృహిణీత్వము. 2. గృహధర్మము.

స్త్రీపణ్యోపజీవి సం. వి. న్. పుం. 1. ప్ర్యాజీవుఁడు. 2. భార్యవలన జీవించువాఁడు.

స్త్రీపరుఁడు సం. వి. అ. పుం. కాముకుఁడు.

స్త్రీపర్వము సం. వి. న్. న. మహాభారతమున నొక పర్వము

స్త్రీపుంసయోగము సం. వి. అ. పుం. 1. పదునెనిమిది వ్యవహార పదములలో నొకటి. 2. స్త్రీ పురుషుల కలయిక.

స్త్రీపుంసలక్షణ సం. వి. అ. స్త్రీ. స్త్రీ పురుష స్వభావ చేష్టలు రెండును గలిగిన జంతువు, లేక వృక్షము.

స్త్రీపుంధర్మము సం. వి. అ. పుం. స్త్రీ పురుషుల ధర్మ ములను నియమించు శాస్త్రము.

స్త్రీపురము సం. వి. అ. న. ఆఁడువారుండు గృహ భాగము.

స్త్రీపుష్పము సం. వి. అ. న. = స్త్రీకుసుమము.

స్త్రీపూర్వుఁడు సం. వి. అ. పుం. స్త్రీజితుఁడు

స్త్రీప్రత్యయము సం. వి. అ. పుం. స్త్రీలింగమును సూచించు ప్రత్యయము

స్త్రీప్రసంగము సం. వి. అ. పుం. స్త్రీలతోడి యధిక సంపర్కము

స్త్రీప్రసువు సం. వి. ఉ. స్త్రీ. స్త్రీజనని.

స్త్రీప్రియము సం. విణ. (అ. ఆ. అ.) స్త్రీలకు ప్రియ మైనది. వి. అ. పుం. మామిడి చెట్టు

స్త్రీబంధము సం. వి. అ. పుం. రతిక్రీడ.

స్త్రీబాధ్యుఁడు సం. వి. అ. పుం. ఆఁడుదానిచే బాధింప బడుటకు లోబడియుండువాఁడు.

స్త్రీభాషి సం. వి. న్. పుం. ఆఁడంగివాఁడు, స్త్రీవలె మాటాడువాఁడు, (ఆ ప్ర.ని.)

స్త్రీభూషణము సం. వి. అ. న. మొగలిపూవు.

స్త్రీముఖపము సం. వి. అ. పుం. అశోకవృక్షము.

స్త్రీరంజనము సం. వి. అ. న. తములపాకు.

స్త్రీరత్నము సం. వి. అ. న. 1. నారీతిలకము. 2. లక్ష్మి.

స్త్రీరాగము సం. వి. అ. పుం. దేశాక్షి, దేవగాంధారి మొదలగు రాగము. (పురుషరాగము కానిది.)

స్త్రీలింగము సం. వి. అ. న. 1. మూఁడు లింగములలో నొకటి. 2. స్త్రీత్వమును సూచించు గుర్తు (కుచాది) 3. ఆఁడుగుఱి.

స్త్రీవాసము సం. వి. అ. పుం. పుట్ట.

స్త్రీవిషయము సం. వి. అ. పుం. రతిక్రీడ.

స్త్రీవ్రణము సం. వి. అ. పుం. ఆఁడుగుఱి.

స్త్రీసంస్థానము సం. విణ. (అ. ఆ. అ.) ఆఁడుదాని యాకృతికలది. (స్త్రీసంస్థానం చాప్సర స్తీర్థ మారాత్ .... శాకుంతలమ్ 5 అం.)

స్త్రీసంగ్రహణము సం. వి. అ. న. 1. అనుచితముగా స్త్రీని కౌఁగిలించుకొనుట. 2. వ్యభిచారము.

స్త్రీసంబంధము సం. వి. అ. పుం. వివాహము వలని చుట్టరికము.

స్త్రీసేవ సం. వి. అ. స్త్రీ. ఆఁడుదాని యెడ రక్తిగాని భక్తిగాని కలిగియుండుట.

స్త్రీస్వభావుఁడు సం. వి. అ. పుం. నపుంసకుఁడు.

స్త్రీహరణము సం. వి. అ. న. బలవంతముగా స్త్రీని తెచ్చుట.

స్త్రీహారి సం. వి. న్. పుం. స్త్రీలను తెచ్చువాఁడు లేక హరించువాఁడు.

## స్త్రై

స్త్రైణము సం. విణ. (అ. ఆ. అ.) 1. స్త్రీనిబంధమై నది. 2. స్త్రీతత్పరమైనది. వి. అ. న. 1. స్త్రీత్వము. 2. స్త్రీభావము. 3. స్త్రీల సమూ హము.

## స్థ

స్థండిలము సం. వి. అ. న. 1. వ్రతదీక్షఁబూనినవారు పడుకొనుటకుగాను దర్భాదులచే సంస్కరింపఁబడిన

భూమి. 2. యజ్ఞహోత్రము కొఱకై [illegible] 3 పఱచినచోటు 4. పొత్తు 5. సంస్కారము చేయఁబడిన నేల 6. ఉపవేద్రము 7. సరిహద్దు 8. ఇంటి ముందుండు స్థలము.

స్థండిలసీతికము నం. వి. అ. న. 1. ఉదక. 2. వేదిక.

స్థండిలుఁడు నం. వి. అ. పుం. ప్రతిదినము భూమిపై పండుకొనువాఁడు, స్థండిలశాయి.

స్థండిలశాయి నం. వి. న్. పుం = స్థండిలుఁడు.

స్థండిలేశయుఁడు నం. వి. అ. పుం = స్థండిలుఁడు.

స్థపిరము నం. వి. అ. న. పోఁక. (వ్యా. వి.).

స్థగణ నం. వి. అ. స్త్రీ. భూమి

స్థగనము నం. వి. అ. న. 1. అచ్ఛాదనము, కప్పు, 2. మఱుఁగు.

స్థగము నం. విశే. (అ. ఆ. అ.) 1. వంచనశీలమైనది 2. విడువఁబడినది. 3. అత్యభావముతో గూడినది.

స్థగరము నం. వి. అ. పుం. పుత్రజీవకమను వృక్ష విశేషము.

స్థగి నం. వి. ఈ. స్త్రీ. తములపాకుల పెట్టె.

స్థగిక నం. వి. ఆ. స్త్రీ. 1. వేశ్య. 2. ఒకవిధమైన కట్టు. 3. తములపాకులు, పోకలునుంచెడి పెట్టె.

స్థగితము నం. విశే. (అ. ఆ. అ.) 1. అచ్ఛాదింపఁబడినది. 2. తాడనము చేయఁబడినది. 3. అడ్డఁబడినది 4. మూయఁబడినది.

స్థగుఁడు నం. వి. అ. పుం. మోసగాఁడు.

స్థగువు నం. వి. ఉ. పుం. 1. ఉబుకుట. 2 గూను.

స్థపతి నం. వి. ఇ. పుం. 1. శిల్పి. 2. బృహస్పతి సవనము చేసినవాఁడు 3 అంతఃపురమును గావలి కాయువాఁడు. 4 సారథి 5 వడ్రంగి. 6. కుబేరుఁడు. విశే. (ఇ. ఈ. ఇ.) శ్రేష్ఠము, ముఖ్యము.

స్థపత్యుఁడు నం. వి. అ. పుం. అంతఃపురోద్యోగి

స్థపుట నం. వి. ఆ. స్త్రీ. జాజి, (వ్యా. వి.).

స్థపుటగతము నం. విశే. (అ. ఆ. అ.) దుర్లభ స్థలము లలో నుండునది.

స్థపుటము నం. విశే. (అ. ఆ. అ.) 1. మిట్టపల్లమైనది 2. మధ్యానతము పార్శ్వోన్నతమునైనది. 3. క్లిష్ట పరిస్థితులలో నున్నది వి. అ. పుం. పై కుబికియుండుట.

స్థపుటితము నం. విశే. (అ. ఆ. అ.) స్థపుటమైనది; తాడనపడినది.

స్థపుటీకృతము నం. విశే. (అ. ఆ. అ.) విషయముగాఁ జేయఁబడినది.

స్థపుటుఁడు నం. వి. అ. పుం. కృత్రిముఁడు.

స్థము నం. విశే. (అ. ఆ. అ.) (సమాసాంతమున వాడఁబడును.) 1. నిలుచునది. 2. స్థావరమైనది. వి. అ. పుం. చోటు, స్థలము.

స్థల నం. వి. ఆ. స్త్రీ. కృత్రిమమైన నేల.

స్థలకమలము నం. వి. అ. న. మెట్టతామర.

స్థలకమదము నం. వి. అ. పుం. కరవీరపు మొక్క.

స్థలదేవత నం. వి. ఆ. స్త్రీ 1. స్థానికముగా నుండు దేవత. 2. గ్రామదేవత.

స్థలపద్మిని నం. వి. ఈ. స్త్రీ. 1. మెట్టతామర.

స్థలము నం. వి. అ. న, 1. చోటు. 2. మెట్టభూమి 3. జలశూన్యమై సహజముగాఁ జదరమైన నేల. 4. తీరము 5. దిబ్బ. 6. క్షేత్రము 7. చర్చనీయాంశము. 8. శిబిరము. 9. గ్రంథాదులందలి భాగము.

స్థలవర్త్మము నం. వి. న్. న. సముద్రతీర మార్గము

స్థలవిగ్రహము నం. వి. అ. పుం. సమభూమిపై జరుగు యుద్ధము.

స్థలశుద్ధి నం. వి. ఇ. స్త్రీ భూమిని శుద్ధిచేయుట.

స్థలసీమ నం. వి. న్. స్త్రీ పొలిమేర.

స్థలి నం. వి. ఈ. స్త్రీ. 1. సహజమైన స్థలము, 2. స్థలదేవత.

స్థలేశయము సం. విశ. (అ. ఆ. అ.) స్థలశాయి. వి. అ. పుం. స్థలజలములు రెండింటను జీవించు జంతువు.

స్థవి సం. వి. ఇ. పుం. 1. సాలెవాడు. 2. స్వర్గము. 3. చరవస్తువు. 4. అగ్ని.

స్థవిర. సం. వి. ఆ. స్త్రీ. ముసలిది.

స్థవిరుఁడు సం. విశ. (అ. ఆ. అ.) 1. స్థిరుఁడు. 2. చిరంజీవి. 3. వృద్ధుఁడు వి.అ పుం. 1. జైవాతృకుఁడు 2 శతాయుకుఁడు. 3. ముసలివాఁడు. 4. యాచకుఁడు.

స్థవిష్ఠము సం. విశ. (అ. ఆ. అ) 1. మిక్కిలి స్థూలము 2. గరిష్ఠము. 3. బలిష్ఠము

స్థవీయము సం. విశ. (స్, సీ, స్.) 1. స్థూలతరము.

## స్థా

స్థాండిలుఁడు సం వి. అ పుం. = స్థండిలుఁడు.

స్థాణవము సం. విశ. (అ ఈ. అ.) స్థాణువునకు సంబంధించినది.

స్థాణుకర్ణిక సం. వి. ఆ. స్త్రీ. విష్ణుక్రాంతము (వృ) వి.

స్థాణుప్రకీర్ణ సం. వి ఆ. స్త్రీ. అశ్వసంచార మార్గ విశేషము.

స్థాణువు సం విశ (ఉ ఉ. ఉ) స్థిరమైనది, కదలనిది వి ఉ. పుం 1. జీనకమను వానన ద్రవ్యము 2. ఈటె. 3. చెదలపుట్ట 4, శివుఁడు. 5. చిలుక కొయ్య. 6. శూలము 7. ధ్రువుఁడు. 8. ఆసన విశేషము

స్థాత సం విశ. (ఋ. త్రీ. ఋ.) 1. వర్తిష్ణువు, ఉండువాఁడు. వి. ఋ. పుం. 1. దారిచూపువాఁడు 2 చోదకుఁడు.

స్థాతవ్యము సం. విశ. (అ. ఆ. అ.) ఉండఁదగినది. వి. అ. న. ఆలస్యము.

స్థానకము సం వి. అ. న. 1. వాట్యభంగిమము. 2. స్థితి. 3. నాటకమునందలి సన్నివేశము, 4. నగరము. 5. నురుగు. 6. పళకత్రము. 7. తైత్తిరీయము నందలి యొక భాగము 8. నిలబడిన విగ్రహముతో నున్న దేవాలయము 9. వేపమున్నగు సమయమునందలి శరీర విన్యాసము 10. యుద్ధసమయమున దలి విలుకాని నిలువతీరు.

స్థానకుటికాసనము సం వి. అ. పుం. స్థావ గృహత్యాగము.

స్థానదీప్తము సం. విశ. (అ. ఆ. అ) సన్నివేశమును బట్టి అశుభమైనది.

స్థానపాలకుఁడు సం. వి. అ. పుం. 1. ఒకానొక యశ్వపాలకుఁడు. 2. కావలివాఁడు. 3. రక్షకభటుడు.

స్థానపిప్పటిక సం. వి. ఆ. స్త్రీ. దైనికాదాయవ్యయ పట్టిక.

స్థానభూమి సం. వి. ఇ. స్త్రీ. 1. వానప్రస్థము. 2. హర్మ్యము.

స్థానభ్రష్టుఁడు సం. విశ. (అ. ఆ. అ.) ఉద్యోగము నుండి తొలఁగింపబడినవాఁడు.

స్థానము సం. వి. అ. న. 1. చోటు 2. ఇల్లు, 3 ఉనికి 4. సామ్యము. 5. ఉచితము. 6. జీవించియుండుట. 7, త్రివర్గము నందొకటి (అనఁగా కృష్యాద్యష్ట వర్గమునందు శత్రువుతో సమముగా నుండుట శ. ర.)

8. విలుకాని యుద్ధమప్పటి నిలుచు తీరు. (ఇది పంచవిధము. ఆలీఢము, ప్రత్యాలీఢము, సమపదము, విశాఖము మండలము శ. ర.)

స్థానమృగము సం. వి. అ. పుం. 1. తాఁబేలు, మొసలి మున్నగు వాని వర్గమునకుఁ జెందిన జంతువు.

స్థానయోగము సం. వి. అ. పుం. ఉచిత స్థలముల నియమించుట.

స్థానాధికారము సం. వి. అ. పుం. కోవెలపారు పత్తెము.

స్థానాధ్యక్షుఁడు సం. వి. అ. పుం. 1. స్థానికపాలకుఁడు. కావలివాఁడు. 3. రక్షకభటోద్యోగి.

స్థానాపతి సం. వి. ఇ. పుం. 1. మధ్యవర్తి. 2. దూత.

స్థానాపత్యయోగము సం. వి. అ. పుం. తంత్ర విశేషము.

**స్థానాసేధము** సం. వి. అ. పుం. నిర్బంధము.

**స్థాని** సం. విణ. (న్. నీ. న్.) స్థానముకలది. 2. స్థిరమైనది. 3. ఆదేశముకలది వి. న్. పుం. 1. ఆదేశమునకుఁ బూర్వరూపము. 2. ఆదేశము.

**స్థానికము** సం. విణ. (అ. ఈ. అ.) స్థానమునకు సంబంధించినది.

**స్థానికుఁడు** సం. వి. అ. పుం. 1. స్థానాధ్యక్షుఁడు. 2. గుడిపారుపత్తెము చేయువాఁడు. 3. ఆప్రదేశమున నుండువాఁడు.

**స్థానీయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్థానికము. 2. స్థానమునకుఁదగినది. వి. అ. న. 1. నగరము 2. రాజధాని. 3. ఎనిమిది వందల గ్రామములను రక్షించుట కేర్పడినకోట.

**స్థానేపతితుఁడు** సం. వి. అ. పుం. అన్యుని స్థానము నాక్రమించువాఁడు.

**స్థాపకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిలబెట్టునది. 2. స్థిరపఱుచునది.

**స్థాపకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.), 1. స్థాపించువాఁడు 2. సూత్రధారుఁడు. 3. దేవాలయమును గాని విగ్రహమును గాని ప్రతిష్ఠించువాఁడు (ధనాదులను) నిక్షేపించువాఁడు.

**స్థాపత్యుఁడు** సం. వి. అ. పుం. హెగ్గడికాఁడు, అంతఃపురము నందలి కావలివాఁడు.

**స్థాపత్యము** సం. వి. అ. న. స్థపతి యొక్క కర్మము.

**స్థాపన** సం. వి. ఆ. స్త్రీ. 1. స్థిరపఱుచుట. 2. సూత్రధారకర్మము 3. ప్రస్తావన. 4. నిలువయుంచుట.

**స్థాపనము** సం. వి. అ. న. 1. స్థాపించుట. 2. మోపుట. 3. సమాధి. 4. గర్భవతులకుఁ జేయు నొక సంస్కారము.

**స్థాపనప్రవృత్తుఁడు** సం. వి. అ. పుం. మరల బలము చేకూరుట కవకాశము లేనివాఁడు.

**స్థాపని** సం. వి. ఈ. స్త్రీ. 1. చిఱుబొద్దిచెట్టు. 2. అగురుసొంటి.

**స్థాపనీయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్థిరము చేయఁదగినది. 2. బలవర్ధకౌషధములచేఁ జికిత్స చేయఁదగినది.

**స్థాపయిత** సం. వి. ఋ. పుం. స్థాపించువాఁడు.

**స్థాపించు** సం. స. క్రి. స్థాపనముచేయు, నిలుపు.

**స్థాపితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిలుపఁబడినది. 2. నిశ్చయింపఁబడినది. 3. రూఢముచేయఁబడినది. 4. నియమింపఁబడినది. 5. నియోగింపఁబడినది. 6. పరిణీతము. 7. దృఢమైనది. 8. నిశ్చలమైనది.

**స్థాప్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్థాపింపఁదగినది. 2. నియోగింపఁదగినది. 3. నిర్బంధింపఁదగినది. 4. (దుఃఖాదులకు) పాల్పఱుపఁదగినది. వి. అ. న. ధరావత్తు, కుదువ. పుం. దేవతా విగ్రహము.

**స్థామము** సం. వి. న్. న. 1. దేహదార్ఢ్యము, బలము. 2. గుఱ్ఱపు సకిలింపు. 3. స్థిరత్వము. 4. స్థానము.

**స్థామనము** సం. వి. న్. న. శరీరము. (వాచ.)

**స్థాయ** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**స్థాయము** సం. వి. అ. పుం. పాత్రము.

**స్థాయి** సం. విణ. (న్. నీ. న్.) 1. కదలనిది, స్థిరమైనది. 2. నివసించునది 3. మారనిది వి. న్. పుం. స్థిరమైన భావము (రత్యాదిస్థాయిభావము) న్. న. స్థిరమైన స్థితి.

**స్థాయికుఁడు** సం. వి. అ. పుం. అధికారి.

**స్థాయిభావము** సం. వి. అ. పుం. సజాతీయ విజాతీయ భావములచేతఁ దిరస్కరింపఁబడక రససిద్ధిపర్యంతము నిలిచియుండు భావము. (ఈ భావములు తొమ్మిది - రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము)

**స్థాయుకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్థిరమైనది 2. ఒకచోట నుంచఁబడినది.

**స్థాయుకుఁడు** సం. వి. అ. పుం. గ్రామాధికారి.

**స్థాలము** సం. వి. అ. న. 1. కంచము, భోజనపాత్రము. 2. కలిగొట్టుచెట్టు. (వృ. వి.).

**స్థాలి** సం. వి. ఈ. స్త్రీ. 1. వంటపాత్రము, లోవి. (శ. ర.) 2. కలిగొట్టుచెట్టు. (వృ. వి.).

స్థాలిక నం. వి. ఆ. స్త్రీ. స్థాలము.

స్థాలిపాకము నం. వి. అ. పుం. 1. పాకయజ్ఞ విశేషము. 2. వివాహ కాలమున దంపతులచేఁ జేయబడునొక కర్మము.

స్థాలీపులాకము నం. వి. అ. పుం. వంటగిన్నె యందలి యన్నపు మెతుకు.

స్థాలీబిలము నం. వి. అ. న. నీళ్లుకాచు బానయందలి లోపలి భాగము.

స్థాలీబిలీయ(ల్య)ము నం. విశే. (అ. ఆ. అ.) వండుటకు యోగ్యమైనది.

స్థావరము నం. విశే. (అ. ఆ. అ.) 1. స్థిరమైనది, కదలనిది. 2. జడమైనది. 3. సుస్థాపితమైనది. వి. అ. పుం. 1. స్థిరమైనయాస్తి. 2. స్థూల శరీరము. న. 1 కులధనము. 2. వింటినారి 3. వింటినారిని చెవిదాక లాగుట. 4. జడపదార్థము. 5. తోలునారి.

స్థావరాది నం. వి. ఇ. న. ఒకవిధమైన విషము.

స్థావిరము నం. వి. అ. న. ముసలితనము.

స్థాసకము నం. వి. అ. పుం. 1. చేతనిడినకుంకుమ. 2. కుంకుమ మొదలగువానిపూఁత. 3. నీటిబుగ్గ. 4. తిలకము. 5. వాసనద్రవ్యములచేత శరీరమును సువాసితము కావించుట 6. నీటిబుగ్గవంటి యశ్వాలంకారము.

స్థాసువు నం. వి. ఉ. న. దేహబలము.

స్థాస్నువు నం. విశే. (ఉ. ఉ. ఉ.) బహుకాలముండునది, స్థిరమైనది. వి. ఉ. పుం. చెట్టు.

## స్థి

స్థిక(క్క)ము నం. వి. అ. పుం. పిఱుఁదు.

స్థితకరణము నం. వి. అ. న. రతిబంధ విశేషము.

స్థితధీ నం. వి. ఈ. పుం. స్థిరమనస్కుఁడు, ప్రశాంతచిత్తుఁడు.

స్థితపాఠ్యము నం. వి. అ. న. నిలబడి స్త్రీకావించు ప్రాకృత పద్య పఠనము.

స్థితప్రజ్ఞుఁడు నం. వి. అ. పుం. 1. సర్వకామములను విడిచి ఆత్మసంతుష్టుఁడైనవాఁడు. 2. ఏవిధమైన భ్రాంతియు లేనివాఁడు.

స్థితము నం. విశే. (అ. ఆ. అ.) 1. ఉన్నది. 2. నిలిచియున్నది. 3. నిశ్చయింపఁబడినది. 4. ప్రతిజ్ఞ చేయఁబడినది. 5. నిశ్చలమైనది. వి. అ. న. 1. రతివిశేషము. 2 నిశ్చలముగానుండుట. 3. నిలఁబడువిధము. 4. సన్మార్గమునందలి పట్టుదల.

స్థితి నం. వి. ఇ. స్త్రీ. 1. ఉనికి. 2. కూర్చుండుట. 3. మర్యాద. 4. బ్రతుకు. 5. సృష్టిస్థితిలయములలో రెండవది. 6. పొలిమేర. 7. నిలకడ. 8. పరిపాలన 9. పరిస్థితి. 10. స్వభావము 11. సత్త్వ వర్తనము. 12. ఔచిత్యము 13. ఉదాత్తత్వము. 14. పదవి. 15. సంక్షేమము 16 నియమము. 17. నిశ్చయము. 18. సీమ. 19 గ్రహణముండు కాలము.

స్థితిజ్ఞుఁడు నం. వి. అ. పుం. నీతినియమముల నెఱుఁగువాఁడు.

స్థితిపదము నం. వి. అ. న. సన్మార్గము.

స్థితిపదుఁడు నం. వి. అ. పుం. విష్ణువు.

స్థితిభిదుఁడు నం. వి. ద్. పుం. నీతినియమములనుల్లంఘించువాఁడు.

స్థితిమంతము నం. విశే. (త్. తీ. త్.) 1 స్థిరత్వము కలిగినది. 2. శాశ్వతమైనది. 3. మర్యాదకలది.

స్థితిస్థాపకము నం. విశే. (అ. ఆ. అ.) పూర్వస్థితిని గలిగించుశక్తిగలది. వి. అ. న. మఱలఁ బూర్వస్థితికి వచ్చు సామర్థ్యము.

స్థిర నం. వి. ఆ. స్త్రీ. 1. భూమి. 2. బూరుగుచెట్టు. 3 ముయ్యాకుపొన్న. 4. స్థిరచిత్తముగల స్త్రీ.

స్థిరకుసుమము నం. వి. అ. పుం. పొగడచెట్టు... 

స్థిరగంధ నం. వి. ఆ. స్త్రీ. 1. మొగలిచెట్టు. 2. పాటలీపుష్పము.

స్థిరగంధము నం. వి. అ. పుం. చంపకము.

స్థిరగతి నం. వి. ఇ. పుం. శనిగ్రహము.

స్థిరచక్రుఁడు నం. వి. అ. పుం. పూర్వుఁడైన బుద్ధుఁడు.

స్థిరచ్ఛదము నం. వి. అ. పుం. 1. కొండరావిచెట్టు వంటి యొకచెట్టు.

స్థిరచ్ఛాయము నం. వి. అ. పుం. 1. వమేరువు. 2. బాటసారులకు నీడనిచ్చు చెట్టు. 3. చెట్టు.

స్థిరజీవిత నం. వి. ఆ స్త్రీ 1. బూరుగుచెట్టు.

స్థిరతరము నం. విశ. (అ. ఆ. అ.) 1. బహుకాల ముండునది. వి. అ. పుం. 1. పరబ్రహ్మము.

స్థిరదంష్ట్రము నం. వి. అ. పుం. 1. పాము. 2. ఆదివ రాహము. 3. ధ్వని.

స్థిరపడు మి. అ. క్రి. 1. పాదుకొను, 2. నిలుఁవద్రొక్కుకొను.

స్థిరపత్రము. నం. వి. అ. పుం. 1. బుంద నేలలందు మొలచు ఈతచెట్టు.

స్థిరపఱచు మి. న. క్రి. నిశ్చయముచేయు. (వ్యవ. ఈ సంబంధము స్థిరపఱిచితిమి.)

స్థిరపుష్పము నం. వి అ. పుం. 1. చంపక వృక్షము. 2. వకుళ వృక్షము

స్థిరమగు మి. అ. క్రి. 1 నిశ్చయమగు.

స్థిరము నం. విశ. (అ. ఆ. అ.) 1. నిలుకడయైనది 2. కదలనిది. 3. శాశ్వతమైనది. 4 శాంతమైనది. 5. ప్రసన్నమైనది. 6 నిశ్చలవర్తనము కలది. 7. నిశ్చితమైనది. 8. కఠినమైనది. 9. బలమైనది. 10 కఠినహృదయముగలది. వి. అ.పుం. 1. కొండ. 2 చెట్టు. 3. పరుష సదేతరమైనహల్లు. 4. ఎద్దు. 5. మోక్షము న. స్థిరత్వము; మొండితనము.

స్థిరయోని నం. వి అ. పుం. 1. నీడనిచ్చుచెట్టు

స్థిరయౌవనము నం. విశ. (అ. ఆ. అ.) 1. నిత్య తారుణ్యముకలది వి. అ. పుం 1 దేవయోని విశేషము.

స్థిరరంగ నం వి. అ. స్త్రీ. 1. నీలిమందు.

స్థిరవాక్కు నం. విశ (చ్. చ్. చ్.) 1 విశ్వాసింపదగిన పలుకులుగలది.

స్థిరవారము నం వి అ. పుం. 1. శనివారము.

స్థిరసంగరుఁడు నం. వి. అ. పుం. 1. వాగ్దానమును నిలుపువాఁడు, సత్యసంధుఁడు.

స్థిరాంఘ్రిపము నం. వి అ. పుం. 1. స్థిరపత్రము. (వృక్షవిశేషము)

స్థిరాయువు నం. వి. స్ పుం. 1. బూరుగుచెట్టు విశ. (స్. స్. స్.) 1. చిరకాలము జీవించువాఁడు.

స్థిరీకరణము నం వి. అ న. 1. దృఢపఱుచుట.

స్థిరీకారము నం. వి. అ పుం. 1. స్థిరీకరణము

స్థిరుఁడు నం. వి. అ. పుం 1. శని 2. రాహువు 3 శాశ్వతుఁడు. 4. చపలత్వము లేనివాఁడు. 5. కార్తికేయుఁడు, 6. దైవము.

## స్థు

స్థురి నం. వి. న్. పుం. మోసెడి గుఱ్ఱము లేక ఎద్దు.

## స్థూ

స్థూణ నం. వి. ఆ. స్త్రీ. 1. వెండి ఇనుము మొదలగు లోహములచే చేయఁబడిన విగ్రహము. 2. (ఇట్టి) కంబము. 3. దాగలి.

స్థూణకర్ణము నం వి అ. పుం. 1 ఒకవిధమైన వ్యూహ విశేషము. 2. రుద్రుని రూపములలో నొకటి.

స్థూమము నం. వి అ. పుం వెలుతురు.

స్థూముఁడు నం వి. అ పుం. చంద్రుఁడు.

స్థూరము నం వి అ. పుం. ఎద్దు.

స్థూరి నం. వి న్. పుం. బరువును మోసెడి గుఱ్ఱము లేక ఎద్దు. స్థురి.

స్థూరీపృష్ఠము నం వి. అ. పుం స్వారి చేయుట కుప యోగింపని గుఱ్ఱము.

స్థూరుఁడు నం వి అ పుం మనుష్యుఁడు.

స్థూల నం. వి అ. స్త్రీ పెద్ద యేలకి.

స్థూలకంటకము నం. వి అ. పుం. ములుగోలిమిడి, మొగబీఱ. (వృ. వి)

స్థూలకంటకిక నం. వి. అ. స్త్రీ బూరుగు చెట్టు.

స్థూలకంఠ నం. వి. అ స్త్రీ. ఒక విధమైన వంగచెట్టు. (వృ. వి.).

స్థూలకందము నం. వి. అ. పుం. తినుటకు యోగ్యమైన దుంప, ఎఱ్ఱయులి.

స్థూలకము నం. విశే. (అ. ఆ. అ.). 1. పెద్దది 2. లావైనది. వి. పుం. తృణవిశేషము, ఱెల్లు.

స్థూలజీదము నం. వి. అ. పుం. ఉమ్మి. శ్వేదము.

స్థూలచాపము నం. వి. అ. పుం. ప్రత్తిని శుభ్రపఱుచుటకుపయోగించు వింటి వంటి సాధనము.

స్థూలతాలము నం. వి. అ. పుం. హింతాలము. (వృ. వి.)

స్థూలనాలము నం. వి. అ. పుం. లావైన ఱెల్లు.

స్థూలనాసము నం. విశే. (అ. ఆ. అ.) పెద్ద ముక్కుగలది. వి. అ. పుం. పంది.

స్థూలనీలము నం. వి. అ. పుం. డేగ.

స్థూలపట్టము నం. వి. అ. పుం. ప్రత్తి.

స్థూలపట్టాకము నం. వి. అ. పుం. ముతుకు గుడ్డ. స్థూలపటము.

స్థూలపదము నం. వి. అ. పుం. ఏనుగు.

స్థూలపదుఁడు నం. వి. అ. పుం. ఏనుఁగు కాలు గలవాఁడు.

స్థూలపుష్పి నం. వి. ఈ. స్త్రీ. విష్ణుక్రాంత. (వృ. వి.)

స్థూలప్రపంచము నం. వి. అ. పుం. వాస్తవ జగత్తు.

స్థూలఫలము నం. వి. అ. పుం. బూరుగుచెట్టు.

స్థూలమధ్వ నం. వి. ఆ. స్త్రీ. యవధాన్యము.

స్థూలము నం. విశే. (అ. ఆ. అ.) 1. శక్తిమంతమైనది. 2. దట్టమైనది. 3. ముతుకయైనది. 4. మూర్ఖమైనది. 5. మొండిది. 6. సూక్ష్మము కానిది. 7. లావైనది. 8. తెలివి లేనిది. 9. బలిసినది. వి. అ. న. 1. గుడారము 2. పర్వత శిఖరము. 3. ఫలిసిన పాలు లేక పెరుగు పుం. పనసచెట్టు.

స్థూలమూలము నం. వి. అ. న. ఒక విధమైన ముల్లంగి.

స్థూలలక్షుడు నం. వి. అ. పుం. 1. వదాన్యుఁడు. 2. బుద్ధిమంతుఁడు. 3. మేలుకీళ్ళను స్మరించువాఁడు. 4. అశ్రద్ధగా గుఱి చూచువాఁడు.

స్థూలవల్కలము నం. వి. అ. పుం. ఎఱ్ఱ లొద్దుగు చెట్టు.

స్థూలవిషయము నం. వి. అ. పుం. లౌకిక వస్తువు.

స్థూలశరీరము నం. వి. అ. న. వాస్తవ దేహము. నశ్వర శరీరము.

స్థూలశాటకము నం. వి. అ. పుం. న. 1. దుప్పటి. 2. ముతుకు వస్త్రము.

స్థూలశీర్షిక నం. వి. ఆ. స్త్రీ. పెద్ద తల గల చిన్న చీమ.

స్థూలస్కంధము నం. వి. అ. పుం. లకుచ వృక్షము.

స్థూలహస్తము నం. వి. అ. పుం. 1. ఏనుగుతొండము. 2. మొద్దు చేయి.

స్థూలి నం. వి. న్. పుం. ఒంటె.

స్థూలించు నం. అ. క్రి. ఒడలు చేయు. బలియు.

స్థూలోచ్ఛ్రయము నం. వి. అ. పుం. 1. పర్వతము నుండి పడిన పెద్ద ఱాయి 2. మొటిమ, లోపము 3. అసాకల్యము, లోపము. 4 లఘు తీవ్రమును నిటు మందమును గాని యేనుఁగుల గమన విశేషము.

# స్థై

స్థైపము నం. వి. అ. పుం. పెండపిట్ట.

స్థైమము నం. వి. న్. పుం. స్థిరత్వము.

ఉ. .. శుంభదిలాతలాభ్యుదయసాధన, స్థైమము వప్రతరిక్యాగుణసీమ యనైన మదీయ వాక్యకన్యామణి....ఖం. 1.19. వి. న్. న. దార్ఢ్యము.

శా....వచ్చెం గుంతీసుతవంధ్యము ఘుమ స్థైమాభిరామంబుగన్. భార. విరా. 4.95

స్థేయము నం. విశే. (అ. ఆ. అ.) 1. స్థిరముచేయఁదగినది. 2. నిశ్చయింపఁ దగినది. (న్. నీ. న్.) మిక్కిలి స్థిరమైనది. స్థిరతరము

స్థేయుఁడు నం. వి. అ. పుం. 1. కులబ్రాహ్మణుఁడు 2. గురువు 3. బ్రహ్మ. 4. తీర్పరి, మధ్యవర్తి.

స్థేషము నం. విశే. (అ. ఆ. అ.). స్థిరతమము.

## స్థై

స్థైర్యజము నం. విశే. (అ. ఆ. అ.) స్థావరము.

స్థైర్యము నం. వి. అ. న. 1 స్థిరత్వము; మనోనిశ్చయము. 2. ఓర్పు. 3. కాఠిన్యము. 4 జితేంద్రియత్వము. పుం. జాపత్రి.

## స్థౌ

స్థౌణేయము నం. వి. అ. పుం. 1. గండివనపుచెట్టు. 2. మాచిపత్రి. 3. గంధద్రవ్యవిశేషము.

స్థౌరము నం. వి అ న. 1. గుఱ్ఱముగాని గాడిద గాని వీపున మోయఁదగినబరువు. 2. బలము 3. స్థిరత్వము.

స్థౌరి నం. వి. న్. పుం. స్థూరి, బరువుమోసెడి గుఱ్ఱము లేక ఎద్దు (రూ) స్థౌరి.

స్థౌలలక్ష్యము నం. వి. అ. న. ఔదార్యము, బహుప్రదత్వము.

స్థౌలి —స్థౌరి.

స్థౌల్యము నం. వి అ. న. 1 స్థూలభావము, లావు, 2. బుద్ధిమాంద్యము

## స్న

స్నపనము నం. వి. అ. న. 1, నది మొదలగువానిలో మునిఁగిచేయు స్నానము. 2. కడుగుట.

స్నపితము నం. విశే. (అ. ఆ. అ.). 1. స్నానము చేసినది. 2. కడుగఁబడినది.

స్నయము నం వి. అ. పుం. 1. స్నానము. 2. ప్రోక్షణము.

స్నవము నం. వి. అ. పుం. 1, కాఱుట. 2. కురియుట. 3. స్రవణము.

స్నస నం వి ఆ. స్త్రీ. 1. సన్నపునరము, సిర. 2. కండరము.

## స్నా

స్నాత నం. వి. ఆ. స్త్రీ. ఋతుస్నానముచేసినస్త్రీ.

స్నాతకవ్రతము నం. వి. అ. న. వివాహామునకు ముందు బ్రహ్మచారి విషయమున జరుపఁబడు వ్రతవిశేషము. (స్నాతకమని వ్యవహారము.)

సీ. స్వాధ్యాయ మఖలంబు నభ్యసించియును గుర్వనుమతి స్నాతకవ్రతమొనర్చి. నూత, 2. అ 115 పా.

స్నాతకుఁడు నం వి. అ. పుం. 1. స్నానశీలవ్రతుఁడు (శ.ర) క. గురుపూజచేసి వీడ్కొని, యరిగి సమావర్తనార్హుఁడై స్నానంబున్. బొరినొనరిచి వేల్చినయ, వ్వరుషుడు నా స్నాతకాఖ్యపూని చరించున్. విజ్ఞా కాం. 1.60. 2. బ్రహ్మచర్యాశ్రమము ముగించినపిదప స్నానవ్రత మాచరించిన బ్రాహ్మణుఁడు. 3. ఏదేని మతప్రయోజనమునకై భిక్షుకవ్రత మాచరించు బ్రాహ్మణుఁడు. 4. గృహస్థాశ్రమము స్వీకరించిన ద్విజుఁడు. 5. వేదాధ్యయనానంతఁము ఆశ్రమాంతరమునకుఁబోక వ్రతయుక్తుడై తీర్థ స్నానశీలుడైన బ్రహ్మచారి.

మత్త. స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్, భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు .... భార. సభా. 2. 4.

స్నాతము నం. విశే. (అ. ఆ. అ.). స్నానము చేసినది.

స్నాతుఁడు నం. వి. అ. పుం. 1. స్నానముచేసినవాఁడు. 2, అధ్యయనము పూర్తికావించినవాఁడు.

స్నాత్రము నం. వి. అ. న. స్నానము.

స్నానతీర్థము నం. వి. అ. న. పవిత్రమైనస్నానఘట్టము.

స్నానతృణము నం. వి. అ. న. దర్భ.

స్నానము నం. వి. అ. న. 1. నీరుపోసికొనుట.

2. నీటిలో మునుఁగుట. 3. స్నానయోగ్యమైన జలము. 4. నలుగుపిండి. 5. విగ్రహములను స్నానము చేయించుట. 6. క్షాళనముచేయుట.

స్నానయాత్ర సం. వి. ఆ. స్త్రీ. జ్యేష్ఠపూర్ణిమ నాఁడు జరుగునుత్సవము.

స్నానవిధి సం. వి. ఇ. పుం. 1. స్నానక్రియ. 2. స్నానముచేయుటకు యోగ్యమైనవిధానము.

స్నానీయము సం. విణ. (అ ఆ అ.). స్నానము చేయుటకుఁదగినది; స్నానముచేయునపుడు ధరించు నది. వి. అ. న. 1. నలుగుపిండి మొ॥.

2. స్నానయోగ్యమైనజలము.

స్నాపకుఁడు సం. వి. అ. పుం. స్నానముచేయించు వాఁడు.

స్నాపనము సం. వి. అ. న. స్నానముచేయించుట.

స్నాపితము సం. విణ. (అ. ఆ. అ.). స్నానము చేయింపఁబడినది.

స్నాయుకము సం. వి. అ. పుం. స్నాయువు.

స్నాయుబంధము సం. వి. అ. పుం. వింటినారి.

స్నాయువు సం. వి. ఉ. పుం. 1. స్నస, సన్ననరము. 2. వింటినారి.

స్నాయుస్పందనము సం. వి. అ. న. నాడి.

స్నాయ్వర్మము సం. వి. న్. న. ఒకవిధమైన కంటిజబ్బు.

స్నావము సం. వి. అ పుం. 1. సన్నపునరము. కండరము.

స్నావిరము సం. విణ. (అ. ఆ. అ. కండరములతోఁ గూడినది.

## స్ని

స్నిగ్ధ(ము) సం. వి. ఆ. స్త్రీ. మజ్జ. అ. న. 1 నూనె. 2 మైనము. 3. కాంతి. 4. చిక్కఁదనము. 5. పునుఁగు. పుం ఎఱ్ఱయాముదపుచెట్టు.

స్నిగ్ధతండులము సం. వి. అ. పుం. త్వరలోఁ బంటకు వచ్చు నొకవిధమైన వరిధాన్యము.

స్నిగ్ధపత్ర(ము) సం. వి. ఆ. స్త్రీ అ. పుం. రేఁగుచెట్టు (వ. వి )

స్నిగ్ధపల్లవము సం. వి. అ. పుం. నీరు నేరేడు.

స్నిగ్ధఫల సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన మొక్క (ముంగూసబేల్) (వృ. వి )

స్నిగ్ధము సం. విణ. (అ. ఆ. అ.). 1. స్నేహము గలది. 2. చిక్కనగలది 3. నునుపుగలది. 4.చేమురుగలది. 5. అంటుకొను స్వభావము గలది. 6. ఉజ్జ్వలమైనది. 7. చల్లనిది, తడితోఁగూడినది. 8. దయతోఁ గూడినది, 9. అందమైనది, 10. స్థిరమైనది.

స్నిగ్ధవృంత సం. వి. ఆ. స్త్రీ. కమ్మెరాకుతీఁగె (వృ. వి.)

స్నిగ్ధవృక్షము సం. వి. అ. పుం. వల్లమామిడి.

స్నిగ్ధుఁడు సం. వి. అ పుం. స్నేహితుఁడు.

## స్ను

స్నుకుక్ సం. వి. హ్. స్త్రీ. స్నుహి, జెముడు. (వృ. వి.)

స్నుఘ్నిక సం. వి. ఆ. స్త్రీ. క్షారము.

స్నుతము సం. విణ. (అ. ఆ. అ.) స్రవించినది. కాఱినది.

స్నువు సం. వి. ఉ. పుం. న. కొండనెత్తము, సానువు. ఉ. స్త్రీ. సన్నపునరము.

స్నుష సం. వి. ఆ. స్త్రీ. 1. కోడలు. 2. పెండ్లికూతురు.

స్నుహ సం. వి. ఆ. స్త్రీ. స్నుకుక్, జెముడు. (వృ. వి.).

స్నుహి సం. వి. ఈ. స్త్రీ. స్నుహ, జెముడు (వృ. వి.)

## స్నే

స్నేహకేసరి సం. వి న్. పుం ఇముసము.

స్నేహనము సం. వి. అ. న. . తలయంటుట. 2. పరిమళ తైలాదులచే శరీరమును రుద్దుట. 3 తైలము.

స్నేహపాత్రము సం. వి. అ. న. 1. తైలపాత్రము 2. పెద్దసిద్దె, జాణలి, ప్రసిద్ధముగ్గ గుడది

స్నేహప్రియము సం. వి. అ. పుం. దీపము

స్నేహబీజము సం. వి. అ. పుం. 1. ప్రియాల వృక్షము 2. మోరటివృక్షము

స్నేహభువు సం. వి. ఊ. పుం. శ్లేష్మము.

స్నేహభూమి సం. వి. ఇ. స్త్రీ. 1. నూనెనొసంగు నది. 2. స్నేహపాత్రము.

స్నేహము సం. వి. అ. పుం. 1. నేస్తము, ప్రేమ; దయ. 2. అనురక్తి. 3. నూనె, నేయి మున్నగు చమురు పదార్థము. 5. జిడ్డుపదార్థము. 6. వీర్యము వంటి శరీరజమైనద్రవము. 6. వైశేషికుల సిద్ధాంతమునుబట్టి యిరువది నాలుగు గుణములలో నొకటి.

స్నేహరంగము సం. వి. అ. పుం. నువ్వులు.

స్నేహరసనము సం. వి. అ. న. నోరు.

స్నేహరేకభువు సం. వి. ఊ పుం. చంద్రుఁడు.

స్నేహలము సం విశే. (అ. ఆ. అ.) 1. ఆసక్తిగలది. 2. లలితమైనది.

స్నేహవరము సం. వి. అ. న. క్రొవ్వు.

స్నేహవస్తి సం. వి. ఇ. స్త్రీ. నూనెను శరీరములో నికిఁ బంపుట.

స్నేహవిద్ధము సం. వి. అ పుం. దేవదారువృక్షము.

స్నేహవ్యక్తి సం. వి. ఇ. స్త్రీ. ప్రేమవ్యక్తీకరణము

స్నేహాక్తము సం. విశే. (అ. ఆ. అ.) చేమురుతోఁ ఖూయఁబడినది.

స్నేహాశయము సం. వి. అ. పుం. దీపము.

స్నేహి సం. విశే. (న్. నీ. న్.) 1. ప్రేమగలది. 2. చమురుగలది. వి. న్. పుం. 1. స్నేహితుఁడు. 2. నలయంటువాఁడు.

స్నేహించు సం. అ క్రి. 1 పొత్తుచేయు 2. మరగు.

స్నేహితము సం విశే. (అ. ఆ. అ.) 1. చెలిమిగలది; దయగలది. 2. చేమురుగలది.

స్నేహితుఁడు సం. వి. అ. పుం. నెయ్యుఁడు, చెలికాఁడు.

స్నేహితురాలు మి. విశే. సఖి.

స్నేహువు సం వి ఉ. పుం. 1. చంద్రుఁడు. 2. స్నేహితుఁడు. 3. ఒకవిధమైనరోగము.

## స్నై

స్నైగ్ధ్యము సం వి. అ, న. 1. స్నిగ్ధభావము. 2. స్నేహము. 3. మృదుత్వము.

## స్ప

స్పందనము సం. వి. అ. న. స్పందము, గర్భమున శిశువు కదలుట.

స్పందము సం. వి. అ. పుం. 1. ఇంచుక కదలుట. 2. అదరుట.

స్పందితము సం. విశే. (అ. ఆ. అ.) 1. అదిరినది. వెడలినది. వి. అ. న. 1. అదరుట 2. కంపము. 3. మనోవ్యాపారము.

స్పందోలిక సం. వి. అ. స్త్రీ. 1. ముందునకు వెనుకకు నూగుట. 2. ఊయలపై మాగుట, క్రీడా విశేషము.

స్పరిశము సం. వి. అ. పుం. స్పర్శము.

స్పర్ధ సం. వి. అ. స్త్రీ. 1. పంతము; పోటీ. 2. అసూయ, చూపోపనితనము. 3. సాదృశ్యము. 4. క్రమోన్నత్యము. 5. పరునిఁబరిభవించుట యందిచ్ఛ.

స్పర్ధావువు. సం విశ. (ఉ. ఉ. ఉ.) స్పర్ధగలవాఁడు.

స్పర్ధించు. సం స. క్రి 1 చర్చచేయు. అ. క్రి పోటీపడు.

స్పర్ధి సం విశ (న్. నీ. న్.) 1. పోటీపడునది. . అసూయవహించునది 3. గర్వముతోఁగూడునది వి. న్ పుం. 1. ప్రత్యర్థి. 2. సమానుఁడు

స్పర్ధితము స విశ. (అ. ఆ. అ). పోటీపడునది.

స్పర్ధ్యము సం విశ (అ ఆ. అ) 1 కోరఁదగినది. 2. గెలువగలది.

స్పర్శ సం వి అ స్త్రీ. అంటు

స్పర్శనకము సం. వి. అ. న. చర్మము. (సాంఖ్య సిద్ధాంతము)

స్పర్శనము సం వి. అ. న. 1. స్పర్శేంద్రియము. 2. తాఁకుడు. 3. దానము. 4. కానుక. వి. అ. పుం. 1. వాయువు. 2. తపింపజేయు రోగము.

కం. పరకాంతా ముఖదోషా, కరకాంతి స్పర్శనముఁ గడు మొగుడుచునా, ధరణీసుర నేత్రంబులు, సరసిజములన్నమాట సహజము గాదే. నిగం. 1. 48.

విశ. (అ. ఆ. అ.) స్పృశించునది.

స్పర్శమణి సం. వి. ఇ. పుం. 1. పరుసవేది, స్పర్శోపలము. 2. చింతామణి. 3. స్పర్శమణి ప్రభావము వి. ఇ. న. బంగారము.

స్పర్శము సం. వి. అ. పుం. 1. సంఘర్షము. 2. స్పర్శజ్ఞానము. 3 తాఁకుడు. 4. ప్రభావము. 5. త్యాగము, ఈవి. 6. తపింపఁజేయు వ్యాధి 7 ఆకాశము. 8 ఇంద్రియములచేత నభిలషింపబడు విషయము. 9. కానుక. 10. వాయువు. 11 సంగమము 12. వర్గాక్షరము. (క మొదలు మ వఱకు).

స్పర్శలజ్జ సం. వి. ఆ. స్త్రీ. స్పర్శ సంకోచ పర్ణిక, అత్తిపత్తి చెట్టు (వృ. వి.)

స్పర్శవేది సం. వి న్ పుం. పరుసవేది.

స్పర్శసంచారి సం. విశ. (న్. నీ. న్.) సాంక్రామికము

స్పర్శస్నానము సం వి అ. న. గ్రహణ స్నానము.

స్పర్శస్పందము = స్పర్శస్యందము. సం. వి. అ పుం కప్ప

స్పర్శికము సం విశ (అ ఆ. అ) స్పర్శవేద్యమైనది. తాకుట వలన దెలియునది.

స్పర్శితము సం. విశ. (అ. ఆ అ) ఈయఁబడినది

స్పశము సం. వి. అ. పుం. యుద్ధము

స్పశించు స. క్రి. 1. అడ్డగించు, 2. నిర్వహించు. 3. చేర్చు. 4. తాఁకు. 5. చూచు. 6. పరిశీలించు.

స్పశుఁడు సం. వి. అ. పుం. 1. గూఢచారి. వేగు. 2. వన్యమృగములతోఁ బోరాడువాఁడు

స్పష్టము సం. విశ. (అ. ఆ. అ) 1. వెల్లడియైనది. 2. ప్రత్యక్షమైనది. 3. వాస్తవమైనది 4. స్ఫుటమైనది

స్పష్టీకరణము సం. వి. అ. న. తెలియఁజెప్పుట.

స్పష్టీకరించు సం. స. క్రి. తెలియఁజెప్పు.

స్పష్టీకృతి సం. వి. ఇ. స్త్రీ. 1. స్పష్టీకరణము 2. సరిచేయుట

## స్పృ

స్పృక్క సం. వి. ఆ స్త్రీ. 1. పక్క చెట్టు 2 లఘువు (వృ. వి.) 3. వధువు 4. గంధద్రవ్య విశేషము

స్పృక్కు సం. విశ. (క్ క్. క్) 1 తాఁకునది. 2. చొచ్చుకొనిపోవునది. (ఇది సమాసాంతములందే కానఁబడును. మర్మస్పృక్కు. హృది స్పృక్కు మొ.)

స్పృశము సం. వి. అ. పుం. తాఁకుడు.

స్పృశి సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడుచెట్టు.

స్పృశించు సం. స. క్రి. 1. అంటు, తాఁకు. 2 నీటితోఁ గడుగు.

స్పృశుఁడు సం. వి. అ. పుం. స్పశుఁడు, వేగులవాఁడు.

స్పృశ్యము సం. విశ. (అ. ఆ. అ.) స్పృశించదగినది.

**స్పృష్ట** = స్పృష్ట. నం. వి. ఋ. పుం. తపింపఁజేయు. రోగము. విశ. (ఋ. ష్టీ. ఋ.) స్పృశించునది. తాఁకునది

**స్పృష్టకము** నం. వి. అ. న. యాదృచ్ఛికమైన యాలింగనము.

**స్పృష్టకాండుఁడు** నం. వి. అ. పుం. శస్త్రాజీవుఁడు.

**స్పృష్టపూర్వము** నం. విశ. (అ. ఆ. అ.) 1. పూర్వానుభూతమైనది 2. పూర్వము స్పృశింపఁబడినది.

**స్పృష్టము** నం. విశ. (అ. ఆ. అ.) 1. స్పృశింపఁబడినది 2. అపవిత్రము చేయఁబడినది. 3. స్థానకరణముల పూర్ణస్పర్శచే నుత్పన్నమైన వర్ణాఘాతము. వి. అ. న. తాఁకుడు, స్పర్శము.

**స్పృష్టాస్పృష్టము** = స్పృష్టాస్పృష్టి. నం. వి. అ. న. ఒండొరులను దాఁకుట.

**స్పృష్టి** నం. వి. ఇ. స్త్రీ. తాఁకుడు, సంపర్కము

**స్పృహా** నం. వి. ఆ. స్త్రీ. 1. ఇచ్ఛ; గాఢమైన కోరిక. 2. జ్ఞప్తి 3. అసూయ

**స్పృహణము** నం. వి. అ. న. కోరుట.

**స్పృహణీయము** నం. విశ. (అ. ఆ. అ.) కోరఁదగినది.

**స్పృహయాళువు** నం. విశ. (ఉ. ఉ. ఉ.) కోరువాఁడు.

**స్పృహాళువు** = స్పృహయాళువు.

**స్పృహ్యము** నం. విశ. (అ. ఆ. అ.) కోరఁదగినది. వి. అ. పుం. మాదీఫలము.

## స్ఫ

**స్ఫటి** నం. వి. ఆ. స్త్రీ. 1. పటిక. 2. పాముపడగ.

**స్ఫటము** నం. వి. అ. పుం. పాము పడగ.

**స్ఫటి** నం. వి. న్. పుం. పాము. ఈ. స్త్రీ. పటిక.

**స్ఫటిక** నం. వి. అ. స్త్రీ. 1. పటిక. 2. కర్పూరము.

**స్ఫటికము** నం. వి. అ. పుం. పటికపు రాయి.

**స్ఫటికాచలము** నం. వి. అ. పుం. 1. మేరు పర్వతము 2. కైలాసగిరి.

**స్ఫటికాభ్రము** నం. వి. అ. పుం. కర్పూరము.

**స్ఫటికారి** నం. వి. అ. పుం. ఒక రసాయన పదార్థము, (అల్యూమినా సల్ఫేట్)

**స్ఫటికి** నం. వి. ఈ. స్త్రీ. పటిక

**స్ఫటితము** నం. విశ. (అ. ఆ. అ.) చీల్చఁబడినది

**స్ఫరకము** నం. వి. అ. పుం. డాలు

**స్ఫరణము** నం. వి. అ. న. 1. అదరుట. 2. వణఁకు.

## స్ఫా

**స్ఫాటకము** నం. వి. అ. పుం. జలబిందువు. న. పటికపు రాయి.

**స్ఫాటికము** నం. విశ. (అ. ఈ. అ.) 1. స్ఫటికసంబంధమైనది. 2. నిర్మలమైనది. వి. అ. న. 1. పటిక. 2. ఒక విధమైన చందనము.

**స్ఫాటికి** నం. వి. ఈ. స్త్రీ. పటిక.

**స్ఫాటితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఛిద్రములు చేయబడినది. 2. విస్తరింపఁ జేయఁబడినది.

**స్ఫాతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. పెరిగినది. 2. ఉబ్బినది.

**స్ఫాతి** నం. వి. ఇ. స్త్రీ. 1. వృద్ధి. 2. ఉబ్బుట.

**స్ఫారణము** నం. వి. అ. న. 1. వణఁకుట 2. అదరుట.

**స్ఫారము** నం. వి. అ. పుం. 1. వంకర 2. వృద్ధి. 3. చలనము. 4. కంపము. 5. ఇత్తడి మున్నగు వానితోఁ జేయఁబడిన బుడగల రూపమునను న్న యాభరణము, 6. వీచి, తరఁగ. 7. టంకారము. 8. బంగారు లోనగువాని ఘుటిక. న. సమృద్ధి విశ. (అ. ఆ. అ.) 1. అధికమైనది. పెద్దది. విస్తృతమైనది.

**స్ఫారితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. తెఱువఁబడినది. 2. వెడల్పైనది.

**స్ఫాలనము** సం. వి అ న. 1. కదలిక. 2. వణఁకుట 3. చలింపఁజేయుట. 4. రాపిడి. 5 గుఱ్ఱము మీఁదఁ గుఱ్ఱవానిని దట్టుట.

## స్ఫి

**స్ఫిక్కు** సం. వి. చ్. స్త్రీ. పిఱుఁదుల యున్నతి.

**స్ఫిచ(జ)ము** సం. వి. అ. స్త్రీ. స్ఫిక్కు.

**స్ఫితము** = స్ఫీతము

**స్ఫిరము** సం. విశ. (అ ఆ. అ) 1 అధికమైనది 2. విస్తృతమైనది. 3. అసంఖ్యాకమైనది.

## స్ఫీ

**స్ఫీతము** సం. విశ. (అ ఆ అ.) 1 విస్తారమైనది, వ్యాపించినది. 2 స్వచ్ఛమైనది.

## స్ఫు

**స్ఫుటిత** సం. వి ఆ స్త్రీ 1. వఖశత భేదము.

**స్ఫుటనము** సం వి. అ న 1 భేదించుట 2. వికసించుట 3. సంధులు సడలుట.

**స్ఫుటము** సం. విశ. (అ. ఆ అ.) 1. స్పష్టమైనది 2. వికసించినది. 3. ప్రకటమైనది. 4 వ్యాపించినది. 5 తెల్లనిది. 6. నిర్మలము. 7 విదితము. 8 అసామాన్యము. వి అ. పుం. ఆ స్త్రీ విప్పఁబడిన పాము పడగ

**స్ఫుటి** సం వి. ఈ. స్త్రీ. ఇ. పుం. 1. పండి పగిలినదోస కాయ. 2. కాళ్ళ చర్మము పగులుట.

**స్ఫుటిక** సం. వి. ఆ. స్త్రీ. 1. పగిలిన ముక్క. 2. పలుచని తునుక.

**స్ఫుటితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. వికసించినది. 2. భేదింపఁబడినది. 3. స్పష్టము చేయఁబడినది. 4. పరిహాసింపఁబడినది. వి. అ. న. చుంబన క్రియా విశేషము.

**స్ఫుటీకరణము** సం. వి అ న 1. స్పష్టపఱుచుట. 2. సరిదిద్దుట.

**స్ఫురణ** సం. వి. ఆ. స్త్రీ. 1 ప్రకాశము 2. అదరుట 3. ప్రత్యక్షమగుట. 4 జ్ఞప్తికి వచ్చుట

కం హారులు సుదర్శనాకారములు, పరిపంథిమదావహములు బహువిదలక్ష్మి, స్ఫురణా పరీణాహంబులు, పురితేజులు శార్ఙ్గపాణిఁ బోలుంజాలన్. నార. 2. 6.

**స్ఫురణము** సం. వి అ న. 1. తోఁచుట. 2 అదరుట 3. ప్రకాశించుట. 4. ప్రత్యక్షమగుట

**స్ఫురము** సం. వి. అ పుం 1. అదరుట 2. ఉబ్బుట. 3 కంపించుట. 4. డాలు.

**స్ఫురించు** సం. అ. క్రి. 1 అదురు 2. తోఁచు. 3 అరుగుదెంచు. 4 ప్రకాశించు. 5. ప్రత్యక్షమగు

**స్ఫురితము** సం విశ (అ ఆ అ.) 1. ప్రకాశించునది. 2. అదిరినది. 3. తోఁచినది. 4. ఉబ్బినది. వి. అ. న. 1 కంపము. 2 అదరుట 3. మనఃక్షోభము 4 ప్రకాశము 5. చుంబనక్రియా విశేషము. 6. రతిబంధ విశేషము. 7. గమక విశేషము.

**స్ఫురము** సం వి. అ. న. శిబిరము, డేరా.

**స్ఫులనము** సం. వి. అ. న 1. అదరుట. 2. కంపించుట

**స్ఫులింగము** సం. వి అ. పుం. అగ్నికణము. మిణుఁగురు

**స్ఫులింగలక్ష్మి** సం. వి. ఈ. స్త్రీ తంత్రవిశేషము.

**స్ఫులింగిని** సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసప్తజిహ్వలలో నొక్కటి.

## స్ఫూ

**స్ఫూర్జ** సం. వి. ఆ. స్త్రీ. ఉఱుము, మేఘధ్వని.

**స్ఫూర్జకము** సం. వి. అ. పుం. నల్లతుమ్మ, తుమ్మికచెట్టు.

**స్ఫూర్జథువు** = స్ఫుర్జథువు సం. వి. ఉ. పుం. 1. ఉఱుము 1. వజ్రధ్వని, పిడుగుచప్పుడు.

స్ఫూర్జనము సం. వి. అ. న. గర్జించుట, ప్రేలుట.

స్ఫూర్జము సం. వి. అ. పుం. ఉఱుము. 2 వజ్రము. 3. భయసంతోషములతోఁ గూడిన వాయుకావాయన ప్రేమ సమావేశము.

స్ఫూర్జితము సం. విశ. (అ. ఆ. అ) 1. ప్రకాశించినది. 2. విడిపడినది. వి. అ. న. 1. పిడుగు, 2 ఘోషఘోషధ్వని

స్ఫూర్తి సం. వి. ఇ. స్త్రీ. 1. కవితావేశము. 2. అదరుట 3. తోఁచుట. 4. ప్రకాశము. 5. తళుకు. వదలుట.

స్ఫూర్తిమంతుఁడు సం. వి. త్. పుం. 1. శివభక్తుఁడు 2. పాశుపతుడు. విశ (త్. తీ త్) స్ఫూర్తిగలది.

## స్ఫే

స్ఫేయము సం. విశ. (న్. నీ. న్.) మిక్కిలియధిక మైనది

స్ఫేష్ఠము సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలియధిక మైనది 2 మిక్కిలి దృఢమైనది.

## స్ఫో

స్ఫోట సం. వి. ఆ. స్త్రీ. విప్పఁబడిన పాముపడగ.

స్ఫోటకము సం. వి. అ. పుం. 1. బొబ్బరోగము. 2. మసూరి, అమ్మవారిజబ్బు. 3. వాఁపు,కురుపు; కంతి.

స్ఫోటకరము స్ఫోటబీజకము, సం. వి. అ పుం. నల్ల జీడిచెట్టు.

స్ఫోటనము = సం వి. అ పుం. సన్నిహితముగా నున్న హల్లులను వేఱువేఱుగాఁబలుకుట. న. 1. చీల్చుట. 2 బద్దలగుట. 3. ధాన్యమును తూర్పారఁబట్టుట, చెరుగుట.

స్ఫోటబీజకము = స్ఫోటకరము.

స్ఫోటము సం వి. అ. పుం. 1. ఛేదిల్లుట. 2. నీటిబుగ్గ 3. విస్తృతమగుట 4. వాచుట 5. ఏదైన ధ్వనిని వినునప్పుడు మనసున స్ఫురించుభావము. బుధైః. వైయాకరణైః ప్రధానభూతస్ఫోటరూపవ్యంగ్య వ్యంజకస్య శబ్దస్యధ్వనిరితి వ్యవహారః కృతః, కావ్య ప్ర.) 6 మీమాంసకులు గ్రహించు నిత్యధ్వని.

స్ఫోటని సం. వి. ఈ స్త్రీ బరమా, రంధ్రముచేయు సాధనము.

స్ఫోటశోఫ సం వి. ఆ. స్త్రీ జీడి, నల్లజీడి.

స్ఫోటించు సం. న క్రి 1. ఛేదించు. 2. పొడుచు. 3. పెల్లగించు.

స్ఫోటిక సం వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన పక్షి.

స్ఫోరకము సం. విశ. (అ. ఆ. అ.) స్ఫురింపఁజేయునది, జ్ఞప్తికి తెచ్చునది.

స్ఫోరణము సం. వి. అ. న. స్ఫురణము.

## స్ఫ్య

స్ఫ్యము సం. వి. అ. పుం. 1. యజ్ఞములలో నుపయోగింపఁబడు ఖడ్గాకారముగల సాధనము. 2. పడవనడుపు తెడ్డు.

## స్మ

స్మయదానము సం. వి. అ. న. ఆడంబరముతోఁ గూడిన దానము.

స్మయనము సం. వి. అ. న. నవ్వు.

స్మయమానము సం. విశ. (అ. ఆ. అ) ఆశ్చర్యము పొందునట్టిది

స్మయము సం. వి. అ. పుం. 1. గర్వము. 2. ఆశ్చర్యము.

స్మరకథ సం. వి. ఆ. స్త్రీ. కామినీకాముకుల ప్రలాపము.

స్మరకూపము సం. వి. అ. పుం. న. ఆఁడుగుఱి.

స్మరగురువు సం వి. ఉ. పుం. విష్ణువు

స్మరచక్రము=స్మరచంద్రము. సం. వి. అ. పుం. ఉత్తానకరణబంధ విశేషము.

స్మరణపదవి సం. వి. ఈ. స్త్రీ. మృత్యువు.

స్మరణము సం. వి. అ. న. 1. తలంపు. 2. జ్ఞప్తి. తెలివి. 3. ఒక భక్త్యంగము. 4. సంప్రదాయము. 5. దేవతానామమునులోన జపించుట. 6 ఒకానొక యర్థాలంకారము.

స్మరణాపత్యతర్పకము సం. వి. అ పుం. తలంపు చేతనే తన సంతతికి తృప్తిని గలిగించునది, తాబేలు.

స్మరణి సం. వి. ఈ స్త్రీ. రుద్రాక్షమాల.

స్మరణీయము=స్మర్తవ్యము. సం. వి. (అ. ఆ. అ.) స్మరింపఁదగినది.

స్మరదీపిక సం. వి. అ. స్త్రీ. జారిణి.

స్మరధ్వజ సం వి. ఆ స్త్రీ. వెన్నెలరాత్రి.

స్మరధ్వజము సం. వి అ. పుం. 1. మగగుఱి. 2. ఒకమైన చేఁప. 3. వాద్యవిశేషము. న. ఆఁడుగుఱి.

స్మరప్రియ సం. వి. ఆ. స్త్రీ. రతిదేవి.

స్మరము సం. వి. అ. పుం. 1. స్మృతి 2. ప్రేమ. 3 వృశ్చికము.

స్మరలేఖిని సం. వి. ఈ. స్త్రీ. శారిక.

స్మరలేఖము సం వి. అ పుం. ప్రణయలేఖ.

స్మరవల్లభుఁడు సం. వి అ. పుం. 1. అనిరుద్ధుఁడు, 2 వసంతుఁడు

స్మరశాసనుఁడు సం వి అ. పుం. స్మరహరుఁడు పరమేశ్వరుఁడు.

స్మరశాస్త్రము సం. వి. అ. న. కామశాస్త్రము

స్మరసఖుఁడు సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2 వసంతుఁడు.

స్మరసమ్మర్యము సం. వి. అ. పుం. గాడిద.

స్మరాంకుశము సం వి. అ పుం. గోరు.

స్మరాంకుశుఁడు సం వి అ పుం. కాముకుఁడు.

స్మరాతివాసము సం వి అ. పుం. అశోకము.(వృ.వి.)

స్మరాసవము సం. వి అ పుం. లాలాజలము

స్మరించు సం. స. క్రి. తలఁచు, స్మరణముచేయు.

స్మరుఁడు సం. వి. అ. పుం. మన్మథుఁడు.

స్మరోపహారము సం. వి. అ. న. శృంగారసాధనము (సుగంధద్రవ్యాది.)

స్మర్త సం. వి. ఋ పుం. 1. గురువు. 2. స్మరించునట్టివాఁడు.

స్మర్తవ్యము=స్మరణీయము.

స్మర్యము=స్మర్తవ్యము.

# స్మా

స్మాయము సం వి. అ. పుం. మందహాసము, చిఱునవ్వు.

స్మారకము సం. విశే. (అ. ఆ. అ.) స్మరింపఁజేయునది, జ్ఞప్తికిఁదెచ్చునది. వి అ. న. స్మృతిచిహ్నము.

స్మారణము సం. వి. అ. న. 1. స్మరింపఁజేయుట. 2. గణించుట.

స్మారము సం. వి. అ. న. స్మృతి.

స్మారితుఁడు సం. విశే. (అ. ఆ అ.) సాక్షి.

స్మార్తకాలము సం. వి. అ. పుం జ్ఞాపకముంచుకొనుటకుఁ దగిన కాలము. (ఒక శతాబ్దము)

స్మార్తము సం. వి. అ. న. స్మృత్యుక్త కర్మము. విశే. (అ ఆ. అ.) 1. స్మృతి సంబంధమైనది. 2. స్మృతి గ్రంథములలోఁ జెప్పఁబడినది. 3 న్యాయబద్ధమైనది.

స్మార్తికము సం విశే. (అ. ఆ అ) సంప్రదాయసిద్ధమైనది.

స్మార్తుఁడు సం. వి. అ. పుం 1. స్మృతుల యందుఁ బండితుఁడైన బ్రాహ్మణుఁడు. 2. స్మృతి సంప్రదాయములను అనుసరించువాఁడు

## స్మి

**స్మితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. నవ్వినది. 2. వికసించినది. వి. అ. న. అధరమునందు మాత్రము ప్రకాశించెడు చిఱునవ్వు.

**స్మితి** నం. వి. ఇ. స్త్రీ. స్మితము.

## స్మృ

**స్మృతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. అభిప్రేతము. 2. స్మరింపఁబడినది 3. విధింపఁబడినది. వి. అ. న. స్మరణము, జ్ఞప్తి.

**స్మృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. తలఁపు. 2. ధర్మశాస్త్రము 3. బుద్ధి. 4. అలంకార విశేషము, స్మరణము. 5. ఎఱుక 6. ఒక సంచారి భావము. 7. జ్ఞాపకము 8. అభిలాష.

**స్మృతిజాతుఁడు** నం. వి. అ. పుం. మన్మథుఁడు.

**స్మృతిపాఠకుఁడు** నం. వి. అ. పుం. ధర్మశాస్త్రమును చదువువాఁడు, న్యాయవాది.

**స్మృతిమంతుఁడు** నం. విశే. (త్ తీ త్) స్మృతి గలది. పుం. 1. విచక్షణుఁడు, న్యాయశాస్త్రవేత్త. 2. పూర్వజన్మ కథ నెఱుఁగువాఁడు.

**స్మృతివినయము** నం. వి. అ. పుం. స్వధర్మమును జ్ఞప్తికి దెచ్చుచుఁ జేయు మందలింపు.

**స్మృతిప్రభము** నం. వి. అ. పుం. జ్ఞాపకశక్తియందలి లోపము.

**స్మృతివిరుద్ధము** నం. విశే. (అ. ఆ. అ.) న్యాయ వ్యతిరేకము.

**స్మృతిశేషుఁడు** నం. వి. అ. పుం. మృతి నందినవాఁడు.

## స్మే

**స్మేరము** నం. విశే. (అ. ఆ. అ.) 1. వికసించినది 2. కొంచెముగా నవ్వినది. 3. గర్వించినది. వి. అ. పుం. చిఱునవ్వు.

**స్మేరవిష్కిరము** నం. వి. అ. పుం. నెమలి.

## స్య

**స్యందనము** నం. వి. అ. న. 1. కాఱుట. 2. త్వరగా ప్రవహించు నీరు. పుం. 1. తినిశ వృక్షము. (వృ. వి.) 2. యుద్ధ రథము. 3. వాయువు. విశే. (అ. ఆ. ఈ.) అ.) త్వరగాఁ బోవునది.

**స్యందనారోహుఁడు** నం. వి. అ. పుం. 1. రథమునెక్కి యుద్ధము చేయువాఁడు. 2. రథికుఁడు.

**స్యందని** నం. వి. ఈ. స్త్రీ. 1. లాలాజలము. 2. మూత్రద్వారము.

**స్యందనిక** నం. వి. అ. స్త్రీ. 1. లాలాజల బిందువు. 2. చిన్న యేఱు.

**స్యందము** నం. వి. అ. పుం. 1. కాఱుట. 2. నీటి యూట. 3. రథము. 4. చెమట 5. నేత్రరోగము.

**స్యంది** నం. విశే. (న్ నీ న్.) స్రవించునది.

**స్యందిని** నం. వి. ఈ. స్త్రీ. 1. లాలాజలము, చొంగ 2. కవదూడలను గనునట్టి యావు.

**స్యందుఁడు** నం. వి. అ. పుం. చంద్రుఁడు.

**స్యదము** నం. వి. అ. పుం. 1. వేగము. 2. గమనవేగము. 3. కాఱుట.

**స్యన్నము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కాఱినది (నీరు మొదలైనది) 2. బొట్లుబొట్లుగాఁబడునది.

**స్యమంతకము** నం. వి. అ. పుం. దినమున కెనిమిది బారువుల బంగారము నిచ్చుచు నపాయములనుండి రక్షించు నొక మణి.

**స్యమిక** నం. వి. అ. స్త్రీ. నీలిమందు.

**స్యమి(మీ)కము** నం. వి. అ. పుం. 1. మేఘము 2. వల్మీకము. 3. కాలము. 4. ఒకానొకచెట్టు.

## స్యా

**స్యాద్వాదము** నం. వి. అ. పుం. ఈశ్వరుని యునికిని సందేహించు వాదము.

**స్యా(శ్యా)లకుఁడు** నం. వి. అ. పుం. బావమఱఁది.

**స్యా(శా)లిక** సం. వి ఆ స్త్రీ. మఱఁదలు, భార్య సోదరి

**స్యాలుఁడు** సం వి. అ పుం. శ్యాలకుఁడు, భావమఱఁది

# స్యూ

**స్యూతము** సం విణ (అ. ఆ. అ.) 1. కుట్టఁబడినది (వస్త్రము మొదలైనది) 2. కలుపఁబడినది. వి. అ. పుం. 1 పల్లిక. 2. సజ్జ, సంచి.

**స్యూతి** సం. వి ఇ. స్త్రీ. (బట్టలు మున్నగువాని కుట్టు. 2. సంతతి. 3. కుటుంబము. 4. సంచి. 5. కుట్టుపని

**స్యూన** సం వి. ఆ స్త్రీ 1. కాంతికిరణము. 2 మొలనూలు.

**స్యూనము** సం వి. అ. పుం. 1. స్యూతము. 2. దారము. 3 కాంతికిరణము.

**స్యూనుఁడు**=స్యోనుఁడు సం వి అ.పుం. సూర్యుఁడు.

**స్యూమము** సం వి. అ. పుం, కాంతికిరణము న, 1. నీరు. 2. సౌఖ్యము.

# స్యో

**స్యోతము** సం. వి. అ. పుం. స్యూతము.

**స్యోనము** సం విణ. (అ. ఆ. అ.) అందమైనది; శుభావహమైనది. వి. అ. పుం. 1. కిరణము 2. సంచి. న. 1. ఆనందము 2. సౌఖ్యము. 3. సుఖాసనము

**స్యోనాకము** శ్యోనాకము సం. వి. అ. పుం. 1. దుండుగచెట్టు. 2 పెద్దమాను

# స్ర

**స్రంసనము** సం. వి. అ. న. 1. జాఱుట; 2. పడఁజేయుట. 3. అకాల గర్భస్రావము 4. విరేచనకారియగు మందు.

**స్రంసము** సం. వి. అ. పుం. 1. పడుట 2. జాఱుట.

**స్రంసి** సం. విణ. (న్. నీ. న్.) 1 క్రిందఁబడునది. 2. వ్రేలాడునది 3. జాఱునది వి. పుం. న్. 1. పోఁకచెట్టు. 2. గొనుగుచెట్టు.

**స్రక్కరి** సం. వి ఈ. స్త్రీ. పుష్పలావిక; మాలకరి.

"ఉ... దోర్దండము లెత్తి మ్రొక్కుదురు స్రక్కరిఁ గన్గొని పౌరపల్లవుల్". నిరం. 1. 52.

**స్రగ్గు** అ. క్రి. అడఁగు 2. తగ్గు.

**స్రగ్ధర** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక వృత్తము (మ, ర, భ, న, య, య, యగణములు. యతిస్థానము 8 15.

**స్రగ్వి** సం. విణ. న్. వీ. న్.) పూలదండను ధరించినది.

**స్రగ్విణి** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక వృత్తము (ర, ర, ర గణములు, యతిస్థానము 7.)

**స్రజము** సం. వి. జ్. స్త్రీ. 1. పూలదండ 2 భూషణవిశేషము. 3. వరుస.

**స్రజ్వ** సం. వి. న్. పుం. 1. మాలాకారుఁడు 2 వస్త్రము. 3 త్రాడు. ఆ. స్త్రీ. త్రాడు, దామము

**స్రద్ధువు** సం. వి. ఊ. స్త్రీ. అపానవాయువు.

**స్రవ** సం. వి. ఆ. స్త్రీ. చాఁగచెట్టు. పుం. 1. సెలయేఱు. 2. మూత్రము.

**స్రవంతి** సం. వి. ఈ. స్త్రీ. 1. నది. 2 చీలమండ. 3. రుదంతీవృక్షము. ఎలుకచెవిచెట్టు. 4. స్త్రీహముండు స్థానము.

**స్రవణము** సం. వి. అ. న. 1. కాఱుట. 2. మూత్రము 3. అకాలగర్భస్రావము. 4. చెమట.

**స్రవద్గర్భ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఈఁచుకపోయిన యావు 2. గర్భస్రావమైన స్త్రీ.

**స్రవద్రంగము** సం. వి. అ. పుం. అంగడివీధి.

**స్రవస్మధ్యము** సం. వి. అ. న. నడుమనుండి నీరు స్రవించుచున్నట్లు కనఁబడుమణి.

ప్రసవము సం. వి. అ. పుం. 1. కాయుట. 2 కరియుట 3. బిందువు. 4. ప్రవాహము. 5. సెలయేఱు.

ప్రవిచము సం. అ. క్రి. 1. కాఱు. 2. చేష్ట.

ప్రష్ట సం వి. ఋ. పుం. 1. బ్రహ్మ. 2. నిర్మాత.

ప్రస్తము సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రిందఁబడినది. 2. జాఱినది. 3. ప్రేలాడువది. 4. వదులుచేయఁబడినది. 5. వేఱుచేయఁబడినది.

ప్రస్తరము సం. వి. అ. పుం. పరుపు (సోఫా)

ప్రస్తహస్తము సం. విణ. (అ. ఆ. అ.) (చేతి) పట్టు విడుచునది.

ప్రస్తాంగము సం. విణ. (అ. ఆ. అ.) సడలిన యవయవములు గలది 2. మూర్ఛాక్రాంతమైనది.

ప్రస్తి సం. వి. ఈ. స్త్రీ. 1. పడుట. 2 జాఱుట. 3. వదులగుట. సడలుట.

## స్రా

స్రాముఁడు సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎప్పుడును ప్రవంచుముక్కులును గన్నులును గలవాఁడు 2 కుంటివాఁడు.

స్రామ్యము సం వి. అ. న. కుంటితనము

స్రావకము సం. విణ. (అ. ఆ. అ.) కార్చునది, వి. అ. న. నల్లమిరియము

స్రావణము వి. అగసాలివాని పనిముట్టు. చిన్న పట్టుకారు.

స్రావము సం. వి. అ. పుం. ప్రసవము, కాఱుట

స్రావి = సం వి. వి. 1. క్రమము. 2. మార్గము

స్రావితము సం. విణ (అ. ఆ. అ.) కరిగింపఁబడినది

## స్రు

ప్రుక్కఁజేయు స. క్రి. ప్రుక్కునట్లు చేయు, ప్రుక్కించు.

ఆ. "తునిమితో వ యవని తొమ్మిదం యిమ్ము, ప్రుక్కఁ జేసి ..." భార. ద్రో. 3. 243.

ప్రుక్కఁబడు అ క్రి శోకించు, దుఃఖించు.

వ, .. అవమతి నొందిన ప్రుక్కఁబడక ... భార విరా 1

ప్రుక్కించు స క్రి ప్రుక్కఁజేయు కం. ......

కం. చూచెదుగా కెట్లు నిన్ను ప్రుక్కించెదవో. భార ద్రో. 4 9.

ప్రుక్కు అ. క్రి 1. వెనుదీయు.

కం ఎక్కువ వెలద్రవ్యంబులు, ప్రుక్కక ముచ్చిలి నచో డఁ జూలగొనినచో. విజ్ఞా. కాం. 2. 98

ఉ ...పాపవృత్తికిన్, ప్రుక్కక వైరమెత్తి కడుఁ గ్రూరుఁడవై యిటు సీతమాడఁగా, దిక్కులు గెల్వఁగాదు నను ద్రెక్కొనఁ బోయితిఁగాని యిమ్మెయిన్. నిర్వ 5.

2 భయపడు.

ఉ. ... ప్రుక్కము చావున కాత్మనేమియున్. భార. అర. 4

గీ. రక్కసుల కేడ నేరిటు ప్రుక్కనేల, దరము లోపల మార్తురఁ దొడఁగ గెలుచు, జాడలెన్నెన్నఁ గల వెన జంకుమాని, చెఱుపు దొడరని ప్రేలిమి చేయు మొకటి. అచ్చ. రా. యు. 3. (శర.)

3 ముడుగు

కం జక్కవ లలరఁ జకోరము, లుక్కఱఁ గమలములు విరియ నొగిఁ గైరవముల్, ప్రుక్క నమస్తవనంబులు, మొక్క దశలు వెలుఁగ భాస్కరుఁడు పొడతెంచెన్. భోజరా. 1. (శ.ర.)

4 ముడుతపడు

కం చిక్కని చక్కని మున్నని, ప్రుక్కని తోలూడ్వ ఒడని ఛులి సెగలచె, నొక్కఁ బడని దిండంబులు, తిక్కక యుపవయన వేళఁ దాల్పఁగ వలయున్ విజ్ఞా. కాం. 1 23

గీ. యవనఁ నెవెండ్రుకలు ప్రుక్కెఁ జన్నంబు, శివు వంగె బొమలు ప్రేలఁబడియె. భోజరా. 6. (శ ర).

5 తగ్గు

కం. స్రుక్కిన యంగుళములు దళ, మెక్కిన దేహమును గాంతి యెడలినమోమున్....భోజరా. 1. (శ.ర.)

6. దుఃఖించు.

ఉ .. సత్యయింతకున్, స్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించిరన్. పారి. 1. (శ.ర.)
7. చింతించు.

ఉ... భీమతనూభవ నెమ్మనంబునన్, స్రుక్కుచు నుండె నైషధుడును గడుఁ జింత వహించె....నైష. 4 (శ.ర. .

8. మూర్ఛిల్లు.

గీ. కంకటము దూటి యంగంబు గాఁడిపోవఁ, గ్రూరనారాచమేసిన స్రుక్కె నతడు. భార. ద్రో. 3. (శ.ర.)

9. సంకోచించు

ఉ...తావిసిలమై, స్రుక్కుచు నీచభామినుల చొప్పునఁ బల్కెడు,... భార. విరా. 1. (శ.ర.)
10. వాడు, మ్లానమగు.

గీ. కలుకుటెండఁ దాఁకిన తొగకామునకంగిఁ బాఁపచే నిమ్మ నెంతయు బలము దఱిగ, స్రుక్కె... హరి. పూ. 7. (శ.ర.)

11. చుట్టుకొను. ఆము. 5. (శ.ర.)

వి. 1. చిక్కు, ముడులు పడుట.

సీ. చూర్ణాలకంబుల స్రుక్కు చక్కగ దీర్చి... నైష 7. (శ.ర.).

వ....నొగలెక్కి పగ్గంబుల స్రుక్కు సక్కంజేయ భార. విరా. 4.46

సీ. మున్నూలొడ్డి, వలచేయి యెక్కఁగవలను దాల్చి, మున్మడుంగెగఁదాల్చి క్రిమ్మఱ దిగఁదాల్చి స్రుక్కులు పుచ్చి ముచ్చట్లు చుట్టి, ముడిచి మంత్ర పూర్వగముగ వడుగొకటి న, వ్యాసి యొకటి గృహస్థు రెండుదాల్చు, వలయు జన్నిదంబులు ... విజ్ఞా. కాం. 1.25.

1. దుఃఖము, శోకము.

శా. ... భోగంబులన్, మెచ్చున్ స్రుక్కును లేక యుండు... భార. శాం. 2.

సీ. సౌఖ్యంబు దుఃఖంబు సంప్రాప్తమైనచో నుబ్బు స్రుక్కులులేక యుండెనేని.

3. అధైర్యము.

4. కార్శ్యము.

సీ. ఆకతాఁకువ స్రుక్క నిక్కి ప్రక్కలునొక్క నుఱక కల్లేటినొక్కొరణంబు. మనుచ. 4. 59.

4. వళి, కడుపుమీఁది ముడుత.

సీ. స్రుక్కులు తరఁగలు చొక్కిలి సుడి... నీలా. 2. (శ.ర.).

స్రుక్కు సం. వి. చ్. స్త్రీ. యజ్ఞోపకరణము.

స్రుక్ప్రణాళిక సం. వి. అ. స్త్రీ. గరిఁటెచిప్ప.

స్రుగ్జిహ్వుఁడు సం. వి. అ. పుం. అగ్ని.

స్రుఘ్ని సం. వి. ఈ. నేట్రను (Natron)

స్రుచము సం. వి. చ్. స్త్రీ. స్రుగ్భేదము.

స్రుతము సం. విశే. (అ. ఆ. అ.) 1. కారినది. 2. పోయినది.

స్రుతి సం. వి. ఇ. స్త్రీ. 1. కారుట. 2. ప్రవాహము. 3. గుగ్గిలము.

స్రువ సం. వి. ఆ స్త్రీ. 1. అందుగు చెట్టు. (వృ. వి.) 2. చాఁగ (వృ. వి.) 3. యజ్ఞపాత్ర విశేషము. 4. సెలయేఱు,

స్రువము సం. వి. అ. పుం. యజ్ఞపాత్రవిశేషము.

స్రు(వ)వాకర్ణము సం. విశే. (అ. ఆ. అ.) చెవిమీఁద గరిఁటె గుర్తుగలది.

స్రువావృక్షము సం. వి. అ. పుం. 1. ములువెలఁగ చెట్టు. 2. స్రుక్స్రువములకైన వృక్షము.

స్రువాహస్తుడు సం. వి. అ. పుం. శివుఁడు.

స్రువు సం. వి. ఉ. స్త్రీ. 1. గరిటెవంటి యజ్ఞోప కరణము. 2. ఊటకాలువ.

## స్రో

స్రోతఘ్ని సం. వి. ఈ. స్త్రీ. సర్జక్షారము, లవణ విశేషము.

స్రోతము సం. వి. అ. న. 1. ప్రవాహము. 2. సెలయేఱు.

స్రోతస్యుఁడు సం. అ. పుం. 1. శివుఁడు. 2. దొంగ.

స్రోతస్వతి = స్రోతస్విని.

స్రోతస్విని సం. వి. ఈ. స్త్రీ. ఏఱు, నది.

స్రోతస్సు సం. వి. స్. న. 1. జలప్రవాహము; ఏఱు 2. తరంగము. 3. నీరు 4. నీరువచ్చెడి త్రోవ. 5. ఇంద్రియము 6. ఏనుఁగు తొండము. 7 జలవేగము. 8. కుజాముఖము. 9 జంతువుల ఇంద్రియ రంధ్రము 10 వంశపరంపర.

స్రోతోంజనము సం. వి. అ. న. 1. నీలాంజనము. సౌవీరాంజనము.

స్రోతోద్భవము సం. వి. అ న. సౌవీరము.

స్రోతోరంధ్రము సం. వి. అ. న. ఏనుఁగు తొండము చివర నుండు రంధ్రము.

స్రోతోవహ(ము) సం. వి. ఆ. హ్. స్త్రీ. నది.

## స్వ

స్వ సం. వి. ఆ. స్త్రీ. సమాన వర్ణమునకుఁ జెందినస్త్రీ

స్వంగము సం. వి. అ. స్త్రీ. కౌఁగిలి.

స్వంజనము సం. వి. అ. న. కౌఁగిలించుకొనుట.

స్వఁజుఁడు సం. వి. అ. పుం. 1. బ్రహ్మ 2. శివుఁడు.

స్వకంపనము సం. వి. అ పుం. వాయువు.

స్వకపోలకల్పనము సం. వి. అ. న. స్వయముగాఁ గల్పించుట.

స్వకము సం విశ. (అ ఆ అ.) స్వకీయము, సొంతము. వి. అ. న. సొంతయాస్తి.

స్వకర్మము సం. వి. న్. న. స్వధర్మము.

స్వకర్మస్థుఁడు సం. విశ. (అ. ఆ. అ.) తన పని యందు నిమగ్నుడై యుండువాఁడు.

స్వకర్మి సం. విశ. (న్. నీ. న్.) స్వార్థపరుఁడు

స్వకామి సం విశ. (న్. నీ. న్.) స్వకర్మి, స్వార్థపరుఁడు

స్వకీయ సం. వి. ఆ. స్త్రీ. సొంతభార్య.

స్వకీయము సం. విశ. (అ. ఆ. అ.) 1. తనది. 2 తన కుటుంబమునకు సంబంధించినది.

స్వకుఁడు సం. వి. అ. పుం. మిత్రుఁడు, బంధువు.

స్వగతము సం. వి. అ. న. (అవ్యయమని 'ఆప్టే') 1. రహస్యము. 2. తనలోఁదాను మాటలాడుకొనుట. 3. నాటకాంగములలో నొకటి.

స్వగృహము సం. వి అ. పుం. ఒక విధమైన పక్షి. న. సొంతయిల్లు.

స్వచమసుఁడు సం. వి. అ. పుం చంద్రుఁడు.

స్వచరము సం. విశ. (అ. ఆ. అ.) తనంతదాను గదలునది.

స్వచ్ఛందజుఁడు సం వి. అ. పుం. 1. కొడుకు. 2. దుష్టుఁడు.

స్వచ్ఛందము సం విశ (అ. ఆ. అ) 1. సొంతమైనది. 2. కల్మషములేనిది. 3. స్వతంత్రమైనది. 4. సహజమైనది వి. అ పుం 1. తనయిష్టము. 2. స్వాతంత్ర్యము.

స్వచ్ఛటి సం వి ఈ. స్త్రీ చిటికెలు వేయుట.

స్వచ్ఛమణి సం. వి ఇ పుం. స్ఫటికము.

స్వచ్ఛము సం. విశ (అ ఆ. అ.) 1 నిర్మలము. 2 తెల్లనిది. 3. అందమైనది. 4 ఆరోగ్యవంతము వి. అ పుం. 1. స్ఫటికము. 2. రేఁగుచెట్టు న. ముత్యము 2. స్వర్ణరజత మిశ్రితమైన లోహము.

స్వచ్ఛవాలుకము సం వి. అ. న. తెల్లసుద్ద.

స్వజ సం. వి ఆ. స్త్రీ. కూఁతురు.

స్వజనుఁడు సం వి అ పుం. 1. పాలివాఁడు. జ్ఞాతి. 2. బంధువు. 3. సగోత్రజుఁడు.

**స్వజము** సం. విశ. (అ. ఆ. అ.) 1. స్వాయంభువు. 2. స్వాభావికమైనది. వి. అ. న. రక్తము. పుం, 1. చెమట. 2. ఒకజాతి విషసర్పము. 3. కొడుకు. 4. నెత్తురు

**స్వత** సం. వి. ఆ. స్త్రీ 1 స్వత్వము, 2. స్వామ్యము.

**స్వతంత్రత** సం. వి. ఆ స్త్రీ. 1. స్వతంత్ర భావము. 2. మౌలికత.

**స్వతంత్రము** సం. విశ. (అ ఆ. అ.) 1 ఆత్మీయ మైనది. 2. స్వేచ్ఛగలది. 3. యుక్తవయస్సు వచ్చినది

**స్వతంత్రించు** సం. అ. క్రి. 1. ఒకరి యనుమతి లేకుండఁ దానుగాఁ బ్రవర్తించు. 2. తానే ప్రధానముగాఁ బ్రవర్తించు.

**స్వతంత్రుఁడు** సం. వి. అ. పుం. గ్రుడ్డివాఁడు.

**స్వతఃప్రమాణ** సం. విశ. అ. న. ప్రత్యక్షనిరూపిత మైనది. తనంతఁదాఁ బ్రమాణమైనది.

**స్వతస్సిద్ధము** సం. విశ. (అ. ఆ. అ.) సహజము.

**స్వత్వబోధనము** సం. వి. అ. న. స్వామ్యనిదర్శనము

**స్వత్వము** సం. వి. అ. న. 1. సొమ్ము. 2. స్వామ్యము. 3 స్వేచ్ఛాజీవితము.

**స్వదనము** సం. వి. అ. న. 1. రుచిచూచుట 2. తినుట.

**స్వదితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. రుచిచూడఁబడినది. 2. తినఁబడినది.

**స్వదేశము** సం. వి. అ పుం. తనదేశము, మాతృభూమి.

**స్వధ** సం వి. ఆ. స్త్రీ. 1. అగ్నిదేవుని భార్య.

సీ, సంతుష్టమానస స్వాహా స్వధాకాంత లుభయ పార్శ్వంబుల నోలగింప. చిత్రభా. 4. 63 2. పితృదేవతల కొసఁగఁబడు బలి.

సీ వేదాధ్యయనములు విధివిహిత స్వధాస్వాహాదు లొగి నిలుపంగఁబడియె. మార్క. 2. 171.

3. తనస్వభావము. 4. తనభాగము. 5. మాయ 6 శ్రాద్ధము

**స్వధర్మము** సం. వి. అ. పుం. 1. స్వభావము. 2. స్వకులవృత్తి 3. తనమతము,

**స్వధాకారము** సం. వి.అ. పుం ''స్వధస్వధాయనెడు'' ధ్వని.

**స్వధానినయనము** సం. వి. అ. న. పితృదేవతలకు కవ్యము నొసఁగునపుడు ఉపయోగింపబడు పవిత్ర గ్రంథము.

**స్వధాప్రియము** సం. వి. అ. పుం. నల్లనువ్వులు.

**స్వధాప్రియుఁడు** సం. వి. అ. పుం. అగ్ని.

**స్వధాభుక్కు** సం వి. క్. పుం. పితృదేవత.

**స్వధాభుజుఁడు** = స్వధాభుక్కు.

**స్వధితి** సం. వి. ఇ. స్త్రీ. 1. గండ్రగొడ్డలి. 2. ముద్గరమను నాయుధ విశేషము.

**స్వధీతి** సం. వి ఇ. పుం. 1. వేదములను బాగుగాఁ జదివినవాఁడు. 2. బ్రహ్మచారి.

**స్వనచక్రము** సం. వి. అ. పుం. రతిబంధ విశేషము.

**స్వనము** సం. వి. అ. పుం. స్వరము. ధ్వని, మ్రోఁత.

**స్వని** సం. వి. ఇ. పుం. 1. ధ్వని. 2. అగ్ని.

**స్వనికము** సం విశ. (అ. ఆ. అ.) ధ్వని చేయునది.

**స్వనిఘ్నము** సం. విశ. (అ. ఆ. అ.) తనమీఁదనే యాధారపడినది

**స్వనితము** సం విశ. (అ. ఆ. అ.) మ్రోయునది. ధ్వనిచేయునది, వి. అ. న. 1. ఉఱుము. 2. ధ్వని.

**స్వపనము** సం వి అ. న. 1 నిద్రించుట. 2. కలగాంచుట. 3. శరీరము మొద్దువాఱుట.

**స్వప్నకుఁడు** సం వి అ. పుం. నిద్రించువాఁడు.

**స్వప్నక్కు** సం. విశ. (క్. క్. క్.) 1. స్వప్నకుఁడు. 2. నిద్రాళువు.

**స్వప్నదోషము** సం. వి. అ. పుం. నిద్రయందు రేతః స్ఖలనము

**స్వప్న భాషణము** సం. వి. అ. న. నిద్రయందలి పలవరింత.

స్వపము సం. వి అ. పుం. 1. కల. 2. నిదుర, 3. చూపు 4. ఆలస్యము. స. అజ్ఞత.

స్వప్నశువు సం. విశ. (ఉ ఉ. ఉ.) నిద్రాశీలుఁడు.

స్వప్రకాశము సం. విశ (అ. ఆ అ.) తనంతట దాను ప్రకాశించునది.

స్వబీజము సం. వి. అ. పుం ఆత్మ

స్వభానువు సం. వి. ఉ. పుం. ఒకానొక సంవత్సరము

స్వభావము సం వి. అ. పుం. 1. నిజభావము తత్త్వము. 2. అభ్యాసము. 3. స్వధర్మము.

స్వభావోక్తి సం. వి. ఇ. స్త్రీ. 1. సహజమైనమాట. 2. ఒకానొక యర్థాలంకారము.

స్వభువు సం. వి. ఊ. పుం. 1. విష్ణువు. 2. శివుడు. 3. బ్రహ్మ. ఊ. స్త్రీ. 1. స్వదేశము. 2. స్వగృహము.

స్వమనీషిక సం. వి. ఆ. స్త్రీ. ఉపేక్షాభావము.

స్వము సం. వి. అ. పుం. 1. సొమ్ము. 2. అహంకారము. 3. స్వభావము. 4. తాను. వి. పుం. ఆత్మ సం. విశ. (అ. ఆ. అ.) 1. తనది. 2. సహజమైనది. 3. తనజాతికిఁ జెందినది.

స్వమేకము సం. వి. అ. పుం. ఒక సంవత్సరము.

స్వయంకృతము సం విశ. (అ. ఆ అ.) 1. స్వయముగాఁ జేయబడినది 2. సహజమైనది.

స్వయంకృతుఁడు సం. వి అ. పుం దత్తపుత్రుఁడు.

స్వయంగ్రహము సం. వి అ. పుం స్వతంత్రముగా గ్రహించుట.

స్వయంగ్రాహము సం విశ (అ ఆ అ) బలవంతముగా గ్రహించునది. వి. అ పుం 1. దానపంచకములో నొకటి. 2 తానే కొంలించుకొనుట.

స్వయంజాతము సం విశ (అ ఆ అ.) తనంత దాఁబుట్టినది.

స్వయందత్తుఁడు సం వి అ. పుం ద్వాదశవిధ పుత్రులలో నొకఁడు, స్వయముపాగతుడు

స్వయంపాకము సం. వి అ. పుం 1. ఒకపూట బత్తెము 2. హవ్యకవ్యములయందు బ్రాహ్మణుల కిచ్చు వంట సామగ్రి. 3. నియమాతిశయము గల బ్రాహ్మణులు స్వయముగాఁ జేసికొనువంట.

స్వయంపాఠము సం వి. అ. పుం. మూలపాఠము.

స్వయంప్రకాశము సం. విశ (అ అ. ఆ) తనంతఁ దావ్యక్తమగునది.

స్వయంభువు సం. వి. ఊ. పుం. 1. శివుడు 2 బ్రహ్మ. 3. విష్ణువు. 4. మన్మథుఁడు 5. కాలపురుషుఁడు. 6. నక్షత్రము. 7. జైనతీర్థంకరుఁడు

స్వయంభువుఁడు సం వి అ పుం 1. మనవు 2. శివుఁడు. 3. బ్రహ్మ.

స్వయంభూతుఁడు సం వి అ. పుం శివుఁడు

స్వయంవరము సం. వి. అ. స్త్రీ. స్వయముగా మగని వరించుకన్య.

స్వయంవరము సం వి. అ. పుం. కన్య వరుని స్వయముగా వరించుట.

స్వయంశ్రేష్ఠుఁడు సం. వి. అ. పుం శివుఁడు.

స్వయముపాగతుఁడు సం. వి. అ. పుం తనంతదా వచ్చి పెంచుకొనుమని యడుగు కుమారుఁడు.

స్వయుతి సం. వి ఇ. స్త్రీ. లంబకర్ణములమ గలుపు నట్టి రేఖ.

స్వయూథ్యుఁడు సం. వి అ. పుం. బంధువు.

స్వయోని సం. విశ. (ఇ ఇ ఇ.) తల్లివంశపుచుట్టము వి ఇ పుం స్త్రీ. జన్మస్థానము. స్త్రీ. సోదరి దగ్గఱి బంధుత్వముగల స్త్రీ.

స్వర సం. వి. ఆ స్త్రీ బ్రహ్మ భార్య.

స్వరకంపము సం వి అ. పుం ఎలుఁగుఁకంపించుట.

స్వరక్షయము సం వి. అ పుం కంఠధ్వనిభంగము.

స్వరగ్రామము సం. వి అ పుం. మంద్రమునుండి హెచ్చు స్థాయివఱకు గల స్వరములు, సరళి.

స్వరచిఛ్ఛిద్రము సం వి అ. న. వేణువునందలి రంధ్రము.

**స్వరతిక్రమము** సం. వి అ పుం. వైకుంరము జేరుట

**స్వరనాభి** సం వి ఇ. పుం. ఒకవిధమైన వేణువు

**స్వరనేత్రాంగవికారము** సం. వి అ. పుం. భక్త్యంగము, భక్తివిశేషము

**స్వరపత్తనము** సం. వి. అ. న. సామవేదము

**స్వరపరివర్తనము** సం వి. అ. న. కంఠధ్వని యొక్కమార్పు.

**స్వరబద్ధము** సం. విఐ. (అ. ఆ. అ) లయానుగుణముగాఁ గూర్పఁబడినది

**స్వరబ్రహ్మము** సం. వి. న్. పుం. శబ్దబ్రహ్మము.

**స్వరభక్తి** సం. వి. ఇ. స్త్రీ. సంయుక్తాక్షరముల నడుమఁజేర్పఁబడెడి యచ్చు. (ఉదా చంద్రుడు చందురుఁడు)

**స్వరభంగము**=స్వరభేదము. సం. వి. అ. పుం. గొంతు బొంగురు పోవుట.

**స్వరభంగి** సం. వి న్. పుం. ఒకవిధమైనపక్షి.

**స్వరభేదము**=స్వరభంగము.

**స్వరమండలము** సం. వి. అ. న. స్వరగ్రామ మూర్ఛనా తానాదుల సమూహము. (సప్తస్వరా స్త్రయో గ్రామా మూర్ఛనా శ్చైకవింశతిః, తానా స్త్వేకోన పంచాశ దిత్యేతత్ స్వరమండలమ్)

**స్వరమండలిక** సం. వి. ఆ. స్త్రీ ఒకవిధమైన వీణ.

**స్వరము** సం. వి. అ. పుం. 1. ముక్కుగాలి. 2. ఉదాత్తాంస్వరము. 3. అకారాదికమైనయచ్చు. 4. షడ్జాదికము. 5. సప్తసంఖ్య. 6. గుఱ్ఱుపెట్టుట. 7. కంఠమాధుర్యము.

**స్వరయతి** సం. వి. ఇ స్త్రీ. ఒకానొకయతిభేదము (ఒక యచ్చునకు మిత్రమైన వేఱొక యచ్చుతో వేసెడు యతి. ఇది యేడు విధములని అప్పకవి చెప్పెను.)

**స్వరయోగము** సం. వి అ. పుం కంఠధ్వని.

**స్వరలాసిక** సం. వి. ఆ. స్త్రీ. వేణువు.

**స్వరవిభక్తి** సం వి. ఇ స్త్రీ. అచ్చును వేఱుచేయుట.

**స్వరసంపత్తు** సం వి.ద్ స్త్రీ కంఠధ్వని మాధుర్యము

**స్వరసము** సం వి. అ. పుం. 1. సహజమైనరుచి. 2. రచనయందలి స్వాదుత. 3. ఒగరైన రసము

**స్వరాజ్యము** = స్వరాష్ట్రము సం. వి. అ. న. 1. స్వతంత్రరాష్ట్రము. సొంతరాజ్యము

**స్వరాట్టు(ట్టు)** సం. వి. ట్. పుం 1. బ్రహ్మము. సూర్యుని యేడు కిరణములలో నొకటి. 3. విష్ణువు 4. ఏఁబదిలక్షలనుండి కోటి కర్షముల వఱకు రాబడి వచ్చు రాజు.

**స్వరాష్ట్రము**=స్వరాజ్యము.

**స్వరింగణము** సం. వి. అ పుం బలముగల వాయువు.

**స్వరితము** సం. విఐ. (అ ఆ అ) 1 మ్రోగునట్లు చేయఁబడినది. 2. స్వరముతోఁగూడినది 3. కలుపఁబడినది. వి. అ. పుం. ఉదాత్తానుదాత్తములకు నడిమిధ్వని (సమాహారః స్వరితః)

**స్వరువు** సం. వి. ఉ. పుం. 1. యజ్ఞము. 2. వజ్రాయుధము. 3. యూపస్తంభము చెక్కునపు డెగసిన బెరడు 4. యూపఖండము. 5. యూపస్తంభభాగము. 6. పిడుగు 7. ఖడ్గము. 8. బాణము అమ్ము. 9. ఒక విధమైన తేలు. (ఉ, ఉ, ఉ,) 1. మ్రోయునది. 2. తపింపఁజేయునది.

**స్వరూపము** సం. వి. అ. న. 1. ఆకారము, 2. స్వభావము 3. సొగసు. 4, స్థితి. 5. విధము. విఐ, (అ, ఆ, అ,) 1. సదృశము. 2. సుందరము. 3. తెలివి గలది.

**స్వర్గంగ** సం వి. ఆ. స్త్రీ. 1. ఆకాశగంగ. 2. పాలవెల్లి.

**స్వర్గతి** సం వి ఇ. స్త్రీ. 1. మరణము. 2. స్వర్గమునకేగుట.

**స్వర్గతుఁడు** సం. వి. అ. పుం. మరణించినవాఁడు.

**స్వర్గపతి** సం వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

**స్వర్గపథము** సం వి. అ. పుం. పాలవెల్లి.

**స్వర్గమనము** సం. వి. అ. న. 1. స్వర్గమున కేగుట. 2. మరణము.

**స్వర్గము** సం. వి. అ. పుం. 1. దేవ లోకము. 2. ముక్తి.

**స్వర్గవధువు** సం. వి. ఊ. స్త్రీ. అప్సరస. (ఇట్లే స్వర్గ స్త్రీ మున్నగునది.)

**స్వర్గస్థుఁడు** సం వి. అ. పుం. 1. స్వర్గమందున్న వాఁడు. 2. మరణించినవాఁడు.

**స్వర్గారోహణము** సం. వి. అ. న. 1. స్వర్గాధిగమనము. 2. శ్రీమహాభారతమున నొక పర్వము.

**స్వర్గి** సం. విశ. (న్. జీ. న్.) స్వర్గమునకు సంబంధించినది. వి. న్. పుం. 1. స్వర్గము నందుండు వాఁడు; మృతుఁడు. 2. వేల్పు.

**స్వర్గిరి** సం. వి. ఇ. పుం. స్వర్ణగిరి, సుమేరువు.

**స్వర్గియ(ర్గ్య)ము** సం విశ. (అ. ఆ. అ.) 1. స్వర్గమునకు సంబంధించినది. 1. స్వర్గమును గూర్చునది, స్వర్గమునకుఁ బంపునది.

**స్వర్జకము** సం. వి. అ. పుం. సురేకారము, పెట్లుప్పు.

**స్వర్జి** సం. వి. న్. పుం. =స్వర్జకము.

**స్వర్జిత్తు** సం వి త్. పుం. ఒక విధమైన యజ్ఞము.

**స్వర్ణకము** సం. విశ. (అ ఆ అ) సువర్ణ వికారమైనది, బంగరు రంగు గలది.

**స్వర్ణకారుఁడు** సం. వి. అ. పుం. అగసాలె, బంగరు పని చేయువాఁడు.

**స్వర్ణ కేతకి** సం. వి. ఈ స్త్రీ బంగారుమొగలి.

**స్వర్ణక్షీరి(ణి)** సం వి. ఈ. స్త్రీ 1. బలురక్కెస చెట్టు. 2. కంగుష్ఠము.

**స్వర్ణగర్భుఁడు** సం. వి. అ. పుం. 1. పాలపిట్ట. 2. కోశపంజు.

**స్వర్ణజము** సం. వి అ. న. తగరము.

**స్వర్ణదీధితి** సం వి. ఇ పుం. అగ్ని.

**స్వర్ణద్వీపము** సం. వి. అ పుం. సుమత్రా ద్వీపము.

**స్వర్ణనాభము** సం. వి. అ. పుం. సాలగ్రామము.

**స్వర్ణపక్షుఁడు** సం. వి. అ. పుం. గరుడుఁడు.

**స్వర్ణపద్మ** సం. వి. ఆ. స్త్రీ. గంగానది.

**స్వర్ణపాటకము** సం. వి. అ. పుం. వెలిగారము

**స్వర్ణపారేవతము** సం. వి. అ. న. పెద్ద యీఁక (వృ. వి.)

**స్వర్ణపుష్పము** సం. వి. అ పుం. చంపక వృక్షము.

**స్వర్ణపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. జీలుగు. (వృ. వి.)

**స్వర్ణబందువు** సం. వి. ఉ. పుం విష్ణువు.

**స్వర్ణభూమిక** సం. వి. ఆ స్త్రీ. 1. అల్లము. 2. దాల్చిని.

**స్వర్ణభృంగారము** సం వి అ పుం. బంగారు పెట్టె.

**స్వర్ణమాక్షికము** సం. వి. అ న. ఒక విధమైన ధాతుద్రవ్యము.

**స్వర్ణము** సం వి అ. న. 1. బంగారము. 2 బంగారు నాణెము 3. గైరిక ధాతువు 4. ఎఱ్ఱ ఉమ్మెత్త చెట్టు. 5. గుజ్జు నారికేడము.

**స్వర్ణయూథిక** సం. వి. ఆ. స్త్రీ. పచ్చని మల్లె.

**స్వర్ణరేతుఁడు** సం. వి న్. పుం. 1. సూర్యుఁడు. 2. అగ్నిహోత్రుఁడు.

**స్వర్ణవజ్రము** సం. వి. అ. న ఒక విధమైన యుక్కు.

**స్వర్ణవల్లి** సం వి. ఈ. స్త్రీ. పెద్ద మానేరు. (వృ. వి.)

**స్వర్ణవర్ణము** సం. వి అ న. పసుపు ఇట్లే స్వర్ణ వర్ణ (ఆ. స్త్రీ.)

**స్వర్ణస్తేయము** సం వి అ. న. బంగారమును దొంగిలించుట. (పంచ మహా పాతకములలో నొకటి.)

**స్వర్ద్రుక్కు** సం. వి క్. పుం. 1. ఇంద్రుఁడు. 2. అగ్ని. 3. సోమము (వృ. వి.)

**స్వర్ధుని** సం వి. ఈ స్త్రీ గంగానది

**స్వర్భానవము** సం వి అ పుం. విలువైన రత్న విశేషము.

**స్వర్భానువు** సం వి. ఉ పుం. రాహువు.

**స్వర్మణి** సం. వి ఇ. పుం సూర్యుఁడు.

స్వర్యము సం. విశ. (అ ఆ. అ.) కంఠధ్వని కనుకూలమైనది.

స్వర్వ్యాపి సం. వి ఈ. స్త్రీ. గంగానది.

స్వల్పకంకము సం. వి. అ. పుం నారాయణ పక్షి.

స్వల్పకేసరి సం. వి న్. పుం. కోవిదార వృక్షము.

స్వల్పదురాలభ సం వి ఆ. స్త్రీ. చిన్న రేఁగడి. (వృ. వి.)

స్వల్పము సం. విశ. (అ. ఆ. అ.) 1. అప్రధానమైనది, 2. కొంచెము. 3, మిక్కిలి యల్పమైనది.

స్వల్పాంగులి సం. వి. ఇ. పుం. చిటికెన వ్రేలు,

స్వల్పిష్ఠము సం. విశ. (అ. ఆ. అ ) స్వల్పతమము

స్వల్పీయము సం. విశ. (స్. సీ. స్.) స్వల్పతరము,

స్వవశ సం. వి. ఆ. స్త్రీ. స్వతంత్రురాలు,

స్వవాసిని సం. వి. ఈ. స్త్రీ. = సువాసిని. 1, పేరంటాలు, 2, పుట్టింట నుండెడిది

స్వస సం. వి. ఋ. ఆ. స్త్రీ. తోడఁబుట్టినది, సోదరి.

స్వసేయుఁడు = సం. వి. అ. పుం. మేనల్లుడు, సోదరి యొక్క కొడుకు.

స్వస్తి సం. అవ్య. 1. క్షేమము. 2. శుభము, 3. ఆశీర్వాదము.

స్వస్తికము సం. వి. అ. పుం. 1. తూర్పువాకిలిగల రాజగృహము. 2. భుజబంధవిశేషము. 3. మంగళవస్తువు. 4. ముగ్ధస్త్రీ హస్తవిన్యాసవిశేషము. 5. పాముపడగమీఁదివల్లని రేఖ. 6.నాలుగుత్రోవలు కలియుచోటి. 7. అదృష్టము సూచించుగుర్తు 8. కంఠమునకిరువైపుల రెండుచేతుల నడ్డముగా నుంచుట. 9. ఒకవిధమైన భక్ష్యము 10 యోగాసనములలోనొకటి. 11. దేవతకై యేర్పఱుపఁబడిన పీఠము. 12. వెల్లుల్లి.

స్వస్తికర్మము సం. వి. న్. న. శుభము కలిగించు కార్యము.

స్వస్తికారుఁడు సం. వి. అ. పుం. స్తుతిపాఠకుఁడు.

స్వస్తికుఁడు సం. వి. అ. పుం. 1. స్వేచ్ఛావర్తనము కలవాఁడు. . . స్తుతిపాఠకుఁడు.

స్వస్తిదుఁడు సం. వి. అ. పుం. శివుఁడు.

స్వస్తిముఖము సం. వి. అ. పుం. లేఖ.

స్వస్తిముఖుఁడు సం. వి. అ. పుం. 1. దైనము. 2. బ్రాహ్మణుఁడు. స్తోత్రపాఠకుఁడు.

స్వస్తివాచకము సం. వి. అ. పుం. 1. ఆశీర్వచనము. 2 అభినందనము. 3. యజ్ఞయాగాదులకు ముందు చేయఁబడు కార్యము. 4. శుభాభినందన పూర్వకమైన పుష్పపారితోషికము. (ఇట్లే స్వస్తివాచనకము, స్వస్తివాచనికము.)

స్వస్తివాచ్యము సం. వి అ. న. అభినందనము.

స్వస్థత సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రసాదము. 2. ఆరోగ్యముగా నుండుట.

స్వస్థమగు స. క్రి. తేలుకొను, ఆరోగ్యమునొందు.

స్వస్థము సం. విశ. (అ. ఆ. అ.) నెమ్మదిగా నుండు నుండునది. 2 స్వర్గమందుండునది. (స్వస్థా భవంతు కురురాజ సుతాః స్సభృత్యాః వేణీ.)

స్వస్రీయ సం. వి. ఆ. స్త్రీ. మేనగోడలు. సోదరి కొమార్తె.

స్వస్రీయుఁడు సం. వి. అ. పుం. మేనల్లుఁడు. సోదరి పుత్రుడు.

స్వస్రేయి సం. వి. ఈ. స్త్రీ.=స్వస్రీయ.

స్వస్రేయుఁడు=స్వస్రీయుఁడు.

## స్వా

స్వాంకికుఁడు సం. వి. అ. పుం. మార్దంగికుఁడు.

స్వాంతము సం. వి. అ. న. 1. మనస్సు. 2. అనునయించుట. 3. గుహ. 4. రంధ్రము. 5. తన మరణము.

స్వాగతము సం. వి. అ. న. 1. కుశలప్రశ్నము. 2. సుఖముగా వచ్చితిరా యని యడుగుట. 3. ఒకానొక వృత్తము. విశ. (అ ఆ. అ.) 1. న్యాయముగా నార్జింపఁబడినది 2. అభిమతమైనది

**స్వాగమము** సం. వి. అ. పుం. 1. స్వాగతము. 2. వందనము.

**స్వాఘాతము** సం. వి. అ. పుం. బరివెంకచెట్టు.

**స్వాచ్ఛ్యము** సం. వి. అ. న. స్వచ్ఛత.

**స్వాజన్యము** సం. వి. అ. న. 1. స్వజనత్వము. 2. సంబంధము.

**స్వాతంత్ర్యము** సం. వి. అ. న. స్వతంత్రభావము.

**స్వాతి** సం. వి. ఈ. స్త్రీ. 1. సంజ్ఞాదేవి, సూర్యుని భార్య. 2. ఒకానొక నక్షత్రము. 3. ఖడ్గము.

**స్వాదనము** సం. వి. అ. న. 1 పానము 2. రుచి. 3. అనుభవము. 4. స్వాదువుగానొనరించుట, 4. కావ్యాదుల సౌందర్యము. పుం. 1. రుచి. 6. రుచిచూచుట.

**స్వాదము** సం. వి. అ. పుం. 1. రుచి. 2. రుచి చూచుట.

**స్వాదవము** సం. వి. అ. న. స్వాదుత్వము,

**స్వాదితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పానము చేయఁబడినది. 2. రుచిచూడఁబడినది 3. స్వాదువుగాఁజేయఁబడినది.

**స్వాదిమ** సం. వి. న్. పుం. మాధుర్యము.

**స్వాదిష్ఠము** సం. విశే. (అ. ఆ. అ.) 1. స్వాదుతమము 2. మిక్కిలి గృఢమైనది 3. పూజ్యమైనది.

**స్వాదీయము** సం. విశే. (న్. సీ. న్.) స్వాదతరము

**స్వాదుకంటకము** సం. వి. అ. పుం. 1 పల్లేరు పల్లవెలగ (వృ. వి.)

**స్వాదుధన్వుఁడు** సం. వి. న్. పుం. తియ్యని విలుకాఁడు, మన్మథుఁడు.

**స్వాదుపుష్పము** సం. వి. అ. పుం. అరుదొండ. (వృ. వి)

**స్వాదుఫల** సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష. (వృ. వి.)

**స్వాదుఫలము** సం వి. అ. న. రేఁగుపండు

**స్వాదురస** సం. వి. ఆ. స్త్రీ. 1. కారుగోగుమిడి. (వృ. వి) 2. శతావరి. (వృ. వి.) 3 మద్యము 4. ద్రాక్ష.

**స్వాదులుంగి** సం వి. ఈ. స్త్రీ. 1. దబ్బకాయ 2. దబ్బచెట్టు

**స్వాదువు** సం. విశే. (ఉ. ఉ. ఉ.) 1. ఇంపైనది. 2. పరిశుద్ధమైనది. 3. తియ్యనిది. 4. దృఢమైనది. వి, ఉ, పుం, 1. మాధుర్యము, 2. బెల్లము. న, 1. మాధుర్యము. 2. రుచి. 3. అందము. స్త్రీ. ద్రాక్ష.

**స్వాదుశుద్ధము** సం. వి. అ. న. 1. రాతియుప్పు.

**స్వాదూదము** సం. వి. అ. పుం 1. మంచినీళ్ళ సముద్రము.

**స్వాద్యము** సం వి. అ. న 1. ఉప్పన. 2. రసము.

**స్వాద్వి** సం. వి. ఈ. స్త్రీ ద్రాక్ష.

**స్వాధిష్ఠానము** సం. వి. అ. న. షట్చక్రములలో నొకటి.

**స్వాధీనత** సం. వి. ఆ. స్త్రీ. తనవశమై యుండుట

**స్వాధీనపతిక** సం వి ఆ. స్త్రీ. నాయికా విశేషము. (స్వాధీనుఁడైన పతిగల నాయిక.)

**స్వాధీనము** సం. విశే. (అ. ఆ. అ.) స్వవశమైనది.

**స్వాధ్యాయము** సం, వి, అ, పుం, 1. వేదాధ్యయనము 2 వేదము 3 జపము.

**స్వాధ్యాయి** సం. వి. న్. పుం. 1 వేదాధ్యయనము చేయువాఁడు. 2. ఉపాధ్యాయుడు 3 పట్టణమందలి వర్తకుఁడు.

**స్వానము** సం. వి. అ. పుం. స్వనము, ధ్వని.

**స్వాపకము** సం. విశే. (అ. ఆ. అ.) నిద్రకలుగఁజేయునది

**స్వాపతేయము** సం. వి. అ. న. ధనము.

**స్వాపము** సం. వి. అ. పుం. 1. శయనము. 2. స్వప్నము. 3. నిద్ర. 4. తిమ్మిరి. 5. అజ్ఞానము.

**స్వాపవ్యసనము** సం. వి. అ. న. నిద్రమబ్బు

**స్వాప్నము** సం. విశే. (అ. ఆ. అ.) నిద్రకు లేక స్వప్నమునకు సంబంధించినది.

**స్వాభావికము** సం. విశే. (అ. ఈ. అ.) స్వభావము చేతఁగలిగినది, సహజమైనది.

స్వాభావికులు సం. వి. అ. పుం. ఒక తెగ బౌద్ధులు.

స్వాభావ్యము సం. వి. అ. న. 1. సహజత్వము. 2 సహజస్థితి

స్వాభాసము సం. విశ. (అ. ఆ. అ) మిక్కిలి ప్రకాశ మానమైనది

స్వాభీలము సం విశ. (అ. ఆ. అ) 1. ప్రబలమైనది 2. భయంకరమైనది.

స్వామి సం వి. న్. పుం. 1. అధిపతి. 2. భర్త 3. రాజు. 4. నాయకుఁడు 5, ఈశ్వరుఁడు. 6 యజమాని. 7. తత్త్వము బోధించు గురువు. 8. సన్న్యాసి. 9. కుమారస్వామి. 10. బ్రాహ్మణుఁడు. 11. దేవతా విగ్రహము.

స్వామిజంఘి సం. వి. న్. పుం. 1. పరశురాముఁడు

స్వామిజనకుఁడు. సం. వి. అ. పుం. 1. మగని తండ్రి.

స్వామిని. సం. వి. ఈ. స్త్రీ. 1. రాజుభార్య. 2. రాణి 3. ఈశ్వరి.

స్వామిభట్టారకుఁడు, సం. వి. అ. పుం. 1. ప్రభువు.

స్వామ్నాయము సం. విశ. (అ. ఆ. అ.) సంప్రదాయ సిద్ధముగా వచ్చినది.

స్వామ్యము సం. వి. అ. న. సొంతమగుట, హక్కు (అష్టస్వామ్యములు - దాన, విక్రయ, వినిమయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపములు,) 2. అధిపత్యము. 3. స్వాస్థ్యము.

స్వాయంభువము సం. విశ. (అ. ఈ. అ) 1. బ్రహ్మకు సంబంధించినది. 2. బ్రహ్మనుండి వచ్చినది.

స్వాయంభువుఁడు సం. వి. అ. పుం. 1. బ్రహ్మకుమారుఁడు. 2. ఒకానొక మనువు.

స్వాయత్తము సం. విశ. (అ. ఆ. అ.) 1. తనకధీనమైనది. 2. తనమీఁదనే యాధారపడి యుండునది.

స్వారసికము సం. విశ. (అ. ఈ. అ.) 1. సహజ మాధుర్యము గలది. 2. స్వచ్ఛందమైనది.

స్వారస్యము సం. వి. అ. న. 1. సహజ సౌందర్యము కలిగియుండుట. 2. లాలిత్యము 3. సహజత్వము.

స్వారాజు సం. వి. అ. పుం. = స్వారాజ్యుఁడు. ఇంద్రుఁడు.

శా. స్వారాజ ప్రముఖా మరప్రవరులన్ వర్జించి... ... నైష. 6. 79.

స్వారాట్టు సం. వి. ట్. పుం. ఇంద్రుఁడు.

స్వారి వి. వాహ్యాళి, విహారము,

గీ. శివుఁడు మంధాచగిరితుంగ శృంగవీథిఁ, జెలువు మీఱంగ స్వారి వెంచేయునపుడు. ఉ. రా. 1. (శ. ర.)

స్వారోచిషుఁడు సం. వి. అ. పుం. 1. స్వరోచిపుత్రుఁడు. 2. రెండవ మనువు.

స్వార్థము సం. వి. అ. పుం. 1. ధాత్వాదులకు నిశ్చితమైన యర్థము. 2 తనప్రయోజనము.

స్వాలక్షణము సం. విశ. (అ. ఆ. అ.) 1. సులభముగా గ్రహింపదగినది.

స్వాలక్షణ్యము సం. వి. అ. న. 1. వింతలక్షణము. 2. సహజలక్షణములు.

స్వాల్పము సం. విశ. (అ. ఈ. అ.) చిన్నది, 1, కొంచెము, వి. అ. న 1. అల్పత్వము.

స్వావశ్యము సం. వి. అ. న. 1. ఆత్మనిశ్చయము.

స్వాస్థ్యము సం. వి. అ. న. 1. స్వస్థత. 2. ఆత్మ విశ్వాసము. 4. స్థిరత్వము. 5. సంపద. 6. తృప్తి. 7. ఆరోగ్యస్థితి.

స్వాహ సం. వి. అ. స్త్రీ. 1. అగ్ని దేవుని భార్య.

సీ. సంతుష్టమానస స్వాహా స్వధాకాంత లుభయ పార్శ్వంబుల నోలగింప. చిత్రభా. 4. 68.

2. సర్వదేవతా సామాన్యమైన యాహుతి.

సీ. వేదాధ్యయనములు విధివిహిత స్వధాస్వాహాదులొగి నిలువంగబడియె. మార్క. 2. 171.

3. బుద్ధుని భార్య.

స్వాహా సం. అవ్య. విధిదృష్టములైన అగ్నికార్యాదుల

యందు దేవతాగుల కాహుతు లొసఁగునపుడు మంత్రాంతమున వాడఁబడు పదము.

గీ. ప్రాణముఖ వాయువులకు స్వాహాంతములుగ' జఠరశిఖయంగ దన్నామ సరణి మున్ను, వేల్చి భజియించి వార్చి పవిత్రుఁడగుము, జదువఁదగు శ్రుతి పరమంత్ర సక్తిమాని. సూత. 2. 114.

**స్వాహావల్లభుఁడు** నం. వి. అ. పుం. అగ్ని దేవుఁడు (ఇట్లే స్వాహాపతి, స్వాహాప్రియుఁడు).

## స్వి

**స్విదితము** నం. విశ. (అ. ఆ. అ). 1. చెమటపట్టినది. 2 కరఁగినది.

**స్విన్నము** నం. విశ. (అ. ఆ. అ.) స్వేదముతోఁ గూడినది. 2. ఉడికినది.

**స్విష్టము** నం. విశ. (అ. ఆ అ.) అధికముగాఁ బ్రేమింపఁబడినది

## స్వీ

**స్వీకరించు** నం స. క్రి. 1. గ్రహించు, 2. అంగీకరించు 3. అపహరించు.

**స్వీకర్త** నం. విశ. (ఋ. త్రీ. ఋ.) స్వీకరించువాఁడు.

**స్వీకారము** నం. వి. అ. పుం. 1. అంగీకారము. 2 గ్రహణము. 3. పాణిగ్రహణము. (స్వీకరణము నం. వి అ. న స్వీకృతి ఇ. స్త్రీ.)

**స్వీకృతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁబడినది 2. గ్రహింపఁబడినది.

**స్వీయ** నం. వి. ఆ. స్త్రీ. ఒకానొక నాయిక. (పతియందే యనురాగము కలది)

**స్వీయము** నం. విశ (అ ఆ. అ.) తనది.

## స్వు

**స్వుఁడు** నం. వి. అ పుం. 1. బంధువు. 2 విష్ణువు

## స్వే

**స్వేచ్ఛ** నం. వి. ఆ. స్త్రీ. 1. ఇష్టము. 2. స్వైరిత.

**స్వేచ్ఛామృత్యువు** నం. వి. ఉ. పుం 1. భీష్ముఁడు 2. తనయిచ్ఛ ననుసరించి పొందు మృత్యువు.

**స్వేదచూషకము** నం. వి. అ. పుం. చెమటను పోగొట్టు చల్లనిగాలి.

**స్వేదచ్ఛిదము** నం. విశ. (ద్. ద్. ద్) చల్లపఱుచునది.

**స్వేదజము** నం. విశ. (అ అ అ.) చెమటనుండిపుట్టు క్రిమికీటము.

సీ. మశకా క్రిమికీట మత్కుణమశకముల్ చీమలు మిడుతలు స్వేదజములు. శివధ 5. 7

**స్వేదజలము** నం వి. అ. న. చెమటనీరు.

**స్వేదనము** నం. వి. అ. న. 1. చెమటపట్టునట్లు చేయుట. 2. చీము.

**స్వేదని** నం. వి ఈ స్త్రీ. పెనము

**స్వేదనిక** నం. వి. ఆ. స్త్రీ 1. పెనము. 2 వంటిల్లు.

**స్వేదమాత** నం వి. ఋ. స్త్రీ. అన్నరసము.

**స్వేదము** నం వి అ. పుం 1. చెమట. 2 ఒకానొక సాత్త్విక భావము. 3. ఉష్ణము, ఆవిరి.

**స్వేదితము** నం. విశ. (అ అ అ) 1 ఆవిరితోఁ గాచఁబడినది. 2. మృదువుగాఁ జేయబడినది

## స్వై

**స్వైరము** నం. విశ. (అ ఆ. అ) తనయిచ్ఛ వచ్చినట్లు సంచరించునది. 2. స్వేచ్ఛతోఁ కూడినది. 3. రహస్యమైనది. 4. ఋజువైనది. 5. మందమైనది.

వి. అ. న. స్వేచ్ఛ, స్వతంత్రత.

స్వైరవిహారి సం. విశ. (న్. జి. న్.) అడ్డులేకుండ సంచరించునది.

స్వైరాలాపము సం. వి. అ. పుం. రహస్య సంభాషణము.

స్వైరి సం. విశ. (న్. జి. న్.) ఇష్టానుసారముగా సంచరించునది.

స్వైరిణి సం. వి. ఈ. స్త్రీ. 1. ఇష్టానుసారముగా సంచరించుస్త్రీ. 2. కులట.

కం....స్వైరిణి నాఁ, దగు మగని విడిచి వేఱొక మగనిఁ దగిలి లజ్జలేక మనియెడు నేనిన్. విజ్ఞా. కాం. 1..10

స్వైరిత సం వి. అ. స్త్రీ 1. స్వేచ్ఛ. 2. విచ్చలవిడి వర్తకము

స్వైరుఁడు సం. విశ. (అ. ఆ. అ.) 1. స్వైరి 2. సోమరి.

స్వోదరపూరకుఁడు సం. వి అ. పుం. కుక్షింభరి

స్వోరసము సం. వి అ. పుం. 1 గానుగపిండి. 2. పొల్లు.

స్వోవశీయము సం. వి. అ. న. 1. సౌఖ్యము. 2. సంపద.

## హ

హ ఉభ. ఒకయక్షరము, ఊష్మములలోఁ గడపటి వర్ణము

హంకరించు అ. క్రి. అహంకరించు, గర్వించు, అభిమానము వహించు (శ.ర.)

హంకారము వి. (సం. అహంకారః) అభిమానము. అహంకారము.

సీ....తనువుమూలము దుఃఖములకు దేహము కర్మమునను బుట్టు, హంకారమునుగల్గు నమ్మేను నందువఁ గర్మంబులెల్లను గల్గుచుండు, అధ్యా. కిష్కిం. 129. పా.

సీ. తనుకొండునెఱతనంబులుపుట్ట పుట్టిల్లు హంకారములకెల్లనాటపట్టు. చంద్రా. 2.10.

హంగు వి. 1. ఒనరు, అనుకూల్యము

ఆ. వేసమునకునైన దాసరిగావచ్చు, హంగుదప్పు వేళ జంగమగును. వేమన. 262 (బ్రౌ.)

2. కార్యసిద్ధికై వెనుకనుండి చేయుప్రయత్నము. వ్యవ :—వాఁడు వెనుకనుండి హంగుచేయుచున్నాడు.

హంజ సం. వి. అ స్త్రీ. దాసి. (ఆ.ని.)

హంజి సం వి. ఇ పుం తుమ్ము.

హంజిక సం. వి అ. స్త్రీ 1. దాసి. 2. ఓషధివిశేషము

హంజే సం. అవ్య. చేటిని సంబోధించుటవు డుపయోగించు పదము,

హండ(డా) సం. వి. అ. స్త్రీ. . వెడల్పునోరుగల పెద్దమృత్పాత్రము, 2. వెడల్పునోరుగల పెద్ద లోహపాత్రము. (ఆ. ని.) 3. నీచజాతి స్త్రీ.

హండి సం. వి ఈ. స్త్రీ. హండా, వెడల్పునోరు గల పెద్దమంటి పాత్రము (ఆ. ని.)

హండిక సం. వి. అ. స్త్రీ. హండి

హండే సం, అవ్య. నీచస్త్రీ సంబోధనమున నాడఁదగిన పదము.

హంత సం. విశ. (ఋ. త్రి. ఋ.) చంపువాఁడు. 2. హింసించువాఁడు. 3. తొలఁగించువాఁడు. 4. ధ్వంసము చేయువాఁడు. వి. ఋ. పుం. 1. చంపువాఁడు. 2. దొంగ. అవ్య. సంస్కృతమున సంతోషాశ్చర్య విషాదాదులను దెలుపుటకై యుపయోగింపఁబడును.

హంత విశ. దుష్టురాలు.

కం. కాంతల నమ్ముదురే ధీమంతు లిసీ సుతనుల తలు మాయా మృగముల్, హంతలు జగజంతలు నిను. మంతయు లోకాపవాద మరయరు మదిలోన్. శుక. 1. 117.

వి. మాయ, మోసము. చూ. హంతలాఁడి.

**హంతకారము** సం. వి. అ. పుం. అతిథికి సమర్పించు నుపహారము.

**హంతలాఁడి** విణ. (హంతలు + ఆఁడి.) మాయలాఁడి, మోసకత్తె.

గీ. అక్కటా కానవైతి నీహంతలాఁడి, వగలు నమ్మితిఁగద పతివ్రతయటంచు. శుక. 3. 636.

**హంతువు** సం. వి. ఉ. పుం. 1. చంపుట. 2. చావు. 3. ఎద్దు.

**హంభ** సం. వి. ఆ. స్త్రీ. గోధ్వని, అవు అఱపు.

**హంవీరతాయెతు** వి, వి. 1. శూరతా చిహ్నమగు నలంకార విశేషము.

వ. ... పొగరు దిఱిగి నాదుమబుఁగునం బరగు పగటలం గావుమని కరతలంబుల వ్రాలిన కాంత చనుంబు రీతిమగ వాతి హంవీర తాయెతు సొంపు నింపఁ గళావిలాసంబున సంపూర్ణ చంద్రబింబంబు జయించు ... చంద్రా. 5. 124.

2. ఒక విధమగు భూషణము.

వ. ... చేకట్టులు హంవీరతాయెతులు తాళీలు కంఠమాలికలు కంటసరు లుత్తరిగెలు చౌకట్టు లొంటులు మురువులు తురాలు కిరీటంబు లనంబ ఁగు నాభరణంబులును ... ప్రబంధ 605.

ఁగడ. రంగుగల ముంగా మురాలు నాభరణములు, నంగదంబులు మంచి హంవీరతాయెతులు. హంస 5. 356.

**హంవీరనాట** వి. రాగవిశేషము, (సంగీ.) ముప్పది రెండు నపుంసక రాగములలో నొకరాగము.

గీ. రీతిగౌళయు నీలాంబరియును ఘనము, దనరు హంవీరనాటయు వని నపుంసకములు ముప్పది రెండు రాగములు ... ప్రబంధ. 97.

**హంవీరుఁడు** సం. వి. అ. పుం. క్షత్రియుడు, విణ. (అ. ఆ. అ.) శూరుఁడు ... సమరహంవీరుఁడు... కళాం. 5 ఆ. (శ. ర.)

**హంస** సం. వి. అ. పుం. 1. అంచే. 2. పరమాత్మ. 3. యోగివిశేషము. 4. శరీరవాయు విశేషము. 5. తెల్ల గుఱ్ఱము. 6. మంత్రవిశేషము. 7 మాత్స ర్యము 8. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము. రాజ హంస మొ॥ (శ.ర.) [కొన్ని యర్థములలో హంసము అనియు వాడఁబడును]

**హంసకము** సం. వి. అ. పుం. 1. కాలియందె. 2. అంచే.

**హంసకాళీతనయము** సం వి. అ పుం. దున్నపోతు,

**హంసకీ (నీ) లకము.** సం వి అ పుం రతిబంధ విశేషము

**హంసకూటము** సం. వి. అ. పుం 1. హిమాలయ శిఖరములలో నొకటి 2. ఎద్దుమూపురము.

**హంసగద్గద** . సం. వి. అ. స్త్రీ మధురముగా మాట లాడు స్త్రీ.

**హంసగుహ్యము** సం. వి. అ. న. ఒకానొక బుక్కు.

**హంసచ్ఛత్రము** సం. వి. అ. న. సొంటి.

**హంస తిలక(ము)** సం. వి. అ. న. రాగిడిబిళ్ళ.

సీ. శృంగార రాజ్యలక్ష్మికి ముడిగలిపిన. గతి హంస తిలకంబుఁ గబరిఁ బూన్చి. కు. సం 8. 12.

**హంసతూలము** సం. వి అ పుం. న. అంచ ఈకలు.

**హంసనాదిని** సం. వి. ఈ స్త్రీ. కొన్ని ప్రత్యేక లక్షణ ములు గల స్త్రీ (గజేంద్రగమన, తన్వి, కోకిలా లాపసంయుత, తనుమధ్య, ఘనజఘన యగు స్త్రీ హంసనాదిని యనఁబడును.)

**హంసపక్షము** సం. వి. అ. పుం. అభినయ విశేషము.

**హంసపదము** సం. వి. అ. పుం. ఒకానొక తూనిక. (కర్షము)

**హంసపాదము** సం వి. అ. పుం. 1. సిందూరము. 2. పాదరసము 3, వ్రాఁతయందు తప్పు గల చోట నుంచెడి హంస పాదాకారమైన గుర్తు

**హంసపాది** వి ఒకానొక చిన్న చెట్టు.

సీ ముయ్యాకుపొన్నయు మొగలిఱ తుత్తెర బంక తుత్తెర హంసపాది ... హంస. 4. 10.

**హంసయానము** సం. వి. అ. న. 1. అంచలచే లాగఁ బడు వాహనము. 2. అంచనడక వంటి నడక.

హంసరథుఁడు సం. వి. అ. పుం. బ్రహ్మ. (ఇట్లే హంసవాహనుఁడు).

హంసలిపి సం. వి. ఇ. స్త్రీ. జైనులు వ్రాసెడి యొక విధమైన వ్రాఁత.

హంసలోహకము సం. వి. అ. న. ఇత్తడి.

హంసవళ్ళు మి. వి. బ. వస్త్ర విశేషము.

గీ. హంసవళ్ళును బన్నాలు హారిణవళ్ళు, మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. 272.

హంసాంఘ్రి సం. వి. ఇ. పుం. సిందూరము.

హంసాంశువు సం. విశే. (ఉ. ఈ. ఉ.). తెల్లనిది.

హంసాభిఖ్యము సం. వి. అ. న. వెండి

హంసావళి మి. వి. వస్త్ర విశేషము.

ద్వి. తమవుఁ,బుత్తడిచీరఁ దడియొత్తి సతికిఁ,బోవర హంసావళి పుట్టంబు గట్టి. ద్వి. భార. విరా. 596. పొ.

వ. .... తారా మండలంబులును హంసావళులును హరిణావళులును ... పుట్టంబులు గట్టుకొని ...... ద్వా. 3. 83.

హంసి(క) సం. వి. ఈ. అ. స్త్రీ. ఆఁడుహంస.

హంసిని సం. వి. ఈ. స్త్రీ. ఒక వృత్తము.

హంసిరము సం. వి. అ. పుం. ఒక విధమైన చిట్టెలుక.

హంసుఁడు సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు.

చం. ఖరమురకంసహంస వరకాదిసురారుల ప్రాణవాయువుల్, పొరిగొని .... రాధికా. 2. 36.

హంసోదకము సం. వి. అ. న. 1. పలుకికాయలు కలిపి చేయఁబడిన హృద్యమైన మద్య విశేషము. 2. ఎండకు వేడిచెంది వెన్నెలకుఁ జల్లబడు నుదకము.

వ. ... హంసోదకంబులను తీర్థ సుగంధోదకంబులను మజ్జనం బార్చి ... కు. సం. 9. 5.

3. హంసమూత్రము.

హక్క సం. వి. అ. స్త్రీ. గ్రుడ్లగూబ.

హక్కము సం. వి. అ. పుం. ఏనుఁగుల పిలుపు.

హక్కా-హక్కము సం. వి. అ. పుం. సవాలు చేయుట

హజారము = అజారము వి. 1. ఆస్థాన మంటపము. కొలువుకూటము.

చం. కుముదము నిద్రవోఁ బొడుపుఁ గొండపయిన్ రవియొప్పెఁ జూడఁగా, సమధికలీల నింద్రుని హజారపు మేడకుఁ జైఁకికుండయై. కాశీ. 1. 125.

గీ. వయన పర్వదరుచి సాంద్రుఁడైన రామ, చంద్రుఁ డొగివచ్చె జనకు హజారమునకు. చం. రా 3. 122.

క. భూరమణుఁడు కొలువిచ్చి హ, జారమ్మున నుండువట్టిసమయమెఱిఁగి యొ, య్యారంబున నభినవశృంగారంబులు మెఱయఁ జని ప్రగల్భత మీఱన్. వై జ. 1-114.

2. మొగసాల, ముఖసాల.

ఉ...మ్రోసెనంత నిస్సాణము పాకశాసనుహజారమునం గదనాభిళంసియై. పారి. 4-38.

ఉ. అంతట ద్వారకాపురమునందు సభాపరిపాలుఁ డర్జునోద్దంతము యాదవుల్ దెలియునట్లు హజారమునందు ఛేరియ, త్వంతరుపాకసాయిత హృదంతరుఁడై చెలఁపించె... విజ, వి. 2. 157.

చం. చనిచని ముందటన్ వెలిహజారము వెల్వడి వచ్చుచున్న యా,సనకసనందనప్రముఖ సంయము లంగని పెద్దగొల్వుదీర్చె నలుయంచవు నెంచి ... దశా. 1.263.

హజురు వి. ఆస్థానము, కొలువు.

క. వచ్చినమంత్రుల నృపతివి. యచ్చరనాయకు నసుజ్ఞ నవసరసచివుల్, చెచ్చెర హజురువకుఁ బిలువ వచ్చిన దిగ్గున నరుంగు వడిడిగ్గి తగన్. రా. వి. 5-37. (శ.ర.)

హజ్జ = అజ్జ వి. 1. పాదము, అడుగు.

ఉ. ఎంతటిసేగిగల్గెఁ బరమేశ్వరుఁడే దయచేసివచ్చె నా,చెంతి కెటన్న పల్కు గలచేన్నను మోదకరంబె యొందు న,త్యంతము కోమలంబులగు హజ్జలు నొవ్వవె నొచ్చెనంచుఁదాఁ, జింతవహించుమున

యది చిత్తము చేడియలాం యొల్లకన్. పార్వ. 4 174.

కం. ... పాదపద్మముల జిగిజాళ్వా, గజ్జెలు మెఱయఁగఁ బజ్జల, హజ్జలిడుం గుజ్జుతల్లి యావందింపన్. దశా. 5. 68.

2. అడుగుజాడ, పాద ముద్ర.

సీ. ఏనుంగుహజ్జలో నెల్ల సత్త్వంబుల హజ్జలు నడఁగిన యట్లు పోలె. భార. శాం. 2. 236.

3. కాలు

సీ. జంటవల్ హజ్జబదంట బల్ మెకముల బలగంబు మితి యేఱుపఱుపరాదు. ఉ. రా. 7. 190.
బలుహజ్జమెకము = ఏనుఁగు.

సీ. బలుహజ్జమెకపు దాఁటులు నిల్కుడట్టంపు టాముసీరువనేల యసలు గొవఁగ. అచ్చ. రా. యు. 184.

**హట్టము** నం. వి. అ. పుం. 1 అంగడి వీథి 2. సంత.

**హట్టవాహిని** నం. వి. ఈ స్త్రీ. అంగడి వీధి లోని మురుగు కాలువ

**హట్టవిలాసిని** నం వి ఈ. స్త్రీ. 1. కులట. 2 నఖ యనెడు సుగంధ ద్రవ్యము 3. పసుపు.

**హట్టాధ్యక్షుఁడు** నం. వి. అ. పుం. అంగడివీధిని బర్యవేక్షించు నధికారి.

**హట్టి** నం వి ఈ స్త్రీ. చిన్న యంగడివీథి

**హఠపర్ణి (క)** నం. వి ఈ స్త్రీ. 1. నాఁచు. 2. పాఁచి

**హఠబుద్ధి** నం. వి. ఇ స్త్రీ. తలవని తలంపుగా లాభము వచ్చునను విశ్వాసము.

**హఠము** నం వి అ పుం. 1. పట్టుదల.

ద్వి. దాతల నమ్మించి ధనములఁ గొనెడి, కఠిన చిత్తులు తెరుగాక లోకముల, హఠమేల నృపులతో యమిన రేణ్యులకు. ద్వి. హరిశ్చ. ఉ. 482. పం.

2. బలాత్కారము, 3. యోగ విశేషము. (శ.ర.) 4. దౌర్జన్యము. 5 పీడనము. 6. మొండితనము. 7. అత్యావశ్యకత. 8. క్రతువు వెనుక మరుగుట. 9. అకాశమాలి. (వృ. వి.) 10. ఆకస్మిక లాభము

**హఠయోగము** నం. వి. అ. పుం. ఒక విధమైన యోగాభ్యాసము (ఒంటికాలిపై నిలుచుట, చేతులు పైకెత్తుట, పొగ పీల్చుచుఁ దలక్రిందుగా వ్రేలాడుట. ఈ విధముగా నవయవములఁ గ్లేశపెట్టి చేయు యోగము. ఇది రాజయోగము కంటె విలక్షణమైనది )

**హఠవాది** నం విశే. (న్. సి. న్.) మొండి పట్టు పట్టి సాధించువని.

**హఠవాదికుఁడు** నం. వి. అ. పుం. చార్వాకుని వంటి వాఁడు.

**హఠవిద్య** నం. వి. ఆ. స్త్రీ. హఠయోగశాస్త్రము

**హఠాదేశి** నం. విశే. (న్. సి న్.) బలాత్కారముగా వ్యతిరేక విధానము నవలంబించునది.

**హఠాయాతము** నం. విశే. (అ.ఆ అ.) అపరిహార్యము, విడువరానిది.

**హఠాలువు** నం వి. ఉ. స్త్రీ. ఒక విధమైన చెట్టు

**హఠిత** నం. వి. ఆ. స్త్రీ. కోలాహలము, పెద్ద ధ్వని.

**హఠితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఆకస్మికము. 2. ఉగ్రము, తీవ్రము.

**హడపము** = అడపము వి. వక్కలాకు లుంచుకొను పెట్టె, తాంబూల కరండము

చం. హడపము వీణ కిన్నెర హిమాంబువు నించిన గిండి ... ముదంబడగ ధరించి యూడిగపు టబ్బురపువ్వలిగుబ్బెతల్ దగన్. కువల. 4. 137.

ద్వి. కేళి సాసురరాజు కిన్నరరాజు, గాళాంజి హడపంబు గైకొని నడవ. ద్వి. పద్మ. 6. 427. పా.

**హడపు** = అడపు వి. ఉపదన్యసనము, కనుపెట్టి చూచుట.

వ.... కాట, బోలపణ్ణున్ను ఎఱియబోల ఖాదణ్ణును తలరాసినావయ తెలిసిన బోలునల్లురుం బూణ్ణగా ఎరియబోల ఖాదని హడపున కేతబోలదుగ్గని. ద.శా. నం. 4. 1111 నం.

**హడి** నం. వి. ఇ. పుం. దారువుయొక్క శృంఖల. కొండకొయ్య.

**హాడి(డ్డి)కుఁడు** నం. వి. అ. పుం. నీచజాతి పురుషుఁడు (ఆశ్లే హాడ్డి, హాడ్డికుఁడు, హాడ్డిపుఁడు.)

**హడ్డజము** నం. వి. అ. న. మజ్జ, అస్థిసారము.

**హడ్డము** నం. వి. అ. న. ఎముక.

**హఢక్కము** నం. వి. అ. పుం. న. చిన్న చేతి వాద్యము.

**హాణిగలు** వి. బ. నమస్కార విశేషము.

రగడ. నీలాచలమున నెలకొను పురుషోత్తమునకు హాణిగలు దండిగఁ జేర్చుచు హం స 4. 219.

**హత** నం. వి. ఆ. స్త్రీ. చెఱుపఁబడిన స్త్రీ.

**హతకుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) దుఃఖితుఁడు. దుష్టుఁడు వి. అ. పుం. నీచజాతి పురుషుఁడు; పిఱికివాఁడు.

**హతచ్ఛాయ** నం. వి. ఆ. స్త్రీ. తొలఁగిన సౌందర్యము.

**హతబుద్ధి** నం. విశ. (ఇ. ఇ. ఇ.) బుద్ధి లేనిది.

**హతభాగ్యము** నం. విశ. (అ. ఆ. అ.) అదృష్టహీనము.

**హతము** నం. వి. అ. న. 1. చంపుట. 2. కొట్టుట. విశ. (అ. ఆ. అ.) 1. చంపఁబడినది. 2. బాధింపఁబడినది. 3. నష్టమైనది. 4. కొల్లగొట్టఁబడినది. 5. నిరాశ పొందినది. 6. అడ్డగింపఁబడినది. 7. దీనమైనది.

**హతలక్షణుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. శుభలక్షణములు లేనివాఁడు. 2. దురదృష్టవంతుఁడు.

**హతాశుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఆశగోల్పోయినవాఁడు. 2. విషణ్ణుఁడు. 3. శక్తిహీనుఁడు. 4. దయారహితుఁడు. 5. వ్యర్థుఁడు. 6. నీచుఁడు.

**హతాశ్రయుఁడు** నం. విశ. (అ. ఆ. అ.). దిక్కులేనివాఁడు.

**హతా(త)హతము** నం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి కొట్టఁబడినది.

కం. అని కొనియాడిన సేనానిని నిలింపుల నాదరించి నిఖిలజగత్ప్రాణ నిరంకుశ తేజంబున, దనుజుల నాలో హతాహతంబుగఁ దోలెన్. పగాహ. 6. 98

ద్వి. వడిఁ బ్రాసములవైచి వజ్రంబులారి, యసిదండంబులను హతాహతముగాఁ బొడిచి. ద్వి. భార. విరా. 1. 18 పా.

కం. మతిగలిగి చదువు చిలుకలు, హతహతములుగాఁగఁ బోటులాడున్ బలువుల్, వితరణ మెన్నరి గుణమగుఁ, జతురుఁడు శూరుండు నతఁడు జనులం దెల్లన్ ద్వా 7. 81.

**హతాహతి** నం. వి. ఇ. స్త్రీ. హాళాహాళి, అతిత్వర.

లయగ్రాహి ... పెక్కుల్ వ్యూహములు బయల్పడి హతాహతిఁ జనం బటపి రాహవములోనన్. కు సం. 12. 170

మ ... అమరుల్ భేదిల్లి భీతిన్ హతా,హతి మార్వెట్టక పాఱ ... కు. సం. 12. 129

**హతి** నం. వి. ఇ. స్త్రీ. 1. దెబ్బ. 2. నష్టము. 3. అపజయము. 4. లోపము. 5. చంపుట.

**హతుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడినవాఁడు. 2. చంపఁబడినవాఁడు. 3. నిరాశచెందినవాఁడు. 4. అడ్డగింపఁబడినవాఁడు. 5. పూర్తిగా ధ్వంసము చేయఁబడినవాఁడు. 6. ఐనుఁడు.

**హతువు** నం. వి. ఉ. పుం. శీతకాలము.

**హత్తి** వి. (సం. హస్తి.) 1. ఏనుఁగు.

గీ. హత్తిమిత్తి చందంబున హత్తినడువఁ, గత్తి గుత్తుకను బిరానఁ గత్తిరించి, సత్తిమత్తిల్లి బలిసేసె నత్తినొక్కఁ, డవని పతియిచ్చుమేలు మేలనుచు మెచ్చు. చంద్రా. 2. 88.

కం. అత్తటిని జేరఁబోయి వి, యత్తటినికి సాటియైన దౌరాయనుచున్, బ్రోత్తుంగం ఘౌతటమున, హత్తివలె వసింపఁగని బ్రహస్తుఁడు పలికెన్. ఉ. రా 3. 164.

2. కుంజరాది శబ్దములవలె కర్మధారయ సమాసమున నుత్తరపదమై శ్రేష్ఠవాచకమగును.

గీ. క్రొత్త వెత్తమ్మి కంటెను మెత్తనైన, యుత్తలిరుటాకు టడుగంచు నీశ్వరాంఘ్రి, యెత్తి యెత్తి

కమ్ముగవ నొత్తి యొత్తి. బత్తివత్తిల్ల నారాచహత్తి వలికె. బహుళ. ౭, ౭౦.

**హత్తించు** స. క్రి. (√ హత్తు) 1. అతుకఁజేయు, అతికించు.

కం. దండించితరులు వెసమే, పాండంబులు ద్రెంచి తెచ్చి హత్తించిన నా, ఖండులుఁ దదియాదిగ మే, పాఁడుం డయ్యె... భా. రా. బాల. 512.

సీ. రేయను వాలునఁజాయలైన రథాంగతతుల హత్తించు సంధాన కరణి పారి. 4. 49

2. కూర్చు, కలుపు.

సీ. గోడిగజాతిలోఁ గొదను పెంటుల నేర్చి మావుల హత్తించు మార్గనంబు. శార. విరా. 1. 78.

వ. కుంటెన కత్తెయైన శ్రద్ధయను తొత్తు కూఁతు రుపనిష ద్వరుణిని వివేకునితో హత్తింప నెత్తికొన్న యది. ప్రబోధ. 2. 78.

3. సేర్చు

క. ఎత్తిన గద లంకించియు, హత్తించియు బమరి దిరిగి యడిచియు బయిసై, నొత్తియు ద్రొబ్బియుఁ బట్టియు, మత్తగజద్వయముభోలె మలసి రిరువురున్. ఉ. హరి. 3 62.

శా...సంచేంద్రియో, న్మాదంబుం బరిమార్చి బుద్ధి లతకున్ మాఱాకు హత్తించి ని. ష్యేద బహ్మా పదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రు మ, ర్యాదన్... భాగ. 8. 65.

4. ఉంచు, పెట్టు.

సీ.... కుంకుమ హత్తించి కొనగోరఁదీర్చిన పురు హూతు నిల్లాలి బొట్టనంగ ఉ. హరి 3. 86.

వ... సనశ్శిలా చిత్రకంబు నొసలన్ హత్తించె... నైష. 6 44.

5 పూయు పట్టించు.

సీ. తనువల్లి హత్తించె ధవళభూతి. హర. 4. 11

6. తాఁకించు.

మ. జనకోత్సంగ నివాసవాసవనొరాజన్య స్తహస్తా భిమ... సౌఖ్యామృతపారవశ్యమునవో సైచెన్ శిలాయోజనం. బనిసాధ్వుల్ వొగడం బ్రియాంఘ్రి సనెకల్ హత్తించె భూజాని... వసు. 6. 32.

7. కలిగించు.

వ ... శత్తపస్వి కీర్తితంబగు నమ్మత్తకాశినీ రత్నంబు శంభుచాపాధిరోపణ ప్రయత్నంబు చిత్తంబున హత్తింప .... చం. రా. 3. 93.

**హత్తింపు** వి. (√ హత్తు) కలయిక, కూటమి. సురతము.

సీ. అదిచాల కెదు రెక్కి యనురాగమున మ్రొక్కి వింత హత్తింపులఁ గొంతసేపు. శశాం. 4. 68.

**హత్తు** = అత్తు. అ. క్రి. 1. కలుగు.

కం. అత్తటి బిత్తరిఁగని భూ, భృత్తనయోత్తముఁడు తత్తరిలుచిత్తమునన్, మెత్తవడి క్రొత్త వలపులు, హత్తఁగ వత్తైలవ కిట్టులనియెం బ్రేమన్ రసిక. 3-76

కం. ఉత్తరమునఁ బోడమును బ్రత్యుత్తర ముత్తరము లేక యుత్తమమగునే, హత్తిన సువృష్టి వలవన్, విత్తులకుం బోడమినట్టి విత్తులుపోలెన్ నా పంచ. 1.117.

2. అంటు. సక్తమగు.

గీ. చిఱుతవోయిన మూఁకుటిచెలువు దాల్చి, హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రియందు. కాశీ. 2 138.

సీ గుత్తంపురయిక దా హత్తకుండఁగఁజేసి కల పంబు కులుకు గుబ్బలను బూయు. వ్యాస. 1. 216.

3. నాఁటుకొను, లగ్నమగు.

గీ. తోడఁబరువులు వాఱుచుఁ దోఁటపనులు, సేయుఁరూపు మదిన్ హత్తి పాయకునికి. కళా 4 105.

4. గ్రుచ్చుకొను, నాఁటుకొను.

కం. గుత్తంబు గుబ్బ లురమున, హత్తగఁ సరియాని యాని యారసికుండున్, బిత్తరియును బెనఁగిరి... శశాం. 3.108.

2. ఉండు, వర్తించు.

సీ...దండకాటవిమొదలు పంప తుదగాఁగల క్షేత్ర పటల మెల్ల, నజునకు హరికి నాశాయత్తమై హత్తు... పాం.డు. ౬.౭౭౫.

6 చేరు. సమీపించు.

వ. పరమ భాగవతు ననుగతికి హత్తు సత్త్వగుణ సంపద విధంబున వదాన్య మూర్ధన్యునకు ననుకూల యగు కీర్తి బాలిక పోలిక... చం. రా. ౩.౬౫.

గీ. చూచినప్పుడె విలుపాఅవైచి సరస, తామరస భీమలంగదా దండమెత్తి, దండహత్తి మనోజుండు దండవెట్టె, నమ్మహీదేవు నెమ్మదిరిమ్మవొడమ, శుక. 1.493.

7. కలియు, కూడు.

గీ. బెదరి చేంనిబలియుని బిగియఁబట్ట, కతనిమైవడి నేవచ్చి హత్తజేఁత, క్రమము... అము. 4.251.

౮. పొందుపడు, అనుకూలించు.

శా. వీగంధర్వుఁడు తద్విలాసములు మున్నీక్షించి తానెంతయున్, రాగాంధుడయికోరి హత్తకకడున్ రారాపులం గంతుఁడు, ద్వేగంబందగఁ జేయనెవ్వ నువ్విళ్ళూరుచున్ వేఁగువాఁడు... మనుచ. ౩.౬౮.

9. సంభోగమునకై పైఁబడు, పై కొను.

గీ. మధురగంధోత్తమాపానమత్తులగుచుఁ, జిత్తమున వానయెలుఁగక మొత్తమునను, హత్తుకొను బిత్తరులఁగూడి....దశా. 8.41.

స. క్రి. 1. తాకు, అంటు

ఉ...కంతుచేతినూ, అంచులకత్తిహత్తి జవరాలి కుచాద్రులముంచేఁ బత్తరే, భాంచితవైభవం బెడల నాతతబాష్పమహాపయోనిధిన్. వసు. 3.107.

౨. పొందు.

శా. తత్తా దృగ్విభవప్రభావనిధిఁగంచాళప్పగారిన్.. గొల్చుచుఁ దదాశీర్వాదలబ్ధోన్నతిన్, హత్తెందాను విరూరిమంత్రిమణి వేదాద్రీశుఁ డుద్యద్రుచిన్. పాండు. 1.75.

ఉ...అన్నివిద్యల నహీనుఁడనేవని కావువారిచే, ద్రొక్కుడులు గొంచు నాతఁడు సముద్ధతగర్వము హత్తి వర్తిలున్. శుక. 2. 437.

3. చేరు, అధిరోహించు.

ఉ.... గృహాంగణావధమాలికల్, హత్తి వరేంద్ర వీథిఁ జతురంగబలంబులు గొల్వఁగా మరు, న్మత్తగజంబుపైఁజను కుమారశిరోమణిఁ జూచి రుబ్బువన్. మనుచ. ౫. 60.

4. ఉండు. నిలుపుకొను.

ఉ. పుక్కిటియోవరిం జదువుపుత్తడి హత్తిన పెద్దనైన మీ,రొక్కొకవేళఁ బాలపము నొందమిఁ జెందినఁ జక్కఁబెట్టు వారు .... పాండు. ౬. 218.

5. తగులుకొను.

సీ. పసు నీతోడన యేతెంచుచో నొక యిట్టి డావలి వంక నేఁగుటయును.గీ జూచి నిలిచితినేను నిల్చుటఁ గనుగొని, యెచ్చట నెల్లిదిహత్తెనోయెలుక పదర, వేగిరించక నీవ భావించుకొనుము, కల్లనిజములు క్రమముగాఁ గావవచ్చు. కళా. 3. 184.

6. కౌఁగిలించుకొను. ఆలింగనముచేయు.

ఉ. కుప్పసముల్ వదల్చి రిఱిగుబ్బల నొత్తిలి. హత్తివేగుజా .మిప్పలలర్చు గాడ్పులకధీశు...అము. 5 104.

హత్తుకొను. . అ. క్రి. (హత్తు+కొను, స్వార్థమున) 1. కలుగు, పుట్టు.

కం. నెత్తుటఁ దొత్తిల్లియుఁ బలు, మొత్తములై రాతుసులు ఁమని భృత్యులకున్, జిత్తమ్ముల నుత్తలమున్, దత్తరమును హత్తుకొన రణంబులు సేయన్. ఉ. రా. ౪.౬౩౪.

వ. రథకళత్రంబుల నేత్రంబుల కవేల తరవారు లొసఁగు తరవారులన్ దదీయ చండతర బాహు దండకదళీయుగళవేదండతుండపాండిత్యంబు హత్తుకొన వర్తిల్లి...చం. రా. ౬. 85.

7. నెలకొను, ఉండు.

క. క్రొత్తై త్రిశృంగశిఖరము, నుత్తరశృగంబు సకును నుత్తరపు దిశన్, హత్తుకొని కడలిదాఁకను.

ను త్త ా ఒంటభూము అమరుచుండును మహిమన్. ఏ గాహ. 10.160.

? వాటుకొను, లగ్నమగు.

గీ బలియొసంగిన పూజలు నలిపి వేడు,కొనినఁ దశాంకంతిమతిమాయ మనమునందు, హత్తుకొని యున్కిచే మానదయ్యె నధిప .కాళికాదేవి నిజశిరః కంపనంబు. శుక. 4. 64.

స. క్రి. 1, కూడు,కలియు

గీ. హత్తుకొనవచ్చు నీవంటియందగాని, కట్టి ముద్దుల గుమ్మను గుట్టుతోడ,వనిన మనసిచ్చి మది లోన హదర్ష మెచ్చి, మంత్రసానికి విడెమిచ్చె మమతతోడ, హంస. 5. 42

5. చేరు, ఆశ్రయించు.

సీ. పాదహత్తుకొని సమున్మదవృత్తిఁ జను హత్తి కొమ్ములంటఁ జెకల్చి కొట్టె నొకఁడు. శుక. 1.174.

6. తగులుకొను, కూడుకొను.

సీ. వనిత యెవ్వతె హత్తుకొనునొ వీని నటంచు వెంటనే బుడుతల వేగఁబనుపు, కువల. 4. 160. రాధికా. 8. 102

హత్తుకొలుపు స. క్రి. (√ హత్తుకొను) హత్తుకొనఁ జేయు, పొందుపఱచు

సీ. తాటంక వలయ మధ్యమునఁ జెందొవ పువ్వు లవ తంసముగాను హత్తుకొలిపె. వైజ. 4. 30.

హత్తుగడ = అత్తుగడ వి. (√ హత్తు.) 1. పొందిక. చేరిక.

ఉ....కోవెల జియ్యల కియ్యోయారికిన్, హత్తు గడంచుఁ గొంద అపు డందురు.....బహుళ. 5.81

2. కలయిక,

ఉ....హత్తుగడ కూడునె చూడఁ బచాటువన్నెలం, గారములోన నైన వెలిగారము గూడక యున్న భాస్కరా. భాస్కర శ. 11.

హత్నువు సం. వి ఉ పుం. 1. ఆయుధము. 2. రోగము. 3. చంపువాడు

హత్య సం. వి. ఆ. స్త్రీ. 1. వధము, 2, చంపుట; 3. వధజనిత పాపము.

ద్వి ..రాముండు, విధిపౌత్రు రావణు వధియించి వట్టి, హత్యఁ బాపుకొనంగె హరిఁ బ్రతిష్ఠించి పండితా, మహిమ. 284. పా.

హథము సం. వి. అ. పుం. 1. దెబ్బ. 2. చంపుట. 2. చావు

హథుఁడు సం. వి. అ పుం దుఃఖితుఁడైనవాఁడు.

హదను = అదను. వి. ఔ. అనౌ. 1. యుక్తసమయము, ఉటి

సం.. మాన్యసువ్యాజ్జన బంధుకోటికిన్, హదనున మేలుసేత చతురాననసంభవశాస్త్ర పద్ధతిం, దదుచితమైన శాంతిక విధానము.... నైష 8 1+.

ఆ. హదను వచ్చుదాఁక నపరాధిపై రోష, మూఁగి చెఱువలయు హదను వేచి, లక్ష్యసిద్ధిదాఁక లావున శరమూఁగి, కాఁడవిడుచు వంపకాఁడువోలె. ఆము. 4, 2-9.

సీ అపవర్గఫలసిద్ధి హదనైనఁ జేపట్టుకైనది బహుఫలోత్కరము లొడిచి. పాండు. 2. 17.

2, సమయము, వేళ

ఉ. .... మొగిలొందె నంబుధ్, బ్వాహచలద్రథత్వము మొదల్ మెఱుఁగన్ ధ్వజమెక్క పౌటగా, నాహదనన్ దెలంగు జనమాంతము నూళ్లకు బోవరామియున్. ఆము 4. 88.

సీ. తటిఝరి వవను హదను సావియదుమ నాఁగా లాభిధానంబుగాఁ దెలంగు. అం. భా 1. 24.

హద్దు వి మేర; ఆజ్ఞ

ఆ. హద్దుముద్దు మీటి యాఁడుది మగఁడంచుఁ, గూడిమాడి యాడఁజూడఁదలచి, బలిమి విందుబెట్టి పగగొన్న చందాన, బెడ్లిచేసి నేసె జేలనైతి. రాధికా. 8 47.

హననము సం. వి. అ. న. 1 చంపుట. 2. కొట్టుట. 3. బాధించుట. 4. గుణించుట వి. అ. పుం 1. మద్దెలవాయించు కట్టె. 2. ఒకరకమైన క్రిమి.

**హనము** సం. వి. అ. న. చంపుట.

**హనీలము** సం. వి. అ. పుం. కేతకి (వృ. వి.)

**హనుక** సం. వి. ఆ. స్త్రీ. దవుడ.

**హనుగ్రహము** సం. వి. అ. పుం. హనుస్తంభము, దవడ కదలక పోవుట అను రోగము.

**హనుభేదము** సం. వి. అ. పుం. 1. దవుడలు తెఱచుకొని యుంచుట, 2. ఒక విధమైన గ్రహణము.

**హనుమ** వి. (సం. హనుమాన్) హనుమంతుడు, అంజనేయుడు.

కం. అశంఖగవంబు మహా ప్రాశని నిర్ఘోష భీమమై దిక్కులు నాకాశంబునిండె వంత గు, హాళయ నుండైన హనుమ యనుకపి పెలుచన్. భార. అర. ౫. 314.

సీ. ఏకాంతభక్తుడా కెఱిగి యేలవెకదా హనుమచే నుంగరంబనుపు టెల్ల. ఉ. రా. 1. 158.

**హనుమంతబీఱ** వి. వృక్షవిశేషము, ఒకజాతి చెట్టు.

సీ. హనుమంతబీఱ మంకెవ గిరికర్ణిక పెదమల్లె కొండ ముప్పిడియు గోల. హం.స. 4. 11.

**హనుమంతుడు** సం. వి. త్. పుం. అంజనేయుడు. హనుమ తుని ముందఱ గుప్పిగంతులు = అధికుని ముం దల్పుడు డంబములాడుట

చం. వదరులు పల్కినంతటనె వచ్చెనె ధైర్యము శౌర్యవృత్తి నీ, కొదవిన జిక్కనై నిలువు మోరి నిశాచర యిన్నగంబునన్, మది మది నుండి నేడు నను మార్కొని యెందుల కేగ వచ్చు నీ,మదమణంగింతు బోర హనుమంతుని ముందఱ గుప్పిగ తులే. రుక్మాం. ౯. 83.

**హనుమడు** = అనుమడు. వి. (సం. హనుమాన్) అంజనేయుడు.

కం. హనుమని వాలము పెరుగగ, ఘనతర కార్పాస పట్టికా శ్రేణులగ, న్కనిఁజుట్టి ... భా. రా. సుం. 453.

**హనుమానుడు** సం. వి. త్. పుం. హనుమ.

**హనువు** సం. వి. ఉ ఊ పుం. స్త్రీ. చెక్కిలిక్రింది భాగము, దవుడ. వి. ఉ. స్త్రీ. 1. నఖమనెడు గంధద్రవ్యము. 2. చావు. జీవితమునకు హానిచేయునది, ఆయుధము. 4. వ్యాధి.

**హనుస్తంభము** = హనుగ్రహము

**హనుస్వనము** సం. వి. అ. పుం. దవుడలతో జేయు ధ్వని.

**హన్నము** సం. వి. అ. న. విష్టింపబడినది,

**హపు (ఖు)ష** సం. వి. ఆ. స్త్రీ. ఓషధివిశేషము

**హబాయి** వి. అశ్వాలంకారవిశేషము.

సీ. వినువాంకతరంగలు వెల్లజల్లులు గాంగ వాల్మించుకెంపు హబాయి గాంగ. ప్రబంధ. 61.

**హమా** విశ. (హిం. హమా.) సర్వము, సమస్తము.

గీ. సర్వంసవర్గములు టంకసాలప్రేయు, చావడి హమాదినుసుమేలు సకుంగలిగి, నాల్గుదిక్కుల పేటల నగరజముల, కఱరి నమ్ముచు ధవచిత్తుండచట వెలయు. హంస. 2.231.

**హము** సం. వి. అ. న. 1. పరమాత్మ. 2 ఆనందము 3 ఆయుధము. 4. మణియొక్కతళతళ. 5. వీణ

**హయ** సం. వి. ఆ. స్త్రీ ఆదుగుఱ్ఱము, గోడిగ.

**హయంకషుడు** సం. వి. అ. పుం. 1. సారథి. 2. ఇంద్రసారథి, మాతలి.

**హయకర్మ** సం. వి. న్. న. గుఱ్ఱములను గుఱించిన జ్ఞానము.

**హయకాతర (రిక)** సం. వి. ఆ. స్త్రీ ఒకమొక్క.

**హయకోవిదుడు** సం. వి. అ. పుం. అశ్వశాస్త్ర అశ్వశిక్షలయందు నేర్పుకలవాడు.

**హయగంధ** సం. వి. ఆ. స్త్రీ. అశ్వగంధ (వృ. వి.)

**హయగ్రీవ** సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి,

**హయగ్రీవుడు** సం. వి. అ. పుం. 1. విష్ణువుయొక్క యవతారము.

2. ఒకానొక రాక్షసుడు.

వ. విరోచనబలి నముచి జంభమహాజంభ హయ

గ్రీవప్రముఖదైత్య దానవ గణంబులను. శివరహస్య. సంభవ. 8-17.

**హయద్విషత్తు** నం. వి. త్. పుం. మహిషము.

**హయనము** నం. వి అ. పుం సంవత్సరము. న. ఆచ్ఛాదితమైనబండి

**హయపుచ్ఛి (క)** నం. వి. ఈ అ. స్త్రీ. కారు మినుము (వృ. వి.).

**హయప్రియ** నం. వి. అ. స్త్రీ. ఖర్జూరవృక్షము

**హయప్రియము** నం. వి అ పుం. శాలిధాన్యము.

**హయమార (క) ము** నం వి. అ. పుం. గన్నేరు

**హయమారణము** నం వి అ. పుం అత్తిచెట్టు.

**హయము** నం. వి. అ. పుం గుఱ్ఱము నాలుగు హ్రస్వవర్ణములతోఁ గూడిన పద్యపాదము. 3. సప్తసంఖ్య. 4. చమరమృగము 5 ధనూరాశి.

**హయాంగము** నం వి అ పుం ధనూరాశి.

**హయారి** నం. వి ఇ. పుం. గన్నేరు (వృ వి)

**హయావళి** నం వి ఇ. స్త్రీ. వస్త్రవిశేషము.

ద్వి. కొలనిమేఘము గజావళి హయావళియు... బస పు. 3-70

**హయి** నం వి ఈ. స్త్రీ = హాయి

**హయిసరే** = హైసరే. అవ్య. ప్రశంసార్థకము.

సీ హాయిసరే నెఱిమించు వదలించు కనుమించు కమ్మదమ్ములమేలు గ్రుమ్మఁజాలు. కువల. 4,153.

**హయుఁడు** నం. వి అ. పుం. 1 ఇంద్రుఁడు. 2. ఒక ప్రత్యేక జాతికిఁ జెందిన పురుషుఁడు.

**హరకము** నం. వి. అ. న. 1. ఒకవిధమైన దీర్ఘ ఖడ్గము. 2. భాజకము.

**హరకాలా** వి. (హిం హర్ కారా.) వార్తాహరుఁడు వేగువాఁడు.

కం. హరికాలాల్ గొనివచ్చిన, ఫరమానాచూచి హర్షసరవశుఁడగుచున్. రంగా. 2 144

**హరకుఁడు** నం. వి. అ పుం 1. చోరుఁడు. 2. ధూర్తుఁడు 3 శివుఁడు.

**హరణము** 1. హరించుట. 2 గ్రహించుట. 3. తొలగించుట. 4. దొంగిలించుట. 5. నాశనము చేయుట. 6. విభజించుట. 7. విద్యార్థికిచ్చుభూముక 8. గవ్వ. 9 ఉడుకు నీరు 10 ముంజేయి 11. అరణము.

**హరబి(బ్బి)** వి. 1 దేశ విశేషము 2. హరబీ దేశపు గుఱ్ఱము. 3 హరబీ దేశభాష

**హరసమవాయి** వి. 1 ఒకానొక స్వరస్థాయి

ద్వి. హాళువాయియును ధర హరసమవాయి... ఆదిగా సొగయు తాయములు...బస పు. 3.94 పం

**హరాల్ కోరు** విశే. (హిం హలాల్ ఖోర్.) 1 సర్వ భక్షకుఁడు 2. దుష్టుఁడు 3 నీచుఁడు

సీ. తాజీ హరాల్‌కోరు ప్రాజ ప్రక్కల ముచ్చు చీవాట్ల మారి ప్రాచీనపత్తు. హంస. 6. 118.

**హరి** విశే. 1 పచ్చనిది 2. గోదుమ పచ్చనిది. 3 పసుపు పచ్చనిది. వి 1 విష్ణువు 2. ఇంద్రుఁడు. 3 శివుఁడు. 4. బ్రహ్మ. 5. యముఁడు. 6. సూర్యుఁడు. 7 చంద్రుఁడు 8 నరుఁడు. 9. అగ్ని. 10. వాయువు. 11 సింహము 12. కిరణము 13. గుఱ్ఱము. 14 ఉచ్చైశ్శ్రవము 15. కోఁతి. 16 కోయిల. 17. కప్ప 18 చిలుక 19. పాము. 20. నెమిలి 21. పసుపురంగు. 22. భర్తృహరి 23. ఇంద్రియము 24. సింహరాశి. 25. ఒకవర్షము (శ. ర.).

**హరి (యి)ంచు** నం. అ. క్రి. అడఁగు, వశించు.

క. పతనముల నేజసముల, నేతీర్థవిలోకనముల నేక్రతువుల నీ, జ్ఞానివధంబొనరించిన, పాతకము హరించునసఁ దపస్వి యతనితోన్. జై. భా. 1.50.

స క్రి. 1. అపహరించు.

వ...హిరణ్యకశిపు హరించి బలి నణంచి ... మార్క. 1. 116.

2. అపహరించు.

సీ. అవనితలేశ్వరుం డప్పాసు లూరక హరియించి దస్యుని యట్లఘోర. గీ. నరకమునఁబడు. మార్క. 2. 213.

హరికథ నం. వి. ఆ. స్త్రీ. 1. విష్ణుకథ, 2. నృత్య గాన సహితముగా కథకుఁడు చెప్పు కథాప్రక్రియ.

హరికము నం. వి. అ. పుం. 1. బంగారువన్నె గుఱ్ఱము.

హరికాంతము నం. విశే. (అ. ఆ. అ.) 1. ఇంద్రునకుఁ బ్రియమైనది. 2. సింహసుందరమైనది.

హరికుఁడు నం. వి. అ. పుం. 1. చోరుఁడు. 2. జూదగాఁడు

హరికేలీయము నం. వి. అ. పుం. 1. వంగదేశము.

హరికేశుఁడు నం. వి. అ. పుం. 1. శివుఁడు.

హరిగ = అరిగ వి. 1. ఖేటము 2. డాలు.

సీ. ఖటవిగ్రహముల కుప్పల క్రేవ దలలపై హరిగలు మాటుగా నడఁగువారు జై భా. 6. 120.

కం. విరుగఁగల తురువ లిరువుగు, నెఱమట్టి మెఱుంగు దట్టువెగు చల్లడముల్, పరగంగ బొందె కోలల, హరిగలు శాటించి మ్రొక్కొయారముమీఁగన్ ప్రబంధ 89.

2. ఎండ తగులకుండఁ బట్టెడు కేడెమువంటి సాధన విశేషము.

చం. హరిగలనీడ వేత్రధరు లయ్యెడ నామము లుగ్గడించి హె, చ్చరిక యొనర్ప ... కువల 4. 200.

సీ. ఘనకళంకిని జంద్రుఁ గనకుండఁ జాటుగా వరుణపకిడు వెండిహరిగయనఁగ. చంద్ర. 5. 114

హరిగంధము నం. వి. అ. పుం. 1. చందన విశేషము.

హరిగోలు = అరిగోలు వి. ఏఱు దాఁటదగిన సాధన విశేషము.

సీ. అఖండసరంగుల హరిగోలు గుంపునా వనజంబు లలఁతి గాడ్పునఁ జలింప శుక. 3. 323.

హరిచ(చె) వి. పక్షి విశేషము.

సీ. హరిచయాఁకలు నెమ్మిపురి జొంపములు తెల్ల నవరముల్ జల్లులు జాగిలములు ....... శాన్క చేసి ... శుక 1. 246.

రగడ. ఎనఁగ వన్నములోని విపములు నేర్పులుమ నీ సింగిలికలు, ఆసమ శౌర్య దురీణులకు బిరుదందు రల్లవె హరిచె యాఁకలు. శుక. 1. 232.

హరిచందనము నం. వి. అ. పుం. న. 1. పసుపుపచ్చని రంగుగల గంధము 2. సురద్రుమము లైదింటిలో నొకటి. 3. వెన్నెల. 4. పద్మకేసరము

హరిచాపము నం. వి. అ. న. ఇంద్ర ధనుస్సు.

హరిణకము నం. వి. అ. పుం. లేడి, చిన్నలేడి.

హరిణక్రీడనము నం. వి. అ. న. బాలక్రీడా విశేషము.

వ. .. అందఱు హరిణక్రీడనంబను నాటకుఁ దొడంగి హరి. పూ. 7.

హరిణనర్తకుఁడు నం. వి. అ. పుం. కిన్నరుఁడు

హరిణము నం. విశే. (అ ఈ అ). 1. తెల్లనిది 2. కిరణములు గలది. 3. ఎఱుపుతోఁ గలిసిన తెలుపు వన్నెగలది. వి. అ. పుం. 1. లేడి 2. తెలుపు రంగు. 3. వాతు.

హరిణవళ్ళు మి. వి. బ. వస్త్ర విశేషము.

గీ. హంసవళ్ళును బద్మాలు హరిణవళ్ళు, మొదలుగా వల్వలు ధరించి ముదిత లవుఁడు ప్రబంధ. 272.

గీ. ... నిండువన్నెలు బొదలు బచ్చలును హరిణ వళు హంసవ ళ్లురగ వళ్ళు .... మొదలుగాఁగ, దనరు పటములు వేనవే ల్గొనియొ వెలకు. హంస. 5. 359.

హరిణి నం. వి. ఈ. స్త్రీ 1. ఆఁడులేఁడి. 2. ఒకజాతి స్త్రీ (చిత్రిణి.) 3. పసుపు వన్నెమల్లె. 4. బంగారు ప్రతిమ. 5. ఒకవృత్త విశేషము. 6. ఆకుపచ్చని రంగు. 7. పసుపు. 8. చిఱువేరు వంటి వేరు. 9. దేవవేశ్యలలో నొకతె. (వా.)

**హరిణీకుఁడు** నం. వి. అ. పుం. బోయవాడు.

**హరిణీదృక్కు** నం. విశ. (క్. క్. క్.) లేడికన్నులు గలది. వి. క్. స్త్రీ. మృగాక్షి, స్త్రీ.

**హరిణుఁడు** న. వి. అ. పుం. 1. సూర్యుఁడు విష్ణువు 3. శివుఁడు.

**హరిత** నం. వి అ స్త్రీ 1. దూర్వ, గటిక (స్వ. వి.) పసుపు 3. గోధుమవన్నెగల ద్రాక్ష

**హరితకపిశము** నం. విశ. (అ ఆ. అ.) పసుపువన్నె కలిసిన గోధుమరంగుకలది.

**హరితకము** నం వి. అ. న పచ్చగడ్డి. కూరముసుగ.

**హరితపణ్యము** నం. వి అ. న. కూరగాయల వ్యాపారము.

**హరితము** నం విశ. (అ. ఆ అ) 1. ఆకుపచ్చ వన్నెకలది 2. నీలవర్ణము కలది. వి. అ పుం 1. ఆకుపచ్చని రంగు. 2. సింహము 3 ఒకవిధమైన గడ్డి పచ్చగుల్లము. 5 పచ్చపిట్ట, గిజిగాఁడు. 6. పచ్చ పెసర

**హరితహరి** నం వి అ. పుం. సూర్యుఁడు

**హరితాళకము** నం. వి అ. న పుం హరిదళము. న. నాటకాలంకరణము

**హరితాళి** నం. వి ఈ స్త్రీ 1 గరిక 2 ఆకాశము వంటి రేఖ

**హరితాళిక** నం. వి ఆ. స్త్రీ. 1. భాద్రపదశుక్ల తృతీయ 2. గరికమొక్క.

**హరితురంగముఁడు** నం వి అ. పుం ఇంద్రుఁడు.

**హరిత్తు** నం. విశ. (త్. త్. త్) 1 ఆకుపచ్చనిది. 2. పసుపుపచ్చనిది. వి. త్ పుం. 1. ఆకుపచ్చని రంగు 2. పసుపుపచ్చనిరంగు. 3. పచ్చని సూర్యుని గుఱ్ఱము) స్త్రీ 1. దిక్కు 2. పసుపు

**హరిత్పతి** నం. వి. ఇ. పుం. దిక్పాలకుఁడు.

**హరిత్పర్ణము** నం. వి. అ. న. ముల్లంగిగడ్డ.

**హరిదశ్వము** నం.వి.అ. పుం. జిల్లేడుచెట్టు

**హరిదశ్వుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు.

**హరిదళ** ... వి. (సం హరితాలమ్) పసుపుపచ్చని ధాతువిశేషము.

**హరిదాసు(ఁడు)** నం. వి అ. పుం. విష్ణుభక్తుఁడు.

**హరిదిక్కు** నం.వి. క్. స్త్రీ. తూర్పు.

**హరిదినము** నం వి. అ. న. ఏకాదశి. హరిని సేవించు దినము.

కం. హరిదినమున కేధర్మము, సరిగా దేతీర్థములును సరిగావు.. జాహ్నవి ౨-౨౨.

**హరిదేవము** నం. వి. అ పుం. శ్రవణనక్షత్రము

**హరిద్రము** నం వి అ. స్త్రీ. పసుపు వేళ్ళపొడి.

**హరిద్రంజని** నం. వి. ఈ స్త్రీ పసుపు

**హరిద్ర(క)ము** నం వి అ పుం. చందన వృక్షము

**హరిద్రము** నం వి. అ. పుం 1. పచ్చని రసము. 2 నాగకేసర పుష్ప చూర్ణము.

**హరిద్రాంగము** నం వి. అ పుం. ఒక విధమైన పావురము,

**హరిద్రాభము** నం వి. అ పుం. 1. పసుపురంగు 2 కచోరము

**హరిద్రారాగ(క)ము** నం. విశ (అ ఆ. అ) 1. పసుపు రంగు గలది. 2 ప్రేమ విషయమున చంచలమైనది. "క్షణమాత్రానురాగశ్చ హారిద్రారాగ ఉచ్యతే"

**హరిద్రువు** నం. వి. ఉ. పుం. 1 చెట్టు ఒకవిధమైన మొక్క. 3 గ్రూని .. సుపు

**హరిద్వారము** నం వి అ. న. ఒక ప్రసిద్ధ క్షేత్రము

**హరినీలము** నం. వి. అ. పుం. నీలమణి

**హరినేత్రము** నం వి. అ పుం గుడ్లగూబ.

**హరిన్మణి** నం. వి. ఇ. పుం 1 గరుడ పచ్చ 2 మరకతము

**హరిపదము** నం. వి. అ. న. 1. వసంతారంభము. 2. ఆకాశము.

**హరిపర్ణము** నం. వి. అ. న. ముల్లంగి గడ్డ

**హరిప్రస్థము** నం. వి. అ. పుం. ఇంద్రప్రస్థపురము.

సీ ... సర్వ, సుఖా మ్ముల నించి సకల దిక్కుల హరి. ప్రద్ధంబుచుట్టు నపారభూరి, బహువిధాగార ముల్ .... భార సభా. 1. 292.

హరిప్రియ సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి. 2. భూమి. 3. తులసి. 4. ఏకాదశి. 5. ద్వాదశి. (అప్టే)

హరిప్రియము సం. వి. అ. పుం. 1. కదంబ వృక్షము 2. శంఖము. న. 1. వట్టివేరు. 2. ఒకవిధమైన చందనము.

హరిప్రియుఁడు సం. వి. అ. పుం. 1. మూర్ఖుఁడు 2. పిచ్చివాఁడు

హరిబీఁక (కె) అశ్వశిరోలంకార విశేషము.

సీ తొలుత మాపోగుకట్టులు రాలినది గడా యిందు గల్గిన హరిబీఁకకెల్ల. ప్రబంధ. 168.

సీ. తేఁటసుప్పాణి ముత్తెల మోము ముట్టును శ్రీక రంబుగ హరిబీఁకెవెలయ. ఇందు. 2-54. హంస. 5-166.

హరిబీజము సం. వి. అ. పుం. పసుపువచ్చని హరి దళము.

హరిబువ్వము వి. బువ్వముబంతి.

హరిభుక్కు సం. వి. క్. పుం. గాలిని తినునది,పాము.

హరిమ సం. వి. అ. పుం. 1. హరితవర్ణము. 2. తెల్ల పాఱుట. 3 కాలము. 4. పచ్చకామెరలు.

హరిమంథము సం. వి. అ. పుం. సెనగ

హరిమేధము సం. వి. అ. పుం. అశ్వమేధయాగము.

హరిమేధుఁడు సం. వి. అ. పుం హరిమేధసుఁడు. స్. పుం. విష్ణువు

హరియము సం. వి. అ. పుం. పసుపువచ్చని గుఱ్ఱము.

హరిరోముఁడు సం. వి. స్. పుం. 1. దేహమున మృదువైనరోమములు కలవాఁడు. 2 యువకుఁడు. మృదువైనరోమములు కలవాఁడు. 2. యువకుఁడు.

హరిలోచనము సం. వి. అ పుం 1. ఎంద్రకాయ, 2. పీత 3. గుడ్లగూబ.

హరివంశము సం. వి. అ. పుం. 1. మహాభారతమున కనుగుణముగా వ్యాసునిచే రచింపఁబడిన గ్రంథము

హరివర్షము సం. వి. అ. పుం. 1. జంబూద్వీప నవవిభాగములలో నొకటి.

హరివాణము సం. వి అ. పుం. 1. తట్టె.

హరివాణము వి. (క. త అరివాణవు ,హరివాణవు ) 1. పళ్ళెరము.

వ...నీరాటకు వచ్చు మదవతీవతంసంబుల దర్శింప సరోజాక్షి గంధాక్షతలు సందించి కుదురు పఱిచిన పచ్చల హరివాణంబుల రూపంబున దీపించు...పద్మి నీపత్రంబులంగనుంగొని...వరాహ. 3. 94.

సీ. వలుదసోరంబగండ్ల వచ్చిన జిగివెండి హరివాణమని చేత నందియుంచి, రా. వి. 3-13.

సీ. హరివాణములమీఁదఁ గరకంకణముల దీప్తులపరా గ్గముతోన తొరుగ నిందు, వదనలు వడ్డింప .. వరాహ 4. 133.

2. పాత్రము.

కం. సతనాల్కల తేఁకేయపు, డతనికిఁ బొడకట్టె పసిఁడిహరివాణము తోడుతఁదెచ్చి పాలయోరెం బటివలు ముప్పురకుఁ బెట్టుమని యిడి చనుఁడున్. అచ్చ. బాల. 74.

3. భోజనపాత్రము.

సీ. తెలెహరివాణంబు తలిగ కంచము తట్టె చాకిల వంగఁ గంసంబుదవరు. ఆం. భా. 2-244

ఆ. తళియ పళ్లెరంబు తెలె హరివాణంబు, తట్టె కంచ మనఁగఁ దవరుఁ బాత్ర. ఆ. సం. మాన. 80.

హరివాలుకము సం. వి. అ. న. 1 నూఁగుదోన. 2. కూఁతురుబుడమ (వృ. వి.)

హరివాసము సం. వి. అ. పుం ఒకానొకపట్టణము. వ...హరివాసంబను పురంబుపై విడిసిన ... భార. సభా. 1-235.

హరివాసరము సం. వి. అ. పుం. ఏకాదశి.

హరివాహనుఁడు సం. వి. అ. పుం. 1, గరుడుఁడు 2. ఇంద్రుఁడు. 3. సూర్యుఁడు.

**హరిశయనము** సం. వి. అ. న. చాతుర్మాస్య కాలము (ఆషాఢ శుద్ధైకాదశి మొదలు కార్తిక శుద్ధైకాదశి వఱకు.)

**హరిషము** సం. వి. అ. పుం. హర్షము.

**హరిహయుఁడు** సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు. 2. సూర్యుఁడు. 3. సూతుఁడు. 4. గణేశుఁడు

**హరిహరాత్మకుఁడు** సం. వి. అ. పుం. 1. గరుడుఁడు 2. నంది.

**హరిహరి** అవ్య. అయ్యో, అక్కటా, పాప పరిహార సూచకము.

చం. హరిహరి వారిమూఢమతి కాదియు నంతము గల్గనేర్చునే. రాధికా. 2-9.

**హరిహరుఁడు** సం. వి. అ. పుం. శివకేశవు లిరువురును గలిసిన దేవుఁడు

**హరిహేతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఇంద్రధనుస్సు. 2. చక్రాయుధము.

**హరీతకి** సం. వి. ఈ. స్త్రీ. కరక. (వృ. వి.)

**హరుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు (అ. అ. అ.) హరించువాఁడు

**హరువు(ర్వు)** వి. చక్కదనము, సౌందర్యము

సీ. విబుధాధినాథుఁ డీ వేదాద్రినాథుఁడు శౌంధి తనూజ యీతిరుమలాంబ,

గీ. యనఁగ ననుకూలదాంపత్య వినుత మహిమ. హరువు దీపించె నౌర వేదాద్రి విభుఁడు, హరి యశుఁడైన కలకాల హస్తితనయ, తిరుమలాంబయు నిత్య వర్ధిష్ణులఁట్లు. వాఁడు. 1.78.

సీ. పొన్నగున్నలనీడఁ గన్నెపుప్పొడితిన్నె మగనిఁ బూజించినహరువుఁ జూచి కొమ్మఁ గౌగిటఁజేర్ప గోరంటనంటిన మొవగుబ్బ కస్తూరి మురువుజూచి విజ. వి. 1-138.

ఉ. అందువిరోధ మార్గముల నందు విశేషము లందు హర్వులిం, పొందఁగ జూచి, ... సారంగ. 2- 63.

గీ. కర్ణపూరోత్పలసుగంధకలన వలరి, ప్రాంత మున నిల్చుభ్రమరశాలం బనంగ, వామకర్ణాగ్రమున నిందువదన కపుడు. హర్వుమీఱంగ నీలంపుముగ్గు దనరె. ఇందు 6-82.

2 విలాసము

కం విరితీవల యుయ్యాలల, హరువు వికిచి సుమ చయాపహరణవిహారతా, దరణ చణప్రచరణలై. యరుణాంబుజచరణలప్పు డలరుం బోదలన్. రా.వి. 3. 104

కం. అయకోపుద్యష్టియును నఖినయముసటు దూరమ్ముమోడి నయమున్నతిరే, కయును బ్రమాణము హరువున్, మెయిసిరి యవఘళము మురుపు మెలకువ యమరున్. ప్రబంధ 108.

3. విధము

కం. సురసాలముహరువున నీ, సురసాలముదనరె నిచటఁజూడుము కినల, స్ఫురదురురుచి నిచయం బులు. కురువిందాభరణదీప్తి కొమరునహింపన్. భోజసుతా 1-41.

సీ....భరతు, కంటి సుహోత్రునిహరువున ఘుశీల రామునిక్రియ భగీంధునిరేవ. శుక 1-10

4. నాణెమైనపని, మేలిపని.

కం. వెరవరులీహరువులకీ, గురుకు వలని తలఁచి రాజు కొలువై యున్నాఁ, డనుచుండని తాముంచఱ, నటిగి యొటింగించియుండె నతఁడధిపతికిన్. రామా. 2. 79.

సీ...కంగిర్చునేతి, కిరుసులో బిగిసు చిత్తరువు పత్తడి ప్రాఁతహరువులో మురుపసౌంపలగువువ్వు, తీఁగలోఁజేవ...ఘటికా. 2- 1.

కం అత్తరువులఁ జిత్తరువులఁ, గ్రొత్తహరువులోలయు కేళికూట గృహములో, నత్తమినత్తమిఁ బొత్తమిఁ, జిత్తజుగురుఁడౌట మదని జిత్తఁజొదవెన్. ముకుంద. 3-31.

4. తగినపని, యుక్తకార్యము.

చం. తలవరులార రంగవతిధామము వందునఁబైఁడి గిన్నెప్రము, చ్చిళినదురాత్ములీ దురితచిత్తులు వంబులు విరినందఱన్, సిలుగుఁబెట్టి వే హరువు లేయుఁడు పొందని నంప... విప్ర. 1.24.

కం. ఇతఁడెవ్వఁడైన నేమగు. ఈతినాయక ధనము మాకుఁ జెల్లించిన వాఁడ తగినమాన్యుఁడు దగ పగఁ, నతివేగమవిత్తమునకు హరువీకఁజెపుమా. హరిశ్చ. 4.228.

6. ఏర్పాటు.

కం. దొరవెట్టిన హరువెట్టిరా. యరుదాహోవిడుదు లున్నహవణిక లులుపా, పదిధనము నింద్రభోగ మె, దొంగెను దమ కననివారు తుదిశేరొకరున్. విజ. వి. 3-179.

విశ. 1 మనోజ్ఞము, చక్కనిది.

ద్వి. అందల బంగరుహరుపు చిత్తరువు, లందంబు గాఁ దీర్చి...

రం రా. బాల. 78 పా. 10 పం.

చం. గోరిసెలయందమున్‌గురుచకొమ్ముల చందము వెన్నుమందమున్, గరువపుమేనిలో నుదుటు కాఁగెడు పెన్పొదుఁగింద్రనీలముల్, జెంసినముక్కు మీఁగడబలెన్ జెలువొగఁ కంబళంబువన్. హరువుగఁ గామధేనువు సుధాంబుధిఁబుట్టె నభీష్ట దాత్రియై దశా 2-234.

ద్వి హరువైన పైఠిణీ మంచట్ట దొడిగి. రఘునా. 7. పా. 8 పం

2 యోగ్యము. తగినది.

గీ. అతఁడు గొఱప్రాణముననుండి హరువు దెరువు. లావటిలఁదెల్పఁజని వాయుదేవసుతుఁడు, క్షీర వారాకరోత్తరతీరభూమి, ముందు దివ్యౌషధంబుల కొండఁ దెచ్చె రామా. 8-17)

3 నాజెమైనది.

కం. హరువు గొనమ్మలతిట్టా...అచ్చ. రా. కిష్కిం. (శర.)

హరుసము=అరుసము. వి. (సం. హర్షః, ప్రా. హరిసో.) హర్షము, సంతోషము.

చం. పరహితుడైనవానికి శుభంబు లభించిన నెల్ల వారలున్, హరుసమె కంద్రు....ఉ. రా. 2. 64.

కం. హరి రమ్మనియె నటవ్నన్, హరుసముతో వారు వలువు రతివినయమునన్. దశా. 10.18.

హరుసించు అ. క్రి. (√ హరుసము) ఇష్టపడు, సంతోషించు.

ద్వి హరివాక్యమునకు మాఱాడఁగ వెఱచి, హరుసించి గోవర్ధనాద్రికి జాత్ర, చాటించి యందఱు సదనంబులందుఁ, జాటించి వస్తుసంపద ప్రేమ మిగుల. ద్వి. భాగ. 2.30పా.

హరేణుకము నం. వి అ పుం. 1. కాయధాన్యము. 2. బటాని.

హరేణువు నం. వి. ఉ. పుం 1. బటాని. 2. కాయ ధాన్యము. 3. గ్రామమునకెల్ల మందులత. 4 లంక. స్త్రీ. 1. మర్యాదగల స్త్రీ 2. తామ్ర వర్ణముగల లేడి.

హర్త నం విశ (ఋ త్రి. ఋ) 1. హరించువాఁడు. 2. గ్రహించువాఁడు వి. పుం. 1 దొంగ. 2. సూర్యుఁడు.

హర్మము నం వి. న్ న. 1. తెఱచుట 2. ఆవు లించుట.

హర్మికము నం వి అ స్త్రీ. వేసవికాలమునకై స్తూపముపైకట్టబడిన గృహము

హర్మితము నం. విశ (అ. ఆ అ.) 1. తెఱవ బడి నది 2 త్రోవవేయఁబడినది. 3. గ్రహింప బడినది.

హర్ముటము నం వి. అ పుం. తాఁబేలు

హర్ముటుఁడు నం. వి అ పుం. సూర్యుఁడు.

హర్మ్యము నం వి అ. న 1 ప్రాసాదము. 2. పెద్ద భవనము 3. పొయ్యి. 4. పాపాత్ములు నివసించు నరకలోకము. 5. అగ్నికుండము.

హర్మ్యపలభి నం. వి ఈ. స్త్రీ. హర్మ్యతలము

హర్యక్షము నం. వి. అ. పుం. సింహము.

హర్యక్షుఁడు నం. వి. అ. పుం. కుబేరుఁడు.

హర్యశము నం. వి. అ. పుం. 1. గుఱ్ఱము. 2. అశ్వ మేధమునకర్హమైన గుఱ్ఱము. 3. యజ్ఞము.

హర్షకీలకము నం. వి. అ. పుం. ఒకవిధమైనరతి.

**హర్షజము** నం. వి. అ. న. రేతస్సు.

**హర్షణము** నం. విశ. (అ. ఆ. అ.) 1. సంతోషింప జేయునది. 2. పులకలు గల్గించునది. వి. అ. పుం. మన్మథుని పంచబాణములలో నొకటి. 2. నేత్ర రోగవిశేషము. 3. గ్రహయోగము 4. అవం కర్మాదులు. న. 1. సంతోషము. 2. సౌఖ్యము 3. సంతోషింపఁజేయుట. 4. రోమహర్షాహము గల్గించుట. 5. కామోద్రేకము.

**హర్షదోహదము** నం. వి. అ. న. పుం. కామాభిలాష, వలపు.

**హర్షమాణుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) సంతోషము నొందిన మనస్సుకలవాఁడు.

**హర్షము** నం. వి. అ. పుం. 1. సంతోషము, ఆనం దము. 2. పులకించుట. 3. సంచారిభావములలో నొకటి. 4. కామోద్రేకము. 5. గాఢాభిలాష.

**హర్షయిత్నువు** నం. విశ. (ఉ. ఉ. ఉ.) సంతో షింపఁజేయునది. వి. ఉ. న. బంగారము. పుం. కుమారుఁడు.

**హర్షసంపుటము** నం. వి. అ. పుం. రతిక్రియా విశేషము.

**హర్షి** నం. విశ. (న్. ఈ. న్.) సంతోషము కలవాఁడు.

**హర్షించు** సం. అ. క్రి. సంతోషించు.

వ.. ఆశ్రితోత్తముఁ గాంచి హర్షించి ఆ వసిష్ఠున కృతార్థుఁడు నిట్లనియె మార్కం. 1-101.

**హర్షితము** నం. విశ. (అ. ఆ. అ.) సంతోషింపఁ జేయఁబడినది. వి. అ. న. సంతోషము.

**హర్షుల** నం. వి. ఆ. స్త్రీ. మీసముగలకన్య.

**హర్షులము** నం. వి. అ. పుం. లేడి.

**హర్షులుఁడు** నం. వి. అ. పుం. 1. ప్రియుఁడు. 2. కాముకుఁడు. విశ. (ఉ. ఉ. ఉ.) 1. పరిహాస శీలుఁడు. కామోద్రేకముగలవాఁడు.

**హల** నం. వి. ఆ. స్త్రీ. 1. సఖి. 2. భూమి. 3. నీరు. 4. మద్యము.

**హలా** నం. అవ్య. చెలికత్తెల కుపయోగించుచుండు నుడి పదము.

**హలకత్తు** నం. వి. ద్. స్త్రీ. నాగటికొయ్య, వడికోలు.

**హలగోళకము** నం. వి. అ. పుం. కీటవిశేషము.

**హలది** (క. హాలద్ది) పసుపు.

**హలధరుఁడు** నం. వి. అ. పుం. 1. కర్షకుఁడు. 2. బల రాముఁడు.

**హలభూ(భృ)తి** నం. వి. ఇ. స్త్రీ. 1. దున్నుట. 2. వ్యవసాయము.

**హలము** నం. వి. అ. పుం. న. 1. నాఁగలి. 2. ఆయు ధము. 3. భూమినిగొలుచు మానము. న. 1. నాగలి. 2. అంగవైకల్యము. 3. ఆటంకము. 4. కలహము.

**హలముఖము** నం. వి. అ. న. నాగటికొఱ్ఱు.

**హలవాహ** నం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన నూరుకోల మానము.

**హలసీరము** నం. వి. అ. పుం. నాఁగటిఱ్ఱు.

**హలహతి** నం. వి. ఇ. స్త్రీ. నాఁగటితో దున్నుట.

**హలహల** నం. అవ్య. ప్రశంసార్థకము.

**హలహలకము** నం. వి. అ. పుం. ఉత్కంఠ.

**హలహలము** నం. వి. అ. పుం. హాలాహలమను విషము. విశ. (అ. అ. అ.) దున్నఁబడిన చాళ్లు వర్పరుచునట్టిది.

**హలాయుధుఁడు** నం. వి. అ. పుం. 1. బలరాముఁడు. 2. మడకదున్నువాఁడు.

**హలాహము** నం. వి. అ. పుం. చిత్రవర్ణముగల యశ్వము.

**హలాహలము** నం. వి. అ. పుం. 1. హాలాహలమను విషము. 2. బల్లి. 3. నలికిఁచు గర్తపుప్పొళ. 4. బ్రహ్మ 5. సర్పము.

**హలి** నం. వి. ఇ. పుం. 1. పెద్దనాఁగలి. 2. నాగటి చాలు. 3. సేద్యము. న్. పుం. 1. బలరాముఁడు. 2. కర్షకుఁడు.

**హాలికుఁడు** నం. వి. న్. పుం. కర్షకుడు, అరకపట్టి దున్నువాడు.

హాలిని సం. వి. ఈ. స్త్రీ. 1. కటిగొట్టి. (వృ. వి.) .. నాగళ్ల సమూహము.

హాలిప్రియ సం. వి. ఆ. స్త్రీ. మద్యము, కల్లు.

హాలిప్రియము సం. వి. అ. పుం. కమిడిచెట్టు.

హాలీనము సం. వి. అ. పుం. ఉకుచెట్టు.

హాలీశేష సం. వి. ఆ. స్త్రీ. నాఁగటికొయ్య.

హాలుహారము సం. వి. అ. పుం. ఒకవిధమైనగుఱ్ఱము.

హాల్య సం. వి. ఆ. స్త్రీ. నాగళ్లసమూహము

హాల్యము. సం. విశ. (అ. ఆ. అ.) 1. దున్నఁదగినది. 2. విశ్రుతమైనది వి. అ. న. 1. దున్నిన పొలము. విశ్రుతత్వము

హల్లకము సం. వి. అ. న. ఎఱ్ఱకలువ

హల్లకల్లోలము = అల్లకల్లోలము విశ. తాఱుమాఱై నది. వ్యాప్తము, సంక్షుభితము, కలఁత నొందినది.

... ములో ములు ... మూర్తిచే హల్ల, ... కల్లోలమై పడఁగాఁ జూచినాఁడు ... రా ... పా. 1. వ.

కం ... ఒలముల నలబలముల యెలగో శేమేమి యెక్కడెక్కడ ... కన్, తల తల ... పొడుమ, ... హల్లకల్లోలంబై రా. వి. 5. 2

వ... దెసచెడి కలఁగుచు నడి హల్లకల్లోలమై యతలకుతలమై యుట్టట్టై యఱ్ఱాతిలూగి ప్రబంధ. 783

హల్లనము సం. వి. న్. న. 1. నిద్రలోవలె దొర్లుట

హల్లా వి. (హిం. హల్లా) 1. లగ్గపట్టుట; 2. కోటకెగఁద్రాకుట.

కం. ఇల్లకా నిమ్మిపుడా, ఖిల్లా కిల్లాకునడఁచి కించన్యాప్తన్, హల్లాకు నూలుకొలుపుమఁ, ఖల్లా కుంజెదరఁజేతు శీఘ్రమె వారిన్. రంగా. 2. 247.

హల్లాల్లము. సం. వి. అ. పుం. పర్వతాదులఁబెక లించుటయందగు ధ్వనికనుకరణము.

కా అవైకుంటహాట్టజుల్ వనుప హల్లాల్ల ధ్వనిన్ మందర. గ్రావంబున్ సురదైత్యకోటి వెలుకంగా నొప్పరంధ్రంబు, వరాహ. 58.

హల్లాసేయు స. క్రి. (హల్లా+చేయు) 1. లగ్గపట్టు. 2. నాశనము చేయు.

కం హల్లాసేయుదు బొబ్బిలి, కిల్లాతజ్జయము నీకుఁ గిల్లోకులుపుదునే, గల్లోడఁజుమ్మి యిది నా, యల్లా ... యధిపవిలంపా. రంగా, 1. 64.

హల్లీశ(స)కము సం. వి. అ. న. స్త్రీలు పలువురు చేరి మండలాకారముగాఁ దిరుగుచుఁ చేయు నృత్యము.

హల్లీశ(ష)ము సం. వి. అ. న. 1. పదునెనిమిది ఉపరూపకములలో నొకటి. (ఇది ఏకాంకము. ఒక పురుషుఁడు ఏడు, ఎనమండ్రుగురు లేక పదుగురు స్త్రీలు కలసి చేయునృత్యగానములతోఁగూడినది 2. హల్లీసకము.

హల్లు సం. వి. ల్. పుం. కకారాద్యక్షరము వ్యంజనము. (ఒక ప్రత్యాహారము.)

హల్లోహలము సం. వి. అ. పుం. 2. సంభ్రమము. 3. తొట్రుపాటు; 3. అదటు; 4. వేగము

కం... అలరుల దండన్, ఖిల్లి యొకతె హారికిచ్చెను, హల్లోహలకలిత యగుచు నంగన కంటే. భాగ. 10. పూ. 784

కం...హల్లోహలమద బంభరమల్లధ్వనులు. మనుచ. 2. 6 పాండు. 4.

హాళది = అళఁది సం. (హరిద్రా) 1. పసుపు;

2. పసుపురంగు.

కం. ఆగిరులలోన మేరువు, ప్రాగుత్తర దక్షిణాపరదిశలఁ దెలుపున్, జేగురు హాళఁదియు నలుపును, నైగురుతుఁగ దెలుపు బ్రాహ్మణాదిక జాతుల్. వరాహ. 10. 109.

ఉ. పట్టుతిలాదయున్ హాళఁది పచ్చ, మనుంబట పింద్ర గోపవుం, బట్టు కురాడముం దొగరుఁ

బట్టియు .. యావృపతిమంచము పై సతులం చి రచ్చెలిన్. పాంచాలి. 5 10.

**హళహళి** (క) సం వి. ఈ. ప్రీ 1. సంభ్రమము, 2. వేగిపాటు. 3. తొందర.

చం. హా వాళి సప్పుళిచ్చివ క్రియన్ విరణనియ లాను శేఃటులున్, మలయుచు దారం బెట్టిన క్రమంబువఁ బండ్లు గ్రసి చుచిల్కలున్, దలకొని సంతరించిన నిధంబునఁ గెంజిగురుల్ గ్రహించు కో. యిలలును గల్గి యామని రహించె మహీజన రంజనాకృతిన్ ఉ. రా 9. 18

చం చిలుకలకొల్కి యొక్కరిత నే పరాకుపరాక ఉంచరన్, జలరుహపాణి యొర్తు సరన్ గయుధండ యొసంగముఁగలన్, హళహళినొక్క గంధగజయాన బరాబరిచేయ...అహ. 1. 159

2. ధ్వని.

వ... గిలుకలచప్పర కోల్పమంచవు హాళహళులు రాధికా. 4, 102.

క్రౌంచపదము అంచితగోష్ఠీసంచరణ ప్రత్యయ నముచితహళహళికలతో రా, యంచలు మ్రోయన్ గొంచిలు గూయన్ వ్యవహిత పరరవమైన కొలంకున్. కళా. 6 225.

**హాళాహళి** వి. 1. కలకలధ్వని.

గీ. అని వచించుచు వారలవ్వనిఁ జరించు, చున్నచోఁ గిరశారీమయూరపికమ.శరోలంబజాలంబు ప్రాలి కడు హ, ళాహళి యొనర్పనులికి యిలా విభుండు. రసిక. 3 17..

చం.. వాద్యములు మ్రోయ హాళాహళిసేయఁ జౌరులె, చ్చినరొద వేత్రు లెచ్చరికఁ జెప్ప ... చంద్రా. 6-130. ఉ.రా. 6 ౦.

2 సంభ్రమము, తొందర.

చం ...అ. ప్పాలఁతుల నందఱన్ నిదురపుచ్చి హాళాహళిగాఁగ నొంచున, వ్వలవుల రాజుఁ గూర్పనిట వచ్చి పెనంగితి జేనిగూడి.... యయా. 5-142.

ఉ. చెప్పెడిదేమి నావలపు చేసిన చేఁతలు కొల్వలో నని, వెన్నెప్పుడు గంటి వప్పుడపయి బడనీడిచె సిల్వఁ బద్దహా, టప్పుడ దెంతయైనఁగల దట్టు హాళాహళి కింత సేపునీ, వొప్పెడిదాఁకఁదాళుట కయోమది మెచ్చవుగా నృపాలకా. విజ వి. .9

3 సమ్మర్దము, సందడి.

చ. ఎదురుగవచ్చిపాండవ్యధరణీశ్వరుఁడర్జునుఁగాంచి నేఁడుగ, సుదినము మిరు రాగలుగుశోభన మెన్న టకబ్బుఁ ద్రోలికిం, బదఁడని యుద్ధకుందొఅని శక్రగజంబుల నెక్కి వచ్చిరం. పొదవ హాళాహళి, గడకు నొత్తెడు పౌజుల దిక్కు సూచుచున్ విజ. వి. 1-106.

కం. (నావను) ... అ, మ్మని నాథుశిక్ష రొ డొరులను వడిఁ జేయూఁతగా హాళాహళిమిఱన్. ఎళా. 1-183.

4. శౌర్యము.

ఉ. కావుము గావుమో గిరిశ కామిని యొంగరేక మాని నీ.లావున నింత కాలము హాళాహళి ప్రేయుదు వైరికోటి . రాజచ. 2-82.

5. ఆటోపము.

ఉ . విరహోర్తుల మీఁద నె చూపు శౌర్యమున్, దావజ యీహాళాహళియు భగ్నుని ముందఱఁ జూపవైతిగా. సాంగ. 2-175.

విణ వ్యాప్తము, అతిశయి ంచ.

ద్వి. కరమున నాళాల కరమర్థిఁ గున్ని, యుంమున నునుగుబ్బలొఅయంగ జెర్చి, యుగపడ జిగి హాళాహళిగాఁగ బిగిసి. తగడు గొన్నట్టి గప్పపురేవ నలరి. ఆ. మ క 4-20. పొ. 8. సం.

**హాళాహళిసేయు** స. క్రి. (హాళాహళి + చేయు) భగ్నముచేయు, గడగొట్టు; కూల్చు.

ఉ. ఖండితలైన కామరసగంధుల నిర్భరమాన దుర్గముల్, చండపరాక్రమంబున హాళాహళి సేయ దలంచి వారిపా, లిండుంమీ ద జల్లికను నేయుఁ ద్రిలోకశయంకరుం డనఁ, గుండురథాంగ చిత్తమునకొల్మి శిలీముఖసంక్తిఁగాంచుచున్. వరాహ. 4-158.

**హళువాయి** వి. (సం.గీ) ఒకానొక స్వరస్థాయి.

ద్వి హాళునాయియును ధరిహారసముహాయు... ఆదిగా సొగయురాయములు ... బస. పు. 3.941. పం.

హావణి వి. అలంకారము.

కం. శ్రవణశ్రీలు వహించిన, ధవళాంబుజకళిక లనగఁ దళుకు వహింపన్, వవలా యొక్క చెవి నేసెఁ, హావణిగ హాలురుమంజి ముత్తియమ్ములఁ బొగడల్. చంద్రా. 6 24.

గీ. హావణి సత్సంప్రదాయంబునందు భాగ్య చిహ్నములలోడ నుదయించె శీలవృత్తి. కృ. శకుం. పీఠి. 28.

2. అశ్వశిహావిశేషము.

సీ. లవణిసంకోచంబులకుఁ దెచ్చి హావణితో ఁ స సిద్ధివడయించి, రాగెలందు. వి. శకుం. 1 112.

హావణించు స. క్రి. (√. హావణి) అలంకరించు.

సీ. అవనీవధూమణిహావణించుకాంచియై యంబోధి యొంటాక నలరుచుండు. శకాం. పీఠి. 66.

2. తాల్చు, ధరించు.

సీ. హావణింపగా నేర్చువఖిలావనీచక్ర సామ్రాజ్య పూజ్య విశాలలక్ష్మి. పాండు. 1 52.

సీ. పయ్యెదచెంగావిపావడ హావణించి ముఖపుండరీకమిఁవువఁ గదించి శకాం. 4. 81.

3. చక్కఁబఱచు.

చం... నిజవంశము మైలపడంగఁజేసితిం, టిజగడమింటిలోనె హావణింపక నీవిటులొంటివచ్చుటన్. జై. భా 6.21.

4. ఉంచు.

సీ. కెమ్మోవులవచ్చిగఁటు మాటుటకు హావణించిన అవిక సంవి మణుచుముడుపులు సగముమునివంటఁ గొంకనొక్కు చెక్కులును. ప్రబంధ. 78.

5 పొందు.

సీ. అదివహించునెలుంగు హావణింపలేదుగా కిన్నరీతతి తావుకొన్న నేమి. చం. రా. 5. 52.

గీ. నిష్క్రమించు.

మ క్రొమ్మిన్నంచులన్, హావణించుకున్ గనుమిన్న లెన్ల దమా య బోటినాబోటికిన్. దశా. 7 9. 7 ఏచించు.

వ. విజయరాఘవపార్థివేంద్రుఁడు హావణించినరఘునాథనాయకాభ్యుదయ నాటకంబునకుఁ గథాసంవిధానంబెట్టి వలెనన. రఘునా. 1. పూ. 8 పం.

అ. క్రి నిష్క్రమించు. చెందు.

గీ. మఱియు గొందఱు సుదతులు మద్దెలయును నారజము మొదలైనవాద్యములు వట్టి, శ్రుతులు ఘుమ్మనిహావణింప నతివ దేశి, వృత్తవైఖరిఁ జూపె మునీంద్రుడెదుట. వాల్మీకి. 2. 125.

హావణింపు వి. (√హావణించు) అలంకారము,

ఉ... ఆకళా, శాలితయాసురూపరుచి సంపవలా హావణింపు సొంపులన్ శకాం. 2. 69.

హావణిక (√. హావణించు) అలంకారము, ఒప్పు

కం. దొరవెట్టిన హారువెట్టిదొ యరు దాహో విడుదులున్న హావణిక లులుపా, పరిధవము నింద్ర భోగమె, దొర కెను దమ కననివారు తుది తేరొకరున్. విక్ర. వి. 3- 79

గీ. ఎచ్చరిక యొచ్చరి పేవ యేన వదిలము హావణికపోణిమి యన నొప్పు నవధానము.... అం. భా. 1-188.

2. జాగరూకత

కం అట హరివిక్రముఁడత్యుద్భట హయభటహస్తిఘటలు దగరా వగరా, దట హావణిక వెడలిన మహి పటహరమైచటుల లటక పటహము మొఱసెన్. రా వి. 4-129.

3 విధము

గ. తత్పురీవారపారిప్లవేక్షణా కటాక్షవీక్షణ ప్రేక్షణీయులగుటకై జగతి నవతరించిన జయంత నలకూబరుల హావణికన్. చం. రా. 2-98.

వ.... పరస్పరవిజయేచ్ఛలఁ జిక్కుదీసినటుల దాయాదులపాళ్ళు వంచిన యపమను రాలుప్రాలిన హావ

సెబాసు మేలు హావు దించు ఫణీశ్వరుఁజూచి యుంపునన్ సుదల 4-1.

మహాప్రసిద్ధ ...అచ్చాటు నరుల్, హావుదవ్యాపాత్ర గాయా యహహా బళిబళియంచుఁ బొల్లెచ్చి పన్, నవళిన్ నర్తించెఁ గాంధర్వరవముల ముఖారావ భావావృత్తిన్. వైజ. 1-127.

**హవుసు**=హౌసు వి సొగసు

గీ.చూపఱకు వేడ్కలొదవించు సొబగు వెలయు వెలయొసఁగు జాళువా బ్రాంతశాలిమి వెన్నఁ గన్నసేపు దుప్పటి కలువార, వలదువల జేసి చెల్వారె హావుసుఁబూని. ఇందు. 5. 27

గీ. ఎన్నఁడో కదవగకాని కింపు మెఱయఁ, గంతు కేళిని వింతలుగానుపింతు, హావుసు చెల్లింతుఁ జెలులతో నతికయంతు, వసుదు నేనుఁదు నీయాన హంసయాన. అహ 3. 57.

**హవేలి** వి. (హిం హవేలీ. 1.నగరు. 2.రాజగృహము విజ 1. రాజునకుఁ జెందినది. (శ. ర.) వ్యాప :- . హవేలీతోఁట, హవేలి గ్రామము.

**హవ్య** సం వి ఆ స్త్రీ 1. గోవు.

**హవ్యకవ్యములు** నం. వి అ. న. 1. దేవతలకును పితృదేవతలకును నర్పించు హోమద్రవ్యములు

**హవ్యపాకము** నం. వి న్. పుం. 1. వెన్నపాలతో వండు హోమద్రవ్యము. 2. హవ్యమువండు పాత్రము. చరువు.

**హవ్యము** నం. విణ (అ ఆ అ) 1. హోమము చేయ దగినది. వి అ. న. 1. నేయి 2. యజ్ఞము నందు దేవతలకర్పించునది. 3. హోమద్రవ్యము

**హవ్యలేహి** నం. వి. న్. పుం. 2. అగ్ని.

**హవ్యవాట్టు** నం వి హ్. పుం 1. అగ్ని.

**హవ్యవాహుఁడు**=**హవ్యవాహనుఁడు** నం.వి.అ పుం. 1. అగ్ని

**హసంతి(క)**నం. వి. ఈ. ఆ. స్త్రీ. 1. కుంపటి.

ఉ. అంతట మంచుమించి దిశలన్నియు ముంచెము శీతబాధచే, నంతత మిండ్లలోపల హసంతికలన్ దలలెత్తె మేను. లా గ్యంతము బీడుపాఱి ధను రాకృతి నంగఁ దొడంగె ... శివధ. 5. 100

**హసత్తు** నం. వి. త్. స్త్రీ. 1. కుంపటి.

**హసనము** నం. వి. అ. న. 1. నవ్వు.

**హసని** నం. వి. ఈ. స్త్రీ. 1. కుంపటి.

**హసనీమణి** నం. వి ఆ. పుం. 1. అగ్ని.

**హసము** నం. వి. అ. పుం. 1. నవ్వు.

శా. ఏవంభూత మహాప్రభావనిధి లోకేశుం జిత క్లేశు మం, దావిర్భావహసైకమూర్త దశితో ద్యద్దైత్యగర్వాంధకా. రావేశున్ వరకేసరిం గొలిచి ...పాండు. 3. 114.

2 పరిహాసము. 3. ఆనందము.

**హసాదు**=**అహాదు** అవ్య.(నం. ప్రసాదః,క. హసద.) (శ.ర.) గొప్పవారియాజ్ఞనంగీకరించుటను దెలుపుటకై విధేయులనుమాట.

చం. అని యనుపన్ హసాదని నృపాగ్రిణియమ్ముని లోకచంద్రుఁడు, డొకని...కువల. 4.94.

ఉ. బల్లున.దెల్ల వాటిన నృపాలుఁడు మంత్రులఁ బిల్వఁబంచి......కలఁజెప్పెన దెంతయు నాను పూర్వగా, సల్లలితాంతరంగులయి సామిహసాదని వారలూఁకొనన్. సారంగ. 1. 30.

మ. అనివర్ణించు సువర్ణగర్భునకు నేదాశింప్ర సాదించి గ్ర, కకనఁద్రైలోక్యము సృష్టిచేయుమని శ్రీకాంతుండు పంపన్ హసా, దని వాణీశ్వరుఁ డాగ మోక్తముగ సూర్య చంద్రతారల్ దివం,బున భూమీనభముల్ సృజించెను. యథా పూర్వంబుగా నంతటన్ దశా 1. 804.

**హసించు**(యి) నం. అ. క్రి. 1. నవ్వు. హాసముచేయు 2 ఎగతాళిచేయు, పరిహసించు.

ద్వి అవతళిరేఖ హసియించు నొసలు. ద్వి.పరమ. 1. 16. పొ.

మ . ఆ, శ్మతనూదీప్తులు క్రొమ్మెఱుంగులహసింపన్ దర్శిమానంబుతోన్. వరాహ. 2.64.

ఈ... నీ యింటను మించుమించు హసియించు నిభోర్మికనూర్మిలన్ నృపా. చం రా 3. 10.

హసితము సం. విశ. (అ ఈ. అ.) 1 నవ్వునది 2. వికసించినది. వి. 1. నవ్వు 2 వేళాకోళము 3. మన్మథుని విల్లు.

హస్త సం. వి. ఆ. స్త్రీ. 1. ఇరువదియేడు నక్షత్రములలో బదుమూడవది

హస్తకము సం. వి. అ. పుం 1 చేయి. 2. హస్త విన్యాసము 3. కొలమానము, మూ.

హస్తగతము సం. విశ (అ. ఆ. అ.) 1 చేజిక్కినది 2. పొందబడినది 3. వశమైనది

హస్తచాపల్యము సం. వి. అ. న 1 హస్తకౌశలము

హస్తతలము సం. వి. అ న. 1.అఱచేయి 2 ఏనుగు తొండము చివర

హస్తతాలము సం వి. అ. పుం. 1. అఱచేతులు చఱచుట. 2 చప్పట.

హస్తతుల సం వి. ఆ. స్త్రీ. 1. చేతూకము 2 చేత్రాసు

హస్తధారణము సం. వి అ. న. 1. హస్తవారణము. 2 దెబ్బను చేతితో నాపుట.

హస్తపుచ్ఛము సం. వి. అ న. 1. మణికట్టుక్రింది చేతికొన భాగము

హస్తపుపారువ వి. (హస్తము+పారువ) 1. మల్లబంధవిశేషము.

వ. దండనిల్కడ కదలుకలయు మెలకువ విగళింపుదిశాపదికలు పాదపుహస్తపుపారువ... మొదల గువితము లెఱింగి... ప్రబంధ. 78.

వ అవ్వీరుండు దండనిల్కడ కదలు హస్తపుపారువ కరలాఘవంబు లాదియాపోడశోపవీతంబుల రీతులు నేర్చి....హంస. 1. 206.

హస్తప్రదము సం. విశ. (అ. ఆ. అ.) సాయము చేయునది.

హస్తబింబము సం. వి. అ. న. తైలాదులతో శరీరము ను సువాసిత మొనర్చుట.

హస్తభ్రష్టము సం. విశ. (అ. ఆ. అ.) 1. చేజాఱినది. 2. తప్పించుకొని పోయినది.

హస్తమణి సం వి ఇ. పుం మణికట్టునధరించు నాభరణము

హస్తము సం వి. అ. న 1. తోలుతిత్తులజంట 2. చేతినేర్పు పుం. 1. చేయి. 10 2. ఏనుగు తొండము. 3. మూర. అంగుళములు 4. చేవ్రాత 5. చేవ్రాలు. 6. సూచించుట. 7. సాయము 8. (కేశకచాది పరమైనపుడు) సమూహార్థకము. 9. ఒకనక్షత్రము, హస్త.

గీ అట్టిమునికిఱారం బెక్కుపత్యములుపుట్టు, హస్తమునగర్మనఫత భారి. 8-168.

10. హస్తాకారముగల పర్వి, చేతివలెనుండుప్రెడ్డు, చట్టము

ను హరివాణంబులు గిన్నియల్ పడిగముల్ హస్తావళుల్ పీఠముల్ ..వరాహ 4-112

హస్తలాఘవము సం వి. అ న. 1. చేతినేర్పు 2 కనుకట్టువిద్య, గాండీ.

హస్తలేఖము సం. వి అ పుం. 1 చిత్తరువు మున్నగువానిని దీర్చుటకు ముందుచేతితోజేయు నభ్యాసము, 2 చేతివ్రాతలేఖనము

హస్తవంతుడు సం. విశ (డ్, తి, డ్.) నేర్పుగలవాడు

హస్తవాపము సం. వి అ. పుం చేతితోబాణములు ప్రయోగించుట. హస్తక్షేపము

హస్తసిద్ధి సం. వి. ఇ స్త్రీ. 1. చేతిపని 2 కూలి

హస్తసూత్రము సం. వి అ న 1 మణికట్టున ధరించు తోరము 2, కంకణము

హస్తస్వస్తికము సం వి. అ పుం చేతులను స్వస్తికమువలె నొకదానిపై నొకటి యడ్డముగావేయుట.

హస్తహార్యము సం. విశ. (అ. ఆ. అ.) ప్రత్యక్షమగునది 2 సువ్యక్తమగునది.

హస్తాక్షరము సం. వి. అ. న. చేవ్రాలు.

హస్తాగ్రము సం. వి. అ. న. వ్రేలు.

హస్తామలకము సం. వి. అ. న. 1. అఱచేతిలోని యుసిరికకాయ; వశమైనది, స్పష్టమైనది. 2. ఒక వేదాంత గ్రంథము.

హస్తామలకుఁడు నం. వి. అ. పుం. శంకరాచార్యుల వారి శిష్యులలో నొకఁడు.

హస్తార్పణము నం. వి. అ. న. నమస్కారము. (ఈయర్థము ఆంధ్రమువనే కానవచ్చుచున్నది.) రగడ. చెన్నగు సింహక్షేత్రమహాసిం, హస్వరూపునకు హస్తార్పణమని...హంస 4-213.

హస్తావాహము నం. వి. అ. పుం. 1. జ్యాఘాతవారణము. (అల్లెత్రాటిదెబ్బ తగులకుండఁ గాపాడునది-అంగుళిత్రము.) 2. చేతిసంకెల.

హస్తాహస్తి నం. అవ్య. చేతులు చేతులు కలిపి చేయు యుద్ధము.

హస్తి నం. విశ. (న్. నీ. న్.) హస్తముగలవాఁడు. వి. న్. పుం. ఏనుఁగు.

వ. అప్పు డప్పటుగభస్తి హస్తియుంబోలెఁ బద్మినీప్రమోదావహకర ప్రచారుండై... పాండు. 4-16.

హస్తిక నం. వి. అ. స్త్రీ. తంత్రులుగల వాద్యవిశేషము.

హస్తికక్ష్యము నం. వి. అ. పుం. 1. సింహము; పెద్దపులి

హస్తికము నం. వి. అ. న. గజయూథము.

హస్తికర్ణము నం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

హస్తిగిరి నం. వి. ఇ. పుం. కాంచీనగరము.

హస్తిఘ్నుఁడు నం. వి. అ. పుం. 1. ఏనుగును జంపువాఁడు 2. మనుష్యుఁడు

హస్తిచారము నం. వి. అ. పుం. ఒకవిధమైన యాయుధము

హస్తిచారి నం. వి. న్. పుం. ఏనుఁగును నడుపువాఁడు.

హస్తిజాగరికుఁడు నం. వి. అ. పుం. గజమును పోషించువాఁడు.

హస్తిజిహ్వ నం. వి. అ. స్త్రీ. ఒకవిధమైన నాడి.

హస్తిదంత(క)ము నం. వి. అ. పుం. 1. ఏనుఁగు దంతము. 2. చిలుక కొయ్య న ముల్లంగిగడ్డ.

హస్తినఖము నం. వి. అ. న. గవనివాకిట వాటముగా నేర్పఱిచిన మట్టిదిబ్బ.

హస్తి(న)నాపురము వి. కురురాజధానియగు నొక పట్టణము, కరినగరము.

గీ. తనరు గంగాతరంగిణీతటమునందు... హస్తినాపురంబు....దశా. 1. 82.

హస్తినాస నం. వి. అ. స్త్రీ. ఏనుఁగుతొండము

హస్తిని నం. వి. ఈ. స్త్రీ. 1. ఆడేనుఁగు. 2. ఒకవిధమైన యోషధి. 3. ఒకజాతి స్త్రీ. (స్థూలాధర, స్థూలనితంబబింబ, స్థూలాంగుళి, స్థూలకుచ, సుశీల, కామోత్సుక, గాఢరతిప్రియ, నితాంతభోక్త్రి అయినట్టి స్త్రీ.)

హస్తిపకుఁడు నం. వి. అ. పుం. మావటివాఁడు. జరికాఁడు.

హస్తిపర్ణి(క) నం. వి. ఈ. స్త్రీ. 1. దోసతీఁగ. 2 రాచబీఱ.

హస్తిపుఁడు=హస్తిపకుఁడు. నం. వి. అ. పుం. మావటీఁడు

హస్తిబంధకి నం. వి. ఈ. స్త్రీ. వన్యగజములను వశపఱుచుకొన నుపయోగపడు నాఁడేనుఁగు.

హస్తిమయూరము నం. వి. అ. పుం. అజామోదము. (వృ. వి.).

హస్తిమల్లము నం. వి. అ. పుం. 1. ఐరావతము. 2. భస్మరాశి. 3. గాలిదుమారము. 4. మంచు.

హస్తిమల్లుఁడు నం. వి. అ. పుం. గణేశ్వరుఁడు.

హస్తివాహము నం. వి. అ. పుం. అంకుశము.

హస్తివాహుఁడు నం. వి. అ. పుం. మావటివాఁడు.

హస్తిశుండ నం. వి అ. స్త్రీ 1. ఇంద్రవారుణి యను నొకవిధమైన యోషధి. 2. నల్లేరు.

హస్తిశుండి నం. వి. ఈ. స్త్రీ.=హస్తిశుండ.

హస్తిషడ్గవము నం. వి. అ. న. ఆఁడేనుఁగుల సమూహము.

హస్తేకరణము నం. వి. అ. న. పెండ్లియాడుట.

**హస్త్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చేతికి సంబంధించినది 2. చేతితోఁ జేసినది. 3. చేతితో నీయఁబడినది.

**హస్త్యాజీవుఁడు** సం. వి. అ. పుం. మావటీఁడు.

**హస్త్యారోహుఁడు** సం. వి. అ. పుం. 1. మావటివాఁడు. 2. గజవాహనుఁడు.

**హస్రము** సం. విశే. (అ. అ. అ). 1. స్మేరము. 2 తెలివితక్కువది. 3. అజ్ఞము.

**హహాలము** సం. వి. అ. న. ఉగ్రవిషము.

## హా

**హా** అవ్య. 1. గుఱ్ఱము మున్నగువానిని త్రోలుటకై చేయుధ్వని.

ఉ...పోయిపోయిరా, ఇక్కడ వన్నె సోఁకనటు హా యనివన్ గదలెన్ జరిలునన్. సాంగ. 1-82.
2. కడచిన విషయమును జ్ఞప్తికి దెచ్చుకొనుటను సూచించును.

వ....హా! మఱచియంటి... ఆము. 6-31.

3. సంతాపము దెలుపును.

ఉ. హా యను ధర్మరాజతనయా యను నన్నెడఁబాయ నీకుఁ జ, న్నే యను....భా. ద్రో. 2-342.

మ. అత దల్పౌషధహీనుఁడై ... చరణద్వంద్వంబు రాకుండినన్, మతిఁ జింతించుచుఁ దద్విధం బెఱిఁగి హా వన్నిట్లు దైవంబ తె, చ్చితె యీఘోరవనప్రదేశమునకున్ సిద్ధోపదేశంబునన్. మనుచ. 2-14.

ఉ....ల్ల థాంగియై, సోలినఁ జూచి డెందములు సుఱ్ఱున హా యని వోటు లందఱున్. ఆము. 5-76.
4. ఆక్రోశార్థకము.

కం. అది గనిన మాల్యవంతుఁడు, గదగొని హాపోకు పోకు గరుడ యటంచున్, విదళించె గరుడు ఱెక్కలు.... దశా. 2-402.

4. రోషమును, ఆక్షేపమును దెలుపును.

ఉ....మోహినీమహిళ యద్భుతరోషకషాయితాక్షియై, హా యనువంతలో దశా 2-329.

ఉ. స్యందనమున్ దురంగములు శౌరివిపో బలరాము చెల్లెలీ, యిందునిభాస్య యీమె నెటకెత్తుక పోయెదు రాకుమారమే, మందురు యాదవుల్ వినిన హా యిటువంటివె రాచవారితోఁ, బొందులు గానకుండఁ గొని పోఁదగవా మిమువంటివారికిన్. విజ. వి. 3-148.

6. సుఖాదులవలని పారవశ్యమును దెలుపును.

చం, సకలశుభమ్ము లిమ్మనుచు సన్నుతులీగతిఁ జేయ సాంద్రవం, తికదయఁ దెల్ప బంచినగతిం జనుదెంచె నుదంచదూర్మికా, నికర విలోల ఖేలదలినీ కలగాన లసత్ ప్రఫుల్లహల్లక సుఖడోలికా విహృతి లాలన బాలసమీర మయ్యెడన్.

కం. చనుదెంచిన హాయనియ, జ్జవనాయకుఁ దలరుచున్ విశాంచుఁగని యీ, యనుకూలమారుతాగతి, గనుఁగొని నామోదసూచకంబైనదిగా. విజ. వి. 1-52.

7. ఆశ్చర్యార్థకము.

మ. అరుణావిష్కృతి భాస్కరోదయముఁ బద్మామోదమంభోరుహా. కరమున్ వేలుపు విల్ ప్రవర్షణము నోంకారంబు మంత్రాక్షర, స్ఫురణంబున్ బ్రకటింపఁగా మొదల నుద్భూతంబులై వట్టులీ, శ్వరుఁ డేతెంచుటకున్ ద్వదాగమనము హా సంసూచకంబయ్యెడున్. పాండు. 4.57.

**హాంగరము** సం. వి. అ. పుం. పెద్దచేఁప.

**హాంత్రము** సం. వి. అ. పుం. చావు, మృతి.

**హాకారము** సం. వి. అ. పుం. హా యనుధ్వని.

**హాకీము** వి. (హిం. హాకిం.) 1. యజమానుఁడు.

శా.. నీరుకాకి నెపముల్ జోడించి పల్మాఱయో హాకీముల్ దమరిట్లు పల్కుటకు నర్హంబె విమర్శింపఁగన్. రంగా. 2. 218.

2. వైద్యుఁడు. (శ.ర.)

**హాకృతము** సం. విశే. (అ. ఆ. అ.) హాహాధ్వనులతో నిండినది.

**హాజారము** = హజారము. వి. ఆస్థానమండపము, కొలువు కూటము.

కం. యోజింపుమనుచుఁ జెప్పిన, హాజారంబునకు వచ్చి యమ్మంత్రివరుం, డేకాడ బ్రియమొనర్చెద, రాజునకని తలఁచు...రామా. 2. 77.

**హాటకగర్భుఁడు** సం. వి. అ. పుం. బ్రహ్మ.

**హాటకగిరి** సం. వి. ఇ. పుం. మేరుపర్వతము.

**హాటకము** సం. విణ. (అ. ఆ. అ.) సువర్ణమయము. వి. అ. న. 1. బంగారు. 2. ఉమ్మెత్త (వృ. వి.) 3. ఒకవిధమైన రసము. పుం. ఒకదేశవిశేషము.

**హాటకి** సం. వి. ఆ. స్త్రీ. మట్టికుండ.

**హాటకేశ్వరుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**హాతము** సం. విణ. (అ. ఆ. అ.) విడిచిపెట్టబడినది.

**హాతువు** సం. వి. అ. ఉ. పుం స్త్రీ. 1. చావు. 2 బాట., మార్గము.

**హాత్రము** సం. వి. అ. న. 1. కూలి. 2. బాధించుట. 3. చంపుట. 4. చాయ.

**హాత్రువు** సం వి. అ. పుం. ఒక రాక్షసుఁడు.

**హాధిరా** అవ్య. గుఱ్ఱములు మొదలైన జంతువుల నాఁపుటకు సారథులు ప్రయోగించుమాట.

సీ. జగదంతరప్రజా సమ్మర్దపథముల హాధిరాయని వేగ మాగకున్న. కకుత్థ్స 2-42.

**హానము** సం వి. అ. న. 1. విడుచుట. 2. నష్టము. 3. అపజయము. 4. తప్పించుకొనుట. 5. బలము. 6. కొఱఁత. 7. విరమణము

**హాని** సం. వి. ఇ. స్త్రీ. 1. విడుచుట. 2. తక్కువగుట. 3. నష్టము 4. కీడు, 5 లోపము. 6. గతి.

**హాపనము** సం వి. అ. న. 1. వెడలించుట. 2. బయటికిఁద్రోయుట.

**హాపుత్రి(క)** సం. వి. ఈ. ఆ. స్త్రీ. మందపిచ్చుక. కాటుకవంటి యొకపిట్ట. ఆ. స్త్రీ. ఆవులించుట.

**హాఫిక** సం. వి. ఆ. స్త్రీ. ఆవులింత.

**హామిక**=అమిక వి. (సం. అహమహమికా.) మదము. గర్వము.

ఉ. అమ్మనుజాళి సొమ్మసిలి యమ్మెయిఁ గ్రమ్మఁటఁ జేరి హామికిన్ హుమ్మని హుంకరించి దగునొత్తె వనాటుఁడ... సమీర. 1.170.

ఉ. ...అనేకసాయక, స్తోమవిశాలతూణగణశోభిత బాహులు దండ్రిఁ గొల్చుచున్, హామిక వచ్చి కుక్కళలవాఖ్యులు దానవ వంశ వర్ధనా. సీతా. వి 2-151.

ఉ హామికఁ జొచ్చి బాల్యమను నాటకొలంకుఁ గలంచి యిచ్చగా, నామికగామిడై నిలిచి యొాదల యెత్తి చెలంగు తద్వయ, స్వామజరాజకుంభ విలసద్గతి నొప్పెఁగుచద్వయంబునా, రిమణి కౌరయారు దనరెం గళికాఁచిత దానధారలై. ఉ. హరిశ్చ 2-45

**హాయనము** సం. వి అ. పుం. న. 1. సంవత్సరము. 2. కిరణము. పుం. ధాన్యవిశేషము.

**హాయి** వి. 1 సుఖము.

వ. అప్పుఁడు వెన్నెలలకాఁక సోఁకునకుంగాక యిందుమతి హాయనుచు హాయిలేక...ఇందు. 4-37.

గీ ఇంగితజ్ఞులహాయి మారంగళాయి, మంగయ బలాఁతచేయి మారంగళాయి, యంగదభృతాను యాయి మారంగళాయి, భృంగసంకాశకాయి మారంగళాయి. పాంచాలీ. 1.28.

2. సంతోషము.

సీ. మదికి హాయి ఘటించె మదవతీ మణులార! సురభిళాళుగ పరిస్ఫురణగరిమ. చంద్రా. 2-142.

సీ. తనవల్లఁబుట్టిన దనక మహామాయ నాదిని జేపట్టి హాయినెందె. పార్వ 4-102.

**హాయిమను** అ. క్రి. (హాయి+అను. వృత్తిని వర్ణాగమము) సుఖించు.

మ. చలదావాసంతికాసూనని, ర్ఘల మారందకణాళి జాటి తనపై ద్రాలంగ రాయంచ తెం. కృలు ఝూడించినఁ గ్రమ్ము తెమ్మెరల రాకన్ హాయిమంచున్నెడన్. కుశల. 4-126.

**హాయిరె** అవ్య. సంతోషమును దెలుపును.

ఉ. హాయిరె కాలచూపులిఁక నక్కట చోక్కటపున్ మెఱుంగులై, నాయెద దుస్సపాతె రతినాథుని యాధునికాస్త్రవైఖరిన్. అహ. 5-67.

హార నం. వి. ఆ. స్త్రీ. తొగరువన్నెగల ద్రాక్ష.

హారకము నం వి. అ. న. 1. ముత్యాలహారము. 2. గద్యరచనా విశేషము. 3. భాజకము. (గణిత.)

హారకుఁడు నం. వి. అ. పుం. 1. దొంగ. 2. మోస గాఁడు; జూదరి.

హారగుటి(లి)క నం. వి. ఆ. స్త్రీ. హారమునందలి యొుక ముత్యము.

హారతి వి. నీరాజనము, ఆరతి.

"నక్షత్రపు హారతి" బ్ర. 3. ఆ. (శ.ర.)

హారఫల(క)ము నం. వి. అ, న. అయిదు పేటల ముత్యాలహారము,

హారము నం. విశ. (అ. ఆ. అ.) హారసంబంధియైనది, వి అ పుం. 1. గ్రహించుట. 2. తొలఁగించుట. 3, నూటయెనిమిది పేటల ముత్యాలహారము. 4. యుద్ధము. 5. భాజకము. (గణిత.) 6. దీర్ఘాక్షరము (ఛంద;).

హారయష్టి నం. వి. ఆ. స్త్రీ. ముత్యాలహారము.

హారహార నం. వి. ఆ. స్త్రీ. ఒక విధమైన ద్రాక్ష.

హారహూరము నం. వి. అ పుం మద్యము.

హారావలి నం. వి. ఇ. స్త్రీ. 1 ముత్యాల హారము. 2 పురుషోత్తమ దేవుఁడు రచించిన యసాధారణ పదముల నిఘంటువు

హారి నం విశ (న్. జో. న్.) 1. హరించునది, 2. గ్రహించునది. 3. పొందునది. 4. మనోహర మైనది. 5. అతిశయించినది. 6. హారముకలది. ఈ స్త్రీ. ముత్యము.

హారీకంఠము నం. వి. అ. పుం. కోకిల.

హారికులు నం. వి. అ. పుం. (బ) ఒకజాతి జనులు.

హారిణము నం. వి. అ. న. లేడిమాంసము.

హారిణికుఁడు నం. వి. అ. పుం. వేఁటకాఁడు.

హారితము నం. వి. అ. పుం. 1. ఆకుపచ్చవన్నె. 2. ఒకవిధమైన పావురము. విశ. (అ. ఆ. అ.) 1. గ్రహించునట్లు చేయఁబడినది. 2. బహూకరింపఁ బడినది. 3 ఆకర్షింపఁబడినది. 4. అతిశయింపఁబడినది

హారిద్రము నం. విశ. (అ. ఆ. అ.) పసుపు వర్ణము గలది వి అ. పుం. 1. పసుపు వర్ణము 2. కదంబ వృక్షము, 3. ఒకవిధమైన జ్వరము. 4. బంగారము

హారీతము నం. వి అ పుం. ఒకవిధమైన పావురము.

హారీతుఁడు నం. వి. అ పుం 1. దుష్టుఁడు. 2. మోస గాఁడు. 3. ఒకస్మృతికర్త.

హారుఁడు నం. వి. అ. పుం. మోయువాఁడు.

హారువు నం వి ఉ. పుం. జూదమునందలి పరిభాష ఉ. హారి. క ఆ... (శ.ర.)

హార్దము నం. విశ. (అ. ఈ. అ.) హృదయమునకు సంబంధించినది. వి. అ. న. 1. ప్రేమ. 2 దయ, 3. ఉద్దేశము. 4. అర్థము.

హార్ది నం. విశ. (న్. జో. న్.) మిక్కిలికోరఁబడినది.

హార్దిక్యము నం. వి. అ. న. మైత్రి.

హార్దిక్యుఁడు నం. వి. అ. పుం. కృతవర్మ.

హార్య నం. విశ. (అ. ఆ అ.) 1. గ్రహింపఁదగినది. 2. మోయఁదగినది. 3. తొలగింపఁదగినది. 4. కదలింపఁదగినది. 5. ఆకర్షింపఁదగినది. 6 ఓడింపఁదగినది 7. సంపాదింపఁదగినది. 8. వశపఱుచుకొనఁబడినది. 9. నశింపఁజేయఁదగినది. 10. మనోజ్ఞమైనది. వి. అ. స్త్రీ. ఒక విధమైన (శ్రీ)గంధము.

హార్యము నం. వి. అ. పుం. 1. పాము. 2. శాంద్ర. (వృ. వి.).

హాల నం. వి. అ. స్త్రీ. మద్యము. సారాయి.

హాలకము నం. వి. అ పుం. గోదుమవన్నె గుఱ్ఱము.

హాలభృత్తు నం. వి. త్. పుం బలరాముఁడు.

హాలము నం. వి. అ. పుం. 1. నాఁగలి. 2. పక్షి విశేషము.

హాల(లా)హలము నం. వి అ. పుం. న. 1. విష భేదము. 2. నలికండ్లపాము. పుం. బల్లి.

**హాలహలి(ల)** నం. వి. ఈ. స్త్రీ. మద్యము సారాయము.

**హాలి** నం వి ఈ. స్త్రీ. మఱదలు, భార్యచెల్లెలు.

**హాలికము** నం విణ. (అ. ఆ అ.). నాఁగలికి సంబంధించినది. వి. అ పుం. దుక్కిటెద్దు.

**హాలికుఁడు** నం వి అ. పుం. 1. కర్షకుఁడు 2. నాఁగలితోఁ బోరాడువాడు.

**హాలిని** నం. వి. ఈ స్త్రీ. పెద్దబల్లి.

**హాలుఁడు** నం. వి అ పుం. 1. బలరాముఁడు. 2. శాతవాహన వంశపు రాజులలో నొకఁడు.

**హాలువు** నం వి ఉ పుం దంతము. పల్లు.

**హాళి** వి. ఆసక్తి.

ఉ. హాళి మనంబునం బెరుగ నాలయి బిడ్డయిబంటుఁ బైదయై. పాండు ?. 162.

మ. సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా హాళి వాటిల్లెడున్, సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యా హాళి యానేగదా! విజ. వి. ?. 53. దశా. 7. 137.

2. సంతోషము.

ఉ. నావిని శంకరున్ బలుకు నారదుఁడో మదనారి భూరికా, ర్యావహ బుద్ధిఁబోలె భువనాళిని హాళిఁ జరింతు ... పాండు 2. 217.

కం హాళిం గొని యాడందగు, హేళిఁ బ్రసన్నోదయున్ ద్రయీ మధుపాళీ, కేళీ సంకిలితకం, కేళి గుళుచ్ఛ స్వరూప మ్మృడిరింభోళిన్. రామా. 1. 16, శుశ. 1. 178

3. ఉత్సాహము, పూనిక.

గీ దర్పకునితోడఁ గూడి చైత్ర ప్రభుండు, విరహిణీ పాంథసందోహ విజయమునకు, హాళి దైవార ఏపుడు వాహ్యాళి వెడలె. రసిక. 2. 7.

మ. ... ఘటియించెన్ జలకేళీ హాళిమెయి రఘుస్వామి యధీణుఁడై. దశా 3. 174.

4. ప్రేమ, స్నేహము.

గీ. బ్రహ్మరుద్రాది దేవతా ప్రభులమీఁది, హాళియను మాని నందకాద్యాయుధాళి, రాముఁడయ్యెడ దశరథరాముఁడయ్యె. ఉ. రా. 1. 39.

గీ. పూలపాన్పువఁ గొదలేని హాళి నతను, కేళినోలాడఁజేసిన లీలగ్రాల. రసిక. 5. 172.

5 పరిహాసము.

లయగ్రాహి ... కయ్యాలకెన వెట్టుచును హాళిఁ జలవట్టుచు సుమాళముల గిట్టుచును బాలికలు వేడ్కన్. కళా. 6. 231.

**హావకుఁడు** నం. వి. అ. పుం. 1. పిలుచువాఁడు. 2. వధువు నాహ్వానించువాఁడు.

**హావము** నం. వి. అ పుం. 1. పిలుపు. 2. భ్రూనేత్రాది వికారముల చేతఁ గొంచెము తెలియఁదగిన మనోవికారము.

శ్లో. గ్రీవారేచక సంయుక్తో భ్రూనేత్రాది వికాసకృత్, భావా దీషత్ ప్రకాశో యః స హావ ఇతి కథ్యతే (ఉజ్జ్వలమణి.)

**హావళి(డి)**=అవళి (డి). (బ. హావడులు, హావళులు హావళ్ళు ) ఉపద్రవము

కం దేవా క్రమక్రమంబునఁ. బావనులై సృష్టిఁ గలుగు ప్రజలీ కరణిం, గైవల్యంబున కేఁగెదు, హావళిచే మాకు నడవ నధికారంబుల్. వరాహ. 10. 17.

ఉ. ... అయ్యామనిఁ బంటచేల డిశ హావళి సేయు మహామహీజముల్, భీమనిశాత దంష్ట్రికల బిట్టగలించుచు నేకలంబులు... చంద్ర. 2. 8.

శా. ... వర్షంపు నెవ్వన్ రుజన్, హావల్లన్ దిగు నవ్య భూప్రజల రాజాయాయి జాత్యోచితిన్ బ్రోవంగాఁ దగు ... అము. 4. 245.

**హాసకుఁడు** నం. వి. అ. పుం. హాస్యకారుఁడు. నవ్వు కలిగించువాఁడు.

**హాసనము** నం. విణ.(అ. ఈ. అ ). నవ్వు పుట్టించునది.

**హాసనికుఁడు** నం. వి. అ. పుం. బాల్య మిత్రుఁడు.

**హాసమార్గము** నం. వి. అ పుం. 1. ఎగతాళి. 2. పరిహాసము.

హాసము సం. వి. అ. పుం. 1. నవ్వు. 2. ఆనందము. 3. హాస్యరస స్థాయి భావము. 4. పరిహాసము. 5. వికసించుట. 6. గర్వము

హాసనుఁడు సం. వి. న్. పుం. చంద్రుఁడు.

హాసావళి సం. వి. ఇ. స్త్రీ. వస్త్ర విశేషము ప్రబంధ. 605.

హాసించు సం. అ. క్రి. నవ్వు. చంద్రా. 1 ఆ. (శ. ర.)

హాసిక సం. వి. ఆ. స్త్రీ. 1. నవ్వు 2. సంతోషము.

హాస్తికము సం. వి. అ. న. ఏనుఁగుల సమూహము.

హాస్తికుఁడు సం. వి. అ. పుం. మావటివాఁడు.

హాస్తినము సం. విశే. (అ. ఆ. అ.). ఏనుఁగు మునుగు వంతలోఁతు గలది. వి. అ. న. హస్తినాపురము.

హాస్యము సం. విశే. (అ. ఆ. అ.). నవ్వఁదగినది. వి. అ. పుం. నవరసములలో నొకటి. న 1. నవ్వు 2. సంతోషము. 3. వేళాకోళము. 4. ఆక్షేపము.

హాహ(హా)లము సం. వి. అ. న. ఉగ్రవిషము.

హాహవము సం. వి. అ. పుం. నరక విశేషము.

హాహసుఁడు సం. వి. న్. పుం. ఒక గంధర్వుఁడు.

హాహా సం. అవ్య. సంతాపార్థకము.

శా. హా హా పుట్టెడు లాతిచూపులకు నాహా పుట్టు మీవారికిన్. భార. శల్య. 2. 248.

హాహాకారము సం. వి. అ. పుం 1. దుఃఖము 2. బిగ్గరగా శోకించుట. 3. రణధ్వని.

హాహుఁడు సం. వి. అ. పుం. ఒక గంధర్వుఁడు.

హాహూలు వి. బ. హా హూ అను మాటలు, ఆడంములు.

కం. ఒహో భూవర వలవని, హాహూ లివి యేల విక్రమార్కుని సరిగా, సాహసమును గంభీరోత్సాంబును లేక యెక్కుఁదరమే నీకున్ ద్వా. 2. 69.

## హి

హింకారము సం. వి. అ. పుం. 1. పులి. 2. ఒక విధమైన చిన్నధ్వని.

హింగుడి సం. వి. ఈ. స్త్రీ. = ఇంగుడి.

హింగు నిర్యాసము సం. వి. అ. పుం. ఇంగువ రసము. 2 వేఁపచెట్టు.

హింగుపత్రము సం. వి. అ. పుం. గారచెట్టు.

హింగులిక సం. వి. అ స్త్రీ. ఒక జాతి ముండ్ల చెట్టు

హింగులువు సం వి. ఉ పుం. న. హింగుళము.

హింగుళము సం. వి. అ. పుం. న. రాగద్రవ్య విశేషము, ఇంగిలీకము

హింగుళి సం. వి. ఈ. స్త్రీ. 1. మునగచెట్టు 2. హింగుళము.

హింగువు సం వి. ఉ న. 1. ఇంగువ, 2. ఇంగువ చెట్టు. 3. వేఁపచెట్టు.

హింగూజ్జ్వలసం. వి అ. స్త్రీ. ఒకవిధమైనసుగంధద్రవ్యము

హింగూలము సం. వి. అ పుం. ఒకానొక దుంప.

హింజీరము సం. వి. అ పుం. ఏనుఁగు కాలికిఁగట్టు గొలుసు.

హిండనము సం. వి. అ. న. 1. వ్యాప్తి. 2. భ్రమణము. 3. సురతము. 4. వ్రాయుట.

హిండి సం. వి. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

హిండికుఁడు సం. వి. అ. పుం 1. జ్యోతిషికుఁడు. 2 కాముకుఁడు.

హిండితము సం విశే. (అ ఆ అ) వ్యాపించినది.

హిండి(డీ)రము సం. వి అ పుం 1. ఒకజాతి వేఁప యెముక. 2. మునగచెట్టు 3. బలకరౌషధము న. దానిమ్మ (వృ. వి.).

హిండీరుఁడు సం వి. అ. పుం. మగవాఁడు.

హిండుకుఁడు సం వి. అ పుం. శివుఁడు

హింతాలము సం. వి. అ. పుం. గిరకతాడి. (వృ వి.)

హిందువు సం. వి. ఉ. పుం. భారత వర్షీయుఁడు. భారతీయుఁడు.

హిందోల సం. వి. ఆ. స్త్రీ ఎనిమిది పురుష రాగములలో నొకటి.

సీ. భైరవి మాళవ బంగాళ హిందోల...ఎన్మిది పురుష రాగంబులు. హంస. 5-123.

**హిందోలకము** నం. వి. అ. పుం. ఉయ్యెల, ఉయ్యెల తొట్టి.

**హిందోలము** నం. వి. అ. పుం. 1. ఎనిమిది పురుష రాగములలో నొకటి. 2. ఉయ్యెల.

**హింస** నం. వి. ఆ. స్త్రీ. 1. పీడ. 2. మోసము. 3. చంపుట. 4. దొంగతనము

**హింసకము** నం. విశే. (అ. ఆ. అ). 1. బాధించునది. 2. ఉపద్రవకరమైనది. 3. క్రూరమైనది. వి. అ. పుం 1. వన్యమృగము. 2. క్రూరజంతువు.

**హింసకుఁడు** నం. వి. అ. పుం. 1. హింసించువాఁడు. 2. శత్రువు. 3. అథర్వవేదమున నిష్ణాతుఁడైన బ్రాహ్మణుఁడు.

**హింసన** నం. వి. ఆ. స్త్రీ. 1. కొట్టుట. 2. చంపుట.

**హింసనము** నం. వి. అ. న.=హింసన

**హింసనీయము** నం. విశే. (అ. ఆ. అ.) చంపఁదగినది.

**హింసాకర్మము** నం. వి. న్. న. 1. బాధాకరమైన పని. 2. అభిచారక్రియ.

**హింసారువు** నం. వి. ఉ. పుం 1. పెద్దపులి. 2. క్రూరమృగము

**హింసాలువు** నం. విశే. (ఉ. ఊ. ఉ.) 1. బాధాకరమైనది. 2. చంపునది. వి. ఉ. పుం. అడవికుక్క.

**హింసించు** నం. న. క్రి. 1. చంపు, వధించు.

కం. పాపాత్ములై వరక్కసు, లేపున వచ్చెదరు వారి హింసింపుము ర, మ్మీ పుణ్యాశ్రమమునకును... భా.రా బా. 268.

2. బాధించు, 3. కొట్టు.

**హింసితము** నం. విశే. (అ ఆ అ.) బాధింపఁబడినది. వి. అ న. 1. హాని. 2. బాధ.

**హింసీనము** నం వి. అ. పుం 1. వన్యమృగము. 2 క్రూరమృగము.

**హింసీరము** నం వి. అ. పుం. 1. పులి. 2. పక్షి.

**హింసీరుఁడు** నం వి అ. పుం. మోసగాఁడు.

**హింస్యము** నం. విశే. (అ. ఆ. అ.) చంపఁదగినది.

**హింస్ర** నం. వి. ఆ. స్త్రీ. 1. నాడి. 2. జటామాంసి. (వృ వి.) 3. వల్లయుప్పి. (వృ.వి.) 4. గంజాయి. (వృ. వి.) 5. అడవి గోదుమ. 6. క్రొవ్వు.

**హింస్రకము** నం. వి. అ. పుం. క్రూరమృగము.

**హింస్రము** నం. విశే. (అ. ఆ అ.) 1. హానికరమైనది. 2 హింసించునది. 3. భయంకరమైనది, వి. అ. పుం. క్రూరమృగము. న. క్రూరత్వము.

**హింస్రుఁడు** నం. వి.అ. పుం. 1. శివుఁడు. 2. భీముఁడు 3. జీవహింసాప్రియుఁడు.

**హిక్క** నం. వి. ఆ. స్త్రీ. 1. ఎక్కిలి. 2. పైడికంటియను పక్షి. 3. గుడ్లగూబ. 4. అస్పష్టమైనధ్వని.

**హిక్కిక** నం వి. ఆ. స్త్రీ. ఎక్కిలి.

**హిక్కితము** నం. వి. అ. న. ఎక్కిలి

**హిజారు** (హిం.హిజార్) వి. 1. పురుషులు తొడుగు గొను లాఁగు, చల్లడము.

సీ. మెలి పెట్టి చుట్టిన తెలివరంగిముజానుపైల పేటాడబ్బు పమలజెలఁగు, బంగరు వ్రాతలపట్టుహిజారు కంబరు... శుక. 2-427.

2 వర్తకి ధరించు సగముతోడ వఱకు నుండెడు చట్టలాఁగు, అర్ధోరుకము. (కాలిశిఁ దొడిగికొను అని (శ. ర)

సీ. బటువు గద్దియలపైఁ బట్టుగద్దిగరిబి ఉఘనదేశముల హిజారు లమర కువల. 1.188.

చం తొలఁకెడు తత్తరంబు వగలోఁ దొడనిగ్గు హిజారుమీఁద మెప్రటిలు వడినొంటి కట్టున ఘటించిన చీర... శుక. 3-16.

**హిజరీ** హిం. వి. మహమ్మదీయ శకము. (శ.ర.)

**హిజ్జలము** నం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు. (వృ.వి.)

**హిత** నం. వి ఆ. స్త్రీ. 1. ప్రవాహమున కడ్డముగా వేయు దారి. 2. నరముల.సమూహము.

**హితకము** నం వి. అ. పుం. శాబకము.

**హితకుఁడు** నం. వి. అ. పుం. బాలకుఁడు.

**హితపథ్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉపయోగించునది. 2. ప్రియమైనది.

**హితప్రణి** సం. వి. ఈ. పుం. గూఢచారుఁడు.

**హితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది 2. పంపఁబడినది. 3. గ్రహింపఁబడినది. 4. తగినది 5. ఉపయోగకరమైనది. 6. ప్రియమైనది. 7 శుభమైనది వి. అ న. 1. లాభము. 2. మేలు. 3. సంతోషము.

**హితవరి** = ఇతవరి. విశ. (హితవు+అరి) మేలు చేయువాఁడు; మేలు చేయునది.

చం హితవరి మాటలాడి తుది సెగ్గొనరింపనె కాచియున్న యీ,కితవపు వృద్ధ భల్లుకము కృత్రిమ మైత్రి నిజంబుగాఁ దలం,చితి ... విక్ర 3. 96.

కం. హితవరియై వెరవరియై, మతిమంతుఁ డనంగఁ దనరి మంత్రి విధాన, ప్రతిభాన్వితుఁడగు నిత్యో చితవితరణశాలి మంత్రిఁ జేయఁగ వలయున్. చిత్రభా. 5. 53.

కం. పతిరతిఁ దీఱదు తమి పర, పతి రతియేరీతి దొరకు భావంబున సం, గతమగు నీవెత దీర్చెడి హితవరు లెవరని తలంచి రెంతయు వంతన్ హంస. 5. 280.

**హితవు** = ఇతవు. విశ. (సం. హితమ్) మేలు కలిగించునది.

వ్యావ. నామాటలు వానికి హితవుగాఁ దోఁచలేదు. వి. 1. సఖ్యము, చెలిమి.

ఆ. హితవు మఱచు రాజు లెందు నమ్మికకుఁ బాత్రములె సమదమతులు క్రౌర్యరతులు. భార. శాంతి 3. 247.

సీ తనవిత్త హానికోర్చినఁ బూఁటపడపలె హితవున్న చోట నప్పీయఁదగదు. రామలిం. 49.

2. ఇష్టము, ప్రీతి.

వ్యావ. వానికి అన్నము మీఁద హితవులేదు.

3. మేలు కలిగించుమాట.

వ్యావ నేను హితవు చెప్పితిని. నీవు పెడచెవిని బెట్టితివి. నేనేమి చేయుదును.

**హితవుపడు** అ. క్రి. (హితవు+పడు) ఇష్టపడు, ఆశపడు.

కం. పతిరతిని దృప్తిఁబొందక, మతిఁ జపలత పుట్టి యన్యమానవు రతికిన్, హితవుపడి మోహదరలన్, బతిమాలి కృశించుజార భాస్వతి యెపుడున్. హంస 2. 147.

**హితాశంస** సం. వి. ఆ. స్త్రీ. అభినందనము.

**హితుఁడు** సం. వి. అ. పుం. 1. మిత్రుఁడు. 2. ఆప్తుఁడు.

**హిబుకము** సం. వి. అ. న. పాతాళలోకము.

**హిమ** సం. వి. ఆ. స్త్రీ. 1. శీతాకాలము. 2. చిన్న యేలకికాయ 3. ఒక విధమైన గడ్డి. 4. రేణుక యను సుగంధ ద్రవ్యము.

**హిమకము** సం. వి. అ. పుం. విటంకవృక్షము, పుల్లవెలగ. (వృ వి.)

**హిమకరము** సం. వి. అ. పుం. కర్పూరము.

**హిమకరుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు

**హిమకూటము** సం. వి. అ. పుం. 1. శీతకాలము 2. హిమవత్పర్వతము.

**హిమఖండము** సం. వి. అ. న. వడగలు.

**హిమగిరి** సం. వి. ఇ. పుం. మంచుకొండ, హిమాలయ పర్వతము.

**హిమగువు** సం. వి. ఉ. పుం. చంద్రుఁడు

**హిమజ** సం. వి ఆ. స్త్రీ. 1. పార్వతి. 2. శచీదేవి.

**హిమజుఁడు** సం. వి. అ. పుం. మైనాకగిరి

**హిమఝుటి** సం. వి. ఇ. పుం పొగమంచు.

**హిమతైలము** సం. వి. అ. న. ఒక విధమైన కర్పూర తైలము.

**హిమదీధితి** సం. వి. ఇ. పుం. చంద్రుఁడు. (ఇట్లే హిమద్యుతి, హిమధాముఁడు మొ॥)

**హిమదుర్దినము** నం. వి అ.న. మిక్కిలి చల్లని వాతావరణము.

**హిమద్రుట్టు** నం వి. హ్. పుం సూర్యుఁడు.

**హిమద్రుమము** నం వి. అ. పుం నింబ వృక్షము

**హిమధాతువు** నం వి. ఉ. పుం, హిమాలయ పర్వతము.

**హిమపాతము** నం. వి. అ. పుం 1. చలితోఁ గూడిన వాన 2. మంచుపాటు

**హిమప్రస్థము** నం. వి అ పుం హిమాలయ పర్వతము.

**హిమము** నం. విశే. (అ ఆ. అ.) చల్లనిది వి అ పుం. 1. శీతకాలము 2. హిమాలయము. 3. చందనవృక్షము. 4. కర్పూరము. న. 1 మంచు 2. చల్లదనము. 4. నవనీతము. 4. ముత్యము 5. రాత్రి. 6. చందనకాష్ఠము

**హిమవంతము** నం. విశే (త్. తీ. త్.) మంచుతోఁ గూడినది వి త్. పుం హిమాలయ పర్వతము.

**హిమవత్పురము** నం వి. అ. న. ఓషధిప్రస్థపురము, హిమవద్రాజధాని.

**హిమవలము** నం. వి. అ. న. ముత్యము.

**హిమశర్కర** నం. వి. ఆ. స్త్రీ. యవనాళముచేఁ జేయబడు నొక విధమైన చక్కెర.

**హిమశ్రథుఁడు** నం. వి. అ. పుం. చంద్రుఁడు

**హిమసంహతి** నం. వి. ఇ. స్త్రీ. మంచురాశి.

**హిమసరస్సు** నం. వి. స్. న. 1. మంచుకొలను. 2. చల్లని నీరు.

**హిమస్రుతి** నం వి ఇ. స్త్రీ. మంచు జడివాన.

**హిమహాసకము** నం. వి. అ. పుం. బురదనేల మొలచు ఖర్జూర వృక్షము.

**హిమాంకము** నం. వి. అ. పుం. కర్పూరము.

**హిమాంబువు** నం. వి. ఉ. న. 1. మంచు నీరు. 2. పన్నీరు.

**హిమాంశువు** నం వి ఉ పుం. 1. చంద్రుఁడు. 2. కర్పూరము

**హిమాంశ్వభిఖ్యము** నం. వి. అ. న. వెండి.

**హిమాగమము** నం. వి అ. పుం శీతాకాలము.

**హిమానద్ధము** నం. విశే. (అ. ఆ. అ.) చలిచే గడ్డ కట్టినది

**హిమాని** నం వి ఈ. స్త్రీ. హిమ సమూహము.

**హిమాపహుఁడు** నం వి. అ పుం. అగ్ని

**హిమాబ్జము** నం వి. అ న. కలువ

**హిమాభ్రము** నం. వి. అ పుం కర్పూరము.

**హిమారాతి** నం. వి. ఇ.పుం. 1. అగ్ని. 2. సూర్యుఁడు.

**హిమాలయము** నం వి. అ. పుం. 1. హిమవత్పర్వతము 2. ధవళ ఖదిర వృక్షము

**హిమావతి** నం. వి. ఈ. స్త్రీ. రెడ్డి వారి నావఁ[?]త్రాలు. (వ్య. వి.) (శ. ర.)

**హిమాహ్వ(య)ము** నం వి. అ. న పద్మము పుం. కర్పూరము

**హిమిక** నం. వి. ఆ. స్త్రీ. మంచు, తుషారము (గడ్డి మున్నగువానిపైఁ బడిన మంచు.)

**హిమితము** నం. విశే. (అ. ఆ. అ.) మంచుగా మారినది.

**హిముఁడు** నం. వి. అ. పుం. చంద్రుఁడు.

**హిమేలువు** నం. విశే. (ఉ. ఉ. ఉ.) శీతపీడితము, చలిచే గడ్డ కట్టినది.

**హిమోత్తర** నం. వి ఆ. స్త్రీ. గోధుమ వన్నె గల ద్రాక్ష.

**హిమోత్పన్న** నం వి. ఆ. స్త్రీ. ఒక విధమైన చక్కెర.

**హిమ్నుఁడు** నం. వి. అ. పుం. బుధుఁడు.

**హిమ్యము** నం. విశే. (అ. ఆ. అ.) 1. మంచుతోఁ గూడినది 2. చల్లనిది.

**హిరంగువు(డు)** నం. వి. ఉ. పుం. రాహువు.

**హిరణము** సం. వి. అ. న. 1. బంగారము. 2. రేతస్సు 3. గవ్వ

**హిరణ్మయము** సం. విశ. (అ. ఈ. అ.) స్వర్ణ వికారమైనది. వి. అ. న. ప్రపంచమందలి నవఖండములలో నొకటి.

**హిరణ్మయుఁడు** సం. వి. అ. పుం బ్రహ్మ.

**హిరణ్య** సం. వి. ఆ. స్త్రీ. అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి.

**హిరణ్యకక్షము** సం. విశ. (అ. ఆ. అ.) బంగారు మొలనూలు ధరించినది.

**హిరణ్యకము** సం. వి. అ. పుం. సువర్ణ తృష్ణ.

**హిరణ్యకవచుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) బంగారు మైగాఁపు గలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

**హిరణ్యకశిపుఁడు** సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు ప్రహ్లాదుని తండ్రి.

**హిరణ్యకేశి** సం. వి. ఈ. స్త్రీ. యజుర్వేద శాఖలలో నొకటి.

**హిరణ్యకోశము** సం. వి. అ. పుం. వెండి బంగారములు

**హిరణ్యగర్భుఁడు** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2 విష్ణువు. 3. సూక్ష్మ శరీరమందలి యాత్మ.

**హిరణ్యద** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**హిరణ్యదుఁడు** సం. వి. అ. పుం. సముద్రుఁడు.

**హిరణ్యనాభము** సం. వి. అ. పుం. తూర్పు, పడమర దక్షిణ దిక్కులందు చావడులు గల భవనము. 2 మైనాక పర్వతము.

**హిరణ్యనాభుఁడు** సం. వి. అ. పుం. 1. మైనాకుఁడు 2 విష్ణువు.

**హిరణ్యబాహువు** సం. వి. ఉ. పుం. 1. శివుఁడు. 2. శోణనదము.

**హిరణ్యబిందువు** సం. వి. ఉ. పుం. అగ్ని.

**హిరణ్యము** సం. వి. అ. న. 1. బంగారము. 2 బంగారు పాత్రము. 3. వెండి. 4. విలువ గల లోహము 5. సంపద, ఆస్తి. 6. రేతస్సు 7. గవ్వ 8. దుత్తూరము, ఉమ్మెత్త (వృ. వి.) 9 మూఁడ.

**హిరణ్యయము** సం. విశ. (అ. ఈ. అ.) = హిరణ్మయము.

**హిరణ్యరేత(స)ము** సం. వి. స్. పుం. 1. చిత్రకము (వృ. వి.) 2. జిల్లేడు (వృ. వి.)

**హిరణ్యరేతసుఁడు (తుఁడు)** సం. వి. స్. పుం. 1, అగ్ని. 2. సూర్యుఁడు 3. శివుఁడు

**హిరణ్యవము** సం. వి. అ. పుం. 1. దివ్యధనకోశము 2. బంగారు నగ.

**హిరణ్యవర్ణ** సం. వి. ఆ. స్త్రీ నది.

**హిరణ్యవాహము** సం. వి. అ. పుం శోణనదము

**హిరణ్యవాహుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**హిరణ్యాక్షుఁడు** సం. వి. అ. పుం ఒక రాక్షసుఁడు హిరణ్యకశిపుని సోదరుఁడు

**హిరణ్యిని** సం. వి. ఈ. స్త్రీ బంగారు గని.

**హిరాకి** (హిం. హిరాకీ) గుఱ్ఱము.

గీ. ... చౌపుటములు, రహిగ నటియించు చిలుక హిరాకి నెక్కి, మదనుపాముసవారీ దండు గదలె నపుడు అని. 3 16

**హిలమోచి(క)** సం. వి. ఇ. పుం. ఆ. స్త్రీ. 1. చిలుక కూర. 2. పొన్నగంటి కూర.

**హిలిహిలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉల్లాసము గలది. 2. వినోదించునది.

**హిల్లము** సం. వి. అ. పుం జలపక్షి విశేషము.

**హిల్లోలము** సం. వి. అ. పుం. 1. తరఁగ. 2. హిందోళము. 3. చిత్తచాపల్యము. 4. రతిబంధ విశేషము.

**హిల్వలలు** సం. వి. ఆ. స్త్రీ బ. = ఇల్వలలు.

**హిహకము** సం. వి. అ. పుం. దేహమును ముడుచుకొన్న పిల్లి.

**హిహీ** అవ్య. ఇసీ, హిహిహీ లయొక్క రూపాంతరము. (శ. ర.)

# హి

హి సం. అవ్య. ఆశ్చర్యవిషాద శ్రాంతులను దెలుపును.

హింతాలము సం. వి. అ. పుం. ఒకవిధమైన ఖర్జూరపుఁ జెట్టు.

హిన సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుచుంచు.

హీనతము. సం. విశ. (అ. ఆ. అ.) రహితము హీనము

హీనకర్ముఁడు సం. వి. న్. పుం. సాంప్రదాయిక మత విధుల నపేక్షించువాఁడు. స్త్రీ. హీనవిధి న. హీన కర్మము.

హీనజాతి సం. విశ. (ఇ. ఇ. ఇ.) 1. నీచజాతికి జెందినది 2. వెలివేయఁబడినది.

హీనపక్షము సం విశ. (అ. ఆ. అ.) అరక్షితము.

హీనము సం. విశ. (అ. ఆ. అ.) 1 విడువఁబడినది 2. రహితము. 3. శిథిలమైనది. 4 తక్కువయైనది. 5 నింద్యము. 6. దోషయుతము. 7. అల్పము. కం హీనప్రజ్ఞుఁ డకార్యము, వినైన సేసి తుది వగచు... భార. శాం 3.352.

8. నీచము. 9. చనువనుండి తప్పిపోయినది. వి అ పుం వ్యవకలనము. న. లోపము.

హీనయానము సం. వి. అ. న. బౌద్ధమతశాఖ.

హీనవర్ణము సం. విశ. (అ. ఆ. అ.) తక్కువ కులము నకుఁ జెందినది.

హీనవాది సం. విశ (న్. నీ. న్.) హీనభూయిష్ఠ మైన వాదము చేయువాఁడు. 2. నిరుత్తరుఁడు. 3. న్యాయస్థానమున నోడినవాఁడు

హీనసంధి సం. వి. ఇ. పుం. అల్పుడైనరాజుచేఁ జేయఁ బడిన పొందు.

హీనాంగి సం. వి. ఈ. స్త్రీ. చిన్నచీమ.

హీనితము సం. విశ. (అ. ఆ. అ.) 1. తొలగింపఁబడి నది. 2. వేఱుచేయఁబడినది. 3. తీసివేయఁబడినది.

హీనుఁడు సం. వి. అ పుం. 1. దోషయుక్తుడైనసాక్షి. దోషసహితుఁడైన ప్రతివాది. అన్యవాది, క్రియా ద్వేషి, అనుపస్థాయి, నిరుత్తరుడు. ఆహూత ప్రప లాయి, అని హీను లైదువిధములు.

హీర సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి. 2. చీమ.

హీరకము సం. వి. అ. పుం. 1. వజ్రము. 2. వజ్రా యుధము. 3. ఒక వృత్తము.

హీరము సం. వి. అ. పుం. 1. పాము. 2. కంఠహా రము 3. సింహము. న. 1. వజ్రము. 2. పిడుగు.

హీరహారిణి సం. వి. ఇ పుం. రెండుతలలపాము.

హీరాంగము సం. వి. అ. పుం. ఇంద్రాయుధము

హీరుఁడు సం. వి. అ. పుం. 1. శ్రీహర్షునితండ్రి. 2. శివుఁడు.

హింస సం. వి. ఆ. స్త్రీ. 1 గాయము. 2. హాని.

హీలము సం. వి. అ. న. రేతస్సు.

హీలుకము సం. వి. అ. న. ఒకవిధమైన సారాయి.

హీహీ సం. అవ్య. సంతోషాదులను దెల్పునది.

# హుం

హుఁ సం. అవ్య. స్మరణసందేహాంగీకార క్రోధనిందా ద్వేష ప్రశ్నాదులను సూచించును

హుంకరించు సం. అ. క్రి. హుం అని ధ్వనిచేయు.

ఉ. అమ్మనుజాళి సొమ్మసిలి యమ్మెయిఁ గ్రమ్మఱ జేరి హామికన్, హుమ్మని హుంకరించి తగునోరి వనాటుఁడ.... సమీర. 1-180

హుంకారము సం. వి. అ. పుం. 1. హుమ్మని ధ్వనిం చుట. 2. అడవిపంది యొక్క ఘుర్ఘురము. 3. ధను ష్టంకారము.

హుంకరించు సం. అ. క్రి. హుంకారముచేయు.

శా. ... సంఖ్యాతీతంబగు సేనతో నడచె హుంకా రింపుచున్ లగ్గకున్. రంగా. 3-78.

హుంకించు = హుంకరించు అ. క్రి. హుమ్మని ధ్వని చేయు.

సీ. కత్తులీఁగక దోఁచ గదలఁజేతులఁ బూని హుంకిం

పగా వీథి నుండువారు.... దైత్యభటులు. మల్లువు. 2-4.

**హుంకృతము** సం. వి. అ. న. 1. మంత్రోచ్చారణము 2. అడవిపంది యొక్క ఘుర్ఘురము. 3. మేఘ గర్జనము.

**హుంకృతి** సం. వి. ఇ. స్త్రీ. హుంకారము.

**హుండనము** సం. వి. అ. న. మొద్దువాఱుట.

**హుండము** సం. వి. అ. పుం. 1. పులి. పొట్టేలు. 2. ఊరఁబంది.

**హుండి** సం. వి ఇ న. స్త్రీ. బియ్యపురాశి.

**హుండిక** సం. వి. అ. స్త్రీ. 1. మారకపుహుండి. 2. సైనికుల పోషణమునకై చేయఁబడు నేర్పాటు

**హుండ్రిక్కు** వి. ఢీ కొలుపుటయందగు ధ్వని కను కరణము.

ద్వి. రిక్కలువెట్టి హుండ్రిక్కురటంచు, ఢీకొల్పి వికవికఁదెగడు వల్లియలు, చేకొని వారింపఁజేరు గోపికలు. అ.మ.క. ?-24. పా. 10. పం.

**హుండీ** హిం. వి. 1. సొమ్మిచ్చుట కాజ్ఞాపత్రిక. (శ.ర.) 2. మ్రొక్కుబళ్లకైన ధనాదులనువేయు పాత్ర విశేషము.

వ్యవ. ఈరూకను హుండీలోవేయుము.

**హుండుఁడు** సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు. 2. మూర్ఖుడు.

**హుకుము** వి. (హిం. హుకుమ్) ఉత్తరువు, ఆజ్ఞ.

గీ. మీరు సరకారు శా జమీన్దారుఁడరయ, నెదిరి సత్త్వంబు తన సత్త్వ మెఱిగికొనక, హుకుము చొప్పున నడవక వికటమతిని, దిరుగఁబడియుంట సరసంపుఁదెఱఁగె యనియె రంగా. 2-258.

**హుజురు**=హుజూరు. వి. సన్నిధి, సమ్ముఖము.

సీ. పెంపుమీఱు వసంతపేషువా హుజురున నుండి చెలామణి హొవరు దెలువ. గీ... మదనుపాదునహో దండు గదలెనపుడు. ఆని. 3-19.

గీ. హుజురు కొలువులు గలిగె సొ పొలుకుతేట, నీటికొలఁకులలోబెండునిండు పగలఁ, దెప్పలై బొందు మల్లెల చొప్పరములు, నెరయఁజేసినవారికి దొరలచేత. కువల. 1-98.

**హుజూరు**=హుజురు. వి. (హిం.హుజూర్.) సమ్ముఖము, సన్నిధి.

కం. వచ్చినమంత్రుల నృపతివి, యచ్చర నాయకు ననుజ్ఞనవసర సచివుల్, చెచ్చెర హుజూరునకుఁబిల, వచ్చిన డిగ్గున నరుంగు వడి డిగ్గితగన్. రావి. 5-36.

**హుటాహుటి** వి. గమన వేగము.

కం. కుటిలాలక చూడుము వి,స్ఫుటమంజరిదాసె భృంగములు చాలు నిశా,విట బింబముఁ బట్ట హుటాహుటి వచ్చువిధుంతుదునకు నుపమానంబై. వరాహ. 8-87.

పంచచామరము. హుటాహుటిన్ హలాయుధుండ హోవహోగ్రుఁడైతనం, తటంవటాననిప్పుడీ విధం బెఱింగి వచ్చెనో, ఘటాఘటీల నెల్లఁద్రోవగట్టి పట్టబంచెనో. యటోయిటో యెటో భటోద్భటార్భటుల్ ఘటిల్లెడున్. విజ. వి. 3-142.

లయగ్రాహి. పేరాములు హాఱుచుఁసమీరునిహుటాహుటిని, గేరడము లాడుచు మహారయముతో న, య్యారె యనమీఱి..... సారంగ, 1.121.

విశ. అతిత్వరితము.

కం. .... భువినంత దవ్వు నేమును, తవతవ లేకరుగుదుము హుటాహుటి నడలన్. మనుచ. 1. 76.

**హుడము** సం. వి అ. పుం 1. పొట్టేలు. 2. భూమిలోఁ బాతిన వాడిగల యినుపకొఱ్ఱు. 3. కోటబురుజు 4 దడ్డుకఱ్ఱ

**హిడుక్క** సం వి. అ. స్త్రీ వాద్యవిశేషము. బుడుబుడుక్క

ఉ పల్లకి చక్కికాహళము వంశము ఢక్క హుడుక్క ఝర్ఝరుల్, ఝల్లరి యాదిగాఁ గలుగు శబ్దపరంపర కాళశబ్దమై, యుల్లసిలన్...... కాశీ. 1-59.

**హుడుక్కము** సం వి. అ. పుం. ఉడుక, వాద్యవిశేషము. (శ.ర)

**హుడువు** సం వి. ఉ. పుం మగగొఱ్ఱె.

**హుతభుక్కు** సం వి. క్. పుం. అగ్నిహోత్రుఁడు. (ఇట్లే హుతాశనుఁడు మొ.)

హుతవహుఁడు సం. వి. అ పుం అగ్ని హోత్రుఁడు.

హుమా = హుమాయి. వి. గుఱ్ఱము.

కం. ఐక్కలదొర చెలికానికిఁ, గొంకుహుమా జోడనయ్యకుం జొక్కపురేఁ, జక్కలజేనినిచేలుపు జక్కరనౌదలను దాల్చు జగవేల్పునకున్. అచ్చరా. బాల 21.

చం పులుఁగుహుమా వజీరునకుఁ బుట్టిన దిట్టవు... నీలా 3-18.

హుమాయి (యా) = హుమా. వి. గుఱ్ఱము.

గీ చిలువదిండి హుమాయిపై మెలఁగువాఁడు లీలఁ జెనుపాముపైఁ బవ్వళించువాఁడు, నీమనోరథ మీడేర్చ నిక్కముగను... ఉ రా. 5-191.

చం ఉడిగపువారు... వెం,బడిఁ బలుమాఱు నెచ్చరిక వల్కుచుఁ గుల్కుచు రాహుమాయిత, త్తడి దుమికించుచుం జనునతండు వయాళిహయాళిగొల్పఁగన్. చంద్ర. -110.

2 వాహనము,

మ. ఎలమిన్ బంగరుఱెక్క పక్కెర హుమాయీ తేజీ దాటించుచున్, నలుమోమయ్య హుటాహుటిం గరలె... దశా. 2-62.

హుమారము వి. సవారి.

సీ జాబిల్లి చిన్నంపుఖాఖా హుమారంపు సరదారుని యుదార తరజవఁబు అచలా. 1-20.

హురుట్టికము వి ఏనుగుల కుపయోగించు నొకవిధ మైన గడియ, లేక కొక్కెము.

హు(ర్మ్మ) రుమత్తు విణ. 1. పెద్దది.

గీ ఆశ్రమంబున మునివరులాడుకొనఁగ, సంధెలని జపములని బల్ సవనములని, నియమనిష్ఠలనందుపై నేర్చుకొనియె, నరియె హురుమత్తువేళలఁ జక్కఁ బడునె. (హురుమత్తు వేళలన్ = పెద్దకాలమున వార్ధకమున.) పాంచ. 1-34.

2. అధికమైనది, గొప్పది.

సీ ఒక్కనిబ్బరం ముగా హురుమత్తు పరువెత్తు సల్లించు కల్లెముల్ ఘల్లనంగ కృష్ణ. 1.53.

ఉ. అత్తటిఁ దోడిచెల్వ లహాహా యిదిగో వలిగాడ్పు మమ్మెఁదూ, ర్పెత్తె వసంతు డెంతయు రహించఁగ నాకులపాటుఁ జూపె హు, ర్మత్తుగఁ దోఁచె మింట నెదురన్ ద్విజరాజొకఁ డుద్ధతిన్ మధూ, దృత్తగ వారి వెల్వడెఁ బగత్తురగుండయి చూడు కోమలీ. చంద్రా. 3-56.

వి. అతివేగము.

వ. ...తమకంబుల గమకింపుచు హురుమత్తునఁ దూఁటి యుంపఱల పరంపరల వెంపరలాడిన హుసి యని. ప్రబంధ. 703.

హురుము(మ)ంజి(జీ) = ఉరుముంజి. హుర్మ్మంజి, వి. 1. పారసీకదేశమందలి యొకమండలము, అచ్చటి సముద్రము.

ఉ. ముక్కరివెట్టి గట్టిహురుముంజి చొగారవు ముత్తియంబు చేర్చుకొ యమర్చి... పాంచాలీ. 2-7.

సీ. పచ్చనిహురుమంజి పనివాగె పక్కెరపారసి పల్లంబుపట్టమయము. మనుచ 4-28.

సీ. హురుమంజి ముత్యాలయొంటుల చకచకల్ తళుకుఁ జెక్కులదండఁ దాండవింప. చం. రా. 2-62.

సీ, హురుముంజిముత్యాలయొరుగు పాగ మెఱుంగు నొసలిబత్తరిబొట్టుమునుఁగువేయ. సారంగ. 1-79.
మ. చెలువంబై కళలన్ వెలుంగు హురుమంజీ దేశ పున్ముత్తియం, బులతోఁ గూర్చిన చేరుచుక్క.... అని. 5-72.

2. అణిముత్తెము, శ్రేష్ఠమైన ముత్యము.

సీ. ఉదయాద్రిక మీఁద హురుమంజి చౌడాలు వెడ వింటి పాదుశా వెల్లగొడుగు. మృ. వి. 2-33.

సీ మురువుగా హురుమంజి మురువుతో వీనులకట్టా ణిగొప్పచౌకట్లుదాల్చి దశా. 7-250.

హుర్మ్మ(ర్మ్మ)ంజి = హురుమంజి.

సీ. తోతెంచె నొక్కొ మధూకపుష్పములను నాసహు ర్మ్మంజి ముత్యములవలన. పాండు 4. 234.

**హుర్మంజిపూస** (హుర్మంజి+పూస.) మంచి ముత్యము.

మ. నెలఱూనంతవ నిగ్గులుప్పతిలు తిన్నెల్ మూలరా పెద్దటా,కులనిద్ధ్రవు జగాహజారమునఁ దళ్కుం గుల్కు హుర్మంజి పూ, సలసింగంబు మెఱుంగుఁ జెక్కడపుగల్ జాగా చొగాగద్దియన్. చంద్రా. 2.57.

**హుర్చనము** సం. వి. అ. న. మోసము వంచన. కుటిలత్వము.

**హులము** సం. వి. అ. పుం ఒకవిధమైనపనిముట్టు.

**హులహులి** సం. వి. ఈ. స్త్రీ. ఆనందసమయములందు స్త్రీలచే నుచ్చరింపబడు ధ్వనివిశేషము.

**హులిహులి** సం. వి. ఈ. స్త్రీ 1. శోభనగానము. 2. గర్జించుట, కూఁతవెట్టుట.

**హువువు** సం. వి. ఉ. పుం. పొట్టేలు.

**హుళి**=హుళిక్కి. వి. నాస్త్యర్థకము.

మ. .. మా, గ్గణముఖ్యావనశీలమా శశకశృంగప్రాయ మాప్తాదితో, మణమూడబ్బఱ సత్యమా హుళి గణించన్ వాని కద్రిస్తనీ. (హుళికి అని శ.ర.) హంస. 5. 111. ప్రబంధ. 110.

**హుళికి**=హుళిక్కి. వి. (శ.ర.)

**హుళిక్కి** వి. నాస్త్యర్థకము, అభావమును దెలుపును.

గీ. ఏమినేయుదు నెక్కడి కేఁగువాఁడ, ధనము నిష్ప చ్చంబు విద్యయు హుళక్కి. కాశీ. 4. 111.

గీ. నిలుకడ హుళక్కి తావులు పొలనువల్చు, నిట్టి మాటోంట్లతోఁ జెల్మి యెట్లు పొసఁగు. వసు.2.132

**హుష్వ్వ** వి. ఉమియుట మొదలగువానియందగు ధ్వని కనుకరణము.

సీ అల విధూదయ హేతువగు తూర్పుఁ జాలాలు హుష్వ్వన మమియు చిట్టమ్ము లనఁగ. విప్ర. 3.28.

**హు(శా,సా)షారు** వి. (హిం. హుష్యార్.) 1. జాగరూకత, జాగ్రత్త.

చం. అటువలెవేఁగుచుండి మగఁడత్తయు మామయు నింటలేమి వెల్పటికి హుషారువం జని. హంస. 5. 160.

కం. ఆకోలాహల మరుదని, యాకర్ణింపుచు విభుండు హయము డిగి హుసారై కైజా చేసి మహా, శోక హతలమున నిలిచి కనుంగొనుచుండన్. చంద్రా. 2. 111.

2. సంతోషము

కం. ఈవేడ్కఁజూడు ముందఱ, సావళమదె విడువఁగా హుసారున నెగిమా, జావపొదనోవఁ గొఁజులు, లేవంగొట్టెడును మోయలేమన బోయల్. పార్వ 6 73.

చం. వివఁడు ప్రమోదలీల ... పిచనవములం దలంపఁడు హుషారుగ సారెకు వేఁటఁ బోవఁజా, జనవరనూళి యందొకటి సైఁచునె చానల నెంచు వారికిన్.

3. ఉత్సాహము.

ఉ. చక్కని వారకాంతలు హుషారుగ నాట్యము సల్పుచుంట నొం, పెక్కఁగ రాజవీథుల మహీతల నాథుఁడు రాజసంబునన్. ఉ. హరిశ్చ. 4. 21.

విశ. సంతోషకరము.

చం. చలువలు గట్టి చన్నుల హుషారుగ గందము లంది కప్పురం, బలరెడి ముత్తెపుం బరణులంది ... కువల 1. 85.

సీ. చిగురాకు తెగనారు వగరాజులు హుశారు వగ మీఱు రత్నాలవహి గుడార్లు. కృష్ణ 3. 75.

**హుసి** వి యుద్ధాసక్తి యందగు ధ్వని కనుకరణము.

వ. తమకంబుల గమకింపుచు హురుమత్తున దూఱి యంపఱల పరంపరల వెంపరలాడివ హుసియని దొందడిని పుళిందులు కఱకుమీఱి చుఱుకు చూపులు చూచి. ప్రబంధ. 7. 88,

**హుసివోవు** = ఉసివోవు. అ. క్రి. వ్యర్థమగు; తప్పిపోవు.

చం. కొలుచు సమగ్ర భంగి నొవఁగూడ దివాణపు వారిచేతికా,కలు హుసి వోవఁగాఁ గఱవు కాల

మెఱుంగక .... శో భిలునగు రెక్కలు కదేస పిల్లలనంగ నచ్చుటన్. శుక. 2. 406.

**హుహువు** నం. వి. ఉ. పుం. ఒక గంధర్వుఁడు.

## హూ

హూ[1] అవ్య వేత్రహస్తులు చేయు హెచ్చరిక.

శా. ఓహో భైరవ నీలరుద్ర నిలు సాహో వీరభద్రేశ కుం,భా! హూగాకు నికుంభ యంచు వగి సమ్మర్దంబు వారించుచున్. వరాహ. 11. 9.

హూ[2] వి. ఆవులించుట యందలి ధ్వని విశేషము.

సీ ఒదిగిలి కనువిచ్చి హూయని బిట్టావులించి కొండొక చేతివేచి నీల్గి. భార. అర. 7. 45.

**హూడము** నం. వి. అ. పుం. పొట్టేలు.

**హూణము** నం. వి. అ పుం. 1. దేశవిశేషము 2 ఒక విధమైన బంగారు నాణెము.

**హూణుఁడు** నం వి అ పుం. 1. విదేశీయుఁడు. 2. అనాగరకుఁడు. 3. పర్షియాదేశములోని యొక జాతి జనుఁడు, 4. ఆంగ్లేయుఁడు.

**హూతము** నం. విశే. (అ. ఆ. అ.) పిలువఁబడినది వి. అ. న. పిలుచుట

**హూతి** నం వి ఇ. స్త్రీ. పిలుపు, ఆహ్వానము.

**హూరవము** నం. వి. అ. పుం. నక్క.

**హూహువు** నం. వి. ఉ. పుం 1. ఒకానొక దేవగాయకుఁడు. 2. గంధర్వుఁడు.

**హూహూ** వి. చలిబాధ యందగు ధ్వని కనుగుణము.

సీ. జనులు హూహూయను చలివేళఁ గుత్తుక బంటి తోయముల లోపల వసించి. భాగ. 4. 614.

## హృ

**హృచ్ఛయము** నం. వి అ. పుం. 1. ప్రేమ. 2. ఆత్మ. 3. అంతరాత్మ.

**హృచ్ఛయుఁడు** నం వి అ. పుం. మన్మథుఁడు.

**హృణి** నం. వి. ఇ. పుం. 1. కోపము. 2. మండుట.

**హృణీ(ణి)య** నం. వి. ఆ. స్త్రీ 1. నింద. 2. జాలి. 3. సిగ్గు.

**హృతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. గ్రహింపఁబడినది. 2. హరింపఁబడినది. 3. ఆకర్షింపఁబడినది. 4 ఆమోదింపఁబడినది. వి. అ. న. భాగము.

**హృత్స్తంభము** నం వి. అ. పుం. హృదయ పక్షవాతము.

**హృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. హరణము. 2. నాశము.

**హృత్తు** నం. వి. ద్. పుం 1. హృదయము. 2. ఱొమ్ము. 3. ఆత్మ 4. అంతస్సారము.

**హృత్ప్వ** నం. వి. న్. పుం. 1. జాలరి. 2. శివుఁడు.

**హృత్సారము** నం వి అ పుం. ధైర్యము.

**హృదయంగమము** నం. విశే. (అ. ఆ అ.) 1. మనోహరము. 2. అందమైనది. 3. సమ్మతమైనది. 4. ప్రియమైనది 5. ఇష్టము. వి అ. న. పుం ఉచితభాషణము.

**హృదయగ్రహము** నం వి అ. పుం. హృదయ మాంద్యము.

**హృదయజుఁడు** నం. వి అ. పుం. కొడుకు.

**హృదయదీపకము** నం. వి అ. పుం. గోపదేవుడు రచించిన వైద్యశాస్త్ర నిఘంటువు.

**హృదయపురుషము** నం. వి. అ. పుం. గుండెకొట్టుకొనుట.

**హృదయప్రమాథి** నం.విశే. (న్. నీ. న్.) హృదయమును గలఁచునది.

**హృదయప్రస్తరము** నం. విశే. (అ. ఆ. అ) క్రూరమైనది.

**హృదయమిచ్చు** మి. అ. క్రి. (హృదయము+ఇచ్చు) మనసిచ్చు; రహస్యమెఱిగించు.

కం. నీతి గణింపక జార, వ్రాతములకు హృదయమిచ్చి వర్తిలుటన్.... శుక. 3. 535.

**హృదయము** నం. వి. అ. న. 1. మనస్సు, ఎద 2. ఆత్మ. 3. ఱొమ్ము 4. ప్రేమ. 5. అంతర్యామి 6. అంతస్సారము. 7. శాస్త్రము. (అశ్వహృద

యము ఇత్యాదులు) 8. తత్త్వజ్ఞానము. 9. వేదము 10. కోరిక. 11. అహంకారము.

**హృదయమునవెక్కు** మి అ. క్రి. (హృదయమునకున్ + ఎక్కు.) ఇష్టుఁడగు, ప్రియుఁడగు, ప్రియమగు.

ఉ. అంబుధియల్లుకుట్టి మనయచ్చరజాతికి జావవేల్పు పీ, తాంబరుఁడెట్టులట్లు హృదయంబునకెక్కె నితం డటంచు... కకు. 1. 172.

**హృదయరజ్జువు.** నం. వి. ఉ పుం క్షేత్రగణితములో మధ్యరేఖ.

**హృదయసంఘట్టము** నం. వి. అ పుం. హృదయస్తంభము.

**హృదయసమ్మితము** నం. విశ. (అ. ఆ. అ.) ఱొమ్ము బంటి.

**హృదయాత్మము** నం. వి న్. పుం. నారాయణపక్షి.

**హృదయాళువు** నం. విశ. (ఉ. ఉ. ఉ.) మంచి మనస్సుగలది.

**హృదయోదంకము** నం. వి. అ. పుం హృదయోచ్ఛ్వసము.

**హృదయ్యము** నం. విశ. (అ ఆ. అ.) హృదయమునకుఁ బ్రియమైనది.

**హృదావర్తము** నం. వి అ. పుం శ్రీవృక్షకము, గుఱ్ఱము ఱొమ్మునందుగల సుడి.

**హృది** నం. వి. న్. న. మనస్సు, ఎద.

మ. హృదిచైతన్యముఁబొందఁ దెప్పిఱి నిషాదేశుండు సంరబ్ధతన్, గదచేతఁగొని... ఉ. హరి. 3. 81.

**హృది(దీ)కుఁడు** నం. వి. అ. పుం. యాదవరాజు

**హృదిస్పృక్కము** నం. విశ. (క్. క్. క్.) 1. హృదయమును తాఁకునది. 2 ప్రియమైనది. 3. సుందరమైనది. 4. సమ్మతము. (ఉల్లే హృదిస్పృక్కు.)

**హృద్య** నం. వి. ఆ స్త్రీ. 1. ఆఁడుమేఁక. 2. రక్తపాషాణము. 3. బుద్ధియనెడి యోషధి.

**హృద్యగంధ** నం. వి. ఆ స్త్రీ మల్లెతీఁగ.

**హృద్యగంధము** నం. వి అ. పుం బిల్వవృక్షము. న. 1. సన్నజీలకఱ్ఱ. 2. లవణ విశేషము.

**హృద్యము** నం విశ ఆ ఆ అ.) హృదయంగమము. వి అ న పుం తెల్లజీలకఱ్ఱ. పుం వశీకరణవేదమంత్రము.

**హృద్వంటకము** నం వి అ. పుం కడుపు.

**హృల్లాసము** నం. వి. అ. పుం. 1. ఎక్కిలి. 2. చింత.

**హృల్లేఖ** నం వి. ఆ. స్త్రీ. 1. చింత. 2. మాయాబీజము. (హ్రీమ్ అనునది) 3. ఇష్టార్థమందలి యుద్యోగము.

**హృల్లేఖము** నం. వి. అ. పుం. 1. జ్ఞానము. 2. వివేకము. 3. గుండెనొప్పి. 4. తర్కము. 5. ఊహ.

**హృషి** నం. వి. ఇ. పుం. స్త్రీ. 1. సంతోషము. 2. తృప్తి. 3. వైభవము. ఇ. పుం. అసత్యవాది.

**హృషితము** నం. విశ. (అ. ఆ. అ ) 1. సంతోషించినది. 2. పులకించినది. 3. ఆశ్చర్యము నొందినది. 4. వంగినది. 5. నిరాశచెందినది 6 నిర్మలమైనది 7. క్రొత్తది. 8. కవచితము. 9. కుంఠితము.

**హృషీకము** నం వి. అ. పుం. న. ఇంద్రియము.

**హృషీకేశుఁడు** నం. వి. అ. పుం 1. విష్ణువు. 2. కృష్ణుఁడు.

**హృషుఁడు** నం. విశ. (ఉ ఉ ఉ.) 1. సంతోషించినవాఁడు. 2. అబద్ధము చెప్పువాఁడు. వి ఉ. పుం. 1. అగ్ని. 2. సూర్యుఁడు. 3. చంద్రుఁడు.

**హృష్టము** నం. విశ. (అ. ఆ. అ.) 1. సంతోషించినది. 2. పులకించినది. 3. మొక్కవోయినది. 4. కఠినము 5. ఆశ్చర్యము పొందినది.

**హృష్టి** నం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము. 2. సౌఖ్యము 3. గర్వము. 4. అజ్ఞానము.

**హృష్టియోని** నం. వి. ఇ. పుం. అర్ధనపుంసకుఁడు,

# హె

హెగ్గడి వి. 1. అంతఃపురమందలి కావలివాఁడు.

సీ. తగువాహావముల వంతఃపురకాంతలనిడిదిద్దువై పించు హెగ్గడులును. కళా. 8. 29.

ద్వి. కడిఁది హెగ్గళ్ళు హెగ్గడికత్తియలును, బడి బడి వడిబరాబరి సేయుచుండ. అ.మ.క. 5. 241. పా. 24. పం., యయా. 4. 154.

2. అంతఃపురపు కావలికత్తె. (శ.ర.) 3. నపుంసకుఁడు.

ద్వి. ఎందుండి వచ్చితిరేమని యనఁడు, మందుఁడో జడుఁడో సోమరియొ హెగ్గడియొ. ద్వి. పరమ. 4. 281. పా.

హెగ్గడికత్తె (త్తియ) వి. (హెగ్గడి+కత్తె) అంతఃపురపుఁ గావలికత్తె.

గీ. ఒక్కనాఁ డంతిపురమున నుదుటవిగువు, గబ్బిగుబ్బెతగము లూడిగములు సలుప, రాజవర్మ పరాకజారమున దొరలు, కాచినారని హెగ్గడికత్తె దెలుప. కువల. 2. 3.

గీ కలిగినవియెల్ల నేర్పుతోఁ దలిరుఁబోండ్లు, కడఁగ్రమోయింప హెగ్గడికత్తె లరిది, పైఁడికోలలు పూని వే వదఁడటంచుఁ, బల్లకీముందఱను బరాబరులు సేయ యయా. 5. 158.

హెగ్గడికాఁడు వి. (హెగ్గడి+కాఁడు.) అంత.పుర రక్షకుఁడు. (శ.ర.)

హెగ్గడీఁడు వి. (హెగ్గడి+ఈఁడు) హెగ్గడికాఁడు.

గీ. ఆతఁడు తెచ్చిన రత్నభూషాంబరాదు, లందు కొన హెగ్గడీలతో సావతిమ్ము. సత్య. సాం. 4.

హెగ్గాళె వి. వాద్య విశేషము.

ది... తప్పెటఁ జిత్రగతులవాయింప. గాళెలుమించు హెగ్గాళెలు సన్న, గాళెలు రాఁతు లగ్గలముగా మొఱయ. అ.మ.క. 4. 198. పా. 28 పం.

హెచ్చరించు = ఎచ్చరించు. స. క్రి. (√హెచ్చు.) 1. ప్రోత్సహించు. పురికొలుపు.

చం....విక్రయింపఁగా, గలరణశూరులైన యవికారుల వీరుల హెచ్చరించి... ఉ.రా. 4. 272.

2. అవధానమును దెలుపు.

మ...వలుమోమయ్యె హుటాహుటిన్ గదలెఁ కెంతంజేరి జేజేలరా, యలు సాహోయని హెచ్చరింప... దశా. 2. 67.

వ...ఇదిగో వ్రేసెదఁ దప్పించుకొనుమని హెచ్చరించుచు... ఉ. రా. 3. 246.

హెచ్చరిక = ఎచ్చరిక. వి. (√. హెచ్చు) 1. అవధానము, జాగరూకత.

ఉ. ఇచ్చట మేము వేఱమటియెవ్వరి తోడను మాటలాడఁగా, వచ్చెద మచ్యుతాత్మజ దివస్పతి పంపువ గృఁష్ణుపాలికిన్, వచ్చి యతండు వీడ్కొలువ వారల యిద్దఱ యాజ్ఞలున్ గదున్, హెచ్చరికన్ ధరించి యిపు డేఁగెడు లాగిది యొక్కచోటికిన్. ప్రభా. 2. 44.

గీ. నెరసి వేపాకు పురుటింట నెరయఁజెక్కి, హెచ్చరిక గల్గియుండరె యింతులార. ఇందు. 2. 5.

2. ప్రభువుల యవధానమునకై వేత్రధరు లుపయోగించు మాట.

గీ. వసిఁడిబెత్తుల వారిరుదెసలఁ గ్రమ్మి, జతవదేవ వరాకు హెచ్చరికయనుచుఁ,గరము వేడుకతో బరాబరు లొనర్ప. రసిక. 1. 80.

చం. హరిహయవహ్ని సారి దనుజాధిపువాయుకుబేరశంకరుల్, నరసతగోల్పు మ్రొక్కులిడి స్వామి పరాకవధారు దేవ హె, చ్చరిక యటంచుఁ గంచుకులు సారెకు నూరెల నుగ్గడింపఁగా... దశా. 1. 233.

హెచ్చరికించు =ఎచ్చరికించు. (చి. ని,. శ. ర.)

హెచ్చించు స. క్రి. (√హెచ్చు) పెంచు, అతిశయింపఁజేయు.

సీ. పంజీవకునితోడి సఖ్యంబుపై వచ్చె హెచ్చించి యాపదఁదెచ్చుకొంటి, నొంటిపాటువ నాతఁడొక నాడు నాతోడ నోడక నీనుద్దు లుగ్గడించి. వేం. పంచ. 1. 369.

**హెచ్చిరిల్లు(లు)**=ఎచ్చిరిల్లు. అ. క్రి. (√. హెచ్చు.)
1. విజృంభించు.

చం. తన తనువెల్ల దాచికొని దక్షిణమారుత చోర కుండు నేర్పునఁ జనుదెంచి తావిఁగొనిపో వన దేవత హెచ్చరిల్లి కో, యన పెనుబోటుఁగూఁత విడువట్టిగతిన్ వినవయ్యె వింటివే, యనుపమగాత్రి కోకిలకులాకులకేకికుహూకుహూధ్వనుల్. కువల. 8. 124.

2. వర్ధిల్లు, అధికమగు.
కం. ఆమగువమోముతోడను, నేమిటనో హెచ్చి రిల్లి హిమకరుఁ డోకనాఁ, డేమో పోలువఁటయికం, దామర తాఁబోలుదునన దైవమునగదే. రాజ. చ. 2. 179

కం అట కొంతకాల మరిగిన, నటవాఁడు సుమంతు నకు మహైశ్వర్యంబు, ప్రకటమై గడియకుడుకుని, రటువలె హెచ్చిరిలి రాఁగ నతిముత్సుకుఁడై. సారంగ 3. 128.

**హెచ్చిల్లు(లు)** = ఎచ్చిల్లు. అ. క్రి. (√హెచ్చు.) అతిశయించు, పెంపొందు.

చం. అలరుచుఁ గేకయాధిపతి యంపిన గార్గ్యునికిన్ వినీతి హె, చ్చిల నెదురేఁగి... ఉ. రా. 8. 153.

కం. నిలిచి దగదీర్చుకొని హె, చ్చిలుకోపముతోడ నింతజేసిన దీనింద, లవ్రచ్చుక మ్రింగెదను... శుక. [illegible]. 113

**హెచ్చు**=ఎచ్చు. అ. క్రి. 1. అతిశయించు, మించు.

సీ. అరవిందముల కచ్చులడఁగించుతిగి హెచ్చునాయ తంబగు కన్నుదోయితోడ. ఆము 1 12.

గీ. అంతమాగధ వైతాళికాతిమంజు, లారవంబుల మేల్కని హరివరంపుఁ, బెంపునఁ దదాస్యకళ హెచ్చి సొంపుమీఱు, ననుచు మును జాఱెనా నెల యపుడు క్రుంకె రా.వి. 1. 78.

కం. వారు శివద్రోహులుగద, యీరసమువశైవమ తము హెచ్చఁగ రాదం. చేరితినైనఁ జెఱుతురు... శుక. 3. 72.

2 ఉద్రేకించు.

ఉ. ఏనయి యున్నడైనఁ దమి హెచ్చినచోఁ దనుజేరి యుంతప్రౌ, ఢైనఁ బదంబులోత్తఱణ మప్పటికేమి ఘటించుఁ గోరికల్. దశా. 3. 25.

చం... తమి హెచ్చవొచ్చె మె, య్యెడలను జేని బల్ హాయలు నిమ్మగ గోరుచుఁజాలఁ బ్రోడలై యడరెడు గొల్లకన్నె లహహా తొలుబాముల నేమి నోచిరో. నీలా. 1. 108.

3. విజృంభించు.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చిన రాజ వంశమున్; గూఁకటివేళ్లతోఁ బెఱికి గోత్రవధంబున జేసినట్టియా, ప్రేకపుఁగీడుగాక ప్రజవేచ దలంచిన గోరుచుట్టుపై, రోఁకటిపోటుచందముగ రోసి జనుల్ వను జూచి తిట్టరే జై. భా. 1. 64.

విశ. అధికము.

గీ. ఇచ్చు మెచ్చు, దెచ్చు హెచ్చుగ ద్రావిడ దేశ మధిప దశా. 1. 113

వి. గొప్పతనము, ఆధిక్యము.

చం. మొనలకు హెచ్చుగా మనముమున్నగడంగినఁ గాక శత్రులం, గనుగొని యిట్టు లోఁడొసు మొగం బులు మాచుచున్నఁ బోవునే భార విరా.4.111.

కం. కావున వారల నటనా, ప్రావీణ్యము హెచ్చు గుందుఁ బ్రకటించుటకై, దేవరఁ దోడ్కొని రమ్మని దేవేంద్రుఁడు పనిచె... విక్ర. 2. 78.

సీ. అధరంబు బింబంబు నగలించుచో హెచ్చు శుక రాజ తుండవిస్ఫురణఁ బోదల. దశా. 2. 269.

**హెచ్చుకంటిదొర** వి. (హెచ్చు+కన్ను+దొర) శివుఁడు, ముక్కంటి.
విశాలచాపది హెచ్చుకంటిదొర నేదివప్రోడ
పొచ్చెము లెంచకపూలువిలుకాఁడ. ప్రబంధ. 246.

**హెచ్చుకుందాడు** అ. క్రి. (హెచ్చు+కుందు+ఆడు) ఎక్కువతక్కువలాడు వివాదపడు;

సీ. నిష్ప్రతిపంబైన నీప్రతాపంబుతో హెచ్చుకుం దాడె బీఱ డవేఁడి. నైష. 8. 91.

స. శ్రీ. తృణీకరించు, ఇంచుమించులాడు.

వ. కొందఱిచ్చావతులు ప్రియుఁడు తమకునేమి యిచ్చిన మెచ్చుక హెచ్చుకుందాడుదురు. కాశీ. 2. 7౪.

**హెచ్చుకుందు** *విశే.* (హెచ్చు+కుందు) ఎక్కువ తక్కువ,

గీ. ఏల పదరెదు నీకును హెచ్చుకుందు, మాటలకు నేఁత యిన్నాళ్లు మాకు లేని, వటువు నడురేయి యొందుండి వచ్చెఁ జెపుమ. విప్ర. 5. 57.

**హెజ్జిజ్జి** వి. ముప్పది రెండు నపుంసక రాగములలో నొకటి. (సంగీ)

గీ. .... హెజ్జిజ్జి నీలాంబరియు ననంగఁ, బొనఁగు ముప్పదిరెండు నపుంసకములు. హంస. 5. 12.

గీ. ... నాట, జౌళిదేశాక్షి తోడి వరాళి శ్రీవ, రాళి హెజ్జిజ్జి కేదారగౌళపాడి. ప్రబంధ. 96.

# హే

**హే** *అవ్య.* పశ్వాదులను ద్రోలుట యందగు ధ్వనికను కరణము.

శా. ....వల్లెత్రా, డెంతేఁ గైకొని హే యటంచు గదియన్ హేలావినోదంబువన్. దశా. 9. 16.

**హేక్క** నం. వి. ఆ. స్త్రీ. ఎక్కిలి.

**హేజీబు** వి. మంత్రి.

గీ. జిష్ణుతో మాటలాడ హేజీబు నమతు, రౌర తిప్ప నృపాల ఖాహోని నిహతు, లైనయల హిందు ఖాన సేనాధిపతులు, సిండిసురపట్టనము చెంతదండు విడిసి. కువల. 1. 33.

గీ. ఉభయకటముల శ్రీముద్రలూర్ధ్వపుండ్ర, సంగతాంగార నవయవఖారలోహి, కాఞతశ్రీల హేజీబులపుడు వచ్చి, రగణితస్థితి సాహెబు నగరి కడకు. రా.వి. 5. 35

సీ. రాయబారము వచ్చెనా యిత్తటి నయోధ్య కింద్రు హేజీబులం దెవ్వఁడైన. చం. రా. 4. 84.

**హేజుబారి** వి. (హిం.) రాయబారి.

గీ. ఇట్లు గనుఁగొన్న మప్పినిహేజుబారి, కప్పరాసుల యెకిమీఁడు చెప్పరాని, మెప్పురాఁ గప్పరపు వీడ్య మప్పు డొసఁగి, కుశల సంప్రశ్న మొనరించి కుతుక మొదవ. రంగా. ౨ 115.

**హేఠము** నం. వి. అ. పుం. 1. ఆటంకము. 2. హాని. గాయము, 3. కలఁత.

**హేడజము** నం. వి. అ. పుం. 1. కోపము. 2. అసంతృప్తి.

**హేడము** నం. వి. అ. పుం. అవమానము.

**హేడాబు(వు)కుక్కఁడు** నం. వి. అ. పుం. అశ్వవ్యాపారి

**హేడుఁడు** నం. వి. అ. పుం. అంతఃపురవుఁ గావలివాఁడు. విశే. మూర్ఖుఁడు.

**హేతి** నం. వి. ఇ. స్త్రీ. 1. ఆయుధము. బాణము. 2. దెబ్బ, గాయము. 3. సూర్య కిరణము. 4. వెలుతురు. 5. మంట. 6. పనిముట్టు. 7. లేఁత మొలక.

**హేతుకము** నం. వి. అ. పుం. 1. కారణము. 2. సాధనము, పనిముట్టు.

**హేతుదుఁడు** నం. వి అ. పుం. తార్కికుఁడు.

**హేతుదుష్టము** నం విశే. (అ. ఆ. అ.) అయుక్తము, న్యాయవిరుద్ధము.

**హేతుదృష్టి** నం వి. ఇ స్త్రీ. భగవంతుని యస్తిత్వ విషయమును సందేహించు స్వభావము.

**హేతుమంతము** నం. విశే. (త్. తీ. త్.) కారణము కలది. వి త్. న. కార్యము.

**హేతుమన్నిగదము** నం. వి. అ. పుం. హేతువును సూచించు వేదవచనము.

**హేతువాదము** నం. వి. అ. పుం. 1. వివాదము. 2. కపటము. 3. భగవంతుని యస్తిత్వమును సందేహించుచుఁ గావించు వాదము.

**హేతువాది** నం. వి. న్. పుం. 1. తర్కించువాఁడు. 2. దేవుని యునికిని సందేహించువాఁడు.

**హేతువు** నం. వి. ఉ. పుం. 1. కారణము. 2. ఉద్దే

శము. 3 సమూలము. 4 సాధనము 5 తర్కము 6. హేతువాదము. 7. ఒక యలంకారము 8. ప్రేరణక్రియకుఁ గర్త. 9. మూల కారణము (బౌద్ధ.) 10. బాహ్యప్రపంచము. ఇంద్రియములు (పాశుపతులమతము) 11. విధము 12. వెల, మూల్యము.

హేతుశాస్త్రము నం. వి. అ. న. 1 తర్కయుక్తముగా రచింపఁబడిన గ్రంథము. 2. శ్రుతిస్మృతుల ప్రమాణమును నిరసించు గ్రంథము.

హేతుహేతుమద్భావము నం. వి. అ. పుం. కార్యకారణములకుఁ గల సంబంధము.

హేత్వవధారణము నం. వి. అ. న. (నాటక) తర్కించుట, హేతువాదము,

హేత్వాభాసము నం. వి. అ. పుం. మిథ్యాహేతువు. (1. సవ్యభిచారము, అనైకాంతికము. 2.విరుద్ధము 3. అసిద్ధము. 4. సత్ప్రతిపక్షము. 5. బాధితము. అని యిది అయిదు విధములు.)

హేమ నం. వి. ఆ. స్త్రీ. 1. భూమి. 2. అందకత్తె.

హేమంతనాథము నం. వి. అ. పుం. వెలఁగచెట్టు.

హేమంతము నం. వి. అ. పుం న. మార్గశీర్ష పుష్యమాసములతోఁ గూడిన ఋతువు.

హేమంతి నం. వి. ఈ. స్త్రీ. శీతకాలము.

హేమకందలము నం. వి. అ. పుం. పగడము.

హేమకము నం. వి. అ. న. బంగారము.

హేమకింజల్కము నం. వి. అ. న. నాగకేసర పుష్పము.

హేమకూటము నం. వి. అ. పుం. ఒక పర్వతము.

హేమకేతకి నం. వి. ఈ. స్త్రీ. స్వర్ణకేతకి, పచ్చపూమొగిలి.

హేమకేలి నం. వి. ఇ. పుం. అగ్ని.

హేమకేశుఁడు నం. వి. అ. పుం. శివుఁడు

హేమగంధిని నం. వి. ఈ. స్త్రీ. రేణుకయను సువాసనా ద్రవ్యము.

హేమగౌరవము నం వి. అ పుం అశోకవృక్షము.

హేమఘ్నము నం. వి అ. న. సీసము. (లోహము)

హేమఘ్ని నం. వి. ఈ. స్త్రీ. పసుపు.

హేమచంద్రుఁడు నం. వి. అ. పుం. 1. ఇక్ష్వాకుని మనుమఁడు. 2 ఒకజైన నిఘంటుకర్త.

హేమజ్వాలుఁడు నం. వి. అ. పుం. అగ్ని.

హేమతరువు నం. వి ఉ. పుం. ఉమ్మెత్తచెట్టు.

హేమతారము నం వి. అ న మైలుతుత్తము.

హేమదుగ్ధ(క)ము నం. వి అ. పుం మేడిచెట్టు

హేమధాన్యకము నం. వి. అ. పుం. ఒకటిన్నర మాషముల తూనిక.

హేమపక్షము నం. విశే (అ. ఆ. అ.) బంగారు గోడలు కలది. వి. అ. పుం బంగారుటొడ్డాణము.

హేమపుష్ప(క)ము నం. వి. అ. పుం 1. అశోకవృక్షము. 2. లోధ్రవృక్షము. 3. చంపకవృక్షము. న 1. అశోకపుష్పము. 2. మందార పుష్పము.

హేమపుష్పిక నం. వి. ఆ. స్త్రీ. 1. చేమంతిపువ్వు. 2 పచ్చ అడవిమొల్ల.

హేమపృష్ఠము నం. విశే. (అ. ఆ. అ.) బంగారు పూఁత పూసినది.

హేమమాక్షికము నం. వి. అ. న. అగ్నిశిల.

హేమమాల నం. వి. ఆ. స్త్రీ. యమునిభార్య.

హేమమాలి నం. వి. న్. పుం. సూర్యుఁడు.

హేమము నం, వి. అ. న. 1. బంగారము. 2. ఉమ్మెత్త (వృ. వి.). పుం. నల్లనిరంగగల గుఱ్ఱము. న్. న. 1. బంగారము. 2. జలము. 3. మంచు. 4. ఉమ్మెత్త. 5. కేసరపుష్పము. 6. శీతకాలము.

హేమయూథిక నం. వి. ఆ. స్త్రీ. హేమపుష్పిక, చేమంతి

హేమరాగిణి నం. వి ఆ. స్త్రీ. పసుపు.

హేమరేణువు నం. వి. ఉ. పుం. త్రసరేణువు.

**హేమలము** సం. వి. అ. పుం. 1. ఒరిపిడిరాయి. 2. తొండ.

**హేమలుఁడు** సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.

**హేమవ(బ)లము** సం. వి. అ. న. ముత్యము.

**హేమశంఖుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు.

**హేమసారము** సం. వి. అ. న. మైలుతుత్తము.

**హేమసూత్ర(క)ము** సం. వి. అ. న. ఒకవిధమైన కంఠహారము.

**హేమాంగము** సం. విశే. (అ. అ. అ.) సువర్ణ వికారమైనది. వి. అ. పుం. 1. సుమేరు పర్వతము. 2 సింహము. 3. చంపకవృక్షము.

**హేమాంగుఁడు** సం. వి. అ. పుం. 1. గరుడుఁడు. 2. బ్రాహ్మణుఁడు, విష్ణువు.

**హేమాద్రి** సం. వి. ఇ. పుం. 1. సుమేరుపర్వతము. 2. చతుర్వర్గచింతామణికర్త.

**హేమాహేమీ ము లు** విశే.బ. అధికులు, గొప్పవారు, పూజ్యులు.

శా. మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదములేదు నిందుసభలో నొక్కింత మాత్రంబు హే, మాహేమీలు ఘటాఘటీలతిరథుల్ మాంధాత లీసాములే, లాహిసాధిక భావముల్ తడవరాదంచున్ వితాకుండనై. వరాహ. 11. 8.

కం. మదమొదవు కోడెవిటులకు. హృదయపుటాంతరములోన హేమాహేమీల్, పదివేలమన్మథులువు, ట్టుదు రాసీమాటికుచ పటుత్వముగన్నన్. హంస. 1. 212.

సీ. బహుతవన్యులఁ దెల్పువట్ల హేమాహేములను పల్కు పూజ్యార్థ మగుచునుండు. ఆం భా. 3. 16

**హేమాహ్వము** సం. వి. అ. పుం. 1. వనవంచక వృక్షము 2. ఉమ్మెత్త. (వృ. వి.)

**హేమించు** సం. అ. క్రి. బంగారమగు (శ.ర.) స. క్రి బంగారముచేయు.

మ ఇలఁ ద్రవ్యున్ నిధివాంఛ ధాతువితతుల్ హేమింప నూఁదున్ మహీ, శులఁగొల్చున్....... మల్ల. వైరాగ్య. 8.

**హేమ్నుఁడు** సం. వి. అ. పుం. బుధుఁడు.

**హేమ్యము** సం. విశే. (అ. అ. అ.) సువర్ణవికారమైనది.

**హేయము** సం. విశే. (అ. అ. అ.) విడువఁదగినది

**హేరంబము** సం. వి. అ. పుం. మహిషము.

**హేరంబహట్టము** సం. వి. అ. పుం. ఒకదేశము.

**హేరంబుఁడు** సం. వి. అ. పుం. 1. గణేశుఁడు, 2. ప్రగల్భవచనుఁడైన నాయకుఁడు.

**హేర(రి)కుఁడు** సం. వి. అ. పుం.. గూఢచారి.

**హేరము** సం. వి. అ. న. 1. కిరీటము. 2. పసుపు. 3. దయ్యపుమాయ.

**హేర(రా)వళి** వి. పొడవన్నెకోక. (శ.ర.)

**హేరామి** వి. హింసించుట, ఉపద్రవపెట్టుట.

ఉ. రాముఁ డనఁగఁ జెప్పుము ధరాసురుఁడో జమదగ్నిపుత్రుఁడై, సోమకిరీటికిన్ శరణు చొచ్చి గుహుండును దానుగూడి పో, రాములతోడనుం బరశురాముఁడవన్ విలువిద్యనేర్చి హే, రాముల దండ్రి నాఁటిరిపులందున మాడినయట్టి రాముడో. భల్లా. 2 (శ.ర.)

**హేరాళము**=పెరాళము. విశే. (క. హేరాళ, త. పెరాళమ్. తు. పెరాళ.) 1. అధికము. మిక్కుటము.

కం. పీలని వలలొడ్డిరి హే, రాళముగా లోకపాలరమణులు మృగయా, లీలఁ గనుఁగొనఁగఁ జేసిన, జాలక జాలములుగల దిశాభిత్తులనన్. వరాహ. 4. 74.

2. నిరాతంకము, అడ్డులేనిది.

కం. సారమతి దక్షవాటిక, తూరుపు గవనింబ్ర సిద్ధితో వసియించున్, హేరాళక్రీడాసం, చారిణీ నూకాంబ భక్తజన రక్షణకై. భీమ. 1. 100.

(ఈ ప్రయోగమునుబట్టి శ.ర. దీనిని తత్సమముగా గ్రహించెను. కాని సంస్కృత నిఘంటువులలో నీ పదము కానరాదు, శ్రీనాథుఁ డచ్చటచ్చట దేశ్యపదములను సిద్ధసమాసములలోఁ జొప్పించుట కలదు. కన్నడ తమిళములందును హేరాళ, పెరాళ పదములు కలవు. కావున నిదిదేశ్యముగా

గ్రహింపఁబడినది. చూ. కైవారము.)

హేరికుఁడు సం. వి. అ. పుం. వేగులవాఁడు.

హేరుకుఁడు సం. వి. అ. పుం. శివకింకరుఁడు. 2. గణేశుఁడు. 3. బుద్ధుఁడు (చక్రసంబరుడు). అ న శివలింగము

హేల సం. వి. ఆ. స్త్రీ. 1. అవమానము 2. ద్వేషము. 3. శృంగార విలాసము. 4. ఆనందము 4. సంభోగేచ్ఛ. 6. సౌలభ్యము. 7. వెన్నెల. 8. విరామము (సంగీ).

హేలంబి సం. వి. అ. స్త్రీ. ఒకమూలిక.

హేలనము సం. వి. అ. న. 1 అనుమానించుట 2. విలాసముగా వినోదించుట.

హేలావంతము సం. విశ. (త్. తీ త్. 1. అంతుకో భావముతోఁ గూడినది. 2. చులకనగాఁ జూచునది.

హేలావుక్కుఁడు సం. వి. అ. పుం. అశ్వవర్తకుఁడు.

హేలి సం. వి ఇ. పుం సూర్యుఁడు. స్త్రీ. 1. శృంగార క్రీడ 2. ఆలింగనము. 3. పెండ్లియూరేగింపు.

హే(హై)లిహిలము సం. విశ (అ ఆ. అ.) విలాసశీలమైనది

హేవాకము సం. వి. అ. పుం. ఆత్యంతాసక్తి (ఈ పదమును బిల్హాణా ద్యర్వాచీన సంస్కృత కవులు ప్రయోగించిరి. ఇది పారసీక పదమో అంట్ళ్లి పదమోయై యుండువని, ఆ.ప్త.ని. ప్రౌఢిమ అని శ. ర.)

కం. స్థావర రాజతనూభవ, యావేళవ డాయవచ్చె నభవుని సేవాహేవాక ప్రౌఢిని ... హం. 3 67.

కం. రేవా త ంగశీకర, సేవాహేవాకపార శిశిర మురుత్ప స్తావపరికంప్యమానజ, టావళి యగు చతఁడు వింధ్య మల్లనఁ జేరెన్. కాశీ 1. 88.

హేవాకి సం. విశ. (న్ నీ న్.) అత్యాసక్తి గలవాఁడు.

హేవానకము సం విశ. (అ. ఆ. అ.) 1. అధికమైనది 2. నిశితము.

హేషము సం. వి. అ. స్త్రీ. అ. న. గుఱ్ఱపు సకిలింపు.

హేషి సం. వి. న్. పుం. గుఱ్ఱము,

హేషించు సం. అ. క్రి. (గుఱ్ఱము) సకిలించు.

గీ జన్మవేళన యాతఁ డుచ్చైఃశ్రవంబు, భంగి హేషించెఁ బృథివి గంపంబు నొంద. భార. ద్రోణ. 5. 341.

హేషితము సం. వి. అ. న. గుఱ్ఱపు సకిలింపు.

హేహే అవ్య. బిగ్గఱగాఁ బిలుచునపుడు సంబోధనకైవాడు పదము.

## హై

హై అవ్య సంబోధనార్థకము.

హైడింబి సం. వి. ఇ. పుం. ఘటోత్కచుఁడు.

హైడింబుఁడు సం. వి. అ. పుం. ఘటోత్కచుఁడు.

హైతుకము సం. విశ (అ ఈ. అ) హేతు సంబంధమైనది హేతువాదపూర్వకమైనది.

హైతుకుఁడు సం. వి. అ. పుం 1 తార్కికముగా వాదించువాఁడు, 2. మీమాంసా సిద్ధాంతముల నవలంబించువాఁడు 3 విరుద్ధ మతావలంబకుఁడు.

హైమ సం. వి. అ. స్త్రీ. చేమంతి. (మల్లె)

హైమంతికము సం. విశ. (అ. ఆ. అ,) 1 చల్లనిది 2. హేమంతమునఁ బెరుగునది వి. న. పుం. ఒక విధమైన వరి ధాన్యము (హేమంత ఋతువునఁ బండెడిది.)

హైమనము సం విశ (అ. ఆ. అ.) 1. చల్లనిది. 2 శీతకాలమునకు సంబంధించినది 3. శీతకాలమునఁ బెరుగునది. 4, స్వర్ణమయము. వి. అ పుం. 1. మార్గశీర్షమాసము. 2. హేమంతర్తువు 3 శీతకాలమునఁ బెరుగు వరిధాన్యము (పుష్టికము)

హైమము సం విశ. (అ. ఆ అ.) 1 చల్లనిది. 2 మంచు చేతఁ గలిగింపఁబడినది. 3. బంగారువన్నె గలది. వి. అ. న. మంచు, తుషారము.

హైమముద్ర(ద్రిక) సం వి. అ. స్త్రీ. బంగారు నాణెము.

**హైమలము** సం. వి. అ. న. పుం. హేమంతము.

**హైమవతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మంచుతో గూడినది. 2. హిమవత్పర్వతము నుండి ప్రవహించు నది. 3. హిమాలయము నందుండునది. వి. అ. పుం ఒక విధమైన విషము. న. భారత వర్షము. (ఇండియా)

**హైమావతి** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి. 2. గంగా నది. 3. ఒక యోషధి 4 గోధుమవన్నె ద్రాక్ష. 5. అవిసెచెట్టు. 8. త్రిఫలములలో నొకటి.

**హైమి** సం. వి. ఈ. స్త్రీ. చేమంతిపువ్వు. (మల్లె)

**హైముఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**హైయంగవము** సం. వి. అ. న. 1. తొలినాఁడుఁ పిలికి యెత్తిన యావు వెన్న. 2. అట్టి వెన్న కాఁచిన నెయ్యి. (ఇట్లే హైయంగవీనము.)

**హైరణ్యకుఁడు** సం వి అ పుం. అగసాలెవాఁడు.

**హైరాను** హిం విశే 1 ఎటు తోఁచని. 2. తొందర పడిన (శ. ర.)

**హైరికుఁడు** సం. వి. అ. పుం. చోరుఁడు.

**హైసరే** = **హాయిసరే.** అవ్య ప్రశంసార్థకము. నెబాసు.

సీ. హైసరే యతని పే రనిన మాత్రమునసే కురు దేశ మేల్రాజుగుండెలదరె. కృష్ణ. 2. 45.

సీ. మందహాసంబుల యందంబు హైసరే సరిలేదు మెడకంట సరికినెందు. వాల్మీ. 2. 50.

**హైహయుఁడు** సం. వి. అ. పుం. యదువు మని మను మఁడు, కార్తవీర్యార్జునుఁడు. (బహు) హైహయ దేశము; ఆదేశమున నివసించు ప్రజలు.

**హైహేయుఁడు** సం. వి. అ. పుం. కార్తవీర్యార్జునుఁడు.

## హొ

**హొ** విశే వ్యుత్పత్తి యందు హొన్ను శబ్దమునకు మీఁద వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. దీనికిఁ బరుష సరళములు పరంబు లగునపుడు నుగాగమం బగు. హొంగాళె, హొంబట్టు శ. ర.

**హొంత** వి పరిశ్రమము: నేర్పు.

సీ. ఇంపుసొంపుల త్రుమ్మరింపు మాటలు వీణ పలు కుల కఠరాభ్యాస మొసఁగు, మందంపు నడపులు మాయూరగతులకుఁ బలుమాఱు తిన్నని ఫణితి. జూపు, సరసంపునాసిక సంపెంగ మొగ్గల కెక్కున తక్కువల్ చక్కదిద్దుఁ, జొక్కంపు గుబ్బలు జక్కవ కవలకు దిట్టతనం బుపదేశమిచ్చు.

గీ. **హొంతఁజాదుట వనవిహారోత్సవంబు,** సలుపుట యుఁ బుష్ప వితతివాసనలు గొనుట, నెఱి సరసిఁ **గ్రీడలాడుట నెపములుగను, వలిన** సౌందర్య మింక నేమని వచింతు. అని. 2. 31.

**హొంతకాఁడు** వి (హొంత+కాఁడు) జెట్టి మల్లుఁడు

మ. ఉరుసంధ్యా తపశోణమృత్కలితమై యొప్పారు బ్రహ్మాండమన్, గరిడిన్ గాలవు హొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చుని, బ్బరపున్ సంగడ మోయనన్ శశి డిగెన్. ప్రాగ్భూమి భృత్త్యైతనే, తర బాహాగ్రపు సంగడంబనఁగ మార్తాండుండు దోఁచెన్ దివిన్. మనుచ. 3. 59.

**హొంతకారి** వి (√హొంత) జెట్టి, మల్లుఁడు.

గీ. జెట్టితండంబుతోడఁ జేపట్టి హొంత, కాసిఱిచిన యట్టు లగ్గలిక విఱుతు. భార. విరా. 1. 81.

గీ. కవులు బుధులును గాయకుల్ గవనికాండ్రు హొంతకారులు దగువందు లుండునండ. మల్హు. 1 13.

సీ. గరిడిలో నెఱహొంతకారులై సాముల మీఱిన రాజకుమారమణులు. హంస. 2. 9.

విశే. 1. దృఢచిత్తురాలు, మనస్విని.

గీ. వారిలో వారిలోలకల్హారకమల, వనరటద్భృంగ గంగఁ జేకొనిరి సురలు, మారుని మిటారి చికటారి గౌరి యనెడు, హొంతకారి వరించె నయ్యంతకారి. చం. రా. 3. 4.

ఉ. అక్కట యొందుఁబోయెనొ యొయారపు నంచల ముద్దుగుమ్మయే, చక్కని దాఁగెనో కలికి జక్కవ లెక్కువ గుబ్బలాఁడియే, దిక్కున మన్నదో సొలుపు దేఱెడి చూపులహొంతకారి యే,యిక్కువ నిల్చెనో యొఱపు నీనెడు చిల్కలకొల్కి దైవమా. కువల. 4. 96.

2. నేర్పరి.

సీ. అష్ట భాషల యందు సామర్థ్యంబు లేకుండ హొంతకారి కవీంద్రులొక్కవంక. తపతీ. 1. 14.

**హొంబట్టు** వి. (హొన్ను+పట్టు) 1. బంగారు వన్నె గల పట్టు.

సీ. .... హొంబట్టు జిలుఁగు గెంజెంబుతోడ. మనుచ. 6. 102.

సీ. పటువులై హొంబట్టుబటువు లోయన నొప్పు రమ చన్నుదోయిఁ బాదములు నేర్చి. కళా. 2. 157.

సీ. పైఁగప్పుకొన్న హొంబట్టు దుప్పటి ... నీలా. 1. 60.

2. పచ్చని పట్టుబట్ట.

మ. అనఘుల్ గన్గొననోఁచు రాఘవుని యాథార్థ్య తత్త్వంబు భావించుటీ, ల నధోవల్కల ధన్యనాస హాసిమీలన్నెత్తుఁడై మున్నుగ, ట్టినహొంబట్టు సడల్పనేమి కొదవున్నట్టే గోటికందర్పమో, హను నెమ్మేనికటంచు వాక్రుతినుతుం డార్తిన్ మంత్రైన్ మతిన్. చం. రా. 4. 60

సీ. బొమ్మంచు ముయ్యంచు పొప్పళిహొంబట్టు నుద యరాగము....

గీ. మొదలుగా వల్వలు ధరించి ముదితలపుడు. ప్రబంధ. 272.

వ. సన్నవలిపంబులును వెలిపట్టులును హొంబట్టులును... ద్వా. 3. 206.

**హొనకా** వి. దేశవిశేషము.

రగడ. సకలాతులుం దెలుపు చలికప్పడంబులును, హొంబొట్టు లోడీలు హొనకాడుకూలాలు. హంస. 5. 266.

**హొనరు**=ఒనరు. వి. పొందిక, ఒప్పు.

సీ. పెంపుమీఱువసంత ఫేషువా హజారువనుండి చెలామణి హొనరుదెలుప....గీ. మదనుపాదుసహా దండు గదలెనపుడు. అని. 3. 19.

**హొన్గుబ్బలి** వి. (హొన్ను+గుబ్బలి.) మేరుపర్వతము, బంగరుకొండ.

సీ. వెలిబూదిపూఁత ప్రాఁబలుఁకుటందియలు హొన్గుబ్బలి సింగాణిగిబ్బ మావు. అచ్చ. రా. యు. 598.

**హొన్నంచు** వి. (హొన్ను+అంచు) బంగారు పనిపి గలయంచు.

ఉ.... హొన్నంచు రథంబు దాఁగుబలియంచు పకీబులు క్రమ్మోయనెక్కినన్. మనుచ. 5. 42.

సీ. ఒజిగంటమెఱుఁగెక్కు నీరయంగఁగల టెక్క హొన్నంచువక్కెర యుదుటుచూప. దశా. 266.

వ. మకువు తాప్తాకురాడంబులు పరంగిపిటలు చదరంగంబులు పగడసాలలు హొన్నంచు సురటులు. ప్రబంధ. 605.

**హొన్నగరు** వి. ఔ. అనౌ. (హొన్ను+నగరు) బంగారు నగరు; రాజగృహము.

చం. పగడపుఁజాయజాజు నినుపంగనుపట్టు విదేహరాజుహొన్నగరునకుం బరిష్కరణ నాటిక లేటికి మాటిమాటికిన్. చం. రా. 3. 113.

**హొన్ను**=పొన్ను. వి. (దీనికి వ్యుత్పత్తియందు వికల్పముగఁ దొలియచ్చుమీదివర్ణములకు లోపమును బరుషసరళములు పరమైనచో నుగాగమంబునుగల్గును (ఉదా. హొంబట్టు, హొంగట్టు) 1. సువర్ణము, బంగారము.

వ... పదాఱువన్నె హొన్ను పనులన్ జూడన్ జూడ... ఉ. రా. 3. 52

2. బంగారునాణెము, వరహా.

ద్వి. ఒడిలోనఁ బట్టిన హొన్నులమూట, పొడవు నూతిని బడిపోయిన యట్లు, ద్వి. తి సా. 1. 84. పా. 8 పం.

గీ. ఉంగరంబులు కెంపులముంగరయును, మొదలు గల సొమ్ములనుదాల్చి మురిపెమమర, దిరుగుచును విట కోటులధృతి గలంచి, హొన్నులు గడి తు మరు నాన చిన్నదాన. చంద్ర. వి. 2. 19.

విజ. మనోహరము, అందమైనది.

వ ...పచ్చికపట్టుల హొన్నగు విన్నావు కేవ వేలు

రాచెలులవిడిదలును.... అచ్చ. బా. 3. 38.

**హొన్నుగట్టు** వి. (హొన్ను+గట్టు) బంగరుకొండ. మేరుపర్వతము.

సీ పట్టపేనుంగు లాంట్టాశ్వములు హొన్నుగట్టుల మెచ్చని ఘనరథములు. ఉ. రా. 5. 167.

**హొన్సరిగె** వి. (హొన్ను+సరిగె.) బంగరుజరీ

మ... రాసుతుఁడు దోర్దో సైన్యముల్ గొల్వఁగా సొరిదిన్ సన్నరుమాలు హొన్సరిగె కుచ్చుల్ చెన్ను నన్ జౌకళిం, చ గుపాంంబుగ వాద్యనాదములు దిక్చక్రంబునన్ నిండఁగన్. ఇందు. 2. 55.

**హొమ్మ్క** వి॥ (ఒమ్మనకు మొదటి రూపము.) పెద్ద. స్థూలము. వి. స్థౌల్యము.

**హొయలు** వి. 1. విలాసము.

గీ. హొరగల కోరమీసల హొయలు వాని, నొఅవు నెఱపెడు వెడలుపుటుఁ ముపానిఁ, గాంచి పులకిత గాత్రియై కలువకంటి. కృ. శకుం. 2. 45.

ఉ. కావున వేశ్యచందమును గైకొనుమీవు హొయల్ చెలంగఁగా. వేం. మా. 1. 128.

సీ. జాలువయ్యెంట భుజంబు మీఁదికిఁద్రోని చెఱఁగు డాపలివంకఁ జెక్కు హొయలు. దశా. 2. 160.

2. సొగసు.

ఉ... మేలికడానిడాల్ హొయలుమీఱెడు...నీలా. 1. 1.

3. వేడుక. వినోదము.

ఉ.... నేఁ నెప్పుడు గాంతుఁ బెండ్లిహొయ లెప్పుడు పొందొనరింతునంచు మేల్ చొప్పడ భావరుం డెదురు చూచుచునుండఁగ సత్వరంబునన్. కృష్ణ. 4. 82.

**హొయల్(లు)బండి** వి (హొయలు+బండి) ధనికులు విలాసమునకై యెక్కిపోవు శకటము. క్రీడా శకటము

వ. జనులకనువండువులగు హొయల్ బండులును. ప్రబంధ. 605.

**హొరంగు** వి. 1. సొగసు.

వ... అంతరాంతర దంతురిత నిరంతర కర్ణికార ప్రముఖ వివిధ ప్రసవనిర్గళదనర్గళ విచిత్రతరపరాగ రాజితంబగు ధరణీతలంబు రంగవల్లికాలంకృతం బగు మెఱుంగుహొరంగుమీఱ ... ఇందు. 2. 44.

సీ. కావులరీవి కప్రపుధూమములకావి జగిలెలరంగు రచ్చలహొరంగు. రసిక. 1. 86.

2. కాంతి.

సీ... వెలుగురాజా హొరంగులు వెలుంగ. నీలా. 2 48.

చం. మెడ నిగుడించి సోయగపుమేని హొరంగు రంగలింపఁగా. రసిక. 5. 3. (విలాసము. అని. శర)

**హొరపు** వి. హోదా, అధికారము.

క. ఊళ్లాయములమీఁద హొజపుత్తరువు గన్న రాయకై జీతంబు రాయువారు. రా. వి. 5. 13.
(హొఁపుత్తరువు=అధికారపత్రము.)

**హొన** వి॥. మనోజ్ఞము, చక్కనిది.

సీ హొనతమ్మి నూల్వంటి యనదుశేఁగౌనుపై నోరగాఁగఁ బరుండి యొరగఁగొంకి. ప్రబంధ. 750.

## హో

**హో** అవ్య. 1. ప్రశంసార్థకము.

చం. అలఘు నిశాతవప్రమున వంగములన్నియు నిర్వికారుడై, యొలువఁదొడంగి వట్టియెడ హోయని కిన్నరయక్ష సిద్ధసాధ్యులు దివినుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ నద్భుతం బెలయఁగఁ బుష్పవృష్టిఁ గురియించిరి కర్ణుపయిం యంబునన్. భార, అర. 7. 378.

2. పిలుచుటయందగు ధ్వనికనుకరణము.

చ పులియమెు దివసావలము పొంగున మ్రోఁగుచు నున్కియట్లెయి,మ్ముల నొకపాడి గోవపుడు ముందటికిం జనుదెంచునట్లె హో, నిలుమనినం బయింబడక నిల్చి కనుంగొనునట్లె కావురే, కలఁగక యాడుమాట లయకాలునినైన శమింపజేయదే ? భోజరా 4. 132.

**హోడ** నం. వి ఋ పుం. చోరుఁడు.

**హోడము** నం. వి అ. పుం. ఓడ, నావ.

**హోఢము** నం. వి. అ. న. దొంగిలింపఁబడిన వస్తువు(లు).

**హోత** నం. వి॥. (ఋ. త్రీ. ఋ.) యజ్ఞముచేయు వాఁడు, అగ్నియందు హవిరాదులను వేల్చువాడు

వి. ఋ. పుం. 1. ఋత్విజుఁడు. (యజ్ఞసమయమున ఋక్కులను బఠించువాఁడు.) 2. అగ్ని. 3. యజ్ఞము చేయువాఁడు.

**హోతృ(త్ర)కుఁడు** సం. వి. అ. పుం. హోతృ సహాయుఁడు.

**హోతృషదనము** సం. వి. అ. న. హోత యాసనము.

**హోత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞము. 2. స్తుతి. 3. వేదవచనము. 4. హోతృక వ్యాపారము వి. అ. న. 1. హోమము చేయఁదగిన నేయి మున్నగునది. 2. హవిస్సు. 3. యజ్ఞము.

**హోత్రి** సం. వి. ఇ. పుం. హోత. (శ. ర.)

**హోత్రియము** సం. విశ. (అ ఆ. అ.) హోమమునకు సంబంధించినది వి. అ. న. యజ్ఞశాల.

**హోత్రియుఁడు** సం. వి. అ. పుం. దేవతలకై హోమము చేయు ఋత్విజుఁడు

**హోత్వ** సం. వి. న్. పుం. యజ్ఞము చేయువాఁడు.

**హోమకుఁడు** సం వి అ. పుం. హోత.

**హోమతురంగము** సం వి అ. పుం. యజ్ఞాశ్వము

**హోమధానము** సం. వి. అ. న. యజ్ఞగృహము.

**హోమధాన్యము** సం. వి. అ. న. నువ్వులు, శాల్మి.

**హోమధేనువు** సం. వి. ఉ. స్త్రీ హవిస్సునకై పాలిచ్చు గోవు.

**హోమము** సం. వి. అ పుం. 1. దేవయజ్ఞము (పంచయజ్ఞములలో నొకటి.) 2. హవిస్సు. 3. యజ్ఞము 4. వైశ్వదేవము. (శ. ర)

**హోమి** సం వి ఇ పుం 1. వన్నె. 2. జలము. 3 అగ్ని 4. చిత్రక వృక్షము న్. పుం హోమము చేయువాఁడు.

**హోమీయము** = **హోమ్యము** సం. విశ (అ. ఆ అ) హోమము చేయఁదగినది.

**హోమ్యము** సం వి. అ. న. 1. నేయి. 2. హోమద్రవ్యము.

**హోర** వి. ప్రసిద్ధి.

గీ. హోరంగల కోరమీసాల హోయలువాని, నొఅవు నెఅపెడు వెడలుపుటురమువానిఁ ... గాంచి పులకిత గాత్రయై కలువకంటి. కృ. శకుం. 45.

(వ్యవ.) అతని పని యిప్పుడు మంచి హోరగా నున్నది.

**హోర** సం వి. ఆ. స్త్రీ. 1. అహోరాత్రము. 2 రాశ్యంశము. 3. లగ్నభేదము. 4. శాస్త్ర విశేషము. 5. గంట. 6. జాతకము.

**హోరాట** వి. ఆటోపము.

మ. ఒకనాఁడాతమముందటన్ బలుమఱున్ హోరాటమైనేల యొత్తి, కొవంగా బవరంబులన్ గెలువఁగా దెల్లంబుగాఁ జూచి .... భార. ఉద్యో. 1. 279.

శా. రుద్రాదిత్య మరుద్వసు ప్రభృతు లార్వుల్ నింగి ముట్టంగవీ, రోద్రేకంబున డాపలన్ వలపలన్ హోరాటమైముంచి సర్వద్రోహింబరిమార్తమంచు వికటభ్రామ్యద్భుజామండలీ, రౌద్రాకారతఁదాఁక దాఁకెరిపు ధైర్యప్రావణున్ రావణున్. నిర్వ. 6. 132.

**హోరాహోరి** క్రి. విశ. అవిరామముగా, ఎడతెగక.

శా. రావై రాగ్యముఁ బూని నీవు కడునిర్దాక్షిణ్య చిత్తంబునన్, రావైతేఁజవిగానియుందులకుహోరాహోరిగాఁ బోరి యే, లావాలయము సేయఁగా... మనుచ. 3. 84.

కం. వారరువురు దమలోపల, వేరముగొని రాజ్యకాంక్ష విజిగీషువులై, హోరాహోరిఁగఁ బోరిరి. ఆము. 3. 15.

**హోరు** = ఓరు వి. గాలి వీచుట, వాన కురియుట మున్నగు వాని యందలి ధ్వని కనుకరణము.

సీ. హోరంత ప్రొద్దును హోరని విసరుచుఁ గెరలు కరువలి వకీలుగాఁగ. వరాహ. 10. 29.

ఉ. దారుణవచ్చి వీచె సముదారసుశీర సమీర పోతముల్, హోరన సన్నుతించెనపు డుర్వీజనాళి తదీయ శౌర్యముల్. చమ. 3. 8.

గీ ...కడవ వంచి, వట్లు హోయని ధారౌఘ మైక్యమంది మిన్నుమన్నును నొకటిగా వృష్టి బలసె. ఆము. 4. 91.

గీ పూని హోరువ జెడిదంపువావ గురియు. కళా. 4. 85.

ఉ. ...హోయమని యేడ్చుచుఁ బెద్ద యెలుంగుతోడ మా, తల్లిని డించిపోయెదను దాపన కామినులార కూర్మి సం, ధిల్లఁగఁ బ్రోవరే యనుచు దీనత లక్ష్మణుఁ డేఁగె నయ్యెడన్ ఉ. రా. 6. 295.

ఉ. ... రోదన్ మహాగిరులు హోరవం బ్రస్తుతి బ్రాలి. ఆము. 2 47.

వ. ...అంచ బెగ్గురు మలివులంగలియు నొడ్డారయు నీరుహోరు లాతనికి మేలివాయిదంబులనగు సంతసం బలవడ. ఆచ్చ భా. 2. 31 పా.

హోల సం. వి. అ. స్త్రీ. హోళీ పండుగ.

హోలకము సం. వి. అ. పుం. 1. సెనగపిండి. 2 గడ్డి నిప్పులలో సగము పక్వమగునట్లు కాల్చిన వేరుసెనగ మొదలగు కాయధాన్యము.

హోలాక సం. వి. అ. స్త్రీ. 1. హోళీపండుగ.(ఫాల్గున శుద్ధ పూర్ణిమకు ముందొనర్పఁబడువసంతోత్సవము) 2 ఫాల్గున శుద్ధపూర్ణిమ

హోలాకము సం. వి. అ. పుం. ఒక విధమైన యావిరి స్నానము; ఊఁదరపెట్టుట న. ప్రాచ్య కాంత వాసులు చేయు నొకానొక మతకర్మము, వసంతోత్సవము.

హోలాకాధికరణన్యాయము సం. వి. అ. పుం. స్మృతు లందును గల్పసూత్రములందును జెప్పఁబడిన దాని కాధారముగా శ్రుతివచనము లేనప్పుడు అట్టి సాధారణ శ్రుతివచన మేదో యుండెనని యూహింపవచ్చు నని చెప్పు న్యాయము జైమినియు,శబరస్వామి యు నీ న్యాయమును గూర్చి చర్చించిరి· (సామాన్యశ్రుతి కల్పనాయా మస్తి ప్రమాణం న విశేషశ్రుతి కల్పనాయామ్.)

హోలి సం. వి. ఈ. స్త్రీ. హోలాక, కాముని పండుగ.

హోలిక సం. వి. ఆ. స్త్రీ హోలి.

హోళి వి. కాముని పడుగ యందు కడపటివాఁడు తగులఁబెట్టుటకై ప్రోగు చేసెడు గడ్డికంప, అన్య దేశ్యము అని, శ, ర.

హోళిగ వి. (కన్న) భక్ష్య విశేషము. శ. ర.

## హౌ

హౌ అవ్య. సంబోధనార్థకము.

హౌతభుజము సం వి అ. న. కృత్తికా నక్షత్రము,

హౌత్రకము సం. విశ. (అ ఆ అ.) హోతకు సంబంధించినది,

హౌత్రము సం. వి. అ న. హోతృ వ్యాపారము,

హౌదా హిం. వి. (హిం. హౌదమ్.) ఏనుఁగు మీఁది యంబారి.

సీ. సౌవర్ణ కలశముల్ సవరించిన విలాతి నకలాతు హౌదాల సామజములు, రంగా, 1, 156,

హౌమ్యము సం. వి. అ. న. వెన్న, హోమి,

హౌసు వి 1. సొగసు

ఉ దేవ వరాకు హౌసు కళదేఱెడు నీదగురూప వైభవం,బు ... హంస 2. 44.

సీ. యాగపాత్రలు దెచ్చి హౌసుగా వడిలుడికి చిప్పలుగఁ జేసి కేరువారు. సిం. కార, 20,

2, ఇంపు,

సీ, ఈ మావఁగానేల యీ సూనగంధంబు హౌసాన... ఇందు. 4. 59.

3. కోర్కి.

సీ. బటువుగుబ్బల నొత్తిపక్కకు హత్తినాహౌసు చెల్లించిన యందగత్తె. శకుం. 4. 59.

4, ఔద్ధత్యము, బిగరు.

సీ, వేలుపు వెలయాండ్ర వీథిలోఁ గనువారి హౌసు మించె నటంచు నాజ్ఞ చేసి. పార్వ. ౩. 93.

5. ఒయ్యారము, (శ. ర )

హౌసుకత్తె వి. (హౌసు+కత్తె)అందగత్తె, సౌందర్యవతి,

గీ. అచ్చరలలోన నొక్కతె హౌసుకత్తె, నీవు పట్టపుదేవిగా నేలికొనుము. మల్లుపు 2 43.

హౌసుకాఁడు వి, హౌసు+కాఁడు , హావుసుకాఁడు, సొగసుకాఁడు, ఒయ్యారికాఁడు (శ ర.).

## హ్న

హ్నవనము సం. వి. అ. న. హ్నవము, దాఁచుట,

హ్నవము సం. వి. అ. పుం. దాఁచుట,

## హ్ను

హ్నుతి సం. వి. ఈ. స్త్రీ 1. దాఁచుట. 2. తిరస్కరించుట. 3. దొంగిలించుట.

## హ్య

హ్యస్ అవ్య. (తెలుగున దీనికి స్వతంత్రప్రయోగము మృగ్యము,) కడచినదినము, నిన్న.

హ్యస్తనము సం. విశ. (అ. ఈ. అ.) నిన్నటిది.

హ్యస్త్యము సం. విశ. అ. ఆ. అ.) పూర్వదినమునకు సంబంధించినది, హ్యస్తనము,

హ్యోభవము సం. విశ. అ. ఆ. అ.) నిన్నజరిగినది,

## హ్ర

హ్రణీయ సం. వి. ఆ. స్త్రీ. 1. నింద. 2. సిగ్గు.

హ్రదగ్రహము సం. వి అ. పుం. మొసలి.

హ్రదము సం వి అ. పుం 1 లోతైన కాసారము. 2. ఏటివడుమ లోతుగల చోటు. 3 లోతుగల నిడు పాటి నీటిపల్లము, 4. లోతైన రంధ్రము, 5.కాంతి కిరణము.
హ్రదిని సం. వి. ఈ స్త్రీ. 1. నది. 2. మెఱపు.
హ్రసకము సం. విశ. (అ ఆ. అ.) తగ్గించునది.
హ్రసము సం. వి అ. పుం 1 ధ్వని. 2. తగ్గుట. 3. అల్పసంఖ్య 4. అభావము.
హ్రసితము సం. విశ. (అ. ఆ. అ.) 1. వాయింపc బడినది. 2. పొట్టిచేయcబడినది; తగ్గింపcబడినది.
హ్రసిష్ఠము సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి హ్రస్వము, హ్రస్వతమము.
హ్రసీయము సం విశ. (న్. సీ. న్. హ్రస్వతరము.
హ్రస్వగర్భము సం వి. అ పుం కుశ, దర్భ,
హ్రస్వగవేధుక సం. వి ఆ. స్త్రీ. బీఱ.
హ్రస్వపత్రిక సం వి ఆ. స్త్రీ కండ్లరాని. (వృ.వి.)
హ్రస్వవర్ణము సం. వి. అ పుం. లఘువింపరి (వృ.వి)
హ్రస్వఫలము సం. వి అ పుం. ఖర్జూరవృక్షము
హ్రస్వము సం. విశ (అ. ఆ. అ.) 1. చిన్నది. 2. పొట్టిది. 3. తక్కువ వయస్సు కలది. 4. అప్ర ధానము. వి. అ. పుం. 1. కుబ్జుడు, 2. పొట్టి యచ్చు. న. ఒక రసాయన ద్రవ్యము.
హ్రస్వమూలము సం.వి.అ పుం ఎఱ్ఱని పొట్టిబెత్తము.
హ్రస్వాంగము సం. వి అ పుం. జీవకమను గంధ ద్రవ్యము (శ. ర.).
హ్రాదము సం. వి. అ. పుం ధ్వని.
హ్రాది సం.విశ.(న్.సీ న్.) ధ్వనిచేయునది గర్జించునది.
హ్రాదిని సం. వి. ఈ. స్త్రీ 1. నది 2. సల్లకీవృక్షము. 3 మెఱపు. 4 ఇంద్రుని వజ్రాయుధము.
హ్రాదుని సం వి ఈ. స్త్రీ ఇ. పుం వడగల్లు.
హ్రాసనము సం. వి. అ న 1. గజస ప్తమదావస్థలలోc జివరిది. 2. తగ్గుదల.
హ్రామ్ అవ్య. మంత్ర బీజాక్షరము. (ఇట్లే హ్రీమ్, హ్రూమ్.)
హ్రీణీయ సం. వి. ఆ. స్త్రీ. = హ్రణీయ. 1. నింద; రోత. 2. సిగ్గు. 3. జాలి.
హ్రీ సం. వి. ఈ స్త్రీ 1. సిగ్గు. 2. వినయము.
హ్రీక సం. వి ఆ. స్త్రీ. 1. సిగ్గు. 2. పిఱికితనము.
హ్రీకము సం. వి. అ. పుం. ముంగిస.
హ్రీకుడు సం. వి. అ. పుం తండ్రి.
హ్రీకువు సం. విశ. (ఉ. ఉ ఉ.) 1. సిగ్గు గలది. 2. వినయము గలది. వి. ఉ. పుం. 1. పిల్లి 2. లక్క. 3. తగరము
హ్రీజితుడు సం. విశ. (అ. ఆ. అ.) లజ్జాక్రాంతుడు (ఇట్లే హ్రీమూఢుడు మొ.)
హ్రీణము సం విశ. (అ. ఆ. అ) సిగ్గు పొందినది, (ఇట్లే హ్రీతము)
హ్రీతముఖము సం. విశ. (అ ఆ. అ.) 1. సిగ్గు గలది. 2. వినయవంతము.
హ్రీతము సం వి. ఈ. స్త్రీ 1, సిగ్గు, 2. వినయము.
హ్రీవిషేధుడు సం. విశ (అ. ఆ. అ.) 1. వినయము లేనివాడు. 2. సిగ్గు లేనివాడు
హ్రీబలుడు సం. విశ. (అ. ఆ. అ.) అత్యంత వినయ వంతుడు.
హ్రీవేర(ల)ము సం వి అ న కురువేరు. (వృ.వి.) (హ్రీబేరము అని. శ. ర.)
హ్రేపణము సం. వి. అ. న 1. సిగ్గుపడుచుట. 2 అతి శయించుట. 3. కలత.
హ్రేపితము సం. విశ. (అ ఆ. అ.) 1. సిగ్గు పఱుపc బడినది 2. అతిశయితము
హ్రేష సం. వి. ఆ. స్త్రీ. సకిలింపు.
హ్రేషి సం. విశ. (నా జీ న్.) సకిలించునది.
హ్రేషితము సం. వి అ న. హ్రేష. సకిలింపు.
హ్రేషుకము సం. వి అ పుం ఒక విధమైన పాఱ.

## హ్లా

హ్లాత్తి సం. వి. ఇ స్త్రీ. సంతోషము,
హ్లాన్ని సం వి. ఇ స్త్రీ. = హ్లాత్తి, సంతోషము,
హ్లాద(క)ము సం.వి అ పుం. సంతోషము, ఆనందము.
హ్లాదనము సం. వి ఆ. న. 1. సంతోషించుట. 2 సంతో షింపc జేయుట 3. సేద దేర్చుట
హ్లాది సం విశ. (న్ సీ న్) సంతోషింపc జేయుc వాడు. 2, ధ్వనిచేయునది.
హ్లాదితము సం. విశ. అ. ఆ. అ.) 1. సంతోషించి నది 2 సేదదేఱినది.
హ్లీకుడు సం. విశ. (అ. ఆ. అ.) లజ్జాహతుడు.
హ్లీకువు సం. విశ. (ఉ. ఉ ఉ.) లజ్జాహతుడు.
హ్లేష సం. వి. ఆ. స్త్రీ. హ్రేష. సకిలింపు.

## హ్వా

హ్వాల సం వి అ స్త్రీ. 1.అపజయము. 2. దారితప్పుట.
హ్వా సం.వి.ఆ స్త్రీ. 1 పేరు. 2.జిహ్వా 3.తరు.4 నది.
హ్వాతవ్యము సం. విశ. (అ ఆ అ) పిలువదగినది.
హ్వానము సం.వి.అ.న 1. పిలుచుట. 2.శేక.3. ధ్వని.
హ్వాయకము సం. విశ. (అ. ఆ. అ) ఆహ్వానించునది. 2, పిలుచునది,
హ్వార్యము సం. వి అ. పుం. 1. పాము. 2. గుఱ్ఱము.
హ్వాలము సం.వి.అ.పుం. 1. అపజయము,2. ముగింపు.